మున గౌరీదేవిని గల్గియుండుట ఉమామహేశ్వర లక్షణములు.

శ్లో. నన్దీశం భాస్కరం చైవ గణేశం మాతృకా స్తథా। పితౄ వాగ్వాణి సంయుక్తం షణ్ముగం శక్తిమేవ చ। నాగంచ కేశవంచైవ భృంగీశం భైరవం తథా। బాణ రావణ చండీశా క్షేత్రపాల రిట శ్శివః॥

నన్దీశ్వరుఁడు, సూర్యుఁడు, విఘ్నేశ్వరుఁడు, సప్తమాతృకలు (బ్రాహ్మీ మాహేశ్వరీ కౌమారీ వైష్ణవీ వారాహీ ఇన్ద్రాణీ చాముండా), పితృదేవతలు, సరస్వతి, షణ్ముఖుఁడు, శక్తి, సుబ్రహ్మణ్యస్వామి (నాగము) విష్ణుదేవుఁడు, భృంగి, భైరవుఁడు, బాణాసురుఁడు, రావణభూపతి, చండీశ్వరుఁడు, రిటుఁడు, క్షేత్రపాలుఁడు, వీరు శివపరివారము.

3 లక్ష్మీనారాయణలక్షణము:—

శ్లో. నీలదేహం పీతవాసం శంఖచక్రగదాధరమ్। రత్నకుండలగ్రైవేయం సుఖాసీనం కిరీటినమ్। రమావామాంకవిభ్రాజం లక్ష్మీనారాయణం భజే॥

నల్లని శరీరచ్ఛాయయు, పీతాంబర (పచ్చని రంగుబట్ట) ము, శంఖము, చక్రము, గద మూఁడు చేతులందు ధరించుట (నాల్గవచేయి అభయ లేక వరదహస్తమనియు, (నాల్గుచేతులనియు) నెఱుంగునది.) చెవుల రత్నకుండలములును, శిరంబునఁ గిరీటమును ధరించియుండుటయు, సుఖాసీనతయు, వామాంకమున లక్ష్మీదేవిం గూర్చుండఁబెట్టుకొని యుండుటయు, (తఱచుగ నాలింగనముఁ జేసికొనియుండఁ జిత్రించుచుందురు.) ఇవి లక్ష్మీనారాయణవిగ్రహలక్షణములు.

విష్ణుపరివారకులు:—

శ్లో. గరుడో విష్వక్సేనో వా ఒఽక్రూరో బలి నారదః। క్షేత్రపాలో విధాతా చ ముకుందశ్చ గదాధరః। ప్రహ్లాదో వాయుపుత్రశ్చ శౌనకశ్చ విభీషణః। శుకాఽర్జునపరాశర్యో శేషో భాగవతా స్స్మృతాః॥.

గరుత్మంతుఁడు, విష్వక్సేనుఁడు, అక్రూరుఁడు, బలిచక్రవర్తి, నారదుఁడు, క్షేత్రపాలకుఁడు, విధాత, ముకుందుఁడు, గదాధరుఁడు, ప్రహ్లాదుఁడు, ఆంజనేయుఁడు, శౌనకుఁడు, విభీషణుఁడు, శుకుఁడు (శుకయోగి), అర్జునుఁడు, పరాశరుఁడు, శేషుఁడు (ఆదిశేషువు), పరమభాగవతోత్తములగు వీరు విష్ణుపరివారకులని చెప్పఁబడుదురు. ఇందునకు రామానుజీయవైష్ణవులు శివునింగూడఁ జేర్చి విష్ణుదేవునకుఁ బదునెన్మిదిమంది పరివారమనియెదరు.

దేవీపరివారము:—

శ్లో. సరస్వతీ శచీ లక్ష్మీ లోపాముద్రా హ్యరుంధతీ। మాతృకా అనసూయా శ్చ చండికా పరివారకాః॥

సరస్వతీదేవి, శచీదేవి, లక్ష్మీదేవి, లోపాముద్రాదేవి, అరుంధతీదేవి, సప్తమాతృకలు, అనసూయాదేవి, చండికలు నని యర్థము. వీరు దేవీపరివారము.

4 సతీధాతృవిగ్రహలక్షణము:— (దీనికి శతానందమూర్తి యనియెదరు).

శ్లో. మన్దారకుసుమోద్భాసం మకుటం యజ్ఞసూత్రకమ్। కమండలధరం శాంతం జపమాలా విరాజితమ్। చతుర్ముఖం సుఖాసీన మభయం వరదం తథా। మరాళవాహనోపేతం వాణీవామాంకశోభితమ్। భజేహం పరమాత్మానం శతానంద మ్మనోంబుజే॥

మందారపుష్పమువలెఁ గాంతిఁగల్గియుండుట, యజ్ఞోపవీతము మెడయందుండుట, కమండలము చేతనుండుట, శాంతరూపము, జపమాలం జేత ధరించియుండుట, నాల్గుముఖములం గల్గియుండుట, సుఖముగఁ గూర్చుండియుండుట, అభయహస్తము, వరదహస్తముఁ గల్గియుండుట, వామాంకమున సర్వతీదేవిని గూడియుండుట, శతానందలక్షణములు. (సతీధాతారలక్షణము).

౫ రాజరాజేశ్వరీలక్షణము (గౌరీదేవీవిగ్రహలక్షణము:—

శ్లో. పద్మాసనాం, పద్మకరాం, త్రినేత్రాం, మకుటోజ్వలామ్। అష్టబాహు సమాయుక్తాం, హరిబ్రహ్మేంద్రసేవితామ్। వామే శూలం చ డమరు పుండ్రేక్షు శ్చాపమండితామ్। ఖడ్గం పరశు ఖట్వాంగమ్ హలం రక్తాభ్రిభూషితామ్। మృగేంద్రవాహనారూఢామ్ రాజరాజే ం భజే॥

పద్మాసనముపైఁ గూర్చుండుట, పద్మములం బోలు కరములం గల్గియుండుట, మూఁడునేత్రములం గల్గియుండుట, విష్ణుదేవుఁడు, విధాత, ఇంద్రుఁడు వీరిచే సేవింపఁబడుచుండుట, వామభాగమున నాల్గుచేతులతో వరుసగఁ దిశూలము, డమరుకము, కుంకుమభరణి, చెఱకువిల్లును, దక్షిణభాగఁపు నాల్గుచేతులతో వరుసగ ఖడ్గము, గండ్రగొడ్డలి, ఖట్వాంగము, నాగలి ధరించినటులుండుట, ఎఱ్ఱచీర ధరించియుండుట, సింహవాహనముఁ గల్గియుండుటయు రాజరాజే విగ్రహలక్షణములని యెఱుంగునది.

గజలక్ష్మీ విగ్రహలక్షణము.

(రూపధ్యానము)

శ్లో. సువర్ణస్థాలీకలితకరైః కరేణురభిషిక్తమ్। సురసుందరీవీజ్యచామరైః శ్రీమాంబుహ్యాతమ్। రాజత్కమలకర్ణికావిరాజితం ధ్యాయేత్। సర్వసిద్ధయే రమా మభయవరదహస్తామ్॥

బంగారుకలశములను తొండములచేఁ బట్టుకొనిన యేనుఁగులచే నభిషేకింపఁబడుచుంటయు, సుందరులగు దేవతాస్త్రీలు చామరములచేఁ దడియారు విసరుచుంటయు, ప్రకాశమానమగు తామరపూవు కర్ణికయందుంటయు, అభయవరదహస్తములు రెండును, తక్కిన రెండుచేతులందు రెండుతామరపద్మములం గల్గి, యిటుల నాల్గుహస్తములు గల్గియుంటయు, గజలక్ష్మి విగ్రహలక్షణములుగ నెరుంగవలయును.

౬ మహాలక్ష్మి విగ్రహలక్షణములు:—

శ్లో. కమలాలంకృతాం దేవీం కదమ్బవనవాసినీమ్। కర్ణతాటంకయుగళాం మకుటాభరణభూషితామ్। మణిమాలావిరాజాంఘ్రిం మహాదేవస్య సోదరీం। రమాం రాకేన్దువదనాం భజే పీతామ్బ్రధారిణీమ్॥

పద్మాలంకృతయై యుండుట, కదంబవనమందుండుట, కర్ణములందుఁ దాటంకద్వయముఁ గల్గియుండుట, కిరీటముం ధరించియుండుట, ఆభరణములం ధరించియుండుట, మణులమాలలు పాదాభరణముల ధరించియుండుట, నవ్వుమొగముఁ (స్మితము) గల్గియుండుట, చంద్రబింబమువంటి ముఖముఁ గల్గియుండుట, పీతాంబరధారిణియై యుండుటయు లక్ష్మీదేవివిగ్రహ లక్షణములుగ నెఱుంగునది.

౭ సరస్వతీ (వాణీ) విగ్రహలక్షణములు:—

శ్లో. వీణాపుస్తకహస్తాభ్యాం సితపద్మాసనస్థితామ్। సుందరీం శుక్లవస్త్రాభామ్ సురారాధ్యాం సుమంగలీమ్। హంసారూఢా మంబుజాక్షీం

రత్నకింకిణి మేఖలామ్। భజేహం భారతీదేవీం సర్వవిద్యావిశారదామ్॥

రెండుచేతుల వీణ వాయించుచుంటయు, నొకచేతఁ బుస్తకము (వేఱొకచేతం జపమాల యుం) ధరించి, నాల్గుచేతులం గల్గియుంటయు, తెల్లతామరపద్మమునందుఁ గూర్చుండియుండు టయు, సుందరతరరూపము, తెల్లమేనిచాయఁ గల్గి యుంటయు, సురులచే సేవింపఁబడుచుంటయు, సుమంగలి కుండవలసిన చిహ్నములం గల్గియుం టయు, హంసవాహనముఁ గల్గియుంటయు, లేక హంసపై నెక్కియుంటయు, తామరఱేకులం బోలిన నేత్రములం గల్గియుంటయు, రత్నములం దాపిన యుజ్జ్వాణమును (మువ్వలతో సహా) గల్గి (లేక ధరించి) యుంటయు, అన్నివిద్యలను నేర్చిన తెల్వెని జూపులక్షణములం (చూపులఁ) గల్గియుం టయు, సరస్వతీ (వాణీ) విగ్రహలక్షణములు.

౮ శ్రీరామవిగ్రహలక్షణములు:-

ఇవి యనేక విధములఁ జిత్రింతురు. ముఖ్య ముగఁ బట్టాభిషేకము గాని, రామపంచాయతన రామము గాని, కోదండరామముగాని, వనవాస మున కేగు రామునిగఁగాని, రామాయణమునందుఁ దెలుపఁబడిన లక్షణములతోఁ జిత్రింతురు. ఎన్నివి ధములఁ జిత్రించినను మనుష్యాకారము, రెండు చేతులు, ధనుర్ధారణము, సీతాలక్ష్మణయుతము, లేక సీతాలక్ష్మణభరతశత్రుఘ్నాంజనేయయుత ము, ఒకప్పుడు వల్కలధారణము లక్షణములు. ఇవి యా యాసమానార్హలక్షణపరివారములతోఁ జిత్రింతురు. ఉదాహరణరూపమున శ్రీరామపట్టా భిషేకరూపలక్షణముల వివరింతుము గాక.

శ్రీరామపట్టాభిషేకలక్షణము:-

శ్లో. వామాఙ్కే వసుధాపుత్రీ పురతో ఋషిమం డలమ్। పాదపీఠే తు హనుమా న్పార్శ్వద్వయం తు భ్రాతరః। రవిజో జాంబవ శ్చాగ్రే తారాపుత్రో విభీషణః। మందస్మితః పరివృ తో నీలజీమూతసన్నిభః। నానాలంకారసం యుక్తో మణిపీఠే విరాజితః। రాజీవలోచనో రామో కృపయా పాలయా మ్యహమ్॥

వామాంకమున సీతాదేవి యుండుటయు, ఎదుట సప్తమహార్షులుండుటయు, పాదములకడ నాంజనేయుం డుండుటయు, ఇరుపార్శ్వముల సోదరు (కుడివైపున లక్ష్మణస్వామి, ఎడమవైపున భరతశత్రుఘ్నులు) లుండుటయు, అగ్రమున సుగ్రీ వజాంబవంతు లుండుటయు, (వెనుకఁగా) అంగ దుఁడు, విభీషణుఁడు నుండుటయు, చిఱునగవు మోము, నీలమేఘు (శరీర) ఛాయయుం గల్గియుం టయు, వివిధాలంకారధారి యగుటయు, మణి మయ (సింహాసన) పీఠమం దుంటయు, పద్మపత్ర నేత్రములం గల్గియుంటయు, శ్రీరామపట్టాభిషేక విగ్రహలక్షణములని యెఱుంగునది.

౯ శ్రీకృష్ణదేవునివిగ్రహలక్షణములు:—

ఇదియు శ్రీరామవిగ్రహములవలెనే యనేకవిధ ములఁ జిత్రింతురు. ముఖ్యముగ మురళీకృష్ణుఁడు, రాధాకృష్ణులు, రాధారుక్మిణీసహిత శ్రీకృష్ణుఁడు మొదలగురూపలక్షణములను భాగవతపురాణము నందుఁ దెలియనగురీతుల వివిధాకారలక్షణము లున్నను, మనుష్యరూపముననే నీలమేఘచ్ఛాయఁ గల శరీరకాంతులు మొదలగునవి లక్షణములు. ఇవియు నాయాసమయార్హలక్షణపరివారములతోఁ జిత్రింతురు.

అటులనే విష్ణుదేవునియవతారములలోఁ గూర్మ, వరాహ, నరసింహ, వామన, శ్రీరామ, బల రామ, పరశురామాద్యవతారముల నాయాలక్షణ ములం దెలుపురూపములఁతోఁ జిత్రింతురు. అందుఁ గూర్మనాథుని కేవలము తాఁబేలువలెను, వరాహ

నాథుని నరసింహదేవుని మనుష్యశరీరముపై వరాహముయొక్కతలను, సింహముతలను నుంచి నృసింహదేవుఁడు హిరణ్యకశ్యపునికాళ్ళపైఁబండఁబెట్టుకొని గర్భముం జీలిచివేయుచున్నటులను, ప్రహ్లాదుఁడు భక్తితో నిలచున్నటులను చిత్రించుచున్నారు. ఇదిహిరణ్యకశ్యపునిగరునందే యొకస్తంభము నుండి వెల్వడినయవతారముగాన నట్లే చిత్రించిన 'వీరనృసింహ' మనియు, లక్ష్మీదేవి నంకమున నిడుకొని, శాంతుఁడై యుండిన నరసింహదేవుని 'లక్ష్మీనృసింహవిగ్రహ' మనియుఁ జిత్రింతురు.

౧౦ శ్రీరంగనాయకిస్వామి (శేషశయననారాయణదేవుఁడు) విగ్రహలక్షణములు:—

శ్లో. భూ రమా పాదదేశే చ నాభిపద్మే విరించినః। తుంబురు నారదః పార్శ్వే శేషపర్యంక శాయనమ్। మాణిక్యమాలికాయుక్తం మకుటశ్రీవిరాజితమ్। ధ్యాయేత్ శ్రీరంగనాథం తం సర్వకామఫలప్రదమ్॥

భూదేవి, లక్ష్మీదేవి (లేక నీలాదేవి) పాదములకడ నుండుటయు, నీదేవి పాదములకడ నుండుటతో శ్రీదేవి హృదయమందుండుటయు, నాభియందుఁ గమలముండి, అందు విధాత యుండుటయు, ఇరుప్రక్కలఁ దుంబురునారదులు (వీణాగాన) మొనర్చుచుండుటయు, శేష (పాము) పాన్పుపైఁ బరుండియుండుటయు, మాణిక్యహారములు (మెడయందు) ధరించియుండుటయు, భక్తుల కిష్టకామ్యములొసంగు దృష్టి మొదలగులక్షణములుఁ గల్గియుండుటయు, శ్రీరంగనాథస్వామిలక్షణము లని యెఱుంగునది. ఇది శేషశయనలక్షణ మగునటులనే యీ లక్షణములతోనే యనంతుఁడనుసర్పము (పాము) పై నిట్లే శయనించియుండుటకు 'అనంతశయన స్వామివిగ్రహ' మనెదరు.

౧౧ ఆంజనేయులు:-

ఆంజనేయవిగ్రహము తెల్లపువు నిలువంబడిన మర్కటమువలెనే చిత్రించెదరు. మఱి సంజీవిపర్వతముం గొంపోవుచున్నటుల సర్వసాధారణములం గల్గినరూపములను శ్రీమద్రామాయణకార్యముల మేరకుఁ జిత్రించుచుందురు.

ఇందుఁ బంచముఖవీరాంజనేయుం డను విగ్రహమును కోఁతిశరీరము గనుమతలలంగాని, దైవముముఖములం గాని, రచింతురు. అవి కోఁతిముఖము (నార) సింహముఖము, గరుడు (గరుడపక్షి లేక గరుత్మంతు) ని ముఖము అడవిపంది [వరాహ] ముఖము, అశ్వ [గుఱ్ఱము] ముఖము.

ఈవిగ్రహమున కైదుముఖములందుఁ బదునైదు నేత్రములు చిత్రింతురు. పదిచేతులును, వాల్లయందు వరుసగ ౧ ఖడ్గము, ౨ శూలు, ౩ పుస్తకము, ౪ కలశము, ౫ అంకుశము, ౬ సంజీవిపర్వతము, ౭ నాగలి, ౮ ముష్టిముసలము, ౯ పాశము, ౧౦ కులిశము, ఆయుధములం ధరించినటులఁ జిత్రింతురు. ఇవి యాంజనేయవిగ్రహ లక్షణములు.

అష్టదిక్పాలురు—విగ్రహములు:—

౧ ఇంద్రుని విగ్రహము:—

శ్లో. సురాధిపం సహస్రాక్షం మకుటోజ్వలభూషణమ్। శ్యామవర్ణం చతుర్బాహు మభయం వరదం తథా। వజ్రాయుధం దేవదత్తం సర్వాభరణభూషితమ్। కుండలం యజ్ఞసూత్రం చ మతంగాధిపవాహనమ్। శచీవామాంక సంయుక్తం పురుహూతం భజే మ్యహమ్॥

దేవతల కధినాథుఁడు, వేయికన్నులు (శరీరమంతటను) గలవాఁడుగ నుండుట, కిరీటము భూషణముగాఁ గల్గియుండుట, శ్యామవర్ణశరీ

రముఁ గల్గియుండుట, నాల్గుచేతులును, వాట్ల యందు (పైచేతుల) వజ్రాయుధము, దేవదత్త మును, (క్రిందిచేతుల) అభయము, వరదము గల్గియుండుట, మేన నలంకారములు గల్గియుం డుట, చెవులకు మకరకుండలములం గల్గియుండుట, యజ్ఞోపవీతముఁ గల్గియుండుటఁ దెల్లని యేనుఁగు వాహనముగాఁ గల్గియుండుట, శచీదేవి భార్యగాఁ గల్గియుండుట, ఇంద్రవిగ్రహలక్షణములు.

దీని కర్త పరివారము స్వర్గనివాసులలో ముఖ్యు లని యెఱుంగునది.

౨ అగ్నిదేవుని విగ్రహము:—

శ్లో. హుతాశనం ద్విశీర్షంచ సప్తహస్తవిరాజితమ్। జటాబద్ధం త్రిపాదంచ జటామకుటమండితమ్। షణ్ణేత్రంచ ద్వినాసంచ గౌరవర్ణసమాయు తమ్। స్రుక్ స్రువం శక్తి మిధ్మం చ వ్యంజనం ఘృతపాత్రకమ్। తోమరం సప్తజిహ్వాచ మేషారూఢం మహామహం। దక్షిణేచ స్వాహా దేవి వామపార్శ్వే స్వధా స్తథా। సుఖాసీనం చతుశ్శృంగం భజే యజ్ఞేశ్వరం సదా॥

హుతాశనుఁడై యుండుట, రెండుశిరస్సులు, ఏడుచేతులు, వాట్లయందు స్రుక్, స్రువము, శక్తి, ధర్మము, వ్యంజనము, ఘృతపాత్రము, తోమరము, ధరించియుండుట, మూఁడుపాద ములుగల్గి యుండుట, జటలుకట్టి ముడివైచి యామీఁద కిరీటమును ధరించియుండుట, ఆఱు నేత్రములు, రెండుముక్కులు (నాసికములు, రెండుముఖములును) గల్గియుండుట, గౌరవర్ణము గల్గియుండుట, ఏడు నాల్కలు గల్గియుండుట, మేకవాహనముఁ గల్గియుండుట, దక్షిణమున స్వాహాదేవియు, నుత్తరమున స్వధాదేవియు నను నిరువురుభార్యలం గల్గియుండుట, సుఖముగఁ గూర్చుండి యుండుట, నాల్గుకొమ్ములు, ప్రసన్న వదనముం గల్గి, ఆత్మాభిముఖుఁ [దన కెదురుగ నున్నవా]డై యుండుటయు, నగ్నిహోత్రవిగ్రహ లక్షణములుగ నెఱుంగునది.

౩ యమ విగ్రహలక్షణములు:—

శ్లో. సూర్యపుత్రం త్రినేత్రంచ మకుటంచ చతు ర్భుజమ్। అభయం వరదం చైవ శ్యామలా దేవిసంయుతమ్। కాలదండంచ పాశంచ మహి షారూఢ ముపాస్మహే॥

మూఁడునేత్రములు, కిరీటము, నాల్గుచేతులు, వాట్లయందుఁ (పైచేతుల) గాలదండము, పాశ మును, (క్రిందిచేతు) లభయవరదహస్తములై యుండుటయు, శ్యామలాదేవి భార్యగఁ గల్గియుం డుట, మహిష [ఎనుబోఁతు] వాహనము గల్గి యుండుట, యమవిగ్రహలక్షణములు.

౪ నైఋతి విగ్రహలక్షణములు:—

శ్లో. నరారూఢం నీలవర్ణం మకుటం కర్ణకుండలమ్। ద్వినేత్రంచ చతుర్బాహుం అభయం వర దం తథా। కుంత శర్చాపసంయుక్తం దివ్యా భరణభూషితమ్। యజ్ఞోపవీతం వామాంకే దీర్ఘాదేవీపతిం భజే॥

నరవాహనము, నీలవర్ణము, కిరీటము, కర్ణ కుండలములు, రెండు నేత్రములు, కుంతము, ధనస్సు, అభయ, వరదహస్తములు నాలుగు చేతులు, ఆభరణములు, యజ్ఞోపవీతము, వామాంకమున దీర్ఘాదేవి భార్యగను గల్గియుం డుట, నైఋతివిగ్రహములుగ నెఱుంగునది.

౫ వరుణవిగ్రహలక్షణములు:—

శ్లో. వరుణం శ్వేతవర్ణంచ మకుటమ్ కర్ణకుండ లమ్। చతుర్బాహుం పాశధరం వరదం అఙ్కు శం తథా। శూలాయుధధరం దేవం కాళికావ

రణాలయమ్। శ్వేతాంబర సమాయుక్తం ముక్తాభరణభూషితమ్। యజ్ఞోపవీతసంయుక్తం కృకరాశ్వం నమోస్తు తే॥

తెల్లనిశరీరచ్ఛాయయు, కిరీటము, కర్ణకుండలములుగల్గియుండుట, నాల్గుచేతులు, వాట్లయందుఁ బాశము, అంకుశము, పైచేతులందు ధరించుట, క్రిందివి వరద అభయహస్తములుగ నుండుట, త్రిశూలధారణము, కాళికాదేవి భార్యగఁ గల్గియుండుట, తెల్లనివస్త్రమును ధరించుట, ముత్యముల నాభరణములుగ ధరించుట, మెడను యజ్ఞోపవీతముండుట, తగరును వాహనముగఁ గల్గియుండుటయు వరుణవిగ్రహమునకుండఁ దగినలక్షణములు.

౬. వాయుదేవునివిగ్రహము:—

శ్లో. వాయవ్యం నీలదేహంచ మకుటం కుండలద్వయమ్। చతుర్బాహుసమాయుక్తం వ్యజనద్వయసంయుతమ్। అభయం వరదం హస్తం శాంతరూపంద్వినేత్రకమ్। నానాలంకారవిభ్రాజం అంజనీదేవిసంయుతమ్। కురంగవాహనోపేతం యవ్యం ప్రణమామ్యహ

నల్లనిశరీరము, కిరీటము, కర్ణకుండలములం గల్గియుండుటయు, పైచేతులందు రెండువిసనకఱ్ఱలును, క్రిందిచేతులం దభయ వరదహస్తములును, ఇటుల నాల్గుచేతులం గల్గియుండుటయు, శాంతరూపముఁ గల్గియుండుటయు, రెండునేత్రములు, నానాలంకారములు, లేడిపిల్ల వాహనము గల్గియుండుటయు, అంజనాదేవి భార్యగఁ గల్గియుండుటయు, వాయుదేవుని విగ్రహలక్షణములు.

౭ కుబేరునివిగ్రహలక్షణములు:-

శ్లో. కుబేరం స్వర్ణవర్ణం చ చతుర్బాహుం ద్వినేత్రకమ్। అభయం వరదంచైవ వాయువేగ సమన్వితమ్। యజ్ఞసూత్రం చోత్తరీయం సర్వాభరణభూషితమ్। చిత్రరేఖాసమాయుక్త మశ్వారూఢ ముపాస్మహే॥

బంగారువంటి శరీరచ్ఛాయ, రెండునేత్రములు, నాల్గుచేతులు, [క్రిందివి అభయ వరద హస్తములు, పైవి కత్తి, డాలును బట్టియుండునవి) యజ్ఞసూత్రము, ఉత్తరీయముఁ (పైబట్ట) గల్గియుండుటయు, సర్వాభరణములు ధరించియుండుటయు, చిత్రరేఖాదేవితోఁ గూడియుండుటయు, వాయువేగవంతమగు నశ్వమును వాహనముగాఁ గల్గియుంటయు, కుబేరవిగ్రహలక్షణము లని యెఱుంగునది.

౮ ఈశానవిగ్రహలక్షణము:-

శ్లో. ఈశానం శ్వేతవర్ణం చ మకుటం నాగకుండలమ్। త్రినేత్రం చ చతుర్బాహుం అభయం వరదం తథా। త్రిశూలడమరోపేతం వ్యాఘ్రచర్మోత్తరీయకమ్। నానాలంకార సంయుక్తం ఉమావామాంకధారిణమ్। చంద్రచూడం వృషారూఢం ధ్యాయే దీశాన మవ్యయమ్॥

తెల్లనిమేనిచాయ, కిరీటము, నాగకుండలములు, మూఁడునేత్రములు, నాల్గుచేతులు, (పైచేతుల త్రిశూల డమరుకములును, క్రిందివి వరద అభయహస్తములుగను), పులితోలు ఉత్తరీయముగఁ గల్గియుండుటయు, పాముల నలంకారములుగ మేన ధరించుటయు, గౌరీదేవిని వామాంకమున ధరించుటయు, నెలబాలుని (చంద్రుని) శిరంబున నిడుకొనుటయు, వృషభవాహన మధిష్ఠించియుంటయు, అవ్యయత్వముఁ గల్గియుంటయు, ఈశానుని విగ్రహలక్షణములుగఁ జెప్పఁబడినవి.

**రూపనగరము:**— పంజాబు దేశమున, అంబాలాజిల్లా రూపారుతహశ్శీలు, రూపార్ గ్రామము. దీని తొల్లింటిపేరు రూపనగర మని యుండె నందురు.

**రూపనారాయణీనది:**—[సుమహాదేశము చూడుఁడు] ద్వారకేశ్వరీనది, శిలావతీనది, కలసి రూపనారాయణి యనుపేరుఁ గలనది హుగ్లీ [గంగ] యందు సంగమించును. (మిడ్నాపూర్జిల్లా బంగాళాదేశము చూడుఁడు.)

**రూపవాహికులు:**—రూపానదీతీరవాసులు. రూపానది శుక్తిమంతమను పర్వతమునం బుట్టినది.

**రూప సాగరము - సనాతన సాగరము:**— చైతన్యదేవుని శిష్యులును, గౌడదేశమేలిన హుస్సైన్షానవాబు కడఁ దొల్లింట మంత్రులుగ నుండిన సోదరులు రూపసనాతనులు వ్రాసిచిన సాగరములు. చైతన్యతీర్థసలములు. వారు చైతన్యమతస్వీకరణ మొనర్చిన యానవాలుగ నొక యాత్ర నేటికిం జరుపుచున్నారు.

బంగాళములోని రాజషాహి జిల్లాయందలి మాల్దాపురమున కాగ్నేయముగఁ బదునెన్మిదిమైళ్ల దూరముననున్న 'రామకేలి' యనుగ్రామమున నున్నవి.

**రూపానది:**—శుక్తిమంత మనుపర్వతము నందు జనించు నొకనది. ఈనదీతీరవాసులను 'రూపవాహికు' లని వాడుచుండిరి.

**రూపాశ్వుఁడు లేక కృతాశ్వుఁడు:**— ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు.

**రూబిడియమ్ (Rubidium):**—లాటిన్ పదజన్యము. వెండివంటి యొకవిధమగు తెల్లని లోహపదార్థము. ఇది యెక్కువ యుపయోగకారి గాదు. ఇది పొటాషియమ్ తెగకుఁ జెందినది. దీని ఆటోమిక్ తూనిక బరువు 85 . 45.

**రూమ్‌దేశము:**—ఏష్యామైనరునం దున్నది. దీనిని 'శివాస్' అనియెదరు. శివాస్ దీనికి ముఖ్యపట్టణము. (ఏష్యామైనరు చూడుఁడు.)

**రూమ్ ప్రోవిన్సు (శివాస్ ప్రోవిన్సు):**— ఆసియామైనరులోని యొకప్రోవిన్సు. దీనిని 'శివాస్' అనియు నందురు. (ఆసియా మైనరు చూడుఁడు.)

**రూమిమస్తకి:**—లా. Pistacia Lentiscus, ఆంగ్ల Mastiche, ఇదియొక జాతిచెట్టు యొక్క జిగురనియు, వేఁడి జేయుననియు, దీనిని వేఁడినీళ్ళతో నమలుచుండుటవలనఁ గఫదోషము, జలుబు, పండ్లసలుపు, పండ్లు కదలుట, అజీర్ణము, ఎక్కిళ్ళు, కడుపులో గుడగుడలాడుట, గట్టిగట్టి, సామాన్యంపుఁ గడుపునొప్పి నివారణమగు ననియు, అర్కానుపానమునములతో సేవించిన, పిచ్చి, ద్వంద్వరోగములు, మతిచాంచల్యము నివారణమగుననియు, పన్నీటితో గుజ్జుదడిపి దానికి దీనిపాగఁ బట్టించి కండ్లపై వేసిన నేత్రరోగములు నివారణమగుననియు, వాసనఁ జూచుచుండిన జలుబు, తలనొప్పి, తగ్గుననియుఁ జెప్పుదురు.

శ్వేతపసుపువన్నెఁగల యీ రూమిమస్తకి పలుకులు మెత్తగ గుండఁజేసి, యనంతరము వస్త్రకాళితముఁజేసి, డబ్బాలలో నెత్తి ముద్రణకార్యము లొనర్చువారు (Letter Press Printers) నిలువ యుంచుకొందురు.

ప్రింటింగులో నొకశాఖ 'ఎంబోజింగు' (Embossing). ఈ Embossing (ఎంబాసింగే) ఒకరకము ముద్రణము. అనఁగా ఉబ్బెత్తు అక్షర

ములు వచ్చునట్లు ముద్రించుట. ముద్రణమే, ఉబ్బెత్తు అక్షరములు వచ్చునట్లు చేయుటఁ గాక ముద్రణము జరిగినతర్వాత నుబ్బెత్తు అక్షరములు వచ్చునట్లుఁ గళానైపుణ్యముచేత నొనర్చుట యొక్క రీతి 'ఎంబోసింగు'. ఈతరగతి ఎంబోసింగుకు "ప్రోసెస్ ఎంబోసింగ్" (Process Embossing) అందురు.

ఈ ప్రోసెస్ ఎంబోసింగు కార్యమునకు ముఖ్యమైనవస్తువు రూమిమస్తకిపొడి. ఒకచిన్న 'లెటరు హెడ్' లేక మూఁడు నాలుగుపంక్తులు మాత్రమే ప్రకటనవిషయ మేదేని గల కరపత్రము, అచ్చు వేసినతక్షణమే, ఆతడి యారకమునుపే, అదివఱకే సిద్ధపఱచియుంచుకొనిన, ఆరూమిమస్తకీచూర్ణము నచ్చయిన భాగముమీఁద నొత్తుగా వేసి, పూర్తిగా నక్షరముల కంటినదని తోఁచినపిదప, మిగిలి యున్న చూర్ణము డబ్బాలోనికిఁ బడునట్లు తీసి వేయవలయును. అట్లెన్ని ప్రతులకు వలసిన నన్ని ప్రతులకును, ఈచూర్ణము నంటునట్లు చేయవలెను. అనంతర మెన్ని దినము లట్లుంచిన నుంచివేయ వచ్చును. కూర్చిన లెటరుహెడ్డు, లేక, కరపత్రమునఁగల టైపులు పెద్దపెద్దపాయంటులే యైనచో (అనఁగా 14, 18, 22, 24, 28, మొదలగునవి యైనచో) ఆరూమిమస్తకీచూర్ణము ముదుకదిగా నుండవలెను. ఆటైపులు 6, 8, 10, 12 మొదలగు చిన్నపాయంట్లు, సన్న రకం టైపులయినచో, మిక్కిలి మెత్తనై, రెండుసార్లు వస్త్రకాళితమైన ఆరూమిమస్తకీచూర్ణము వాడుకచేయవలెను.

అట్టిచూర్ణము చక్కఁగాఁ బొడుగఁబడిన కాగితము లొక్కొక్కటిచొప్పున సన్నని నిప్పువేఁడి మీఁద, ఆ యచ్చయిన భాగమునే నడువనిచ్చినచో, ఆసన్ననివేఁడిమి కచ్చుకాఁబడి యాసిరా పచ్చిగానున్న సమయమున, నాయక్షరముల కంటి యున్న యాచూర్ణము, పొంగి ఉబ్బెత్తుగాఁ దేలును. ఆపొంగుట అక్షరముఖభాగమున మాత్రమే యగుటను నయ్యది ఉబ్బెత్తయి కానవచ్చును. ఈ చూర్ణము transperant స్వభావముఁ గలదగుటచేత, తానంటియున్న యక్షరముభాగ్రమునసున్న సిరాయొక్కరంగే పైకిఁ బ్రతిఫలించును. అట్లగుట నాయచ్చయినభాగము, దాని యసలుసిరాతో ఉబ్బెత్తు అక్షరములతోఁ గానవచ్చుచు, కంటి కెంతో యింపుగా నుండును.

## రూమేనియాదేశము (Rumania):-

ఐరోపాఖండమునందలి స్వతంత్రదేశము. Limited monarkey.

ఒకలక్ష యిరువదిరెండువేల రెండువందల యెనుఁబదిరెండుమైళ్ళు నైశాల్యమనియు, నొక కోటి తెబ్బదినాల్గులక్షలు జనసంఖ్యయనియుఁ జెప్పఁబడినది.

## రూమేనియా స్టేటు (డెన్యూబియ న్ప్రొవిన్సు):—

తొల్లింట నైరోపా బాల్కను రాష్ట్రములలో నిది. ఒకప్పుడు టర్కీప్రభుత్వము క్రింద నుండి, రష్యాటర్కీల యుద్ధసందర్భమున జరిగిన క్రీ. శ. 1878 బెర్లిన్ట్రీటీయందు స్వతంత్రతఁ బడసి రాష్ట్రముగఁ జేయఁబడినది. ఇందు వల్లాబియా, మోల్డేవియాస్టేట్సుసంయుక్తమై యున్నవి. ఇప్పుడు బాల్కన్ స్టేట్సునందు రూమేనియా యని పిలువఁబడుచున్నది. ౪౮౧౨౦౦ చతురఁపుమైళ్ళ నైశాల్యముఁ గలది. వ్యవసాయదేశము. వల్లాబియాయందు బుఖారెస్టును, (౨౫_౨౦౦౦) మోల్డేవియాయందు జెస్సెపురమును ముఖ్యపట్టణములు. సంయుక్తమునకు బుఖారెస్టు ప్రధాననగరము. గలట్జపురము రేవుస్థానము. (బాల్కన్ స్టేట్సు, ఐరోపా చూడుఁడు. టర్కీదేశము చూడుఁడు.)

**రూమేలియాస్టేటు:**— ఐరోపాఖండములోని టర్కీ ఇ న్యూరప్ దేశములోని యొక స్టేటు. దీనిని ఆల్బేనియా, తూర్పురూమేలియా, బల్గేరియాలం గల్పి టర్కీప్రోవ రనియు నందురు. (టర్కీదేశము చూడుఁడు.)

కాన్స్టాంటినోపిలు ప్రధాననగరముగ నుండెను గాని, యిప్పుడు దేశముఁ బ్రధానకార్యస్థానము లాసియామైనరులోని యంగోరాకు మార్పఁబడినవి. దీనిని స్టంబూ లని యందురు. ఆదిని దీనికి 'బైజంటియ' మ్మని పేరుండెను. రోమనులనాఁడు 'కాన్స్టాంటినోపు' లని మార్పఁబడెను. తురుష్కులు స్తంబూలని పేరిడిరి. బోస్పరస్సనంబడు సముద్రతీరమున నున్న రేవు. ౧౧౦౦౦౦౦ జనులకు నివాసమగు గొప్పనగరము. సముద్రమునుండి చూచిన స్తంభములు, డోములు, అపరంజిప్రాత నిర్మాణములు, బహుగంభీరముగఁ గన్పట్టును. దీని రేవుస్థానము 'గోల్డెన్ హారన్' అనంబడు సముద్రపుఁ బాయపై నేర్పఱుపఁ బడినది. పట్టణ మేడుకొండలపై నిర్మింపఁబడినది. రాజనివాసప్రాసాదద్వారము చాల యెత్తుగ నుండుట 'హాస్తిహుమయూ' నని పేరుండెను. దానికిఁ బరాసుభాషయందు 'Sublime Porte' అని యనువాదము. విదేశప్రభుత్వములవారిచే రాజకీయసంబంధములఁ దీదేశప్రభుత్వమును 'Porte' అని వాడఁజేసినది. ఈప్రాసాదము నగరమునందు సెరాగ్లియో (seraglio) అనుభాగమునందుఁ గలదు. ఇంకనిట రోమనులనాఁడు క్రైస్తవదేవస్థానముగ నుండిన సెంటు సోఫియా యిప్పుడు మసీదై యున్నది.

నగరమున 'గలాటా' యనంబడుభాగము వర్తకస్థలము. 'పెరా' యనంబడుభాగము గొప్పవారును, విదేశరాయబారులును నివసించుభాగము. డార్డినలీసువద్ద గల్లిపోలీ పురము ప్రభుత్వపుఁ బ్రధాననౌకాస్థానము. అడ్రియానోపు ల్పూర్వ మొకప్పుడు ముఖ్యపట్టణమై యుండినది. సెలోనికా (తొల్లింటి తెస్సెలోనికా) పురము రేవు పట్టణము.

**రూలాఫ్ త్రీ:**—(త్రయరాశికము చూడుఁడు.)

**రూలాఫ్ది రోడ్డు** (Rule of the Road):—ఇది పద్ధతి. ఆది నింగ్లాండుదేశమున నేర్పఱుపఁబడి, భరతదేశమునకుఁ గూడ వ్యాపింపఁ జేయఁబడి శాసింపఁబడినది. బాటలయందుఁ బర్వేడు లేక నడచుబండ్ల కితరబండ్లవలనను, గుఱ్ఱపుకౌతులవలనను, నపాయములు గలుగకుండ నొకదెస కరుగువా రందఱుఁ దమయెడమచేతివైపుగ బాటయొక్క భాగమునుండియే పోవలయునని యేర్పాటుఁ జేయఁబడినది. ఇట్లనుటయం దెదురుగవచ్చు బండ్లు మొదలగు నవియు, వాటియెడమచేతివైపుగ బాటయొక్క క్కనభాగముననే పోవుంగాన నపాయములు కలుగకుండునని భావము. దీని నాంగ్లమున 'Keep to the left' అనియెదరు. ఒకబండి వేఱొకబండిని (వెనుక నుండునట్లు) దాటి, ముందుకుం జనుతఱి నొకేదెసకుఁ బోవుచుండుబండ్లలో దాటిపోవు బండి బాట నడుమ కరిగి దాటఁబడు బండ్లను వెనుకనుండునట్లు ముందుకుంజని తిరుగ నెడమచేతివైపువరుసకుం జేరి పోవలయునని చెప్పఁబడినది. కాని పెక్కు ఐరోపాదేశములందుఁ గుడిదెసగ నరుగుచుంటయే 'Keep to the right' పద్ధతియై యున్నది.

**రెంటకులగోత్రము:**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. రెంటకుల— (రెంటి

కుల) గోత్రము, ఏకార్షేయ (33) గోత్రము. సంవర్తగణము. సాంవర్తకసగోత్రము. ఆపస్తంబ యజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ. వసన్తేశుఁడు దేవత. వనసాంబిక భార్య. దండకారణ్యము తపస్థానము. వనసరస్సు తటాకము. జపము లక్ష. దీపములు 30. క్షేత్రసంఖ్య ౮౦. కన్యక దానము. కురువిందము వర్జనీయము.

(వైశ్య గోత్రములు చూడుఁడు.)

**రెంటూరి గంగరాజు కవి:-** ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్ససగోత్రము. తండ్రిపేరు చినగంగరాజు.

ఈకవి భానుమతీపరిణయ మనుప్రబంధము రచించి వేంకటగిరిసంస్థానఁపురాజకుటుంబమునకుఁ జెందిన వెలుగోటి రాయభూపతి కంకిత మిచ్చెను. వీరు వెలమవారు. రాయభూపతి సుప్రసిద్ధుఁడగు కస్తూరి రంగనాయనికిఁ బెద్దతండ్రిమనుమఁడు. ఈ కస్తూరిరంగనాయఁడు గొప్పయుద్ధములందు జయమందిన శూరుఁ డనియు, సుప్రసిద్ధుండగు యాచమనాయనితండ్రి యనియు నీసందర్భమున నెఱుంగఁదగినది.

**రెండవబౌద్ధమత మహాసభ:-** రేవతుఁ డధ్యక్షుఁడు. క్రీ. ము. ౪౪౩ సం॥ విశాలీనగరమున బలూకారామవిహారమునందు జరిగెను. (మగధరాజ్యము చూడుఁడు.)

**రెండుజతల నోటిపండ్లు (Two sets of teeth):—** జన్మించుతఱి నోటిపండ్లు కుదుళ్ళలోననే లేఁతవిగ మెత్తనివిగనై యుండును. ఏల యన నవి ముదురుట యప్పటికిఁ జాలదు. వాటి క్రిందనే వేఱొకజతపండ్లింకను లేఁతవిగను, ఆకారము సరిగా నేర్పడనివిగను నై యుండెడిని. మొదటి పైజతపండ్లిరువదియనియు, వాటిక్రిందుగ నుండు రెండవవరుసపండ్లు ముప్పదిరెండనియు, లెక్కింపఁబడియున్నది. ఇంచుమించుఁ గొన్ని నెలలలోఁ బైవరుసమొదటిపండ్లు పైకి రానారంభించును. వాటిని పాలపండ్లనియెదరు. వాటికిని, నీదిగువనుండు రెండవవరుసపండ్లకును గొంతసంబంధ ముండునుగానఁ బాలపండ్లను భద్రముగఁ గాపాడవలెననియు నేపాటిదైనను వాటికిఁ దగిలిన దెబ్బప్రమాదము రెండవవరుస పండ్లం జెడఁగొట్టుననియుఁ గనిపెట్టఁబడినది. క్రిందివరుసపండ్లు నాంగ్లశరీరశాస్త్రవేత్తలు సెల్సుగనే యుండుననియు, నవి యెక్కువకాలము ముదురుట వలనఁ బండ్లుగనై, గట్టిపడవలయు ననియుఁ, గాననే యధికకాలము కొన్నివత్సరములవరకుఁ బట్టుననియు ననుచున్నారు. పాలపండ్లొక్కొక్కటిగ నూడిపడిపోవుచో రెండవవరుస యడుగు పండ్లు తలచూపుచుఁ బైకి వచ్చుచుండును. ఇవి పశువులందు ముఖ్యముగ రెండేసిగ బయల్వెడలెడిని. క్రింది రెండవవరుసపండ్లు వార్ధక్యమున నూడిపోయినపిదపఁ బండ్లు తిరుగ బయలుదేఱుట యుండదు. అనఁగా రెండువరుసలే యుండునని భావము.

**రెండునాల్కలమనిషి:-** మోమోటమును, మాటనిలుకడ, లేక రెండుమాట లాడిన వానిని 'రెండునాల్కలమనిషి' యని యసూయతోను, 'ఉభయతోముఖి' యని హేళనగను ననెదరు.

**రెండునేత్రములయుపయోగము-** ఒక్కకంటితోఁ జూచినను గాన నగుచుంటఁ బనిఁ జేయ వీలగుంగాని, యాపని యించుకఁ దప్పుచుంట కాస్పద మగును. రెండునేత్రము లొకవస్తువుం జూచుట యన నొకతావునుండి చూచుటగాక,

రెండును వేర్వేఱుతావులనుండి చూచినదృక్పథ మగును. ఆరెంటినిగల్పి నేత్రములనుండి చూచి మేధస్సు, అవయవములఁ బ్రోత్సహింప నవి తప్పు జరుగకుండఁ బనిఁజేయుచుంట సంభవించె డిని. లేకున్న నొకేనేత్రముతోఁ జూచుట యన నొకే దృక్పథమై యించుక పొరపాటుఁ గల్గు చుండును.

ఒకఫొటోగ్రాపు ఛాయాపటయంత్రము (Camera) యొక్క యొకేనేత్రము (lence) నుండి చూచికల్గించినది గాన, పైకిఁ జూచుటను సమ నుగానున్న స్థూలాకారము మాత్రముఁ దెల్పుచుండు నదిగాఁ గాన నయ్యెడిని. అటులఁ గాక నొకవ వస్తువుయొక్క రెండుఛాయాపటముల నర్ధస్థలమున నర్ధదూరములంచుంచి, స్టీరియోస్కోప (stereocope) నంబడు భూతదర్పణములనుండి రెండు నేత్రములతోఁ జూచినచో నది యాఛాయాపట వస్తువునే చూచినటుల నిజాకారమునే గాక, నిజ రూపమునుగూడఁ జూపించును. ఇందుకుఁ బ్రధా నకారణము రెండుదృక్పథములనుండి యొకవస్తు వును జూచుటయే నని యెఱుంగునది.

**రెక్కలు విఱిగిన పకిపలె నున్నాఁడు**:– నిరాధారుఁడని భావము. (ఆంధ్ర లోకోక్తి).

**రెటీనా (Retina)**:—ఇది నేత్రమున వెనుక భాగమున మేధస్సునుండి యేర్పడిన పొరలసము దాయము. ఇది Nerve fibers చేతను, nerve cells జేయఁబడినదిగా నాంగ్ల నేత్రవైద్యు లను చున్నారు. వాటింగల్పి పట్టియుంచుటకుఁ గొంత tissue పదార్థము కలదు. ఇది మేధస్సునం దుండు పదార్థమువంటిదే. ఇది పదిపొరల సము దాయము. కొన్నిటియందు సెల్సు కలవనియుఁ గొన్నిటియందు నెర్వ్ఫైబరు కలదనియుఁ బరిశీల నలు బయల్పఱచినవి. ఇందు వెనుకనుండు తొమ్మిదవ పొర ముఖ్యమైనది. కంటిగ్రుడ్డువెను కనే యిది యుండి, దృష్టియందు ముఖ్యసాధన కారణముగ నుండును. ఈపొరలు మిక్కిలిఁ బలు చనగను, అతిసున్నితములుగను నుండెడిని. అతి బలమగు భూతద్దముతోఁ బరిశీలించినగాని తెలియ రానివి. ఇవి మేధస్సుయొక్క 'Out Growth' అని వివరింపఁబడినవి.

పైన వివరింపఁబడిన cells ను, 'vision cells' అనెదరు. అవి నాళియాకారములనుండి 'Rods' అనియు, 'Cones' అనియు ద్వివిధము లుగఁ జెప్పఁబడినవి. వీటికొనలపైఁ జూచువస్తువు యొక్క వెలుతురుబింబము తాకెడిని. దీనిం గూర్చి If the refracting materials in front are just right, the light is sharply focussed at the point where it reaches the retina' అని గొప్పనేత్రశాస్త్ర వేత్త షల్కియున్నాఁడు. కోన్సువెలుతురు బింబము లనుబలమైనవెలుఁగునందునను, రాడ్సుచాలతక్కువ వెలుతురుగల చీఁకటియందునను, చూచువస్తువుల వెలుతురుబింబములను గ్రహించి యుపయుక్తపఱుచు నని చెప్పఁబడియున్నది. ఈతరులందు రెండు తావులు గానసయ్యెడిని. రెటీనాయం దుండు నొకతావునను Great optic nerve (నరము) వ్యాపించి విప్పుకొనును గాని, యటఁ గోనులు గాని, రాడ్సు గాని యుండవు గాన నట నేదృష్టి శక్తియు నుండక యంధకారస్థానముగనే యుం డును. తక్కిన Yellow spot అనంబడు రెండవ తావటనే ప్రక్కగఁ గలదు. అందే పెక్కుగో నులు, రాడ్సు నుండెడిని గాన నదియే దృష్టిస్థాన

ముగ నున్నది. అందుఁ గోనలు బలముగ వెలుతురునందు, రాడ్సు బలహీనముగ వెలుతురుండు చీఁకటియందుఁ జూడఁబడువస్తువుయొక్క వెలుతురుబింబము (light image) లం గ్రహించు ము, నగుపఱచుచుండును. వెలుతు రనుకూలించుతఱి నీపని యంతయు సెకెండునందు నలువదియవవంతుకాలమున జరుగునఁట. ఇం దింకను తెలియఁదగిన విషయములు కలవు. దృష్టియందు రెండువస్తువులు రెండుగనే గన్పింపవలయునేని, వెలుతురుబింబములు రెండుకోనలం జేరవలసియుండును. కడుదూరమునం దుండు నక్షత్రాదులు సమీపమునం దుండున ట్లగుపడునవియల్లు, రెండుకోనులకు సరిగా నేత్రం(పు)రెటీనాయందుఁ జేరక యొకే కోనునకుం జేరుకతన నారెండును నొకేనక్షత్రముగఁ గన్పట్టుచుండును. ఇది డబుల్ స్టార్సు, ఒకటిగ నగుపడుటకుఁ గారణమని చెప్పఁబడినది. భూతద్దముతోఁ జూచినతఱి నన్నిటితోఁ గూటు వాటినడుమదూరమును ద్విత్వము రెండు కోనులం జేరునంతటిదగుట నప్పు డవి రెండునక్షత్రములుగఁ గన్పట్టెడిని. రెటీనాలోని ప్రతికోనుకు ఆప్టిక్ నెర్వునుండి వేర్వేఱు ప్రత్యేకమార్గములున్నవని లనలు బయలుపఱచినవి.

ఈరెటీనాయం దగుపడునగుదృష్టితో బాహ్యమునందుఁగల వెలుతురునకుఁ గలసంబంధముం గూర్చి యొకధర్మము చెప్పఁబడియున్నది. 'The greateroutside power (అనఁగా వెలుతురని యెఱుంగునది) that excites our senses of sight the greater is the amount we must add to our sight or vision in order to difference involved.

అనఁగా॰ నెన్నిక్రొవ్వొత్తుల దీపఁపువెల్గునందొకవస్తువును జూతుమో, యాదృష్టి యగుపడు దృశ్యఁపుబలమునకుఁ బిదప నెన్నిక్రొవ్వొత్తిదీపములవెలుతురుం గల్పుదుమో యంత యధికముగ నౌచు, లేక యెన్నిక్రొవ్వొత్తిదీపములవెలుతురుఁ దగ్గింతుమో యంత తక్కువ నగుచు మన కావస్తువుయొక్క వెలుతురుబింబదృశ్య మెందున ని యెఱుంగుట వాటియంతర్భేద మెఱుంగుట కావశ్యకము.

## రేడియమ్ (Radium):—

ఇది భూమిని మానవజీవితావసర మగునట్లు వేఁడిగనుంచు పదార్థము. తనకుఁదానే వేఁడిని బుట్టించునదిగను, elements లో నొకటిగను జెప్పఁబడినది. భూమిపైఁ బగలంత బడుచుండుసూర్యరశ్మియందలి వేఁడి రాత్రులందు భూమినుండి వెడలిపోవుచుండు నని యు, నదియే జీవులజీవితమున కతిముఖ్యమగువేఁడి గల్గించుచున్నదనియు, సూర్యరశ్మినుండి భూమికిం గల్గుచున్న వేఁడికన్న నధికమగువేఁడి భూమినుండి రాత్రులం దనుదినము వెడలిపోవుచున్న దనియు, నిటీవలఁ గనిపెట్టఁబడియున్నది.

రేడియమ్ నేఁడుకొంచెము భూమిపై వారలకు దొరకియున్నది. భూమియందుఁగూడ నధికముగ నుండవని తెలుపఁబడుచున్నది. భూమియందున్న రేడియముగల్గించుచున్న వేఁడివలనఁగాకున్నఁ గొంతకాలములో భూమివేఁడిని గోల్పోయి చల్లఁబడిపోయియుండవలయునని పరిశీలకు లనుచున్నారు. చంద్రుండును ఆదిని వేఁడిని గల్గియుండినదే కాని రాను రాను చల్లఁబడిపోయెనట. అందు వేఁడిని నిల్పు రేడియమ్ లేదఁట. అందెవ్వరు జీవించుటలేదనుచున్నారు.

ఆంగ్లరసాయనవేత్తలు పృథివి, వాయువు, అగ్ని, జలము నాల్గుభూతములని తెలుపుచుండిరి. ఇప్పుడు రేడియమ్‌గూడ నొకభూతమని 'పంచభూతము' లనుచున్నారు. కాని, నారిధర్మమునఁ గొన్నిలోహములకు ఎలిమెంట్సు (భూతములని) పేరిడియున్నంటఁ గానగును. అగ్నియందలి వేఁడి

మియు సూర్యునినుండికల్గినదే యని వారనెదరు. కాని రేడియమ్‌నందలి వేడి స్వతస్సిద్ధమైనదట. అది కాలుటలేకుండగనే కొంత వేడిని కల్గింపం గల్గినది. ఇది ఆస్ట్రియాదేశమునందు దొరకం గల జాడలున్నవని కొందఱు తలంచుచున్నారు. నిశ్చయము తెలియదు. జగమంతటను కొంచెము కొంచెముగం గలదని తలంచుచున్నారు.

**రెడ్‌క్రాసు సొసైటీ (Red cross) (యుద్ధకాలమున దెబ్బతగిలినవారిని సంరక్షించి వైద్యోపచారము లొనర్చు సంస్థ (Red cross (miroing) society.) కుం జిహ్నముగుటకుం గారణము:—** తొలుత, క్రీస్తువెనుక ౧౮౫౯వ సంవత్సరమున సోల్ఫెరినోయుద్ధము (Battle of Solferino) ను స్విజర్లాండుదేశస్థుండగు హెన్రీడునా యను పేరుంగల యొక మహనీయుండు గాంచి, యందు దెబ్బలు తినిన సైనికుల దురవస్థయు, పడు బాధలును గుండెలు కరంగిపోవు నట్లొక చిన్నపుస్తకమును వ్రాసి ప్రకటించెనంట. ఆపుస్తక మనేక మంది యాదరణమునకుం బాత్రమై, పెక్కు భాషలలోని కనువదింపంబడెనట. తత్ఫలితముగ క్రీ. వె. ౧౮౬౩ సంవత్సరమునం దటస్థదేశమగునాస్విజర్లాండునందే యాయనగౌరవార్థముగ నొక సభ, సమావేశమై యందు వివిధదేశములు గలసి, యాయనను గౌరవించి పెక్కుతీర్మానము లొనర్చుకొనెనంట. అందు వైద్యసహాయము యుద్ధముతో నొకవిధికృత్యముగ నేర్పఱచుకొనిరంట. మఱియు దే స్విజర్లాండు దేశంపుబావుటాపైం గల చిహ్నము (ఎఱ్ఱజాగాపైం దెల్లనిల్పుక్రాసు) ను మార్చి తెల్లజాగాపై నెఱ్ఱనిల్పుక్రాసు (Cross) ను, యీయుద్ధకాలవైద్యసంస్థకుం జిహ్నముగ నేకగ్రీవముగ నంగీకరించి యేర్పఱచుకొనిరంట. నేంటికి నట్లే యున్నది. ఇంతే కాక నానుపత్రులం గనిపెట్టుకొనియుండు నర్సు (Nurses) లు గూడ దానినే చిహ్నముగ ధరించుచుందురు.

**రెడ్ సెల్సు (Red cells):**—ఎఱ్ఱనిసెల్సు. రక్తమునందుండు ముఖ్యభాగము. (హీమోగ్లోబిన్ చూడుండు). వీట్లనుండియే యెఱ్ఱరక్తము నకుం జే రట్లుం గల్గినది. ఏలయన తెల్లని వైటుసెల్సుకన్న నివి యధికభాగ ముండుటంబట్టి, రక్త మెఱ్ఱగ నుండును. శరీర మారోగ్యవంతమై యుండుతఱి నందలిరక్త మధికముగ నుంటయే కారణము. ఒకచిన్నరక్తంపుంజుక్కయం దివి కోట్లకొలందిగ నుండునని తేలుచున్నది. వీటిని లెక్కించుటం గడుంగడు కష్టము.

రోగి శరీరస్థితిని వైద్యుం డెఱుంగ నీరెడ్ సెల్సు, వైటుసెల్సు నారోగిరక్తమునం దేసంఖ్యలమేర కుండునో, దానింబట్టి యుండునుగాన, నాలోపతీ విధాన మెఱింగిన నాంగ్లవైద్యశాస్త్రవిదులకు రక్తమునం దేసెల్సు యేవాటాలెక్క (Proportion) మేర కున్నదో యెఱుంగుట యవసరము. (వైటుసెల్సు చూడుండు).

'రెడ్ సెల్సు' అనంబడునవి రక్తము నెఱ్ఱగం జేయునవి యైనను, ఒక్కొక సెల్సును పరీక్షించితిమేని, అది పసుపుంబచ్చధాతువం గాన్పించుగాన వీటియెఱుపుపసుంపుంబచ్చధాతువు (ముదిరి) పరిణామముగ నేర్పడినదని తోంచెడిని. అది • ముదిరిన పసుపుధాతువ యెఱుపునకుం జేరుటకుం బ్రారంభమైనట్లే యుండెడిని. లకులు వాటి యధిక సంఖ్యయే యెఱుపుగం గన్పించుటకుం గారణమని యెదరు. రక్తమునం దెఱుపుతగ్గి నీరసము, ఎఱుపు లేక తక్కువ యెఱుపుం గన్పించుట కర్థము. అనారోగ్యముం గల్గి, రక్తపటిమ తగ్గినదనియే చెప్ప

వలసియుండును. అపరిశుభ్రవాయువులఁ బీల్చి యూపిరిఁ దీయుట రెడ్ సెల్సును బాధచేయునని కనిపెట్టఁబడియున్నది. ఇంకను రోగిం బరీక్షించుట యందు వైద్యునిఁబొరఁబెట్టు వేఱొకసంగతిగూడఁ గలదు. ఒక్కొ-క రోగికి రక్తమున రెడ్సెల్సు తగ్గి నను, లేక సరిగా నున్నను, వాటియందుండవలసిన యెఱ్ఱని, పచ్చని ధాతువగు హీమోగ్లోబిన్ సరిగా నుండక, నీరసించియు, తగ్గియు నుండును. ఇట్టిస్థితింబట్టికూడఁ బరిశీలింపవలసియుండును.

గుల్లగనుండు శరీరఁపుయెముకలనడుమనుండు Bone marrow నుండి సెల్సుద్భవించి రక్తము లోనికిఁ జాఱునని చెప్పఁబడినది. సుప్రసిద్ధపరిశీలకులు 'Red cells of the blood are round and flat' అనియు 'Thay are thinner towards the middle than edge' అనియు 'They are circular bi-concave discs' అనియు నాంగ్లమున నిర్వచించిరి. అది వాటియాకారము. ఆరోగ్యస్థితియందు రెడ్సెల్సన్నియు, నేకాకారముంగల్గి యేకపరిమాణమున నుండునని యు, నత్తఱి nucleus అందుఁ గానంబడక లేతఁదనమున నుండుతఱిఁ బ్రతిసెలునందు దాని న్యూక్లియస్ ఉండుననియు, పరిణామమున నది భగ్నమై రక్తమునఁ జిరకాలము నిలచియుండకఁ గొన్నివారములుగ మాత్రము నిలుచుచుండుననియు, తోడనే క్రొత్తసెల్సు కల్గుచుండుననియుఁ బరిశీలనలు తెల్పుచున్నవి. ఇవి తమంతటఁ దాము క్తమునందుఁ గదలునవి కావనియు, శరీరమునం భాగములకు రక్తము ప్రసరించుచుండుతఱి (Circulation) దానితో శరీరమం దంతటఁదిరు చుండుననియుఁ జెప్పఁబడినది. వీటిని Passive గాఁ బోల్చియున్నారు. వీటియందుఁ గల రంగు రన్ (Iron) లోహమువలనఁ గల్గినదిగాఁ బోల్చియున్నారు. రెడ్సెల్సు చెమటతో పాటి యందలి ఐరను నశించునఁట.

రక్తము లంగ్సులోని కరుగుతఱి నూపిరినుండి యటకుఁ జేరిన ఆక్సిజెనును, రెడ్సెల్సుమాత్రమే తనయందున్న హీమోగ్లోబిన్ సాహాయ్యమునఁ బీల్చుకొనఁ గల్గునుగాని, వైట్సెల్సు పీల్చుకొనఁ జాలవని తెలిసినవిషయమే. (వైట్సెల్సు హీమోగ్లోబిన్ చూడుఁడు.)

## రెడ్లెటర్డే (Red letter day):—

ఆ కాలమున 'Happy and delightful day' అనఁబడఁదగిన సుదివసమునకు 'Red letter day' అనిపెదరు. అట్టిదినములను స్పష్టముగ నెఱుంగఁ గల్గునటులఁ గేలండరులం దెఱ్ఱసిరాయక్షరములతో ముద్రింతురు.

## రెడ్‌రష్యనులు:—

(వైటురష్యనులు చూడుఁడు.)

## రెడ్డిప్రభువుల కొండపల్లిదుర్గము—

ఇది మహాబలమైనదుర్గమని పేరందినది. కృష్ణా మండలమున బెజవాడతాలూకాలో బొమ్మలకుఁ బ్రసిద్ధినందిన కొండపల్లిగ్రామమునకరిని కొండయందుఁ గట్టఁబడినదుర్గము. ఆకొండ కృష్ణానుండి యుత్తరమునఁ గొండూరు, జుజ్జూరువఱకు వ్యాపించియున్న గొప్పకొండ. దానిచుట్టుకొలత నూఱుమైళ్ళుండును. దుర్గము కృష్ణానదినుండి యైదుమైళ్ళుండును. కొండపీటియందు క్రీ. శ. ౧౩౬౨ — ౧౩౭౭ కాలమునాఁడు పరిపాలన మొనర్చిన యనవేమారెడ్డిపాలనకాలమున నాయునిచే నిర్మింపఁ బడినదిగాఁ దలంపఁబడుచున్నది. కొండపల్లె యను గ్రామములు పెక్కులుంటఁ గొండపల్లి దుర్గము నినఁ గొంతసంశయము ముదయించనోపు. ఈకొండ

పల్లి యట వసించుచు బొమ్మలంజేసి యమ్ము చుండు నార్యక్షత్రియులు (లేక ముచ్చిలు) చేయు బొమ్మలచేఁ బేరంది, 'బొమ్మలకొండపల్లి' నా వాడఁబడుచుంట నీదుర్గమునకుఁ గొండపల్లిదుర్గ మనుపేరీప్రాంతముల వాడుకయం దున్నను, నీవ్యాసమున బొమ్మలకొండపల్లిదుర్గమని పేరిడి యున్నాము. ప్రధానదుర్గ మొకబలమైన కోటయై యున్నది. దానింజుట్టి పెక్కుప్రాకారములు కోట గోడలచే దిశలందుఁ జుట్టఁ బడియున్నవి. ఇవి యన్నియు నిం దున్న పెక్కుబురుజులును, కోటకు నలుదిక్కులనున్న నాలుగు రక్షకపరిశీలనస్థానము లగు పెద్దబురుజులును, లోనున్న చెఱువులును, ఒకచిన్నపట్టణమును బోలి లోనున్నకోటయందలి యిండ్లు, వీధులు, నుద్యానవనస్థలములును గల్గి కొండపల్లిదుర్గ మగుచున్నది.

బహిఃప్రాకారము కొండపల్లిగ్రామమునుండి రమారమి రెండుమైళ్ళదూరము. దీనిద్వార మొక బురుజునం దున్నది. దానిం గడచి లోని కేగినచో లోనున్న ప్రధానమగుకోట కొక మైలుదూర ముండెడిని. అంతఁదనుకఁ బ్రాకారములలోనే పోవలయును. మార్గమున నేడుబురుజులను దాట వలసియుండును. దీనికి రాచబాట యనిపేరు. ఇది ప్రధానమార్గమై యుండెనఁట. ప్రాకారములమధ్య పాడుపడుచున్న యిండ్లు, వీధులు గలవు. అవి దుర్గద్వారరక్షకసైనికులుండిన యిండ్లని చెప్పు దురు. ఇదిగాక రాళ్ళబాట యని పేరందిన రహ స్యమార్గము వేఱొకటి కలదు. అది లోనివా రాపత్సమయములందు దుర్గమునుండి తప్పించు కొని పాఱిపోవుట కేర్పఱుపఁ బడినట్లు తోఁచెడిని. బురుజులపై సైనికులు కావలిఁ గాచుచుండి రందురు.

ప్రధానదుర్గమును జేరుటతో దానియొక్క వెలుపలిద్వారమునుండి యరిగి లోనిద్వారముం జేరుదురు. ఈరెండుప్రధానద్వారములు మిగులబల ముఁగలవిగనుండి వింతఁగొల్పెడిని. ప్రాకారపుఁగో టగోడలు తగిలినచోటఁ జిన్నచిన్నకొండలం దగు లుచు, కొన్నిచోట్ల వాటింజుట్టుచు, ప్రధానదుర్గ ముం జుట్టియుండును. చూచువారల కాప్రధాన దుర్గమునకుఁ గొండలే పెట్టనికోట లనిపించు చుండును.

ప్రధానదుర్గములోని యిండ్లు శిల్పచిత్రములం బ్రదర్శించెడిని. సైనికుల యిండ్లన్నియు వీధులుగ నిర్మింపఁబడినవి. ధనాగారము లన్నియు నొక తావున వరుసగ నిర్మింపఁబడియున్నవి. వీట్లం గడచి పైన మైదానముంబోలి కొంత వాఁకిలి గలదు. దానికవ్వల ముఖ్యసేనానుల నివాసభవ నములు సౌధములవలెఁ గన్పడెడిని. వాటి కొక ప్రక్కఁగఁ బ్రభువు నివసింపఁదగిన ప్రాసాదమును, అంతఃపురములును, వాటినంటి యంతఃపురో ద్యానము లుండినతావులును నిర్మింపఁబడియున్నవి.

రాజప్రాసాదముకడ నొకఫర్లాంగుదూరమున సభామందిరము ప్రాచీనశిల్పకళానైపుణితో నిర్మిం పఁబడినది పాడుపడుచున్నది. అందలిశిలావిగ్రహ చిత్రములు చూడఁదగినవి. గజశాలలు, నశ్వ శాలలు నాప్రాంతముననే నిర్మింపఁబడియుండెను. రాణుల యంతఃపురములకు వెనుకభాగమున రెండు గొప్పసరస్సులు కలవు. వాట్ల నిప్పుడు టాంకీలని వాడుచున్నారు. అవి చాల లోతైనవఁట. నిర్మల జలంబులు కాలువలగుండా వీటికిఁ జేరెడిని. జలము లు క్రిందిభూపరిస్థితులనుండియేమొ మిగుల రుచి కరములై యుండును. దర్బారులం జరిపిన సభా భవనమున కెదుట లక్కపడవలకొల నని బడు నొకసరస్సు కలదు. అందుఁ గలువలు విస్తారముగఁ

బాప్పించి యుండును. అం దక్కాలమున లక్క పడవలలో రాణులు విహరించుచుండువారఁట. ప్రధానదుర్గమునకు నాల్గుదిక్కులందు నాల్గు గొప్ప బురుజులు రక్షకస్థానములుగ నిర్మింపఁబడినవిధముగ మున్ను చెప్పఁబడియె. అవియే పరిశీలనస్థానములు గూడ నై యుండెను. అవి యొకపాటిగుట్టలపై వాట్లంజుట్టి నిర్మింపఁబడిన గొప్పబురుజులై యున్నవి.

ఈనాల్గింటియందు నుత్తరదిశనున్న యొంటి మస్యఁపుబురుజు కడుంగడు ముఖ్యమైనది. భూ (సాధారణ) మట్టములనుండి రెండువేలయడుగుల యెత్తున నున్నది. దీని నెక్కి చూచిన నూరు మైళ్ళదూర మానునని చెప్పఁబడినది. రాజధాని యగు కొండవీటిదుర్గమును, బందరుసముద్రతీరమును దీనిపై కెక్కి చూచినఁ గానవచ్చును. దండెత్తి వచ్చు శత్రుసైన్యము నూఱుమైళ్ళదూరమం దుండఁగనే దీనినుండి పరిశీలకులు కనిపట్టి యిట రణభేరి మ్రోగించిన దుర్గభాగముల కెల్లఁ దెలిసి సైనికులు యుద్ధసన్నద్ధు లగుచుండువారఁట. దీనిపై నొకరహస్యద్వార ముండిన యానవాళ్లు కలవు. గాని దానింగూర్చి యేమియుం దెలియ రాదు. ప్రధానదుర్గమునుండి యిట కేగుమార్గమున గొప్పగొప్పచెట్లు, గండశిలలు, పై నల్లిబెట్టి నీడఁ గల్గించిన పొడుగాటి యడవితీఁగెలు మిక్కుటముగ నుండి యచ్చెరువుఁ గల్గించుచుండును. అడవి మృగముల యఱపులు, కీచురాళ్ళధ్వనులు మార్గమున భయంకరమై తోఁచెడిని.

పిదపఁ జెప్పఁదగినది యెఱ్ఱబురుజు రక్షకస్థానము. ఇది ప్రధానదుర్గమునకు దక్షిణదిశగా రమారమి రెండుమైళ్ళదూరమున నున్నది. చాల యెత్తైనబురుజు. దీని నెక్కి పరిశీలించినఁ జుట్టుపట్ల నేఁబదిమైళ్ళదూరమున శత్రుసైన్యములు వచ్చుచుండినఁ గన్పించునఁట. అమరావతి యిటనుండి గన్పించెడిని.



పిమ్మటఁజెప్పఁదగినది యెఱ్ఱకొండబురుజు రక్షకస్థానము. ప్రధానదుర్గమునకుఁ బశ్చిమదిశ నున్నది. ఇది యెఱ్ఱబురుజుకన్న నెత్తైనదని యనుచున్నారు. కొంతవఱ కీబురుజునందుఁ జక్కనిపనితనము కలదనియే చెప్పనగును. దీనినుండి పరిశీలించిన నందిగామసీమ చక్కఁగాఁ గన్పించెడిని. ఈబురుజుపై నుండి సైనికులను యుద్ధమునకుఁ బురికొల్పి, వీరావేశమును గల్గించురణభేరిని వాయించుచుండువారఁట. ఇది పెద్దబురుజుగనే గన్పించుచుండును.

శేషించిన నాల్గవరక్షకస్థానము హనుమంతుకొండబురు జనంబడునది. ప్రధానదుర్గమునకుఁ దూర్పుదెసగా రాజభవనమునుండి యొకమైలు దూరమునందే యున్నది. ఈబురుజు నెక్కుటావున నొకద్వారము బురుజుపైఁ బ్రధానసైన్యాధిపతి యుండుట కేర్పాటులు కలవు. దీనిపై నెక్కి పరిశీలించిన హైదరాబాదున కరుగుబాటలు, కృష్ణానది కడుదూరముఁ గన్పించెడిని.

ఇంక నీదుర్గ మెవ్వరివశమున నెంతెంతకాల ముండెనో వివరించి ముగింతునుగాక. క్రీ. శ. ౧౩౬౭ మొదలు ౧౩౭౧ కాలమువాఁడగు అనవేమారెడ్డి యీమహాదుర్గనిర్మాతయని తలంపఁబడుచుంట నంతవఱ కాయనవశమునందుండెను, పిదప ౧౩౯౭ వఱకుఁ గుమారగిరిరెడ్డిభూపతివశమునను, పిదప ౧౪౧౪ వఱకుఁ బెదకోమటి వేమారెడ్డిభూపతివశమునను, పిదప ౧౪౧౯ వఱకు రాచవేమారెడ్డిభూపతివశమునను నుండుట స్పష్టమే. పిదప రెడ్డిరాజులపాలన మంతరించి ౧౪౬౧ వఱ కొండవీటినుండి లాంగూలగజపతివశమునను, తరువాత ౧౪౭౪ వఱకుఁ బ్రతాప (హరిహర) దేవునివశ

మునను, పిదప ౧౪౬౧ వఱకుఁ గపిలేశ్వరవశము నను, కొండవీటితోఁబాటు దుర్గమును నుండెను. అప్పటితో నాపాలన కంతరాయము రా రెండవ మహమ్మదుషా వశమై ౧౪౭౧ వఱకుండెను. పిదపఁ బురుషోత్తమగజపతి వశమై ౧౪౮౨ వఱకును, పిదప వీరభద్రగజపతివశమున ౧౪౯౬ వఱకును నుండి పిదప శ్రీకృష్ణదేవరాయసార్వభౌముని ప్రభుత్వమునకు వశమాయెను.

పిమ్మట క్రీ. శ. ౧౫౩౪ లో, కూలీకుతుబ్షా వశమై, ౧౫౪౩ లోఁ దిరుగ నచ్యుతదేవరాయలకు, సదాశివరాయలకు, వేంకటపతిరాయలకు వశమై, ౧౫౭౯ వరకుఁ గడపి, యప్పుడిబ్రహీం పాదుషా వశమై, తిరుగ ౧౫౯౦ — ౧౬౧౦ వరకు అమీనుల్ముల్కు—షరాస్ఖాను వశమం దుండెను. పిదప ౧౬౧౧ లో గుటుంపల్లి ముత్తునామాత్యుని వశమై ౧౬౫౬ వర కుండి, యత్తఱి నటఫర్ జంగు అబ్దుల్లాహసన్ తానీషావశమున ౧౬౬౬ వరకుండి, నిజాముల్ముల్కు—ప్రభుత్వవశమున ౧౬౯౭ వరకుండి ౧౭౪౯ వరకు సుల్తానబ్దుల్లాహసన్ తానీషా వశమం దుండి, పిదప ౧౭౫౨ వరకు దాదాబహద్దూర్ ఖానీషావశమును నుండి, పిదప ఖిల్లేదారులనంబడిన యుద్యోగులవశమున, ౧౭౫౨—౧౭౫౮— ౧౭౬౬ లలో నుద్యోగులనూర్పు నందుకొని యెట్టకేలకు ౧౭౬౬లో నాంగ్లసేనాని జనరల్ కె యిలాడ్గారి వశ మాయెను. ఆయన దీనిని ౧౮౫౯ వరకు వశమం దుంచుకొనెను. నేఁటికిని బ్రిటీషువారివశమునందే యున్నది. ఆగొప్పపర్వతమునందలి కిఁ ఱాళ్ళు, చింతలు, సీతాఫలములు, అడవి మున్నగు వాటినుండి ఫలసాయాదాయము ప్రభుత్వమువారికిఁ జెల్లుచున్నది. బహిఃప్రాకారపుఁ జుట్టుకొలత పంద్రెండుమైళ్ళుట. (దండకవిలె చూడుఁడు. రెడ్లు చూడుఁడు.)

**రెడ్డిప్రభువులు, కొండవీటిరాజ్యము:**—కొండవీటిరాజ్యముంగూర్చి దండకవిలె యందు వివరింపఁబడినది. (దండకవిలె చూడుఁడు). ఆప్రభువులలో రెడ్డిప్రభువులు సుప్రసిద్ధులు. వారింగూర్చి యందు వివరింపఁబడును.

వీరిమూలపురుషుఁడు దొంతి అల్లాడరెడ్డి యని దండకవిలెయందుఁ జెప్పఁబడియున్నది. కొండవీటి లోకల్ రికార్డ్సునందు వీరికాలము క్రీ. శ. ౧౩౨౧—౧౪౨౦ అని మూఁడవసంపుటము, ౫౭౭ పుట యందుఁ జెప్పఁబడినది.

వీరిసంతతివారిలో మొదటఁ బ్రభుత్వమునకు వచ్చిన ప్రోలయరెడ్డి కంకితమీయఁబడిన హరివంశమున దేసటివారని చెప్పఁబడుట వీరియింటిపేరు దేసటివారని కొందరు పరిశీలకులు భ్రమపడిరిగాని యది సరికాదు. వీరిమూలపురుషుఁడల్లాడరెడ్డి పంటరెడ్లతెగకుఁ జెందినవాఁడని చెప్పఁబడినది. పంటరెడ్లు పదునాలుగువిధములు. అందొకశాఖ వీరిది కావచ్చును. కానిచో వీరు దేసూరిరెడ్లు కావచ్చును. గాన హరివంశమున దేసటి, దేసూరిశాఖకుం జెందినవారని యట్లుఁ జెప్పియుండవచ్చును. ఏదియుఁ గాకున్న నింటిపేరు గ్రామనామముఁగాన కాపురముండినగ్రామము నుండి మాఱవచ్చును. ఈయన రాజధాని తొలుత నద్దంకి యనియు, కొండవీటికిఁ దనరాజధానిని మార్చుకొనెననియుఁ దెలిసెడిని. ఈయనపాలనకాలమున నీయనసుతుఁడనపోతవేమారెడ్డి సేనానియై, ధరణికోటయందు వసించుచుఁ బల్లహదిత్యుఁడనియు, పల్లవత్రినేత్రుఁడనియు, రాయచేకోలుగండఁడనియు బిరుదములు కలవాఁడై యుండువాఁడు.

౨ వ ప్రభువు అనపోత వేమారెడ్డి క్రీ. శ. ౧౩౫౦ — ౧౩౬౨. ప్రోలయవేమారెడ్డికిఁ బిదప పెద్దకుమారుఁ డనపోతు వేమారెడ్డి సింహాసన మెక్కెను. ధర్మపరిపాలనఁ జేసినవాఁడని చెప్పఁ బడినది. ఈతనికిఁ బిదప నీతనితమ్ముఁ డనవేమా రెడ్డి రాజ్యమునకు వచ్చెను.

3 వ ప్రభువు అనవేమారెడ్డి క్రీ. శ. ౧౩౬౨— ౧౩౮౦. ఈయన గొప్పదాత. విద్యల నభివృద్ధి పఱచినవాఁడు. రాజ్య మీతనికాలమున నెక్కువ వ్యాపించి యుత్తరమున రాజమహేంద్రవరము నుండి దక్షిణమునఁ గంచిదనుకను, తూర్పున సముద్రమునుండి పశ్చిమమునఁ శ్రీశైలముఁ దనుకను నుండెనని చెప్పఁబడినది. ఈయనక "ముల్లగూరమ్మ" యను దేవతయందు భక్తి మెండు. అమీనాబాద యని యిప్పుడు పిలువఁ బడుచున్న 'ముల్లగూరమ్మపేట' కడఁ గొండపై దేవాలయము నిర్మించి, యీమెను బ్రతిష్ఠించి, యాగ్రామ మా దేవస్థానమున కిచ్చివేసెనఁట. (ఈమె మూలాంకురేశ్వరి యఁట). ఈయనకడ మామిడి (పెద్దనసుతుఁడు) సింగన మంత్రిగనుండి శ్రీనాథమహాకవివల్లఁ గృతి నందెను.

౪ వ ప్రభువు కుమారగిరిరెడ్డి క్రీ. శ. ౧౩౮౦— ౧౪౦౦. ఆయనకుఁ బిదప నాయనయన్నగారికుమా రుఁడు కుమారగిరిరెడ్డి సింహాసనమునకు వచ్చెను. ఈతఁడు జనకంటకుఁ డందురు. ఈతనికాలమున వంశక్రమాగతముగ వీరియింటనుండిన పరశువేది చోరులచే నపహరింపఁబడెననియు, ౧౩౮౨—౮౫ మధ్యఁద్రిపురాంతక శ్రీశైలమధ్యప్రదేశము విజ యనగరి సామ్రాజ్యమునకు వశమయ్యెననియుఁ జెప్పఁబడినది. వసంతోత్సవప్రియుఁడుగాన నీభూ పతికి వసంతనృపాలుండని పేరయ్యెను. మఱియు నీతండు 'వసంతరాజీయ' మనునాట్యశాస్త్రమును రచించె నందురు. ఇతనిమఱఁది కాటయరెడ్డికి రాజమహేంద్రవరరాజ్య మిచ్చివేసెను. అంతటి నుండి యారాజ్యము వేఱె చీలిపోయెను.

౫ వ ప్రభువు పెదకోమటి వేమారెడ్డి క్రీ. శ. ౧౪౦౦ — ౧౪౨౧. పిదప నీయన పెదతాతమను మఁడు పెదకోమటివేమారెడ్డి సింహాసనమునకు వచ్చెను. ఈతనికడ మామిడి (పెద్దనకొడుకు) సింగన మంత్రిగ నుండెను. కొంతకాలము తరగా రామమంత్రియు మంత్రిగా నుండెనఁట. ఆస్థాన కవియగు శ్రీనాథమహాకవి ప్రభునకు "సర్వజ్ఞ చక్రవర్తి" బిరుద మిప్పించెనట. ఈతనికాలమున నే శ్రీనాథుఁడు గౌడడిండిమభట్టు కంచుఢక్కా పగులఁగొట్టించుట, కృష్ణరాజుమేడనిర్మాణము, మొదల్గను కైలాసకోటల జాగీరుల సంపాదించి శ్రీనాథుఁ డీయన కర్పించుటయు జరిగెనఁట. ఇతఁడును ముల్లగూరమ్మభక్తుఁడే.

౬ వ ప్రభువు (రాచ) వేమారెడ్డి ౧౪౨౧ — ౧౪౨౪. తరువాత నాతనిసుతుఁడు రాచవేమా రెడ్డి ప్రభువాయెను. ఈతండే కొండవీటిరెడ్డిప్రభు వులలోఁ గడపటివాఁడు. క్రూరుఁడు, ఈతఁడు పురిటిపన్ను విధించెననియు, దానిని భరింపఁజాలకఁ బ్రజ లీతనిం బరిమార్ప నెంచిరనియు, సౌరము యెల్లప్ప యనుబలిజకొమరుఁడు ముత్యాలమ్మగుడి యొద్ద నీతనిఁ దనకటారితోఁ బొడిచి చంపెననియుఁ జెప్పబడినది. పిదపఁ గొండవీటిరాజ్యము గజపతి రాజుల యధీనమయ్యెను. (దండకవిలెచూడుఁడు).

**రెడ్డిప్రభువులు:**— వీరు కొండవీడు అద్దంకిసీమ, గుంటూరు మొదలగు ప్రాంతములఁ బాలించిరి. రాజమహేంద్రవరమున సుప్రసిద్ధుఁడు వీరభద్రారెడ్డి నృపాలుఁడు మొదలగువారు పాలించిరి.

వీ రనేకపద్యకావ్యములఁ గృతులనందినవారు. విద్యాపోషకులు. వేమారెడ్డి శ్రీశైలముకడ, పాతాళగంగకుఁ బావంచాలఁ గట్టించినధర్మశాలి. ఆయనయన్న మాచిరెడ్డియొక్క పౌత్రుఁడు. వే మారెడ్డి యమరుకకావ్యవ్యాఖ్యాత. అన్న వేమా రెడ్డి హరివంశమును గృతినందినవాఁడు. అనపోత రెడ్డికిఁ గర్పూరవసంతరాయుఁడని బిరుదుండెను. అనేకులు సుప్రసిద్ధులు కలరు.

# రెడ్డిప్రభువుల వంశవృక్షములు

## ౧ ఆంధ్రహరివంశమునఁ జెప్పఁబడినది. పంటరెడ్లు.

- వేమభూపాలుఁడు
  - కోమటిపోలిరెడ్డి
    - మాచిరెడ్డి
    - అన్నవేమారెడ్డి (హరివంశకృతిపతి)
      - పోతయరెడ్డి
      - వేమాంబ
      - కోమటి పోలయరెడ్డి
    - అన్నంరెడ్డి
    - మల్లారెడ్డి

---

## ౨ ఆంధ్రహరివంశమునఁ జెప్పఁబడినది. పంటరెడ్లు.

- దొడ్డయరెడ్డి
  - పోతయరెడ్డి
  - చిన్నయరెడ్డి
    - మాకారెడ్డి
  - అన్నమ్మ మొదటి కోమటిపోలనభార్య
  - నాగయ్యరెడ్డి

---

## 3 మల్లవరఁపుశాసనములోని రెడ్డివంశావళి. పంటరెడ్లు.

- వేమారెడ్డి — శ్రీశైలమునకుఁ బాతాళగంగకు మెట్లుఁ గట్టించిన ప్రభువు. ఈయనకు మాచయరెడ్డియను జ్యేష్ఠ సోదరుఁడుండెనఁట.
  - దొడ్డమ్మ — ఈమెకుమారుఁడు కాటయవేమారెడ్డి
  - అనపోతరెడ్డి — ఈతనికిఁ గర్పూరవసంతరాయఁడని బిరుదు కలదు.
    - కూతురుమల్లమ్మ
  - అనవేమారెడ్డి

# రెడ్డి ప్రభువుల వంశవృక్షము

౪ ఆంధ్రకాశీఖండములోని రెడ్డిరాజులవంశావళి. (పంటరెడ్లు).

దువ్వూరి పెరమాళ్లురెడ్డి.

భార్య అన్నమ్మ.






# రెడ్డిప్రభువుల వంశవృక్షము

౬. మల్లవరంశాసనమునఁ జెప్పఁబడిన రెడ్డివంశావళి.

కాటయరెడ్డి
|
మారయరెడ్డి
|
కాటయరెడ్డి — ఈతనిభార్య దొడ్డమ్మ. ఈమె తండ్రిపేరు వేమారెడ్డి. ఈమెసోదరులపేరు అనపోతరెడ్డి, అనవేమారెడ్డి అనువారలని చెప్పఁబడినది.
|
వేమారెడ్డిభార్య మల్లమ్మ. — మల్లమాంబతండ్రిపేరు అనపోతరెడ్డియనియు, ఆమెసోదరునిపేరు కుమారగిరిరెడ్డి యనియుఁ జెప్పఁబడినది.

ఈకుమారగిరిరెడ్డి కొండవీటిదుర్గమేలినవాఁడు. ఈయనకడఁ (బాల్యమునఁ) గాటయవేమారెడ్డి మంత్రిగనుండెను. బంధువుఁడు. పిదపఁ గాటయవేమారెడ్డికిఁ గుమారగిరిరెడ్డి రాజమహేంద్రవర రాజ్యము బహుమాన మిచ్చెనఁట.

# రెడ్డిప్రభువుల వంశవృక్షములు

దూపూరి పెరుమాళ్ళురెడ్డి భార్య అన్నమ్మ.



# రెడ్డిరాజులవంశావళి

## కొండవీటి ప్రభువులు.




కొండవీటిరాజ్య మేలినవాడు. ఈతనిబాల్యమున నీతనికడఁ గాటయవేమారెడ్డి దివానుగ నుండెను. పిదప నాతని కీతఁడు రాజమహేంద్రవరరాజ్య మొసంగి ప్రభువుగాఁజేసెను. పిదపఁ బరిశీలనలవలనఁ గుమారగిరిరెడ్డికిఁ గాటయవేమారెడ్డి తోఁబుట్టువు పెనిమిటి (భావమఱఁది) యైనట్టును, ఆయన కూఁతురును, రాజమహేంద్రవరపురాధీశుండగు వీరభద్రారెడ్డి భార్యయు నగు మల్లమ్మమేనగోడలైనట్టును దెలియుచున్నది.

# రెడ్లవంశవృక్షము-రెడ్డిప్రభువుల వంశావళి



**రెడ్డివారినానుఁబాలుచెట్టు**:-లా. Euphorbia Thymifolia.

ఇది పెద్దచిన్నభేదములచే ద్వివిధము. చిన్నది భూమినంటియే చిన్నయాకులతో నేల నావరించి పెరుఁగును. పెద్దజాతి పైకి లేచుటయు, పెద్ద యాకులం గల్గియుంటయు భేదములు. ఈరెండు రకములలో నొక్కొక్కటి తెల్లది, యెఱ్ఱనిది యని తిరుగ ద్వివిధభేదములు. ఇటుల రెడ్డివారి నానుఁబాలు నాల్గుభేదములుగ నుండును. పెద్ద జాతియాకులరసముగాని, కషాయముగాని, చూర్ణముగాని, సమస్తమేహరోగములను హరించును. పైత్యము, క్రిమి, విషదోషము, సెగరోగము, నిర్మూలించుశక్తిఁ గల్గియున్నది. నేత్రరోగముల హరించి, యించుక వాతముఁ జేయును.

చిన్నజాతిచెట్టుచూర్ణము పిల్లల క్రిమిరోగము, జ్వరము, విరేచనములు, నివారించును. చిన్నజాతి పిల్లలకే యుపయోగించుచుందురు.

**రెడ్డిసీమ**:—ఆంధ్రదేశమునఁ జిత్తూరుమండలములోని, తిరుపతిక్షేత్రమునలెనే పశ్చిమగోదావరీమండలములోని యేలూరుసమీపమున నొక చిన్నమెట్టపై నొకతిరుపతిక్షేత్రము కలదు. దానిని 'ద్వారకాతిరుపతి' యనియు, చిన్నతిరుపతి యనియు ననెదరు. ఇచటి వేంకటేశ్వరస్వామిని వెంకటరెడ్డి యని యీప్రాంతములవా రనుటయుం గలదు. ఇందు రెడ్డి యనఁ బ్రభువని యర్థము. ఈతావు కొవ్వలిప్రదేశమగు దేశభాగమంతయు 'రెడ్డిసీమ' యనఁ బరగెడిని. రెడ్డికులజు లీదేశమున నుండుగఁ గలరు. రెడ్లప్రాబల్యముఁ గలసీమ యని భావము.

**రెడ్లు (రెడ్డికులమువారు)**:— రెడ్డి యనుపదము రాట్, లేక రేడు నుండి వెలువడె నని తోఁచెడిని. అట్లగుననేని భూపతి యర్థముఁ గా నొప్పు. ప్రాచీనంపుఁ బద్యకావ్యములందుఁ గూడ రట్టడి, రడ్డి, రడ్డు, 'రెడ్డిరాజులు' 'రెడ్డిదొరలు' 'గ్రామరెడ్డి' అనునాదుక లధికార సూచకములు. నేఁటికిని రెడ్లధికముగాఁగల నెల్లూరు మొదలగు మండలములలో గ్రామాధికారి యగు విలేజిమునసిఫ్ కులముచే రెడ్డి గాకున్నను గ్రామస్థులచే 'రెడ్డిగారు' అనంబడుచుండుఁ గాన నగును. పరిశీలనలు రట్టడి, రడ్డి లేక రడ్డు కడకు రెడ్డిగా నిలచినట్లు తెల్పుచున్నవి.

గుంటూరుమండలములోని ఎఱ్ఱఁబాలెఁపుశాసనమున క్రీ. శ. పంద్రెండవశతాబ్దమునం దుండిన ఎఱ్ఱమరట్టడి తనతల్లిదండ్రుల యర్చనకుఁగా దానము లొసర్చి, యీశాసనము వేయించెనఁట. శాసనము కడభాగమున, తనను "ఎఱ్ఱమరెడ్డి" యని వ్రాసియుంట రెండుపదముల కర్థ మొకటియే యనియు, నాపంద్రెండవశతాబ్దికాలమునాఁటికీ రెండుపదములు వాడుకయందున్న వనియుఁ దేలుచున్నది. ఇంక 'రట్టడిక' మన రెడ్డితనము, లేక రెడ్డికమున కర్థమగుట కొట్టిశంకలుం గలుగనేఱవు. రెడ్లు తాము రాష్ట్రకూటసంబంధులమని చెప్పుకొనుచుంట, రెడ్డిపదము రాష్ట్రకూటసంబంధమై యుండవలసియుండును. రట్టడికము రాష్ట్రకూటపదమునకు సమీపపదముగనే పలుకుచున్నది. రాష్ట్రశబ్దము రాజ్యమున కర్థ మిచ్చునది. కూటశబ్దము కూడిక (సముదాయ) యని తేలుచున్నది. రట్టడమునకుఁ బ్రతిరూపమేయగు 'రట్టడి' పదమున కర్థము రాష్ట్రకూటమే యగును. రట్టడిపదమునకుఁ బూర్వరూపము రట్టగుట్టు, రట్టగుడి యను పదములుఁ గానోపు. ఎపిగ్రాఫికా ఇండికా ఎనిమిదవసంపుటము ౧౩౮ పుటయందు గుట్టశబ్దము గుప్త లేక గుప్తఁగొనినవాఁడని తెల్పుచున్నది.

గుట్ట, గుడి, గుట్టిక శబ్దములకు ఘంటికార్థముగ జైనులు, బౌద్ధులు, రక్షకమనియు, రక్షకుం డనియు నుపయోగించిరి. ఈయర్థమునే Rhys Davids & Williams Stede పండితులు రచించిన పాలీ యాంగ్లనిఘంటువునందుం జెప్పియున్నారు.

రెడ్లు, అనవేమారెడ్డి, వీరభద్రారెడ్డి వంటి స్వతంత్రప్రభువులుగను, సేనానులుగను, సాహిణులుగను, నుంచి శూరులని పేరందినవారు గాని నీయర్థము లన్వయించుటకు కేయాటంకము లుండవు. వీరు రాష్ట్రికూటులకుచో సూర్యవంశక్షత్రియులుగ (స్కాందపురాణ సహ్యాద్రిఖండోక్తి) ౧ భారద్వాజస ౨ పూతిమాష, ౩ వశిష్ఠ, ౪ కశ్యప, ౫ హరిత, ౬ విష్ణువృద్ధ, ౭ జనార్దన, ౮ సౌబల, ౯ కౌండిన్య, ౧౦ మాండవ్య, ౧౧ కౌశిక, ౧౨ విశ్వామిత్ర యనంబడు ద్వాదశగోత్రములవారుగ నుండవలయును. అవి మారి యిప్పటిగోత్రము లెట్లు వచ్చినది పరిశీలనలు జరుగవలసియున్నది. భూమంచిరెడ్లయందు వాడుకలోనున్న ౧ ఆత్రేయ, ౨ కలిగల, ౩ కౌటిన్య, ౪ చక్రిపాల, ౫ తామసపాల, ౬ పైడిపాల, ౭ మైపాల, ౮ రకిఇళ్ళ, ౯ వామనపాల, ౧౦ శోభనపాల, ౧౧ సిరిపాల, ౧౨ పెంపాళ గోత్రముల కెట్టిసంబంధ మున్నదో, యేల మారెనో తెలియవలయును. సందునికాలమున వీరు ప్రచ్ఛన్నులై యాంధ్రభూమి కరుదెంచుకతన గోత్రములంగూడ మారె నయ్యెనని వీరియం దొకప్రతీతి కలదంట. క్షత్రియులగోత్రములుగ మారిన్ని వీరికి బై పేరులుగల గురువులుండిరేమో పరిశీలింపందగును. (భూమంచిరెడ్లు చూడుండు.)

ఏది యెట్లు జరిగినను నిప్పుడు వీరియందుం బెక్కు లంతశ్శాఖ లేర్పడియున్నవి. వాట్లనెల్ల సంపాదించుట దుర్ఘటము. 'వడ్లలోని తెగలు, రెడ్లలోని తెగలు లెక్కింపంజాల' రని రెడ్లలో సామెతగం బల్కుచుందురు. దేసటివంశంపు రెడ్లు, దుప్పూరువంశంపు రెడ్లు, కడుపురాతనంపు భేదముంగల తెగలుగం జెప్పుకొనుచుందురు. కొందఱు రెడ్డి ప్రముఖులు వీరియంతశ్శాఖ లెనుబది రెండని నుడివిరి గాని, పూర్తిగ వాటిపేరులం దెల్పినవారు మాకు లభింపలేదు. ముప్పదినాలు గంతశ్శాఖల పేరులు గద్వాలసంస్థానమువారు 'రెడ్డికులనిర్ణయ చంద్రిక' యను గ్రంథమున వ్రాయించిరని తెలియుటయేగాని మాకు లభింపలేదు.

మాకు లభించినవి వివరించి ముగింతుము గాక.

౧ అయోధ్యరెడ్లు:—వీరు పంటరెడ్లయందుం గూడం గానవచ్చెదరు.

౨ ఓరుగంటిరెడ్లు:—వీరును పంటరెడ్లయందుం గలరు.

౩ కమ్మపురిరెడ్లు.

౪ కుంచెముగురెడ్లు.

౫ కుంచేటిరెడ్లు:— వీరు పంటరెడ్లయందుం గలరంట.

౬ గాజులరెడ్లు.

౭ కొణిదెరెడ్లు:- ఇందుం బెద్దకొణిదె, చిన్నకొణిదె యని రెండంతశ్శాఖ లేర్పడియున్నవి.

౮ గండికోటరెడ్లు:-వీరును పంటరెడ్లయందుం గలరు.

౧౦ గోనుగుంటరెడ్లు.

౧౧ దేశూరిరెడ్లు.

౧౨ దేహాశూరరెడ్లు.

౧౩ నానుగొండరెడ్లు.

౧౪ నెరవాటురెడ్లు.

౧౫ నేరడిరెడ్లు:- వీరును పంటరెడ్లయందుఁ గలరు.

౧౬ పంటరెడ్లు:-వీరిని తెలగా రెడ్లనియు వాడుదురట. వీరియందుఁ బదునాలు గంత శ్శాఖలు కలవని యొకభట్టుకవి దేవరాజను పేరుగలవాఁ డార్వీటి బుక్క రాజు గారిపేరుగ నొకచాటుధారపద్యమును రచించెనఁట. ఆర్వీటి బుక్కరాజు మహా మండలేశ్వరుఁడైన శ్రీకృష్ణరాయసార్వభౌమునికి సామంతుఁడై యుండెను. దాని నిట వివరింతును.

సీ॥ పంటాన్వయమునందుఁ బదునాల్గుశాఖలఁ
జక్కఁగ వివరింతు సత్యమరసి
మోటాటి, వెలనాటి, మొరసు, నేర, దయోధ్య,
పంట, పొంగలినాటి, పాకనాటి
భూమంచి, కుంచేటి, మున్నూటి, గోటేటి,
ఒనర గండియకోట, యోరుగంటి
యనఁబరగుచు నుండు రాంధ్రావనీస్థలి
గౌరవాధిష్ఠిత కాపురెడ్లు
తే॥ పంట పదునాల్గు విధములం చంట జగతిఁ
దరతరంబుల నిట్టులఁ దనరుచుండ్రు।
వీరి కుపతెగలున్నవి వివిధములుగ।
భుజబలాటోప పిన్నమ బుక్కభూప॥

౧౭ పల్లెరెడ్లు.

౧౮ పాకనాటిరెడ్లు:—వీరియందుఁ బోకనాటి వారను వేరంతశ్శాఖవారున్నారని కొందఱును, పాకనాటి, పోకనాటి యొకటేయని కొందఱును ననుచున్నారు. వీరు పంటరెడ్లలోఁగూడఁ గలరఁట.

౧౯ పెడకంటిరెడ్లు

౨౦ పొంగలినాటిరెడ్లు:— వీరును పంటరెడ్ల యందుఁ గలరు.

౨౧ పోకనాటిరెడ్లు

౨౨ బలిజరెడ్లు

౨౩ బూస లేక బూసటిరెడ్లు

౨౪ భూమంచిరెడ్లు:—వీ రుత్తరసర్కారులలో నధికముగఁ బంటరెడ్లయందుఁగూడఁ గలరఁట.

౨౫ మొరపరెడ్లు

౨౬ మొరసురెడ్లు:—వీరు పంటరెడ్లుయందుఁ గూడఁ గలరు.

౨౭ మోటాటిరెడ్లు:—వీరిని మోటాడురెడ్లని యు నందురు. వీరియందు, తంగటూరు, వెల్లాల, పాకుమంచాల, తొగర్చేడు రెడ్లు అని నాలు గంతశ్శాఖలు కలవు. మఱియు వీరు పంటరెడ్లయందుఁ గూడఁ గానఁబడుచున్నారు.

౨౮ మొల్లమరెడ్లు.

౨౯ రేనాటిరెడ్లు.

౩౦ లాలిగొండరెడ్లు.

౩౧ వెలనాటిరెడ్లు:—వీరు పంటరెడ్లయందుఁ గూడఁ గలరట.

౩౨ పొంగనాటిరెడ్లు.

౩౩ సజ్జనరెడ్లు.

౩౪ సాదరరెడ్లు.

(రెడ్డిప్రభువుల కొండవీటిదుర్గము చూడుఁడు.)

ఇంక మున్నూటరెడ్లనంబడువారు వేఱుగ నున్నట్లుఁ గానరాదు. గాన సంఖ్యాధిక్యతం దెలుపుటకు రెడ్లందఱును మున్నూరని వాడిరేమో కాని దేవరాజుగారి సీసపద్యమునుండి ప్రత్యేక శాఖవారు మున్నూటిరెడ్లని యున్నారనియే తోఁచెడిని.

**రెప్పపాటు (కన్నీరు)**:—కనురెప్పలు తెఱచుగ వ్రాలుచు తోడనే లేచుచుండుట

మేల్కొని యుండుతఱి సందఱకును సర్వసాధారణముగ నడుచుచునేయుండును. రెప్పపాటుకాలము నకు నిమిష మనిపేరు. దేవత లీరెప్పపాటులక్షణము లేనివారని చెప్పఁబడిరి. గాననే వారి కనిమిషు లనిపేరు గల్గెను. నిదురఁబట్టుటతో నేత్రములు మూసికొని తిరుగ మేల్కాంచుటతో నేత్రములు విప్పుదుము గాన నిందు రెప్పపా టుండదు.

ఇంక రెప్పపాటులనో, దానిపని యేమో యోచింతుము గాక. కనురెప్పలలోఁ గ్రిందవి, పైవి కలసి నాల్గుండును. ఏకంటికైనను క్రింది రెప్పలు, పైరెప్పలు రెండుంగలసి కొనుటయే రెప్పపాటనఁబడును. మహావాయుపథమునఁ గంటికగుపడని యతిసూక్ష్మమైన త్రసరేణువులు గల సన్నఁపుధూళి (బుగ్గి) యుండి చూచుచుండు నతనినేత్రములందుఁ గొద్దిగఁ జేరుచుండును. తోడనే కనురెప్పలు వాటంతట నవియే మూసికొని తోడనే తెఱచును. ఇట్లగుతఱి నేమి జరుగుచున్నదియో తలంచిన వింతఁ గొల్పెడిని. క్రింది రెప్పలమూలాలందు సన్నని రంధ్రములులోని కేగి యుండును. ఈరంధ్రములు లోభాగమున 'Eye glounds' అనుభాగము కలదు. అది జలనిలయము. రెప్పలు మూసికొనినప్పుగనే యీరంధ్రములనుండి తలవెంట్రికకన్న సన్ననిధారగ రెండు చిన్నచిన్న జలకణములు రెండు నేత్రములలోనికిఁ దిగును. రెప్ప వాల్చుటయు, తెఱచుటయు నా జలముతో నేత్రములం దుడిచి శుభ్రపఱచును.

అట్లు శుభ్రపఱుపకున్న నచిరకాలముననే నేత్రేంద్రియము సరిగాఁ బనిఁజేయుట మానుంగాన నట్టిబాధ రాకుండ నేత్రముల నెప్పటి కప్పుడు పరిశుభ్రపఱచు చుండునేర్పాటు 'రెప్పపా' టని యెఱుంగునది. దుఃఖసమయమున నీజలమే యధికమై కండ్లలోనికిం దిగి కంటినుండి బయటికిఁ గాఱుచుండును. దానినే కన్నీరందురు.

## రెబిలియన్ టు టైరెంట్సు, ఒబిడియన్సు టు గాడ్ (Rebellion to Tyrants is obedience to God):—

ఒత్తిడిఁ గల్గించువారిపైఁ దిరగఁబడుట దైవమునకు విధేయత నడుపుటయే యనుట కీఉక్తి ప్రసిద్ధమైనది. ఈమాటలు జమైకాద్వీపమున marta Bay కడ నొకకొండపై నొకఫిరంగిపైఁజెక్కి యటనేగల President John Bradshaw సమాధికడ నుంచిరఁట. మఱియు నీఉక్తి యమెరికాసంయుక్త రాష్ట్రముల సుప్రసిద్ధుఁడగు Dr. Franklin గారి కొకతఱి నావేశపూర్వకమున స్ఫురించెనఁట.

## రెమిడీ Remidy (పరిహారము):—

కల్గిన నష్టమునకుఁ బరిహారమని యర్థము.

## రెయిన్ ఆఫ్ టెర్రర్ (Rein of terror):—

ఫ్రెంచిరివల్యూషన్ కాలమున జరిగిన పరిపాలనమునకుఁ బేరు. అప్పుడు జాకోబైట్సు కక్షవారివలన నేర్పఱుపఁబడిన Committe of public safety వారిచేతియం దుండెను.

## రెయిన్‌గేజి (Rain gauge):—

కురిసిన వర్షమును భరతవర్షమున నాదికాలమునుండి పొలమును దున్నుటనుఁ జాలినవర్షమును దుక్కివర్షమనియు, వ్యవసాయఁపుఁబొల మంతటను నీరు నిలచినంతటివర్షము లేక రెండుముక్కాల (పదును) వర్షమును మడికట్టువర్ష మనియు లెక్కించుచుండిరి.

పాశ్చాత్యవిధానమున రెయిన్ గేజిస్థానములు స్థాపింపఁబడి కొంతవర్ష మొక funnel గుండా నొకగాజుగొట్టములోనికిఁ జేరును. దానిపై నంగుళముల గుర్తు వేయఁబడియుండును. దానినుండి యిన్నియంగుళములవర్షమని లెక్కించుచుందురు.

**రెయిన్ బెల్టు** (Rain belt):— దీనిని 'Equatorial Rain Belt' అనియు నందురు. భూమధ్యరేఖ కిరుదెసలనుగల ప్రాంతమున North and South Trade winds వరకుఁగల తావుల భూమిచుట్టు వర్షములు తఱచుగఁ దప్పకఁ బడు చుండును. దీనిని 'Rain belt' అనెదరు.

మఱియును సహారాయెడారిమొదలు గోబి యెడారివరకుఁగల ప్రదేశమునను, అమెరికాఖండ మునఁ గొంతప్రదేశములను వర్షమే కురియదు. వీట్లను 'Rainless Zone' అనియెదరు.

**రెయిన్ లెస్ జోను:**—
(రెయిన్ బెల్టు చూడుఁడు).

**రెయిన్షాడో:**— (Rain shadow):— వర్షకారణములగు వాయువులనుండి మఱుఁగు పఱుపఁబడిన ప్రదేశము 'రెయిన్షాడో' అని యెదరు. (వర్షపాతకారణములైదు చూడుఁడు).

వర్షపాతకారణములగు వాయువులు పర్వత మున నొకదెసకుమాత్రమే తగులుటచే దాని రెండవప్రక్క రెయిన్షాడోయై వర్షములు లేని ప్రదేశ మగును.

**రెయిల్వేఎంజిన్ (locomotive)నందలి ౧౬౪ యంత్రభాగములు:**—

1 Wind Deflector.
2 Chimney.
3 Chimney Bell.
4 Blower Connection.
Vacuum Exhaust pipe.
6 Lamp Iron.
7 Hand Rail.
8 Smokebox Door Handles.
9 Smokebox Door.
Dart for fastening Smokebox Door
11 Smokebox Door Baffle plate.
12 Smokebox.
13 Blast Pipe.
14 Exhaust from Inside Cylinders.
15 Exhaust from Outside Cylinders.
16 Exhaust Steam to Exhaust Injector.
17 Steam pipe to Outside Cylinder.
18 Steam pipe to Inside Cylinder.
19 Oil pipe from Sightfeed Lubricator in Cab to Inside Cylinder.
20 Pipe from Sight feed Lubricator in Cab to outside Cylinder.
21 Main Steam Pipe for Superheated Steam.
22 Superheated Header.
23 Steam Pipe from Regulator Valve to Superheator Header.
24 Regulator Valve.
25 Vacuum Exhaust Ring on Chimney.
26 Oil Pipe to Regulator.
27 Distribution Box for oil Supply to Cylinders.
28 Smokebox Saddle Casting.
29 Blast Nozzle.
30 Steam Chest.
31 Piston Valve Liners.
32 Piston Valve (Inside Admission)
33 Piston Valve Spindle.
34 Exhaust Steam Passage.
35 Front Steam Port.
36 Back Steam Port.
37 Back Exhaust Port.
38 Front Exhaust Port.
39 Piston Valve Tail Rod Cover.
40 Front Steam Chest Cover Casing.
41 Front Steam Chest Cover.
42 Back Steam Chest Cover Casing.

43 Back Steam Chest Cover.
44 Inside Cylinder.
45 Piston.
46 Piston Rod.
47 Babk Cylinder Cover.
48 Front Cylinder Cover.
49 Relief Valve.
50 Front Cylinder Cover Casing.
51 Footplate.
52 Vacuum Hosepipe.
53 Buffer.
54 Drawhook.
55 Screw Coupling.
56 Pad and Casing for Drawhook.
57 Fngine Main Frame front portion.
58 Bogie Guard Iron.
59 Bogie Frame (Bar Type).
60 Cylinder Water Cocks (Inside Cylinder).
61 Cylinder Water Cocks Rod.
62 Bogie Axles.
63 Bogie Wheels.
64 Bogie Axlebox Keeps.
65 Bogie Axleboxes.
66 Bogie Axlebox Guides.
67 Bogie Springbeam.
68 Bogie Sping Hangers.
69 Bogie Spring.
70 Bogie Center Casting.
71 Bogie Slide.
72 Bogie Casting.
73 Frame Stay and Motion Support.
74 Control Springs on Bogie.
75 Bogie Brake Hangers.
76 Bogie Brake Lever.
77 Bogie Brake Cylinder Guides.
78 Bogie Vacuum Brake Cylinder.
79 Bogie Brake pull Rod.
80 Bogie Brake Lever.
81 Bogie Brake Block.
82 Bogie Brake Hanger Bracket.
83 Crosshead Inside Cylinders.
84 Gudgeon Pin.
85 Anchor Link of Walschaerts Valve Gear.
86 Combination Lever of Walschaerts Valve Gear.
87 Radius Rod of Walschaerts Valve Gear.
88 Rocking Lever Tail Rod Guide.
89 Rocking Lever.
90 Motion Bar Lubricatiors.
91 Motion Bars.
92 Connecting Rod Inside Cylinders.
93 Eccentric Rod.
94 Expansion Link.
95 Casting for Carrying Expansion Links and Reversing shaft.
96 Steam Pipe to Outside Cylinders.
97 Lifting Arm of Reversing Shaft.
98 Automatic Vacuum Retaining Valve.
99 Expansion Link Die Block.
100 Trunnious Expansion Link.
101 Reversing Arm.
102 Sand Box.
103 Reversing Shaft.
104 Air pump of Vacuum Brake which maintains Vacuum while Engine is running.
105 Air Pump Plunger Rod.
106 Pipe Connection between Air Pump and Auto Vacuum Retaining Valve.
107 Vacuum Limit Valve.
108 Air Pump Lubricator.
109 Gear for Operating Sand Valves.
110 Eccentric Strap.

111 Eccentric Sheave.
112 Inside Crank.
113 Big End of Connecting Rod.
114 Big End Key.
115 Piston Rod Gland Packing.
116 Fngine Main Frame.
117 Reversing Rod.
118 Leading Axlebox Guides.
119 Crosshead Outside Cylinders,
120 Piston Rod Ourside Cylinders.
121 Motion Bars Outside Cylinders.
122 Crank Axle.
123 Leading Crank Pin.
124 Coupling Rod.
125 Leading Wheel.
126 Clip for Leading Axlebox Guides.
127 Leading Spring.
128 Spring Hanger Bracket.
129 Spring Hanger.
130 Equalising Beam.
131 Equalising Beam Bracket.
132 Brake Shaft Carrier Bracket.
133 Intermediate Brake Shaft.
134 Bracket for Trunnions of Vacuum Brake Cylinder.
135 Vacuum Brake Cylinder.
136 Vacuum Brack Reservoir.
137 Driving Axlebox.
138 Driving Axle.
139 Driving Axlebox keep.
140 Connecting Rod Outside Cylinders..
41 Sand Box.
2 Frame Stay.
3 Intermediate Reversing Shaft Braket.
Intermediate Reversig Shaft.
Delivery pipe from Injector to Clack Box.

146 Pipe to Vacuum Garge in Cab.
147 Driving Axlebox Guides-
148 Spring Hanger.
149 Clip, Driving Axlebox Guides.
150 Driving Crank Pin Outside Cylinders.
151 Driving Spring.
152 Pull Rod; Cylinder Water Cock Gear.
153 Sand Pipes.
154 Cylinder Cocks outside Cylinders.
155 Coupling Rod for Brake Shafts.
156 Brxake Shaft.
157 Brake Pull Rod.
158 Brake Adjusting Screw.
159 Brake Crossbeams.
160 Brake Pull Rods.
161 Brake Hangers.
162 Brake Blocks.
163 Brake Block Adjusters.
164 Driving Wheel
165 Vacuum Brake Train Pipe.
166 Hose between Train Pipe and Vacuum Brake Cylinder.
167 Motion Bar Support, Outside Cylinders.
168 Frame Stay.
169 Trailing Axlebox Guides.
170 Trailing Axlebox.
171 Trailing Axlebox keep.
172 Clip for Trailing Axlebox Guides.
173 Trailing Spring.
174 Brake Hanger Bracket.
175 Roller, Equalising Beams.
176 Steel Cover for India - Rubber Pads on Spring Hangers.
177 Guards for Equalising Beams.
178 Ash Pan.

179 Fire Bars.
180 Fire Bars Carrier Supports.
181 Fire Bars Carriers.
182 Damper Doors on Ash pan.
183 Trailing Wheels.
184 Draw Gear between Engine and Tender.
185 Pad for Draw Gear between Engine and Tender.
186 10. Millimetre Injector.
187 Injector Overflow Pipe.
188 Footsteps.
189 Injector Water Connections to Tender.
190 Injector Steam Pipe.
191 Vacuum Brake Connections to Tender.
192 Vacuum Pipe from Ejector to Train Pipe.
193 Blow off Cock and Waste Pipe.
194 Frame Stay.
195 Ashpan Damper Handles, Back Doors.
196 Ash pan Damper Handles, Front Doors.
197 Cylinder Water Cock Handle.
198 Sand Gear Handle.
199 Fire Door Handle.
200 Cab Side Sheet.
201 Footboard.
202 Reversing Gear.
203 Reversing Gear Handle.
204 Firedoor.
205 Regulator.
206 Blower Valve.
207 Vacuum Enjector Handle.
208 Enjector Steam Cocks.
209 Condensing Pipes for Sight feed Lubricator.
210 Cab Roof.
211 Whistles.
212 Whistles Handle.
213 Control Valve, Steam, in Connection with Lubricator.
214 Sightfeed Lubricator.
215 Steam Cock Train Heating.
216 Regulator Rod.
217 Hand Hole Doors.
218 Steam Collecting Mouth on Steam Pipe.
219 Vertical Stays.
220 Boiler Clothing.
221 Main Steam Pipe.
222 Safety Valve Cover.
223 Safety Valve Springs.
224 Safety Valves.
225 Safety Valves Casting.
226 Clack Box and Delivery Nozzle, Top feed.
227 Trays for Water Delivery.
228 Longitudinal Stays.
229 Transverse Stays.
230 Four Cone Vacuum Ejector.
231 Exhaust Pipe for Ejector.
232 Handrail.
233 Boiler.
234 Flue Tubes.
235 Superheater Elements.
236 Superheater Flue Tubes.
237 Washout Plugs.
238 Firebox.
239 Brick Arch.
240 Reversing Rod.
241 Firebox Back Plate.
242 Firebox Crown Plate.
243 Firebox Tube Plate.
244 Firebox Stays.
245 Palm Stays.

246 Firebox Throat Plate.
247 Expansion Bracket.
248 Splashers, leading, Driving, and Trailing.
249 Smoke Box Tube Plate.
250 Driving Balance weight.
251 Leading Balance weight.
252 Trailing Balance weight.
253 Reversing Rod Stop.
254 Fusible Plug.
255 Foundation Ring.
256 Mud Hole Door.
257 Stays in water Space.
258 Sand Gear Pull Rod.
259 Outside Cylinder Steam Steam Cover.
260 Outside Cylinder Front Steam Chest Cover.
1 Outside Cylinder Front Cylinder Cover.
2 Outside Cylinder.
263 Outside Cylinder Back Cover.
264 Outside Angle Iron for Supporting Footplate.

**రెల్లుగడ్డి:**—రెల్లుగడ్డియందు రెండు జాతులు గలవు. దీని కాంగ్లమున Reeds అనియు, Reed grass అనియుం బేరులు. సంస్కృతము పేర్లుసరిగాఁ దెలియవు. రెల్లుపూవు మిగులఁ దెల్లగా వ్యాపించియుండుటంగాన గర్భిణీస్త్రీల చెక్కులు తెల్లవారుట రెల్లుపూవుతోఁ బోల్తురు. నదులందు లంకలను గోసివేయకుండఁ బ్రవాహమును నిలుపుఁదలఁజేసి మరలించుటకు, లంకలం బెంచుటకు రెల్లు నదీతీరములందునను నదులయందలి లంకలను నాటి పెరుగఁజేతురు.

348

కీనివేళ్ళరసకషాయములు తాపము, పైత్యము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, రక్తదోషము, క్షయరోగములు శాంతింపఁజేయు నందురు.

**రెస్పాండెన్షియా (Respondentia):**— వాణిజ్యపరిభాషాపదము. అప్పుగాఁ జేసిన సొమ్ము నకుఁగాను ఓడను, అందలిసరకును, తనఖాయిచ్చు కంట్రాక్టున కీపేరు వర్తించెడిని.

**రెస్టు (Rest):**— వాణిజ్య పరిభాషాపదము. విశ్రాంతియని యర్థము. బాంకివ్యాపారమున ఖర్చుకుఁ బోఁగా నిల్వయున్నధనము (వారపులెక్కలలోఁ గానఁగునది) న కీపేరు వాడుచున్నారు. ఇట్టిది మిగులునది యని యర్థమగుచున్నది. ఆలెక్కలను (Weekly returns) 'Rest accounts' అనుచున్నారు.

**రెస్ట్రైంటు (Restraint of trade):**— వాణిజ్యపరిభాషాపదము. వర్తకముపైఁ బ్రభుత్వ శాసనములవలనఁ గలిగిన గొన్నికట్టుబాట్లునిర్బంధములు.

**రేంజి ఛెయిన్ (Range of Chain of Mountains):**— పర్వతపంక్తి. (Mountains చూడుఁడు).

**రేకలాబండి:**—ఇది దక్షిణదేశమునందు, ముఖ్యముగఁ జెన్నపట్టణమున వాడుకయందుఁ



గానఁగును. ఒకేయెద్దు నొకేమనుష్యుఁడు (తోలేవాఁడే) తోలుటఁ గానఁ జులకనగఁ బరువిడఁ గల్గును.

**రేకింగు** (Racking):— వాణిజ్యపరిభాషా పదము. సారాయములు, స్పిరిట్సు, ఒకపీపానుండి వేరొకపీపా మొదలగువాట్లలోనికి జేర్చుటకు వాడుచున్న పదము.

**రేకు రెంటు** (Rack Rent):— వాణిజ్య పరిభాషాపదము. 'Rent' అనినఁ బన్నినియు, అద్దె (బాడుగ)యనియు నర్థము. 'Rack rent' అనిన సంవత్సరంపుటద్దె సొమ్మొకసారి వసూలుపఱచుట యని భావము. కాని యెక్కువఅద్దె (వసూలు చేయుట) యని యిప్పుడు వాడుచున్నారు.

**రేఖాగణితము**:—

(క్షేత్రగణితము చూడుఁడు).

**రేఖాగణిత (శాస్త్ర) మున నాంగ్లపండితులచే వాడఁబడు గురుతులు**
(Geomitrical signs):—

1 Is unequall to
అసమానంపు గురుతు



2 Is greater than
అధికముగానున్న గురుతు



3 Is not greater than
అధికము గాదను గురుతు



4 Is less than
తక్కువగానున్న గురుతు



5 Is not less than
తక్కువ గాదను గురుతు



6 Is parallel to

7 Is not parallel to



8 Perpendicular



9 Equilateral



10 Angle మూల



11 Right angles
(90 డిగ్రీలపరిమాణముగల) మూలలు



12 Obtuse angle
(90 డిగ్రీలకన్న) ఎక్కువపరిమాణముగల లేక right angle కన్న పెద్దదియగు మూల



13 Acute angle (౯౦ డిగ్రీలకన్న) తక్కువదియగు లేక right angle కన్న చిన్నది యగుమూల.



14 Equi angular



15 Equality సమానత

16 Triangle త్రికోణము. ఇందు మూడుమూలలు సమములుగను మూడు రేఖలు సమములుగను, ఉండినచో దానిని 'equilatoral traingle' అనియెదరు.



17 Square చౌకము

tangle

19 Parallelopiped Sol. |

20 Gircle వృంతము (మధ్య ముండు point నకు center అని యు నందురు.



21 Semi circle దీనిని అగవృంతమని యు, 'half circle' అనియు నందురు.



22 Diameter (of a circle)



23 Radius (of a circle)



24 Arc



25 Degree ° minutes' – seconds" ° ' "

26 Degree ° – seconds" — Thirds"' (దీనికి 'circular measure' అని పేరు)

27 feet అడుగులు. ' అంగుళ ములు" (దీనికి long measure' అనిపేరు.

**రేఖాయనగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుడు).

**రేగాలిజమ్** (Ragalism):— క్రైస్తవ మత గురుపీఠములయందు రాజునకుఁగల యధి కారముగల సిద్ధాంతము.

పూర్వము 'పోపు'న కధికారము లుండెడివి. ఇపుడు చర్చి of ఇంగ్లండనఁబడు ప్రధానమతపీఠ మునకును, బిషప్పులను రాజుగారే నియమింతురు.

**రేఁగుచెట్టు:**—లా. Zezyphus Jujuba; ఆంగ్ల. Jujube tree; సం. కోలః, కోలిః, కోలీ, బదరికా, బదరీ యనుపదములు రేఁగుసామాన్యమునకును, బదరఫలీ, బదరవల్లీ, భూబదరీ యనుపదములు కారురేఁగునకును, బదరం, సేవిఫలం అనుపదములు పెద్దజాతిరేఁగునకును, బదరః, కోలజాతిరేఁగునకును, లకుచః ఆంధ్రనిఘంటువునందు 'కమ్మరేఁగు' అని చెప్పఁబడినది. పలుతావుల నిది క్షుద్రపనస యని చెప్పఁబడినది. లఘుకర్కంధూః అనుపదము కారురేఁగునకు వర్తింప నోపును.

నిజమున రేఁగు పులుపురుచిఁగలపండ్లు, తీపిరుచిఁగలపండ్లుగాచు జాతులు రెండుగ నెన్నఁదగినది. తీపిపండ్లయందుఁ గోలటెపోడుగుపండ్లంగాచుదియు, గుండ్రటెపండ్లం గాచునదియు భేదములు. పులుపుపండ్లనను, తీపిపండ్లనను, పెద్దపండ్లం గాచుజాతి శ్రేష్ఠము. పండ్లయందుఁబురుగుపట్టుట దోషము బరఁగెడిని. రేఁగుచెట్టునందు ముండ్లధికముగ నుండునది శ్రేష్ఠముగుజాతి కాదందురు.

తియ్యని రేఁగుపండ్లు మూలవ్యాధి నడంచి, మేహశాంతిఁగల్గించి, శుక్రవృద్ధిని రక్తముం బుట్టించునని యు, విరేచనబద్ధము గల్గించి, గొంతుకను బొంగుపఱచునని యు, ముఖ్యమున నధమఁపుజాతి పండ్లయం దేర్పడుబంక శ్లేష్మోద్రేకమును రేఁపునని యుఁ జెప్పఁబడినది. ఎండినరేఁగుబండ్లు రక్తవిరేచనములం గట్టునందురు. పుల్లనిరేఁగుబండ్లు జీర్ణముంగల్గించు ననియు, చలువ, రొంపఁ జేయు ననియు, శీతపైత్యము నుద్రేకించి జ్వరముఁగూడఁ గల్గించు ననియుఁ జెప్పఁబడినది. ఈదోషములకు నువ్వులచెట్టుకాల్చిన బూడిదయు, తేనె, పంచదార విడుగుడులందురు. నేలరేఁగు, గంగరేఁగు లందును నివియే గుణములు.

కమ్మరేఁగుకాయ కాసను, వాతమును గొట్టునందురు. రేఁగాకులు నూరి తలకుఁ బట్టించిన నెంద్రుకలను బలమిచ్చి, పెంచును. జిగురునందు వీర్యస్తంభనఁగల్గించు గుణము గలదందురు.

**రేచకము:**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యష్టాంగయోగములలోఁ బ్రధానమగునది ప్రాణాయామము. ఆప్రాణాయామము పూరక, కుంభక, రేచకాత్మకము. (ప్రాణాయామము చూడుఁడు).

రేచక మనఁగా లోపలివాయువును బయటికి వెడలఁజేయుట యనియర్థము. యోగశాస్త్రమునందు 'యం' అను వాయుబీజమును ముప్పదిరెండుసారు లుచ్చరింపఁదగినకాలమున ముక్కురంధ్రములగుండా వాయువును బైకి వెడలించుట 'రేచక' మనంబడును. (ప్రాణాయామము చూడుఁడు).

ప్రథమప్రాణాయామ మనియు, ద్వితీయప్రాణాయామ మనియు, తృతీయప్రాణాయామ మనియుఁ బ్రాణాయామాభ్యాసము త్రివిధములుగఁ జెప్పఁబడినది. అందుఁ బ్రథమప్రాణాయామమున నెడమముక్కురంధ్రమును మూసి నొక్కిపట్టి, కుడిముక్కురంధ్రమున లోపలివాయువు 'యం' అనుబీజమును ముప్పదిరెండుసారు లుచ్చరింపఁదగినకాలమున నెమ్మదిగా గాలిని వదలుచుండుట 'రేచక' మనియు, ద్వితీయప్రాణాయామమున రేచకము నెడమముక్కురంధ్రముం దెఱచి 'రం' అనుబీజమును ముప్పదిరెండుసారు లుచ్చరింపఁదగినకాలమున లోపలివాయువును నెమ్మదిగా బయటికి వెడలనీయవలె ననియు, తృతీయప్రాణాయామమున రేచకము 'లం' అనుబీజమును ముప్పదిరెండుసారు లుచ్చరింపఁదగినకాలమున నెమ్మదిగ

లోపలివాయువును బయటికివిడచివేయవలెననియుఁ జెప్పఁబడినది.

స్వరశాస్త్రమునఁ జెప్పఁబడినది.

మే గాక నారోగ్యము దృఢపడుననియు, శరీరబల మధికమగుననియు, యోగశాస్త్రవేత్త లనిరి. (అష్టాంగయోగకులు చూడుఁడు).

## రేచర్లమాధవరాయణింగారు(కవి):-

ఈతఁడు క్రీ. శ. ౧౬౮౦ సంవత్సరప్రాంతమున జటప్రోలుసంస్థానాధిపతియై యుండినవాఁడు. సర్వజ్ఞసింగమనాయనివంశజుఁడు. ఇతఁడు రచించినది 'చంద్రికాపరిణయ'మను ప్రబంధము. ఇంకను బాలసరస్వతివిరచితమగు చంద్రికాపరిణయము నొకటి కలదు. అది మిగుల రసవంతమైనదిగాఁ వినది.

ఈభూపతిప్రపితామహుండగు మాధవరాయఁడు వాల్మీకిరామాయణమునకు సంస్కృతవ్యాఖ్య రచించెను. పితామహుఁడు మల్లనృపతి. బాలసరస్వతిం బ్రోత్సహించి భర్తృహరి తెనిఁగింపఁజేసెనఁట.

మాధవరాయప్రభువు రచించిన చంద్రికాపరిణయమునందు, తోరణాల చొక్కన యనుకవి యున్నిశబ్దములు నందిచ్చుచుండువాఁ డనియు, ప్రభువునకుఁ బేరబ్బెననియు, నోర్వలేనికొందరు వాడుకఁ గల్గించి 'తోరణాలచొక్క- దొంగకుక్క-' యనియాయనపై (దమకుఁగల నియోగిద్వేషమును తీర్చుకొనుచుండిరని యొకయపవాదముక గలదు. ఈమహనీయులు పిదపకాలఁపుఁ బరిశీలకులేమో ప ంపఁవలెను.

## రేచర్లవారు:—

రేచర్లవారు రెడ్లలోను, పద్మనాయక వెలమలవారిలోనుగూడఁ గానవచ్చుచుంటఁ బెక్కండ్రు పరిశీలకు లీయిర్వురిపూర్వికులును నొకరేయెయుండి, పిదప వేరై రేమో యని పొరపడుచుందురు. కాని, రెడ్లు రాష్ట్రికూటులుగ స్పష్టపడియుంట నట్లుకాదని తేలుచున్నది. ఇప్పటి నిజాంరాజ్యమున పిల్లలమఱ్ఱిగ్రామము నందు బయల్పడిన యెన్మిదిశాసనములనుండియు, నాగులపాడుగ్రామమున బయల్పడిన మూఁడు శాసనములనుండియు, పాలంపేటయందు బయలఁడిన యొకశాసనమునుండియు, రెడ్లు సామంతప్రభుత్వమున సేనానులుగ నుండి, పిల్లలమఱ్ఱిరెడ్లవంశమని పేరంది, యాప్రాంతసీమల నేలుటఁ దేలుచున్నది. ఇది త్రిలింగకాకతీయ సామ్రాజ్యమునందని యెఱుంగునది. ఆసంతతి నీక్రింద వివరించుచున్నాము.

తక్కినరేచర్లపద్మనాయకులలోఁ గాకతీయగణపతిదేవునికాలమున భేతాళనాయనింగారు లేక భేతాళ నాయకుఁడును, రుద్రమదేవికాలమునఁ బ్రసాదాదిత్యనాయనింగారు, రుద్రమనాయనింగారు, సిబ్బినాయనింగారును, ప్రతాపరుద్రుని నాఁడు, వెన్నమనాయనింగారు, ఎఱ్ఱదాచానాయనింగారు, నల్లదాచానాయనింగారు, సింగమనాయనింగారు, వెన్నమనాయనింగారు, లేక వెన్నమనాయకుఁడు, యాచమనాయనింగారు లేక యాచమనాయుఁడు సుప్రసిద్ధవీరప్రముఖులై యుండిరి.

## రేచర్ల రెడ్ల సంతతి:—




(త్రిలింగకాకతీయసామ్రాజ్యము చూడుఁడు. రెడ్లు చూడుఁడు. దండకవిలె చూడుఁడు. రెడ్డిప్రభువులు కొండవీడు చూడుఁడు.)

పలనాటియుద్ధమునకుఁ బూర్వము రెడ్లకాలము ను పిమ్మట, క్రీ. వె. ౧౨౫౦ పిదపఁ బద్మనాయక వెలమలప్రభావమునని కాకతీయసామ్రాజ్యముంగూర్చి చెప్పనగుచున్నది. ఇందుఁ బ్రసాదాదిత్యనాయనింగారగ్రగణ్యులనియు, వారికిఁ గాకతిరాజ్యప్రతిష్ఠాపనాచార్యుం డని వాదుక బిరుద ముండెననియు వాడుక నేటికిఁ గలదు.

శాసనములనుండి యాకాలమునం దించుమించుగ ననఁగా క్రీ. వె. ౧౨౯౦—౧౩౦౪ వెలనాటిని సోమయ వెంకంగా రనంబడిన వెంకానాయనింగారును, ౧౨౯౪ మెదకుసీమను అన్న వెంకానాయనింగారును, ౧౨౯౪—౧౩౧౭ నాటికి, పాకనాఁడు - తొండెమండలములు ముప్పిడినాయనింగారును, ౧౨౯౯—౧౩౧౧ నాటికి, కమ్మనాడును గుఱ్ఱియనాయనింగారును, ౧౩౦౭—౮ వెలనాటిని సోమయవెంకానాయనింగారును, ౧౩౦౪—౧౧ మఱియు ౧౩౧౩—౨౩ కాలముల కమ్మనాటిని కామయబొప్పయనాయనింగారును, ౧౩౧౮—౧౯ వెలనాటిని దేవరనాయనింగారును సామంతులుగఁ బాలించుచున్నట్లుఁ దెలియుచున్నది. వీరందఱు రేచర్ల పద్మనాయకులే యందురు.

ఇది యిటుండ క్రీ. వె. ౧౩౦౦ ల నాటికే నంది గూడెము గూపయరెడ్డి ౧౩౦౮ త్రిపురాంతకము ను, ఎల్లయరెడ్డి ౧౩౧౮ నాటికి నందిగూడెమును, అన్నమరెడ్డి ౧౩౨౦ నాటికి ధరణికోట, పోలయ వేమారెడ్డి పాకనాటిని కాటమరెడ్డి పాలించుచుం డినటులఁ దెలిసెడిని.

**రేఁజీఁకటి**:—రాత్రులందు మాత్రము దృష్టి సరిగాఁ గన్పింపని నేత్రరోగము.

**రేట్టింగ్** (Ratting changing sides in politics):- రాజకీయకక్షులలో నొకకక్షనుండి వేఱొకదానికి మాఱుటకు వాడుచున్న ఉక్తి.

**రేట్లు**:—(పన్నులు రేట్లు చూడుఁడు).

**రేడికల్సు** (Radicals):-వీరు 'Extreme liberals' అనంబడుదురు. క్రీ. వె. ౧౮౧౮ వ సంవత్సరమున బ్రిటీషుపార్లమెంటునం దాది నీకక్షి వారికి Hunt cobbett నాయకుఁడుగ నుండెను.

**రేడియమ్** (Radium):—ఇది యిటీవలఁ గనిపెట్టఁబడిన లోహపదార్థము. సనాతనముగ వెండి బంగారుల వలె ... ...న్యముగ నందఱ కెఱింగినది కాదుగాన నింక సందర్భస్థితులు వివరింప నగును.

భౌతికశాస్త్రనిధానమునఁ బ్రపంచమందలి వస్తువులు, మూలద్రవ్యము లనియు, మిశ్రద్రవ్య లనియు ద్వివిధముగ విభజింపఁబడినది. స్వ సంసిద్ధములై యితరద్రవ్యములఁ గల్పి చేయఁ ...నవి గాక, ప్రథమపదార్థములుగనే యుండు "మూలద్రవ్యము" లందురు. ఇంక ...మిశ్రద్రవ్యము లనేకవస్తువులకూడికవలనఁ గల్గి . అనఁగా నితరద్రవ్యములం గల్పి చేసినవని ...వము.

ఈవిధముననే మూలద్రవ్యములు ధాతువు లనియు, ఉపధాతువు లనియు, ద్వివిధముగ నున్నవి. స్వయంప్రకాశముఁగల్గినవి ధాతువులు. బంగారము, వెండి, రాగి, రేడియమ్ స్వతః ప్రకాశముగల్గినవే గాన ధాతుద్రవ్యము లనంబడును. వీని నాంగ్లము న 'Self luminous' అనెదరు. 'Mranium' అనంబడునదియు ధాతువులలోఁ జేరినదియే. మెఱుఁగుడుపురుఁగునం దిట్టి స్వయంప్రకాశపదార్థ ములు కలవు. కొన్ని మిశ్రద్రవ్యములు అనఁగాఁ గొన్నిద్రవ్యములు కలసిన స్వయంప్రకాశము వలెనే ప్రకాశముఁ గల్గినవిగ నగును. అవి మిశ్ర ధాతువు లనంబడును.

ప్రస్తుతాంశమగు రేడియమును కనుఁగొనినది మెడమ్‌క్యూరీ యనిపేరుగల ఫ్రెంచిదేశఁపుఁ బరిశీ కురాలు. ఈవిదుషీమణి రసాయనశాస్త్రము, భౌతికశాస్త్రము నభిమానవిద్యలుగఁ బరిశీలన ప్రయత్నములు సల్పుచుండునది. ఈమెభర్తయు నీమె కీపరిశీలనలందుఁ జాలా సాహాయ్యమొనర్చు వాఁడఁట. ఈమె Pitch Blende నుండి రేడి యమ్ తీయఁగల్గినది. ఒకటన్ను పిచ్‌బ్లెండినుండి తొలుత నీమె పదునాఱుపౌనుల Barium chloride ను తీసెనట. అది యురేనియమ్ కన్న నఱువదిరెట్లు హెచ్చుప్రకాశమానమై యుండినట్లుఁ గనుఁగొనెనఁట.

పిదప నీబేరియమ్ క్లోరైడు నుష్ణోదకమునం గరగించి, చల్లారనిచ్చిన నందుండి రెణ్డుకగ్రెయి న్నెత్తుఁగల పదార్థము వేఱుగ నాయెనఁట. అదే రేడి యమ్ యురేనియముకన్నఁ బదిలక్షలరెట్లధిక తేజ ముఁగలదని తేలుచున్నది. తొలుదొల్త నీదగుబడి యిట్లున్నను, 'Gicsel' అను పేరుగల జర్మను పరిశీలకుఁడు తనపరిశీలనలవలన నొకటన్ను పిచ్ బ్లెండి (ఖనిజము) నుండి నాల్గుగ్రెయినుల రేడి

యమును దీసి చూపించెను. ఈమహనీయుఁడు గొప్పరసాయనశాస్త్రవేత్తయు, గొప్పపరిశీలకుఁడు నని వింటిమి.

సూర్యుని ప్రకాశకిరణముల వలెనే రేడియం ప్రకాశకిరణములు గన్పట్టినను, వాటినుండి భేద ముఁగల్గియున్నవఁట. రేడియమ్‌కిరణములు త్రివిధ ములుగ నుండుననియు, కఱ్ఱబల్లలు, నినుపరేకులు, మాంసము, ఎముకలు, చర్మము, వీట్లగుండా ప్రసరించునుగాన వానిని (అనఁగా శరీరములోని స్థితిగతులను) దీనివెలుతురునందుఁ బొటోగ్రాఫుఁ దీయనగుననియుఁ గనిపెట్టఁబడినది. ఈకిరణముల నాంగ్లరసాయన శాస్త్రవేత్తలు 'Rontgen' అనియు, 'Xrays' అనియు నందురు. అనఁగా నితరద్రవ్యములను రంజింపఁ (బ్రకాశింపఁ) జేయు నవి యని భావము. ఇటులఁ దనకిరణములను బ్రయోపఱచు రేడియమునందుఁగలవేఁడి యెన్నటికిఁ దగ్గదని పరిశీలనలవలనఁ దేలుచున్నది.

ఇంకను నీరేడియమునందు సూక్ష్మశరీరజంతు వులను బంపుశక్తి గలదనియు, రేడియముండిన గొట్టమును పైతను, చేతంబట్టుకొనిన పుండుఁ జేయు ననియు, దీనింబ్రయోగించిన వ్రణములు, కొఱుకు మొదలగుసమస్తచర్మవ్యాధులు, క్షయ దగ్గులు కుదర్పవీలగుననియు, వైద్యశాస్త్రవేత్తలు తలంచుచున్నారు గాని పరిశీలన లింకను జరుగ వలసియుండును.. అంధత్వము, బధిరము, దీని వలనఁ గుదుర్ప వీలగునందురు.

రేడియము నొకగొట్టమునందుంచి మూసి, కొంతకాలము నిల్వయుంచిన నది 'హీలియమ్' (Helium) 'లిథియమ్' (Lithium), 'సోడి యమ్' (Shodium)అనుద్రవ్యము లేర్పడి గల్గు ననియు, నవి మూలద్రవ్యము లనియు నను చున్నారు. రేడియమ్ దొరకుటయే యరుదు. దొరకదనియే చెప్పవచ్చును. దొరకుతావుల పౌను నలువదిలక్షలవఱకు విలువయుండునని తలంపఁ బడుచున్నది. ఇందువలన నొకసంగతి తేలినది. పరమాణువు (atoms) లవిభాజ్యములని యిది వఱకుఁ దలపఁబడుచుండుట పొరపాటనియు, ఈ రేడియముమూలమున నవియు విభజింపఁబడనగు ననియు గ్రహింపఁబడినది.

**రేడియేషన్ (Radiation):–** రేడియేష నాంగ్లపదమున నొకకేంద్రస్థానమునుండి దశదిశ లకు వ్యాపించుట యని యర్థము. సూర్యగోళము నుండి కిరణములు దశదిశలకు వ్యాపించుట యిట్టి రేడియేషనేయని చెప్పఁబడినది. కొన్ని దేవతా సంబంధములగు చిత్రపటములందునను, క్రీస్తు ప్రభువు మొదలగు వేర్వేఱుమతములందలి మహా త్ములచిత్రపటములందునను, రేడియేషన్ కిరణ వ్యాపకమును చంద్రపరివేషముంబోలిన యాకార ముగను ఖ మ్ముంజుట్టి చిత్రించుచుంటఁ గాననగును.

ఈరేడియేషన్ వ్యాపకము నేత్రములగుండా ముఖ్యముగ వ్యాపించుచుండునని యిటీవలి పరి శోధనలనుండి కనిపెట్టఁబడినది. మఱియు దృష్టి దోష మనంబడునది యీరేడియేషననే తలంపఁ బడుచున్నది. ఇందువలన రేడియేషనుగుండా గుణము గాని, దోషము గాని ప్రసరించుచుండు ననియు, నోటిగుండా వెడలుమాటలు శాపము గనో, వరముగనో, పరిణమించుట రేడియేషనేమో యనియుఁ * గొందఱు తలంచుచున్నారు. ఇది యింకను కనిపెట్టఁబడవలసియున్నది.

ఏది ఎట్లైనను తపోమహిమఁగల మనోబల ముండినవారియం దీరేడియేషన్ పనిఁజేయఁగల దనియు, లేనివారియందు బలహీనమై నిరర్థకముగ

వ్యర్థమగుబలహీనతగా నమరి, వృథాపోవుచుండు ననియుఁ జెప్పఁదగియున్నది.

**రేడియో ఏక్టివిటీస్** ( Radio activities):- రేడియో పనులయొక్క మూలసూత్రము 'వెలుతురు, వేడియు, Violent motion నం దొక matter ను గల్గియుండును' అనుధర్మమున్పై నాధారము. ఈవిషయమై Proffessor Ram say Wm. అను పండితుఁడును, wilhelm konrad పండితుఁడును mmecurie విదుషీమణియు, గొప్పపరిశీలన లొనర్చి క్రొత్త సంగతులను వెల్లడించిన విజ్ఞానులని చెప్పఁబడినది.

వీరిపరిశీలనలకు ఫలితములుగ X Ray రోగులశరీరములందలి రహస్యములనెన్నిటినో కనఁబఱచి చూపి, వైద్యులకుఁ జికిత్సాసాధనమై దనరుచుంట నిక్కముగను నందరెఱింగినదే. ఇంక వర్తకసందర్భమున ఎక్సురే గల్గించుచున్నవింత లత్యాశ్చర్యకరములుగ నున్నవి. లోహములగుండా నీయెక్సురే కిరణములు చొచ్చుకొనిపోయి లోనున్నగుణదోష పదార్థములం జూపుట యెవ్వరికైనను విపరీత మనిపించకపోదు. (ఎక్సురే చూడుఁడు.)

క్రీ. శ. ౧౮౯౫ సంవత్సరమున Professor Rontgen పండితుని పరిశీలన లచ్చెరువందఁజేయుచు వర్తకవిజ్ఞానుల కనుదినసాధారణకృత్యములుగ ననేకవింతల నొడంబడఁజేసినదనిన నతిశయోక్తి కానేరదు. దీనిపై నభివృద్ధిగఁజెప్పఁదగిన Ultra Voilet Ray విజ్ఞాన మమూల్యమగు Synthelic Sunshine ను మనస్వాధీనమునం దుంచి, రోగచికిత్సలయం దమోఘమగు విజ్ఞానప్రదమై యుండఁజేసినది.

డాక్టరు Rontgen తనపరిశీలనలను వెల్లడించుకాలమునందే Professor Ramsay పరిశీలకుఁడు Helium ను కనుఁగొనెనఁట. ఇది క్రీ. శ. ౧౮౯౫ వ సంవత్సరము హైడ్రోజను వలె నతితేలికయైన దానివలె మండునది కాని వాయువగుటచే దీనిని తిత్తులందు నింపి Heavier than air Craft నం దుపయోగించుచున్నారు. ఈగాలి విస్తారము విలువఁ గల్గియున్నను, కొలఁది కాలములోనే పరిశోధకులు దీనిని చౌకగఁ జేయఁ గలుగుటకు సావకాశములున్నవని యాలోచింపఁగల్గించుచున్నారు.

రేడియోయాక్టివిటీకార్యముగఁ దరువాతఁ జెప్పఁదగినది Radium లోహము. Fangoid nature గలవ్యాధులం గుదర్చుటయం దది గల్గించుచున్నగుణము లద్భుతములు. దీనిని 'Mme Curie' అనుపేరుఁగల విదుషీమణి కనిపెట్టెను. ఆమెయు, నామెభర్తయుఁగూడ గొప్పపరిశీలన లొనర్చుచుండిరఁట. భర్త మృతిఁజెందినపిదప నామెపరిశీలనలం దిది బయటఁబడెనఁట. దీని నామె క్రీ. శ. ౧౮౯౮ లోఁ గన్గొనెను. రేడియమ్ Pitchblende నుండి వేరుఁ జేయఁ బడెనఁట. Professor Beoquerel పండితుఁడు రేడియము నొకగొట్టమునం దుంచి తనజేబునందుంచుకొనుచుండగ, దీనియందలిమహాగుణములు బయల్పడి పరిశీలనల నంది విజ్ఞానము బయల్పడియెనని చెప్పఁబడినది. తొలుత కాలి, దీనిని పరిశీలన ప్రారంభమయ్యెనఁట.

**రేడియోగ్రాఫీ** (Radiography):— శరీరమునందలి యవయవములయంతర్భాగములను బరిశీలించుట కుపయోగింపఁబడు సాధనము.

**రేడియోవేవ్స్**:—
(రేడియోవైర్లెస్ చూడుఁడు.)

**రేడియోవైర్లెస్** (Radio or Wireless)- ఇది నిజముగ జరుగునా? అని యనిపించువింతలలో రేడియోబ్రాడుకేస్టింగు సృష్టియందొకవింత లలో వింత యనిపించును. తీగలు లేకనే మాటల నిది యొకతావునుండి వేరొకతావునకు నడుపుట జగత్తునందలి యనేక రహస్యములలో నొక రహస్యమైనను, మనమిదివఱకుఁ దీగలపై నెలక్ట్రిసిటీమూలమున వార్తలను నడుపుటకు మాత్రమలవాటుపడియుంట నిరాధారముగఁ బంపుటయన దానిరహస్యముల నెఱుంగువఱకు వింత యనిపించకపోదు. ఈతరు (ether) నందు electro magnetic waves propogation వలన నిది సాధ్యమైనది.

క్రీ. శ. ౧౮౬౮ సంవత్సరమున, Mr. Clerk max well అను పండితుఁడు పరిశీలన లొనర్చుచు, భవిష్యత్తుం జెప్పినటులNature of properties of the radio waves of the electro mag netic group ను గూర్చి తెల్పియుండెను. దానిని క్రీ. శ. ౧౮౮౮ సంవత్సరములో Hertz పండితుఁడనుభవైకవేద్యముగఁ జేసి చూపెను. కాని దీనినుపయోగమునకుం దెచ్చిన పేరు ప్రతిష్టలు మార్కోనీగారికి దక్కినవి. వారు క్రీ. శ. ౧౮౯౫ లో దీని యుపయోగములను చక్కఁగ లోకమునకుఁ బ్రదర్శించి చూపి, యసాధ్యముకాదని ఋజువుపఱచిచూపిరి. వారిప్రదర్శనమువలన Electro magnetic waves travel with the Velocety of light అని తేలినది. అనఁగా సెకండుకాలమున ౧౮౬౦౦౦ మైళ్లు ప్రయాణ మొనర్పఁగలదని భావము.

రేడియో ప్రోగ్రాములకు Broadcasting station ప్రధానమగు మధ్యస్థానమైనది. దీనిని 'Very radiating centre of radio activities' అనెదరు. అట యంత్రములందు 'transmitter' అనుపేరుగల యంత్రభాగము ప్రధానమైనది. ఇంకను modulating apparatus ఒకటియు, The aerial ఒకటియు ముఖ్యములు. ఇవి మూఁడును ముఖ్యభాగములు.

ఏరియల్:-ఇది సర్వసాధారణముగ మూఁడు లేక నాల్గు ఇన్సులేటెడ్ (insulated wires) తీఁగెలుగ భూమినుండి పైకి నిర్మింపఁ బడినదిగ నుండును. ఈ తీఁగెలనుండియే (అనఁగా నీఏరియల్ నుండియే) రేడియోవేవ్సు చుట్టునుండు నీతరులోనికి విడువఁ బడును.

ఏరియలునందలి యొక 'microphone' అనఁబడు యంత్రభాగములోని కుపన్యాసకుఁడుపన్యాసమును పల్కును. అందులోనికే గాయకుఁడు పాటలం బాడును. మైక్రోఫోనులు తఱుచుగ గుండ్రనియాకారమునే గల్గియుండును. దీనిలోనికిఁ బాడుచుండునపుడుదీనికొన్ని భాగములుకదలుచుండెడివి. ఈకదలికలే Variations of sound (ధ్వనులందలి భేదములు) గల్గించి, మైక్రోఫోను నుండి నడుచు Currents నందు, Variations కల్గుటకుఁ గారణమగును. అట్లు కలిగిన Currents ట్రాన్సుమిటరుకడకుం జేరుకొనునవి. కాని యీ కరెంట్సు చాల బలహీనములుగ నుండునవియని యెఱుంగఁదగును.

ఇట్టి బలహీనపుఁగరెంటులు transmitter లోనికిఁ జేరకముందు Vacuum tubes (గొట్టములు) మూలమున దర్పితములై (magnified) బలపడును. ట్రాన్సుమిటరుయొక్కపని 'to tet up waves which are carried in every direction and may be intercepted by the Various receiving stations' అని చెప్పఁబడియున్నది. అన్నిదిశలకు నేగఁగల ధ్వని

యొక్క యలల నాయత్నపఱచుటయే ట్రాన్సుమీటరుయొక్క కార్యమై యున్నది. మఱియు నటనుండి నీకరెగ్గింట్సు very powerful electrical discharges వలన Transmitting end నందు, start అగునని చెప్పఁబడినది. మఱియు నీఎలక్ట్రికుడిశ్చార్జిలకు 'electric disturbances' అని వాడుచున్నారు.

ఇటుల ట్రాన్సుమీటరునుండి బయలుదేఱఁ జేయఁబడిన Sound waves దూరము పోయిన కొలఁది బలహీనమగుచునే యుండును. భరతదేశమునం దమర్పఁబడిన రేడియోస్థానములందు, దూరదేశములగు స్పైరోపా, అమెరికా, ఆస్ట్రేలియా మొదలగుదేశముల రేడియో బ్రాడుకేస్టింగుస్టేషనునుండి పంపఁబడినవార్తలు picked up waves గా వార్తాపత్రికలందుఁ జదువుచునే యున్నాము. దూరస్థలముల కంపఁబడువార్తలు transmitter Capacity-Receiving set-capacity-Locatior of the receiving set with reference to local sourroundings - The wave length atymospheric conditions అనంబడు పరిస్థితులపై నాధారపడియుండెడిని. గాన నీ factors నుగూడ గమనించుచుండుటఁ జాల ముఖ్యమని చెప్పఁబడినది. ఇం దింకను వేఱొకసంగతి గమనించఁదగినది కలదు. atmospheric interference అనఁబడిన పరిస్థితి రేడియోపట్ల నెక్కువ చీకాకుఁ గల్గించునదిగఁ జెప్పఁబడినది. దానినుండి యెక్కువ చికాకుఁ గల్గించుధ్వనులు గల్గించును. అది winter నందుకన్న వేసవియందే యధిక బాధకరమై యుండునని మఱువరాదు. రాత్రులందుకన్న పగటియందే యధిక బాధకరమై యుండెడిని. రాత్రులందుఁ గల్గించుచికాకుధ్వనులకన్నఁ బగళ్ళయందనేకరెట్లెక్కువబలమైయుండి బాధకరమగు చికాకుధ్వనుల నొనర్చుచుండును.

ఇట్టి గుణములం గల్గి ట్రాన్సుమీటరు గుండావెడలిన waves ఈతరుగుండా గమనించుటకై interception కలుగఁగనే యందలి రిసీవింగు ఆపరేటనునకుఁ జేరుకొనును. ఈ Receiving set నందుండు apparatus ఐదువిధములగు పనులఁ జేయ నమర్పఁబడియుండెడిని. అవి 1. Intercepting, 2. Tuning, 3. Detecting, 4. Amplifying, 5. Re-producing కార్యములు.

వేర్వేఱు Broad casting స్టేషనులందు వేర్వేఱు wave lengths ను వాడుచుండుటయు, వేర్వేఱు receiving sets నందు Tuning device లుండుటవలన సరిపోవుచున్నది. ఈ ట్యూనింగుడివైజునుండియే యెట్టి wave length నకైనను, respond చేయఁగల్గుచున్నారు. మఱియు "current from the tuning controls, will not effect the head phones" అనియుఁ జెప్పఁబడినది. ఏలయన నిది alternating current of high frequency గా మాత్రమే యుండునది.

రేడియోవేవ్సు రిసీవింగు స్టేషనకుఁజేరుట రాగితోఁ గాని, ఉక్కుతోఁగాని చేయఁబడి యెత్తుగ నున్న తీఁగెలగుండా నని వెనుకఁ జెప్పఁబడినది. వీటినే 'aerial' అనియు 'antinna' అనియు వాడుచున్నారు. ఇవి నూఱుమొదలు నూటయిరువదియైదువరకు అడుగులయెత్తున నుండును. మఱియు భూమినుండి యిరువది లేక ముప్పదియడుగులయెత్తుఁగలతావున నమర్పఁబడియుండును. ఇంతియేగాక also an efficient 'earth' be connected to the earth terminal of the set అనియుఁ జెప్పఁబడినది.

ఇంక డిటెక్టరు (detector) గూర్చి యోచింతము. ఇది కరెంటును Phones కుఁ దగులు

నటుల మార్పు గల్గించును. ఈమార్పు ద్వివిధ ముగఁ గలుగును. in coming wave must be changed from an aleternating to a direct current గాఁ జేయుట యొకటియు, Uibration rate ను విస్తారముగఁ దగ్గించుట యొకటియు నై యున్నది. ఈమార్పులం గల్గించుట కుపయోగింపఁబడు detectors రెండురకములు కలవు. Crystal detector ఒకటియు, Vacuum detector ఒకటియుఁ గలవు. రెండవదానిని 'Vacuum tube' అనియు నందురు.

కొన్ని క్రిష్టల్సునందు 'Galena Quartz' ప్రధానద్రవ్యము. అది సర్వసాధారణముగ దాని గుండా ఎలక్ట్రిక్కు కరెంట్సును నడుపును. అట్లు నడుపుటలో నొకేదిక్కునకు నడుపునుగాన, alternating Current intercepted radio wave రూపమున నా Crystal కుఁ దగులఁగనే యొక direction గా నుండు Vibration లు దానిగుండా నడచి, యవ్వలి కరుగుటంజేసి, డైరక్టుకరెంటగుటసంభవించుచున్నది. ఆడైరక్టుకరెంటే head phone పై పనిఁజేయును. కాని, ఈCrystal detector లు చౌకగ లభించునవి. సుళువైనవి. Clear reception కల్గించునవి యైనను, నుపయోగించుటయం దనేక నష్టములు, కష్టములు గల్గుచుండునని యనుభవైకవేద్యముగఁ బెక్కండ్రు తెల్పుచున్నారు.

వేఱొకవిధమగు Detector నకు Vacuum tube అని పైన వివరింపఁబడెను. దీని నింకను గొందఱు 'Thermionic valve' అని పేరిడి వాడుచున్నారు. ఇది చాల శ్రేష్ఠమైనదని చెప్పఁబడినది. దీనికిఁ గర్త Marconi Fleming and De Forest అనువారల సంయుక్తప్రయత్నముగాఁ జెప్పఁబడినది. ఈ Thermionic valve రేడియోయందు మూఁడు ముఖ్యకార్యము లొనర్చుచున్నది. అవి transmitter నందు generator of an alternating current గా నుండును. రిసీవింగుసెట్టునందు detector గను, amplifier గను గూడ నుండి, పనిఁజేయుచున్నది. కాని దీనియందలి Theory of action చాల complicated గా నుండును.

తరువాత గమనింపఁదగినది amplifying set. ఇది రిసీవింగుసెట్టునందు ముఖ్యయంత్రభాగమని చెప్పఁబడినది. ఇది range of the set ను, loudness of the sound నధికపఱుచును గాన సర్వసాధారణముగ వాడఁబడుచుండుట నేమంతప్రాముఖ్యమైనదిగా గమనింపఁబడుచుండుట లేదు. మున్ను Radio waves కడుదూరము పయనమొనర్చుటచే నంతకంతకు బలహీనతఁ జెందుచుండునని చెప్పఁబడియే యున్నది. గాన నట్టి బలహీనఁపు waves ను amplyifing outfit బలపఱచి Phones నందుఁ జక్కఁగ వినఁబడఁ జేయును. Loudspeakers నందుఁ బ్రవేశపెట్టఁబడి గట్టిగా వినఁబడఁజేయుచున్నవి. laud speakers ను, అట్టి amplifying outfit గనే యెఱుంగవలయును.

ఈ amplification నందు రెండుమార్గములు కలవు. ఒకదానియందుdetection అయినపిదప amplify అగును. రెండవవిధమందుఁ గొన్ని Valves ఉపయోగింపఁ బడుచుండును. ఇది 'Andis frequency' అనియు, 'radio frequency' అనియుఁ దిరుగ ద్వివిధముగా నుండును. ఈ amplif ication లందుఁ గడపటి పని electric waves ను sound waves గా మార్చుటయైయున్నది. ఈమార్పును 'repro-

duction' అనుచున్నారు. reproducing machines 'head phones' అనియు, loud speakers' అనియు ద్వివిధముగా నున్నవి. మన మెఱుంగియున్న telephoneలకన్న head phone లు చాలమెక్కువ sensitiveఅని చెప్పఁబడినవి. loud speaker ల నుపయోగించుతఱి head phone ల నుపయోగించునప్పటికన్న నధికమగు stronger current కావలసియుండును గాన వాటినుపయోగించుతఱి Valves మూలమున కరెంటును amplify జేయవలసియుండును.

ఇంక loud speaker లందు మూఁడుభేదములు కలవు. 1electro dynamic type అనియు,2 Electro magnetic Typeఅనియు, 3 Electro mechanical Type అనియు నై యున్నవి. ఈమూఁడుభేదములుగల loud speaker లు వాడుకయందే యున్నవి. ఇం దెలక్ట్రో డైనామికుల్డ్ పుతౌడుస్పీకరు చాల సుప్రసిద్ధము. గొప్పగొప్ప యుపన్యాసములను దీనిగుండా విని పింపఁజేతురు. ఇందుగుండా amplify అయిన శబ్దజాల మొకలక్షమందిగల కూటమియం దంద ఱికి నొకేవిధమున వినఁబడును. మంచిపరిస్థితులం దొకమైలుదూరమువరకు వినఁబడునఁట.

ఈరేడియో sets భూమిపైననే గాక ఏరోప్లేనులందు వాడఁబడుచుంటఁ క్రొత్తవింత. ఓడలకు నడకలందు సంగతులందెలుపుటకు రేడియోకంపను వాడఁబడుచున్నది. ఓడలందు, ఏరోప్లేనులందు, ఆటోమోబైలులందుఁ గూడ నీరేడియో వాడఁ బడుట యచ్చెరువుఁ గొలుపకపోదు. వీటియన్నిటి యందు వాడఁబడుధర్మ మొకటియేయని తెలియు చున్నది.

ఇటీవల వ్రేలిముద్రలు, ఫొటోగ్రాపులు (ఛాయాపటములు) దస్తూరీవ్రాతలు, రేడియోమూలమునఁ బ్రదర్శింపఁబడినవని వినవచ్చుచున్నది. నేఁడు మన రేడియో ప్రపంచ మన్నిమూలలం గల్పుచున్న శబ్దలహరిగా నున్నది. దీనికన్న నిక్కాలమున నధికమగువింతలేదని పెక్కండ్రనుచున్నారు.



## రేడియోవైర్లెస్ ఫేడింగ్ (Radio wirless fading):—

రేడియోవైర్లెస్ సెట్టు లొక ప్పుడు బలహీనముగఁ బలుకుటయు, నొక్కొక్కప్పుడు కేవలము పలుకకపోవుచుంటయు, సంభవించుచుండును. దీనిని 'ఫేడిం' గనియెదరు. దీని కనేకకారణములు కలవు. ఇట్టివి తఱుచుగాఁ జిన్న చిన్నవిగనుండు Radio sets నందు సంభవించుచుండును. వీటి నెదుర్కొనుటకు Automatic volume Control అనఁబడిన యంత్రపరికరములం గూడ నుపయోగించుచున్నారు.

కొండలప్రదేశములు మొదలగు కొన్ని తావులందు రేడియోవైర్లెస్ బొత్తిగాఁ బలుకుట యుండుటము. పల్కినను సరిగాఁ దెలియకుండునట్లుఁ బలుకును. పలుకుటఁ గష్టమైన ప్రదేశములకు 'Dead areas' అని పేరు. (డెడ్డేరియాస్ చూడుఁడు). అట్టిప్రదేశములవారు Radio Wireless sets స్థాపించుకొనినవా రనేకులు ద్రవ్యమును వృథా వ్యయమొనర్చితిమని పశ్చాత్తాపపడియున్నారు. గాన స్థాపింపఁదలంచినవారు తమ ప్రదేశములు, వాటిపరిసరములు Radio wireless న కనుకూలించునా? యని తొలుతఁ బరిశీలించుకొనవలసియుండునని యనుచున్నారు. పిదపఁ జూచుకొనఁ దగినది Periods. ఇవి యొక్కొకతఱిఁ గాలపరిస్థితులనుండియు, శీతోష్ణవిజృంభణములనుండియు, నొకటిరెండుదినములు మొదలు పది లేక పదునేనుదినములదనుకఁ గూడ రేడియోసెట్లు సరిగాఁ బలుకకఁ జెడినట్లుండుటయుఁ గలదు. ఈ

కాలములందుఁ బలుకకపోవుటయు, ఫేడింగుగనే యెంచఁబడు నందురు.

ఇంక నీవైర్లెస్ సెట్టునుండి ట్రాన్సుమిటరు గుండా 'ఈతరు' లోనికిం బంపుమాటలు, పాటలు, ధ్వనులు, 'లాంగువేవ్' వనియు, మీడియంవేవనియు, 'షార్టువేవ్' వనియు, 'Long wave medium wave shart wave' అనియు, మూఁడు తెఱఁగులుగఁ బంపుదురు. (వేవ్సు చూడుఁడు). చలి (మిక్కుటముగ నుండు) కాలమున మీడియంవేవుగుండా చేరినవార్తలు ఫేడుకాకుండ నిలుచును. సగటున నుష్ణదేశములందలివేఁడి మీడియమ్‌వేవుపై నుండి సరిగా రేడియోవైర్లెస్‌పై పని నడుపుట సంతృప్తిఁ గల్గింపదని యిటీవలఁ దలంపఁబడుచున్నది. షార్టువేవులపైఁ బంపఁబడువాటి కట్టి శీతోష్ణపు ఫేడింగుబాధ లధికముగ నుండవు.

ఈకారణములచేతనే యొకరేడియోవైర్లెస్ స్టేషనునుండి రాత్రులందు ౪౦౦ మైళ్ళదూరము మువఱకు సౌఖ్యముగను, చక్కఁగను, విన్పించు మీడియంవేవువార్తలు పగటియందు నూఱు లేక నూటయేఁబది మైళ్ళదూరమునకన్న నెక్కువ దూరస్థలములందు ఫేడగుచుండెడివి.

## రేడియోవైర్లెస్‌టెలిగ్రాఫీ (Radio teligraphy):—

తంతిసహాయము లేకుండ టెలిగ్రాము నందఁజేయువిధానము. (Wireless).

## రేణుకలు:—

లాటిన్ భాషయందు Piper Aurantiacum.

సం. కపిలా, రాజపుత్రీ, హరేణుకా, కామందకీ.

ఇవి మిరియములవలె నుండుననియు, అతిసారము, ఉన్మాదములను, కఫ కాసలను, జ్వరములు, దాహము, మరదలు, శీతపైత్యదోషముల నడంచుననియుఁ జెప్పఁబడినది.

## రేణుకాచార్యుఁడు - (రేణుకసిద్ధుఁడు):—

ఈమహాత్ముఁడు రేణుకారాధ్యుండనియు వాడుక నందినవాఁడు. వేదోక్తశివభక్తి నుద్ధరించ శివనియోగితుండై యాంధ్రభూమియందుఁ దొల్లింటి కాకతీయరాజ్యమునందుండిన కుల్యపాక (ఇప్పటి కొలనుపాక లేక కొలిపాకక్షేత్రము) జన్మించి, సోమనాథదేవుని యంశగాఁ గల్గినవాఁడు. అగస్త్యులనుండి యుపదేశమందెనని చెప్పఁబడినది. వారియుపదేశము 'సిద్ధాంతశిఖామణి' యనంబడు రేణుకాగస్త్యసంవాద మనఁబడుచున్న 'శివాద్వైతసిద్ధాంతగ్రంథము' గ నున్నది. లంకాధిపతియగు రావణభూపతిసోదరుండగు విభీషణుఁడీతనికడ మంత్రోపదేశ మందినవాఁడఁట. ఈ మహనీయుఁ డాతని కొసంగిన శివలింగ మిప్పుడు రామేశ్వరదేవాలయమున నుంచఁబడి యున్నది. (క్షేత్రము చూడుఁడు.) శంకరభగవత్పాదులు రేణుకాసిద్ధుని యనుగ్రహముకై తపం బొనర్చి యారులింగము లందెననియు, నవి యిప్పటి శంకరపీఠములందుఁ జంద్రమౌళీశ్వరశివలింగము లనుపేరునఁ బూజింపఁబడుచున్న వనియుఁ దెలియుచున్నది. ఈమహాసిద్ధుఁడు కొలిపాకసోమనాథలింగమునం దైక్యమాయె నఁట.

దారుకారాధ్యులు, ఏకోరామారాధ్యులు, పండితారాధ్యులు, విశ్వారాధ్యులు వీరియవతారములే యందురు.

## రేణుకాతీర్థము:—

పంజాబునందలి నహాన్ పురమున కుత్తరముగఁ బదునాఱు మైళ్ళదూరమున నీతీర్థము కలదు. రేణుక పరశురామునితల్లి, జమదగ్నిభార్య.

దీనిప్రశంస పద్మపురాణము సర్గ ఆది ౧౧ యందుఁ గలదు.

**రేణుగోత్రము:**— ఇది విశ్వామిత్రసంతతియందు రేణుగణముగఁ జెప్పఁబడినగోత్రము. విశ్వామిత్ర, గాధిన, రైవణ అనిప్రవర.

**రేణుగోత్రము:**—
(రౌద్ధకగణము చూడుఁడు).

**రేపటిపని నేఁడు చేయుడము తప్పె, నేఁటిపని రేపటికి నిల్వ యుంచడము తప్పె:**
(ఆంధ్రలోకోక్తి)

**రేపనేరో జొకటియుండునా?:**
(ఆంధ్రలోకోక్తి). ఇదియొక సామెత.

**రేపిడుప్స (Rapids):**—of a river. నది మెరకనుండి పల్లమునకు దిగుతఁటే దొరలుచు, వడిగాఁ బర్విడును. దాని నట్టితావున 'rapids' అనెదరు. (river చూడుఁడు).

**రేభగణము:**— ఇది కాశ్యపసంతతియందలి యొకగణము. ఇందు నాలుగుగోత్రములు చెప్పఁబడినవి.

౧ మైత్రేయసగోత్రము, ౨ రేభసగోత్రము, 3 రైభసగోత్రము, ౪ శాంభవసగోత్రము. ఈ నాలుగు గోత్రములకుఁ బ్రవర:— కాశ్యప, అవత్సర, రైభ, (త్ర్యార్షేయప్రవర)

**రేభగోత్రము:**— (రేభగణము చూడుఁడు).

**రేర్ఎర్తు (Rare Earth):**—ఇవి metalic oxide జాతికిఁ జెందినవి. 'elementary bodies' అని వాడిరి. వీటికి yttra - ceria - lanthaua - didymia యను భేదములం గల్గియుండునవి.

1 Yattrium group నందు dysprosium-erbium - holmium - terbium - thulium - yttrium -ytterbium - lutecium అనునవి కలవు.

2 Cerium group నందు cerium-curopium - gadolinium - lanthanum - neodymium - praseodymium - samarium - scandium అనునవి కలవు.

3 Thorium - గూప్రునం దిది యొక్కటియే కలదు.

4 Zirconium - గూప్రునం దిది యొక్కటియే కలదు.

ఈవిభజనము నవీనమైనది. అవి యిప్పుపదార్థములనుండి యీపేరు లియ్యఁబడి జాతులనుండి గూప్రులుగా విభజింపఁబడినవి. ఇంకను oxidse నకుఁగూడ 'rare earths' అని పేరు వాడుచున్నారు. అవి minerals నందు చాల కొంచెముకొంచెముగా లభించెడివి.

**రేల (రెల్ల) చెట్టు:**— లా. Cassia Fistula, ఆంగ్ల. Purging Cassia అనియు, Pudding Pipe tree అనియుం బేర్లు. సం. అరగ్వధః, దీర్ఘఫలః, స్వర్ణపుష్పః. రెల్లకాయలను నక్కలు ప్రీతితోఁ దినుననియు, తోడనె కడుపునొప్పిఁ గల్గి బాధపడుచు మూల్గుననియు, అట్లయ్యును తిరుగఁ దినకమానవనియు నందురు. బాధలనంది చెడుచున్నను తిరుగ తిరుగ నాపనిని మానక వృత్తి మరలించుకొనఁజాలనివారింగూర్చి 'నక్క రెల్లగాయవాట' మని సామెతగ వల్కు-

చురు. రెల్లపూవులు పెద్దపెద్దగుత్తులుగఁ బసుపుఁ బచ్చరంగున వింతగఁ బూచును.

రెల్లపట్ట లేక ఆకులరసకషాయములు మిక్కిలి వేఁడిఁజేసి విరేచనముఁ గావించును. మూత్రము వెడలించును. క్రిమి, కుష్ఠు, గుల్మరోగము, జ్వరము, మహోదరరోగము, మేహము, విష దోషము, శూలల నడంచుననియు, పండులోని గుంజు పైత్యము, జ్వరము, వాతముల నడంచి, విరేచనముఁజేసి శూలం గల్గించుననియు, చిగుళ్ళు విరేచనముఁజేసి చర్మరోగముల నివారించుననియు, పూవు సందు నివేగుణములనియుం జెప్పఁబడినది. ఇది మలబద్ధరోగమును మాన్పునందురు.

## రేవణగోత్రము:—

(శౌనకగణము చూడుఁడు.)

**రేవతి:—** ఈపేరుగల స్త్రీలు పల్వురు గలరు. రైవతపర్వతమున నొకకాలమునలో జన్మించిన నొక స్త్రీ రేవతియను పేరుఁగలది. ఈమెను తత్తరమునఁ దపమొనర్చుచుండిన ప్రముచుఁ డనుఋషి పెంచెను. భర్త ప్రియవ్రతునివంశమున జనించిన దుర్దముఁడు. ఈమెసుతుఁడు రైవతమనువు. (రైవతకపర్వతము ద్వారకకు సమీపము) భాగవతమున ప్రియవ్రతుని పుత్రుఁడు దుర్దముఁడని చెప్పియున్నది.

బలరాముని (శ్రీకృష్ణసోదరుఁడు) భార్యపేరు రేవతి. ఈమె రేవతునికుమార్తె. ఈమెతండ్రిపేరు కకుద్మి యనియు, కకుద్మి రైవతుని సుతుఁడనియు, ఆరైవతుఁడు శర్యాతిపౌత్రుఁడనియు వేఱొకచోఁ జెప్పఁబడినది.

అరిష్టుఁడు, పిప్పలుఁడు, వీరలతల్లి పేరుక రేవతి కలదు. ఈమెభర్త పేరు మిత్రుఁడు. దక్షప్రజాపతికుమార్తెలలోఁ జంద్రునిభార్యలగు అశ్విన్యాదిగా నిరువదియేడునక్షత్రములలో నొకరేవతి గలదు.

**రేవతీనది:—** ఇప్పుడు దీనిని 'రప్తి' యనుచున్నారు. అయోధ్యారాష్ట్రములోని నది. గరుడపురాణము లోయందుఁ బ్రశంసింపఁబడినది. దీనికి 'ఇరావతి' లేక 'ఐరావతి' యనియుం బేరు కలదు.

**రేవతీ నక్షత్రము:—** ఇది మత్స్యాకారముఁగల్గి కన్పించు మూఁడునక్షత్రములసముదాయము. దీనికను అంత్యః, పూషా, పౌష్ణః, రేవతీ యను పర్యాయనామములుకలవు. దీనికిఁబూషుఁడు అధిదేవత. దేవగణనక్షత్రము. తిర్యఙ్ముఖము. స్త్రీస్వభావనక్షత్రము. ఆడమేనుఁగ ఆడనెమలి, ఇప్ప చెట్టు ఈనక్షత్రసంబంధములనియు, ప్రవేశించిన ముప్పదిఘడియల పైత్యాజ్యము (అనఁగా విషఘటికల) నియు, కలునది యెన్మిదఘడియలపై యమృతఘటికలనియు నిది మృదుస్వభావనక్షత్రమనియుఁ జెప్పఁబడినది.(నక్షత్రములుచూడుఁడు).

## రేవలచిన్ని:—

లా. Rheum Emodi, ఆంగ్ల Rhubarb లేక Rheum. ఇదిచలువ చెట్టువేరనియు, సమశీతోష్ణముఁ జేయుననియు, కొన్నితత్వముల సంచునపైత్యముఁ జేయుననియు నందురు.

ఉబ్బు, సెగరోగము, అగ్నిమాంద్యముల నడంచి, నీళ్ళవిరేచనముల నాఁపి, విరేచనముఁ గావించు నందురు. మఱియుఁ బొత్తికడుపుపైఁ బట్టినచిన మూత్రమును వెడలించునని యనెదరు.

**రేవానది:—** సర్వసాధారణముగ రేవాయన నర్మదానదిగఁ దలంచుచున్నారు. మహాని

కాళిదాసు తనమేఘసందేశము ౧-౨౦ యందుఁ బ్రశంసించియున్నాఁడు. మరియుఁ బద్మపురాణ స్వర్గ ౧౦ యందుసను ప్రశంస కలదు. కాని, వామనపురాణ ౧౩ అధ్యా (౨౫-౩౦ శ్లోకముల) నను, భాగవత ౧౮ యందునను, రేవానది వేఱు నదిగా సూచించెడిని. ఇది యందుఁ జేరిననదిగఁ దలంపఁబడుచున్నది.

## రేవిగోత్రము:—

(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**రేపూరి అనంతనార్యకవి:—** పూర్వ మీయింటిపేరు తాళవవా ఁనియుండెనఁట. ఈ యననాఁడే రేపూ రని మాఱెనఁట. వెలనాటి బ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. తండ్రిపేరు లింగకవి. తాతపేరు కాళ హస్తికవి. క్రీ. శ. ౧౮ వ శతాబ్దప్రారంభకాల మునాఁటివాఁ డందురు.

రచించినవి ౧ గాధేయోపాఖ్యానము. బదిర కృష్ణభూపాలున కంకిత మొనర్పఁబడినది. ౨ వృద్ధా చలమాహాత్మ్యము. పంటలింగా (జీ) రెడ్డిగారి కంకితము.

**రేపూరి అనంతయజ్వ కవి:—** వెల నాటి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. బాలకవి బిరుదాంకితుఁడు. తండ్రి కాలహస్తికవి. తాత అనంతార్యుఁడు. ౧౮ శతాబ్దము కడనుండినవాఁడు. నివాసము ...చనాపల్లిసమీపముననున్న తుఱ్ఱయ్యూర్. రచించినవి శ్రీకృష్ణమాహాత్మ్యము, శివరహస్య ఖండము. మొదటిది వెంగుళము కృష్ణభూపాలున కంకితము; రెండవది తీర్థపురి (తుఱ్ఱయూర్) నందీ ...న కంకితము. ప్రౌఢకావ్యములు.

**రేపుణూరి వేంకటార్యకవి:—** ఆంధ్ర కవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. నందవరీకవైదికబ్రాహ్మణుఁడు. శ్రీవత్ససగోత్రము. తిరుమల కొండయ్య తండ్రిపేరు.

రచించినది శకుంతలాపరిణయ మను ప్రబంధము. దీని నొకభూపతి కంకితమొనర్పఁ దాఁ దలచి నట్టును, దానికొక కరణము విఘ్నముఁ గల్గింప, రోసి శ్రీ వేంకటేశ్వరస్వామికిఁ గృతిసమర్పించి నట్టును జెప్పఁబడినది. శబ్దాలంకారములం దీ కవికిఁ జాల యభిమానము. మఱియు సీతఁడు రామ చంద్రోపాఖ్యాన మను గ్రంథముఁగూడ రచించె నఁట.

**రేషనాలీజమ్ (Rationalism) :—** పాశ్చాత్య Philosophy యందు సకారణత్వము (reason) యుండుట విజ్ఞానమున కొకేధర్మ ముగా నుండుననియు, నొకవేళ కాదనినను reason ప్రధానధర్మమైయుండుననెడిసిద్ధాంతము.

ఇది empiricism సిద్ధాంతమునకును sensationalism సిద్ధాంతమునకును, వ్యతిరేకము. 'Date of sense' అనునది sensible knowledge కి, అతీతముగ నడచి నిజస్థితింజూపు ననుటను రేషనలీజమ్ ఎదిరించును.

**రేషనల్ హొరైజన్ (Rational horizon):—**

(భూవలయరేఖ చూడుఁడు).

## రేహర్క్షత్రియులు:—

(ప్రమారశాఖక్షత్రియులు చూడుఁడు).

**రైటరుగారు (రైటరున్యూస్ ఏజన్సీ స్థాపకులు)** ఇప్పు డీన్యూస్ ఏజన్సీ 'Rewte-

rs Limited' అనుపేరఁ బరఁగు ప్రపంచవార్తాసంస్థ ఆంగ్లదేశఁపుసంస్థగ నున్నది. దీనిని స్థాపించినది Paul julius de Reuter గారు. వీరు జర్మను దేశమున Kassel అనఁబడుగ్రామమున క్రీ. శ. ౧౮౧౬ జూలై ౨౧ తేదిని, జర్మనుదంపతులగర్భమున జనించిరి. తొలుత బాంకర్లుగ పనిచేసిరి. ౧౮౪౯ లో రైటర్ న్యూస్ఏజన్సీని స్థాపించి, దానిని నడుపుచుండిరి. ఆది నిది బ్రస్సెల్సు నగరమునకును, Aix-lu-Chapelli కిని, వర్తకమువార్తల నందించు సంస్థగఁ బ్రారంభమైనది. ఇంగ్లాండు ప్రాన్సులకు (డోవరు కలే పురములనడుమ) మొదట కేబిల్ వేయఁబడఁగనే వీరు Naturaized British subject గా నైరని చెప్పుదురు. వీరు లండనునగరమున ౧౮౫౧ కాపురము కుదిరి, ౧౮౬౫లో దీనిని లిమిటెడ్ కంపెనీగా రిజిస్టరు చేయించిరి.

సాక్సకోబర్గుడ్యూకుగారు రైటరుగారికి బేరన్ గౌరవపదవినొసంగెను. వీరు నీస్‌పురమున ౧౮౯౯ ఫిబ్రవరి ౨౫ తేదీని మృతినంద, వీరిసుతులు Julius element Herbert ౧౮౫౨-౧౯౧౫ గారు, ఈవార్తాసంస్థ కధిపతులైరి. దాని యప్పటి వాడుకనామము. అన్నిఆస్తులు హక్కులతో సహా ౧౯౧౯ లో రూ:బర్సు టెలిగ్రాంకంపెనీగా ౫౫౦౦౦౦ పౌనులకు. విక్రయింపఁబడినది. దానిం గొనినవారు ౧ హానరేబిల్ మార్కునేపియరు గారు, ౨ లార్డు గ్లెంకోనరు (ప్రభువు) గారు, 3 వైకౌంటు పీల్‌గారు, ౪ సర్ రోడరు స్టార్ జేమ్సుగారు నై యుండిరి. ఇప్పు డది కేవల మాంగ్లసంస్థగనే యున్నది.

## రైటరు ఏజన్సీ (రూయిటర్ ఏజన్సీ:— (న్యూస్ ఏజన్సీలు చూడఁడు.)

## రైడర్ (Rider):— వాణిజ్యసంబంధపరిభాషాపదము. ఒకదస్తావేజునకుఁగాని, ఒకసభాతీర్మానమునకుఁగాని, వేరుగఁ గొంతఁ జేర్చిన (దీనికిఁ బిదప సతికించిన) వేరుపత్రము.

## రైనునది (Rhine River):— ఐరోపా ఖండమునందలి పెద్దనదులలో నొక్కటి. అనేక దేశములగుండా ప్రవహించుచు రాకపోకలకు వర్తకఁపుటోడలకు, జలమార్గమై ప్రాముఖ్యత నందిన ప్రవాహ మగుట నెల్లరచే 'Romantic Rhine' అనఁబడుచున్నది. అది ప్రవహించుదేశములవారిప్రతినిధులగు inter national commission వారి యధికారపరిపాలనక్రింద నున్నది.

స్విజర్లాండుదేశఁపు mont St. Gotthard శిఖరముకడ నొకగ్లేసియరునుండి జనించి, యచిరకాలముననే బెర్నీస్ ఓబర్లాండు నుత్తరదిశయందుండి మంచుకరఁగిన జలములను, కురిసినవర్షజల జలమును లెక్కలేని కొండప్రవాహములగుండా గై కొని, మెలుమెలునకు బలపడుచు, బురద ప్రవాహమున కాన్సటన్సుసరస్సునం జేరుకొనును.

తనతో నే తెంచినపంకము నందు విడిచి, శుచియై, నిర్మలజలప్రవాహముతో నాసరస్సుయొక్క యవ్వలికడనుండి తిరుగ బయల్వెడలి, బేసెల్‌పురముకడకుఁ బ్రవహించి, యట నుత్తరవాహినియై, mainz పురమున కరగుచో మార్గమున నొక rift Vally గుండా నడచి, దానిని ఫలభరితముగ నొనర్చి, అందున్న పచ్చికబయళ్ళం దడుపుచు, Black forest సమీపమున Monnheim పురముప్రక్కనుండి నడచుచు, నటనుండి, పెద్దసముద్రఁపుటోడల రాకపోకలకుం దగినదిగనై Mainz పురమునుఁజేరి, యట Main నదిని దన యందుఁజేర్చుకొని యింకను బలపడును.

ఈ main నది cannalized నదిగను యుంట (క్రైనాల్వై జేషన్పద్ధతి చూడుఁడు). ఒక కాలువ దీనినుండి డేన్యూబునదికిఁ గల్పుటచేతను, ఇతర కాలువలసాహాయ్యములు, సంబంధములు నమరియుంటను, నార్తు సీ నుండి Block sea దనుకఁ బ్రయాణజలమార్గము కలదని తేలు చున్నది.

పిదప రైనునదీప్రవాహమునకు బొనస్పర్వత మధ్యరా, నటనుండి పశ్చిమవాహినియై, కొంత నడచి, సందుదొరకినంత దానింగొనుకొని యవ్వ లకుఁ బ్రవహించి నడుచును. ఈతావునను రైన్గోర్జి యనెదరు. పిదప నది జర్మనుదేశములోని చేతిపని పాటులకు, యంత్రశాలలకుఁ జేరందిన యొకగొప్ప సమతలప్రదేశముగుండా నరుగుట గొప్పయోడ లకు, వర్తకమునకు మార్గమై, యత్యంతప్రాముఖ్య తం గూర్చెను.

హాలండుదేశములోని కరిగి చీలికపై గొప్ప డెల్టాఁగూర్చుకొన నొకపాయశాఖ తనపేరుననే సముద్రముఁ జేరును. వెడలుపుగ నున్న వేఱొక శాఖ యోడలరాకపోకల కాస్పదమయ్యెను. దీనిక 'waal' అనిపేరు. వేఱొకశాఖ 'yssel' అను పేరు గలది జూడర్జీయుంను సంగమించును. 'Lak' అనుపేరుగల వేఱొకశాఖ రోటర్డామ్‌కడ సముద్ర ముం జేరెడిని. ఇం దోడలు విశేషముగ నడుచు చుండెడిని. రైనునది ౮౦౦ మైళ్ళుపొడవనియుఁ జెప్పఁబడినది. ఇందుఁ జేరు నుపనదులు చిన్నవి, పెద్దవి కలిపి ౧౨౦౦౦ ఉండు నందురు.

## రైనోప్లాస్టీ (Rhinoplasthy):—

(రైనోరు రైనోఫారిన్‌జీల్ చూడుఁడు).

## రైభగోత్రము

(రేభగణము చూడుఁడు)

## రైభ్యర్షిఆశ్రమము:—

దీనికిఁ గుబ్జామ్రా మనిపేరు వాడఁబడినది. హృషీకేశమున కుత్తర ముగఁ గొంతదూరమునను న్న విష్ణుక్షేత్రము. వరాహపురాణము ౧౨౬ యందు దీనిప్రశంసయు, ౧౪౬ యందు హృషీకేశప్రశంసయుఁ గలవు గాన నివి వేర్వేఱుక్షేత్రములని యెఱుంగఁదగినది. దీని యందుఁ గుబ్జాశ్రమము, కుబ్జామ్రము, కుబ్జమా రమునని వాడఁబడిన కూర్మపురాణము ఉపరి ౩౪ అధ్యా ౩౪ శ్లో. నందునను, ౩౬ అధ్యా. ౧౦ శ్లో. నందునను ప్రశంస కలదు.

## రైభ్యుఁడు:—

ఈపేరుఁగలవా రిర్వురుకలరు. పూరువుసంతతి. చంద్రవంశక్షత్రియుఁడగు సుమతి పుత్రుఁ డొకరైభ్యుఁడు కలఁడు. ఇతని కీనుఁ డని నామాంతరము కలదు.

మఱియొకఋషి రైభ్యుఁడను పేరుగలవాఁడు కలఁడు. ఈతనిసుతులు అర్థావసువు, పరావసువు ననువారలు.

## రైవతక (పర్వత) ము లేక కుముద పర్వతము:—

ఇది ద్వారకకు సమీపముననుండు పర్వతము. ఋతవాక్కు-శాపవశమున రేవతీనక్షత్ర మీపర్వతముపైఁ బడెనఁట. అత్తావునఁ బల్లపు వర్షములకు నీరు నిలిచే, నొకతామరకొల నయ్యె నఁట. నాఁడాదిగ నాపర్వతమునకు రైవతక మనియు, సరస్సునుండి కుముదపర్వత మనియు, వాడుకలు గల్గెనఁట. మఱియు నాసరస్సునందే రేవతి యనుకన్య జనించెనఁట. (ఆమెయే ప్రము చుఁడనుఋషికిఁ బెంపుడుకుమార్తెయు, రైవత మనువుతల్లియు, నై యున్నది). ప్రియవ్రతునిసంత తివాఁడగు దుర్దముఁడు రేవతిభర్త భాగవతమునఁ బ్రియవ్రతునిపుత్రుఁడనియే చెప్పియున్నది.

## రైవతగణము:—

ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి. [యజుశ్శాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు].

ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము

౧ రైవతగణము:—ఐదు గోత్రములు.

౧ రైవతమను గోత్రము. జన- జన్మ -జయధ- రేవత - రైవత - (పంచార్షేయప్రవర.)

౨ పరర్షి గోత్రము— జహ్ను - జయధ - పర (త్ర యార్షేయప్రవర].

3 జయధర్షి గోత్రము—జయధ - పర - రేవత [త్రయార్షేయప్రవర].

౪ పరిషంగర్షి గోత్రము—రేవత - రైవత - అజిత- ప ృత - పరిషంగ - (పంచార్షేయప్రవర).

౫ విద్యాస్వర్షి గోత్రము—అజిద - పరిధృత - పరి షంగ - విదిత - విద్యాస్త - (పంచార్షేయ ప్రవర).

**రైవతపర్వతము:**—జూనగడ్ సంస్థానము లోని జైనులయాత్రాస్థానము. నేమినాద్ తీర్థక రునిజన్మస్థానము. జైనుల పంచతీర్థములలో నొక టి. జైనులు దీనిని రేవాయాయిపర్వత మని, యందురు. (గిరినగరము చూడుఁడు.)

**రైవతమనువు:**- ౫ రైవతమనువు. ప్రియవ్రతుని సంతతివాఁడగు దుర్దముఁ డీతని తండ్రి. తల్లి రేవతీదేవి. రైవతుఁ డతిధర్మాత్ముఁ డని చెప్పఁబడినది. కుమారులు బలుఁడు, బన్ధువు, స్వయంభావ్యుఁడు, సత్యకుఁడు సని మార్కండేయ పురాణమునను, అరుణుఁడు, తత్త్వ విత్త్వవం తుఁడు, హవ్యావుఁడు, కపి, ముక్తుఁడు, నిరుచ్ఛ కుఁడు, సత్త్వ, నిర్మోహుఁడు, ప్రకాశకు లను పది మంది పుత్రులని యితరతావులను గాననగును. ఈతని మన్వంతరకాలమున విభుం డనువాఁ డిం ద్రుఁడు. హిరణ్యారోమ, వేదశ్రీ, ఊర్ధ్వబాహు, వశిష్ఠ, వేదబాహు, సుదామ, పర్జన్యర్షులు మహ ర్షు లనియుఁ గలదు: పుష్యశుద్ధ ఏకాదశి రైవత మన్వాది.

**రైవతుఁడు:**—ఐదవమనువు. ప్రియవ్రతుని పుత్రుఁడని భాగవతమునను, ప్రియవ్రతుని సంతతి లోనివాఁడని యితరగ్రంథములందును జెప్పఁబడి యున్నది. తల్లి రేవతి. (రేవతి రైవతపర్వతము చూడుఁడు).

వేఱొకరైవతుఁ డనర్తునికుమారుఁడు. కకుద్మి తండ్రి.

**రైవెరా (రివైరా) (Riviera):**—మధ్య ధరాసముద్రపుశాఖయగు Ligurian సముద్ర తీరము నంటి యిటలీ ఫ్రాన్సుదేశములలోనున్న దేశభాగమున కీపేరు వాడుచున్నారు. ఇందు వింతయగు శీతోష్ణస్థితి, సౌందర్యవంతమగు వృక్ష జాలదృశ్యము మనోహరములై యుండును.

**రెవెరా రెవెరా రివెరా:**-

(రివైరా లేక రైవైరా చూడుఁడు).

**రైనోపారంజియల్**—

ముక్కునకుసంబంధిన వ్యాధులకు శస్త్రచికిత్స మొదలగునవి చేయువిధానము.

**రొంపఁగల్గినతఱి వాసనఁ దెలియ కుండుట:**—వాసనల నెఱుంగుటకు ఆవాసన నొసంగుద్రవ్యమును, గాలియు, సరియగుశక్తిఁ గల్గిన ఘ్రాణేంద్రియమును కావలసియుండును. ముక్కునందు ఘ్రాణశక్తిగలభాగమునకు వాయువు లేనిది వాసన లరుగఁజాలవు గాన గాలియు దీని కవసరమే. మఱియు ముక్కునందలి ఘ్రాణశక్తి గల భాగమునకు శాస్త్రవిదు లాంగ్లమున 'mu-couse membrane' అని సాంకేతికనామ మిడిరి. ఈశరీరశాస్త్రవేత్తలు పరిశీలించి, ఈ mucouse membrane ఒకపొర యనియు,

రొంపఁ గల్గినతఱినది వాచియుండు ననియు, నత్తఱి నందలి (clels) ఇంచుకచెడి పటిమఁ దప్పియుంట వాసనలను గ్రహింపనీకయుండుననియుఁ గన్గొని యున్నారు. అత్తఱి నావాదినపొరయందు నీ రధికముగ నూరుచు చెమ్మఁగల్గి, సెల్సుగంధ్రిములు కప్పఁబడియుంట, వాయువుగుండా వాసనలు ఘ్రాణేంద్రియమునకుఁ జేరఁజాలవనియు, నిత్తఱి ముక్కు దిబ్బవేసినదని యనెదరనియు, వాసన తెలియకుండుస్థితిఁ గల్గుననియు ననెదరు.

**రొంప (శిరోవాతము):**— ఆంగ్లపరిశోధకులు దీనింగూర్చి యొకవిధమగు మైక్రోబు లేక జరమ్ (Microbe or germ) తడిఁగల్గియుండినగాలియం దుండుననియు, అది యూపిరిఁబీల్చుతఱి లోనికేగి శిరస్సునఁ బ్రధానముగను, శిరేతరభాగములందుఁ గూడా వసించుచుండుననియు, వారిపాదముల కదేపనిగఁ జెమ్మ తగులుచుండెనేనియు, చెమ్మయందు నానుతఱి విస్తారము గాలి పట్టెనేనియు, శరీరమందలివేఁడి తగ్గుతఱి విజృంభించి ముక్కుకడకుఁజేరి యట నీరెక్కువఁగలుగునటులఁ జేయుచుండును. దీనిని రొంప యనియు, జలుబనియు, పడిసెమనియు నందురు.

ఇంకను నీటనున్న తఱియు నడచుచుంటిమేని శరీరమందలిరక్తమంతయుఁ జక్కఁగఁ బ్రసరించుచుండ శరీరవేఁడిమి చెడదనియు, శరీరవ్యాయామము, శరీరమున రక్తము ప్రసరించుట శరీరమునకుండవలసిన యర్హపరిమాణముగలవేఁడి సరిగానుండునేని యీజరమ్ తానే నశించుననియు, శరీరమున వేఁడి సబునార్మల్ (Subnormal) [అనఁగా 98.4 నాలుకక్రింద] అయినప్పుడే విజృంభింపఁగలదనియు నప్పుడే రొంపగల్గుననియు, ఈ జరమ్ శరీరమున లేకుండుతఱి [Sub normal] వేఁడి తగ్గిపోయిన వాతగుణం బసఁబడుననియు నాంగ్లవైద్యశాస్త్రవేత్త లనెదరు.

**రొటేషన్ లేక రివల్యూషన్ (Rotation Revolution):**— భూమి తనకుఁదాను దిరుగుతఱి నొకసారి తిరుగుట కిరువదినాల్గుగంటల కాలము పట్టును. దీని కొక Rotation అనిపేరు.

అట్లు తిరుగుచు నొకసారి సూర్యుని జుట్టివచ్చుట కొకసంవత్సరఁపుఁగాలము పట్టును. దీనికొక Revolution అనిపేరు.

**రొటేసిజమ్ (Rhotacism):**— ఇండో యూరోపియన్ భాషాశాస్త్రమున R ను గురించిన పరిణామములను, ఉచ్చారణలను దెలుపుభాగము.

**రొట్టె నేతిలోఁ బడినట్లు:**— .
(ఆంధ్రలోకోక్తి.)

**రొయ్యపీత:**— ఇది గండుపిల్లి సమానేప యొక్క చేదుకట్టు (Gall).

ఇది పైత్యము, కాకఁజేసి విరేచనముఁ గావించి వాతమును, సన్నిపాతదోషమును, వాతసంబంధమగు విదాహమును నడఁచును.

దీనిని సన్నిపాత సూతికావాతముల కిచ్చు నౌషధములందుఁ జేర్చుచుందురు. దీనియందు వ్యాకసంకోచగుణము బలముగఁ గలదందురు.

**రోకలిబండ (Ring worm):**— రోకలిబండయనఁగా (బండరోకలి) పొన్నులేని రోకలిముక్కయని యర్థము. తలనుండి తోకవరకును రోకలివలెనించుమించుగ సమానమగువలముఁగల్గి రోకలిబండయాకారమున నుండుటచే నీక్రిమి కీపేరు తెల్గున వాడఁబడుచున్నది. దీనిశరీరమంతయుఁ జిన్న చిన్న యుంగరము లొకటిపక్క నొకటిగ నతుకఁబడి

పట్టుండుటచే దీని నాంగ్లేయపరిశీలకులు ring worm అనుచున్నారు. ఈపురుగునకుఁ గుళ్లిన యాకులు మొదలగు వృక్షపదార్థము లాహారము. సందున దట్టముగాఁ జెట్లు పెరుగుటవలనఁ దేమగ నుండుచోట్ల నిది వసించును. వీనిలోఁ బెద్దరోకలి బండ (కొండరోకలబండ), చిన్నరోకలబండ యను రెండుభేదములు గలవు. ఈభేదములు చిన్న, పెద్ద భేదములేగాని మిగిలినయంశముల నీరెండును నొకే జాతికిఁ జెందియున్నవి.

దీనిశరీర మనేకయుంగరముల యతుకులుగా నుండును. ఈ యుంగరములు శరీరముచుట్టు ను దిరిగి యుండును. వీనిలో మిక్కిలి పెద్దవి 8—9 దంగుళముల పొడవును, మిక్కిలి చిన్నవి రెండంగుళముల పొడవును గల్గియుండును. పెద్ద లేక కొండరోకలిబండ పెంకు (మెరుపునలుపుకల్గిన Dark brown) రంగుగను చిన్నరోకలిబండ యెఱ్ఱమంటి (Brown), రంగుగనునుండును. దీనికి నోరు, దౌడలుగల్గియుంటఁగుళ్ళినయాకులు, కూర పదార్థములుఁ దిని బ్రతుకును. నోటిపైఁ గండ్లు గలవు. తలమీఁద రెండు స్పర్శేంద్రియములు ముందుకు నిగిడి యుండును. వీనిసహాయమున రోకలి బండ వస్తువులం దడవి తెలిసికొనఁ గల్గును. ఇది గాక కండ్లతోఁ జూచును. దీనికి శ్వాసించుటకు ముక్కులేదు. దీనిశరీరమునఁ బ్రతిరెండుంగరములుఁ గలియుచోట లోపలికిఁ గన్నము లుండును. యీ కన్నములు పైనుండి శరీరములోనున్నగాలి గొట్ట ములలోని కుండునుగాన రోకలిబండ యీకన్న ములనుండియే శ్వాసించును. అడుగుభాగమునఁ బ్రతియుంగరమునకును గ్రందిభాగమున రెండేసి జతల కాళ్ళు గలవు. వీనితో నడుచును. దీని శరీరము దుర్గంధముగా నుండును. అందువలన దీనిని గొన్నిపక్షులు మొదలగునవి తినకుండ వేయును. ఈపురుగు తనకు భయముకలుగునపుడు కాళ్ళన్నియు ముడుచుకొని తల లోపల కుండునట్లు చుట్టగాఁ జుట్టుకొని, కదలక మెదలకఁ జచ్చినట్లు వాలకమువేసి పడిపోవును. భయము తీరినవెంటనే చుట్టవిప్పుకొని లేచి వడివడిగాఁ బ్రాకిపోవును.

తొలకరివర్షములు పడినవెనుక నీపురుగులు జతఁగట్టి యాషాఢమాసమునవందలకొలఁది గ్రుడ్లఁ బెట్టును. అవి సూర్యరశ్మిచేఁ బిల్లలగును. ఈపురుగులు రాలి కుళ్ళిన చెట్లయాకులు మొదలగువాని యందుండు కుళ్ళుపదార్థములనే దినునుగాని వ్యవసాయముల కెట్టి కొరుపును చేయవు. అందువల్ల వ్యవసాయదారుల కవి శత్రువర్గములోనివి కావు.

**రోగత్రయము:—** వైద్యశాస్త్రమున వాత, పైత్య, శ్లేష్మములకుఁ బేరు.

**రోచన:—** వసుదేవునిభార్యలలో నొకతె. ఈమెసుతుండు హేమాన్నదుఁడు.

**రోట్లో తలపెట్టితే రోకలిపోట్లకు వెఱవరాదు:**
(ఆంధ్రలోకోక్తి).

**రోడ్డు (Road) బాటలు, వాటి రచయితలు:**- ఆది నొకప్పుడు రాకపోకలకు రోడ్డు [Road] బాటలు ప్రధానమార్గములుగ నుండెడివి. కాలినడకబాటలవలన నడవఁ జాలని వారలకుఁ గష్టమును, వర్తకసౌకర్యముల కసలే వీలులేనిచిక్కులు సంభవించుతఱి రోడ్డుబాటలు ప్రాముఖ్యతనందుట యెల్ల రెఱింగినదే. అక్కాల మున వేర్వేరుదేశములకు రోడ్డుబాటలు లేకుండిన తఱి, వేరువేరు జాతులమైత్రికి వీలు కలుగకుండిన యదమున వీటి ప్రాముఖ్యత యెంత యుండెనో

దాదిసీరోడ్లను వైచినది రోమకసామ్రాజ్యము. అవి తిన్నగా వేయఁబడుటయు, కొండ లడ్డమైనను వాటినెక్కించి యవ్వలకుదింపి, తిన్నగానే వేయఁబడుట నేటికిని అపియన్-వే (రోడ్డుబాట) సాక్ష్య మిచ్చుచున్నది. అది రోమకపురినుండి దక్షిణముగా నిటలీనుండా రాజ్యమంతటను బోవునట్లు వేయఁబడి, రెండువేల వత్సరములు గతించినను జెడక నట్లే నిలచినది. స్కాట్లండుదేశస్థు లందు John Louden mac Adam అను నాయనయును, Thomas Tilford అను నాయనయు, దీని నిజతత్త్వమును జక్కఁగ గమనించి మార్గమును జూపినవారై చిరస్మరణీయులుగ నున్నారు. ఇందు మొదటివా రాబాల్యము రోడ్డుబాటలం గూర్చి పరిశీలన లొనర్చిరఁట. పెద్దవాఁడై తన స యమున ప్రయత్నము సాఁగించెనఁట. క్రీ ౭౯౮లో దెవనైరునఁ బగిలిపోయిన రాతిముక్కలంగూర్చి గట్టిజాగాగా నమర్చి, దానిపై నడుచు రాకపోకలయొత్తిడిచే నిలచునట్లును, అందేరాతిముక్కయు నాకౌన్సులకన్న నధికబరువుంట యసమంజసమనియుఁ గన్గొంటినని నఁట. దానినుండియే యిప్పటి మెటలింగుపద్ధతి యేర్పడియెఁ గాఁబోలు. నానాటికటుల దిటముగఁజేయఁబడుట కాయనపేరుననే 'Macadamised Roads' అని పేరువాడుకయ్యెనఁట. రెండవ వాఁడగు తోమస్ టెల్ఫర్డుగా రింకను నధికులని చెప్పఁబడియున్నది. ఆయనఘనకార్యములు వంతెనలన్ను నిర్మించుట, తాపీపని, దేశమున బాటలం గొలుచు సర్వేకొలతలతో నీసందర్భమునఁ జెప్పఁబడఁదగినది. ఆయన స్కాట్లాండుదేశమున ౧౨౦ వంతెనలు, ౯౨౦ మైళ్ళరోడ్డుబాటలం గట్టించిన వాఁడఁట. ఈయన బాటలకుఁ బునాదిగఁ బెద్దపెద్ద రాళ్ళను వైచి, పైని పగిలిపోయిన చిన్నరాతిముక్కలుపఱచి, బాటను గట్టిచేయ నమకట్టెన వాఁడఁట. ఇప్పటికాలపు బాటలు నీయుభయుల పద్ధతులు వీలువెంబడి ననుసరింపఁబడుచున్నవి. ఇంక భరతదేశమున నక్కాలమునందు, అంతకుముందు పూర్వమునం గూడ రోడ్డుబాట లేదోవిధముగ నుండినను, వాటిం బరిశీలించిన బాటలను, వాటివివరములు వ్రాయుటకుఁ బరికరములు చాలవు. తుంగభద్రానదిని దాట జీర్ణవిజయనగరము నుండి యవ్వలితీరమున కానేగొంది (తొల్లింటి కిష్కింధ) కరుగు బాటప్రక్కనున్న వంతెనయు, మైసూరురాయిల్వే పశ్చిమవాహిని శ్రీరంగపట్టణములనడుమ కావేరీనదిని దాట నిర్మింపఁబడినవంతెనయు, కాశీనుండి ప్రయాగకరుగు పాతబాటయు, మొగలైప్రభుత్వమున వేయఁబడినటులఁ జెప్పఁబడుచున్న యుత్తరహిందూస్థానమందలి కొన్ని బాటలును, ముఖ్యముగ దక్షిణహిందూస్థానమున పాంబనునుండి రామేశ్వరమునకును సేతుపతిభూపతి యొల్లునిచే వసూలుచేయఁబడిన పన్నులనుండి వేయఁబడినమాత్రబాటయు, బ్రిటీషువారి ప్రభుత్వమీభరతదేశమున లేనికాలములందే వేయఁబడినవిగాఁ దెలియుచున్నవి.

**రోడ్సుపురమందలి గొప్ప సూర్య విగ్రహము:**—ఇది ప్రపంచమందలి యాది కాలపువింతలలో నొకటి. ఇది రోడ్సు (Rhodians) పురవాసులను రక్షించెడు దేవుఁడని, యప్పటివారిభాషయందు 'Phoebus' అనంబడుచుండెను. దీనిని Lysippus అనువారిశిష్యుఁడు Lindus కాపురస్థుండగు Chares అనువారు రచించిరి. దీని పోతఁబోసి చేయుటకు క్రీ. ము. ౨౯౬ మొదలు ౨౮౪ వఱకు (అనఁగాఁ బన్రెండు సంవత్సరములు) పట్టెనని తేలుచున్నది.

అది రోడ్సుపురనౌకాశ్రయమునందు ౬౬ సంవత్సరములక్లో నిలచియుండి, క్రీ. పూ. ౨౨౪ ప్రాంతమునఁగల్గిన భూకంపమునకుఁ బడిపోయి, ౮౦౪ సంవత్సరములు భూమిపైఁబడియుండెనఁట. పిదప నొకయూదవర్తకుఁడు దానింగొనుక్కొని ౯౦౦ ఒంటెలబరువు లోహముం గొంపోయెనఁట. అది ౭౨౦౦౦౦ పౌనులాయెనని చెప్పఁబడినది. తిన్నగ నిలచి యుండినరోజులలో హార్బరున కిరుప్రక్కలను చెరియొకకాలు నానుకొని నిలువఁబెట్టిరఁట. కాళ్ళక్రిందుగ నోడలునడచుచుండెడివని చెప్పఁబడినది. విగ్రహములోపల పై కెక్కుటకు మెట్లుండెనఁట.

**రోడ్‌రోడ్‌స్టెడ్** (Road Road stead) పోగయోడలు క్షేమముగను, సౌఖ్యముగను లంగరువేసుకొనియుండఁ దగినతావు. (Hour-bour చూడుఁడు.)

**రోడియమ్** (Rhodium)—ఫ్రెంచిభాషా పదజన్యము. జర్మనుభాషాపదమగు Rhodon పదజన్యమనియుఁ దలంపఁబడుచున్నది. మైలరంగుతోఁగూడిన తెల్లనిరంగుగల యొకలోహము. ఇది ప్లాంటినమ్ తెగకుఁ జెందినది. ఇది ప్లాంటినమ్, నిక్కల్ లోహములతోఁ గలసి దొరికెడిని. ఎక్కువవేఁడికి నిలుచులోహము.

**రోడ్ట్సెడ్:—.**
(రోడ్ చూడుఁడు).

**రోడ్డేసియా:—** దక్షిణఆఫ్రికాయందున్న టెరిటరీ. ఇది ఉత్తరరోడ్డేసియా యనియు, దక్షిణ రోడ్డేసియాయనియు రెండుభాగములుగ నున్నది. రెంటెనడుమను జాంబీసీనది ప్రవహించుచున్నది. వైశాల్యము 300000 చతురఁపుమైళ్ళు. దక్షిణ రోడ్డేసియాయందు మటబేలెలాండును, మషోనాలాండును జేరియున్నవి. ఈభాగమున బంగారుగనులు కలవు. ఇందు సాలిస్బరీ, బులవాయో, ఉంతాలీపురములు ముఖ్యపట్టణములు. ఉత్తర రోడ్డేసియా బ్రిటీషుసౌతాఫ్రికాకంపెనీవారికిఁ బరిపాలనకు గుత్తనిచ్చియున్నారు. రెండును బ్రిటీషుప్రభుత్వమువారివే.

**రోదదిన గోత్రము:—**
(పీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు).

**రోధోమాలి గోత్రము:—**
(ఔతథ్యఉపగణము చూడుఁడు).

**రోపుబ్రిడ్జి** (rope bridge):—
(వంతెనలు చూడుఁడు).

**రోమకపురిచే నాక్రమింపఁబడిన సప్తపర్వతములు:—** తొల్లింటి కాలమున రోమకపురికి 'City of seven hills' అనియు, పవిత్రమైన దగుట 'etarnal city' యనియు వాడుకనామము లుండెను. ఆపర్వతము లేడింటి పేరులు:— 1 Aventive hill, 2 Palative hill, 3 Capitol hill, 4 Esquiline hill, 5 Quirinal hill, 6 Viminal hill, 7 Caelian hill.

**రోమకపురినిర్మాణము:—** ఆదికాలఁపు రోమనులయుద్ధాధినాధుఁడగు మార్సుదేవునకును, పదభ్రష్టుండైన యొకభూపతికుమార్తెకును, సుతులుగ రోమ్యులస్ అనునాయనయు, రోమస్సను నాయనయు కవలపిల్లలుగఁ గల్గిరఁట. వీరి మాతామహునిరాజ్య మాక్రమించినన్పపాలుఁడు వీరి తల్లిం జంపి, వీరినిర్వుర నొకకట్టతొట్టియం దుంచి టైబరునదియందు వదలెనఁట. ఆతొట్టె యొక

తీరమునకుఁ జేరెనఁట. అట నొకయాఁడుతోఁడేలు వీరిని సంరక్షించుచుంటయు, నొకవడ్రంగిపిట్ట వీరి కాహార మిడుచుంటయు జరుగుచు వీరు పెరిగి పెద్దవారైరఁట.

వారిరువురా ప్రాంతవాసులగు గొల్లలకాపరులను సైన్యముగఁ గూర్చుకొని, వారిమాతామహునిరాజ్య మాక్రమించినభూపతిపై దాడి వెడలి యోడించి, రాజ్యము స్వాధీనపఱచుకుని, టైబరునదీతీరమునఁ దమయాఁడుతోఁడేలు పెంపుడుతల్లి వసించుచుండినచోటనే తమరాజధానిపురము నిర్మించుకొన సమకట్టి, రోమ్యులస్ గోడలంగట్ట నారంభించి, రాజ్యకాంక్ష మనమునం దిమిడియున్న రోమసు, అసూయతతో హేళనగ నవ్వ, వారిరువురకుఁ గలహము వాటిల్ల నందు రోమసు నిహతుఁ డాయెనఁట.

ఇటుఁ బగతునియంతముఁ గాంచినరోమ్యులసు నగరనిర్మాణముఁ గావించుకొని దానికి రోమని పేరిడి, అచటి కీశాన్యదిశయందుఁ బర్వతనివాసులుగ నుండిన వారిబాలికలను బలాత్కారమునఁ దెప్పించి తనవారి కందఱకు భార్యలుగ నొనర్చి, పిదప వారితో సఖ్యముఁ గుదుర్చుకొని, వారితోసహా Quirinus అనుపేరుతో నాపురమున మొదటి భూపతి యయ్యెనఁట.

**రోమకపురినిర్మాణ చరిత్ర:-** ఐరోపా దేశములందు 'రోమ్' అనిపేరందిన రోమకపురి యిటలీదేశమునఁ బ్రధాననగరము. రోమనుక్యాతలిక్కుమతాధ్యక్షులగు పోపుజగద్గురువునకు నివాస స్థానము. ఒకప్పుడు రోమకసామ్రాజ్యమునకు రాజధానిగ నుండెడిది. దీనికిఁ గ్రైస్తవలోకమున 'ఎటర్నల్సిటీ' (పరలోకపురి లేక స్వర్గీయనగరము) అనుపవిత్రనామము కలదు.

ఒకప్పుడు మహావైభవోపేతమై మహాధికార గరిమకు మూలస్థానమైయుండి, యిప్పుడు పవిత్రవంతముగ జేగీయమానమై, తలయెత్తుచున్న నవీన సామ్రాజ్యరాజ్యమునకుఁ బ్రధానస్థానముగనున్న నీనగరీలలామము క్రీ. పూ. ౭౫౩ సంవత్సరమున 'రోమసు రోమ్యులసు' అను నిర్వురునాయకుల క్రింద నట నివాస మేర్పఱచుకొనిన కొందరిచేఁ బ్రారంభింపఁబడినదని బలముగ ప్రతీతి కలదు. ఈ కాల మించుమించు సరియేయని పరిశీలనలు స్థిరపఱచినవి. ఏదేని యొకమహాకార్య మొనర్పఁ గొంతకాలము పట్టకతప్పదనుటకు 'రోమకపురినిర్మాణ మొక్కదినమునఁ గాలేదు' అని నానుడిగాఁ బల్కుచుందురు.

రోమకపురి యేడుకొండల నేకముఁజేసి నిర్మింపఁబడిననగరము:- అవి ౧ Palatine, ౨ Capitol, ౩ Aventnie, ౪ Caelian, ౫ Esquiline, ౬ Viminal, ౭ Quirinal, గుట్టలు. ఇందు, పేలటైను గుట్ట ప్రారంభకాలమున నివాసముగఁ బ్రారంభింపఁబడినది. రానురాను రోమకపురి పెరుగుచు క్రీ. పూ. ఆఱవశతాబ్ది మధ్యకాలముననే పట్టణ మేకమై యేర్పడిన దందురు. అప్పుడే క్లోకామేగ్జిమా భవనమును, ఫోరంమాగ్జిమ్ము లేర్పఱుపఁబడుటయు జరిగినదఁట.

ఇంచుమించుగ నీకాలముననే రోమకపురి యేడుకొండలంజుట్టు రక్షణకై యప్పటి యధికారిగనుండిన సెర్వియస్టుల్లియస్ గారు నిర్మించిన దుర్గమును, ఏర్పడె నందురు. ఇది మొదట నిర్మింపఁబడినదుర్గము. దీనిని క్రీ. పూ. ౩౦౦ నాఁడు. తిరిగి యొకదుర్గము నాతావునందే నిర్మించిరఁట. అది యెక్కువబలముఁగలదిగ నిర్మింపఁబడుట నచ్చుటచ్చట నిలచియున్నది. ఈదుర్గ మేడుకొండలం జుట్టియున్నది. దుర్గనిర్మాణ మనునంతనే నాయక

త్వము, భూపతిత్వముగఁ బరిణామమునుఁ జెందఁదిగఁ దోఁచకపోదు. కాక నీమగ్గనిర్మాత సెర్వియస్ టుల్లియస్ అని చెప్పఁబడుటయు వీటి కాంగ్లభాష యందు 'సార్వియన్‌వాల్సు' అనఁబడుటయు నీ యూహను బలపఱచెడిని. పిదపనే గాలులు (Gauls) రోమకపురి నాక్రమించి రందురు. ఈ దుర్గమునం దనేకద్వారము లుండెను. వానినుండి బాటలు చుట్టునట్లునున్న గ్రామముల కరుగునవిగా నుండెను. పిదప రానురాను నాబాటలు రాజ్యము పొడవునను పోవునవిగ వేయఁబడినవి గానోపు.

రోమకపురియందలిబాటలు తిన్ననివి కావు. పలయు దాహజలములు టైబరునదినుండి గాని, నూతులనుండి గాని, లభింప వలసియుండునుగాన, నట్లనుకూలించుపురి మందలిపల్లఁపుప్రదేశములందే పట్టణమ్ము పెరుగవలసియుండెనుగాన వీలగునట్లిండ్లు కట్టఁబడుచుండెను. గాని గుటల యుపరిభాగముల గృహనిర్మాణమును గూర్చి తలంపఁబడనేలేదు.

అక్కాలమున 'పోన్సు సబ్లిసియస్' అనఁబడు నొక కఱ్ఱవంతెన నొకదుర్గద్వారమునుండి టైబరు నదిని దాఁట నిర్మింపఁబడియుండినటులఁ దెలియు చున్నది. నిర్మాత లెవ్వరో సరిగాఁ దెలియరాకున్నను, క్రీ. పూ. ౩౧౨ సంవత్సరమున నయూ అప్పియూ యనఁబడు సైన్యములు నడుచు పెద్ద బాట నిర్మింపఁబడెనఁట. దీని నాంగ్లమున 'అప్పియన్‌రోడు' అని వివరించిరి. మఱియు నప్పటి రోమకపురికి దాహోదకములందెచ్చు నాక్వెడక్టు (నీటికాల్వ) నిర్మింపఁబడినదఁట. ఇదియే మొదటి ఆక్వెడక్టుగాఁ జెప్పఁ బడినది.

భూమిపైనుండి గాక యెత్తుగ నిర్మింపఁబడిన లావులవంతెనమీఁదుగా నీటికాలువ ప్రవహించునటుల నీఆక్వెడక్టులు నిర్మింపఁబడుట రోమకపురికొండల యుపరిభాగములం దిక్కాలమునుండి నివాసగృహములు నిర్మింపఁబడసాగెనఁట. నేఁటికిని రోమకపురికి నీటివసతి యధికముగనే యున్న దందురు. రానురాను రోమకపురియుఁ బెరుఁగుచున్న యితరపట్టణములందు వలెనే నగరముఁ జుట్టిన దుర్గముపెలుపల నన్నిదిక్కులందుఁ బెరుఁగుట కారంభమై, గృహనిర్మాణములు కాఁసాగెను. ఎచటఁ దవ్విన నచట దాహోదక మవ్వారిగ నూతులందుఁ బడుఁబల్లఁపుప్రదేశ మగుట, నిట్లు పెరుఁగుట కాటంకముఁ గలుగుండె నందురు.

జూలియస్‌సీజరు చక్రవర్తి 'ఫోరమ్-రూమేనమ్' అనుగొప్పకట్టడమును నిర్మించినవాఁడు. నాఁడే కేపిటోల్‌గుట్టకు, క్విరినాల్గుట్టకు, నడుమ నాకపోకలప్పు చక్కనిబాట నేర్పఱచి వేయించెనఁట. రోమకపురిపొడవునను టైబరునదీతీరమునకు గట్టుఁబోయించి, బలపఱచి, ముంపునుండి నగరభాగమును రక్షించెనందురు. పాంపీపట్టణ మీ మహారాజుకాలముననే ప్రారంభింపఁబడి నిర్మింపఁబడినది. నగరమున కుత్తరదిశయం దుండిన గొప్ప బయలు ప్రదేశము టైబరునది పొంగినకాలమున ముంపుకగుచుంట వదలివేయఁబడియుండ నత్తావున టైబరునదికి ముంపుదుగట్టు వేయఁబడుట నిర్బాధకమైనకతన, నందు బాటలు వేయించి, పట్టణమందు వ్యాపించ నేర్పాట్లుచేసెను.

తరువాత రాజ్యమునకువచ్చిన ఆగస్టస్ చక్రవర్తి, ప్రారంభింపఁబడినపనుల నన్నిఁటినిఁ బూర్తిచేయుచు నగరసౌందర్యమునకుఁ గారకుఁ డాయెను. ఆమహారాజుకాలముంగూర్చి యిట్లు చెప్పఁబడినది. He found Rome of bricks and left it of marbels, అనఁగా నాయన సింహాసన మెక్కుతఱి రోమకపురి యిటుకలతో నిర్మింపఁబడి యుండ, ఆయన చనిపోవువఱకు మార్బెలురాళ్ళ నిర్మితమైయుండెనని వివరింపఁబడినది.

ఆయన యెనుఁబది గొప్పదేవాలయములను పున ర్నిర్మాణ మొనర్చెనఁట. అందు, పేలటైనుగుట్టపై నేఁటికిం గాననగుచున్న అపోలోదేవస్థాన మొకటి యై యున్నది. ఈయనపాలనముననే నగరము పరి పాలనార్థముగఁ గోటలోనెన్మిదియు, బయి వెల్పట నున్నవియు, నది కిరుదెసలనున్న వర్తకభాగ మొకటియు, పదునాలుగు ఖండములుగ విభ జించెనఁట. పోలీసుసిబ్బంది నేర్పఱచి, పైరు బ్రిగేడువసతిం గూర్చెనఁట. టైబరునది యుభయ తీరములను చక్కఁగ బంధించి గట్టులం బలపఱచి, ముంపుబాధలు లేకుండఁ గాచి స్నానగృహములను (Public baths) నిర్మించెనఁట.

ఇంతఁదనుకఁ జక్రవర్తులనివాసము పేలటైను గుట్టపై నుండిన లివియాగృహమునం దుండెనఁట. అది యొకపాటి సామాన్యమగునది మాత్రమే. ఆగస్టసుచక్రవర్తియు నందే నివసించెను. తర్వా భూపతులు తమనివాసమునకు గొప్పగొప్ప సుం దరభవననిర్మాణము లొనర్చుకొనుచుండిరి. నీరో చక్రవర్తి పేలటైనుగుట్టయు, ఎస్క్విలైనుగుట్ట యు నడుమప్రదేశముం గల్పి తనయావరణ మేర్ప ఱచి యందుఁ దనవాసముగ స్వర్ణభవనము నిర్మిం చెనఁట. అది యిప్పటి వెటికాన్భవనముకన్న గొప్ప దిగ నుండె నందురు. (వెటికాన్భవనము చూడుఁ డు). అక్కాలమున రోమకపురియందుఁ దఱ చుగఁ గల్గుచుండిన యగ్నిబాధల నాయన దీనికై యుపయోగించుచుండ నాయన యగ్నిప్రమాద ములకుఁ గారకుఁడేమో యని యొకకింవదంతి వ్యాపించియుంటఁ గాననగును.

పిదప వచ్చినఁ జక్రవర్తులలో వెస్పెసియను గారు తనపూర్వు లాక్రమించిన విస్తారప్రదేశ ముల నొక 'amphi theatre' ఒకటియు, 'collosium' ఒకటియు గొప్పకట్టడములం గట్టించెను. కొల్లోసియ ముండినతావు తొల్లి యుద్యానవన కాసారము యుండె నందురు. ఒక Forum నిర్మించెనఁట. కాపిటోలుగుట్టపై జూపి టర్ దేవళమును గట్టించెనఁట. ఆయన రెండవ సుతుఁడు డొమిటియన్గారు పేలటైనుగుట్టపై గొప్పప్రాసాదమును తనకై నిర్మించుకొనె నం దురు. డొమిటియన్చక్రవర్తి వేఁటాకక్రీడాస్థల ము నిర్మించెనఁట. గాని తర్వాతిభూపతియగు నెర్వాగారికాలమున నది పూర్తియాయె నందురు. ట్రాజన్భూపతి యాకొండను నూఱడుగులయె త్తుగ నుండునట్టుల నరికించి సమతలముగఁ జేర్చె నఁట. ఈతని జయశాసనస్తంభ మొకడ బొమ్మలతో శాసనము వేయించి యున్నాఁడు. ఆయనయే వేఁటాక నీటిఆక్విడక్టు కట్టించె నందురు. స్వర్ణభవన ముండినతావునఁ గొన్ని స్నానగృహము లీయన నిర్మాణములని చూపుచున్నారు.

పిదప టిటస్ రాజ్యమునకు వచ్చెను. ఆయన జరూసలేముపై దండయాత్ర సల్పి, యెహోవా దేవళమును నాశనొనర్చినవాఁడు. పిమ్మట హాడ్రి యన్ రాజ్యమునకు వచ్చి, పెక్కు కట్టడములను గట్టించెను. టిబోలికడఁ దనకొక నివాసభవనము, వెనస్ రోమీదేవళములును, ఇప్పుడు కాననగు చున్న సెంటియాంజెలోకట్టడము నొకవంతెనయు, నీ యనకాలమున బనులని చెప్పఁబడినవి. మేరియస్ ఆరేలియసునృపతియు గొప్ప భవననిర్మాతయై యుండెను. సెప్టిమియసు, సెవరసున్బానాథుఁడు భవననిర్మాతలుగఁ బేరందిరి.

ఇంక రోమకసింహాసనమునకు వచ్చిన ప్రతి వారు నేదో కట్టడములం గట్టించిరని చెప్పుటకన్న నందఱును పురనిర్మాతలే యనుటయే సమంజ సము. వారిలోఁ బ్రత్యేకముగఁ జెప్పఁదగినవారిలో ఆరేలియనుభూపతి యొకఁడు. ఈయన రోమక

పురింజుట్టి యొక కాంక్రీటుగోడలకోట గట్టింప మొదలిడెను. దానిని తరువాతవారగు ప్రోబసూభ పతి పరిపూర్తి జేసెను. అవి నేటికిని గలవు.

ఇంతదనుక బూర్వకాలపురోమకపురి యని చెప్పదగును. క్రీ. పూ. ౨౮౩ లో రోమకపురి యగ్నిప్రమాదముచే గొప్పనష్టము నందెను. అప్ప టినరపాలుండగు డియోక్లేటియన్ పెక్కుభవన ములను దిరుగ నిర్మించెనని చెప్పబడినది.

క్రీ. శ. ఒకటవశతాబ్దమున క్రైస్తవమతావేశ మధికమయియుండి, సెంటుపీట్రో, సెంటుపాలో, సెంటులోరింజో క్రైస్తవదేవాలయములు నిర్మిం పబడుటతోను, బాటలవెంబడి భూమిలోనికి గుహలు (Catacombs) త్రవ్వంబడుచు, క్రైస్తవమతభక్తుల నివాసములుగ వాడబడుచుం డెను. తరువాతకాలమున గొన్నికూరిజాతులు రోమకపురిపై దండెత్తిరా, యుద్ధములు సంభ వించెను. వారు నీటికాల్వకట్టలను భగ్న మొనర్చ, గుట్టలపై భాగములందు గట్టబడిన పట్టణభాగ ములు నీరులేక వదలివేయబడి పాడవ మొదలి డెను. క్రీ. శ. తొమ్మిదవశతాబ్దమధ్యకాలమున సంభవించిన భూకంపము రోమకపురికి గొప్పనాశ ము గల్గించి నగరమును బాడుచేసెను. ఇంతద నుక మధ్యకాలపురోమకపురి యని చెప్పనగును.

పిదప దేశప్రభుత్వము పోపుజగద్గురుల వశ మాయెను. తరువాత రాజ్యము విక్టరు ఎమాన్యు అల్ గారివశమై తిరిగి రాచరికముకల్గెంగాని పురాభి వృద్ధియన్నను తొల్లింటివై భవ మస్తమించె ననియే చెప్పవలయును. ఇక్కాలమున గోట గోడలవెలుపల వయాలప్పియా కిరుదెసల వృక్ష శాస్త్రసంబంధోద్యానవనము నిర్మింపబడినది కలదు. ౧౮౭౦ నాటికి జనాభా రెండులక్షల యిరు వదియాఱువేలకు దగ్గియుండెననియు దరువాత నభివృద్ధియగుచున్నదనియు నందురు. ఇక్కాలమున నందెక్కువ మ్యూజియములు, ఆర్టుగేలరీలు, నధిక ముగ గలవు. (ఇటలీదేశము చూడుడు).

## రోమకపురియందలి కోలీసియమ్:-

ఇటలీదేశములోని రోమకపురియందు జకరి వర్తులచే నిర్మింపబడిన గొప్పకట్టడ మడవిమృగ ముల కలహప్రదర్శనములు మొదలగువాని వినోద కార్యప్రదర్శనములకై నిర్మింపబడినది. చూపరులు కూర్చుండుజాగా లన్నియు మార్బిల్‌రాతి పలకలతో గప్పబడియుండె నట. కాలములు మారి, కోలీసియమ్ పాడుపడుచుండ నామార్బిల్ పలకలు మాయమైన వందురు. ఇక్కాలమున నైనను దానిపాడచ్చెరువు గొలుపుచుండెడిని. ఐదంతస్థుల గుండ్రనిగొప్పభవనమువలె గన్పించు నీకట్టడము బాగున్నదినములలో బురమునకే గాక సామ్రాజ్యమునకంతకు నలంకారమో యనున ట్లుండెనేమో యనిపించెడిని. ఇది ఓవల్ షేపున ౨౦౫ గజములపొడవు, ౧౭౦ గజములు వెడలు పును గలది. మధ్యకాలములందు బ్రపంచము నందలి వింతలలో నొకటిగ జెప్పబడినది. దీని పైకప్పు వేయబడనే లేదనియు, అవసరములందు బట్టలు కప్పుచుండునేర్పాటు గలిగి యుండెననియు నచటివా రనెదరు.

## రోమకపురి లేక రోమునగరము:-

ఇటలీదేశము చూడుడు. అందు పాపాల్‌స్టేటు నందున్ననగర మిటలీదేశపురాజధాని. దీనిని క్రైస్తవులు 'హోలీసిటీ' యనుచున్నారు.

## రోమక సామ్రాజ్యపు మొదటి భూపతి:.

(సీజరు ఆగస్టసు చక్రవర్తి చూడుడు.)

## రోమనుల బాటలకొలత లెక్క:—

ఇం దొక మైలునందు వేయి మిల్లి 'పెస్స్యూస్' లుండును. (mille passui) మిల్లీపాస్స్యూము నాంగ్లమున 'double paces' అనుచున్నారు. ఇంక మిల్లీ యనిన మైలని యర్థము. నడచుతఱి నూనియున్న పాదముఁ (అడుగు) దనుక నుండు ప్రదేశమున కాంగ్లమున 'pace' అనెదరు. దీనిని డ్రిల్లు (drill) చేయు నాంగ్లవిధానగ్రంథములందు ముప్పదియంగుళములుగను, కొన్ని యితరలెక్కలందు 33 గను, వేఱుతావుల సింకె నెక్కువగఁ గూడ లెక్కింపఁబడియున్నది. కాని రోమనులు తమబాటలకొలతలం దైదడుగులకుఁ దక్కువగ నొకమిల్లిపేసముగను, అట్టివి వేయి యొక మైలు గనువాడిరి. కొందరు రోమనుమైలునందు ౧౬౨౦ గజములుగ లెక్కించిరి. అట్లగునేని ఇంగిలీషులెక్క మైలునకు నూఱునలువదిగజములు లేక ౪౨౦ అడుగులు తగ్గియుండవలెను. అగునేని రోమనుమైలు మిల్లిపాసస్‌నందు నాలుగడుగుల తొమ్మిదంగుళములు పైచిలుకుండియుండును.

ఇంక రోమనులనాఁటి యడుగుకొలత విచారించుట సమంజసము. 'Luigi Canina' యను పేరుఁగల యిటలీదేశపుఁబరిశీలకుఁ డీకొలతల సందర్భమునఁ జిరస్మరణీయుఁడు. ఆయన ౧౭౯౫-౧౮౫౬ కాలమునాఁటివాఁడు. ఆయన రోమకపురియందలి Antonine Columu ను, Trajan Columu ను రెండుస్తంభములం గొలిచ్చి దిమ్మలకుఁబై గానున్నస్తంభములపొడవు రెండింటికి నొకేవిధముననుండఁ గన్గొనియెను. ఇవి రోమనులెక్కను నూఱడుగు లుండెను. ఇవి రోమను అడుగులని యెఱుంగవలయు గాని, యింగ్లీషు లెక్క ౧౨ అంగుళముల యడుగులు కావనిభావము. పిదప నాతఁడే యీలెక్కమేరకుఁ గొలతఁ గొల్చి నినుపతీఁగెలనొలుసులం జేయించి సుప్రసిద్ధమగు 'అపియన్ వే [బాట] ను పండ్రెండు మైళ్ళదనుకఁ గొలిచి, మైలు మైలుకడను కొలత రాళ్లు బయల్పడుచుంటఁ గన్గొనియెను. ఇంక నా బాటయందు వారి మైలుమైలుకడ నేదోయొక కట్టడము బయల్పడుచుండ నఁట.

## రోమను న్యూమరికల్ గుఱుతులు:-

| | | |
|---|---|---|
| 1 | అంకెకు గుఱుతు | I |
| 2 | ,, | II |
| 3 | ,, | III |
| 4 | ,, | IV |
| 5 | ,, | V |
| 6 | ,, | VI |
| 7 | ,, | VII |
| 8 | ,, | VIII |
| 9 | ,, | IX |
| 10 | ,, | X |
| 11 | ,, | XI |
| 12 | ,, | XII |
| 13 | ,, | XIII |
| 14 | ,, | XIV |
| 15 | ,, | XV |
| 16 | ,, | XVI |
| 17 | ,, | XVII |
| 18 | ,, | XVIII |
| 19 | ,, | XIX |
| 20 | ,, | XX |
| 21 | ,, | XXI |
| 22 | ,, | XXII |
| 23 | ,, | XXIII |
| 24 | ,, | XXIV |
| 25 | ,, | XXV |
| 26 | ,, | XXVI |
| 30 | ,, | XXX |
| 40 | ,, | XXXX |
| 50 | ,, | L |
| 52 | ,, | LII |
| 54 | ,, | LIV |
| 55 | ,, | LV |
| 56 | ,, | LVI |

| | | |
|---|---|---|
| 60 | ,, | LX |
| 65 | ,, | LXV |
| 70 | ,, | LXX |
| 75 | ,, | LXXV |
| 80 | ,, | LXXX |
| 89 | ,, | LXXXIX |
| 90 | ,, | XC |
| 94 | ,, | XCIV |
| 97 | ,, | XCVII |
| 99 | ,, | XCIX |
| 100 | ,, | C |
| 105 | ,, | CV |
| 110 | ,, | CX |
| 111 | ,, | CXI |
| 190 | ,, | CXC |
| 200 | ,, | CC |
| 220 | ,, | CCXX |
| 224 | ,, | CCXXIV |
| 300 | ,, | CCC |
| 320 | ,, | CCCXX |
| 400 | ,, | CD |
| 500 | ,, | D |
| 600 | ,, | DC |
| 800 | ,, | DCCC |
| 896 | ,, | DCCCLXXIV |
| 970 | ,, | CM |
| 999 | ,, | CMXCIX |
| 1000 | ,, | M |
| 1500 | ,, | MD |
| 1800 | ,, | MDCCC |
| 2000 | ,, | MM |
| 2015 | ,, | MMXV |

ఈగురుతు అంకెలకుఁ దలపై అడ్డగీతలు గీచినయెడల నాయంకెవిలువకు వేయిరెట్లధికవిలువకర్థమగునని యెఱుంగునది.

ఉదాహరణములు.

| | |
|---|---|
| $\overline{V}$ | ఐదువేలు |
| $\overline{VII}$ | ఏడువేలు |
| $\overline{X}$ | పదివేలు |
| $\overline{XII}$ | పండ్రెండువేలు |
| $\overline{L}$ | ఏఁబదివేలు |
| $\overline{LX}$ | అఱువదివేలు |
| $\overline{C}$ (నూరువేలు) | ఒకలక్ష |
| $\overline{CL}$ (౧౫౦౦౦౦) | ఒకలక్షాఏఁబదివేలు |
| $\overline{D}$ (౫౦౦౦౦౦) | ఐదులక్షలు |
| $\overline{DD}$ | పదిలక్షలు |
| $\overline{M}$ (౧౦౦౦౦౦౦) | ,, |
| $\overline{MM}$ | ఇరువదిలక్షలు |

అంకెవేయఁబడినది (Numbered) అనుటకు గురుతు.

**(?) రోమను కాతలిక్కు క్రైస్తవ మతాధ్యక్ష పరంపర:**—వీరిని సర్వసాధారణముగ Pope అని బిరుదనామమున వాడుచున్నారు. లాటిన్‌భాషాపదముకు 'Pappa' అనియును, జర్మనుభాషాపదముగ 'Pappas' అనియును (గౌరవార్థకముగఁ దండ్రి యని యర్థము. ఈమహాత్ములకుఁ బూన్చుయగు బిరుదనామములకు official rilegeous tittles అనియెదరు).

1 Bishop of Rome and Vicar of Jesus christ
2 Successor of. St. Peter
3 Prince of the Apostles
4 Supreme Poutiff of the universal church
5 Patriarch of the west
6 Primate of Italy
7 Arch Bishop of and metropolilan of the Roman Provinces
8 Sovern of the Temporal demenious of the Holy Roman Church

అనినియు యున్నవి.

పోపుమహాత్ముఁడు Pontefex mixemu (అనఁగా Supeme Pontiff) గాన తనమత ధర్మము క్రిస్టిటికిని సర్వాధికారి యని తలంచెడిని. గాని యిటలీయైక్యతనాటనుండి యీయనప్రభుత్వఁపుసరిహద్దులు తగ్గి, వెటికాన్ భవనము టాటరాన్ Custil Gondolfo Villa (రోమకపురిలో నిది) కొలఁదిపాటిరాజ్యమునకు మాత్రముఁ జెందుచుంట నామాత్రమునకే యీయన భూపతియై యున్నాఁడు. (వెటికాన్ చూడుఁడు).

పోపులు కార్డినల్సుచే నెన్నుకొనఁబడి సెంటు పీటర్సు కెతీడ్రల్ దేవస్థానమున నభిషిక్తుఁ డగును. అత్తఁడు బూర్వసాంప్రదాయముమేరకు భిషపులందఱాయనను చేతులతో తాకెదరఁట. ఆమహాత్ముఁడు తనకుఁ దాను తెలుపుకొనుతఁడు బరమేశ్వరునిసేవకుల సేవకుఁడ నని వచించును.

౧ Clement V - ౨ John XXII - ౩ Benedict XII - ౪ Clement VI - ౫ Innocent VI - ౬ Vrban V - ౭ Gregory XI అను ఏడుగురు పోపుదేశికులును St. Peter మహాత్ముఁడునహా Avignon నివాసులనియు, పదుగురు Anti popes ను, Clement VII – Bendict XIII – Clement VIII – Felix V. గార్లు (నల్వురు పోపులును) Avignon నందు స్థానము మాత్రముండినదనియు, వీరు గాక రోమునుపోంటిఫ్పదవి నందినవారు. ౨౫౯ మంది యనియుఁ జెప్పఁబడినది. అందు ముఖ్యులు కొందఱును తక్కినవారు నిందు వివరింపఁ బడియున్నారు.

రోమన్కాతలిక్కు క్రైస్తవమతాతిశయములు. ఈమతస్థులు తమమతాతిశయములను నాల్గు వివరింతురు. వీ రధికసంఖ్యాకులని చెప్పఁబడినవారు.

1 One in Doctrine sacraments and Govt.

2 Holy with a sanctity of life and cheeracter arising espicially out of the sacramental system.

3 Catholic- as its members are found in every part of the word.

4 Apostolic threw an unbroken succession going back to the Apostle Peter.

POPES OF ROME SINCE 1378.

Urban VI, April, 1378- Oct 1389
Boniface IX, Nove, 1389- Oct, 1404
Innocent VII, Oct, 1404- Nov, 1406.
Greogry XII, Nove, 1406- July, 1415.
Alexander V, June, 1409- May, 1410.
John XXIII, May' 1410- May, 1415.
Martin V, Nove, 1417- Feb, 1431.
Eugenius IV, March, 1431-Feb-1447.
Nicholas V, March, 1447- March, 1455.
Calixtus III, Apr, 1455- Aug, 1458.
Pius II, Aug, 1458- Aug, 1464.
Pauls II, Aug, 1464- July, 1471.
Sixtus IV, Aug, 1471 - Aug, 1484.
Innocent VIII, Aug, 1484- July, 1492.
Alexander VI, Aug, 1482- Aug, 1503.
Pius III, Sep, - Oct, 1503.
Jelius II, Nov, 1503- Feb, 1513.
Leo X March, 1513- December, 1521.
Adrian VI, January, 1522- Sept, 1523.
Clement VII' Nove, 1523- Sept, 1534.
Pual III, Oct, 1534- Nove, 1549.
Julius III, Feb, 1550- Mar, 1555.
Marcellus II, Apr, 1555.
Paul IV, May, 1555- Apr, 1559.
Pius IV, Dec, 1559- Dec, 1565.

Pius V, Jan, 1566- May, 1572.
Gregory XIII, May, 1572- Apr, 1585.
Sixtus V, Apr, 1585- Aug, 1590.
Urban VII, Sept, 1590.
Gregory XIV, Dec, 1590- Oct, 1591.
Innocent IX, Oct, - Dec, 1591.
Clement VIII, Jan, 1582- Mar, 1605.
LEO XI, Ar, 1605.
Paul V, May, 1605- Jan, 1621.
Gregory XV, Feb, 1621- July, 1623.
Urban VIII, Aug, 1623- July, 1644.
Innocent X, Sept, 1644- Jan, 1655.
Alexander VII, Apr, 1655- May, 1667.
Clement IX, June, 1667- Dec, 1669.
Clement X, Apr, 1670- July, 1676.
Innocent XI, Spet, 1676- Aug, 1689.
Alexander VIII, Oct, 1689- Feb, 1691.
Innocent XII, July, 1691- Sept, 1700.
Clement XI, Nov, 1700- March, 1721.
Innocent XIII, May, 1721- March, 1724.
Benedict XIII, May, 1724- Feb, I730.
Clement XII, July, 1730- Feb, 1740.
Benedict XIV, Aug, 1740- May, 1758.
Clement XIII, July, 1758- Feb, 1769.
Clement XIV, May, 1769- Sept, 1774.
PLUS VI, Feb, 1775- Aug, 1799.
Pius VII, March, 1800- Aug, 1823.
Leo XII, Sept, 1823- Feb, 1829.
Pius VIII, Mar, 1829- Nov, 1830.
Gregory XVI, Feb, 1831- June, 1846.
Pius IX, June, 1846- Feb, 1878.
Leo XIII, Feb, 1878- July, 1903.
Pius X, Aug, 1903- Aug, 1914.
Benedict XV, Elected Spet. 41, 014.

The more important popes are referred separetely under their respective official names.

The term Black Pope, applied to the general of the sociity of Jesus, is derived from his black dress. See Anti-Pope; History Infallibility; Papa; Papacy; Rome; Temporal power; Vatican.

**రోమన్టోగా:**—రోమనులుధరించు పోలిక పెద్దకోటులు, విగ్రహములంజేయుఁ గళాశాస్త్రజ్ఞులిక్కాలంపు టాంగ్లప్రముఖులు ధరించు దుస్తులెక్కువ రమ్యముగ నుండునవి కావనియు, ఒక తావున నుంచి దూరదృష్టి కగుపడునట్లుఁ గూడఁ దనరుచుండఁదగిన విగ్రహములగు తొల్లిరోమనులు ధరించు పెద్ద పొడవుగలకోటులు (long coats) చక్కఁగ నమరుననియుఁ గనిపెట్టిరి గాన నా కోటును ధరించినట్లు చెక్కి సిద్ధపఱచెదరు.

ఇంకను నిండుఁ బనియు, శ్రమయుఁ దక్కువ పట్టును. దీనికి రోమన్టోగా(Roman 'Toga') యందురు. స్త్రీలవిగ్రహములకు వారిదుస్తులే పొడవుగనుండునుగాన నీటోగా యవసరమే లేదు. ఇంక రారాజులు, సైన్యాధిపతులు మొదలగు వారికి వారిప్రత్యేకదుస్తులే విధి. ఇంక నీటోగా పాలితులగు ప్రముఖులకే యని తేలుచున్నవి. (టోగా చూడుఁడు).

**రోమపాదుఁడు:**—ఈపేరుఁగలవా రిర్వురుఁ గాన నగుచున్నారు. అంగభూపతులలో దశరథుఁడను నామాంతరముఁ గలవాఁ డొకఁడు రోమపాదుఁడు. ఈతనిసుతుఁడు చతురంగుఁడు. ఈతఁడే శ్రీరామునిసోదరియగు శాంతాదేవిని దత్తుఁ దీసికొనినవాఁడు. (ఆమె ఋష్యశృంగునిభార్య).

మఱియు యదుసంతతిలోని విదర్భుని మూఁడవసుతునిపేరును రోమపాదుఁడే. చతురంగున కతిరథుఁ డనియుఁ బేరు కలదఁట. (అంగదేశము చూడుఁడు.)

**రోమశుఁడు:**—ఋషి. ఇంద్రుని పంపున 'అర్జునుఁడు నాకలోకమున నున్నాఁ' డని యుధిష్ఠిరునకుఁ దెలిసి యతనిచేఁ దీర్థయాత్ర యొనర్పఁ జేసినవాఁడు.

**రోమహర్షణ మహర్షి:**— ఈతఁడు వ్యాస మహర్షి శిష్యుఁడగు సూతునిసంతతివాఁడు. వైశంపాయనునివలనఁ బురాణగాథల నెఱింగినవాఁడు. కుమారునిపే రుగ్రశ్రవసుఁడు. భాగవతమునఁ గలదు.

**రోమునగరము:**— (రోమకపురినిర్మాణ చరిత్ర చూడుఁడు.)

**రోమ్యూలియ న్కేలండరు (Romulian Calendar):**— రోమన్సంవత్సరము నందలి కాలవిభజనముం దెలుపు కేలండరు. దీనిని రోమకపురీనిర్మాతయగు రోమ్యులస్ ప్రభుండు రచించె నందురు. ఇందు సంవత్సరమునకు ౩౦౪ దినములును, ఇవి పదిమాసములుగను విభజింపఁబడి యుండెను. పిదప న్యూమాపోంపిలియసుగారు మఱిరెండుమాసములం జేర్చిరఁట. దానితో వత్సరమున ౩౬౫ దినము లేర్పడియె నందురు.

**రోమేన్సుభాషలు (Romance Languages):**— ఒకప్పుడు రోమకసామ్రాజ్యమునకుఁ జెందియుండిన యిప్పటి యైరోపాఖండఁపుఁ బశ్చిమదేశములు, దక్షిణదేశములందు వాడఁబడుచున్న భాషల కీపేరు కలదు. అవి యన్నియు లాటిన్ భాషాజన్యములు.

352*

౧ ఇటాలియనుభాష:— లాటిన్భాషాజన్య మనుటకు సార్థకముగ మాతృభాష కించుక భేదముతోఁ బోలికం గల్గియుండు భాష.

౨ స్పానిషుభాష:— analytic సాంప్రదాయముఁ గలది. అరబ్బీపదసంబంధ మీభాషకుఁ బోర్చుగీసుభాషలయందుఁ గానవచ్చెడిని.

౩ పోర్చుగీజుభాష:— ఎనలైటిక్కు సాంప్రదాయముఁ గలది. అరబ్బీపదసంబంధ మీభాషకు, స్పానిషుభాషకుఁ గలదు.

౪ ప్రోవిన్షలుభాష:— కేటలానుభాషాపదములతోఁ గలసియున్నది. తొల్లింటి రోమకసామ్రాజ్యభాగముగ నుండి యిప్పు డధికభాగము ఫ్రెంచిదేశమునకుఁ జేరియున్న 'ప్రోవి' న్సను పేరుఁగలసీమయందు వాడఁబడిన భాష యని భావము. ఛార్లెమాగానుచక్రవర్తి పరిపాలనరాజ్యమునం దీప్రోవిన్సుసీమ యుండెడిది.

౫ రైటోరోమనిక్కు భాష:— ఇది గ్రిసన్సుసీమ, తిరోల్సీమలందుఁ బ్రచారమునం దున్నది. అధికముగ వాడఁబడుచున్నభాష కాదు.

౬ ఫ్రెంచిభాష:- దీనియందు సెల్టిక్కు పదసంబంధముఁ గాన నగుచుండును. వాడుకయందు divergences అధికముగ నవలంబించినభాష.

౭ రూమేనియనుభాష:— ఈభాషలోనికి స్లావోనిక్ పదము, టర్కీభాషాపదములు, గ్రీకుపదములు, ఇల్యిరిక్ లో అల్బేనియనుపదములు చేరియుంటఁ గాన నగును.

ఈభాషలు పరిశుద్ధమగు గ్రాంధికలాటిన్భాషాజన్యములు కావు. జనసామాన్యమం దధికముగఁ

బ్రచారము నందియున్న గాల్లియ్యలాటిన్భాషనుండి కల్గినవి. ఆభాషకు 'linguaromana' అని పేరుండెను. ఈభాషలందుఁ దరతరములుగ వాడఁబడుట నించుక భేదరూపములం గల్గియున్నలాటిన్ భాషాపదసముదాయము ప్రధానపదసముదాయముగ నుండును. (ప్రోవిన్సుసీమ చూడుము.)

## రోయలిటీ (Royalty):—

యజమానికిచ్చునది యని యర్థము. గనులఁ ద్రవ్వువారు భూమియజమానికిచ్చుకట్టుబడికిని, ఒకవస్తువును Patent చేయుటకుఁ గట్టినట్టి మూల్యమునకును, ఒకపుస్తకమును వ్రాసిన (గ్రంథకర్తకు) వేఱొకరచ్చువేసి యమ్ముకొనుహక్కుఁ గల్పించుకొనినిచ్చుమూల్యము మొదలగువాట్లను 'Royalty' అనెదరు.

## రోయల్‌సొసెటీ సంఘము:

ఇంగ్లీషువారిలోఁ బ్రధానమగు విద్యాధికుల సంఘముగాఁ బేరందినది. క్రీ. శ. ౧౬౬౨ లో స్థాపింపఁబడి ౧౬౬౫ సంవత్సరములో రెండవఛార్లెసు భూపాలునివలన, ఛార్టరునుండి యామోదింపఁబడినది. సైంటిఫిక్ రీసెర్చినిఁ బ్రోత్సహించుచును, మెప్పులను, బహుమానపతకములును నొసంగుచుండును.

స్కాట్లండుదేశమునందలి యెడింబరోనగరమున నిట్టిసంస్థయే వేఱొకటి కలదు. అదియు నిట్టిపనులనే నెఱవేర్చుచున్నది.

## రోరింగుఫార్టీస్:— (Roaring forties):—

ఇవి గాలులు భూమధ్యరేఖ కుత్తర దక్షిణములందు ౪౦ మొదలు ౫౦ డిగ్రీలవఱకుఁ గల ప్రదేశముల గాలులు స్థిరముగను, బలముగను వీచెడిని. ఇవి సముద్రముపై నైనచో మిక్కిలి స్థిరముగను, బలముగను, వీచును గాన నావికులు వీట్లను 'roaring forties' అనెదరు. (వాయువు చూడుఁడు).

## రోలింగుస్టోకు (Rolling stock):—

రెయిల్వేలు,, ట్రామ్వేలు వీట్లయందు నడిపింపఁబడు నన్నిదినుసులబండ్లకు నెంజనులు (చక్రములపైఁ బర్విడు నన్నిబండ్లకు) మొదలగువాట్లకీ పేరు వర్తించును.

## రోలు మద్దెలతో మొఱ్ఱఁ బెట్టుకున్నట్టు- (రోలు కొక పార్శ్వముననే దెబ్బ; మద్దిల కిరుపార్శ్వములందు దెబ్బయే):

(ఆంధ్రలోకోక్తి).

## రోవాయుధగోత్రము:—

(అగస్త్య ఉపగణము చూడుఁడు.)

## రోషనియాతెగమహమ్మదీయులు:-

వీ రాఫ్ఘనిస్థానసీమలందుఁ గాన నగుచున్నారు. ఒకబోధకుఁడగు (మెస్సయా) ప్రవక్త రాఁ గలఁడని నమ్ముచుండెడివారు. ఆత్మోజ్జీవనము, దైవసంయోగధర్మములు నమ్మువారు. మానసికాభ్యాసములే దైవసన్నిధింగూర్చి ప్రాతులుగ నొసర్చు నందురు.

(మహమ్మదీయమతము చూడుఁడు. మెహదావీతెగ మహమ్మదీయులు చూడుఁడు):

## రోసనూరి వెంకటపతి కవి:-

ఆంధ్రకవులలో నాధునికునిగఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. కాశ్యపసగోత్రుఁడు. వేంకటగిరిసంస్థానాధిపతియగు కుమారయాచభూపాలునివలన "తిక్కయజ్వ" యని బిరుదము నందిన యాస్థానకవి.

రచించినది 'విష్ణుమాయావిలాస' మహాపద్య కావ్యము. దీనిని వేంకటగిరిసంస్థానాధిపతి యగు బంగారు, యాచమనాయని ప్రభునకుం గృతి నొసంగెను.

## రోసియాక్షత్రియులు:—

(జౌహానులు చూడుఁడు).

**రోసెట్టాశిలాఫలకము:—** (Rosetta Stone):— ఇది యొక Black Basalt stone slab (శిలాఫలకము). పురాతనపుఈజిప్టు దేశపు hieroglyphic (or picture) వ్రాంత రూపకమున క్రీ. పూ. 196 సంవత్సరపు మెంఫిస్ శాసనము అనఁగా Ptolemy Epiphanes గారి గౌరవపుడిగ్రీ చెక్కఁబడి యున్నది. నెపోలి యనుగా రీజిప్టుదండయాత్ర వెడలినతఱి వారి యుద్యోగులు దీనిం గాంచి సరకుసేయక, వదలి పోయిరఁట. పిదప రెండుసంవత్సరములనాఁడు బ్రిటీషువా రలగ్జాండ్రియాఁ గైకొనినతఱి రోసెట్టాపురమునుండి దీనిం దెచ్చి లండనునగరమునందలి బ్రిటీషు మ్యూజియమునం దుంచిరి.

ఈశాసనపువ్రాంతలనుండియే యదివఱకుఁ దెలియక యుండిన పురాతనపు ఐగుప్తీయ 'hieroglyphic' అనఁబడిన Picture writing ను పోల్చఁగల్గిరి. ఇటులఁ బోల్చినది సుప్రసిద్ధుండగు ఫ్రెంచిదేశస్థుఁడు Champollion అనుపేరుఁ గలవాఁడు. ఆయనయే Egyptology కలను గన్పెట్టినవాఁడని చెప్పఁబడినది. ఆవ్రాంతకు 'Demotic Script' అనిపేరు.

**రోసెట్టాశిలాశాసనము:--** రోసెట్టా, డామియెట్టా యనుపట్టణము లాఫ్రికాలోని నైలు దీముఖద్వారముకడ నున్న రేవుపట్టణములు. రోసెట్టాపట్టణముకడ దొరకిన శిలాశాసనమును గూర్చిన చరిత్ర విచిత్రమైనది. అది యీజిప్టు (ఐగుప్తు) దేశచరిత్ర నెఱుఁగఁ జేయుటయే గాక 'Hjeroglyphics' అని యాంగ్లేయులచేఁ జెప్పంబడు చిత్రాక్షరభాష నెఱుఁగ దారిఁజూపెను. గాన భరతదేశసంబంధముఁగలది గాకున్నను, ప్రపంచజ్ఞానము నెక్కువగ నెఱుఁగఁగోరు నాంధ్రుల కెఱుకయగుట సమంజసము. చిత్రాక్షరభాష నింకను గొందఱు Picturewriting అనియు ననుటఁ గలదు.

ఆఫ్రికాఖండమును అంధకారఖండ (dark continent) మని యనుట యెల్ల రెఱింగినదే. అది దానింగూర్చి సరిగాఁ దెలియకుండుటచేఁగాని వేఱు కాదు. కాని క్రీస్తుమునుపు వేలకొలఁది సంవత్సరములకుఁ బూర్వ మైరోపాదేశము లెవ్వియు నాగరికతఁ జెందనినాఁ డీజిప్టు (తొల్లింటి ఐగుప్తుదేశము) నాగరికతఁ బడసి విగ్రహచిత్రములం జెక్కుట, చిత్రలేఖనము, వైద్యము, నిర్మాణకల (engeneering) మొదలగువాటి యందు నేర్పరియై యుంటఁ గణ్యాకగణ్యగ వినుచుండుట సర్వసాధారణమై యుండెను. నేఁటికి నా దేశపుఁబురాతననిర్మాణము లచ్చెరువుఁ గొలుపు నవిగ నున్నవి. యాత్రికులా దేశముంగూర్చి నుడివినకథ లత్యద్భుతములై యుండినవి. కాని, యా దేశ మేలినభూపతులు, దేశమందలి పనివాండ్రు మొదలగువారి చరిత్రలు సరిగా బయల్పడకుండినవి. ఆదేశస్థులలిపి, భాష లసలే సుబోధకముగా లేవు. ఇటుల నెపోలియన్ బోనపార్టీకాలముఁ దనుకఁ గడచెననియే చెప్పవలయును.

క్రీ. శ. ౧౭౯౮ లో నెపోలియన్ బోనపార్టీ యీజిప్టున కరిగియుండ నాయనయుద్యోగులలో నొకరు రోసెట్టాపురపరిసరముల సెంటుజూలియన్ దుర్గము (కోట) కడ నొకపెద్దరాతిం గాంచి,




Wonder world of Why and How ?—
A great New Illustrated Encyclopeadia for all ages.
PAGE. 55.

యది యేమో చూతమని పరిశీలింపఁ దీయించెను. అది నల్లశిల (black basalt). నాల్గడుగుల పొడవును, రెండడుగుల వెడలుపుఁ గలఫలకము. అది శిథిలమై యుండియు, దానిపైఁ గొంత శాసనరూపకమైన శాసన మున్నట్లు స్పష్టపడెను. అందు మూఁడుభాగములుగఁ ద్రివిధాక్షరము లుండినటులఁ దోఁచెను. దానిం గాంచిన నెపోలియనుగారును దాని నెఱుంగఁగోరి, దానినట్లే వ్రాయించి, ఆర్కియాలోజీవేత్తల కందఁజేసెనని చెప్పఁబడినది. వారిలో నొకరు Champallion పండితుఁడను పేరుఁ గల శాస్త్రవిముఁడు చక్కఁగఁ బరిశీలించి, యందలిమూఁడవ భాగఁపువ్రాఁత గ్రీకుభాషయనియు, రెండవభాగఁపు (మధ్యభాగఁపు) వ్రాఁత (Demotic) యనియుఁ బోల్చి తమప్రభున కెఱిఁగించెను. ఇచట 'డెమోటిక్' అనిన నీజిప్టుదేశఁపుభాషాలిపిగా నెఱుంగవలయును. ఆ రెండు నొకే సంగతి దెల్పునవిగా నాయన నందలిలిపిసందర్భములనుండి యూహించి, తక్కిన బొమ్మలవ్రాఁత (మొదటిభాగము) సైత మదే యర్థము నెఱుంగఁ జేయునదిగా నుండునని యాయన తలంచి, తన యభిప్రాయమును బయల్పఱచెను. ఆబొమ్మల

వ్రాతయే hiero glyphics లేక picture-writing అని పిదపఁ బేరందిన దాయెను. ఇది తక్కిన పరిశీలకులకు మార్గసూచకమై పిదపఁ జక్కని పరిశీలనలు నడచి, యీజిప్టు దేశపులిపి దొరకెను. క్రమముగ నీజిప్టుప్రదేశపు గోరీలు (సమాధులు) జ్ఞాపకచిహ్నములు, దేవాలయములంగూర్చి కథలు వెలికి వచ్చెను. తొలుత బొమ్మలతో భావముం దెల్పు పిక్చరురైటింగు వ్రాతలును, పిదప డెమోటిక్ అనఁబడుచున్న లిపియు, నైగుప్తీయులు వాడుచుండినటులఁ బరిశీలకులు దీనింబట్టియే పెక్కుశాఖలను బయల్వెట్టి వెల్లడింప నారంభించిరి. ఇటుల రోసెట్టాశిలాశాసనము పురాతనపు జైగుప్తుచరిత్రను బయల్పఱచెనని చెప్పఁబడుచున్నది. ఇప్పుడా శిలాఫలకము లండనునగరమందలి బ్రిటీషు మ్యూజియమునందీజిప్టియనూమ్ అనఁబడుభాగమునం దుంచఁబడియున్నది.

ఇంక నీజిప్టుదేశపు అబీడోస్ పురమున నొక గోడపై హైయిరోగ్లిఫిక్సువ్రాతలు కొన్ని కలవు. అవి నునుపుగఁ జేయఁబడినఁ బథకములుగ నున్న ప్రదేశములు. వీటికి Cartouches అని పేరిడిరి. అందు భూపతుల పేర్లు వివరింపఁ బడినట్లున్నవి. అవి సేటి I ప్రభునియాజ్ఞమేర కట్టింపఁబడిన వఁట. ప్రభువులపేర్లు వరుసగ నట వివరింపఁ బడియున్నవి.

**రోహణగిరి:**—సింహళద్వీపమున 'ఆడమ్సు పీక్' అను పేరఁ బరఁగుచున్న పర్వతశిఖరము. మురారియొక్క యనర్ఘరాఘవనాటకము, సప్తమాంకమున నిది సుమనకూటమని పేర్కొనఁబడినది. ఇట నొకపాదము కలదు. దానిని హిందువులు విష్ణుపాద మనియు, బౌద్ధులు బుద్ధపాదమనియు, మహమ్మదీయులు ఆదమ్ (మొదటి మనుష్యుఁడు) యొక్కపాద మనియుఁ బూజించుచున్నారు.

ఇటనుండి సూర్యో...న వింతదృశ్యమొకటి గాన నగును. గాలియందలి మంచు... దీపర్వతచ్ఛాయ కొంచెమునే పగుపడి తోడనే మఱుఁగుపడి మఱియొకసారి కనిపించి మాయమగును. కొండ నెక్కుటఁ గొంతకష్టతరముగనే యుండును. కొండదిగువను రత్నపురమను నూరు కలదు. ఇటఁ గెంపులు మొదలగు రత్నములు భూమియందు దొరకును. వాట్లవర్తక మిట జరుగుచుండును.

**'రోహణాచలలాభే రత్నసంపదః సంపన్నః' ఇతి న్యాయము:**— రోహణాచలము రత్నములమయమగు పర్వతమని చెప్పఁబడినది. అదియే స్వాధీనమగుచో రత్నములకుఁ గొదువయుండదని భావము.

**రోహదేశము:**—

(అపగదేశము చూడుఁడు).

**రోహిల్ఖండము:**—రోహిదేశ మన నాఖ్యానము. అట నివసించు నాఫ్ఘను తెగమహమ్మదీయజాతులలో నొకతెగవారగు రోహిల్లాలచే నాక్రమింపఁబడినకతన రోహిల్ఖండ మని పేరయ్యెను. అది యుత్తరపాంచాలభాగదేశము. అది యిప్పుడు తొల్లింటి యుత్తరపాంచాలమున కహిచ్ఛత్రపురము రాజధానిగ నుండెడిని. ఇప్పుడిందు చరేలీపురము ముఖ్యస్థానము.

(ఉత్తరపాంచాలము చూడుఁడు).

**రోహిగోత్రము:**—ఇది విశ్వామిత్రసంతతి. రోహిగణముగఁ జెప్పఁబడిన గోత్రము. విశ్వామిత్ర, మాధుశ్ఛందస, రౌహిణ యని ప్రవరరూపము.

**రోహిణము:**— అలంబత్ర్యముకడఁ గిరమునం దుండిన యొకవృక్షము. దీనిశాఖలందు

వాలఖిల్యులు పూర్వ మొకప్పుడు వ్రేలాడుచుఁ దపం బొనర్చుచుండిరంట.

మఱియు రోహిణ మను నొకపర్వతము కలదు. ఇందు రత్నములగను లుండెనని తెలియుచున్నది.

**రోహిణి:—** దక్షపుత్రిక. చంద్రునిభార్య. ఇరువదియేడు నక్షత్రములలో నొకటి. చంద్రునికిఁ బ్రియభార్య యని చెప్పఁబడినది. (ప్రభాసతీర్థము చూడుఁడు). వసుదేవుని భార్యలలో నొకతెయగు బలరామునితల్లి పేరు రోహిణియే.

**రోహిణీనది:—** ఇది చిన్న జలప్రవాహము. కపిలవస్తురాజ్యము, నేపాలదేశములనడుమ సరిహద్దుగాఁ బ్రవహించునది. ఒకప్పు డీప్రవాహోదకములను పంటపొలములకై దీసికొనుటఁగూర్చి కపిలవస్తుశాక్యులకును, నేపాల (దేశపుఁ గోలియరగణా) కోలులకును తగాదాలు కల్గి విరోధము సంభవించి, కలహము సిద్ధమగుతఱి బుద్ధుఁడు వారించి తగవుఁ దీర్చెనని జాతకము లనుగ్రంథములనఁ జెప్పఁబడినది.

**రోహిణీనక్షత్రము:—** ఆకసమున బండినిం బోలునటుల మూఁడునక్షత్రములు కలసియుండిన నక్షత్రసముదాయము. జ్యోతిషశాస్త్రగ్రంథములందు దీనికి విధిః, బ్రహ్మా, ప్రజాపతిః, చతుర్ముఖః, ప్రచేతః, పంకజాసనః, పద్మయోనిః, బ్రహ్మనామః, ఆత్మభూః, విధాతా యను మాటలు పర్యాయపదములుగ వాడఁబడియున్నవి. ఈనక్షత్రమునకు బ్రహ్మ యధిదేవత యనియు, మనుష్యగణనక్షత్ర మనియు, నూర్ధ్వముఖ పుంస్వభావనక్షత్ర మనియు, సర్పము, జవినిఱెంపక్కి, నేరెడుచెట్టు దీనిసంబంధము లనియు, ప్రవేశించిన నలువదిఘటికలపైఁ ద్యాజ్య [విషఘటికలు] మనియు, నేఁబదిఘటికలపై నమృతఘటికలనియు, నిది స్థిరస్వభావనక్షత్ర మనియుఁ జెప్పఁబడినది.

**రోహితకపురము:—** పంజాబునందు ఢిల్లీపురమునకు వాయువ్యదిశగా నలుఁబదిరెండు మైళ్ళదూరమున 'రోహితక్' అనుపేరఁ బరఁగుచున్న పురము.

దీనిని పాండవులలో నకులుఁడు జయించి, స్వాధీనపఱచుకొనినటుల మహాభారతము, సభాపర్వము, 32 అధ్యాయమునఁ జెప్పఁబడినది.

నాటిపురాతనపురి కిప్పుడు 'ఖోక్రాకోట' యని వాడుచున్నారు. ఇప్పటి రోహితక్ నవీనము.

**రోహిత (పుర) ము లేక రోహితాశ్వపురము:—** బీహారుదేశములో షహాబాద్ జిల్లాయందు 'రోహితాస్' అను పేరఁ బరగుచున్నది.

హరిశ్చంద్రచక్రవర్తి సుతుండగు రోహితాశ్వ మహారాజిటఁ గోటఁ గట్టె నందురు. దానిని, అందలి భవనములను, మాన్‌సింగుమహారాజు మరమ్మతుఁ జేయించుటఁ జేసి యట్లే యున్నవి.

రోహితాస్‌నందు రాజ్యపాలన మొనర్చిన రాజులవంశావళి మాన్సింగుభూపాలుని శాసనములందుఁ గానఁగుచున్నది.

**రోహితాయనగోత్రము:**
(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

**రోహితాయసగోత్రము:—**
(నిధ్రువగణము చూడుఁడు.)

**రోహితాక్షగోత్రము:—**
(శాలంకాయన గణము చూడుఁడు.)

## రోహిత్యాయనగోత్రము:—

(జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.)

## రోహిదేశము:—

(అపగదేశము చూడుఁడు.)

**రోహిల్ఖండుసీమ:—** ఇది హిందూస్థానీభాషయందు వాడుకనందిన పేరుగాన నాదిని రోహిల్లాఖండమని పేరె యుండును. రోహిల్లా లాఫ్ఘను తెగలకుఁ జెందిన యొక తెగమహమ్మదీయులు. వీ రాదేశఁపు సరిహద్దు కొండప్రదేశములనుండి పదునెన్మిదవశతాబ్దఁపుఁ బ్రారంభముననే యీసీమ కరుదెంచి యిట నివాసముఁ గుదిరినకతన నీప్రాంతసీమకు 'రోహిల్లాఖండ' మని పే రయ్యెనఁట. అక్కాలమునఁ బ్రాబల్యదశయందుండిన మహారాష్ట్రులతో వీరికి సరిపడక నయోధ్య దేశఁపునబాబు సురాజుద్దౌలాగారితో సఖ్యముఁ గుదుర్చుకొని, వారికి నలుఁబదిలక్షల రూప్యములు నెల కొక లక్షగ వాయిదాల మేరకుఁ జెల్లించుచుండుటకును, దానికిఁ బదులుగ నాయన సైన్యసహాయ మిచ్చి, రోహిల్లాలను మహారాష్ట్రుల బారినుండి తప్పించుటకును సంధి కొడంబడిరఁట. సైన్యసహాయమున మహారాష్ట్రులం దరిమివైచినఁ బిదపఁ గొంతకాల మటుల నవాబుగారికిఁ జెల్లించుచుండిరఁటఁ గాని పిదప స్థిరపడి బలముఁ జేకూర్చుకొని సొమ్ముఁ జెల్లింప నిరాకరింప, నవాబు పీరిస్థితిగతుల నారసి లొంగఁదీయుట ముస్తరమని తలంచి యీస్టిండియాకంపెనీ సర్వాధికారిగనున్న వారన్ హేస్టింగుగారితో సంధి నడపి, కంపెనీవారికిఁ గొంతద్రవ్యమిచ్చి వారి సైన్యబలముఁ గైకొని ౧౭౭౪ సంవత్సరమున రోహిల్లాలను సంగరమున నోడించి లొంగదీసెనఁట. దీనికి 'రోహిల్లాసంగ్రామ' మని పేరయ్యెను. ఆసీమ యయోధ్యరాష్ట్రమునకు యవ్యదిశగా నున్నది.

పిదప నింగ్లాండునందు హేస్టింగ్సుగారిపైన ర న నింపీచ్ చేసినవారు వీరిపై మోపిన నేరములలో నిది యొకటి. రోహిల్లాలనుండి యిటుల 'రోహిల్ఖం' డను పేరు కల్గెను.

## హ్రోడియుమ్ (Rhodium):—

అప్రూపమగు 'metallic element' అని చెప్పఁబడినది. దీని Chemical symbal Rh. అనియు, atomic weight 102 o 91 అనియు, atomic number 46 అనియు, melting point సెంటిగ్రేడు తెర్మోమీటరు 2000 డిగ్రీల కనియు, Spicific gravity .12 . 1 అనియుఁ జెప్పఁబడినది.

ఇది ప్లాటినమ్‌గ్రూపునకుఁ జెందిన గట్టిలోహము. దానితో నూరల్ పర్వతములందు, అమెరికా యందుదొరకు నూదాధాతువుఁగల తెల్లలోహము తీఁగఁ దీయనగును. చక్కఁగా సాఁగఁగొట్టిన సాఁగును.

## హ్రోడ్సు ద్వీపము:—

(ఏష్యా మైనరు చూడుఁడు).

## రౌక్ష్యాయణగోత్రము:—

(వాధ్రృస్వ లేక మిత్రయుపగణము చూడుఁడు.)

## రౌక్షాయనగోత్రము:—

(వాధ్రృస్వ లేక మిత్రయుపగణము చూడుఁడు.)

## రౌచికకవి:—

(కవి, కవులు చూడుఁడు.)

రౌతు మెత్తనైతే గుఱ్ఱము మూఁడు కాళ్లతో వెనుకకు నడువఁగలదు:
(ఆంధ్రలోకోక్తి.)

రౌద్రాశ్వుఁడు:— పూరువుసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి అహంయాతి. ఈతనికి ఘృతాచియందుఁ బదుగురు సుతులు గల్గిరి. అందు ఋచేయుఁవు జ్యేష్ఠుఁడు.

రౌద్ధకగణము:—ఇది విశ్వామిత్రసంతతి యందలి యొకగణము. ఇందు గోత్రము లెన్మిది కలవు.

౧ అద్యోహ, ౨ ఉదవాస, ౩ ఉదేవేణు, ౪ ఔద్దాలకి, ౫ కథక, ౬ గాధిన, ౭ రేణు, ౮ రౌద్ధక.

ఈరౌద్ధకగణమునందలి యెన్మిదిగోత్రములకుఁ బ్రవరరూపములు మూఁడు కలవు.

౧ విశ్వామిత్ర, గాధిన, రౌద్ధక (త్రియార్షేయ).
౨ విశ్వామిత్ర, రౌద్ధక, గాధిన (త్రియార్షేయ).
౩ విశ్వామిత్ర, గాధిన, రైవణ (త్రియార్షేయ).

రౌద్ధకగోత్రము:—
(రౌద్ధకగణము చూడుఁడు).

రౌద్ధాయనగోత్రము:—
(వాధ్ర్యస్వ లేక మిత్రయువగణము చూడుఁడు).

రౌప్యాయనగోత్రము:—
(వాధ్ర్యస్వ లేక మిత్రయువగణము చూడుఁడు).

రౌహిగోత్రము:—
(అగస్త్య యుపగణము చూడుఁడు).

రౌహిణ్యగోత్రము:—
(శరద్వంత యుపగణము చూడుఁడు)

రౌహిణ్యగోత్రము:—
(ఔతథ్య యుపగణము చూడుఁడు).

రౌహిణేయగోత్రము:—
(ఔతథ్య యుపగణము చూడుఁడు).

రౌహితవము:—ఇది చిన్న యడవి. భారత యుద్ధమునఁ గౌరవసైన్యముల కిది యొకవిడిదల.

రౌక్ష గోత్రము:—
(ఉపమన్యు గణము చూడుఁడు).

రౌక్షకగణము:—ఇది విశ్వామిత్రసంతతియందలి యొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి.

౧ క్రథక, ౨ రేవణ, ౩ రౌక్షక, ౪ నైతరాయణ, ౫ సాధ్ధహాల.

ఈరౌక్షకగణమునందలి (౫) గోత్రములకుఁ బ్రవరరూపములు.

౧ విశ్వామిత్ర, రౌక్షక, రైవణ.
౨ విశ్వామిత్ర, గాధిన, రైవణ.

రౌక్షకగోత్రము:—
(రౌక్షకగణము చూడుఁడు.)

రౌక్షాయన ఉపగణము:— (ఆంగీరస సంతతిలోని భరద్వాజగణములోని యొక యుపగణము.) ఇందుఁ దొమ్మిదిగోత్రములు గలవు. అవియన్నియు మాతోన్యుక్తములు.

అగ్నిజిహ్వ, కపిల, కర్ణమణి, కర్ణసుత, త్రిభిన్ది, రౌక్షాయన, శవల, శిపిల, శిపిలశ్వి.

వీట్లకుఁ బ్రవరరూపములు:-
౧ ఆంగీరస, బార్హస్పత్య, భరద్వాజ,
౨ ఆంగీరస, బార్హస్పత్య, భరద్వాజ, వాందన, మాతవచస.

**రౌక్షాయనగోత్రము:—**
(రౌక్షాయన గణము చూడుఁడు.)

**రౌక్షాయణగోత్రము:—**
(నాధ్ర్యస్వ లేక మిత్రయువగణము చూడుఁడు.)

**లంక:—** ద్వీపమునకు లంకయని పేరు. నాల్గు వైపులను నీటిచేఁ జుట్టఁబడిన భూభాగమునకు లంక యని పేరు. (నదులు చూడుఁడు).

**లంకభూములు:—**
(పటిమొండుమట్టి చూడుఁడు).

**లంకమేఁత, గోదావరియాఁత:—** ఆంధ్రభాషా సాంప్రదాయార్థపదము. (ఆంధ్రలోకోక్తి). పడినశ్రమకును, తిన్న తిండికిని సరిపోయి మరేమియు మిగులకపోవుసను భావము. ఏమియు మిగిలి లాభింపని వ్యాపారమున కిది వాడు చుందురు.

**లంకలు (పప్పు) చెట్టు:—** లా. Phascous Aconitifolius సం. ముకుష్టః, ముకుష్టకః, యని కొందఱనిరి కాని, యీరెండుపదములు నడవిపెసలకు వర్తించును. లంకలు పెసర, సెనగలఁబోలిన పప్పుజాతి. ఇది సెనగలకుఁ జేర్తురుగాని చాల యధముఁపుజాతి యందురు. లంకలపిండి శనగపిండియందుఁ జేర్చి మోసపుచ్చె దరని వదంతి కలదు. ఏనుఁగు పెసలని కొందరందు రఁట.

లంకలు మిక్కిలి వాతము, మలబద్ధము, నగ్నిమాంద్యదోషములఁ గల్గించి బలకరముగ నుండు నందురు. రక్తపైత్యము, జ్వరములఁగూడ శాంతింపఁజేయు నందురు.

**లంకలోఁబుట్టినవా రంతారాకసులేనా?:—**
(ఆంధ్రలోకోక్తి).

**లంకాపట్టణము:**
లంకారాజ్యము చూడుఁడు).

**లంకారాజ్యము - సింహలద్వీపదేశము - పరసముద్రదేశము - రత్నద్వీపరాజ్యము:—** సాధారణలక్షణధర్మముల యానవాళ్లును గల్గియుంట నిప్పటిసింహళద్వీపమనఁబడు దక్షిణసముద్రద్వీపమును తొల్లింట రామాయణప్రసిద్ధ లంకారాజ్యసింహళముగఁ బెక్కండ్రు పోల్చిరి. కొందఱు పరిశీలకు లిటీవల నాలంకారాజ్య మిది కాదని తలంచిరి. సుప్రసిద్ధజ్యోతిషవేత్తయగు వరాహమిహిరుఁ డుజ్జయినీపురమును, లంకాపురమును నొకేఖాయారేఖపై నుండినవిగ నుడివియుంటపై నాధారపడి యిది లంకారాజ్యద్వీపము కా దనుటకన్న నితరసంగతులంగూడఁ బరిశీలించుట సమంజసము. పురాణములం దెచ్చటనో లేక పురాణములకాలము నాఁటి గ్రంథమం దెచ్చటనో లంకయు, సింహళమును నొకటి కాదని కల దందురు. గాని యది యింతవఱకును సరిగా బైటపడలేదు.

ఇది యిట్లుండ నసలు రామాయణకథయే జరుగలేదనియు నట్టివి జరిగియేయుండవని వాదించు పరిశీలకులును గలరు. వరాహమిహిరునకు లంకారాజ్యస్థానము తెలియకుండినదనియు, నెక్కడనో యుత్తరమునయున్న జ్యోతిషవేత్తకు దక్షిణమున కడుంగడుదూరము గడచి, సముద్రశాఖంగూడ దాఁటి యున్నలనున్న లంకారాజ్యమందలి యొక్క పట్టణము గుర్తు సరిగాఁ దెలియక పొరపాటైన దేమో యనియుఁ దలంచుపరిశీలకులును గలరు.

రామాయణము సుందరకాండము ౧ యందు లంకాపట్టణము త్రికూటపర్వతప్రాంతమని రావణ భూపతినివాసముగఁ జెప్పఁబడినది. త్రికూటపర్వతము గజేంద్రమోక్షణప్రదేశముప్రాంతముల నుండుట సుప్రసిద్ధము గాన నటనేమో యని భ్రమించుటకన్న, సింహలమున లంకాపురముకడ నొక త్రికూటపర్వత ముండినదేమో యోచించుట సమంజసము. ఇప్పటి సింహలద్వీపమున నైరుతి భాగమున సముద్రమున మున్గియున్న Great Basis, Little Basis అనఁబడు కొండలున్న చోట సముద్రమున మున్గి రావణమహాపతికోట లుండినతావని యచటివారు జూపుచున్నారు. ఆపర్వతమునందే మూఁడు శిఖరము లుండియుండునేమో, దానికిఁ ద్రికూటమని యక్కాలమునఁ బేరుండినదేమో? మఱియు నిప్పటి కొలంబోపట్టణమునకు నలుఁబది మైళ్ళదూరమున 'నికుంభిల'యనంబడుతావు నింద్రజిత్తు యాగమొనర్చిన తావుగఁ జూపుచున్నారు. దీనింగూర్చినప్రశంసయు, చర్చయు Journal of Buddhist text Society Volum III P 1. appindix యందుఁ గలదు.

క్రీ. వె. అయిదవ శతాబ్దమున వ్రాయఁబడిన 'మహావంశ' మను బౌద్ధగ్రంథమున సింహలచరిత్రయందు లంకారాజ్యమే సింహల మనియు, విజయునిదండయాత్ర, దుత్తగామణి, పరాక్రమబాహులన్నృపతులచరిత్రలు వివరింపఁబడినవి. ధాతవంశమను ప్రసిద్ధ బౌద్ధగ్రంథకర్తయగు ధర్మకీర్తి యనునాతఁడు సింహలద్వీపవాసి. ఈతఁడు తొల్లింటిలంకారాజ్య మాకాలఁపు సింహలమని యభిప్రాయపడియున్నాఁడు. మఱియు నీతఁ డొకటవ పరాక్రమమాహుండను సింహల నృపతికాలము వాఁడని తెలియుచున్నది.

సింహలద్వీపమునకు రత్నద్వీపమని పేరుండెను. సింహలమునందలి రత్నపురపట్టణముకడ నున్న గనులు, రత్నములు, సుప్రసిద్ధములు. క్రీ. వె. ౧౩ శతాబ్దమున నీద్వీపమును దర్శించి మార్కోపోలో దీనిని "జిలాన్" అని వ్రాసియున్నాఁడు. మహాభారతము, సభాపర్వము, ౩౧ యందు విభీషణుఁ డొసంగిన కాన్కలలో నొకటిగ నగరువు ప్రశంసింపఁబడినది. కౌటిల్యుని యర్థశాస్త్రమున వ్యాఖ్యయందుగరువు ఉత్పత్తియగు దేశముగ సింహలముం గూర్చి భట్టస్వామి వ్రాసియున్నాఁడు.

ఇంక నీసంగతిని వదలి తొల్లింటికాలఁపురాజధానియగు ననూరాధపురముంగూర్చి వివరింతును. ఇట గయనుండి మహేంద్రోసంగమిత్రలు తెచ్చినబోధివృక్షఁపుశాఖ నాటి, జనించినవృక్షము కలదు. అది యొకయాత్రాస్థలము. బుద్ధభగవానునిదంత మొకయాలయమునఁ గలదు. అది యొక యాత్రాస్థలము. మఱియు నిట 'ఇసిభూమంగనన్' అనంబడుప్రదేశమున మహేంద్రోశ్మశానఁపుఁ దావును జూపుదురు. ఈపురమున ఘంటాకర విహారమున బుద్ధఘోషునిచేఁ ద్రిపిటకములకు వ్యాఖ్యయగు అత్తకథ (అష్టకథనము) వ్రాయఁబడెనఁట. అనఁగా, పాళిభాషనుండి సింహళములోని కనువదింపఁబడెనఁట. ఈబుద్ధఘోషుఁడే బౌద్ధచరిత్ర యనుకావ్యమును రచించినవాఁడు. ఇందలి శ్లోకములు రసవంతములుగను, పాండిత్యప్రౌఢిమఁ గలవిగను నున్నవి.

**లంఖణం పరమౌషధమ్**:—ఇది యాయుర్వేదశాస్త్రమందుఁ జెప్పఁబడిన సంస్కృతలోకోక్తి. లంఖనమన భోజనముఁ జేయకుండు టని యర్థము. రమారమి నన్నిరోగములు నేదోరూపమున నజీర్ణదోషమువలనఁ గల్గుననియు, నందువలన భోజనము మానియుంట నాదోషము నివారించి

యారోగ్యమొసంగు నను నొకనై ద్యవిధానము కలదు. గాన, లంఖనము శ్రేష్ఠమగు నౌషధము వంటిదేయని భావముగాఁ జెప్పఁబడినది.

**లంఖణము (Fast):—** జ్వరగతదేహులకు నజీర్ణి మొదలగురోగములు కలవారికి, ప్రసవమైనస్త్రీలకు, జీర్ణశక్తి చెడియుండువుగాన భోజనము మాని యవసరమగునంతకాలము లంఖనముఁడుట యాయుర్వేదనై ద్యవిధానమున విధింపఁబడినది. లంఖనమును, నుపవాసమును పొరబడి యొకరీతివిగఁ దలంపరాదు.

(ఉపవాసము చూడుఁడు).

**లంగరు (Anchor):—** ఇది క్రీ. ము. ౫౭౫ సంవత్సరమునుండి వాడుకయందున్నదఁట. రూపము నానాఁటికిఁ గొంతకొంతమార్పులఁ జెందుచుండెనఁట. పాశ్చాత్య దేశఁపు లంగరులందు Rodger లంగరు, Lenox లంగరు, mitchson లంగరు, Aiglen లంగరు, Isaac లంగరు, Porter లంగరు మొదలగు భేదములు గలవి గలవందురు.

**లంజముండ్లచెట్టు:—** ఇది తెల్లనియాకులుఁగల్గి, చూడ వేడుకగ నుండు పెద్దచెట్టు గానఁ బూఁదోటలందు నాటి పెంచుదురు. ఇది పూవులం బూయదు. కాయను. కొమ్మలనాటినబ్రతుకునట్టిది.

లేఁతయాకులను దక్షిణదేశస్థులు పులుసుఁజేసి భుజింతురని తెలిసెడిని. వాతమును హరించి, మేహశాంతిఁ గలించు నందురు.

**లండను నగరము:—** ఆంధ్రభూమితోఁ గాని, భరతదేశముతోఁగాని, నైసర్గికసంబంధము లేకుండియు, రాజకీయముగ బ్రిటీషుప్రభుత్వ ప్రధానస్థాన మగుటఁ బ్రభుత్వసంబంధముఁగల్గిన లండను నగరముంగూర్చి యాంధ్రవిజ్ఞానమున నించుక వివరించుట సమంజసము.

లండనునందు ౭౫ లక్షల కధికముగ జనులు వసించుచున్నారనిన నెంతగొప్పనగరమో తెలియును. ఇంతపెద్దనగర మొంతనై శాల్యముగఁ నాక్రమించునో యనుప్రశ్న నైసర్గికముగఁ గల్గెడిని. తేమ్సునదీతీరమున Kew నుండి, Barking వఱకు వ్యాపించియున్న నగరము.

ఈనగరము, తపాలాఫీసులవసతికిఁగా, నెన్మిది భాగములుగను, వాట్లహద్దులలో నుత్తరములు మొదలగువాటిని పంచుటకు ౧౧౨ డెలివరి ఏరియాలుగను, నేర్పఱుపఁబడినది. లండను పోలీసు ఏరియా ౭౭౩౭౪౯ యకరములపరిదేశమని చెప్పఁబడినది. ఈపోలీసులకు 'Metropolitan Police' అని ప్రత్యేకనామ మిడియున్నారు. ఆది నిది కొందరు వర్తకులు కాపురముఁ గుదిరిన యొకచిన్న settlement గ నదీతీరమునందుండిన గ్రామము.

రోమను లీదేశ మాక్రమించియుండునాటికి నీ గ్రామమునుజుట్టి యొకగుర్గముండెడిదఁట. లండనభివృద్ధియగుచుఁ బెరుఁగుట కారంభము తేమ్సు నదిపై మొదటివంతెన నిర్మింపఁబడుట యనిరి. ఆతా విప్పటి (London bridge) వంతెనకుఁ గొన్నిగజముల దూరములో నుండునటులఁ జూపుచున్నారు. రోమనులనాఁటిబాట లీగ్రామమునకడనే కలియుచుండె నఁట.

రోమను లీదేశమును వీడి వెడలిపోవుటతో నీలండనును, గొంత క్షీణించెనఁటఁ గాని, క్రీ. వె. ౬౦౪ లో mellitus గారిని లండనుబిషప్‌గాఁ జేయుటతో నీ తా నభివృద్ధిఁ గాంచ మొదలిడెనని చెప్పుదురు. డేనులదాడికాలములం దీ లండను, తేమ్సునదిపై రాకపోకలసందర్భమున నొకతాళపుఁ జెవివంటిదని తలంపఁ బడినదని నిదర్శనములు కలవు. Conute ప్రభువు, Sweyn ప్రభువుల పాలనము లనుండి రాజధానిగౌరవముల నందుచుఁ బెరుగ

నారంభించి, యితరదేశములు వశోమైఁకొలఁది మహానగర మాయెను.

ఇప్పటిభూపతులు విండ్సరునందలి దుర్గమున వసించుచుందురు. లండనునందు వారినివాసమున బక్కింగ్హామ్ రాజభవనము గొప్పదై యున్నది. లండనుచట్టనిర్మాణసభ (పార్లమెంటు) ను, ఉన్నత న్యాయస్థానము (ప్రీవీ-కౌన్సిల్) పరిపాలనకచేరీలు, ఇండియాదేశప్రభుత్వకార్యాలయము (స్టేటుసెక్రిటరీగారి కార్యస్థానము) మొదలగున వెన్నియో లెక్కలేక యున్నవి. బ్రిటీషుసంస్థానము (సామ్రాజ్యము) నందలి యెల్లదేశముల కట్టుసంస్థలన్నియు లండనునగరమునందే యున్నవి.

## లండనునగరఁపు బ్రిటీషుపార్లమెంటు భవనము (Houses of British Parliament in London):—

తొలుత బ్రిటీషుపార్లమెంటుభవన మొకపాటి పెద్దభవనము గానే యుండెను గాని యిప్పటిభవనమంత పెద్దది, డాబుదర్పములం గల్గినది కాకుండెడిని. అక్కాలము నం దదియు గొప్పభవనములలో నొకటిగనే యుండెను.

కోశాధ్యక్షుఁడుగా నుండిన ప్రభుత్వమహోద్యోగమంత్రి కాంగ్లమున Exchequer అనిపెదరు. ఆది నొకప్పుడు ధనాగారఁపు లావాదేవీ లెక్కలు కఱ్ఱకమ్ములపై గంట్లు నఱుకఁబడుచు భద్ర పఱుపఁబడుచుండెను. అట్టి కఱ్ఱపేలికలు నానురా నధికసంఖ్యాకములుగ నగుచు గదులన్నిటను కప్పుఁదనుక వేయఁబడుచు నిండిపోవుచుండ, క్రీ. శ. ౧౭౮౨ లోఁ బార్లమెంటుసం దట్టి కఱ్ఱపేలికలు (Wooden tallies) వాడుక నాఁప శాసింపఁబడెను గాని, ౧౮౨౬ వఱకు నట్లె నడచుచు, నప్పు డమలులోనికి వచ్చెను (enforced). అక్కాలమున భవనమున వెచ్చగా నుండుటకు ప్రోయిలు (Stones to keep the rooms warm) అమర్పఁబడి, యందుఁ గాల్చుట కీతీసివేసినపాతకఱ్ఱకమ్ము లుపయోగింప నిర్ణయింపఁబడెనఁట. అప్పటి శీతల మధికముగ నుంట, కఱ్ఱకమ్ముల నధికముగ వాడఁదొడఁగిరట. ఎట్లో ప్రమాదవశమున, నదివఱకే యెండియెండి యుప్పుడగ్నిసెగ నింక నాయత్త పఱుపఁబడిన యాకఱ్ఱ కగ్ని యంటుకొని, పెద్దమంటయై జాగ్రతఁబడు లోపుననే పార్లిమెంటుభవన మంటుకొని, పరశురామప్రీతి యగుచుండ, నార్పఁజేయుప్రయత్నములు నిరర్థకము లగుచుండ నెట్లట్లో యొక్క వెస్టుమినిస్టరుహాలు తప్పఁ దక్కినదంతయు క్రీ. శ. ౧౮౩౪ అక్టోబరు ౧౬ దినమునఁ గాలిపోయెనఁట. ఎట్టకేలకుఁ బునర్నిర్మాణప్రయత్నములు ప్రారంభమై, సర్ ఛార్లెస్ బేరీ (Sir Charles Barry) గారి ప్లాను లంగీకరింపఁబడి, యిప్పుడున్న బ్రిటీషుపార్లమెంటు భవననిర్మాణము నొనర్చిరి. ఇది తేమ్సునదీతీరమున నదినంటి 300 గజములపొడవున నిర్మింపఁబడినది. భవనమున కిరు దెసలందు నొకదెసను విక్టోరియాటవరు గోపురము (౭౫ అడుగులచౌకమున (3౪౦ అడుగులయెత్తునను), రెండవదెసను బిగ్ బెన్ (Big ben) గంట యమర్పంబడిన గంట స్తంభము (3౨౦ అడుగుల యెత్తునను) గలవు. ఈభవనము నిటులఁ దిరుగఁ గట్టుటకు నిరువదియేఁడువత్సరముల కాలము పట్టి, మూఁడు మిలియనులపౌనులు ప్రభుత్వమునకు వ్యయమయ్యెనని చెప్పఁబడినది. కట్టడఁపుఁ (ప్లింత్ ఏరియా) బ్రదేశఁపుజాగా మూఁ డెకరములనేల. భూపతి పార్లమెంటుసభను దెఱచుటకు లోని కరుగుమార్గము విక్టోరియాటవరుక్రింది మహాద్వారముగుండా నరగెడిని. గంటస్తంభఁపు బిగ్ బెన్ధ్వనిని వైర్లెస్గుండా లండనునగరమంతట విని

పింపఁజేయుచున్నారు. ఆ బిగ్ బెన్ గంట పద మూఁడుటన్నులబరు వుండునని చెప్పఁబడినది. దానిపే రీభవననిర్మాణమున కమ్మిషనరు గానుండి, పనుల నడిపిన Sir Benjamin Hall గారి పేరుఁ గ్లుప్తపఱచి (Ben) యిడంబడినదఁట. ఇప్పు డిది లండనునగరంపుభవనములలో ముఖ్యమనిపించుకొనుచున్న కట్టడము. చాలపెద్దది.

**లండనునగరంపు గొప్పయగ్నిప్రమాదము:—** క్రీ. శ. ౧౬౬౬ సెప్టెంబరు ౨-౩-౪-౫ తారీఖులు నాల్గురోజులలో సంభవించి, యాఱవతేదీ నారిపోయినది. ఈకాలమున ౪౦౦ వీధులను, ౧౩౨౦౦ భవనములను, ౮౯ పారిష్ చర్చిలను, ౫౨ చావిడుల (Halls) ను నాశనముఁ జేసెను. ఇంకను సెంటుపేల్సు దేవాలయము, గిల్డుహాలుభవనము, రోల్సుమార్కెట్టుఁ గూడఁ గాలి బూడిదపా లాయెను. దీని నాంగ్లేయులు 'great fire of London' అనియెదరు.

**లంపాకదేశము, మురందదేశము:—** కాబూల్నది కుత్తరంపుదట్టుననున్న దేశమనియు, పురుషపురము (ఇప్పటి పెషావరుపురము) సమీపమని హేమకోశమునఁ జెప్పఁబడినదేశము. బ్రహ్మాండపురాణము, పూర్వ ౪౮ యందు దీని ప్రశంస కలదు. మఱియు మార్కండేయపురాణము ౫౭ యందునను, ప్రశంసింపఁబడినది. లఘులంపాకము, గురులంపాకము ననుప్రసిద్ధజ్యోతిషగ్రంథము లీదేశంపుఁ బండితులు రచించినవి.

Journal of asiatic Society of Bengal 1840 P 474 యందు, భరతదేశమునకుఁ బశ్చిమంపుఁగడభూమి యనియు, ప్రజలకు లంపాకులని పేరనియు, కోఆస్నదిజన్మస్థాన మిందులోని దనియుఁ జెప్పఁబడినది.

వీనికి మురందదేశమనియుఁ బేరుండెనఁట. ఆఫ్ఘనుస్థానములోని జలాలాబాదునకు వాయవ్యదిశగా నిరువదిమైళ్ళదూరమున నుండెనని తలంపఁబడుచున్నది.

హ్యూయనచ్వాంగను చీనాయాత్రికుండు కపిశేనుకుఁ దూర్పుగా ౧౦౦ మైళ్ళదూరముననున్న దేశమని వ్రాసెను. ఓపియన్ లామ్ఘాన్ ప్రాంతమునుండి దీనిమార్గమని పోల్చియున్నారు. లంపాకనామము 'లాంఘూ' యైనదని తలంపఁబడుచున్నది. లంపాకదేశము ౧౬౬ మైళ్ళు చుట్టుకొలతఁగల దేశమని హ్యూయనచ్వాంగు వ్రాసియుంట నది చాల చిన్నదేశమై యుండవలెను. కపిశేనురాజ్యముండినకాలమున దానికి సామంతరాజ్యముగ నుండె నందురు.

**లంబాడీ జాతివారు (బ్రింజారీలు)-** వీరి యాదినామము బ్రింజారీకుల మనియుండనోపు. వీరికి మూలస్థాన మాంధ్రదేశమునందలి యిప్పటి విశాఖపట్టణంపుమండలములోని యెండ్రికపర్వతప్రాంతమున, మచ్చేరుగ్రామ పరిసరమునందున్న మచ్చేరు, లేక మచ్చగుండంపుఁ బ్రాంతసీమ. అంతకుఁ బూర్వంపుసంగతులు తెలియరావు. వారే మరచిపోయిరి. అప్పటి వీరికులనామము 'బ్రింజారీ' లనియుండెడిని. ఈమత్స్యగుండము మాడుగులసంస్థానంపు భూపతులరక్షణక్రింద నుండెడిదఁట. ఈ మచ్చగుండమున వివిధపరిమాణములుఁగల పెక్కుజాతులచేప లుండును. వాటి నెవ్వరు పట్టి చంపి తినరు. మహాశివరాత్రిదినమున నిట గొప్పయాత్ర జరగును. యాత్రికులు వాటి కాహారము విడుచుచుందురు. విశాఖపట్టణంపుమండలగెజిటీరనుగ్రంథమున వివరింపఁబడిన చరిత్రమేర కొక బ్రింజారీ యాకట్టుబాటు ధర్మవిధికి లోఁబడక మరాత్ముండై మచ్ఛగుండములోఁ జేఁపలంబట్టి వ నారంభించె

నంట. అది కారణముగ నాకులమువారెల్లరు నాతనికార్యమును గ్రహింపక, యామోదించి యూరకుండ, నాతెగ బ్రింజారీలకు శాపముం గల్గెనంట. ఆచేపలంబట్టిన దురాత్ముండు, ఆతనిసామానుల మోయునెద్దు సహితముగ గండశిలలై పోయిరంట. నేటికింగూడ వాటిని యాత్రిస్థులు చూడనగును. ఆకులమువారెద్దులపై సరకులను వైచికొని, సీమ సీమలగ్రామములకరగుచు, కొనుంగోలువర్తకముం జేయుట వృత్తిగాం గల్గినవారంట. నేటికిని నించుమించావృత్తియందే మెలంగుచున్నవారు.

ఆంధ్రదేశమునందన్నిసీమలందునను, నిజాము సర్కారువారిరాజ్యమునను, వీరు సంచరించుచుం గాననయ్యెదరు. ఒక్కొకచో నారునెలలు, సంవత్సరకాలముం గూడ నిల్వ యుంటం గలదు. కృష్ణామండలములోని తిరువూరుతాలూకాయందు వారు పర్వతసీమల స్థిరపడి లంబాడీగ్రామములుగ స్థిరనివాసము లొనర్చుచున్నారు. కొందఱు వ్యవసాయము లొనర్చుచున్నను, ముఖ్యవృత్తి వర్తకమే. ఆంధ్రభూమియందు వారు శపింపంబడినవారగుట హేయముగ 'పింజారీ' యని వాడంబడు పద మీబ్రింజారీపదమునుండి కల్గినదియే యని తెలసెడిని. ఈకులమువారడవిజాతుల (nomades) వారిలో నొకరుగ నెన్నంబడుచున్నారు. వీరికి వేర్వేఱు కులనామములు వాడుకయందున్నవంట. వీరు శూరులు. కలహములకు వెనుందీయనివారు. మైసూరురాజ్యమునంగూడ వీరు గాననయ్యెదరని తెలియుచున్నది. వీరిరక్షణ మితరులపై నాధారపడినది కాదుగాన వీరికడ సదా యాయుధము లుండును. ధైర్యవంతులు. స్త్రీలు బలాఢ్యలు. తంబాపశువులను సరకుల మోయించుచు, తోలుకొని స్త్రీలే నడుపుచుందురు. అధికశ్రమను సలిపుకరముగా నంద రోర్వంగలవారు.

Rev. J. Cain గారు వీరింగూర్చి క్రీ. శ. 1879 లో 'ఇండియన్ ఏంటిక్వరీ' యనుపుస్తకమున, వీరింగూర్చిన వివరములను వ్రాసెను. తుప్పలపై గుడ్డపేలికలను వైచుచుండి దానిని 'కంపలమ్మ' దేవతగా వీ రారాధించుచుందురు. బస్తరురాజ్యంపుబాటలపక్కగా వీరిచేఁ జేర్పంబడిన రాళ్ళకుప్పలు కొన్నిగలవు. వాటిని 'గుట్టలమ్మదేవత' యని యారాధించుచున్నారు. ఈ రెండు దైవములు వారికిఁ గులదేవతలంట.

క్రీ. శ. 1891 మైసూరురాజ్యంపుసెన్సస్ (జనాభా) రిపోర్టునందు లంబాడీలు విష్ణుమతసంబంధముం గలవారని చెప్పంబడియున్నది. వీరిలో సింకను నరణ్యముల వసించువారు 'బాణశంకరీదేవి' యనుశక్తి నుపాసించుచుండుటం గలదు. 'బసవ' యనునామము వీరియందుఁ బవిత్రము. 'మంగణా' యనుపేరు కొందరికిఁ గలదు. అది తిరుపతి యలమేల్మంగాదేవిసంబంధమని యనెదరు. వీరిలో ఋషియనం దగుతపస్వి యొక్కండు 'మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే; అగ్రత శ్శివరూపాయ వృక్షరాజాయతే నమః' యనుమంత్రమును జపించుచుండఁ దాను వినినటుల 'The casts and tribes of Southern India' యనుగ్రంథమున Thurston అను పండితుండు వివరించియున్నాండు. మర్యాదగా సంచరించుచు నుత్సాహముతోం బని సేయుచు, నెండవేడిమికి సరకుంగొనని శరీరత్రాణతోం గష్టపడి ద్రవ్యార్జన మొనర్తురని యాయన వీరింగూర్చి వ్రాసెను. ఆంధ్రదేశమునం గొన్ని సీమలందుం గొన్నిజాతులవారు లంబాడీస్త్రీలను బరిణయమైరని తెలియుచున్నది. వీరు తెలుంగువారే యైనను వీరికి లంబాడీభాష ప్రత్యేకముగం గలదు. మాటుమనుజులు వీరియం దున్నవంట.

**లక్క** :— లా. Coccus Lacca. ఆంగ్ల. Lac. ఫ్రెంచి Laque. పారశీ. లాక్. సం. అలక్తః, అలక్తకః, లాక్షా. ఇది కొన్ని యడవి చెట్లపైనను, రేగు, మఱ్ఱి మొదలగు కొన్ని దేశవాళీ చెట్లపైనను పురుగులచేఁ జేర్పఁబడు బంక పదార్థము. ఆపురుగులకుఁ బాశ్చాత్యులు 'Coccus Lacca' అని పేరిడియున్నారు. ఇవి యాచెట్లపైననే తమ యాహారమును గల్పించుకొనునఁట. లక్క తననివాసమునకై యాపురుగులు కట్టుకొనుగూడని పరిశీలకు లనుచున్నారు. వీట్లఁ జేర్చి శుభ్రపఱచి రంగులం గల్పి లక్కఁ జేతురు. ఈలక్కకణికలకు 'Sealing Vax' అనెదరు. దీనినుండియే రంగును వచ్చును. దానితోఁ బాశ్చాత్యులు త్రుప్పును, ఉన్ని మొదలగువాట్లకు రంగులు వైచెదరు. మనదేశమున లక్కరంగులని చెప్పఁబడున వీసంబంధమునఁ జేయఁబడినవియే.

లక్క మనదేశములనేగాక బర్మా, చీనా, జపాను దేశములందునను, విస్తారము దొరకును. రంగులు లక్కజంతువు జీవించియుండుతఱినే చేతురందురు. బర్మా, చీనా, జపాను దేశములవారు, లక్కను ద్రావకముగనొనర్చి (లేక్కర్ lacquer) కఱ్ఱసామానులపైఁ బూయుదురు. వీటికే 'లేక్కరుసామాను' లనిపేరు. (లేక్కరు చూడుఁడు.)

**లక్కపూఁత** (Lacquer):— జపాను, చీనా, బర్మా మొదలగు దేశములం దిది పూయఁబడిన కఱ్ఱసామాను విస్తారముగఁ జేయుచుందురు. లక్క కాంగ్లమున 'Shellac' అనియు, దాని క్లిష్టపఱుపఁ బడినరూపమునకు 'lac' అనియుఁ బేర్లు. లక్కతోఁ జేయంబడినపూఁతగ నిది 'Lacquer' అనఁబడుచున్నది. కాని, యిందు నిజమున లక్కయే లేదు. 'anacardiaceae' అనుపేరుఁగల యొకదినుసుచెట్టు బంకతో నది చేయఁబడుచున్నది. బహుశః పై రంగునుబట్టి యిది యిట్లు పిలిచెడి వాడుకనామము నుండవలెను.

**లక్నో** (లక్ష్మణపురి):— ఇది ఆగ్రా, అయోధ్య సంయుక్తరాష్ట్రములు (U. P.) యందు రాజధానీనగరము. గుమితీ (గోమతీ) నదీ దక్షిణతీరము. లక్ష్మణపురి నార్తు లాటిట్యూడ్ ౨౬°౫౨, తూర్పు లాంగిట్యూడ్ ౮౦°౫౬ డిగ్రీల తావున సముద్రఁపునీటిమట్టముపై ౪౦౩ అడుగుల యెత్తున నున్ననగరము. ౩౬ చతురఁపుమైళ్ళవైశాల్యముఁ గలది. అయోధ్యరాష్ట్రమునకు క్రీ. వె. ౧౭౭౫ నుండి రాజధానియై యుండినగరము. దీనికి 'City of Palaces and Parks' అని యాంగ్లు లనెదరు.

క్రీ. వె. ౧౭౭౫ వఱకు గ్రామమైయుండి, అజఫుద్దౌలాప్రభునిచేఁ ఫైజాబాదునుండి రాజధాని యిటకు మార్చఁబడి నాఁడాదిగఁ బెరిఁగి నగరమైనది. ఏటేట ౪౩ అంగుళముల వర్షము కురియుటఁ బూఁదోఁటలు పెంచుటకు గొప్పవీలు కలదు. కాలువ లుంట ఫలవంతమగు ప్రదేశమై యున్నది. పెక్కుజాతులపండ్లకుఁ బేరందినగరము.

క్రీ. వె. ౧౮౧౯ సంవత్సరమున నయోధ్య నవాబున కాంగ్లప్రభుత్వమువారు 'కింగ్ ఆఫ్ జౌడ్' అనుబిరుదము నొసంగిరి. లక్నోనగరమునఁ జూడఁదగిన భవనములు, పూఁదోఁటలు పెక్కు గలవు. అవి ౧ దౌలత్ఖానాభవనము, ౨ పెద్ద ఇమాంబారా, ౩ రూమీదర్వాజా, (దీనిని టర్కిష్ గేటనియెదరు), ౪ కుద్సిద్మంజిల్ భవనము, ౫ బీబియాపూర్ కోఠీ, ౬ చినాత్కోఠీ ౭ చార్బాగ్ ఉద్యానవనము, ౮ అయిష్బాగ్ ఉద్యానవనము, ౯ మోతీమహల్, ౧౦ దిల్ఖుష్ భవనము, ౧౧ లాల్బారాదరీ (ఇది దర్బారుమందిరము)

ఇంకను దీని యొక్కపురంగు పూయఁబడుట క్వాస రస్సుల్తాన్ అనియు నందురు. గుజ్జములు, నేనుఁ గులు నుండుశాలలు, ౧౩ రెసిడెన్సీకోఠీ, ౧౪ ఫర్హాత్ బక్షుభవనము (ఇది జనరల్ మార్టినుగారివద్ద నుండి కొనఁబడినభవనము), ౧౫ ముబారక్మంజీల్, ౧౬ పామంజీల్, (ఇట నడవిమృగముల దెబ్బలాటలాడించి చూచు భవనము), ౧౭ చత్తర్మంజీల్, ౧౮ హుసేనాబాదిమాంబారా, ౧౯ కైజర్బాగ్ భవనము, ౨౦ సికందర్బాగ్ అనంబడునవి ముఖ్యములు.

ఇన్ని దివ్యభవనములు, ఉద్యానవనములు, మహాద్వారములచే నలంకృతమగు నీలక్నోనగరము నేలిన భూపతులచరిత్రయే దేశచరిత్రయే యగును. దానిని వ్రాయుట మాపని కాదుగాని యిన్నిసుందరభవనములను నిర్మించిన భూపతుల పేర్లను వివరించి ముగింతుము.

తొలుత నయోధ్యరాజ్యమునకు వీరికాలమునఁ ఫైజాబాద్నగరము రాజధానియై యుండెను. అట నసదాతాలీఖాన్ రాజ్యస్థాపన మొనర్చిన మొదటి నవాబు. పిదప మన్సూరాలీఖాన్ రెండవభూపతి యయ్యెను. ఈయనకు 'సఫ్దార్జంగు' అనియుఁ బేరుకలదు. పిదప షూజాఉద్దౌలా సింహాసన మెక్కెను. పిదప (నాల్గవ నవాబు) అసఫుద్దౌలా క్రీ. వె. ౧౭౭౫ సంవత్సరమునఁ దనరాజధానిని లక్నోకు మార్చెను. నాఁటినుండియు లక్నో బాగుపడి వృద్ధి నందెను.

అసఫుద్దౌలాకుఁ బిదప క్రీ. వె. ౧౭౮౯ లో రెండవ సదాత్తాలీఖాన్ ప్రభు వయ్యెను. పిదప నశీరుద్దీన్ ౧౮౨౭ లోఁ బ్రభుత్వమునకు వచ్చెను. పిదప మహమ్మదాలీషా క్రీ. వె. ౧౮౩౭ మొదలు ౧౮౪౨ వఱకు రాజ్య మేలెను. తరువాత అమ్జాదాలీషాయును, నాతనికిం బిదప వజీదాలీషాయును పాలించిరి. వజీదాలీషా క్రీ. వె. ౧౮౪౭ మొదలు ౧౮౫౬ వఱకు రాజ్యమేలెను. ఈయనను క్రీ. వె. ౧౮౫౬ లో సింహాసనమునుండి తొలఁగించిరి. పిదప నాయన కలకత్తాయందు నివసించుచు, ముప్పది వత్సరములు జీవించి, క్రీ వె. ౧౮౮౭ లో మృతి నొందెను. అది యాయన ౬౦ వ సంవత్సరంపువయస్సున నయ్యెను.

## లక్సారుపట్టణము, పూర్వ(పు)తీబీస్-

ఈజిఁప్టు దేశమునందుఁ గైరోనగరమునుండి ౪౫౦ మైళ్ళదూరమున నైలునదీతీరమునందుఁ దొల్లింటి తీబీసుపుర ముండినప్రదేశమున నున్నది. పరిసరము లందే కర్నాక్పురము దేవాలయముఁ గలదు.

లక్సారునం దిప్పుడు ౧౨, ౬౦౦ జనులు వసించుచున్నారు. ఇది భరతదేశమున హరిద్వారప్రాంతమునఁగల లక్సారు ఇనుపబాటల సంధిప్రదేశము కాదని మనసునం దుంచుకొనవలయును.

## లక్సెంబర్గుగ్రాండుడచ్చి:—

ఐరోపాఖండమునందు బెల్జియందేశమున కాగ్నేయదిశగా నున్న సంస్థానము. దీనిని పరిపాలనఁ జేయుప్రభువునకు 'గ్రాండుడ్యూక్' అని పేరు. రాజధాని లక్సెంబర్గుపురము.

## లక్షాయనగోత్రము:—

(భరద్వాజ ఉపగణముచూడుఁడు.)

## లగ్నాష్టకాలు (లగ్నాష్టకములు):—

ఆంధ్రభాషాసాంప్రదాయార్థపదము. ఒకదురాత్ముని వంచించుటకు హేళనఁ జేయుట, తూలనాడుట, గదుముట, గెంటివేయుట, అవ్వలకు నెట్టుట మొదలగు కార్యములకు హేళనగా 'లగ్నాష్టకము' లని యందురు.

**లగ్నత్యాజ్యము:**—మేషలగ్నము వృషభ కన్యా ధనుస్సుల నాదియందును, మిథున సింహతుల కుంభముల మధ్యయందునను, కర్కాటక వృశ్చిక మకర మీనముల కంత్యము నందునను, ముప్పాతికఘడియలు (అనగా ౧౮ మినిట్లు) కాలము లగ్నత్యాజ్య మనంబడు విషఘటిక లనియు, శుభకార్యముల కనర్హము లనియు, జ్యోతిషశాస్త్రమునఁ జెప్పఁబడినది.

**లగ్నము:**—ముహూర్తమనియు, నిర్ణీత కాల మనియు నర్థము. వివాహములందు వధువునకు వరుఁడు గళమునఁ దాళిఁగట్టుట కేర్పఱుపఁబడిన సుముహూర్తము.

**లఘిమాసిద్ధి:**
(సిద్ధి సిద్ధులు చూడుఁడు.)

**లఘుఋక్షము:**—
(నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు.)

**లఘుపద్మాసనము:**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. (ఆసనములు చూడుఁడు). ఇది పద్మాసనమునకుసంబంధించిన యనాంతరభేదాసనము. కుడిపాద మెడమ తొడపై నుంచి, యెడమపాదముఁ గుడితొడపై నుంచి, చేతులు సిద్ధాసనమునందువలె నుంచి, బొటనవ్రేళ్ళం బట్టుకొని గడ్డము హృదయమున కానించి, భ్రూమధ్యమున దృష్టుల నిల్పుట లఘుపద్మాసన మనఁబడును.

[పద్మాసనము చూడుఁడు — సిద్ధాసనము ౘడుఁడు].

**లఘుశేఖరము:**—
(తాళములు చూడుఁడు.)

**'లజ్జా కుతోఽంతర్మలినాశయానామ్?':-** ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. 'దుష్టచింతనలుఁ గలవారికి లజ్జ యెక్కడ?' అని యభిప్రాయము. లజ్జ యుండదని భావము.

**లట్వియాదేశ(పు(బ్ర)భుత్వము:**—బాల్టిక్కు-సీమలలో నొకప్రజాప్రభుత్వసంస్థానము. నలుఁబదివేల యెన్మిదివందల నేఁబదిచతుర(పు) మైళ్ళనైశాల్యమనియు, పందొమ్మిదిలక్షల జనసంఖ్య యనియుఁ జెప్పఁబడినది.

**లతన్వాలీదేవి (జ్వాలాముఖి):**—
(వైష్ణవీ దేవీక్షేత్రము చూడుఁడు).

**లతాహస్తము:**—(హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు).

**లత్తివనము:**..... యష్టివనము. దీనిప్రశంస 'మహావగ్గ' మనుబౌద్ధగ్రంథమున ౧—౨౨ యందుఁ గలదు.

**లత్తుగదూది, గల్లలత్తుక:**— లత్తుగదూది ఎఱ్ఱలత్తుగ, పచ్చలత్తుగ, నల్లలత్తుగ, ఊదాలత్తుగ యని నాల్గురంగులది సుప్రసిద్ధము. కవులు స్త్రీలపాదముల కెఱ్ఱనిరంగుఁ బూయుటను లత్తుకని పేర్కొనిరి. బహుశః దీనివ్యాపకము తురకలయాధిపత్యకాలమున నని తోఁచెడిని. తొల్లింటి క్షత్రియప్రభుత్వములనాఁడు సనాతనాచారమగుపసఁపు సున్నమును నీటితోఁ గల్పినట్టి ఎఱుకతన సౌమంగలుల పాదములకుఁ బూయుట, చందనముఁ బూయుట, పసఁపుఁబూయుట, కుంకుమ బొట్టిడుట, తాంబూల మిచ్చుటలవలెనే యాదరణమర్యాదలలో నొకటిగ నుండెను. నేటికి నట్లే యచ్చ టచ్చట నడుచుచున్నది.





లక్షకరంగులు సిరాలుగఁ జేసి వాడుచుండిరని గూడ వినుము.

**లభాయనిగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము, చూడుఁడు.)

**లయ (ప్రాణము):**—సంగీతశాస్త్రమున దశప్రాణములలో నొకటి. (దశప్రాణములు చూడుఁడు).

లయ (ప్రాణము) మూఁడువిధములు.

౧ ద్రుతము:— పాడఁదగినంతకాలము. ద్రుతము తక్కువ కాలమని యెఱుఁగునది. దీనిని హ్రస్వో చ్చారణ ప్రమాణ (కాల) మని యందురు. ఎంత తక్కువగఁ (హ్రస్వముగఁ) బాడఁగలరో యంతకాలము.

౨ మధ్యలయ:— ద్రుతమునకు రెట్టింపు (రెండింతల) కాలము.

౩ విలంబితలయ:—ద్రుతమునకు నాల్గురెట్లు (మధ్యలయకు రెట్టింపు) కాలము.

**లయగ్రహము:—**
(గ్రహలయ చూడుఁడు).

**లయయోగము (వైకృతయోగము):—**
(అభ్యాసయోగములు చూడుఁడు).

**లయాంగములు:—**
(అంగములు చూడుఁడు).

**లలందవిగోత్రము—:**
(గవిష్ఠిర గణము చూడుఁడు).

**లలామగోత్రము:—**
(జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు).

**లలాయనగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణముచూడుఁడు).

**లలితకూరచెట్టు:—** దీనింగూర్చి యంతగాఁ దెలియదు. ఇది జిగటగనుండును గాన శ్లేష్మము నుద్రేకించునది యని తోఁచెడిని. చలువఁజేసి రక్తపైత్యము నడంచునని యందురు. వీర్యమునకు బలముఁ గల్గించుననియు నందురు.

**లలితతాళము:—** (తాళములు చూడుఁడు).

**లలితప్రియతాళము:—** (తాళములు చూడుఁడు).

**లలితపూర్జిల్లా:—** ముఖ్యపట్టణము లలితపూరు. (ఆగ్రాప్రోవిన్సు చూడుఁడు).

**లలితాషష్ఠి:**—భాద్రపదశుద్ధషష్ఠి. ఘూర్జరదేశమున లలితాదేవినిఁ బూజింతురు. పర్వదినము. (పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుఁడు).

**లవంగ (మొగ్గల) చెట్టు:—**లా. Caryophyllus Aromaticus, ఇంగ్ల. Cloves tree. సం. దేవకుసుమం. శ్రీసంజ్ఞం, లవం, లవంగం, లవంగకలికా,

లవంగములందుఁ జమురు కలదు. కారమురుచి గలదు. దీనియందు ఫలాదులను కుళ్ళిపోనీయకుండ నిలుపుశక్తియు, దుర్వాసనలను, వదలఁగొట్టుశక్తియుఁ గలదు. గాన, మురబ్బాలలో వైచెదరు. కొన్నిరకుండలను నీళ్ళకూజాలను నీటితో నింపి యందు లవంగములపొడివైచి, యించుకసేపుంచి గాలించి కడిగివైచెదరు. లవంగములను లవంగమొగ్గ లనియెదరు. రుచిపరిమళములకై తాంబూలమునందుఁ జేర్చి నములుచుందురు.

లవంగమొగ్గలందు మేహశాంతిఁగల్గించు గుణమును, ధాతుపుష్టిఁ గల్గించు గుణమును, ఆమవికారము, పైత్యరోగములు, మధుమేహము, వికారము, విదాహము, శ్లేష్మము, క్షయరోగముల నడంచు గుణమును గలదని చెప్పఁబడినది. లవంగముల చమురు పైనఁబూసిన మేహవాతఁపు నొప్పులు, తలనొప్పి, దంతములచిగుళ్ళవాపు, పండ్లు కదలుట, నొప్పి, నివారించునసియు, లోని కచ్చిన నుబ్బురోగము, వాతిదోషము, నతిమూత్రముల నడంచునసియు, శరీరములోపలనున్న దోషములను వెడలించి, శుభ్రపఱచునసియు, నుబ్బురోగమును నివారించునసియు, సప్తుంసకత్వముఁ బాపునసియు, స్త్రీలకు వంధ్యదోషనివృత్తిఁ గల్గించునసియు, బుఱుతురక్తమును చక్కఁగ వెడలించునసియు, గర్భిణులవాంతుల నాఁపునసియు, గర్భిణులకు శీఘ్రప్రసవముఁ గల్గించునసియు, బాలింతలకుఁ బాలుపడఁజేయునసియుం జెప్పఁబడినది. లవంగమొగ్గల నెప్పుడు నోట నుంచుచుండిన నది తగ్గిపోవునసియు నందురు. వాతముడఁడి, శిరోభారము, కండ్లజలుబులు, సన్నిపాతముఁ గల్గినతఱి లవంగమొగ్గల నరుఁగఁ దీసిన గంధము కండ్లయందుఁ గలికము వైచిన నివారణ మగును. మఱియు లవంగములచూర్ణము విషముల హరించి, వీర్యవృద్ధి, వీర్యస్తంభనలఁ గల్గించునందురు.

లవంగాకులను 'ఆకుపత్రిక' మందురు. దీని చూర్ణకషాయములు త్రిదోషముల నడంచి, అతిసారము, ఎక్కిళ్ళు, జ్వరములు, ద్వంద్వరోగములు, మలమూత్రబద్ధము, శ్వాసకాశలు, శూలల నివారించునని చెప్పఁబడినది. లవంగపట్ట దాల్చిని చెక్కవలెనే యుండుంగాని, పలసరి హెచ్చు. దానిగుణములే గలది.

దీనిదోషములకుఁ తుమ్మజిగురు, హాలిహాము సకె విఱుగుడు లందురు.

**లవణత్రయము:**—సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణముల కాయుర్వేద వైద్యశాస్త్రమున లవణత్రయ మనిపేరు.

**లవణము** (Salt):—ఇటలీదేశమున Via sataria అను సుప్రసిద్ధ మార్గము పురాతనమని పేరందినది. దీనికి 'లవణఁపుబాట' యని యర్థమఁట. రోమనుల పురాతనఁపుసైనికులకు రోజువారి మామూలుగ (laily allowence) నుండెనఁట. నెలసరికి జీతమునకు 'salary' అని యాంగ్లపదము కుదురుట యీలవణమునుండియే యయ్యెను. 'Tree to salt' అను ఉక్తి తినుచుండుజీతమునకుఁ దగినవిశ్వాస మను నర్థమిచ్చుతఱి salt అనిన తినుజీతమునకే సమన్వయార్థ మగును.

ఇంక నేలరీ యేర్పడినవిధము నెఱింగించుట యిట సమంజసము. రోమను సైనికులకు లవణఁపు కొలవెన్ను నిచ్చుచుండెడివారఁట. పిదప నేలనో దానిని నిలపి జీతముల నెక్కువఁజేసి వాటికి 'సెలేరియమ్' (salarium) అని పేరిడిరఁట. ఇందు లవణము (salt) కూడ చేరియున్నదని భావము. ఆసెలేరియమ్ పదమునుండియే salary (నెలజీతము) అనుపద మాంగ్లమున నేర్పడినది, గానసే 'The man worth his salt' అనుతఱి, 'He is well worth to salary paid to him' అని యర్థ మగుచున్నది.

**లవణము, దాహము:**— మనశరీరము నందలి రక్తములో నుప్పు చాల ప్రధానమగు నది. అది తగ్గిపోయిన శరీరము రోగమున కాశ్రి

యమగును. ఎక్కువ యయ్యేనేని రక్తము బరువయి క్రిందికి దిగఁబడునుగాని చక్కఁగా శరీరమంతటను ప్రసరింపకుండును. ఈమెక్కుయగుట మనము ఉప్పెక్కువ తినుటవలన సంభవించును. రక్తము సరిగా స్రవించక క్రిందికి బరువై దిగఁబడుటచే నాళాళీమైనసరములు శరీరేతరభాగములలోనికి నీటిద్రవము చేరుకొనును. దీనికి ఫలితముగా నోటిలోనికి రంధ్రములగుండా ద్రవము సరిగ స్రవింపదు. నాలుకకడఁ దడి తగ్గిపోవును. మనము దాహమగుచున్న దనియు, నీటం ద్రాగవలయుననియు ననుకొందుము.

రక్తమునందుఁగల యుప్పునకు సోడియమ్ క్లోరైడ్ (Sodium Chloride) అని పేరిడియున్నారు. ఇది శరీరమందలి రక్తప్రమాణము ననుసరించియుండవలెను. ఎక్కువగాని, తక్కువగాని కారాదు. ఎక్కువగా మనము తినినచో విదాహముఁ గల్గించి, నీరు ద్రావఁజేయును. మనము త్రాగిననీటియం దీయధికమగు సోడియమ్క్లోరైడు చేరుకొని, మూత్రముద్వారా వెడలిపోవును. పిదప రక్తము యథాస్థితికిఁ జేరుకొని చక్కఁగ స్రవింప నారంభించును.

**లవణములు:**— లవణమనిన యుప్పని యర్థము. భరతదేశఁపుఁ దొల్లింటి గ్రంథములందు ద్వాదశలవణములు చెప్పఁబడినవి. అందు మొదటి మైదును పంచలవణము లనంబడుచు నాయుర్వేదవైద్యవిధానమున నుపయోగింపఁ బడుచున్నవి.

౧ సైంధవలవణము:-సింధుదేశమున భూమియందు గనులలో రాళ్ళవలె దొరకుటంజేసి యీపేరం దినది. దీనిని 'ఇందు' ప్పని కొందరు వాడుచుందురు. ఉత్తరహిందూస్థానమున వాడఁబడుచున్నది.

౨ సముద్రలవణము — సముద్రపునీటి నెండించి చేయఁబడు ఉప్పు.

3 బిడాలవణము:-(కృతకసుపాంశువు.)

౪ కాచలవణము— దీని నద్దములం జేయుటయందుపయోగింతురు.

౫ పాంశులవణము—దీనిని యవాక్షార మని యందురు.

౬ పాంసలవణము — (మట్టిఉప్పు) మన్నునుండి తీయఁబడునది.

౭ చవిటియుప్పు—ఉప్పుపట్టులం దదియే ప్రేలియుండ నేరుదురు.

౮ టంకణక్షారము — దీనిని వెలిగార మనియు నందురు.

౯ గడలవణము—దీనిని సాంబలవణ మనియు, పాశ్చాత్యకరసంభవలవణ మనియు నందురు. సాంబహారుసరస్సునందలి యుప్పునీటి నెండించి చేయఁబడిన లవణము.

౧౦ పాకెరక లవణము.

౧౧ సర్జరసక్షారము—దీనిని సజ్జాకార మనివాడుచున్నారు.

ఇంక ననుదిన మాహారపదార్థముగ నుపయోగింపఁ బడుచున్న సముద్రలవణముంగూర్చి వివరింతుము. దీని నాంగ్లరసాయన శాస్త్రవేత్తలు 'Sodium Chloride' అనియెదరు. తక్కినవాటి కొన్ని 'salts' కాయగూరలయందు, పండ్లయందు, పాడిపదార్థములందు శరీరమునకు భోజనముగుండా లభించెడిని. శరీరమునకుఁ గావలసిన lime salt పాలయం దున్నది. నిజమున నిది పాలయందే యధిక ముండుటఁగని పెట్టఁ బడినది.

ఈసందర్భమున వేఱొకసంగతియు వివరింపవలయును. కూరలుమొదలగుపదార్థముల నుడుకఁబెట్టుటచే, సందలిసాల్ట్సు నీటియందుఁ గరఁగి

యావార్చినసీటిలోఁ బైకి పాఱఁబోయఁబడును. ఇది యాచారముగ జిరకాలమునుండి జరుగుచున్న పనియే.

ఉప్పు శరీరరక్తమునందునను, tissues యందునను, ప్రధానద్రవ్యమై యుండుట రుచికై వంటయందు వాడుచున్నను చాల బలకరకార్య మొనర్చుచున్నది. పొత్తికడుపునం దిది చాలకుండిన జీర్ణశక్తి తగ్గిపోవునని చెప్పఁబడినది. భోజనమైన యిరువది ముప్పది మినిట్లకాలములోఁ బొత్తికడుపులోనికి Hydro chloric acid గాఁ జేరుటకు మన Sodium chloride కారణమగునని కనిపెట్టఁబడినది.

శరీరమందలి lime salt ఎముకలకు దృఢమొసంగునది. అదియే లేకుండిన నెముకలు వంచిన వంగిపోవుచుండును. దంతములుగూడ నిట్టివే. శరీరమును దహనముఁజేసినపిదపనైన బూడిదయందీ lime salt కాలిపోక నిలచియుండును. పాలయందుఁగల iron salts రక్తమునకు ముఖ్యద్రవ్యములలోనివని చెప్పఁబడినది.

**లవణానది:**—దీని నిప్పుడు 'లన్' అనియు, 'లూని' యనియు, 'నన్' నదియనియు పలువిధముల వాడుచున్నారు. ఇది పానియరువద్ద జనించి, మాళవదేశములోని ఛద్పురసోనరీ యనఁబడు తావున సింధునదితో సంగమించునది.

మాలతీమాధవనాటకమునఁ దొమ్మిదవయంకమునఁ బ్రశంసింపఁబడినది.

**లవపురము (లాబపురము-లోహావార్-లాహెూర్):**— (లాభపురము చూడుఁడు.)

**లహాసాపట్టణము:**—టిబెట్టుదేశమునఁ బ్రధానపురము. పరిపాలకుండును, మతాధిపతియునగుదలైలామాస్వామి నివాసస్థానము. వారినివాసభవనమునకు 'పోతల' యనిపేరు. ఒకకొండ ప్రక్కను కొంతయెత్తున నిర్మింపఁబడియున్న పెద్ద కట్టడము. ఆప్రాంతదేశమునకు, 'క్యిచూలోవ' యనిపేరు. చాల ఫలవంతమగు ప్రదేశము.

పోతలభవనము ౯౦౦ అడుగులపొడవును గల్గియున్నది. ఇదిగాక పట్టణమువెలుపల డీబంగ్‌విహారము, సేరావిహారము, గాడెన్‌విహారము నను మూఁడు గొప్పవిహారములు (మఠములు) కలవు. మూఁడును మూఁడుపట్టణములవలె నుండును. ఇవి గాకఁ బర్వతపాదమున వ్యాపించియున్న లహాసాపురమున నిరువదివేలజనసంఖ్య కలదు. విహారములందు లామా (సన్యాసు) లే నసించుచుందురు.

అచివి చీనాప్రభుత్వము టిబెట్టుదేశము నొక Buffer state గా నుంచఁదలంచి యుండిరని యిటీవల బయల్పడినది. టిబెట్టుదేశపు లామాస్వాములును, ఇతరదేశములందుఁ గల్గుచుండు మార్పులసంపర్కము తమకుఁగలుగుటఁ జికాకుగ నెంచి, యనాదిపద్ధతుల నుండుట విశ్రాంతిగఁ దలంచియుండిరి. అందు లహాసాపట్టణము లామాలకునికిపట్టును, ప్రధానస్థానమును నై యుండెను.

లహాసాపట్టణమున్న 'క్యిచు లోవ' బ్రహ్మపుత్రానదిలోనికిఁ జేరుకొనునది. ఈనది కీప్రాంత 'నుసాంగ్పోఛు నది'యనిపేరు.

దేశపాలకుండును, బౌద్ధమతాధిపతియు నగు దలైలామాగారు నసించు భవనమగు పోతలవిహార మొకకొండపై, పట్టణమునకుఁ బశ్చిమదిశయం దున్నది. దానికవ్వల దక్షిణమున ఛాగ్పోరీకొండపై నొకదుర్గమును, దానికడ లామాలవైద్యపాఠశాలయుఁ గలదు. ఇది నదీతీర

మునసే యున్నది. వీటికినడుమ సుందరమంతమగు పట్టణముఖద్వారము నిర్మింపఁబడినది. లహాసాపురమందుఁగల బౌద్ధదేవస్థానములందు గొప్పది 'జోకాం' గనియు, నగరద్వారమునకు 'ప్గ్గోకలిం' గనియు పేరు లందురు. లహాసాపురి కైశాన్యదిశను మురువిహారభవనమున బౌద్ధకలాశాల స్థాపింపఁబడి పేరందినది కలదు.

ఈనగరమున నాగ (పాము) దేవస్థాన ముండుట విచిత్రము. దానిచుట్టును కందక మున్నది. యోగినుల గృహము, చీనావారిదేవస్థానము, శాసనస్తంభము, నాట్యశాల, చీనారాకొమరిత నీటిబుగ్గ, యూటోకువంతెన, అనంతజీవితబుద్ధదేవస్థానము, తురుష్క-స్థానవణిక్స్థానభవనము, బౌద్ధవిజ్ఞానముద్రాయంత్రస్థానమును లహాసాపురమున దర్శనీయములు. ఊరివెలుపలనున్న విహారత్రయము టిబెట్టురాజకీయతంత్రములను నడపుఁ బ్రభుత్వసంబంధములు. అవి డిబంగువిహారము, సేరావిహారము, గాడెన్‌విహారము లనంబడునవి. పర్వతపాదముననే యున్నవి. ఇందు డిబంగు ప్రపంచమందంతటను పెద్దమఠము. ఇం దెన్మిదివేల లామాలు వసించుచుందురు. పురమునకుఁ బశ్చిమదిశను రెండుమైళ్ళలోఁగల నీవిహారమున దలై లామాగారి ప్రత్యేకభవన మొకటి కలదు. ఇందుఁ బ్రభుత్వాలయ మొకటి యున్నది. ఈప్రాంతముననే నాఛంగ్‌ఛోస్కు యందు అనుపేరుగల మహామాయాదేవస్థాన మున్నది. పట్టణోత్తరపరిసరములందు సేరావిహారమును, అందుఁ బరీక్షాస్థానవిశ్వవిద్యాలయమును గలవు. ఇం దైదువేలు లామాలుందురు. ఈమఠమునందే బుద్ధభగవానుని దోర్జి (వజ్రాయుధము) ఉన్నదందురు. తక్కిన గాడెన్ విహారము తూర్పుగా ౨౩ మైళ్ళదూరమునందున్న మఠము. ఇందు టొసంగుకాపాభిక్షువుసమాధి కదు పవిత్రనంతము. వీరు బౌద్ధభిక్షువుల విధాననిర్మాత యనిరి. ఇట నాదరణ మధికము. (పోతలమఠము చూడుఁడు.)

పోతలవిహారము ౯౦౦ అడుగుల పొడవును, దానిపైన వారు నివసించుస్వర్ణభవనము 300 అడుగులయెత్తును గలది. మొత్తమున లహాసా పుణ్యస్థలము. దానిం జుట్టి ప్రదక్షిణ మొనర్ప నొకబాట కలదు. దానిపై భక్తులు ప్రదక్షిణ మొనర్చుచుందురు.

## లక్షణ [కావ్యమందలి లక్షణ]:—

కావ్యములంగూర్చి లక్షణ చెప్పఁబడినది. అలంకారశాస్త్రమున నిది చతుర్విధములుగ వివరింపఁబడినది. అవి ౧ వృత్తి, ౨ రీతి, 3 శయ్య, ౪ పాకము ననఁబడునవి.

౧ వృత్తి:- వృత్తి యన కావ్యవృత్తి యనిభావము. ఇది శబ్దమూలమనియు, కావ్యమూలమనియు, తిరుగ ద్వివిధము.

౧ శబ్దమూలవృత్తి లేక శబ్దవృత్తి:-శబ్దముల నాశ్రయించినవృత్తి యనిభావము. ఇది అభిధ, లక్షణ, వ్యంజన యని తిరుగ మూఁడువిధములుగనుండును.

౧ శబ్దవృత్తియందలి అభిధ:— ఇది రూఢిమూలమనియు, యోగమూలమనియు నిరుతెఱంగులు.

౨ శబ్దవృత్తియందలి లక్షణ:— ఇది జహల్లక్షణ యనియు, అజహల్లక్షణ యనియు, జహదజహల్లక్షణ యనియు మూఁడు తెఱఁగులు.

3 శబ్దవృత్తియందలి వ్యంజన:— ఇది శబ్దశక్తిమూల యనియు, అర్థశక్తిమూల యనియు, ఉభయశక్తిమూల యనియుఁ ద్రివిధము.

౨ వృత్తియందలి కావ్యము - కావ్యము నాల్గు తెఱఁగులు:—

[౧] కైశికి:—ఇది శృంగారకరుణా రసములందుండు కావ్యవృత్తి.

[౨] ఆరభటి:— ఇది భీభత్స రౌద్ర రసములందుండు కావ్యవృత్తి.

[౩] సాత్వతి.

[౪] భారతి.

౩ రీతి:— ఇది త్రివిధము.

[౧] వైదర్భి.

[౨] గౌడి.

[౩] పాంచాలి.

[౪] శయ్య - కావ్యమందలి కవిత్వధోరణి. ఇది యొకేవిధము.

౪ పాకము:— ఇది ద్వివిధముగఁ జెప్పఁబడినది.

[౧] ద్రాక్షాపాకము:—కవిత్వమర్థములోనికిఁ జొరకుండనే పైకిఁ గర్ణానందమును రుచించుచుండుటకు ద్రాక్షాపాక మనిపేరు

[౨] నారికేళపాకము:— కవిత్వము పైకి రుచింపనట్లు నటించుచు, అర్థముం బరిశీలించినతోడనే మహానందమగుచు రుచించుచుండుట నారికేళపాకమనఁబడును.

ఇంకను గొందఱాలంకారికులు పైకి రుచులు స్ఫురించుచు స్ఫురించకుండుచు నరటిపండుంబోలి, అర్థమున రుచించుచుండుపాకము కదళీపాకమనియు, పైకి, అతికఠినవాక్యములలో నిర్భేదమో యనునట్లుండి త్రికటువో యనిపించి లోనర్థమున రుచించు కావ్యపాకమును శిలాపాకమనియుఁగూడ ననియున్నారు.

**లక్షణ త్రివిధము:** ౧ జహల్లక్షణ, (జహత్ విడిచిపెట్టుట), అంటక యర్థమిచ్చుట.

౨ అజహల్లక్షణ (అంటియు విడక యర్థమిచ్చుట.)

౩ జహదజహల్లక్షణ (అంటీయుంటక యర్థమిచ్చుట.)

ఇంకను లక్షణదోషములు మూఁడు కలవు. అవి ౧ అతివ్యాప్తి, ౨ అవ్యాప్తి, ౩ అసంభవము నని.

**'లక్షణప్రమాణాభ్యాం వస్తుసిద్ధిరితి' న్యాయము:**—ఒకవస్తువు నెఱుంగుటకు దాని లక్షణములును, దానిం గూర్చిన ప్రమాణములును ప్రధానము లయ్యెను.

ఒకవస్తువుంగూర్చి (చెప్పఁబడిన) లక్షణముల వల్లను, దానింగూర్చిన ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన శాబ్దాదిప్రమాణములవలనను దెలియవలయునని భావము.

**లక్షణములు మంచివి గాని చిన్నదానికి లజ్జ లేకపోవుటయే నిదర్శనము:**—

(ఇది యాంధ్రలోకోక్తి.)

**లక్షద్వీపములు (లక్దీవ్స్):**—ఇవి హిందూ మహాసముద్రమున సింహళముకడనుండి సింహళ ప్రభుత్వమునకుఁ జెందినవి. అనేకములుంట నిట్లుపేరందినవి. గవ్వలు మొదలగునవి దొరకుతావులు, కొబ్బరితోఁటలు విస్తారముగఁ గలవు.

**లక్షనక్షత్రాలైన నొకచంద్రుఁడు కానేఱవు:**— (ఆంధ్రలోకోక్తి.)

**లక్ష్మణఫలము:**— ఇది రామఫలము, సీతాఫలములఁ బోలినది. దీనిని లక్ష్మణుఁ డరణ్యవాసకాలముల నేరితెచ్చి, భుజింప నాయనపేరయ్యెనని వాడుక కలదు.

ఇది చలువఁజేసి మేహశాంతి, పైత్యశాంతిఁ గల్గించునందురు. ఇది యరుదుగఁ గానవగుచుండు నడవిజాతిచెట్టు.

**లక్ష్మణుఁడు:**— ఈపేరుగలవా రిర్వురు కలరు. సూర్యవంశక్షత్రియులలో దశరథమహా రాజుసుతుఁడు, శ్రీరామునిసోదరుఁ డొకలక్ష్మ ణుఁడు. తల్లి సుమిత్రాదేవి. భార్య జనకమహా రాజు కన్నకూఁతురగు ఊర్మిళ. (దశరథుఁడు చూడుఁడు.)

మఱియొక లక్ష్మణుఁడు దుర్యోధనునిపుత్రుఁ డు. తల్లి భానుమతి.

**లక్ష్మి పంజిచెట్టు**—దీనిఁగూర్చి యంతిగాఁ దెలియదు. దీనియాకు స్త్రీలవంధ్యత్వము వాపు ననియు, పైత్యశాంతిఁ జేసి ప్రమేహము నడంచి, యించుక శ్లేష్మము నుద్రేకించు ననియు, వీర్యవృద్ధి కరమైనదనియుఁ జెప్పుదురు.

**లక్ష్మితాళము:**—
(తాళములు చూడుఁడు).

**లక్ష్మినారాయణచెట్టు (విషమంగ లపుఁజెట్టు):**— లా. Crinum Asiaticum. దీనిని విషమంగలఁపుఁజెట్టు, విషముంగలి చెట్టు ననియు నందురు. దుంపలనుండి లేచి చెంగల్వంబోలిన పెద్దయాకులు (రమారమి నొకగజము) పొడవుఁ గల్గి వర్షాకాలమునఁ దెల్లనిపువ్వులఁ బూచు చెట్టు. పూఁదోఁటలందు వై చెదరు.

దీనిదుంపరసము బాణములకు మన్యఁపుజనులుఁ దగిలించెదు విషఁపుఁ బదునువలనఁ గల్గెడిగాయముల మాన్పునందురు. ఆకునూరి యాముదమున వెచ్చఁజేసి పైనవైచి కట్టుటవలన రాచపుండు, గోరుచుట్టు, పంగలిజెష్ఠ, మాదలు మానుననియు, పసరుఁ జెవిలోఁ బోసిన కర్ణవ్యాధులు నివారణ మగుననియు నందురు.

**లక్ష్మినారాయణయోగము:**— భాద్రపదశుద్ధ ఏకాదశినాఁడు సోమవారముగాని, బుధవారముగాని, యై శ్రవణనక్షత్రము అతిగండము గాని, సుకర్మయోగముగాని, కల్గిన నాదినమున లక్ష్మినారాయణయోగము కల్గిన దినమని చెప్పఁబడినది.

**లక్ష్మిపంచమి:**—
(శ్రీపంచమి చూడుఁడు.)

**లక్ష్మివ్రతము:**— కార్తికబహుళ అమావాస్యదినమున సల్పుదురు.

**'లాంగలం జీవన మితి'న్యాయము:**— ఇది నాగలియే జీవనమని యర్థము. వ్యవసాయజీవనమని భావము. ఇటులనే 'అయుర్ధన' మనఁబడెడి ఉక్తియును గలదు. అనఁగా నాయుర్దాయము కల్గియుండుటే ధనమని భావము. బ్రతికి యుండిన పనిఁజేసి కుటుంబమును బోషింప ధనము సంపాదించుసని తాత్పర్యము. ఇది క్లుప్తపఱచి చెప్పఁబడిన ఉక్తి.

**లాంగిట్యూడ్, లాటిట్యూడ్ (Longitude Latitude:**— భూమియొక్క పటముల అడ్డనిలువుకొలతల గురుతు. (డిగ్రీగీతలు చూడుఁడు).

**లాంగుపార్లమెంటు (Long Parliament):**— బ్రిటీషుపార్లమెంటుసభకూడి నిల్వయుండి పనిచేయుటంగూర్చి తెలుపుట భావము.

ఒకతఱి బ్రిటీషుసీమలందు ౧౬౪౦ ప్రాంతముల రాజకీయమునందుఁ జికాకులు కలిగెను. భూపతి

స్వేచ్ఛానువర్తియై సంచరించుచుండెను. పార్లమెంటునందుఁ బ్రభువులసభలో మతగురువు లధిక సంఖ్యాకులుగఁ జేరియుండిరి. దానియంగీకారముఁ బడయకుండేఁ బ్రభువులసభ రద్దు పఱుపఁ బడ రాదని యొకశాసనమును గావించిరి. క్రీ. వె. ౧౬౪౨ మొదలు ౧౬౪౯ వఱకు Civel war తిరుగుఁబాటు వ్యాపించెను. ౧౬౪౮ డిశంబరులో ౧౪౩ Presbyterian సభ్యులు బలాత్కారముగ సభనుండి వెడలఁగొట్టఁబడిరి. తక్కినవారు (Rump) సభను సాఁగించిరి. భూపతిని విచారించుమని న్యాయస్థానము నేర్పఱచిరి. ప్రభువుల సభను రద్దుపఱచితిమని తీర్మానించిరి. ఇట్టుల క్రీ. వె. ౧౬౫౩ వఱకుఁ బ్రభుత్వమును నడిపిరి. అత్తఱి Cromwell మహాశయుఁడు దాని నంతమొందించెను.

౧౬౫౯ మే, మాసమునఁ దిరుగా Rump పార్లమెంటు ప్రారంభమై ౧౬౬౦ మార్చి ౧౬ తేదీని పార్లమెంటు రద్దుపఱుపఁబడిన శాసనముఁ జేయఁబడెను. ఇత్తఱుణమున క్రీ. వె. ౧౬౪౦ మొదలు ౫౩ వఱకు విలియమ్ లెంథాల్‌గారు 'స్పీకరు' గ నుండిరి. కాని యీసందడిలో నీశాసనములు గౌరవింపఁబడి నిల్పియుంచఁబడలేదు.

ఈచివరికాలమునందు క్రీ. వె. ౧౬౪౦ నవంబరు ౩ తేదీయందారంభించిన పార్లమెంటుసభ [illegible] ౧౬౫౩ వఱకు నిలచియుండె. ౧౬౫౯ లోఁ దిరుగఁ జక్కఁబఱుపఁబడెను. దీనికి 'లాంగు పార్లమెంటు' అని పేరిడఁబడి వాడఁబడుచున్నది.

## లాంగులిగోత్రము:—

(అశ్మరథ్య ఉపగణము చూడుఁడు.)

## లాంగూలహస్తము:—

(హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.)

## లాంగుల్యానది:—

(నాగావళీనది చూడుఁడు.)

**లాంగ్ (Long):—** వాణిజ్యపరిభాషా పదము. దీర్ఘమని యర్థము. దీర్ఘకాలమునకు అనఁగా మామూలుకన్న నెక్కువకాలము పరిమితితో వ్రాయఁబడినహుండీకి 'Long dated Bill' అనిపేరు. మూఁడుమాసముల పరిమితితో నున్న బిల్లులయొక్క Exchange వ్యాపారమునకు 'Long exchange' అనియెదరు. అమెరికాదేశమున ధర పెరుఁగునను నాశతో వాటాలను గాని సేకరించుచు ధర పెరిగినతరువాత లాభమందు వర్తకునకు 'Long stock' అనియెదరు. ఈతఁ డింగ్లాండుదేశమున Bull వర్తకునకుఁ బ్రతి.

**లాంటెనిస్సు ఆట (Lawn Tennis):-** ఈయాట పెబ్బదియెన్మిది యడుగుల పొడవును ముప్పదియాఱడుగుల వెడలుపును గల్గిన యొక రంగమున నాడుదురు. ఇది యెక్కువగఁ బ్రచారమందిన యాట.

పొడవును సమముగ రెండుభాగము లొనర్చి, ఇరుదెసల నాల్గడుగుల స్తంభములఁ బాతి, మూఁడడుగుల [illegible] వెడలుపుగల చిక్కపువలను [illegible] కట్టుదురు. దాని కిరుదెసల నాడువారు [illegible] ఇద్దరుగాని, యిద్దరిద్దరుగాని [illegible] బంతులను [illegible] ప్రయోగించి నాడుదురు. [illegible] బంతులు గుండ్రనివై యుండి 'Tennis balls' అనియు, [illegible] నాడు సాధనమునకు Tennis racquet లేక Tennis bat అనియు [illegible] ఈయాటను, పద్ధతులు కలవు. [illegible] ఆటకు 'Game' అనియు, సంపూర్ణమగునాటకు 'set' అనియుఁ బేర్లు.


1 Fore hand Service Ball.


2 Fore hand drive Ball.


3 Fore hand stroke Ball.


4 Finish of reverse American service.


5 Reverse American service Ball.


6 Reverse American service Ball.


7. Over head Volley Ball.


8 English Back hand stroke Ball.


9 American service Ball.


10 Fore hand drive Ball



11 Fore hand service Ball.



12 Low back hand Volley Ball.



13 Back hand Chop.



14 Finish of fore hand drive ball.



15 Low fore hand Volley Ball.



16 Horizantal back hand drive Ball.



17 Back hand stroke Ball.



18 Forehand half Volley Ball.



19 Back hand half Volley Ball.

**లాండాఫ్ త్రీ మూన్సు** (Land of three moons):— మొరాకో దేశపుజాతీయ పతాకముపై మూఁడుచంద్రుదు లుంట విదేశస్థులచే నిట్టిపేరుక గల్గింపఁబడినది.

**లాండింగు ఆర్డరు:**— (Landing order):— వాణిజ్యసంబంధ పరిభాషాపదము బాకీలు పూర్తిగఁజెల్లింపఁబడె ననియు, సరకులను స్టీమరునుండి రేవునకు దింపవచ్చు ననియు, కస్టమ్సు ఉద్యోగి ఓడ ప్రధానోద్యోగికిఁ బంపుపత్రము.

**లాండౌ** (Landau):— నాల్గుచక్రములు గల గుఱ్ఱపుబండి. దీని [illegible] యున్నారు.

తొలుత బవేరియాదేశమున Landau అను పురమున నాహింపఁబడి చేయఁబడుట నాపేర య్యెను. పైకప్పును గేవలముమూసియుంచుటకుఁ గాని, సగము తెఱచియుంచుటకుఁగాని, అంతయు గేవలము వాల్చివేయుటకుఁగాని యేర్పాటుచేయఁ బడినది.

**లాంప్బ్లాకు** (Lamp black):— ఇదియొక నుసిరంగు. దీని నొకయాంగ్ల సుప్రసిద్ధ రసాయనవేత్త 'Nearly pure from of Carbon consisting of soot produced by the imperfect Combustion of Coal-tar, resin, oil or gas' అని వివరించి యున్నారు.

అచ్చుపనివాలందు విస్తారము వాడఁబడుచున్న దీపపుమసి.

**లా ఆఫ్ గ్రావిటేషన్** (Law of gravitation of Sir Izac Newton):— దీనిని 'న్యూటన్సు లా ఆఫ్ గ్రావిటేషన్' అని యెదరు. 'Every particle in the universe attracts every other particle with a force depending directly upon the product of the masses of those particles and universely as the Equare of distance between them' అని వ్రాయియున్నది.

ఈసిద్ధాంతముమేరకు సూర్యుఁడు, చంద్రుఁడు, భూమి యనంబడు త్రిపదార్థముల పరిమాణ గమనవేగ పరిస్థితులం గుడించుట చాల కష్టతరము. ఈలెక్కను సుప్రసిద్ధ ఎస్ట్రోనోమీశాస్త్రవిదులగు గణితశాస్త్రవిశారదులు దుస్సాధ్యమని నుడివియున్నారు.

సూర్యునింగూర్చి యసలే లెక్క కుదురలేద నియు, చంద్రునింగూర్చి Lunar Theory లేక Hill Brown Theory అనంబడునది సరిపోవు ననియుఁ జెప్పఁబడినది. (హిల్బ్రౌన్ థియోరీ చూడుఁడు. ఎస్ట్రోనోమీ శాస్త్రముచూడుఁడు).

**లాకులు** (Locks):— కెనాల్ ఎంజనీరింగునందు వివరింపఁబడిన యొక కట్టడము చూడుఁడు.)

కేనాలును [illegible] మాత్రమే [illegible] నిర్మింపఁబడక [illegible], [illegible] నేర్పా[illegible]. [illegible] గూడ [illegible] [illegible]. నీటిమట్టమునకు క్రిందికి దిగఁబడు [illegible] నిర్మించి, పడవలను దానిగుండా [illegible]. లాకునందు ప్రక్కలగోడలను రెండుకడలందుఁ దలుపులును గల్గి, మూఁసినతఱి నీరు పోరరానిదిగ (water tight) గాఁ జేయఁ బడును. తలుపులందుఁగాని ప్రక్కగోడలయందుఁ

గాని తూము లమర్పఁబడి, Shutter లనంబడు తలుపులచే భద్రపఱుపఁబడి యుండెడిని.

కాలువయొక్క యిరుదెసలనుండియుఁ బడవ లరుదెంచి లాకునుదాఁటి, యవ్వలి కరుగవలసిన యదనున, లాకునందలి నీటిమట్టమును, లాకులో నికి రానిచ్చు ఓడ కనుకూలించునటుల, నీటిమట్ట మును క్రిందికాల్వమట్టముతోఁగాని, పైకాల్వమట్ట ముతోఁగాని సరియగునటులఁ దొలుతఁ గునుర్చు కొని, ఆవైపు (లాకు) తలుపులం దెఱచి యా పడవను లాకులోనికి రానిచ్చెదరు. పిదప నాతలు పులను మూసి తూములగుండా నీటిని లాకులో నికి రానిచ్చుటగాని, లేక లాకునుండి క్రిందికి వెడలఁజేయుట గాని, జరిపి, లాకుమట్టమును మార్చి, పడవల నివ్వలకవ్వల కరుగఁజేతురు.

నీటితూములు లాకుతలుపులందుఁగాని, ప్రక్క గోడలందుఁగాని, రెంటియందుఁగూడఁగాని యమ ర్పఁబడవచ్చును.

ఇంక నీసందర్భమున వేఱొకసంగతి వివరింపఁ బడఁదగినది కలదు. సముద్రమునఁ గొన్నితావు లందు పోటుపాటులుఁగల్గుచుండుట యందరెఱిం గినవిషయమే. ఇవి గాఢముగాఁగల తావులందు రెంటి నీటి మట్టములకును, పదియడుగులవఱకు భేదముండును. (పోటుపాటులు చూడుఁడు). అట్టి తఱి నచటిహార్బరుడాకులందు నీరు చాలకపోవ చ్చును. లేక యధికము గావచ్చును. (హార్బరు ఎంజినీరింగు చూడుఁడు). గాన నీటిమట్టము నెప్పుడు నవసరమగు నొకరీతినుంచవలసి వచ్చును. ఓడల కసౌకర్యముఁ గలుగకుండునటుల హార్బరు డాకుమొగను ద్వారములఁబోలి యొకలాకును, అట్టితావులందు నిర్మించి, నీటిమట్టమును సంరక్షిం చుచుందురు. దానిగుండా యోడలు జనుచు, హార్బరుడాకులలోనికిఁ జేరుట గాని, దానినుండి వెడలుచుంటఁ గాని, జరుగుచుండును.



ఆంధ్రదేశమున లాకు నీటితో నిండుటను 'లాకు మట్టమైన' దనెదరు. ఇంకను నసూయత, హేళనములతో నొకనియాస్తి యంతయు నప్పుల పాలై యాతనికిఁ దలముల్కఁ గలిగెనని తెల్పుట కును, 'లాకు మట్టమైన' దని యనుటయుఁ గలదు.

**లాకౌట్ (Lock out)**— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. క్రేమకలహములవలన ఫాక్టరీలు మొదలగు సంస్థలయజమానులగు employers తమకర్మాగారములు యంత్రశాలలకుఁ బనివాండ్రు రాకుండునటుల మూసివేయుట, పనివాండ్రు పనికి రాక నిరోధించుట వారుచేయుపనికి 'strike' అని పేరు.

**లాగాన్ (Lagan).**— వాణిజ్యపరిభాషా పదము. ఓడ సముద్రమున నపాయస్థితియం దుం డుతఱి తేలిపోఁదగినసామానులను పైడెక్కుపై నుంచుటకుఁ బేరు, లేక అట్టిసామానులు.

**లాగోస్ సెటిల్‌మెంటు:**— ఆఫ్రికాఖండ మున, నాఫ్రికాపశ్చిమభాగమున నప్పర్గినియా దేశమునం దున్నబ్రిటీషువారి Settlement స్థలము. ఇది Bight of Benin యం దున్నది. (అప్పర్గినియాదేశము చూడుఁడు).

**లాగ్ (Log):**— వాణిజ్యసంబంధపరి భాషాపదము. పొగయోడ పరుగునుగు ర్తించి లెక్కించుటకు సాధనముగ నుపయోగించుతాడు. ఇది యేఁబది యడుగులు జరగిన నొకమైలని గుర్తిం చియున్నారు. ఇట్టిలెక్కలను, ఓడప్రయాణమందు జరిగిన నితరవిషయములును వ్రాయుపుస్తకము నకు 'Log-book' అనిపేరు.

**లాచెస్** [Laches]:—వాణిజ్యసంబంధ పరిభాషాపదము. అశ్రద్ధ, అజాగ్రతకార్యములను వర్తకవ్యాపారమున నొనర్పఁబడినవాటికిఁ బేరు.

**లాజిక్కు** (Logic):— దీనిని కొందఱు విద్వాంసు లాంగ్లమున 'science of reasonning' అనియు మఱికొందరు 'science of laws of thought' అనియు నిర్వచించియుంట, భరతదేశఁపుఁ దర్కశాస్త్రసంబంధియేమో యని పించకపోదు. ఐరోపావిధానమునఁదొల్లింటి లాజిక్కు గ్రీకువిద్వాంసుండగు ఆరిస్టోటల్ పండితుఁడు తన Organon గ్రంథమున వివరించియున్న విధాన మని తోఁచెడిని. పిదపఁ గొంతకాల మిది వ్యాపింప కున్నను, Abelard పండితుఁడు మొదలగువారు తమకాలమున నీవిద్యావ్యాప్తిం గావింప, విశ్వ విద్యాపీఠములం దిది బోధింపఁబడుచు వ్యాపించి నది. ప్రాన్సిసు బేకన్ పండితునినాఁడు, లాజిక్కునకు నూతనమార్గము లేర్పడుట 'Novum Organum'అనఁబడినది. ఇది ద్వివిధము. Inductive Logic reasons from the parti cular to universal and deductive Logic from the universal to the Particular అని చెప్పఁబడినది.

(పంచతంత్రము చూడుఁడు. హితోపదేశము చూడుఁడు).

**లాటదేశము**:. దక్షిణగూర్జరభూమి, ఖండేశముసహా మాహీ తపతీ నదులమధ్యప్రదేశ మని గరుడపురాణము ౫౫ యందుఁజెప్పఁబడినది. దీనిని డాక్టరు భాండార్కరు పండితుఁడు తన history of Deccan Sec II. p. 42 యందంగీకరించి వ్రాసియున్నాఁడు. వాత్స్యాయనకామ సూత్రములం దీదేశఁపుఁబ్రశంస కలదు. Col Yule పరిశోధకుఁడు ఉత్తరకొంకణము దక్షిణ గుజరాతదేశము నిందులో నుండెనని యభిప్రాయ పడియున్నాఁడు. ఇందు సూరత్, బరోచి, ఖైరా మండలసీమలును, బరోడాసంస్థానభాగములును నుండెనని తలంపఁ బడుచున్నవి. అశోకుని ధవళిశాసనమున 'లాతికా' యనియు, గిరినార్నిల శాసనమున 'రిష్టిక' (బహుశారాష్ట్రికా) యని యుఁ బేర్కొనియున్నారు.

బరోడాయందు దొరకిన రాగిరేకుశాసనమున లాటేశ్వరదేశమునం దెలాపూర్ అనియు, దాని యేలికలు వివరింపఁబడిరి. గాని, లాటదేశము, లాటేశ్వరదేశము వేర్వేఱని Journal of asiatic Society of Bengal 8 (1839) p 292 యందుఁగలదు.

లాటదేశఁపు నాగరబ్రాహ్మణులు నాగరలిపిం గనిపెట్టిరని యొకవాదుక గలదు. గాని దేవనాగర లిపి తొల్లింటిదనుట నిస్సంశయము గాన నిది ప్రవాదమై యుండనోపు.

**లాటిట్యూడ్**:—
[డిగ్రీలు చూడుఁడు.]

**లాటిట్యూడినేరియానిజమ్** [Latitudinarianism]:— సామాన్యనిబంధనలను, శాసనములను, లెక్కఁజేయని స్వాతంత్ర్యవాంఛ.

క్రీ. శ. పదునేడవశతాబ్దమున హేతువాదము నకు నిలువనట్టి మూఢనిబంధనలను పాటింపనికొంద ఱింగ్లాండు చర్చిపరిపాలనము నెదుర్కొనిరి. వారిని 'Latitudinarians' అనిరి. అటువంటి స్వతంత్రతత్వమునే 'లాటిట్యూడినేరియానిజమ్' అందురు.

**లాటినిజమ్** [Latinism]:— లాటిను భాషాసాంప్రదాయము ననుసరించిన శైలికిని, భావప్రకటనమునకును, వర్తించును.

**లాటిట్యూడు, లాంగిట్యూడు డిగ్రీలు, భూమధ్యరేఖ, మెరిడియన్:**—పటములందు భూమధ్యరేఖ [equator) యనఁబడు భావితరేఖ యుండును. దానికి సున్న సంఖ్యగా నీయఁబడియుండెడిది. దాని కుత్తరమునను, దక్షిణమునను, దానితో సమానముగా [parallel] ధ్రువములకడఁ దొంబదిసంఖ్యవఱకు గీయఁబడిన అర్థరేఖలు లాటిట్యూడ్ [latitude] డిలనంబడుచున్నవి. వీటి కడ్డముగ గీయఁబడునిలువు గీతలు లాంగిట్యూడు డిగ్రీ [longitude degrees] లనంబడుచు, ఇంగ్లాండుదేశపు గ్రీనిచ్ పురముమీఁదుగా గీయంబడిన నిలువుగీత సున్నగాఁ గైకొని, ప్రపంచముచుట్టు నిలువుగీతలడిగ్రీలు గీయఁబడియుండును. ఇవి యన్నియు నొకధ్రువ ములకడ నుండును. తొంబది డిగ్రీకూటమునుండి వేరుధ్రువముకడఁ దొంబదిడిగ్రీలకూటమునకుం జేరుకొనునట్లు గీయంబడి యుండెడిని. గాన నుత్తర దక్షిణ ధ్రువములలో నేదియైనను లాటిట్యూడు ౯౦ డిగ్రీలు, లాంగిట్యూడు సున్నఁగల తావులుగ నెఱుంగఁదగి యుండెడిని.

**లాటిన్భాష**— ఇటలీదేశ మధ్యభాగమున 'Latium' అనుగ్రామ ముండెను. దానిం జుట్టి గొప్పమైదానము కలదు. దానిని తొల్లింటికాలమున 'Latium Country' యనియు, 'Latium plain' అనియు ననుచుండిరఁట. అందుఁ బ్రజలు మాటలాడుభాషకు లాటిని, లేక (తర్వాత) లాటిన్ అని పేరు వాడుక యయ్యెను. రోమనులప్రాబల్యకాలమున వారిభాషను పవిత్ర భాషగఁ గైకొనియుంట, దేశదేశములందు వ్యాపించి వాడుకసందెను. ఇందుఁ గొన్నిపదములు సంస్కృతభాషాపదములతోఁ గొంతవఱకు సంబంధమునుం గల్గియుంటఁ గాననగుచున్నది.

**లాటిన్భాషాసామెతలు:**—

(లోకోక్తులు చూడుఁడు).

సంభవించినసంగతినుండి తక్కినదంతా యోచించుకొనఁదగినదే యగును.

మితిమీఱుట వాదహేతు వగునా?

రోగముకన్నఁ బరిహారము తక్కువదే గాని, యెక్కువది కానేరదు.

చేయుచున్నపనిని వీడుట శ్రేయమగునా?

నీపనులను నీవే చేసుకొనుచుండుము. దైవము సాహాయ్యము చేయఁగలఁడు.

పరద్రవ్యకాంక్ష స్వార్థనాశనమునకుం దారిఁ దెఱచును.

సత్యసంధునికన్న సత్యమే గొప్పది.

నిజమగువిద్య దాఁగుడుమూఁత లాడునదే కాని, యెదుట నిలుచునది కాదు.

దురాశ శపింపఁబడినదోషమువంటిదే.

దేనినైనను త్వరితముగ నిచ్చివేయువారికి దేవుఁడు రెండుసార్లిచ్చుచుండును.

పిల్లలకుఁ దల్లిదండ్రులపోలికలు, గుణములు తప్పనిధర్మములే.

సల్లాపములు యత్నించుటలకి గూఢమగునట్లుఁ జేయరాదు.

యుద్ధవిరామముతో సైన్యాధికారము సివిల్ అధికారమునకుఁ దావొసంగవలసినదే.

ఏకార్యమునందైనను ప్రథమప్రయత్నమే నష్టముగ నుండునది.

ఆచారమే ధర్మశాస్త్రము.

రుచులకొఱకుఁ దగాదా లేమిటి?

మృతిఁజెందినవారింగూర్చి మంచి తప్ప మఱి యేదీ మాటలాడుట అసమంజసము.

లేనిదానినుండి వచ్చునదీ లేదు.

వచ్చేమూల్యము అమ్మితే వచ్చునుగాని, మార్చితే వస్తుందా?

హాస్యము అర్హత మీఱకుండా నుంచినంత కాలము రుచికరమే.

తనస్వదేశముకొఱకే మైనచోఁ జచ్చుటకూడా శ్రేయమే యగును.

బ్రతికియున్నంతకాలమువఱకే ఆశలు.

మనహాయింపులు మూలసూత్రమును పరీక్షించునవియే.

సింహమును పంజానుపట్టి పోల్చవచ్చును.

నరకములో దిగుట సులభమే; తప్పించుకొనుట కష్టముగాని.

కోపము పాటలనుగూడ పాటింపఁ గలదే.

శతృవులనుండి యైనను మంచివిద్య నేర్చుకొనవలసినదే.

ఆకాశము విఱిగి పడిపోయినా సరే, న్యాయము వీడరాదు.

అదృష్టము పెక్కండ్రకుఁ గలుగవచ్చును; చాలాచాలా, ఈవుల నీయవచ్చును; గాని యెవ్వరికిఁ బూరిగా నుండనేరదు.

బలము గట్టిజాతి నరిగిపోఁ జేయఁజాలకఁబోవచ్చును గాని; యదేపనిగఁ బడుచుండునీటిబొట్లు లరుగఁజేయఁగలవు.

విధి నెఱుఁగకపోవుట క్షమాపణకుఁ గారణము కానేరదు.

కోప మొకవిధమగు తాత్కాలికఁపు వెఱ్ఱియే.

రచించుట కష్టసాధ్యము గాని, విమర్శించుట సుకరమే.

పొగడ్తలందినవానిచేఁ బొగడఁబడుట మంచిది.

కార్యనిమగ్నత మనుష్యులం గూడఁగల్గించును.

వ్రాసినలేఖ సాక్షియై నిలిచియుండును.

గొప్పపట్టణము గొప్పయెడారివంటిది.

సత్యము జయమందునంతటి గొప్పది

అభ్యాసమునం దధికబలము కలదు.

ఆరోగ్యముఁగలశరీరమున బలమగుమనస్సు

జాగ్రత అంతా భవిష్యత్తుకొఱకే.

అసలుపేరు మార్చుకుంటే అప్రతిష్ట పోతుందా?

ప్రకృతినాసిం జేసి మూసం బగులఁగొట్టినట్లు. అసఁగా వాసింబోలినవాడింకొకఁడు తిరుఁగఁ గలుగలేదని భావము.

కారాని కార్యములకే దైవమును ప్రార్థించి యర్థింపుము; ఆయ్యేకార్యములు నీవే చేసికొనుము.

గౌరవములను కాంక్షించి యుండరాదు. మఱియు వాటిని నిరసింపరాదు.

తన కన్నీ తెలుసు ననెడిదుస్సర్వజ్ఞత్వము లోకులచే గౌరవింపఁబడదు.

జ్యూపిటర్ ఐనను లోకులనందరిని సంతోషపఱుపఁజాలఁడు. జ్యూపిటర్ లాటిన్భాష మాటలాడుప్రజలకు వెనుక దైవమైయుండెనఁట.

నష్టపఱుపఁజూచువారికే నానాచిక్కులుఁగలుట.

ప్రభువే లేకపోతే కలహకారణమే యుండకఁబోవును.

ఔన్నత్యము సుగుణసంపదవలనఁ గల్గునది కాని, జన్మతః కల్గునది కాదని యెఱుంగవలయును.

బ్రతికియుండినమాత్రమున నిజముగ నది జీవితము కానేరదు; ఆరోగ్యముగనుండి జగమునసనుభవించుటయే నిజమగు జీవితము.

ఒకప్పుడు సత్యము శత్రువులను, పొగడ మిత్రులను, గల్గించుచుండగాని, ధైర్యముఁగలవారు సత్యమున్ను వీడరు.

మంచివాని కన్నీ మంచివే.

కాలముకొలఁదీ మర్యాదలు.

అపాయం దాఁటితే అందరినీ గేలిచేయుట యేనా?

నా దేశము నాకుఁ బ్రియమైనదే కాని, నా స్వాతంత్ర్య మంతకన్న ప్రియమైన దన్నట్టు.

ప్రతిష్ఠ ఆలస్యముగవచ్చి, శరీరముం గాల్చిన బుగ్గిని దాఁచును.

ఒకప్పుడు దోషమని తెలంపఁబడినవి కాలములు మారి మఱియొకప్పుడు గుణములుగఁ దోపవచ్చును.

అందరినీరక్షకులు కాస్తూంటే, రక్షకుల నెవ్వరు గాచుట?

ఏది వ్రాయఁబడినదో అది వ్రాయఁబడినదే.

దేవుఁడు నశింపఁజేయువారికి ముందుఁ దీవ్రత నొసంగును.

విన్నటులనే తిరుగ నేకరువుబెట్టుట.

సూదిమొనతోఁ దాఁకి చూపినట్లు.

ప్రజాక్షేమముకన్న నెక్కువ ధర్మవిధి కానరాదు.

కీ డెప్పుడూ అపాయ మొనర్చుటకే రాదు.

కనిపించుచుండునది నిజము కాకుండెనేని కట్టుదిట్టముగాఁ జేయబడినదై యుండవలయును.

కలిగినఘనతలు కలిగిన ట్లుండిపోతాయా?

ఒకరి జ్ఞాపకచిహ్నము నీచుట్టూ వెతుకుతుంటే దొరకునదియే.

దేశమందు శాంతి, సమ్మదీ, కావలెనంటే ప్రతివాఁడూ యుద్ధసన్నద్ధుఁడై యుండవలసియుండును.

నేను నీవెట్లుండెదవో అట్లున్నాను. నీవు నేనుండినట్లే యున్నాఁడవు.

దేవతలందరూ కోపం తెచ్చుకోనిమ్ము.

ఆలస్యముగా విందుకువచ్చేవారి కన్నీ మిగిలితే విందే.

కాలములు మారిపోతే మనమూ దానితోఁ బాటువారమే.

కాలము పోతుంది గాని తిరిగీ రాదు.

గ్రీకులు బహుమానములు తెచ్చినప్పుడు మేము భయపడుతాము.

పిశాచముతోఁ బట్టుకొని లాగినట్లు (లేఁపెట్టినట్లు.)

నిశ్చితమైనపద్ధతి లేనిస్థలము పద్ధతిలేని స్థలమే.

రోమకపురికొఱకుఁ బ్రపంచకముకొఱకు.

నీకుఁ గావలసినది నైకొమ్ము.

సమ్మిడి దగ్గరలేనిబాటసారి దొంగలవద్ద పాటలు పాడితే ఏమిభయము?

దానివిలువెంతో అంతకు.

కడుపు ఆకలిఁ గొనినయదనుఁ జెవులు పని చేయవు. (అనఁగా ఏమిచెప్పినా నాటదనిభావము)

మంచి నంగీకరించి, చెడ్డను వెలువరించినట్లు.

ఆయుధబలముకన్న ధర్మపథబల మధికము

మానవధ్వని దైవవాక్కుగా నెఱుంగఁ దగినది.

**లాటెన్‌లోహము (latten)**:—రాగి, జింకు, పాల్లు కలపి చేసినలోహము. ఇత్తడి యని మన మనుచున్నలోహము.

దీనినుండి చేయఁబడుటచేఁ జెంబునకు హిందీ భాషయందు 'లోటా' యనిపేరయ్యెనని కొందఱు తలంచుచున్నారు. క్రీ వె. పదమూఁడవశతాబ్దమునుండి వాడుకనందియున్న లోహము.

**లాక్టిక్‌ఆసిడ్ (Lactric Acid):—** పాలు తోడుం బెట్టుట కుపకరించు నొకవిధమగు పులుపుద్రావకము.

[కెజియిన్ పరిశ్రమ చూడుడు.]

**లాడములు:—** బరువుమోయునట్టియు, బండ్లు లాగునట్టియు, పశువులలో గుఱ్ఱములకు, నెద్లకు, కాళ్ళ డెక్కలు గలవు. వాట్లకు లాడములు మేకులచే బిగింతురు.

సృష్టివలన గుఱ్ఱములు, నెద్దులు, ఏనుగులు, మేకలు మొదలగునవి తమతమ శరీరములబరువు తోం గాళ్ళను భూమిపై నాని, నడచుటకు గట్టి డెక్కలను, నడచుటచే డెక్క లరంగిపోవుటను భర్తీచేయుటకు డెక్కలు పెరుంగుచుంటయు నైసర్గికలక్షణము గల్గియే యున్నవి. ఐనను కాలములు మారి మారి బరువులుమోయుటయు, బండ్లు లాగుటయు మొదలగు నెక్కువపూనికంగల పనులు గుఱ్ఱములకు, నెద్దులకు విధింపంబడినపిదప నీయెక్కువపూనిక (Strain) వలన డెక్క లీజంతువుల కెమగుటకును, అరుగుదల (రాపిడి) కిని, సరిచాలక, అరుగుదల యెక్కువయై కొంతకొంత కాలము పనిజేయంజాలక, ఊరుకొనవలసినచ్చుటం బ్రారంభమయ్యెను.

ఇంకను మెత్తనిమట్టిబాటలకుబదులు కఠినమైనరాతి మెటలింగులు పరువంబడిన యిక్కాలంపుబాట లేర్పాటైనపిదప వాట్లపై నడచుటవలన, నెక్కువ త్వరితముగ డెక్క లరిగిపోవుచు, మెత్తగాళ్లుం బడుచుండుట యెక్కువయ్యెను.

మానవబుద్ధి దీనికిం బ్రతిహతముగ నినుపలాడములు డెక్కలకుం దగిల్చి, మేకులచే బిగించి, డెక్కలరగిపోవుబాధను నివారింపంగల్గెను. నైసర్గికము చేసినయేర్పాటు కక్కఱలేకపోయెంగాని కృతకమూలకల్పితరక్షణమే, రక్షకమయ్యెను.

**లాదులవంతెన (arch bridge):—**

(వంతెనలు చూడుడు.)

**లాప్లాటాదేశము (La Plata):—** దీనిని 'యునైటెడ్‌స్టేట్సు ఆఫ్ లాప్లాట' యనుచున్నారు. ఇది లాప్లాటానదియొక్క యేటవాలు ప్రదేశ మగుట ఫలవంతమై, జనబాహుళ్యమై, కొన్ని యభిప్రాయభేదములుం గల్గి, మూండు ప్రజాప్రభుత్వదేశములుగ విభాగమై యున్నవి. లాప్లాటాయందుం బరగుయే దేశము కలిసియున్నది. లాప్లాటాయంతయుసమతలప్రదేశము. జలసమృద్ధిం గల్గి ఫలవంతమై యున్నది. పచ్చికబయళ్ళు విశేషముగనుండి, పశుసమృద్ధిం గలదేశముగ నున్నది. ఇచటిపచ్చికబయళ్ళకు 'పంపా' (Panpas) లని పేరు. అడవిగుఱ్ఱములు వీటియందు మేయుచు వృద్ధిబొందుచుండును. ప్రజలు ముఖ్యముగ నిండియన్లతులవారు. తొల్లింటి స్పానియావారి సంతతి వార మని చెప్పుకొను గాచోజాతివా రడవిగుఱ్ఱములం బట్టుకొనుటయందు నేర్పరులు. వారు తోలుపట్కావంటి లాస్సో యనుదానిని విసిరి, గుఱ్ఱములను బట్టుకొందురు.

పరగుయేయందు 'మాటె' యనంబడు వేఱొక జాతి తేయాకుచెట్లు కలవు. అది యట్లుపయోగించు చున్నారు. ధాన్యము, తోళ్ళు, ఎముకలు, మాంసములు, ఈదేశములనుండి యెగుమతిచేయంబడుచున్నవి. ఈదేశములందుం బశువు లపరిమితముగం గలవని చెప్పంబడినది. క్రీ. వె. ౧౫౫౩ లో స్పానియాదేశస్థు లీదేశమునకుం జేరుచు, నివసింప మొదలిడిరి. క్రీ. వె. ౧౮౧౧ లో స్పానియాసంబంధమునుండి విముక్తినంది ప్రజాప్రభుత్వముల నేర్పఱచుకొనిరి. పరాంగుయే యిందుం జేరినదిగాని, యచిరకాలముననే స్వతంత్రదేశమాయెను. కొంత కాల మంతఃకలహము లుండెను. ఉరుగుయే,

ఆర్జంటైను, పారాగువె, దేశము లిందులోని ప్రజాపాలనభాగములు.

**లాప్లాండర్సు:—**
[ఎస్కిమోజాతి చూడుఁడు.]

**లా బైలా పద్ధతులు, ఏర్పాటు-ఉపపద్ధతుల ఏర్పాటు** [Law and by law]:—దేశమునకంతకును వర్తించునటుల శాసన నిర్మాణ ప్రజాసంస్థ (Legeslative body) యభిప్రాయముమేరకు దేశపాలకుండగు సరపాలునిచేఁ గాని, ప్రజాపాలనమే సంపూర్ణముగాఁగల దేశము లం దగ్రాసనాధిపతివలనఁగాని యంగీకరింపఁబడి, ప్రజల నందఱను శాసించునది. శాసనము, పద్ధతి, [Law] యనఁబడును.

ఇంక నాశాసనఁపు టేర్పాటుల నమలుజరుపు వేర్వేఱు సంస్థలు [Local bodies] గాని, వేట్లనిమిత్త మాశాసనముచేయఁబడినదో, ఆయిసుపదారిసంఘములు, స్త్రీమరుసంఘములు మొదలగు సంస్థలు గాని, ఆశాసనఁపు టేర్పాటుల నతిక్రమించకుండఁ దమ కవసరమగు మఱికొన్ని స్థానికములుగనుండు [Local] పద్ధతుల నేర్పఱచుకొని, ప్రభుత్వముయొక్క యంగీకారమును బడసి, యమలునం దుంచవచ్చును. అట్టిపద్ధతులకు By laws ఏర్పాటుపద్ధతులు అనిపేరు. అమలు జరుగుటయం దీరెండు నొకేవిధముగాని, వీట్లకుఁగల భేదము Law దేశమంతట నమలుజరపఁబడునదియు, By law ఆయాస్థానములందు మాత్రమే పద్ధతివలె నమలు జరుపఁబడునదియు నై యుండును.

**లాభపురము (లవపురము, లోహావార్, లాహెహార్):—** గిరినార్, శత్రుంజయం దలి జైనుశిలాశాసనములందు లాభపుర మని పేర్కొనఁబడిన యీపురముంగూర్చి Tod's Rajastan I 224 యందుఁ దొల్లింటిపేరు "లవవర" మనియుఁ (శ్రీరామునిసుతుండగు లవుని పేరం బరఁగు పురి) బిదప నది లోహావారుగ మాఱి, యిప్పుడు 'లాహోర్' అనఁబడుచున్నదనియు వివరింపఁబడినది. లాహోరిప్పటిపంజాబు దేశమునఁ బ్రధాననగరమై యున్నది. (పంజాబు దేశము చూడుఁడు).

**లాభము గూబలలోనికి వచ్చినట్లు:—** (ఆంధ్రలోకోక్తి).

**లాభములేక శ్రేష్ఠిగా రేటిలోఁ బడరు:—** (ఆంధ్రలోకోక్తి).

**లాభాలవారు:—** వీరు వైశ్యకులజులు. 'లాభాల' అనునది వీరియింటిపేరుగ గ్రామనామముఁగానోపు. వీ రిప్పు డెవ్వరును తెలుచుఁ గానరాకుంట, వీరిగోత్రము తగ్గిపోయినదనియు, వైశ్యులం దిక్కాలమున శేషించిన నూటవక్కగోత్రములు విస్తారముగ మాత్రము నిలచియున్న వనుచున్నారు. (వైశ్యగోత్రములు చూడుఁడు).

లాభాలవారికి సంతులేనందున వైశ్యులందరేకగ్రీవముగఁ గొలతలందు, తూనికలందు, లెక్కించుటయందు నొకటవయంకె తటస్థించినప్పు డెల్ల రెల్లరవలె నొకటియని లెక్కింపక 'లాభాలు' అనుచుండుటకును, బిచ్చమువైచుతఱి బియ్యముం బట్టి పిడికిలియందు బొటనవ్రేలిం దూరముగ నుండునటుల (ముడువక) దూరముగ నుంచుటకును, ఏర్పఱుచుకొనిరి. దీనివలనఁ గొంచెము పాటిబియ్యఁపుగింజలు వేఱుగఁబడును. ఇది సంతతిలేని లాభాలవారియుద్ధరణార్థము పిండప్రదానము వంటి దందురు.

ఇట్టి యాచారము తాము వైశ్యుల ౧౦౨ గోత్రములలోని వైశ్యులమే యను కళింగకోమటులయందుఁ గలదు. (కళింగకోమటులు చూడుఁడు. ఆర్యవైశ్యులు చూడుఁడు.) లాభాల వారిని పర్లాకిమిడిప్రాంతము, టెక్కలిప్రాంతము, (కొత్తపిల్లి గ్రామం) న స్వల్పముగ నున్నారని తెలియుచున్నది.

## లామకాయనగోత్రము:—

(కుశికగణము చూడుఁడు).

లామా:— బౌద్ధమతసన్యాసులను భరతదేశమున భిక్షువు లనెదరు. టిబెట్టు, నేపాలము, మొదలగు హిమాలయ దేశములందు 'లా మా' యనెదరు. బర్మా, సయాం మొదలగు దేశములందు 'పుంగి' యనుచున్నారు. అందఱు బౌద్ధసన్యాసుల తెగలే. సింహళద్వీపమున బౌద్ధ సన్యాసి యనియు, భిక్షువనియు, స్వామి యనియు నందురు. (లుంగీ చూడుఁడు).

## లార్డు [Lord]:—

(లేడీలార్డు చూడుఁడు).

లార్సెనీ (Larceny):— వాణిజ్యసంబంధపరిభాషాపదము. ఒకరియాస్తిని దురుద్దేశ్యముతో నింకొకరు హరించుట, యాక్రమించుట. ఇది రెండువిధములు. దొంగతనమునకు Simple Larceny అనియు, ఎదుర్కొనిని ఆస్తియజమానిని లేక రక్షకుని కొట్టిగాని, బలాత్కరించిగాని, హరించికొంపోవుట 'Compound Larceny' అనియుం బేరులు.

## లావ గోత్రము:—

(అగస్త్య ఉపగణము చూడుఁడు).

## లావద్యగోత్రము:—

(గర్గఉపగణము చూడుఁడు).

## లావలిగోత్రము:—

(కథ లేక కథ్యగణము చూడుఁడు).

లావా (Lava):— అగ్నిపర్వతములకార్యముగాఁ గరఁగినరాళ్ళకు 'lava' అనిపేరు. (పర్వతములు చూడుఁడు.)

## లావుగోత్రము:—

(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.).

లావోజాతివారు:— సయాం, హిందూచీనా దేశములందుఁగల తాయిజాతితెగప్రజలు. వీరికి సయాం దేశభాషయందు 'లావో' లని పేరు. వీరును దాసినే వాడుకొనుచున్నారు. వీరు బౌద్ధమతమువారు. పందిళ్ల వలె నెత్తగు స్తంభములపై వేయఁబడినగుడిసెలలో నివసింతురు. నేతగాండ్రు. సయాందేశమున వీరు పదిలక్షలజన మున్నారు.

## లావోస్ దేశము:—

(షాన్దేశము చూడుఁడు).

## లావ్యగోత్రము:—

(అగస్త్య ఉపగణము చూడుఁడు).

లాస్ ఆఫ్ గ్రావిటీ (Laws of Gravety):—

(సోలార్ సిస్టమ్ చూడుఁడు — ఎస్ట్రోనొమీ చూడుఁడు).

లాస్టేజి లేక లేస్టేజి:— వాణిజ్యసంబంధపరిభాషాపదము. ఓడయొక్క విధిబరువుకొఱకు వాడఁబడిన యిసుక, రాయి మొదలగు ballast సరకులు.

## లాహవిగోత్రము:—
(ఉపమన్యు గణము చూడుడు).

## లాహోరు (తొల్లింటి లవపురము; లోహవార్)
(లాభపురము చూడుఁడు).

## లాహోరు నగరమందలి బాద్షాహి మసీదు:—
ఇది క్రీ. శ. ౧౬౭౩ లో ఔరంగజేబుచక్రవర్తిచే నిర్మింపఁబడినది. ఇది యటనే గాక మధ్యఆసియా యంతటిలోను పెద్దమసీదని పేరందినది. ఇది మహమ్మదీయుల భరతదేశపు యాత్రా స్థలములలో నొకటిగ నున్నది. ఇందు మహమ్మదు జగద్దేశికులు పలుసంగరములలోఁ దనలాంఛన పతాకముగ నెగురవేయుచుండిననాటి శావుటా కలదు. దానిపై నరబ్బీభాషాక్షరములతో ఖురాన్ షరీప్ నందలి యొకపద్యము నగిషీపనితో గుట్టఁ బడియున్నది. దానినుండి యీమసీదత్యంతపవిత్ర స్థలముగా నెన్నఁబడుచు యాత్రాస్థలముగ నున్నది.

దీనినిర్మాతయగు నౌరంగజేబుచక్రవర్తికి జ్యేష్ఠ సోదరుఁడగు దారాషికోమరుండు, తద్గురుండగు మియాన్‌మీర్‌గారి గోరీపై నొకగొప్పమసీదును నిర్మింపఁదలంచి, యీమసీదునందలి పరికరములు, సామానులం జేర్చియుండెననియు, ఔరంగజేబు చక్రవర్తి దారాషికోమరుని వధించి, సామానులంగ్రహించి కొని, మక్కానగరమునందున్న అల్ వలీదు మసీదుపోల్కెగాఁ గట్టించెననియు వాడుక కలదు. నిర్మాణముపై 'ఫిదైఖాన్' అనునాయన నిర్మాణకాలమునం దధికారిగా నుండెనని యందు శాసనము కలదు. బటాలాకాపురస్థుడుగ నుండిన 'సుజన్‌రాయి' అని వారివ్రాతగ్రంథమగు చరిత్రి 'ఖలాసత్ - ఉల్ - తవారిఖ' నం దీలాహోరు బాద్షాహిమసీదు నిర్మాణమున (ఆదినములలో) కాఋలకులరూప్యములు వ్యయమైనటుల వ్రాయఁ బడియున్నది.

ఈమసీదు ఆగ్రాయెఱ్ఱరాతితోను, మార్బెలు రాళ్ళతోను కట్టఁబడినది. ఆదేశమునందు 'అబ్రిరాయి' యని వాడుచున్న 'అబ్రి' రాతితో మసీదుపై కెక్కు సోపానములు నిర్మింపఁబడినది. కాబూలునుండి రప్పింపఁబడినవి. ముఖద్వారఁపులావు తొబ్బదియడుగుల యెత్తుఁ గలది. దానిగుండా నేగఁగనే ౫౩౦ అడుగులపొడవు, ౫౭౭ అడుగులవెడల్పుఁ గల్గినవాకిలియు, దానినడుమఁ గాలుసేతులఁ గడుగు జలకుండమును గలవు. ఈవాకిలికిఁ బశ్చిమదిశను మసీదు (ప్రార్థనాలయము) నిర్మింపఁబడి, పైకప్పుగ మూఁడుడోములు కట్టఁబడినవి. ముఖద్వారముక్రింద మార్బెలురాళ్ళు పఱువఁబడినవి. వాకిలినడుమనుండు నడకమార్గమునందును, జలకుండమునందును నామార్బెలురాతిఫలకములే పరువఁబడినవి. క్రీ.శ.౧౮౪౦ భూకంపము దీనిని గొంత నష్టపఱచెనట. ప్రక్కస్తంభములపై కెక్కి చూచిన నగర మంతయుఁ జక్కఁగఁ గానఁగుచుండును.

## లాక్షాయనగోత్రము:—
(నిధ్రువగణము చూడుఁడు).

## లాక్షిగోత్రము:—
(గవిష్ఠిరగణము చూడుఁడు).

## లాక్షేయగోత్రము:—
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

## లాక్ష్మణేయగోత్రము:—
(ఉపమన్యుగణము చూడుఁడు)

## ల్లానోస్ (Llanos):—
దక్షిణఅమెరికా దేశములం దడవులులేని సమతలప్రదేశములకు

'Manos' అని పేరు. (Land portions చూడుఁడు).

**లింగకవి - గంగకవి:**— ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవారు. వీరింగూర్చి యేమియుం దెలియకున్నది. లింగకవి నీలకంఠోపాసకుఁడనియు, గంగకవి నృసింహోపాసకుఁడనియు, లింగకవి సీతావిజయ మనునామాంతరముఁగల 'శతముఖరామాయణము' మొదటిమూఁడాశ్వాసములు రచించి, దానిని చిన్నాశెట్టిపుత్రుఁడగు పోచన్నపాలునకును, గంగకవి నాల్గవ యాశ్వాసము రచించి, దానిని భోగన్నపాలునకును, గృతు లొసంగి రనియుఁ జెప్పఁబడినది.

**లింగదొంతపాదు:**— ఇది దొండతో నేసంబంధము కలదిగాదు. అడవిపాదు.

దీని వేరురసముగాని, యాకురసముగాని నాలుకను శోధించుచు శుభ్రపఱచుననియు, నారోగ్యకరమనియు నందురు.

**లింగనమఖి కామేశ్వరకవి:**
(కామేశ్వరకవి చూడుఁడు).

**లింగపురాణము (లైంగ ము):**— ఇది మార్కండేయపురాణమునఁ జెప్పఁబడనే లేదు. దీనికి బదులు నృసింహపురాణము చెప్పఁబడినది. దేవీభాగవతమునఁ బదునేనవపురాణముగఁ జెప్పఁబడినది. తక్కిన వాన్నిటియందుఁ బదునొకండవదిగాఁ జెప్పఁబడినపురాణము. నందికేశ్వరప్రోక్తము. గ్రంథసంఖ్య ౧౧౦౦౦. కూర్మపురాణమునందు లింగపురాణము పదియవపురాణముగఁ జెప్పఁబడినపురాణము.

**లింగబలిజకులసులు:**— వీరు లింగధారులగు శైవులు. శైవపంచాక్షరిమహమును ప్రణవసహితముగ జపించు శివపూజాధురంధరులు. జంగమ మహేశ్వరులశిష్యులు. వీరికి 'శివయోగి' యనునామము కులబిరుదమని తెలియుచున్నది. వీరు ధరించి పూజించు శివలింగము ప్రళయకాల రుద్రుగిండగు శివుం డందురు.

వీరికి సోమరాజులు, మొరసిలరాజులు, ఏకోరాములు, పండితరాజులు ననువార్లు లాచార్యులు, మంత్రిపాఠకులుగ సృష్టింపఁబడినవారు కలరు. ప్రళయకాలరుద్రుని నాసికేంద్రియమునుండి ముచ్చరిగుద్రుం డుదయించెను. ఆతండే దేవాసుర యుద్ధములందు దేవతాపక్షమున యుద్ధమొనర్చి సహాయముచేసెం వాఁడు. ఆముచ్చరిగుద్రుని సంతతివారే వీరని యందురు. బసవారాధ్య సాంప్రదాయమును నవలంబించి యున్నారు.

**లింగమకుంట తిమ్మన్న కవి:**— ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. యాజ్ఞవల్క్యశాఖీయ బ్రాహ్మణుఁడు. కాశ్యపసగోత్రము. తండ్రిపేరు లక్ష్మయ్య; తల్లి తిమ్మాంబ. భట్టరు చిక్కాచార్యుని శిష్యుఁడు. పితామహుఁడు సర్వయ్య, పెద్దన్న రామకవి, అన్నలు. వృష్టికుండికా తీరస్థ లింగమకుంట గ్రామము నివాసము.

ఈకవి రామలింగకవితో సమకాలికుఁడఁట. రామలింగకవి నీతనికిఁ గూడ భట్టరు చిక్కాచార్యుండే గురుండఁట. వీరిద్దరు క్రీ. శ. ౧౬౭౦ ప్రాంతమునం దుండినవారు గానోపు.

తిమ్మకవి రచించినది సులక్షణసారము (లక్షణగ్రంథము). ఇం దాంధ్రశబ్దచింతామణి, ఉత్తమగండఛందస్సు, ఆంధ్రభాషాభూషణము, అధర్వణఛందస్సు, అనంతఛందస్సు, కవిసర్పగారుడము, కవిగజాంకుశము, కావ్యచింతామణి, కావ్యాలంకారచూడామణి, గోకర్ణఛందస్సు, ఛందోదర్ప

ణము, భీమనఛందస్సు, వాదాంగదచూడామణి, శ్రీధరఛందస్సు, సర్వలక్షణశిరోమణి, సర్వలక్షణసారసంగ్రహము ననులక్షణగ్రంథము లుదహరింపఁబడుటంజేసి యీతిమ్మనకవి గొప్పలాక్షణికుండనియు, పెక్కులక్షణగ్రంథములం బరిశీలించిన కవి యనియుఁ జెప్పవలయును.

**లింగమకుంట రామకవి:—** ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. యాజ్ఞవల్క్యబ్రాహ్మణుఁడు. కాశ్యపసగోత్రము తండ్రిపేరు లక్ష్మయ్య; తల్లి తిమ్మమాంబ. పితామహుఁడు సర్వయ్య. పెదన్న అన్నగారు. తిమ్మకవి తమ్ముఁడు. వృద్ధకుండికాతీరస్థ లింగమకుంట నివాసగ్రామము. (లింగమకుంట తిమ్మన్నకవి చూడుఁడు). భట్టరు చిక్కాచార్యుం డీతనిమతగురువు.

రచించినవి మత్స్యపురాణము, వామనపురాణము నను నాంధ్రపద్యకావ్యములు. ఈగ్రంథము లీతఁడు రచించుచున్నకాలమున నీతనితమ్ముఁడు తిమ్మన్నకవి వ్రాయుచుండెనఁట. కవి క్రీ. శ. ౧౬౨౦—౩౦ ప్రాంతకాలమునం దుండినవాఁడు నానోపు. ఈకవి 'చతుర్వాటికామాహాత్మ్య' మను పద్యకావ్యమును గూడ రచించెను.

## లింగమకుంటవారి వంశావళి

యాజ్ఞవల్క్యబ్రాహ్మణులు. కాశ్యపసగోత్రులు. వృద్ధకుండికాతీరమున లింగమకుంట కాపురము
లింగమగుండ అన్నయామాత్యుఁడు

శ్రీరామమంత్రి

అన్నప్పమంత్రి
భార్య అమ్మలమ్మ

సర్వరాజుకవి
భార్య భాగీరథమ్మ

తిమ్మన్న

గాదన్న

కేసవన్న

బసవరాజు

రామరాజు

లక్ష్మణరాజు

పెదన్న

రామకవి
మత్స్యపురాణము,
వామనపురాణము,
చతుర్వాటికామహా
త్మ్యము రచించినకవి.

తిమ్మన్న
సులక్షణసారము
రచించినకవి.

**లింగము:**—లింగము పరమేశ్వరచిహ్నముగ వీరాగమమునందుఁ జెప్పఁబడినది. శైవులు లింగమును బూజింతురు.

శ్లో॥ 'లీయతే గమ్యతే యత్ర యేన సర్వం చరాచరమ్। తదేతల్లింగమిత్యుక్తం లింగతత్త్వపరాయణైః॥

అని చెప్పఁబడియున్నది. అనఁగాఁ జరాచరాత్మకజగ మంతయు దేనినుండి కల్గి, దేనియందు సమసించిపోవుచున్నదో, యదియే (అనఁగా సృష్టి పరమేశ్వరుఁడే) లింగ మని భావము. ఇచట లీయ మను ధాతువునుండి ప్రథమాక్షరమును, గమ్య మను ధాతువునుండి ద్వితీయాక్షరమును గైకొనఁ బడినదని భావము. మఱియు నీలింగము శివపంచాక్షరీమంత్రమునకు నిరూపణాకారముగఁ జెప్పఁబడినది. పంచాక్షరీఛందస్సునందు—

శ్లో॥ ఓంకారవదనాదేవీ 'వా' 'య' కారపదద్వయీ

'శి' కారదేహమధ్యా చ నమకారపదద్వయీ

పంచాక్షరీ పరావిద్యా సతారా లింగరూపిణీ

శివమంత్రాభిధా శైవీ మమాంగే సుప్రతిష్ఠితా॥




అని చెప్పఁబడియుంట, 'ఓం' కారము ముఖస్థానమునను, 'న' కార 'మ' కారములు పదస్థానమునను, 'శి' కారము మధ్యమునను, 'వా' కార 'య' కారములు భుజస్థానములుగను దనరుట నొకయాకారముగ లింగ మేర్పడి, పంచాక్షరీ మంత్రము [సతారా] ప్రణవనిర్దిష్టమై, శివలింగముగనాయెనని భావము.

ఇంకీ నీశివలింగమును లింగతత్త్వపరాయణులు, ఆరుభాగములుగ విభజించిరి. అవి ౧ అధః పట్టిక యనియు, అధఃకంజ మనియు, కంఠము లేక గళ మనియు (దీనినేమధ్య మనియెదరు), ఊర్ధ్వకంజ మనియు, ఊర్ధ్వపట్టిక యనియు (దీనినిపానవట్ట మనియెదరు), ఆద్యప్రదారిక లేక లింగము లేక శిరస్సనియుఁ జెప్పఁబడినది.




(గౌరీలతాలింగమండలము, అధ్వలు చూడుఁడు).

ఇంక శివలింగములు దేవాలయములందుఁ బ్రతిష్ఠింపఁబడునవి లింగ మనియు, బేర మనియు, శాంకర మ్మనియు త్రివిధములుగ నుండును. శాంకర మనునది శక్తిచిహ్నముఁగల్గిన బాణలింగ మని చెప్పఁబడినది.

దేవతార్చనయం దుంచి పూజించులింగములు బ్రాహ్మణులకు రసలింగము, క్షత్రియులకు బాణలింగము, వైశ్యులకు స్వర్ణలింగము, శూద్రులకు శిలాలింగము సర్వోత్కృష్టములని చెప్పఁబడినది. దీనిం గూర్చి శివమహాపురాణము ౫ — ౧౧ — ౧౮ అధ్యాయములందుఁ గొంతివఱకుఁ జర్చింపఁబడినది. శైవులు ధరించుశివలింగములు పురుషులు స్ఫటికశివలింగములును, స్త్రీలు కుమారటావులనంబడుబలపఁపుశిలాలింగములును నైయున్నవి. నర్మదయందు దొరకునవి బాణలింగములు కలవు. నర్మదానదీతీరవాసులు వారిదేశభాషయందు 'నర్మదమే కంకర్ సబ్ శివశంకర్' అని భక్తిపారవశ్యమున వచించుదురు. అనఁగా నర్మదయందలిరాళ్ళన్నియు శివలింగములే యని యర్థము. కొన్ని నర్మదబాణలింగములందు శక్తిచిహ్నములం గల్గినవియు, పార్థపాశుపత మనుచిహ్నముం గల్గినవియుఁ గూడఁ గలవు. కొన్ని స్ఫటికసంబంధబాణములు గూడఁ గానవచ్చుచున్నవి.

**లింగాచారము**:—ఇది శైవాగమములందుఁ జెప్పఁబడిన పంచాచారములలో నొకటి. ౧ సప్తవిధములగు వేధాదీక్ష, ౨ సప్తవిధములగు మనుదీక్ష, 3 సప్తవిధములగు క్రియాదీక్షలు లింగాచారముగఁ జెప్పఁబడినది. (ఏకవింశన్మహాదీక్షలు చూడుఁడు).

**లింగాయతులు (వీరశైవులు)**:—కల్యాణపురము రాజధానిగ మహారాష్ట్ర, కుంతలదేశమేలిన జైనమతస్థుండగు చాళుక్యనరపతి బిజ్జల మహారాజుకడ మంత్రియగు బసవేశ్వరుం డీమత విధానమగు బసవాచారశైవము నేర్పఱచిన మతోద్ధారకుఁడు. ఈయన శైవులందఱకు భక్తియోగమును బోధించినవాఁడుగఁ జెప్పఁబడెను. బసవేశ్వరునియింటిపేరు మండంగివారు. తండ్రి మాదరాజు. తల్లి మాందాంబ. లింగధారియగు శైవబ్రాహ్మణుఁడు. ఉపనయన సంస్కారమును నిరసించెను. వేదములను పాటింపలేను. శివభక్తికిఁ గుల మొకయాటంకము కారాదని విధించెను. కాన నాకాలమున నొకసంఘముగ మాత్రముండిన వారి యనుచరశైవవర్గము వారికి పిదపఁ గ్రమముగ నేకస్తోమ యొకకులముగ నయ్యెను. వారినే లింగాయతు లందురు. ఇటీవల వారియందుఁగూడ భేదము లేర్పడినవని తలంపఁబడుచున్నది.

బసవమంత్రిని జైనుండగు బిజ్జలభూపతి తన నగరమునకు రావించి వధింప, నటనున్న సంగమేశ్వరశివలింగమునం దైక్యమైరని చెప్పఁబడినది.

**లిక్విడ్ ఎసెట్సు (Liquid assets)**:- రూకలుగా వెంటనే మార్చఁగలనోట్లు మొదలగు ఆస్తులు.

**లిక్విడేటెడ్ డేమెజెస్ (Liquidated Damages)**:—వాణిజ్యసంబంధపరి భాషాపదము. తొలుతనే యొకకార్యమున నష్టము వాటిల్లునేని దానికిఁబరిహార మింతయని యేర్పఱచుకొనియున్న దాని కీపేరు నాడుచున్నారు.

**లిగ్నైటు లేక బ్రౌన్‌కోల్ (Lignite or Brown coal)**:— రాక్షసబొగ్గు, అదిని కర్రయని యందు రెఱుంగుదురు. భూపుటమునఁ గొంత కాల మున్నచో నీమార్పు కలుగును. అట్టివి

పూర్తి గానుండ దానిం దర్శించినచో బనుపురంగు ధాతువుఁ గల్గియుండెడిని. దానికి లిగ్నైటని పేరిడియున్నారు. ఈమధ్యస్థితియందుఁ గల్గుపోలిక యధికముగ్గఁ గన్పించెడిని. జర్మనుదేశమున నీ లిగ్నైటు వంటచెఱకుగ వాడఁబడుట గాననయ్యె డిని. దీనియందు 'జెట్' [Jet] అనంబడు నొక భేదజాతి కలదు. దాని నాంగ్లమున 'Bovey coal' అందురు.

**లిగేసీ [Legacy]:—** వాణిజ్యసంబంధపరి భాషాపదము. ఉద్దేశపత్రమూలము [will] గ నిచ్చిన యీవి. ఇవి మూడువిధములు. ఆస్తి మొత్తమునుండి ఖర్చించియిచ్చినదానికి General Legacy అనిపేరు. నియమించిన ప్రత్యేకపు టాస్తి నొక్కరికొసఁగుటకు 'Specific Legacy' అనిపేరు. కొంతసగదిమ్మన్నతిట నట్టిసగదు ప్రత్యే కముగ లేనిచో నాస్తిని మార్చి దానిం బరిపూర్తి చేయుటకు 'Demonstasive Legacy' అని పేరు.

**లిటెరిజమ్** (Leterism):—క్రీ. శ. (1837-19122) సుప్రసిద్ధుఁడగు Joseph lister శస్త్రవైద్య నైపుణ్యముచే శస్త్రవైద్యమునందుఁ బట్టిశోధనము సలిపి కనిపెట్టినపద్ధతులను Listerism అందురు. ఇతఁడు 1897 నందుఁ బ్రభువు (Lard) అయ్యెను.

**లితుఆనియాదేశప్రభుత్వము** (Lithuania):—ఐరోపాఖండమునందలి బాల్టిక్కు సంస్థానములలో నొకప్రజాప్రభుత్వ సంస్థానము.

నలుఁబదివేల యెన్మిదివందల యేఁబదిచతు రపుమైళ్ళవైశాల్యమనియు, నిరువదిరెండులక్షల తొంబదివేల సంఖ్యయనియుఁ జెప్పఁబడినది.

**లిథోగ్రాఫీ (Lithogrphy):—** గ్రీకు భాషయందు Lithos అనిన రాయి లేక శిలా ఫలక మనియు, graphein అనిన వ్రాయుట యనియు నర్థములు. తొల్లింట రాతిపలకలపై నల యురూపమును వ్రాసి, వ్రాసినసిరా గట్టిపడున ట్లారఁబెట్టి, దానిని నీటితోఁదడిపిన సిరావ్రాసిన తావున జిడ్డుసిరా గానఁ [సంటక] దక్కినతావంత నీటిచెమ్మఁగల్గియుండునట్లొనర్చి, తిరుగ నూనెలతోఁగల్పి యుండిన జిడ్డుసిరా యలఁది కాగితముపై నొక్కిన నీటిచెమ్మఁగలతావుల సిరాయంటకఁ దొల్లివ్రాసిన తావులనే సిరాయంటి, యారూపమే కాగితముపై నంటి, రూపము ముద్రితమగును. పిదప నక్షరముల నపసవ్యముగ రాతిపై వ్రాసి ముద్రించుటయు ప్రారంభమాయెను. ఈపద్ధతి నేఁటికిని హైదరా బాదునగరమున నరుదు, పారసీ భాషలను కాగిత ములు లిథోముద్రణము చేయుచుండుటఁ గాన నగును.

ఇప్పుడు పాశ్చాత్యదేశములందు దీనిపై నభివృద్ధిగ రాతిపలకలకు బదులు అల్యూమినియమ్ రేకులు, జింకు రేకుల నుపయోగించియు, వాటిపై యంత్రసా హాయ్యమున రూపములను జతిగించియు, కొన్ని మార్పులం గల్పించియు, లిథోముద్రణముఁ జేయు చున్నారు. ఇట్లీయుగమునఁ జేయఁను లనేకము లిప్పుడు యంత్రసాహాయ్యమున జరుపుచుండు నభివృద్ధి యెల్లయెడల విదితము.

దీనిని Planographic printing అనియు, నందురు. సమతలప్రదేశముద్రణముగనున్న విద్య. ఐరోపాఖండపుమధ్యప్రదేశములం దిందుకు మె త్తని సున్నపువచ్చు రాతిపలకల నీపనులకు వాడు దురు. ఇక్కాలమున సిమెంటు, జింకు, లేక అల్యూ మినియమ్ భాగములు కల్పి చేయఁబడు పలకల గూడఁ గృతకశిలాఫలకములుగ నుపయోగింపు

చున్నారు. వీనికి synthetic stone slabs అనియెదరు.

**లిథోలజీ (Lithology)**:—పాషాణతత్వమును పరిశోధించుకళ. దీని 'Petrolpgy' అని కూడ వాడుదురు.

**లినోలీయమ్ బట్ట (Linolium)**:— ఇది లినెన్ బట్ట. చావిడులందు నేలపైఁ దివాచీల వలెఁ బఱచుట నుపయోగింతురు. బట్టపై బంక, కార్కుపొడి, లిన్సీడ్ ఆయిల్ మొదలగువానిని పాలు గుదిర్చి యుడికించి, రంగులు కలిపి వేఁడిచేసి గట్టిపఱచెదరు. ఇది యంగుళము నాలవవంతు దళముఁ గలిగియుండెను.

**లిపి**:— ధ్వను లక్షరములుగను, ధ్వనుల కూటమి నర్థముల నెఱింగించు మాటలుగను, వాల్ల సముదాయమే భావముల నెఱింగించు వాక్యములుగను, ఆవాక్యసమూహములు గ్రంథములుగను, వాఙ్మయముగఁ దనరెడిని. ఇంక ధ్వనులకు గురుతులుగ వ్రాయఁబడుచిహ్నము లక్షరములనఁబరఁగులిపియే గాని వేఱు గాదు. అక్షరమనఁ జెడిపోయి నశింపక నిలచియుండునది యెఱుంగవలయును. ఈయక్షర సమామ్నాయమున కాంగ్లమున "alphabet" అనియెదరు. (అక్షరములు చూడుఁడు).

మాటలాడినతఱి నాధ్వని యొకతఱి వినిపించి నశించును. లిపితో వ్రాయఁబడినయక్షర ములటులఁ గాక నిలచియుండునుగాన నక్షర మనఁబరగెను. దీని కింకను వర్ణ మనిపేరు కలదు. దానికి రంగని యర్థము. అనఁగా రంగుపూయఁబడినది భావము. నల్ల రంగగు సిరా (కజ్జలము లేక కాటుక) యంటునట్లుఁ జేయుటఁ గాన లిపి వర్ణ మగును.

లిపి లేక లేఖనము ననుపదములు లిప్ అను సంస్కృతధాతువునుండియు, లిఖ్ అనుసంస్కృత ధాతువునుండియుఁగల్గినవి. లేపనము (లిప్ ధాతువు) నను రంగుతోఁ బూయుట యనియు, లేఖనము (లిఖ్ ధాతువు) నకుఁ జెక్కుట లేక గీకుట యనియు, భావములు. మొదటిది సిరాతో నక్షరములు వ్రాయుటను, రెండవది రాతిపలకలు, లోహపు రేకుల పైన నక్షరములను జెక్కుటయు, తాటియాకుల పై (గీకుట) వ్రాయుటలను దెలిపెడిని.

లిపి వేర్వేఱుభాషలకు వేర్వేరై యుండును. (పాశ్చాత్యపరంపర చూడుఁడు. హీయిరోగ్లిఫిక్ చూడుఁడు. క్యూనీఫారమ్ లిపి చూడుఁడు. ఫోనీషియాలిపి చూడుఁడు. లేక [illegible]లిపి చూడుఁడు. సెమెటిక్కులిపి చూడుఁడు).

**లిపోగ్రమేటిజమ్ (Lipogramati-sm)**:—గ్రంథకర్తలు పద్యములనుగాని, వచనమును గాని, వ్రాయునపుడు దచ్చులలోఁ గాని, హల్లులలోఁ గాని, యొకటిగాని, కొన్నిటినిగాని, యక్షరములు రానీయకుండ వ్రాయుట.

గ్రీకుదేశపుఁగవియగు (Lasus) అనునతఁడు క్రీస్తునకుఁ బూర్వము 500 ఏండ్లనాఁ డీపద్ధతిని రచించెను. తెలుఁగునందును నిరోష్ఠ్యనైషధము మొదలగునవి కలవు.

**లిప్పు - ఇరిగేషన్:**

(ఇరిగేషన్ చూడుఁడు.)

**లిప్ రీడింగు**:— నోటి కదలికం జూచి మాటలు గ్రహించువిధానము.

**లిబరాలిజమ్ (Liberalism)**:—అనఁగా (Liberal) 'లిబరల్' పార్టీ యనఁబడు ప్రజాసా

తంత్ర్యవాదులయొక్క సిద్ధాంతము. క్రీ. శ. 1886 సంవత్సరమునం డైర్లాండు దేశమునకు Home rule నిర్ణయించుసందర్భమున నింగ్లండుప్రధాన మంత్రియగు (W. E. Gladstone) గ్లాడ్ స్టోను మతమునకు భిన్నముగ బ్రిటీషుపార్లమెంటు నం దీపార్టీ బయలుదేఱినది.

ఒకయధికారియందుగాని, యొకజాతియందుగాని, సర్వాధికారములు కేంద్రీకరణమై యుండ రాదనియు, ప్రజలకు వ్యక్తిస్వాతంత్ర్య ముండవలెననియు, లిబరల్ పార్టీవారి ముఖ్యసిద్ధాంతము. మతాధికారములందును, రాజకీయములందును నీ పార్టీ కార్యక్రమము కలదు. అమెరికాసంయుక్త రాష్ట్రములకు బదునాఱవ యధ్యక్షుఁడగు అబ్రహాములింక నీతత్వము ననుసరించియే శ్వేతజాతులకు, బానిసలగునీగ్రోజాతివారికి స్వేచ్ఛనొసంగి బానిసతనమును తొలఁగింపఁజేసెను.

పందొమ్మిదవ శతాబ్దమునసనే Church of England యొక్క నిరంకుశమగు మతాధికారమును తొలఁగించుటకు Liberation Society స్థాపింపఁబడినది. నిరంకుశాధికారమునుండి ప్రజాసంఘము నుద్ధరింపఁ బాటుపడువానిని Liberator అందురు.

**లిబ్నిట్జియానిజమ్** (Leibnitzrianism):-Libnitzఅనువానియొక్క తత్వము. ఈశ్వరుఁడే యీప్రపంచమును నిర్మించినాఁడనియు, నీప్రపంచము సర్వోత్తమమైనదనియు నీ తత్వమే 'optimisam' అనఁబడు పరిణామవాదమునకు మూలబీజ మని చెప్పఁబడినది.

**లిబ్యాప్రదేశ సీమ**:— ఈప్రదేశభూమి యిటలీదేశమునకు దక్షిణమునందున్న సిసిలీద్వీపమునకు దక్షిణభాగమున మధ్యధరాసముద్రమున కవ్వలితీరము నంటి, (అనఁగా ఆఫ్రికాఖండపు టుత్తరతీరమునంటి) యించుమించు తొమ్మిదివందలమైళ్ళ పొడవును, నూటయేఁబదిమైళ్ళ వెడలుపును గలిగియుండిన భూభాగముగ దలంపఁబడుచున్నది. ఇది రోమకసామ్రాజ్య ముండిననాఁడు కడుప్రశస్తమైన పంటభూమిగ నుండి, యేఁటేట నాహారపదార్థములఁ బండించుచు, నిటలీదేశమున కనుపుచు, రోమకచక్రవర్తిగారి పాలనమునం దుండెడిదఁట. అనఁగా నిది యించుమించు రెండువేలసంవత్సరములక్రిందటిమాటయని వేఱుగ వ్రాయ నక్కఱయుండదు. అక్కాలమున నందు 'సైరిన్' అనుపేరుగల రేవుపట్టణము మూఁడు లక్షల జనాభాఁగలిగి గొప్పవర్తకస్థలమై యుండెననియుం జెప్పఁబడినది. రోమకసామ్రాజ్యము భగ్నమై కాలము గడచి, పరిస్థితులు మాఱి, సహారాయెడారినుండి గాలి కిసుక యెగిరివచ్చి పంటపొలములం బాడుఁజేయుచు, చిన్న పెద్ద యిసుకమేటలనుసైచివేయు, ప్రజలును క్షీణతనంది నడుమనడుమ మిగిలియున్న ప్రదేశములకుఁ జేరుకొని కొంచెముకొంచెము పంటలం బండించుచు బీదలై మనుచున్నారు. వారిని లైబియనులనివాడుదురు గాక. లైబియా యనుపే రిటాలియను లిడినదియేనట. ఇది రోమనుల 'derilict country' అని ప్రభుత్వమువారి కాగితములందుఁ గలదు. క్రీ. వె. ౧౯౩౦ నాటి కాదేశమున నేఁడు లక్షల లైబియనుప్రజలును, నేఁబదిలక్ష లిటాలియనుప్రజలును నుండిరఁట. దేశవిస్తీర్ణము ౭౦౬,౦౦౦ చౌకఁపుమైళ్లుగ నిటాలియను పత్రిక యొకటి వ్రాసియుండెను.

రోమకసామ్రాజ్య మస్తమించినపిదప లైబ్యా దేశము తురుష్కసుల్తానుగారిసామ్రాజ్యమునకుఁ జేర్పఁబడి కొంతకాల ముండి, తిరుగ క్రీ. వె. ౧౯౧౧ లో నిటలీప్రభుత్వమువారిచే నాక్రమింపఁబడియెను. అత్తఱి నిటలీభూపతిని వారిప్రజలు

లిబ్యాచక్రవర్తి యనుచుండిరి. పిదపఁ బంధొమ్మిండు వత్సరములనాఁడిప్పటి హిట్లరుగారు నియామకుఁడుగ నధికారపదవి నందెను. తోడనే లిబ్యాను కోలనీగా మార్పునందఁజేసి యిటలీప్రజల కందుఁ బ్రదేశముల నేర్పఱుచుచు, వలసఁబోవఁ జేయ మొదలిడెను. సముద్రతీరమున బాట వేయించెను. ఓడరేవుల నేర్పఱచెను. ఇది యంతయు నిటాలియనుల నటకు వలసఁబంపుటకైన ప్రోత్సాహకార్యములే యని చెప్పఁబడినది. కాని యిసుకమేటల నెత్తించి, బయలుదేఱఁదీయ నాయాసకర ద్రవ్యముగాని, తీరికగాని లేకుండెనని స్ఫురించెడిని. అప్పటినుండి జినోవా రేవునుండి యేటేట నూఱు కుటుంబములుగ (అనఁగా నెన్మిదివందల జనుల వఱకు) లిబ్యాకు వలసఁబోవ నారంభించిరఁట. సముద్రపుటంచునుండి దేశములోనికి నూఱు మైళ్ళదూరముఁదనుక నిటాలియనులు పోవఁదొడఁగిరఁట. తోడనే యిటలీప్రభుత్వము లైబ్యాను కోలనీగానుండ రద్దుపఱచి, యిటలీలోని యొక భాగముగఁ బ్రకటించిరి. వారికి భూమిశాశ్వతఁపు హక్కు స్థిరపఱుపఁబడలేదనియు, నెలజీతము లంపుచున్నారనియు, నిన్నిమువత్సరములు గడచినఁ బిదప నిరువది లేక యిరువదియైదుసంవత్సరముల కిస్తీలలో మూల్యము రాఁ బట్టుకొని, భూమి నాతనికి సిరపఱచెదరనియుం దెలిసెడిని. ప్రస్తుతి సంగర మీపరిస్థితుల నెటుల మార్చునో చూడ వలసియున్నది. ఈయుద్ధకాలమున వలసఁబోవుట నాపివేయఁబడె నందురు.

**లిమిటేషన్ (Limitation):**— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. నియమితి, హద్దు, అని యర్థము. ఇంతధరలోపుననే కొనవలయుననియు, నంతకన్న నెక్కుడుధరకుఁ గొననక్కఱలేదనియు, నొకవర్తకుఁ డొకవర్తకునికి వ్రాసిన



దానికి 'Limitation of price' అనిపేరు. కొంతసొమ్మువరకే భాగస్థులు బాధ్యతవహించునట్లుగ నర్వమగుద్రవ్యముఁ జేర్చి సంఘముగఁ బనిసేయుదానికి 'Limited Company' అనిపేరు. అనఁగాLimited Liabilityఅని యెఱుంగునది.

**లిమ్మొలజీ (Limmology):**— ఫ్రెంచి జన్యపదము. తటాకములయొక్క భౌతిక రూపములను, నిలువనీటియొక్క వస్తుతత్త్వమును (Bidogy), తెలుపునట్టి కల.

భూకంపములచేతను, అగ్నిపర్వతములు మొదలగువానిచేతను సహజముగ నేర్పడినట్టియు, పూడిపోయినట్టియు, మార్పులు దీనివలనఁ దెలిసికొనఁబడును.

**లిసెప్సు గారు:**— లీసెప్సను పేరును సర్వసాధారణముగ సూయజ్ కెనాలు త్రవ్వించిన ఎంజనీరని యందఱెఱిఁగియున్నారు. ఈమహనీయుని పేరు Ferdinand Vicomte De Lesseps. క్రీ. శ. ౧౮౦౫ సం॥ రము నవంబరు ౧౯ తేదీని వెర్సైలీస్ పురమున జన్మించినవాఁడు. ఫ్రెంచి యింజనీరు ౧౮౩౫ సం॥ రమున నుద్యోగియై, ౧౮౫౪ లో విశ్రాంతిఁగొనినవాఁడు. ౧౮౫౪ లో ననుమతులనంది ౧౮౫౮లో సూయజ్ కెనాల్ కంపెనీని నాయత్తపఱచి, పదునొకండువత్సరములు పనిచేసి, కాల్వను ద్రవ్వించి, క్రీ. శ. ౧౮౬౯ లోఁ గాల్వను ఇస్మాయిల్ పాషా (ఈజిప్టుభూపతి) చేతఁ గాల్వను దెఱపించినవాఁడు. ఈయన విగ్రహము సూయజ్ కెనాల్ కడఁ బ్రతిష్ఠింపఁబడియున్నది.

పిదప పెనామాకాల్వం ద్రవ్వించఁ బ్రోత్సహింపఁబడి, పనిపరిశీలనలు సరిగాలేక నీతఁడు చాల ధనముం గోల్పోయెను. క్రీ శ. ౧౮౯౪ డిశెంబరునెల యేడవతేది మృతిఁజెందెను. గొప్ప రాజకీయవేత్త.

చీనాదేశంపు బాటకొలత. ఇంచుమిం చింగ్లీషుమైలున మూఁడవవంతుఁగలదు. అనఁగా రెండుఫర్లాంగుల డెబ్బదిమూఁడుగజముల యొక్క యడుగుండును.

**లీకేజి (Leakage):**— వాణిజ్యసంబధపరిభాషాపదము. ద్రవపదార్థములు కొద్దిగనో, గొప్పగనో కాఱిపోవునని గుర్తింపఁబడి, యంగీకరింపఁబడినతరుగు. ఇట్టి తరుగువారుగులకు 'Leakage and Breakage' అనెదరు.

**లీగల్ టెండరు:**— వాణిజ్యసంబంధపరిభాషాపదము. దేశమునఁ బ్రచారములోనుండు ప్రభుత్వమువా రేర్పఱచిన నాణెములు (నాణ్యము.)

**లీ గాఫ్ నేషన్సు (League of Nations):**— ఇది పెక్కుజాతులకూటమి సభ. ఐరోపా మహాసంగ్రామానంతరమున నమెరికా సంయుక్తరాష్ట్రములకు నగ్రాసనాధిపతియగు Woodrow wilson మహాశయుని సలహాల మేర కాయన యేర్పఱచిన చతుర్దశాంశలను నిర్వహించి తీర్మానించు నధికారములతో 'లీగాఫ్ నేషన్సు' ఏర్పఱుపఁబడినది. Peace Conference నందు దీనింగూర్చిన యోచనలు జరిగి పారిసునగరమున క్రి. వె. ౧౯౧౯ సంవత్సరమునఁ దలపెట్టఁబడినది. ౧౯౨౦ జనవరి ౧౦ తేదీని Treaty of Versailles సంధిపత్రమున విధింపఁబడి, ప్రారంభమునందు నలుఁబదిరెండుజాతుల నారింమ సభ్యులుగఁజేరి యిప్పటికి ౫౭ గురు సభ్యులం గల్గియున్నది గాని యిందుఁ బ్రారంభము నుండి యమెరికాసంయుక్తరాష్ట్రములు చేరియుండలేదు.

లీగాఫ్ నేషన్సుయొక్క ప్రధానకార్యస్థానము స్విజర్లాండుదేశమునందలి జెనీవాపురమున నిర్మింపఁబడినది. ఇందు 'అసెంబ్లీ' యనియు, 'కౌన్సిల్' అనియు రెండుకూటములు కలవు. దీనికి Permanent secretariat ఏర్పఱుపఁబడి పనిఁ జేయుచున్నది. మఱియు దీని కనుబంధముగ హేగ్‌పురమున (హాలండునందు) Permanent Court of International Justice అనఁబడిన న్యాయస్థానమును, ఒక లేబర్ ఆఫీసును గూడఁ గలవు. ఎసెంబ్లిసభ యేటేట సెప్టెంబరు మాసమునఁ గూడుచుండును. కౌన్సిల్ సభయందు, ఫ్రాన్సు, గ్రేటుబ్రిటన్, ఇటలీ, జపాన్, జర్మనీ శాశ్వతసభ్యులు. తక్కినవా రేటేట నెన్నుకొనఁబడు సభ్యులం బనుపుచుందురు. ఇది సంవత్సరమున నాలుగుసారులుకూడి సభలు జరుపుచుండెడిని. సభ్యులు పరస్పరశాంతికి హామీచేయుటయు, యుద్ధమునుఁ బ్రకటించుటయు, ఒకరిరాజ్యము నొకరాక్రమించుటయు నను, లీగునకంతకు వర్తించునటెడి మూలసూత్రము కలదు. ప్రతిసభ్యుఁడు యుద్ధము సంభవించఁగల వ్యవహారములపట్ల లీగ్ యొక్క దృష్టిని మరల్ప నధికారముఁ గల్గియుండును.

సభ్యుల కభిప్రాయభేదము కౌన్సిలుచేతఁ గాని, న్యాయస్థానముచేతఁగాని, పరిష్కరింపఁబడును. పరిపాలనవ్యవహారములకు మాండేటు నిచ్చు నధికారము లీగునకుఁ గలదు. (మాండేటు చూడుఁడు). ఇటీవలఁ బత్రికావిలేఖరులు లీగాఫ్ నేషన్సుపటిమ తగ్గిపోవుచున్నదని యభిప్రాయము లిచ్చుచున్నారు. అమెరికాసంయుక్తరాష్ట్రము లిందుఁ జేర నిరాకరించుటయే మొదటిలోపమనియు, నైరోపారాద్యములలో డిక్టేటరుపదవుల నేర్పాటుతో దీనిస్థితిమారి దుర్బలమయ్యెననియు, అబ్సీనియా దీని నర్థించినకతన నిది యేర్పఱచిన iconomic boycott నిరర్థకమైన పిదప

దీనిపటిమ బయల్పడెననియు, మంచూరియా, స్పానియా, చీనా, జకోస్లోవేకియా దేశము లాజ్ఞాపత్రము లర్పించెగాని, లీగాఫ్ నేషన్సు ఏమియుం జేయకుండుటయే నిదర్శనము లనియు, దీనిభవిష్యత్తింకను నిరీక్షించి చూడవలసియే యుండు ననెదరు.

**లీచీపండ్లచెట్టు** (Litchi):—ఇది చీనాదేశపు దక్షిణభాగములనుండి యుత్తరప్రదేశములకు వ్యాపించినచెట్లని చెప్పఁబడినది. ఆకులు కాడకిటునటు క్రమముగ నాలుగులేక యైదుజతలుగ నుండి, తెల్లనిగుత్తులవలెఁ గాడలం బూచును. కాయలలోని తాటిముంజరగువలె నున్నగుంజు నల్లనిపిక్కను జుట్టుకొనియుండి కడు రుచ్యముగా హాయినడంచి, వేసవియందనుకూలముగ నుండును.

**లీజ్** (Lease):— వాణిజ్యసంబంధమగు భాషాపదము. కౌలు, సేద్యము, నివాసము, వాడుక మొదలగు భూములు, గృహములు, యంత్రశాలలు మొదలగునవి. Tenants ఇచ్చిన యధికారపత్రము. అట్లు కౌలును, అద్దెయుఁ దీసుకొనిన వారికి 'Lease holders' అనిపేరు. మఱియు నట్టి యాసులకు 'Lease holds' అనిపేరు.

**లీడ్సుకుండసామాను** (Leeds ware):- ఆంగ్లదేశమున లీడ్సుపురమునఁ జేయఁబడుకుండ సామాను. సౌందర్యవంతము, చక్కనిమెఱుఁగుఁ గలది. క్రీ. శ. ౧౭౬౦ మొదట ప్రారంభింపఁబడి ౧౭౭౫ వఱకు నలరంగుసామానునే చేయుచుండెను. పిదప నభివృద్ధిపఱుపఁబడి, వేర్వేఱురంగులుకూడఁ జేర్చఁబడియున్నది.

**లీపియర్ (వత్సరము)**:—ఇది పాశ్చాత్యుల కాలమానవిధానవత్సరము. అది గ్రీసుతో వత్సరములఁ గొంతభేదముతో నాల్గుసంవత్సరముల కొకసారి వచ్చుచుండు వత్సరము. ఫిబ్రవరి నెలయం దిరువదితొమ్మిదిదినములం గల్గి, సంవత్సరము మొత్తమునందు ౩౬౬ దినము లుండునది.

శకాబ్దాంతవత్సరములను వదలి, తక్కిన తొంబదితొమ్మిది సంవత్సరములలో నేదియైనను నాల్గుచే భాగింపఁబడి, శేషము మిగులకుండిన నది లీపుసంవత్సర మనియు శకాబ్దాంతవత్సరములందు మొదటిమూఁడును లీపు గాక, నాల్గవశతాబ్దాంతవత్సరము లీపగుచుండు ననియు, దీనిధర్మము చెప్పఁబడినను శాస్త్రజ్ఞులం దింకను సంశయములు కలవు. వేలకో లేక లక్షలకో గూడ నిట్టినిబంధనయే (అనఁగా మొదట మూఁడు లీపు గాక నాల్గవది లీపగుచుండు నను ధర్మము) వర్తించుచుండు నేమోయని తలంపఁబడుచున్నది. పరిశీలన జరుగవలసియుండును.

**లీప్జిగ్ సంత** (Leipzig Fair):— ప్రపంచమందలి గొప్పసంతలలో నొకటి. క్రీ. శ. ౧౧౭౦ నుండి సాగుచున్నది. క్రీ. శ. పదునాఱవ, పదునేడవ శతాబ్దములందు గొప్పదశ ననుభవించి యుండెను. నెపోలియన్ యుద్ధములకాలమునఁ గొంత క్షీణించి, పందొమ్మిదవ శతాబ్దమునం దిరుగ బాగుపడినది.

ఈస్టరుపండుగులకుఁ గూడి, మూఁడువారములు నిలుచుసంతకు బుక్కుఫెయిర్ (Book Fair) అనెదరు. ఇం దనేకవస్తువులు చేరును. ఇదియే ముఖ్యమైనది.

**లీలతాళము**:—

(తాళములు చూడుఁడు).

**లీలాజననది**:— ఫల్గునీనది. గయప్రక్కం బడి ప్రవహించును. ఇది యంతర్వాహిని (భూమి

లోపలనుండియే ప్రవహించునది) యనియందురు. (ఫల్గునీనది చూడుఁడు.)

**లీలావతి:**— ఈపేరుగలవారిద్దరుఁ గలరు. హిరణ్యకశ్యపునిభార్య (ప్రహ్లాదునితల్లి) యొక లీలావతి. ఈమె రాక్షసస్త్రీ.

మఱియు ప్రసిద్ధగణితశాస్త్రవేత్తయగు భాస్కరాచార్యపుత్రిక యొకలీలావతి కలదు. లీలావతీ గణితశాస్త్ర మీామెపేరనే రచింపఁబడినది.

**లీవర్డుద్వీపములు** (Lee ward islands):—ఇవి పసిఫిక్కుమహాసముద్రమునందు వెస్టిండీసుద్వీపసమూహమునఁ జిన్నఆంటిలీస్ దీవులం దొకద్వీపసముదాయము. దక్షిణయమరికాతీర ప్రాంతము. బ్రిటీషువారివి.

వీటికిఁ బ్రభుత్వస్థాన మొకచిన్నద్వీపమగు నేంటిగువాయం దున్నది. (వెస్టిండీసుద్వీపములు చూడుఁడు).

**లుంబినీవనము:**—
(కపిలవస్తురాజ్యము చూడుఁడు.)

**లుప్తమాసము:**—
([illegible] చూడుఁడు).

**లులాయగోత్రము:**—
(కుండినగణము చూడుఁడు).

**లూతిక:**—
కంటికొలుకులకడఁగురుపులులేచు జబ్బునకుఁ బేరు.

**లూథెరన్ మతశాఖ** (Lutheranism):— క్రైస్తవమతశాఖలలో నొకటి. Marten Luther గురుప్రబోధమును బాటించిన క్రైస్తవులని భావము. ఈసిద్ధాంతము 'Its theological basis is the confession of Augaburg of 1530' అని చెప్పఁబడినది. ప్రపంచమున నీమతస్థు లించుమించు ఛాలుకోట్ల మందికల రందురు. జర్మనీ, డెన్మార్కు, నార్వే, స్వీడను దేశములందు మతప్రాబల్యము కలదఁట.

**లూనార్ తియరీ:**—
(హిల్బ్రిను సిద్ధాంతము చూడుఁడు.)

**లూనార్ సైకిల్:**—
(చంద్రపరిక్రమము చూడుఁడు.)

**లూయిడ్ బోర్గ్లే సిద్ధాంతము:**—
(మాక్సువెల్ సిద్ధాంతముఁ జూడుఁడు.)

**లూసరన్గడ్డివ్యవసాయము:**—
లూసరన్గడ్డి యొడతెగక పశువులకుఁ బచ్చిమేఁత నాలుగైదుసంవత్సరములపాటియ్యఁదగినది గానఁ గొన్నిసీమలందుఁ బ్రత్యేకముగ వ్యవసాయముగనే చేయుచున్నారు. భరతదేశమునందు మూఁడురకముల లూసరన్ గడ్డివ్యవసాయము చేయఁబడుచున్నది.

౧ కాన్స్టావార్ లూసరన్, ౨ పరిష్యాలూసరన్, 3 మీారల్ లూసరన్. ఇందు మొదటి దెక్కువఫలవంతముగఁ దలంపఁబడలేదు. తక్కినవి రెండు నుపయోగకరములని తలంపఁబడినవి. రెండు నించుమించొకటే పోలికగ నుండును. లూసరన్గడ్డి రెండుమొదలు నాలుగడుగులవఱకు కాయాస్థలముల పరిస్థితులంబట్టి పెరుఁగును. పశ్చిమోత్తర సరిహద్దుపరగణాలలో నక్టోబరు నెల మధ్యకాలమునుండి నవంబరు నెల మధ్యకాలమువఱకుఁ బైరుఁ బెట్టుట కర్హకాలమనితలంపఁబడుచున్నది. సత్తువఁ గలిగియుండి చెట్లవేళ్ళయందు నీరునిలువకఁ జెమ్మ మాత్రము నిలచు సావకాశముఁగల సమస్త

భూములు నీ పైరున కనుకూలములు. రెండుపాళ్ళు బంకమన్ను నొకటిరెండుపాళ్లిసుక కలసిన భూములు శ్రేష్ఠములు. నీరుతోడిగాని, పారించిగాని, లూసరన్‌గడ్డిపొలమును దడుపుచుండుటకు వలయునేర్పాటు సమర్పఁబడ వలయును. గుఱ్ఱపులద్దె, పశువులపేడ, గొఱ్ఱెగత్తము, బాగా మఁగ్గి పాతగిలినమనుష్యుల యశుద్ధములు, దీనికిఁ దగిన యెరువులని చెప్పఁబడినది. ముందుగా నీయెరువులను భూమిపై నంతటఁ జల్లి, మెత్తగఁ గలియ దున్నవలయును. గుఱ్ఱములమేఁతకై యుపయోగింపఁబడుగడ్డికి సున్నఁపు టెరువుఁగూడ వైచుట శ్రేష్ఠము. వేసవిలోఁ బ్రతి రెండుకోతలకుఁ బిదపను, శీతాకాలమునఁ బ్రతికోతకుఁ బిదపను నెరువు వైచుచు, కలికి మట్టిలో వైచుచుండవలయును. ఎకరమునకేఁటేట నైదువందలు మొదలాఱువందల మణుగుల యెరువు కావలసియుండును.

ఎకరమునం దాఱుసేర్ల విత్తనములు చల్లవలసి యుండును. ఇవి యించుమించుఁ బన్నెండుపౌనులగును. విత్తనములు చల్లినవెంటనే నీరుఁ గట్టవలయును. గడ్డి మొలచినపిదప వేసవికాలములోఁ బ్రతిమూఁడవ రోజునఁగాని, నాల్గవరోజునఁ గాని, తక్కినకాలములందు వారమున కొకసారియును నీరుఁగట్టుచుండవలయును. నీటియెద్దడిగిడసఁబాఱఁ జేసి చక్కఁగ నెదుగనీయదు. వీలగునంతవఱకుఁ గలుపుఁ బెరుగనీయక, పెరికివేయుచుండవలయును. గడ్డికోయునప్పుడెల్లఁ గలుపుఁ బీకివేయుట సులభమైన మార్గము: గడ్డి పూవులుఁ బూయులోపుననే కోయవలయునుగాని, పూసినపిదప గడ్డిముదిరిపోయి, పశువుల కజీర్ణముఁ గల్గించును

పశ్చిమోత్తర సరిహద్దుపరగణాలలో సంవత్సరమున కెకరమునకు ముప్పదిటన్నులగడ్డి కోయనగుచున్నట్లు లెక్కింపఁబడినది. ఎచ్చటనైనను నొక్కటావున విత్తనములకై గడ్డిఁగోయక నిలువఁజేయుట శ్రేయము. ఆఱంగుళముల ముక్కలుగ గడ్డిని నఱకి మూఁడుపాళ్ల లూసరన్‌గడ్డిముక్కల కొకపాలుగాని, రెండుపాళ్లుగాని, పచ్చిగరికగాని, యెండుగడ్డిగాని యందుఁజేర్చి గుఱ్ఱములకు మేఁత వైచెదరు.

రోగములుఁగల గుఱ్ఱములకు లూసరన్ గడ్డి మంచిపథ్యమని కనిపెట్టఁబడినది. ఏరోజునకైన గడ్డి యారోజుననే కోసికొనవలయునుగాని నిలువఁ జేసినఁ గుళ్లి చెడిపోవునని తెలియఁదగినది.

లూసరన్ గడ్డికి ‘డన్నా’ యను చీడతెగులు పట్టును. ఆరోగముఁబట్టినచెట్లను పెరికివైచి, దూరముగఁ గాల్చివేయుట శ్రేయము. మఱియు నట్టావున భూమిఁగల సున్నఁపుఁబొడిఁ జల్లి శుద్ధిఁజేయవలయును. ఇంకను గాలిమొక్క లేక గాలితీఁగ యను నొకవిధమయిన తీఁగలు లూసరన్ గడ్డి యందుఁ బుట్టి గడ్డిపొలమును బాధచేయును. వీటిని మొదలంటఁబీకి పాఱవేయుచుండవలయును.

ఈగడ్డి స్విజర్లాండు దేశములోని లూసెరన్ పురిపరిసరముల విస్తారముండుటచే నీ పేరందినది. గొప్ప పశుగ్రాసముగా నున్నది. [గాలితీఁగలు చూడుఁడు.]

## లెక్రోసీఆట (Lacrosse game):—

నూఱుమొదలు నూటయేఁబదుగుల పొడవుఁగల ప్రదేశమునఁ బండ్రెండుగు రొకకక్షిగ నిరుదెసల నిరువదినల్గు రిరుకక్షుల్లుగ నిలువంబడి, కడను చిక్క మమర్పఁబడిన కఱ్ఱలం బట్టుకొని, నాలుగున్నరఔన్సులబరువుఁగల రబ్బరుబంతులతో నాడు యాట. చిక్కములం దాబంతులం బట్టుకొనుట, తిరుగఁ గొట్టుట యిందలి కార్యములు కనడాదేశమునం దిది విస్తారముగ నాడఁబడుచున్నయాట.

**లెటర్** (Letter):— వాణిజ్య సంబంధ పరిభాషాపదము. ఉత్తరమని యర్థము. తెలియఁ బఱచినపత్రిమని యెఱుంగునది. తయారగుచున్న యొక Joint stock Company యందలి వాటాల నర్హకాలమున వేర్వేఱుగ వాయిదా సొమ్ములు చెల్లించుచుండు భాగస్థులకు వేర్వేఱుగ విభజించి దానిం దెల్పినపత్రమునకు 'Letter of allotment' అనిపేరు. ఒకదేశాధిపతిగాని, ఆయనమంత్రులుగాని, మఱొకదేశాధిపతికో లేక ఆయనమంత్రులగు సమానోద్యోగులకో వ్రాసి, ఆదేశఁపురాయబారి (Ambassador) ద్వారా పంపినయుత్తరమునకు 'Letter of Credence' అనిపేరు. ఒకకార్యముయొక్క ఫలితముగ నష్టము కల్గునేని తా నానష్టమునకు హామీగా నుండి పూచీవహింతునని వేఱొకరు వ్రాసిన లేఖకు 'Letter of indemnity' అనిపేరు.

అప్పులవాండ్రందరు (Credetors) కలిసి బాకీయున్నవానిని (ఆస్తులకు నష్టముఁ గల్గించనిపక్షతిని) కొంతగడువుకాలములో వ్యాపారముఁ జేసి కొననచ్చునవియు, తా మాకాలమున న్యాయస్థానముద్వారా నేతొందరలం గల్గింపమనియు వ్రాసినపత్రమునకు 'Letter of Licence' అనిపేరు. తాఁ దీసుకొనిన వాటాలు తః కక్కర లేదను మొదలగు సంగతులతో వ్రాసిన లేఖకు 'Letter of Renunciation' అనిపేరు. విల్లు వ్రాయకుండఁ జనిపోయినవారి యాస్తిపాలనకు వారివారసులకు న్యాయస్థానమువా రొసంగెడి పరిపాలనాధికారపత్రమునకు 'Letter of administration' అనిపేరు.

**లెటర్స్ పేటెంటు** (Letters Patent);— ఇంగ్లాండుదేశఁపుఁ బ్రభుత్వమున నితర శాసనములమేరకుఁ గల్గినయధికారసావకాశముల కన్న నధికములగు నధికారసావకాశముల నొసంగునట్టి ప్రభుత్వమువారిశీలుక్రింద నీయఁబడినయధికారసావకాశము. ఇవి కొందఱకు, లేక కొన్ని సంఘము (కంపెనీ) ల కొసంగఁబడుచుండును.

ప్రభుత్వమువారివలనఁ గలిగింపఁబడిన విశేషాధికారగరిమకు 'లెటర్స్ పేటం' టనియెదరు. ఒక పుస్తకము లేక దస్తావేజు బహిరంగముగ నందఱకు లభింప వీలుఁగల్గునదిగ నుండియు, దానికర్తృత్వము లేక అధినాధత్వ మొకరికి స్థిరపఱచి, వారి స్వాతంత్ర్యమును నిల్పు విశేషాధికారమున కీపేరు వర్తించును. ఒకఁగుణౌషధము, సువాసనద్రవ్యములు, యంత్రములు, ఆసనములపోలికలు మొదలగునవి కనిపెట్టి మొదట రచించినవారు తమస్వాతంత్ర్యఁపుహక్కుల నిల్పి పేటెంటుఁ జేయించుకొని నిలువం బెట్టుకొందురు.

దీని నతిక్రమించినవారికి శిక్ష కలదు. లెటర్స్ పేటంటుకక్షణముగూర్చి ప్రభుత్వశాసనము లుండును.

**లెబనానుపర్వతముల దేశము**:— జహోవాదేముఁడు (జోహోవ) ఇశ్రాయేలీయులకు 'Land of milk & honey' అని చెప్పిన దేశము సిరియాదేశమై యున్నది. కోయెన్సిరియా ఫలవంతమైనదేశము. ఇచట ద్రాక్షపండ్లఁగూర్చి చాల యతిశయోక్తిగా బైబిలునందుఁ జెప్పఁబడినది. (సిరియాదేశము చూడుఁడు.)

**లెబిహెహాఫ్ సిద్ధాంతము**:—(మోక్సువెల్ సిద్ధాంతముఁ జూడుఁడు).

**లెమ్మింగు (జంతువ)**:— లెమ్మింగు ఎలుకజాతికిఁ జెందినది. ఐరోపాఖండమునందు నార్వే స్వీడన్ దేశముల కొండలం దుండును.

ఒక్కొకతఱి నపరిమితముగ సంతాన మభివృద్ధిమై తిండివెదకుకొనుచు దేశములోనికిఁ దండోపతండములుగ నంతట నవే కాన్పించుచు, వ్యాపించుచు దారియందుఁ బైరులను, గడ్డిని తినివేయుచు నాశనముఁజేయుచుఁ బోవుచుండును. అవి నడచినతావు నాశనము కాన్పించుచుండెడిని. పోవుతఱి భావులు, చెరువులు, నదులు, ఏమి దారిలోనున్నను వాటింబడి కొన్ని చచ్చుచుండును. దారియందుఁ గొన్ని పక్షులవాతఁబడుచు సంఖ్య తగ్గుచుండును. ఇట్లు నాశన మొనర్చుచు సముద్రముంజేరి యందుఁ బడి యశేషమై మరణించి యవిలకుఁ గళేబరములు దరికింజేరి వాయువుం జెఱచును.

నూతులు, చెఱువులు, నదులందుఁ బడినవి నీటింగూడ విషపూరితముగ నొనర్చును. తోడనే వాయుజలములదోషమున దేశమంతయు భయంకరముగ జ్వరపూరితమై టైఫాయిడ్ (విషమజ్వరము) దేశమంతట వ్యాపించి ప్రజాపీడనము, ప్రజానాశనము సంభవించును. ఆజ్వరమునకు Lemming fever అనియు, ఆసంవత్సరమును Lemming year అనియు నందురు. అరుదుగ సంభవించుచున్నను సంభవించినతఱి ఘోరమగు నాపదఁ గల్గించుచుండును.

## లెమ్మో ద్వీపము —

(కేండియాద్వీపము చూడుఁడు).

**లేండాఫ్ కాంగరూ ఎండ్ క్రేన్:—** ఆస్ట్రేలియాజాతీయపతాకముపై నొక కాంగరూ మృగమును, ఒకకొంగయునుంట నిట్టిపేరిడఁబడెను.

**లేండాఫ్ క్రాస్** (Land of Cross):— పోపులపరిపాలనమునుండి క్రైస్తవమతప్రాముఖ్యత నందిన యిటలీదేశభాగముల కీపేరు వాడుకయయ్యెను. ఇప్పుడు పాపాల్ స్టేటు ప్రదేశమునకు వర్తించుచున్నది.

**లేండ్ ఆఫ్ ది క్రిసెంటు:—** టర్కీ దేశపు జాతీయపతాకముపై (ఒకచంద్రుఁడు నొక నక్షత్రము) క్రిసెంటుచిహ్నము వేయఁబడియుంట దాని కాపేరు వాడుకయయ్యెను. మఱియు రాజధానిగానుండిన స్తంబూల్ నగరము తొల్లింటి రాజభవనపుముఖద్వారమునయున్న యుత్తమయొకలాను కడఁ బ్రసిద్ధమైనది. దానికి ఫ్రెంచిభాషానువాదపదము Sublince Porte నుండి విదేశస్థులు టర్కీప్రభుత్వమును 'Porte' అనుచుండిరి.

టర్కీ మొదట బలాఢ్యమయ్యు, నానాఁటికి బలముతగ్గి చిన్నరాజ్యమైయుండినకతనఁ గొందఱు రోపాదేశస్థులు దానిని (sick man of Europe) 'ఐరోపారోగి' యని హేళనగా వాడుచుండిరఁట.

**లేండ్ ఆఫ్ ది స్టిల్:—** స్కాట్లాండుదేశమునఁ గొండలపైఁ దట్టముగ ముండ్లపొదలు ప్రాముఖ్యతఁ౦చియుంటఁ గాఁబోలు నాదేశమునకు 'Land of Thistle' అనిపేరు విదేశస్థులచే వాడఁబడ ప్రారంభమయ్యెను. ఇది హేళనగాఁ గాక మంచియభిప్రాయముననే వాడఁబడుచున్నది.

**లేండ్ ఆఫ్ ఫోరు స్టార్సు** (Land of Four Stars):— న్యూజీలండుదేశపు జాతీయపతాకముపై నాల్గునక్షత్రములు చిత్రింపఁబడియుంట నట్టిపేరు వాడుకయయ్యెను.

**లేండ్ ఆఫ్ రెయిజింగ్ సన్** (Land of Raising sun):— జపాన్‌దేశపు జాతీయపతాకముపై నుదయించినసూర్యుఁడు గురుతుగ వేయఁబడియుంట నాదేశమును విదేశస్థులు "Land of raising sun" అని యందురు. అనఁగా జపానుకవ్వల పసిఫిక్కు మహాసముద్రమున

నన్య దేశములు లేవనియు. తూర్పునఁ దామే కడ దేశఁపువార మనియు జపానీయులయభిప్రాయము.

**లేండ్ ఆఫ్ వైటు ఎలిఫెంటు:**— తెల్లయేనుఁగున కైరావత మని పేరు గలదు. ఇవి బర్మాదేశమున నేలికకుఁ బట్టపేనుఁగుగా నుండెడివఁట. ఇంకను నైరావతీనది బర్మాదేశమునఁ బ్రాముఖ్యమగు నదియై యున్నది. గాని, పెక్కండ్రు బర్మా (తొల్లిఁటి బ్రహ్మ) దేశము నిట్లనెదరు. కాని తెల్లయేనుఁగు సయాందేశఁపు జాతీయ పతాకముపై నను, నెమలిచిహ్నము బర్మాదేశఁపు జాతీయపతాకముపై నను గానఁగుచున్నది.

**లేండాఫ్ స్టార్క్సు:**— జర్మనీదేశమున Stork పక్షిని చాల శ్రేయోదాయకమని తలంచుదురు: అది యింటిమీఁదను ప్రతిగృహముపై నను నాదేశమున గూడుఁ బెట్టుకొని యొంటికాలుపై నిలువఁబడియుంటఁ దఱుచు గానఁగుచుండును. దాని నాదేశమున నెవ్వరు బాధింపఁదలంపరు. ఇంక నాదేశఁపు జాతీయపతాకము (జెండా) పై నీపక్షియే చిహ్నముగఁ జిత్రింపఁబడియుండును.

విదేశస్థు లీజర్మనుదేశమును 'Land of storks' అనెదరు.

**లేండుపోర్షన్సు (Land Portions)**— భూమిభాగములు విస్తారఁపు భూప్రదేశమునకు Continent (ఖండము) అనిపేరు. ఒక భూఖండమునం దొక్కొక్క రాజకీయమగు నొక్కొక్క భాగమునకు (Country) రాజ్యము అనిపేరు. వీట్ల కింకను Kingdom అనియు, Empire అనియు, State అనియు, Dominian అనియు, దేశభేదములు రాజకీయసంబంధములే.

అన్నివైపులను నీటిచేఁ జుట్టఁబడిన భూప్రదేశమునకు Island (ద్వీపము) అనిపేరు. ఇట్టిద్వీపముల సమూహమునకు Archipelago (ఆర్కిపెలెగో) అనిపేరు. కొంచెము భూమితోఁ గలసి యుండుటఁ దక్కఁ దక్కిన యన్నిదెసలను నీటిచేఁ జుట్టఁబడిన భూప్రదేశమునకు Peninsula (ద్వీపకల్ప) మనిపేరు. రెండు పెద్దభూభాగములం గలుపుచు, నిరుదెసల నీటిచే నావరింపఁబడిన సన్నభూభాగఁపుఁ (సంధి) బ్రదేశమునకు Isthmus (భూసంధి) అనిపేరు. సముద్రములోనికిఁ జొచ్చుకొనిపోయిన సన్నఁపుఁ బొడవుఁగల భూప్రదేశమునకు Cape (అగ్రము) అనిపేరు. Promontory (ఎత్తుగుభూమి) Point Head Naze లేక (Nose ముక్కు అనిభావము) Rass (Head) అనఁబడున వన్నియు (Cape) అగ్రములందలి భేదములవ్వే.

సమతలముగనున్న భూప్రదేశమునకు 'Plain' అనిపేరు. సమతలప్రదేశములు పర్వతములపై నెత్తుగుఁ విగ నుండునేని వాట్లకు Table land లేక Plateau (plats) అని యనెదరు. పర్వతముల మధ్యనుండు ప్రదేశమునకు 'Vally' అనిపేరు. రష్యాదేశమునందుఁ జెట్లుచేమలు లేని సమతలప్రదేశములను Steppes అనెదరు. ఉత్తర అమెరికాదేశములందుఁ బచ్చికమైదానప్రదేశములను Praircis అనెదరు. ఇంకను వాట్లనే Savannahs అనుటయుం గలదు. స్విజర్లాండుదేశమున నాల్పుపర్వతములందలి పచ్చికబయళ్ళకు alps అని పేరు. దక్షిణఅమెరికారాజ్యములందరణ్యములచే నాక్రమింపఁబడిన సమతలప్రదేశములకు Selvas అనిపేరు. అటనే యితరసమతలప్రదేశములను Pampas అనియును, Llanos అనియును దుదురు. నిష్ఫలవంతమై నిరుప

యోగమగు ప్రదేశములను Desert Land అని యెదరు. డెజర్టు అనిన వదలివేయఁబడిన యని యర్థము. డెజర్టులనడుమ సారవంతమై జలముసమీపముగనే భూమియందుఁగల్గి, చెట్టుచేమలు బ్రతుకఁగలప్రదేశమునకు Oasis అనిపేరు. Oasis డెజర్టునందు ఫలవంతమగు ప్రదేశము. సముద్రజలములు కడమై భూమి ప్రారంభమగు తావునకు Coast లేక Beach (సముద్రతీరము) అనిపేరు. సాధారణముగ సముద్రప్రాంతప్రదేశమునకు sea board అనియు, sea coast అనియు వాడుకగలదు.

**లేండుబ్రీజెస్** (Land Breezes):— భూమిపైనుండి వీచుగాలులు. ఇవి వేర్వేఱుపరిస్థితులవలన వేర్వేఱుదేశములందు వేర్వేఱువిధములుగా నుండును. వీటింగూర్చి వాయువు దాని కృత్యములు చూడుఁడు.

**లేక్కర్** Lacquer [లక్కరంగు]:— లక్కను కొన్నిపదార్థద్రవములందుఁ గరగించి పూయు రంగులవలెను, వార్నీషులవలెను చేయుదురు. (లక్క చూడుఁడు). వీటిని కఱ్ఱసామానులపైఁ బూయుదురు. లేక్కర్ జాతులందు వార్నీషు వలె మెఱుఁగిచ్చు రంగులేని లేక్కరుగూడఁగలదు. జపాన్‌దేశమందలి లేక్కర్‌చేయువిధానమునకు, బర్మాదేశఁపువిధానమునకుఁ జాలభేదము కలదు. *జపాన్ దేశఁపుది లక్కతోడనే గాక, ఇతర వృక్షముల బంక, రసము మొదలగువానితోఁ గూడఁ జేయుచున్నారు.

**లేక్టిక్కు ఆసిడ్**:— ఇది పాలు లేక పాడి వస్తువులు పులియఁబెట్టుటవలనఁ జేయఁబడుచున్నది. పాశ్చాత్యదేశములందు వెన్న, ఛీస్, మొదలగునవి చెడిపోకుండ నిల్వయుంచుటకు వాటి కుపయోగించుచుందురఁట. ఔషధములందుఁగూడ వాడుచుందురఁట.

**లేక్టోమీటర్**:— పాలలోఁగలసిన నీళ్ళం బ ంచి తెలుపుయంత్రపరికరము.

**లేక్సుపీరియర్** (Lake Superior):— ఈసరస్సమెరికాఖండఁపు వింతలలో నొకటిగఁజెప్పబడినది. సంయుక్తరాష్ట్రములకును, కన్నడాదేశమునకును సరిహద్దుపొడవున నొకవరుసగ ననేక సరస్సులు కలవు. అందు లేక్సుపీరియ రనుసరస్సు పశ్చిమముగా నుండును. ఇది ప్రపంచమునందలి మంచినీళ్ళసరస్సులలో నెక్కువపెద్దది యని చెప్పఁబడినది. ఈసరస్సు సముద్రఁపునీటిమట్టముపై ౬౦౧ అడుగులయెత్తున నేర్పడియుండుటఁ బ్రపంచమందలి యెత్తుగుసరస్సులలో నగ్రగణ్యమై యున్నది. దీనిపొడవు ౪౧౨ మైళ్ళవఱ కుండును. వెడలుపు ౧౬౭ మై ళ్ళుండును. దీనిపరిమాణము ౩౧౨౦౦ చతురఁపుమై ళ్ళుంట యెంతపెద్దసరస్సో యోచింప నగును. దీనియుత్తరఁపుగట్టు శిలాతలమయమై, రాళ్లఁగలద్వీపములు తీరమునఁ గల్గి, వింతఁ గొల్పొడెని. నీటియందున్నఁ గొన్నిశిలలు ౧౩౦౦ అడుగులయెత్తుగ నుండును. దీనియందు ద్వీపము లనేకములు కలవు. అందుఁ బెద్దది Isle Royal అనంబడి ౪౪ మైళ్ళపొడవుఁ గలది. దక్షిణతీరము పల్లముగ నిసుకం గల్గియుండును.

ఈసరస్సునందలి జలములు స్వచ్ఛములై, యద్దమునంబోలి యందలిసర్వవస్తువులను పైకిఁ బ్రదర్శించునవియై చూడ ముచ్చటగ నుండును. ఈసరస్సు శీతకాలమున నితరసరస్సులంబోలి మంచుగ ఘనీభవించదఁట. కాని తీరములందు మంచు బిగిసియుండునఁట. దీనియందుఁ దఱుచు హఠాత్తుగాఁ దుపానులు గల్గుచుండునఁట. వర్ష

కాలమునఁ బడవలు నడపు టపాయకరముగ నుం డుట నావికాపయనములు మానివై చెదరు.

## లేక్ సరస్సు – లేగూన్:—

(Lake –(సరస్సు) Lagoon చూడుఁడు).

**ఖలు వ్రాయుకల:**— ఆంగ్లమున లేఖలు వ్రాయుట విధులయొక్కయు విధానముల యొక్క మయ్యమై యుండును. తొలుఁదొల్త వ్రాయుకాగితము, వ్రాయుసంగతి కనుకూలించు నదిగ నుండవలెను. ఆహ్వానపత్రికలకు వేఱుకాగితములు (invitation cards) కలవు. వ్యాపారంపులేఖలు వ్రాయుటకుఁ బెద్దపరిమాణముఁగల పలుచనయందుఁ గట్టిఁగలకాగితములేర్పడియున్నవి. ఇవి వ్రాయువారి పేరు, తావు, ముద్రింపఁబడి యుండవలయును. ఇంక యోగక్షేమాదులు వ్రాయులేఖ లొకపాటి పెద్దకాగితములును, చిన్న కాగితములును గూడఁ గలవు. లేఖలయొక్క ప్రాముఖ్యతలంబట్టి యివి వాడవలసియుండును. వీటికె 'లెటర్ పేపర్' అనియు, 'నోటుపేప' రనియుఁ బేర్లు.

రెండవది వ్రాయు లేఖకాగితమున కనుకూలించుసంచి [cover] యుండవలెను. ఇవి యన్నిరకములకాగితములను నడ్డముగా సగమున కొకేమడత మడచిన పట్టునంతటికొలతలఁ జేయఁబడుటఁ గలదు. వర్తకవ్యాపారసంబంధలేఖలు రెండుమడతలు మడిచి [నాల్గవవంతునకు] దూర్చఁదగినపరిమాణంపుఁగవర్లు కలవు. స్త్రీలవాడకమున కన్నిరకములకాగితములు, కవర్లు ప్రత్యేకముగఁ గలవు. అవి పురుషు లుపయోగింపరాదు. ఇవి స్త్రీ లుపయోగింపరాదు.

పిదప నెఱుంగఁదగినది లోన వ్రాయువ్రాఁత. సాధారణముగ వ్రాయులేఖ లన్నియు నుత్తమ పురుషరూపముననే వ్రాయవలయునుగాని, [Formal invitations] సామాన్యంపు టాహ్వానములు ప్రథమపురుషయందు వ్రాయవలయును.

లేఖలు వ్రాయునపుడు దూరాలోచన మొనర్చి మాటలఁ గుదుర్చుకొని వ్రాయవలయునేగాని, తొందరపడి వ్రాయరాదనియు, తగాదాలసంగతులుఁగలలేఖ లతిజాగ్రతగ మాటలం గుదుర్చుకొనవలయు ననియు, నాంధ్రులంమఁగల విధి యాంగ్లమునను నట్లే కలదు. స్నేహితులకు వ్రాయులేఖలు టైపుచేయఁబడక స్వదస్తూరితో వ్రాయఁబడినవి. నాచియందుఁగల గౌరవమునే గాక, యన్యులకుఁ దెల్పియుండనిరహస్యార్థమును సూచించెడిని. కార్యార్థము నుద్యోగుల కొసంగఁబడు దరఖాస్తులు, పిటీషనులు మొదలగు కాగితములు టైపుచేయఁ బడినచో నవి యుభయపక్షములగౌరవములనే గాక, మర్యాదప్రవర్తనం గూడ సూచించును.

పెన్సలుతో లేఖలు వ్రాయుట యోగ్యమైనది కాను. విధిని యిఱుకుకాలమున నత్యంతపరిచయముఁగలవారి కట్లు వ్రాయక విధిలేనిచో నందీ పెన్సలువ్రాఁతను మన్నింపుఁడనిగూడఁ గడవ్రాయుట సమంజసము. ఇక్కాలమున సిరాకలములు (Fountain pens) కల్గియుంట నీపెన్సలు వ్రాఁతలు తగ్గిపోయినవని తలంపఁబడుచున్నది.

ఒకరిని దూషించు వ్రాఁతలుగాని, ఫిర్యాదు స్వభావముఁగలలేఖలు గాని, వ్రాసియు నొకదినము నిల్వయుంచిగాని, లేక తిరుగఁదిరుగఁ జదువుకొనిగాని, యట్టిలేఖ నంపుట సమంజసముగాదని తోఁచినచో, పంపక మానివేయుటయే వ్రాయువారికి గౌరవప్రదమని తలంపఁబడుచుండును. ఇట్లన విధిలేనితఱిఁ బంపుట తప్పదు.

లేఖప్రారంభమున Dear Sir అని పురుషులకును, Dear madam అని స్త్రీలకును, వ్రాయుచుండుట సాధారణపద్ధతి. ఎక్కువమైత్రియుండినపురుషులకు వ్రాయుతఱి My dear sir అని వ్రాయుటయుం గలదు. గాని యెక్కువస్నేహము లేనిచో My శబ్దముఁగూడఁ బ్రయోగించిన నిచ్చకపుమనిషి యనియో లేక మాయమనిషి యనియో యని లేఖవ్రాసినవానింగూర్చి యర్థమగును. స్నేహానుబంధము పాటింపని గృహస్థు మర్యాదపూర్వకలేఖలందు Dear Sir అనిగాని, Dear Mr (పేరు) అనిగాని వ్రాయుటఁ గడుం గడు శ్రేయము. ఈసందర్భముల పేరనిన నవతలవారి Sir name అని యెఱుంగునది. అంతకన్న Christian name వాడుట మంచిదనెదరు.

ఇంక స్త్రీలకు లేఖ వ్రాయునపుడు Dear madam అని వ్రాయుట మర్యాద కాదనియు, నూరక madam అని వ్రాయుటయే గౌరవ మనియుఁ దలంపఁబడుచున్నట. వివాహముకాని స్త్రీలకు వ్రాయులేఖలం దెప్పుడు Dear miss అని వ్రాయరాదు. అట్టివారికి Madam అని వ్రాయుటయే తగినదిగ నెంచఁబడుచున్నది. వివాహితలకు వ్రాయునపుడు Dear mrs (భర్తగారి క్రైస్తవనామము) వ్రాయుటసమానప్రతిపత్తిఁగల వారియందుఁ గలదు. ఆంగ్లలేఖలందు ముఖ్యాంశముల క్రింద గీతగీయుట (under line) మర్యాద కాదని యెఱుంగునది.

తరువాత నెఱుంగఁదగినది లేఖను ముగించు పద్ధతులు. వర్తకవ్యాపారసంబంధలేఖలు yours faithfully అని వ్రాసి దస్కతుఁజేసి ముగించుట యాచారమై యున్నది. వర్తకవ్యాపారమునం దధికానుబంధముఁగలవారి కొకప్పుడు yours truly అని వ్రాయుటయుం గలదని విందుము.

కాని పరిచయములేనివారికి, పరిచయముండినను నుత్తరప్రత్యుత్తరము లదివఱకు లేకుండినవారికిని, allow me to remain Dear sir అని వ్రాసి, పిదప yours truly అని వ్రాయుట మర్యాదగఁ దలంపఁబడుచున్నది. కాకున్నను, yours faithfully అని గాని, yours truly అనిగాని వ్రాసిన చాలునందురు. ఇంక స్నేహముఁ గలవారికి I remain Dear Sir అనివ్రాసి yours sincerely అని వ్రాయుట యాచారముగ నున్నది. కాకున్నను yours sincerely అని వ్రాసినం జాలునందురు. స్త్రీలపట్లను నిదియే మర్యాద యనెదరు.

పూజ్యులగు పెద్దలకు వ్రాయుతఱి with best regards అని గాని, with respepts అని గాని వ్రాసి I remain మొ॥ వ్రాయుట యత్యంతగౌరవముగఁ దలంపఁబడుచున్నది. ఇటులనే చనువధికముగఁ గలవారికి with kind regards అనియు, kindest regards I remain మొ॥ వ్రాయుటయుఁ గూడఁ గలదు.

వర్తకవ్యాపారసంబంధలేఖలందుఁ దలకడఁ బ్రారంభమునఁగాని, కడను వ్రాయువారియెడమ చేతివైపునఁగాని, యెవరిపేరున నీలేఖ వ్రాయఁబడినదో వారిపేరును, పైవిలాసమును, గౌరవముగ వ్రాయుట విధిగ నెంచఁబడుచున్నది.

లేఖలు మనుష్యులచేతఁ బంపుతఱి వాటి నంటింపకుండఁ బంపుటఁ దీసికొనిపోయినవారి నమ్మకమును సూచించెడిని. పరిచయముఁ గల్గించు లేఖలంటించక యెవరికిఁ బరిచయముం గల్గింతురో వారి

చేతికేయిచ్చివేయుట యాచారమై యున్నది. రహస్యఁపుసంగతులు గలలేఖలు ముం దొకకవరునం దుంచి, యంటించి, దానిని వేఱొక యంతకన్న పెద్దకవరులో నుంచి, రెంటిపైఁగూడ పై విలాసములు వ్రాసి పంపుట పద్ధతిగ నున్నది లేఖలనవసరముగ లక్కసీళ్ళతో భద్రపఱచుట యనాచారమని తలంపఁబడును. అది బరువుఁగూడ నధికమగుటఁ బోస్టేజీవ్యయ మధిక మగును.

స్త్రీలకు వ్రాయులేఖలందుఁ జాల దూరముగ నుండునట్లు చనువుఁగల్గినను కలుగనియట్లే గౌరవమాత్రముం దెల్పుచుంటయు నత్యావశ్యకములు.

**లేగూన్ (Lagoon):**—సముద్రపునీటఁ బ్రవహించు తంపర. ఇది పెద్దపెద్దయోడలు నడువఁదగినంతలోతు లేకున్నను, చిన్నచిన్ననావలు పోఁగల్గినలోతుఁగల్గియుండునది. దీనిని lake అనియు నందురు. అందుఁ గొన్నిమంచినీళ్ళు lakes (సరస్సులు) కలవు. సరస్సులందు మంచినీళ్ళసరస్సులు, ఉప్పునీటిసరస్సులు నుండును. lagoons ఉప్పునీటివేగాని మంచినీటివియుండవు. మంచినీటిసరస్సులకు మెరకకల వగుచోఁ దంపర, ఆవ, యనిపేర్లుఁ బరగెడిని. (Sea Portions చూడుఁడు.)

**లేటర్‌డేసెయింట్సు:**—
(మోర్మనులు చూడుఁడు.)

**లేటిట్యూడ్- లాంగిట్యూడ్(Latitude-longitude)**-భూమియొక్క పటముల నిలువు, అడ్డు కొలతలగురుతులు.(డిగ్రీగీతలు చూడుఁడు).

**లేటెంట్ హీట్ (Latent heat) వేఁడి-** ఆంగ్లరసాయనశాస్త్రమున వేఁడి నొక కొంతపదార్థమున కందించిన, దానివేఁడి యధికమగుననియు, నొకకొంతపదార్థమునుండి వేఁడిని గొంతవెడలునటులఁ జేసిన దానియందలివేఁడి తగ్గుననియు నొకధర్మము చెప్పఁబడినది. అనఁగా దానియందలి టెంపరేచరు మాఱునని భావము. నీరు ఘనీభవించుచు శీతలస్థలిని మంచునకుఁ గొంతవేఁడి నందించిన దానియందలి టెంపరేచరు మాఱకనే మంచు నీరుగమాఱుటసంభవించెడిని. అట్లే మంచు కరఁగ నారంభించు వేఁడియొక్క ప్రారంభస్థలిని నీటికి మంచుముక్కఁ గలిపి శీతలముం గల్గించిన, నందలిటెంపరేచరు మాఱకనే నీరు మంచుగ ఘనీభవించుట సంభవించెడిని. ఇంకను నీ రావిరిగ మాఱు బోయిలింగుపోయింటువేఁడికడ నీటిందీసి దానికింకను వేఁడి గల్గించిన, టెంపరేచరు మాఱకనే యానీ రావిరియగుట సంభవించెడిని. ఇట్టిసందర్భములం దావేఁడిని 'లేటెంటుహీట్' (lantent heat) అనిసాంకేతనామముతో వాడుచున్నారు. లేటెం టనిన గర్భితమైన గుప్తమగువేఁడి యని యర్థము. ఇది పైకగుపడునట్టివేఁడి కాదు. అంతర్గతమై పై కగుపడనున్నది గాని లేకపోలేదు. నశించినది, చెడినది కాదు. నీటియందుఁగూడఁ గొంత వేఁడి కలదని యెల్లరెఱింగినదే. అది ఘనీభవించిన తఱి నావేఁడి దానియందే యడఁగి గర్భితమై యున్నది. గాని నశించలేదు. కావుననే దానిని లేటెంటుహీటనిరి.

పై నొసంగఁబడిన నుదాహరణములు మంచు నీరగుటకు, నీరు ఘనీభవించి మంచగుటకు, నీ రావిరి యగుటకుఁ దెల్పుచున్నను క్రొత్తవారికి సుబోధకమగుట కష్టమై యుండును. ఆంగ్లరసాయనశాస్త్రమున లేటెంటుహీటుంగూర్చి వివరించుధర్మము "Latent heat is the quantity of heat which must be communicated to a body in a given state in order to convert it into a deffrent state without the change of tempare-

ture" అనియై యున్నది. latent అను లాటి న్భాషాపదమున కాంగ్లమున lying hid అని యర్థము. లేటెంటుకాని వేడి కాంగ్లరసాయన శాస్త్రమున 'sensible heat' అనియెదరు.

దీనిని మఱియొకవిధమునఁ జెప్పవలయుననిన నీటిని ఘనీభవింపఁజేసినచో నీటియందున్న వేడి (సెన్సిబిల్ హీటు) లేటెం టగును. మంచును నీరుగాఁ గరగించిన నం దడఁగియుండిన లేటెంటు హీటు సెన్సిబిల్ హీటుగా మారును. ఇచట సెన్సిబిల్ అనినఁ బైకి స్పష్టముగాఁ దెలియఁబడెడు దనియర్థముఁ గాని వేఱు గాదు.

దీనినుండి యొకవస్తువునందున్న వేఁడికిని, దానిం జూడ తెర్మోమీటరునందున్న టెంపరేచరునకును, నెల్లప్పుడు సమానముగనుండు సంబంధ ముండక పోవచ్చునని తెలియనయ్యెడిని. అనఁగా నొకతఱి యుండవచ్చును. ఒకతఱి యుండకపోవచ్చునని భావము. (వేఁడి చూఁడుడు - తెర్మోమీటరు చూడుఁడు.)

## లేఁడికి లేచినదే ప్రయాణముహూర్తము:—

(ఆంధ్ర లోకోక్తి.)

**లేడీ డే (Lady day):—** ఇది క్రైస్తవుల పండుగ. క్రీస్తుప్రభువు తల్లియగు మేరీఅమ్మ గారిపేరుఁ గలదినము. మార్చి ౨౫ తేది దీనిని క్రైస్తవులు 'Feast of the annunciation of the virgin Mary' అని యనుచుందురు. ఆంగ్లదేశమున నిది Quarter day అయి యున్నది.

**లేడీ లార్డు 'Lady':—** సామంతయగు వనితకు వాడుక యయ్యెను. తొల్లింటికాలమున నింగ్లాండులో గొప్పవారిస్త్రీలు తమ్ముఁ గొలుచు వారందఱకు Loaf dian (Loaf server) రొట్టెల నాహారముగ నిడువారఁట. ఆపదమునుండి యేర్పడినపదము.

Lord- గొప్పసామంతులకు బిరుదముగనున్న పదము. Laford (Loaf giver) తమ్ముఁ గొలుచువారందఱకు రొట్టెల నాహారముగ నొసంగువాఁడని యర్థమిచ్చుపదమునుండి యేర్పడిన ప్రతిరూపకపదము.

## లేఁడులజాతి భేదములు:—

లేఁడి, దుప్పి, కణుజు మొదలగుజంతువులు కొంచెముగ నితరదేశములం దున్నను వీట్ల ముఖ్యనివాసము భరతదేశపు టడవులందేయని తేలుంగాన, జంతుశాస్త్రవేత్త లీజాతిభేదముల నెన్మిదిగ లెక్కించుచు, నవి భరతదేశపువే యనియెదరు. అమెరికాయందుఁగూడ నీజాతులు కొన్ని కలవందురు గాని యవి వీటిలోనివే నఁట.

౧ చిట్టాల్ జాతి— ఒడలునందుఁ జిట్టలు లేక మచ్చలుంట నీ పే రయ్యెనఁట. చక్కనిజాతి. దక్షిణమున యరణ్యములందు మందమందలుగ వసించెడిని. మగది యించుకఁ బెద్దది. పిల్లను బట్టి పెంచిన చాల మచ్చిక యగును. రాత్రులందుఁ గట్టకున్న నెల్లలు నిద్రించుతఱిఁ బాఱిపోయి యన్యులతోఁటలను మేసి తిరుగ నందఱు లేచువఱ కింటనే యేమియు నెఱుఁగనిదానివలె నుండుగుణముఁ గలది. పరువిడుచు నెన్మిదియడుగుల కంచెనైనఁ దాఁటఁగలదు.

౨ సాంబారుజాతి- (సాంభూర్) మధ్యయిండియా, ఉత్తరఇండియా యరణ్యముల వసించుజాతి. ఎఱుపు కలసిన పసుపువర్ణముఁ గలది. వెండ్రుకలు మోటగఁ బొడవుగ నుండి చిట్టాలుజాతి

కన్ను నొకయడుగు గొత్తుగ నుండు. పెద్దజాతి. మగది నాలడుగుల యెత్తునకుఁ బెరుగును.

3 కాశ్మీరజాతి- ఇది భరతదేశపు లేడిజాతులలో నెక్కువ యెత్తైనదని చెప్పఁబడినది. మచ్చల లేడిని బోలియుండెడిని. కాశ్మీరమునందు మాత్రమే కలదు.

౪ కడవేజాతిలేడి- పశ్చిమకనుములందు నాప్రాంతారణ్యములందు నుండుజాతి. సాంబారుజాతిలేడి వలెనే యుండురంగుఁ గల్గియు, నించుకనూదా బూడిద రంగులతో నుండి, వేడిప్రదేశములందుఁ బచ్చిగడ్డిని మేసి బ్రతికెడిని. కాని, యీజాతి సముద్రపు నీటిమట్టముపై నాలు వేలయడుగులయెత్తునఁగూడఁ గలవని కనిపెట్టియున్నారు. కాని, యివి మందలుగ నుండవందురు. చాల పిఱికిజాతి.

౫ నల్లలేడి- వీటిచర్మమును కృష్ణాజినమని యనుటఁ గలదు. దక్షిణ యిండియాపీఠభూములఁ గానవయ్యెడిని. కొన్ని దక్షిణాపథ (డక్కన్) వ్యవసాయపుఁ బ్రాంతములందుఁగూడఁ గన్పించుచున్నవి. కొన్ని పోతరించులేళ్లు మోటారు కారుతోఁగాని రెయిల్వేబ్రియునుతోఁగాని కూడా పరుగిడుటఁ గాననగును. ఈజాతి పెద్ద మేఁకంతపరిమాణము. ఆఁడులేడి యేంబరువంటి పచ్చనివర్ణముఁగల్గి సుందరాకారమునఁ దనరారును. మగది యించుక నల్లనిదిగఁ దోఁచును. వీఁపుపై నలు పధికముగ నుండును. ఇం దాఁడవి మచ్చికపడు నఁట.

౬ నీల్గయిజాతి (నీలగిరిజాతి)- ఉదకమండల పరిసరములను, నీలగిరిపర్వతములం దంతటను గన్పించుజాతి. ఇది యపురూపపుజాతిగఁ జెప్పఁబడినది. నల్లయూదారంగులనుండి పేరందినది. ఆఁడుది, మగది కలసియుండ నొల్లవు. జోడుఁ గట్టుతఱిని మాత్రము కలసి యుండునఁట. స్లేటుపలకరంగు మేనుతో నాఱడుగుల దనుక పెరుఁగు నందురు. కొమ్ములు పొట్టి. మగది యించుక నలు పధికము.

౭ కెమ్మాజాతిలేడి— కన్నడభాషను కెంప (ఎఱ్ఱని) శబ్దమునుండి యేర్పడిన పేరు. ఎఱ్ఱనిరంగుఁగల జాతి. వెండ్రుకలించుకఁ బొడ వధికము. మగది యించుక బలసి గొఱ్ఱెనుబోలి యుండును. ఈజాతి నిర్బంధమునం దధిక కాలము బ్రతుకనఁట.

౮ ఎలుకజాతిలేడి— ఇది మైసూరుదేశపు మలనాడుసీమయందునను నాప్రాంతారణ్యముల తిప్పడొంకలందుఁ గాన నగుచున్నది. పెద్ద చెవలపిల్లివలె నుండుజాతి. చాల నశించుచున్నజాతి. చిట్టాలుజాతివలెనుండు కడుఁజిన్నజాతి. దుంపలం ద్రవ్వుకొనికూడఁ దినును. వార్ధక్యములు. నోటినుండి చిన్న వంకరదంతములు రెం డేర్పడును. అమెరికాయందుఁ గూడ లేడిజాతి యొకటి కలదు గాని యది భరతదేశపుజాతులలోనిదే.

**లేడేస్ (Lay days):**—వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఓడయందు Load చేయుటకుఁగాని, ఓడనుండి unload చేయుటకుఁగాని యంగీకారపత్ర మందినపిదప నాపని ముగింపగు వఱకు నంగీకరింపఁబడిన కాలములు.

**లేతశరీరములు, ముదిరినశరీరములు:**- పనితన మిప్పుడు బాలుర కిరవగునవి కొన్ని, ముదిరినశరీరములుగల పెద్దవారి కిరవైనం గావచ్చును. కొన్ని యిరవుఁగాకపోవచ్చునుగాని, పెద్దవారి కిరవగుకొన్ని బాలుర కిరవుగాక యుపా

యకరములుగూడఁ గానోపు. పసితనమున బాలుర కిరవగు స్తన్యము ముదిరిన శరీరముఁగల పెద్దవారి కిరవైననుఁ గాకున్నను పెద్దవారు గాల్పుచుట్ట, త్రాగు కాఫీ, మొదలగునవి బాలుర కపాయకర ములు గానోపు. ఇంక బలోపాహారములగు భోజన దార్థములు బాలుర కరుగవు.

దీనికి మొదటికారణము:- ముదిరినశరీరములందు భరించియుండఁగలశక్తి (power of resistanec) బలపడియుండునుగాన వారికిఁ బలోపాహారపదార్థ ములు పొగాకుపొగ, కాఫీ మొదలగునవి యపా యము జేయఁజాలకుండును. పసిబాలురం దా శక్తి లేఁతదిగాన బలహీనమైయుంట నపాయకర ములు గానోపు.

రెండవకారణము:- ముదిరినశరీరమున జీర్ణశక్తి బలముగ నధికమై యుండును. బాలురయం దట్లుఁ గాక బలహీనమై యుండెడివి. కాన నజీర్ణకరము లై యుఁడనోపు.

మూఁడవకారణము:- ముదిరినశరీరములు గట్టి పడియుండునుగాని, ఎదుగుచున్న లేఁతశరీరముల వలె నతిమృదువై యేపాటికతినతకు నోర్వఁ జాలక పుండగుటకు సిద్ధమైయుండునవి కావుగాన, ముది రినశరీరములతో వ్యవహారము నిరపాయకరమై యుండును. ఎదుగుచున్న లేఁతశరీరము లించుక హెచ్చుతగ్గుల నాగఁజాలకఁ బుండగునట్లు సిద్ధ మై యపాయకరములు గానోపు.

**లేని, కాని మాటలు:**— ఆంధ్రభాషాసాం ప్రదాయార్థపదము. లేని యనిన యన్నుత మని యు, కాని యనిన కారాని యనియు నర్థముఁ. నిరసనయం దుపయోగించుపదము. లేనిపోని మాట లనుటయం దిదియే యర్థము. ఇట 'పోని' యన పోఁగూడని, చనరాని యని యర్థము.

**లేబర్ డే:**— ఐరోపాదేశములందు మేనెల ౧ వ తేది లేబర్ డే ఆచరింపఁబడుచున్నది. క్రీ. శ. ౧౮౯౦ నుండి ప్రారంభమైనది.

**లేమ్బ్‌డాసిజమ్** (Lambdacism):— ఆంగ్లము నెఱుఁగని యితరదేశీయులు తెలియకగా R అను నక్షరమునకు బదులుగ L ను ఉపయో గించి యుచ్చరించుట.

(ఉదా) "Very అనుటకు బదులు Velly అనుట. దీనినే Lallation అందురు, భాషా శాస్త్రమున Lambdoid అనియుఁ గలదు. గ్రీకు భాషాజన్యమగు 'Lambda' దీనికి వ్యుత్పత్తి.

**లైటియర్** (Light Year):—ఎస్ట్రానో మీశాస్త్రమున నాకాశమండలిగోళముల దూర మునుగొలుచుతతి బిలియన్ 1000,000,000,000 (12 సున్నలు) మైళ్ళదూరమునకు 'లైటియ్యరు' అని పేరిడి వాడియున్నారు. ఇది యాంగ్ల జర్మను గణితశాస్త్రమందలి లెక్కయి యున్నది. (న్యూ మరికల్సు చూడుఁడు. ప్లానెట్సు చూడుఁడు. ఎస్ట్రానామీ చూడుఁడు) సర్వదేశములవారును ఎస్ట్రానామీశాస్త్రవిధానదృష్ట్యా లైటియరనిన 1000 000 000 000 మైళ్ళదూరమని యంగీక రించియున్నారు.

**లైట్ - డ్యూస్** (Light dues):— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. సముద్రమున నడచు నోడలకు మార్గములం దెలుపు light houses లు Boys Biacons మొదలగువాన్ని నుంచుట కగువ్యయమునకుఁ గాను నోడలనుండి వసూలుచేయు పన్నుల కీపేరు వర్తించును.

**లైట్‌హౌసులు** (Light houses):— ఇవి తెలుచుగ టవర్ (Tower) రూపములుగ

నిర్మింపఁబడిన masonary కట్టడములు. వీట్ల యందుఁ దలపై దీపములు మొదలగునవి నిలుపుచు సముద్రఁపుటోడలందలి నావికులకు మార్గములం దెల్పుచుందురు. ఈదీపములు మొదలగువాటికి 'బీక' (beacons) న్ననియు, ఈకట్టములకు లైటుహౌసు (Light houses) లనియు, వాడుచుందురు. స్థిరముగ నొకేరీతిని గన్పట్టుదీపములు గాని, వేర్వేఱుభేదావస్థలతోఁ గన్పట్టుదీపములు గాని, బీక న్ననంబడును. ఈ బీకనులందలి భేదము నుండి నావికులు వేర్వేఱు రేవుస్థలములను రాత్రులం దెఱుంగ వీలగుచుండును.

దీపము చూపుచుండు రంగు దీపము స్థిరముగ నుండునదియో లేక తిరుగుచుండునదియో, ఒక్కొకతఱి నొకటిగనో, రెండుగనో యధిక కాంతులం బ్రదర్శించునదియో, ఎంతెంతగడువులందు వెలుఁగిచ్చుచుండునదియో, ఇట్టివిభేదము లీబీకన్ దీపములం దేర్పఱుపంబడి యనేకతావులందు భేదములతో నమర్పఁబడుచుండెడిని. కొన్ని బీకనులు ఫిరంగులం బేల్చినటుల ధ్వనులిచ్చునవిగను, మఱికొన్ని బీకనులు వేర్వేఱుధ్వనులం జేయునవిగను గూడ నమర్పఁబడియుండును గాని, యన్నియుఁదమ తమ నియమితకాలములందు గడువుకాలముల నతిక్రమింపకఁ బనిచేయుచుండును.

ఓడలు నడుచు జలమార్గములం దించుక ప్రాముఖ్యతఁదగ్గినముఖద్వారముల (minor entrances) కడ, అనఁగా హార్బరుల లోపలితావులు నోడలు, నావలు, పడవలు నడుచుకాల్వల మొగలందుఁగూడ చిన్నదీపములయేర్పాటు లుండును. ఇట్టివానింగూడ బీకన్ దీపము లనియే యందురు. ఇట్టివి నీటియందుఁ దేలుచుండు (buoys అనంబడు) ఇనుపతుంబలపైనను, చిన్న కట్టడఁపుస్తంభములపైనను లేక లోహఁపు స్తంభములపైనను నమర్పఁబడియుండును. ఇట్టివి నిర్మించుటకు వీలు లేనిజలప్రదేశముల బీకన్దీప మావసర మగునేని చిన్న Light Ship అనఁగా Ships having lights లేక దీపఁపుటోడలను, లంగరులు వేసి, నిలిపియుంచి యుపయోగింతురు. ఈయేర్పాటు లన్నియు నావికులకు మార్గదర్శకములై తనరెడిని. (హార్బరులు చూడుఁడు).

**లైట్హౌస్ దీపస్తంభము** (Light house) :— ఇవి యనాదిగ నుండినటులఁ బరిశీలకు లనెదరు. లైటుహౌసులు సముద్రమునం దిరుగుచుండునోడల కపాయకరప్రదేశముల నెఱుఁగఁజేయుటకు నిర్మింపఁబడుచుండునవి. ముఖ్యముగ నోడరేవులకడ నిర్మింపఁబడెడిని. ఇక్కాలమున నివి 'Marvel of cientific skill' అని చెప్పఁబడునంతటి యేర్పాటులతో నిర్మింపఁబడుచున్నవి. నిత్యముఁ గడుదూరమున కగుపడుదీపకళి కలును, పొగమంచు గ్రమ్మినకాలమున ధ్వని యొనర్చి యోడల కెఱుకపఱచు Fog horn లును, Fog srgnalls ను గల్గియుండవలయును.

లైటుహౌసులు కడుదిట్టమైన కట్టడములుగ నుండును. ఇవి సముద్రఁపునీటియందుఁగాని, నీటియందలి లేక తీరములందలి శిలాతలములపైఁగాని నిర్మింపఁబడునుగాన, కడుబలముగ నుండవలసియుండును. తుపానులందు వీటి కపాయ మధికముగాన, వాటి కాఁగి నిలువఁగలవిగ నుండవలసియుండును. తుపానులందు నీటియెగురుపాటు దీపముల కంటునటు లున్నతఱిఁగూడ నివి యోడలకు వెలుతురం జూపుచుండవలయునుగాని యూరక విశ్రాంతిగొనరాదనుటయందే దీపస్తంభ నిజతత్వము సుబోధకముఁ గాఁగలదు.

వీటిపునాదులు రాళ్ళలోనికిఁ దొలచి నిర్మింతురు. కొన్ని రాతికట్టడములుగను, కొన్ని యినుపకట్టడములు [కాంక్రీటుసహా] గను, నిర్మింపఁబడుచుండును. కాని గట్టిపునాది యడుగున లేనియిసుకప్రదేశముల నిర్మింపఁబడు లైటుహౌసులం గూర్చి యధికజాగ్రతం గొనుచుందురు. ఇవి గుల్లగను, గుండ్రముగ నుండునట్లును, నిర్మింపఁబడుచుండుట శ్రేయమని కన్గొనఁబడియున్నది. ఇం దడుగున [క్రిందిభాగమునందు] జలనిలయమును, దానిపై లోనికిం జనుమార్గముఁగల ప్రదేశమును, దానిపైని నూనెను బొగ్గు మొదలగువంట చెఱకు నిల్వయు, దానిపై నిల్వ సామానులగది [Store room] యు, దానిపై చమురు నిలవగదియు, దానిపై లైటుహౌసుకీపరు (ఉద్యోగి) వసించు గదియు, దానిపై నాతఁడు పరుండుగదియు, దానిపై సర్వీసురూమును [గదియు], దానిపై దీపఁపులాంతరును నుండునట్టుల నిర్మింతురు. ఈదీపములకు నూనె గాని, గాస్ గాని, ఎలక్ట్రిసిటీ గాని, యుపయోగింపఁబడుచుండును. ఈదీపములపైననే యనేకయోడలరక్షణ, ఆధారపడియుండునుగాన నిది యెక్కువ జాగ్రతతో నిర్మింతురు. లాంతరుం జుట్టు నొకగదివలె నద్దముల నోడ యుండును. అందు Lences Prisms Reflectors కూడ నమర్పఁబడి యుండెడివి. అవి వెలుతురుం దర్పితముగ నొనర్చుట [magnifying] కుఁ దోడు కిరణములం జేర్చుట, వంచుట మొదలగుపనులం జేయుచు గాఢమగుకాంతిని ప్రకాశింపఁ జేసి, ముప్పదిమైళ్ళదూరమునకుఁ గూడఁ గన్పింపఁ జేయునవిగా నుండెడివి. ఈలాంతరు లనేక టన్నులబరువుండును. నిష్ఠతోఁ బనిఁజేయుచుండును. గడియారఁపునిర్మాణతోఁ పనిఁజేయునఁట.

దీపములరంగులు మారునట్లయు, తిరుగఁ గన్పించుచుండు కాలవ్యత్యాసములును, వేర్వేఱు లైటుహౌసులందు వేర్వేఱుగ నమర్పఁబడుచుండునని చెప్పఁబడియున్నది. వీటినినడుప గడియారఁపుయంత్రమువంటి యంత్రము (చక్రసముదాయము) లమర్పఁబడెడివి. ఆగడియారఁపు యంత్రములు (Clock-work-machinery) స్ప్రింగులవలన బిగింపఁబడి పెండ్యులమ్ (Pendulum) వలనఁ గదలింపఁబడుచుఁ దిరుగుచుండును. దీపము ఎలక్ట్రిసిటీ యగునేని యాశక్తియే యవసరకాలముల స్ప్రింగులం బిగించి కీ యిచ్చుచుండునుగాని, చమురుదీప మగునేని చేతితోఁ ద్రిప్పి, కీ యిచ్చుచుండవలసియుండును. ఇట్టిశక్తి కీ తక్కువగుతఱి నొకయలారమ్ (alaram) గురుతు ధ్వనించెడి యుద్యోగిని మేల్కొల్పెడివి. ఇట్టి వెలుతురు దివ్వెలు లక్షక్యాండిల్సు వెలుఁగిచ్చునవికూడ నుండును. ఇట్టియుద్యోతము కొన్నితావులఁ బొగమంచు గ్రమ్ముచో నివి నిరర్థకములై యుండు నందురు. అట్టితఱి Fog horm తో ధ్వనిఁజేయుచు నోడలకు సంగతులం దెల్పునఁట. ఈఫాగ్‌హారన్ ధ్వనుల భాష యన్నిలైటుహౌసులకు సాముదాయకముగనే యుండును. ఇంక ఫాగ్‌సిగ్నల్సునందు భేదములుండెడివి. కొన్నితావుల ధ్వనింగల్గించుఁ దిక్కుల మూలమునను, కొన్నితావులఁ దుపాకులం బేల్చుచు ధ్వను లొనర్చుచు నోడలలోనివారి కెఱుకఁగఁజేయుచుండుటయుం గలదు. అవి యిరువదిమైళ్ళదూరమునకుఁగూడ సముద్రపు టల్లకల్లోలఁపుధ్వనుల నడుమ విన్పించునఁట. అవి విద్యుచ్ఛక్తిగలతావులం దావిరిసాహాయమువలననే పేల్పఁబడుచుండునఁట.

## లైటుహౌస్ దీపస్తంభము మొదటఁ గట్టంబడినది (The first light house that was built in the world):—

ఐరోపాఖండఁపు గ్రీసుదేశమునుండి సముద్రమును దాఁటి,

ఐగుప్తుదేశమున కరుగుమార్గమున ఫారోస్ ద్వీపము కలదు. అది గ్రీసుదేశమునం దక్కాలమున Sostratus అనుపేరుగల గొప్ప ప్రసిద్ధిగల కట్టడనిర్మాత [archilict] ఉండెను. ఆతని కొక సుందరితో వివాహసంబంధ మేర్పడి, ఐగుప్తుదేశ తీరమున నొకతావున వివాహము జరుగ నేర్పడి, యాకన్య నొకనాటిరాత్రి తలిదండ్రులు నావపై సముద్రముపైఁ గొంపోవుచుండిరి. చీకటియందా నావ సుడిగాలిలోఁ దగుల్కొని తెన్నుఁగానక యొకరాతికిఁ గొట్టుకొని పగిలిపోవ, వారందఱు మృతినొంద, నాపెండ్లికొమరుండు దుఃఖితుండై, ధైర్య మవలంబించి, ప్రభుత్వసాహాయ్య మర్థించి, యాతావునకు సమీపముననేయున్న ఫారోస్ద్వీపమున నారాతిపై నావవాలుగ నాదీపస్తంభముఁ గట్టడనిర్మాణ మొనర్పఁజేసి, తెల్లని పొడవగు కట్టడముం గట్టించె నది పిదప నాకాలపు ఏడువింత లలో నొకటిగఁ బరిగణింపఁబడ సాగెనఁట [Seven wonders of the world]. అది నాల్గువందల యడుగులపొడ వుండెనని చెప్పఁబడినది. అది పిమ్మట ౧౫౦౦ సంవత్సరము లట్లు నిలచి పనిఁ జేయుచుండెనఁట. పిదపఁ గల్గిన భూకంపమునకుఁ గూలి విరుగఁబడి భగ్నమాయెనని చెప్పఁబడినది.

## లైట్నింగ్ కండక్టరు (Lightning Conductor):— Conductance శక్తి యెక్కువగాఁగల లోహఁపుఁదీగలను కట్టడములకుఁ గొంచెముపైగా నుండునటుల భూమికి నాటఁజేయుపరికరము. ఇవి యాకట్టడములపైఁ బిడుగులు పడునపుడవాటి నాకర్షించి భూగతముగునట్లుఁ గ్రిందికి నడుపఁజేయునుగాన, కట్టడమునకు రక్షగా నమర్చుచుందురు.

## లైన్:—

(ప్లైన్ చూడుఁడు).

## లైబిలిటీస్ బై ఎండార్సుమెంటు (Liabilities by endorsment):— హుండీలుమొదలగువాట్లపైఁ జేయఁబడిన endorsement వలన సంభవించెడి యప్పులతీర్మానపు బాధ్యతల నాహుండీ యెవ్వరిపైకి వ్రాయఁబడినదో వా రాసొమ్ముఁ జెల్లింపకపోయిరేని endorse చేసినవా రాబాధ్యతవహించవలసియుండును.

## లైబేరియా రిపబ్లికు దేశము:—

ఆఫ్రికాఖండమునఁ బశ్చిమభాగమున, నప్పర్గినియా యందున్న సెటిల్మెంటుస్టేషను. ఇది స్వతంత్రమైన నీగ్రోప్రజాపరిపాలనదేశము. క్రీ. శ. ౧౮౨౨ లో నమెరికాసంయుక్తరాష్ట్రములలో నొక సంఘము వారివలన బానిసవర్తకము నాటునకు స్థాపింపఁబడి క్రీ. శ. ౧౮౪౭ లోఁ బ్రజాప్రభుత్వముగాఁ జేయఁబడినది. మోన్రోవియాపురము ప్రభుత్వకార్యస్థానము. దీని కమెరికాసంయుక్తరాష్ట్రముల యగ్రాసనాధిపతిగానుండిన ప్రసిడెంటు మన్రోగారిపే రిడఁబడినది.

## లైబ్రరీ:-

(పుస్తకభాండాగారము చూడుఁడు).

## లైయానిజమ్ (Lionism):— Lion అనఁగా సింహము. సింహమును వేఁటాడుట యందలి నేర్పరితనము.

## లైసెన్సు (Licence):— వాణిజ్య సంబంధపరిభాషాపదము. కొన్ని (వస్తుపదార్థములు మొదలగునవి) విక్రయించుటకు, మందుగుండు సామానులు తయారుచేయుట మొదలగు నపాయకరములగుపనులకు, కొన్నియాయుధములం గల్గియుంటకు నీయఁబడిన Special permission.

**లైసోల్ పరిశ్రమము (Lysol):**—లైసోల్ రోగపుఁ బురుగులం జంపి పరిశుభ్రపఱచు పదార్థము. ఘాటువాసనఁ గలది. ఇందు సఖముభాగము Cresols ఉండవలె ననియు, Caustic alkali ఉండరాదనియు, (అనఁగా లేనిదిగానుండిన శ్రేయమనియు), వైద్యవిద్యావిశారదు లనుచుందురు. ఇది రెండువిధములుగఁ జేయఁబడుచుంట నాచారమై యున్నది.

ఒకవిధానము:—

Cocaine hydrochloride...అరగ్రేను
Baric acid ... ...4 గ్రేనులు
Distilled water [పరిశుభ్రోదకము] 1 fi ఔన్సు

వీటిని గొంచెము వేడినీళ్ళతోఁ గల్పవలయును.

ఇంకొకవిధానము:—

Tar oil ... 40 గ్రేనులు
Common rosin ... 10 గ్రేనులు
Caustic Potash solutions 70 గ్రేనులు
Alcohol ... 70 గ్రేనులు

**లొంబార్డీసీమ:**— ఇటలీదేశములోని యొక ప్రోవిన్సు. (చూడుఁడు.)

**లొద్దుగ (లోధ్ర) చెట్టు:**—లా. symplocos Racemosa — ఆం. Lodh tree. సం. లోధ్ర - శబర - హేమపుష్పక. ఇది తెల్లలొద్దుగ, ఎఱ్ఱలొద్దుగ యని ద్వివిధము. గుణ మొకటే.

స్త్రీల ఋతుసంబంధదోషములను శుభ్రపఱచి యారోగ్యముఁ గల్గించునదిగ లొద్దుగపూ వాయుదవైద్యశాస్త్రమునందు వివరింపఁబడినది.

చెక్కరసము గాని, కషాయము గాని, అరుచి, అతిసారము, కఫదోషము, క్రిమిరోగములు, దాహము, పైత్యము, వమనములు, విషదోషములు హరించునని చెప్పఁబడినది.

తెల్ల, ఎఱ్ఱ, లొద్దుగజాతులను లోధ్రద్వయమనియు వాడియున్నారు.

**లొల్లార్డిజమ్ (Lollardism):**— Church అధికారమును పొందకయే బైబిలు ప్రచారముఁ జేయుట మొదలగుపనులు చేయుట. ఇట్టి Lollards, చాలమంది Henry VIII కాలమున ఘోరముగ శిక్షింపఁబడెడివారు.

**లోఆర్కిపిలెగో (Low archipelago) ద్వీపములు:**— దీనికి Dangerous archipelago అని యువాడుకపేరుఁ గలదు. అనఁగా గష్టతరద్వీపము లనియర్థము. ఇచటి కేగుటఁ గష్టతర (దుస్సాధ్య) మనిభావము.

ఇవి ఓసీనియాయందలి పొలినేసియాద్వీపసమూహమునకుఁ జెందిన ద్వీపములు. సముద్రపు నీటిమట్టముపై నెక్కువయెత్తులేకఁ జిన్నచిన్నవిగనుండు పెక్కుద్వీపములు కలవు. సొసైటీద్వీపములకుఁ దూర్పుగా నున్నవి. స్వదేశభాషానామ మేమో తెలియదు.
(ఓసీనియా పొలినేసియా ద్వీపములు చూడుఁడు).

**లోకనీతిసిద్ధులు - (పంచసిద్ధులు-లోకవ్యవహారసిద్ధులు):**-ఇవి యైదును లోకవ్యవహారములందుఁ గ్రియాసిద్ధిఁ జేకూర్చునవి.

౧ సహాయము— తనకార్యమున కవసరమగు సహాయసంపత్తి ని గుమర్చుకొనుట.

౨ సాధనోపాయము— తనకార్యసాధనమున కనుకూలమగు నుపాయములను జక్కఁగ నెఱింగి కార్యమును జాగ్రతగ నడుపుట.

3 దేశకాలవిభాగము— ఏదేశమునం దేది యమరునో, యేకాలమునం దేది యనుకూలించునో

చక్కఁగ యోచించి వాటిమేరకుఁ గార్యము నడపుట.

౪ వినిపాతము— రాఁగలవిపత్తుల నెఱింగి, వాటిని దప్పించుకొనుటకు వలసిన జాగ్రితయందు మెలఁగుట.

౫ ప్రతీకారము— అన్యులు తన కొనర్చిన యుప కారాపకారములకుఁ దగురీతిని బ్రతిక్రియ లొనర్చుట.

**లోకపాలురు:**— భూమికి నలుదిక్కులను రక్షకులై లోకాలోక మనుపర్వతముపై వసించు చుండినవారు. ౧ సుధన్వుఁడు, ౨ శంఖపాలుఁడు, ౩ హిరణ్యరోముఁడు, ౪ కేతుమంతుఁడు.

లోకాలోకపర్వతమునకుఁ జక్రవాళ మనియు నామాంతరము గలదు. దీనిలోపలిభాగము సూర్య కిరణముచేఁ బ్రకాశించుచుఁ గనఁబడుచుండుటయు, వెలుపలిభాగము స్పష్టము గాకుండుటను దీని కీపేరు గల్గెనని చెప్పఁబడినది.

**లోకపురము:**— మధ్యరాష్ట్రములలో నిప్పుడు 'చాందా' యనంబడుచున్నది. ఇట మహా కాళీదేవస్థానముఁ గలదు. ఇంకను దొల్లింట ఝుర్ప తేశ్వరుఁడని నామాంతరముఁ గల యచలేశ్వరుని దేవస్థానముఁ గలదు. ఆయచలేశ్వరుఁడు కాళీ పుత్రుఁడఁట. దీనిప్రశంస స్కాందపురాణమునఁ గలదఁట.

**లోకములు పదునాలుగు:**— చతుర్దశభువనములు. (౧౪ లోకములు.)

ఊర్ధ్వలోకములు ౭:— ౧ భూలోకము, ౨ భువర్లోకము, ౩ సువర్లోకము, ౪ మహర్లోకము, ౫ జనోలోకము, ౬ తపోలోకము, ౭ సత్యలోకము.

అధోలోకములు ౭:— ౧ అతలము, ౨ వితలము, ౩ సుతలము, ౪ రసాతలము, ౫ మహాతలము, ౬ తలాతలము, ౭ పాతాళము. వెరశి ౧౪.

**లోకములు, లోకాధిపతులు (అష్టలోకములు):**—

| | | |
|---|---|---|
| ౧ మహాతలము | దీనికి లోకాధిపతి | బలుఁడనియు |
| ౨ రసాతలము | ,, | అతిబలుఁడనియు |
| ౩ తలాతలము | ,, | బలవంతుఁడనియు |
| ౪ సుతలము | ,, | బలవిక్రముఁడనియు |
| ౫ వితలము | ,, | బలేశుఁడనియు |
| ౬ నితలము | ,, | బలశాలియనియు |
| ౭ తలాతలము | ,, | బలాధ్యక్షుఁడనియు |
| ౮ పాతాలము | ,, | హాటకుఁడనియుఁ |

చెప్పఁబడినది. (సిద్ధాంతశేఖరము, నైమిత్తికకాండము, షడధ్వశోధనప్రకరణము చూడుఁడు).

**లోకవ్యవహారసిద్ధులు:**— (లోకనీతిసిద్ధులు చూడుఁడు.)

**లోకాయతమతము:**— (చార్వాకమతము చూడుఁడు.)

**లోకాయుతుఁడు:**— ఈమహానుభావునిం గూర్చి యేమియుం దెలియకున్నది. ఈతఁ డింద్రియాత్మవాదిమతమునకుఁ గర్త. (ఇంద్రియాత్మవాదిమతము చూడుఁడు.) ఇది నిరీశ్వరవాది మతము. అనఁగాఁ బరమేశ్వరుఁడే లేఁడనుమతములలో నొకటి. ఇంద్రియములనే యాత్మ యనెదరు.

**లోకేశమనుగణము:**— ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము. ఇందైదుగోత్రములు చెప్పఁబడినవి.

(సామశాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు.)

౧ లోకేశమనుగోత్రము—లోకేశ, ధాత్య, వితథు. [త్రయార్షేయప్రవర.]

౨ పద్మదక్షర్షి గోత్రము- ధాత్ృ, వితక్ష, వైతక్ష, మేధమతి, పద్మరక్ష, [పంచార్షేయప్రవర.]

3 వితక్షపునుగోత్రము- వితక్ష, వైతక్ష, మేఘవంతి, [త్రయార్షేయప్రవర.]

౪ మేధమతి ఋషి గోత్రము- మేధమతి, పద్మదక్ష, విశ్వవేద్య, విశ్వమయ, విశ్వోపచిత్ర, [పంచార్షేయప్రవర.]

౫ విశ్వమయర్షి గోత్రము- విశ్వమయ, విశ్వోపచిత్ర, విశ్వబర్హి [త్రయార్షేయప్రవర.]

## లోకోగారగోత్రము:—

(కౌశికగణము చూడుఁడు.)

**లోకోక్తులు:**— లోకముచేఁ జెప్పఁబడు 'ఉక్తి' లోకోక్తి. లోకులు దీని నిట్లు వాడిరనియు, వాడుచున్నారనియు, వాడుచుందురనియు భావము. అనుభవమువలనఁ దరతరములుగ లోకులు దీని నెఱింగిరని తాత్పర్యము.

ఇది యనుభవైకవేద్యముగా నిశ్చయపఱుపఁబడినవాక్యము. దీనికి సంశయ ముండదు. తెలుఁగున 'సామెత' యని దీనికిఁ బేరు. సామెత లేక సామ్య మన సాదృశ్యమనియే యర్థము. సామెతలు తెలుఁగుదేశమునఁ గల్గినవి. తెలుఁగుసామెతలని వ్రాయఁబడినవి. అవి యాద్యక్షరములకుం జెందినవిగ విభజించి, వాట్లయం దవి చేర్పఁబడినవి. అనఁగా ఆద్యక్షరము, 'అ' యైన నవి 'అ' అక్షరమునకుం జెందినసామెతలుగ, అ అక్షరమునందునను, 'క' ఆద్యక్షరములుగాఁగలవి 'క' అక్షరమునకుం జెందినవిగ, క అక్షరమునందునను, స్థానము లీయఁబడినవి. (చూడుఁడు.)

ఇంక నరబ్బీ (అరేబియా) దేశఁపుసామెతలు, అఱవదేశఁపుసామెతలు, నాంగ్లదేశఁపుసామెతలు, ఆఫ్ఘనిస్థానదేశఁపుసామెతలు, (అనఁగాఁ బుష్తు భాషాలోకోక్తులు) ఇటలీదేశఁపుసామెతలు, కన్నడదేశఁపుసామెతలు, కాశ్మీరదేశఁపుసామెతలు, చీనాదేశఁపుసామెతలు, జపాన్దేశఁపుసామెతలు, జర్మనుదేశఁపుసామెతలు, తురుష్క- (టర్కీ-) దేశఁపుసామెతలు, పరాసు (ఫ్రెంచి) దేశఁపుసామెతలు, పారశీక (పరిషియా), దేశఁపుసామెతలు పోర్చుగీసు [పోర్చుగలు] దేశఁపుసామెతలు, బంగాళ (వంగ) దేశఁపుసామెతలు, బడగ (నేలగిరిపర్వతఁపు టడవిమనుష్యుల) సామెతలు, మలయదేశఁపుసామెతలు, మహారాష్ట్రదేశఁపుసామెతలు, రష్యాదేశఁపు సామెతలు, స్పానియాదేశఁపుసామెతలు, హిందుస్థానదేశఁపు [హిందీభాష] సామెతలు, గూడ నిందుఁ జేర్పఁబడినవి. నామెతలు నైజముం

**లోకోమోటివ్ ఎంజినులు:**- ఒక తావునుండి వేఱొకతావునకు సరకులను, మనుష్యులను, వారుండినబండ్లను, తీసుకొనుపోవుయంత్రములకు 'లోకోమోటివ్ ఎంజిను' లనియెదరు. ఇవి యావిరిబలముచే నడుచు steam engine లు, Internal combustion engine లుఁ Electric engine లు నని త్రివిధము.

**లోగర్దమ్ములు:**- లోగర్దములు అనునది గణితశాస్త్రమునందలి ముఖ్యముగా బీజగణితముయొక్క సాంకేతికనామము. 'లోగర్దము' అనుపదమునకు సరియైన నిర్వచనముఁ జెప్పుటకును, గణితశాస్త్రమునందు వాని ప్రయోజనమును గూర్చి చెప్పుటకును, ముందు 'బీజగణితము' (Algebra) A ఇండిసీస (Indices) న నేమో ఉపోద్ఘాతముగా వివరింపవలసి యున్నది.

a అనునొకవస్తువు మరల దానిచేతనే గుణింపఁబడినయెడల వచ్చినలబ్ధము '$_a 2$' అని చెప్పఁబడును.

ఉదా— $a \times a = a\ 2$ (1)

అట్లే $a \times a \times a = a\ 3$ (2)

...$a \times a \times a \times a$ అసంఖ్యమగు n పరిమితి ప్రాప్తిని గణించినయెడల$= {}_a n$ (3)

a అనుదానికి మీఁదనుంచఁబడిన లబ్ధమునందలి 2, 3, 4, n - వీనికి ఇండిసీస్ (Indices) అని పేరు. ఇది యింగ్లీషుభాషలోని 'Index' అనుదాని బహువచనరూపము.

బీజగణితమునందు కేవలము ధనస్వభావము గల (Plus) ఇండిసీసులేగాక, ఋణస్వభావము గల నెగెటివ్ (Indices) ఇండిసీసును, భిన్నస్వభావముగల (Fractional) ఇండిసీసునుగూడఁ గలవు.

ఉదా—$_a{-x}$ అనఁగా $\frac{1}{_a x}$ అనియు, $\frac{1}{a\ x}$ అనఁగా a యొక్క x పరిమితి నూరవన్నమాట. $\frac{x}{a}$

$a,^2\ a,^3\ a^4 \ldots\ldots {}_a n$ అనువానిని రెండవయంశమునకు, మూఁడవయంశమునకు, నాల్గవయంశమునకు ...అసంఖ్యమగు n అంశమునకు గుణింపఁబడిన a అని చదువఁదగును. అంతే కాదు ${}_a 2,\ {}_a 3$ (ఎస్క్వేయరు, ఏక్యూబు) అని చదువుటఁగూడ నాచారము.

పైన వివరింపఁబడిన లబ్ధములవంటివానిలో 2, 3, 4...n అనుసంజ్ఞలు ${}_a 2,\ {}_a 3,\ {}_a 4,\ {}_a n$ అని వానికి లోగర్దములని చెప్పఁబడును. అప్పుడు a అనునది ప్రాతిపదికము లేక పీఠము (Base) ఎట్లనఁగా $10^2 = 100$, పది యనుపీఠము (base). సందలి నూరు అనులబ్ధమునకు రెండు లోగర్దమనఁబడును.

ఆలాగుననే 5 అను (పీఠ) సంఖ్యకు వచ్చిన 125 లబ్ధమునకు మూఁడు లోగర్ద మయియుండును.

మూఁడు అను (పీఠ) సంఖ్యకు వచ్చులబ్ధము 8 1 కి నాలుగులోగర్దము అయియుండును.

పది అను (పీఠ) సంఖ్యకు వచ్చు లబ్ధము 1,0000000 నకు ఏడు అనునది లోగర్దము.

ఆలాగుననే ${}_a x = m$ అయినయెడల అప్పుడు a పీఠమునకు లబ్ధమైన m నకు x అనునదిలోగర్దమగును.

లోగర్దం (Logartham) అనుపదము తఱచుగా సంక్షిప్తరూపమున 'లోగ్' (Log) అని వాడఁబడును.

పీఠము (Bese) గా వాడఁబడుసంఖ్య 'log' అని వ్రాసి, దానితరువాత లబ్ధమునకు ఉపధగా వ్రాయఁబడును.

ఈక్రిందఁ కొన్ని యుదాహరణము లీయఁబడినది.

$$\log_{10} 100 = 2$$

$$\log_2 16 = 4$$

$$\log_5 125 = 3$$

$$\log_3 81 = 4$$

$$\log_{10} 10000000 = 7$$

$$\log_a m = x$$

లోగర్దములయొక్క ముఖ్యప్రయోజనములలోఁ గొన్ని క్రింద వాయఁబడినవి.

${}_a x = m$, & ${}_a 7 = {}_n$ అయినయెడల అప్పుడు

$$\log ma = x \times y$$

$$\log_a \frac{m}{n} = x - y$$

$$\log_a mx = {}_a m\ {}_x \log a\ m.$$

**లోగుట్టు పెరుమాళ్లకే యెఱుక:—** (ఆంధ్రలోకోక్తి).

**లోగోగ్రాఫీ (Logography):—** వాక్య మంతయు నొక్కయక్షరముతోడనే వ్రాయుపనికి వర్తించును. మఱియును సభలలో నుపన్యసింపఁ గోరువారలకును, ధనమును స్వీకరించి యుపన్యాసములను వ్రాసియిచ్చుటకును, వర్తించును.

**లోగోస్ (Logos)** (ఓంకారము చూడుఁడు).

**లోడీ నృపవంశము:—** పీరు సయ్యద్ నృపులకుఁ బిదప నుత్తరహిందూస్థానమందలి మహమ్మదీయరాజ్యమేలిన ముసల్మానునృపతులు. (మహమ్మద్ గోరీ చూడుఁడు.
ఢిల్లీనగరము రాజధాని. వీరియందు సుప్రసిద్ధుఁ డిబ్రహీములోడీ.

**లోధ్రకాననము:—** దీని నిప్పుడు 'లోధ్మానా' యనుచున్నారు. కుమాన్‌లో నున్నది. గర్గమహర్షియాశ్రమ మీయరణ్యము లోనిది. రామాయణము, కిష్కింధకాండము, 43 అధ్యాయమునందే ప్రశంసింపఁబడినది.

**లోధ్మానా అరణ్యము:-** గర్గమహర్షి యాశ్రమవనము.

**లోపలియూహలు మంచివి కాకపో లోకమంతా చెడ్డయే:** (ఆంధ్రలోకోక్తి).

**లోపాముద్రాదేవి:—** విదర్భరాజపుత్రిక అగస్త్యమహర్షి భార్య. పతివ్రత.

**లోభిసొమ్ము లోకులపాలు:—** [ఆంధ్రలోకోక్తి.]

**లోమశ ఆశ్రమము:—** బీహారములోని గయ మండలమున, నోవాడా సబుడివిజనులోని రాజౌలీ పురమున కీశాన్యదిశగా నాల్గుమైళ్ళదూరమున లోమసెరి యనుకొండపై లోమశని యాశ్రమము కలదు.

**లోమశఋష్యాశ్రమము:—** పంజబునందలి జ్వాలాముఖీక్షేత్రమునకు వాయవ్యదిశగా 80 మైళ్ళదూరమున, ముండీసంస్థానరాజ్యములోని రోఅల్సార్ అనుతావున నదేపేరుగల సరస్సు (రోఆలేశ్వరము) నం దేడుపర్వతములు గలవు. అవి కదలుచుండునని యచటివా రనెదరు. అందు గౌరీదేవియని పేరంబరఁగుకొండ గొప్ప క్షేత్రస్థలమై యున్నది. అందు లోమశమహర్షియాలయము కలదు. దానినే హిందువులు, బౌద్ధులుఁ గూడఁ బూజించుచుందురు. బౌద్ధు లీరుషిని పద్మసంభవుఁడని పేర్కొనియెదరు. టిబెట్టుదేశమునఁ బద్మసంభవుఁడే బుద్ధుఁడు.
బౌద్ధులు-జపాన్, టిబెట్టు, చీనా దేశములనుండి బౌద్ధు లేతెంచి దర్శించుదురు. సరస్సుతీరమున నీదేవాలయ మున్నది.

**లోమాయనగోత్రము:—** (వశిష్ఠగణము చూడుఁడు).

**లోయడ్బారేజి (Lloyd Barrage):—** ఇది సింధునది కడ్డముగా సింధుదేశమునందలి సుక్కూరుపురముకడ నిర్మింపఁబడినది. నదియందలినీటి నెక్కువయెత్తునకు నిలపి కాల్వలగుండా ప్రవహింపఁజేసి పంటపొలములకు నీరిచ్చుటకైన యేర్పాటుగ నిర్మింపఁబడినది. ప్రపంచమందలి యిట్టికట్టడములలో నిదియే పెద్దదిగాఁ జెప్పఁబడు చున్నది. ఇదివఱకు నిర్జలప్రదేశములైన గయాళీ సింధునేలలను మహాఫలవంతములుగ మార్చిన

నిర్మాణము. నదికిం గుడివైపున మూఁడును ఎడమవైపున మూఁడును ప్రధానములగు పంటకాలువలు గొప్పవి త్రవ్వఁబడి, వాట్లగుండా సింధుదేశ మంతయుఁ దడపుచుండినవనిన సతిశయోక్తి కానేరదు. క్రీ. శె. ౧౮౯౩౦ జనవరిలో నివి తెఱువంబడినవి. నది కడ్డముగ నిర్మింపఁబడిన యడ్డుగోడ, ఒకమైలువఱకు పొడవుండును. దీనిని బలపఱచు గోడగట్టా కాశము నంటున ట్లున్నచో చాల బలమైనదిగ విపరీతము తోఁచెడిని. నీరు నిలువఁబడిన బారేజిపై భాగమున గొప్పసరస్సుంబోలి నీటివడి లేకఁ బ్రశాంతము తోఁచును. ఈప్రాంతమున సింధునది కడ్డముగా నిర్మింపంబడిన యినుపవంతెన 'Lands down Bridge' అనఁబడుచున్నది. అది cantiliver నుండి, cantilivor వఱకు మధ్యను 840 అడుగులదూరముగల గొప్ప గర్డరులచేఁ గట్టఁడినది.

## లోలార్కులు:—

[కాశీపట్టణము చూడుఁడు.]

**లోలాసనము:**—యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. పద్మాసనమున మఠము వైచుకొని కూర్చుండి, (పద్మాసనము చూడుఁడు.) అఱచేతుల నిఱుప్రక్కల నేల నాని, చేతుల ఊనికబలముపై శరీరమును పైకెత్తుట 'లోలాసనము'.

ఇందువలన వాయువు చలనముఁ దప్పి స్థిరత వహించునని చెప్పఁబడినది.

## లోలాక్షిగోత్రము:—

(జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.)

**లోవ (Vally) :**— రెండుకొండలమధ్యనుండు పల్లఁపుఁప్రదేశమును 'Vally' అనెదరు. ఇది సర్వసాధారణముగ సారవంతములైన భూములు గలదిగా నుండును. (mountains చూడుఁడు.)

**లోవరు బర్మాదేశము:**— ఆసియాఖండమున నిండోఛైనీస్పెనెన్సులా యందు బర్మాదేశభాగము. ఆసాముకడనున్న చిటగాంగ్పురము మొదలు మలయద్వీపకల్పమువఱకు వ్యాపించియున్నది. ౮౧౦౦౦ చతురఁపుమైళ్ళ వైశాల్యము. దేశమంతటను నుత్తరదక్షిణములకుఁ బర్వతపంక్తులును, వాట్లనడుమ నైరావతీనది, సిట్టాంగునది, సాల్విన్నది, ప్రవహించులోయలును, నదుల కిరుదెసల సారవంతములగు వ్యవసాయప్రదేశములును గలవు. ఐరావతీనది డెల్టాప్రదేశము. గొప్పసమతల ప్రదేశము. మిగుల సారవంతము. సముద్రతీరమున భూమిలోనికిం జొచ్చుకొనిపోవు సముద్రఁపుఁగాల్వలుకలవు. ఉత్తరమువైపున రామిద్వీపము, చెడుబాద్వీపము, దక్షిణమున మార్గుయీ ద్వీపసమూహము (ఆర్కి పిలెగో) ను దీనికిం జెందినములు.

దేశస్థులకు వీరివ్యవసాయమే ముఖ్యజీవనవృత్తి. ప్రత్తియుఁ దైరుఁ జేయఁబడుచున్నది. పట్టునేత, చేతిపనులు మొదలగువృత్తులు కలవు. (బర్మాదేశము చూడుఁడు). ప్రపంచమున ధాన్యము యెగుమతి యెక్కువ బర్మాదేశమని చెప్పఁబడినది. ఆరకానునుండి పెట్రోలియమ్ భూమినుండి తీయఁబడి, యెగుమతి చేయఁబడుచున్నది. లేక్కరు పూతపని దేశమున విశేషముగాఁ గలదు. బంగారమునఁగల పనియుం గొంతవఱకుఁ గలదని చెప్పవచ్చును. లోవర్బర్మాదేశము మూఁడుఖండములుగఁ జేయఁబడి, బ్రిటీషువారిపాలనయం దున్నదేశము. అదివఱకు స్వదేశఁపుభూపతిపాలనయందుండి, క్రీ. శె. ౧౮౮౫ లో బ్రిటీషుప్రభుత్వము వారి హస గతమైనది.

౧ అరకాన్ ప్రోవిన్సు—ఇది యుత్తరమున నున్నది. కులదాన్నదీముఖద్వారమున నున్న యక్యాబు పురము ముఖ్యపట్టణము. ధాన్యవర్తకముఁగల గొప్ప రేవు. కోయూకప్ప్యపురము రామ్రిద్వీప మందలి రేవుపట్టణము.

౨ పెగూప్రోవిన్సు—ఇందు రంగూన్నగరము ప్రధానస్థానము. మఱియు నిది బర్మాగవర్నరుగారి నివాసస్థానమును, దేశమున ముఖ్యపట్టణము నై యున్నది. ధాన్యము, కలప, వర్తకము విశేషముగ జరుగు రేవుస్థానము. ఐరావతీమహానదియొక్క యొకశాఖానదిపై [పశ్చిమముగా] నున్న బేసిన్పురమును, ఉత్తరముగా నైరావతీనదీతీరముననున్న ప్రోమ్పురమును, వర్తకస్థలములు. రంగూనుకుఁ దూర్పుగా సిట్టాంగునదీతీరముననున్న పెంగూ పురము బ్రిటీషుసైన్యస్థానము యున్నది. బర్మాదేశమునఁ బెగూప్రోవిన్సు ధనవంతము, ప్రజావంతము నై యున్నది. ఇచట దొరకు చిన్నజాతి గుఱ్ఱములను తొల్లింటివారు పైగోపుటంగణాలనుచుండిరి. ఇప్పు డింగ్లీషు వ్యాపించి, పెగూపోనీ లనుచున్నారు. ఇవి చక్కఁగాఁ బర్విడుట యందుఁ బే రందినవి.

౩ టెనాసిరిమ్ప్రోవిన్సు— ఇందు మౌల్మేన్పురము ముఖ్యపట్టణము. ఇది సాల్విన్నదీముఖద్వారమున నున్నది. కలపవర్తక మిట నధికము. దక్షిణముననున్న టావోయిపురము, మెర్గూయిపురము నితరపట్టణములు. టెనాసిరిమ్ప్రోవిన్సునందు జనాభా చాలతక్కువ.

**లోవర్గినియాదేశము:—** ఆఫ్రికాఖండమున, నాఫ్రికాపశ్చిమభాగమున నున్నదేశము. ఇందు ౧ ఫ్రెంచికాంగోదేశమనియు, ౨ కాంగోఫ్రీస్టేటు లేక బెల్జియనుకాంగోదేశమనియు, ౩ పోర్చుగీసుకాలనీ ఆఫ్ అంగోలాయనియు, మూఁడు విభాగదేశములుగ నున్నది. వాటిని వేర్వేఱుతావులందుఁ దెలియనగును. (ఆఫ్రికాఖండము ఆఫ్రికాపశ్చిమభాగము చూడుఁడు.)

**లోవర్ప్రొవిన్సెస్:—** ఇవి యిండియాదేశమునందలి బంగాళారాజధాని- బీహారుప్రోవిన్సు- ఒరిస్సా (ఉత్కల) ప్రోవిన్సు- ఛోటనాగపూరు ప్రోవిన్సులు కలసినసాముదాయికఁపుఁబేరు. వీటివైశాల్యము ౧,౫౧,౦౦౦ చతురఁపుమైళ్ళు. వీనిః బ్రిటీషురక్షితసంస్థానముల వైశాల్యముం గల్పిన ౨,౦౦,౦౦౦ చతురఁపుమైళ్లని యంచనా వేయఁబడినది. వీటియందు జనబాహుళ్య మధికము. బెంగాలీభాష, ఓడ్రము, ఉరుదుభాష, గోండభాషలు గలవు. తొలుత నివి గవర్నరుజనరలుగారి స్వంతపరిపాలనయం దుండి, క్రీ. శ. ౧౮౫౩ లో నొక లెఫ్టినెంటుగవర్నరుగారిక్రిందఁ బ్రత్యేకింపఁబడినవి. (ఆయాదేశములు చూడుఁడు. ఇండియా చూడుఁడు.)

**లోషకృత్ గోత్రము:—**
(గర్గఉపగణము చూడుఁడు.)

**లోష్టపప్రస్తారన్యాయము:--** లోష్టమన గులకరాతి కర్థముగూడఁ గలదు. దేనినైనను ప్రస్తరించుటవలన సంఖ్యం దెలియుటయని భావము. ఇందునకు గులకరాళ్ల నొకచోట సంఖ్యకుం దగినట్లుంచి ప్రస్తారఁపులెక్కఁ జేయుట యని భావము.

**లోష్టలగుడన్యాయము:** మట్టిముద్దా కఱ్ఱా యని యర్థము. కుమ్మరి మన్నును కఱ్ఱతో బాది, మథించి మెత్తనిపదును కుఁ దెచ్చును. అనఁగాఁ గుండలుచేయఁదగిన పదు

నుకు బాడి తెచ్చును గాని, పగఁదీర్చుకొనఁ గాద నిభావము.

**లోహదేశము:—**

[అష్టనుస్థానము చూడుఁడు.]

**లోహముల కాంతి చెడుట (Tarnish):—** వాయువునందుఁ గొద్దిగనో, గొప్పగనో Sulphur కలదు. రాగి, వెండి, యిత్తడి మొదలగు లోహములు గాలింబట్టుటతో నాగంధకసంబంధమున రంగు మాఱుచుండును. గాననే వాట్ల ననుదినముఁ దోమి శుభ్రపఱచిన వాటిరంగు మెఱుపు తిరిగి కల్గుచుండును.

బంగారు మటుల గాలియందలి గంధకము నకుఁ జెడునది కాదుగాన రంగు చెడక నిలిచి యుండును. ఇంకను లోని కౌషధముగ sulphur గలసినమందులు పుచ్చుకొనువారి శరీరమునందున్న వెండియాభరణములును, నిట్లే రంగు మాఱు చుండునని కనిపెట్టఁబడినది.

**లోహాయనగోత్రము:—**

[కుండినగణము చూడుఁడు].

**లోహార్గలు:—** హిమవన్నగముపైనున్న పవిత్రస్థలము. దీనిప్రశంస వరాహపురాణము ౧౫ అధ్యాయమునఁ గలదు. దీనిని చంపావతీపురముకడ నున్న లోహావతిగాఁ దలంచుచున్నారు.

[లోహావతి చ ]

**లోహావతీనది:—** ఆగ్రా, అయోధ్య, సంయుక్తరాష్ట్రములలోని ఆల్మోడా [కాళీకుమాన్ డివిషను] లోనిది. ఇట లోహాగాట్ పురము ప్రక్కఁబడి ప్రవహించుచుండెడిని. ఆదికాలమున నీప్రాంతమున రాక్షసు లధికముగఁ జేరియుంట శ్రీకృష్ణుఁడు పెక్కండ్ర నిట ఘోరసంగరముల వధించుచుండ, వారలరక్త మీఁదేటఁబడుచు నీటి కెఱ్ఱనికలకం గల్గించుచుంట నీపేరయ్యెనని చెప్పఁబడినది. లోహాఘాటుపుర మొకప్పు డాంగ్లసైన్యస్థానమై యుండెను. ఇట రాక్షసులనాఁటి యేకశిలా దుర్గ మొకటి కలదు. మఱియు నాఁటి భగవతీ యాలయము 'సూయి' అనంబడుగ్రామముదరిని నేఁటికిని బూజింపఁబడుచున్నది కలదు.

లోహావతీనదియందు రిక్షేశ్వర, శివక్షేత్రము కడఁ గాళిందీనది సంగమించెడిని. ఇది యాప్రాంతముల సుప్రసిద్ధక్షేత్రమును, స్నానతీర్థమును నైయున్నది. కార్తిక శుద్ధఅష్టమి మొదలు తొమ్మిదిదినము లిట గొప్పస్నానయాత్ర నడచెడిని.

**లోహావార్పురము (లవపురము - లాహొర్):—** (లాభపురము చూడుఁడు).

**లోహిగోత్రము:—** (కుండినగణము చూడుఁడు).

**లోహితగణము:—** ఇది విశ్వామిత్రసంతతి లోని యొకగణము. ఇం దేడుగోత్రములు చెప్పఁబడినవి.

౧ అష్టకి, ౨ కచ్ఛూరాయణ, ౩ దాడకి, ౪ లోహిత, ౫ వన్జాయన, ౬ వాశి, ౭ శ్వాతి వర్ణాయన.

ఈలోహితగణగోత్రములు (౭) కుఁ బ్రవర రూపములు (౫).

౧ విశ్వామిత్ర - అష్టక - లౌహిత.
౨ విశ్వామిత్ర - లౌహిత - అష్టక.
౩ విశ్వామిత్ర - దేవరాత - చకిత.
౪ విశ్వామిత్ర - అష్టక.
౫ విశ్వామిత్ర - మాధుశ్ఛందస - అష్టక.

**లోహితగోత్రము:—** (లోహితగణము చూడుఁడు).

**లోహితసరోవరము:—** దీనికి రావణ హ్రదమనియుఁ బేరు కలదు. ఇందు లోహితానది యనఁబడు బ్రహ్మపుత్రానది జన్మించును. బ్రహ్మాండపురాణము ౫౧ యందుఁ బ్రశంసింపఁబడినది.

**లోహిత్యసరస్సు:—** లిటిల్టిబెట్టు అను వాడుకఁగల లాహాలునం దున్నది. దీనినుండియే చంద్రభాగానది యుత్పన్నమగుచున్నది. దీని ప్రశంస కాళికాపురాణము ౮౨ అధ్యాయమునఁ గలదు.

**లోహితాయన గోత్రము:—** (జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**లోహితాస్యుఁడు:—** ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి హరిశ్చంద్ర చక్రవర్తి. ఈతనిరాజధాని లోహితాస్ఘుర్ అని పిలువఁబడుచు బీహారమునం దున్నది.

**లోహిత్యానది:—** బ్రహ్మపుత్రానదికి పేరు కలదు. బ్రహ్మపురాణము ౬౪ యందు దీ ప్రశంస కలదు.

**లౌ ఏపిల్ (Low apple):—** ఆదికాలమునం దైరోపాసీమలవారు తమాటీచెట్ల కాయలను, పండ్లను, విషవంతములుగ నెంచి, పరిత్యజించి యుండిరఁట. అక్కాలమున బలహీనమగు తావులం దా చెట్లడవిమొక్కలు, లేక గడ్డిమొక్కలవలె [ఎవ్వరు నాటిపెంచకనే] విత్తనములు గాలి కెగిరి కొట్టుకొనివచ్చి పడి మొలచి పెరిగి కాచెడివఁట. క్రీ. వె. పందొమ్మిదవశతాబ్దకాలమువఱకు నట్లే గడచి, దానినిజస్థితిని ప్రజ లెఱింగి తిననారంభించి వాటివ్యవసాయము మొదలిడిరఁట.

అత్తఱి దానిబాహ్యాకారఁపుసొగసున కర్షమైనరుచిగూడ నందుబయల్పడుట దానికి 'Love Apple' [అనురాగఫలము] అని వాడ నారంభించిరి. కాని యీవాడుక చిరకాలము నిలువక, రానురాను తగ్గిపోయెనఁట. భరతదేశమున దీని నొకజాతివంగచెట్టుగా నెంచి, సీమవంకాయ యనుచుండిరిగాని నానాఁటి కాపేరు తగ్గి, దానివిదేశనామమగు తమాటీ యనుపే రధికవాడుక నందినది. వైద్యపరిశీలనలం దిందు విటమిన్సు అధికముగాఁగల బలవర్ధకపదార్థమని తేలినది. ఇటలీదేశమున దీనిగింజలనూనెను బలమునిచ్చు వైద్యౌషధిగా వందుచుందురఁట. కాని యది చాల తక్కువగా లభించుట నెక్కువధరఁ గల్గియుండునఁట. [తమాటీ చూడుఁడు].

**లౌకికశకము లేక సప్తర్షిశకము:—** ఉత్తరకొంకణమునఁ బ్రారంభింపఁ బడినది.

**లౌగాక్షిగణము:—** ఇది కాశ్యపసంతతిలోని యొకగణము. ఇందు నలువదిమూఁడు గోత్రములు చెప్పఁబడినవి. ఇవి యన్నియు ద్విగోత్రములు.

బోధాయన సూత్రోక్తగోత్రములు (౨౨)

| | |
|---|---|
| ౧ అంజయ, | ౮ మైత్రవాహ, |
| ౨ అవిష్టి, | ౯ చోష్యణ, |
| ౩ జౌదకి, | ౧౦ దేహాకాలేయ, |
| ౪ కల, | ౧౧ పరస్థావి |
| ౫ కాపుటి, | ౧౨ భాలంకాయని, |
| ౬ కౌనాభి, | ౧౩ యకసయ, |
| ౭ గార్థభాయణ, | ౧౪ యోధకాలకి, |

౧౫ తై, ౧౯ సైతకి,
౧౬ లౌగా, ౨౦ సైరంధ్రి,
౧౭ వాచయ, ౨౧ సౌరసుఖ,
౧౮ సారంభరి, ౨౨ సౌలి.

కాత్యాయనసూత్రోక్త గోత్రములు (౧౧)

౧ అనష్టి, ౭ శరద్వంత,
౨ కా, ౮ శాకబలి,
౩ జవాహి, ౯ సాముచి,
౪ పిన్గాక్షి, ౧౦ సౌకి,
౫ రాజశేఖ, ౧౧ హాజలి.
౬ రావలి,

మాత్స్యసూత్రోక్త గోత్రములు (౧౦)

౧ జౌదవాహి, ౬ సజాతపి,
౨ జౌపకత్సకి, ౭ సాధ్య,
౩ తాని, ౮ సాగ్రమాకి
౪ భాకుటి, ౯ సైరిషి,
౫ రాజబలి, ౧౦ సౌపత.

ఈలౌగాక్షిగణమునందలి నలుఁబదిరెండుగోత్రములకుఁ బ్రవరరూపములు నాలుగు.

౧ కాశ్యప, అవత్సర, వాశిష్ఠ.
౨ కాశ్యప, అవత్సర, అసిత.
౩ కాశ్యప, అవత్సర, నైధ్రువ.
౪ కాశ్యప, అవత్సర, నైధ్రువ, రేభ, రైభ, శండిల, శాండిల్య.. (సప్తార్షేయము)-

కొందఱు కాశ్యప, ఆవత్సర, నైధ్రువ, రేభ, రైభ యని పంచార్షేయముం జెప్పుచున్నారు.

**లౌగాక్షిగోత్రము:**— (ఔతథ్యఉపగణము చూడుఁడు).

**లౌగాక్షిగోత్రము:**—(లౌగాక్షిగణము చూడుఁడు).

**లౌగాక్షి(గణము) గోత్రము:**– ఇది యగస్త్యసంతతియందు దగస్త్యేతరగణమందు లౌగాక్షియుపగణముగ నెన్నఁబడిన గోత్రము. దీనికిఁ బ్రవరరూపము [కాశ్యపసంతతి లౌగాక్షి చూడుఁడు].

**లౌడ్‌స్పీకరు యంత్రము (Loud Speaker):**— లౌడ్‌స్పీకరుపరికరము తొల్లింట గ్రామోఫోనుల కిడి వాడుచుండిరి. ఇది ధ్వని నతిశయింపఁజేసి చక్కఁగ వినిపింపఁజేయునది. ఉమ్మెత్తపువ్వునాకారముఁ గల్గియుండును.

బ్రాడ్‌కేస్టింగునందు రిసీవింగ్ ఆపరేటస్‌నకుం దగిల్చి యతిశయింపఁజేయుచున్నారు. ఉపన్యాసములు, పాటలు, వీటిధ్వని నధికపఱచి చక్కఁగ వినఁబడఁజేయును. లౌడ్‌స్పీకరులు 'హారన్' లనియు, 'కోను' (cone) లనియు ద్వివిధములుగ నున్నవి. [రేడియోవైర్లెస్ చూడుఁడు.]

**వంకాయ (వంగకాయ):**– ఇది యాదిని వంగదేశమునుండి మనదేశమునకేతెంచినకతన వంగకాయ యనఁబడుచు రానురాను వంకాయ యయ్యెను. హిందూస్థానీభాషయందు దీనికి బైంగన్ అనిపేరు. అదియు బంగ [వంగ] శబ్దసంబంధమే యందురు.

**వంగచెట్టు, వ్యవసాయము:**– లా. Solanum melongena. ఆంగ్ల:–'Brinjal అనియు Egg plant అనియుం బేళ్ళుఁ గలవు. సంస్కృతమున భంటా, భంటాకీ, రాజకూష్మాండ, వార్తకః, వార్తా, వార్తాకః, వార్తాకీ, వార్తాకుః, వార్తికః, వార్తికా యని యుందురు.

వంకాయ ప్రసిద్ధమైన కాపదార్థము. లేతవంకాయ పథ్యమైనదని చెప్పఁబడినది. మరియును వంకాయలఁ బోలినకూరయు లే దందురు. ఇం దున్న జాతిభేదములకు లెక్కలేదు. రంగులంబట్టియు నాకారములంబట్టియు, రుచులంబట్టియుఁ బలు భేదములు గాన్పించుచున్నను పాటింపఁబడక మెట్టవంకాయలనియు, నీటివంకాయ లనియు, కర్పూరఁపువంకాయలనియు, కొండవంకాయల నియు నాల్గుముఖ్యభేదములు పేర్కొనఁబడు చున్నవి. ఇందు గింజలుతక్కువగ నుండునది శ్రేష్ఠ జాతిగను నెక్కువగ నుండునది యధమఁపుజాతి గను, కొండ లేక యడవివంకాయ యధమాధమఁ పుజాతిగను నెంచబడును. కర్పూరఁపువంకాయలు చిన్నజాతి. ఇది హైదరాబాదుసీమయందుఁ గలదు.

నీటివంకాయజాతులందు గుత్తులుగఁ గాచు గుత్తివంకాయయని యొకజాతి కలదు. గుండ్రని పెద్దవంకాయలను మెట్టవంగ మందురు. దీనిపంట్లం జీరి కలుగఁదఱిగి యెండించిన నది వంగవరు గనఁ బడును. వంకాయలయందు లేతవి మిగుల రుచ్యములుగ నెన్నఁబడుచుండును.

వంకాయయందు రసదోషమును, విరుచుగుణమును, దురదలు క్రిములను పెరిగేపించుగుణమును కలదందురు. ఇది కఫోద్రేకమును గల్గించును. కఫరోగులు దీనిని మానవలయును. దురదలు, పుండ్లు, వ్రణములుఁ గలవారు వంకాయను దినరు.

వంగదేశమునుండి మనదేశమునకు వచ్చుటచే వంగకాయగఁ బేరందిన దీనిజన్మదేశ మేదో స్పష్టముగఁ దెలియరాకున్నది గాని భరతదేశమున స్థిరపడి శాకములందు విశేషప్రాముఖ్యతఁ గలిగి యున్నది. విస్తారము తేమను తమయందు నిల్పు కొనఁగల పలురకములభూములు దీని వ్యవసాయమునకుఁ బనికివచ్చును గాని కేవల మిసుకలు, చౌటినేలలు, దీనికిఁ బనికిరావు. వంగచెట్టునకు నీరు పారించు టవసరము. 'నీటిలో వంగలుకాయ' ననుసామెతయుఁ గలదు. దీనికి నీరున్నను నిస్సారఁపు టిసుక పనికిరా దనిభావము. పేడగత్తము నధికముగ వేయుట, యెక్కువ మొత్తఁగ దున్నుట, నీరు పారించుట, గొప్పులు త్రవ్వి నీరుపారించుచుం డుట, భూమిని గుల్లగఁ జేయుచుండుట, వంగల కెక్కువ యవసరము. వంగనారుఁ బోసి, వాటి నడుమనడుమ పేడనీళ్ళఁ బోయుచు మిరపనారు వలెనే యెక్కుడు సత్తువఁ జేయుచుండవలయును. (మిరపచెట్టు వ్యవసాయము జూడుఁడు.) ఆముదఁపుఁబుచ్చు, చాలకాలము దీనిని గాయుచుండఁ జేయును. వంగనా రెనిమిదంగుళముల మొలకలైనతరువాత నాటుట శ్రేయము. 'వంగముదరి' 'పరిలేత' యను సామెతయుఁ గలదు. చెట్టు యొక్కకోమలము, యవ్వనముఁ జెడకుండ నాము దఁపుఁబుచ్చు మొదలగు ద్రవరూపఁపు టెరువులతో నిలుపవచ్చును. చెట్టు యవ్వనపటిమం గోల్పోయినఁ బిదపఁ గాచినకాయలందు గింజ లధికమై కసరుఁ గల్గును. మొక్కల నెడముగా నాటిన గొప్పులు త్రివ్వుచుండుటకు వీలై చెట్టు చిరకాలము జీవించును. లేతకాయలు సద్యఃకాలోపయోగమునకును, ముదిరిపోయిన కాయ లెండఁబారనిచ్చి చీలికలుగఁగోసి యెండించి వరుగుఁ జేసి తీరికగానుపయోగింకొనుటకును పనికివచ్చును. వంగచెట్టునకు మనుష్యుల యశుద్ధము లెంతి మాత్రము నెరువుగ వేయరాదు. వేసినచోఁ గాయలు పెద్దవిగఁ బెఱిగి గొప్పకాపుఁ గాయుఁ గాని వానిని దినినవారలకు శరీరములు చెడి బూరగాళ్ళు, బూరచేతులు, నంజవృద్ధి మొదలగు రోగములు తప్పకఁ గల్గును. పశువులపచ్చిపేడ వంగల కెక్కువ బలకరము. అయినను దోషయుక్తమని

గూడ చెప్పబడుచున్నది. సురేకారము మొద లగు నెరువులు కాయలరుచిని బాడుచేయును.

**వంగదేశపు గాయస్థులు:—** వీరు ఉత్తర హిందూస్థానసీమలందు ముఖ్యముగ వంగదేశమున వసించువారు. మంచిలేఖరులు. శాక్తేయమతము వారు. వీరియందు దవాత్పూజ (శిరాబుడ్డిం బూచించు) నాచారముం గలదు. ఇది శ్రీపంచ మిదినమున నొనర్చుచు సరస్వతీపూజ యందురు. వీరు తఱుచుగ నుద్యోగులుగం గానరుచుందురు.

సుప్రసిద్ధుండగు న్యాయవాది రాష్బిహారి ఘోష్, లార్డుసిన్హా మొదలగువా రీతెగవారే యని చెప్పబడినది.

**వంగదేశము, గౌడదేశము, నివృత్తి దేశము, హరకేళదేశము, బంగాళదేశము:—** ఋగ్వేదమున నైతరేయారణ్యకమునం దొలుత వంగదేశము ప్రశంసింపబడినది. మహాభారతమునవంగదేశము, పుండ్ర సుమహా, తామ్రలిప్తి దేశములనుండి వేరుగంజెప్పబడినది. Steins రాజ తరంగిణి 1—163 యందు బంగాళాభాగములుగం బంచగౌడదేశములు చెప్పబడినవి. అవి ౧ పుండ్ర వర్ధనము, ౨ రాఢదేశము, ౩మగధదేశము, ౪ తీర భుక్తిదేశము, ౫ వరేంద్ర లేక బరేంద్రదేశము. పుండ్రదేశపుదూర్పుభాగమునకు నివృత్తిదేశమని పేరుండెనంట. త్రికాండశేషమున గౌడపురమునకు నివృత్తియని పేర్కొనంబడినది. ఇప్పుడది 'గౌర్' అనంబడుచున్నది. వంగతూర్పుభాగమునకు హరకేళ మనుపే రుండెనని హేమచంద్రుని యభిధాన చింతామణియందుం జెప్పబడినది.

అదివరకుం బుండ్రవర్ధనదేశమనిచెప్పం బడుచు రాజ్యపరిపాలనకు లోంబడియుండిన వంగదేశము క్రీ.వె. ౬౪౪ లో స్వతంత్రరాజ్యమైనట్లుం దేలుచున్నది. ఈదేశమునం జెప్పంబడిన యజయనది యిప్పటి కట్వాపట్టణముకడ గంగానదియందుం గలియును. దీనింగూర్చినప్రశంస గాలవతంత్రమునం గలదు. వీరభూమిపరగణాలోని యజయనదీతీరమునం గెండూలీగ్రామమున సుప్రసిద్ధగీతగోవిందము రచించిన జయదేవమహాకవి జన్మించెను. ఈతండు

— ౮ ౧

దియోపారాశిలాశాసనముమేరకు, ఎపిగ్రాఫికా, ఇండికా ౧,3 యందు వివరింపంబడినటుల సామంతసేనునిసుతుండు హేమంతసేనుండనియు, నతని సుతుండు విజయసేనుండనియు, నాతనిసుతుండు బల్లాలసేనుండనియు, నతనిసుతుండు లక్ష్మణసేనుండనియు, నాతని (సుతునిపేరు తెలియదు) పౌత్రుండు రెండవలక్ష్మణసేనుండనియు, నీతని కశోకసేనుండని పేరుండెననియు రాజపరంపరలోం జెప్పంబడినది.

అధిశూరన్నృపాలునికాలమునకుం గర్ణసువర్ణపురము రాజధానియని చెప్పంబడినది. అది రాను రాను కానోర్యాయై యిప్పుడు రంగమతియనంబరగుచున్నదంట. ఇప్పటి మూర్షదాబాదుజిల్లాలో బరంపురమున కారుమైళ్ళదూరమున నున్నదంట. ఈపురముంగూర్చినప్రశంస కుబ్జకాతంత్రమున ౭ ౮ గలదు. ఆ యధిశూరన్నృపాలుండే క్రీ.వె. ౭౩౨ సంవత్సరమున వంగదేశమును జయించి గౌడపురమున సింహాసన మెక్కెనని వేఱొకచో నిదర్శనములు చూపబడినవి. ఈనృపాలుండు సంతానములేక తనమిత్రుండగు కమాజిన్నృపతి వీరసింహు నర్థించి యటనుండి యైదుగురుమంత్రవేత్తలగు విద్వాంసులను రావించి వారివలనం బుత్రకామేష్టియాగ మొనర్చి సుతునిం బడసి వారి కైదు గ్రామము లగ్రహారములుగ నొసంగెనంట.

[విద్వాంసుల కిచ్చిన యగ్రహారములు.]

౧ భట్టనారాయణుఁడు:- ఈతఁడు వేణీసంహార నాటకమును రచించినవాఁడు. ఈతఁడు ధర్మపాలుని యాస్థానవిద్వాంసుఁడుగఁగూడ నుండెనని తెలియుచున్నది. ఈతని కిచ్చినయగ్రహారముపేరు పంచకోటి.

౨ దక్షుఁడు:- ఈతని కిచ్చిన యగ్రహారముపేరు హరికోటి.

3 శ్రీహర్షుఁడు:- ఈతఁడు నైషధము రచించినవాఁడు. అగ్రహారముపేరు కామకోటి.

౪ చాందసుఁడు:- ఈతని కిచ్చిన యగ్రహారము పేరు కంకగ్రామము.

౫ వేదగర్భుఁడు:- ఈతని కిచ్చిన యగ్రహారము పేరు వటగ్రామము.

ఈసంగతి గౌడపుర (ఇప్పటిగౌర్) దుర్గము కడ నొకశాసనమున వివరింపబడినది. ఈ యైదగ్రహారగ్రామములకును సాముదాయకముగఁ బంచసార్ అని పేరుగలదు. ఒకమైలుదూరమున నివి యున్నవి.

పిమ్మట క్రీ. శె. ౧౦౭౨ సంవత్సరమున విజయసేనుండు గౌడపురసింహాసనమునకు వచ్చెను. అతనికిఁ బిదప నాతనియగ్రసుతుండును, పిదప క్రీ. శె. ౧౧౧౯ సంవత్సరమున రెండవసుతుండగు బల్లాలసేనుండును రాజ్యాధిపతులైరి. బల్లాలసేనుఁడే గౌడపురసింహాసన మెక్కినవారిలోఁ గడపటివాఁడు. ఈతని పురమున నీతనివిరోధియగు నొక మహాంతి కుట్రనడపి మాయసంగరముఁ గల్పించి ప్రవాదముల నెరప నీయనకుటుంబ మగ్నియందుఁ బడి మడసిరఁట. జయమందినను బల్లాలసేనుఁడిటులఁ గుటుంబముంగోల్పోయి విచారమున గౌడపురమును వదలి విక్రమపురమను వేరురాజధానిని నిర్మించుకొనెనఁట. ఈపురమునకు రానురాను బల్లాలబాదియని పేరయ్యెనఁట. ఇప్పు డది ఢక్కాజిల్లాలోని మున్షిగంజిపురమునకుఁ బశ్చిమమునుగా నాల్గుమైళ్లదూరమున బిక్రాంపూరనంబడుచున్నది. కొందఱకక్కడివారు బల్లాలబాదియనియు వాడుచుందురు.

జనరల్ కన్నింగ్హాము పండితుఁడు రామపాలపురము తొల్లింటి రాజధానియనియు నధిసూరుఁడే యటనుండి గౌడపురమునకు రాజధానిని మార్చెననియు, మఱియు నాతఁడే బంగాళమంతయు నేకరాజ్యముగఁజేసి యేలినవాఁడనియు వ్రాసియున్నాఁడు. లక్ష్మణసేనుని రాజధాని నవద్వీపము (ఇప్పటినద్దియా) భక్తియార్కిల్జి యాతనిందరిమివైచి రాజ్యమాక్రమించుచో రాజధానిని నవద్వీపమునుండి తిరుగ గౌడపురమునకు మార్చెనఁట.

## వంగలోహము (జింకు):—

(తుత్తునాగముఁ జూడుఁడు.)

## వంగుఁడు.

—అత్రిసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి బలి. ఈతనిపాలనమునలన నీతఁ డేలినదేశమునకు వంగదేశమని పే రయ్యెను. మఱియు నీతఁడు వంగదేశ మేలిన నృపతులకు మూలపురుషుఁడు.

ఇతని సోదరులు అంగుఁడు, కళింగుఁడు, పుండ్రుఁడు, సుహ్ముఁడు (లేక సుబ్రహ్మఁడు). (వంగదేశముఁ జూడుఁడు.)

## వంచిపురము (స్కన్దపురము):—

తొల్లిఁటి చేర లేక కేరళదేశఁపు రాజధానిగ నుండెను. ఇప్పుడు కరూ రనుచున్నారు. కోయంబత్తూరుమండలమున నున్నది. (చేరదేశముఁ జూడుఁడు.)

**వంజాయనగోత్రము:—**
(లోహితగణముఁ జూడుఁడు.)

**వంటుచెఱకు:**—వంటచెఱకన వంటఁజేయుటకుఁ గాల్చుకట్టెలని భావము. ఇది యాంధ్రభాషాసాంప్రదాయార్థపదము. సుప్రసిద్ధోక్తి.

**వండలేనియమ్మకు పగపులు వొండు; గడింపలేనిమగవానికి గాబరావొండు:-**
(ఆంధ్రలోకోక్తి.)

**వంతెనలు:—** కాలినడకబాటలనుగాని, బండ్లనడకబాటలనుగాని, యినుపదారినిగాని, యొకనదికిఁగాని, వేఱొక జలప్రవాహమునకుఁగాని, యడ్డముగ నిర్మించి దానిని దాటంజేయు (పైబాటల నడపునట్లుఁ జేసిన) నిర్మాణము వంతెనయనఁబడును. ఆంగ్లమున దీనికి బ్రిడ్జి (Bridge) యందురు.

ఆదికాలమునం దన్ని దేశముల నొకేరీతిని ప్రవాహమున కిరుపార్శ్వములందును నొడ్లనంటి గోడలను బలముగ నిర్మించి, యావసరమగుతఱి నడుమను గూడ మంచిపునాదులపై దిమ్మలను నిర్మించి, వానిపైఁ బొడవగు రాతిపలకలం బఱచి పైని బాటలు నడుపుటయె జరుగుచుండినది. ఇట్టివంతెన యొకటి యింకను మైసూరురాజ్యమునఁ గలదు. మఱియొకవంతెన జీర్ణవిజయనగరముకడఁ దుంగభద్రానదిని దాటుచుండినది యుండెను. ఇవికాక హిమాలయపర్వతోపరిదేశములందును, టిబెట్టుదేశమునను త్రాడుతో ననఁగాఁ గొన్ని చెట్లపట్టలు (నారలు) పేని గొప్పవలముఁ గలత్రాటినిఁ జేసి ప్రవాహప్రదేశమును దాటించి యిరుదెసలను మఱిరెండు చిన్నత్రాళ్ళను చేతఁ బట్టుకొను నాస్థారముగ నొనర్చి వానితో నడుమను క్రిందుగానున్న పెద్దత్రాటికిని త్రాడుతో లంకెలు వైచిపైని కాలిబాటను నేటి కడ్డముగ దాటించుఁ త్రాటివంతెనలు నేటికిని గలవు.

మఱియు నాపాంతముల నొక్కొక్క పెద్దప్రవాహముల కడ్డముగ నొకత్రాటిని బిగించి దానినుండి వ్రేలాడఁ దీయఁబడిన నొకయుయ్యాలపీటం గూర్చొని వేఱొక త్రాటిసాహాయ్యమున నెట్టుకొనుచుంబోయి యవ్వలిదరికిఁ జేరఁగల త్రాటివంతెనలును గలవు. సింహాలమునను, ఆంధ్రదేశమందలి గోదావరీమండలమునను, పడవలు నడవని నీటికాల్వలపైఁ గాలువ కడ్డముగ నొకటిగాని, రెండుగాని తాటిచెట్ల నడ్డముగ వైచియుండ వాటిపైఁ గాలినడక సాఁగించు వంతెన లెన్నియో గానవగును. జపాన్ దేశమునఁ జిన్నకాలువలపై నుద్యానవనములందుఁ గాలినడకమార్గములందుఁ బట్టణములకు దూరమునఁ గలతావులఁ బల్లెటూళ్ళకడ వెదురుబొంగులతోను, కఱ్ఱపలకలతోను, చులకనగను, రమ్యముగను, గన్పించుఁ గాలినడకవంతెనలు కాల్వలను, జలములను దాటించు చుండునవి కలవు. అవి జపాన్ దేశఁపుఁ బ్రత్యేకపనితనమని చెప్పవలయును. మహాలగ్జాండరు దండయాత్రయందుఁ బడవల నేటి కడ్డముగ నిలపి, వాటిపైని కఱ్ఱలఁ బఱచి, వంతెనగ నొనర్చి పైని బాటగఁ జేసి పటాలముల నడపి దాటించెనని చెప్పఁబడినది. అట్టి పడవలవంతెనలు నేటికిని నుత్తరదేశములం దనేకతావులందుఁ గలవు.

రానురాను వంతెనలపని చాల యభివృద్ధిఁగొని యావిజ్ఞాన మిక్కాలమున నతిశయించుటఁ బ్రపంచమం దన్ని దేశములందును గానవగును. ఈయభివృద్ధి కాలముఁ గడచుకొలఁదిని కల్గుచుండిన యనుభవములపై నాధారపడి యభివృద్ధి నొందనది. ఈయభివృద్ధితో ననేకాంగ్లసాంకేతికపదము లేర్పడినవి. ప్రవాహమున కిరుదెసలను తీరము

లందు నిర్మింపఁబడు గోడలకు abutments అనియు, నదియందుఁ గట్టఁబడిన దిమ్మ (స్తంభము)లకు piers అనియు, స్తంభమునకును స్తంభమునకును నడుమనుండుప్రదేశము ననఁగా నినుపదూలములు వేయఁబడిన స్థలములకు spans అనియు, పైని బరచు నినుపదూలములకు girders అనియు, గర్డరుల కడభాగ ప్రదేశములు వేనిపై నానుకొనునో వానికి supports అనియు, నినుపదూలములు బల మతిశయింపఁజేయఁ గుదిర్చిన యినుపపనికి web అనియు, ఇంకను ట్రస్సులనియు, స్ట్రిట్సు లనియు, బ్రెస్ అనియు నెన్నియో భాగములు గలవు.

వంతెనలందు ముఖ్యమగునవి యారువిధములు గలవు. అందుఁ బూర్వఁపువంతెనల సంతతిగఁ జెప్పఁదగినది Masonary arched bridge. ఇది ప్రవాహమునందుఁ గట్టఁబడిన దిమ్మస్తంభములపై లాదులరూపమున నాటఁబడి పైని రస్తాను నడిపింపఁబడునది. ఇందుఁ జిన్నచిన్న వంతెనలకు లాదులకు బదులుగ ఫెర్రోకాంక్రీటుపలక లమర్చుటయుఁ గలదు.

ఇటీవల రాతికి నిటుకలకుఁ బదులు ఫెర్రోకాంక్రీటుపని యెక్కువ బలముగ నుండునని తలంపఁబడుచున్నది. ఫ్లాటస్లాబ్సు తరుచుఁ జిన్నవంతెనలకే వాడుచున్నను పెద్దవంతెనలకు నార్చిరూపమునను ఫెర్రోకాంక్రీటువంతెనలను జేయుటయుం గలదు. ఫ్లాట్సు ఆర్చి [Flat arch] వంతెన పెద్దది. wrington వద్ద mersey నదిపైఁ గట్టఁబడియుంట నుదాహరణముగఁ గొనఁదగినది. దీని span 134 అడుగు లుండును.

**Ferro Concrete bow string girder bridge** సెంటుపియరోగ్రికడ సీనునదిపైఁ గట్టఁబడినది. దాని పొడవు ౪౩౭ అడుగు లుండును.

తర్వాత సర్వసాధారణముగఁ జెప్పఁబడఁ దగినది girder bridge. ఈవంతెనలు చిన్నవియైనను, పెద్దవియైనను నుండవచ్చును. ఇవి యిక్కాలమున సర్వసాధారణమై యున్నవి. ఇనుపదూలములు వంతెనపొడవునను [ప్రవాహమున కడ్డముగ] దిమ్మలపైనుండి యివ్వలవ్వలకు నడిపి దానిపైనుండి బాటను నడుపుదురు. ఈ girder దూలము లనేకరకములుగ నుండెడిని. కావలసిన బలము నకై వీటి నెప్పటి కప్పుడు చేసుకొందురఁట. ఈ గర్డరులు వెబ్బుగర్డరులనియు (web girders), లెట్టిస్ గర్డరు [Lettice girders] లనియు ద్వివిధములుగ నుండి యనేకయంతర్భేదములుఁ గలవిగ నుండును. ఇంగ్లాడునందు New custle upon Tyne కడ నడ్డముగఁ గట్టఁబడిన యినుపదారివంతెన చక్కని యుదాహరణముగఁ జెప్పఁబడినది. భరతదేశమునందును జెక్కులు కలవు.

ఆరువందల యడుగులకుఁ బైఁబడిన span కలతావులందు Cantiliver bridges కట్టఁబడినఁ గాంటిలీవరు గర్డరులు వాడఁబడునని భావము. ఈవంతెనలఁ గూర్చి "They are deep at their points of support, and taper towards the other extrerufy" యని వ్రాయఁబడినది. ఈవంతెనలం దుదాహరణములుగఁ జెప్పఁబడఁదగినవి రెండు గలవు. క్యూబిక్కునగరముకడనున్నవంతెనయందు ౧౮౦౦ అడుగుల clear span కలదు. స్కాట్లాండునందలి ఫోర్తుబ్రిడ్జి Forth bridge లందు మూఁడు double cantilivers కలవు. అం దొక్కొక్కటి ౧౭౧౦ అడుగుల పొడవు span కలది.

పిదపఁ జెప్పఁదగినది, ఆర్చి (గర్డరు) బ్రిడ్జి. ఇది యినుపదూలములను వెబ్బులుసహా నార్చి

వలెఁ జేసి యనఁగా దూలము strait గా నున్న దాని నంటి క్రిందికి వ్రేలాడు గర్డరువెబ్బు (gerder webs) లాడమువలె నమర్చి నిర్మించువంతెన. ఇందు బరువు, మోపుఁదల మొద లగునవి చక్కఁగ లెక్కించవలసియుండును. దీనిని 'steel arched and spandrel braced bridge' అనియు నందురు. ఇట్టిగర్డరువెబ్బులు వంతెనయందు దూలములపై నుండున ట్లమర్చి వంతెనమధ్యకు విరుగునటులను క్రిందనుండి యోడలు పోవుటకై వంతెనపైకిఁగాని, ప్రక్కలకుఁగాని భాగములుఁ జనఁగల్గునటుల నిర్మింపఁబడిన వంతెనకు Bascule bridge అని పేరు. ఇందుకు లండన్ టవర్ బ్రిడ్జి యనియు, రామేశ్వరమునకేగు నినుపదారిపైఁ బాంబన్ ఛానల్ పైఁ గట్టఁబడిన యినుపదారివంతెనయు నుదాహరణములు.

పిదప నుదువఁదగినది 'suspension bridge'. ప్రవాహప్రదేశమున కిటునటు, ఎబత్మోంటు గోడలపై టవరులను నిర్మించి వాటికిఁగాని లేక నితరములగు బలముఁగల తావులకుఁగాని యినుప త్రాడులనో, గొలుసులనో బంధించి వంతెనవలె నిరుదెసలను నడపి యారెంటినిఁ గల్పుచుఁ బైని బాటను నడపుటచే రచించినది 'సస్పెన్షనుబ్రిడ్జి' యనంబరగెడిని. ఇట్టివంతెన కుదాహరణముగ న్యూయార్కునగరము (అమెరికా) కడనున్న బ్రూక్లినువంతెనయు, విలియమ్సుబర్గువంతెనయు, న్యూయార్కుకడ నీస్టురివర్ పై నిర్మింపఁబడిన మాన్హాట్టన్ వంతెనయుఁ జెప్పఁబడినవి.

ఇవికాక నింకను నుదువఁదగినవి movable Bridges. ఇవి మూఁడు తెఱంగులు. 1 Revolving or swing bridges అనియు, 2 Lifting or bascule bridges, 3 Transporter bridges, అనంబడునవి. లండనునగరంపు టవరుబ్రిడ్జి Hinged bascule Type వంతెనలుగఁ జెప్పఁబడినది.

వంతెన లాదికాలమునుండియు భరతదేశమున నిర్మింపఁబడుచున్నవియె గాని నూతనము కాఁజాలదు. ఆంగ్లమున వంతెనకు బ్రిడ్జి అనెదరు.

జలప్రవాహము జలనివాసమగు తంపరంగాని, పల్లఁపుఁ బ్రదేశముంగాని మార్గమందలి నిమ్నోన్నతప్రదేశముం దాటుట కేర్పాటుఁ జేయఁబడిన నిర్మాణమును బ్రిడ్జి యందురు. ఇవి Beam వంతెనలు, arch వంతెనలు, rope వంతెనలు నని త్రివిధముగ నిర్మింపంబడుచున్నవి.

౧. Beam bridges:— బీమ్మనిన దూలము లని యర్థము. కాన నాదిమ్మలు లేక స్తంభములపై దెసల నానుకొనియుండునటుల దూలములఁ బఱచి నడుపఁబడు నిర్మాణమున కీపేరు వర్తించును. చిన్న చిన్నవంతెనలు (Culvert) కఱ్ఱ దూలములచే నిర్మింపఁబడినను బడవచ్చునుగాని తరుచుగ నినుపదూలములనే వంతెనలకు వాడుచుందురు. ఈసందర్భమున నినుపదూలములు (Girder) తరుచుగ మూఁడురకములు చేయఁబడుచున్నవని యెఱుంగవలయును. (గర్డర్సు చూడుఁడు).

౨ తరువాతఁ జెప్పఁదగినది లాడులవంతెన (arch bridge). లాడులను తొల్లింట రాతితోఁగాని, యిటుకలతోఁగాని సున్నము క్రసిమెంటు బిగింపులతో నిర్మించుచుంటఁ బద్ధతిగా నుండెను గాని యిటీవల యనుభవములనుండి పెద్దనిర్మాణములు రెయిన్ఫోర్సుడు కాంక్రీటుతో మాత్రమే చేయఁబడునటుల నేర్పడినది. ఐనను చిన్నచిన్న సాధారణఁపు వంతెనలందు మాత్రము పూర్వఁపుఁ బద్ధతి నడుపఁబడుచుంటఁ గాననగును.

3 తరువాతఁ జెప్పఁబడఁదగినది మూఁడవది యగు త్రాటివంతెన (rope bridge). ఆత్రాటి నుండియె వంతెనలు క్రిందికి వ్రేలాడఁజేయఁబడు కతన వీనికి suspension bridges అనియు నామాంతరమును గలదు. ఆంగ్లభాషయందు suspension అన వ్రేలాడుట కర్థము.

భరతదేశమం దాదికాలమునుండియుఁ ద్రాటి వంతెనలు గలవు. కొన్ని చెట్టులపట్టలను నులిపి, త్రాళ్ళవలెఁ బెనచి జలప్రవాహమున కిరుదరుల నున్న గొప్పగొప్పవృక్షముల మొదళ్ళకుఁగాని, గండశిలలకుఁగాని బిగించి కట్టి దానినుండి క్రిందికి నడచునట్టి భాగమును వ్రేలాడఁదీసిన వంతెన లిప్పటికిని హిమవన్నగరసీమలం దచ్చటచ్చటఁ గాన నగుచున్నవి. ఇవియే యీజాతివంతెనల యాది రూపములని చెప్పనగును. ఇంక నీపట్టలత్రాళ్ళను నినుపతీఁగెలఁ బెనచినత్రాళ్ళుగ మార్పును తరువాతఁ గల్గిన యభివృద్ధిగ నెఱుంగవలయును.

పాశ్చాత్యవిధానమున నీమూఁడువిధానముల వంతెనలే చెప్పఁబడినవి. తక్కిన వేర్వేఱునామములచేఁ బరగు వంతెన లన్నియు నీమూఁటియందును దేనికో యొకదానికిం జేరియున్న యంతర్భాగములేగాని ప్రత్యేకవ్యక్తిత్వముఁ గలవి కావు. కేంటిలీవరువంతెనలు వ్రేలాడునట్టి సస్పెన్షను బ్రిడ్జి తెగకుఁ జేరినవియె. హింజీబ్రిడ్జి కేంటిలీవరులలో నిదియొనని చెప్పఁబడినది. కల్వర్ట్లువంతెనలు చిన్నవి. ఇవి చిన్నచిన్న జలప్రవాహములం దాటుటకు నిర్మింపంబడుచుండును. వీనిఁ దాటుటకుఁ గఱ్ఱదూలములు, రాతిపలకలు, ఫెర్రోకాంక్రీటుపలకలు నుపయోగింప నగుఁగాని తరుచుగఁ జిన్న యినుపదూలములంగూడ వాడుచున్నారు. కేంటిలీవరువంతెన Beam bridge గఁ జేయఁబడియొకపైపు వ్రేలాడఁ దీయంబడునదిగ నున్నది.

ఎక్కువ span గల వంతెనలందు latice గడ్డరు లుపయోగించెదరు. ప్రతివంతెనకును వంతెనకడలందు రెండు abutiment దిమ్మలును నడుమను Piers అనంబడు దిమ్మలు లేక స్తంభములు వలయునన్ని నిర్మింపఁబడును. ఎబట్మెంటుల కిరుపార్శ్వములందు రక్షణకై నిర్మింపఁబడు గోడలకు (వింగ్సు) అనిపేరు.

బ్రిడ్జిలకు ముఖ్యాంగములగు abutiments ను, piers ను, wings ను, సర్వమగు పునాదులపై నిర్మింపఁబడినవెనుక దానిమీఁద వేయఁబడుమార్గ (Road way) మా యా వంతెనల స్వభావముల ననుసరించి దూలములమీఁదగాని, లాడులమీఁదఁగాని, త్రాళ్ళమీఁదఁగాని వ్రేలాడు, ప్లాట్ఫారము (Suspended Platforms) లమీఁదఁ గాని నిర్మింపఁబడును.

**వంది**:—ఇతఁ డొకఋషి. జనకమహారాజు యజ్ఞ మొనర్చుతఱి నీతనితో యజ్ఞశాలయం దష్టావక్రుఁ డనుఋషి వాద మొనర్చి జయించె నని చెప్పఁబడినది. వంది యనఁగాఁ బొగడికయే వృత్తిఁగాగల భట్రాజు.

**వంధ్యత్వము**:—స్త్రీలకు సంతానముఁ గలుగని గొడ్రాలితనమును వంధ్యత్వమందురు. ఇది మహావంధ్య, కాకవంధ్య, మృతవంధ్య యని త్రివిధభేదములుఁ గలదిగఁ జెప్పఁబడినది.

అసలే సంతానము గలుగకుండుట మహావంధ్యత్వమనియు, నొకసంతానముమాత్రముఁ గల్గి మఱి కలుగకుండుట కాకవంధ్యత్వ మనియు, కల్గుచు మృతి నొందుచుంటయేగాని సంతానము నిలువకుండుట మృతవంధ్యత్వ మనియుఁ జెప్పఁబడినది.

**వంశగుల్మ (కుండ) ము:—** (ఉపప్లవ్య దేశముఁ జూడుఁడు).

**వంశదేశము, వత్సదేశము:—** సంయుక్తరాష్ట్రములలోని ప్రయాగకుఁ బశ్చిమమున నుండుసీమ లోకప్పుడు వంశదేశమను పేరఁ బరగుచుండెను. ఆదేశ మేలిన నరపతి వత్సమహారాజు సత్వాలననుండి వత్సదేశమని యది పిలువఁబడసాగెనఁట. రాజధాని కౌశాంబిసగరము. ప్రయాగనుండి పడమరగా ముప్పది మైళ్లదూరమున నిప్పుడది 'కోశాం' అనంబడు గ్రామమై యున్నది. మఱియు కౌశాంబీనగరమునకు వత్సపట్టణమనియుఁ బేరయ్యె నందురు. రామాయణకాలమున నుత్తరఁపుటెల్ల గంగానదియై యుండెనఁట.

వత్సరాజు, పరంతపుఁడు, ప్రతాపమహారాజు, ఉదయనుఁడు నీదేశ మేలిన నరపతులు. బౌద్ధులుదయనుని నుదేనుఁ డనిరి. ఉజ్జయినీనరపాలుండగు మహాసేన [ప్రద్యోతమహారాజు] పుత్రికయగు వాసవదత్తం బరిణయమైనవాఁడు. బృహత్కథయందును, కథాసరిత్సాగరము ౧, ౨ యందును, హర్షదేవవిరచిత రత్నావళినాటకము, శ్రీహర్షవిరచితప్రియదర్శికనాటకము ౧ 3 యందును ప్రశంసలు కాన నగును.

ఉదయనుఁడు ఒండోల భిక్షునివలన బౌద్ధదీక్షను పొంది బౌద్ధుఁడై బుద్ధభగవానుని విగ్రహమును మంచిగంధఁపుఁగట్టెతోఁ జేయించి దేవస్థానమం దుంచెనఁట. ఇది బుద్ధుని ప్రథమవిగ్రహమని చెప్పఁబడినది. ఎతు ౫ అడుగులు. రెండవ విగ్రహము కోసలభూపతి ప్రసేనజిత్తు చేయించెనఁట. ఇది స్వర్ణవిగ్రహమని చెప్పఁబడినది.

సుబంధుఁడను కవి రచించిన వాసవదత్తనాటకము క్రీ. పె. తొమ్మిదవశతాబ్దప్రారంభమున వ్రాయఁబడిన దనియు వార్తికమును రచించిన కాత్యాయనుఁడను పేరుఁగల వరరుచి కౌశాంబీ నగరమున జన్మించినవాఁ డనియుఁ జెప్పఁబడినది.

కాత్యాయనుఁడు పిదప పాటలీపుత్రమున నందభూపాలునికడఁ బ్రధానులలో నొకఁ డయ్యె నని కథాసరిత్సాగరము ౧ — 3 యందుఁ జెప్పఁబడినది.

**వంశధారానది:—** ఇది వెమురుపాదలనుండి జనించి యాంధ్రదేశములో ఖలింగక్షేత్రముకడనుండి ప్రవహించుచుఁ గళింగపట్నముకడ సాగరగామియగు నది. తొల్లింటి కలింగరాజ్యములోని దీనది.

**వంశపూజనాథుఁడు:—** జైనతీర్థకరులలో నొకఁడు. (తీర్థములు చూడుఁడు.) వీరిచిహ్నము దున్న (పోతు). ఇక్ష్వాకు వంశక్షత్రియుఁడు. తండ్రి వసుపూజ్యరాజు. తల్లి జయాదేవి. జన్మస్థానము (భాగల్పూరుకడ) చంపాపురి. పొడవు ౭౦ ధనస్సులు. (ధనస్సు మూఁడున్నరమూర). ఎఱ్ఱని కమలమువంటి వర్ణము. ఆయువు ౭౨ లక్షలు. గణధరసంఖ్య ౬౬. నిర్యాణస్థలము (భాగల్పూరుకడ) మందరగిరి. అంతరాళము 3౦ సాగర్.

**వంస్తవగోత్రము:—** (అగస్త్యఉపగణముఁ జూడుఁడు.)

**వక్కలంక వీరభద్రకవి:—** ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. భారద్వాజసగోత్రుఁడు. తండ్రిపేరు భాస్కరకవి. తాతపేరు చంద్రశేఖరకవి. తల్లిపేరు జగ్గాంబ. మాతామహుఁడు దిట్టకవి విశ్వనాథకవి. మేనమామ దిట్టకవి వేంకటాద్రి.

ఈతఁడు వార్ధక్యమునఁ దుర్యా [యత్యా] శ్రమమును స్వీకరించి, పిదప సిద్ధి నందెను. డెంకులూరి లింగనారాధ్యులవారి శిష్యుఁడు. కూచిమంచి తిమ్మనకవికిని, జగ్గకవికిని సమకాలికుఁడు. ఈతఁడు రచించిన గ్రంథములు ౧ వాసవదత్తాపరిణయము. దీనిని పీఠికాపురప్రభువగు రావు మాధవరాయనింగారికిఁ గృతినిచ్చెను. ౨ కాళిదాసకృతకుమారసంభవమును, గౌరీకల్యాణమను పేర నాంధ్రప్రబంధముగ నొనర్చెను.

ఈతఁడు పిండిప్రోలు లక్ష్మణకవికిని, కృష్ణమూర్తి కవికినిఁ గూడ సమకాలికుఁడని చెప్పఁబడినవాఁడు.

**వక్రరాగములు:—** సంగీతశాస్త్రముమేరకు స్వరములకు రాగరత్నాకరమునఁ జెప్పఁబడిన పద్ధతులమేరకు దశవిధగమకములపాదేసిన సంపూర్ణసంపూర్ణములగు కర్తారాగములును, వాట్లనుండి యారోహణమునందుఁ గాని, యవరోహణమునందుగాని, రెండింటియందుఁగాని కొన్నిస్వరములం దగ్గించి షాడవ ఔడవ భేదములం గల్గించి యాస్వరములకు దశవిధగమక పూర్వకప్రస్తార మొనర్చిన జన్యరాగములు గల్గును. (రాగములు, సంగీతము, జన్యరాగములు చూడుఁడు.)

ఈరాగములు నడుచు గమనిక ననుసరించి రాగములు లవక్రరాగములనియు, వక్రరాగములనియు ద్వివిధముగ నుండును. (అవక్రరాగములు చూడుఁడు.) ఆరోహణమందుఁగాని, యవరోహణమునందుగాని, రెంటియందుగాని ముందునకు వెనుకకుఁ దిరుగ ముందునకు నడచు వక్రగతులు రాగసంచారమునకుఁ గల్గించి రుచుల నధికపఱచి శ్రవణసుఖాధిక్యతఁ గల్గించుటవలన నారాగములకు వక్రరాగములని పేరయ్యెను. ఇందున కుదాహరణము ౨౦ నటభైరవీ (కర్తా) రాగజన్యమగు నానందభైరవిరాగమును స - గ - రి - గ - మ - ప - ద - ప - ని - స - స - ని - ద - ప - మ - గ - రి - స అని పాడుట (ప్రస్తరించుట) యు, ౨౮ హరికాంభోజీజన్యమగు శాహనారాగమును స - రి - గ - మ - ప - మ - ద - ని - స -; స - ని - ద - ప - మ - గ - మ - ర - గ - ర - స అని ప్రస్తరించి పాడుటయు, ౮ హనుమత్తోడిజన్యమగు నసావేరీరాగమును స - రి - మ - ప - ద స; స - ని - స - ప - ద - మ - ప - రి - గ రి - స అని ప్రస్తరించి పాడుటయు వక్రగతిం గల్గించుటయే యగును.

వక్రరాగములు త్రివిధములని సంగీతశాస్త్రవేత్తలు విభజించిరి. అవి ౧ ఆరోహణావరోహణములు రెంటియందును వక్రగతిం గల్గినవియు, ౨ ఒక్కయారోహణమునందే వక్రగతిం గల్గి యవరోహణమున నవక్రముగనే యుండునవియు, ౩ ఒక్కయవరోహణముననే వక్రగతిఁ గల్గి యారోహణమున నవక్రముగనే యుండునవియు నను మూఁడు విధములు.

ఇట్టి వక్రరాగములందునను షాడవ, ఔడవ సంపూర్ణ పద్ధతిఁ గల్గియుంట నొక్కొకదానియం దుభయవక్రగత (ఆరోహణవక్రత, అవరోహణవక్రత) లుంటచే నిరువదియేఁడు భేదము లయ్యెను. అవి—

౧ సంపూర్ణసంపూర్ణమున:— ౧ ఉభయవక్రత, ౨ ఆరోహణవక్రత, ౩ అవరోహణవక్రత యని త్రివిధము.

| | | |
|---|---|---|
| ౨ సంపూర్ణషాడవమున | ,, | త్రివిధభేదములు |
| ౩ సంపూర్ణఔడవమున | ,, | త్రివిధభేదములు |
| ౪ షాడవసంపూర్ణమున | ,, | త్రివిధభేదములు |

| | | |
|---|---|---|
| ౫ షాడవషాడవమున | ,, | త్రివిధభేదములు |
| ౬ షాడవఔడవమున | ,, | త్రివిధభేదములు |
| ౭ ఔడవసంపూర్ణమున | ,, | త్రివిధభేదములు |
| ౮ ఔడవషాడవమున | ,, | త్రివిధభేదములు |
| ౯ ఔడవఔడవమున | ,, | త్రివిధభేదములు |

ఇట ౯ × ౩=౨౭ ఇరువదియేఁడు భేదములుఁగల వక్రరాగములు గల్గినవి. ఇటుల నిరువదియేఁడు విధములగు వక్రరాగములు లక్షలకొలఁదిగఁ దయారగుంగాని యవి యన్నియు వెర్రివాలకములుగ నుండి రుచింపమింజేసి గాయకులచే నంగీకరింపఁబడలేదు. స్వల్పసంఖ్యాకములు మాత్ర మంగీకారమంది వాడుకయం దున్నవి.

ఇటీవలఁ బల్లూరుపు సుబ్రహ్మయ్య...... గాయకశిఖామణికలెనఁ గుతూహలమని యొకవక్రరాగమునకుఁ జేరిక యుద్ధరించెను. దానికి స - రి - మ - ద - ని - గ - ప - స్; స్ - ని - ద - ప - మ - గ - రి - స అనునవి యారోహణావరోహణములై యున్నవి. మఱియు నీరాగమునందే యాధన్యుఁడు "రఘువంశ సుధాంబుధి చంద్ర శ్రీకర" యను కృతిఁగూడ రచించెనని విందుము.

**వక్రానది లేక వక్రేశ్వరీనది:—** వంగదేశమున బర్ద్వాన్ (వర్ధమానము) మండలములోని యొకనది. దీని నిప్పుడు 'బకా' యనుచున్నారు. (వంగదేశముఁ జూడుఁడు.)

**వక్తృత్వము (Oratory) ప్రాసంగికశక్తి :—** వక్తృత్వ మొక్కవిద్యగఁ జెప్పఁబడినది. ఇది భరతదేశమునం దెక్కువ వ్యాపింపకున్నది. ఆదికాలమునుండియు లేకపోలేదు. వినువారలను బ్రోత్సాహపఱచి విన సంసిద్ధులుగ నొనర్చుట, రంజింపఁజేయుట యనునిపుణత లీ వక్తృత్వఫలితములని తేలుచున్నది. వినువారలకు బోధించుటయు నీవిద్యయందలిభాగమే. బహుళః బోధించుసందర్భమున వక్తృత్వమూలమునఁ దన బలముఁ బ్రదర్శించి వినువారలను తనబోధనలకు వశవర్తులుగఁ జేయుపనికి 'శక్తిపాతవిద్య' యని పేరిడియుంట మతధర్మవిధానములందుఁ సుప్రసిద్ధము.

ఇంక నీవక్తృత్వవిద్య నాల్గవశతాబ్దకాలమున గ్రీసుదేశమునందుఁ బ్రజాప్రభుత్వసందర్భములందు బలముం గూర్చుకొన ముఖ్యసాధనమై యుండెనట. వారక్కాలమున నీవిద్యాభ్యాసమునకు సంస్థల నేర్పఱచి నడపిరట. Eloquence అట మహోన్నత స్థితి నంది యుండెనని చెప్పఁబడినది. శరీరసౌష్ఠవము సరిగా లేని Demosthens గారు Eloqent Oratory కలాప్రవీణులగుట వక్తృత్వమున నాయనను మించువారు లేరని పొగడఁబడుచుండిరని చెప్పంబడినది. రోమనులీవిద్యనే గ్రీకులనుండి నేర్చుకొనిరి. వారి మహోన్నత్యకాలమున రోమనులు Honour Distinction, Power లను కాంక్షించిరేని యీ విద్యానిపుణతపై నాధారపడి ప్రయత్నము లొనర్పవలసియుండెను. రోమనుల Oratory యందు 'Roman qualities of method, and stateliness లోప మనియు, సుప్రసిద్ధవక్తయగు నొక పండితుఁడు వ్రాసియున్నాఁడు. ఈ నేర్పులన్నియు నొక్క Cicero గారివద్దమాత్ర ముండె నందురు. అక్కాలమునందు రోమకపురియందు న్యాయవాదిగనుండిన Quintition గా రొక వక్తృత్వవిద్యాపాఠశాల నేర్పర్చి తా నందధ్యాపకుఁడుగఁగూడఁ బనిఁజేయుచుంట నాయన కప్పటిప్రభుత్వము వేతన మేర్పరిచి యిచ్చుచుండెనని తెలియుచున్నది.

Oratory విద్య Natural oratory యనియు artificial oratory అనియు ద్వివిధము. తా నెఱింగిన సంగతులను సహజశక్తితో వినువారలకుఁ దెలుపుట కుపన్యసించుట నైసర్గిక వక్తృత్వ మనియు, విద్యార్థుల కధ్యాపకు లుపన్యసించుపాఠములు, మతబోధకులు మతబోధ లొనర్చు నుపన్యాసములవలెను తొలుదొల్త బాగ జక్కఁగఁ జదువుకొని సుబోధకముగ నుపన్యసించుట artificial oratory యనియు చెప్పంబడినది. Pulpit oratory (మతబోధ) political party oratory మొదలగునవి ఆర్టిఫిషల్ ఒరేటరీలోనివే యగును.

పార్లమెంటుసభయందుఁ దగాదావాదములు, న్యాయస్థానములందు వాదిప్రతివాదుల పక్షముల వాదనలు, మొదలగునవి సమయానుగుణ్యముగ సంసిద్ధమై యుండవలసియుండుం గాన నైసర్గిక వక్తృత్వసంబంధము లగును.

వక్తృత్వవిద్యయందు ముఖ్యధర్మములు మూఁడు గలవు. అవి information, Preparation and delivery అని చెప్పఁబడినవి. ఉపన్యాసకుఁడు లోకవ్యవహారము, సభ్యులస్వభావాదులను జక్కఁగ నెఱిఁగియుండుటయు, తా నుపన్యసించు సంగతిఁ బూర్తిగ నెఱింగినవాఁడుగను నుండుట ముఖ్యము. ఉపన్యాసకాలమునం దా యా నిముషములం దవసరమగు విషయములఁగూర్చి సమర్థించుటకుఁగాని, యెదుర్కొనుటకుఁగాని యతిత్వరితగతిఁ గల్గినమనస్సునఁ గోపముఁ దెచ్చుకొని చికాకు పడక శాంతముగ నెదుర్కొనుట గ్రహించు శాంతియు నవధానమును మఱపుఁ జెందని జ్ఞాపకశక్తియు వక్తయగునుపన్యాసకుఁడు చక్కఁగ నభ్యాస మొనర్చి యుండవలయును. ఎక్కువగఁ జదువుచుంటయు నుత్తులం జక్కఁగ జ్ఞాపక ముంచుకొను పరిపాటియు, విస్తారమగు శబ్దజాలము పరిచయముగనుంటయు నత్యవసరములు. ఇది మొదటిధర్మమగు Information అనఁబడును.

ఉపన్యసింపఁ బోవుసంగతియందలి ముఖ్యాంశముల నొకటితర్వాత నొకటి వరుసగ ముందుగ కూర్చుకొని యెన్నిభేదమార్గములనైనను వానిని సమర్థించు నోపికయు వినుకిఁ గలుగ నీయుని విధానాభ్యాసములును రెండవధర్మమగు Preparation అనంబరగెడిని.

తక్కిన తృతీయధర్మమగు delivery యన్నిటికన్నను ముఖ్యమని యెంచంగునది. కంఠస్వరము మార్దవముగను, ధోరణి వీలగునంత క్లుప్తముగను, నడుమనడుమ ననవసరముగ నాలస్యముగ ధోరణి నీడ్చుటయు, శబ్దములు రుచికరములుగ నుండునటుల పదవిన్యాసశక్తియు, వినుకిఁ గలుగకుండునటుల ధోరణిని సర్దుకొనుచుంటయు, చెప్పునది నాతిదీర్ఘముగ నుంచుకొనుటయు నుపన్యసించుచు వినువారలముఖవైఖరుల నతిజాగ్రతగఁ బరిశీలించుచునే యుంటయు నౌసరమగుతావులం దాపుటయుఁ దొందరపడకుంటయుఁ గ్లిష్టపదములు, సందిగ్ధపదములు, నిరర్థకపదములు, పునరుక్తులు మాని కృపణవృత్తి స్ఫురింప నీయక నుపన్యసించుటఁ దృతీయధర్మమగు delivery యగును. ఇట్టివి సభారంజకములై వినువారలచిత్తముల నాకర్షింపం గల్గెడిని.

## వక్తృత్వముకల (Elocution) (ఆరెటరీ, వాగ్ధాటి, వాచాలకత్వము, వాగ్ఘరి):—

బహిరంగముగ మాట్లాడుటయందుఁ జెప్పువిషయములను స్పష్టముగను, నిర్దుష్టముగను నుచ్చరించుటకును వక్తృత్వ మనిపేరు. అట్లుఁ జెప్పుధోరణి నుపన్యాస మందురు. చాతుర్యము

గను, రుచికరముగను వినువారికి నచ్చఁజెప్పుచుఁ బ్రసంగించుకళకు Oratory యని యాంగ్ల మునఁ బేరు.

ఈవిద్యకు సంస్కృతమునఁ బూర్వులు శక్తి పాత్రవిద్య యనిరి. తనస్వశక్తిచే వినువారిసామర్థ్య మును స్వాధీనపఱచుకొనుటయని యిందలిభావము. ఇది మనోబలము స్వచ్ఛము, నిర్దుష్టమునగు ప్రయత్నము, పరోపకారబుద్ధి, స్వార్థత్యాగము, వాచాళుత్వము నొకనియందుఁ గూడియుండిన జయప్రదముగను, తక్కువగ నుండిన కొంతవరకు హీనతగను వానికిఁ గల్గుచుండును. పాశ్చాత్యు లగు వక్త లుపన్యాసము లిచ్చుకల క్రింది విధానముల నభ్యసింపందగునని తెల్పుచున్నారు.

౧ ఉపోద్ఘాతము:— ఉపన్యాసమునకు ముం దధిక ముగఁ జెప్పరాదు. ఇత్తరుణమున వేరొకటి రుచింపదు. ఉపన్యాసాంతమునఁ గ్లుప్తముగ నుడివిన నుడువవచ్చును. అదియు నంత ప్రశ స్తము కాదు. ఏది ముఖ్యముగఁ జెప్పవలసి యున్నదో దానిని బాగుగ నెఱింగి చెప్పి వైచి విరమించుటఁ జాల రుచికరమై యుండె డిని.

౨ మాట్లాడుచుండునతఁడు ముఖవికాసము చక్కఁగ విడఁబారి యుండునట్లు జాగ్రత నభ్యాసముఁ జేసుకొనవలెను. ముఖము ముడుచుకొనుట, యధికముగాఁ ద్రిప్పుకొనుట, వయ్యారముగా నటించుట మొదలగుచర్యలు మాయకాఁడని వినువారలకుఁ దోఁపింపఁ జేయును. ముఖము ముడుచుకొనిన వినువారలకు నిరసనఁ గల్గు టయుఁ గలదు.

౩ కాలుసేతులఁ గదలించుట, తిరుగుట, చేతితోఁ జూపుట, కాళ్ళూరకఁ గదలించుట, చేతు లెత్తుట, మైవివశతకు సూచనలు. ఇవి మనో దౌర్బల్యముఁ దెలుపునవి కాని సదభిప్రాయ ముఁ గల్గించునవి కా నేరవు. అనేకు లివి వక్తృత్వలక్షణములని భ్రమఁజెందుచున్నారు.

౪ మాటల నెప్పుడును క్లిష్టపఱచినరూపములం దుపయోగించుటఁ దగదు. పదముల పూర్ణ రూపములే సభోపన్యాసములందు స్పష్టముగ నెల్లరకును దెలుసునను సంగతి మరువరాదు.

౫ వీలగునంతవరకు శరీరచేష్టలు వచించు నుప న్యాసధోరణి కనుకూలించునదిగ నుండునట్లు జాగ్రతఁ గొనవలయును.

౬ ఉపన్యాస మిచ్చుచుండునతఁడి నెట్టివిపరీతపరిస్థితిఁ గల్గినను కలవరపడరాదు. తొందరపడి ముగింప రాదు. నిరాశఁ జెంది ధైర్యము వీడరాదు. ఒక్కతఱి నించుక యాగి సద్దడంగినతోడనే తిరుగ వక్తృత్వము నారంభించుటఁ బెక్కు సభలందుఁ జాల మంచిపనిని జేసినది.

౭ సభ్యులయయిష్టము, అల్లరి, అరపులను నుప న్యాసకుఁడు చల్లని నిదానదృష్టితోఁ జూచుచు వారి నిజాభిప్రాయములను జక్కఁగ గ్రహిం చుచుఁ గాలోచితమగుధోరణి నుపన్యసించుట సమంజసముకాని తనయయిష్టమును కఠిన ముగఁ దెల్పుటయుఁ గోపగించునట్లు ముఖలక్ష ణములనుండి వ్యక్తముఁ జేయుట, తాను జా గ్రతఁగొనినట్లు నటించుట, గడసరితనముఁ బ్రక టించుట యుపన్యాసకునకు లేశమును తగనివని మనసునం దుంచుకొనవలయును.

౮ తాఁ జెప్పుచుండు ధోరణిని వదలి మఱియొక సంగతిని హఠాత్తుగా మొదలిడ రాదు. ఇది వినువారి కర్థముఁ గాకుండఁ జేసి కలవర మొన ర్చును. మాటల నొత్తి పలుకరాదు. తీవ్ర

ముగను, గంభీరముగను పలుకరాదు. ఇది వినువారిమనస్సులందు నిరసనఁ గల్గించును. తొందరధోరణి కానఁపడి మాటలు గొణుగు కొనరాదు. ఇది స్పష్టముగ బోధపడకుండఁ జేయును. అతినెమ్మదిగ నుపన్యసించుట విను వారి కశ్రద్ధను, విసుకును గల్గించి ఫలిత ముండదు.

౯ ఉపన్యాసములందు శతృవులనైనను నిందింప రాదు. ఎవ్వరిని తూలనాడరాదు. ఇది గౌరవ ప్రదము కాకపోవుటయేగాక నొక్కొకతఱిఁ బరాభవముఁగూడఁ గల్గించెడిని.

౧౦ శైలి సులభబోధకముగను వాక్యము లెప్పటి కప్పు డేభావమున కాభావముతోఁ నేసంగతి కా సంగతితోఁ దెగిపోయి తిరుగఁ గ్రొత్తవాక్యము లతో ముందుసంగతిం దెల్పు నంశమును ప్రారంభించుచు నుపన్యాసము నడుపుట యభ్యాస మొనర్చుకొనవలయును. కాని పొడుగుపాటి క్యసముదాయములు, దూరాన్వ యప్రయోగములు నుపన్యాసములందుండిన వినువారికి రుచింపవని యెఱుంగునది.

౧౧ ఉపన్యాసకాలమున నోరుఁ దెరచియుంచుట శ్రేయముఁ గాదు. ముక్కుతో నూపిరిఁ దీయ వలయునుగాని నోటితో నుచ్ఛ్వాసముల విడుచుట కుపన్యాసకాలమున వీలుండదు గాన దీని నభ్యాసముఁ జేసుకొనవలెను.

౧౨ శబ్దోచ్చారణ స్పష్టముగ లేకున్న వినువారికి రుచింపదు. గాన స్పష్టముగఁ బల్కుట కభ్య సింపవలయును. అందుఁ దొలుత నెమ్మదిగను, పిదపఁ ద్వరితముగను బల్కుచు నాయుచ్ఛార ణను స్వాధీన మొనర్చుకొనుట మంచిది.

౧౩ ధోరణి స్పష్టముగను, హీనస్వరముతోఁ గాకుండ నించుకఁ జటిలముగను, కంఠస్వరము జిరజారలు లేనిదిగను నుండు టావశ్యకము.

౧౪ చెప్పినదానినే తిరిగి చెప్పుట విశారదత్వ మని పించుకొనదు.

౧౫ ఊపిరి నాశికమునుండి నడపునపుడుఁ గొంతసే పూపిరిని నిలిపియుంచుటయు, తాపీగ దానిని విడచుటయు నభ్యాస ముపన్యాసములందుఁ జాల యుపకరించును.

## వచనగోత్రము:—

(అగస్త్య ఉపగణము చూడుఁడు.)

## వచ్చినవాదు చచ్చినా పోదు:—

(ఆంధ్రలోకోక్తి.)

## వచ్చి రాని మాటలు ఊరీ ఊరని ఆవకాయవంటి రుచిఁగల్గినవి.

(ఆంధ్రలోకోక్తి.)

## వజ్రకము:—

శ్రీరామునివిల్లు. (ధనుర్విద్య చూడుఁడు.)

## వజ్రపాదగోత్రము:—

(జాతుకర్ణ్య గణము చూడుఁడు.)

## వజ్రము:— లా. adamas- ఆంగ్లే. Diamond- ఫ్రెంచి diamant- సం. వజ్రం.

వజ్రము ప్రపంచమునందలి యన్నివస్తువుల లోను నెక్కుడు గట్టిది. భూమియందలివస్తువులలో దాని ప్రమాణమునుబట్టి యెక్కువకాంతియు, తళుకును గలది. నవరత్నములలో రాజమనిపించు కొనునది. అన్నిరత్నములలో నిది యెక్కుడు విలువఁగలది. ఆంగ్లరసాయనశాస్త్రవేత్తలు వజ్రి

మును a trasparent Crystal of pure Carbon అందురు. వజ్రమును సానఁబట్టుటకు, మెరుగుపెట్టుటకు వజ్రఁపుసానయె కావలయును.



ఇది యంతగట్టిది. వజ్రములను ముఖములుఁ (పలకలు) గ గోసి మెరుగిడువిద్య యు క్రీ. వె. ౧౪౫౦ నుండి లోకమెఱుంగునని కొందరు పాశ్చాత్యపండితులు వ్రాసిరిగాని భరతదేశ మంతకన్నఁ జాలపూర్వకాలమునుండియు నెఱుఁగును. వజ్రమును భరతదేశస్థులు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, పంచమ గంధర్వ జాతులుగ విభజించియున్నారు. వీనినే పాశ్చాత్యులు Colourless diamonds, Red diamonds, Yellow diamonds, Green diamonds, Black diamonds, Blue diamonds అందురు. వజ్రము గనులనుండిగాని ఇసుకబయళ్ల నదీగర్భములనుండిగాని దొరకును. దొరకుతఱి Crystal రూపమున నుండును. చిన్నదిగనున్నను, పెద్దదిగనుండినను, వజ్రము స్వచ్ఛతయు, నూదా బంగారువన్నె మెఱుపు మొదలగు తళుకులంగల్గి లోన నీరునిలిచి కదలకయుండునటులఁ గానఁగుచుం డుట పరీక్ష. ఇంకను grey, yellow, brown Red, Pink, Blue, Green, రంగులధాతువులుగల్గిన వజ్రములుండునని యొకప్రసిద్ధాంగ్ల పరిశీలకుఁడు నుడివియున్నాఁడు.

స్వచ్ఛమగు నీటియందైదారంగుళములలోతున వజ్రమునుండి వెలుతురునందుఁ బరిశీలించిన వజ్రముం జుట్టి గీతవలె నానవాలుఁ గనిపించుంగాని యొకవేరువస్తువు నీటియందున్నట్లు గానరాకుండును. ఇది Nitric acid, salfuric acid లను ద్రావకములంగల్పి యందుంచిన వేలిపోక నిలువవలయునని పాశ్చాత్యపరిశీలకు లందురు.

వజ్రములు ముఖ్యముగ భరతదేశము, దక్షిణాఆఫ్రికా దేశము, బ్రెజిల్దేశము, చీనాదేశము, మలయ ద్వీపసమూహము, బోర్నియోద్వీపము, ఆస్ట్రేలియాలయందు దొరకెడిని. అందు భరతదేశమున

కోహినూరు మొదలగు గొప్ప పేరందిన జ ములు దొరకినవి. గాన వేరుగ వ్రాయనక్కఱలేదు. క్రిష్ణానదియందు దొరకినవజ్రములు గోల్కొండ మొదలగుతావులను మేలుజాతి వజ్రములు దొర కినవి. దక్షిణాఫ్రికావజ్రములు పెద్దవి. వానికి Cullinan diamonds అని పేరిడియున్నారు. బ్రెజి ల్వజ్రములకు మెరుగెక్కువ. ఆస్ట్రేలియా వజ్రములు చిన్నవిగను, నెక్కుడు గట్టిగను నుండునందురు.

వజ్రము లాభరణములయందు బిగింతురు. ఒకప్పుడు కుందనమనబడు బంగారపురేకులతో నొక్కి బిగింతురు. ఒకప్పుడు బంగారుపనిలోనే కరిపించి బిగింతురు. పాశ్చాత్యదేశమున Diomond Cement అనబడు దానితో బిగింతురు. Chronometer యంత్రమున శిలలుగ నై చెదరు. Brown dimonds Borts లను భూమినుండి నీరుతీయ Boaring నూతులం ద్రవ్వు యంత్రములకుం గడలను బిగింతురు. ఇంకను కఠిన ములగు శిలలకుం గన్నములుపొడుచు Boaring యంత్రముల కడుగున నధమంపుజాతివగు నల్లని వజ్రంపుముక్కలను బిగింతురు. ఇవి గొప్పగొప్ప గండశిలలను భేదించెడివి. ఇంక Carbonados అనంబడునది చిన్నహీనంపు వజ్రంపుటిసుక. వీని కాంగ్లమున rough aggregates అనియు నందురు. వజ్రంపుబొడి (రాపొడి) వజ్రములకు మెరుగిడం బనికివచ్చును.

భూమియందు వేడికిం బుఠముగనై పరిశుద్ధమైన యవస్థకు వజ్రావస్థయనియు, దానికిం గొంత తక్కువైనయవస్థకుం బుష్యరాగావస్థయనియు, నింకను హీనావస్థకు వైక్రాంతావస్థయనియు, కేవ లప్రారంభస్థితియందుండుచుక స్వచ్ఛతం గల్గినది స్ఫటి కశిలయనియు నధమాధమమగు కేవల ప్రారంభ దశను గొర్విష్వరాయియనియుం గొందరు పరిశీల కులు నుడివిరి. వజ్రమును శాస్త్రోక్తముగ భస్మ మొనర్చి లేక శుద్ధింజేసి దాని నాయుర్వేదమై న్యూ త్నౌషధముగ వాడుదురు. ఇది గుల్మమొదలగు సమస్తోదరరోగములను నివారించి విరేచనములం జే యును. అనేకరోగముల నడంచును. బలమొసం గును. సరిగా శుద్ధిగాని వజ్రభస్మము వికారము లను గల్గించును. దీనికి విరుగుడు నెయ్యి, తేనె, పటికపంచదార, ఆవుపాలునను చెప్పంబడినది.

## వజ్రరేఖ:—

(పురుషసాముద్రికము చూడుడు. స్త్రీసా ముద్రికము చూడుడు).

## వజ్రము లాకాశమున లభించుట:-

వజ్రములయుత్పత్తి యాంగ్లరసాయనశాస్త్రవిదు లచే Crystallisation of carbon, which has been dissolved under enormous pressure, in molten iron etc, and thrown up, towards the surface of the earth from depths by volcanic actions etc" అని సర్వసాధారణనిర్వచనము నొందియున్నది. వీనిపరిశీలనల నొనర్చినవారిలో నిర్వురు రష్యాదేశంపుం బండితులు చిరస్మరణీ యులు. వారు క్రీ. శ. ౧౮౮౬ సెప్టెంబరు ౨౨ తేదీని రష్యాదేశంపుటాగ్నేయదిశను novo urei అను గ్రామమునకడం బడిన యొక 'మీటియరు ఉల్క' బరిశీలించి యందు నూటనొకపాలు వజ్రంపురజ మినుముతోను, రాతితోను, కలసి యున్నటులం గన్గొనిరి. ఆరిజోనాదేశములోని Devil canyon నం దొక iron meteorite నం దిటులనే కన్గొనంబడినదట. నిజమున నాప్రదే శమందున్న meteoric iron నం దట్టి వజ్రంపు రజ మున్నదందురు. చిలీదేశంపు carcote నం దొక meteorite stone (రాయి) యందొక చిన్నవజ్రమే దొరకెనట.

**వజ్రాసనము:—** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. ఇది సిద్ధాసనమునకు సంబంధించిన యవాంతరభేదాసనము.

కుడికాలిమడమను సీవనిస్థానమునం దానించి యెడమకాలిమడమను లింగస్థానమునం దదిమి యుంచి తక్కినదంతయు సిద్ధాసనమువలెనే యొనర్చుట. (సిద్ధాసనము చూడుఁడు.)

**వజ్రిణిగోత్రము:—** (విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.)

**వజ్రుఁడు:—** యదుసంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి అనిరుద్ధుఁడు. తల్లి ఉషాదేవి. పితామహుఁడు శ్రీకృష్ణుఁడు. శ్రీకృష్ణనిర్యాణానంతర మీవజ్రుఁడు మధురాపురమున కధినాథుఁడయ్యెను.

**వజ్రేశ్వరీదేవీపీఠము:—** (త్రిగర్తదేశము చూడుఁడు.)

**వజ్రోళిముద్ర:—** యోగాభ్యాసవిధానమునఁ జెప్పఁబడిన వింశతి ముద్రలలో నొకటి. రెండరచేతులను నేలమోపి వానిపై శరీరభారమంతయు నాపి కాళ్లను పైకెత్తి తలను నేలకుఁ దగులకుండశరీరమును నిలువఁబెట్టి తలక్రిందుగను, కాళ్లు మీఁదుగను నిలచియుండుట వజ్రోళిముద్రయని చెప్పఁబడినది. ఇది మేరండుఁడనుముని యభిప్రాయము. దీని కింకను ప్రకారాంతరము కలదు గాని యది గురుముఖతః తెలిసి యభ్యాసముఁ జేయఁదగినది గాన వ్రాయఁజనదు.

**వటపత్రపురము:—** భగవాన్లాలు ఇంద్రజీ పరిశోధకుఁడు, దీని నిప్పటి బరోడానగర ముండిన తావని పోల్చియున్నాఁడు.

**వటస్థానము:—** భారతయుద్ధకాలమునఁ గౌరవసైన్యములకిది యొక విడిదల. కురుక్షేత్రములోనిది.

**వట్టిమాటలతోఁ గడుపునిండునా?:—** (ఆంధ్రలోకోక్తి.)

**వట్టివేళ్ల (గడ్డి) చెట్టు:—** లా. Audropogon muricatus, ఆంగ్ల. Cuss Cuss grass. సం. ఉశీరః దాహహారణం, లాజం, వంశశలాకా.

వట్టివేళ్ళలోఁ దెల్లవట్టివేరను నొకశ్రేష్ఠజాతి కల దది చాల యరుదు. దానికి లాటిన్భాషయందు Andropogon Iwarancusa అనియు సంస్కృతమున నుశీరం, జలాశయం, లామజ్జః, శీఘ్రం, అనియుఁ బేర్లు.

వట్టివేరునందు సువాసన గలదు. వేసవియందు గాలివచ్చుద్వారముల కిటికీలయందు వట్టివేళ్ళ చాపలఁ గట్టి తడుపుచుండిన పరిమళయుతమగు చల్లఁదనము మెండవేళల సౌఖ్య మిచ్చును. మరియు వట్టివేళ్ళు విసనకఱ్ఱలుగఁగూడఁ జేయుదురు. దక్షిణదేశమునఁ దంజావూరుమండలసీమలందు వట్టివేళ్ళపంటఁ బండింతురు. అచటిస్త్రీలు పచ్చివట్టివేళ్ళను తలవెంట్రుకలందు ధరింతురు.

వట్టివేళ్ళ రసకషాయచూర్ణములందుఁ జలవఁ జేసి మూర్ఛ, భ్రమ, ప్రమేహము, రక్తపైత్యములు, పైత్యోద్రేకము, కడుపులోనిమంట, వాంతులు, క్షయల నడంచు శక్తి గలదని చెప్పఁబడినది. తెల్లవట్టివేళ్ళగుండ దశాంగధూపవస్తువులందుఁ జేరును.

**వటీకరగోత్రము:—** (వశిష్ఠగణము చూడుఁడు.)

**వటుగోత్రము:**—(గర్గఉపగణము చూడుఁడు.)

**వటేయక్షన్యాయము:**— మఱ్ఱిచెట్టుపైఁ బిశాచముండునని వాడుకఁ గలదు. ఈవాడుకనన్ని మఱ్ఱిచెట్టుచటఁ గన్పడిన నట నొకపిశాచ ముండునని తలంచుటయు, నెన్నిమఱ్ఱిచెట్లో యన్ని పిశాచములుండునని తలంచుటయు, మఱ్ఱిచెట్లన్నియుఁ బిశాచనివాసములనియే తలంచుటయు నర్థములేని యవ్యక్తతయని భావము.

**వటేశనాథ దేవస్థానము:**— అంగదేశమునఁ గాలీవహాడ్ కొండపైఁగల దేవస్థానము. [అంగదేశముఁ జూడుడు.]

**వట్టెళుత్తులిపి:**— ఇది దాక్షిణాత్యలలో నొకటి. (వీటివంశవృక్షము చూడుఁడు). దీనినుండికల్గినమార్పే యరవలిపియై బఱంగుచున్నది. దాని నాభాషయందు తమ్మిళ్ష (తమ్మిళ్) నుచున్నారు. వట్టెళుత్తులిపి చేరలిపినుండి జనించినది. అది గుహాలిపినుండియు, నది యశోకమౌర్య బ్రాహ్మీదేవనాగరినుండియు జనించినలిపులు. (అరవదేశఁపులిపులు, దాక్షిణాత్యలిపులు, జూడుఁడు.)

వట్టెళుత్తను మళయాళభాషాపదమునకు వట్రువవ్రాతయని యర్థమగును. ఇది యరవదేశఁపుఁ బురాతనలిపిగను, స్వతంత్రోత్పత్తి కలదిగను కొందరును, అశోకుని బ్రాహ్మీదేవనాగరినుండియే యేర్పడినదని కొందరును నభిప్రాయభేదములఁ గల్గియున్నారు. మహమ్మదీయులగు మాపిళ్లాజాతివా రీలిపినే యిటీవలిఁదనుక నుపయోగించుచుండిరఁట. క్రీ. వె. ౧౫ శతాబ్దమునాటివఱ కరవదేశమున నీలిపి వాడుకయందుండ లే దఁట. పాండ్యరాజ్య మున్నంతకాలము వాడుకయందుండెనందురు. మళయాళదేశమునం దిది మారిపోయిన రూపమునకుఁ గోళెళుత్తని పేరఁట.

చోళరాజ్యము ప్రబలుటతో నీలిపి వ్యాపకముఁదగ్గి యిప్పటి యరవలిపి వాడుకలోనికివచ్చుట యధికమగుచుండెననియుఁ గాననే యరవదేశఁపుఁ బురాతనగ్రంథములగు కురళ్ తొల్కాప్పియమ్ గ్రంథముల పాతప్రతు లీవట్టెళుత్తలిపిలోనున్నవనియు సుప్రసిద్ధ పరిశీలకశిరోమణియగు బర్నెలు పండితుఁ డభిప్రాయపడి యున్నాఁడు.

**వఠిక లేక వఠికగోత్రము:**— (పరాశరగణముఁ జూడుఁడు.)

**వడ:**— వడయను గాతయును, తాపమును శ్రమమును దనరును. (గాడ్పులు చూడుఁడు.)

**వడగండ్లు** [Hailstones]:—పెంపువాతావరణమున స్నోక్రిస్టల్సువలె నేర్పడినవైనను (స్నోఫ్లేక్ చూడుఁడు. ఫాగ్ చూడుఁడు. మిస్టు చూడుఁడు. హోరు ఫ్రోస్టు ఐస్ క్రిస్టల్సు చూడుడు. మంచుబిందువులు చూడుఁడు.) వాటివలె నచిరకాలమున భూమికిఁ జేరక వాయుపథమున విపరీతములచేఁ బైకి నెట్టఁబడుచు క్రిందికిఁద్రోయఁబడుచు నూగులాడి యాడుచుండుకతన వేర్వేరుపొరలు మంచుదానియం దేర్పడి వలయుగనై బరు వెక్కి కరగుచు నేలంబడి వడగండ్లు నాఁబరఁగుచున్నవి. దీనిని విభజించిన లోనిపొర లగుపడును. తరుచుగ నివి నేలంబడుతఱి శీతలమైన వాతావరణమునుండి జనసగుట కఱుఁగక నేలంజేరుటఁ గలుగుచున్నది. తే కుండెనేని కఱిగి నీరై వానచినుకులుగనే యనఁగాఁ బెద్దచినుకులుగ నేలం బడుచుండును.

చినుకులతో వడగండ్లుకూడ వర్షించిన నద్దానిని వడగండ్లవాన యనెదరు. వడగండ్లు మంచుముక్కలు. వీటియం దనేకమంచుపొర లగుపడును. మేఘములకడఁ గల్గిన యతిశీతలమున కట్లు ఘనీభవించియు క్రిందికి మైకి ననేకసారులు air currents బలమున నెత్తఁబడుచు దిగుచు కడకు నేలంబడుటచే నిట్టిపొర లేర్పడునని తలంపఁబడుచున్నది. బరువగుతఁకె నిది యపాయకరమగు వర్షమయ్యెడిని. [మీటియొరోలజీ చూడుఁడు.]

**వడలిగురు (జన్మస్థానము)**:—ఇది సిక్కుమతస్థుల యారవగురుఁడగు హర్గోవిందగురుని జన్మస్థానమగుట సిక్కుల యాత్రాస్థల మనఁబడుచున్నది. పంజాబుదేశమునం దమృతసర్ జిల్లా యమృతసర్ నుండి నాల్గుమైళ్ళదూరమున వడలిగురుగ్రామ మున్నది.

**వడ్రము (Carpentry)** :— వడ్రమనాదిగ భరతదేశమునం దభివృద్ధినందిన కళ. కృతయుగమునందే యీకళ భరతదేశమున మంచిస్థితియందుండినటులఁ దెలిసెడిని. విశ్వకర్మసంతతివారగు సనాతనఋషిసంతతిలోని మయునివంశమువారగు ౧ ననుమానుష ౨ సనత్కుమార, 3 ధార్మిణి, ౪ విధాత్యమను, ౫ ద్విజధర్మర్షి, ౬ వదదంతి, ౭ భావబోధమను, ౮ వతత్సు, ౯ శాంతమతర్షి, ౧౦ యాజ్ఞసేనర్షి, ౧౧ చత్సుర్షి, ౧౨ విశ్వదక్షర్షి, ౧౩ సుమేధర్షి ౧౪ పన్నర్షి, ౧౫ రైవతమనుర్షి, ౧౬ పరార్షి, ౧౭ జైధర్షి, ౧౮ పరిషంగర్షి, ౨౦ విద్యాంతర్షి గోత్రములవారు దారుకావర్ణమువారని, వీరి కిది యాదివృత్తియని, వీరు పరాశక్తి పీఠముఁ బూజించువారని, సనాతనసూత్రమునఁ జెప్పఁబడియున్నది. దారుకావృత్తి యన కఱ్ఱపనిఁ జేయుటయే వృత్తిగాఁగల్గియుండుట యనియర్థము.

ఇంక నాంగ్లమున నీకళకు Carpentry అని పేరు. ఈపేరు Carpentum అను లాటిన్పదము నుండికల్గినది. కార్పెంటమనఁ బండియని యర్థము. పాశ్చాత్యదేశములందుఁ బ్రథమతః కఱ్ఱతో బండ్లను జేసియుంట నీపే రిట్లేర్పడనోపు. కాని పిదప రాను రాను కఱ్ఱతోఁ జేయఁబడు పనికంతకును వర్తింపసాఁగెను. ఇక్కాలమునఁ గార్పెంటరీకళ కఱ్ఱపనిగా (వడ్రముగా) నన్వయించెడిని. ఇండ్లు కట్టుట, సామానులుచేయుట మొదలగు సమస్తములగు కఱ్ఱపనులును కార్పెంటరీకళగనె పరిణమించియున్నవి.

అభ్యాసపూర్వకముగ విద్య నలవఱచుకొని గురుఁడు చెప్పినకన్నఁ బదివేలరెట్లుగఁ దనయూహాపోహలచే మొద్దుకఱ్ఱముక్కల నందముగ వేర్వేరు రూపములుగఁ గుమర్చునీకలఁగూర్చి వ్రాయఁబడినగ్రంథములు గానరాకున్నవి. గాని యిటీవలఁ బాశ్చాత్యులు దీనిని చక్కనిగ్రంథములుగ వ్రాసియున్నారు. Foul Sham's practical carpentry for Amatiears అను పుస్తకము విద్యాభ్యాస ప్రారంభదశయం దుపచరించునని చెప్పవలయును.

వడ్రమునం దారితేరిన విద్యావిశారదు లీక్రింద వివరింపఁబడిన ద్వాదశవిధులను మనస్సునందుంచుకొనిన శ్రేయమని యనుచుందురు. ఇవి యభ్యాసమువలన నెఱింగినవి.

౧ పనిఁజేయుకఱ్ఱ గుంపులు పగుళ్ళు వెలరు (పోటికిఁబోయిన కఱ్ఱ) తెటుకు (ఎండకుఁ జెటుకుఁబోయి వంకరగా మెలిదిరిగినది) మంచిపని కుపయోగింపరాదు. దీనిపైఁ జేసినపని ప్రశస్తమైయుండముగఁ గన్పించదు.

౨ పనిముట్లను చక్కనిపనుసునం దుంచుకొని యెప్పటికప్పుడు గమనించు చుండవలయును. వానిని చెమ్మకుఁగాని, యెండకుఁగాని, వానకుఁ గాని, యుప్పునకుఁగాని, సముద్రపుగాలికిఁ గాని,బహిరంగపర్చి వదలివేయరాదు. అట్లొనర్చిన నవి చక్కగఁ బనిఁజేయక నేర్పుఁగనపరుప నీయకుండును.

౩ చిత్రికయలుగులు పదునుగ నుంచఁబడుటయే గాక సరియగు మొన వెలుపలికుండునట్లుఁ జక్కఁగనమర్పఁబడవలయును. లేకున్నఁ జిత్రిక పట్టునపుడు దాటుచు కఱ్ఱపై గంట్లు పడఁజేయును.

౪ మేకులు, గుంపులు, తెటుకు, గలబల్లను చిత్రికఁ బట్టరాదు. పట్టకతీరనితఱి మేకులఁ బెరకివైచియు,గుంపులఁజెక్కివైచియు, తెటుకును, ముందు చెక్కిగాని, కోసిగాని సరిపుచ్చుకొనియు మరియుఁ జిత్రిక్కఁ బట్టవలయును.

౫ స్క్రూమేకులుగాని, తీగమేకులుగాని దిగఁగొట్ట బిగించునపుడు తొలుత నవసరమగు రంధ్రముఁ జేసి మరియు బిగించవలయుఁగాని బద్ధకించి కన్నములుచేయక నెంతమొత్తనికఱ్ఱయుండైనను మేకుండినఁగొట్టరాదు. కఱ్ఱయందు రంధ్రముఁ జేయఁబడక దిగఁగొట్టఁబడిన మేకు సరిగా బిగియకుండునని మనస్సునం దుంచుకొనవలయును. వంగిపోయినమేకును తిన్నఁజేసి తిరిగి దిగఁగొట్టుటచాలాతప్పు. తిరిగిసాఁగఁగొట్టితిన్న పేర్చుటతో మేకుసందలిపదును చెడిపోవును గాన సరియగు పట్టుఁబట్టదు. మరమేకు నెప్పుడును సుత్తితోఁ గొట్టరాదు.

౬ కోతపని వడ్రమునం దెక్కువగా నడచునది గాన దానింగూర్చి యెక్కువజాగ్రతఁ గొనఁదగినది. నూలువేసికొననిది కఱ్ఱను రంపముతోఁ గోయరాదు. ఎంతజాగ్రతగఁ జూచుకొనుచుండినను రంపము తిన్నగా నాడునటులఁ గఱ్ఱను తగినస్థితియం దొరఁగా నిలువంబెట్టుటయో లేక నొకయెత్తగు గట్టుబల్లపైఁ బరుండఁబెట్టుటయో చేసి రంపమున కిరుకు లేకుండ నాడునటులఁ దిన్నగఁ గఱ్ఱంగోయవలయును.

౭ కఱ్ఱపరిమాణమునకు మించినవలమును, పొడవునుగల మేకుల నుపయోగింపరాదు. ఇవి కఱ్ఱను పగులఁజేసి చెడఁగొట్టును. మంచఁపుఁ బట్టెలను కోళ్ళకు బిగించుతఱి వలముఁగల మరస్క్రూమేకుల బిగించుతఱి వీలగునంత వరకు బిగువుగాని రంధ్రములంజొప్పించి నిమ్మలతో (nut) తో బిగించవలెను.

౮ మేకుల తలలు కఱ్ఱలో దిగిపోయి మునిఁగి యుండునటుల గుమ్ములుతీసి దింపి బిగించి పైని కఱ్ఱమక్కురాసి సరిపుచ్చి నునువుఁజేయవలెను. ఈకఱ్ఱమక్కును Putty యని యెదరు.

౯ కఱ్ఱయందు వంగిపోయినమేకులను,విరిగిపోయిన మేకులను బద్ధకపడి యటాగఁగొట్టి వదలివేయరాదు. ప్రయత్నించి వాటిం బీకివైచి తిరుగ వేరుమేకులతో బిగించుట సమంజసము. మేకులు కన్నములు సరిగాక వచ్చుచో నిట్టి దుస్థితి సంభవించునని మనసునం దుంచుకొనవలయును.

౧౦ వడ్రపుఁబనిముట్లలో నేపని కేది నిర్ణయింపఁబడినదో, ఆయా పనికే దానిని వాడవలెఁగాని వేరుపని కాపనిముట్టును వాడుట తప్పు. అందువలన నాపనిముట్టును నాపనియుఁగూడఁ జెడునని మనసునం దుంచుకొనవలెను.

౧౧ తొలచునప్పుడు వేర్వేరుపరిమాణములుఁ గల యులుల నుపయోగింపుచుండవలెఁగాని యులులను మార్చుటకు బద్ధకపడరాదు. ఇందు వలనఁ బని శుభ్రితం గోల్పోవుటయు, శ్రమ యధికమగుటయు సంభవించును.

౧౨ బాడిదను కఱ్ఱఁజెక్కుటకుమాత్ర ముపయోగింపనగుఁగాని దానిందిరుగవైచి సుత్తితోఁగొట్టినట్లులులపైఁ గొట్టరాదు. బాడిదతోఁగొట్టిన దెబ్బ యావసరముకన్న నధికముగఁ దాకుటయే గాక నేదోయొకవైపున కధికమగు నొత్తిడిఁ గల్గించు దెబ్బలందగులఁ జేయును. ఉలిపై మోదుట కెప్పుడును సుత్తులే తగినవి. చిన్న దెబ్బలుకొట్టుట కినుపసుత్తులే తగినవి. ఇంకను మరియుఁజిన్న దెబ్బలకుఁ గఱ్ఱసుత్తులను వాడుట యెక్కువచక్కని పనినొసంగెడిని.

కుసులను దొలకలఁ దొలిచి వానియందు బిగించుటకు సర్వసుమక్కుఁ గరిగించి బిగింతురు. ఇత్తటిఁ గొందరు కఱ్ఱమేకులను (ముచ్చలను) కూడ బిగించుటఁ గలదు. గొప్పగొప్ప పనివారం డ్రిది దురభ్యాసమనియు కఱ్ఱమేకులం బిగించుటఁ గఱ్ఱకు నష్టముఁగల్గించుట యనియు ననుచున్నారు. విధిలేనితావులం దప్ప కఱ్ఱమేకులను బిగించుట తగదు.

అన్నిటికిని ముఖ్యముగ గమనింపఁదగినది యే పనుల కే కఱ్ఱ లర్హమైనవో పనివాఁడెఱింగి యుండ వలయును. దానిం దెలియక సరిపోనికఱ్ఱ నుపయోగించిన పని నిరర్థకమగు శ్రమగఁ బరిణమించును.

చక్కనిపని కావలయుననిన మంచిపనిముట్లు విరివిగ నుండవలయును. అవి మంచిపదునులు గల్గి యుండవలయును. వడ్రముపొడవును కమ్మరము కఱుచయని లోకోక్తి గలదు. అనగాఁ గఱ్ఱయెప్పుడును పొట్టికారాదు. ఇనుపపనియం దెప్పుడును పొడవు పనికిరాదు.

## వడ్డించేవాఁడు వశమైతే కడబంక్తిం గూర్చున్న నేమి?

(ఆంధ్రలోకోక్తి.)

**వడ్డెలు:**—వీరుత్కృష్టులుఁ గారు. ఉప్పరులఁ బోలిన గొనుకకులమువారు. గాన కొందరు వీరిని వడ్డియుప్పరుల నుటయుఁ గలదు. వీరియుత్పత్తినిఁ దెల్పు గ్రంథములు లేకున్నను వీరియందనుశ్రుతముగ నున్న వాడుకనుబట్టి పరమేశ్వరుఁడగు శివుని దేహఘర్మ జెమ్మటబిందువునుండి యొకపురుషుఁడును పార్వతిమేని చెమటబిందువునుండి యొక స్త్రీయును నుద్భవించిరనియు వారే యీజాతికి మూలపురుషులగు నాదిదంపతులనియు వారిసంతతి వారే వడ్డెలు నాఁ బరఁగువారనియు వారందురు. భూమిం ద్రవ్వుట నూతులు చెరువులు ద్రవ్వుట వృత్తిగాఁగలవా రాంధ్రులు. వివాహములందు వీరికి నల్లపూసలు తాళిబొట్టుగను వక్కలిగను జెప్పుదురు.

## వడ్లు ముత్తుపము పిచిక లౌరుత్తుము:

— రాఁబడి స్వల్పము, ఇంటతినేవా రధికము సనిభావము (ఆంధ్రలోకోక్తి.)

**వణుకూరి గుర్వరాజు:**— యీ కవిం గూర్చి యేమియుఁ దెలియరాకున్నది. ఈతఁడు శమంతకమణి చరిత్రమును రచించిన ట్లప్పకవీయమునఁ జెప్పఁబడియుండుటకన్న నా గ్రంథముఁగాని యితరిపరికరములుగాని గానరావు.

**వత్సకుఁడు:**—యదుసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. వసుదేవుని తమ్ముఁడు. తండ్రిశూరుఁడు లేక శూరసేనుఁడు.

**వత్సగోత్రము:—**
[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.]

**వత్సదూతము**
(బాణాగ్రములు చూడుఁడు.)

**వత్సదేశము:—**
(వంశదేశము చూడుఁడు.)

**వత్సనాభి [వసనాభి]:—**
(నాభి చూడుఁడు.)

**వత్సమహారాజు:—** ఈతనినుండి వంశదేశము వత్సదేశ మాయెనఁట. రాజధాని కౌశాంబీ నగరము. అలహాబాదు ప్రాంతమున నిప్పుడు 'కోశాం' అనఁబడుచున్నది. దీని కొకప్పుడు వత్సపట్టణమని పేరుండెనఁట. ఇతఁడు బౌద్ధమతస్థుఁడు. పాండవులరాజధానియగు హస్తినాపురము నదియందుఁ గలసిపోవ నాభూపతుల కిది రాజధాని యాయెనఁట. భార్యపేరు 1 వాసవదత్త లేక (ధారుణీదేవి). ఇతర భార్యలు:— 2 ఇరావతి. 3 రత్నావళి.

**వత్సరుఁడు:—** ధ్రువుని రెండవసుతుఁడు. భార్య సర్వర్థి. కుమాళ్ళు పుష్పార్ణుఁడు, చంద్రకేతుఁడు, ఇషుఁడు, ఊర్జుఁడు, వసువు, జయుఁడు. (ఆర్గురు).

**వత్సుఁడు:—** బృహదిషుని సంతతి. తండ్రి సేనజిత్తు. మరియుఁ గాశ్యులలోఁ బ్రతర్దనుఁడను నామాంతరముగల వత్సుఁ డొకఁడు గలఁడు. (కువలయాశ్వుఁడు, ఋతుధ్వజుఁడు). కుమారుఁ డలర్కుఁడు.

ఇంకను కంసునిభటులలో నొకవత్సుఁడు గలఁడు. అతఁడు శ్రీకృష్ణునిచే నిహతుఁడైన వాఁడు.

**వత్సావనగోత్రము:—**
(విష్ణువృద్ధ ఉపగణముఁ జూడుఁడు).

**వదతోవ్యాఘాతన్యాయము:—**
దీనిని స్వవచనవ్యాఘాతన్యాయమని యు నందురు. తానన్నమాటలవలననే తనభావమునకు బాధ కల్గుటయని తాత్పర్యము.

"నాతల్లి గొడ్రా"లని చెప్పుటవలనఁ దానెట్లు జన్మించెనని బాధ కల్గును. ఇది స్వవచన వ్యాఘాతదోషము.

**వదనిక:-**
(బదనికఁ జూడుఁడు).

**వధ్యఘాతకన్యాయము:—** చంపఁదలంపుఁగలవాఁడు ఘాతకుఁడు. ఎవనిం జంపఁదలంచెనో వాఁడు వధ్యుఁడు. వీరిద్దరుఁ గలసియుండఁ బొసఁగదని యర్థము. ఇట్టిపరిస్థితులసంబంధి విరోధపదార్థములఁ జెప్పుట కీన్యాయము వర్తించును.

**వధికగోత్రము:—**
(పరాశరగణముఁ జూడుఁడు).

**వధూమాషమాపనన్యాయము:—**
దీని కొక మిథిలదేశమునఁ బ్రచార మొందియున్న కథ గలదఁట. ఒకలోభియగు ధనవంతు నింటికి ముష్టికివచ్చిన బిచ్చగాండ్రకుఁ బిడికెడేసి బియ్యమును భార్యచేత వేయించుచుండువాఁడఁట. ఆమె కొంతత్యాగినిగాన భర్తకు వెఱచియు బిచ్చమునం దధికము వైచుచుండునఁట. ఆతఁ డనుమానించుచుఁ జిన్నపిల్లయగు కోడలు (చిన్న) చేత బియ్యము తక్కువవచ్చునని తలంచి కోడలిచే బిచ్చము వేయించుచుండుమని విధించెనఁట.

ఈన్యాయమును లోభత్వపు యోచనలఁ దెల్పుటకు వాడుచుందురు.

**వనజగణము:**— ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి.

౩ వనజగణము:—ఇం దైదుగోత్రములు గలవు.

౧ వనజర్షిగోత్రము:— వనజ, వానజ, భాస్వత, తపన, తాపన యను పంచార్షేయప్రవరఁ గలది.

౨ భాస్వతర్షిగోత్రము:—భాస్వత, తపన, తాపన, మధు, మాధవ, యను పంచార్షేయ ప్రవరఁ గలది.

౩ మధుఋషిగోత్రము:— మధు, మానుమతి, సర్వభద్ర, యను త్రియార్షేయప్రవరఁగలది.

౪ చిత్రవసుఋషిగోత్రము:—చతుర్బాహు, సుమతి, చిత్రవసు, యను త్రియార్షేయ ప్రవరఁగలది.

౫ తాపనర్షి గోత్రము:— వనజ, వానజ, తాపన, యను త్రియార్షేయ ప్రవరఁ గలది.

(ఋక్శాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు).

**వనవాసపురము (క్రౌంచపురము):**- (వైజయంతపురముఁ జూడుఁడు. వైజయంతి దేశముఁ చూడుఁడు.)

**వనవాసిదేశము:**—
(వైజయంతి దేశముఁ జూడుఁడు).

**వనసింహన్యాయము:**— ఇది హ్రదనక్రన్యాయము వంటిది. వనమునం దొకసింహ ముండిన నాసింహమునకు వనము రక్షకము. ఇంకను వనమున సింహముండినకతన నట కెవ్వరు నేగకె వెరతురు గాన నవ్వనమును ఛేదించుట కెవ్వరును సాహసించి యట కేగరు. ఇందువలన సింహమును వనమును నన్యోన్యరక్షితము లగునని భావము. అట్లే చెరువునందు మొసలియుండిన నామొసలి చెరువునందురక్షితమగుటయెగాక చెరువును మొసలివలన [ఇతరులు వెఱచి యట కేగనికారణమున] రక్షిత మగుచుండును.

అన్యోన్యసహారక్షిత పరిస్థితులయం దీన్యాయము వాడుచుందురు. ఇట్టిన్యాయముల కన్యోన్యాశ్రయన్యాయములనియుఁ బేరు కలదు. ఇదియే దీనియర్థము.

**వన్ మేన్ కంపెనీ (One man compeny):**— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. పద్ధతులమేరకుఁ గంపెనీయం దెందరు వాటాదార్లన్ని వాటాలుండితీరవలసియున్న నావిధులు నెరవేర్చుట కన్న వారుతప్పఁ దక్కినస్వామ్యమంతయు నొకనిదే యగు Company లేక నట్టిసంస్థలోఁ దక్కినవారిపై నొక్కఁడు స్వతంత్రతఁగల్గియుండెనను నట్టిసంస్థకీపేరు వర్తించెడిని. ఇటుల మార్కెట్టునకంతకును గల్గియుండినను నొకవర్తకుఁడు పరిధానాయకుఁడై తక్కినవారిపై స్వతంత్రతఁ గల్గియుండిన దానిని One man market అందురు.

**వన్నె (Carat) (బంగారపు):**—
(కేరటన్ చూడుఁడు.)

**వన్నెలవిసనికఱ్ఱ:**— ఆంధ్రభాషాసాంప్రదాయార్థపదము. లేనిపోనిచక్కదనములను తీర్చిదిద్దుకొనుచుండుదు సొగసుకాని విట్లనుచున్నారు.

**వన్యగ్రామము:**— దీనిని బనిజగ్రామమనియు నందురు. తిరుహూత్ డివిషనులోని ముజాఫర్పూరుజిల్లాలోఁ దొల్లిటివిశాలీ (బెసాడ్) పురములోని యొకభాగమై యుండెను. (కుందగ్రామముఁ జూడుఁడు. మగధదేశము, విశాలీపురముఁ జూడుఁడు.)

**వనాయుదేశము:**— దీనికి యవనదేశమనియుఁ బేరు కలదు. మహమ్మదీయులు 'జజీరా-అలరబా' అనియెదరు. దానినుండియె పాశ్చాత్య

లం దరేబియాయనుపేరు కలిగెను. (దీని కెడారి దేశమని యర్థము.)

శబ్దస్తోమమహానిధియను గ్రంథమున వనాయుదేశ మరబ్బీదేశమని చెప్పఁబడినది. రామాయణము నాదికాండమున నీదేశఁపుటుత్తమాశ్వముల ప్రశంస కలదు. కౌటిల్యుని యర్థశాస్త్రమున నీదేశఁపు టుత్తమాశ్వములు పేర్కొనఁబడినవి. వరాహమిహిరాచార్యుఁని బృహత్సంహితయం దర్చదేశమని వాడియున్నాఁడు. మక్కానగరము, మదీనా, [అల్మదీనాతున్నబీ బోధకునినగరము] జిడ్డారేవుపట్టణము, మోఛాపురము, నిందలి పట్టణములు. [అరేబియాదేశముఁ జూడుఁడు.]

**వపుష్ప**:- కాశిరాజుకుమా భా [మూఁడవ] జనమేజయుఁ డని భారతమునందు చెప్పబడి ప్రశంసింపఁబడినది.

**వయాలెక్టియా** (Via Lactea):— మిల్కీవేఅనియు నందురు. (గెలాక్సీ చూడుఁడు.)

**వరకురేకులు** (gold & silver leafes):- అపరంజిగాని, వెండిగాని పూతపూయుటకుఁగాను తీయఁబడిన పలుచనిరేకులు. ఒకంగుళమున ౨౯౦౦౦౦ భాగము దళసరి యుండునందురు. వీనిని విలువఁగలమాత్రి (ఔషధము) లకు పూటుపోకుండఁ బైనిచుట్టుటయుఁ గలదు. ఆయుర్వేదవైద్యులు రక్తశుద్ధి మొదలగుకార్యముల నౌషధములందు వీనిని గలుపుదురు.

**వరంగల్లు**:—
(ఏకశిలానగరముఁ జూడుఁడు — తెలింగానాదేశముఁ జూడుఁడు.)

**వరగోగుచెట్టు**:— లా. Salvadara wightana. ఆంగ్ల. Tooth brush tree. సం. పీలుః (పెద్దవరగోగు లేక జిట్టువరగోగు) శ్యామః (చిన్నవరగోగు). ఇది గోగుజాతిదైనను వేరుభేదములు గలది. ఇది చిన్న పెద్దభేదములచే ద్వివిధము. పెద్దజాతికి జిట్టువరగోగనియుఁ బేరు కలదందురు. దీనివేరు చెక్కలరసకషాయములను మిక్కిలివేడిఁ జేసి దారుణవాతములు శూలలు, సూతికావాతములు, సన్నిపాతము, అంతర్గతజ్వరముల నిర్మూలించి ఋతుబద్ధమును భేదించుననియుఁ జెప్పఁబడినది.

ఇది పొక్కుంగాను పైకి రాచుతటి జాగ్రి గోనవలె నందురు. దీనిపండు కాక, పైత్యముఁజేసి విరేచనము వెడలించిత్రిదోషముల శమింపఁజేయును. మఱియు క్రిమి, గుల్మము, మూలవ్యాధుల నివారించునని చెప్పుదురు. (గోలుగుచెట్టుచూడుఁడు.)

**వరగోష్టిన్యాయము**:— ఆఁడుపిల్లకు సంబంధము నరయ నేగినవారితరప్రసంగముల మూలమున భోగట్టాలంజేయుచుఁ బ్రయత్నించుననిదీనియర్థము. తనమనస్సులోని కోర్కెఁ దెలుపక యన్యులతో నితరప్రసంగములద్వారా వార్తలం దీయగోరువారినిగూర్చి యీన్యాయము వాడుదురు.

**వరండి లేక వైరండిగోత్రము**:—
(అగస్త్యుఁడుపగణము చూడుఁడు.)

**వరదచతుర్థి**:—(కుందచతుర్థి చూడుఁడు.) మాఘశుద్ధచతుర్థి కీపేరు కలదు. వరప్రదాయినీ గౌరీదేవిం బూజింతురు.

**వరధనులు**:—బాణుని హర్షచరిత్రయందు వివరింపఁబడిన హర్షవర్ధనుఁ డీ సంతతివాఁడే!

క్రీ. వె. ఏఁడవశతాబ్దమున స్థానేశ్వరము రాజధానిగ రాజ్య మేలినవాఁడు.

**వరణ [పురము]:—** ఇది వ్యాకరణసూత్రములు రచించిన పాణిని నివాసస్థలము. ఇప్పుడు దీనిని 'ఓర్నోస్' అని యాంగ్లేయులు వాడెదరు. పాంచాలదేశమున సింధునదిపై యటాక్‌పట్టణమున కెమురుగ నాపరిసరముల నేటికిని బరణమను పేరుఁగల చిన్నపట్టణమున్నది. [నదిపడమటిగట్టుపై నని యెఱుంగునది.]

కన్నింగ్హామ్‌సేనాని దీనిని పెషావరుమండలమున 'ఓహిండు'నకుఁ బశ్చిమముగ ౧౬ మైళ్ళలో నని చెప్పియుండెనుగాని యది సరికానేరదు.

**వరపుద్యకపోతః శ్యేమయురాతిన్యాయము:—** రేపు నెమిలిపిట్టయనుట కన్న నేఁడొకపావురమనినను శ్రేష్ఠమే 'వరఃసాంశయికాన్నిష్కాదసాంశయికః కార్షాపణః' (చూడుఁడు.)

**వరరుచి [కాత్యాయనుఁడు]:—** పాణిని సూత్రములకు వార్త్తికము వ్రాసినవాఁడు. మగధ రాజ్యమేలిన మహానందుఁడనుపేరుగల కడపటినంద భూపతికడఁ బ్రధానులలో నొకఁడుగ నుండిన వాఁడు.

(మగధరాజ్యముఁ జూడుఁడు.)

వేఱొకవరరుచి ప్రాకృతభాషకు వ్యాకరణము రచించినవాఁడు గలఁడు. ఆతనితండ్రి చంద్రశర్మ. సోదరులు విక్రమార్కమహారాజు, భట్టి, భర్తృహరి, అనువారలు. [ఉజ్జయని చూడుఁడు.]

**వరలక్ష్మీవ్రతము:—** స్త్రీలకు వివాహమైనదాదిగ సౌమంగళ్యమున్నంతదనుక నేటేట శ్రావణమాసములందలి ప్రతిశుక్రవారమునకు వరలక్ష్మీదేవిని (మహాలక్ష్మిని) పూజించుచు నీవ్రతమాచరించెదరు. ఇది సౌమాంగల్యమును, నైశ్వర్యమును, భద్రపర్చుటకై నవ్రతమని చెప్పఁబడినది. ఇందుఁ బూజింపంబడునది స్వర్ణరూపము. ఇటీవల స్వర్ణమయ లక్ష్మీరూపములకుఁ బదులు కాసులు, మొహరులు, డాలరులు వాడఁబడుట ప్రారంభమైనటులఁ దెలియుచున్నది. ఈవ్రతము నకుఁ బ్రధానస్థానములు గంగాయమునా నదులు సంగమించుతావులు (మాధవప్రయాగలేక అలహాబాద్) ను తుంగభద్రానదితీరములందును నని చెప్పంబడినది. ఆవ్రతాచరణమున కివి పేరందినవి. రవి కర్కటకరాశి యందుండుతఱి శ్రావణమాస శుక్లపక్షమునఁ బౌర్ణమికి ముందరి శుక్రవారమున నీవ్రతారంభమునకు యోగ్యమని చెప్పఁబడినది. స్త్రీల సౌమంగల్యరక్షణ, మైశ్వర్యరక్షణలకై యీ వ్రతము చెప్పఁబడినది. సర్వసాధారణముగ దీనిని శ్రావణశుక్రవారములనోమని యందురు.

**వరాలాటకొంకణము:—** సప్తకొంకణములలో నొకటి. [కొంకణదేశముఁ జూడుఁడు].

**వరాలాటదేశము, వరలాటదేశము, బరాలాట:—** ఇది సప్తపరశురామక్షేత్రములలో నొకటి. ఇప్పుడు బీరార్సు లేక బరారనుచున్నారు. తొల్లింటివరాలాటలో నైజాంరాజ్యమున కెక్కువభాగము చేరిపోయిన దనుచున్నారు. తొల్లింటి హైలాహారులరాజ్యమైయుండి పిమ్మట యాదవులపాలనకుం జేరెనఁట. ఇది పదమూఁడవ శతాబ్దకాల మఁట.

వశ్యపురము రాజధానియని చెప్పఁబడినది. ఇది త్రైశిక్యపురమనియు వాడుక నొందెనఁట. రానురాను బస్యమై యిప్పుడు 'బేసిన్' అనఁబడుచు బొంబై రాజధానియం దున్న పురము. దీనింగూర్చి బ్రహ్మపురాణము ౨౭ అధ్యాయము

నను కన్యారీశాసనములందును ప్రశంసలు గానబడు చున్నవి.

విమల- లేక నిర్మలక్షేత్రము మాదేశములోనిది. స్కాందపురాణప్రసిద్ధము. ఇట విమలేశ్వరశివలింగ ముండెనట. ఈదేవస్థానమును పోర్చుగీసుమహా నీయులు భగ్నముచేసి రనుచున్నారు.

**వరాహకల్పము:—** బ్రహ్మగారియొక్క నాయుః ప్రమాణమునఁ గడపటిసగము. ౮౬౪ కోట్ల మనుష్యసంవత్సరములు బ్రహ్మకొకదినము. అట్టిదినముల ౩౬౦ అగునేని బ్రహ్మకొకసంవత్సరము. అట్టివత్సరములు ౧౦౦ బ్రహ్మాయుః. అనగా ౩. ౧౧౦౪౦౦౦ సంవత్సరములని భావము.

**వరాహక్రాంత (చెట్టు):—** ఒయొక యోషధి. దీనిని సంస్కృతభాషయందు మధుపర్ణికా, మధుపర్ణి యనివాడెదరు.

**వరాహద్వాదశి:—** మాఘశుద్ధద్వాదశి. దీని నింకను బ్రహ్మోదద్వాదశి యనియుఁ దిలద్వాదశి యనియుఁగూడ నందురు. (పండుగలుచూడుడు)

**వరాహపర్వతము:—**(ఋషభపర్వతముఁ జూడుఁడు. కాశ్మీరదేశముఁ జూడుఁడు.)

**౧౨ వరాహపురాణము (వారాహము):—** ఇది కూర్మపురాణమునను, దేవీభాగవతమునను పదునొకండవపురాణముగను తక్కిన వానియందుఁ బండ్రెండవపురాణముగను చెప్పఁబడిన పురాణము. వరాహప్రోక్తము. గ్రంథసంఖ్య ౨౪౦౦౦.

**వరాహమిహరుఁడు:—** జ్యోతిషవేత్త. బృహత్సంహితయను ప్రసిద్ధ జ్యోతిషగ్రంథమును రచించినవాఁడు. బృహజ్జాతకము రచించినవాఁడు. ఉజ్జయినిలో విక్రమార్కమహారాజాస్థానమునం దుండిన మహారత్నము లనఁదగిన విద్వాంసులలో నీతఁడొకఁడు.

(ఉజ్జయినిచూడుఁడు. అవంతిదేశము చూడుఁడు.)

**వరాహమూలపురము (బారామూలా):—** ఇది కాశ్మీరములోనుండిన యొకక్షేత్రము. వరాహమూల మని పేరు. ఇచ్చటి వరాహస్వామిదేవళము మహమ్మదీయులచేఁ బాడుచేయఁబడినది. ఇప్పుడు బారామూలాయనుపేరఁ బరగుచున్నది. ఇచటిపర్వతమునకు వరాహపర్వత మని పేరు. జీలమ్ (శతద్రు) నదీతీరము.

(కాశ్మీరదేశముఁ జూడుఁడు).

**వరాహక్షేత్రము (తొల్లిఁటివ్యాఘ్రపురము):—** పురాణములందు విష్ణుదేవుఁడు వరహావతారమెత్తినతావు వ్యాఘ్రపురమని చెప్పఁబడినది. తరువాత వరహావతారమునుండి దానికి వరాహక్షేత్రమని పేరయ్యెనందురు. పిదపఁ గొంత కాలమునకు దానికో లేక నాపరిసరమునకో 'కోలీ' పురమని పేరయ్యెనని పరిశీలనలవలనఁ దేలినది. కోలీపురము సుప్రబుద్ధభూపాలుని రాజధాని. సుప్రబుద్ధమహీపతి బుద్ధభగవానుని తల్లియగు మాయాదేవికిఁ దండ్రి.

వరాహక్షేత్రమనుపేర కాలమునఁ గేవలము మాసిపోయినట్లగుపడను. ఇప్పుడు బెంగాల్ నార్తువెస్టరన్ రెయిల్వే (B. N. W. R.) 'ట్రెనిచ్' అనుస్టేషనునకుఁ దూర్పుగ రెండుమైళ్ళ దూరమున కువానానదియొక్క కుడివైపున నదిపైఁ గట్టఁబడిన రెయిల్వేవంతెన కరమైలుదూరమున బారాఛత్రి యను పేరుగల చిన్నగ్రామమును తొల్లింటి వరాహక్షేత్రమేనని (తొల్లింటివ్యాఘ్రపురము) పోల్చియున్నారు.

మరియు హోషింగాబాద్ కుమాన్ రెయిల్వే పైనున్న 'సోరోన్' అనబడినతావును చాలా పురాతనస్థలమనియు, తొల్లింట 'ఉకలక్షేత్ర' మను పేరం బరగుచుండెననియు, విష్ణుదేవుడు వరహావతారమున హిరణ్యాక్షునిం దునిమినపిదప సూకరక్షేత్ర మని పేరయ్యెననియు నిప్పుడు బృహద్గంగానదీ తీరమందెత్తగు గుట్టపైనున్న 'కిలా' యనబడు తావు సూకరక్షేత్రమనియుం జెప్పుచున్నారు. దానిని వేణుచక్రవర్తి నిర్మించెనట. (ఉత్తరపాంచాలదేశముం జూడుడు). ఇప్పు డాతావున సీతారామస్వామి దేవాలయము కలదు.

సోరోన్ పట్టణమునకు వాయవ్యదిశగా వరాహస్వామి లక్ష్మీదేవి దేవాలయము కలదు. ఇటనేటేట నఘాన్ మాసమున మార్గశీర్షయుత్సవము జరుగును. ఇది హిరణ్యాక్షవధ జ్ఞాపకార్థమట. అత్తఱి పెక్కుజనులు తండములుగ నేతెంచి బృహద్గంగ యందును నచటికి నాల్గుమైళ్ళదూరముననున్న గంగానదియందును స్నానములాచరించుచున్నారు.

దీని నిజస్థితులను పరిశీలకులు పరిశీలించవలసి యుండును.

## పరిపంట ధాన్యముల యిరువది యారు జాతిభేదములు:—

సీ॥ ఇప్పపూ రాజనా, లేనుంగుకొమ్ములు
 ఆకుసన్నంబులు, నాట్రిగడలు
కప్పురభోగులు, కస్తురిపట్టియల్
 గుత్తిమల్లెలు, చిటిముత్తియములు
రామసాగరములు రాజనములు తీగె
 సరులు, ముస్తెలు, ముత్తెసరులు, రెక్క
పాయలు, నక్కల్లు, బంగారుతీగెలు
 మదనగంధులు, తీగమల్లియలును

తే. కాకిరెక్కలు, చిరిపూలు, గండసరులు
 చందమామంపుం బూల్నాగసాగరాలు
 పాలుమీగడలును సుకవాసులనంగ.
 ధాన్యభేదములై యొప్పు దానవారి.

ఆంధ్రపదనిధానము (నిఘంటువు)

దీనిని రచించినది తూము రామదాసకవి. శేషాద్రిరమణకవుల 'కాకతీయగ్రంథమాల' యను బంధగ్రంథముగం బ్రకటింపంబడినది. ౧౫౬౫ పద్యములుంగల నిఘంటువు. ఇందు నామలింగానుశాసనముంబోలి కాండములు, వర్గములు విభజింపం బడియున్నవి.

## వరిపైరునకు ఎరువు:—

వరిపైరునకుం దఱుచుగా నుపయోగింపంబడు నెరువు లావుపేడ, పిడుకలకచ్చిక, చెరువుమన్ను, సరుగుడాకు, నానుదంపుంబిండి, వేరుసెనగపిండి మొదలగునవియై యున్నవి. ఆవుగెత్తము నుపయోగించు వ్యవసాయదారు లేదేనియొకపద్ధతిపై నుపయోగించుచున్న ట్లెక్కడను గానరాదు. దొరకినంతవఱకు వరిమళ్ళలోం బోయుటయే వారి కలవాటు. బీగా యొక్కటికి కొకమణుగు చమురుపిండి వేసినం జాలును. చెరువుమట్టి మూండునాలుగుసంవత్సరముల కొక్కొక్కపరి వేయంబడు చుండును. ఒక్కొక్కయకరమునకు ముప్పదిమొదలు వంద బండివఱకును మట్టిపోయుచుందురు. ఎన్నుబది పౌనుల యెముకలపొడియు, నెనుబదిపౌనుల సురేకారమును నొక్కొక్కయెకరమునకుం బోసిన యెడలం జమురుం బిండి వేసినదానికన్న మంచిది. పంటయు నంతకన్న నధికముగా ఫలించును. చవిటిభూములకును నుబ్బనభూములకునుం బ్రత్యేకముగం బైనుదహరించిన యెరువుల నుపయోగింపవలయును.

**వరుణతీర్థము (సలిలరాజతీర్థము):-** సింధునదీసముద్రసంగమమునఁ గలతీర్థము. దీనిఁ గూర్చి మహాభారతము వనపర్వము ౮౨ అధ్యాయమునఁ బ్రశంస కలదు. మరియు వరుణానదికి సలిలరాజమని పేరున్నటుల మహాభారతోద్యోగ పర్వ ౯౭ అధ్యాయమునఁ జెప్పఁబడినది.

**వరుణపర్వతము:—**
(మగధరాజ్యముఁ జూడుఁడు.)

**వరుణపురము:—**
(ఉచ్చనగరముఁ జూడుఁడు.)

**వరుణసాలురు:—** వీ రాంధ్రబ్రాహ్మణులలో నొకశాఖవారై యున్నారు. (ఆంధ్రబ్రాహ్మణులు చూడుఁడు.)

**వరుషపురము [బరుషపురము]:—** దీనిని యూసుఫ్ జాయిదేశమున సహాబ ష్ ఘుర్ గాఁ బోల్చియున్నారు. పెషావరుపురమున కీశాన్యదిశగ నలుఁబదిమైళ్ళదూరము. హ్యూయనత్సాంగు దీనిని పోలూషా యని వ్రాసుకొని యున్నాఁడు.

**వరేంద్రదేశము (బరేంద్రదేశము):-** తొల్లింటి పుండ్రదేశమునకు రాజధానియగు మహాస్థానపురమునకే బరేంద్రి లేక వరేంద్రపురమని పేరు కలదు. ఆప్రాంతదేశము వే రొకప్పుడు వరేంద్ర లేక బరేంద్రదేశమని పేరు పాలనమునఁ జిన్నదేశమై యుండె నేమో యని తలంపఁబడుచు చున్నది.

పరిశీలకులు గోమస్తపూర్, నవాబుగంజి, గజోల్, మాల్డా ఠాణాలం గల్పిన నగు రాజ్యము గాఁ దలంచుచున్నారు.

**వర్గత్రయము:—** తండ్రి, తాత, ముత్తాత లకు వర్గత్రియ మందురు.

**వర్ణము:—** శిల్పశాస్త్రమునఁ జెప్పఁబడిన నిర్మాణములకు వలయు వర్గాకారముల కీ పేరు వర్తించును. (శిల్పశాస్త్రముఁ జూడుఁడు.)

ఇది పంద్రెండుభేదములు కలది. ఆయము, తిథి, వారము, నక్షత్రము, లగ్నము, యోగము, కరణము, అంశము, ఆయువు, ధనఋణములు, అధిపతి లేక దిక్పాలకుఁడు; భూతము నను నవి భేదములు. ఇంకను గ్రహబలముఁగూడ నరయం దగినదని భరద్వాజమతమునఁ గలదు.

౧ ఆయము:—పదమును (సంఖ్యను) తొమ్మిదిచే గుణించి యెనిమిదిచే భాగించగా మిగిలిన సంఖ్య 'కాయ' మనిపేరు. ఇవి ౧ ధ్వజాయము (ధనప్రాప్తి), ౨ ధూమాయము (దుఃఖకరము), ౩ సింహాయము (జయకరము), ౪ శ్వానాయము (భయప్రదము), ౫ వృషభాయము [ధనలాభము], ౬ ఖరాయము [రాజభీతికరము], ౭ గజాయము [సౌఖ్యప్రదము], ౮ కాకాయము [దేహపీడలు].

౨ :—పదము నెనిమిదిచే గుణించి యెదుచే భాగింపగ మిగిలిన సంఖ్యకుఁ దిథియని పేరు. తిథులం దమావాస్యయు, నందతిథులు, రిక్తతిథులు [శూన్యతిథులు] వాస్తుగణితమం దయోగ్యములు. తక్కినతిథులు యోగ్యములు.

౩ వారము:—పదము నారుచే హెచ్చించి యేడుచే విభాగించగా మిగిలిన సంఖ్యను వారముగ నెఱుంగవలయును. సోమ, బుధ, గురు, శుక్ర వారములు యోగ్యములు. మంగళవారము, శనివారము తగదు.

౪ నక్షత్రము:—పదము నెనిమిదిచే గుణించి యిరువదియేడింటిచే భాగింప మిగిలిన సంఖ్య నక్షత్రసంఖ్య. ౨ భరణి, ౩ కృత్తిక, ౯ ఆశ్లేష, ౧౧ పుబ్బ, ౨౦ పూర్వాషాఢ, ౨౫ పూర్వాభాద్ర లయోగ్యములు. తక్కిన నక్షత్రము లర్హనక్షత్రములు.

౫ లగ్నము:—పదమును మూటిచే గుణించి పండ్రెండుచే భాగించగా మిగిలిన సంఖ్య లగ్నరాశి నెఱిఁగించునది. వృషభ, సింహ, వృశ్చిక, కుంభ రాసులు యోగ్యములు. మిథున కన్యా ధను ర్మీనరాసులు మధ్యమములు. మేష, కర్కట, తులా, మకరము లనర్హరాసులు. అనగా వాస్తుకర్మకు స్థిరరాసులు యోగ్యములనియు, ద్విస్వభావరాసులు మధ్యమములనియు, చరరాసుల యోగ్యములని యెఱుఁగునది.

ఇంకను వరాహసంహితయందు వృషభ, మిథున, కర్కటక, కన్యా, తులా, ధను ర్మీనరాసులు వాస్తుకర్మయం దర్హములనిచెప్పఁబడినవి.

యోగము:—పదమును నాల్గుచే గుణించి యిరువదియేడుచే భాగించగా మిగిలిన సంఖ్య యోగముం దెలుపును. వ్యాఘాతము, గండడము, శూల, వ్యతీపాత్, వైధృతినామ యోగము లయోగ్యములు. తక్కిన వర్హయోగములు.

౭ కరణము:—పదమును పదునేనుచే గుణించి పదునొకండుచే భాగించగా మిగిలిన సంఖ్య కరణములం దెల్పెడిని. కిమస్తుఘ్నము, నాగకరము, అయోగ్యములు. తక్కినని వాస్తుకర్మ కర్హకరణములు.

౮ అంశము:—పదమును ఆరుచే గుణించి తొమ్మిదిచే భాగించగా మిగిలిన సంఖ్య (నవాంశ) అంశమును దెల్పును. ౧ నష్టాంశ (అయోగ్యము), ౨ వృద్ధి, ౩ స్త్రీ. ౪ మృత్యువు (ఇది అయోగ్యము), ౫ బహునాంశ (అయోగ్యము), ౬ చోరాంశ (అయోగ్యము), ౭ పుత్రాంశ ౮ గోకులాంశ, ౯ కీర్తి, ఇం దయోగ్యాంశలు వదలవలెను. తక్కినవి యోగ్యములు.

౯ ఆయువు:—పదము నెనిమిదిచే గుణించి నూటయిరువదిచే భాగింప మిగిలిన సంఖ్య యాయుః పరిమాణవత్సరములఁ దెల్పును. దీర్ఘాయువు యోగ్యము. మధ్యాయువు మధ్యము. అల్పాయు వనర్హము.

౧౦ ధనఋణములు:— పదసంఖ్యను మూఁడుచే గుణించి యెనిమిదిచే భాగింప మిగిలిన సంఖ్య ఋణముం దెల్పును. ఎన్మిదిచే గుణించి పండ్రెండుచే భాగింప మిగిలినది ధనముం దెల్పును. ధన మధికముగనున్న యోగ్యము. ఋణ మధికమైనఁ దగదు. సమమైన మధ్యమము.

౧౧ అధిపతి:—దీనిని దిశాధిపతియని యెఱుంగునది. పదము నెన్మిదిచే భాగించగ శేష మధిపతిం దెల్పును. (గుణింపులేదు.) ఇంద్ర, యమ, వరుణ, కుబేరులు యోగ్యదిశాధిపతులు. అగ్ని, నైఋతి, వాయువులు, ఈశానలు విదిశాధిపతులు గానఁ దగదు.

౧౨ భూతవర్గము:—పదమును నాలుగుచే గుణించి ఐదుచే భాగించగా మిగిలినసంఖ్య భూతముం దెలుపును. ౧ పృ త్వము, ౨ జలము

మధ్యమము. 3 అగ్ని అధమము. ౪ వాయువు అనర్థము. ౫ ఆకాశము కేవలానర్థము.

ఇంకను కేంద్రములందు శుభగ్రహములు, కోణములందుఁ గ్రూరగ్రహములు నుండి భాగ్య రాజ్యాధిపతులు కూడియుండగ నెనుఁబదియొక్క సంవత్సరమున కధికమగు నాయుర్దాయము వచ్చియుండగ మహాయోగ్యమగు ముహూర్తమనియు, దేవాలయములు, గృహములుకట్టుట (వాస్తుకర్మ) కర్హముహూర్తమనియు నితరదోషము లుండినను పాటింప నక్కరలేదనియుం జెప్పఁబడినది.

మఱియు లగ్నమున శుక్రుఁడు, పంచమ నవమస్థానములలో రవికుజులు నుండుతఱి దేవాలయ శంఖుస్థాపన మొనర్చిన నాదేవాలయము వెయ్యి సంవత్సరములఁదనుక సకలవైభవోపేతమై వర్ధిల్లునని చెప్పఁబడినది.

మరియును గురుఁడు లగ్నమందు, శని అష్టమమందు, పంచమమునఁ జంద్రుఁడు, దశమస్థానమున శుక్రుఁడు, ఏకాదశమున బుధకుజులు నుండిన లగ్నము వాస్తుకర్మకు మహాయోగ్యమనియు, దేవస్థానము శాశ్వతముగ మహిమాయుతమై, వైభవోపేతమైఁ దనరారుననియుఁ జెప్పఁబడినది.

ఇంకను శివాలయములకు వృషాయమును, విష్ణ్వాలయములకు ధ్వజాయమును, దేవ్యాలయములకు సింహాయమును, గణపతి దేవాలయములకు గజాయమును కడుప్రశస్తములనియు వాస్తుకర్మయందునను, శంఖుస్థాపనమునను మిగుల శుభప్రదములనియుఁ జెప్పఁబడినది.

**వర్గోత్తమాంశ:**— జ్యోతిషశాస్త్రమునందుఁ జరరాసులగు మేష, కర్కాటక, తుల, మకరములందుఁ బ్రథమనవాంశయును, స్థిరరాసులగు వృషభ, సింహ, వృశ్చిక, కుంభములందలి నవాంశలలో నైదవభాగములును, ద్విస్వభావములగు మిథున, కన్యా, ధనుర్మీనములలోని నవాంశభాగములందుఁ గడపటినవాంశభాగములును వర్గోత్తమాంశము లనఁబడును. ఇవి బలకరములై, శుభప్రదములై యుండిన మేలనియు, దోషయుక్తములయియుండినఁ గీడనియుఁ జెప్పఁబడినది.

**వర్గుపుష్యగోత్రము:**—
[పితహవ్య లేక యాస్కగణము చూడుఁడు.]

**వర్ణలఘువు:**—సంగీతశాస్త్రమున జాతి (లయ) ప్రాణమునఁ జెప్పఁబడిన దశలఘువులలో నొకటి. పదియక్షరములకాలము. (జాతి [లయ] ప్రాణము చూడుఁడు).

**వర్ణనతాళము:**—
(తాళములు చూడుఁడు).

**వర్ణభిన్నతాళము**
[తాళములు చూడుఁడు].

**వర్ణయతితాళము:**—
[తాళములు చూడుఁడు].

**వర్తకవ్యాపారము, వృత్తివ్యాపారము:**— నూటయేఁబదిసంవత్సరముల కాలము క్రిందటినుండియు నీరెండురకముల వ్యాపారములకు భేద మేర్పడియే యున్నది.

ఇక్కాలమున వర్తకము ద్రవ్యముం బెట్టఁబడి పెట్టి యితరదేశములనుండిగాని, స్వదేశములనుండిగాని కొనుట, అమ్ముట, తాను మధ్యవర్తిగ హామీయుండి పని నడపుట మొదలగు స్వశరీర శ్రమయు, కాయక్లేశము లక్కరలేక, ద్రవ్యసాధ్యము, పలుకుబడిసాధ్యములగు కాలముల

వలన ద్రవ్య మార్జించుటయనియు, వృత్తివ్యాపారములు, తాను ధర్మశాస్త్ర, వైద్య, శబ్దజ్ఞాన, రసాయనాదిశాస్త్రజ్ఞాన, చిత్రలేఖన, లోహదారు శిల్పాదివిద్యలందు, శాస్త్రములందు సర్వపాండిత్యము గడించి వాట్లమూలమున ద్రవ్యార్జన మొనర్చుట యనియు నేర్పడి యున్నది.

వర్తకుఁడు తనవర్తకమును ద్రవ్యసాహాయ్యమునను, వృత్తివ్యాపారి తనవృత్తిని తనస్వకాయకష్టమువలనను, తనబుద్ధివిద్యలసాహాయ్యమునను నడపునని యెఱుంగునది.

**వర్తకవ్యాపారశాస్త్రము** (Commercialory commercialism):— స్వదేశమునందుఁగాని, విదేశమునందుఁగాని సరకులంగొనుచు విక్రయించుట లేక యేదైన నొకరీతిపనిని తా నడిపించుటవలన ధన మభివృద్ధిపరచుట లేక గడించుట మొదలగు ధనాకర్షణ లేక ధనాభివృద్ధివిధానములకు Commercialism అనిపేరు. ఒక సంస్థ లేక పవిత్రస్థానసంస్థ, దేవస్థానసంస్థ మొదలగువాటను ధనార్జనసాధనములుగ నడపుటకు commercialogy అనిపేరు. ఈధనాకర్షణ, ధనార్జన, ధనాభివృద్ధికై కొని యమ్ముట మొదలగు పనులఁగూర్చిన శాస్త్రమునకు commercialogy అనిపేరు.

**వర్తులోహము**:—ఇది యొకలోహమని తలంపఁబడుచున్నది. పులుపు, వెగటు రుచులం గల్గి చలవఁ జేయును. కఫదోషవికారములు, జ్వరములు, పైత్యరోగముల శమింపఁజేయునని చెప్పఁబడినది.

**వర్ధకిగణము**:—ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి.

ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము.

౧ వర్ధకిగోత్రము:- వర్ధకి, భావబోధ, తక్ష, త్రియార్షేయ ప్రవర.

౨ భావబోధమనుగోత్రము:- భావబోధ, తక్ష, స్థపతి త్రయార్షేయప్రవర.

౩ తక్షర్షిగోత్రము:- తక్ష, స్థపతి, యాగరక్షిత, శాంతమతి, ప్రమతి (పంచార్షేయ ప్రవర.)

౪ శాంతమతిర్షిగోత్రము:- శాంతమతి, అనంత, వేశ్మకర్త, యజ్ఞసేన, ప్రమతి (పంచార్షేయ ప్రవర.)

౫ యాజ్ఞసేనర్షిగోత్రము:- అనంత, వేశ్మకర్త, యజ్ఞసేన (త్రయార్షేయప్రవర.)

(యాజుశ్శాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు.)

**వర్ధమానదేశము**:— కథాసరిత్సాగరమున ౨౪, ౨౫ యందు వింధ్యపర్వతపంక్తి కుత్తరమునఁ బ్రియాగ మొదలు కాశీ వరకుంగల దేశమని చెప్పఁబడినది. అటులనే తలంచుచున్నారు.

**వర్ధమాన [పుర] ము**:— ఇవి యారు వేర్వేరుతావులఁ జూపవచ్చునని గానవచ్చెడిని.

౧ మార్కండేయపురాణమునఁ బ్రియాగ కాశీక్షేత్రములమధ్య నొకవర్ధమానపుర ముండినటులఁ జెప్పఁబడినది. ఇది యిప్పుడు గానరాకున్నది. గాని శాలాపాణి యనుపేరుగల యక్షుఁ డటఁ బెక్కండ్రం జంపి వారియెముకల నేరించి కుప్పగ నుంచినటులను నందువలన దానికి, అస్తికగ్రామమని వాడుకఁ గల్గినటులనుం జెప్పఁబడినది. జైనతీర్థకరులలోఁ గడపటివాఁడగు మహావీరస్వామి తాను కేవలత్వ మందినపిదప మొదటి పర్యాటనము వర్ధమానపురమునఁ గడపినటుల జైనకల్పసూత్రమునఁ జెప్పఁబడినది. హాజహాన్పూరు

నుండి యిరువదియైదు మైళ్ళదూరమునయున్న బన్సుఖేరాకడ దొరకిన యొకరాగిశాసనమున వర్ధమానపురమున హర్షవర్ధనమహారాజు క్రీ. వె. ౬౩౮ సంవత్సరమున వర్ధమానకోటీ యందు విడిసెనని గానవచ్చుచున్నది. వర్ధమానకోటి యిప్పుడు దినాజపూర్ నందుండుట సుప్రసిద్ధమే గాన నది యేమోనని తోఁచకపోదు. దేవీపురాణమున ౭౬ అధ్యాయమున వర్ధమానదేశముఁ గూర్చి ప్రశంస కల దందు వంగదేశములోనిదిగాక నిది వేరు దేశముగ వర్ణింపఁబడినది. గాన దినాజపూర్ వర్ధమానపురమై యది ప్రధాననగరముగను, పరిసరదేశప్రాంతము వర్ధమానదేశముగను తోఁచెడిని.

స్పెన్సుహార్డీస్ మెన్యూఅల్ ఆఫ్ బుద్ధియిజం ౭౮౦ పుటయందు వర్ధమానపురము దంత లేక దంతపురమునకు సమీపమని చెప్పఁబడినది. లలితపూర్ శాసనమని ప్రసిద్ధి వడసిన శాసనమున వర్ధమానపురము మాళవదేశమునందని తెలియుచున్నది. ఇవన్నియు నిటులుండఁ గథియవాడు సంస్థానములలో నొకటి వాడ్వాన్ (వర్ధమానము) పేరంబరగుచుంట సుప్రసిద్ధమే. ఇట నేమెరుతుంగు జైనస్వామి ప్రబంధచింతామణిని క్రీ. వె. ౧౪౨౩ సంవత్సరమున రచించియున్నాఁడు.

మఱియు నాజైనస్వామియే మహాపురుష చరిత్రియు, షడ్దర్శనవిచారము మున్నగుగ్రంథములటనే రచించెను. ఈసంగతి యాప్రాంతముల వారు ప్రసిద్ధిగ నుడువుచున్నారు.

**వర్ధమానరేఖ:—**

[ద్రిసాముద్రికముఁ జూడుఁడు].

**వర్మదృక్కు:—** యదుసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. అక్రూరుని తమ్ముఁడు.

**వర్ష:—** మరీచిభార్యలలో నొకరిత. ఈమె కార్గురు సుతులు. వారు బ్రహ్మశాపముచే మృతినంది శ్రీకృష్ణునితల్లియగు దేవకీదేవిగర్భమునం బుట్టియుఁ గంసునిచే వధింపఁబడి సుతలమును బట్టియుండిరఁట. దేవకీదేవికోర్కెకొఱకు శ్రీకృష్ణుండు వారిం దెచ్చి తల్లికిం జూపి వారికి శాపవిముక్తిఁ గల్గించెనఁట.

**వర్షపాతకారణములు ఐదు:—** ఆంగ్ల వాతావరణశాస్త్రజ్ఞులు వర్షములు కురియుటకై దుముఖ్యకారణములు సూచించుచున్నారు.

౧ Prevailing winds:— సముద్రమునుండి వీచుగాలులు వర్షముం గల్గించుట. భూమునుండి వీచునది dry winds అని భావము.

౨ Winds from warmer to cloder regions deposit rain as they are cooled:- అనఁగా వేడిప్రదేశములనుండి శీతల ప్రదేశములకు వీచుగాలులు dry winds అని భావము.

3 Altitude of the land and mountains bar:—గాలులు పర్వతములదెస వీచుతఱి వానికిందగిలి పైకెగయుతఱి విడఁబాఱి చల్లఁబడుట వర్షాకర మగును. పైనుంచి క్రిందకు దిగుగాలు లడచంబడి వేడియై వర్షాకరములు కావుగాన పర్వతములయొక్క సముద్రమువైపు (ప్రక్క) భాగము తేమం గల్గియు నవ్వలి భూప్రదేశమువైపు (ప్రక్క) భాగ మెండుగ నుండెడిని. చిరాపుంజ్

(అసాము) వర్షా కిదియె కారణమని చెప్పఁబడినది.

౪ Distance from the sea:— సముద్రము నుండి భూమిదెసకు దూర మరుగుకొలఁదిని గాలి వేఁడియగుచుండును గాన వర్షకారణముఁగా కుండెడిని.

Airpressure:— తక్కువ యొత్తిడి ప్రదేశములనుండి వేఁడిమైనగాలి పలుచగఁ జెదిరి పై కెగయుచుఁ [తేలికయగుట] జల్లఁబడి తేమను గల్గి వర్షకారణ మగును. ఎక్కువ యొత్తిడిఁగల ప్రదేశమునుండి వాయువు దట్టమై వేఁడిని గల్గియుంట వర్షాకరవాయువు కానేరదు. [రెయిన్ షాడో చూడుఁడు].

**వర్షపాతము (Rainfall):**— ప్రపంచమందలి శీతోష్ణస్థితులను సవరించుటకు టెంపరేచరునకుఁ బిదప వర్షపాతము ముఖ్యకారణములలో రెండవదిగఁ జెప్పఁబడియున్నది. (టెంపరేచరుఁ జూడుఁడు. దేశమందలి శీతోష్ణస్థితి చూడుఁడు.) ఈవర్ష సందర్భమునం దెక్కువగఁ బరిగణింపంబడఁ దగినది నీటియావిరి. ఈనీటియావిరి వాతావరణమునందుంటకు టెంపరేచరే కారణము. వేఁడిం గల్గియున్న వాయువునం దధికముగను, చల్లని గాలియందుఁ జాలఁ దక్కువగను నీటియావిరి యుండునని పరిశీలనలుఁ దెలుపుచున్నవి. వేఁడిగాలికి శీతలము తగులుతఱి యందలి నీటియావిరి దట్టమై మేఘములుగనైనను, మంచుగనైనను నిరూపించుచుండును. ఆమేఘములే వర్షరూపమున భూమికిం జేరునది.

భూమధ్యరేఖ కిరుదెసలందునుగల tropical calms అనఁబడు ప్రదేశములఁ జుట్టుకొని (వేఁడి యధికమగుట) వాయు వాకసముదెసకెక్కుచునేయుంటయు నందు నీటియావిరి యధికముగనుంటయు నాయావిరి యాకసమున జల్లఁబడి మేఘములై సదా యాప్రదేశమున భూమిం జుట్టి వర్షించుచుంటయు జరుగుచుండును. ట్రేడ్విండ్సు జనుమార్గమునందు (టెంపరేచరు చూడుఁడు.) గాలి వేఁడిమై యాకాశమున కెగురుట మొదలగు పనులుండవు గాన వర్షమును నుండదు. ఆకాశము నీలిరంగుగనుండి సర్వకాలమును గాలి యనుకూలమై వేసవిచల్లగాలిం బోలి యుండును. ఈసీమలందే యాసరక్షేత్రములగు నెడారులును గలవు. సహారాయెడారి, అరేబియాదేశసీమలు, మెసపొటేమియా, మధ్యఆసియా నిర్జలప్రదేశములు మొదలగునవి యుత్తరగోళార్థపు హద్దులలోను నాఫ్రికాఖండపుఁ గల్హారీయెడారి, ఆస్ట్రేలియాలలోని నిర్జలప్రదేశములును పెటగోనియా మొదలగునవియుం గలవు. దక్షిణగోళార్థమున నధికభాగము సముద్రమునందేయుంటఁ గాననయ్యెడిని. ఉత్తరగోళార్థమునందలి మెసపొటేమియా యందు నదీజలములనుండి వ్యవసాయము చేయంబడుచున్నది.

ఇంక నేంటీట్రేడ్విండ్సు వీచుదేశములం దంత యధికవర్షములుగాని, వర్షహీనతగాని యుండుట లేదు. ఐరోపాకెంపరేటుజోనని చెప్పంబడు ప్రదేశ మీయాయేంటీట్రేడ్విండ్సు వీచుభాగమే యందురు. ఐరోపావాయవ్యభాగములు, న్యూజీలాండు నిందుకుఁ జెందినవగుట వర్షాధిక్యమును వర్షరాహిత్యమును లేనివఁట.

వర్షా తకు వేరొకకారణము మహాపర్వతప్రాంతములను గల్గియుండుటగాఁ జెప్పఁబడియున్నది. ట్రాపిక్సునందైనను పర్వతప్రాంతములందుఁ గొంతవర కధికమనియె చెప్పవలయు

నందురు. మహాపర్వతము లడ్డమగుటచే వర్షపు గాలులాగి పైకెగసిపోవుచుండునందురు. గాననే యట్టిపర్వతముల కవ్వలి దెసలం దుండవలసినవర్ష ముండదందురు. టిబెట్టుదేశమున వర్షపుగాలుల నుండితేమను సముద్రపుగాలులు పీల్చివేసి హరించుకతన నెత్తుగుపీఠభూమియైనను వర్షములు సరిగా కురియకుండెడిని. ఈజిప్టుదేశము వర్షహీన మయ్యు నైలునదీజలములచే ఫలవంతమైయున్నది. దాని కిరుదెసలను నెడారులే కలవు.

**వర్షము కురియుటకు ముం దుప్పు చెమ్మగిలుట:—** వర్షము కురియుటకుముందు వాతావరణపు గాలియందు నీటియావిరి యధికమగుట సంభవించి గాలి బరువగును. తోడనే కొన్ని లవణము (salts) లధికముగను మనము భోజనమునందు వాడుకొను నుప్పుంమునకుం దక్కువగను నట్లు బరువైన గాలియొక్క సంపర్కమున దానియం దధికమైన నీటియావిరిని గ్రహించి చెమ్మగిలుచుండును.

వర్షము కురియుటచే నట్టి వాతావరణమందు నీటియావిరికూడ బుగ్గితిస రేణువులం జుట్టుకొని (దానిచే నాకర్షింపంబడి యని భావము.) బరువై వానచినుకులుగ నేలంబడిపోవుచుంటం జూచుచునే యున్నారము. కొన్ని యుప్పు లధికమగు చెమ్మయొక్క సంపర్కమునం గేవలము నీటివలె నగుటయుం గలదు.

**వర్షము, కప్పలు:—** వేసవికాలమునందు చెరువులు, గుంటలు మొదలగునవి బాగుగ నెండిపోయినపిదప వర్షకాలమున వర్షములు కురిసిన తోడనే యదివరకు జలశూన్యములగు తావులన్నియు, కాలమయములై యుంటయు నావర్షపుదినమున రాత్రియంతయుం గప్పలు విపరీతముగం గూయుటయు నందరెఱింగినదే! వర్షమునకుముందు శూన్యములై యున్న యాస్థలములలో నన్నికప్పలెట్లువచ్చినవో తెలియక కప్పలాకసమునుండి వర్షపుచినుకులతోం బడినవని తలంచువారును గలరు. గాని యది యసంభవము. అయినచో నీకప్ప లెట్లు వచ్చినవనంగా వేసవివచ్చువరకును జలాశయముల యందుం బెరిగియున్న కప్పలు నీ రెండిపోవుసమయమున నందలి బురదయందుం బగుళ్ళలోం జేరియుండిపోవును. నీ రెండిపోయినది మొదలు తిరిగి వర్షముం గురియువరకును కప్పలు భూమియందుండి జీవించుటకు దానిజీవనమున కనుకూలించునట్లు సృష్టింపబడిన దానియవయవములే యనుకూలపడును. భూమిలో నుండునంతకాలమును కప్పలు నిదురించుచుండును. ఆసమయమున వానియొక్క తేమంగలచర్మమునందలి చిన్న రంధ్రములనుండి కప్పలు శ్వాసించుచు జీవించును. ఇవి యిట్లే నీటిలో మునిగియున్నప్పుడుకూడ నీటిలోనిగాలిని చర్మరంధ్రములనుండియే శ్వాసించును. కప్ప శ్వాసించుట కత్యల్పవాయువు సరిపడునుగాననే దానిరక్తము చల్లంగ నుండును. కప్పలిట్లు భూమిం యందుండు కాలమున వేసవితోం దొలకరివర్షములు పడగానే యాబురదనుండి పైకివచ్చును. అనియో కప్పలకు ఋతుకాలము. వర్షముపడిన మరునాటి యుదయమున నాగోతులవద్ద కప్పలు మిథునములుగానే గోచరించును. అటుపిదపం గొన్నాళ్ళ కాడుకప్ప లీని నీటియందు గ్రుడ్లం బెట్టును. ఒక్కొక్కకప్ప వందసంఖ్యవరకు గ్రుడ్లంబెట్టును. ప్రతి గ్రుడ్డును నావగింజంత ప్రమాణముగనుండి చుట్టు న్నియు నొకటిప్రక్క నొకటి చేరుకొని నీటం దేలుచు సూర్యరశ్మిచేం బొదుగంబడి పిల్లలగును. గ్రుడ్లు వెలువడివచ్చుపిల్లలు విచిత్రమగు తలకప్పలై

నీట నీదుచుండును. గ్రుడ్డు వెలువడినది మొదలిత లాహారమును దినునేర్పలవడువరకు నాతలకప్పలు దాము పుట్టినగుడ్ల కనుసరించియుండు బంకవంటి పదార్థమును దిని పెరిగి శరీరములోఁ గొంచెము కొంచెముగా మార్పునొందుచుండును. పిదప గడ్డి కొసలు, నీటిమొక్కల చిగుళ్ళు తినును. అవి తలకప్పలయవస్థలోనుండి నీట నీదుచుండినతఱి వాటి మూతిదగ్గర సన్ననినూలుదారమువంటి పువ్వార




లుండును. వీనిమూలమున నవి నీటిలోనిగాలిని బీల్చుకొని పెరుగును. పెరిగినకొలఁదిని పువ్వారలు తగ్గిపోవును. ఇందుఁ గనుపర్చిన పటములోని యేఁడు మార్పులనొంది· యెనిమిదవయవస్థయగు కప్పరూపమును బొందును. అప్పటికిఁ దోక పూర్తిగాఁ బోవును. అప్పటినుండి నీటఁ బెరిగి వేసవియందు మరల బురదనుండి పోవును.

## వర్షాగమముఁదెలుపు సూచనలు:-

ఇప్పుడు వర్షాగమముఁ దెల్పు యంత్రములు గలవు. ఈయంత్రములు కనిపెట్టఁబడని యాది కాలమున భరతదేశమున వానరాకట నిట్లెఱుంగుచుండెడివారు. పిల్లులు తమచెవులపై ముందు కాళ్ళతో రాసుకొనుచుండిన వర్షము వచ్చుటను సూచించుటయే యగును. పిడుగులు నుఱుములు, తుపానులుఁ గల్గుతఱి పిల్లులు విశ్రాంతిగ నుండక నసౌఖ్యముగ నుండునట్లుండును. అవి దారిఁ దప్పి తిరుగుచుండెడిని.

గాడిదలు పెద్దవర్షములు పడుటకుఁ బూర్వము విశేషముగ నోండ్రించుచుండును.

గొఱ్ఱెలు కొండప్రదేశములందు మేయుచుండుతఱి గొప్పవాన వచ్చుటనెఱింగి వీలగునంతవఱకును, తమకు వానగాలిదెబ్బ, నేలచెమ్మ, లేకుండు జాగ్రత్తైనతావును వెదకికొనుచుఁ బోయి చేరును.

పొలములు, కళ్ళములందు వసించు నెలుకలు, పందికొక్కులు వర్షాగమము నెఱింగి, తమరంధ్రము లంగప్పి భద్రపఱచుకొనును.

బాతు లెగురుటయు, గడ్డినేలలఁ దిరుగుటయు, వర్షముఁ గలునని యెఱింగినసూచనలే.

నెమళ్ళు బలముగఁ గూయుచుంట, వర్షాగమము నెఱింగియే. గోరింకలు క్రిందుగా నెగురుటయు వర్షాగమము నెఱింగియె యగును. సాలెపురుగు లతివేగముగ దట్టముగ పట్టల్లుకొనుటయు నిట్టిటయే.

**వలపల - దాపల:** 'వెలపలనున్న' అని యర్థమిచ్చు మొదటిపదమును, 'దాపునన్న' యని యర్థమిచ్చు రెండవపదమును సంయుక్తముగ సాధారణముగ నెడ్లబండ్లు, పోతులబండ్లు మొదలగు ద్వంద్వములుండు వెపులఁ దెలుపనుపయోగింపఁబడుచున్నవి

కుడిప్రక్కనుండుదానిని వలపలిది యనియు, నెడమప్రక్కనుండుదానిని దాపలిదియనియు నందురు. అనఁగా గమనోన్ముఖులై శకటసారథ్యమున నుండు వారికని యెఱుంగునది. తెలుపుగ, చులుకుగనుండు పశువును వలపలను, మందముగనుండు దానిని దాపలను నుంచుచుండుటఁ గాననగుచుండును.

**వల్లభీనగరము:**— (సురాష్ట్రముఁ [సౌరాష్ట్ర] జూడుఁడు. ఘూర్జరదేశముఁ జూడుఁడు).

**వలలుఁడు:**— విరటునివద్దవంటలవానిగాఁ గుదిరిన యజ్ఞాతభీమసేనుఁడు. (అజ్ఞాతపాండవులు చూడుఁడు).

**వలశంకుగోత్రము:**—
(కుశికగణముఁ జూడుఁడు).

**వలాయనగోత్రము:**—
(జమదగ్నివత్స ఉపగణముఁ జూడుఁడు).

**వలాయనిగోత్రము:**—
(ఉపమన్యుగణముఁ జూడుఁడు).

**వలిగోత్రము:**—
(శండిలగణముఁ జూడుఁడు).

**వలీపలితము:**— బాల్య, యౌవనముల యందే (అనఁగా వయస్సు మళ్ళకముందే) శరీరము ముడతలు పడుటయు, వెంట్రుకలు తెల్లబడుటయుఁ గల్గుచుజబ్బు.

**వల్ఫ్ ఏజన్సీ:**—
(న్యూస్ఏజన్సీలు చూడుఁ )

**వల్లూరి నరసింహకవి:**— ఆంధ్ర కవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. తండ్రిపేరు కానువత్కవి.

ఈతఁడు రచించినది నాగ్నజితీపరిణయము ప్రబంధము.

**వలేబలగోత్రము:**—
(ఉపమన్యుగణముఁ జూడుఁడు).

**వల్లత్తోల్ నారాయణమేనన్మహాకవి:**— ఈవిద్వత్కవిని కేరళదేశమున వెల్లత్తోలని వాడుచున్నారు. అది యీయన ఇంటిపేరని తెలిసెడిని. గొప్ప పండితకుటుంబమున నాయరుకులమున జనించెను. ఆధునికుఁడు. బ్రిటీషుమలబారు జిల్లాయందు వెట్టత్తునాడునం దొకపల్లెటూరున జనించి మేనమామకడనే సంస్కృతవిద్యాభ్యాస

మెునర్చి వాల్మీకి, కాళిదాసుల మార్గ మవలంభించిన విద్వత్కవిపుంగవుఁడు. ఈయన రచించిన మొదటి సంస్కృతపద్య కావ్యము వాల్మీకిరామాయణమని యందురు. ఈ మహాకావ్యము తులసీదాసు హిందీరామాయణముతోడను, కంబారు తమ్మిళరామాయణముతోను సరిగ మళయాళమున గారవింపఁబడుచుఁ జేరుప్రతిష్ఠఁ దెచ్చినది. ఈయన జన్మకాలము క్రీ. శ. ౧౮౭౮ నవంబరుమాసముగఁ జెప్పఁబడినది. ఈతఁడు బాల్యముననే గూడ నైసర్గికమగుకవిత్వధోరణిఁ గలవాఁడనియు (బాలకవి) యందురు. ఆఁగ్లవిద్యఁ జదివినవాఁడు కాఁడు.

తనస్వగ్రామమును వీడి దరినున్న తిరుచ్చూరు పురవాసియై కొంతకాలముండెను. అది కొచ్చిన్రాజ్యములోనిది. అచ్చోటు కేరళభాషకున్కిపట్టు. అటఁ గేరళోదయమనియు, నాత్మపోషిణియనియు రెండుమాసపత్రికల నడపెను. అందలి యీకవి పద్యములు మిగుల రసవంతములని పొగడఁబడుచుండెను. అక్కాలమునం దీయన మార్కండేయ, వామన, పద్మ, మత్స్యపురాణములను మళయాళభాషలోనికి వచనముగ ననువదించెను.

ముప్పదిసంవత్సరములకుఁ బిదప నీతనికిం బధిరముఁ గలుగ 'బధిరవిలాస' మనుగ్రంథమును రచించెను గాని చెముడు కుదర దాయెను. ఈయన యితరగ్రంథములు బంధనస్థనయానురుద్ధము, విలాసలతిక యనుశృంగారకావ్యములును ఎండి గురునాధన్ అనునదియు నైయున్నవి. ఈయనకుఁ గొచ్చిన్ప్రభుత్వమువారు కవితిలక న్ననుబిరుదము నొసంగి పెన్షను నొసంగుచున్నారు. తిరువాన్కూరు ప్రభుత్వమువారు 'కవిసార్వభౌమన్' అనుబిరుద మొసంగిరి. వీరశృంఖలమను కంకణ మొసంగి బహూకరించిరి. వీరు కథాకాళీనాటకకళ నుద్ధరించిరఁట. [కథాకాళీ చూడుఁడు.]

ఈకవితిలకుఁడు ౧౯౩౦ లో కొంతధనముఁ బోగుచేసి కలామండలమను నొకసంస్థను స్థాపించెను. అందే నేటికిని వసించుచున్నాఁడు. [కేరళ కలామండలము చూడుఁడు.]

**వల్లభమతము:—** ఇది వైష్ణవమతములలో నొకటి. ఈనుతకర యో లేక తొల్లింట మతమునకుఁ గొత్త విధానమును సంస్కరణరూపముగఁ దెచ్చిపెట్టినవారో సరిగఁ దెలియదు గాని వల్లభాచార్యులనుండి యీమతమునకు వల్లభమతమని పేరుఁ గలిగెను. ఇట్లుండియుఁ బూర్వులం దలంచుటఁ జూడ నీమతము సనాతనమని యుద్ధరించెడిని.

శ్లో॥ ఆదౌ శ్రీపురుషోత్తమం పురహరం శ్రీనారదాఖ్యం మునిమ్। కృష్ణవ్యాసగురుం శుకం తదను విష్ణుస్వామినం ద్రావిడమ్। తచ్ఛిష్యం కిల బిల్వమంగళ మహం వందే మహాయోగినమ్। శ్రీమద్వల్లభనామధామచ భజేఽస్మత్సంప్రదాయాధిపమ్॥

ఈమహాత్ము లందరును వల్లభుల బాల్యమున వృద్ధులై జీవించియుండి వారిందర్శించినటులఁ జెప్పఁబడిన బిల్వమంగళులుసహా యీమతసాంప్రదాయమువారేనఁట. ఈమతస్థు లందరును జపకాలమున నీశ్లోకమును బఠించుచుందురు. ఐనచో నీ వల్లభాచార్యులవలన వల్లభమతమని పేరుకున్చుట యర్థము లేకుండెడిని. ఒకవేళ మతమునుండియె యీయనకు వల్లభాచార్యుండని పేరుఁగలుగనోపు. (అదివరకుండిన పేరు తెలియకున్నది).

వల్లభునితండ్రిపేరు లక్ష్మణభట్టనియు, తల్లిపేరు యెల్లమ్మయనియు వారిది ఆకివీడు (పశ్చిమగోదావరిమండలము) సమీపమునఁ గాకరవాడయనియు, యజుర్వేదము, భారద్వాజసగోత్రము, వెలనాటి

శాఖ యని చెప్పఁబడినది. వల్లభాచార్యుల యన్న గారు రామకృష్ణభట్టు. తమ్మునిపేరు రామచంద్ర భట్టు. ఇంక నీవల్లభాచార్యులకుఁగూడ నెద్దియో యొకభట్టనుపేరు లేకుండునాయని సంశయముఁ గలదెడిని.

వల్లభుల విద్యాగురుండు మధ్వానందస్వామి యనియు, మేనమామ విద్యాభూషణుఁడనియు, భార్యపేరు మహాలక్ష్మీదేవియనియు, నీమె కాశీ నివాసియగు మధురమంగళుని పుత్రికయనియు, వీరి కిరువురు పుత్రులుఁ గల్గిరనియు, పిదప వీరు సన్యాసము స్వీకరించిరనియు, వీరు సిద్ధినొంది పర మేశ్వర సన్నిధికిఁ జేరుట విక్రమశకము ౧౫౮౭ సంవత్సరమున నాషాఢశుద్ధ తృతీయయం దనియుఁ జెప్పంబడినది.

గోపికాస్త్రీవేషముఁ గృష్ణునిపూజించుట యీ మతగురువులందుఁ గాననగును. వారు గృహస్థులు. దేహ, ప్రాణ, ధనములు మూటిని పరమేశ్వరాధీన మొనర్పవలయుననియు, అందువలన నాత్మకుఁ బరమేశ్వరసంబంధముఁ గలియుట సంభవించునని యు నందువలన నాగామిసంచితప్రారబ్ధము లు నశించుననియుఁ జెప్పఁబడినది. ఇది శ్రావణశుద్ధ యేకాదశిదినమగుట వల్లభాచార్యులు దీనిని పవి త్రదినముగఁ బాటించిరి. అందుఁ బ్రాణధనముల సమర్పణము భక్తితోఁగూడినవి. దేహముసమ్పరిం చు టంతరంగ సేవ. అది రహస్యమున జరుగఁదగి నది. ఈమతమున భక్తియే ముఖ్యము. అదియే కృష్ణునికృపఁబడయుటకు సాధనము. భక్తికి శాంత ము, ధ్యానము, సఖ్యము, మాధుర్యము,అనునాల్గు దశలు చెప్పఁబడినవి. కృష్ణునియందు వ్రేతలకెట్టి భావముండెనో యట్టి భావమే గురువులయం దుండవలసినది.

సన్యసించుట, ఉపవాసములు, ఇంద్రియవశీ కరణము మొదలగునవి ముఖ్యములుగ నెన్నఁబడ లేదు. ఈమతమును పుష్టిమార్గమనియును, శుద్ధా ద్వైతమనియును వాడియున్నారు. క్రీ.వె. ౧౭౮౦ సంవత్సరమున నయోధ్యసమీపమున సభానగర మున జన్మించిన స్వామినారాయణులను నొకమహా త్ముఁడు బ్రహ్మచారిగనుండి యీవల్లభమతమం దలి యంతరంగసేవ (శరీరసమర్పణము) మాన్పి సంస్కరించెను. ఈ సంస్కార మవలంబించిన వల్లభమతస్థుల నుద్ధవసాంప్రదాయస్థులందురు. ఈ మతమునఁ బరమేశ్వరుఁడగు కృష్ణుఁడు సత్ [స్థితి లేకపదార్థము] అనియు, చిత్తు (ప్రాణము-జ్ఞాన ము) అనియు, నానందమనియు, మూఁడువిధము లుగ నుండుననియు (పదార్థముసత్తులోనిభాగము, ఆత్మ చిత్తులోనిభాగము.) ఆత్మకు దేహసంబం ధమున నిజమగుజ్ఞానము మరగిపోయి సంసారముఁ గల్గుచున్నది. పరమేశ్వరానుగ్రహముఁ గలుగ కృష్ణుని సన్నిధికి నాలోకమునకుఁ జేరనగును. అదియే యీమతమునందలిముక్తి. అది నిత్యపదవి. అందుకు భక్తియే సాధనము.

**వల్లభాచార్యులు:** ఈమహనీయుని తండ్రిపేరు లక్ష్మణభట్టు. ఆయననివాస మాంధ్ర దేశమునఁగృష్ణాగోదావరీనదుల మధ్యముననుండు నాకిపీడుసమీపమునఁ గల కాకరవాడయను పేరు గలగ్రామమని చెప్పఁబడినది. తల్లిపే రెల్లమ్మ. జన్మస్థానము మధ్యరాష్ట్రములోని చంపారణ్యము. వెలనాటిశాఖాబ్రాహ్మణకులము. అధ్యయనము చెప్పినగురుఁడు మధ్వానందయతి. జ్యేష్ఠసోదరుఁడు రామకృష్ణభట్టు. తమ్ముఁడు రామచంద్రభట్టు. జన్మకాలము విక్రమశకము ౧౫౩౫ సంవత్సరమని యందురు. భార్య బనారస్‌నివాసుఁడగు మధుర మంగళుని కుమార్తెయగు మహాలక్ష్మీదేవి. వీరి కిరువురుపుత్రులు గల్గిరి

వల్లభాచార్యులవారు విక్రమశకము ౧౫౮౭ లో సన్యాసము స్వీకరించి యా సంవత్సరమున నాషాఢశుద్ధతృతీయాదినమున మృతినొందిరి.

వీరిమతమునకు వల్లభాచార్యమతమని పేరు. ఈమతముఁగూర్చి కొన్నినిందావాక్యముల నితర మతస్థు లందురు. గాని నిజమారయువలసియుండును. (వల్లభాచార్య మతముఁ జూడుఁడు).

**వల్లాబియా:—**

(రూమేనియా చూడుఁడు).

**వశిత్వసిద్ధి:**

(సిద్ధి, సిద్ధులు చూడుఁడు).

**వశిష్ఠగణము:—** ఇది వశిష్ఠసంతతియందలి యొకగణము. వశిష్ఠగణము కేవలగణమని చెప్పఁబడినది. ఇందు ౮౫ గోత్రములు గలవు.

బోధాయన సూత్రోక్త గోత్రములు [౩౫]

౧ అవిక్షితి
౨ ఆశ్వలాయన
౩ ఔడులోమి
౪ కపిష్ఠల
౫ కాన్డవృద్ధి
౬ కామ్యకాయని
౭ కారీషిత
౮ కౌభోక
౯ కాలాయ
౧౦ గాయని
౧౧ గౌరవ్య
౧౨ గౌరిత్రవ
౧౩ జాతుకర్ణ్య
౧౪ దేవన
౧౫ నయాప్త
౧౬ పార్ణకాయన
౧౭ పార్ణవల్క-
౧౮ పూతిమాష
౧౯ లోమాయన
౨౦ వశిష
౨౧ వాటక్య
౨౨ వాశిష్ఠ
౨౩ వాహకధి
౨౪ విశ్వాయన
౨౫ నైతాలకి
౨౬ వ్యాఘ్రపాద
౨౭ స్వ్రవేల
౨౮ -
స్వపాజి
౩౦ సావక
౩౧ సుదహారిత
౩౨ సౌచివృక్ష
౩౩ సౌతవ
౩౪ సాయస
౩౫ హారకి

కాత్యాయనసూత్రోక్త గోత్రములు [౨౯]

౧ ఆప
౨ ఔడులోమి
౩ ఔపదవ
౪ ఔపవత
౫ కాశిరి
౬ కౌలోహవి
౭ కావిధి
౮ గోపాయన
౯ గాధవి
౧౦ చౌలి
౧౧ దౌనసి
౧౨ నాకవ్య
౧౩ నైగల
౧౪ పలాశి
౧౫ పార్ణవల్క్య
౧౬ పౌరశ్రివ
౧౭ బ్రిహ్మపురేయ
౧౮ బ్రహ్మావలి
౧౯ మాన్డలి
౨౦ మాలోహారి
౨౧ యాజ్ఞవల్క్య
౨౨ వటీకర
౨౩ వాహ్యాకృత్
౨౪ శితవృక్ష
౨౫ స్వస్థికర
౨౬ సాత్వలాయన
౨౭ సూష్ణ
౨౮ సౌమనసాయన
౨౯ స

మాత్స్యసూత్రోక్త గోత్రములు [౧౪]

౧ ఆద్వల
౨ గాడవి
౩ ఛాన్దాలి
౪ తాలిసవ్య
౫ దాసవ్య
౬ విధి
౭ పేడవ
వాగ్రది
౯ వ్యాలోహవి
౧౦ నైష్ణవ్య
౧౧ వోలి
౧౨ సుదారక
౧౩ సునా
౧౪ సుపాచి

ఇతరగ్రంథోక్త గోత్రములు [౭]

౧ అర్ధనాక్షి
౨ ఇన్ద్రప్రమద
౩ కౌలి
౪ బాలిశి
౫ మిఃధోవలి
౬ రావణి
౭ సుషత్వి

ఈ వశిష్ఠగణమునందలి ౮౫ గోత్రములకు ప్రవరరూపములు (౩)

౧ వశిష్ఠ
౨ వశిష్ఠ- ఇంద్రప్రమద- ఆభరద్వసు
౩ వశిష్ఠ- ఆభరద్వసు- ఇంద్రప్రమద.

**వశిష్ఠగోత్రము:**—(జాతుకర్ణ్య గణము చూడుఁడు.)

**వశిష్ఠగోత్రము:** — (వశిష్ఠగణముఁ జూడుఁడు.)

**వశిష్ఠమహర్షి:**— భార్య అరుంధతి. గొప్ప పతివ్రత. ఈమె యన్నకు శక్తిమొదలగువారు నూర్వురుపుత్రులు. శక్తికిఁబుత్రుఁడు పరాశరుఁడు, అతనికి (పరాశరునకు) కుమాళ్ళు సుతపుఁడు, సుతేజుఁడు, వ్యాసుఁడు.

మఱియొకభార్య దక్షప్రజాపతికుమార్తెయగు నూర్జ. ఈమెయందు బుత్రులు; ౧ రజుఁడు, ౨ గోత్రుఁడు, ౩ ఊర్ధ్వబాహువు, ౪ వసుఁడు, ౫ అనఘుఁడు, ౬ సుతపుఁడు, ౭ శుక్రుఁడు. మరియు బ్రహ్మమానసపుత్రుఁడై యుండుతఱి నిమిశాపముచే శరీరమునోవ మిత్రావరుణులకుఁ బుత్రుఁడై యగస్త్యునితో కుంభసంభవుఁడై జనించెననియు నగస్త్యవశిష్ఠులిర్వురును కుంభజులే యనియు దేవీభాగవతమునందుఁ గలదు. (శ్రీరాములకుఁ గులగురువు.)

ఈయనసుతులు ౧౦౦ లో ౯౯ గురు విశ్వామిత్రునితపోగ్నికి నిహతులైరని చెప్పఁబడినది.

**వశిష్ఠమహర్షి:**— ఈయనయుత్పత్తింగూర్చి కొన్ని గ్రంథములందు బ్రహ్మమానసపుత్రుఁ డనియు, మరికొన్ని గ్రంథములయందు మైత్రావరుణులయంశంబున నగస్త్యునితోఁబాటు కుంభసంభవుఁడై జనించినవాఁడనియుఁ, జెప్పఁబడియున్నది. ఇంకను గొన్నిచోట్లఁ దొలుత బ్రహ్మమానసపుత్రుఁడై జనించెననియు నిమిశాపమున దగ్ధశరీరుఁడై తోడనే మిత్రావరుణులయంశమునఁ దిరుగ నగస్త్యునితో కుంభసంభవుఁడై జనించినవాఁడనియుఁ జెప్పఁబడినది. ఇట్లే యగునేని వశిష్ఠుఁ డగస్త్యునికన్నముందుగనే బ్రహ్మమానసపుత్రుఁడుగ జనించినవాఁడుగ నుండనోపు. ఏదిమైనను వశిష్ఠున కగస్త్యునికివలె కుంభసంభవుఁడనునామము సుప్రసిద్ధము కాలేదు.

వసిష్ఠుఁడు గొప్పతపస్సంపన్నుఁడు. గొప్పమహాశ్యాంతియు, మహాప్రభావమును గలవాఁడు. అయోధ్యాపురాధీశులగు సూర్యవంశపురాజులకు గురువు. ఈతనినుండియే వాసిది వశిష్ఠగోత్రమయ్యెను.

వైవస్వతమన్వంతరమున సప్తమహర్షులలో నొకఁడయ్యెను. ఇతని కరుంధతియు, ఊర్జయు నిర్వురుభార్యలుగఁ దెలియుచున్నది.

అరుంధతి కర్దమునికుమార్తె. కర్దమప్రజాపతి బ్రహ్మచ్ఛాయాసంజాతుఁడుగఁ జెప్పఁబడినవాఁడు. మరికొన్నితావులఁ బులహునిసుతుఁడు (కర్దముఁడ)నియుఁ గలదు. కర్దమునికుమారుఁడు కపిలుఁడు. అరుంధతీదేవితల్లిపేరు దేవహూతి. సోదరుఁడు కపిలుఁడు. అరుంధతికిఁ బుత్రులు శక్తిమొదలగువారు నూర్వురుఁ గల్గిరి.

రెండవభార్యయగు నూర్జాదేవి దక్షప్రజాపతి కుమార్తె. తల్లిపేరు ప్రసూతీదేవి. అక్కచెల్లెండ్రిరువదినలుగురు (దక్షప్రజాపతి చూడుఁడు). గ విష్ణుపురాణమునను, అగ్నియను దక్షప్రజాపతి రెండవభార్యవలన నిరువదిమంది సవతితోఁబుట్టువులని వేరుతావులను గలదు. సోదరులు బెక్కండ్రు కలరు. ఊర్జాదేవి కేడ్వురు పుత్రులు గల్గిరి. వీరు

స్వాయంభువమన్వంతరమున సప్తమహర్షిత్వమునకు వచ్చినవారు.

వశిష్ఠమహర్షి యొనర్చిన ఘనకార్యములు పెక్కు గలవు. అందుముఖ్యమగునది క్షత్రియుఁడగు విశ్వామిత్రుని బ్రాహ్మణార్హసుగుణసంపద పూర్తిగఁ గల్గువరకు తననూర్వురుసుతులలోఁ బెక్కండ్రింగోల్పోయియు నలుగక శాంతముగనోర్చి విశ్వామిత్రుని గుణపూర్ణుంజేసి బ్రాహ్మణసంస్కారములిచ్చి బ్రాహ్మణుం జేయుటయె. (విశ్వామిత్రుఁడు చూడుఁడు).

ఈసందర్భమున నొక్కసంగతి వివరించుట సమంజసము. ఇందున్నకై తనసుతుల నెందరినో గోల్పోయినను వశిష్ఠునకు పట్టరానిదుఃఖము గలుగ నోర్వఁజాలక హిమాలయముపై సట్లెజ్కియాయని ఋగ్వేదమునఁ బేర్కొనఁబడిన నదీతీరమునంగల తన యాశ్రమముకడనున్నతటియట నొకనాఁడు దుఃఖాక్రాంతచేతస్కుఁడై భరింపజాలకఁ గాలుసేతులం దాళ్ళతోఁ గలియఁగట్టుకొని నదియందుఁ బడెనఁట. దోషరహితుఁడౌటఁ బరమేశ్వరుఁ డనుగ్రహించియో లేక నదీమహాత్మ్యముననో యాపాశములు (త్రాళ్ళు) వీడిపోయినవఁట. నాఁడాదిగ నానదికి విపాశనదియని వాడుకఁ గల్గెనఁట. నేటికి సట్లెజ్కియా యనుపేరు మాసి విపాశగను, విపాసబీయాస్‌గను మారియున్నది. ఇది పాంచాలదేశమునం దుండు నైదుముఖ్యనదులలో నొకటి. సింధునదిలో సంగమించునది. నది కవ్వలితీరమున నుండిన వశిష్ఠాశ్రమముకడ నిప్పుడు వశిష్ఠముని యనఁబడు గ్రామమున్నది. (వశిష్ఠాశ్రమములుఁ జూడుఁడు).

**వశిష్ఠమహర్షి (భేదములు)**:—వసిష్ఠు లెందరో సరిగాఁ దెలియరాదు. ఆకుటుంబము వంశపరంపరగా నందరును వశిష్ఠపదవి నొందినవారుగఁ గన్పించుచున్నారు. ఆదివశిష్ఠుఁ డెవ్వరో సరిగఁ దెలియకున్నది. శ్రీరామునికాలమందుండిన వశిష్ఠుఁ డొకఁడును విశ్వామిత్రుని (గాధిరాజసుతుని) బ్రహ్మర్షిం జేసిన వశిష్ఠుఁడొకఁడును. బహుశః యీతఁడే కడపటివశిష్ఠు గానోపు. ఏలనన నీతని సుతుఁడగుశక్తికి వశిష్ఠనామము గానరాదు. మరియు నీతనినాఁడే యీకుటుంబముఁ బ్రధాననివాసస్థానమగు 'వశిష్ఠముని' యనఁబరగుచున్న గ్రామము విపాశా (ఇప్పటిబీయాస్) నదీతీరమందున్నది. అందుఁ బడిన నాదంపతుల త్రాళ్ళు (పాశములు) ముళ్ళు విడిపోవుటనే యానది యంతటినుండియు విపాశానదిగఁ బేరందెనని చెప్పంబడినది. ఆపేరే బిపాశయై నానాటికి బీయాస్‌గా మారినది. వశిష్ఠమునిగ్రామమున నేటికిని వశిష్ఠు లారాధించిన శివలింగము గలదు. (విపాశానది చూడుఁడు). దిలీపమహారాజునాఁ డాయన వశిష్ఠాశ్రమమున కేగి వారికిఁ బరిచర్యలొనర్చి రఘుమహారాజుం గనెనని చెప్పంబడినది ఈ వశిష్ఠుఁడు వేరొకఁడై యుండును.

**వశిష్ఠర్షిగోత్రము**:— (శిష్టుకరణములు చూడుఁడు.) ఈగోత్రమువారికిఁ బ్రధానర్షి వశిష్ఠుఁడనియు, ప్రవరరూపములు వశిష్ఠ, ఉపమన్యు, పరాశరయనిగాని, వశిష్ఠ, కుండిన, పరాశరయనిగాని, త్ర్యార్షేయములై యుండుననియుఁ జెప్పఁబడినది.

శిష్టుకరణములలో శింగుమహాంతి వారను నింటిపేరుగలవా రీగోత్రజులై యున్నారు

**వశిష్టసంతతి:**— (౨౭) వశిష్టమహర్షి బ్రహ్మ మానసపుత్రుఁడై జనించి పిదప దగ్ధదేహుఁడై మిత్రావరుణులయంశమున కుంభసంభవుఁడై జనించినవాఁడు. భార్య యరుంధతీదేవియు సరజాదేవియు నిర్వురు. సుతులు శక్తి మొదలగువారు నూర్వురుగల్గిరిగాని యొక్క శక్తి తప్ప తక్కినవారు మరణించిరి.

వశిష్ఠమహర్షి
బ్రహ్మమానసపుత్రుఁడు

౨౭/౧ శక్తి

౨౭/౨ పరాశరుఁడు
దాశరాజు కుమారెయగు
(యోజనగంధి) వలన
వ్యాసునిఁ గనెను.

౨౭/౩ వ్యాసమహర్షి

౨౭/౪ శుకయోగీంద్రుఁడు
కుమార్తె కీర్తిమతి. అనుహునిభార్య

**వశిష్ఠాయన లేక వాశిష్ఠాయనగోత్రము:**—(అగస్త్యఉపగణము చూడుఁడు.)

**వశిష్ఠాశ్రమములు:**— సంయుక్తరాష్ట్రములలోని యయోధ్యాపురముకడ (తొల్లింటి యుత్తరకోసల దేశమున) నొక యాశ్రమము గలదు.

అర్బుదశిఖరమున (మౌంటుఆబు) నొక వశిష్ఠాశ్రమముఁ గానవచ్చెడిని.

కామరూపదేశమున (ఇప్పటిఆసాం) సన్ధ్యాచల పర్వతముపై నొకవశిష్ఠాశ్రమ మున్నది.

**వశిష్ఠీనది:**— హేమకోశమనుగ్రంథమున గోమతి (గుమితి) నదికి వశిష్ఠీనదియనియుఁ బేరు చెప్పఁబడినది.

**మహాభారతము**, వనపర్వము ౮౪ అధ్యాయమున వశిష్ఠీనదిఁగూర్చి చెప్పఁబడినది. ఇది బొంబై రాజధాని రత్నగిరి మండలముననున్న వశిష్ఠీనదికి సరిపోవుచున్నది.

**వశిష్ఠుఁడు నక్షత్రము లేక గోత్రము:**—(నక్షత్రములు, భారతీయులుగుర్తించినవి చూడుఁడు.)

**వశ్యకూటము (వశ్యపొంతనము):**- జ్యోతిషశాస్త్రమునందు వధూవరుల యెన్నికలఁ గూర్చి వివరింపఁబడిన పండ్రెండుకూటములలో నొకటి. (ద్వాదశకూటములు చూడుఁడు). మేష రాశికి సింహ, వృశ్చికరాసులును, వృషభరాశికి కటక, తులారాసులును; మిథునకుఁ గన్యయును; కర్కాటకమునకు వృశ్చిక ధనస్సులును; సింహ రాశికి తులారాశియు; కన్యారాశికి మిథున మీన రాసులును; తులారాశికి మకరకన్యలును; వృశ్చిక రాశికి కర్కాటకరాశియు; ధనస్సునకు మీన రాశియు; మకరరాశికి మేష; కుంభరాశులును; కుంభరాశికి మేషరాశియును; మీనరాశికి మకర రాశియు, వశ్యరాసులుగాన వధూవరులరాసుల నుండి వారిస్థితి నెఱుంగఁదగునని చెప్పఁబడినది.

**వసచెట్టు:**— వసచెట్టువేరును వసయని వాడుచున్నారు. ఇది వసమూలిక. లా. acorus calamus. ఆంగ్ల. sweet flag లేక sweet rush. సం. ఉగ్రా (నల్లవస) ఉగ్రగంధా (వససామాన్యము) గోలోమీ(వససామాన్యము)

వచా. వస తెల్ల నల్ల భేదములు గల్గియున్నట్లు గాన్పించునుగాని పాటింపఁబడుటలేదు.

వస పెక్కు ఔషధములలోఁ గలియును. ఇది పైత్యముఁజేసి బుద్ధికి బలమొసంగి వాచాలత్వము నకు నుద్ధృతముఁ గల్గించును. విషములను విరుచును. మూలశంక, పక్షవాతముల యుద్ధృతముల మాన్పును. అధికముగఁ దినిన వికారపెట్టి వాంతిఁ గల్గించును. గంధము పైకిఁ బూసిన గుండెనొప్పి మొదలగునొప్పులు, నేత్రములవాతము, శ్లేష్మములు నడంచును. పిల్లలకుఁ బట్టుచుండిన నాల్కపల్చఁబడి వేగముగ మాటలు వచ్చును. ఇట్లే చిలుకలకు, గోరువంకలకుఁగూడ మాటలు వచ్చుటకై తినిపింతురు.

## వసంతకులగోత్రము:–

ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. [వైశ్యగోత్రములు చూడుఁడు.)

వసంత లేక వసంతకులగోత్రము. ఏకాన్లేయ (౧౩) గోత్రము. విరోహిత్యగణము. సంస్కృత గోత్రము వైరోహిత్యస. వరుణఋషి. ఆపస్తంభయజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవర ఖండ. సమానగోత్రము వరుణస. రామనేశ్వరుఁడు దేవత. భార్య వాసవాంబ. వారణాశి తపస్థానము. నిర్గుండసరస్సు. తటాకము. జపము లక్ష. దీపములు ౧౫. క్షేత్రసంఖ్య ౩౫. హిరణ్యదానము. వంకాయ, పొగడ, వర్జనీయములు.

## వసంతతాళము:—

(తాళములు చూడుఁడు).

## వసంతనవరాత్రములు

చైత్రశుద్ధ పాడ్యమి మొదలు తొమ్మిదిదినములు వసంతనవరాత్రములు. ఇందు వసంతమాధవపూజ లొనర్తురు. వసంతోత్సవములు సల్పుదురు.

## వసంతపంచమి:—

(మదనపంచమి చూడుఁడు).

## వసంతపౌర్ణమి (డోలాపౌర్ణమి):

ఫాల్గుణశుద్ధ పౌర్ణమి కీపేరు కలదు. కామదహన సూచకముగ నీదినమున వసంతోత్సవప్రారంభము లొనర్తురు. బార్హస్పత్యమానరీతి నీదినము వసంత ఋతువులోని దగుట దీని కీపేరు కల్గెనఁట. విష్ణుదేవుని డోలోత్సవము (ఉయ్యాలలోనుంచి యూపుట) లొనర్తురు.

## వసంతికాక్షేత్రము:

—బిందువాసిని. సంయుక్తరాష్ట్రములలోని మీర్జాపూర్ జిల్లా వింధ్యాచలముపై నున్న సుప్రసిద్ధశక్తిపీఠము.

## వసతి లేక వసాతిదేశము:—

టిబెటీయులు, బర్మీయులు, కలిసినకలయిక ప్రజ లీదేశమున వసించువారనియు, టిబెట్టునకుఁ దూర్పు, ఆగ్నేయదిశలయందో, బర్మాదేశమున కుత్తరదిశయందో, కామరూపదేశమున కీశాన్యదిశయందో యీదేశ ముండియుండెడిదిగ తలంపఁబడుచున్నది.

Mac Crindle పరిశోధకుఁడు దీనిని రావల్పిండిమండలప్రాంతమేమోయని తలంచెను.

## వసనాభి:—

(నాభి చూడుఁడు).

## వసుకుందపురము:—

(విశాలీనగరము, మగధరాజ్యము చూడుఁడు).

## వసుగణము (అష్టవసువులు):—

దక్షప్రజాపతికుమార్తెలలోఁ బదిమందిని ధర్మున కిచ్చి పరిణయ మొనర్చెను. వారిలో నొకతెయగు వసువునం దెనమండుగురు పుత్రులఁ గల్గి వారు

వసువు లనంబడి, యందఱు గలసి వసుగణముగఁ జెప్పఁబడియున్నారు.

౧ ధరుఁడు—ఇతనికి యాపుఁడనియుఁ బేరు కలదు. కొన్ని పురాణములందు ధరుఁడనంబడుమాటకు బదులు వరుణుఁ డనియున్నది. ఈవరుణుఁడెవరో తెలియరాకున్నది.

౨ ధ్రువుఁడు— కొన్ని పురాణములందు విష్ణువని యున్నది.

౩ సోముఁడు— కొన్ని పురాణములం దీ పేరునకుఁ బదులు నహుషుఁ డని యున్నది.

౪ అహుఁడు— ఇతనికి ధర్ముఁడు లేక అధ్వరుఁ డనియుఁ బేరు కలదు.

౫ అనిలుఁడు— ఇతని కగ్ని యనియుఁ బేరు కలదు. మఱికొన్ని పురాణములం దనిలుఁ డనుటకు బదులు జయుఁడని యున్నది.

౬ అగ్ని—

౭ ప్రత్యూషుఁడు— కొన్ని పురాణములం దీపేరునకు బదులు వృషభుఁడని పేరుఁ గన్పించుచున్నది.

౮ ప్ర[illegible]— (వీరు అష్టవసువులు).

వీ రెనమండుగు రొకప్పుడు వశిష్ఠమహర్షి యొక్క హోమధేనువు నపహరించి, శపింపఁబడి, శంతనచక్రవర్తికి గంగాదేవియం దెనమండుగురు పుత్రులుగ జన్మించిరి. వీరియం దెక్కువ యపరాధము గారకుఁడై నప్రభాసుఁడు తనభార్య కోరికె మేరకుఁ దక్కినవారి సహాయముతో ధేనువు నపహరించినవాఁడు. అతను తక్కినసోదరులదోషములందలి చతుర్థాంశములను కూడ తాను వహించి, భీష్ముఁడను బేరం బరఁగుచు నాజన్మాంత బ్రహ్మచర్యవ్రతదీక్షతో ధర్మపరుఁడై చిరకాలము జీవించి, యేకాదశితిథిని మృతినంద నాఁటిదిగ నానాఁటి యేకాదశి యేఁటేట నాయనపేరం బరఁగుచు భీష్మైకాదశి యనఁబరఁగుచున్నది. వసువులు నవదేవతాగణములలోని వారు. (పితృగణము చూడుఁడు).

## వసుగోత్రము:—

(నిధ్రువగణము చూడుఁడు).

## వసుదుఁడు లేక త్రసదస్యుఁడు:—

ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు.

## వసుదేవుఁడు:—

అత్రి సంతతి. చంద్రవంశపుయాదవుఁడు. దేవమీఢునిపౌత్రుఁడు. శూరునిపుత్రుఁడు. (సోదరి రాజాధిదేవి.) (అవంతిదేశాధిపతియగు జయత్సేనునిభార్య). కుమాళ్లు విందానువిందులు. కుమార్తె మిత్రవింద. (శ్రీకృష్ణునిభార్య).

భార్యలు సుతులు పెక్కండ్రు గలరు: అందు దొరకినపేర్లు.

దేవకీదేవివలనఁ గల్గినసుతుఁడు శ్రీకృష్ణుఁడు.

రోహిణి లేక (రేవతి) వలన బలరాముఁడు, గదుఁడు, విపులుఁడు, సారణుఁడు.

శ్రీదేవివలన సుధన్వానుఁడు, వసువు, హంసుఁడు.

మదిరవలన శూరుఁడు.

సహాదేవివలన శుక్రముఖ్యుఁడు.

ధృతివలన త్రివృష్టుఁడు.

ఇంకను పౌరవి, భద్ర లేక కౌసల్య, రోచన, శాంతి యనుపేర్లుఁ గలభార్యలు తొమ్మండుగురును, పుత్రులు పదిమూఁడియుఁ గానఁబడుచున్నారు.

వసుదేవుని సోదరి కుంతీదేవి. పాండురాజు భార్య. పాండవులతల్లి. కుంతిభోజుని పెంపుడు కుమార్తె.

**వసుధార లేక వసుధారతీర్థము:**— (బదరీనాథము లేక బదరీనారాయణము చూడుఁడు.) మందాకినీనది జన్మస్థానము.

**వసుపదుఁడు:**— తండ్రి కోలాహలుఁడు. తల్లి శక్తిమతి. సోదరి గిరికాదేవి. ఈమె వసుమహారాజు భార్య.

ఈతఁ డుపరిచరవసువుకడ సేనాపతిగ నుండిన వాఁడఁట.

**వసువు (లను పేర్లుగలవారు):**—
వసువులు పెక్కండ్రు గలరు.

౧ భృగునివంశస్థుఁడగు భూతజ్యోతికుమారుని పేరు వసువు.

౨ కుశికునినాల్గవకుమారుఁడు వసువు. గిరివ్రజపురనిర్మాత.

౩ వసుదేవునకు శ్రీదేవియందుఁ గల్గిన కుమారుఁడు వసువు.

౪ మురాసురునికుమారుఁడు వసువు.

౫ దక్షప్రజాపతికుమార్తె యొకతె వసువు (ధర్ముని భార్య.)

౬ చేదిదేశపురాజగు కృతికుమారుఁడు వసువు. ఈతఁడు కోలాహలశుక్తిమతులపుత్రికయగు గిరికాదేవిని పెండ్లాడినవాఁడు (మహారాజు). మఱియు అష్టవసువులని యెనమండుగురువసువులు పురాణప్రసిద్ధమే..

ఈఅష్టవసువులలోనివాఁడే భీష్ముండును. (అష్టవసువులు చూడుఁడు.)

**వస్తికర్మ:**— ఇది యాయుర్వేదవైద్యవిధానమునందలి యొకవిధానచికిత్స. పిచికారినైచి కషాయాదియౌషధములను శరీరములోని కెక్కించి రోగోపశాంతిఁ గల్గించువిధానమునకు వస్తికర్మ యనిపేరు. ఆయుర్వేదవైద్యవిధానమునఁ జెప్పఁబడినటుల రోగనివారణకుఁ బంచకర్మలు అయిదు విధానములుగ వివరింపఁబడినవి. అవి శోధనము, శమనకర్మ, స్వేదకర్మ, స్నేహాకర్మ, వస్తికర్మ యనంబడునవి. ఇందు శోధనకర్మ వమనమనియు, విరేచనమనియు, ద్వివిధముగ నుండెడిని.

వీటియందు శోధనకర్మ శరీరమును చక్కఁగ శోధించి, లోనివిషరోగపదార్థములను వమనముఁ గల్గించిగాని, విరేచనముఁ గల్గించిగాని, పైకి వెడలఁజేసి రోగోపశాంతిఁ గల్గించుట. శమనకర లేపనములు మొదలగు బహిఃప్రయోగములవలన బాధను శమింపఁజేయుట స్వేదకర్మ చెమటఁ బుట్టించుచు లోనిదోషపదార్థములను చెమటగుండా వెడలింపఁజేయుచు, రోగోపశమనముఁ గల్గించుట. స్నేహాకర్మ తైలములు మొదలగునవి శరీరమున మర్దనలుచేయించుట, పూయుటలవలన శరీరమును మెత్తఁబఱచి, బాధానివృత్తిం గల్గించుట. వస్తికర్మ పిచికారీమూలమునఁ గషాయాదులను శరీరములోనికిం జొప్పించి రోగశాంతినిఁ గల్గించుట.

"వస్తినా యత్కర్మ దీయతే త ద్వస్తికర్మ" తొల్లింటికాలమున నిప్పటిపిచికారీరకములు లేని కారణమునఁ దిత్తులబలమున గొట్టములగుండా కషాయాదులను లోనికిం జొప్పించుచుండిరి. అదియే వస్తికర్మ.

వసి యన తిత్తి యని యెఱుంగునది. కొన్ని జంతువులతిత్తులు బాగుఁజేసి దీని కుపయోగింపనగునని చెప్పఁబడినది. దీనికిఁగట్టుగొట్టముల కాయుర్వేదశాస్త్రమున నేత్రి మనిపేరుఁ బెట్టి వాడిరి గాని, నేత్రి మన దానిగుండా వైచినరంధ్రము నకు వర్తింపంజేయుట సమంజసమని తోఁచెడిని. వస్తి, నేత్రము లనంబడుగొట్టము లాయాకార్యముల కర్హములగునటుల బంగారుచేతను, వెండి

చేతను, రాగిచేతను, ఇత్తడి, ఇనుము, ఏనుఁగు దంతముచేతఁ గొన్నియు, కొమ్ముచేఁ గొన్నియు, కొన్నిజాతులకొయ్యలచేతఁ గొన్నియు, రత్నముల లోని కొన్నిజాతులరాళ్ళచేఁ గొన్నియు, వస్తిగొట్టములు (నేత్రములు) చేయఁబడవలయునని శాస్త్రగ్రంథముల సూచింపఁబడియున్నది. ఇందుఁ గొన్నిటికి వంకరలు సూచింపఁబడియున్నవి. ఇంకను గొట్టములయొక్క రంధ్రములకు వివిధపరిమాణములును చెప్పఁబడినవి. వాగ్భటమున నీసంగతి చక్కఁగఁ జర్చింపఁబడినది. గొట్టముయొక్కకొనలుండవలసిన వివిధాకారములు సూచింపఁబడినవి. వీట్లగుండా శరీరములోనికింబ్రయోగింపఁబడవలసిన కల్కద్రవ్యములు, కషాయద్రవ్యములు, స్నేహద్రవ్యములుఁ గూడ వివరింపఁబడినవి.

ఇంతియే గాక వస్తికర్మవిధానములు త్రివిధ భేదములు. నిరూహము, అనువాసనము, ఉత్తరము నని త్రివిధములగు భేదములుగ నీవస్తికర్మవిధానములు చెప్పఁబడినవి. ఏయేరోగములం దెట్టెట్టిస్థితులం దీమూఁడువిధానములలో నేవిధానమున వస్తికర్మను వైద్యుఁ డొసర్పవలెనో విధింపఁబడిన యేర్పాటులు కలవు.

వీట్ల నింకను నట్లే వివరించుచు వ్రాయుటకిది తావు గాదు. కాని, ప్రస్తుత మావైద్యవిధానమునఁగల పరిపూర్ణతను, నిపుణతను, గొనియాడుచుఁ దర్వాతికాలఁపు ననుభవములేక నట్లే నిలచిపోయి. వృద్ధిఁ గాంచక నామమాత్రావశిష్టమైయున్న భారతదేశఁపు టాయుర్వేద వైద్యవిధానమునఁ బిచికారీలమూలమున నౌషధములను శరీరములోనికిఁ జొప్పించి, రోగనివారణముఁ గల్గించు విధానము శాస్త్రమున లేకపో లేదని యెఱుంగఁ దగినది. ఎట్టిరోగులకు నెట్టిబాధలందు నెట్టివిధాన వస్తులలో నేద్రవ్యము నేనేత్రమున నె ట్లుపయోగింపవలెనో యెఱుంగుటకుఁ గొంత పరిశీలన మొసర్పవలసియుండుననియు నిది యొక చక్కని వైద్యవిధానమే యనియుఁ దోఁపకపోదు. ఇంకను వస్తికర్మవిధాన మాతొల్లింటికాలమునఁ జక్కఁగ మనదేశమున వ్యాపించి యాచరణయం దుండెనని పరిశీలనలవలనఁ దేలుచున్నది.

## వస్తికుల (వస్తిస) గోత్రము:

ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. వస్తికుల లేక వస్తిసగోత్రము. ఏకార్షేయ [౫౧] గోత్రము. వశిష్ఠగణము. సంస్కృతగోత్రము వాశిష్ఠస. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథములు ధర్మసింధు, నిర్ణయసింధు. రాజదేవుఁడు దేవత. పల్లవాంబ భార్య. పద్మాచలము తపస్థానము. పల్లవసరస్సు తటాకము. జపము లక్ష. దీపములు ౩౭. క్షేత్రసంఖ్య ౨౦. వజ్రము దానము. తెల్లవట్టివేరు వర్జనీయము.

[వైశ్యగోత్రములు చూడుఁడు].

## వస్తుశక్తిన్యాయము:

ఒకవస్తువుయొక్క శక్తి దానిబలాబలములు, స్థితిగతులు, నుపయోగములవలననే తెలియునని భావము.

## వస్తుసామాన్యన్యాయము:

— అప్పుతీర్చుట యన తొల్లి తెచ్చుకొన్న రూపాయలే తిరిగి యివ్వ నక్కఱలేదు. ఆసంఖ్యఁగలవి, ఆవిలువఁగలవి యిచ్చినవస్తుసామాన్యమేయని భావము.

## వస్యపురము (బస్య లేక బైశిక్య):—

వైశిక్యపురమనియు వాడుక యుండెను. తొల్లింటి వరాటాట (వరాట) దేశమందలిపురము. వశ్యపురముంగూర్చి కన్నారీశాసనములందుఁ బ్రశంస

కలదు. బ్రహ్మపురాణము ౨౭ అధ్యాయమున దీనింగూర్చి నుడువఁబడినది.

దీని నిక్కాలమున బొంబై రాష్ట్రములోని బేసిన్‌పురముగఁ (Basin) బిలుచుచున్నారు.

**వస్త్రపాతక్షేత్రము:—**
(గిరినగరము చూడుఁడు).

**వహాబీలు:—**మహమ్మదీయమతస్థులలో నొకశాఖవారు. 'వహా' బనుమూలపురుషునుండి నే రందినవారు. క్రీ. వె. ౧౮ శతాబ్దమునుండి వీరు కలరు. వీరుయాత్రలను నిరసించుచుందురు. యాత్రలు చేయ నొల్లరు. ఋషులను సన్మానింపరు. పొగాకు ముట్టరు. ధరించు బట్టలందు విలువఁ గలవియుండరాదు. అనఁగా డాబువేషములు వీరికిఁ గిట్టవు. వహాబీలు ౧౯ వ శతాబ్దప్రారంభమునఁ బ్రబలియుండ, ఈజిప్టుపరిపాలకుండగు మహ్మదాలీ గొప్పగొప్ప సంగరము లొనర్చి వీరి నడంచెనఁట. ఇరువదియవశతాబ్దమున, అబ్దుల్ అజీజు కాలమున వీరు తిరుగ బలపడిరి. ఐరోపాసంగ్రామానంతరము వహాబీలు చెలరేగి క్రీ. వె. ౧౯౨౬ లో వీరినాయకుఁడు ఇబాన్‌సౌడ్ అను నాయకుఁ, అరేబియాలోని హెజాజ్‌నకు, నెజడ్‌నకుఁ గల్పి భూపాలుఁడైన పిదప నాసీమలు వహాబీలకు వశమాయెను.

వహాబీసంఘము మొదిని క్రీ. వె. ౧౮ శతాబ్ద ప్రారంభకాలమున నేర్పడెననియు, మహమ్మద్ ఇబిన్ అబ్దుల్ వహా బను పేరుకలవాఁడు స్థాపించుట నాయనపేరం బరగెడిననియు, ఆయన ౧౭౦౪—౯౨ కాలమునాఁటివాఁడనియు; గొఱ్ఱెలం గాచుకొనుచుండిన నెజిడ్‌గారిపుత్రుం డనియు, ఇస్లాంమతమం దాదిని వ్యాపించియుండిన Simplisity తిరుగ వ్యాపింపఁజేయుటయు, తీర్థయాత్రలను, మహాత్ములపూజను, నిరసించుటయు, ధరించు దుస్తులందు విలువను నిరసించుటయు, దేవస్థానముల గొప్పను వారించియు, తగ్గించియు, సాధుత్వమునకుఁ దెప్పుటయు, పుగాకు వాడుకను మాన్పుటయు, వీరి ముఖ్యోద్దేశ్యములని తెలియుచున్నది.

**వహ్నా:—**అత్రిసంతతి. చంద్రవంశము. తండ్రిపేరు తుర్వసువు. కుమారునిపేరు గోభానుఁడు. అగ్నికి వహ్ని యనియుం బేరు కలదు.

**వహ్నిప్రకారములు ౮:—** (అగ్నియొక్క యెన్మిది రూపములు.)

౧ జాతవేద.
౨ సప్తజిహ్వ.
3 హవ్యవాహనమూర్తి.
౪ అశ్వోదరరూపము.
౫ వైశ్వానరరూపము.
౬ కౌమారజరూపము.
౭ విశ్వముఖరూపము.
౮ దేవముఖ.

**వ్యంజకవ్యంగ్యన్యాయము:—** ఒక శబ్దమునకు విలక్షణమగు నర్థమిచ్చు పదమునకు 'వ్యంజక' మనిపేరు. అట్టి వ్యంజకము చేసియుండి, విలక్షణార్థ మిచ్చుమాటలకు 'వ్యంగ్య' మనిపేరు.

దీనిని 'వ్యంజకోహా యథా లోకరీతిన్యాయ' మనియు నందురు. (మాషాసిక్తతామ్రన్యాయము చూడుఁడు.)

**వ్యంజకోహి యథా లోకరీతిన్యాయము:—**(వ్యంజకవ్యంగ్యన్యాయము చూడుఁడు.)

**వ్యపదేశి:—** ఒకేధర్మమున రెండుధర్మములారోపింపఁ జేయుటకు వ్యపదేశ మనిపేరు.

'రాముఁ డొక్కఁడే. అతని తలిదండ్రులకుఁ గుమారుఁడు' అనుతటి నతఁడే జ్యేష్ఠుఁడనియు, నతఁడే కనిష్ఠుఁడనియు రెండు ధర్మములు నారోపింపఁబడినవని భావము.

**వ్యభిచారము:—** సర్వసాధారణముగ ధర్మము లేక ఆచారమునందు నియతిని వీడి, చరించుటయని యర్థము. ఇట్టివి మనస్సునం దనర్హాములగు కార్యములం గోరి, తలపోయుట మనోవ్యభిచార మనియు, శరీరముచేత (నియతిని వీడి) అనర్హాములగు కార్యము లొనర్చుట కాయిక వ్యభిచార మనియు, వాక్కు (నోటిమాటల) చే ననర్హావాక్యములను వల్కుట, వాగ్వ్యభిచార మనియు, త్రివిధముగ నుండును.

ఇంకను వేదాంతగ్రంథములందుఁ దానుద్దేశించినది నెరవేఱక పోవుటను, అన్వయవ్యభిచార మనియు, తా నుద్దేశింపకున్నను నెఱవేఱుటను వ్యతిరేకవ్యభిచార మనియు వాడియున్నారు.

**వ్యవసాయమునకు ఆంగ్లదేశమున గైల్సు అనువాడుక (పెట్టుడుపేరు):—** ఆంగ్లదేశమునఁ బల్లెప్రాంతములందు సేద్యమే వృత్తిజీవనముగను సేద్యధర్మములను దప్పఁ దక్కిననగరములందు వ్యాపకముఁ జెందిన నాగరికధర్మములందు విముఖతయుం గల్గిన జనులను 'గైల్సు' (giles) అను పెట్టుడు పేరున [nickname] వాడుదురు.

క్రీ.వె. ౧౭౬౦ సం॥ర ప్రాంతమున నొకనాటక సంఘమునఁ బాత్రధారిగనుండిన 'బిక్కెర్‌స్టాఫి' [Bickerstaffe] యనునాతఁడు 'maid of the mill, అనంబడు నొకనాటకమును వ్రాసెను. అం దొక ప్రధానపాత్రి 'గైల్సు' అను పేరుగల సేద్యజీవనముఁగల మనుజుఁడు.

ఆనాటకము కడురమ్యముగ నుంటఁ బెక్కండ్రు నాకర్షించి, చాలవ్యాపకముఁ గాంచెను. నాటి నుండియు సేద్యవృత్తిపరులకు గైల్సు అను నామ మాంగ్లసీమలందు వ్యాపకముఁ గాంచెను. ఇది కొంతవఱకు వెక్కిరింత పేరుగ నర్థము స్ఫురించుచున్నను, వ్యవసాయ మొనర్చువారి కంత నొప్పిఁ గల్గించునది కాదు.

పిదపఁ గొంత కాలమున కాంగ్లదేశ మేలిన మూఁడవజార్జిభూపతికిఁ బట్టణములందలి విముఖవలనను, రాజభవనమర్యాదలందలి నిర్లక్ష్యమువలనను, పల్లెగ్రామములు, వ్యవసాయము మొదలగు వాన్లియందుఁగల యభిమానమువలనను, ప్రజ లాయనను 'ఫార్మరు గైల్సు' అని చెప్పుకొనుచుండిరఁట. ఎట్లనను గైల్సుపదము నైఘంటికము కాలేదు. అధికారాంగీకారమును బడయలేదు. వంచనం గల్గించు నదియుఁ గాదు. పెట్టుడు పేరు.

**వ్యవసాయశాస్త్రము:—** భరతదేశఁపు టాదికాలమునాఁటి వ్యవసాయశాస్త్రగ్రంథములు సరిగా లభింపమి నాఁకాలమునాఁటి స్థితి వ్రాయఁజాలముగాని, యాంగ్లపరిపాలమునాఁటి వ్యవసాయ గ్రంథములవలన మన కీవిషయముఁ దెలియుచున్నది.

సేద్యము త్రివిధాత్మకము. అవి భూమి, వ్యవసాయ మొనర్చు నాతఁడు, పరికరములునని. బ్రిటీషుసీమలందుఁ బరికరములు లెక్కింపఁబడకఁ దస్థానములు, మేఁకలు, గొఱ్ఱెలు, పందులు, ఆవులు మొదలగు జంతుసముదాయ మొకభాగముగఁ జెప్పఁబడినది. భూమి యన సారవంతమై వ్యవసాయమునకు, మంచిపంటలకు నర్హతఁగలది యనియే భావనఁ గాన నెరువులు నిండే చేరునని

భావము. వ్యవసాయఁపుఁజేనియందలి మొక్కలకుఁ గావలసిన soluble mineral matters సరిగా నుండినఁ జేలు బలముగఁ బెరిగి మంచిపంటఁ బండును. ఈపరిస్థితియే 'agricultural Value of the Soil' అని యాంగ్లవ్యవసాయ గ్రంథ ములందుఁ జెప్పఁబడినది. పొలములందు వ్యాపించి యుండురసాయనపరిస్థితు (Chemical nature) లం బట్టి భూములు 'ఇసుకగొడి' (గరప) భూము లనియు, బంకమట్టిభూము లనియు, Carbonate of time ఉన్నభూము లనియు, మూఁడు విధములుగఁ జెప్పఁబడినవి. ఇందు మొదటిరెండు గాని, అవి కలసినవిగఁగాని యున్నభూములను లోతుగ వేళ్ళు పోఁగల Loam అనియెదరు. అవి చాలా శ్రేష్ఠమైన వ్యవసాయఁపుఁబొలము లనఁ బడుచున్నవి.

సేద్యఁపుభూమియందు Humus అనంబడు చు మొక్కల యాహారమున ముఖ్యభాగము, ముఖ్యపదార్థము, నైట్రోజనస్ (nitrogenous) లేకున్న నాపొలము ఫలవంతమైనది కాదని చెప్పఁబడవలయును. భూమియందు నైస ర్గికముగఁగాని, అధికవ్యవసాయమునుండి గాని, మొక్కలయాహారపదార్థములలో నేదేని కొర వడినచో నత్తఱి నాలోపమును భర్తీచేయుటకు వలయు నెరువులను రసాయనశాస్త్రపరిచితుఁడగు వ్యవసాయవిజ్ఞాని నెఱపి భూమిని బాగుఁ జేయుటఁ గర్తవ్యము.

వ్యవసాయఁపు మొక్కలు త్రివిధజాతులని చెప్పఁబడినవి. మనుష్యులకుఁ బశువులకు నాహార పదార్థములుగఁ బనికివచ్చునవిగఁగాని, పనికివచ్చు పదార్థముల నిచ్చునవిగఁగాని యుండు మొక్క లొకజాతిగను, చేలమధ్యఁ బెరుఁగు గడ్డిగాదలు (కలుపు) రెండవజాతిగను, మొక్కలం దినివైచి బంటల నాశన మొనర్చు ఫంగస్ మొదలగు రోగ దోషములు మూఁడవజాతిగను వివరింపఁబడినవి.

ఇంకను గొన్నిజాతులమొక్కలు కొన్నిమాస ములవఱకే బ్రతుకునవియు, మఱికొన్ని యెక్కువ కాలము జీవించునవియుఁ గలవు. పొలములందుఁ బంటలు మార్చుచు సేద్య మొనర్చుటయుఁ గొంతవఱ కుపచరించునదియే. పొలమునందు వ్యవ సాయమాపి యొకసంవత్సరము భూమికి విశ్రాంతి నొసంగుటయుఁ గొంతమేలుఁ గల్గించునని చెప్పఁ బడినది.



నాగళ్ళు, నితరవ్యవసాయపరికరములు, దున్ను పశువులు, నీటివసతులు, నతివృష్టి, యేటివెల్లు వలు, ననావృష్టి మొదలగున వన్నియు ననుకూల పరిస్థితిం గూర్పవలసి యుండును. ఇది మూఁడవ భాగము. ఇంగ్లాండునందు ౧౯౦౮ వ సంవత్సర ము ఎగ్రికల్చరల్ హోల్డింగ్సు ఆక్టు కలదు.

## వ్యసనములు ౭ (సప్తవ్యసనములు:—

౧ స్త్రీలకుఁ బురుషులయందునను, పురుషులకు స్త్రీలయందును సంగమవాంఛ.

౨ ద్యూత (జూజము) వాంఛ.

3 మధు (కల్లు, సార మొదలగుమత్తుపదార్థ)పాన వాంఛ.

౪ మృగయా (వేఁట అడవిమృగముల వేఁటాడు) వాంఛ.

౫ కఠినోక్తులాడు (గడసరితనఁపు) వాంఛ.

పరద్రవ్యాపహారణ- (మాయోపాయములచే నితరుల సొమ్ము లన్యాయముగ హరించు) వాంఛ.

౭ పరనింద- ఇతరులఁ దూలనాడి ప్రసంగించు) వాంఛ.

కామజన్యవ్యసనములు [౧౦]

౧ వేఁట (వ్యసనము) ౨ ద్యూతము, ౩ పగటి నిద్ర, ౪ పరనింద, ౫ పగలు స్త్రీసంభోగాభ్యాసము, ౬ మద్యపానము, ౭ నృత్యవ్యసనము, ౮ సంగీతవ్యసనము, ౯ వాద్యవ్యసనము, ౧౦ వ్యర్థదండన. (హింసావ్యసనము లేక వినోదము. ఇవి కామజన్యవ్యసనములు).

క్రోధజన్యవ్యసనములు (౮)

౧౧ కొండెములు చెప్పుట, ౧౨ సాహసించుట, ౧౩ ద్రోహచింత, ౧౪ కృపణత (పిటీలు లేక కపటప్రవర్తనము), ౧౫ పరగుణశ్రేయాసహనము, ౧౬ పరదూషణము, ౧౭ పరుషవాక్య ప్రకటనావ్యసనము, ౧౮ అన్యాయజీవనము, లేక నన్యాయ ప్రవర్తనము, [ఇవి క్రోధజన్యవ్యసనములు].

## వ్యవహారికనామకరణము లేక వ్యవహారికనామములు:—

[నామకరణములు, త్రివిధము చూడుఁడు].

**వ్రంగకులగోత్రము:—** ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. వ్రంగకుల [వంగకుల వ్రంగమూలకుల వంగమూల] గోత్రము. ఆత్రేయ [౬] గోత్రము. వాయుగణము. సంస్కృతగోత్రము వాయవ్యస. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖన్డ, సమానగోత్రము. హయగ్రీవస. రామేశుఁడు దేవత. రామాంబ భార్య. శ్రీశైలము తపస్స్థానము. రామాంబుధి తటాకము. జపము అర్బుదము. క్షేత్రసంఖ్య ౫౫. దీపములు ౪౦. షోడశమహాదానములు దానము. ఆవాలు, వావిలాలు, వడియములు వర్జనీయములు.

**వ్రకశిష్టకులగోత్రము:—**

[మంగమకుల చూడుఁడు.]

**వ్రక్కాలకులగోత్రము:—**

[మంగమకుల చూడుఁడు.]

**వ్రజభాష:—**

[హిందీభాష చతుర్విధము చూడుఁడు.]

**వ్రజమండలము:—** శ్రీకృష్ణుఁడు భూమియందు జనించి బాల్యలీలలు సలిపి, యావనలీలల నెరపినతా వగుటఁ బవిత్రక్షేత్ర మాయెను. దీనిని ౮౪ క్రోశములప్రదేశముగఁ జెప్పియున్నారు. యమునానదీతీరము.

ఇటఁ జూడఁదగిన క్షేత్రములు పెక్కుఁ గలవు. అన్నియు వైష్ణవులకుఁ బవిత్రవంతములే. అన్నియు శ్రీకృష్ణసంబంధములే.

పురాతనగోకులము:- దీనిని పురాణగోకుల మనెదరు. ఇది మహావనము. మధురాపట్టణముకడ యమునానది కవ్వలిగ్రామము. శ్రీకృష్ణుని బాల్యమున నందుఁడు పెంచినతావు. ఇట నందుని గృహమును, మహామాయయను బాలిక జన్మించిన తావును, రెం డెత్తగు మెరకప్రదేశములఁ గాననగుచున్నవి. శ్రీకృష్ణుఁడు పసిబాలుఁడగు తఱిఁ బరుండినగదిని, ఆనాటి యుయ్యెలయును, శివుఁ డాబాలుం జూడ నేతెంచినతావును, పూతనం జంపిన తావును, రోలును, ఇట్లెన్నియో యానవాళ్ళుం జూపుదురు.

ఇట వల్లభాచార్యనిర్మితమగు క్రొత్తగోకుల మొకటి కలదు. అందునను నీపవిత్రస్థానములనే

చూపుచున్నారు. అందు శ్యామలాల్ [శ్యామ సుందరస్వామి] దేవాలయప్రదేశము, నందునిభార్య యశోద మాయ లేక యోగనిద్రం గనినతావని యు, నదియే కృష్ణుని మార్చుకొనిన తావుగ నచటివారు చెప్పుదురు. క్రొత్త గోకులమునందలి నందునిగృహ మనఁబడుతావు మామూలుమేర ఔరంగజేబు మసీదునిర్మాణ మొనర్చెను.

ఇందిప్పుడు కనఁదగిన తావులు.

౧ మధువనము - [మహోలీగ్రామముకడనున్నది]

౨ తాళవనము - తార్ణీగ్రామముకడ నున్నది. ఇట బలరాముఁడు ధేనుకాసురుని వధించెను.

౩ రాధాకుండము- ఇట శ్యామకుండము, రాధా కుండము నని రెండు సరస్సులు కలవు. అందు శ్రీకృష్ణుఁ డరిష్టమను ఋషభముం జంపిన పాపపరిహారము నడసెనఁట.

౪ గోవర్ధనము- ఇది యొకపట్టణము. ఇట మాన సగంగాసరస్సు గలదు. తీరమున గోవర్ధనపర్వ త మున్నది. కతిపయదూరమున నీపర్వత మె త్తినతావును 'పితో' యని పిలుచుచున్నారు.

౫ గన్తోలీ- రాధామాధవ పరిణయస్థలము.

౬ కంబానా- అఘాసురుని శ్రీకృష్ణుఁడు వధించిన తావు.

౭ బార్షానా- రాధాదేవి బాల్యముఁ గడపినతావు.

౮ రితోరా- రాధాపరిచారకయగు చంద్రావళి యొక్క స్వగ్రామము.

౯ నన్దగాన్- నందయశోద లుండినతావు.

౧౦ పాన్సరోవరము- ఉదయ సాయంసమయముల శ్రీకృష్ణుఁడు పశువులను నీరుఁద్రావఁ దోలు చుండిన సరస్సు.

౧౧ చరణ్పహాడ్- ఇంద్రుఁడు శ్రీకృష్ణునికి సన్మాన వందన మాచరించినతావు.

౧౨ బీర్ఘాట్ [వస్త్రహరఘాట్]- గోపీవస్త్రా పహరణస్థలము.

౧౩ వకవనము- వకాసురుని శ్రీకృష్ణుఁడు చంపిన తావు.

౧౪ భాండీరవనము- ప్రలంభాసురుని బలరా ముఁడు చంపినతావు.

౧౫ రావల్- రాధాదేవి పుట్టి యొకసంవత్సరము వఱకుఁ బెరిగినతావు.

౧౬ బ్రహ్మాండ్ఘాట్- మాతోడాగ్రామము కవ్వ లనున్నతావు. శ్రీకృష్ణమూర్తి యశోదా దేవికి నోరుఁ దెఱచి బ్రహ్మాండదర్శనముఁ గల్పించిన తావు.

౧౭ మహావనము- శ్రీకృష్ణుఁడు బాల్యముఁ గడ పుచుఁ బూతనను వధించినతావు.

౧౮ మధుర - ఇది పెద్దపట్టణము. సైన్యస్థానము. ఇది శ్రీకృష్ణుఁడు కంసుని వధించిన తావు. [ఇప్పుడు ముత్రా యనుచున్నారు.]

౧౯ మధురయందు శ్రీకృష్ణుఁడు కంసుని వధించి యలసి యమునాతీరమున విశ్రాంతిఁ జెందిన తావు. [ఇప్పటి విశ్రాంతిఘాట్].

౨౦ పులిన - [వ్రజములో] ఇది రాసమండల క్రీడాస్థలము. బృందావనము.

౨౧ కాలీయదహనఘాట్— కాలీయమర్దనస్థలము. బృందావనము.

ఇవి వ్రజమండలమునఁ జూడఁదగినతావులు. ఇందు బృందావనమును, అందలి ౨౦--౨౧ తావు లును, కల్పితములని పెక్కండ్రు పరిశోధకులు సంశయించుచున్నారు.

## వ్రజమండలవనములు పన్రెండు:-

౧ తాళవనము— దీనిని విష్ణుస్థాన మనియు నందురు.

౨ కుందవనము— దీనికి మతాంతరమున గుముద వనమనియుం జెప్పఁబడినది.
౩ బృందావనము.
౪ ఖాదిరవనము— ఖదిరవన మనియు నందురు.
౫ కామ్యకవనము.
౬ బహుళవనము— దీనికి వకుళవన మనియుం బేరుఁ గలదు.

ఇవి యమునానదీ పశ్చిమతీరమున నున్నవి.

౭ మహావనము.
౮ బిల్వవనము.
౯ లోహవనము.
౧౦ భాండీరవనము.
౧౧ భద్రవనము.

ఇవి యమునానదిదరిఁ దూర్పుతట్టున నున్నవి.

౧౨ అగ్రవనము— దీని నిప్పు డాగ్రానగర మనుచున్నారు.

## వ్రతదినములు:—

[పండుగలు చూడుఁడు.]

## వ్రతపల్లవములు:—

[పంచపల్లవములు చూడుఁడు.]

## వాంఛాయనగోత్రము:—

(వాధ్రిస్వ లేక మిత్రయువగణము చూడుఁడు.)

## వాంతిభేది:—

[విశూచి చూడుఁడు.]

**వాకచెట్టు**:—వాకపండు భోజనపదార్థము. ఇది పెద్ద చిన్న వాకలని ద్వివిధము. లా. Carissa Carondas. సం. కరమర్దః, కరమర్దకః, కరమర్ది, కరాంబుజః, కరామ్లకః, అవిఘ్నవృక్షః, అనియుఁ గొందరు వాడియున్నారు. ఇందుఁ బెద్ద వాక శ్రేష్ఠజాతి.

వాకను ఓక యని యజ్ఞతఁగ వల్లుచుందురు. వాకకాయలు జఠరదీప్తి నిచ్చుననియు, పైత్యముఁ జేయు ననియు, పండునం దీగుణములే బలముగఁ జేయును. బెల్లము, శొంఠి వాకకు విఱుగుడులని చెప్పఁబడినది.

## వాక్యములు రెండువిధములు:—

వేదాంతశాస్త్రమున జీవేశ్వరులకు భేదనిరూపణముం దెల్పువాక్యములను 'అవాంతరవాక్యము' లనియు, జీవేశ్వరుల నైక్యనిరూపణముం దెల్పు వాక్యములను 'మహావాక్యము' లనియు, నద్వైత సిద్ధాంతము నంగీకరించువారు వాడుదురు.

**వాక్యశకునములు**:— కార్యారంభ, యోచన, ప్రశ్నాదుల ప్రారంభములందు యజమానునకు వినంబడు సంఖ్యలంగూర్చి వాక్యశకునములని నిర్వచింపఁ బడినది. 'ఒకటి' అనుమాట యేప్రసంగముల ధోరణిలో నైనను నుచ్చరించుట సంభవించి యది కార్యయజమానికిఁ బ్రారంభ కాలమున విన్పించుట యపశకున మనియు, రెండనుపదము వికటసంధి యనియు, మూఁడనుపదము కలహప్రద మనియు, నాల్గనుపదము విరోధకరమనియు, ఐదు మహాకలహప్రదమనియు, ఏఁడు అనుపదము వినఁబడిన మరణతుల్యమగు నపశకున మనియు, ఎన్మిది యనుపదము కార్యహానియనియు, పంద్రెం డనుపదము ఆపదలనియు, పదమూఁడనుపదము స్థానభ్రష్టతం గల్గించుననియు, పదునే ననుపదము నిర్బంధప్రదమనియు, ఇవి చెవినిఁబడుటపశకున మనియుఁ జెప్పఁబడినది.

ఇంక నారు, తొమ్మిది, పది, పదునొకండు, పదునాలుగు, పదునారు, పదునేఁడు, పదునెన్మిది, పందొమ్మిది, ఇరువది యనుసంఖ్యాపదములు సుశకునపదములుగఁ జెప్పఁబడినవి. అందు ౬ శ్రే

యస్కారము, ౯ ధనలాభము, ౧౦ సంపత్ప్రదము ౧౧ జయప్రదము, ౧౨ మేలు, ౧౩ దుష్కర కార్యసిద్ధి, ౧౪ ఆపన్నివారణము, ౧౫ మహా కార్యసాధనము, ౧౯ దుష్కరములగు కార్యము లంగూడ జయించి పొందనగును. ౨౦ సర్వదిగ్వి జయము నని చెప్పఁబడినది.

## వాక్యశరగోత్రము:—

[శాండిల గణము చూడుఁడు.]

**వాకాటదేశము:**—ఉత్తరమున హైదరా బాదు, తూర్పున శ్రీశైలము, పశ్చిమమున నరే బియాసముద్రము, దక్షిణమునఁ జోళరాజ్యము నెల్లలుగాఁ గల్గినదేశము వాకాటదేశమై యుం డెను.

వింధ్యశక్తి యనుపేరుఁగల కైలాకిల కై కిలాకిలవంశ యవనుఁడు ప్రభువు. రాజధాని కిక్క లానగరము. ఈతఁడే రాజ్యమును స్థాపించెనఁట. కొంకణ ఆంధ్ర కలిసి యైనరాజ్యము.

**వాకాటకవంశనరపతులు:**- వింధ్య క్షేత్రదక్షిణభాగములందు రాజ్యపాలన మొన ర్చిన నృపులు. వీరు భారశివులతోడను, గుప్తవంశ నరపతులతోను వివాహసంబంధబాంధవ్యములు కలవారు.

## వాకాయనగోత్రము:—

[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.]

## వాకాశ్వకిగోత్రము:—

(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

## వాకాశ్విగోత్రము:

[ఉపమన్యుగణము చూడుఁడు.]

## వాక్సారపురము (వ్యాఘ్రపురము

[Buxar]:—ఇప్పుడు బీహారుదేశమందు షహా బాదుజిల్లాలోని పురము. దీనింగూర్చిన సంగతులు పెక్కుఁగలవు. బ్రహ్మాండపురాణ పూర్వఖండమున వేదగర్భమాహాత్మ్య మనంబడు ౧-౫ అధ్యాయ ములందునను, సూతసంహిత యజ్ఞఖండము ౨౪ అధ్యాయమునను దీనిప్రశంసలు కలవు.

పురముమధ్యనుగల గౌరీశంకర దేవస్థానమున కంటియున్న వ్యాఘ్రసార మనుపేరుఁగల సరస్సు నుండి యిప్పటిపేరు 'బక్సారు' ఉత్పన్నమైనదని తలంపఁబడుచున్నది.

ఇచటనే తోతానది గంగానదిలోఁ గలియుతా వునఁగల సిద్ధాశ్రమమున నాదివిష్ణుదేవుఁడు వామ నావతార మెత్తిన పవిత్రస్థలిం జూపుదురు. రామా యణ బాలకాండమున దీనిప్రశంస కలదు. భాద్ర పదమాసమున నిట యాత్ర జరుగును. అది యీ వామనావతార సంబంధమే.

వ్యాఘ్రపురమున కింకను పూర్వకాలమున వేదగర్భపుర మని పేరుండెను. ఇట విశ్వామిత్రా శ్రమ ముండెడిది. అట శ్రీరాములు తాటకిని వధించిరఁట. చారిత్రవనమను పేర నిప్పుడు గాన నగుచున్నది.

చరిత్రప్రసిద్ధమగు బక్సారుయుద్ధము జరిగిన ప్రదేశము. బక్సారుపురమునుండి రెండుమైళ్ళ దూరమునందుఁగల కాత్కొవులీ లేక కైత్ హులీ గ్రామముకడఁ గాననగును.

గయకు వాయవ్యమున ౨౫ మైళ్ళదూరమున దేవకుండ మనుతావున నొకటియు, కురుక్షేత్ర మున స్థాణుతీర్థమున కెదురుగ సరస్వతీనదీపశ్చిమ తీరమున నొకటియు విశ్వామిత్రాశ్రమములు కలవు. [బీహారుదేశము చూడుఁడు.]

## వాకిగోత్రము:—

[ఉపమన్యుగణము చూడుఁడు.]

**వాకుడుచెట్టు:—** ఇది బీటిబయళ్ళలోను, ఇసుకయందునను మొలచి కాచునట్టి ముళ్ళచెట్టు. వాకుడుకాయ చిన్నదిగాని, యన్నివిధముల మెట్ట వంకాయను బోలియుండును. ఇది యేసంబంధమూలేని యిర్వురు నౌకరివెన్క నౌకరుగ నౌకమోస్తరుపనులనేచేయువారిని 'వంకాయతమ్ముఁడు వాకుడుకాయ' యని సామెతగ ఛలోక్తిగఁ బల్కుటఁ గలదు. వాకుడుకాయ కూరగఁ జేతురు. వీటిం గొందరు రేవటిములంకాయ లనుట యుం గలదు. లా. Solanum gacquini సం. కంటకశ్రేణీ, కంటకారికా, కంటతనుః, అనుపదము లెఱ్ఱవాకుడునకును, చంద్రహాసా, క్షేత్రదూతీ యనుపదములు తెల్లవాకుడునకును, వాడియున్నారు. గాన నిది యెఱ్ఱ, తెల్ల యని రెండుభేదములని తెలుచున్నది. ఇందుఁ దెల్లజాతి శ్రేష్ఠ మందురు. మఱియు వాకుడు, నెల్లి, రేవటి, దూలగోవిల చెట్లను గంటకారీత్రయ మని యాయుర్వేదవైద్య శాస్త్రవేత్త లనిరి.

వాకుడుకాయ లేక పండు, వేరు, లేక సమూల రస కషాయచూర్ణములు త్రిదోషముల శమింపఁజేసి యుబ్బసము, క్షయదగ్గు, ప్లీహరోగము, మూలవ్యాధి, జలోదరము, గుల్మము, పొత్తికడుపులోనిశూలలు నివారించి, వేఁడిఁ జేసి మలబద్ధము నడంచి, మూత్రమును వెడలించుననియు, వాకుడుగింజల నెండించి యగ్నిలో వైచి పొగ నోటఁబట్టిన పండ్లనొప్పి హరించుననియుఁ జెప్పఁబడినది.

**వాగ్భటుఁడు:—** సుప్రసిద్ధ ఆయుర్వేదవైద్య గ్రంథమగు వాగ్భటమునకుఁ గర్త.

[అవంతిదేశము చూడుఁడు.]

## వాగ్రధిగోత్రము:—

[వశిష్ఠగణము చూడుఁడు.]

వాఙ్మయదోషములు

శ్లో॥ పారుష్య మనృతం చైవ పైశున్యం చాఽపి సర్వశః। అనుబద్ధప్రలాపశ్చ వాఙ్మయస్యాచ్చతుర్విధమ్॥

౧ వాక్పారుష్యము లేక కఠినోక్తులు పల్కుట. ౨ అనృతము- అసత్యములు పల్కుట. 3 పైశున్యము- పిశునత్వము. ౪ అసంబద్ధప్రలాపము- సంబంధము లేనిది దోషములు వివరించి తెలుపుట యను నివి వాఙ్మయదోషములు. వాక్కుతోఁ జేసెడి యశుభకర్మలు.

## వాగర్గిగోత్రము:—

[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.]

## వాగాయనిగోత్రము:—

[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు]

**వాఙ్నియమన్యాయము:—** అధికప్రసంగములు మాని, మితముగ మాట్లాడునట్లని యర్థము. అనేకబాధలు కలుగకుండ నీనియమము రక్షించునని భావము.

## వాచకకవి:—

(కవి, కవులు చూడుఁడు).

## వాచయగోత్రము:—

[లౌగాక్షిగణము చూడుఁడు].

**వాచస్పతిమిశ్రమతము:—** ఈమతకర్త వాచస్పతిమిశ్రుఁ డను గొప్ప పండితుఁడు. జీవుఁ డజ్ఞానియగుట, జీవ మజ్ఞానమున కాశ్రయమనియుఁ గాన జీవున కజ్ఞానకృతమగు భ్రమ

లనేకములు కలవనియు, నం దొకటి పరమేశ్వరుఁ డున్నాఁడనుభ్రమ యనియు, తాను జ్ఞాని నైతి ననియు, పరమేశ్వరుఁ డుండుట నెఱింగితినని నమ్ముటయు, భ్రమలే యనియు వీరిసిద్ధాంతము.

ఒకవేళ తాను పరమేశ్వరుని తెలుసుకొనలే ననిన-చో నజ్ఞానమునకుఁ బరమేశ్వరుఁడు విషయమై యజ్ఞానముచే నాచ్ఛాదింపఁబడుట సంభవించును. ఇట్టితఱి నజ్ఞాన మొకటియని చెప్ప వీ లుండక పోవును. ఏలయన నొక్కఁటే యగు-చో నొక్కని యందు నివృత్తి యగునేని యందరియందు నివృత్తియయి తీరవలయును. ఇదివఱ కజ్ఞాన మెవ్వనియందు నివృత్తి కా లేదన, నిఁక ముం దును నివృత్తి కానేఱదు. అజ్ఞానకార్యమగు సంసారమును ప్రతీతి కాఁ గూడనిదే యగును. గాన శ్రవణము, ఈక్షణము మొదలగు సకల కార్యములు నిష్ప్రయోజనములే యగును.

జీవు లనంతములు. జీవుల నాశ్రయించియున్న యజ్ఞానమును ననంతమే. జీవుల కజ్ఞానసంబంధ ముగఁ గల్గెడిభ్రమలును ననంతములే. ఇట్టి భ్రమ లవలనఁ గల్పింపఁబడిన యీశ్వరులు, బ్రహ్మాం డములు, గతులు, స్వర్గభోగసుఖములు, నరక క్లేశకష్టములు నన్నియు భ్రమలే. అనంతములే.

ఒకవేళ నేకారణము చేతనైనను జీవునియం దజ్ఞానము నివృత్తి యగుట సంభవించునేని, భ్రమ లన్నియు నివృత్తి కావలయును. దానివలనఁ గల్పి తములైన యీశ్వరులు, బ్రహ్మాండములు మొద లగున వన్నియు నివృత్తి కావలసినవే. అట్లుఁ గల్గు టయే యీమతమునందుఁ జెప్పఁబడిన ముక్తి.

'నేను' అనియెడి శబ్దము నంతఃకరణవిశిష్టచేత నరూపజీవుఁడు. దీనివిశేష్యమగు సాక్షి చేతనము, బ్రహ్మము. అది యజ్ఞానమునకు విషయ మగుట యే గాక నాశ్రయముఁగూడ నగుచున్నది. విశే ష్యధర్మము విశిష్టమునందు వ్యవహరింపఁబడు చున్నది

ఈమతమునందుఁ దమయజ్ఞాననాశన మభిల షించువారలకు ముముక్షువు లనిపేరు. ఈమత స్థులు వాచస్పతి మిశ్రులు సురేశ్వరాచార్యుల యపరావతార మని చెప్పుదరు

**వాచస్పతిమిశ్రుఁడు**:– ఈమహనీయుని సురేశ్వరాచార్యుల యపరావతార మందురు. గొప్పవిద్వాంసుఁడు. వాచస్పతిమిశ్ర మతమునకుఁ గర్త. ఈతనింగూర్చి యితరవిషయము లేమియుఁ దెలియకున్నవి. (వాచస్పతి మిశ్రమతము చూ డుఁడు).

**వాచీ (జేబుగడియారము)**:– ఇందలి చక్రములు, చీలలు, స్క్రూమేకులు, చాల చిక్కగానుంటఁ బరిశీలించుట కనువుఁ గాకుంట సహజము. గాన దీనిముఖ్యభాగములంగూర్చి వివ రించి విశదీయుటయే సమంజసము.

ఇందలి Compensated balance శీతోష్ణ స్థితులందు వాచీని హెచ్చుతక్కువలు గాకుండఁ గాపాడుచుండును. అనఁగా నైరోపా మొదలగు చలిదేశములందు జేబుగడియారము జేబునం దుం చుకొనినదానికి వెచ్చగా నుండుటయు [high te- mperature సంభవించునుగాన కాలమును జూపుటయందుఁ గొంతభేదముఁ గలుగ నగును. దాని నీకంపెన్సేటెడ్ బేలన్సు సరిఁ జేయుచుండును.

జేబుగడియారములందుఁ బెక్కులు భాగముల భేదములుగల పరికరములు గలవు. అందు Big wheels, Little wheels, Pinions [or

axlles], Levers, Pullets అనునవి ముఖ్యములుగా నెన్నఁబడుచున్నవి. చక్రములనడుమ బిగింపఁబడిన శిలలు కురువిందఁపురాతితోఁ జేయఁబడి యరుగక గట్టిగ నిలచి యుండెడిని. వాచీ యెప్పుడును తిరుగుచుండునుగాన చక్రఁపుఁ జీలలు లోహఁపువగునేని త్వరితముగనే యరిగిపోవును. కెంపుచీలను 'Jewels' అనెదరు. లోహఁపుఁ జీలలను Pivots అనియెదరు.

చీయందలి భాగములకూర్పు విచిత్ర మనిపించెడిని. వాటిని బిగించు మరమేకులు (screws) చిన్నవి, పెద్దవికూడఁ గలవు. కడుచిన్నమరమేకులు కొన్ని బలముఁగల భూతద్దముగుండా చూడవలసియుండెడిని. వాటితలపై (బిగించుటకుఁ జేయఁబడిన) నఱంగుళమున వేయింట రెండు భాగములు మాత్రము వెడలు పుండునని లెక్కింపఁ బడియున్నది. ఇవి పౌనుబరువునకు ౩౦౮౦౦౦ మరమేకులు తూఁగునందురు.

హెయిర్‌స్ప్రింగ్ (Hair spring) అనఁబడు యంత్రిభాగము జేబుగడియారమున విచిత్రమైనదిగాఁ దోఁచెడిని. ఇది చాల ప్రశస్తమైన యుక్కుచేఁ జేయఁబడినది. పొడవు తొమ్మిదిన్నరయు, వెడలుపు వేయింట నొకభాగమును, పది వేలభాగములలో నిరువదియేడుభాగముల మందమును, అంగుళము పరిమాణమును గలదిగా నుండెడిని. దానిని జుట్టుగాఁ జుట్టి గట్టిపదును (temper) నిడి, యమర్చియుందురు. ఈయమరిక కడునేర్పరితనముఁ గల్గినది. ఇంచుక వ్యత్యాసము చాల లోపమును, భేదములను గల్గించును. దీనిపని నధికజాగ్రితతోఁ జేతురఁట.

వాచి తిరుగుచుండుతటి టిక్కు మనిచేయు ప్రితిచప్పుడును, ఒకటి పాతిక జరిగెడిని. ఇటుల సెకెండునం దైదుధ్వనులును, మినిటునందు ౩౦౦ ధ్వనులును, గంటయందు ౧౮౦౦౦ ధ్వనులును, ఇరువదినాల్గుగంటలదినమున ౪౩౨౦౦౦ ధ్వనులును గల్గునని వేఱుగఁ జెప్పనక్కఱ యుండదు. ఒక సుప్రసిద్ధ యంత్రశాస్త్రవిదుఁడు, ఆ అడుగుల driving wheels గల యొక Locomotive యంత్రిముతోను వాచి యొనర్చు సంవత్సరఁపు ధ్వనులలెక్కకు సరియగు రివల్యూషనులను జేయించుచు, భూమి నిరువదియొన్మిదిసార్లు చుట్టిరా నగునని వ్రాసియున్నాఁడు. ఆపండితుఁడు జేబుగడియారమునకు నిట్లు వినరించెను.

"Winding the watch means turning the main spring tightly as it is a spring in itself it tries to unwind. In doing so sets a train of giar wheels in motion. An ingenious device known as "The escapement comes into play. Its work is to prevent of the running down too soon by controtting the speed of the wheels at one end of the escapement is a curved cross bar with two little projections known as Pallets" it swings backwards and forwards, and only one of the pallets at a time can rest on the teeth of the escapement wheel and as it turns slightly a pallent catches one of the teeth and holds it for a moment but as the escapemet swings forward, it turns a little wheel at the top known as "The compensated balance" with partly winds up a tiny hair spring. Immediately the escapement has completed its swing the hair spring begins to unwind turns the wheel and swings the esca-

pemet in the other derrection. That releases one tooth of the escapement wheel and there upon the escapement swings back as it does so, it winds up the hair spring once more for the next swing forward and so to and frow it goes till winding is exhausted.

చాల కాలమునుండి యీవాచీలు పనిఁజేయు విధానమునం దంతగాఁ దెలియఁదగిన మార్పుల నందియున్న వింతగాఁ గానఁబడదు. ఆదిని వాడఁబడుచుండిన యిత్తడికి బదులుగను, ఉక్కుకుబదులుగను, హెయిర్‌స్ప్రింగులు (Hair springs) పల్లెడియ మనంబడు లోహముతో జేయఁబడుచున్నది. ఇది శీతోష్ణసితులకు మార్పులఁ జెందవఁట. క్రీ. శ. ౧౯౦౮ లో Dr. Charles Guillaume పరిశీలకుఁడు నోవా రనంబడు లోహమును జేసెను. అది నికెల్, ఉక్కు, కల పడము లోహములందు నైసర్గికముగనున్న సంకోచ వికాసగుణములు (expanding or contracting) దీనితోఁ జేయఁబడు కంపెన్సేషన్ బేలెన్సు (Compensation balance) నుండి నిర్బాధకముగఁ జేయఁబడినది.

యిత్తడి, ఉక్కులతోఁ గూడఁ జేయఁబడుచునే యున్నవి. Thomas mudge అనునాయన క్రీ. శ. పదునెన్మిదవశతాబ్ద ప్రారంభ వత్సరములందే గన్పట్టిన లీవరు ఎస్కేపుమెంటు విధానము చక్కనిపనిఁ జేయుచుంట నెల్ల రెఱింగినదే. అంతకుఁ బూర్వమునం దుండిన detached escapement క్రీ. శ. ౧౭౯౯ లోఁ జనిపోయిన John Arnold పండితుఁడు కనిపెట్టినదని మనము మఱువరాదు.

స్విజర్లాండు దేశపు జెనీవా నగరమునఁగల లక్షాముప్పది యైదు వేల జనులలో నిచటఁ గల పెక్కుకర్మాగారములు యంత్రములచేతనే నడుపఁబడుచున్నవి. Neuchatel పురమున వాచీ యంత్రభాగములంజేయు కర్మాగారములే గాక గడియారములం జేయుటను నేర్పెడి కళాశాల గొప్పది కలదు. అందుఁ దరగతులుగ వాచీనిర్మాణ విధానముల బోధింతురు.

వాచీలయం దిక్కాలమున వందలకొలఁదిగ భేదములఁ గల్గియున్నవి. యంత్రములచేఁ గర్మాగారములందుఁ జేయఁబడు చక్రములు మొదలగు యంత్రభాగములు 'adjusters' అను వృత్తిఁగల పనివాండ్రచే సరిగాఁ గుదర్పఁబడి, హెచ్చు తక్కువ లుండకుండ సరిచేయఁబడి యీపనివాండ్రచే వాటియం దర్హస్థలముల నమర్పఁబడెడిని. యంత్రాగారములు కొన్నిదిగంటల దినమునందు మూఁడువేలు మొదలెదువేలఁదనుక 'pinions' తయారగుచుండుననియు, dials ఒకపెద్దయంత్రమున దినమున కైదువేలు మొదలెన్మిదివేలఁదనుకఁ జేయఁబడుచున్నవనియుఁ జెప్పఁబడినది.

ఇంక నీవాచీనిర్మాణకల నెఱుంగనివారలకు వింతఁ గొల్పు నొకసంగతితో ముగింతుముగాక. వాచీలయద్దములు పరిమాణములందు ౧౮౦౦ భేదములు కలవనియు, నవి పదునాఱుభేదములు గల మందములు లేక దళసరులుం గల్గియున్నవనియుఁ జెప్పఁబడినవి. ఈసంఖ్యలరహస్య మన్యులకుఁ దెలియదు. గాన వారికి చీయద్ద మనుటయే గాని తక్కినదళసరులు, సైజులు, ననుమాట మనస్సునందే యుండకపోవచ్చును గానఁ దఱుచుగ సరియగు నద్దము దొరకుట కనుఁగొన లేకుందురు. 'వాచిమేకరువేసినదేయద్దము, చేసినదే మరమ్మత్తు?

వాచీయందుండు యంత్రభాగములు ౧౧౭ అని లెక్కింపఁబడినది. హెయిర్‌స్ప్రింగు సెకండుకాలమున నైదుసార్లు సంకోచవికాసముల నంది జేలన్నుచక్రముఁగదలంజేయుచు రోజునందు ४3_,000 సార్లు పనిఁజేయుచుండెడిని.

## వాజశ్రవగోత్రము

(కణ్వ ఉపగణము చూడుఁడు).

## వాజయగోత్రము:—

(కణ్వ ఉపగణము చూడుఁడు).

**వాజస్రవుఁడు (ఋషి):—** ఈయనకింకను అరుణి, ఉద్దాలకుఁడు, వేనుఁడు ననుపేరులుండినటులఁ గఠోపనిషత్తునుండి తెలియనగును. ఈతఁడు రామాయణమునఁ బ్రసిద్ధుండగు వేనుచక్రవర్తి (పృథుచక్రవర్తి) తండ్రి కాఁడు.

వేనుఁడు ఋషిగాఁగల సూక్తము లథర్వణవేదమునఁ గొన్ని కలవు గాని, యావేనర్షి యెవ్వఁడో తెలియకున్నది. అరుణి, ఉద్దాలక నామములవహించిన పన్నములు బృహదారణ్యకోపనిషత్తునఁ గాననయ్యెడిని. ఇంక వీరెవ్వరో స్పష్టము కాలేదు. వాజస్రవసుఁ డన్నప్రదాత యనియు, సత్రయాగ మొనర్చె ననియు, నీతనిసుతుండు నచికేతుఁ డనియు దగ్గుపల్లి దుగ్గయకవి, మిక్కిలి మల్లికార్జునకవి, తెనిఁగించిన నాచికేతోపాఖ్యానమునఁ గలదు.

## వాజాయనగోత్రము:—

(కథ్య లేక కథ్యగణము చూడుఁడు).

## వాజిమతిగోత్రము:—

గణము చూడుఁడు).

## వాటగోత్రము:—

(గర్గ ఉపగణము చూడుఁడు).

**వాటర్‌గాస్ (Water gas):—** Red hot coke గుండా గాని, authracite గుండా గాని యావిరి నడుచుతఱి నేర్పడిన gas నకు 'వాటర్‌గాస్' అని పేరు. దీనిని hydro carbon vapour తోఁ గల్పినచో 'carburatled water gas' అని పే రగుచున్నది. ఇట్టిస్థితియందిది coal gas తోఁ గల్పఁదగి యుండును.

Water gas దానియం దుండు carbon monsxide నుండి coal gas కన్న నధికతరమగు విషపూరితమై యపాయకరముగ నుండెడిని.

## వాటర్‌ఫాల్:-

(నదులు చూడుఁడు).

## వాటర్ షెడ్ (వాటరు పార్టింగ్)

Water shed, water parting.— సరస్సులం దుద్భవించిన నదులకు సరస్సును, పర్వతము నం దొక హిమసముదాయమగు Glacier నందుద్భవించిన నదుల కాహిమసముదాయ స్థానమును, జన్మమాతృకలు (water sheds) అనఁ బడెడిని.

అట్టి నిలయము లొకటి కొకటి కడుసమీపముననేయుంటయు, వాట్లయందు వేర్వేఱు దిశలుగ వేర్వేఱు నదు లుద్భవించి వేర్వేఱు దిశలకుఁ బ్రవహించుటయో లేక యొకేదిశ నుద్భవించి నను వేర్వేఱు దిశలుగానో, దూరముగానో ప్రవహించుచు వేర్వేఱు నదు లగుటయో సంభవించుతఱి నాజలప్రవాహములకు మాతృస్థానములగు water sheds నొకటినుండి వేరొకటి వేఱుఁ

౫౭ యందమనను, ఇంద్రప్రస్థమునకుఁ బశ్చిమమున వాహ్లీక, ఆభీర దేశములనడుమ నుండెనని చెప్పఁబడి ప్రశంసించఁబడినది. పరిశోధకులు దీనిని పాంచాలములోనిదిగఁ దలంచుచున్నారు. దీనిని నకులుఁడు జయించెనని చెప్పఁబడినది.

**వాతనారాయణచెట్టు:—** దీనింగూర్చి సరిగాఁ దెలియదు. సన్ననియాకులనియు, నొక కొమ్మనే తెల్ల, పసుఁపుఁబచ్చ పూవులం బూచుననియుఁ గొందఱనెదరు. దీనియాకుల నాముదమున వెచ్చఁజేసి పైనఁగట్టిన గుండె, ఱొక్కగూడులు, వెన్ను మొదలగు తావులలోని నొప్పులు నివారణ మగునందురు.

**వాతపిత్తకఫోల్బణసన్నిపాతము:—**
(సన్నిపాతదోషము చూడుఁడు).

**వాతపిత్తోల్బణసన్నిపాతము:—**
(సన్నిపాతదోషము చూడుఁడు).

**వాతాంగిరధిగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**వాతాపి (వటపి) పురము:—**
(మహారాష్ట్రదేశము చూడుఁడు, బాదామీ చూడుఁడు).

**వాతాయనాసనము:—** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. కుడికాలిమీఁద నిలువఁబడి, యెడమకాలిమడమను కుడిగజ్జలో నుంచి, రెండుచేతులు హృదయమునఁ జేర్చి భ్రూమధ్యమున లక్ష్యము నిల్పుటకు వాతాయనాసన మనిపేరు. దీనియభ్యాసమున నిద్ర తగ్గుననియు, మనస్సు నిలిచి యేకాగ్రత గల్గుననియుఁ జెప్పఁబడినది.

**వాతావరణపుటొత్తిడి** (air pressure):— పదార్థము (matter), ఘనము (solid), ద్రవము (liquid) వాయురూపము (gascous) అని త్రివిధము. అందు వాయుపదార్థము ద్రవపదార్థమునుండి భేదమైన దైనను, నారెండును ప్రవహించునవిగను, పరువిడఁగలవిగను నున్నవి. (పదార్థపరిణామము చూడుఁడు). ఘనపదార్థమగు భూమిమొదలగువాటియందు కోహెషన్ (cohesion) శక్తి గలదుగాన దానియర్థారూపము నది నిలుపుకొనుచుండును. తక్కిన ద్రవవాయుపదార్థము వీలగునేని క్షణక్షణమునకుఁ గూడ రూపమును మార్పుజెందినఁ జెందుచుండనోపు. ఆంగ్లరసాయనశాస్త్రమున వాయు జలములకు 'fluids' అని పరిభాషానామమిడియున్నారు. మఱియు వీటిచేగల యొత్తిడికి 'fluid pressure' అని వాడుచుందురు. వాయువుయొక్క ఒత్తిడి (air pressure) ను నిందలిదే యగును. జలమునందును నొత్తిడిఁగలదు. ఈరెండును ఫ్లూయిడ్ - ప్రెష్షరనంబడుచుండునవి. ఈయొత్తిడియే లేనిచో నూపిరియాడుట దుస్సాధ్యమే యగును.

ఇందువలన వాయువుగాని, జలముగాని, ఉండని తావు లీభూమియం దుండఁజాలవని తేలెడిని. అట్టివి యుండిన కృత్రిమములుగనుండునుగాని నైసర్గికముగ నుండఁజాలవని భావము. ఈరహస్యమును గన్గొనినవాఁ డాదిని నిటలీదేశపువాఁడగు Torricelli పండితుఁడు. ఈయన Galiles పండితునిప్రధాన శిష్యుఁడు. చిరస్మరణీయుఁ డగుఁగాక. ఉదకము నీయొత్తిడిధర్మముననే పంపు (pump) సహాయమున ముప్పదియడుగులయెత్తున కెగురఁగొట్టనగుననియు, నీటికన్న నధికభారముఁగల పాదరసము కొంతతక్కువయెత్తున కెగురఁగొట్ట నగుననియు, నాయనయే కన్గొని వెల్లడించెనఁట. పంపులు నీటినిపై కెత్తుట, గాలిలేనితావులగుండా ఫ్లూయిడు

పదార్థముల యొత్తుడులవలన నీటింబంపుటయేగాని వేఱు కాదు.

ఈమహాత్ముని పరిశీలనలనుండి యొకదెస మూయఁబడిన యొకగొట్టమునిండా పాదరసమును నింపి, వేఱొకగిన్నెనిండా పాదరసముఁ బోసిన దానిపై నాపాదరసమునిండినగొట్టముం బోర్లించి నచో ననఁగా మూయఁబడినగొట్టముకొనను పై కుండునటుల బోర్లించి, పాదరససముదాయములం గల్పిన నాగొట్టమునందలి పాదరసము క్రిందికిఁ జాఱిపోక నిలచుట విచిత్ర మనిపించెడిని. ఇందలి కారణము భూమియొక్క ఆకర్షణశక్తి యగు గ్రావి టేషన్ పుల్ ఆపాదరసమును, ఈపాదరసమును గూడ భూమిపైపునకుఁ గ్రింది కాకర్షించి లాగు చుండఁ బైనున్నగాలియందలి యొత్తిడి (air or atmospheric pressure) క్రిందిగిన్నెలోని పాదరసము పైనుండి క్రిందికి బలముగ నొత్తిపట్ట యుంట నదిగొట్టములోనిపాదరసమును తనలోనికిఁ జాఱనీయక యటులనే పై కిందొ్రోసిపట్టియుంచెడిని గాన నది జారిపోదు. ఇది గ్రావిటేషనుఫోర్సును వాతావరణంపుటొత్తిడి నెదిరించుటవలన జరిగిన కార్యమని స్ఫురింపకపోదు. ఇం దింకను విచిత్రమే మన గొట్టమునందుఁ బాదరసము తక్కువగ నుండి నచో నాగిన్నెనుండి పైతము పాదరసము గొట్టము లోనికిఁ బైకెక్కునియు, కాని యాపని యాగొట్ట మున గాలి యేమాత్రము లేకుండుతటినే (Vacuum) జరుగుననియు నామహాత్మునిపరిశీలనల నుండియే బయల్పడియున్నది. ఇంకను నటులఁ బైకి నిలువఁబడు పాదరసంపు టెత్తు పరిమితి ముప్పదియంగుళములే యనియు, అంతకు నెత్తుగు పైకి దానిని నిలుపఁజాలదనియు, పరిశీలనలనుండి పోల్చియున్నారు. ఇందునుండి యిట్టిపరిస్థితియందు వాతావరణంపుటొత్తిడి ముప్పది యంగుళముల వేక్యూముగొట్టమున స్తంభముగాఁ బాదరసమును నిలుపుశక్తితో సమానమని (The passure of the atmosphere is equal to supporting a column of mercury thirty inches high) ఒకధర్మముగ నేర్పడినది.

ఒకతఱి నా Vaccum గొట్టము ముప్పది యంగుళములకన్నను నెక్కువపొడవుగా నుండెనేని, పై నఁ గాళీగానుండినభాగమునకు Torricellion Vecuum అని సాంకేతినామ మిడి, ఆమహాత్మునిపేరనే వాడుచున్నారు. ఇట్టి వేక్యూము లందు నించుక పాదరసంపు టావిరి యుండునని, యిటీవలఁ గనిపెట్టఁబడినదఁట.

ఇందువలన వాతావరణంపు టొత్తిడివలననే గొట్టమందలి పాదరసము క్రిందికిం దిగజాఱక నిలు వఁబడుటయున నొత్తిడి యధికమగుచో నాగొట్ట మునందలి పాదరస మెత్తుగ నిలువఁబడుటయు, ఒత్తిడితగ్గినచో నాపాదరసము క్రిందికి దిగుచుం డుటయు జరుగుచుండునని వేఱుగజెప్పనక్కఱ యుండదు. ఇటులనే నీటియొత్తిడికూడ నుండుట నావికులెల్లరు నెఱింగియే యున్నారు. సముద్ర మున నీటిపై భాగ మనగా లో తధికముగానితఱి నీటియొత్తిడి తక్కువగాను, లోతున కరిగినకొలఁది నీటియొత్తిడి యధికముగను నుండును. ఇది నావికు లెల్ల రెఱింగిన ధర్మమే. ఇంక పర్వతములపై గాలి యొత్తిడి తక్కువ యనియు, క్రిందికిఁ దిగినకొలఁది యెక్కువ యగుచుండుననియు స్ఫురింపకపోదు. గాననే యెత్తుపర్వతాగ్రముల వాతావరణమున నొత్తిడితగ్గియుంట (rarity of air) స్వాసిరిం దీయుటఁ గష్టమనిపించెడిని.

ఇట్టి వాతావరణంపు టొత్తిడులం దెల్పు యంత్రపరికరములకు 'బారోమీటర్' రని పేరు. దీనికి wieght measure అని యర్థమగుట

పాదరసము పీటియం డెత్తుగానుండుతఁటి వాతావరణము శాంతిఁ గల్గియుండుననియు, వాతావరణఁపుటల్లకల్లోలము (atmosphearic disturbances) లుండకుండు ననియు, అటులఁ గాక నొత్తిడి తక్కువగుతఁటి నం దెక్కువగాఁ దగ్గిపోవు నేని ప్రక్కప్రదేశములయొత్తిడి బాగున్నదిశలనుండి గాలు లిటకుఁ జేరుటుఁ దోసుకుని వచ్చుచుండు ననియు, అది ప్రచండవాయుప్రసారమే యనియు, అట్టి గాలులు వర్షముం దెచ్చునవియుఁ జెప్పఁబడి నది గాన బారోమీటరునందు rais Causes fair weather & full causes disturbances & rain అని చెప్పఁబడియున్నది. అధికముగ fall కల్గినతఁటి దుపానులుగూడఁ గలుగ వచ్చును.

ఎత్తువ కెక్కు కొలఁది వాతావరణఁపుటొత్తిడి తగ్గుచుండునుగాన దానింబట్టి యేపర్వత మింత యెత్తో బారోమీటరుంజూచి చెప్పవగుచున్నది. శరీరములపైఁబడుచున్న వాతావరణఁపుటొత్తిడి యన్ని దెసలనుండియు సమముగ నొకేరీతిఁ బడుచుండుననుధర్మ మిటీవలఁ గనిపెట్టఁబడినది. గానవే యది యసౌఖ్యములం గల్పింపక భరింపఁగల్గినదిగ నుండెడివఁట. గ్రీనిచ్ నందు జరిగినపరిశీలనలనుండి యొత్తిడి చౌకఁపుటంగుళప్రదేశమున ౧౫పౌనులుం డునని కన్గొనిరఁట. ఇట్టియొత్తిడికిఁ దెబువఁబడియున్న మానవశరీరము లన్నిదెసలనుండి వాతావరణఁపుటొత్తిడి నొకేరీతి నందుచుండునదిగాన భరింప వీలగును గాని, ఒక్కపై దెసనుండి క్రిందికిఁ బ్రవహించుచు నొక్కనదిగా నుండినచో దుర్భరమై యుండెడిదఁట. మఱియు నొకేదెసనుండి నొక్కనదిగానుండి పడిపోవవలసియుండెడి దఁట. అన్నిదెసలనుండి యొకేరీతి నుండుటఁ బైచిక్కుల నుండి శరీరములు రక్షింపఁ బడుచున్నటుల రసాయనశాస్త్రవేత్త లనెదరు.

## వాతావరణఁపుటొత్తిడి:—

(ఎయిర్ ప్రెష్షరు చూడుఁడు).

## వాతావరణమునందలి యచేతన ద్రవ్యములు:—

వాయువునందున్న నచేతన పదార్థముల నీక్రిందివిధమున Prof. Ramsay పండితుఁడు వివరించియున్నాఁడు. ఆయన పరిశీలనలం దీ ద్రవ్యము లిట్లున్నటులఁ గనుంగొనెనఁట. అవి సర్వత్ర మహావాయువునం దుండునని వ్రాసెను.

| | | |
|---|---|---|
| Densety of the gas | 1 . 98 | 9 . 96 |
| Atomic weight | 3 . 96 | 19 . 92 |
| Densety of Liquid | 0 . 3 | 1 . 0 |
| Index of refraction(gas) | 0 . 124 | 0 . 235 |

Argon యొక్కయు Krypton యొక్కయు Xenon యొక్కయు data లిటుల వివరింపఁబడినవి.

| | | | |
|---|---|---|---|
| Density of gas | 19 . 96 | 40 . 78 | 64 . 0 |
| Atomic weight | 39 . 92 | 81 . 56 | 128 . 0 |
| Density of Liquids | 1 . 212 | 2 . 155 | 3 . 52 |
| Boiling point Centigrade- | -186 . 1. | -151 . 7 | 100 . 1 |
| Fusion Point Centigrade- | -187 . 9 | -169 | -140 |
| Critical temperature Centigrade- | 117 . 4 | -62 . 5 | 14 . 75 |
| Critical Pressure- | 40 . 20 M. | 41 . 24 | 43 . 50 |
| Index of refraction of gas- | 0 . 968 | 1 . 450·2 | , 368 |

ఈక్రిందిపథకమున వాల్యూములు (Proportions) వివరింపంబడినవి.

There are 0 . 937 parts of argon to 100 of air.

There are one or two parts of none to 100 000 of air.

There are one or two parts of Helium to 1000 000 of air.
There is about one part of Krypton to 1000 000 of air.
There is about one port of Xenon to 20000 000 of air.

ఈసందర్భమున సముద్రపునీటియందు అనఁగా 15 000 000 భాగములనీటి కొకభాగము బంగారము (Gold) ఉండునని చెప్పఁబడినది.

**వాతావరణవక్రతలు** (atmospheric refractions):— భూమిని జుట్టుకొనియున్న వాతావరణ మనేకవిధముల densities గలదిగ నెఱింగి, ఎస్ట్రానోమీశాస్త్రవిదులు మహావాయు పథము పొరలుగ నుండుననెదరు. ఆకాశమునందుండు నక్షత్రములకాంతులు సూర్యచంద్రుల కాంతులకన్న బలహీనమైనవి. అవి భూమికిం జేరుట, లేక భూమిపై నుండువారి కగుపడుట యందు భూమినిజుట్టియుండు మహావాయుపథము గుండా చొచ్చుకొని నడిచి భూమికడకుఁ జేరవలసి యుండును.

నీటిగుండా గన్పించువంకర లానీటికదలికనుండి యనేక వంకర లున్నట్టు గన్పించును. నీటికన్న నద్దము పరిశుభ్రతను, అంతట నొకేరీతి చిక్కఁదనముఁ (density) గల్గియుండునది గాన దానిగుండా నగుపడువస్తువులు కొంతవఱకు వంకరలు లేక గన్పడెడిని. నీటికదలికతో డెన్సిటీ మార్పులం జెందుచుంట, దానిగుండా నగుపడువస్తువునందు వంకరలు గన్పించును.

వాతావరణము స్వచ్ఛముగను, గాలి నిలచియుండునమశీతోష్ణప్రదేశములందు, దూరఁపువస్తువులు, పర్వతశిఖరములు, చక్కఁగ స్పష్టముగా గన్పించును. వాతావరణమం దల్లకల్లోలము లుండుతఱి వాయువునందలి density మార్పులను, కదలికలను జెందుచో, అటుల స్పష్టముగఁ గన్పించకుండును. ఆకాశమునందలి నక్షత్రములు కాంతివల్లనే గన్పించును. ఆకాంతి భూమికడకుఁ బయనమొనర్చుటయందు వాయువులేని తావుగుండా పయన మొనర్చుచో నేమార్పుఁ జెందక, భూమియొక్క మహావాయుమండలిం జొచ్చుచో ననేక density ల వాయువుగుండా నడుచుకతన, నించుక భూమిదెసకు వంగుచుండునని పరిశీలనలనుండి యెఱుంగనైనది. దీనిమార్పువలన భూమిపైనుండి చూచువారల కానక్షత్రము సరిగానున్నతావునఁ గాక నించుక నెగువగఁ గాన్పించుట సహజము. ఇట్లు వంగుటకు 'atmospheric refraction' అనిపేరు.

ఇట్టిమార్పులు ముఖ్యముగ నొకనక్షత్ర ముదయించుతఱి, భూవలయరేఖ [horizon] కు దిగువగ నుండుతఱి నెగువగఁగన్పించుం గాన నుదయించిన ట్లుగువగఁ గన్పించెడిని. ఇది విచిత్రమని తోఁపకపోదు. ఇట్టిమార్పులనుండి కన్పడుచుండు నక్షత్రములు తమతమనిజస్థానములందే గన్పించుచున్నవా యని సంశయముఁ గలుగకపోదు. ఈ refraction చిత్రములు శిరస్సునకుఁ బైగా నాకసమున నగుపడునక్షత్రములకుఁ గలుగఁజాల దని పరిశీలకులగు విద్వాంసు లనుచున్నారు.

ఈకారణముననే యుదయకాలమునఁ గొంత వేగముతో నక్షత్రగమనములు కన్పించుచుండి, క్రమముగఁ బైకివచ్చినకొలఁది వేగముతగ్గి Zenith నందింకను వేగముతగ్గిన మందగమన ముండుటఁ గాన్పించెడిని.

Refraction మార్పులవలఁ గల్గుమఱియొక విచిత్రము. సూర్యచంద్రులయుద యకాలము

లందుఁగలుగుచుండునని చెప్పఁబడినది. భూవలయ రేఖ [horizon] కడకు నాబింబములు చేరుతఱి, వాటిడయుమీాటరులు భూవలయరేఖతో parallel గా నుండియు, బింబముయొక్క ఉత్తరార్థ మించుకఁ దక్కువఁగఁ బైదెసకును, క్రిందివైపున బింబమునందలి యర్థభాగ మారింట నొకవంతు వరకును, క్రిందికి సాఁగినటుల నగుపడుచు, oval ఆకార మేర్పడి గన్పట్టును. ఇట్టి refraction మార్పు లెవ్వియు మధ్యాకాశగమనమునం దుండ వని చెప్పఁబడినది. (ఎస్ట్రొనొమీ చూడుఁడు. సూర్యబింబము, చంద్రబింబము చూడుఁడు.] సంధ్యారాగము (Twill lights) లిట్టి refraction మార్పులనుండియే కల్గుచుండునని చెప్పఁబడినది. [సంధ్యారాగము చూడుఁడు.]

**వాతేయగోత్రము:—**
(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**వాత్సగోత్రము:**
(విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.)

**వాత్స్యగోత్రము:—**
(నిధృవగణము చూడుఁడు.)

**వాత్సతరాయణగోత్రము:—**
(గర్గ ఉపగణము చూడుఁడు.)

**వాత్సప్రాయణగోత్రము:—**
(విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.)

**వాత్సబలిగోత్రము:—**
(శాండిలగణము చూడుఁడు.)

**వాత్సాయనగోత్రము:—**
(శాండిలగణము చూడుఁడు.)

**వాత్సాయనగోత్రము:—**
(జమదగ్నిఉపగణము చూడుఁడు.)

**వాత్స్యాయనిగోత్రము:—**
(నిధృవగణము చూడుఁడు.)

**వాత్స్యుఁడు:**
ఋషి. శాకల్యునిశిష్యుఁడు.

**వాతోదకానది:—**
(నళినీనది చూడుఁడు.)

**వాతోల్బణసన్నిపాతము:—**
(సన్నిపాతదోషము చూడుఁడు.)

**వాత్సిగోత్రము:—**
(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**వాదనగోత్రము:—**
[భరద్వాజ ఉపగణము చూడుఁడు.]

**వాదము:—**
[కథాత్రయము చూడుఁడు.]

**వాదములు :—** వాదములు- [తర్కశాస్త్రమున] ద్వివిధము.

౧ సంవాదము- [ఉన్నదానింగూర్చి కలదని ఋజువుచేయు వాగ్ధోరణి].

౨ వివాదము- [లేనిదానింగూర్చి కలదను భ్రాంతిని నివారించుటకు చేయువాదము లేక చెప్పు వాగ్ధోరణి].

సంగీతశాస్త్రమున ౧ వాది, ౨ వివాది, 3 సంవాది, ౪ అనువాది యని సంగీతము చతుర్విధము.

**వాదరిగోత్రము:—**
[పారాశరగణము చూడుఁడు.]

**వాదషట్కము (షడ్వాదములు) (ఖ్యాతివాదములు):—** ౧ సత్ఖ్యాతి వాదము, ౨ అసత్ఖ్యాతివాదము, ౩ అనిర్వచనీయఖ్యాతివాదము, ౪ అన్యథాఖ్యాతివాదము, ౫ ఆత్మఖ్యాతివాదము, ౬ అఖ్యాతివాదము.

**వాద్యము లైదువిధములు (పంచ వాద్యములు):—**

మతాంతరమున చతుర్విధములు.

౨ అనద్ధవాద్యము:—భేరీమృదంగాది (తోలుతోఁ గప్పఁబడిన) వాద్యములు.

౨ తతవాద్యము:—వీణాతంబురాది (తంత్రులచేఁ బల్కింపఁబడు) వాద్యములు.

౩ సుషిరవాద్యము:— వేణు (వెదురుగొట్టము), నాగస్వర (తుంబ) ము మొదలగు రంధ్రద్వారములతోఁ గల్గించువాద్యము.

౪ ఘనవాద్యము:—ఘంట, తాళము లు (కాంస్య లోహ) నాదములచేఁ గల్గువాద్యము.

వీట్లను చతుర్విధవాద్యము లందురు. ఇంకను దీనికి మతాంతరమున-

౫ గాత్రవాద్యము:-కంఠము లేక గళమువలనఁ గల్గు ధ్వనులను గల్పి పంచవిధవాద్యము లనుటయుఁ గలదు.

**వాద్యలఘువు:**—సంగీతశాస్త్రమున జాతి [లయ] ప్రాణమునఁ జెప్పఁబడిన దశలఘువులలో నొకటి. ౧౨ అక్షరముల కాలము.

(జాతి.[లయ] ప్రాణము చూడుఁడు).

**వాధూలగోత్రము:—**

(వీతహావ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**వాద్భుతకగోత్రము:**— ఇది యత్రిసంతతిలోని వాద్భుతకగణముగఁ జెప్పబడినగోత్రము. దీనికి ఆత్రేయ, అర్చనానస, వాద్భుతక, అని ప్రవర.



**వాద్భుతకగోత్రము:—**

[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.]

**వాధ్రకిగోత్రము:—**

[నిధ్రువగణము చూడుఁడు.]

**వాధ్ర్యస్వగోత్రము:—**

[వాధ్ర్యస్వ లేక మిత్రయువగణము చూడుఁడు.]

**వాధ్ర్యస్వ లేక మిత్రయువగణము:-** ఇది భృగుసంతతియందలి యొకగణము. దీనిని మిత్రియువగణమనియు నందురు. ఇందు నలువది మూఁడుగోత్రములు చెప్పఁబడినవి.

బోధాయన సూత్రోక్తగోత్రములు [౧౬]

| | |
|---|---|
| ౧ ఉక్షాయన, | ౯ మాల్య, |
| ౨ జౌరుక్షాయన, | ౧౦ మిత్రయువ, |
| ౩ కైతవాయన, | ౧౧ యావాల్య, |
| ౪ గిషాయన, | ౧౨ రౌక్ష్యాయణ, |
| ౫ తాణ్ణాయన, | ౧౩ రౌక్షాయణ, |
| ౬ నాశార్యజస, | ౧౪ వాన్జాయన, |
| ౭ మహావాల్య, | ౧౫ సాపిణ్డిన, |
| ౮ మజ్జాది, | ౧౬ సురభితయ. |

కాత్యాయనసూత్రోక్త గోత్రములు [౯]

| | |
|---|---|
| ౧ అపిశిల, | ౬ మైత్రేయ, |
| ౨ ఆశ్వలాయన, | ౭ శాకటాక్ష, |
| ౩ గోపాయన, | ౮ సాచర్య, |
| ౪ ద్రోణాయన, | ౯ హాసజిహ్వ. |
| ౫ పాటికాయన, | |

మాత్స్యసూత్రోక్త గోత్రములు [౪]

| | |
|---|---|
| ౧ అపికాయని, | ౩ శాలాయని, |
| ౨ రౌద్ధాయన, | ౪ సాస్వయ, |

ఇతర గ్రంథోక్త గోత్రములు [౧౪]

| | |
|---|---|
| ౧ అపిశాయన, | ౮ మోదాయన, |
| ౨ కాపిశాయన, | ౯ రౌక్మాయన, |
| ౩ కాన్డేయ, | ౧౦ రౌప్యాయన, |
| ౪ దివోదాస, | ౧౧ వాధ్ర్యాస్వ, |
| ౫ పిశాక్షి, | ౧౨ శాకటాయన, |
| ౬ పిశాయన, | ౧౩ సాక్షిత, |
| ౭ మిత్రయుగ, | ౧౪ సాత్యకి. |

ఈగోత్రములకు ప్రవర రూపములు.

౧ వాధ్ర్యస్వ, [ఏకార్షేయ ప్రవర]
౨ భార్గవ, వాధ్ర్యశ్వ, దైవోదాస.
౩ భార్గవ, దైవోదాస, వాధ్ర్యశ్వ.
౪ వాధ్ర్యశ్వ, చ్యావన, [ద్వ్యార్షేయప్రవర]
౫ భార్గవ, చ్యావన, దైవోదాస.

**వానపాము** (Earth worm):— వానపాములను తఱచుగ మనము మనయిండ్లవద్దను, తోఁటలు, పెంటలు, మొదలగుచోటను, వర్షము కురియునపుడును, భూమి (మట్టి) త్రవ్వఁబడినపుడును, కొన్నాళ్ళుపాతుడుపడియున్న రాళ్ళక్రిందను, మనము చూచుచుందుము. ఇది పామువంటి శరీరముఁగల్గి, వానకురియునపుడు భూమిలోనుండి పైకివచ్చి యగుపడునుగాన, దీనికి వానపా మని పేరయ్యెను. ఇది భూమియందు నివసించునుగానఁ బాశ్చాత్యులు దీనిని 'మంటిపురుగు' (Earth worm) అందురు.

వానపాము శరీరము తేమగను, అతిమృదువుగను నుండును. రోకలిబండవలె దీని శరీరమును గూడ చిన్నయుంగరము లొకటితో నొకటి చేర్చి యతికినట్లుండును. దీనిశరీర మొక యంగుళము పొడవు మొదలు పదియంగుళములవఱకు నుండును. వానపామునకుఁ గన్నులు, ముక్కు నుండవు. దాని శరీరమందలి మొదటికణుపు మొనతేలి సూదిగా నుండును. ఆసూదివద్ద లోనికొక కన్నముండును. అదియే దానినోరు. ఆకన్నమునుగప్పి యొకచిన్న పొరయుండును. అదియే దాని పెదవి. ఇట్లే దాని శరీరపుఁగొన యుంగరమును మొనదేలి యొకకన్నము లోపలినుండి గల్గియుండును. అదే మలద్వారము. వానపాము నేలఁద్రొకుటకు వీలగునట్లుదానిశరీమందలి ప్రతికణుపునకును దిగువను, ప్రక్కలను నాల్గుజతల ముండ్లవంటి గుబురులుండును. వాని సహాయమున నది నడుచును. అది నడుచునపుడు వెనుక శరీభాగమును నొక్కి ముందుభాగమును చూచును. అపుడు ముందుభాగములోని ముండ్లు భూమిపట్టు వదులును. పిదప నోటివద్దనున్నసూదికొనతో భూమిని నొక్కి వెనుకభాగమును వెనుకకుఁ ద్రోయును. అప్పుడు వెనుకభాగమునందలి ముండపట్టుఁగూడ వదలును. అప్పుడు దేహమునంతను దగ్గఱగా ముడుచుకొనుటమూలమున వానపాము ప్రాకును. అప్పుడు మరల ముండ్లన్నియు భూమి నానును. ఇట్లు వానపాము నడచును. అది భూమిలోఁ గన్నములు చేయుటకును, భూమియందలి సూక్ష్మజీవులు తన్ను బాధింపకుండుటకును, వీలగునట్లు దానివీపుపై నున్న యుంగరముల నరదల లోనున్న చిన్నిరంధ్రములనుండి యొకజలమూరుచు దానియొడలు తేమగ నుంచును. అందువలన దానినరదలందలి కన్నములు విడియుండి, ద్రవమును స్రవించుటయేగాక శ్వాసకార్యమును గూడ నిర్వర్తించును. వెలుతురు, చీఁకటి, వేఁడి, చలి మొదలగువానిని చర్మమువలననే వానపాము తెలుసుకొనును.

వానపాము సూదిగలతనమూతితో చెమ్మగలచోట నొక్కినపుడు మన్ను ప్రక్కల కదుమఁబడి సందగును. అందు బుఱ్ఱనుంచి యది లోని మన్ను పెదవితో గొలికి మ్రింగివేయును. ఆమంటి

యందలి వృక్షపదార్థము దానికాహారమైమిగిలినది తోఁకకన్నమునుండి యుండలుండలుగాఁ గన్నము పై భూమిమీఁద పడును. అవి వృక్షములకుఁ జాలబలమగు నెరువు. వానపాములు పగలు కన్నములందు దాఁగి రాత్రి యాహారములకై తిరుగు నని శాస్త్రవిదు లందురు. దానికి వినుటకు, చూచుటకు, పసి (వాసన) పట్టుటకుఁ బ్రత్యేకావయవములు లేకున్నను, దానియొడలిచర్మమే యిన్నిపనులకును దాని కుపయోగించును. అపాయము నెఱిఁగి కన్నములోఁ జొరఁబడును.

వానపాముయొక్క శరీరమందలి 14, 15 యుంగరములయడుగున నొక్కొక్క యుంగరమున రెండేసిరంధ్రము లుండును. అందు 14 వ యుంగరమునందలి రంధ్రములు రెండును గ్రుడ్లు పెట్టుటకును, 15 వ యుంగరమునుండి వెలువడు రసము నది వేఱొకవానపాము వీపుపై వ్రాయ నది గర్భము ధరించుటకును నుపయోగించును. చూలున్నవానపాము, గ్రుడ్డుపెట్టుటకుఁ బూర్వము తన 32—38 యుంగరములు స్రవించునొకవిధమగు రసమాగడలపైఁ జుట్టునల్లుకొని యొకరబ్బరువంటిపొర యేర్పడును. అది రబ్బరువలెసాగును. ముడుఁగును. ఆపొర శరీరకండరముల [ఉంగరముల] కదలికవలనఁ బదునాలుగవకండరమువద్దకు రాఁగా దానిక్రిందనున్న రెండుకన్నములనుండి వానపాము కొన్నిగ్రుడ్లను, గ్రుడ్డుపిల్లలైన తక్షణము వానికిఁబనికిరాఁగల యాహారమును నాపొరయందు విడుచును. అప్పుడు గ్రుడ్లపొరకును దానిశరీరమునకును నడుమ నుండును. క్రమముగ నీపొర తలవైపునకు జాఱుచు, మొదటియుంగరము దాటి క్రిందఁబడును. క్రిందఁబడఁగానే పొర ముడుచుకొని కన్నములు మూసికొనిపోయి లోపల గ్రుడ్లతో నుండును. ఈగ్రుడ్లయం దొకటిరెండు మాత్రము ముందుగాఁ బెరిగి, పిల్లలై, తక్కినపదార్థమును గ్రుడ్లను దినివేయును. వానపా మెన్నిముక్కలు చేయఁబడిన నన్నియు బ్రతికి పూర్ణాకారములను బొందునని శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

వానపాములు వ్యవసాయదారులకు మిత్రములు. అవి భూమిలోఁ గన్నములు చేసినందువలన గాలి, వెలుతురు, నీరు, బాగుగా భూమిలోఁ బ్రవేసించి, మొక్కలకు సరియగునాహారము నిచ్చుటలోఁ దోడ్పడును. భూమి గుల్లఁబాఱుటవలన వ్యవసాయములవేళ్లు భూమిలో బాగుగ నాటుకొనునట్లుఁ జేయును. వానపాములు తిని పైకి విడిచిపెట్టిన మంటియుండలలో వృక్షజాతిజీవనమున కనుకూలపడు నెరువు విశేషముగ నుండును. అందువలననే వ్యవసాయమునకు వానపాము హెచ్చుగానున్న ప్రదేశములు ప్రశస్తమైనవిగాఁ జెప్పఁబడుచున్నవి.

## వానప్రస్థాశ్రమము:—

[ఆశ్రమచతుష్టయము చూడుఁడు.]

## వానరాకటా, ప్రాణపోకటా తెలియరానిది:—

[ఆంధ్రలోకోక్తి.]

## వానలు కురిస్తే వాతలు మానునా?:-

[ఆంధ్రలోకోక్తి.]

## వానాయనగోత్రము:—

[గర్గఉపగణము చూ ...]

## వాపికగోత్రము:—

[శాండిలగణము చూడుఁడు].

## వామదక్షిణపాదాసనము:— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి.

ఒకకాలి నాని తిన్నగ నిలువఁబడి, రెండవ కాలును ముందునకు చాచి, యానించి, రెండు చేతులను హృదయమునఁ జేర్చుటకుఁ బేరు.

కుడికాలు నేలనాని, నిలుచుండిన కుడిశ్వాస మును, ఎడమకాలు నేలనాని నిలుచుండిన నెడమ ముక్కుగుండా శ్వాసయు నడచును. దీనిని శ్వాస మార్చుట కుపయోగింతురు.

## వామదేవగోత్రము:—
(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

## వామదేవగోత్రము:—
ఇది ఆంగిరస సంతతి. గౌతమగణము. వామదేవ ఉపగణము లోనిది.

ఆంగిరస, వామదేవ, బార్హదుఖ యనియు, ఆంగిరస, గౌతమ, వామదేవ, యనియుఁ బ్రవర రూపములు రెండు.

**వామదేవర్షి:**—వామదేవర్షి పాశుపతుఁడు. శివభక్తుఁడు. మఱియొక వామదేవుఁడు పౌరో హితుఁడు. ఈతఁడు వశిష్ఠునకు సహాయుఁడుగ దశరథమహారాజుకాలమున నుండినవాఁడు.

## వామదేవుఁడు (ఆత్మజ్ఞాని):—
(శుకయోగి చూడుఁడు.)

**వామనద్వాదశి:**—చైత్రశుద్ధద్వాదశి- ఇందు దమనోత్సవవిష్ణుపూజ లొనర్తురు. (పండుగలు చూడుఁడు.)

**వామపాదపవనముక్తాసనము:**—యోగ శాస్త్రమునఁ జెప్పఁబడినయాసనములలో నొకటి. ఇది పవనముక్తాసనముయొక్క ప్రకారాంతర మైనను ప్రత్యేకముగా శాస్త్రమునందుఁ జెప్పఁ బడినది. ఎడమకాలిమడమ నడ్డముగా మడిచి, లింగస్థానమునం దానించి, కుడికాలిని నిలువున మడచి యామడమ నెడమకాలి బొటనవ్రేలి కంటు నట్లుంచి, కుడిచంకను కుడిమోకాలుపై నానించి, చేతులం బంధించి కూర్చుండుట. తక్కిన వన్నియు పవనముక్తాసనమువలెనే.

దీనియభ్యాసమున మలాశయశుద్ధి యగునని చెప్పఁబడినది. (పవనముక్తాసనము - దక్షిణపాద పవనముక్తాసనము చూడుఁడు.)

**వామనపురాణము:**—ఇది లింగ, కూర్మ, పురాణములందుఁ బదమూఁడవ పురాణముగను, తక్కినవాట్లయందుఁ బదునాల్గవ పురాణముగను చెప్పఁబడినది. దేవీభాగవతమున వామనపురాణ మెన్మిదవదిగఁ జెప్పఁబడినది. బ్రహ్మప్రోక్తము. గ్రంథసంఖ్య ౧౦,౦౦౦.

## వామనవ్యూహము:-



రామానుజీయవైష్ణవ వైఖానసవైష్ణవ మత ధర్మములందుఁ దదేకాత్మరూపమహా విష్ణువు. అందు ద్వితీయ చతుర్వ్యూహములలో నొకటి యనియు, ప్రద్యుమ్న వ్యూహము లైదింటిలో నొకయుపవ్యూహ మనియు, వైభవ విలాసమూర్తి యనియు, వరుసగ శంఖ చక్ర గదా పద్మము లాయుధము లనియుఁ జెప్పఁ బడినది.

(విష్ణుదేవాలయ విగ్రహములు చూడుఁడు.)

**వామనస్థలి:—** జూనగడ్ సమీపమున నిప్పుడు బాంతాలి యనంబరఁగుచున్నతావు.

**వామనావతారహస్తము:—** (హస్తాభినయముచూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు)

**వామనుఁడు:—**
[ఉపేంద్రుఁడు చూడుఁడు.]

**వామరథ్యగోత్రము:**
కాపుత్రులగణము చూడుఁడు.]

**వామరథ్యగోత్రము:—**
[ముద్గలగణము చూడుఁడు.]

**వామరథ్యగోత్రము:**
[ఆత్రేయగణము చూడుఁడు.]

**వామవక్రాసనము:** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. కుడికాలిమడమ నెడమతొడక్రిందవచ్చునట్లు కుడికాలు మడచి, యెడమమడమ నెడమపిఱుదున కంటునటుల నెడమకాలిని మడచి, రెండుపాదములకు జానెడుదూర మండునటుల భూమిపై నానించి, కూర్చుండి స్వస్తికాసనమునందువలెఁ జేతులుంచుటవామవక్రాసనమనంబడును. దీనియభ్యాస మాలస్యము నడంచునని చెప్పఁబడినది.

**వామముచెట్టు (ఓమము):—** లా. carum compticum అనియు, ptychotis agowdn. ఆంగ్ల Bishops seed అనియు, omeem seeds tree. సం. దీపిక, దీపనీయ, యవానన్, యవానీ, ఓమ మనియు వాడుకఁ గలదు.

వామము దేశవాళీవామ మనియు, ఖురాసాని వామ మనియు, అడవివామ మనియుఁ ద్రివిధము. దేశవాళీవామము చిన్నగింజయు నొకేభాగమును గల్గినది. ఖురాసానివామము ఖురాసాన్దేశఁపువిత్తనము. పెద్దగింజయు, రెండుమూఁడు భాగములు కలిసి యొకేగింజగను గానవగును. ఇందు, ఖురాసానివామ మెక్కువ ఘాటుగల్గి బలముగ పనిఁ జేయును.

వామము కారముగ నుండి, ఆకలి నుద్రేకించి, వేఁడిచేసి, ఆర్చును. స్త్రీల రుతురక్తమును వెడలించును. బాలింతరాండ్రకుఁ బాలు గల్గించును. పురుషులందు, పుంస్త్వము నుద్రేకించును. అజీర్ణమడంచి కడుపుబ్బును నివారించును. అష్టశూలల నడచును. అజీర్ణవిరేచనములు, అతిసారము, ఆమరోగము, అపస్మారముల నడంచును. కఫము, క్రిమి, గుల్మము, నిస్త్రాణ, మూత్రబద్ధము, వాతములు, విషదోషములు, శోష వీట్ల నివారించును.

రసమును చెవియందుఁబోసినబధిరము(చెవుడు) మొదలగు కర్ణరోగముల నివారించును. కాకతత్వముఁగలవారు విస్తారముగఁ దినిన పైత్యముఁజేసి, తలనొప్పిఁ గల్గించును. కొత్తిమిరియము, మనిషిపాలును, దీనిదుర్గుణములకు విఱుగుడులని చెప్పఁబడినది.

వామఁపురసము పండ్లచిగురు, వాపు బాధల నివారించును. అమితభోజనమువలనఁ గల్గిన యాయాసమును నివారించును. వామముఆకునందు, కాకయు పైత్యముం జేయుగుణ మధికముగ నుండియు, వామమునందుఁగల గుణవిశేషములు సుగుణములం గలియుండునని చెప్పఁబడినది.

అడవివామమునకు లా. seseli Indicum అనియు, ఆంగ్లమున Wild Bishops weed అనియు, సంస్కృతమున వనయోమాని యనియుఁ బేర్లు గలవు. ఇది మిక్కిలి కాక, పైత్యములఁ

జేయుననియు, దీని రసముగాని, అడవివామమును నీళ్ళతో నూరిగాని, గుఱ్ఱములకు లోనికిచ్చిన వాట్ల కడుపునొప్పులు నిమ్మళించుననియుఁ జెప్పఁబడినది.

**వాయనగోత్రము:—**
(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

**వాయనగోత్రము:—**
(కౌమస్థ ఉపగణము చూడుఁడు).

**వాయునిగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**వాయువగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**వాయువానగోత్రము:—**
(ముద్గలగణము చూడుఁడు).

**వాయుతరంగములు, మానవ చైతన్యము:**-సర్వసాధారణమున చైతన్యము గ్రహించు స్పర్శశక్తి శరీరచర్మమునందుండెడిని. అందఱిచేతులు, వేళ్ళు, అందు వాటియగ్రములందుత్తరోత్తర మధికమై యుండును. గాలి వీచునపుడు శరీరమున కాస్పర్శ తగులుట యన వాయుతరంగములను మానవచైతన్యము నెఱింగి గ్రహించుటయే యగును. గాని పెక్కండ్రిఱచేతులకితర చైతన్యస్పర్శజ్ఞానము, అనఁగా తడవి చూచి యావస్తువుంగూర్చియధికముగ నెఱుఁగుజ్ఞానముండుచున్నను, వాయుతరంగముల నెఱింగి గ్రహించు చైతన్యశక్తి యుండదనుచుందురు. ఇది యింకను చక్కఁగాఁ బరిశీలింపఁదగినసంగతి.

అతిత్వరితమున బండి పర్విడుతఱిఁ గల్గువాయుతరంగములు చాల చిన్నవిగ నుండి, త్వరితగతిని జతనుఱిచేతులు గ్రహింపలేకపోవుటఁ బోవుంగాని, దీర్ఘతరంగముల నెఱుఁగఁగలవనియే తోఁచెడిని. కడుచిన్నవగు వాయుతరంగములను చెవులు గ్రహించఁగలుగునుగాని, వాటింగూడ ధ్వనియే యనుకొనుచుండును. ఇంకను నిట్టియఱచేతులశక్తి కొందఱి కల్పముగను నుండికొందఱి కధికముగను, నుండనోపు. నేత్రదృష్టియు, శ్రవణములచే విను శక్తియుం గొందరియఁ దెక్కువయు, కొందరియుం దల్పముగను నుండుటఁ గలదు.

**వాయుపరీక్షలేకగ్రహయుద్ధలక్షణ వాయుపరీక్ష:—** తూర్పు, వాయవ్యదిశ, ఉత్తరము, ఈశాన్యము, ఈదిశలనుండి వీచినగాలి వర్షముం గల్గించుననియు, పశ్చిమమునుండి వీచిన గాలి వర్షాభావముంగాని, స్వవృష్టింగాని గల్గించుననియు, ఆగ్నేయము, దక్షిణము, నైరుతి, దిక్కులనుండి వీచుగాలి వర్షముగల్గింపనిగాలి యనియు, రెట్టవిజ్ఞానబోధకుండగు నయ్యాలరా జనియెను.
(కాలవిజ్ఞానశాస్త్రము చూడుఁడు.)

**వాయుపూతిగోత్రము:—**
(ముద్గలగణము చూడుఁడు.)

**వాయుమండలముయొక్క తూనిక:-** దీని నాంగ్లమున 'weight of atmosphere' అని యనువదింపనగును. స్థూలదృష్టికి వాయువునకుఁదూనికగలదా యని పించునుగాని, లేకపోలేదు. ఘనపదార్థములవలె స్పష్టమైనబరువు వాయువునకుఁ గాన్పించదుగాని, గాలికి భారము లేకపోలేదు.

పరిశీలనలవలన వాయువు దానిక్రిందనుండి భూమినిగాని, జలమునుగాని, ఒత్తుచున్నదని తేలుచున్నది. బారోమీటరునందున్న పాదరసము గాలివలనఁ గ్రిందికణచఁబడి యుంటఁ దెలియనగును.

సముద్రపునీటిపై నున్న వాయువు కొంతప్రదేశముగఁ గైకొని, ఆకాశమండలి వాయువుహద్దు నుండి యడుగున నీటిపై మట్టమువఱకుఁ దూచిననది యదేపరిమితిగల పాదరసమంతబరు వుండవలెనని యు, కాని పిదప నంతపరిమితినిగల్గి ముప్పదియంగుళముల దళసరిగల పాదరసముతో సరియగునని తర్వాత పరిశీలకులు పోల్చియున్నారు.

దీనినే మూలసూత్రముగఁ గైకొని నీటి పంపులు చేయఁబడి పనిచేయుచున్నవి. ముప్పదిరెండడుగులుయెత్తును, ఒకయడుగు పొడవువెడలుపులుగల గాలి, అంతియేపరిమితిగలనీటి కున్నంతబరువుగలదిగఁ జెప్పఁబడినది.

పైరెండుమూలసూత్ర ధర్మముల నుండియు భూమిపై నున్న గాలియంతయు నాభూమినంతటిని ముప్పదియంగుళముల దళసరిని పాదరసముతోఁ గప్పిన నెంత పాదరసమగునో, అంతబరువు గల్గి యుండవలెననియు, గాలినంతటి పొడుగువెడల్పులంగొలచి ముప్పదిరెండడుగుల దళసరిగలభాగములుగ నొనర్చి యెన్నిభాగములగు యన్నియంతల నీటితో సమానమగుభారముగలదిగ నుండవలెననియు తేలుచున్నది. ఇంకను నధికపరిశీలన లొనర్చినవా రఱువదిమైళ్ళ diameter గల సీసఁపుటుండకు (leed globe) సరిగా నుండునని లెక్కించియున్నారు. ఈలెక్కవలన వాయువు భూమిపై ప్రతిచదరఁపు టంగుళప్రదేశమునకు సగటున 16 పౌనులుండునని తేలుచున్నది.

ఈగణితమే సరియయ్యేనేని మానవశరీరము దామాషాయీని పదునేను చతురఁపుటడుగుల ప్రదేశ మాక్రమించునని యనుకొనిన నాతనిశరీరముపై నుండువాయువు 32505 పౌనులు భారము కలదిగ నుండవలసియుండును. ఈబరువాకే ప్రదేశమున మానవశరీరముపై నానుట లేదుగాన, మనుష్యులను నొక్కఁజాలకున్నది. ఈభారము శరీరమునకంతకు నన్నివైపులను చెదరితగులుచుంట మనుష్యులకు నాటుటలేదు. మఱియు నలవాటైయునలే తెలియకుండును. ఇంతియేగాక వాయువు నందుగల elasticity శక్తియొక్క springing వలన Counter balance లుగ నగుచు మనల నొత్తఁజాలకపోవుచున్నది.

## వాయుర్నావమివాంభసీతి న్యాయము:

—నీటిలోని యోడ గాలిచే చలించినట్లని యము. సుడిగాలికి కొట్టుకొని తడఁబడును. ఒకదిక్కునకు చలించువాయువువలన నాదిక్కునకు నడుచును. గాలి బలముగ నేవైపునకు వీచిన నావైపునకుఁ బర్విడును. మందముగా వీచిన నెమ్మదిగాఁ బర్విడును. గాలి నిలచిపోయిన నోడయు నిలుచునని భావము.

## వాయువిడంగములచెట్టు:—

లా. Embelia Robusta: సం. చిత్రతండులవృక్షః, జంతుఘ్నం, జన్తుఘ్నీ, జన్తుశత్రుః, జన్తుహననం, జన్తుహన్త్రి, విడంగా దీనిపండ్లకు వాయువిడంగములనిపేరు.

వాయువిడంగములచూర్ణము లేక రసము, లేక గషాయము రక్తవిరేచనములు, కట్టునవియు, త్రిదోషముల నడంచి, మేహశాంతి, పైత్యశాంతి గల్గించుననియు నుబ్బుజాడ్యము, ఎక్కిళ్లు, క్రిమి, గుల్మరోగము, చర్మ[విదాహము], పాండురోగము, శ్వాసకాసలు, శూలలు నివారించి సమధాతువుం గల్గించు ననియుఁ జెప్పఁబడినది.

## వాయువిమాన యంత్రశాస్త్రము:—

వాయుపథ మనంబడు మహావాయువాతావరణమున వాయువిమానములు తేలుచు నంచరించు

విధానముంగూర్చిన విధులం దెల్పునదిగాన వాయు విమానయంత్రశాస్త్ర మనంబడుచున్నది. దీని కాంగ్లమున 'aeronautics' అనియెదరు. (పరో పైనామిక్సు చూడుఁడు). ఇత్తఱి మున్ముందు గాలిలోఁ దేలునవి ద్వివిధముగఁ జెప్పఁబడినవాట్లం గూర్చిన చరిత్ర వివరించుట సమంజసము. గాలి కన్న తేలికయై, వాతావరణమందుఁ దేలఁగల బెలూను లొకటియు, గాలికన్న బరువైనశరీరము కే గాక లోన నతిభారమగు నినుపయంత్రములంగూడ గల్గి తన గమనమువలననే గాలియందు తేలి, పై కెగురుటతోమాత్రము గాక తనను త్రిప్పినదెసకు వాతావరణమున పోఁ గలుగు నేరోప్లేనులు మొదలగునవి రెండుగను (ద్వివిధములుగ) నీశా స్త్రము వివరించుచున్నది.

క్రీ. శ. ౧౭౮౩ సంవత్సరమున ఫ్రెంచిదేశ మున montgolfiers అనునాయన తొలుత నీపరిశీలనప్రయత్నము లొనర్చెను. ఆయన బెలూ నులందు వేఁడిగాలి నింపి, వేఁడిచేసి, చులకనయగు కతనఁ బై కెగురుటం జూచి, కొన్ని జంతువులను గూడఁ బెకిఁ బంపెను.

పిదప పిలాత్రో డి రోజి యనునాయన బెలూ నుకొక త్రాటింగట్టి తానే పై కేగఁగాని యది భూమినుండి నూరడుగులకన్న నధికము పోలేదు. పిమ్మట నాయనయును మార్క్విస్ డి అర్లాండీస్ అనునాయనయు, ప్రయత్నించి హైడ్రోజెన్ బెలూనునందుఁ బై కెగిరి రాఁగల్గిరి. ఆసంవత్సరమే Charles & Bobert అను నిర్వురును గూడఁ ంచి యెగిరియుండిరి.

క్రీ. శ. ౧౮౫౨ లో గిఫర్డు అనునాయన పొగచుట్టవంటి యాకారముగల 'ఎయిర్షిప్' అనం బడినబెలూనును చేసి ప్రయత్నించియుండెను. దీనిని చిన్నఆవిరియంత్రముతో ముందుకుఁ ద్రోయించె నఁట. ౧౮౭౨ లో Haenlein అను జర్మను దేశస్థుఁడు రచించి, యొక 'Gas engine' చేత కదలునట్లు చేసెనఁట. అదేకాలమున ఫ్రెన్సు దేశమునందు డుపూయి -డి లోమ్ అనునాయన ౧౧౮ అడుగులపొడవుగల వాయువిమానముం గట్టి చేతిబలముచే ముందునకుఁ ద్రోయఁబడుటకు వీలుచూపెనఁట.

క్రీ. శ. ౧౮౮౩ లో టిస్సెండియర్ అను నాయనయు. ౧౮౮౪ లో రేనార్డు క్రెబ్సు అను వారును, పరుషిప్పులంగట్టి విద్యుచ్ఛక్తిబలముచే నడుపఁబడునట్లొనర్చిరి. వీట్లకు dirigible air ship అని పేరయ్యెను. క్రీ. శ. ౧౮౯౩ లో Sehwarty అను మహనీయుఁ డల్యూమినియమ్ శరీరముంగల్గిన ఒక air ship తయారుఁ జేసెను. నేఁటివిమానములకిది మూలమయ్యెనఁట. క్రీ. శ. ౧౮౯౯ లో జెప్లిన్ అనంబడిన వాయువిమానము చేయఁబడినపిదప వాయువిమానవ్యవహార మధిక మై పారిస్పట్టణమునందలి ఎఫియెల్ టవర్ మిగుల నుపయోగించుచు సహకారియై యభివృద్ధికి మార్గ ముం దెలిపెను. ఈ సందర్భమున సాంటోస్ దూమాంటుగా రెక్కువప్రయత్నించి శ్రమపడి పరిశీలనాదులసల్పినవారని చెప్పఁబడినది.

దీనితో ననేకరకముల వాయువిమానములు తమతమ సైన్యకార్యములకుఁగా ననేకదేశముల వారు రచింప వీలుగల్గెను. ఐరోపామహాసంగ్రా మమున నన్నికక్షులవారు లెక్కలేనివాయువిమాన ములతో నొకరినొకరు ఢీకొనియుండిరి.

గాలికన్న బరువగువాటిలో గ్లైడర్సు అనం బడు విమానము లిప్పటివిమానరచనకు మార్గముం జూపినవి. జార్జికేలేయనునాయన పరిశీలనలందే

ప్రాణము గోల్పోయెనఁట. క్రీ. శ. ౧౯౦౩ లో నిద్దరమెరికా దేశస్థులు పెట్రోలు యంత్రముతో రచించి ౮౫౨ అడుగులు నడుపఁగలిగిరఁట. పిదప క్రీ. శ. ౧౯౦౬ లో సాంతోస్డూమాంటను నాయన యొక గ్లయిడరు విమానముం గట్టి యాసంవత్సరమక్టోబరు నెలలో రెండువందల యడుగులవఱ కెగురఁగల్గెనఁట. కాని ౧౯౦౮ నాఁటికి ఫ్రాన్సు దేశమున పెక్కు వాయువిమానము లెగురుచుండెనని చెప్పఁబడినది. పిదప వాయువిమానములు తెఱుఁగ్లైన పనిఁజేయుచున్నవఁట.

ఏరోప్లేన్ గద్దయొక్కయాకారమేగాక నది యెగురుపద్ధతినే యవలంబించిచేసినపని యందురు. ఇది గ్లయిడరుజాతివిమానము. ఇందు మోనోప్లేన్యు, బై ప్లేన్ అనియు నిఱుతెఱఁగులుగ నుండును. ఇటీవల ట్రైప్లేనుగూడ చేయఁబడినదని తెలియుచున్నది. పెద్దవిమానములందుఁ బ్రత్యేకంపుగదియుండుఁ బ్రయాణస్థులును, యంత్రముల కడ దానినడుపు పైలటుద్యోగి కూర్చుండు నేర్పాట్లుండును. ఈకల యింకను నభివృద్ధినందవలసియే యున్నది.

### వాయువిమానమునందలి (aroplane ౧౧౯ ముఖ్యయంత్రభాగములు:—

1 Airscrew, or propeller.
2 Propeller boss.
3 Boss plate.
4 Airscrew reduction gear casing.
5 Carburetter.
6 Engine bearer.
7 Nose.
8 Leading fuselage street.
9 Waterpipe between engine and header tank.
10-12 Cylinder 450 horse-power Napier Lion engine.



11 Exhaust pipe from engine.
12 Oil tank stay.
13 Oil tank.
14 Waterpipe between header tank and radiator.
15 Radiator.
16 Radiator shutters.
17 Radiator shutter control rod.
18 Header tank filler.
19 Streamlined water header tank.
20 Valve operating lever.
21 Valve lever control rod.
22 Rudder bar.
23 Wireless receiver and trans-mitter.
24 Under-carriage strut bolt.
25 Triplex unsplinterable glass wind screen.
26 Reserve pilot.
27 Pilot.
28 Instrument board.
29 Aerial reel.
30 Pilot's cockpit.
31 Wireless remote control.
32 Control lever, or joy-stick.
33 Pilot's seat.
34 Elevator control lever.
35 Logbook and spares box.
36 Control wires to vertical rudder.
37 Cockpit floor strut.
38 Wirless aerial tube.
39 Collision bulkhead.
40 Aerial.
41 Front under carriage struts.
42 Rubber shock-absorbers with oil dampers.
43 Londing wheels.
44 Cord aero tyres.
45 Wheel discs.
46 Petrol tank fillers.

47 Petrol tanks.
48 Saloon curtains.
49 Starboard windows.
50 Leading edge of upper plane.
51 Starboard upper wing tip.
52 Starboard upper plane.
53 Starbord upper aileron.
54 Registration letters of machine.
55 Inlet for heating and venti-lating of cabin.
56 Upper port plane.
57 Upper port aileron.
58 Aileron pylons.
59 Aileron control wires.
60 Upper port wing tip.
61 Saloon containing wicker arm-chairs for eight passengers.
62 Pilot tube of air-speed indi-cator.
63 Twin flying wires.
64 Incidence wires.
65 Streamlined hollow interplane struts.
66 Port lower plane.
67 Strut sockets.
68 Leading edge of lower plane.
69 Fabric wing covering treated with waterproof dope.
70 Solid compression rib.
71 Rib flauge.
72 Former ribs.
73 Main front spar.
74 Ordinary ribs with holes in the web to make themlighter.
75 Rib web without lightening holes.
76 Internal bracing wires.
77 Distance piece to prevent ribs rolling.
78 Lower port wing tip.
79 Main rear spar.
80 Lower port aileron.
81 Aileron gap wires.
82 Trailing edge of lower plane.
83 Emergency exit hatch.
84 Interior electric light.
85 Life-belt in case.
86 Roof light.
87 Upper port longeron.
88 Lavatory.
89 Spare or attendant's seat.
90 Folding accomodation ladder.
91 Port lower longeron.
92 Fuselage side struts.
93 Duralumin longeron strut sockets.
94 Bulkhead.
95 Luggage, goods, and mails.
96 Fairing ribs.
97 Fairing.
98 Rudder control cables.
99 Twin control cables to elevators, both being controlled from port side.
100 Wire turnbuckle.
101 Plywood covering of fuselage.
102 Fuselage bottom cross struts.
103 Fuselage bottom bracing wires.
104 Elevator control cross shaft.
105 Port elevator control lever.
106 Rudder cable guide rod.
107 Elevator control rod.
108 Fuselage side bracing wires.
109 Rubber shock absorbers for tail skid.
110 Tail skid.
111 Tail skid steel shoe.
112 Tail plane.
113 Tail plane trimming gear.
114 Fin.
115 Balanced portion of rudder.

116 Balanced rudder.
117 Indentification letter showing country of origin.
118 Port elevator.
119 Aerial plummet.

## 'యువు - దానికార్యము( ):—

వాయువు భూగోళముం జుట్టుకొని యాకాశము వైపు పెక్కుమైళ్ళదూరమువఱకు వ్యాపించియుండునది. దీనికి 'మహావాయుమండలి' యనిపేరు. వాయువు పెక్కుభేదములు గలది. అందు ముఖ్యములగునవి మూఁడు. నైట్రోజెన్ గాలి యందు ముప్పాతిక వఱకు నుండును. అక్సిజెన సంబంధ గాలి నాల్గవవంతుకుఁ గొంచెము తక్కువగా నుండెడిని. కార్బానిక్ ఆసిడ్ గాస్ అనంబడునది కొంత నీటియావిరి కొంత యందుండెడిని. ప్రాణిసముదాయ మూపిరిఁదీయునపుడు ఆక్సిజెన్ (oxygen gas) గాలిని లోన నుపయోగించుకొని, తక్కువ కార్బోనిక్ ఆసిడ్ గాస్ (carbnic acid gas) ను పైకి వదలివేయుచుండును. వృక్షసముదాయమంతయు నట్లే కార్బానికాసిడ్ గాసును తమలోని కుపయోగించుకొనుటకు ఆక్సిజెన్ గాస్‌ను పైకి వదలివేయుచుండును. ఇటుల గాలి ప్రాణులకు, వృక్షసముదాయమునకుఁ గూడ నవసరమయ్యు నన్యోన్యసాహాయ్య మొనరించుకొనుటఁ గాననయ్యెడిని.

గాలి కండ్ల కగుపడునది గాక శరీరమునకుఁ దాఁకుటవలనను, దూరమునుండి వాసనలను మన ఘ్రాణేంద్రియముకడకుఁ జేర్చుటవలనను, ధ్వనులను దూరమునుండి మనకర్ణేంద్రియములకుఁ జేర్చుట, మనమాటల నన్యుల కర్ణేంద్రియముల కడకుఁ గొంపోవుట మొదలగుకార్యములవలనఁ దెలియనగుచుండునది. మఱియు వాయు విజ్ఞానశాస్త్ర విధముల ప్రాణుల కుపయోగించునదిగ నున్నది. భూమియందలి ప్రాణిసముదాయమునకును, వృక్షసముదాయమునకుఁగూడ నీటివలెనే వాయువును నత్యావసరపదార్థములలో నొక్కటి యైయున్నది.

వాయువునకు వేడితో సంబంధముఁ గల్గుతఱి, విజృంభించి (Expands) పలుచనై (Thined) విస్తారఁపుఁబ్రదేశ మాక్రమించెడిని. అట్లె శీతలముతో సంబంధముఁ గల్గుతఱి ముడుచుకొని (Contracts) దట్టమై (Thick) తక్కువప్రదేశ మాక్రమించి బరువై యుండెడిని. గాలి యింకను నొకవస్తువుచే నొక్కఁబడి నిర్బంధముగ నడఁపఁబడుతఱి నడఁగి దట్టమై బరువగును. తిరిగి విడువఁబడునపుడు తనమామూలుమేరకుఁ బలుచనై వ్యాపించెడిని. మహావాయుమండలియందలి భూమికిఁదాఁకియుండు గాలిపొర తనపైనుండు వాయుసముదాయముచే నొక్కఁబడుచు, దానియొక్కబరువు మోయుటచే నడఁగి, బరువుగ నుండును. ఇట్టితఱిఁ గొంచెముస్థలమునే యాక్రమించెడిని. ఇంక నాకాశముపైపు కడనుండు పైగాలిపొరలందు గాలి కనుపలనై తేలికయై విస్తారఁపుఁ బ్రదేశమునఁ జెదరియుండెడిని. సముద్రఁపు నీటిమట్టముపైనుండి గాలి యొకచౌకము అంగుళము ౧౫ పౌనులబరువు మోయునని యు సముద్రఁపు నీటిమట్టమునుండి మూఁడుమైళ్ళదూరమున నందులోసగమువరువే యుండి రమారమి పదిమైళ్ల యెత్తున రెండుపౌనులబరువే యుండునని యు లెక్కించఁబడినది. ఇందువలన శీతలమువలన ముడుచుకొనియు, బరువువలన దట్టమై నొక్కఁబడిన గాలి విడుదలయగుటయు వేడిచేయఁబడి బలుచనై వ్యాపించుటయు సంభవించునేని, పదునేడు రెట్లెక్కువపు ప్రదేశ మాక్రమించుకొనునని తేలుచున్నది. ఇంకను గాలి శీతలమువలన బరువగుతఱి

భూమివైపు క్రిందికిఁదిగుటయు, వేఁడివలనఁ జల కనగుతటి నాకసమువంకఁ బైకిలేచుటయు గాలి యొక్క లక్షణములు.

**వాయుచలనము:**—ఇట్టి మహావాయుమండలి కదలక నిలచియేయుండిన నదిచేయుపనులను పూర్తిగాఁ జేయలేకపోయెడిని. గాన వాయుచలనము చాలాముఖ్యమయినది. గాలికి వేఁడితో సంబంధ ముగల్గి వేఁడెక్కుచో పలచఁబడుటయు, పైకి లేచుటయును, శీతలసంబంధమునఁ జల్లనగుచో గాఢమై బరువెక్కి భూమివైపు క్రిందికి దిగుటయు, వాయులక్షణములు. భూమధ్యరేఖకడఁగడు నుష్ణప్రదేశ మగుట గాలి వేఁడెక్కి పలుకనయ్యె పైకి లేచుచుండును. అట్టితటి నాస్థాన మాక్రమించుటకు త్తరదక్షిణ ధ్రువములయందుఁ జల్లఁబడినగాలి భూమధ్యరేఖవైపున కెగురుటంజేసి, తాను నట వేఁడియై పైకెగసిపోవుచుండుటయు, తిరుగ ధ్రువములనుండి చల్లనిగాలి యేతెంచుచుంటయు నడచుచుండును. వేఁడియై పైకెగసినగాలి పైనుండి యే ధ్రువముల కిరుదెసల నేగుతామును ధ్రువములకడఁ జల్లనై క్రిందికిదిగి తిరుగ భూమధ్యరేఖ కడ కేగుచుంటయు, జరుగుచునేయుండును. అనఁగాఁ గ్రిందుగా ధృవములనుండి భూమధ్యరేఖాప్రదేశముల కేగుచుండినది శీతలవాయు ప్రవాహముగను, పైఁగా (ఆకసమునందు) భూమధ్యరేఖాప్రదేశమునుండి రెండుధృవములవైపు నిరుదెసలకు వీచువాయుప్రవాహ ముష్ణవాయువనియు, నీసాధారణసిద్ధాంతమును మనస్సునందుంచుకొనవలయును. ఈవాయు ప్రవాహములకు 'Primery air Currents' అనిపేరు.

వాయుప్రవాహ మిట్లాద్యంతములు గలదియైనను, భూమి తనకుఁ దాను తిరుగుచు, భూమధ్యరేఖాప్రదేశమున మినిటునకుఁ బదునేఁడుమైళ్ళు రెండుఫర్లాంగుల డెబ్బదిమూఁడుగజముల యొక యడుగుచొప్పునఁ బర్విడుచుండుటయు, ఆమహా వేగమున భూమి తన్నావరించియున్న మహావాయు మండలిని రాచుకొనుచుఁ బశ్చిమనుండి తూర్పునకుఁ బర్విడుచుంటయు, నీవాయుప్రవాహము లను వంచి, కొంతకలవరముఁ గల్గించి, మార్పు నందించును. ఈక్వేటరున కుత్తరమున నుత్తరధృవమునుండి భూమియొక్క యుపరిభాగమునంటియే వీచు నుత్తరఁపు శీతలవాయుప్రవాహము ట్రాపికల్ ఆఫ్ కేన్సర్ హద్దు చేరువఱకే వంగి పశ్చిమాభిముఖమై జనుచుండు ఈశాన్యదిక్కునుండి వీచుగాలిగా (North East wind Current) నేర్పడును. ఈక్వేటరునుండి యుత్తరధృవమునకేగు వాయుపరివాహము మొదటినుండియు పైకిలేచి యాకసమున కేగుచో నీశాన్యదిక్కునైపున నడునారంభించి, యంతరాళమున నడుచు నైఋతిదిశనుండి వీచువాయుప్రవాహము (South west wind Current) గ నేర్పడును. అనఁగాఁ గ్రిందినుండి జనువాయుప్రవాహమునకు పైనాకసమునందు జను వాయుప్రవాహ మెదురుగనుండునని యెఱుంగునది. ఇంక దక్షిణధృవము నుండి వీచు దక్షిణవాయువు వాయవ్యదిక్కునకు వీచుచు 'South East wind current' అనియు, భూమధ్యరేఖాతలమునుండి యాకసమున దక్షిణధృవమువైపువీచు వేఁడిగాలి 'North west wind current' గను నేర్పడియెడిని.

ఇప్పటికిఁ బ్రధానవాయుప్రవాహములగు Primary Currents శీతవాయువులు భూమధ్యరేఖ కుత్తరమున నీశాన్యదిశనుండి (North East current) వీచునదియు, ఉష్ణవాయువు నైఋతిదిశనుండి వీచునదియు (South West current), రెండు భూమధ్యరేఖకు దక్షిణమున శీతలవాయువులు, ఆగ్నేయదిక్కునుండి (South

East current) వీచునదియు, ఉష్ణవాయువులు వాయవ్యదిక్కునుండి వీచునదియు, (South West current) రెండును మొత్తము నాలుగు కలిసియున్నవి. ఈవాయుప్రవాహము ఉత్తర దక్షిణధ్రువములనుండి ౨౦° డిగ్రీలదూరమునఁ బ్రారంభమై, వీచుట యేఅడ్డు నాటంకములు లేని సముద్రములమీఁద స్పష్టముగాఁ గానసగుచు, నిలుకడఁగ వీచుచుంటఁ గానసగును. వీట్ల కాంగ్ల శాస్త్రవేత్తలు 'Trade winds' అని పేరిడి యున్నారు.

అవి భూమిపై నుండి వీచుతఱిఁ బర్వతములు, పీఠభూములు మొదలగునవి దారి కడ్డమగుచో వాటకుం దగిలి కొంతభాగము వెనుకకు మరలుటయు, ప్రక్కకు మరలి నడచుటయు మొదలగు మార్పులకు లోనై వేర్వేఱుతావుల వేర్వేఱు దిశలనుండి వీచునవి యగును. ఆంధ్రదేశమున దక్షిణదిశనుండి వీచుగాలియు నిట్లె మార్పుఁజెందిన వాయుప్రవాహమే. ఇంక నాకసమున నెత్తుగవీచు నుష్ణవాయువులు, భూమధ్యరేఖనుండి నలుఁబది డిగ్రీలప్రాంతమున బరువై క్రిందికి దిగును. ఇవి శీతలవాయువున కెదురగు తావుల గొప్పధ్వని నొనర్చుచు నరుగుంగాన వీట్లకు 'Roaring forties' అని నావికులు వాడుచున్నారు.

ఇట్లుఁ బలువిధములుగ మాఱినవాయుప్రవాహములం దింకను వేఱుమార్పులు గలుగును. వేఁడిప్రదేశములుగల భూభాగములనుండి యుచ్చటచ్చటఁ బైకెగయువేఁడిగాలులు, శీతలప్రదేశములందుఁ బల్లఁబడినగాలులును, యీప్రవాహములకుం దగిలి వాట్లలక్షణములను మార్పఁగలుగును. సముద్రమునుండియు మంచుచేఁ గప్పఁబడిన పర్వతాగ్రములగుండా వీచుగాలియు, ప్రవాహమునందలి శీతోష్ణస్థితిని మార్చును. ఇట్టిమార్పులకు



లోనగుతఱి వాయుప్రవాహము తమమార్గముల నుండివీడి, వేఱుమార్గములం బట్టుటయు, నొకప్పుడెదురుఁదిరిగి వీచుటయు సంభవించును. కొన్ని తావులందు వేసవికాలమునం దొకవైపునుండియు, వర్షముల దాని కెదురుదెసనుండియు వీవనారంభించును. వీట్లకు 'moon soons' అనియును, 'seasional winds' అనియును శాస్త్రజ్ఞులు పేరిడియున్నారు. శీతలదేశములందు వర్షముఁ గల్గించుపరిస్థితులు వేఱుగ నుండును.

moon soon గాలులందు ముఖ్యమగునవి రెండు. అవి యీశాన్యదిశనుండియు, తూర్పునుండియు వీచు North East moonsoon గాలియు, నైఋతిదిశనుండి వీచు South west moonsoon గాలియు, ననునవి. ఇవి వేర్వేరు తావుల వీచును. ఒక్కొక్కతావున రెండును వీచుటయుం గలదు. నార్తీస్టు మాన్సూన్‌గాలి జూలై ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు నెలలందు వీచుటయు, South west moonsoon ఆగస్టునుండి యొకప్పుడును, తఱుచుగ నక్టోబరు, నవంబరు, డిశంబరు, జనవరి నెలలందు నసాధారణముగను, వీచుటఁ గల్గుచుండును. ఈపద్ధతిగాలులు వర్షములం గల్గించును. ఇవి భరతదేశమునందునను, బర్మా, స్ట్రెయిట్ సెటల్మెంటు దేశమునను, పశ్చిమచీనా దేశమందునను గానసగును. పశ్చిమకనుముల ప్రాంతమున (western ghats) మొదలగు కొన్నితావులందు వేర్వేఱుకారణముల నీగాలులు విస్తారము వర్షించును. అస్సాముదేశములోని చిర్రాపుంజీ యనుతావునఁ బ్రపంచమందెల్ల నెక్కుడు వర్షముఁ గురియును. ఇట్లయ్యుఁ గొన్నితావులం దీ moonsoons తప్పుకొని మరల విడిపోవుటచే వర్షమే యుండదు

తిరునల్వేలిజిల్లాయందు, కుర్తాలమను కొండ ప్రదేశముతావు కలదు. ఈతావున కెదురుగఁ బశ్చిమకనుమలు (western ghats) పర్వతపంక్తియం దొకవెలితిగుండా, అరేబియాసముద్రిమందుఁ గడుదూరము వీచుటచే శీతలమగు వాయుప్రవాహము కొద్దిగా నివ్వల కేతెంచి కుర్తాలప్రాంతముల వేసవికాలమంతయుఁ గొద్దికొద్దివర్షములు కురియుచునేయుండును. ఆవర్షప్రాంతమెంతో పెద్దదియునుగాదు. అది విస్తారమెత్తగుప్రదేశమునుగాదు. కుర్తాలమునుండి యొక మైలున్నరదూరమున వేడిమి తాండవమాడుచుండి, కుర్తాలమున వర్షపుజల్లులచేఁ జల్లఁబడి యతిమనోహరమై శీతోష్ణముగ నుండెడిని. గాని దీనిని సమశీతోష్ణప్రదేశము Sanitorium గా వాడెదరు. ఇంక రామనాథపురంపుజిల్లాలోని రామేశ్వరమున వర్షమే కురియుట యుండదు.

ఈవర్షపుగాలు లొకప్పుడు పెక్కుకారణములచే నాకర్షింపఁబడి బహువడిఁగలవిగ నగును. అట్టిగాలు లీశాన్యదిశనుండియు, నాగ్నేయదిశనుండియుఁ బ్రారంభమై, భూమధ్యరేఖాస్థానమువైపు నడుచుచు, వృత్తాకారములుగ గిరగిరఁదిరుగుచుఁ జనును. వర్షముంగల్గించు లక్షణము లిందు లేకుండిన నద్దానిని సుడిగాలి (whirl wind) యందుము. వర్షలక్షణముండిన తుపానుగాలి (cyclonic wind) అందుము.

తుపానులు వాయువు low presoure దశనందుతఱిఁ గల్గెడిని. ఇవి యచ్చటచ్చటఁ గల్గుచున్నను, బంగాళాఖాతియుక్తాగ్రిగుడమునం (Bay of Bengal) దెక్కువగ సంభవించుచుండును. తుపానులు చాలయపాయకరములుగఁ బరిణమించఁదగినవి. ఒక్కొక్కప్పుడు తుపానుచేఁ జుట్టఁబడిన సముద్రప్రదేశమందలినీరు స్తంభమువలె పెక్కుగజములయెత్తునఁ పైకి నాకసమువైపు లేచును. అట్టితఱి దరినున్నభూప్రదేశ మెత్తుగనున్న దక్కఁ బల్లమగునేని భూమిపై బహుదూర మానసముద్రంపునీరుఁ బర్విడి ముంచి చాలా నష్టముం గల్గించును. దీని నుప్పెన యందుము. ఆంధ్రదేశమున ప్రసిద్ధమగు బందరు (మచిలీపట్టణము) ఉప్పెనయు, కలకత్తానగరముదరినున్న సుందరవనము (Sundarbans) న క్రీ. వె. ౧౮౭౦ ప్రాంతములం గల్గిన యుప్పెనయు నిట్టివే. తుపానులు సంభవించుటకు మున్నును, సంభవించి యాగిపోయినవెనుకను వాతావరణమందుఁ జలన ముండక చాల ప్రశాంతముగ నుండును. చాల నిశ్శబ్దముగ నుండెడిని. తుపానులుఁ దఱచుగ సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు మాసములందుఁ గల్గుచుండునని పరిశీలనలవలనఁ దేలుచున్నది.

తుపానులందు గాలి (low pressure) జూపునట్లు anticyclones కలవనియు, నందు high pressure నందునవియు, నాంగ్లపండితులు వచింతురు. అందునను వాయువు సుడితిరిగినను, విశేషబల ముండఁజాల దనియు, నవి తుపాను జనునట్టిమార్గమున కెదురుగ నడచునవియు, అందు వర్ష ముండకపోవుటయేగాక గాలి పొడిగనుండుటయు, మనోహరముగ నుండుటయో లేక నిశ్చలముగనుంటయో సంభవించునవియు, నాంగ్లపండితు లనెదరు.

తుపానులకు వేర్వేఱుదేశముల వేర్వేరుపేరులు గలవు. మఱియుఁ గొన్నిటియందు గాలియు వర్షము సమముగ నుండును. కొన్నిఁటియందు వర్షమధికముగను, గాలి తక్కువగను నుండును. కొన్నిఁటియందు వర్షముండినను గాలి విపరీతమై యుండును. కొన్నిఁటియందు సుడిగాలి యపాయకరమై యుండును. మఱికొన్నిఁటియందు వేడి

గాలియే వీచును. మఱికొన్నింటియందు దుమార మధికమైయుండును. ఇట్లింకను పెక్కు తెఱంగులుగ నుండెడిని.

చీనాసముద్రములందుఁ గల్గు తుపానులకు 'Typhoons' అనిపేరు. West Indies ద్వీప ప్రాంతముల 'Hurricanes' అనియెదరు. అరేబియా దేశమున సంభవించుదానికి 'Simoom' అని వాడుకఁ గలదు. ఆఫ్రికాఖండపు మధ్య భాగముగ వీచువాట్లకు 'Harnattan' అనియును, 'Sirocco' అనియును వాడుకఁ గలదు. ఇటలీదేశమునను, స్విజర్లాండుదేశమునను, ఆల్ఫ్సు పర్వతప్రాంతములఁ గల్గుదానికి 'Fohan' అని నామమున్నది. Tornado (టోర్నడో) అను తుపాను కొన్ని ప్రాంతములనప్పుడప్పుడు గలుగును. అది చాలయపాయకర మగునది. ముఖ్యముగ నైరోపాశాస్త్రవేత్తలు తుపానులను Storm-Tempest - Cyclone - Hurricane లను నాల్గింటిగ ముఖ్యభేదములని విభజింతురు.

సముద్రతీరప్రాంతముల నుదయమున భూమి పైనుండి సముద్రములోనికిని, సాయంత్రముల సముద్రమునుండి భూమిపైపునకును గాలి వీచుచుండును. పగటియెండకు సముద్రముకన్న భూమి యతిత్వరితముగ నెక్కువవేడియై గాలిని వేడి చేయును. ఆగాలి చులకనయై యాకసమున కెగసి సముద్రముపై పాకసమునందే పైనుండి డును. సముద్రపుగాలి చల్లనిదిగనుండి పగటి యెండ కంతవేడెక్కుచుంట భూమిపైపునకుఁ బర్విడి యటఁ దానును వేడెక్కి యాకసమున కెగసి సముద్రముపైపునకుఁ బర్విడుచు నటఁ జల్లబడి క్రిందికి దిగి తిరుగ భూమికిఁ బర్విడుచుండును.

ఇంక రాత్రిపరిస్థితులు వేఱు. సముద్రము కన్న భూమి యెక్కువ చల్లబడుచుండగాన సముద్రముపై గాలియే యాకసమున కెగసి, భూమిపైపు జరుగుటయు, ఆస్థానమునకు భూమిపై నెక్కువఁ జల్లగ నుండుగాలులు సముద్రములోనికిఁ బర్విడి తిరుగుచుంటయు సంభవించును.

## వాయువులు (సప్తవాయువులు):-

౧ ఆవహావాయువు, ౨ ప్రవాహావాయువు, ౩ సంవహావాయువు, ౪ ఉద్వహావాయువు, ౫ వివహావాయువు, ౬ పరివహావాయువు, ౭ పరావహావాయువు.

## వాయుస్తంభగోత్రము:—

(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**వారంటు** (Warrant):— వాణిజ్యసంబంధపరిభాషాపదము. దీని కనేకోపయోగములు కలవు. సర్వసాధారణముగఁ గట్టములతో సరకులం బాపుకొఱకే దీని నుపయోగించుచున్నారు. ఒకరిని పట్టుకొని నిర్బంధముఁ దనయెదుట నుంచుమని దండనోద్యోగి యిచ్చిన యధికారపుటాజ్ఞకు 'Arrest warrant' అనెదరు. ఆస్తులను, సరకులను బట్టుకొని స్వాధీనపఱుచుకొనుట కిచ్చెడి యుత్తరువునుగూడ 'warrant' అనియెదరు. ఇటులనే Deek warrant అనియు, Share warrant అనియుంగలవు. ఒకలట్లకిచ్చు నధికారపత్రమునకును 'warrant of Attorney' అనియెదరు. సరకులమంచిగూర్చిగాని, కాలమునుగూర్చిగాని, యిచ్చు Guarantee (హామీ లేక పూచీ)కి 'warranty' అనియెదరు.

**వారణావతము**:—ఇప్పటి మీరత్ పట్టణమునకు ౧౯ మైళ్ళదూరము. తొల్లింటి హస్తినా

పురసామ్రాజ్యములోనిది. దీని నిప్పుడు 'బర్నావా' యనుచున్నారు.

దుర్యోధనుఁడు లాక్షాగృహమునఁ బాండవు లంగాల్చి చంపఁ బ్రయత్నించిన దిచటనే. శ్రీకృష్ణ రాయభారమున నడిగిన యయిదుపరగణాలలో నొకటి. కొందఱు దీని నలహాబాదు ప్రాంతమనిరి. (పంచగ్రామసంధిసూత్రము చూడుఁడు).

**వారణాసి:** క్షేత్రము. వరుణానది యుత్తరమునను, అసీనది దక్షిణమునను గంగానది యందుఁ జేరుచుండు మధ్యప్రదేశమునకు వారణాశీక్షేత్ర మనిపేరు. ఇందుకు వ్యాకరణశాస్త్ర మంగీకరింపకున్నను, తొల్లింటికాలమునుండియు వాడుకయం దట్లే యుండియున్నది. ఉత్తరవాహిని యగు గంగానదికి (బ్రహ్మనాళము) పశ్చిమతీరము నందుండు ప్రదేశము. పవిత్రక్షేత్రము.

**వారము (Week):—** ఆదివారము మొదలు శనివారముకడ కొకవార మనఁ బడును. అనఁగా నేడుదినముల కాలము.

ఇది భరతదేశవాసులు ఛాయాగ్రహములగు రాహుకేతువులు గాక, తక్కిన నవగ్రహముల లోని రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని గ్రహములదినములుగఁ బేర్లిడియుండిరి. పాశ్చాత్యు లీ యేఁడుదినములు చంద్రసంబంధములే యనుచు ననుమానించుచున్నారు గాని, నిదర్శనములు కానరాకున్నవి.

౧ ఆది (రవి) వారము, (భానువారము) సూర్యునిదినము.

౨ సోమ (ఇంద్రు) వారము చంద్రుని లేక శివుని దినము.

3 మంగళ (భౌమ) వారము, అంగారకుని లేక గ్రామదేవతల దినము.

౪ బుధ (సౌమ్య) వారము, బుధునిదినము.

౫ లక్ష్మీ (గురు) వారము, లక్ష్మీదేవి లేక బృహస్పతిదినము.

౬ శుక్ర (భృగు) వారము, లక్ష్మీదేవి లేక శుక్రాచార్యునిదినము.

౭ శని (మంద) లేక స్థిర వారము, శనైశ్చరుని లేక విష్ణుదేవునిదినము.

ఈవారములయం దొకచిత్రము కలదు. ఆంగ్లసీమయందు, ఫ్రెంచిసీమలందు, వేర్వేఱుమహమ్మదీయసీమలందు నేసంబంధము లేనిప్రజలచే వాడఁబడువారము లయ్యును, నన్ని దేశములందు (ఆదివార మొక్కదినముననే సంభవించును. అట్లే) ...రము లొక్కటిగనే నడచెడిని.

**వారాహ హస్తము:—**
(హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు).

**వారాహిగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**వారాహిదేవీధురము:—**
(దేవీధురము చూడుఁడు).

**వారిగోత్రము:—**
(శండిలగణము చూడుఁడు).

**వారిణిగోత్రము:—**
(అగస్త్య ఉపగణము చూడుఁడు).

**వారిధాపయన్తగోత్రము:—**
(పూరణ గణము చూడుఁడు).

## వారుణి:—

వరుణునివలనఁ గల్గింపఁబడినదని భావము. మద్యమున కధిదేవత.

## వారుణిగోత్రము:—

[పరాశరగణము చూడుఁడు].

## వార్కరేయులగోత్రము:—

[వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.]

## వార్తాపత్రికానిర్వహణకల:—

పత్రికలనేకవిధములుగ నుండవచ్చును. దీని కాంగ్లమున 'జర్నలిజమ్' అనెదరు. ఈకల యైరోపాదేశమందనేకవిధముల నభివృద్ధిఁగాంచుట నైరోపాకలగాఁ జెప్పఁబడఁదగినదైనను, ఐరోపామహాసంగ్రామానంతరమున నమెరికాసంయుక్తరాష్ట్రములందు గొప్పమార్పులంజెంది, నిజస్థితిని బయలుపెట్టుకొనుచు నమెరికాదేశఁపువిద్యగాఁ జెప్పఁబడఁదగినటుల నున్నది. వార్తాపత్రికానిర్వహణ మిక్కాలమున నొకచక్కని విద్యగ నేర్పదు శాస్త్రముగనైయున్నది. (పత్రికానిర్వహణవిద్య చూఁడుడు న్యూసు ఏజన్సీలు చూడుఁడు.)

ధనవంతమై నాగరికతఁ గల్గి వాణిజ్యవ్యాపారము లధికముగ నడచుచుండు దేశములందు వార్తాపత్రికలు లేకుండినచో మూఁగ చెవుడులే గాక నంధత్వముఁ గూడ దేశమునందుఁ గల్గినట్టులుండునని తలంపఁబడుచున్నది. వార్తాపత్రిక లెందఱిచేఁ జదువఁబడుచున్నవో, యందఱుఁగల సభయందుపన్యాస మిచ్చుచుండునంతటి పనిఁజేయునది యగును. అనఁగా వార్తాపత్రికాసంపాదకులు తమతమవ్యాసములను పత్రికం జదువువారల కందిచ్చుచుండుటయే యగును. ప్రధానపత్రికాసంపాదకునకు జీతమును చక్కఁగనే ముట్టుచుండును. అమెరికాసంయుక్తరాష్ట్రము లందు Mr. Artheer Brisbane అనుపేరుగలపత్రికాసంపాదకునిజీత మాదేశఁపుప్రెసిడెంటుగారి జీతమునకున్న నధికముగా నుండె నందురు.

వెనుకఁ గొంతకాలము సంపాదకీయ (ప్రధాన) వ్యాసములు వార్తాపత్రికలందుఁ బ్రధానములుగఁ బరిగణింపఁ బడుచు, ప్రజలమనస్సుల నాకర్షించుచుండెడివి గాని, యిప్పుడు దాని నిజతత్త్వము బయల్పడి వాటివిలువ తగ్గిపోయినది. ఏలయన పత్రికాసంపాదకుని యభిప్రాయములే గాని ప్రజాబాహుళ్యఁపు టభిప్రాయములు కానేరవు. అందునను పత్రికాసంపాదకుఁ డొకకక్షకుఁ జెందినవాఁ డగునేని, తక్కనకక్షలవారిని, వారియభిప్రాయములను, పాటింపని దౌర్భాగ్యస్థితి వార్తాపత్రికకుఁ గల్గునేని, ఇంక నాపత్రికదుస్థితి కంతమే యుండదు. ప్రజాభిప్రాయములనుండి వార్తాపత్రికలు నడుపఁబడవలసినవిగాన నట్లుఁ గాక నేదో యొకకక్షకుఁ జెందిన సంపాదకీయవర్గమువల్ల వ్రాయఁబడుట, నాపత్రిక స్వల్పజనామోదముఁ బడయక నాస్తికముగా నీరసించి పోషకులపై నాధారపడవలసినఁ దగుచుఁ గొంతకాలము నిలచినను, అన్యకక్షవారికిఁ గంటకముగ నుండి, తనకక్షవారిచేఁ దిప్పఁ దక్కినవారిచే నిరసింపఁబడుచు నుండుస్థితి సిద్ధించుటఁ దప్పదు. ఇట్టివార్తాపత్రిక లింతటితో నాఁగకఁ దమకనుకూలింపని వార్తలను, ఇతరకక్షలనాయకులకుఁ గల్గుచుండు ప్రజామోదాదులను వివరింపక, మౌనముద్ర వహించి యూరకుండవలసివచ్చుచుంటయు, విధిలేక వ్రాసినను వాటిని దేల్చివేసి యెట్లో తేలికగా వ్రాయుటయు సంభవించును. ఇది ద్రోహమని తోఁపకపోదు.

నిష్పక్షపాతముగ సర్వవార్తలను వివరించు వార్తాపత్రిక లప్పటివార్తల విషయములం జర్చించు

టయు, మఱుఁగుపడియుండిన గూఢములగు సంగతులను స్పష్టపఱచి సంభవింపఁగల కష్టసుఖములను వివరించి తెల్పుచుండుటయు, నొక్కొక్కసంగతిపై నన్నికక్షులవారి వాదప్రతివాదములను వ్రాయుచు, ప్రజాభిప్రాయముల నందరికి సమముగ వెలువరించు తావునఁ బత్రిక నుంచవలయునుగాని, వార్తాపత్రిక యని దివ్యనామ మొక్కంటిఁ ధరించుకొని యొకపక్షపు వ్రాఁతలను వ్రాయుట యసమంజసము. మఱియు వార్తాపత్రికలందు సంపాదకీయ వ్యాసముల గౌరవము చెడుటకుఁ గారణ మిదియే.

కక్షులయభిప్రాయములనే సమర్థించుట యు పనిగాం నేర్పడిన వార్తాపత్రిక లాకక్షయందుఁ ప్రజాభిప్రాయవిముఖతఁ గలుఁగగనే పడిపోవుచుండు టెల్లెడలఁ గాననగుచుండును. వార్తాపత్రికలు సంపాదకీయాభిప్రాయములు లేకున్నను నభివృద్ధి నందఁగల్గునుగాని, వార్తలు లేకుండిన నభివృద్ధిఁ గాంచఁజాలవని యనుభవజ్ఞులగు పెక్కండ్రు పత్రికాధిపతులు తెల్పియున్నారు. సర్వవిషయములను సింహావలోకన న్యాయముగ నారసి, వార్తాపత్రికలందలి వ్రాత రుచికరమై, స్పష్టమగునటుల, సర్వసాధారణముగ జనులందరు గ్రహించు స్వచ్ఛమగుమాటలతో వ్రాయఁబడుట ముఖ్యము. పత్రికానిర్వాహకులకుఁ దమయభిమానఁపుఁబట్టులవల లెంతమాత్రముఁ దగవు. ఏల యనఁ బత్రికానిర్వహణ మొకవృత్తియై యున్నది. మఱియు నిది సర్వజనామోదము నందునట్లు నడుపఁబడనిచో నిరర్థకమే యగును.

ఇంక నిటీవల వార్తాపత్రికానిర్వహణ మొక వర్తకమై పరిణమించుట, వర్తకులవలె నిర్వాహకు లొకరికన్న నొక రెక్కువజాగ్రతలం గొని మెలంగుచుంట విధియౌఁడి. దీని కనుగూలించుచు నడుపఁ టకుఁ బత్రికాధిపతులు గమనింపఁదగిన సంగతులు కొన్ని యేర్పడియున్నవి.

వార్తాపత్రికానిర్వాహకులు గమనింపఁదగిన సంగతులు,

౧ వార్తాపత్రికాభాష యనఁగా శబ్దజాలము రుచికరమై, నాతికఠినమై, నిర్దుష్టమై, మనోరంజకమై యుండుట. ఇట్టిశబ్దజాలముతోఁ బత్రికా విషయములను వ్రాయనేర్చిన వారి నెంచి, పత్రికాసంపాదకీయవర్గమునను, వ్యాసరచనలు చేయువారియందునను నియమించుట.

౨ వార్తలంగూర్చి తెల్పువా రెక్కువ మెళకువ, ఎక్కువ జాగ్రతఁ గల్గి, పాలుమాలక, అశ్రద్ధ, బద్ధకము లేని వారును, జరిగిన నిజస్థితిం దెల్పుటకు [ఉన్నది మఱుగుపఱచుట, లేనిది కల్పించుట మొదలగువాటిని మహాదోషములుగ నెంచి] తోడతోడనే యపరిమితోత్సాహులై తెల్పువారుగ నుండునట్లు నియమించుకొనుట.

ఈసంగతియం దింకను గమనింపఁదగినది కలదు. అమెరికా సంయుక్తరాష్ట్రములందలి న్యూయార్కునగరమునఁగల New York Tribune పత్రికకు సుప్రసిద్ధసంపాదకుం డగు Mr. Horace Greely గారు తెల్పినటుల "What the Almighty had permitted to Occur he was not too proud to report" అను నిజమును మనసునం దిడుకొని యున్నది యున్నటులఁ దెల్పకుండిన దోషమని గ్రహించవలెను. వార్తలకుఁ గొంతవఱకు వేఱుగ నన్వయించు వీలుఁ గల్పించి, వాటినిఁ బ్రకటింప నాయత్త పఱచుటకు 'Colouring the news' అనెదరు. అట్టి

Colouring ను స్వపక్షపాతమునకుఁ దప్పుఁడే యగును.

3 వార్తాపత్రికాధర్మమున "Print all the news that is fit to print" అను నొకసిద్ధాంతము కలదు. దీనిమేరకు విలువ లేని వార్తలను ముద్రించుట నిరర్థకమే యగును. దేశకాలపాత్రావసరములగు వార్తలం బ్రకటించినఁ బ్రజలదృష్టి నాకర్షించుంగాని, కేవల నిరర్థకములగు వార్తలైనను నెవ్వరు గమనించరు. అట్టివార్తలకు Colouring ఇచ్చుటయు, బలహీనతను దెల్పుచుండును. కాని పత్రికానిర్వాహకుల శక్తిసామర్థ్యములం దెలుపవు.

కార్యము లతిత్వరితముగ నడచు నిక్కాలమున నాంగ్లమున mile a minute age అని వాడుచున్నారు. ఈకాలమున నిన్న మొన్నటి వార్తలు రుచించునటులఁ బ్రాతఁబడిపోయిన వార్తలు ప్రజలమనస్సుల నాకర్షింపకుండును గాన పత్రికానిర్వాహకులు వార్తలనాలస్యముఁ గాకుండఁ బ్రకటించుట యత్యవసరమని నెఱుంగవలయును. అమెరికాసంయుక్తరాష్ట్రములందు ముందుగ నెఱింగి, వాటిం బ్రకటింప నేర్పఱచుకొనినవాటికి ముందుగనే టెలిఫోను లైనులతోఁగాని, టెలిగ్రాఫు లైనులతోఁగాని, కల్పి యట నొక్కని నుంచుదురు. అతఁడు తెల్పుచుండిన దానిని టైపురైటరుయంత్రముపైఁ దీసుకొనుచుందురు. ఒక్కొక్క కాగితము పరిపూర్తియైనట్టుగనే యచ్చుఁగూర్చువారుఁ గైకొని యక్షరములం గూర్చి ముద్రించుట జరిగెడిని. ఇట్టియేర్పాటులవలన సభావృత్తాంతములు, ఆటపాటలవృత్తాంతములు, ఉపన్యాసాదులు నవి ముగిసిన పదిపదునేను నిమిషములోనే వార్తాపత్రికలు ప్రకటింపఁ గల్గుచుండును.

౪ మోర్గు — ఇది యమెరికాదేశపుఁ బదము. వార్తాపత్రికలందు వ్రాయఁబడు వ్యాసములం దనేకభోగట్టాలు కానలసియుండును. అట్టిదగు పుస్తకభాండాగార ముండవలయుననియు నందు జీవచరిత్రలు, చరిత్రాత్మకములగు భోగట్టాలు మొదలగువాటిని దెల్పు పుస్తకములను మాత్రమే గాకఁ బత్రికలయందలి యట్టివ్యాసములున్న భాగములం గత్తిరించి, యంటించి కొన్నివ్యాసములను భద్రపఱచుకొని యందు విషయసూచికా సహితము నిల్వయుంచుకొనవలయును. దీనికి 'మోర్గ్యూ' అని పేరిడియున్నారు. పత్రికా కార్యాలయముల కిది యత్యవసరము.

వార్తాపత్రికలందు బొమ్మలు:— వార్తలు ప్రకటించుతఱి నాయా తావుల దృశ్యములకు ఛాయాపటములం దీసి, బొమ్మలం జెక్కించి వార్తాపత్రికలందు ముద్రించి ప్రకటించుచుండుట యిక్కాలమున నాచారమై యున్నది. అందుకుఁగాను గొప్పగొప్ప వార్తాపత్రికా కార్యములు ఫోటోగ్రాపు కేమరాలను, ఫోటోగ్రాఫరులను జీతము లిచ్చి యేర్పఱచుకొనెదరు. కొన్ని పెద్దవార్తాపత్రికలు ఫోటోకేమరాలను మోటారుబండ్లపై నమర్చి గొప్పనగరములం దవసరమగు తావులఁ ద్రిప్పుచుఁ ఫోటోగ్రాఫులం దీసి, ప్రకటించుచున్నారు. దీనికిఁ ఫోటోపెట్రోలని పేరిడియున్నారు.

ఇంక దేశదేశములవార్తలను, అచటి ప్రతినిధులమూలమున నొకచోఁ జేర్చి, వేర్వేఱుపత్రికల నమ్ముచు నందఁజేయు న్యూసేజన్సీలనుండివార్తలం

గొనుచు, తమపత్రికలందుఁ బ్రకటించుటచేఁ బత్రిక విలువ, యుపయోగము లతిశయించెడిని. [న్యూసేజన్సీలు చూడుఁడు]. ఈసందర్భమున ఫ్రెంచిదేశపు వార్తాపత్రికావిధానమును గొంతసంగతి నిట వివరించుట సమంజసము. ప్రధాననగరమగు పారిస్పట్టణమున ప్రసిద్ధికముగ నన్నికక్షుల ప్రధాన నాయకు లుండుట సంభవించుచుండును. ఇది యెల్లదేశములందుఁ గల ధర్మమే. ఏదేని యొక సంగతిగూర్చి రాజకీయములందు విచారించు నద నునఁ బ్రజానాయకు లన్నికక్షులవారును తమతమ రాజకీయాభిప్రాయములఁ దెల్పి, వీలగునంతవఱకు వాటికారణములంగూడ వివరింతురు. వాటి నన్నింటిని వార్తాపత్రికలు నిష్పక్షపాతముగ విమర్శించుచుఁ బ్రకటించును. తోడనే దేశమంతటను నన్నికక్షులప్రజలందు నీసంగతిపై నాయకుల యభిప్రాయములు, అందలి లాభనష్టములు విమర్శించుచుఁ దర్కించుటఁ బ్రారంభించి, యేదో యొక యభిప్రాయమును నిర్ధారణ మొనర్చుకొందురు. దానింబట్టి ప్రజాప్రతినిధులు రాజకీయ పరిపాలన సభలందుఁ బ్రజాభిప్రాయములను వెలువఱించి, సమ్మతుల నిత్తురు. ఇందుఁ బ్రధానాంశము వార్తాపత్రికలు నిష్పక్షపాతముగఁ బ్రకటించుటయు, తోడనే ప్రజలు ప్రాలుమాలక దానిం దర్కించి నిజాభిప్రాయములం గుదుర్చుకొనుటయు, వార్తాపత్రికల యుపయోగము చక్కగా నడుచునట్లు తోపఁజేసెడిని. దీనినుండియే 'What Paris thinks to-day the whole France thinks to-morrow' అను లోకోక్తి యేర్పడినది. ఏదో యొకకక్ష నవలంబించిన పత్రికలు ప్రజల నుద్బోధించిన నుద్బోధించఁదగును గాని, నిర్బంధించురీతిని దనవ్రాఁతలను వ్రాయుటయు, ఆత్మస్తవ మొనర్చుకొనునటుల వ్రాయుటయు, అన్యకక్షుల వారిని నిరసించుచు వ్రాయుటయు, హేయము. మఱియు నట్టిహద్దులను మీఱుపత్రికలు నిష్పక్షపాతఁపువార్తాపత్రికల నామములను, గుర్తులను, ధరించుట కనర్హములు.

ఇంకను వార్తలకుఁ బై నిశీర్షికలు [headings] చక్కఁగ వివరించుటయు నత్యవసరము. ఏలయనఁ దీరుఁబడిలేనివా రట్టి హెడ్డింగులను జదువుకొని తమకవసరములగు వాటిని జదువుకొనుటకు వీలగును. లేకున్న విసుగుఁగల్గి పత్రికను జదువకుండఁగనె మానుట సంభవించును. ఇంక నిక్కాలమున వార్తాపత్రికానిర్వహణమునం దనుభవనైకవేద్యము గానున్న ప్రధానాంశమగు నార్థికపరిస్థితికి దారిఁజూపుముఖ్యాంశమగు ప్రకటనలం [ఎడ్వర్టైజుమెంటులం] గూర్చి వివరింపకుండుట లోపమగుఁగాక.

వార్తాపత్రిక లెంత వ్యాప్తిఁ గాంచి యెంత యెక్కువ సంఖ్యాకులచేఁ జదువఁబడుచుండునో యంత యెక్కువగా 'ఎడ్వర్టైజుమెంట్సు' ఆ పత్రికలకు లభించుచుండును. అది యంతయు దగ్రవ్యాసే. దగ్రవ్యాధిక్యత యనిన పత్రిక నున్నతస్థితిని నడపుటకు సాధనమగుం గానఁ బత్రికానిర్వాహకులు తమ పత్రికలను కక్షలపాలొనర్చి, పట్టుదలలకు లోఁబడఁ జేయక, ప్రజాభిప్రాయములపాలొనర్చి, రుచిగ వ్రాఁతలుండురీతిని ధర్మనిర్వహణమునకు లోఁబడఁజేసినఁ బత్రికలు పేరుప్రతిష్ఠలం గాంచి, ఆర్థికముగ నభివృద్ధి యగుటయు, దానితో నధికసంఖ్యాకములగు నెడ్వర్టైజుమెంట్ల నాకర్షించుటయుఁ గల్గెడిని, అందువలన నార్థికపరిస్థితుల లనుకూలించును. దీనిని పత్రికానిర్వాహకులు ప్రధానముగ గమనించుచుండవలెను.

## వార్తాపత్రికలు - గెజిట్‌నామము:-

తొల్లి వెన్నిస్‌నగరఁపుఁ బ్రాబల్యకాలమున వార్తలు

పత్రికలుగా ముద్రింపఁబడి, ముఖ్యప్రదేశము లందుఁ జదువఁబడుచుఁ బ్రకటింపఁబడుచుండెనఁట. శ్రోతలనుండి 'గెజిట్టా' యనంబడు చిన్ననాణె ముం గైకొనుచుండువారఁట. ఆనాణె మాంగ్ల దేశపు ఫార్తింగుతోఁ దుల్యమైన విలువఁ గల్గి యుండినదఁట. రానురాను వార్తాపత్రికలకే, ఆగెజిటానామము వాడఁబడసాఁగెనట. దానియొక్క యాంగ్లభాషాపదరూపమే 'Gazette' అయి యున్నది.

**వార్షకాణిగోత్రము:—**
(నిధృవ గణము చూడుఁడు.)

**వార్ష్ణేయగోత్రము:—**
(పరాశర గణము చూడుఁడు.)

**వార్ మెడల్** (war medal):—ఐరోపా మహాసంగ్రామసందర్భమున క్రీ. వె. ౧౯౧౪ ఆగస్టు ౫ తేదినుండి ౧౯౧౮ నవంబరు ౧౧ తేదీ లోపున బ్రిటీషుసామ్రాజ్యమునుండి యుద్ధమునకు వెడలినవారి కీయఁబడినపతకము.

వెండివియు, బ్రోంజులోహఁపువియు రెండు విధములుగఁ జేయఁబడి సైనికులకు వెండివియు, యుద్ధరంగమునఁ బనిపాటలు చేసినవారికి Broze మెడల్సు నొసంగఁబడినవి.

**వాలశిఖగోత్రము:—**
(ఉపమన్యు గణము చూడుఁడు.)

**వాలఖిల్యగోత్రము:—**
(కుశిక గణము చూడుఁడు.)

**వాలక్షగౌరివగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**వాలా సిక్కుదేవస్థానము:—** పంజాబుదేశమున నమృతసర్ జిల్లాయం దమృతసర్ నగరమునుండి నాల్గుమైళ్లదూరమున వాలాగ్రామము కలదు. ఇట సిక్కుల తొమ్మిదవగురుండగు తేగ్బహదూరుగురుఁడు కొంతకాలము విశ్రమించె నఁట. ఆయన దేవస్థాన మాతావున నిర్మింపఁబడి సిక్కుల యాత్రాస్థలమై యున్నది.

**వాలి:—** కిష్కింధాపురాధీశుఁడు. వానరుఁడు. సోదరుఁడు సుగ్రీవుఁడు. భార్య తార. కుమారుఁ డంగదుఁడు. శ్రీరామునిచే నిహతుఁడైనవాఁడు. (విరుద్ధోక్తన్నలు చూడుఁడు.)

**వాలిశాయనిగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**వాల్మీకిరామాయణము - ప్రాంతప్రతి:—** విక్రమశకము ౧౦౭౫ సంవత్సరమున ననఁగా క్రీ. వె. ౧౦౧౮ సంవత్సరమునాఁటి వాల్మీకిరామాయణఁపుఁ బ్రాంతతాటియాకులప్రతి యొకటి నేపాలప్రభుత్వమువారి యముద్రితగ్రంథ భాండాగారము (లైబ్రిరీ) లో నున్నది. భరతదేశమునం దీగ్రంథముకన్నఁ బురాతనఁపుఁ దాటియాకుల వాల్మీకిరామాయణఁపుఁ బ్రతి యింతదనుకఁ గన్గొనినవాటిలో లేదఁట. ఆప్రభుత్వము దీనినుండి చిత్రములను వ్రాయించి, ఛాయాపటములం దీయించిరనియు, అట్టివి ౧౫౦౦ లాహోరు నగరమునందున్న International Academy of Indian cutture వారికిఁ బంపిరనియు నిటీవలఁ దెలియు చున్నది. ఆయెకాడెమీవారు వాల్మీకిరామాయణముం బ్రకటించెదరఁట. నేపాలప్రభుత్వఁపుఁ బుస్తకభాండాగారమునందున్న ప్రతి భాష పురాతన దేవనాగరీ యక్షరములది. సాం

దర్యవంతమగు నక్షత్రముల చక్కనివ్రాతతో నున్నా నున్నది.

**వాలుకాదేవీక్షేత్రము**:--ఆగ్రా, అయోధ్య, సంయుక్త రాష్ట్రములలోని, ఆల్మోడా లేక కాళీకుమాన్ డివిజనులోని (ఆల్మోడానుండి ౮౧ మైళ్ళదూరమున) సితోరాఘడఁపులోలీ పరిసరముల నొకకొండపై నున్న సుప్రసిద్ధదేవీక్షేత్రము. ఈపరిసరములనే మోష్టుమాన మనుపర్వతముపై ఛండముండాసురులను వాలుకాదేవి సంహరించె నని చెప్పఁబడినది. ఈప్రాంతముననే ఘంటాకర్ణ శివలింగము కలదు. మఱియు నీపరిసరములనే యసురాచలమను పర్వతశిఖరము కలదు. అది తొల్లింటి రాక్షసనివాసప్రదేశమై యుండెనందురు.

**వాలుకేశ్వరము**:- బొంబె నగరమున 'వాలుకేశ్వర' మనియు, 'మలబార్ హిల్' అనియుఁ బిలువఁబడుతావు. పరశురామ ప్రతిష్ఠితశివలింగ మిచటఁ గలదు. స్కాందపురాణ సహ్యాకాండమున అధ్యాయ ౨ దీని ప్రశంస కలదు.

**వాలుహి (లేక వాహి) గోత్రము**:—
(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**వాలేయగోత్రము**:—
(అత్రిపుత్రికాపుత్రుల గణము చూడుఁడు.)

**వాలోదరగోత్రము**:—
(హారిత ఉపగణము చూడుఁడు.)

**వాల్కనైటు**:— దీనిని రబ్బరునకు గంధకముఁబాలుఁ గూర్చి చేయుచున్నారు.
(ఎబొనైటు చూడుఁడు.)

**వాల్కనో (అగ్నిపర్వతము)**:
(యూంటెన్ను చూడుఁడు.)

**వాల్కనిజమ్ (Volcanism)**:— అగ్నిపర్వతములు మొదలగు వానిని గురించిన శాస్త్రము.

**వాల్మీకిమహర్షి**:— వాల్మీకిమహర్షి:- తండ్రి ప్రచేతసుఁడను బ్రహ్మపుత్రుఁడనియు వేఱొకచోట రెండువిధములుగఁ జెప్పఁబడినది. బోయకాంతను బరిణయమై యామెయందు సంతానముఁ గనె నఁట. చౌర్యము, దారిదోపిడులవలన జీవనముఁ జేయువాఁడఁట. సప్తమహర్షు లొకతఱి నాదారినేగ వారిందోచుకొనఁబోయి వారివలన దుర్మార్గవర్తనమునుండి మరల్పఁబడి తప మాచరించుచోఁ దనచుట్టును పుట్టలు (వాల్మీకములు) బలిసిపోయినను చలింపని నిశ్చలవృత్తితోఁ దపమొనర్చి (వల్మీకమహర్షి యనంబరఁగి) శ్రీమద్రామాయణమును శ్లోకరూపముగ రచించిన యాదికవి. ఆశ్రమము బ్రహ్మావర్తమున కెదుట పర్వతము. [బ్రహ్మావర్తము చూడుఁడు. గంగానది చూడుఁడు.] తపమొనర్ప తనపైఁ బుట్ట యేర్పడి బలవఁగా నీపేరుఁగల్గెనఁట. ఛందోబద్ధశ్లోకగ్రంథము శ్లోలుత రచించినవాఁడు.

వాల్మీకిమహర్షికిఁ బూర్వనామములుగఁ దృణబిందు, తృణపాణి యనునామములను వచింతురు. ఇతఁడు గాయకుఁడు. తృణపాణి, సామగానమొనర్చువాఁడఁట. రామాయణమును వీణపైఁ బాడెనఁట. తృణపాణియొక్క సామములు కొన్ని గాన నగును.

వాల్మీకి ప్రాకృతసూత్రములను రచించెను. ఈ వ్యాకరణసూత్రములపై రామానందస్వామి (చెరుకూరి లక్ష్మణసుధి) 'షడ్భాషాచంద్రిక' యనువ్యాఖ్యను, ఎలకూచి బాలసరస్వతి 'షడ్భాషా వివరణ' మనువ్యాఖ్యను, అప్పయదీక్షితులు 'ప్రాకృతమణి దీప' మను వ్యాఖ్యను, రచించియున్నారు.

## వాల్మీకిగోత్రము:-

[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.]

## వాలేరు:—

తొల్లింటి వాలు తేరు. (విశాఖపట్టణంజిల్లా చూడుఁడు.)

## వావింట [వాయింట] చెట్టు:-

లా. Gynandrpsis Pentaphylla అనియు, Ocimum Pilosum ఆంగ్ల. wild mustard. సం. అజగన్ధా - అజగన్ధికా - కాబరీ- ఖరపుష్పా, పూతిమయూరికా - బరబరాగంధా - బ్రహ్మగర్భా - బ్రాహ్మీ - వస్త్రగన్ధా - ఉగ్రగన్ధా - సుగన్ధికా అనుపదములు వాయింట సామాన్యమునకును, బస్తగన్ధా - బస్తమోదా - అనుపదములు కుక్కవావింటకును - వవబర్బరా అను పదము అడవివావింట కనువర్తించును.

వావింటయందుఁ బెద్దజాతికిఁ బెద్దవావింట యనియుఁ దక్కవజాతికిఁ జిన్నవావింటయనియుఁ బేర్లు. ఈరెండు భేదజాతులకుం దోడు కుక్కవావింటయను భేదజాతి యొకటియు, అడవివావింట యనుజాతి యొకటియుంగూడఁగలవు. పెద్దవావింట శ్రేష్ఠజాతి. చిన్నజాతికుక్కవావింట తక్కువజాతులు. తక్కినది అడవిజాతి. వావింటకాయలలోని విత్తులను వావింటా లనెదరు. వాట్లను భోజనపదార్థములకుఁ బరిమళముఁ గలుగునటులఁ దాలింపు వేచెదరు.

వావింటవేరు, వావింటఆకు, వీటిరసము కాక, పైత్యముఁ జేసి త్రిదోషములను శమింపఁజేసి, సమస్తకర్ణరోగములను హరించుననియు, క్రిమి, గుల్మము, మూలవ్యాధి, వ్రణములు నివారించుననియుఁ జెప్పఁబడినది. వావింటఆకు చితుకఁగొట్టి పైనపై చికట్టిన చర్మ మెత్తఁబడునట్లుచేసి, పొక్కపలాస్త్రిచేయునట్లు లోనున్నమలినఁపునీటిని బైటికి వచ్చునట్లు లాగుననియు, తలపై వేసికట్టిన వేఁడిఁ బుట్టించి లోని శిరోవాతసంబంధమగు దుష్టజలములను పైకిలాగి తాఁ బీల్చి, పిండిన వెడలఁగ్రక్కుననియు, వ్రణములపై వేసికట్టిన నవి మానఁజేయుననియు, పసరు చెవిలోఁబోసిన చెవిపోటు, చెవిలోకుఱుపు మొదలగు సమస్తకర్ణరోగములు నివారణమగుననియు, వావింట సమూలముగా నూనెతో సమభాగమందుఁ బైకిఁ జక్కగఁగాచిన నాత్తెలను కుష్ఠురోగములను, సర్పి, తామర, తీట, గజ్జి, చిడుము మొదలగుసమస్తచర్మవ్యాధులను తప్పక నిర్మూలించుననియు, వావింటవిత్తులను వేఁడినీళ్ళతో నూరి లోనికిచ్చిన జ్వరములు, పైత్యరోగములు, నివారణమగుననియుఁ జెప్పఁబడినది.

పెద్దవావింట బలముగఁ బనిచేయును. కుక్కవావింట చెవులందు, చీము, దుర్గంధము, నీరుఁగారుట, రక్తముపడుట మొదలగులక్షణములుగల దుష్టకుఱుపులు, మొండికుఱుపులు, ఆకపసరు చెవిలోవేసిన నివారణమగుననియు, లోనికిచ్చిన త్రిదోషహరమై గర్భవాతములను నివారించుననియుఁ జెప్పఁబడినది.

## వావిలిచెట్టు:-

లా. Vitex Negundo, ఆంగ్ల. Five leaved Chaste tree సం. నిర్గుండా, నిరుండీ, సింధువః, సింధువారం, సింధువారికా, సింధువారితః అనుపదములు వావిలి సామాన్యమునకును, సింధురా యనుపదము తెల్లవావిలికిని, సింధుసహా యనుపదము నల్లవావిలికిని, సింధుకః అనుపదము నీటివావిలికిని, సింధువారచదా యనుపదము కారువావిలికిని వర్తించును. ఇవి వావిలిలోని యంతర్భేదజాతులు. తెల్లవావిలి పంచబిల్వములలో నొకటి. శివలింగార్చన కర్హమని

చెప్పఁబడినది. మఱియు ఇంద్రసురసః,ఇంద్రసురసం, ఇంద్రసురీ, ఇంద్రాణికా, సేఫాలీ అనుపదములు వావిలిసామాన్యమునకును, శ్వేతనిర్గుండీ, శ్వేత పుష్పః అనుపదములు తెల్లవావిలికిని, ఇంద్రాగ్ని, నీలనిర్గుండీ, సువహా యనుపదములు నల్లవావిలికిని గలవు.

వావిలి సమూలకషాయము వేఁడిఁజేసి శ్లేష్మ మునుహరించి, వరుసజ్వరములు, పురాణజ్వరముల నివారించుననియు, కాయల రసచూర్ణ కషాయ ములు క్రిమినిజంపి, నరములకు బలమొసంగు ననియు, వేరుకషాయము వరుసజ్వరములు, దోష జ్వరములు, ఉబ్బురోగము, క్రిమిరోగముల నివా రించుననియు, పచ్చిఆకువెచ్చఁజేసికట్టిన వాతనొప్పు లు, మేహవాతనొప్పులు, ఇఱుకుబెణుకు, నొప్పు లు, కీళ్ళనొప్పులు, వాపులు, శగజీర్ణించుటంగల్గిన అండములవాపు నొప్పి, చేతులుకాళ్ళు బిగదీసు కొనిపోయిననొప్పులు, ముడుచుకొనిపోయిననొప్పి, ఈడ్పునొప్పులు హరించుననియు, ఆకు నూరికట్టిన గడ్డలు అడఁగిపోవుననియు, కలుపులు మాను ననియు, చర్మవ్యాధులు మానుననియు, ఉబ్బుజా డ్యము నివారణమగుననియు, ఎండినయాకుపొగ పీల్చిన దగ్గులు, తలనొప్పి నివారణమగుననియు, అధికమైననేత్రములకు జబ్బుచేయుననియుఁ జెప్పఁ బడినది. వావిలిఆకువేసికాచిన నీరు పురిటివాండ్రకు స్నానముఁ జేయింతురు. నీటివావిలినే చిరివావిలి యందురు.

## వాశిగోత్రము:—

[లోహితగణము చూడుఁడు].

## వాశిష్ఠగోత్రము:—

[వశిష్ఠగణము చూడుఁడు].

## వాషింగ్టన్ కాన్ఫరెన్సు (Washington Conference):—

క్రీ. వె. ౧౯౨౧ నవంబరునెలలో నీసభ యమెరికాసంయుక్త రాష్ట్రములలోని వాషింగ్టనునగరమున నమె రికాసంయుక్తరాష్ట్రములవారు కూర్చి జరిపిరి. ఇందుఁ జర్చింపఁబడినసంగతులు పసిఫిక్కుమహా సముద్రమందలి పరిస్థితులు, చీనాదేశఁపుఁ బరి స్థితులు నై యున్నవి. ఈచర్చలందు బ్రిటీషు ప్రభుత్వము, అమెరికాసంయుక్తరాష్ట్రములు, పరాసుప్రభుత్వము, జపాన్ప్రభుత్వము, చీనాప్రభు త్వములు పాల్గొనినవి. ఇందు 'Five power Naval treaty' ఏర్పడినది.

## వాషింగ్ట న్మెమోరియల్ లేక మాన్యుమెంటు (Washington memorial or monument):—

ఇది యమెరికాఖండము నందలి వింతలలో నొకటిగఁ జెప్పఁబడినది. అమె రికాసంయుక్తరాష్ట్రములలోని వాషింగ్టన్ నగర మున నిర్మింపఁబడినది. వాషింగ్టన్నగరము సం యుక్తరాష్ట్రములకుఁ బ్రభుత్వ ప్రధాననగరము. ఇచట నిర్మింపఁబడిన మాన్యుమెంటు స్థలమునకు నగ్రాసనాధిపతిగ నుండిన యామహానీయుండే యెన్నుకొనెనఁట.

నలుపలకల స్తంభము వలె ౫౫౫ అడు గులయెత్తున నిర్మింపఁబడినది. లోపల గుల్లగనుండి పైకెక్కుటకుఁ దొమ్మిదివందలసోపానములు కలవు. జనరల్ వాషింగ్టన్గారు జీవించియున్నప్పుడే క్రీ. వె. ౧౮౪౮ లోఁ బునాది వేయఁబడి పని ప్రారంభింపఁ బడి, ౧౮౮౪ ముగింపఁబడుట 32 సంవత్సరములు పనిజరగినదని చెప్పవచ్చును.

పునాది Genaral T. I. Casey అనువారు ఉదారంగు గ్రైనైటు గట్టురాతితో ౧౮౬౬ చౌకఁపు

టడుగులచౌకఁపుజాగాయంతయు వేయించిరి. వీరు సంయుక్తరాష్ట్రములలోఁ బ్రధాన ఎంజినీరుగ నుండినవారు. కట్టడము తొలుత క్రిందిభాగము న్యూ ఇంగ్లాండుస్టేటులోని గట్టి గ్రెనైటురాతితోఁ గట్టి, క్రిస్టల్ మార్బిలురాతిఫలకములతో వెలుపల నతికించిరి. పై భాగము స్వచ్ఛమగు తెల్లమార్బిలు రాతితోనే నిర్మించిరి. దీని Cap stone ఐదడుగుల రెండున్నరయంగుళము యెత్తునకిందిభాగమున మూఁడడుగుల చౌకఁపుఁగొలఁతఁగల్గి, ౧౮౮౪ డిశంబరు ౬ వ తేదిని స్థాపింపఁబడినదనియు, మార్బిల్ రాళ్ళు interior rubs ను కలిపి పట్టియుంచుటకు 'Key stone' అనఁగా టాపువద్దకోణపు pramidical top అయిదు టన్నులబరువుఁగల్గి, నాల్గున్నర యడుగులపొడవు, మూఁడడుగు లారంగుళముల చౌకముఁ గల్గిన దనియుఁ జెప్పఁబడినది. శిఖరమున నమెరికాదేశపు టల్యూమినియముతో రేకుకప్పఁబడి, యెండవానలకు మాసిపోకుండునటులఁ జేయఁబడినది.

ఈమాన్యుమెంట మెరికాయందే గాక ప్రపంచమంతటిలోను నెక్కువయెత్తగు మాన్యుమెంటుగఁ జెప్పుచున్నారు.

**వాష్‌పాట్ (Washpot):—**
[తంబిరేలుపరిశ్రమ చూడుఁడు.]

**వాషులేపగోత్రము:—**
[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.]

**వాసగోత్రము:—**
[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.]

**వాసన:**—వాసన యనఁ బరిమళము లేక దుర్గంధమున కర్థము. మనస్సునకంటి వీడక గాఢమైయున్న యభిరుచిని వాసన యనివాడెదరు. ఇది మూఁడువిధములు.

౧ శాస్త్రవాసన:—విద్యలందు మనస్సున కభిరుచి మిక్కుటమై యుండుట.

౨ లోకవాసన:— లోకవిశేషములగు నధికారములు, ఆధిపత్యములు, గౌరవములు మొదలగులోకాతిశయములందు మనస్సునకుఁ గల యభిరుచి.

3 దేహవాసన:— [illegible]్యము, పవిత్రత, గురుత్వవాంఛ మొదలగు శరీరవిశేషాతిశయములందు మనస్సునకుఁగల యభిరుచి.

ఈమూఁడువాసనలు పూర్వజన్మసంబంధములనియు, తొల్లింటిజన్మమునఁగల వాంఛయొక్క గాఢతకుఁ (ఫలమగు) దరువాయి యనియు నందురు.

మంచివాసనయైనను, దుర్వాసనయైనను, కొద్దిగనో, గొప్పగనో ఘాటుతోఁ గలసియుండెడిని గాననే యించుక దూర మిది వ్యాపింపఁ గల్గుచున్నది. ఘాటు లేకుండినచో, ముక్కుకడఁ బెట్టుకొని పీల్చువఱకు వస్తువుయొక్క వాసన ఘ్రాణేంద్రియమునకుఁ దెలియనే తెలియకుండును.

కొన్నిదుర్వాసనలు, అత్తరువులు మొదలగు సువాసనలు, ఘాటుతో యుక్తమైయుంటఁ గొంత దూరమువఱకుఁ బోఁగల్గుచుండును. వాసనలు ప్రతివస్తువునందు వేర్వేఱుగ నుంట లెక్కలేనివని చెప్పఁబడుచున్నవి.

వెలుతురు రీతరునందును, శబ్దము గాలియందును, అలలుగ దూరమునకుఁ బోఁగల్గునటుల వాసనల కలలుగఁ బోఁగల్గుస్వతంత్రశక్తి లేదని చెప్పఁబడినది.

**వాసన కొంతదూరమునకుఁ గూడఁ జనుట:**— వెలుతు రీతరుగుండా తరంగములు [Waves] గ నేర్పడి కడుంగడుదూరముఁ జనుననియు, ధ్వని వాయువుగుండా తరంగములుగ నేర్పడి చనుననియు, అగ్నీ వేఁడిమియుఁ దరంగములుగ వాయువునందుఁ జనుననియుఁ జెప్పఁబడియున్నది. [ఈతరు చూడుఁడు—ధ్వనివినిపించుట, ప్రతిధ్వని చూడుఁడు]. కాని, వాసన యటుల గాలియందుఁ దరంగరూపమునఁ జనునది కాదనియు, రుచియు, వాసనయు, జిహ్వేంద్రియమునకు, ఘ్రాణేంద్రియమునకు, సమీపించుతటినే వాటికిఁ దెలియఁబడుచుండునవిగఁ బరిశీలనలు బయల్పడఁ జేసియున్నవి. వీటి నాంగ్లమున శాస్త్రవేత్తలు 'Contact sens' అని పేరిడియున్నారు. ఇవి జిహ్వేంద్రియ ఘ్రాణేంద్రియములకుఁ బరమాణురూపములఁ జేరి, గ్రాహ్యములయ్యెడిని. అనఁగా రుచులు జిహ్వేంద్రియమునకుఁ బరమాణురూపమునఁ దాఁకి రుచులం దెలుపుటయు, వాసన ఘ్రాణేంద్రియమునకుఁబరమాణురూపమునందాఁకి, వాసనఁ దెలియఁజేయుటయు, సంభవించుచుండును. ఈద్వివిధపరమాణువు లించుక దూరము గాలిలో నెగురుచుఁ జనగల్గియుంటఁ గొన్నివాస

నలు కొంచెము దూరమునందున్నవారికిఁ గూడఁ దెలియనగుచున్నవని పోల్పఁబడినది.

**వాసనానందము:—**

(ఆనందములు చూడుఁడు.)

**వాసిగోత్రము:—**

(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**వాసినగోత్రము:—**

(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**వాసిరిగోత్రము:—**

(కౌమన్ద ఉపగణము చూడుఁడు.)

**వాసిరిగోత్రము:—**

(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

**వాసిరెడ్డి వెంకటాద్రినాయఁడు:**

ఈనృపః క్రీ. వె. పదునేఁడవశతాబ్దమున నమరావతి రాజధానిగఁ ద్రిలింగదేశభాగ మేలినవాఁడు. అమరావతి యిప్పుడు గుంటూరుమండలమునఁ గృష్ణానదీతీరమునఁ బాడగుచున్నది. తండ్రిపేరు జగ్గభూపతి. ఈతనికి క్షాత్రదక్షుఁ డనుబిరుదము కలదందురు. తల్లిపే రచ్చమాంబ. కులము కమ్మవారు.

ఈభూపతి నవరత్నస్థగితమగునట్టియు, రత్నమయ్యమై కాంతులచే దేదీప్యమానప్రకాశముఁగల కిరీటమును సదా ధరించియుండువాఁడని ప్రతీతి కలదు. బహుభాషాకోవిదుఁడు. విద్యావంతుఁడు. అసంఖ్యాకులగు విద్వాంసులను, కవులను, రావించుచు బహూకరించుచు విద్యలం బ్రోత్సహించినవాఁడని చెప్పుదురు.

ఈమహనీయునకు రాజాధిరాజ జనియు, మన్నె సుల్తాన్ - మన్నెహంవీర - మన్నెరాయ - ముస్తుభాస్నగరు - ముస్తుజాన్నగర్ - వీరశంకర - బసవవీర - ప్రతాపరాజమార్తాండగండర - గండాద్యతన భోజమహారాజబిరుదాంకితుం డనియుఁ జెప్పఁబడినది. తనసభాభవనమున కెదురుగ విద్యాభవననిర్మాణ మొనర్చి యందు విద్వాంసులసభ నేర్పఱచెనట. వేఱొకతఱి నీరాజనీతి కోవిదుఁడు సామోపాయములచే మైత్రి నెరపి యశ్వారావు వారిని, ఇమ్మానేనివారిని, కన్దండివారిని, జూవపు వారిని, మాణిక్యారావువారిని, పానూరువారిని, యార్లగడ్డవారిని, మలరాజువారిని, నెల్లొటివారిని, రావువారిని రావించి బహూకరించి రాజమండల రాజసమ్మేళనసభల స్థాపించి, నూతనరాజనీతిపద్ధతుల నాలోచనకుం బెట్టి యంగీకరింపఁజేసెనఁట. పై వారందఱు నాంధ్రదేశమందలి యాకాలఁపు భూపతులే.

**వాసిసాదనగోత్రము:—**

(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**వాసుగోత్రము:—**

(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

**వాసుదేవద్వాదశి:**—ఆషాఢశుద్ధ ద్వాదశి. దధివ్రత మాచరించు వ్రతదినము. (పండుగలు చూడుఁడు.)

**వాసుదేవయోగికవి:**— ఆంధ్రకవులలో నాధునికులయందుఁ బరిగణింపఁబడినవాఁడు. రచించినది జీవప్రబోధ మనెడి వేదాంతగ్రంథము, పద్యకావ్యము.

## వాసుదేవవ్యూహము:—



రామానుజీయ వైష్ణవ చైతన్యవైష్ణవ ధర్మములందు తదేకాత్మరూప మహావిష్ణువు. అం దాది చతుర్వ్యూహ ములలో నొకటిగఁ జెప్పఁబడినది. దీనిని కృష్ణవ్యూహ మనియెదరు. విలాసమూర్తి. వరుసగ గద, శంఖ, చక్ర, పద్మము లాయుధములు.

[రామానుజీయవైష్ణవ మతము, విష్ణుదేవాలయములందలి విగ్రహములు చూడుఁడు.]

## వాస్తవ్యగోత్రము:—

(కారేణుపాలి ఉపగణము చూడుఁడు).

## వాస్తవ్యగోత్రము: —

(ఔతథ్య ఉపగణము చూడుఁడు)

## వాసుకగణము:—

ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి.

౧ వాస్తుకర్షిగోత్రము— వాస్తుక, ఇంద్రసేన, గిరిధర్మ (త్రయార్షేయప్రవర).

౨ ఐంద్రిసేనర్షి— ఇంద్రసేన, గిరిధర్మ, వసుధర్మ (త్రయార్షేయప్రవర).

3 గిరిధర్మర్షి— వసుధర్మ, వజ్రచేత, గిరిధర్మ, (త్రియార్షేయప్రవర).

౪ వసుధర్మర్షి గోత్రము— వసుధర్మ, వజ్రచేత, వ్యంజక, వ్యాజిక, అతిమంత (పంచార్షేయ ప్రవర).

౫ వజ్రచేతర్షి గోత్రము— వజ్రచేత, వ్యంజిక, వ్యాజిక, అతిమంత, సుమంత (పంచార్షేయ ప్రవర).

(అథర్వణశాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు).

## వాస్తువు:—

శిల్పశాస్త్రమునఁ జెప్పఁబడిన నిర్మాణములకు వలయు కొలతలు మొదలగు వాటికిఁ బేరు. (శిల్పశాస్త్రము చూడుఁడు.)

వాస్తుధర్మములు ముఖ్యముగ గృహదేవాలయాదులయందలి కొలతల నెఱింగించెడిని. కొలతలకుఁ గొలబద్దలప్రమాణములు చెప్పఁబడినవి. వాటిని ముందు వివరింతుముగాక. ఎనిమిదితలవెండ్రుకలవెడలుపుఁ బ్రమాణమునకు విషు వనంబడును. ఎనిమిది విషువులపరిమాణ మొకకాష్ఠ యనఁబడును. ఎనిమిది కాష్ఠలపరిమాణ మొక యవగర్భ యనఁబడును. ఎనిమిదియవగర్భము లొక యంగుళ మనంబడును.

ఇట్టియంగుళము లిరువదినాల్గు పరిమాణము గాఁగల కొలబద్దకు రిష్టయనియు, ఇరువదియైదంగుళముల ప్రమాణముగల కొలబద్దకుఁ బ్రజాపతి యనియు, ఇరువదియాఱంగుళముల పరిమాణము గల కొలబద్దకు ధనుర్ముష్టియనియు, ఇరువదియేడంగుళముల పరిమాణముగల కొలబద్దకు అనుగ్రహ మనియుఁ బేరులు. ఈకొలతలతో సర్వమును వాట్లవాట్లధర్మములమేరకుఁ గొలత లుంచవలయును. గృహములకొలతలు ధనుర్ముష్టియనంబడు కొలతబద్ద (౨౬ అంగు) చేతను, దేవాలయములనిర్మాణమున అనుగ్రహ మనేకొలతబద్ద (౨౭ అంగు) చేతను, కొలువవలయునని చెప్పఁబడినది. ఇంకను మంచములు, సవారీలు, రథములు, బండ్లు మొదలగునవి రిష్ట యనే కొలతబద్ద (౨౪ అంగు) చేతను, విఘ్నేశ్వరాదివిగ్రహరచన

ప్రాజాపత్య మనే కొలతబద్ద (౨౪ అంగు) చేతను కొలతలుచూచి సరిపెట్టుకొనవలయునని చెప్పఁబడినది.

మఱియుఁ బనియొక్క యజమాని కుడిచేతి మధ్యవ్రేలియొక్క మధ్యభాగఁపుఁ గణుపునకు మంత్రాంగుళ మని సంజ్ఞ. దీనిచేత ధ్వజములు, వాహనములు చేయుటయందుఁ గొలువఁదగునని చెప్పఁబడినది.

## వాసోదగోత్రము:—

(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు).

**వాస్కోడగామా** (Vasco-da-Gama):—పోర్చుగీసు దేశమున Sines అను తావున నొక యనుశ్రుతసాంప్రదాయ కుటుంబమున జన్మించినవాఁడు. బాల్యాదారభ్య నావికాయాత్రా వినోదియై, సముద్రపుఁ బోడలందుఁ గాలముఁ గడుపుచుండినవాఁడు. ఎట్టకేల కప్పటి యాదేశఁపు భూపతిగ నుండిన యొకటవ 'ఎమాన్యు అల్' గారి యాజ్ఞనంది, నాలుగోడల కధిపతియై, పోర్చుగీసుదేశమునుండి భరతదేశమునకు సముద్రమార్గముఁ దెలియ నియమితుఁడై, క్రీ. వె. ౧౪౯౭ జూలై ౮ వ తేది తేగస్‌నదినుండి బయలుదేఱి, మధ్యధరాసముద్రముం గడచి, యక్కాలమున సూయజుకాలువ లేనందున నాఫ్రికాఖండఁపుఁ బశ్చిమతీరముంబట్టి నడుచుచు, నెట్టకేలకు దక్షిణఁపుఁగడకుఁ జేరెనఁట. నాఁటికిని నేఁటికిని, ఆఫ్రికా ఖండఁపు దక్షిణఁపుఁగొననున్న యగ్రమునఁ దుపానులు తఱుచుగఁ గొట్టుచుండుంగాన నెఱిఁగినవారెల్లరు దానిని 'తుపానులయగ్ర' మని వాడుచుండిరఁట. ఎట్టెట్లో యదృష్టవశమున నక్కాలమున నటఁ దుపాను లేక క్షేమముగ మన వాస్కోడగామాగారి నాల్గుయోడ లాయగ్రముం జుట్టి యాఫ్రికాతూర్పుతీరమునకు మరల తన కది మంచి యాశఁ గల్గించినదిగాన నాయగ్రమునకు 'గుడ్‌హోప్ అగ్ర' మని పేరిడెనఁట. అదియే నేఁటికిని ప్రసిద్ధమై యున్నది.

పిదప నానాలుగోడలు ముందునకుఁ జని, యరేబియాసముద్రమున కష్టమువడి, కడకు మలబారుతీరముం గాంచి, సంతోషపరవశులై యర్ధ్నతలంబున దరికిఁ జేర, నది కేలికట్‌పట్టణ మని యెఱింగిరఁట. అది క్రీ. వె. ౧౪౯౮ మేనెల ౨౦ తేదీయని తెలియుచున్నది. పిదపఁ బోర్చుగీసువారు పశ్చిమసముద్రతీరముననే మర్మగోవా, పంజిందద్వీపము, ఆప్రాంతరాజ్యము నాక్రమించిరి. ఇది బొంబాయి రాజధానిహద్దులలో నున్నది. గామాగారు స్వదేశమునకు మరలిరి.

తిరుగ ౧౫౦౨ లో రాజాజ్ఞంగొని పదియోడలంకోడ గామాగారే మఱియొకతఱి భరతదేశమందాతీరమున కేతెంచి పెక్కుకార్యము లొనర్చిరఁట. ఆయనమృతికిం బూర్వము వైస్రాయి యను నుద్యోగ మిచ్చిరి. ౧౫౨౪ డిశంబరు ౨౪ తేదీని కొచ్చినునం దాయన మృతినందిరి. మర్మగోవా రేవుకడఁ బంజిందు (పోర్చుగీజు ఇరిటసీ) రాజ్యమున నాయనపేరే వహించునతావును, రెయిల్వేస్టేషనును గలదు. జననము క్రీ. వె. ౧౪౬౦ ప్రాంత మందురు.

## వాహకధిగోత్రము:—

(వశిష్ఠ గణము చూడుఁడు.)

## వాహలభ్యగోత్రము:—

(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

## వాహికదేశము:—

(పాతాళరాజ్యము చూడుఁడు, బాహ్లికదేశము చూడుఁడు).

**వాహి లేక వాహనిగోత్రము:—**
(పరాశర గణము చూడుఁడు.)

**వాహిగురు [గురుమంత్రము]:**
(గ్రంథసాహేబు చూడుఁడు.)

**వాహియగోత్రము:—**
(ఆయాస్య ఉపగణము చూడుఁడు.)

**వాహ్లీకదేశము:—**
(పాతాళరాజ్యము చూడుఁడు.)

**వాహ్యాకిగోత్రము:—**
(అగస్త్య ఉపగణము చూడుఁడు.)

**వాహ్యాకృత్ గోత్రము:—**
(వసిష్ఠ ఉపగణము చూడుఁడు.)

**వాహ్యాగచ్ఛి గోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**వాహ్యాగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**వాహ్యారిగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**వాహ్యావాక్యగోత్రము:**
(ఉపమన్యు గణము చూడుఁడు.)

**వాహ్యాయనగోత్రము:—**
(అగస్త్య ఉపగణము చూడుఁడు.)

**వాహులిగోత్రము:—**
(ఉపమన్యు గణము చూడుఁడు.)

**వాహునాకాయనగోత్రము:—**
(నిధ్రువ గణము చూడుఁడు.)

**వ్యాక్షిగోత్రము:—**
(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

**వ్యాక్షిగోత్రము:—**
(ఆయాస్య ఉపగణము చూడుఁడు.)

**వ్యాకరణములు ౯ (నవవ్యాకరణములు):—** ౧ పాణినీయము, ౨ కలాపము, ౩ సుపద్మము, ౪ సారస్వతము, ౫ ప్రాతిశాఖ్య (కుమారవ్యాకరణము), ౬ ఐంద్రము, ౭ వ్యాఘ్రభౌతికము, ౮ శాకటాయనము, ౯ శాకల్యము.

**వ్యాకరణశాస్త్రము:—** వ్యాకరణశాస్త్రమునకుఁ దొలుఁదొల్త సంహిత యని పాడుకనే రుండెను. సంహిత యన సంధింపఁబడినది. లేకఁ గూర్పఁబడినది యని యర్థము. ఇచటఁ బదములనో, లేక వర్ణములనో కూర్చుట యనిభావము. ఆదేశములు, ఆగమములు, హ్రస్వదీర్ఘపరిణామములు మొదలగువాట్లను ధర్మములమేరకు నడుపుచు, శబ్దములంగూర్చుట యని యెఱుంగునది. శబ్దముల సంబంధములందలి విధులను వ్యాకరించుం గాన (వ్యాకరించుట యన విధించుటయని యర్థము) నీ శాస్త్రమునకు 'వ్యాకరణశాస్త్ర' మనియుఁ బేరయ్యెను.

తొలుత వ్యాకరణమును తొమ్మండుగురు మహర్షులు కూడి రచించిరని యొకవిధముగను, వేర్వేఱుగ రచించిరని వేఱొకవిధముగను నైతిహ్యము గలవుగాని, మెచ్చుటను గ్రంథనిదర్శనములు గానవచ్చుట లేదు.

ఈశబ్దశాస్త్రమును తొలుత సర్వవిద్యాధిపతి యగు పరమేశ్వరుఁడు తా నుపదేశించు శబ్దబ్రహ్మము నిత్యమని తెల్పుటకు, తనచేతఁ బట్టిన మంత్రాత్మకమగు డమరుకమును ప్రయోగించ దానంజేసి పదునాలుగు సూత్రములు వినిపించెనఁట. అవి—

[౧] అ ఇ ఉ ణ్, [౨] ఋ ఌ క్, [3] ఏ ఓ ఙ్, [౪] ఐ ఔ చ్, [౫] హ య వ ర ట్, [౬] ల ణ్, [౭] ఞ మ ఙ ణ న మ్, [౮] ఝ భ ఞ్, [౯] ఘ ఢ ధ ష్, [౧౦] జ బ గ డ ద శ్, [౧౧] ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్, [౧౨] క ప య్, [౧3] శ ష స ర్, [౧౪] హ ల్.

వీట్ల యంత్యవర్ణములు, ఇత్సంజ్ఞకములు. వాట్లతో నాదివర్ణము (సముదాయము) లం గల్పినతఱిఁ బ్రత్యాహారము లనిపేరు.

ఈపదునాల్గుసూత్రములు మాహేశ్వరునివల్లఁ గల్గింపఁబడినవిగానమాహేశ్వరములనియు, అణాది సంజ్ఞార్థము లనియు, వాడఁబడెను. ఈపదునాల్గు సూత్రములకు నందికేశ్వరుఁడు వృత్తి నొసఁర్చె ననియుఁ జెప్పఁబడినది.

శబ్దశాస్త్రము బృహస్పతి దేవేంద్రున కెఱిం గించెననియు, నాతఁ డొక వ్యాకరణమును రచిం చెననియు, వ్యాకరణమహాభాష్యమునందుఁ బతం జలి నుడివియున్నాఁడు. ఇక్కాలమున దేవేంద్ర వ్యాకరణము, శాకటాయనవ్యాకరణము, సార స్వతవ్యాకరణము నను మూఁడు గానవయ్యెడిని. కాని దేశమం దంతటను వ్యాపించియున్నది పాణి నీయ మొక్కటియే గాన నిర్ధరణమునఁ బాణినిం గూర్చి యించుక వివరింపవలయును.

పాణిని ఋషి లేక పాణిన్యాచార్యుఁడు పణి నర్షిపుత్రుఁడు; తల్లి దాక్షీదేవి. అక్కాలమున నీతఁ డింద్రునియొక్క యంశమున జన్మించి, ఐంద్రవ్యా కరణమును పునరుద్ధరించెనని చెప్పఁబడినవాఁడు. పాణిని వ్యాకరణశాస్త్రమును సూత్రములుగ రచించెను. తొల్లింటి గాంధారదేశమున, రావీ నదీ తీరమున, ఓహింధునకు వాయవ్యమునఁ గలపయు దూరమందుండినశాలాతురము జన్మస్థానము. ఈతని కాలముంగూర్చి యభిప్రాయభేదములు కలవు. క్రీ. పూ. ౮, ౯ శతాబ్దములమధ్య నని రజనీకాంత గుప్తుఁడు వచించియున్నాఁడు. క్రీ. పూ. ఏడవ లేక ఎనిమిదవ శతాబ్దప్రారంభమున నని డాక్టరు భాండార్కరు పండితుఁడును Indian Antiquary Vol. 1 . 302 లో మగధభూపతియగు పుష్యమిత్రమహారాజునకు సమకాలికుఁడని చెప్పఁ బడియున్నది. Proffesor max muller క్రీ. పూ. నాల్గవశతాబ్దమధ్యకాలఁపువాఁడు పాణి నిగ History of Ancient Sanscrit Literature p 245 & 301 లో వివరించెను. ఈయభిప్రాయము లేవి యెట్లున్నను కాత్యాయ నుఁడను నామాంతరముఁగల వరరుచికంటెను, భాష్యము రచించిన పతంజలికంటెను, పూర్వమునం దుండినవాఁడని చెప్పక తప్పదు. పాణినివ్యాకరణ సూత్రములకు కాత్యాయని (వరరుచి) వార్తిక మును, పతంజలి భాష్యమును, పిదప రచించిరి. దానికే మహాభాష్య మనిపేరు. (పతంజలి చూ డుఁడు).

పాణిని దాక్షీదేవితనయుఁడు గాన దాక్షాయ ణుఁ డనియుఁ బిలువఁబడువాఁడు. మఱియు నీతఁ డు వర్షశిష్యుఁడని చెప్పబడినది. పాణినిచరిత్రము పారాశర్యపురాణమునఁ గొంత గలదు. మఱియుఁ గథాసరిత్సాగరమునఁ బ్రథమలంబకమునఁ జతుర్థ తరంగమందుఁ గొంత వివరింపఁబడినది. పాణినిని సరస్వతీనదీతీరదేశవాసిగఁ గొందఱు తలంచిరి.

వార్తికమును రచించిన కాత్యాయనునింగూర్చి విస్తార మేమియుం దెలియదు. ఇంక భాష్యమును రచించిన పతంజలిఋషికి జన్మస్థానము గోనార్థ యని చెప్పఁబడినది. కాశ్మీరదేశాధీశుఁడగు గోనా ర్థుడు జయించి యాక్రమించి యేలుకతన నాతని

నుండి పేరందినగోనార్థము జన్మస్థానముగఁ గలవాఁడై గోనార్థీయుఁడని చెప్పఁబడినవాఁడు. క్రీ. పూ. ౨వ శతాబ్దమున నుండినవాఁడు. కొందరు పరిశోధకులు పతంజలి మగధభూపతియగు పుష్యమిత్రుని సమకాలికుఁ డనిరి. మఱికొందఱు క్రీ. పూ. ౧౮౦-౧౫౦ మధ్య నీమహాభాష్యమును రచించెనని రుజువుపఱచిరి. సూత్రముల రచించిన పాణినియు, వాట్లకే వార్తిక మొనర్చిన వరరుచియు, వాట్లకే భాష్యము రచించిన పతంజలియు, వ్యాకరణశాస్త్రోద్ధారకులుగ నొకటిగ నెన్నఁబడఁదగినవారలే యగుచున్నారు. ఈవ్యాకరణశాస్త్రమునందు వైదికములు (వేదమునందు వాడఁబడిన పదములు) లౌకికములు (లోకవ్యవహారమున వాడఁబడుపదములు) నగు సంస్కృత భాషాపదసంస్కారణము, విధి విధానములు వివరింపఁబడియుంట నిది యెక్కువగఁ బేరంది వాడుకలోనికి వచ్చినది. (పతంజలి మహర్షి చూడుఁడు).

పిదప వార్తికము (వృత్తి) ను భర్తృహరి కాశీపట్టణమున సపాదలక్ష (౧,౨౫,౦౦౦) కారికలుగ బోధించెనఁట. దానిపేరు వాక్యప్రదీప యనుగ్రంథముగఁ దనరుచున్నది. పాణినీయసూత్రముల కీవాక్యప్రదీపసహితముగఁ దనరఁజేసి హేలారాజీయ మనువ్యాఖ్య రచింపఁబడినది. అది విపులమయ్యుఁ బెద్దగ్రంథమై యుండెను. తరువాతఁ గాశ్మీరదేశవాసియు, సరస్వతీపీఠసంబంధియు నగు కయ్యటోపాధ్యాయుఁ డన్నిటికిని సంగ్రహముగ భాష్యప్రదీప మనుపేరున ముప్పదియాఱువేలగ్రంథసంఖ్యతో నొకవ్యాకరణమును రచించెనఁట. పిదప గరికపాటి అన్నంభట్టను పండితుఁడు పాణినిసూత్రముల కెన్మిదివేలగ్రంథసంఖ్య గల వృత్తిగ్రంథము రచించెను. కొంచె మెచ్చుతక్కువగ నక్కాలముననే భట్టోజీదీక్షితుఁడను మహారాష్ట్రవిద్వాంసుఁడు శబ్దకౌస్తుభమను వ్యాఖ్యను పాణినిసూత్రములకే రచించెను. అది డెబ్బదిరెండువేలగ్రంథసంఖ్యఁ గలది. మఱియు నాతండే యావ్యాఖ్యాసంగ్రహముం గల్పి పాణిని సూత్రములను ప్రకరణములుగ విభజించి, సిద్ధాంతకౌముది యని పేరిడెను. అయష్టాధ్యాయి సిద్ధాంతకౌముదియే వ్యాకరణమునకుఁ బ్రథమ పఠనీయగ్రంథమై నేఁటికిం దనరుచున్నది. దాని నుండియే లఘుకౌముది సంగ్రహింపఁబడినది.

మఱియుఁ బాణినిసూత్రములకు 'ప్రౌఢమనోరమ' యను వేఱొకవ్యాఖ్య కలదు. భట్టోజీదీక్షితుఁడు కాశీపట్టణనివాసి. గొప్పవైయ్యాకరణి. ఈతఁడు వైయాకరణసర్వస్వము, బృహద్వైయాకరణభూషణసారము ననువ్యాకరణగ్రంథములును, తత్త్వకౌస్తుభము, తంత్రాధికరణనిర్ణయము, తిథినిర్ణయోద్ధారణము నను నితరగ్రంథములంగూడ రచించెనని చెప్పఁబడినది.

భట్టోజీదీక్షితపుత్రుండగు హరిదీక్షితుఁడను పండితుఁడు మనోరమకు శబ్దరత్న మనువ్యాఖ్య రచించెను. ఆహరిదీక్షితుని శిష్యుఁడగు నాగోజీభట్టు కయ్యటభాష్యప్రదీపమునకు 'ఉద్యోత' మను వేఱొకవ్యాఖ్యను రచించెను. మఱియు నాగోజీభట్టే కౌముదికి బృహచ్ఛబ్దేందుశేఖరము, లఘుశబ్దేందుశేఖరమునను వ్యాఖ్యాగ్రంథముల రచించెను. ఇంకను వ్యాకరణవిషయములందుఁ దర్కమీమాంసా మతములను ఖండించుచు, 'మంజూష' యనువాదగ్రంథమును, పరిభాషేందుశేఖర మనుప్రకరణగ్రంథమును రచించియున్నాఁడు.

ఇది యిట్లుండ జయాదిత్యమిశ్రుఁడను నామాంతరముఁగల వామనుఁడను పండితుఁడు

వ్యాకరణభాష్యమునం దచ్చటచ్చట నిరోధము లం గల్గించు వేఱొకవ్యాఖ్యానమును, పాణినిసూత్రములకు రచించియున్నాఁడు. ఈకాశికావృత్తికి న్యాస మనువేఱొక వ్యాఖ్యానమును గలదు. కాంచీపురనివాసియగు హారదత్తాచార్యుండను విద్వాంసుఁ డీకాశికావృత్తికే పదమంజరియను వేఱొకవ్యాఖ్యను రచించెను. ఈగ్రంథములు దక్షిణదేశమునఁ బ్రచార మందియున్నవని వింటుము.

పతంజలిమహాభాష్యము నంద రేకగ్రీవముగ గౌరవించుచున్నను పై రెండుమూఁడుగ్రంథములందుఁగల విశేషాంశములను తురీయోక్తి యను పేరున గౌరవించుచునే యున్నారు. మఱియుఁ గొందఱు కవు లీతురీయోక్తిమేరకుఁ బ్రయోగముల నెరపిరని విందుము.

మఱియు భట్టోజీదీక్షితుని నిరసించుచు చక్రపాణి, జగన్నాథుఁడు మొదలగువారు సిద్ధాంతరత్నాకరము మున్నగుఖండనగ్రంథముల రచించిరి గాని, వాటి నెవ్వరు పాటింపలేదు. వ్యాకరణగ్రంథములందుఁ దొల్లింట శాకల్యవ్యాకరణము, శాకటాయనవ్యాకరణము, కాతంత్రవ్యాకరణము నను గ్రంథములు కలవని చెప్పఁబడుటయే గాని, యవి గానఁబడవు. ఇంకను వ్యాకరణమగు ప్రాతిశాఖ్యయు, వ్యాకరణనిఘంటువును నీసందర్భమునఁ బేర్కొనఁబడఁదగినవి.

పిదపకాలములందు సిద్ధాంతకౌముదికి బాలమనోరమ, కాశిక, సరల, శరద్రాత్రి, (వల్లంకొండ రామారాయ పండిత విరచితము), యను వ్యాఖ్యానములు కలవు. న్యాసకృతమగు శబ్దబ్రహ్మనన్దిని యనునొకవ్యాకరణగ్రంథమును శాకటాయనుఁ డొనర్చిన ఋక్తంత్రవ్యాకరణమును గల వందురు. వీటి నింతట వదలి సిద్ధాంతకౌముదీవ్యాకరణమందలి విషయములం దెల్పి ముందునకుం జనెదము. పూర్వార్థమునందు ౧ సంజ్ఞాప్రకరణము, ౨ పరిభాషాప్రకరణము, ౩ సన్ధిప్రకరణము (ఇందు అచ్ ప్రకృతిభావ హల్ విసర్గ స్వాది సంధులు వివరింపఁబడినవి). ౪ శబ్దప్రకరణము (అజంత హలంత శబ్దములం గూర్చి చెప్పఁబడినది). ౫ స్త్రీప్రత్యయప్రకరణము. ౬ విభక్తిప్రకరణము (విభక్తులు, ప్రత్యయములంగూర్చి చెప్పఁబడినది), ౭ సమాసప్రకరణము (ఆఱుసమాసములంగూర్చి చెప్పఁబడినది), ౮ తద్ధితలు.

ఉత్తరార్థమున నజన్తాది సంప్రత్యెండువిధములకుఁ బంతొమ్మిందు ప్రకరణములును, స్వరప్రకరణమును, వేదసంబంధవిధులంగూర్చిన వైదికప్రకరణమును గలవు.

ఇంక నీపాణినీయవ్యాకరణసూత్రములనుండి నన్నయభట్టారకుఁ డాంధ్రభాషకు వ్యాకరణసూత్రములను సంస్కృతభాషయందే రచించెనఁట. వాటికి అహోబలపండితుఁ డాంధ్ర శబ్దచింతామణి యను వ్యాఖ్య రచించి చేర్ప నయ్యది 'అహోబలపండితీయ' మను నాంధ్రవ్యాకరణగ్రంథమై దనరుచున్నది. దానికి క్రొంత్తి భద్రాద్రిరామశాస్త్రి యనుపండితుఁడు తెలుఁగుతాత్పర్యము రచించెను.

సంస్కృతపదముల నాంధ్రమునఁ దత్సమపదములుగ నొనర్చు ధర్మములం దెలుపు చింతామణివ్యాకరణమును గలదు. చిన్నయసూరి యనుపండితుఁడు రచించిన బాలవ్యాకరణ మొకటియు, (దీనిపై కల్లూరి వేంకటరామశాస్త్రికృతవ్యాఖ్య గలదు). బహుజనపలి సీతారామాచార్యుఁడు రచించిన ప్రౌఢవ్యాకరణ మొకటియు, కందుకూరి

వీరేశలింగకృతమగు సంగ్రహవ్యాకరణ మొక టియు, నిత్తరుణమున నాంధ్రవ్యాకరణగ్రంథము లందుఁ జేర్కొనఁదగినవి.

అక్కిరాజు ఉమాకాంతపండితుఁడు పాణినిసూత్ర ములనుండియే యాంధ్రభాష కవసరమగువాట్లఁ గైకొని తెలుఁగున నొకవ్యాకరణగ్రంథమును 'వ్యాకరణప్రదీప' మనుపేర రచించియున్నాఁడు. ఇంకను భారతము లక్ష్మీపతి యనువైయాకరణి యాంధ్రమున 'శకటరేఫనిర్ణయ' మనుగ్రంథ మును, అర్థానుస్వారనిర్ణయమును రచించెను.

ఇటీవల మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు 'ఆంధ్రశబ్దానుశాసన' [సూర్యనారాయ ణీయ] మను వ్యాకరణమును రచించిరి.

## వ్యాఖ్యానలక్షణము లాఱు:—

శ్లో॥ పదచ్ఛేదః పదార్థోక్తిః విగ్రహో వాక్యయో
జనా। ఆక్షేపోఽథ సమాధానం వ్యాఖ్యానం
షడ్విధం మతమ్॥

అని చెప్పఁబడుట, పదచ్ఛేదము పదముల కర్థముచెప్పుట, విగ్రహము, వాక్యప్రయోజన మును వివరించుట, ఆక్షేపణముల వివరించి సమా ధానములు వాటికిఁ జెప్పుటయు, వ్యాఖ్యాతలు చేయుపనులుగఁ జెప్పఁబడినవి. ఇవి వ్యాఖ్యాన లక్షణములు.

## వ్యాఘ్రపద లేక వైయాఘ్రపద గోత్రము:—

(సంకృతి ఉపగణము చూడుఁడు.)

## వ్యాఘ్రపాదగోత్రము:—

(వశిష్ఠ గణము చూడుఁడు.)

**వ్యాఘ్రపాదుఁడు [ఋషి]:**— ఉప మన్యునితండ్రి. [ఉపమన్యువు చూడుఁడు.]

## వ్యాఘ్రపురము (బగ్సార్):—

[వాక్సాపురము చూడుఁడు.]

## వ్యాఘ్రపుష్టిగోత్రము:—

(గవిష్ఠిర గణము చూడుఁడు.)

**వ్యాఘ్రసారపురము:**— ఇప్పటి బీహారు దేశపు షహాబాదుజిల్లాలో బక్సా రనంబడు చున్నది. దీని కింకను వాక్సారము, విశ్వామిత్రా శ్రమము మొదలగుపేర్లు కలవు. [చూడుఁడు.]

## వ్యాఘ్రిగోత్రము:—

[గవిష్ఠిర గణము చూడుఁడు.]

## వ్యాధికి మందు గాని, విధివిధానము నకు మం దేదీ?:—

[ఆంధ్రలోకోక్తి].

**వ్యాధిత్రయము (రోగత్రయము - దోషత్రయము):**— వైద్య శాస్త్రమున ౧ వాతము, ౨ పైత్యము, 3 శ్లేష్మములకుఁ బేరు లుగ వాడఁబడినవి.

## వ్యాప్యాయనిగోత్రము:—

[పరాశర గణము చూడుఁడు.]

## వ్యాయనిగోత్రము:—

[విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.]

## వ్యాలసన్ధిగోత్రము:—

(ముద్గల గణము చూడుఁడు.)

## వ్యాలిగోత్రము:—

(ఆత్రేయ గణము చూడుఁడు.)

## వ్యాలోహావిగోత్రము:—

(వశిష్ఠ గణము చూడుఁడు.)

**వ్యాసకాశి:—** కాశీపట్టణముకడ గంగ కవ్వల రామ్నగర్ పరిసరము. దీనింగూర్చిన ప్రశంస స్కాందపురాణ కాశీఖండమునఁ గలదు.

**వ్యాసగోత్రము:—**
(పరాశర గణము చూడుఁడు.)

**వ్యాసపౌర్ణమి:—** ఆషాఢశుద్ధపౌర్ణమి. ఇందు యతులు వ్యాసమహర్షినిఁ బూజించి, బ్రహ్మసూత్రములం బఠింతురు. స్త్రీలు గోపద్మవ్రత మాచరించి, విష్ణుదేవునిం బూజింతురు. ఉత్తర దేశఁపుసీమలంను గోకిలావ్రత మొనర్తురు.

**వ్యాసమహర్షి:—** ఈపేరుఁగలవా రనేకులు కలరు. కృష్ణుఁడనియు, కృష్ణద్వైపాయనుఁడనియు, సత్యవతీపుత్రుఁ డగుట సాత్యవతేయుఁడనియు, బదరీవనవాసియగుట బాదరాయణుఁడనియు, పరాశరపుత్రుఁడగుట పారాశర్యుఁడనియు, వేదమును విభజించుట వేదవ్యాసుండనియు, మొదలగునామములు సుప్రసిద్ధములు.

కాని యీపేరులఁ బరఁగువాఁ డొక్కఁడో, పెక్కండ్రో స్పష్టముగఁ జెప్ప వీలు కాకున్నది. వ్యాసశిక్ష, వ్యాసస్మృతి, మొదలగు గ్రంథములకుఁ గర్త యొక్కఁ వ్యాసుఁడని చెప్పఁజాలము గాక. కృష్ణయజుర్వేదకారికలలోఁ బారాశర్య వ్యాసుఁడనియుంట, మనసునం దుంచుకొనఁదగినది. ఈతఁడును, సాత్యవతేయుఁడును, నొక్కఁడుగనే స్ఫురించెడిని. ఋగ్వేద దశమండలములోని ౪౨-౪౩-౪౪ సూక్తములు కృష్ణనామమును దెల్పెడిని. ఈతఁ డాంగీరసకృష్ణుం డని యుంట వేఱొక్కఁడై యుండనోపు. బ్రహ్మసూత్రకర్తయగు బాదరాయణుఁడు కృష్ణద్వైపాయనుఁడు కాఁడని లోకమాన్యులగు బాలగంగాధర తిలక్మహాశ యుఁడు వచియించియున్నాఁడు. ఇంక వీరియాశ్రమ స్థలములంగూర్చి విచారింతము.

కాళీనదీజన్మస్థానప్రాంతమున మహారణ్యమున వనమృగబాధితమగు నొకతావున వ్యాససరోవరమును, వ్యాసగుహయు, నొక యాశ్రమమును జూపుచున్నారు. యమునా, భాగీరథీ నదుల నడుమనుండు ద్వీపమున బ్యాస్ఘా టనంబడుతావున నొకవ్యాసాశ్రమమును జూపుచున్నారు. బహుశః ఈతండు కృష్ణద్వైపాయనుఁడేమొ? బనారసుపట్టణముకడ గంగకవ్వల వ్యాసకాశియం దాశ్రమము నిర్మించుకొనిన వ్యాసుఁడు పురాణకర్తయై యుండవలెను. వీరిం గూర్చిన పరిశీలనలు జరుఁగనగును.

**వ్యాసమహర్షి:** పేరు కృష్ణద్వైపాయనుఁడు. పరాశరునికి సత్యవతియందుఁగల్గిన కుమారుఁడు. పితామహుఁడు వశిష్ఠమహర్షి. కుమారుఁడు శుకయోగి. శుకునితల్లి శుకరూపమున విహరించుచుండిన ఘృతాచి. గొప్పవిద్వాంసుఁడు. వేదమును నాల్గుగ విభజించి నల్వురుశిష్యులకిచ్చి వారిచే వ్యాఖ్య వ్రాయించినవాఁడు. పురాణములు రచించినవాఁడు. బ్రహ్మమీమాంసాశాస్త్రసూత్రములను రచించినవాఁడు. కొంతకాలము తాను విష్ణువనుకొనుచు శివద్వేషియైయుండి, పశ్చాత్తప్తుఁడైనవాఁడు. సూతునకుఁ బురాణసంహిత నొసంగినవాఁడు. భారతము రచించినవాఁడు. సాత్యవతేయుండను పేరుఁగలవాఁడు.

**వ్యాసవనము:—**
(కురుక్షేత్రవనములలో నొకటి).

**వ్యాసాశ్రమము:—** యార్కానుండి గాని, కాళీనదిజన్మస్థానమునుండి గాని, యేఁబు మైళ్ళదూరమున వ్యాససరోవరమును, మధ్యేమా

ర్గమున వ్యాసగుహయుం గలవు. ఇవి వ్యాసమహర్షికిఁ దొల్లింటినియమములై యుండెనని చెప్పఁబడినది. (కాళీనదిజన్మస్థానము చూడుఁడు). వ్యాససరోవర మొక్కటి శ్రావణమాసమున నిర్మలజలములం గల్గియుండును. తక్కిన దినములందు మంచుచేఁ గప్పఁబడియుండును. ఈప్రాంతమున జంతుబాధ మెండుగఁ గలదు. పిదప నాబుసి సత్తముం డీయాశ్రమమును వదలి దక్షిణదేశమున కేగియుండనోపు.

## వ్యాహాయనీగోత్రము:—

(అగస్త్య ఉపగణము చూడుఁడు).

## వ్యాహృతులు [సప్తవ్యాహృతులు]:-

౧ భూః, ౨ భువః, ౩ సువః, ౪ మహః, ౫ జనః, ౬ తపః, ౭ సత్యం. ఇవి సప్త ఊర్ధ్వలోకముల పేర్లు. వీట్ల కోంకారము (ప్రణవము)ను ముందు చేర్చి సప్తవ్యాహృతు లందురు. వీట్లను త్రిసంధ్యలందుఁ బ్రాణాయామమునఁ బఠింతురు.

**వ్యాళనకులన్యాయము:**— పాము, ముంగిస వలెనని యర్థము. అన్యోన్యవిరోధులస్థితి యనిభావము. వైరులంగూర్చి వాడుచుండున్యాయము. దీనిని "అహి నకులన్యాయ" మనియు వాడుచుందురు.

**వ్యాళకూలకులగోత్రము:**— ఆర్యశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. వ్యాళకూలకుల (వెలగోళ్ళ లేక వెలిగోళ్ళ) గోత్రము. ఏకార్షేయ (3) గోత్రము. యాస్కగణము. సంస్కృతగోత్రము యాస్కస. జైమినిఋషి. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణ. ఆశ్వలాయనసూత్రము. నిర్ణయసింధు. సమానగోత్రములు జైమిని గోత్రము, వాధూలస వీతహవ్యసగోత్రములు. విమలేశుఁడు దేవత. విమలాంబ భార్య. విమలాద్రి తపస్థానము. నవనీతసరస్సు తటాకము. జపము లక్ష. దీపములు ౨౧. క్షేత్రసంఖ్య ౫౨. వెండిపాత్ర దానము. ఉశిరికపండ్లు వర్జనీయము.

## వ్రాఁతప్రతులు (manuscrepts):—

(వ్రాఁతసంచికలు చూడుఁడు.)

## వ్రాఁతసంచికలు (పుస్తకములు):-

వీట్ల నాంగ్లమున Manuscriptus అనెదరు. లాటిన్భాషయందు manu యన మానవహస్తమనియు, scriptus అనిన వ్రాయుటయనియు నర్థములు. ఇవి భరతదేశమున తాళపత్రములపైనను, కొన్నిపాశ్చాత్యదేశములందు papyrus పైనను, ఈజిప్టు, బేబిలన్, నినివే దేశములందు మట్టిబిళ్ళలపైనను నక్షరముల లిఖించి, కాల్చిన విన్ని వ్రాఁతగ్రంథములుగ నాదికాలమున నుండెను. కాగితములు చేయఁబడినపిదప వాటిపై వ్రాయఁబడుటయు, ముద్రణయంత్రములు కనిపెట్టఁబడినపిదప కాగితములపై ముద్రింపఁబడుటయుఁ బ్రారంభమాయెను. ఆంగ్లమున శబ్దముం దగ్గించి M. S. అనుచున్నారు. దీనిబహువచనము M. S. S. వీట్లధర్మములఁ దెల్పుశాస్త్రము నకు 'Palacography' యనిపేరు.

## వ్రాలు (సంతకము):—

(నిశాని చూడుఁడు.)

**వ్రాసినవ్రాఁతలను రబ్బరుతోఁజెఱుపుట:**—మెత్తని యిండియా రబ్బరుముక్కతోఁ బైన రాయుచు పెన్సలువ్రాఁత నరుగఁదీసి చెఱుపుట మెల్లరెఱింగినదే. అట్టితఱిఁ గాగితముపైఁ బలుచని నొక పొర యరగిపోయి దానితో లోనికరుగకఁ బైపైననే యంటిన పెనసలువ్రాఁత

అనఁగా నల్లని కార్బను (carbon) గీతలంగూడ చెఱిపివేయును. ఇంక సిరా ద్రావక మగుట నిం చుక కాగితములోనికిఁగూడ నాటిన సిరాव్రాఁత గీతను గట్టిదైన యిండియారబ్బరుముక్కతో గీచి, యరగఁదీసినఁగాని యరుగఁదీసి చెఱుపుట కించుక కాగితమునందలి కొంతలోతువకుఁ గూడ నరుగఁ దీయ వలసియుండెడిని. వాఁడిగల చాకుమొనతో నడ్డముగ గీచి సిరావ్రాఁతను చెఱుపుటకునిగూడ జరుగుపని యిదియే. ఐరోపాదేశములందు 'Pumice stone' అనంబడు మెత్తనిశిలతో రాచి చెఱుపుదురు. అత్తితి జరుగుపనియు నిదియే యగును.

## వింగ్సు (Wings):—

(వంతెనలు చూడుఁడు.)

## వింటరుసాలిసిటిస్ (Winter solstices):-- (సీజన్సు చూడుఁడు.)

## విండ్మిల్ (Wind mill.):—

గాలివలనఁ దిరుగుచుండు నాల్గు రెక్కలంగల్గి, వానిదిరుగు



టనుండి నడుపఁబడిన నీరుతోడు యంత్రము (pump) గలకట్టడమునకు 'Wind mill' అని పేరు. గాలి వీచుచున్నకొలఁది రెక్కలు తిరు గుచు, నీటిందోడుచు పాడుఁజేయుచుండును. హా లండుదేశమున నివి మెండుగఁ గలవు. వీటిసాహా య్యమునఁ బిండివిసరుట మొదలగుపనులంగూడఁ జేయింతురని తెలిసెడిని.

## విండ్సర్కాసిల్ (Windsor casile):-

బ్రిటీషుచక్రవర్తుల ముఖ్యనివాసదుర్గము. ఎత్తగు తావున తేమ్సునదీతీరమున నున్నది. పంద్రెండెక రములకై శాల్యము గలది. ఇందు నివాస ప్రాసా దములు కలవు. ఇది Lower ward అనియు, middle ward అనియు, upper ward అనియు మూఁడుభాగములుగ నున్నది. St. Georgis Chapel అను సుందరతరమగు దేవా లయ మీదుర్గమునఁజూడ ముచ్చటగా నుండును. ఇది ౧౯౩౦ లో మరమ్మతుఁ జేయఁబడినది. దీనికిం జేరిన యుద్యానవనము నాల్గుమైళ్ళ చుట్టుకొలతఁ గలది. గొప్ప పుస్తకభాండాగారము విలువఁ గలది దుర్గమునం దున్నది.

## విండ్వర్డుద్వీపములు (wind ward islands):—

ఇవి పశ్చిమహాసముద్రమునం దిస్టిండీసుద్వీపసమూహమునఁ జిన్నఆంటిలీసుద్వీప ములం దొకద్వీపసముదాయము. బార్బాడో యిస్ (Barba does) పురము ప్రభుత్వకార్య స్థానము. ఇది బ్రిటీషువారి పురాతనపుఁ గోలనీ యనిచెప్పఁబడినది. బ్రిటీషువారిది. (వెస్టిండీసు ద్వీపములు చూడుఁడు.)

## విండ్ఫాలు (wind fall):—

అనుకొనని యదృష్టము. పెంకర్నం డార్లింగ్లసామంతులు తమ యెస్టేట్లను, అందున్నచెట్లు నావలంగట్టె department వా రిచ్చువచ్చినప్పుడు కొన్నుకొను నేర్పా

టుతోం బొందిరట. గాలివలన నాచెట్లు పడిపోయి నచో నవి సామంతులవే యగునట. గాన Wind fall సామంతునకు లాభకరమనుటంబట్టి యీ ఉక్తి జనించెనట. నానాటికిఁ దలంచుకొననితలం పుగఁ గల్గిన యదృష్టమున కీఉక్తిని వాడుచున్నారు.

**విండింగ్ [లేక వైండింగు] అప్పు (Winding up):**—వాణిజ్యపరిభాషాపదము. ఒకసంస్థను నడుపుట యసంభవమగుతఱి దాని లెక్కలం బరిశీలించి, దానియాస్తులవలన నప్పులం దీర్చుచు ముగించుట. దీనిని 'Liquidation' అనియు నందురు.

**విందానువిందులు:**—అవంతిదేశభూపా లుఁడగు జయత్సేనుని సుతులు. తల్లి రాజాధిదేవి. (ఈమె వసుదేవుని చెలియలు, శ్రీకృష్ణుని మేనత్త.)

**విందు మందు మూఁడుపూటలు:**— (ఆంధ్రలోకోక్తి.)

**విందుమఱునాఁడే మందు:**— (ఆంధ్రలోకోక్తి.)

**విందుసారము (బిందుసారము లేక సరోవరము):**— ఉత్తరహిమాలయములపై గం గోత్తరి యనంబడు క్షేత్రమునకు రెండుమైళ్ళదూ రమున భగీరథుఁడు గంగకైఁ దపంబొనర్చినతావు. దీనింగూర్చినప్రశంస బ్రహ్మాండపురాణము ౫౧ అధ్యాయమునఁ గలదు.

కైలాసశిఖరముకడనున్న గౌడపర్వత శాఖగ నున్న మైనాకపర్వతమున బిందుసార సరస్సు కల దని మహాభారత సభాపర్వ 3 అధ్యా. చెప్పఁ బడినది. గుజరాతునందలి సిద్ధపురముకడ (అహ మ్మదాబాదునకు నాయువ్యదిశగా కర్దమఋషి యాశ్రమముకడఁ (గపిలమహర్షిజన్మస్థానము) నొక టియు నుత్కలదేశమున భువనేశ్వరమునఁ గృత్తి వాసులను రాక్షసులను వధించిన పరమేశ్వరదాహ శాంతికై త్రిశూలములతో శివుఁడు త్రవ్వినదను నొకబిందుసరోవరమును కలవు.

**వింధ్యపర్వతము:**— (కులపర్వతములు చూడుఁడు).

**వింధ్యపాదపర్వతము:**— సాత్‌పుర (సత్పుర) పర్వతములోనిది. తపతీనది జన్మస్థాన మిందుఁ గలదు. దీనింగూర్చినప్రశంస వరాహ పురాణము ౮౫ అధ్యాయమునఁ గలదు. వింధ్య పాదపర్వతమును ప్రత్యేకపర్వతము తపతీ నర్మదా నదులమధ్య నున్నది.

దీనిపైని నర్మదానదిపైపున 23 అడుగుల యెత్తుగల జైన (దిగంబర) విగ్రహ మొకేరాతి నుండి చెక్కఁబడినది కలదు. ఇది బర్వానిజిల్లా లోని భవాన్‌గంజియనంబడు తావునఁ గలదు. ఇందూర్ సంస్థానపు టిందూరుపురమునుండి ౧౦౦ మైళ్ళదూర ముండును.

**వింధ్యాచలవాసినీక్షేత్రము:**— ఇచటి క్షేత్రమును, ఇటనున్నగ్రామమును, హిందూ స్థానీదేశభాషయందు 'బింధాచల్' అనెదరు. సం యుక్తరాష్ట్రములలోనిది. గంగాతీరము. ఈస్టు ఇండియన్ రెయిల్వే మెయిన్‌లైను మొగ్లు రాయి, అలహాబాదులమధ్యనున్నతావు. మీర్జా పూరు పట్టణపరిసరమై యున్నది. హిందువుల సుప్రసిద్ధయాత్రాస్థలము. వింధ్యాచలవాసినీదేవి శక్తిపీఠములలోనిది. వింధ్యపర్వతపంక్తి యిటనుండి యే ప్రారంభమగును. గంగానదికుడిపైపున నొక చిన్నకొండపై దేవస్థానమును, వేఱొకకొండపై

గ్రామమును, బింధాచల్ అనంబడుచున్నవి. వింధ్యాచలవాసినీదేవిని భోగమాయ యనియు నందురు. మఱిరెం డితరదేవాలయములు గ్రామమునుండి యొకటిన్నరమైళ్ళదూరమునఁ గలవు. అవి వేర్వేరుతావులం దున్నవి. ఒకదేవళమందలి దేవిని యోగమాయ యనియు, వేఱొకదేవళమునందలి దేవిని కాళీయనియు నందురు. ఇటీవల బింధాచల్ సమశీతోష్ణప్రదేశముగఁ దలంపఁబడుచున్నది.

**వింధ్యాటవి (అరణ్యము):—** ఖండేశములోని కొంతభాగము, నైజామురాజ్యములోని ఔరంగాబాద్ పరిసరములు, నాశిక, త్రియంబకపరిసరములు, (వింధ్యపర్వతపశ్చిమపరిసరములు) వింధ్యాటవి యనంబడెను.

**వింధ్యశక్తినృపాలుఁడు:** వాకాటదేశమును స్థాపించి యేలిననృపతి. కైలాకిల లేక కిలాకిల వంశజుఁడు. యవనుఁడని చెప్పఁబడీఁది. రాజధాని కిల్కిలా నగరము. [వాకాటదేశము చూడుఁడు.]

**వింశతిముద్రలు:—** (యోగశాస్త్రముద్రలు చూడుఁడు - యోగశాస్త్రము చూడుఁడు.)

**వింశతిలోహములు:—** రసాయనశాస్త్రజ్ఞులీయిరువది నవీనలోహములు మానవోపయోగమున వెండిబంగారులకన్న నధికములని చెప్పుచున్నారు.

**1 Gallium ఇది యెక్కువవిలువగల లోహము. 2 Vanadium, 3 Thorium, 4 Zinconim, 5 Glacium, 6 Cromium, 7 Lethium, 8 Cerium, 9 Calcium,** 10 Didymium, 11 Indium, 12 Tantalum, 13 Yttorium, 15 Nidium, 16 Barium, 17 Iridium, 18 Osmium, 19 Rhodium, 20 Palladium.

ఇంకను కొందఱు రసాయనవేత్తలు యిరువది లోహములకు Gold, silver, Nickel Alluminius cobalt, Platinum Ganthanium, Telluriumఅను ఏఁడులోహములంగూడఁ జేర్పఁదగు ననుచున్నారు.

**వి. అక్షరమునకుం జెందిన క్రైస్తవ పురుషనామములు:—**

Valentine Valerius Valentin లాటిన్పదము. healthy అనియర్థము. (ఫిబ్రె 14 Valentine's day).

Valery ట్యూటానిక్కుపదము. Slaughter ruler.

Vallance Varney - Vaughan - Vauncey Varney Vernon Vesey Vezey నవీనకల్పితపదములు.

Vester (Sylvester చూడుఁడు.)

Victor లాటిన్పదము. జయశాలియని యర్థము.

Villiers (ఉచ్చారణ Vill-lers అని ) నవీనకల్పితపదము.

Vincent లాటిన్పదము. జయమని యర్థము. St. Vincent బిషపుపేరు.

Vrigil లాటిన్పదము. వృద్ధినందు అనియర్థము. లాటిన్కవీశ్వరునిపేరు.

Virginius లాటిన్పదము. వృద్ధినందు అని యర్థము.

Vivian Vyvyan Vivien లాటిన్పదము. lively అని యర్థము.

Vortigern సెల్టిక్కుపదము. గొప్పరాజని యర్థము.

Vyell నవీకల్పితపదము.

## వి. అకరముకుంజెందిన స్త్రీల నామ ములు:—

Valda Valdivia ట్యూటానిక్కుపదము. బల శాలియని యర్థము.

Valentine Veletina లాటిన్పదము. ఆరోగ్య వంతురాలని యర్థము. ఇదియే Valentine యొక్క స్త్రీవాచకముగూడను.

Valerie Valeria Valerere లాటిన్పద రూపములు. ఆరోగ్యవంతురాలని యర్థము. Valerius యొక్క స్త్రీవాచకపదరూపము.

Vanda నవీనకల్పితపదము.

Vanora సెల్టిక్కుపదము. తెల్లనికెరట మని యర్థము.

Veda సంస్కృతపదము. జ్ఞానము (ఎఱుక) యని యర్థము.

Venetia Venice సెల్టిక్కుపదము. దీవనలందిన యని యర్థము.

Venus లాటిన్పదము. చక్కదనమని యర్థము. రోమనుదేవతయగు వెనస్‌యొక్క పేరుగఁ బ్రచారముఁగన్గెను.

Vera లాటిన్పదము. నమ్మిక యనియర్థము.

Verda నవీనకల్పితపదము.

Verena ట్యూటానిక్కుపదము. పవిత్రమగు బుద్ధిఁగలది యనియర్థము.

Veroonica Vernique గ్రీకుపదరూపములు. (క్రీస్తుయొక్క) సరియగుపోలిక యనియర్థము. Calvary పురమునకేగుతఱి యేసుక్రీస్తు ప్రభువున కొకసారి Si. Veronica యను నామె యెదురయ్యెనట. ఆయన నుదుటం బట్టినచెమట నొత్తుటకుఁ దనబట్టనందించెనట. అట్లొత్తనారూప మాబట్టపై స్పష్టముగనేర్పడి యుండెనట. అంతటినుండియు భక్తురాలికి Veronica యనిపేరు వాడుకయయ్యెనట. నామెపేరుగ నీమాట ప్రచారమందెనట.

Vertue నవీన కల్పితపదము.

Vesta లాటిన్పదము. రోమకదేశమున భూదేవతయు, గృహదేవతయు నగు. Vesta దేవత పేరు.

Victoria, Victorine, Victorie, Victoroire, Vittoria లాటిన్పదరూపములు. జయవంతురాలని యర్థము. ఈపే రఱువది సంవత్సరములకన్న నెక్కుడుకాల మాంగ్లి సామ్రాజ్యమేలిన విక్టోరియాచక్రవర్తినిదిగాఁ జాల ప్రచారమందె నందురు. ముద్దుపేరు Vera.

Vida హీబ్రూపదము. ప్రేమింపఁబడిన యని యర్థము.

Vine నవీనకల్పితపదము. పూలభాషయందు నిషా యనియర్థ మగును.

Viola, Violet, Violante, Violetta, Violetta లాటిన్పదరూపములు Violet జాతిపుష్పమువంటి సౌందర్యవంతురాలని యర్థము.

Virginia, Virgilia, Virginie లాటిన్పద రూపములు. అవివాహితయగు పడుచు అని యును, ఏసుక్రీస్తు తల్లి Vergin mary అనియు నర్థమిచ్చునటుల నీపేరన్వయించెడిని.

Vivian, Viviana, Vivienne లాటిన్పద రూపములు. కదలికఁగల్గియున్న యనియర్థము. దీనియొక్క పుల్లింగరూపమును Vivian గాన యీపదమే ఉభయలింగపదమని యెఱుంగునది.

Volnmnia దీనింగూర్చి యేమియుఁ దెలియదు. పేరు నాటకములందుఁ గానవచ్చుచున్నది.

## వికంహన్తగోత్రము:—

(జౌశనస ఉపగణము చూడుఁడు.)

## వికంహన్తగోత్రము:—

(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

## వికస్వరగోత్రము:—

(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

## వికారములాఱు (షడ్వికారములు):-

(షడ్వికారములు చూడుఁడు.)

## వికార్ బ్రే (Vicar Bray):—

తనకిష్టమైన వారికైన నొదులుకొని తనస్థానమును నిలుపుకొనువాని కీ ఉక్తి వాడుచుందురు. 'Vicar Bray' అట్లుఁ బ్రవర్తించినవాఁ డగుటంజేసి యాతనినుండి కల్గిన ఉక్తి. ఇక్కాలమున రాజకీయకక్షలందుఁ బ్రవేశించి, యెన్నికల జయమునంది, తమ్ము నెన్నుకొనినవారిని సరకుఁజేయక వేలువార్లము స్వలాభమునకై ( ఎ)క్కినవారి నిట్లనుచున్నారు.

## విక్రమశిష్టసగోత్రము:-

ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. విక్రమశిష్టసగోత్రము. ఏకార్షేయ (౧౬) గోత్రము. విశ్వామిత్రగణము. సంస్కృతగోత్రము విశ్వామిత్రస. ఆపస్తంబ యజుశ్శాఖ. పరిమాణగ్రంథ మాద్యప్రవరఖండ. విశ్వేశుఁడు దేవత. విజయాంబ భార్య. గోదావరీతీరము నివసస్థానము. విజయాంభోధి తటాకము. జపము దశలక్ష. దీపము ౪౬. క్షేత్రసంఖ్య ౨౧. స్వర్ణదానము. గంగరావి వర్జనీయము. (వైశ్యగోత్రములు చూడుఁడు).

## విక్రమశిలాసంఘారామము:—

(అంగదేశముచూడుఁడు, మగధరాజ్యము చూడుఁడు.)

## విక్రమార్కరాజాస్థానవరత్నములు (పండితులు):—

శ్లో॥ ధన్వంతరి క్షపణ కా మరసింహ శంకు।
భేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః।
ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం।
రత్నాని వై వరరుచే ర్నవవిక్రమస్య॥
'ఉద్భటః'

అని చెప్పఁ బడియుంట ౧ ధన్వంతరి, ౨ క్షపణకుఁడు, ౩ అమరసింహుఁడు, ౪ శంకువు, ౫ భేతాలభట్టు, ౬ ఘటకర్పరుఁడు, ౭ కాళిదాసు, ౮ వరాహమిహిరుఁడు, ౯ వరరుచి, యని తెలుచున్నది.

## విక్రియవ్యాపారము [అమ్మకము]:-

దీని నాంగ్లమున Sales manship అనియెదరు. కొనినవస్తువులను లాభమునకుఁగాను విక్రయించుటయను వర్తకి మిమిడియుంట నిది రాను రా నొక కలగాఁ బరిణమించినది. దీని నీవిద్యలం దారితేరినవారు 'సయంటిఫిక్కు సేల్సుమేన్లు' ప్పనుచుందురు. ఇట్లనుటవలన నిది నొక శాస్త్రవిధానమా? యని యెంచకపోము.

ఏసరకు లేతరుణమునఁ జౌకగ లభించునో (ఆతరుణమున) కొనవలసియుండునో, ఏతరుణమున (వాటిధర పెరుగునో యాతరుణమున) విక్రయించవలసియుండునో వాట్లం దెలియుటకుఁ బూర్వానుభూతి సాహాయ్య మవసరము గాన, తా నొనర్చు ప్రతివ్యవహారమును లెక్కలు వ్రాయుచు వాట్ల నారయుచుంటయు, ఏతావునం దవి యమ్ముడుపోవునో వాట్ల నదేపనిగ గమనించుచుంటయు,

లేని నిజాయతీప్రవర్తనయుం డెల్లరకు నమ్మక ముండునటులఁ దనవ్యవహారఁపువర్తనము, ఇచ్చి పుచ్చుకొనుట, ద్రవ్యమునందు న్యాయబద్ధమగు కోర్కె, తప్పు దురాశను వీడి కార్యాచరణమును తనవిధిగా నడుపుచుంటయు, వర్తకధర్మరహస్యములు గాన వాట్లంగూర్చి యుపరిమత్తుండై యుంటయు నిందలిరహస్యములని చెప్పఁబడినది. వర్తకునకుఁ గోప మనర్థ మనియు, నవ్వు మొగము లేక వికసించినమొగము, అన్యులపట్ల నాదరణము, మరియాదయు నవసరములు గానోపు.

వార్తాపత్రికలు మొదలగువాటియందుఁ దా నమ్మువస్తువులగుణగణములం బ్రకటించుటయు, కేటలాగులు, కరపత్రములు, బహిరంగప్రదేశముల నంటించుఁబ్రకటనలు, వస్తువులగుణగణములు వివరించుచుండుట విధానముగ నున్నది. అమెరికా దేశఁపు సేల్సుమెన్ తరిబియ్యతునందిన వాక్చతురులను దేశదేశములఁ కనిపి, బోధించుటంగూడ నవలంబించియున్నారు. ఇందువలనఁ గొనువారలకుఁ బ్రోత్సాహ ముదయించుటఁ గల్గుచున్నది.

మోటారుకారుల నమ్మువారు తమకారుల నూళ్ళవెంట నేజంట్లనిచ్చి యుంపుచు, కొనువారి కుత్సాహముం గల్పించి యమ్ముచుంట భరతదేశమందుఁగూడఁ జూచుచునేయున్నాము. అనుభవజ్ఞులగు నాంగ్ల వర్తకులు "Advertising is the hand maid of salesmanship and salesman ship is the hand maid of distribution" అని సామెతగాఁ బల్కుదురు. అమ్మె వస్తువుల గుణాతిశయములను, కొనువారి మనస్సులకు నాటుటయే యిక్కాలమున నిజమగు నెడ్వరుటైజుమెంటుగాఁ దలంపఁబడుచున్నది. అవి కొనువా రడుగుప్రశ్నల కుత్తరము లీయఁ దగు రీతి నుండిననే సరియగు నెడ్వరుటైజుమెంటగును.

అమెరికా సంయుక్తరాష్ట్రములందుఁ గొను వారికడకు దేశదేశముల కరుగు నేజంట్లకడ "సేల్సు మేన్షిప్పుమేన్సు" అనుగ్రంథ ముండును. అందు మాటలాడఁ దగిన విధానములుఁ గూడ వివరింపఁ బడియుండెడిని.

## 'విక్రీతే కరణి కి ముంకుశే వివాదః' ఇతి న్యాయము:

—ఏనుఁగ నమ్మివైచి దానియంకుశ మీయుటకు వివాదపడినట్లు. స్వల్పమునకై వివాదపడుచుంటయని భావము.

## విక్టోరియన్ ఆర్డరు (Victorian order):

—ఇది బ్రిటీషుదేశఁపు నైటుహుడ్డు. ఆదేశస్థులకే యొసంగఁబడుచున్నది. ఇందైదుభేద తరగతులు గలవు. క్రి. శ. ౧౮౯౬ నం దేర్పడినది.

1 G. L. V. O. Grand Cross విక్టోరియన్ ఆరరు.

2 K. C. V. O.— Kinight Commander Victorian Order.

3 C. V. O.— Commander Victorian Order.

4 M. V. O.— } member Victorian
5 M. V. O.— } Order. ఇది ద్వివిధభేదములుగ నున్నది.

## విక్టరీమెడల్ (Victory medal):

—ఈగౌరవపథకము క్రీ. శ. ౧౯౧౯ మార్చినెలయం దైరోపామహాసంగ్రామసందర్భమున, నేర్పఱుపఁబడిజయశీలురగు సైనికోద్యోగుల కొసంగఁ బడినది.

## విక్టరు హ్యూగో (Victor Hugo):

—ఈమహావిద్వాంసుఁడు ఫరాసుదేశస్థుఁడు. కవి

త్వముఁ జెప్పినవాఁడు. నవలలు, నాటకములు వ్రాసినవాఁడు. జన్మస్థానము besancon. జన్మకాలము క్రీ. శ. ౧౮౦౨ ఫిబ్రవరి ౨౬ వ తేది. పారిస్‌నగరమున ౧౮౮౫ మే ౨౨ తేదీని మృతినందెను. క్రీస్తువెనుక ౧౮౨౨ సంవత్సరమునఁ బనిఁ బ్రారంభించెనని రానురా ననేకగౌరవపదవులందెననియుం జెప్పఁబడినది. ఈయనకు రాజకీయ జీవనమును గలదఁట.

**విక్టోరియాక్రాస్** (Victoria Cross):- బ్రిటీషు ఆర్మీ నావీ పర్సొన్లు సైనికదళములందలివారికి ధైర్యసాహసముల కొసంగఁబడు మెప్పు గౌరవచిహ్నపథకము. ఇది క్రీ. శ. ౧౮౫౬ లో విక్టోరియామహారాజ్ఞి గారివలన నేర్పఱుపఁబడినది.

**విక్టోరియాజలపాతము** (Victoria falls):—ఇది ఆఫ్రికాఖండమున జాంబీసీనది యందలి గొప్పజలపాతము. (జాంబీసీనది చూడుఁడు.) జాంబీసీనది యొకకొండగొరిజలోని భూమియొక్క పగులులోనికిం బడును. ఇదియే జలపాతము.

దీనిని డాక్టరు లివింగ్స్టన్‌గారు క్రీ. శ. ౧౮౫౬ సం॥రమునఁ గనిపెట్టి యీపేరిడెనని చెప్పఁబడినది. ఇచటిచిత్రమేమన జాంబీసీనది సమతలముననే ప్రవహించుతటి నదఁగా జలపాతముయొక్క పైభాగమును, దిగువభాగమును, నొకే మట్టముగనున్న సమతలప్రదేశమునఁ బ్రవహించుతటి నీజలపాతము సంభవించుటయై యున్నది. ఆ కొండగొరిజ యొక్క మెలు వెడలుపుగ నున్నది. ఈ జలపాతము భిన్నములుగ నేర్పడి పడుచున్నది. నడుమ చిన్నద్వీపములు గలవు.

జలపాతములలోఁ గొన్ని యొకేపాతముగఁ బగులులోనికిఁ బడును. అవి యించుమించు ౨౬౦ అడుగులుండుననియు, కొన్ని రెండు, కొన్ని మూఁడు పాతములుగఁ బడుచుండుననియుఁ దెలియుచున్నది. జలపాతమున ముందువలె నైదుతావులందుఁ బడి చెదరిన నీటిబిందువు లగు పడుచుండును. అచట నచట స్తంభాకృతిఁ దాల్చి నిలచియుంటఁ గాననగును. వీట్లయందు సూర్యునినుండియుఁ జంద్రునినుండియుఁగూడ నింద్రధనుస్సు లేర్పడి, స్పష్టముగను పెద్దవిగను గాననగుచుంట కడుచిత్రముగఁ దోఁపకపోఁదు.

ఒకయినుపబాట జలపాతమునకుఁ దిగువగ జాంబీసీనదిం దాటువంతెన కలదు. పరిశీలకులు విక్టోరియాజలపాతము నయగారాజలపాతమునందు సగముండుననని యంచనా వేయుచున్నారు. (నయగారాజలపాతము చూడుఁడు.)

స్వదేశభాషయం దీజలపాతముపేరు మోసి ఓయా తున్యా యని యైయున్నది. అనఁగా గర్జించు ధూమ మని యర్థమఁట.

**విక్టోరియా మహారాజ్ఞి:**— ఇంగ్లాండు దేశపు రాజ్ఞియును, బ్రిటీషుసామ్రాజ్యమునకు, అందు ముఖ్యముగా భరతదేశమునకు చక్రవర్తిని. డ్యూకవ్ కెంటు గారి కొమార్తె. తల్లిపేరు విక్టోరియామేరీ. లూయీసాకెన్సింగ్టన్ పురమున క్రీ. శ. ౧౮౧౯ మెయినెల తే ౨౪ ది తెల్లవాఱుజామున జన్మించెను. పెదతండ్రిగారిరాజ్యమునకు క్రీ. శ. ౧౮౩౭ లో రాజ్ఞియయ్యెను. ౧౮౪౦ లో ప్రిన్సు ఆల్బర్టుప్రభువును పెండ్లియాడెను. ఆయనకన్న నీమెయే మూఁడునెలలు పెద్దయుండెను. నలుగురు పుత్రులు, ఐదుగురు పుత్రికలు సంతానముఁగల్గిరి. ౧౮౬౧ వైధవ్య మందెను. క్రీ. శ. ౧౮౫౭ లో

భరతదేశమున సిపాయిలతిరుగుఁబాటు సంభవించ ౧౮౫౮ లో (ఇండియా) భరతదేశపుఁ బరిపాలనముఁ జేకొనెను. క్రీ. శ. ౧౮౭౭ వ సంవత్సరమున నిండియాచక్రవర్తిని యనుబిరుదము వహించెను. క్రీ. శ. ౧౯౦౧ వ సంవత్సరమునఁ దనయెనుఁబది రెండవయేట స్వర్గస్థురాలాయెను. ఈమెపిదప నీమె సుతుండేడవయెడ్వర్డుచక్రవర్తి రాజ్యపాలనమునకు వచ్చెను. ఈమెపాలనము నెమ్మదిదైనదనియుఁ జెప్పఁబడినది. ఈమెను "విక్టోరియా ది గుడ్" అనియెదరు.

**విక్టోరియాశకటము:**—ఇదినాల్గుచక్రముల గుఱ్ఱపుబండి. ముందు డ్రైవరున కెత్తుగు నాసనముండును. ఒకటిగాని, రెండుగాని గుఱ్ఱములం బూయుచుందురు. విక్టోరియామహారాజ్ఞ గారి పేరంబరఁగు సౌఖ్యకరమగు బండి.

**వికుక్షి:**—మరీచిసంతతి. సూర్య, ఇక్ష్వాకువంశపుక్షత్రియుఁడు. తండ్రి శశి. పితామహుఁ డిక్ష్వాకుమహారాజు. కుమారుఁడు పురంజయుఁడను నామాంతరముగల కకుత్స్థుఁడును, బాణుఁడును.

**వికృతి:**—అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి జీమూతుఁడు. కుమారుఁడు భీమరథుఁడు.

**విగ్రహగుణము:** రాజనీతియందలి షడ్గుణములలో నొకటి. (షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు చూఁడుడు.)

**విగ్రహారాధనమతము:**—దీని నాంగ్లమున Idolatry అనుచున్నారు కాని, యది సరియగునర్థము కానేరదు. హిందువులవిగ్రహారాధనమునందలి భావము నెఱుంగకఁ గేవలము బొమ్మలం బూజించుటగాఁ దలంచి యీ పేరిడియున్నారు. శైవ వైష్ణవమతములం దీభావములు చక్కఁగా వివరింపఁబడియున్నవి. సాకార బ్రహ్మము నారాధించువిధమున కీపేరు వర్తించును.

**విగృహ్యయానము:**— రాజనీతియందుఁ జెప్పఁబడిన పంచయానములలో నొకటి.

(షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు చూఁడుఁడు.)

**విగ్ ఎండ్ టోరీ (Whig and Tory):**—ఇది ౧౬౮౦ సంవత్సరమునుండి వాడుకయందుఁ గానఁగుచున్నది. ఉత్పత్తి సరిగాఁ దెలియదు. స్కాట్లండుదేశపుఁగొండ్రాప్తరులపానీయమగు whey (పెరుఁగుపై నీళ్ళు) నుండి whig ను, ఐర్లాండు దేశపుఁ దిరుగుఁబాటు మనుష్యులు (out laws) సంబంధమగునది Tory పదమును గల్గినవఁట. ఇప్పుడువి రోధపుఁగక్షులని తెల్పుటకు వాడుదురు.

**విఘనసనది:**— దీని నిప్పుడు వైఘ యనియు, అరవమున వైఘై యనియు ననుచున్నారు. దక్షిణమధురప్రక్కగ నున్నది. రామనాథపురంజిల్లాలోఁ దనంతటఁ దానే యంతరించునది. అనఁగా సముద్రముదనుకఁ బోక యంతరించును.

ఇది యంతర్వాహిని. అన్నినదులవలెఁ బైకి నీరు కన్పించదు. లోపనె నీరు ప్రవహించునది. శివపురాణమునను, పద్మపురాణోత్తరఖండ ౮౮ వ అధ్యాయమునను, ప్రశంసింపఁబడినది.

**విఘ్నేశ్వరుని చవితి:**— భాద్రపదశుద్ధ చతుర్థి [చవితి] మొదలు త్రయోదశిదనుకఁ దొమ్మిదిదినములను 'గణపతినవరాత్రము' లనియెదరు. ఇందు మహాగణాధిపతియు, విద్యాధినాథుండునునగు విఘ్నేశ్వరుని పూజించుచుందురు. ఆయనకు మోదకము [ఉండ్రము] ప్రీతిగానఁ బ్రథమదిన

మగు చతుర్థియ దుండ్రముల నివేదన మొనర్తురు. గాన నాంధ్రదేశమున నాదినమున కుండ్రాళ్ళచవితి [ఉండ్రముల చవితి] యని కూడఁ బేరయ్యెను. విఘ్నేశ్వరుని "సిద్ధివినాయకుఁ" డనెదరు. మహారాష్ట్రదేశమున నెక్కువప్రచార మందియున్నది.

**విచిత్రవీర్యుఁడు:**—అత్రి చంద్ర పూరువు కురు సంతతిక్షత్రియుఁడు. తండ్రి శంతనమహారాజు. తల్లి దాశరాజు పెంపుడుకుమార్తె సత్యవతి. సోదరులు భీష్ముఁడు, చిత్రాంగదుఁడు.

భార్యలు అంబిక, అంబాలిక యనువారలు. కుమాళ్ళు అంబాలిక వలన ధృతరాష్ట్రుఁడును, అంబిక వలన పాండురాజును, వ్యాసుల తేజమున [విచిత్రవీర్య ననుమతిని] గల్గిన సంతానము.

**విజగమగోత్రము:**

(కణ్వ ఉపగణము చూడుఁడు.)

**విజయతాళము:**

(తాళములు చూడుఁడు.)

**విజయదశమి:**—కొందరు విజయదశమి పండుగను పాండవమధ్యముఁడగు నర్జునుఁడు ఉత్తరగోగ్రహణ సంగరములతో ముడిపెట్టుచుందురు. దీనిప్రారంభము శ్రీరామునిచే నొనర్పఁబడినది. సీతం గోల్పోయి వెతకుచు ఋష్యమూక పర్వతమున నారదమునిచే సుబోధితుఁడై యట శరన్నవరాత్ర దేవీపూజ నొనర్చి, దశమిదినమున ముగించి, లంకపై దాడి వెడలి విజయమందిన నాఁటినుండి నా పవిత్రదినమును 'విజయదశమి'యని వాడనారంభించిరి. శమీ (జమ్మి) వృక్ష మగ్ని సంబంధము. అగ్నియే దేవియాకారముగ యజుర్వేద మంత్రభాగ దుర్గాసూక్తమునఁ జెప్పంబడుచు నిప్పుడు మగ్నిగర్భంబని పిలువఁబడినది. శ్రీరాముం డత్తఱిని శమీవృక్షముం బూజించుట దేవీపూజలతో సంబంధించినదే కాని, యర్జునసంబంధము కానేరదు. మఱియు నిటీవలి పరిశీలనలనుండి యర్జునుని యుత్తరగోగ్రహణసంగరప్రయాణము శరదృతువునందుఁ గాదని తేలుచున్నది. ఉత్తరదేశములం దీదినమున నపరాజితా దేవీపూజ నొనర్తురు. వంగదేశమున దీనిని దుర్గా పూజ యనుచున్నారు. (శరన్నవరాత్రము చూడుఁడు.)



**విజయదశమిపూజ:**—

ఆశ్వయుజ శుద్ధదశమి. శరన్నవరాత్రములు గడచిన మరుచటిదినము. బంగాళాదేశమున దుర్గా పూజయందలి పదియవదినము. ఈదినము విజయుండని పేరుగల యర్జునునితో నేదోసంబంధము కలదిగా లోకులనియెదరు కాని యట్లు కానేరదు. దుర్గాపూజతో సంబంధముఁగలది. అపరాజితదేవి పూజ యీదినమున ముఖ్యముగ నొనర్తురు. శమీ పూజయు (జమ్మి) భేతాళ (ఆయుధ) పూజయు నొనర్చెదరు. పనివాండ్రు వారిపనిముట్లను పూజించుదురు. (పండుగలు చూడుఁడు) వ్రత దినములు చూడుఁడు.)

**విజయనందనతాళము:**—

( - - - - - చూడుఁడు.)

**విజయనగరసామ్రాజ్యము, ఆంధ్రకర్ణాటకసామ్రాజ్యము:**- విజయనగరరాజ్యము క్రీ. వె. ౧౩౩౬ సంవత్సరమునుండి క్రీ. వె. ౧౫౬౫ వఱకు రెండువందల యిరువదితొమ్మిది వత్సరము లుండిన నాంధ్రకర్ణాటకరాజ్యము. దీనిరాజధాని విద్యారణ్యనగర మను పేరున నిర్మింపఁబడి, విద్యానగరమనియు, విజయనగర మనియు ననఁబరఁగి యిప్పుడు శిథిలమగుచు, హంపిరూయి నననంబడు

చు బల్లారిమండలమున హాసుపేటకు సమీపముగ నాంధ్ర కర్ణాటకదేశములు కలయుతావున, తుంగభద్రానదీతీరమునఁ గలదు.

ఇటనేగల శివక్షేత్రమునకు విరూపాక్షక్షేత్రమందురు. అందు, పంపాపతి యనంబడు శివలింగము సుప్రసిద్ధవంతము. విజయనగరమునందే మతంగపర్వతము గలదు. తొల్లింట లంకకేగుచో నిట శ్రీరాముండు విడసిన మాల్యవంతపర్వతము కలదు. దానిపై శ్రీరామాలయము నిర్మింపఁబడి వైరాగులచే నర్చింపఁబడుచుండును. తుంగభద్రానదికవ్వల 'ఆనేగొంది' యనుకోట గలదు. అంగీపురమేలిన రాజవంశపు వారలు నైజాముడాజ్యమం దొక జమీందారుఁడుగ వసించుచున్నాఁడు. ఆనెగొంది యన ఏనుఁగులతావని యర్థము. తొల్లింట నిది కిష్కింధాపురమట. ఇటకుఁ గతిపయ దూరమున ఋష్యమూకపర్వతమును, పంపాసరోవరమును గలవు. ఇవి రామాయణమునఁ బ్రశంసింపఁ బడినవి.

ఈవిజయనగరమంతయు నిప్పుడు పాడుపడి యుండుటఁ గానవచ్చెడిని. ఇది రాజధానిగ యాదవవంశక్షత్రియు లనంబడిన సంగమరాజ పుత్రులు హుక్కరాజు బుక్కరాజు నీరాజ్యము స్థాపించిరి. క్రీ. శ. ౧౩౩౬ హుక్కరాజు మొదటిహరిహర రాయలనుపేరుస మొదటిప్రభుం డయ్యెను. బుక్కరాజు యువరాజుగ నుండెను. వీరికడ వేదభాష్యము నద్వైతపరమున రచించిన శాయణాచార్యుండును, ఆయన యన్నగారగు మాధవాచార్యుండును రాజతంత్రనిర్వాహకులుగ నుండిరి. మాధవాచార్యుండు పరాశరస్మృతికి మాధవీయవ్యాఖ్య రచించినవాఁడు. ఆయనయే ప్రధానమంత్రిగ నుండినవాఁడు. పిదపఁ గొంతకాలమునకుఁ దాను తుర్యాశ్రమము స్వీకరించి విద్యారణ్యస్వామి యను పేరంబరఁగుచు యతియయ్యు భూపతికోర్కెమేరకు ప్రధానమంత్రిత్వము వీడక రాజకార్యముల నడుపుచుండెను. రాజధానిపురమును తొలుత నాయతిపేరునే విద్యారణ్యనగరమని పేరిడఁబడెనుగాని, మఱికొంతకాలమున కది విజయనగర మనా నామక నందె నఁట.

మొదటి హరిహరరాయలకుఁ బిదప బుక్కరాజు ప్రభువయ్యెను. ఈయనకు మూరురాయరగండ, పరరాయభయంకర, భాషగేతప్పు పరరాయరగండ, హిందూరాయసురత్రాణ యనుబిరుదము లుండెనఁట. ఇట సురత్రాణ యన సుల్తానని యర్థమఁట. ఈయన మతసహనముఁగల రాజనతిఁడని చెప్పఁబడినవాఁడు. ఈయనకుఁ బిదప నీయనసుతుఁడు రెండవహరిహరరాయలు రాజ్యమునకు వచ్చెను. ఈమహనీయుఁడు క్షేత్రములందెల్ల షోడశమహాదానములు చేయుచుండినవాఁడని ప్రఖ్యాతిగలదు. ఈయనకాలమున రాజ్యము కర్నూలునద్ద కృష్ణానది మొదలు తంజావూరుమండలములోని కుంభకోణముదనుక వ్యాపించెనని యు, కేరళ, తులువ, తెలుఁగు దేశములు తనరాజ్యమునకుఁ జేర్చుకొనినవాఁ డనియు శాసనముల వలనఁ దెలియుచున్నది. ఈతను ౫౬ జయస్తంభములు వేయించెనఁట. క్రీ. శ. ౧౪౦౪ సంవత్సరమున నీభూపతి మరణించెను.

పిదప నాతనిసుతుండు రెండవబుక్కరాయలు సింహాసనమెక్కెనుగాని, యీతఁడు ౧౩ నెలలు మాత్రమే జీవించి మృతినొంద, నాతని సవతితమ్ముండగు ప్రతాపదేవరాయలు రాజయ్యెను. ఈయన పట్టాభిషేకము క్రీ. శ. ౧౪౦౬ సంవత్సరము నవంబరు, ౭ శుక్రవారమని యొకశాసనమునఁ గలదు.

విజయనగర...సామ్రాజ్యము

ప్రతాపదేవరాయలకుఁ బిదప నాయన సుతుఁడు విజయరాయలు రాజయ్యెను గాని, యతిస్వల్ప కాలముననే మృతినంద నాతనిసోదరుఁడు ప్రౌఢదేవరాయలు రాజ్యమునకు వచ్చెను. ఈయన గజబెంటెకర యను బిరుదమువహించిన యేనుఁగులవేఁటకాఁడని చెప్పఁబడినది. ఈయనకాలమున క్రీ. వె. ౧౪౨౦ సంవత్సరమున నికోలోకోన్టి యనఁ బరఁగిన పెర్శియారాయబారియు, క్రీ. వె. ౧౪౪౦ సంవత్సరమున అబ్దుల్ రజా కనంబడిన యాత్రికుఁడును వీరియాస్థానమునకేగి సన్మానింపఁ బడి వీరిచరిత్ర వ్రాసికొనిరి. అందు ధన పుర సౌందర్య వాణిజ్య విశేషములు చక్కఁగ వివరింపఁబడినవి.

ప్రౌఢదేవరాయల కాలమున వీరిరాజ్యమున కుత్తరఁపుటెల్లకృష్ణానదిగను, దక్షిణఁపుటెల్లకన్యాకుమారియగ్రముగను, వ్యాపించియుండుటఁ జెప్పఁబడినది. ఈతను క్రీ. వె. ౧౪౪౬ మేనెల ౧౪ ఆదివారమున గతించెను.

పిదప రాజ్యమునకువచ్చిన మల్లికార్జునదేవరాయలును, ఆతనికిఁ బిదప ప్రభువైన ఆయనసోదరుఁడు విరూపాక్షదేవరాయలును, చాల బలహీనులగు ప్రభువులు. క్రీ. వె. ౧౪౮౪ సంవత్సరమున విరూపాక్షనృపుని, ఆయన సైన్యాధిపతి తుళువవంశనరసింహరాజు చంపి, తానురాజయ్యెను. ఇంతటితో మొదటిరాజవంశమగు సంగమరాజ వంశపాలనము ముగిసెను.

తుళువ నరసింహరాజు సాలువవంశస్థుఁడు గాన నింటినుండి రాజవంశమునకు సాళువవంశ రాజులని పేరయ్యెను. సాళువ నృసింహరాజు క్రీ. వె. ౧౪౮౬ మొదలు క్రీ. వె. ౧౪౯౩ వఱకు పాలించి, మృతుఁ డయ్యెను. పిదప క్రీ.వె. ౧౪౮౬ మొదలు క్రీ. వె. ౧౪౯౬ వఱకు నర్సింగరాయ ఒడయరు పాలించి మృతినొంద, నావంశము నవ్వలందోసి యాతనిసైన్యాధిపతి నరసరాజు లేక నరసింగరాజు సింహాసన మెక్కెను. ఇంతటి నుండి యీరాజవంశమునకు నర్సింగరాజవంశమని పేరుఁగల్గెను. వీరిది తుళువవంశమే నందురు గాని, అట్టివాడుక గలుగలేదు. వీ రింటిపేరు సంపతి రాజువారని యిటీవలఁ జాటుధారపద్యములధోరణి నుండి పోల్పఁబడుచున్నది.

ఈసంపతిరాజు నర్సరాజుపాలనమున రాజ్యము తూర్పుసీమలు, పడమటిసీమలు నెల్లలుగఁగల్గి దక్షిణమున కన్యాకుమారియగ్రమాదిగ నుత్తరమున నెక్కుడదూరము వ్యాపించినటుల తెలియుచున్నది. ఈతఁడు రామేశ్వరమున షోడశమహాదానము లతివైభవముగ నొనర్చెనని శాసనము కలదు. ఈయన పరిపాలనము క్రీ. వె. ౧౪౯౬ మొదలు క్రీ. వె. ౧౫౦౩ వఱకు ననఁగా నేడు సంవత్సరములని చెప్పఁబడినది. పిదప నీతనియగ్రసుతుఁడు వీరనృసింహరాజులు రాజ్యమునకు వచ్చెను. ఈతనికి భుజబలరాయుఁడని బిరుదముండెనఁట. ఈతఁడు మహాదాతయనియు, నీయనకాలమున రాజ్యమింకను వ్యాపించినదనియుఁ జెప్పఁబడినది. ఈతఁ డాఱుసంవత్సరములు రాజ్యపాలనమొనర్చి క్రీ. వె. ౧౫౦౯ సంవత్సరమున మృతినందెను.

పిదప సుప్రసిద్ధుఁ డగు శ్రీకృష్ణరాయసార్వభౌముఁడు రాజ్యాధిపత్యమునకు వచ్చెను. ఈతఁడు భుజబలరాయుని సవతితమ్ముఁడు. ఈయన పట్టాభిషేకము క్రీ. వె. ౧౫౦౯ ఫిబ్రేవరి లేక మార్చి నెలలని లెక్కింపఁబడినది. ఈయన గొప్ప చక్రవర్తి. బలాఢ్యుఁ డగు భూపతి. మహాశూరుఁడు. మహావీరుఁడు. ఎక్కువయుత్సాహశక్తిగల

వాఁడు. అతిసరసహృదయుఁడు. దయామయుఁడు. గొప్ప రాజనీతిజ్ఞుఁడు. విద్యల నభివృద్ధిపఱచిన వాఁడు. భాషాభిమాని యని చెప్పఁబడినవాఁడు. ఈయన 'ఆముక్తమాల్యద' యనుపద్యకావ్యము రచించినకవి. అల్లసాని పెద్దనామాత్యాది మహాకవుల గారవించి, మనుచరిత్రాది మహాగ్రంథములను రచింపఁజేసి, కృతినొందినవాఁడు. పెక్కుయుద్ధము లతిసాహసముగ నొనర్చి జయమంది శత్రువుల నడంచివేసినవాఁడు. నదుల కానకట్టలు కట్టించి, కాల్వలుద్రవ్వించి వ్యవసాయ మభివృద్ధిపఱచినవాఁడు. జనరంజకముగఁ బరిపాలనము నెఱపి శాంతిని నెలకొల్పి వ్యాపింపఁజేసినవాఁడు. తన ప్రజల వేర్వేఱుమతముల కొఱకరివలనఁగాని తనవలనఁగాని యెట్టిచిక్కులుగకుండఁ బాలననెఱపిన వాఁడు. మహాసైన్యవైభవోపేతుఁడు.

ఈయనకాలమున పోర్చుగలుసేనాని నన్నిజ్ అను నాతఁ డొకప్పు డీయనయాస్థానమునం దుండుటయేగాక, ఈయనతో నొకయుద్ధమునందుండి యీచరిత్ర వ్రాసియుంచెను. పోర్చుగలుదేశస్థుఁ డొకడు డోమింగస్ పేస్ అనఁబడునాతఁడు వేఱొకప్పు డీయనం దర్శించి, సన్మానింపఁబడి, రాజధానిచరిత్రను విపులముగ వ్రాసెను. అదియే ప్రధానాధారముగఁగైకొని తన 'Forgetten Eupire' అను విజయనగర సామ్రాజ్యచరిత్రను తాను వ్రాయఁగల్గితినని Robert swell గ్రంథకర్త వ్రాసియున్నాఁడు. ఈతఁడు క్రీ. శ. ౧౫౩౦ సంవత్సరమున మరణించెను. ఈతనిపరిపాలన మిరువదిరెండుసంవత్సరముల కాలము.

శ్రీకృష్ణరాయునిసోదరుఁడగు నచ్యుతరాయలు పిదప రాజ్యాధిపతియయ్యెను. ఈతఁడు మహాదాత యని పేరందినవాఁడు. ఈతనిపాలనమున క్రీ. శ. ౧౫౩౫ సంవత్సరమున నానందనిధి యనుపేరున, తనరాజ్యమందంతటను శాఖాస్థానములతో నొకబాంకి [ధనాగారము] స్థాపించి, వర్తకుల కుత్తేజముఁ గల్గించినవాఁడు.

అచ్యుతదేవరాయలకుఁ బిదప నాయనసోదరపుత్రుఁడు సదాశివరాయలు రాజ్యాధిపతియయ్యెను. ఈతఁడు బాలుఁడై యుంట ప్రధానమంత్రియు, సైన్యాధిపతియు నగు రామరాజు రాజ్యకార్యనిర్వహణ మొనర్చుచుండువాఁడట. ఈ రామరాజు తాళికోటయుద్ధమున గోల్కొండ బిజాపూరు నవాబుల ఐక్యసైన్యముతోఁబోరి నిహతుఁడుకాఁగా సామ్రాజ్యము విచ్ఛిన్నముగాఁ గొడఁగి క్రీ. శ. ౧౫౬౫ సంవత్సరమున నంతమొందెను.

## విజయ (విద్యా లేక విద్యారణ్య) నగరము:

—తొల్లింటి విజయనగర (ఆంధ్ర కర్నాటక) సామ్రాజ్యమునకుఁ బ్రధాననగరము. తొలుత విద్యారణ్యయతిపేర నిర్మింపఁబడి విద్యానగరముగను, విజయనగరముగను, పేరుమాఱినది. తుంగభద్రానదీతీరము. ఇప్పుడు బళ్ళారిమండలమున హాస్పెటకడనున్న పాడుపడిన నగరము.

(విజయనగరసామ్రాజ్యము చూడుఁడు.)

విశాఖపట్టణమండలమున నొకవిజయనగరము కలదు. ఇది జమీందారీస్థానము. ఇచట సంస్కృతవిద్య కొంతవ్యాపకముఁ గల్గియున్నది.

## విజయుఁడు:

—అత్రిసంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. ఆమవసువు కుమారుఁడు. మఱియు నర్జునకును (పాండవమధ్యముఁడు) విజయుఁడను పేరుకలదు.

సింహలద్వీపమునకు దండయాత్ర వెడలి యట రాజ్యస్థాపనమొనర్చుకొని, స్థిరపడి రాజ్యమేలిన...

 విజయరంగ చొక్కనాధుని...ప్రకటనలు

చెప్పఁబడిన విజయుఁడనుభూపతి యొకఁడు కలఁడు. ఈతఁడు తొల్లింట తామ్రలిప్తిపురమునుండి వచ్చి నటులఁ జెప్పఁబడినది.

## విజయరంగ చొక్కనాధుని కులబంధువులంగూర్చిన ప్రకటనలు:—

శ్రీవిజయరంగ చొక్కనాధుఁడు దక్షిణదేశమునందు మధురలో రాజ్యమేలినప్రభువు. చంద్రవంశక్షత్రియులగు నాంధ్రకర్ణాటకసామ్రాజ్యాధిపతులకు బంధువు. తెలగాలయందు, కోటవారు, లేక దేశబలిజవారనంబడువారు ౧ రాజబంధువులు, ౨ మహాబంధువులు, ౩ గోష్టిబంధువులు, ౪ బహుబంధువులు నని నాల్గుతెగలుగను, వారి యింటిపేర్లతో విజయరంగచొక్కభూపతి శ్రీరంగమున రంగనాథస్వామివారి సన్నిధిని నల్వురంగూర్చి నాల్గుప్రకటనములు గావించెనని చెప్పఁబడినది.

౧ రాజబంధువులు:— ౧ గరికపాటివారు. వీరు (విజయరంగచొక్కనాథ) నాయని వారనియు ననంబడుదురు. ౨ అల్లూరివారు. వీరు 'అమ్మకుమారు' లనఁబడుదురు. (వీరు తంజావూరు ప్రభువగు విజయరాఘవ) నాయనివారనియు ననఁబడుదురు. ౩ నెదుంగుంద్రమువారు, ౪ చింతలపురివారు. (వీరు శ్రీఖండమహారాజు గారివారు), ౫ బండ్లపేటవారు, ౬ పాలపాటివారు, ౭ పట్టఁపువారు, ౮ పగడాలవారు, ౯ సెట్టివారు, ౧౦ ధనసెట్టివారు, ౧౧ నెలికోట లేక తుతాకులవారు, ౧౨ కటివారు, ౧౩ జగదేవవారు, ౧౪ సవరము, ౧౫ కరివేటి, ౧౬ కంచి, ౧౭ గంధపురము, ౧౮ కడియాల, ౧౯ ఆసూరి, ౨౦ శ్రీపతి, ౨౧ చెంజి, ౨౨ వజ్రాల, ౨౩ నిమ్మడి, ౨౪ నీలకంఠము, ౨౫ జేగల, ౨౬ బిరుదు, ౨౭ నాయకులము, ౨౮ విజయము ౨౯ నరావారు, ౩౦ భాండారము, ౩౧ మంచాపాత్రము, ౩౨ మునగలపేట, ౩౩ అంజేటి, ౩౪ దళవాయి, ౩౫ తియ్యారి లేక చిత్రాలవారు, ౩౬ చంద్రగిరి, ౩౭ పురము, ౩౮ పర్వతము, ౩౯ ఉదయగిరివారు, ౪౦ బంతికట్టువారు.

ఈనలువది కుటుంబములవారికి రాజబంధువులనియు, రాజశ్రేష్ఠులనియు, ఏలినవారనియుఁగూడ బిరుదనామములుకలవఁట. వీరియందు సేవకావృత్తి నిషేధ మందురు. వీరు వెండినగలను ధరింపరఁట.

౨ మహాబంధువులు:— ౧ పైడియావులవారు, ౨ బంగారుకత్తివారనెడి గరికపాటివారు, ౩ మొండుగుట్టల, ౪ బ్రహ్మముడి, ౫ మొనల, ౬ సాము, ౭ జవ్వాజి, ౮ ఆదివారు, ౯ దూదివారు, ౧౦ నిండుకులమువారు, ౧౧ సంపంగి, ౧౨ భారి, ౧౩ చిరత, ౧౪ జట్టి, ౧౫ పట్టెటి, ౧౬ బండపల్లి, ౧౭ అందె, ౧౮ ఆలంబాకు, ౧౯ జనకల, ౨౦ విడెము, ౨౧ గంధాల, ౨౨ అరస, ౨౩ పులిగుచ్చువారు, ౨౪ ఇంట్ల, ౨౫ కొనకా, ౨౬ గోపిశెట్టి, ౨౭ మేడిశెట్టి, ౨౮ ఏనుగుల, ౨౯ కుంచా, ౩౦ వల్లెవాటు, ౩౧ రథాలవారు, ౩౨ కత్తి, ౩౩ ముత్యాల, ౩౪ సాయనవారు, ౩౫ కాలాపురి, ౩౬ లాయరీ, ౩౭ పావాడ, ౩౮ వంగా, ౩౯ పోగుల, ౪౦ మండి, ౪౧ పూసపాటివారు.

వీరి కంకను మహాబంధువులనియు, రాజరాజేంద్రులనియు, కులశ్రేష్ఠులనియు బిరుదనామము లుండెనఁట. వీరికి వీరిబంధువులలో మొదటి మరియాదలు కలవందురు. వీరిలోని స్త్రీలకుఁ గాలిమట్టె లుండవఁట.

౩ గోష్ఠిబంధువులు— (గోష్ఠి యనఁ బురాణగోష్ఠి యనియు, వీరు భక్తులనియు భావము.)

౧ పైడిపాటి, ౨ తోట, ౩ గట్టి, ౪ గుడిమెట్ల, ౫ గవనాల, ౬ గాలి, ౭ వెలి, ౮ ఆసూరి, ౯ నంద్యాల, ౧౦ అండె, ౧౧ పుష్పాల లేక కొప్పుల, ౧౨ సీలాల, ౧౩ కీర్తి, ౧౪ సాధన లేక సాధనాల, ౧౫ పగడాల, ౧౬ పోగుల, ౧౭ ఇండ్ల, ౧౮ ముత్యాల, ౧౯ కమతము, ౨౦ సుంకర, ౨౧ మంకు, ౨౨ అరుగుల, ౨౩ ఒయ్యారంపు, ౨౪ కొలుకుల, ౨౫ చత్రి, ౨౬ కటకము, ౨౭ కనకాల, ౨౮ మన్నెంపు, ౨౯ ఒంటి, ౩౦ బీగాల, ౩౧ కరి, ౩౨ భోగిని, ౩౩ పోలురాజు, ౩౪ చందు, ౩౫ బీనాపత్రి, ౩౬ గానాల, ౩౭ రామాయణము, ౩౮ రాజునాయని, ౩౯ కొట్లు, ౪౦ కోలా, ౪౧ మారుసెట్టి, ౪౨ ఎరమచ్చ ౪౩ యరవసెట్టి, ౪౪ బిన్నమసెట్టి, ౪౫ బాలుసెట్టి, ౪౬ నెడెము, ౪౭ గొబ్బూరి, ౪౮ దళవాయి, ౪౯ కాతుల, ౫౦ చంద్రాతు, ౫౧ చల్లా, ౫౨ ఆకుల, ౫౩ నర్రా, ౫౪ ధనాల, ౫౫ తిరుమలశెట్టి, ౫౬ మానము, ౫౭ అల్లి, ౫౮ పాండురంగము, ౬౦ రమ్యపురము, ౬౧ తేకూరి, ౬౨ మేడూరి, ౬౩ మోసూరి, ౬౪ మొలక, ౬౫ నేతి, ౬౬ సొమ్ముల, ౬౭ కొత్తపేట, ౬౮ బాలునాయని, ౬౯ పున్నా, ౭౦ బండికాటి, ౭౧ ఆల, ౭౨ పసుపులేటివారు.

౫. బహుబంధువులు:— ౧ కావేరి లేక జగదేవభుజబలరాయలవారు, ౨ గునిసెట్టి, ౩ గోవు, ౪ అల్లం, ౫ ఆకుల, ౬ మహీపతి, ౭ నిజపతి, ౮ మానం, ౯ సింగంశెట్టి, ౧౦ లక్కంశెట్టి, ౧౧ బిరుసు, ౧౨ సుక్కడి, ౧౩ పెనుగొండ, ౧౪ జబ్బా, ౧౫ గాడి, ౧౬ కాలకంఠము, ౧౭ పాండురంగము, ౧౮ భానుశెట్టి, ౧౯ గంగమశెట్టి, ౨౦ పోలంశెట్టి, ౨౧ గుర్రాల, ౨౨ తూము, ౨౩ తిరుపతి, ౨౪ సింగాణి, ౨౫ ఆరణి, ౨౬ గాజుల, ౨౭ నవులూరు, ౨౮ శ్రీరామ, ౨౯ ఆవుల, ౩౦ అత్తిలి ౩౧ ఛలిపందలి, ౩౨ పాయసం, ౩౩ జక్కా, ౩౪ బాలేరావు, ౩౫ తోట, ౩౬ కోసం, ౩౭ దళవాయి, ౩౮ నిమ్మల లేక నిమ్మస, ౩౯ మేడిద, ౪౦ కుమ్మా, ౪౧ సాయన, ౪౨ భుజన, ౪౩ వగసాల, ౪౪ ముత్యాల, ౪౫ బోయన, ౪౬ అయ్యల, ౪౭ ఆంబీర, ౪౮ ముష్కర్తివారు.

ఈబహుబంధువులకు కాతు లనియు, వీరభటులనియు, హస్తినాపురంపువా రనియు, వాడుకం గలదు. ఈనాల్గుతెగలుం గాకం దక్కనబలిజవారు కొందఱు కలరు. వారి కన్యబంధువులు పేటబలిజెలని జెప్పంబడుదురంట. (తెలగాలు చూడుఁడు.)

**విజయవాడ [బెజవాడ]:**— ఇది కనకదుర్గాక్షేత్రము. కృష్ణానదీతీరము. (ఆంధ్రదేశము) ఇచటి ఇంద్రకీలాద్రి యనుపేరుగల పర్వతముపై నర్జునుఁడు తపంబొనరించుటంజేసి యతనిపేరున విజయవాడ యను వాడుకనంది నానాంటికి మాఱి, బెజవాడయై యిప్పుడు కృష్ణామండలమందున్న పురము.

**విజయసేనుఁడు:**— వంగదేశంపురాజు. (వంగదేశము చూడుఁడు.)

**విటమిన్ (Vitamin):**—నైసర్గికములైన యాహారపదార్థములందుఁ బరమాణురూపమున నుండి శరీరబలము, పుష్టి, ప్రాణలం గల్గించు ద్రవ్యమునకు 'విటమిన్' అని పాశ్చాత్యవిదులు పేరిడియున్నారు. భుజించినపదార్థ మంతయు

మును బలపఱచునది కాదనియు, నందలివిట మినులే బలమును గల్గించునవి యనియు, నిందలి యభిప్రాయము. విటమినులం గూర్చిన విజ్ఞాన మింకను పరిపూర్ణత నందలేదనియు, నింకను గొప్పగొప్పపరిశీలనలు జరుగవలసియే యున్నదని యు, పాశ్చాత్యు లనుచునేయున్నారు. ఐన నింత దనుక నెఱుఁగియున్నది. Vitamin A.- Vitamin B. 1. Vitamin B. 2. Vitamin C.- Vitamin D.-Vitamin E. అనునవి యాఱు తెగలుగ నున్నవి.

విటమిన్ A.— ఇది క్రొవ్వునందుఁ గరఁగును. పాలు, వెన్న, జున్ను, ఆకుకూరలు, గ్రుడ్లు వీటియం దుండునది. ఇంకను క్రొవ్వుఁగల మాంసములందు, చేఁపలందు, కాడ్లివరు ఆయిలునందుఁ గూడ నుండునఁట. A విటమిన్ పెరుఁగుటకుఁ దోడ్పడుననియు, నిది కేవలము లేకపోయిన బిడ్డలకు బాలపాప రోగము వచ్చుననియు ననుచుందురు. A విటమిన్‌గలతావుల దానితో విటమిన్ D గూడ నుండునని చెప్పుచున్నారు.

విటమిన్ B.—ఇది B 1 అనియు, B 2 అనియు ద్వివిధము.

విటమిన్ B. 1. ఇది నీటియందుఁ గరఁగును. ఇది లేకుండిన Beri Beri అనువ్యాధి సంభవించునని చెప్పఁబడినది. ఇది యుముక (ఊక husk) యం దుండును గానఁ బొట్టుఁదీసి విసరినమైదా (గోధుమ) పిండి, ఆడినబియ్యము (polished rice) లం దుండకపోవుననియుఁ జెప్పఁబడినది.

విటమిన్ B. 2.—ఇంచుక భేదముంట వేఱుగఁజెప్పఁబడెను గాని, యిదియు B 1 వంటిదేయగును. (పైని చూడుఁడు). విటమిన్B 2 లేకపోవుట వలన 'Pellagra' అనురోగము పుట్టునందురు. ఈరోగ మిటలీ యుత్తరభాగములందుఁ గలదఁట. (భరతదేశమున కేమియుం దెలియదు.)

విటమిన్ C.—ఇది యాకుకూరలందు, ఫలరసములందు, పప్పులందు, ధాన్యఁపుజాతులందుఁగలదఁట. ఈవిటమిన్ లేకపోయినచో లవణరక్తమనువ్యాధి కల్గునని చెప్పఁబడినది.

విటమిన్ D. సర్వసాధారణముగ విటమిన్ A తోఁ గలసి యుండునని చెప్పఁబడినది.

విటమిన్ E. ని గూర్చి యింకను పరిశీలింపవలసియే యున్నది. సరిగాఁ దెలియదు.

పదార్థముల నుడికించుట, ఊరవేయుట, నిల్వ యుంచుటలవలన విటమిన్లు బలహీనమై చెడిపోవునఁట. ఇంక నిటీవలపరిశోధన లీక్రిందిరహస్యముల బయల్పఱచినవి. 19 వ శతాబ్దమువఱకు దీనిపరిశోధనలు లేకుండెను సరిగాజరుగ సరియగు నాహారములేకుండిన తిమ్మెర, వాతము, స్కర్వీ యను రోగములు గల్గునని కనిపెట్టఁబడినది. 20వ శతాబ్దమున విశేషపరిశీలనలు జరిగెను. విటమినులారోగ్యరక్షణకుఁ దోడ్పడునవి. స్వతంత్రముగ నిరుపయోగము. విటమిను లేకున్న శరీరము శుష్కించును. అందొక్కొకవిటమి నొక్కొకవిధముగ నుపయోగించును. అందుఁ (శరీరపోషణమునకుఁ) దొడ్డది కని పెట్టఁబడినవి.

A— విటమిను పచ్చనియాకులపై సూర్యరశ్మి పడుటవలన నం దుద్భవించును. విటమినులను తయారుచేసికొనుశక్తి వృక్షజాతిది; జంతుజాతికి లేదు. ఈ. ఏ. విటమిను లెండ తగులని తీఁగలందు, దుంపలందుఁ జాలతక్కువ. ఇది చాలసేపుడికించినఁగాని చావదు. కాని, గాలికి

బహిరంగపఱచిన నశించును. ఎముకలధాతు లను వృద్ధిపఱచును. పండ్లరసమం దుండును.

B—విటమినును మొక్కలు గాలినుండియు, భూమి నుండియు, సంపాదించును. బి. విటమిను చెట్ల యాకులలోఁ దక్కువగను, గింజలలోను, కాయ లలోను, బాగుగాను నుండును. ఇంక జంతువు ల కార్జము, మెదడు, హృదయము, మూత్రకోశము, జీర్ణకోశము మొదలగు నవయవము లందు నిల్వయగునట. పాలయందుఁగూడఁ గలదు. జంతువులక్షీరమం దిది యుండును గాని, పచ్చగడ్డితినని పశువుల (ఆవుల) పాలలో నీవిటమి నుండదు. బి. యం దైదు జాతులు కలవు. B-1 లేకున్న మాంద్యముఁ గల్గించును. B-2 లేకున్న శోభి, తామర, మొ॥ చర్మ వ్యాధు లుద్భవించును. B విటమిను నరము లకు, మెదడుకు, బలముఁ గల్గించును.

C—విటమిను జొన్న, బియ్యము, కాయధాన్య ములు మొదలగు నెండినపదార్థములం దుండక పోయినను, నానఁబెట్టి, మొలక లెత్తించిన నందు, తిరిగి యేర్పడును. ఉడికించిన పోవును. జంతువులకార్జము, రక్తములం దిది నిల్వ యుండును. పండ్లరసమం దుండును. రక్త ము చిక్కఁబడును. అంటురోగములకు శరీరము లొంగకుండఁజేయును. ఆఁకలి తగ్గుట, పండ్ల యందు రక్తము కాఱుట, రక్తము తగ్గుట, కళ్ళనొప్పులు, మొదలగునవి C-విటమిను తగ్గినఁ గల్గునని చెప్పఁ బడినది.

D—విటమిను పాలు, వెన్న, నెయ్యి, Codliviroil నం దధికము. కొబ్బరినూనెలోస్వల్పము, ఇతరనూనెలలో లేదు. శరీరములపై సూర్య రశ్మిపడుటవలన నీవిటమి నుద్భవించును. ఇది లోపమైన బిడ్డలకు 'రికెట్సు' అనువ్యాధి కల్గును. భాస్వరములేకున్న పనిచేయఁజాలదు. (ఎండురోగము, పక్షిరోగము కల్గును).

E— విటమిను ధాన్యఁపుగింజలందలి మొలకల లోను, ఆకుకూరలందును, వృక్షసంబంధ తైలములందును గలదు. పరిశీలనలవలన గొడ్డు తనమును బాపునని తెలుచున్నది. A - D ల కంటె స్థిరమైన విటమిను 200 డిగ్రీల వేడి (సెంటుగ్రేడు) యందు సహా నశింపక నిలుచుననియుఁ జెప్పఁబడినది.

F - G - H - I—విటమినులున్న వని తెలియఁబడు టయే గాని, వాట్లఁగూర్చి యేమియుఁ దెలియ రాదు. ఇంకను పరిశీలనలు జరుగవలసియే యున్నది.

**విటుకుల వీరమ్మ:—** పెడసరఁపుఁ గొంకెకబురుల నదేపనిగఁ జెప్పుచుండు స్త్రీని, ఆఁడువాం డ్రిపేరున వెక్కిరింతగా ననుచుందురు. ఇది స్త్రీలయందు మాత్రమే ప్రచారమునం దున్నపదము.

**విఠలరాజు:—**

(కాచవిభుఁడు చూడుఁడు.)

**విడాకు (విడియాకు):—** వివాహసం బంధము విడిపోవుటకై వ్రాసికొనినపత్రము. తొల్లింటికాలమునఁ దాటియాకులపై వ్రాయఁ బడుటఁ బ్రచారమునం దుండినకతన నిది తాటి యాకని యెఱుంగునది. మధ్యకాలమునఁ (నిట్టి వివాహబంధ నివృత్తి కాలమునఁ) దాటియాకులపై (విడాకులు) బంధనివృత్తిపత్రములను వ్రాసి యన్యోన్య మొసఁగుతటి, పోకచెక్కలు లేని విడితమ్మలపాకులను, తాంబూలరూపకముగఁ

గూడ నిప్పించుచుండుట యాచారముగ నేర్పడియెను. ఇది మాఋమనుము లున్నకులములం దాచరణీయమై యుండెను గాన వాడుక సందినది. ఆంగ్లదేశములలోఁ గ్రైస్తవులలో నీయాచారము లేదు. కాని హైందవులలోఁ గొన్నిశాఖల యం దిది యాచారము గానున్నది.

**విడువుమంటే పాముకుఁ గోపము; కరువుమంటే కప్పకుఁ గోపము:—**
(ఆంధ్రలోకోక్తి.)

**వితండము:—**
(కథాత్రయము చూడుఁడు.)

**వితందుగోత్రము:—**
(కౌశిక గణము చూడుఁడు.)

**వితస్తానది:—**దీని నిప్పుడు 'జీలమ్' అనుచున్నారు. ఇది కాశ్మీరదేశమునఁ బుట్టి, శ్రీనగరము, బారాముల్లా పట్టణములనుండి ప్రవహించి, పాంచాలదేశమునకు దిగి, సింధునదియందు సంగమించును. (దశపవిత్రప్రవాహములు చూడుఁడు.)

**విత్తన మొకటి వేస్తే మొక్కొకటి మొలచునా?:—**
(ఆంధ్రలోకోక్తి.)

**విత్తపగోత్రము:—**
(అగస్త్యఉపగణము చూడుఁడు.)

**విత్తముకొలఁదీ విభవము, విద్య కొలఁదీ వినయము:—**
(ఆంధ్రలోకోక్తి.)

**విత్రృష్ణానది:—**మెసపొటేమియా (అస్సీరియా) దేశమునఁగల 'టైగ్రిస్' అనుపేరఁబరఁగు దేశముగఁ బోల్పఁబడినది. దీనిప్రశంస బ్రహ్మాండపురాణము 53 అధ్యాయమునఁ గలదు. శాల్మలద్వీపముగ నెన్నఁబడినదేశము.

**విదర్భగోత్రము:—**
(ఆత్రేయ గణము చూడుఁడు.)

**విదర్భుఁడు:—**అత్రి, చంద్ర, యాదవ క్షత్రియుఁడు. తండ్రి జ్యామఘుఁడు. ఈతనినుండి యీతఁ డేలినదేశమునకు విదర్భదేశమని పేరయ్యెను. పుత్త్రులు కుశుఁడు, క్రథుఁడు, రోమపాదుఁడు ననువారు మువ్వురు.

**విదర్భదేశము:—**మహాభారతమునందలి నలచరిత్రవలన విదర్భ దమయంతి పుట్టినదేశముగను, భీమభూపాలుఁ డేలికగను మన మెఱుంగుదుము. భారతకాలమునకుఁ బూర్వఁపుఁజరిత్ర.

విదర్భదేశమును భోజవంశనృపతులు పాలించినటుల నశోకచక్రవర్తి శాసనములలో నొకదాని యం దుండుటను డాక్టరు భాండార్కరుపండితుఁడు వివరించెను. జనరల్ కన్నింఘాము పరిశోధనుఁడు నర్మదానది కవ్వలనుండు భోజపాలదేశము నతియు నక్కాలమున విదర్భయందుఁ జేరిపోయి యుండెనని దెల్పెను. భీష్మకమహారాజుకాలమున విదర్భ (ఇప్పటి బీరారుపరగణా బొంబాయిలోని ఖాందేశము, నైజామురాజ్యములోని భాగము, మధ్యరాష్ట్రములలోని కొంతభాగము) కల్పుకొని యుండెనని తలంపఁబడుచున్నది. ఈతఁడు రుక్మిణీదేవితండ్రి. వాకాటభూపతియగు రెండవప్రవరసేనుని రాగిరేకుశాసనమునఁ జన్మాంకము భోజపాలదేశములోనిదిగఁ జెప్పఁబడినది. ఇప్పు డది

'చమ్మాల్' అని పిలువబడుచు నమరావతిమండలములోని, ఎలిచపూర్‌నకు నైరుతిదిశగా నాల్గు మైళ్లదూరమున నున్నది.

భీమపురమునకుం దొల్లింటిపేరు విదర్భపుర మనియు, పిదపఁ గుండినపురమై వాడుకనుండె ననియు, పిదప భీమరాజపాలనమునుండి భీమపుర మనఁ బరఁగెననియు, తేలుచున్నది. దీని కిప్పటి పేరు 'దేవల్వార్'. విదర్భానదీతీరము. విదర్భ కిప్పటిపేరు వార్ధానది, కుండినపురము, విదర్భానదీతీరము. బాందాజిల్లాలోని వరోఱాపురమునుండి దక్షిణముగాఁ బదునేకండు మైళ్లదూరమునందుఁ గలదు. ఇట రుక్మిణీదేవియాలయము కలదు. తొల్లి కుండినపురము విదర్భానది మొద లమరావతి వఱకు వ్యాపించియుండెననియు, అమరావతియందుఁగల భవానీదేవళము రుక్మిణీదేవి గౌరీతపం బొనర్చినతా వనియు, అత్తరుణముననే యామెను శ్రీకృష్ణుండు గొంపోయెననియుఁ జెప్పఁబడినది. సోమనాథక్షేత్రమునకు దనున్న ప్రభాసతీర్థమునకు నలుఁబది మైళ్ళ దూరముననున్న మాధవపురమున శ్రీకృష్ణుండు రుక్మిణిం బరిణయ మయ్యెనని చెప్పుచున్నారు. అమరావతీపుర మిప్పటికి నాపేరనే యున్నది. భోజపురము లేక భోజకటకమును నర్మదాతీరమున భీమరాజసుతుండును, రుక్మిణీదేవి సోదరుండును నగురుక్మనృపతి నిర్మింపఁజేసి దానిని తనరాజధానిగఁ జేసుకొనెనని చెప్పఁబడినది. కాని యది రుక్మిణీదేవివివాహానంతరమని తెలియఁ గలదు. అది యిప్పటిభోపాలరాజ్యమునఁ జేరి యున్నది.

**విదర్భానది [పయోష్ణి]:**- దీని నిప్పుడు 'పయిన్గంగ' యనుచున్నారు. దీనిప్రశంస భాగవతము ౫ - ౧౭ యందుఁ గలదు. ఇంకను మధ్యరాష్ట్రములందుఁ బ్రవహించు వరదానదియొక్క శాఖనుగూడ విదర్భానది యనియే యందురు.

**విదర్భనగరము:**— కుండినపురమున కీపేరుండెను.

**విదాహ (అతిదాహ) రోగము:**—శరీరమున రస (జల) భాగము తగ్గిపోవుట మొదలగు కారణములవలన నధికనీరుఁ ద్రావు వాంఛఁ గల్గించుచుండురోగము. ఇది బహుమూత్రరోగులకుఁ గల్గియుండును. వాంతిభేది (విశూచి) రోగమునందును గల్గుచుండును.

**విదిశాగిరి (భీల్సా):**—భోపాల్ రాజ్యమునందలి భీల్సాతోటలప్రదేశపర్వతము.

**విదిశాదేశము:**— వెనుక నొకప్పుడు మాళవలోని భాగమై, యొకప్పుడు భోజదేశమై, యిప్పుడు భోపాల్సంస్థానరాజ్యములోనిదై, యిప్పుడు భీల్స యనఁబరఁగుచున్న తొల్లింటి విదిశాపురప్రాంతదేశము. శ్రీరాముఁడు తనసోదరుండగు శత్రుఘ్నునిసుతుండు, శత్రుఘాతి కొసంగినరాజ్యమని రామాయణము ఉత్తర ౧౨౧ అధ్యాయమునఁ జెప్పఁబడినది. విదిశాపురము (ఇప్పటిభీల్సా) భోపాలున కీశాన్యదిశగా ౨౬ మైళ్ళు వేత్రవతీనది (ఇప్పటి బెట్వా) తీరము. ఇది యీదేశమునకే గాక యొకప్పుడు దశార్ణదేశమునకుఁ గూడ ప్రధాననగరమై యుండెను. మహాకవి కాళిదాసు తనమేఘసందేశము ౧ - ౨౫ యందు దీనింగూర్చి ప్రశంసించెను. దేవీపురాణము ౭౬ యందు విదిశాదేశంపుఁబ్రశంస కలదు. ఇప్పుడు 'బీస్' అనంబడుచున్న యీదేశమందలినదికిఁ దొల్లింటిపేరు 'విదిశావది' యని యుండెనేమో?

ఇంక నిక్కాలమున 'భీల్సాటోప్సు' అనఁ బరఁగు ప్రసిద్ధవనము లైదు కలవు. అవి క్రీ. ము

౨౫౦ మొదలు క్రీ. వె. ౭౮ వఱకు మధ్యను వేర్వేఱుకాలములందు నాటినవిగఁ బోల్చు చున్నారు. అన్నియు నిసుకపర్రదేశముల నాటఁబడినవి.

౧ సాంచివనము:— భీల్సాకు నైఋతిదిశగా నైదున్నరమైళ్ళదూరము.

౨ సోనారీవనము:— సాంచినుంచి నైఋతిదిశగా నాఱుమైళ్ళదూరము.

౩ శతధారవనము:— సోనారీనుండి మూఁడు మైళ్ళ దూరము.

౪ భోజపురవనము:— భీల్సానుండి దక్షిణాగ్నేయ దిశగా నాలుమైళ్ళదూరము.

౫ అందేరవనము:— భీల్సానుండి యాగ్నేయము గాఁ దొమ్మిదిమైళ్ళదూరము

వీట్లకు సర్వసాధారణముగ, పిపాలియా, చిజోలీ వనములని వాడుచున్నారు.

**విదిశాపురము (భీల్సా):—**

(విదిశాదేశము చూడుఁడు.)

**విదుగోత్రము:—**

(కపి ఉపగణము చూడుఁడు.)

**విదుగోత్రము:—**

(గర్గి ఉపగణము చూడుఁడు.)

**విదురాశ్వత్థము:—**మద్రాసు సదరన్ మరాఠా రెయిల్వే చిన్నలైనుపై బెంగుళూరునకు ముప్పదిమైళ్ల దూరమున హిందూపూర్ నుండి పదునొకండుమైళ్ల దూరమున (బెంగుళూరు గుంటకల్లు లైను) 'దొడ్డకురుగోడు' అని యిప్పుడు పిలువంబడు చున్నతావును తొల్లింటి 'విదురాశ్వత్థము' అని పోల్చియున్నారఁట. ఇట విదురునిచే నాటఁబడిన యశ్వత్థవృక్షము కలదని యందురు.

**విదురుఁడు:—** ధృతరాష్ట్రునిమంత్రి. అంబికయొక్క దాసియందు వ్యాసునివలనఁ గల్గిన సుతుఁడు. (ఈతనిని మాండవ్యునిశాపమువలనఁ బుడమియందు శూద్రకులమున జన్మించిన యముఁడని చెప్పియున్నారు.) ధర్మవిదుఁడు పాండవుల కెగ్గుసేయఁ దగదని పలుసారులు ధృతరాష్ట్రునకును, దుర్యోధనునకును బోధించినవాఁడు.

**విదుషుఁడు:—**ఇంద్రునికి శచీదేవియందుఁ గల్గిన మూఁడవకుమారుఁడు.

**విదూరథుఁడు:—**అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి సురథుఁడను నామాంతరముఁగల నిష్నుఁడు. కుమారుఁడు శూరుఁడు. పౌత్రులు సత్రాజిత్తు, ప్రసేనుఁడు నను వారు. అందు సత్రాజిత్తు కుమార్తె సత్యభామ. శ్రీకృష్ణునిభార్య.

**విదేహదేశము:—**

(మిథిలదేశము చూడుఁడు.)

**విదేహుఁడు లేక మిథిలుఁడు:—**

నిమికుమారుఁడు. ఈతఁ డేలినదేశమున కీతనినుండి విదేహదేశమనియు, మిథిలదేశమనియుఁ బేర్లయ్యెను. (మిథిలుఁడు చూడుఁడు.)

**విద్య, జ్ఞాన. విజ్ఞానములు:—** విజ్ఞానమన నేమో యెఱుంగుటకు విద్యంగూర్చియు, జ్ఞానముంగూర్చియుఁ గూడ నెఱుంగవలసియుండును. విద్యంగూర్చి యెఱుంగవలయును. విశ్వవిద్యాలయములు పవిత్రవంతములగు విద్యాశక్తియగు సరస్వతికి నాలయములై విద్యాలయములుగ నుండవలసియుండును. గ్రంథాలయములును విశ్వవిగనే యుండవలసియుండును. విద్యలు విశ్వవిద్యాలయముల పాఠశాలలందు నేర్పఁబడునవి. ఇంకను విద్య పుస్తకభాండాగారముల గ్రంథములందుఁ

జదివి గాని, పుస్తకములపుటలందుఁ జదివి గాని, గ్రహించునది విద్యయనియు, ఆవిద్యను దాను జక్కఁగ మననముఁ జేసి కొనుట లేక స్థిరముగ నెఱింగియుండు నెఱుకను జ్ఞానమనియు, దానిని లోకోపయోగమునకు వదలి యుపయోగపఱచి, తాను నన్యులతోఁబాటం దొకభాగస్వామియై యుండుపరిపక్వస్థితిని విజ్ఞానమనియు నెఱుంగునది. విద్యకు 'Ecucation' అనియు, జ్ఞానమునకు 'Wisdom' అనియు, విజ్ఞానమునకు 'Culture' అనియు నాంగ్లానువాదపదములుగ నున్నవి.

ఈ విద్య, జ్ఞానము, విజ్ఞానముల యంతరాయ భేదములనెఱుఁగుట కనేకసాదృశ్యములు సాధనము లగును. అందొకటి విశ్వవిద్యాలయఁపుఁబరీక్షల నుత్తీర్ణులై, గర్వాయత్తచిత్తులై కొందఱు తిరిప్పుకొనుచుండువా రుందురు. అట్టివారికి విజ్ఞానము మూయఁబడిన ద్వారముగల గదివంటిదే గాని, స్వాధీనమగునది కానేరదు. అట్టివా రందినయోగ్యతాపత్రములు (Univercity Certificates) వారికిఁ బ్రభుత్వఁపు నౌకరీలకు నర్హతల నొసంగునవి గాని, విజ్ఞానమునకు దారిఁ దీయునవి గాక పోవచ్చును. ఇట్లనుటయందు గర్వము మానవ నర్హమని మాయభిప్రాయము. విద్య విజ్ఞానమునకుఁ బ్రథమసోపాన మగుట సత్యముగాని, అదియే విజ్ఞానస్థితి కాఁజాలదు.

[illegible] పాఠశాలలందు విద్య నేర్పు నధ్యాపకులు (ఉపాధ్యాయులు) విజ్ఞానమన (Culture) నేమో యెఱింగియుండవలయును. లేనిచో వారు కేవలజీవనమునకై కుక్షింభరులుగ నుందురు గాన వారికడం జదివిన విద్యయు నట్టిదే యగుచుండును. వారిబోధలందు 'By example rather than precept' గా నుండవలయునన్న విద్యావిధానధర్మము నెల్లఱచే నంగీకరింపఁబడియే యున్నది. విద్య నభ్యసించిన పిదప జరుగఁదగినపని, దానిని మనస్సున నాటించుకొని మననముఁ జేసికొనుట యైయున్నది. ఈ గ్రహించుపనియే యాంగ్లవిద్యాధికులచే "Key to the Rialm which he seeks to enter" అని చెప్పఁబడినది. అదియే జ్ఞానభూమి, Cultural world. అట్టిపాఠశాలలు, వాటిం బరిపాలించు విశ్వవిద్యాలయములు, నెంత పవిత్రవంతములై, యెంతగౌరవనీయములై యుండవలసి యుండునో యధ్యాపకులు (ఉపాధ్యాయు లెంత పూరితచరిత్రులై కేవలకుక్షింభరమాత్రులే గాక) యెట్టివిజ్ఞానవంతులై యుండవలసియుండునో యోచించుకొనిన నది మనోగ్రాహ్యమేగాని, వ్రాయశక్యము కాని దని నిష్కల్మషహృదయులకుఁ దోఁపకపోదు. ఉద్యోగవాంఛచేఁ జదివి నేర్చుకొనువిద్య యర్హతాపత్రముల(qualification certificates) సంపాదించుటతోఁ బరిసమాప్తిఁ గల్గించునది. తక్కిన జ్ఞానవిజ్ఞానములు ప్రతిఫలముల నాసింపని పరిశుద్ధతలం గల్గినవి. వాటియందు భక్తిగౌరవము లుండుటయే వాటికిఁ బ్రతిఫలములు.

ఇంకను పాఠశాలలందు విద్యల నభ్యసించుట మనస్సులందుఁగలయభ్యసనపరిచయములపై నాధారపడియుండెడిని. "Wisdom & under standing" రెంటి కలవాటుపడుటయే. విజ్ఞానదశ [Cultural state] నందుటయై యున్నది. ఒకభూమియం దొకవిత్తనము ఫలించి వేఱొక విత్తనము ఫలింపకుండుటయు వాటి వాటిపరిస్థితులపై నాధారపడియున్నటులనే, విజ్ఞానమును మనస్సుల కలవడుటయు నలవడకుండుటయు, వాటి వాటి పరిస్థితులపై నాధారపడియుండెడిని. విద్య సంపాదించుట machanical process అనఁబడినది. దానికన్న wisdom ఎక్కువదైనది.

దానికన్నను getting understanding సర్వోన్నతమైనదిగా నాంగ్లవిద్యాధికు లనుచుందురు. స్కాట్లాండు దేశమునందలి యొక విశ్వవిద్యాలయముపు గాన్వొకేషన్ చావిడియందు బంగారు అక్షరములతో ' Wisdom is the principal thing therefore get wisdom & with all they getting get understanding' అని చెక్కబడి యున్నది. ఇది సమంజసమని తోచెడిని.

విజ్ఞానమును కట 'understanding' అని యర్థముగ గానోపు. అదియే culture అం బడును. దానియందే నిజమగుజీవనశక్తి యుండవలయును గాన నది మానవోపయోగ మగుచు, నెవ్వరు చంపజూచినను జావక నిలచియుండ గలదు. ఇం దింకను వేఱొకచిత్రము కలదు. ప్రతివానికి విజ్ఞానము దైవతుల్యమగు పవిత్రవంతమని తోచుంగాని, అది యెల్లరియందు నొకే నుండదు, దాని నెఱుంగుటకు గలబాధ్యత యెల్లరియం దొకేరీతినుండకపోవుచున్నది. కొందఱి కింకను విజ్ఞానసంపాదనవాంఛయే యుండదు.

విజ్ఞాన మన్యుల కీయక, దాచుకొనుట మానవత్వమునను హీనత యగును. అట్టివారిని లోకము గారవింపదు. అట్టివిజ్ఞానియుపయోగము లోకమునకుండదు. విజానమును కొందఱాంగ్లపండితులు 'Phylosophy of life' అనిరి. దీనికిని సాధుత్వ (నిరాడంబర) జీవనమునకును నేవిరోధము గాన్పింపదు. భరతదేశపు బూర్వకాలపు ఋషిసత్తములు నిరాడంబరజీవనము సల్పుసాధువులుగ నుండిరి. ఆడంబరజీవనము, ఐశ్వర్యాధికారయుత జీవనము సల్పిన చీనాదేశపు గాన్ఫ్యూకస్ మహాత్ముండును విజ్ఞానియే యని యెల్ల రెఱింగిన సంగతియే. ఇట్టివా రీలోకులచే గారవింపబడ దగినవారు. వీరికి స్వార్థపరత్వ మను నదియే యుండదు.

ఇంక నాత్మసంరక్షణార్థము స్వసౌఖ్యాపేక్షత్వలాలసులై ధనైశ్వర్యాదు లుపయోగించును గాన వాటింగూర్చుకొనుచు ధనవశమునకుఁజేర్చుటయే పురుషార్థముగ నెంచువారు లోకమునకు నిరర్థకజన్ములుగ నుందురు గాని యంతకన్న నధికులు కాజాలరు. పూర్వులసంతతివా రనిపించుకొనుటకు శరీరమాత్రులేగాని, అధికమేమియు వారియం దుండదు. వారియం దుండవలసిన స్వార్థపరత్వ ముండదగినదానికు మీఱిపోయియుండును. ఒక యాంగ్లవిద్యాధికుఁడు, "A Creature whose acts and possions are without any settled pattern is a natural man" అని నుడివియున్నాడు. కాని, యన్యుడప్రయత్నించుటయు, లేకయుండుటయు, వృద్ధిగాని, అర్థముగాని, ఉపయోగముగాని లేని యున్కిగా దోపక పోదు. ఈసందర్భమున Hamlets Sobloquies నందు "what is a man! If his chief good and market of his time—Be but to sleep and feed—A beast and no more—" అను ఉక్తి స్ఫురించు చుండెడిని.

ఇంక నీవిజ్ఞాన మట్టిలక్షణములం గల్గియుండునో యోచింతము గాక. ఒక్కనుప్రసిద్ధ యాంగ్ల విజ్ఞాని 'Culture gives life a solid foundation and back ground so that he is no longer an isolated figure but one unit among the millions of his own generation without any individuality of his own but a partner in a great tradition and with a spiritual relationship not only to men of his own generation—but also, to all

generations gone before—and also to all generations to come" అని నిర్వచించియున్నాఁడు. అట్టివిజ్ఞానుల నింకఁ గొందఱు "Disciplined mind-right ambitions—and balanced interests కలవానిగ వివరించిరి. ఇంకఁ గొందఱు "Nothing is to much with him" అనిరి. మఱికొందరు "One who has a true sense of Proportion' and "True sense of values" అనిరి.—కాని యీసందర్భమున రెండుసంగతులు మనస్సునం దుంచుకొనవలసియుండెడిని. అవి ౧ మన మెవ్వరికిని బానిసలము కారాదనియు, అనఁగాఁ బూర్వులు వచించినదంతయు వేదమే యని తలంపరాదని భావము. ఒక్కొకతఱి భూతకాలఁపు మూఢోక్తి వర్తమానమునకుఁ గష్టనష్టములం దెచ్చిపెట్టునని జాగ్రతఁ గొనుచుండవలసియుందును. ౨ రెండవది క్రొత్తమార్పునిసంతనే సిద్ధమగుచు నాయత్తపడుటయు, బుద్ధిహీనతయె యగును. చక్కఁగ నెప్పటికప్పుడు యోచించి నడుపుచుండుట సమంజసమగుగాక. నిజమగు విజ్ఞానమునకు నుద్రేకము విరోధి. యుద్రేకముఁ గలయూహ లపాయకరములు గావచ్చును. ఇట్టి పరిస్థితులందు విజ్ఞానము దుష్ప్రయోగ మొనర్పఁబడినదగుచుండును. విజ్ఞానము (Cultuer) నకు "Hall mark is sympathy and not arrogance" అని యొక యాంగ్ల లోకోక్తి కలదు.

ఒక్కొకతఱి గ్రంథములందున్నదు, తనయోచనకుఁ గుదిరినను, అన్యులమనస్సులకు బాధఁ గల్గించు విజ్ఞానము నిరర్థకమైనదని మనస్సునందు మఱువరాదు. ఒకసంగతియందుఁగుమరువిజ్ఞానము వేఱొకసంగతికిఁ గుదరకపోవచ్చును. అట్టి విజ్ఞానమును నిష్ప్రయోజకవిజ్ఞానమే యగుగాక. లోకమునఁదలి మానవచరిత్రలు వాటికి వలయు విజ్ఞానవిధానముల బోధించెడిని. అది విజ్ఞానముల ప్రవాహమే గాని, వేఱుకాదు. దానిం బాటింపక కాలముఁ గడచుచున్నదనునెపమున క్రొత్తక్రొత్త మార్పులకుఁ గడంగుట అనఁగా మూలకారణముల నరయ సాహసించుట దోషవిజ్ఞాన మయ్యెడిని. వలయుమార్పులం జేయకుండుట యనాచారము వంటిది. పట్టుదలతో, మార్పుల బలాత్కరించు టత్యాచారదోషమువంటిది యగును.

ఈసందర్భమున పరమార్థమగుమాట విద్యాభ్యాసము పాఠశాలలందే కాదనియు, జన్మకాలము నుండి జీవితకాలమంతటను లోకానుభవముల నుండి గ్రహించుచుండుట నిజవిజ్ఞానమునకు సులభమార్గ మనియున్నె యుండిన నుండుంగాక. పుస్తకములు విజ్ఞానమునకుఁ దాళఁపుఁజెవిగా మున్ను దెలిపియే యుంటిమి. ఈసందర్భమున లండనుపుస్తకభాండాగార నిర్మాణసందర్భమున సభయందు Thomas carlyle పండితుని మహోపన్యాసభాగము నిట నాంలనే యాంగ్లమున వివరించి ముగించుట సమంజసముఁగాన నట్లొసర్తుము. అది సుప్రసిద్ధోపన్యాసము.

"Every one able to read a good book—becomes a Visor man—he becomes a similor centre of light—order— and just insight into the things around him—a collection of good books—contains all the nobleness, and wisdom of the world before us— every heronic and Victorious soul has left his stamp upon it— a collection of books is the best univercity of all univercities— Univercity teaches to read books— and one must go to the book for what it is worth."

## విద్యలు:—

అష్టాదశవిద్యలు [పదునెన్మిదివిద్యలు.]

వేదములు ౪ :—౧ ఋగ్వేదము, ౨ యజుర్వేదము, ౩ సామవేదము, ౪ అధర్వణవేదము.

వేదాంగములు ౬ :—౧ శిక్ష, ౨ వ్యాకరణము, ౩ ఛందము, ౪ నిరుక్తము, ౫ జ్యోతిషము, ౬ కల్పము [విధానము.]

వేదోపాంగములు ౪ :— ౧ మీమాంసాశాస్త్రము, ౨ న్యాయశాస్త్రము, [తర్కము], ౩ పురాణము (౩౬ పురాణములు) ౪ స్మృతి (౩౬ స్మృతులు).

ఉపవేదములు ౪ :—౧ ఆయుర్వేదము (వైద్యశాస్త్రము), ౨ అర్థశాస్త్రము, ౩ ధనుర్వేదము, ౪ గాంధర్వము (సంగీతశాస్త్రము).

శ్లో॥ ఆయుర్వేదో ధనుర్వేదో నీతిశాస్త్రార్థ శాస్త్రయోః। వేదాంగానిచ వేదాని మీమాంసా న్యాయవిస్తరః। ధర్మశాస్త్రం పురాణంచ విద్యాహ్యష్టాదశా యితి॥

౧ ఆయుర్వేదము (వైద్యవిద్య), ౨ ధనుర్వేదము, (విలువిద్య), ౩ నీతిశాస్త్రము, ౪ అర్థశాస్త్రము (Economy), ౫-౬-౭-౮-౯-౧౦ వేదాంగము లారు, ౧౧, ౧౨, ౧౩ ౧౪, వేదములు నాలుగు, ౧౫, మీమాంసాశాస్త్రము, ౧౬ న్యాయశాస్త్రము, ౧౭ ధర్మశాస్త్రము, (స్మృతులు), ౧౮ పురాణము (పురాణకథాజ్ఞానము).

చతుర్దశవిద్యలు:—[౧౪]

౧ ఋగ్వేదము, ౨ యజుర్వేదము, ౩ సామవేదము, ౪ అధర్వణవేదము, ౫ శిక్ష, ౬ వ్యాకరణము, ౭ ఛందము, ౮ నిరుక్తము, ౯ జ్యోతిషము, ౧౦ కల్పము, ౧౧ మీమాంస, ౧౨ న్యాయశాస్త్రము, ౧౩ ధర్మశాస్త్రములు ౧౪ పురాణములు వీట్లకుఁ జతుర్దశవిద్య లని పేరు.

చతు [చౌ] షష్టి [౬౪]విద్యలు, వీట్లను చౌషష్టికల లందురు.

౧ వేదవిద్య—చతుర్వేదములునని భావము.

౨ వేదాంగములు—శిక్ష, వ్యాకరణశాస్త్రము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము.

౩ ఇతిహాసవిద్య — అన్నియితిహాసములు నని భావము.

౪ ఆగమము — అన్నియాగమధర్మములు నని భావము.

౫ న్యాయము - న్యాయశాస్త్రము.

౬ కావ్యము - కావ్యజ్ఞానమనిభావము.

౭ అలంకారములు - అలంకారశాస్త్రము.

౮ నాటకములు - దశవిధరూపక (నాటకకలా) జ్ఞానము.

౯ గానవిద్య - సంగీతశాస్త్రము.

౧౦ కవిత్వము - కవిత్వమునకు వలయునని సర్వ [జ్ఞానము].

౧౧ కామశాస్త్రము.

౧౨ ద్యూతనైపుణ్యము.

౧౩ భాష [దేశభాష స్వభాషలయందుఁ గల నేర్పు].

౧౪ లిపి, కర్మ - [దస్తూరీ, చిత్రకర్మ మొదలగునవి].

౧౫ వాచకము - వాగ్ధోరణి. మాట లాడు నేర్పు.

౧౬ అవధానము - [శ్రద్ధగల్గియుండు నేర్పు] గ్రాహ్యశక్తి.

౧౭ స్వరశాస్త్రము - సూర్యచంద్రాదినాడీ జ్ఞానము.

౧౮ గారడీ.

౧౯ సాముద్రికము - చేతిరేఖలం జూచి ఫలములు నుడువుట.

౨౦ రత్నపరీక్ష.

౨౧ స్వర్ణపరీక్ష.

౨౨ అశ్వలక్షణపరీక్ష - (గుఱ్ఱముల సుడుల నెఱుంగుశాస్త్రము).

౨౩ గజలక్షణపరీక్ష - (ఏనుఁగులందలి సామాదిజాతుల నెఱుంగు జ్ఞానము.)

౨౪ మల్లవిద్య - కసరత్తు, దండెములు, కుస్తీ మొదలగువిద్య.

౨౫ పాకవిద్య - (వంటనేర్పు).

౨౬ దోహదవిద్య - పెంచుటయందు నేర్పు.

౨౭ గంధవాదము - (వాసనఁజూచి వస్తువు నెఱుంగు నేర్పు).

౨౮ ధాతువాదము - (రంగుం జూచి వస్తువుల మంచితనము నెఱుంగు నేర్పు).

౨౯ ఖనిజవాదము.

౩౦ రసవాదము.

౩౧ అగ్నిస్తంభనము.

౩౨ జలస్తంభనము.

౩౩ వాయుస్తంభనము.

౩౪ ఖడ్గస్తంభనము.

౩౫ వశ్యము - (ఇతరులను స్వాధీనమగునట్లుఁ జేసుకొనుట).

౩౬ ఆకర్షణవిద్య - (రప్పించుకొను నేర్పు విద్య).

౩౭ మోహనము - (రంజింపఁజేయు నేర్పు).

౩౮ విద్వేషణము - (కలహముఁ గల్గించు నేర్పు).

౩౯ ఉచ్చాటనము - (వెడలఁగొట్టు నేర్పు).

౪౦ మారణము - (నశింపఁజేయు నేర్పు).

౪౧ వాణిజ్యము - (వర్తకమునందలి నేర్పు).

౪౨ పశుపాలనము - (గోదోహనము, పశువైద్యము మొ॥ నేర్పు).

౪౩ కృషి - (వ్యవసాయమునందలి నేర్పు).

౪౪ యుద్ధశాస్త్రము.

౪౫ మృగయ - (వేఁటాడు నేర్పు).

౪౬ రతికౌశలము.

౪౭ అదృశ్యకరణము - (దాఁచుట, దాఁగుట, మొ॥ నేర్పు).

౪౮ ఉద్యోతకరణము - (బయటఁబెట్టి యందఱకు నచ్చునటుల నెల్ల రెఱుంగఁ జేయు నేర్పు) లేక విద్య.

౪౯ చిత్రక్రియ - (చిత్రించుట, నగిషీపని యని భావము).

౫౦ లోహక్రియ - (లోహములతో వస్తువులంజేయు నేర్పరితనము).

౫౧ పాషాణక్రియ - (రాతితోఁ జూపు శిల్పనైపుణి).

౫౨ మృత్క్రియ - (మట్టితోఁ గుండలు, బొమ్మలు మొ॥ చేయునేర్పు).

౫౩ దారుక్రియ - (కఱ్ఱతో వడ్రంపుఁబనిఁ జేయు నేర్పు).

౫౪ వేణుక్రియ - (మేదరిపని, వెదురుతోఁ జేయునేర్పు).

౫౫ చర్మక్రియ - (తోలుతోఁ జేయు 'గొడారిపని).

౫౬ అంబరక్రియ - బట్టలనేతపనిలో నేర్పు లేక (విద్య).

౫౭ చౌర్యక్రియ - దొంగతనము (విద్య).

౫౮ ఓషధీసిద్ధి - ఓషధులు (మూలికలు) ఔషధములు మొ॥ నేర్పు. వాట్లతో రోగములం గుదుర్చు వైద్యవిద్య.

౫౯ మంత్రసిద్ధి - (మనోబలమువలన నన్యుల రోగములం గుదుర్చు విద్య లేక నేర్పు.)

౬౦ స్వరవంచనవిద్య - వినువారలకుఁ దా ని తరులస్వరముతో మాట్లాడుచు వారు పలుకు చున్నటుల భ్రమఁ గల్గించు నేర్పు.

౬౧ దృష్టివంచనవిద్య.

౬౨ అంజనవిద్య - కాటుకలుపెట్టి, నేత్ర వైద్య మొనర్చు విద్య.

౬౩ జలప్లవము - ఈఁతఁ గొట్టు నేర్పు లేక [విద్య.]

౬౪ వాక్సిద్ధి - శాపానుగ్రహశక్తి. [తానన్న మాట జరుగునట్లుఁ గార్యము నడుపు విద్య.]

ఇంకను నిట్టివిద్యలు మతాంతరభేదములచేఁ బదునొకండు వచ్చెడిని. అవి నయస్తంభనము [వార్థక్యము] గానీయక మఱుగుపఱుచు విద్య, ౨ ఇంద్రజాలము, ౩ కాలవంచనము, ౪ శకున జ్ఞానవిద్య, ౫ పరకాయప్రవేశవిద్య, ౬ బహుభాషావిజ్ఞానవిద్య, ౭ పాదుకాసిద్ధి, [దనయిచ్ఛవచ్చిన తావున కప్పుడే [ఆకాశగమన] మెగురఁగల్గియుండు విద్య], ౮ అనుక్రియ, ౯ మణిసిద్ధి [మణుల మహిమల నెఱింగి, వాట్లవలన విషదోషములు మొదలగునవి హరింపఁజేయు విద్య], ౧౦ ఆసనకర్మ, ౧౧ వాక్స్తంభనము [ఇతరులను పల్కనీయకుండ వాగ్బంధన మొనర్చువిద్య.]

**విద్యాధరలు:—** దేవతలలో నొకతెగ వారు. మూలికాంజనాది విద్యల నేర్చినవారు. జీమూతవాహనుఁడు విద్యాధరులలోనివాఁడు.



**విద్యానగరము:—** (జీర్ణ) విజయనగరము. (ఆంధ్రకర్ణాటక సామ్రాజ్యము చూడుఁడు.)

**విద్యానందము:—**

(ఆనందములు చూడుఁడు.)

**విద్యాభ్యాసరహస్యము:—** విద్యాశబ్దము విద్, వేత్ ఎఱుంగుట యనంబడు ధాతుసంజాతము. ఎఱుంగుట యన నదివఱకే యుండిన విజ్ఞానము నెఱుంగుటయే యగును. సృష్టికిఁ బిదప పరమేశ్వరుని చిల్లక్షణ మొకతెఱఁ విజృంభింపము లోకమునకుఁ గల్గెను. లోకమున కన జీవించి యున్న సమస్తజంతుజాలమునకుఁగూడ నొకరీతిఁ గల్గెను. ఇది చైతన్యవిజృంభణమూలమున జాగ్రతఁగల్గుటతోఁ బ్రారంభమై, విజ్ఞానముగఁ బరిణమించెను. కొందఱు దీనిని పూర్వానుభూతివలనఁ గల్గెనందురు గాని నిజమున నైసర్గికముగనె గల్గెననుటయే సమంజసము.

వివేకానందస్వామి యొకతఱి "Education is the manifestation of the perfection already in man" అని వివరించి యున్నాఁడు. ఇదియే నిజమగు విద్యాభ్యాస రహస్యమని పెక్కండ్రు నుడివియున్నారు.

కాలముఁ గడచినకొలఁది విద్యలనేకములుగ విభజింపఁబడుచు, నేఁటికి వేలకొలఁదిగ నై యున్నవి. శిష్యునకన్నఁ దా నధికముగ నెఱింగిన విజ్ఞానము వానికిఁ గఱపుటకు గురుఁ డొనర్చు పనియును, గురుఁడు తనకుఁ గఱపి బోధించిన దానిని తా నలవడఁ జేసికొనుట, శిష్యుఁడు విద్యాభ్యాస మొనర్చుటయు నై యున్నది. ఇదియే దీని నిజతత్వము. బాలుర కిది యేదో యొక

భావయు, ఆభావయందలియక్షరములు నేర్పుటతోఁ బ్రారంభమై, విశ్వవిద్యాపీఠఁపు (యూనివర్సిటీ) బనిగాఁ బరిణమించుచు, పాఠశాలలు, కళాశాలలుఁ జేయుచుండుపనిగ నేర్పడియున్నది.

**విద్యారేఖ:—** [పురుషసాముద్రికము చూడుఁడు - స్త్రీసాముద్రికము చూడుఁడు].

**విద్యుచ్ఛక్తి (Electrical) ప్రధాన అధమపరిమాణములు (Units) యూనిట్లు, సంజ్ఞలు:—**

Ohm ఇది Resistance యొక్కపరిమాణము సంజ్ఞ R

Ampere ఇది Current యొక్క పరిమాణము సంజ్ఞ C

Volt Electric motive Force యొక్క పరిమాణము సంజ్ఞ E

Coulomb ఇది Quantity యొక్కపరిమాణము సంజ్ఞ Q

Farad ఇది Capacity యొక్కపరిమాణము సంజ్ఞ K

Watt ఇది Power యొక్కపరిమాణము సంజ్ఞ Pw

Gou ఇది Work యొక్కపరిమాణము సంజ్ఞ W. J.

వీట్లకు 'Electrical units' అని పేరు.

**విద్యుద్దేహులు:-** విద్యుచ్ఛక్తి సంపూరితమగు వస్తుసముదాయ మెంత ప్రమాదకరమైనదో, అంత ప్రమోదకరమైనదే. ఈవిద్యుద్దేహసందోహములుగూడ విద్యుచ్ఛక్తి నభ్యాసవశమునఁ దమయందు దవహితముఁ జేసికొని, అవసరము వచ్చినపు డెల్లఁ దచ్ఛక్తిని వినియోగించు నాచారమును, అలవాటును, దేవతానీకమునకును, మానవావళికినిఁ గూడఁ గలదు. అట్లే రాక్షసవర్గమునకుఁ గూడ. విద్యుజ్జిహ్వుఁడును, విద్యుత్కేశుఁడు మొదలగువారు కలరనియు,వా రెన్నెన్నియో యద్భుతకార్యము లొనర్చుచుండిరనియు, శ్రీమద్రామాయణమున వాల్మీకి మహర్షి చెప్పియుండెను.

ఇట్లే జర్మనీదేశమున 1914 సంllరఁపు జర్మనీమహాసంగ్రామమునకుఁ గొంచెముపూర్వము [అనగా 1912 సంllరమున] 'జార్జి బెర్నార్డు స్టూవార్డు' అను వైద్యుతికవేత్త యొకఁడు భార్యాసహితుఁడై తమయం దీవిద్యుచ్ఛక్తి నభ్యాసమూలమునఁ దనదేహమున నవహిత మొనర్చుకొని దేశములం దిరుగుచు, తమశక్తిసామర్థ్యములఁ బ్రదర్శించుచు, మెప్పులఁ గాంచుచుండెను. వైద్యుతాగ్నిని నిజదేహముల నభ్యాసమున సంధానించుకొనిన యీదంపతు లొకయూర నొకయేనుఁగుపై నెక్కి తమ విద్యుత్ప్రభావమును జనులకుఁ జూపింపఁ బ్రయత్నించుచుండ, వారి విద్యుచ్ఛక్తి కాయేనుఁగు సహింపఁజాలక, తన తొండముతో నెంతో యలజడిఁ గలుగఁ జేసెను. అంతతో నాదంపతు లావిద్యుద్దీపిని చాలించిరి.

ఇట్టీవిద్యుచ్ఛక్తి లేక విద్యుద్దీపివలనఁ గాఁదగిన లేక సంప్రాప్తించిన పెక్కుసంఘటనలఁ బరిశీలించినచో దేవతాలోకమున, మహర్షిలోకమున, మహాపురుషలోకమున నెన్నో యుదాహరణములు కాననగును.

1 ముక్కంటి కంటిమంటలచే మన్మథుఁడు భస్మమగుటయు,

2 కపిలుని కంటిమంటలచే సగరపుత్రులు భస్మమగుటయు,

3 దమయంతి పొందుఁ గోరిన కిరాతుఁడు భగ్గునమండి భస్మీభూత మగుటయు,

మనకు గోచరులు కావు. ఈమూఁడింటనున్న శక్తి విద్యుచ్ఛక్తికంటె నధికమగు మహామహిమ యని చెప్పనొప్పును. బుద్ధిమంతులలో నాగరికులు విద్యుచ్ఛక్తిని యంత్రసాధనముల సాయమున లోఁబఱచుకొని, తమతమ శరీరములయందుఁ గూడ, దానిని భరించుచున్నారు గాని వా రింత మాత్రన విద్యుచ్ఛక్తిని యథేచ్ఛముగా నడుపఁ గలిగి, దానికిఁ దాము లోఁబడకయున్న వా రెన్నఁటికిని గానేఱరు. కొన్నికొన్ని పట్టుల విద్యుచ్ఛక్తి వారు చెప్పినట్టుల వినక, బ్రమాదము పెట్టుట యును గలదు. మహర్షులు తమతమ తపోమహిమ వలన విద్యుచ్ఛక్తి మొదలగు వానిని బూర్తిగా లోఁబఱచుకొని, దాని కతీతులై యుండిరనుటకుఁ బై మూఁడు దృష్టాంతములును జాలును.

**విద్యుల్లక్షణపరీక్ష:**—కాలవిజ్ఞానశాస్త్రమునందు వివరింపఁబడిన పరీక్షలలో నొకటి.

విద్యుల్లక్షణపరీక్ష యనఁగా మెఱపుల పరీక్ష:—

౧ పంచరంగులతో మెఱసిన సుభిక్షమనియు,

౨ పంచరంగులు వేర్వేఱుగాఁ గన్పించుచు మెఱసిన వర్షము, గాలి గల్గుననియు,

౩ ఎఱుపురంగుతో మెఱసిన వర్షప్రదమనియు, కలహప్రదమనియు,

౪ ఎఱుపురంగులో బంగారువన్నెఁ గాన్పించిన, వర్షయోగమనియు,

౫ దిరిశెనపువ్వు, ములకపువ్వు పీల్లనలెను, నిండు చంద్రబింబము వలె మెఱసినచో వాన లధికమై సుభిక్షముఁ గల్గుననియు,

౬ పొంగువలెను, బూడిదెకుప్పవలెను, విద్యుత్ప్రకాశ మగుపడుచుండినఁ గొంతియాలస్యముగ వర్షించుననియు,

౭ రక్తవర్ణముగ మెఱపులు గల్గుచుండిన, దేశమునఁ గలహప్రద మనియు,

౮ తూర్పు పడమర ఉత్తరము ఈశాన్యము దిశలందు మెఱపుఁ గల్గిన వర్షించుననియు, తక్కిన ఆగ్నేయ దక్షిణ నైఋతి వాయవ్యదిశలందు మెఱపుగల్గిన ననావృష్టిసూచకమనియు,

౯ మెఱుపులు పసుపుపచ్చగను, బంగారురంగునను మెఱసిన వర్షయోగమనియు, తెల్లనిరంగుతో మెఱసిన వర్షము లేక వరపుఁగల్గునని యు, ఎఱ్ఱనిరంగుతో మెఱసిన నెక్కువ యెండలు కాయుననియు, కపిలవర్ణముతో మెఱసిన గాలి యెక్కువగ వీచుననియు, రెట్టపండితుఁడు తనపరిశోధనలవలనఁ గన్పెట్టిన నిజములను లోకులకు వెల్లడించియున్నాఁడు.

[కాలజ్ఞాన శాస్త్రము చూడుఁడు.]

**విద్యేశ్వరులు ౮:**—౧ అనంతుఁడు, ౨ సూక్ష్ముఁడు, ౩ శివోత్తముఁడు, ౪ ఏకనేత్రుఁడు, ౫ ఏకరుద్రుఁడు, ౬ త్రిమూర్తి, ౭ శ్రీకంఠుఁడు, ౮ శిఖండి.

**విద్యోతుఁడు:**—

(అభిజిత్తు చూడుఁడు).

**విద్రధి:**—గర్భములోననే జనించి, నాభి కడఁ బైకి నెడలెడి విషసంబంధమగు వ్రణము.

**విధగోత్రము:**—

(జమదగ్ని బీవా ఉపగణము చూడుఁడు.)

**విధాత:**—తండ్రి భృగువు; తల్లి ఖ్యాతి; భార్య నియతి; కుమారుఁడు ప్రాణుఁడు. (అగ్రజన్ముఁడు చూడుఁడు).

**విధాతగోళము (నక్షత్రము):—**
[నక్షత్రములు భారతీయులు గుర్తించునవి చూడుఁడు].

**విధిగోత్రము:—**
[వశిష్ఠ గణము చూడుఁడు].

**విధివిధానసిద్ధాంతము:—** ఇచట 'విధి' యనఁ బూర్వకర్మానుసారనిర్ణీత విధి యని యర్థము. "నుదుటవ్రాసినవ్రాఁత" యనుటవంటిది. ఆంగ్లమున దీనిని 'Devene Predetermination' అనెదరు. వారు పూర్వజన్మపద్ధతి నంగీకరింపకున్నను, జన్మకాలమున నీమతమువారు పరమేశ్వరనిర్ణీతవిధు లీజన్మమునం దుండు నందురు గాఁబోలు. ఇంతకన్న దీనింగూర్చి సరిగాఁ దెలియరాదు. హిందువులలోఁ బూర్వజన్మమునం దొనర్చిన కర్మలఫలము లిప్పు డదృష్టరూపమున ననుభవ మగుచున్నటుల నమ్మువారు కలరు. మహమ్మదీయులు పూర్వజన్మముల నమ్మరు కాని "నుదుటివ్రాత" "నజ్" బనెదరు.

**విద్ధతిధులు:—** తెలియంబడిన తిథి యని యర్థము. పైకి స్ఫురించుచున్నను నిచట వేధింపఁ బడిన తిథులని భావము. పూర్వతిథి ఉదయమున మిగిలియుండి, పిదప వచ్చినతిథి. పూర్వఁపుతిధిచే వెంటాడింపఁ బడినదని (వేధింపఁ బడిన) యెఱుంగునది. గాన నష్టతిథులకు 'విద్ధతిథు' లని పేరయ్యెను.

ఈవిద్ధతిథులను రామానుజీయ శ్రీవైష్ణవు లెక్కువగాఁ బాటించువారు. దశమితిథి యుదయమునఁ గొన్నిలిప్తలుగ నుంట నేష్యమైనకతన నాఁ డేకాదశితిథి యైనచో వారు, ఏకాదశివిద్ధతిథి యగుట దాని నేకాదశిగఁ బాటింపక, మఱునాఁ డేకాదశి లేకున్నను మఱునాఁ డేకాదశి వ్రత మాచరించుదురు. విద్ధ లేకుండి సిద్ధతిథి యనం బడును.

**విధులు - నిషేధములు:—** చేయవలసిన యర్హాకృత్యములు విధులు. అనఁగా విధింపఁబడి చేయవలసినపనులు. వీట్ల నాచరింపకపోవుట హీనత. అనేకవిధములగు భంగములకుఁ గారణ మగును. భరతదేశమున మానవుల కేర్పఱుపఁ బడిన నాలుగాశ్రమములలో నొక్కొక్కయాశ్రమమునం దాతఁ డాచరింపఁదగినవిధులు కలవు. ఆంగ్ల రాజ్యము లాచరింపవలసిన విధులు, ప్రభువు లాచరింప వలసినవిధులు, ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వమందలి ప్రజలు నాచరింపవలసినవిధులు కలవు. వాటి నాచరింపనిలోపమే భంగములం గల్గించెడిని. లోగడ చరిత్రలు నట్టిసంగతులం బరిశీలించినవారికిఁ దెల్పెడిని. విధుల నాచరింపందగిన పనులని తలంపరాదు. అది చాలా పొరపాటు. ఆచరింపవలసినపను లని యెఱుంగవలయును. దీనిని ముఖ్యముగ గమనింపవలసియుండును. విధులను సరిగ నాచరింపనిలోపమున పెక్కురాజ్యములు, పెక్కుసామ్రాజ్యములు, పెక్కుమానవజీవితము నందలి యాశ్రమములు భగ్నములై చెడిపోయి భంగములం గల్గించినవి. చక్కఁగ విధుల నెఱింగి నడపుచు నాచరించుటయె ధర్మ మనంబడును. దానిం దప్పి నడచుట, పాటింపకుండుట యధర్మ మగును. అదియే నిషేధము. ఆచరింపరానిది. నిషేధింపఁ (మానఁ) దగిన దని భావము. విధిని పాటింపకుండుట నిషేధము నాచరించుటయే.

పెక్కండ్రు పాశ్చాత్యరాజనీతిజ్ఞులు 'The path of duty is the way to glory' అని నుడివియున్నారు.

భూపతులు 'తమ దినచర్యాజీవితములు, తమ యుద్యోగులు విధులనెఱవేర్చుబాధ్యత నమ్మక

ముపై నాధారపడి యుండు' నని తలంపవలసి యుండును. అనఁగా నుద్యోగులు లంచములకు, పాక్షికములకు లోఁబడక తమవిధుల నిర్వర్తించు దీక్ష బాధ్యతగా నెఱుంగవలసి యుండును. ఇంక నది పరిపాటియై నిశ్చయముగ వారట్లు నడచుచునే యుందురని తలంపనగు. దృఢమైనతలంపు నమ్మకమని యెఱుంగనగును. ఇది రాజ్యాంగధర్మము. ఇట్లే యితరధర్మములు నుండెడిని. పెక్కండ్రు పాశ్చాత్యులు 'Moral idea of duty' అని నుడివియున్నారు. అధ్యాత్మిక, ఆముష్మిక ధర్మములన్నియు నాత్మయం దేర్పడినట్లే యైనను సత్యము, న్యాయము, భక్తిపై నాధారపడినవే గాని, వేఱుగనుండఁజాలవు. ఈరహస్యము నెఱుంగుట దుష్కరము. అయ్యవి యాత్మీయ విధులు, దైవికవిధులు నని రెండుగనుండును. ఆత్మీయము ప్రాణసంబంధములు. శుచి, నీతి, ధర్మము, బంధుమర్యాద, పితృ మాతృ భ్రాతృ దేశిక పోషకులయెడల నుండఁదగినధర్మములు. దైవికవిధులు, పరమేశ్వరుని యెడల నడుపఁదగిన ధర్మములు. పెక్కండ్రు తత్త్వవిదులు ఆత్మీయధర్మములను చక్కఁగ నడిపినఁ దక్కినవి యందు ముఖ్యముగ దైవికవిధులు తమంతట తామే కుదురునెదరు.

**వినకులగోత్రము:—**
(ఇనకుల చూడుఁడు.)

**వినత:**—దక్షప్రజాపతి కుమార్తె. కశ్యప మహర్షి భార్య. కుమారుఁడు గరుత్మంతుఁడు. అనూరుఁ డీమెసంతతివాఁడు. (దక్షప్రజాపతిభార్య చూడుఁడు.)

**వినతుఁడు:**— వానరుఁడు. సుగ్రీవుని సైన్యాధిపతి. కిష్కింధవాసి. సీతాదేవింగూర్చి వెతకుటకై తూర్పుదేశమునకుఁ బంపఁబడిన వాఁడు.

**వినఁబడని పియానోపాట** (Clavier Piano):—దీనిని 'క్లావియర్పియానో' యనెదరు. ఇటీవల నమెరికాదేశమునఁ జేయఁబడినది. ఇది పియానోకీబోర్డంత చిన్నదిగా నుండును. దీనికి strings గాని, తంతులుగాని లేవు. పొట్టి steel streps నుండి Electrical Vidrations మూలమున ధ్వనులంజేయుచుఁ గల్పిపాడెడిని. దీనిపాట ధ్వనిని చెవులతో వినుట యసాధ్యము గాన amplifier నుండి ధ్వనిని దర్పితముగాఁ జేసి వినఁగును. ఆధ్వని full orchestra ధ్వనివలె యుండెడిని.

ఇందలివిశేష మింకొకటి కలదు. Earphones నుపయోగించుచు వినువా రితరు లీపాటను వినకుండనే యందలి సంగీతానుగుణఁనాట్య మొనర్చుచు నాడఁగల్గుదురు.

**వినాయకతాళము:**
(తాళములు చూడుఁడు.)

**వినాశపర్వతములు:—**
(ఆదర్శావళి చూడుఁడు.)

**వినాశకాలే విపరీతబుద్ధిః:**— ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. చెడిపోయే కాలమునకు విపరీతములగుదుర్బుద్ధులు పుట్టు నని భావము. దుర్బుద్ధులు రాఁగల వినాశస్థితికి సూచకములు.

[ఆంధ్రిలోకోక్తి]

**వినాశినీనది**— దీని నిప్పుడు బనాస్ అనుచున్నారు. గుజరాతునందున్న నది. యీనదీతీరముననే దిశానిర్ణయమని బృహజ్జ్యోతిషార్ణవమునఁ జెప్పఁబడినది.

## వినిగమనవిరహన్యాయము:—

ఒకపనిం గూర్చి రెండువిధములుగ మార్గములున్న తఱి నందొకమార్గమునే తా నవలంబించవలె నను పక్షపాతబుద్ధికి 'వినిగమన' మనిపేరు. దానికారణమును బట్టి కార్యము సంతోషించుట (అనఁగా నిశ్చయించుటకు) 'వినిగమన' మనియు, సాధనము లేక యుండుటకు 'విరహ' మనియు నెఱుంగునది. ఇట్టిస్థితియందు 'వినిగమనవిరహ' మనఁబడును.

## వినిపాతసిద్ధి:—

(లోకనీతిసిద్ధాంతములు చూడుఁడు.)

**వినుకొండ వల్లభరాయకవి:**—ఆంధ్ర కవులలోఁ బూర్వకవులలోఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. విశ్వామిత్రగోత్రుఁడు. తండ్రి తిప్పన్న. దశరూపకములలో నొకటియగు వీథినాటకము నాంధ్రమున రచించినవాఁడు. రంగము, ఓరుగల్లుపురము. రచించిన గ్రంథము పేరు క్రీడాభిరామము. ఈగ్రంథము క్రీ. శ. ౧౪౨౦ సంవత్సరమున రచింపఁబడెనని గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగా రభిప్రాయపడియున్నారు.

**వినుకొండ:**—ఇది వినికొండ, విన్నకొండ, వినుకొండ యని వాడుక నామములు గల చిన్న పట్టణము. ఆప్రాంతసీమకు రాజధానిగను, సైన్య మార్గములుగలతావుగను, తొల్లింటఁ బ్రసిద్ధిగాంచి యుండినతావు. ఒకప్పుడు కొండవీటిహవేలీక్రింద నుండినది. ఇప్పుడాంధ్రదేశమున గుంటూరుమండలములో నున్నది. ఇచటఁ గోటలు పెక్కు గానవచ్చెడిని. ఇచటఁగల పర్వతము ౧౭౦౦ అడుగుల యెత్తుఁగలది. దానిపైఁ గలకోటను 'బాలఖిల్లా' యనెదరు. దీనిని రెడ్డిభూపతులు నిర్మించిరని చెప్పఁబడినది.

దిగువకొండపై నొకదుర్గము కలదు. దీనిని పోచిరాజు గన్నమనీడు నిర్మింపఁజేసెనని చెప్పఁబడినది. ఇట తీగెభావి, కోనేరు, చూడఁదగినవి. జలము లోకనీటియూటనుండి వచ్చెడిని. కొండపాదమున సాగి గన్నమనీడి దుర్గ మింకొకటి కలదు. దీనినే పుట్టకోట, నాగులకోటయని, వాడుచుందురు. సాగివా రీపెనుకొండయందుఁ బ్రతిష్ఠించిన లక్ష్మీనృసింహస్వామి, విఘ్నేశ్వరుఁడు, దేవస్థానములును, ఒకకోనేరు గిలకలభావి, తీగెభావి కలవు. ఊరుఁజుట్టు గుంటుపల్లి భాస్కరయ్యగారు కోటఁ గట్టించిరి.

వినుకొండ సీమయందు ౧౬ సముతులు ౨౧౭ గ్రామములు నుండినటులఁ గొండవీటివాడకవిలె యను చారిత్రకగ్రంథమునఁ గలదు. ఇది యప్పటి గ్రామాధ్యాధికారులచే వ్రాయింపఁ బడెనఁట. ఇది పద్యములుగ వ్రాయఁబడినది. వినుకొండ చరిత్ర యీగ్రంథమునుండియే లభించినదని చెప్పవచ్చును. ఇందు ౧౮౯౫ యువనామ సంవత్సర శ్రావణ శుద్ధ పౌర్ణమి పేర్కొనఁబడినది.

వినుకొండ యొకప్పుడు గన్నభూపాలుఁడు రాయనభాస్కరుఁడు, గుంటుపల్లి భాస్కరుఁడు మొదలగు సామంతనృపాలురకు రాజధానిగ నుండినది. విజయనగరసామ్రాజ్యముక్రింద రెండవహరిహరరాయులకాలమున (౧౩౭౭–౧౪౦౪) వల్లభరాయఁడు ఈతని తండ్రి కోశాధికారి. తిప్పన్న సోదరుఁడు (సేనాని). లింగన్న పాలకులుగ దండకవియందుఁ బేర్కొనంబడియున్నారు.

ఆదిని కొండదిగువను గుజరాతిపేట యను గ్రామ ముండినటులను శ్రీరాముఁడు సీతాపహరణవార్త నిటనే వినెననియు నొకవాడుక కలదు. ఇది నిరాధార మనియు, నిదర్శనములు లేవనియు

నందురు. ఇటీవల దీనిఁ బురస్కరించుకొని యిట నున్న సీమాభిమానులు లీకొండకు 'శృతగిరి' యని యు, 'శ్రీవణాద్రి' యనియు, పేర్లు వాడసాఁగి రఁట.

మహమ్మదీయుల యధికారకాలమున నూరు మశీదులు నిర్మింపఁబడిన వనియు, నొకప్పుడు బ్రిటీషుసైన్యములిట నుంచఁబడి బందరుకు మార్పఁబడిన వనియు, నత్తరిని నొకమర్గము నధికారులు భగ్నపఱచిరనియు నందురు.

**వినుకొండసీమ:—** గుంటూరుమండల మున వినుకొండపురము సుప్రసిద్ధము. ఈప్రాంత దేశమున నీపేరు గలిగియుండెను.

**విన్నకులగోత్రము:—** ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. విన్నకుల (వనుకుల వెన్నకుల) గోత్రము. ఏకార్షేయ (౨౨) గోత్ర ము. మందపాలగణము. మందపాలసగోత్రము. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథమాద్య ప్రవరఖండ. సోమేశుఁడు దేవత. భార్య మల్లమాంబ లేక మల్లాంబ. సరస్వతీతీరము తపస్థాన ము. ప్రానాదసరము తటాకము. జపము దశకోటి. దీపములు ౨౧. క్షేత్రసంఖ్య ౩౫. సువర్ణదాన ము. వెదురుబియ్యము వర్జనీయము.

(వైశ్యగోత్రములు చూడుఁడు.)

**విన్నకోట పెద్దనకవి:—** ఆంధ్రకవుల యందుఁ బూర్వకవులలోఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. కౌశికసగోత్రము. తండ్రి పేరు గోవిందరాజు. నివాసస్థానము రాజమహేంద్రవరము. కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రగ్రంథము రచించి రాజమహేంద్రనర పురాధీశుఁడును చాళుక్యభూపతియునగు విశ్వేశ్వరమహారాజునకుఁ గృతి యిచ్చెను.

**విన్నకోటసీమ:—** కృష్ణా, గుంటూరు మండలములందు వ్యాపించినది. విన్నకోటప్రాంత దేశమని యర్థము. మల్లవరము సీమలోనిది. అట నాగేశ్వరశివలింగము సుప్రసిద్ధము.

**విపరిశిష్టకులగోత్రము:—** ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి.

విపరిశిష్ట కుల (ఉపరిశిష్ట) గోత్రము. ఏకార్షే య (౫౫) గోత్రము. వాలఖిల్యగణము. సంస్కృతగోత్రము విష్వక్సేనస. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథమాద్యప్రవరఖండ. సమానగోత్ర ము. వాలఖిల్యస. విరూపాక్షేశుఁడు దేవత. భార్య ముసలాంబ. వింధ్యాద్రిశృంగము తపస్థానము. కేతు సరస్సు తటాకము. జపము కోటి. దీపములు ౨౦. క్షేత్రసంఖ్య ౬౦. కన్యక దానము. వావింటికూర, గాజుపువ్వులు వర్జనీయములు.

(వైశ్యగోత్రములు చూడుఁడు.)

**విపరీతకరణీముద్ర** యోగాభ్యాస విధానమునఁ జెప్పఁబడిన వింశతిముద్రిలలో నొకటి.

భూమిపై శిరస్సు నానించి కాళ్లను పైకి నిలువఁబెట్టి వంకలులేకుండునట్లు నిలచియుండుట విపరీతకరణి యనంబడును.

ఈయభ్యాసమువలన నాభికడనున్న సూర్య నాడి యూర్ధ్వముఖ మగుటయుఁ జిహ్వయందలి చంద్రనాడి యధోముఖి యగుటయుఁగల్గి, జరా మరణములు దూరమగునని చెప్పఁబడినది.

**విపాశానది (వశిష్ఠమహర్షి సంబంధ ము):—** దీని నిప్పుడు బీయాస్ అనుచున్నారు. పాంచాలమున సింధునదిలోఁ జేరుకొనును. తొల్లి విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షి యగుటకుఁ దపం బొన రించి, వశిష్ఠునిపుత్రులను తన తపోశక్తి చేఁజంపిన దుఃఖమును భరింపలేక చేతులంగట్టుకొని యానది

యందు వసిష్ఠమహర్షి పడుటవలన 'విపాశ' యని పేరందెనంట. దీనింగూర్చినప్రశంస మహాభారతము ఆదిపర్వము ౧౭౯ అధ్యాయమునఁగలదు. ఆతీరమున మవోని యనంబడుగ్రామమున కేమరుగ నవ్వలితీరమున నీక్షేత్రము వసిష్ఠ యనుపేరఁ బరఁగును. అట వేఁడినీళ్ళయూటలును గలవు.

**విప్రమహారాజు:**— మగధ బార్హద్రథ సంతతిక్షత్రియుఁడు. తండ్రి శ్రుతంజయుఁడు. పితామహుఁడు కర్మజిత్తు. పుత్రుఁడు శుచి.

**విపులకదళీఫలలిప్సయా జిహ్వాచ్ఛేదన మితి న్యాయము:**— అరఁటి పండుతినఁ బ్రయత్నించుతఱి నాలుకఁ గోసి కొనినట్లు. క్రియాసిద్ధి గల్గునున్నప్పుడు దానిని తనకుపయోగహీనముగఁ జేసికొనుటయం దీన్యాయము వర్తించును.

**విపులుఁడు:**— అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి వసుదేవుఁడు. తల్లి రోహిణి. సోదరులు శ్రీకృష్ణాదులు.

**విబుధుఁడు:**— ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి దేవమీఢుఁడు. కుమారుఁడు మహాధ్రుకుఁడు.

**విభండకుఁడు (విభాండకర్షి):**— ఋషి— కశ్యపునికుమారుఁడు. ఈతఁడు స్నానమొనర్చుచు నూర్వసింజూచి మోహముజెంది వీర్యము జాఱి నీటఁబడి దాహముత్రావిన యొక లేడిగర్భమునఁజేరి, బాలుఁడై జనించెను. ఆతఁడు ఋష్యశృంగుఁడు (ఋష్యశృంగాశ్రమములు అంగదేశము చూడుఁడు).

విభాండకాశ్రమము ఋష్యశృంగుని వశనకాట అంగదేశమునం దుండెను.

**విభాతకిగోత్రము:**

(సంకృతి ఉపగణము చూడుఁడు.)

**విభావసుఁడు (సోదరులు):**—

(సుప్రతీకుఁడు చూడుఁడు.)

**విభీషణుఁడు:**— అసురుఁడు. తండ్రి విశ్రవస్సు. తల్లి కైకసి. సోదరులు రావణ కుంభకర్ణులు. శ్రీరామభక్తుఁడు. ఈతఁడు రావణునుండి చీలి లంకాయుద్ధమున శ్రీరామపక్షమునకుఁ జేరినవాఁడు. రావణాభావానంతరము లంక (రాజ్యమున)కుఁ బ్రభువయ్యెను. కుమార్తె త్రిజట. విభీషణుఁడు చిరంజీవియని చెప్పఁబడినది. భార్య సరమాదేవి. ఈమె శైలూషుఁడను గంధర్వరాజు పుత్రిక.

**విభువు:**— కాశ్యుఁడు. సత్యకేతుపుత్రుఁడు. సువిభువునకుఁ దండ్రి.

మఱియు యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడగు బభ్రువునకుమారుఁ డొకఁడు విభు వనుపేరుఁ గలవాఁడు కలఁడు.

**విభూతి:**—

(భస్మము చూడుఁడు.)

**విభ్రాజుఁడు:**—

బృహదశ్వుని సంతతిక్షత్రియుఁడగు సుకృతి కుమారుఁడు.

**విమత్స్యగోత్రము:**—

(నిధ్రువగణము చూడుఁడు.)

**విమర్శ:** ంచుట యనియర్థము. శోధించుట ఒకవ్యాఖ్యమున విమర్శ యన విచారణ యని యర్థము. న్యాయాధిపనచే బరిశీలింపఁబడుట యని తాత్పర్యము.

మాతృభాషావాఙ్మయమగు సంస్కృతవాఙ్మయమునఁ దొల్లింటి కావ్యములను విమర్శించులక్షణగ్రంథము లుండెనుగాని, యవి దేశదుస్థితులవలన నశించిపోయినకతన నట్టిగ్రంథములు కానరావు. మనవిమర్శనలు వ్యాకరణము, నిఘంటులు, ఛందస్సు, లక్షణగ్రంథములు మొదలగువాటింబట్టియే కావ్యమును విమర్శింపవలెనన్న, దాని యందలి యాయాసంగతులు విమర్శింపఁ బడవలసియుండును. కాని యింతటితో విమర్శ పూర్తి యని తలంపరాదు.

కావ్యకథన మేధోరణియందుండుట నాయాపరిస్థితులందు సమంజసముగ నుండునో, అనుకరణమునందెట్టిధోరణి, శయ్య, పాకముల కావ్యము దనరవలెనో, పాత్రోచితముగ నేయేసందర్భముల వాగ్విజృంభణ మెల్ల చెలఁగఁ దగునో, వివిధాంశములం దెల్పుచుండుతఱి నెట్టి జిగిబిగి, తెల్లము గుభాష, పద్యములయిన నెట్టివృత్తము లుపయోగింపఁబడవలెనో, రసపుష్టి యెచట నెట్లుండవలెనో, పదగాంభీర్య మెట్టులఁ దనరవలెనో, ముఖ్యముగ వినువారలకుఁగాని, చదువువారలకుఁగాని, వినుట, చూచుటఁ గూడ నొనర్చు (నాటకాదిప్రదర్శనములందలి) సభ్యులకుఁ గాని, స్పష్టముగఁ దెలసి యర్థరుచులుస్ఫురించునటులరచనలుండుట, ప్రధానమని మనస్సునం దుంచుకొని, ఈపరిస్థితులను లెట్టు లున్నవో పరిశీలించుట విమర్శనము గాని, కవి నించుకయైనను దూరుట విమర్శయందు దోషము. ఇట్లు పరిశీలనలంగూర్చిన లక్షణగ్రంథములు వ్రాయఁబడవలసియున్నది.

## విమలనాథుఁడు:

జైనతీర్థంకరులలో నొకఁడు. (తీర్థకరులు చూడుఁడు.) పీఠిచిహ్నము పంది. ఇక్ష్వాకువంశ క్షత్రియుఁడు. తండ్రిపేరు కీర్తివర్మరాజు. తల్లిపేరు శ్యామాదేవి. జన్మస్థానము కంపిలానగరము. పొడవు ౬౦ ధనుస్సులు. (ధనుస్సు మూఁడున్నరమూర) వర్ణము సువర్ణచ్ఛాయ. ఆయువు అరువదిలక్షలు. గణధరసంఖ్య ౫౫. నిర్వాణస్థలము సుమేరుశిఖరము (శిఖరీజీ లేక అర్బుదపర్వతశిఖరము). అంతరాశము ౯ సాగర్.

## విమలపురము:—

(ఘూర్జరదేశము చూడుఁడు.)

## విమలభస్మము—

ఇదియొక రాతి (...ౌ) భస్మమని తలంపఁబడుచున్నది. దీని నాయుర్వేదశాస్త్రీయముగఁజేసి వైద్యులు వాడుదురు. త్రికటుకచూర్ణము లేక త్రిఫలచూర్ణముల యనుపానములతో లోనికిచ్చిన బలము, వీర్యపుష్టి, గల్గించుచు కుష్ఠురోగదోషము, జ్వరము, ప్రమేహము, పైత్యభ్రమ, రసవాతము, క్షయ రోగముల నివారించునని చెప్పఁబడినది.

## విమానలక్షణము (హిందూదేవాలయశిల్పము):—

హిందువుల దేవాలయము లందలి గర్భాలయములకు శిల్పశాస్త్రమున విమానములని వాడియున్నారు. విమానములు ౧ దేవ, ౨ గంధర్వ, ౩ గరుడ, ౪ సిద్ధ, ౫ సాధ్య, ౬ చారణ, ౭ యక్ష, ౮ రాక్షస, ౯ కింపురుష, ౧౦ కిన్నర, ౧౧ ధాతృ, ౧౨ భారతీ, ౧౩ విష్ణు, ౧౪ లక్ష్మి, ౧౫ మహాదేవ, ౧౬ గౌరీ విమానములని పదునాఱువిమానములుగను, అం దొక్కొక్కటి ౧ కల్యాణజాతి, ౨ సుందరజాతి, ౩ మాంగల్యజాతి, ౪ లలితజాతి, ౫ ఖద్యోతజాతి, ౬ పుష్కరజాతి, ౭ కామ్యజాతి, ౮ కంకాళజాతి విమానములని యెన్మిదిభేదజాతులుగనుంట మొత్తము నూటయిరువదియెన్మిది భేదజాతుల విమానములుగఁ జెప్పఁబడినవి.

వీటిలక్షణములు భేదములుగ నుండి వేర్వేఱు దేశములం దొక్కొక్కటి వాడఁబడుచుండినవి గాన వీటి నాయాదేశీయములుగఁ జెప్పుట సమంజసము. వీటింగూర్చి మయుఁడు, భరద్వాజుఁడు, తమ శిల్పశాస్త్రగ్రంథములందుఁ బూర్తిగా వివరించియున్నారు.

ఈవిమానములు కొన్ని పురుషవిమానములనియు, కొన్ని స్త్రీవిమానములనియు, కొన్నినపుంసకవిమానములనియు విభజించిరి. కాలాంతరమున నపుంసకవిమానము లనుమాట మాసిపోయి, మిశ్రవిమానము లనియు, మాల్యదవిమానములనియు క్రమముగ నేర్పాట్లు జరిగి పేర్లు వాడుకయయ్యెను.

పురుషదేవతల దేవాలయములు పురుషవిమానములుగను, స్త్రీదేవతల దేవాలయములు స్త్రీవిమానములుగను, ఉభయులు గలసియుండు దేవాలయములు మిశ్ర (దంద్వ) విమానములుగను, జితేంద్రియులగు విఘ్నేశ్వర, ఆంజనేయాదుల దేవాలయములు మాల్యదవిమానములుగను నుండుట సనాతనాచారమై యున్నది. ఆంజనేయాదిదేవతల దేవాలయములు, రాక్షసవిమానాది విరుద్ధవిమానములు నుండరాదని చెప్పఁబడినది. మఱియు గర్భాలయమునకుముందు వేఱొకపవిత్రస్థానమును, దానికి ముందుమంటపమును [స్తంభములపై], నుండవలయుననియు, దేవాలయావరణమున జుట్టియున్న ప్రహారీగోడ కెన్నిద్వారము లుండునో, యన్నిగోపురము లాద్వారములపై నుండవలెననియుఁ జెప్పఁబడినది.

విమానముయొక్క పరిమాణమున మూఁడవవంతుపునాది యుండవలెననియు, నిర్మాణమునందు తెల్లరాయి శుభమును, ఎఱ్ఱరాయి ధనప్రదమును, పచ్చరాయి కీర్తిప్రదమును, నల్లరాయి యారోగ్యప్రదమునని చెప్పఁబడినది. పొరలుగ వీడురాయియు, పిండిరాయియు నవర్హ్యములు. రెండుభాగములు సున్నము, నొకభాగ, మిసుకయుఁ గలిపి మూసినపాత్రలందుంచి, యాఱునెలలు పాతరవైచి, పిదప బెల్లఁపునీరు, మినపనీరు, పాచితివ్వనీరు, కలబందరసముతో గానుగనాడి, నాఱుపారు లైనపిదప, నాబెందడితో దేవాలయము నిర్మించవలయునని చెప్పఁబడినది. దేవాలయము నుండి నీరు వెలుపలికిఁ బోవుజలదారికి సోమసూత్రమని శిల్పశాస్త్రమునఁ బేరిడఁబడినది. దీనిగుండా దేవతావిగ్రహము కొనర్చిన యభిషేకాదిజలములు బైటికిపోవును. [సోమసూత్రము చూడుఁడు].

పిదప దేవాలయలక్షణములలోఁ బేర్కొనఁ దగినది వేదికలు. ఈ వేదిక లేడు చెప్పఁబడినవి. అవి ౧ పీఠవేదిక, ౨ కాగళవేదిక, 3 కపోతవేదిక, ౪ రుచికవేదిక లేక రూపివేదిక, ౫ పద్మవేదిక లేక కంబువేదిక, ౬ ఘంటావేదిక, ౭ శిఖరవేదిక యను పేరులు శిల్పిశాస్త్రమున వాడఁబడినవి. వీటిని సప్తవేదిక లనియు, సప్తదేవవిమానవేదిక లనియు నందురు. వాటింగూర్చి వేర్వేఱుతావులందుఁ గనఁదగును.

ఈవిమానవేదికలం దేడువిధములగు గళములుండవలయునని విధి కలదు. అనఁగా నేదేని యొకగళముండినఁ జాలును. వాటి నీక్రింద వివరింపఁదగును.

౧ ఏకకంఠవేదిక— దీనియం దధిదేవత బ్రాహ్మి. ఈమె సప్తమాతృకలలో నొకశక్తి.

౨ త్రికంఠవేదిక— దీనియందు మాహేశ్వరీ మాతృక యధిదేవత.

3 పంచకంఠవేదిక— దీనియందుఁ గౌమారీ మాతృక యధిదేవత.

౪ నవకంఠవేదిక— దీనియందు వైష్ణవీమాతృక యధిదేవత.

౫ త్రయోదశకంఠవేదిక— దీనియందు వారాహీమాతృక యధిదేవతాశక్తి. (త్రయోదశ యన పదమూఁడని యర్థము).

౬ సప్తదశకంఠవేదిక— దీనియం దింద్రాణీ మాతృక యధిదేవతాశక్తి. (సప్తదశ యనఁ బదునేఁడని యర్థము).

౭ ఏకవింశతికంఠవేదిక— దీనియందుఁ జాముండామాతృక యధిదేవతాశక్తి (ఏకవింశతియన నిరువదియొకటియని యర్థము).

మఱియు వీలుకొలఁది నీవిమానములందుఁ బీఠము మొదలు శిఖరపర్యంతము చిత్రములు చిత్రింపవలయుననియు నవి యీక్రింద వివరింపఁబడిన నుండవలయుననియుఁ జెప్పఁబడినది.

- సాధ్య, చారణ, యక్ష, రాక్షసవిమానములయం దెన్మిది గొంతిసింహములు, పదునాలుమహానాసికలు, ముప్పదిరెండు చిరునాసికలుఁ జిత్రింపఁబడవలెను.
- కింపురుష, కిన్నర, బ్రహ్మ, భారతీ విమానములందుఁ బదునాలు గొంతిసింహములు, ముప్పదిరెండు మహానాసికలు, నలువదినాల్గు చిఱునాసికలుఁ జిత్రింపఁబడవలయును.
- విష్ణు, లక్ష్మీ, మహాదేవ, గౌరీ (లేక పార్వతీ) విమానములందు ముప్పదిరెండు గొంతిసింహములు, నలువదినాల్గు మహానాశికలు, నూట యిరువదియెన్మిది క్షుద్రనాసికలు చిత్రింపఁబడవలయును.

ఇట్లు నిర్మించిన విమాన (గర్భాలయ) ములోని ప్రదేశము నైదుభాగములుగ విభజించి, మధ్యభాగమున దేవతావిగ్రహమునుగాని, శివలింగమునుగాని ప్రతిష్ఠింపవలయునని శిల్పశాస్త్రమునఁ జెప్పఁబడినది. అనఁగాఁ బొడవును, వెడలువును గూడ నైదేసిభాగములుగ విభజించి, మధ్యభాగములు కలసినచోటునఁ బ్రతిష్ఠింపవలయునని శాస్త్రాభిప్రాయము.

## విమలగోత్రము:—

(పాణిక ఉపగణము చూడుఁడు.)

## వియుక్తాగ్రగుడము:—

(అఖాతము చూడుఁడు.)

**విరజుఁడు:**—ఈపేరుగలవా రిర్వురు గలరు. జాతకర్ణిశిష్యుఁడగు ఋషి. యొకఁడు విరజుఁడు కలఁడు. మఱియుఁ బ్రియవ్రతునిసంతతిలో, త్వష్టకుమారుఁ డొకఁడు విరజుఁడు కలఁడు.

**విరటుఁడు (విరాటుఁడు లేక విరట్రాజు):**—మత్స్యదేశాధిపతి. (మత్స్యదేశము చూడుఁడు.) ఈతనికడఁ బాండవు లజ్ఞాతవాసకాలమున వేర్వేఱువేషములతోఁ గడపిరి. కడపట దాని నెఱిఁగి, తనపుత్రికయగు నుత్తర నభిమన్యునికిచ్చి వివాహ మొనర్చి గౌరవించెను. విరటరాజు భారతయుద్ధమునఁ బాండవులపక్షమున సంగర మొనర్చినవాఁడు.

## విరాగములు:—

(మదములు చూడుఁడు.)

**విరాజజైనస్వామి:**— 'లంకావతార సూత్ర' మను ప్రసిద్ధగ్రంథము రచించిన జైనస్వామి. చంపానాసోరు నివాసి. [అంగదేశము చూడుఁడు].

## విరాటదేశము:—

[ఉపప్లావ్యదేశము చూడుఁడు].

**విరాటపురము:**—తొల్లింట మత్స్యదేశమునకు రాజధానియై, ఆదేశాధిపతియగు విరట్రాజునకు నివాసమైయుండెను. బిలాసపూర్ కత్నీలై నున్న (బెంగాల్నాగపూర్ రెయిల్వే) సహదోలు స్టేషనునుండి కొంచెము దూరమున నున్న సోహాగ్పూర్ అనుపట్టణ పరిసరములం దిప్పుడు విరాటపురముండినతావు పాడుదిబ్బలుగ నున్నది. అట తొల్లింటికాలంపు బాణగంగసరస్సును, అటనేగల కీచకునిదేవాలయమును, (విరటరాజు బావమఱంది భీమసేనునిచే నిహతుండైనవాండు). శమీ (జమ్మి) వృక్షవితతియు (పాండవు లాయుధములం దాచిన తావు). గోగ్రహణస్థలము, యుద్ధభూమిని జూపుచుందురు. పాండవు లిట నజ్ఞాతవాసముం గడపిరి.

(ఉపప్లవ్యదేశము చూడుండు).

**విరావల్ (దేవపట్టణము):**— ఇట ప్రభాసతీర్థము కలదు. బొంబై రాజధానిలోనిది.

**విరిగిచెట్టు:**—లా. Cordia my Xa. విరిగిచెట్టుకాయ అన్నివిషదోషముల నివారించుననియు, వ్రణములను మాన్పుననియు, నించుక వాతమును రేపి, తలవెంట్రుకలకు జబ్బుచేయుననియు, విరిగిచెక్క ఆకుల రస కషాయములు, పరిణామశూలనాపి, రక్తపైత్యమును హరించి, కండ్లకుం జలువంజేయుననియుం జెప్పుదురు.

**విరియాలవంశము:**— వీరు పద్మనాయకవెలమవారు. వీరిది తొలుత విప్పర్లగోత్రమై యుండి, పిదప, విరియాలగోత్రమైనది. కోటిగిరి వారు, మేకావారు, విప్పర్లగోత్రమువారే. విరియాలవారు త్రిలింగ కాకతీయప్రతాపరుద్రమహారాజపాలనమున సామ్రాజ్యగదిదుర్గముల రక్షించ నేర్పడిన ౭౭ గురు సేనానులలో నొకరుగ నుండిరి.

**విరూప లేక వైరూప్యగోత్రము:**—
(రథీతర ఉపగణము చూడుండు).

**విరూపాక్షగోత్రము:**—
(జమదగ్నివత్స ఉపగణము చూడుండు).

**విరూపాక్షక్షేత్రము:**— ఇప్పటి బళ్లారి మండలమున హోసుపేట కవ్వల జీర్ణవిజయనగర ప్రదేశమున హంపిగ్రామమునం గలదు. ఇచటి శివలింగమునకుం బంపాపతియనియు, విరూపాక్షేశ్వరుండనియుం బేరు. తుంగభద్రానదీతీరము. [జీర్ణవిజయనగరము చూడుండు. ఆంధ్రకర్ణాటక సామ్రాజ్యము చూడుండు].

**విరూపుండు:**— మరీచి సంతతి. సూర్యవంశక్షత్రియుండు. తండ్రి యంబరీషుండు. పితామహుండు నాభాగుండు. కుమారుండు రథీతరుండు. సోదరులు శంభుండు, కేతుమంతుండు.

**విరోచనుండు:**— ఈయన యసురస్వామి యని చెప్పంబడినవాండు. దేహాత్మవాదమతకర్త. దీనిని విరోచనమత మనియు నందురు. (దేహాత్మవాదిమతము చూడుండు.) ఈమతమునం బరమేశ్వరుం డంగీకరింపం బడలేదు. వీరియందు మరణమే మోక్షమంట.

**విరోహణుండు:**—
ప్రియవ్రతుని సంతతిలోని నరునికుమారుండు.

**విర్జిన్ద్వీపములు (Virgin islands):**— ఇవి పశ్చిమమహాసముద్రమున వెస్టిండీస్ అను పేరుగల ద్వీపములందు, చిన్న ఆంటిలీసు ద్వీపముల లోని యొక ద్వీపసముదాయము. ఇవి బ్రిటీషు

వారివి. ఇవి యాద్వీపసముదాయమునం దుత్తర భాగమున నున్నద్వీపములు.

(వెస్టిండీసు ద్వీపములు, చిన్నయాంటిలీసు ద్వీపములు చూడుఁడు.)

## విలంబితలయ:—

[లయ, ప్రాణము చూడుఁడు].

**విలాయత్:**— రాజ్యమందలి యొక్కొక్క భాగమును 'విలాయతీ' యందురు. ఇది పరిపాలనాసౌకర్యమునకుఁగాను, జిల్లాలుగ విభజింపఁబడినట్లుగనే విభజింపఁబడిన రాజ్యభాగములు.

టర్కీ మొదలగు కొన్నిమహమ్మదీయదేశములందు వాడుకగా నున్నది.

## విలాలాటిగోత్రము:—

[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు].

**విలియమ్ టెల్ ధనుర్విద్యానైపుణ్యము:**—ఐరోపాఖండమున స్విజర్లాండుదేశ మాస్ట్రియాభూపతి స్వాధీనమం దుండియుండెను. అం దొకకాలమున 'గెస్లు' రనుపేరుగల యాస్ట్రియాదేశస్థుఁడగు గవర్నరు, స్విజర్లాండుదేశపాలకాధికారిగ నియమింపఁబడి, పాలించుచుండెను. ఆయన చాల కఠినుఁడును, క్రూరుఁడునై రాజనీతి నెఱుంగక, తనయధికారగరిమఁ జూపుచు నధికారమత్తతఁ గల్గియుండువాఁడు. పాలితులగౌరవమునే గాక కష్టసుఖములఁ గూడఁ బాటింపనివాఁడు. సైన్యబల మధికముగ నుండి, యాస్ట్రియాభూపతి కనిష్ఠసోదరుఁడగు డ్యూకు లియోపాల్డు సర్వసైన్యాధిపతిగ నుండెను. గవర్నరుగా రొకతఱి లూసరన్‌సరస్తీరగ్రామ మగు altdorf పురమున నడివీధి నొక స్తంభము నాటించి, దానిపై తనటోపీనుంచి, తనయధికారగరిమం జూపుట కందఱును దానికి వందనమొనర్పు మని యాజ్ఞాపించెను. అత్రోవ నేగుచున్న ధనుర్విద్యానిపుణుండగు విలియముటెల్లనునాయన దానిని నిరసించి, వందన మిడకుండ నేగ, రాజభటులు వానిం బట్టి నిర్బంధించి గవర్నరుగారి యెదుటఁబెట్ట నాతఁ డీతఁడు ధనుర్విద్యానిపుణుండు గాన నీతని సుతునితలపై నొక ఆపిల్పం డిడి, దానిం గొట్టుమని యాజ్ఞాపించి, కొట్టకున్నఁ దలఁదీయింతు నని నెఱపించెను. విధిలేక టెల్లు కొట్టి, తనవిలువిద్యానిపుణతఁ బ్రదర్శించెను. గాని, యతనిచేత నేటొకయమ్ముఁ గూడ నుంటఁ గాంచి, యాయధికారమూర్తి 'రెండుశరము లేలఁ గొంటి' నని ప్రశ్నించి, చెప్పకున్న బాధింప, నాశరసంధానవిద్యానిపుణుం 'డోయేలికా! ఒకయమ్ము గురి తప్పి నాసుతునిం జంపిన రెండవది నీపైవైచి నిన్నుం బరిమార్చుట' కని ప్రత్యుత్తర మిచ్చెను.

దాని కాగెస్లరుగారు రోషావేశపరుఁడై యాతనిం దిరుగ బంధింపఁజేసి, తన పడవలోఁ గొంపోవుచుండెను. ఆవసరమున నకస్మాత్తుగ నొకతుపాను వారిం జుట్టుకొని యోడ యల్లకల్లోల మాయెను. సైనికులు, విలియముటెల్లుగారు నోడను నడపనేర్పరియని మనవిసేయ గెస్లరుగారు వానిని విప్పించి, నడుపుట కాజ్ఞనొసంగిరి. అతండును జాగ్రతగా నడపుచు నకస్మాత్తుగా నొకరాతికడకు దరికి జేర్చి, తా నందు విల్లుములం గైకొని దూకి పాఱిపోయి, మార్గమునప్రక్క నొక డొంకలో దాఁగియుండి, గెస్లరుగా రాత్రోవను రా, వారిపై బాణము వదలి, వారిని నిహతులుగ నొనర్చెను. ఓడ దరికిం జేర్చిన ఱాతికిఁ నాఁటాదిగ 'Tells platte' యని పేరై, వాడుకయం దున్నది.

**విలూననాసికస్య ఆదర్శదర్శన మితి న్యాయః:—** విలూననాసిక మన ముక్కు కోయఁబడినవాఁడనియు, ఆదర్శ మన నద్దమనియు, దర్శనమన చూపుట యనియు నర్థము. ముక్కుఁ గోసినవాని కద్దముఁ జూపుటయని యాంధ్రలోకోక్తి కలదు. కోపమును పేరేపించుట యని భావము.

**విలేభిగోత్రము:—**
[వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు].

**విలోకితాళము:—**
(తాళములు చూడుఁడు).

**విలోమతనయుఁడు:—** యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. వృష్ణికుమారుఁడు. కుకురునిపౌత్రుఁడు.

**విలోమము:—**
(అనులోమ విలోమములు చూడుఁడు).

**విలోవాతగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**వివరణాచార్యుఁడు:—**
(సురేశ్వరాచార్యులు చూడుఁడు).

**వివస్వతుఁడు-సూర్యుఁడు:—** ద్వాదశాదిత్యులలో నొకఁడు. తండ్రిపేరు కశ్యపుఁడు. తల్లి అదితీదేవి. భార్యలు సంజ్ఞాదేవి, ఛాయాదేవి యను నిర్వురు విశ్వకర్మ కుమార్తెలు. పుత్రులు ౧ వైవస్వతమనువు, ౨ యముఁడు, 3 శనైశ్చరుఁడు. పుత్రికలు యమున, తపతి.

**వివాహములు:—** తొల్లిఁటికాలమున నెన్మిది విధములగు వివాహములు వాడుకయందుండినవి.

అష్టవిధవివాహములు.

౧ బ్రాహ్మవివాహము—సాలంకృత కన్యాదాన మొనర్చుట.

౨ దైవము—క్రతువునందు ఋత్విక్కునకుఁ గన్యాదానమొనర్చుట.

3 ఆర్షవివాహము—వరునివలన గోమిథునముం దీసికొని వానిసహా కన్య నిచ్చుట.

౪ ప్రాజాపత్యము—ధర్మప్రవర్తనవిధించి కన్యాదాన మొనర్చుట.

౫ ఆసురవివాహము—ధనమిచ్చిగాని, పుచ్చుకొనిగాని యాప్రతిఫలమునకుఁ గాను కన్యనిచ్చుట.

౬ గాంధర్వవివాహము—కన్యావరు లన్యోన్యానురాగపూర్వకముగఁ గన్యాదాన మొనర్చుట.

౭ స్వయంవరవివాహము—కన్యలెన్నుకొనిన వరునకుఁ గన్యాదాన మొనర్చుట.

౮ పైశాచకవివాహము — ఉన్మత్తతతోఁగాని, మైమఱచిగాని, శీలరక్షణధర్మమును మీఱి బలాత్కారముగ కన్యం గొంపోవు వివాహమునకుఁ బేరు.

వీటియందు రాక్షసవివాహములు వదలివేయఁబడి, వాటికిఁ బదులు స్వయంవర వివాహములు చేర్పఁ బడినెను.

**వివిపిగోత్రము:—**
[భరద్వాజ ఉపగణము చూడుఁడు].

**వివింశుఁడు:—** ఖనిత్రుని తండ్రి.

**వి వి శ్శేక్షన్ (Vi vi section):—** ఇది పాశ్చాత్యపరిశీలన. లాటిన్ భాషయందు 'Vivus'

అన జీవించియుండుతటి వనియు, 'sqcare' అనఁ బరిశీలించుట యనియు, నర్థములు. పాశ్చాత్త్య వైద్యపరిశీలనలనుజీవించియున్నజంతువులపైఁదిండి inoculation మూలమునను, Blood tests మూలమునను, 'Feedings experiments మూలమునను పరిశీలించి, గుణాగుణముల నెఱుంగుటకుఁ జేయఁబడుపరిశీలనకు 'వి వి శెక్షన్' అనెదరు. ఈపరిశీలన మనాదిగ నున్నదఁట. క్రీ. ము. 300 సంవత్సరములనాఁడు Herophilus అను వైద్యశిఖామణి యిట్టిపరిశీలనలను జరుపుచుండెనని చెప్పఁబడినది.

**వివేకభ్రష్టానాం భవతి వినిపాతశ్శతముఖః:**— వివేకముఁ గోల్పోయినవారు శతవిధముల భ్రష్టులగుదురని తాత్పర్యము. వివేకముఁ గోల్పోవరా దనియు, నది నూఱువిధముల భ్రష్టులుగాఁజేయ ననియుఁ భావము.

**వివేకానందస్వామి:**— ఈమహాత్ముననకుఁ దలిదండ్రులిడినపేరు బాబూ నరేంద్రనాథదత్తు. వీరు బంగాళీకాయస్థులు. జన్మకాలము క్రీ. వె. ౧౮౬౩ సం॥రము. జన్మస్థానము కలకత్తానగరము. వీ రాంగ్లమున బి. ఏ. పరీక్షయం దుత్తీర్ణులైనవారు. బాల్యమునుండి మతబోధయం దాసక్తిఁ గలవారు. రామకృష్ణపరమహంసస్వామివారిశిష్యులై వారికడనే సన్న్యాసముం గైకొనిరి. వివేకానందు లమెరికాసంయుక్తరాష్ట్రములలోని షికాగో నగరమున క్రీ. వె. ౧౮౯౩ వ సంవత్సరమున జరిగినమహామతములసభయం దీరామకృష్ణపరమహంసస్వామిబోధయగు నద్వైతవిధానముం గూర్చి గొప్పయుపన్యాస మొసంగి మెప్పువడసినవారు.

వీరికి శిష్యులగు Captain Sevier గారు, తాము General Mac Gregore గారివద్ద కొనినమాయావతీకోఁటలప్రదేశఁపుటాస్తిని రామకృష్ణపరమహంసమిషన్ వారి కద్వైతాశ్రమ మను నామమున వీరి యద్వైతమతవ్యాపకమునకుఁ గాను సమర్పించిరి. అందే Messrs Savier గారును ఋషివలె యోగినియై యొకచిన్నయింటియందు వసించుచుండిరి. మాయావతీ అద్వైతాశ్రమమున నొకధర్మవైద్యశాలయు, నొకముద్రాక్షరశాలయుఁ గలవు. అం దద్వైతమతపత్రికను నడుపుచుందురు. వివేకానందస్వామి హౌరాకు సమీపమునఁ బదిమైళ్ళలోనుండు బేలూరుగ్రామమున క్రీ. వె. ౧౯౦౨ జూలై ౪ తేదీని మరణించిరి. వారిసమాధియు, కొన్నిమఠములు దక్షిణేశ్వరమునం దున్నవి

**వివేకాసనము:**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి.

ఇది ఉత్థితవివేక మనియు, స్థితివివేక మనియు నిరుదెఱంగులు.

౧ ఉత్థితవివేకాసనము— కుడిచేతి నెడమచంకక్రిందను, ఎడమచేతిని కుడిచంకక్రిందను నుంచి, నిలువంబడుట.

౨ స్థితివివేకాసనము—కుడిచేతి నెడమచంకక్రిందను నెడమచేతిని కుడిచంకక్రిందను నుంచి, స్వస్తికాసనమునఁ గూర్చుండుట.

ఇది చిత్తశాంతిప్రదమని చెప్పఁబడినది.

[స్వస్తికాసనము చూడుఁడు].

**వివేకకవి:**—

(కవి, కవులు చూడుఁడు.)

**విశాఖనక్షత్రము:**—ఇది కుమ్మరసానం బోలిన యైదునక్షత్రములు గూడి యాకసమునఁ గల్పించు, నక్షత్రవితతి. (అనఁగా చక్రాకారము). దీని కింద్రాగ్ని యధిదేవత. రాసగణము. అధో

ముఖము. స్త్రీ స్వభావము. దీనికింకను పర్యాయ పదములు, ఇంద్రాగ్నిదైవత్యము, విశాఖ, శూర్పము ననుపర్యాయనామములు వాడఁబడినవి. ఆఁడపులి, గుడ్లగూబ, ఉమ్మెత్తచెట్టు ఈనక్షత్ర సంబంధము లనియు, సాధారణస్వభావ నక్షత్రమనియు, ప్రవేసించిన పదునాల్గుఘటికలపైఁ ద్యాజ్యము (అనఁగా విషఘటికల) నియు, ముప్పదియెన్మిదిఘటికలపై నమృతఘటిక లనియుఁ జెప్పఁబడినది.

**విశాఖపట్టణము జిల్లా:—** ఆంధ్రదేశములో నిది చెన్నపురిరాజధానియందుఁ జేరియున్నది. విశాఖపట్టణము ముఖ్యస్థానము. హార్బరు రేవుపట్టణము. విశ్వవిద్యాలయస్థానము. ఇందలి భాగమేయగు వాల్తేరు శానిటేరియ మనఁ బడుచున్నతావు. బెంగాలునాగపూరురైల్వే మెద్రాసు సదరన్మరాటారైల్వేలసంధి. విద్యావంతమగు పట్టణము.

విజయనగరము గొప్పజమీందారీస్థానము. వర్తకస్థలము. భీమునిపట్టణము క్షీణించుచున్న రేవుపట్టణము. అనకాపల్లి విశేషవర్తకముఁగల తావు. పార్వతీపురము మన్యఁపువర్తకముఁగలతావు. సాలూరు, జయపురము, జమీందారీస్థలములు. నరిశీపట్నము వేరొకపట్టణము. జిల్లాయొక్క పశ్చిమభాగము మన్యఁపుఁబ్రదేశము. పొందూరు బట్టలనేతకుఁ బేరందిన గ్రామము. అలమంటు అంటిమామిడితోఁటలకుఁ బేరందినగ్రామము. జిల్లాయందు క్షత్రియులు విశేషముగఁ గలరు. పాలకొండ మన్యఁపునరకుల వర్తకస్థానము. రాయగడ మన్యమునందున్న వర్తకస్థలము. సింహాచలక్షేత్ర మీజిల్లాయందుఁ బ్రసిద్ధి కెక్కినది.

**విశాఖాదేవి:—** బుద్ధభగవానుని శిష్యురాలు. అనేకుల నీబౌద్ధమతమునకుఁ గల్పినయామె.

(అంగదేశము చూడుఁడు.)

**విశాఖాదేశము:—** బౌద్ధుల యధికార కాలమున నయోధ్యదేశమున కీపేరుండెను. విశాఖ [పురము] ప్రధానస్థానమై యుండెను. ఫాహియాను [చీనాయాత్రికుఁడు] షాచీ అని వ్రాసికొనెను. ఇది సాకేతమా యని సంశయము గల్గెను. Dr. Hoey పరిశీలకుఁడు హ్యూయనచ్వాంగు వ్రాసిన 'విసోకియా' ను 'పాషా' అని పోల్చెను. ఇది గోండాజిల్లాలో సరయూ, గోగ్రానదుల సంగమమునకడ నున్నది. Dr. Burgess పరిశీలకుఁడు దీనినే లక్నోనగరమని యభిప్రాయపడియున్నాఁడు. దానిని Care temples of India. p. 44 యందు వివరించెను.

**విశాలగోత్రము:—**

(కుశికగణము చూడుఁడు.)

**విశాలదేశము:—** ఉత్తర హిందూస్థానమున బీహారములోని తిరుహూత్ ప్రాంతమును ముజఫర్పూరు హాజీపూర్ మండలప్రాంతములని పోల్చఁబడుచున్నది. ప్రాగ్గెరుపండితుఁ డిది చిన్న రాజ్యమనియు, నుత్తరమున విదేహము, దక్షిణమున మగధమధ్యసీమ యని యభిప్రాయపడియున్నాఁడు. ఇక్ష్వాకుమహారాజు కనిష్ఠసోదరు నభగుని సంతతియందుఁ దృణబిందుమహారాజు కుమారుఁడును, హేమచంద్రమహారాజు తండ్రియు' నగు విశాలునిపాలనమునుండి విశాలదేశ మని పేరందిన దఁట. బుద్ధభగవానునికాలమున వృష్ణివంశఁపు భూపతు లీదేశముం బాలించిరనియు, వారికి విచ్ఛావులని వాడుకపే రుండెననియుం దెలియుచున్నది.

రాజధాని విశాలపురము. గండకీనదీతీరము. ఇప్పుడు ముజాఫర్పూరుమండలము (తిరుహూత్ డివిజనులో) హాజీపూరున కుత్తరముగా బిసాడ్ అను పేరుగల గ్రామమై యున్నది. ఇట బుద్ధభగవానుఁడు చాలాకాలము వసించెనని చెప్పఁబడినది. ఆనాఁడామహనీయుఁడు వసించుచుండిన మందిరములకు ౧ ఉదేనమందిరము, ౨ గౌతమ మందిరము, ౩ సరందమందిరము, ౪ సప్తాంబకమందిరము, ౫ బాహుపుత్రికమందిరము అని పేర్లు చెప్పఁబడినవి. మహాపరినిబ్బానసుత్త (మహాపారినిర్వాణసూక్త) మను గ్రంథమున దీని వివరణము గలదు.

ఈదేశమున హుయ్యానచ్వాంగు షిలాయినపతి (సువర్ణవతీనది) యనిన నదిని యిప్పటిసోండిసదిగాఁ బోల్చుచున్నారు. బుద్ధనిర్యాణానంతర మాయన యస్థులకై కలహింపసిద్ధపడిన యోద్ధరు మల్లుల (భూపతులు) కు యెముకలను ద్రోణుఁడను నాతఁడు పంచియిచ్చి కలహము జరగకుండ నాపెనఁట. ఆతావునకు భక్తపుష్కర మనిపేరయ్యెనఁట. దాని నిటఁ జూపుచున్నారు. మఱియు దాహానదికిఁ దూర్పున శివాస్పరిసరమున నుండు సీమను నాసప్త భూపతుల రాజ్యములని చూపుచున్నారు.

ఈదేశమందలి విశాలచ్ఛత్ర మనఁబడుపురమును (ఇప్పటి హాజీపూర్) పదునాల్గవశతాబ్దము (క్రీస్తువెనుక) న బంగాళాదేశమేలినభూపతిచే నియమితుఁడైన పరిపాలకుఁడగు హాజీమంషుద్దీను పేర వాడుక యయ్యెనఁట. నేఁటికీ హాజీపూరే యై యున్నది. తొల్లి శ్రీరామలక్ష్మణులును, విశ్వామిత్రుండును, మిథిలకేగుతఱి విశాలచ్ఛత్రమున నిప్పుడు శ్రీరామాలయముండినతావున విడిసిరఁట.



విశాలచ్ఛత్రపరిసరములఁ గొంతదూరమున (ఇప్పటి శోన్పూరున కై రుమైళ్ళదూరమున) గండకీనది గంగానదియందు సంగమించుతావునఁగల పెద్దతంపరజాగాకు 'కాజ్యదాతలావ్' అని పేరు. ఇది పెద్దసరస్సునుఁబోలియుండును. ఇది గజేంద్రుని మొసలిబాధనుండి విష్ణుదేవుఁడు రక్షించినతావఁట. అటనే గజేంద్రుని రక్షించి, విష్ణుదేవుఁడు హరిహరనాథ శివలింగమును బ్రతిష్ఠించి, పూజించెనని యాతావును జూపుచున్నారు. మఱియు శోణపురమునందే యిప్పుడు శ్రీరామాలయ మున్నతావున శ్రీరామలక్ష్మణవిశ్వామిత్రులు విడసినతావనియు, వారట మూఁడుదినము లుండిరనియుఁ జెప్పుచున్నారు. ఆయానవాలుఁగ నేఁటమూఁడుదినము లట స్నానయాత్ర (మేలా) జరుగుచున్నది.

**విశాలపురము:**— ముజఫర్పూర్ [బీహారము] మండలమున నిప్పుడు బెసాఢ్ అనుపేరఁ బరఁగుచున్నపురము. ఇది బౌద్ధులనాటిది.

గంగానదియొక్క యుత్తరఁపుగట్టున రామాయణ ఆది ౪౫ వివరింపఁబడిన విశాలపుర ముండినట్లుఁ గానవయ్యెడిని.

క్రీ. శ. పదునొకండవ శతాబ్దమున క్షేమేంద్రునికాలమం దవధానకల్పలతయందు వివరింపఁబడిన విశాలపురము శాల్మతీనదీతీరమం దుండునది. అవంతిదేశపురాజధానియగు నుజ్జయినీపురమునకు విశాలపురమని పేరుండినటుల మేఘసందేశమున వివరింపఁబడినది. మఱియు స్కాందపురాణ రేవాఖండము ౪౭ యందున నట్లేచెప్పఁబడినది.

**విశాలాద్యగోత్రము:**—

(అగస్త్య ఉపగణము చూడుఁడు.)

## విశాలీనది (ఇప్పటి బీస్‌నది):—
(దశార్ణదేశము చూడుఁడు).

**విశాలుఁడు:—** మరీచిసంతతి. సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి యిక్ష్వాకుమహారాజు. పితామహుఁడు వైవస్వతమనువు. సోదరులు నిమిచక్రవర్తి, దండుఁడు లేక దండకుఁడు, కుక్షి.

మఱియు నిక్ష్వాకుమహారాజుకనిష్ఠసోదరుఁడగు నభగుని సంతతియందుఁ దృణబిందుమహారాజు కుమారుఁడు విశాలమహారాజు కలఁడు. ఈతఁడేలుట నాదేశమునకు విశాలదేశ మనిపేరయ్యెను. (విశాలదేశము చూడుఁడు).

**విశిష్టస్య వైశిష్ట్యమ్:** పదములకు వేర్వేఱుగా నున్నప్పుడు ప్రత్యేకార్థమున్ను, అన్నికలిపి యేకవాక్యముగాఁ గూర్చినప్పుడు వేఱొక గొప్పయర్థమును గల్గునని భావము. అనఁగా నేమాట కాయర్థమే గల్గుచుండియు నన్నిమాటలు కలిసి వాక్యమైనతఱి వేఱొక పెద్దయర్థము గల్గెడిని.

**విశిష్టాద్వైత [వైష్ణవ] మతము:—** ఇది షడ్వేదాంతవాదిమతములలో నొకటి. మఱియు నిది తొల్లింటి యాదివైష్ణవమతమునుండి వేఱైనది. దీనిప్రవర్తకులు రామానుజజగద్దేశికులును, వేదాంతదేశికాచార్యులును గాన, దీనిని రామానుజీయవైష్ణవమత మనియు ననుచున్నారు. ఈమతస్థులు తమ్ము శ్రీవైష్ణవులనియుఁ జెప్పుకొందురు. రామానుజకృతమగు వీరి బ్రహ్మసూత్రభాష్యమునకు శ్రీభాష్యమని పేరిడఁబడినది. మఱియు వీరిది శ్రీసాంప్రదాయ మందురు.

రామానుజులకుఁ బిదప నాసిద్ధాంతమునే కొన్ని భేదములతో బోధించినడిపినవారు వేదాంతదేశికులు. వీరిసాంప్రదాయమునకు వడగలైసాంప్రదాయ మని యందురు. ఇంకఁ దొల్లింటి రామానుజ సాంప్రదాయమునకు, తెంగలైసాంప్రదాయమని పేరు. ఈరెండుసాంప్రదాయముల వారికిఁ గొన్ని భేదములు కలవు.

రామానుజజగద్దేశికు లాదిశేషుని యవతారమందురు. యజుశ్శాఖ. ఆపస్తంబసూత్రము. హారితసగోత్రము. తండ్రి కేశవాచార్యుఁడు. ఈయనకు సర్వక్రతుసోమయాజు లని వాడుక యుండెనఁట. తల్లి కాంతిమతి. వీరు పుత్రకామేష్టి యొనర్చిరని చెప్పఁబడినది. జన్మస్థానము భూతపురి (ఇప్పటి శ్రీపెరుంభూదూర్.) జన్మకాలము శాలివాహన శకము ౯౩౯. కలియుగము ౪౧౧౮ పింగళనామ సంవత్సర చైత్రశుద్ధపంచమి (హూణశకము ౧౦౧౭ సం॥రము) చెప్పఁబడినది. వీరు ద్వాత్రింశ లక్షణములు గలవారఁట. వీరివిద్యాగురుఁడు యాదవప్రకాశులును కాంచీపూర్ణులును. అష్టాక్షరీ మన్త్రోపదేశ మొనర్చినవారు మహాపూర్ణులు. సమాశ్రియణమందినతావు మధురాంతకమని చెప్పఁబడినది. వీరు త్రిదండసన్యాసి.

ఇంక వేదాంతదేశికులంగూర్చి వివరింపఁబడును. వీరు కలియుగమున ౪౩౭౧ శుక్లసంవత్సరము కన్యామాసము శుద్ధదశమి బుధవారము శ్రవణ నక్షత్రమున జన్మించిరఁట. ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయి. విశ్వామిత్రసగోత్రము. తండ్రి యనంతసూరి. తల్లి తోతారమ్మ. జన్మస్థానము తిరుత్తణ్ణాడ్ (హిమోపవనము). వీరు శ్రీవేంకటేశ్వరునిఘంటాంశమున జన్మించిరఁట. వీరికిఁదండ్రి గారిడినపేరు వేంకటనాథులు. మేనమామ యిడిన పేరు తూప్పుల్పిళ్ళె. భార్యపేరు తిరుమంగై అమ్మగారు. విద్యాగురువు కిడాంబి అప్పిళ్లాన్. వీరు

జపించినది వైనతేయమంత్రము, హయగ్రీవ మంత్రముసుగాఁ జెప్పఁబడినది. మరణమునాఁటికి వయస్సు ౧౦౦ సంవత్సరములు. సౌమ్య వృశ్చిక మాసశుద్ధపూర్ణిమ మృతతిథిగఁ జెప్పఁబడినది. వీరు రచించినవి ౧౨౧ గ్రంథము లనియు, అందు ... ములు ౩౨, కావ్యములు ౮, అనుష్ఠాన గ్రంథములు ౨౪, రహస్యగ్రంథములు ౩౨ సంప్రదాయప్రబంధములు ౨౪, భగవద్విషయ గ్రంథ మొకటి యనియుఁ జెప్పఁబడినది.

విశిష్టాద్వైతమునఁ బరమేశ్వరుఁడు, ఆత్మ, ప్రకృతి యనునవి త్రిపదార్థములుగఁ జెప్పఁబడినవి. అందుఁ బరమేశ్వరుఁడు నిరస్తసమస్తసంసారకళంకుఁ డనియు, నిఖిలమంగళాధారభూతుఁడనియుఁ జెప్పఁబడెను. ఆత్మయందు, ప్రకృతియందుఁ గూడఁ బరమేశ్వరుఁ డుండువాఁడు. పరమేశ్వరుఁడే సృష్టికర్త. పరమేశ్వరుఁడు పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చారూపముల నైదువిధములుగఁ బ్రకృతియగు జగమందున వెలయువాఁడు.

౧ పరరూపము — కాలకృతమగు పరిణామము లేని నిత్యవిభూతియం దసంకుచితనిత్యజ్ఞానులగు ననంత గరుడ విష్వక్సేనాదుల కనుభవవిషయ భూతుండై, కేవలపరమపదమునందు వేంచేసి యుండురూపము.

౨ వ్యూహరూపము—లీలావిభూతియగు సృష్టిస్థితిసంహారముల నిర్వహించుచు, బుభుక్షువులగు సంసారుల రక్షించుచు, ముముక్షువులగు నుపాసకుల ననుగ్రహించుచు నుండుటకుఁ బరమేశ్వరుఁడు స్వీకరించిన ౧ సంకర్షణవ్యూహము, ౨ ప్రద్యుమ్నవ్యూహము, ౩ అనిరుద్ధవ్యూహము, ఇట్లనుటయందుఁ బరమేశ్వరుఁడు సంకర్షణరూపధారి, ప్రద్యుమ్నరూపధారి, యనిభావము. ఇటుల వ్యూహరూపములు మూఁడు.

౩ విభవరూపము—రామకృష్ణాద్యవతార (రూప) ములు.

౪ అంతర్యామిరూపము బాహ్యవిషయప్రవణులైన చేతనులకు ధ్యానరుచి గల్గుటకై ధ్యేయుఁడై, పరమేశ్వరుఁడు, అట్లు ధ్యానించు భక్తుల హృదయములందు బుద్ధికి నియామకుండై వసించును (దర్శన మిచ్చుటకుల) గోచరించెడిరూపము.

౫ అర్చారూపము—స్థూలరూపమున నర్చనలందఁ బరమేశ్వరుఁడు ౧ శైలీ (శిలావిగ్రహరూపము,) ౨ దారుమయీ (కఱ్ఱతోఁ చేయఁబడినవిగ్రహరూపము,) ౩ లౌహీ, (లోహముతోఁ చేయఁబడినవిగ్రహరూపము), ౪ లేప్యము (రంగులతోఁజేయఁబడిన విగ్రహరూపము), ౫ లేఖ్యము (లిఖింపఁబడిన చిత్తరువు) విగ్రహరూపము, ౬ సైకతి (ఇసుకతోఁజేయఁబడినవిగ్రహరూపము) ౭ మనోమయి లేక మృణ్మయి మట్టితోఁజేయఁ బడిన విగ్రహరూపము, ౮ మణిమయి (మణితోఁజేయఁబడిన విగ్రహరూపము). ఈ యెనిమిదిరూపములఁ బరమేశ్వరుఁ డర్చనలందెడిని.

విశిష్టాద్వైతమతమున విష్ణుపారమ్యము విధింపఁబడినది. అనఁగాఁ బరమేశ్వరుఁడు నితరి విష్ణుదేవుఁ డనియే భావము గాని యద్వైతాది మతములందు వివరింపఁ బడినటుల నిర్గుణుండగు పరబ్రహ్మాత్మిమిట వర్ణింపదు. ఈమతమునఁ బరమేశ్వరుఁడు నిర్గుణుండుకాఁడు. జగత్తును శరీరముగఁ గలవాఁ డని గూడఁ జెప్పఁబడినది. ప్రపంచరూపమున నుండు పరాశక్తి (ప్రకృతి) పరమేశ్వరునిశక్తిగను,

శక్తిశిష్టుండు (శక్తింగూడియున్నవాఁడు) గను, అద్వితీయవైభవముఁ గలవాఁడు (అనఁగాఁ బరమేశ్వరునకుఁ గలవైభవ మన్యులకు లేదనిభావము) గను, దయామయుఁడుగను, ప్రాణులం దరింపఁజేయువాఁడుగను (అనఁగా మలినయుతమగు సంసారబంధమునుండి విముక్తినొసంగ సధికార స్వతంత్రములు గలవాఁడుగను జెప్పఁబడినది.)

ఆత్మలు విశిష్టాద్వైతసిద్ధాంతముమేరకు సణురూపములు, అనంతములు. అంతములేని నిర్మల జ్ఞానముఁ గల్గియున్నను ననాదిగా మాయచేఁ జుట్టుకొనియుండఁబడినవి. కర్మలతారతామ్యములు మేరకు జ్ఞానముగాని, యజ్ఞానముగాని, యాత్మయం దభివృద్ధిఁజెందెడిని. ఇహలోకమునను, పరలోకమునను, పుణ్యాపాపకర్మల కర్హమగు సుఖదుఃఖము లనుభవించునవి. పరమేశ్వరుని సేవించుచుండ నర్హములు, కైంకర్యసేవ కర్హములు గాని యెప్పటికి పరమేశ్వరతుల్యములై, పరమేశ్వరునిలో నైక్యముం బొందఁ దగినవి కావు.

ఇంక నీమతమునఁ బ్రకృతి యగు జగత్తు పరమేశ్వరునిచే నిమిత్తకారణముగను, నుపాదానకారణముగను గూడ సృజింపఁబడినది. మఱియు నీసృష్టి కార్యకారణరూపమై ద్వివిధముగఁ దనరెడిని. అనఁగా జగద్వస్తువితతియంతయు 'చిత్' అనియు, 'అచిత్' అనియు ద్వివిధము. ఈమత పరిభాషయందు 'చి' త్తనిన చైతన్యముగలవి యనియు, 'అచి' త్తన చైతన్యములేనిది యనియు భావము (శిలలు మొదలగునవి). ఈరెండును తిరుగ స్థూలములు, సూక్ష్మములు, నని యొక్కొకటి ద్వివిధము. స్థూలములన నేత్రాదీంద్రియములకగోచరములై నామరూపములు లేనివనియు, నిర్వచింపఁబడినది. ఇటుల నాల్గువిధములగు జగద్వస్తువులందుఁ బరమేశ్వరుండుండుననియు, నందు సూక్ష్మచిదచిత్తులయందుండుట కారణముగను (ఇది జగత్తుం గల్గించు కర్తృత్వమనియు) స్థూలచిదచిత్తులయం దుండుట కార్యముగను, ఇది సృష్టింపఁబడినజగత్తు కార్యమనియుం జెప్పఁబడినది.

ఈసందర్భమునఁ గర్తృ కారణ కార్యముల సించుక వివరించుట సమంజసము. ఏకార్యమునైనను, చేయువాఁడు కర్తగను, ఒనరుచుటఁ గారణముగను, ఒనర్పఁబడినది కార్యముగను జెప్పఁబడినపరిభాష. ఇట స్థూల సూక్ష్మచిదచిత్తులందు నాల్గింటియందుఁ బరమేశ్వరుఁ డుండుట యనఁ దొలుత సూక్ష్మచిదచిత్తులందుఁ బరమేశ్వరుఁడు కారణమై యుండుననియు (ఇది ఉపాదానకారణ మనియు), ఇదియే స్థూలమై జగద్రూపముగ మాఱుచోఁ గార్యముగ నయ్యెననియు, ఇదియే నిమిత్తకారణ మనియు, గాన కార్య, కారణ రూపములు రెండును పరమేశ్వరుడే యనియు భావము. గాననే విశిష్టాద్వైతమతము విశిష్టంచ విశిష్టంచ విశిష్టే (సతి) (ఉభయోః) విశిష్టయోః అద్వైతం విశిష్టాద్వైతమ్" అని నిర్వచింపఁబడినది. అనఁగా సూక్ష్మచిదచిద్విశిష్టమును, స్థూలచిదచిద్విశిష్టమును, విశిష్టమగుచుండు (కలసిపోయి యుండు) కతన రెండు కూడినయుండిన విశిష్టముల కూడికకు 'విశిష్టాద్వైత' మని యీమతమునకుఁ బేరు కల్గెను. విశిష్ట మనఁ గూడి యుండుట, కలిసి యుండుట కలయిక యనియు, అద్వైత మన చేరిపోయిన లేక కలిసినట్టి యేకత్వమనియు నర్థము.

కావుననే జగత్తు సృష్టించుటయం దుపాదాన కారణముగను, నిమిత్తకారణమును గూడ నైయుంటఁ బరమేశ్వరవిశిష్టమగు స్థూలచిదచిత్తును,

సూక్ష్మచిదచిత్తును నభేదైక్య మందియుంట నిట్టిజగత్తుఁ బరమేశ్వరునకు శరీరప్రాయమని చెప్పబడినది. ఇట సృష్టియన నెట్టిదో వివరింపవలయును. విశిష్టాద్వైతసిద్ధాంత ధర్మముమేరకు సృష్టి లేకుండుతటేఁ గూడ, ఆత్మ లనంతములై ప్రకృతియందు నామరూపములు లేనివిగ నగోచరములై యుండినవి గాని లేకపోలేదు. ఆత్మప్రకృతులను గోచరములుగఁ జేయుటయే సృష్టిగఁ జెప్పఁబడినది. ఈసృష్ట్యంతమున నవి తమపూర్వస్థితులం బొందును. అదియే లయముగఁ జెప్పఁబడినది. ఇంక నీమతమున స్థితి యని వేఱుగ నెద్దియుం జెప్పఁబడలేదు.

మతవిధుల కీమతమున 'సంస్కారపంచక' మనిపేరు. 'తాపః పుండ్రస్తథా నామ మంత్రో యాగశ్చ పంచమః' అని చెప్పఁబడియుంట ౧ తాపము, ౨ పుండ్రము, ౩ నామము, ౪ మంత్రము, ౫ యాగము నని యైదు సంస్కారవిధులు నిర్ణయింపఁబడినవి.

౧ తాపము—తప్తములగు శంఖచక్రములను భుజములందుఁ దపింపఁజేసి, చిహ్న మేర్పడునట్లొనర్చెడిసంస్కారవిధి.

పుండ్రము—శ్వేతమృత్తిక (సుద్ద) తోను, శ్రీ చూర్ణముతోను ద్వాదశోర్ధ్వ పుండ్రములు నిత్యము ధరించుచుండుట.

౩ నామసంస్కారవిధి— విష్ణుసంబంధ నామములను వాడుక పేరుగ ధరింపఁజేయుట.

౪ మంత్రసంస్కారవిధి— అష్టాక్షరీమహామంత్ర ముపదేశమై జపముఁజేయుట.

౫ యాగము— తిరువారాధనమనఁబడు పరమేశ్వరారాధన మొనర్చుట.



ఇంకఁ బంచసంస్కారము లందుపనికి 'సమాశ్రయణ' మనియుఁ గురున 'కాచార్యుఁ' డనియు, పరమేశ్వరునకు 'పెరుమాళ్' అనియు, ముఖ్యభక్తులకు 'ఆళ్వారు' లనియు, మతసాంకేతికనామములు కలవు. పరమేశ్వరార్చనము పంచవిధములు.

౧ అభిగమనము— దేవతాస్థాన మార్గములలో సమ్మార్జనాదికైంకర్యములు సలుపుట.

౨ ఉపాదానము—చందనము, పూవులు, మాల్యములు, మొదలగుపూజాద్రవ్యములను పెరుమాళ్ళపూజకై సంపాదించుకొనుట.

౩ ఇజ్య— పెరుమాళ్ళపూజ యొనర్చుపని.

౪ స్వాధ్యాయము— అర్థానుసంధానపూర్వకముగా మంత్రజపము నొనర్చుట, తత్వప్రతిపాదకముగ మతశాస్త్రాభ్యాస మొనర్చుట మొదలగునవి.

౫ యోగము— దేవతానుసంధానము.

ఉపాసనాసహితజ్ఞానముచే దృష్టుదర్శనములు రెండును నశింపఁగా నాతఁడు భగవద్భక్తుఁ డనంబడును.

విశిష్టాద్వైతమతసిద్ధాంతముమేరకు, ప్రాణికిఁగల బంధము మలినవంతములగు సంసారవేదనలుఁ గల్గించునవి. వాట్లనుండి విముక్తికిఁ గారణము పరమేశ్వరానుగ్రహము. విముక్తి నొసంగు నధికారము పరమేశ్వరునిది. సర్వత్ర స్వతంత్రుఁడగు పరమేశ్వరుఁడు దయామయుఁడు గాన తనభక్తుల కతిశయము [ప్రసాదసిద్ధి] నొసంగుచుండును. పరమేశ్వరప్రసాదసిద్ధికలుగనిది మోక్షముగల్గు వేఱుసాధనము లేదుగానఁ బరమేశ్వరానుగ్రహముం గాంక్షించి, యర్చనాదులు జరుపుచుఁ బ్రపత్తితో వేచియుండవలయును.

భగవత్స్వరూపానుభవము కైవల్యపదవి యని కొందఱు నిర్వచించియున్నారు. భక్తవత్సలుండగు పరమేశ్వరుండు నిరవధికానంతరూపమును, పునరావృత్తిరహితమునగు స్వపద [వైకుంఠ] వాసమును ప్రాణియొక్క యధికారముమేరకు సాలోక్యముక్తి, సామీప్యముక్తి, సారూప్యముక్తి ననుగ్రహింప స్వస్వరూపానుసంధానమహాభాగ్య మనుభవించుటయే కల్గుగతిగాఁ జెప్పఁబడినది. ఇదియే మోక్షసుఖానుభవము.

ఈసిద్ధాంతము ద్వివిధభేదములు గలదిగ నిదివఱకే చెప్పఁబడినది. రామానుజవిధానమునకు, తేన్గల సంప్రదాయమనియు, వేదాంతదేశికవిధానమునకు వడగలసంప్రదాయమనియుం బేర్లు. వీరియం దభిప్రాయభేదములు స్వల్పములు గాని వీరికిఁ బట్టుదల లెక్కువ. వీరిభేదము వీరు ముఖమున ధరించెడి నామములందే గానవగును. తేన్గలసాంప్రదాయమువారు నామముక్రింద ముక్కుమీఁదికి పాదము రచింతురు. వడగలవా రట్లుగాక పాదము లేకుండనే నామము దిద్దుదురు. తేన్గలవితంతువులు శిరోముండనముఁ జేసికొనరు. వడగల వితంతువులు శిరోముండనముఁ జేసికొందురు

ఈశ్వరకటాక్ష మెవరియందైనను నిర్హేతుకముగఁ గల్గునని తేన్గలవారును, అది సహేతుకమని వడగలవారును చెప్పుదురు. ఆశ్రితులదోషమును భోగ్యముగాఁ దలంచునట్టివాత్సల్యగుణము గలవాఁడనియు, పరులదుఃఖములకు దుఃఖించునంతటి దయామయుఁడనియు, తేన్గలవారు తలంతురు. వడగలవా రట్లుగాక భక్తులదోషములందుఁ బరమేశ్వరుఁడు లక్ష్యముంచకపోవుటయే వాత్సల్యమనియు, పరులదుఃఖములంజూచి సహింపకుండుటయే దయయనఁబడు ననియు, నిర్వచింతురు.

తేన్గలవారు ప్రపత్తి భక్తివలె మోక్షసాధనము కాదందురు. తేన్గలవారు స్వరూపయథాత్మ్యజ్ఞానియే ప్రపత్తి కధికారియనియు, సర్వధర్మపరిత్యాగము ప్రపత్తికై యొనర్పవలెననియు నందురు. వడగలవారు ప్రపత్తికకించనుఁడే యధికారియనియు ప్రపన్నుఁ డశక్తతచేత సర్వధర్మపరిత్యాగములను స్వాభావికముగ విడువకుండ నేరఁడనియు [అప్రయత్నముగ నవియే వీడిపోవుననియు] నందురు.

తేన్గలవారు శాస్త్రోక్తకర్మలను ప్రపన్నుఁ డాచరించుట తన్నుఁ జూచి యితరు లాచరించుటను బ్రోత్సహించుట యనియు, ప్రపత్తికిఁ బూర్వధర్మములైనవానిని ప్రపన్నుఁ డాచరింపనక్కఱలేదనియు, ప్రపన్నులందఱికిని పరమేశ్వరానుగ్రహ మదివఱకే కలదనియు, ప్రపన్నుఁడే కారణమునవైన పాతకము లొనర్చినను, పూర్వప్రపత్తి ననుసంధించినంతనే నివృత్తి యగు ననియు, ప్రపన్నుఁ డెంతహీనకులజుఁడైనను గౌరవింపఁబడ నర్హుఁడనియు నందురు. వడగలవారటులఁగాక శాస్త్రోక్తకర్మల నాచరించుట భగవదాజ్ఞానుసారముగ భగవత్ప్రీతికొఱకనియు, ప్రపన్ననకుఁ బ్రపత్తికిఁ బూర్వధర్మములు ప్రపత్తి కంగములవంటివేయగుట నాచరణీయము లనియు, ప్రపన్నులందఱకు భగవదనుగ్రహము కలుగఁ గలదనియు, ప్రపన్నుఁ డేకారణమునవైనఁ బాతకములొనర్చిన మరలఁ బ్రపత్తిని సక్రమముగ నాచరింపవలయు ననియు, హీనకులస్థుఁడు ప్రపన్నుఁడైనను తారతమ్య ముండుననియుఁ జెప్పుదురు.

చేతనులు పరతంత్రులు గాన భక్తి మొదలగు నుపాయములఁ బరతంత్రస్వరూప విరుద్ధములని తేన్గలవారు తలంతురు. దీనికి వడగలవారు ప్రపత్తి

తప్ప తక్కినభక్త్యాద్యుపాయము లధికారభేదము ననుసరించి యుండునందురు.

తేఁగలవా రణువాత్రియములగు నాత్మలం దుఁ డంతర్యామిగ నున్నాఁడని, వడగలవా రాత్మలో వ్యాపించుట యసంగతమనియు, వెలుపల నంతటను వ్యాపించియుండుననియు నందురు.

తేఁగలవారు కర్మ జ్ఞాన భక్తియోగములు మూఁడును, ఆచార్యనిష్ఠఁగూడి మోక్షమునకు స్వతంత్రోపాయము లనియు, మోక్షలాభ మీశ్వరునిదేకాని జీవులది కాదనియు, మఱియు నది యధికారభేదము ననుసరించి యుండుననియు నందురు. దీనికి వడగలవారు కర్మజ్ఞానములు భక్త్యంగములు గాని స్వతంత్రోపాయములు గావందురు. మోక్షలాభ మీశ్వరునిది కాదనియు, జీవునిదే యనియు, మఱియు నధికారభేద మనునది లేనేలే దనియు నందురు.

ఏకాదశినాఁడు శ్రాద్ధము వడగలవా రాచరింతురు. తేఁగలవారు దానిని నాఁ డాచరింపక మఱునాఁ డాచరింతురు. ఇట్లుఁ బదునెన్మిది ముఖ్య భేదములు వీరిమధ్యఁ గలవని నుడువుదురు.

**విశుద్ధచక్రము:**— ఇది యోగశాస్త్రమున శరీరమందలి షట్చక్రములలో నైదవది. సుషుమ్నానాడికడ నున్నది. కంఠమూలముల నున్నదిగను, తపోలోకసంబంధిగను, ఆకాశతత్త్వ (అనఁగా Ether) మగను, తెల్లనిరంగుగాను చెప్పఁబడినది. ఇట సదా శివుఁడు దైవతమనియు, నిది మైతరేయలింగ మనియు, శాకినీశక్తి యనియు, నిటనుండి షోడశయోగనాదులు వ్యాపించుననియు మఱియు వీటినుండియే అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అను స్వార విసర్గధ్వనులను షోడశస్వరములును పలుకుననియుఁ జెప్పఁబడినది.

ఆకాశతత్త్వము (ఇందలిది) గుండ్రనియాకారము కలదనియు, నిందు హం అనునది బీజమనియు, అది శ్వేతవర్ణమనియు, ఇటఁజేసినతపమున కాకాశధారణయని పేరందినదనియు, ఆకాశధారణ నొనర్చినవారు ప్రళయమునందుఁగూడ నశింపక నిలచియుండువా రనియు, చతుర్వేదజ్ఞానముం గాంచి, త్రికాలజ్ఞానులగుదురనియుఁ జెప్పఁబడినది.

విశుద్ధచక్రము స్థూల (లౌకిక భౌతిక) శరీరమునం గంఠమూలస్థానమున Cavernous Plexus అని యాంగ్లవైద్యులచేఁ జెప్పఁబడు నరగుచ్ఛ మనియుఁ శబ్దోత్పత్తికి స్థానమనియుఁ జెప్పఁబడినది.

**విశ్రవసువు:**— తండ్రి పులస్త్యమహర్షి. తల్లి హావిర్భుక్కు. భార్యలు నలువురు.

౧ మొదటిభార్య తృణబిందువు కుమార్తెయగు నిలబిల. ఈమెవలనఁ బుత్రుఁడు కుబేరుఁడు కల్గెను.

౨ రెండవభార్య సుమాలికుమార్తెయగు కైకసి. ఈమెవలనఁ బుత్రులు రావణ, కుంభకర్ణ, విభీషణు లనుముప్పురుపుత్రులును, శూర్పణఖ యను పుత్రికయును గల్గిరి. శూర్పణఖ భర్త విద్యుజ్జిహ్వుఁ డనునసురుఁడు.

3 మూఁడవభార్య సుమాలికుమార్తెయు కైకసి చెల్లెలు నగు పుష్పోత్కట. ఈమెవలన మహోదరుఁడు, మహాపార్శ్వుఁడునను నిర్వురు సుతులు జనించిరి.

౪ నాల్గవభార్య సుమాలికుమార్తెయు కైకసి రెండవచెల్లెలునగు రాక. ఈమెవలన ఖర,

దూషణ, త్రిశిరు లను ముగ్గురు పుత్రులు జనించిరి.

## వి[శ్రాంతిదినములు - శనివారము సగము - ఆదివారముపూర్తి - చరిత్రము:

**వి[శ్రాంతిదినములు - శనివారము సగము - ఆదివారముపూర్తి - చరిత్రము:**—అనేకవేలవత్సరములకుఁ బూర్వ మాంగ్లసీమలనేలిన శాక్సన్‌జాతినరపాలుండగు ఎడ్గార్ భూపతి (King Edgar the Sanson) పని పాటలజేయువారికి శనివారము మధ్యాహ్నము విశ్రాంతి నొసఁగ శాసించెను. అదియే నేటికి సర్వవిశ్రాంతిదినముగ పేరందియున్నది. ఇంక నాది వారము క్రైస్తవమతధర్మముమేర కొసంగఁబడు పూర్తి వి[శ్రాంతిదినము. ఇది క్రైస్తవమతసంబంధమగు వి[శ్రాంతి.

బ్రిటీషుసీమలందుఁ గ్రైస్తవదేవాలయముచుట్టు ను సంతలు జరుగుటయును, గ్రామఁపువీధు లేర్ప డుటయును, అనఁగా గ్రామముమధ్య దేవాలయ ముంటయు సాధారణమే. ఈయేర్పాటు చర్చికేగి బజారునందు సంతలందు వలయుసామగ్రిని గొను టకేర్పఱుపఁజడుచుండెను. ఈసంతలు సాధారణముగ శనివారముమధ్యాహ్నమున నుండెడివఁట.

**విశ్వంతిగోత్రము:**—
(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

**విశ్వకర్మ:**—తండ్రి ప్రభాసుఁడు. తల్లి యోగసిద్ధి. ఇతఁడు దేవశిల్పి.

**విశ్వకుఁడు:**—ఇక్ష్వాకుసంతతి. సూర్య వంశక్షత్రియుఁడు. ఈతనికి విశ్వగంధుఁడని నామాంతరముఁ గలదు. పృథునికుమారుఁడు. ఈతనికి శాశ్వతుఁడు, ఇంద్రుఁడు, చంద్రుఁడు, అతిచాంద్రుఁడనియుం బేర్లు కలవఁట.

మఱియొకవిశ్వకుఁ డంగీరససంతతియందుఁ గాననగుచున్నాఁడు. ఈతఁడు అగ్ని.

**విశ్వకాయనగోత్రము:**—
(గర్గ ఉపగణము చూడుఁడు.)

**విశ్వగన్ధుఁడు:**—మరీచి, ఇక్ష్వాకు సంతతిక్షత్రియుఁడు. తండ్రి త్రిధన్వుఁడను నామాంతరముగల పృథువు. సోదరులు సూర్యారణ్యుఁడు (త్రయారణ్యుఁడు), యవనాశ్వుఁడు. ఇతని కింద్రుడనియు, చంద్రుఁడనియు, నతిచాంద్రుఁడనియుఁ గూడఁ బేర్లున్నవఁట.

**విశ్వగోత్రము:**—
[ఔతథ్య ఉపగణము చూడుఁడు.]

**విశ్వజిత్తు:**—మగధ బార్హద్రథ సంతతి క్షత్రియుఁడు. తండ్రి సత్యజిత్తు. పితామహుఁడు సునీథుఁడు. పుత్రుఁడు పురంజయుఁడను నామాంతరముఁ గల రిపుంజయుఁడు.

ఇంకను బృహద్విషునిసంతతియందు జయద్రథునికుమారుఁ (క్షత్రియుఁ) డొక్కఁడు విశ్వజిత్తు కలఁ డీతనిసుతునిపేరు సేనజిత్తు.

**విశ్వతోముఖగణము:**— ఇం దైదు గోత్రములు చెప్పఁబడినవి. ఇది విశ్వబ్రాహ్మణుల యం దొకగణము.

౨ విశ్వతోముఖగణము— (ఐదు గోత్రములు)

౧ చక్షుషర్షిగోత్రము:— విశ్వతోముఖ, స్థాపక, నీలాంగద, విశ్వదక్ష, చక్షుష (పంచార్షేయ ప్రవర).

౨ విశ్వదక్షర్షిగోత్రము:— స్థాపక, యజ్ఞేశ, విశ్వదక్ష, (త్రియార్షేయప్రవర).

౩ విశ్వతర్షి గోత్రము:— యజ్ఞేశ, విశ్వదక్ష, విశ్వత, (త్రియార్షేయప్రవర).

౪ సుమేధర్షి గోత్రము:— విపుల, విశ్వత, జ్ఞాన మతి, మేధ, సుమేధ, [పంచార్షేయప్రవర].

౫ పన్నర్షి గోత్రము:—సుమేధ, ప్రతిమేధ, పన్న, [త్రియార్షేయప్రవర].

## విశ్వనాదనాయకుఁడు:

— ఈ మహానీయుఁడు బలిజకులస్థుఁడగు నాంధ్రుఁడు. విజయనగర మీతని జన్మస్థానము. తండ్రి శ్రీకృష్ణరాయసార్వభౌమునికడ సైన్యాధిపతిగఁ బేరుగాంచిన నాగమనాయకుఁడు. నాయకశబ్ద మిప్పటి నాయఁడు శబ్దమునకుఁ దొల్లింటి కాలఁపు వాడుక పదమని తలంపఁబడుచున్నది.

ఈతని తలిదండ్రులకు సంతానము లేక కాశీపురి కేఁగి యట విశ్వనాథుం బూజింప నీతఁడు గర్భము నంబడి జన్మించుటంజేసి విశ్వనాథనాయకుఁడను పేరిడిరఁట.

క్రీ. శ. ౧౫౪౧—౧౫౬౫ కాలమునాఁటివాఁడగు నళియరామరాజుక్రింద క్రీ. శ. ౧౫౫౯ సంవత్సరమున మధురయందు పరిపాలకుఁడుగ నియమింపఁబడెనఁట. పరిశీలనలవలన నీతఁడు ౧౫౩౦—౧౫౪౦ ల నడుమ జన్మించినటులఁ గన్పించుచుంట నీతఁడు పరిపాలనాభార మప్పగింపఁదగనిబాల్యముననే యామహాపదవిఁ బడసినట్లుఁదోఁచును. ఐనను రాజ్యకార్యనిర్వహణమున నీతనికి భంగములు వాటిల్లినటుల వినము.

ఈతడు రామేశ్వరదేవాలయమున నందీశ్వరుండున్నమండపము గట్టించి, యందు తనవిగ్రహము శిలతోఁ జేయించి స్థాపించెను. పిదప నీతనిసుతుండును నావిగ్రహమున కెదుట నందీశ్వరునికడనే తన విగ్రహమును శిలతో నిర్మింపించి నిలిపెను. నేఁటికి నారెండువిగ్రహము లామండపమున నందీశ్వరుని యెదుట నట్లే యున్నవి.

ఇందువలన విశ్వనాథనాయకుఁడును, నాతని సుతుండును, మధురరాజ్యపరిపాలకు లగుటను, పూర్వసాంప్రదాయానుసరణిగను గూడ శివభక్తులని స్ఫురించెడిని.

## విశ్వబ్రాహ్మణులు:

— వీరు విశ్వకర్మ సంతతివా రనెదరు. విశ్వకర్మయే జగన్నిర్మాత యనుటయుం గలదు. (విశ్వకర్మ చూడుఁడు). విశ్వకర్మసంతతి యందు సానగర్షి, సనాతనర్షి, అభువనర్షి, ప్రత్నర్షి, సుపర్ణర్షి, యను పంచర్షులు, చెప్పఁబడిరి. వారు వరుసఁగ సానగసూత్రము, సనాతనసూత్రము, అభువనసూత్రము, ప్రత్నసనూత్రము, విశ్వజ్ఞసూత్రము నను నైదు ధర్మగ్రంథములను రచించిరని యందురు. వీరివీరి సంతతులవా రాయామూలపురుషరచిత ధర్మగ్రంథములం బ్రమాణములుగఁ గైకొనుచున్నారు. సానగర్షిసంతతివారికి ఋక్శాఖవారని పేరు. వీరు బ్రాహ్మణవర్ణమనియు, లోహకార (ఇనుపపని) వర్ణమనియు, నిరుదెగలుగ నైరి. (ఋక్శాఖ చూడుఁడు). సనాతనర్షిసంతతివారికి యజుశ్శాఖ వారని పేరు. వీరు క్షత్రియవర్ణము దారుకావర్ణము (చెక్కడఁపుపని లేక కఱ్ఱపని) లుగ నిరుదెగలుగ నైరి. (యజుశ్శాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు). అభువనర్షిసంతతివారికి సామశాఖవిశ్వబ్రాహ్మణు లని పేరు. వీరు వైశ్యవర్ణము, అయస్కార లేక కాంశ్యవర్ణము (కంచుపని) నని యిరుదెగలుగ నైరి. (సామశాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు). ప్రత్నర్షి సంతతివారి కథర్వణశాఖ వారని పేరు. వీరియందును శూద్రవర్ణము. శిల్పి, లేక పాషాణవర్ణము (రాతిపని) నని యిరు

తెగలుగనైరి. (అధర్వణశాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు). తక్కిన సుపర్ణర్షి సంతతివారికి ప్రణవశాఖవారని పేరు. వీరియందు ఛండాల వర్ణము, స్వర్ణకారవర్ణము నని రెండుతెగలు గలవు. స్వర్ణకారవర్ణము (బంగారుపని జేయుదు రఁట. ప్రణవశాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు). వీరిని కంసాలులని యాంధ్రదేశమున వాడుటయుం గలదు. కంసాలిశబ్దము కర్మశాలి (పనివాఁడు) శబ్దమునుండి కల్గినది.

వీరు తమపేరులకుఁ బిదప నాచార్యులనుపద మును కులబిరుదముగ వాడుకొనుచున్నారు. ఇం దాదివృత్తివర్ణములగు ౧ స్వర్ణకారవర్ణము, ౨ శిల్పి లేక పాషాణవర్ణము ౩ అయస్కార లేక కాంశవర్ణము, ౪ దారుకావర్ణము, ౫ లోహకారవర్ణము వారు నూరుగోత్రములవారు శక్తిపుత్రులుగాన శాక్తేయు లనియు, దేవపుత్రు లనియు, దేవాంశసాంప్రదాయస్థులనియు, ప్రథమశాఖవా రనియు, నగ్రగణ్యులుగ వీరిమతగ్రంథములందుఁ జెప్పఁబడియున్నది.

వీరి పూర్వోన్నత్యముంగూర్చియు, ననంతర కారణాంతరపతనముంగూర్చియు, వీరు చెప్పుకొను కథనములలో నొకటి యిట వివరించుట సమంజసము.

పూర్వము చోళరాజ్యఁపు రాజకుటుంబఁపు నాచార్యపీఠముననేమి, దేశమునఁగల పౌరోహిత్య పదమునందేమి, విశ్వబ్రాహ్మణు లధిష్ఠించియుండు వారఁట. అట్టియెడ సోరిన్‌రాజ పరిమళమహారాజు చోళదేశమును బాలించుచున్న సమయమున, వ్యాసుఁడను నాతఁడు రాజు నాశ్రయించి, యాచార్యపీఠమునుండి విశ్వబ్రాహ్మణులను దొలగించి, తన్నును, దనపుత్రులను, బ్రతిష్ఠింపవల సినదని ప్రార్థించెనఁట. గాని, పరంపరగా నాచార్య పురుషులుగ నున్నవారిని బీఠమునుండి దప్పింప నిష్టములేక వ్యాసునికోర్కె రాజుని రాకరించెనఁట. మఱి కొంతకాలమునకుఁ బరిమళభూపతి చనిపోవుటయు, నాతనిసోదరుఁడు రాజ్యమునకు వచ్చుటయుఁదటస్థించెనఁట. అప్పుడు వ్యాసుఁడు మఱలఁ గ్రొత్తనృపునిఁగూడఁ బూర్వమువలెనే ప్రార్థించి నిరాకరింపఁబడుట, పరిమళరాజుభోగవనితసుతుఁడును, నతిదుర్మార్గుఁడును నగు, గళింగుఁడనువానిఁ జేరి దన్నును దనపుత్రులను నాచార్య పీఠమున, బ్రతిష్ఠింప నంగీకరించినచో, నప్పటి భూపతినిజంపి సింహాసన మాక్రమించుటలో సహాయమొనర్తుననియు, గళింగునిఁబ్రోత్సహించి, వ్యాసుఁ డావ్యవహారమును నడుటయందు సంపూర్ణమనోరథసిద్ధుఁ డయ్యెనఁట. కాని, యా కళింగబాలరాజు దనవాగ్దానముచొప్పున విశ్వబ్రాహ్మణుల నాచార్యపీఠమునుండి దొలంగింపఁజాలక, వారికిని, వ్యాసునికుటుంబమునకును, సమానగౌరవాదుల నిచ్చి సరిపుచ్చఁజూచెనఁట. కాని, తమ గౌరవాదులలో నొరులకు భాగమీనొల్లని విశ్వబ్రాహ్మణులు రాజునాచార్యపదవినే దృణీకరించి విడిచివేసిరఁట. అందుకుఁ గళింగరాజు గోపము నొంది యాచార్యపీఠమున వ్యాసునిబ్రతిష్ఠించుకొనెనఁట.

నాఁటినుండియు విశ్వబ్రాహ్మణులు దమతమ యథోచితవృత్తులను సలుపమి, నక్కు, నాగలి, కత్తి, గొడ్డలి, యుద్ధోపకరణములు మొదలగునవి లేక బ్రజలు తహతహపడుటఁ, జూచి, భూపతి విశ్వబ్రాహ్మణులదండింప సమకట్టుటచేఁ గొందరు పర్వతగుహలకు బాఱిపోయిరఁట. మఱికొందఱు ప్రచ్ఛన్నవేషములతో నారాజ్యమునందే దాసోజులమను పేర్లతో నజ్ఞాతవాసముసల్పుచుఁ దమ

కులదేవతయగు కామాక్షీమహాదేవిఁగూర్చి మొఱలిడుచుండ, నాదేవి ప్రసీదయై వారి కభయ మొసంగి, రాజువలనిభయము లేదనియు, నోజు నామముల నింటిపేర్లుగా ధరింపవలసినదనియు, దానింకొకరూపమున వారల విముక్తులనుగా నొనర్తుననియు సెలవిచ్చిపంపెనఁట. ఆకాలమున విశ్వబ్రాహ్మణులు మఱలఁ జోళదేశమున స్వస్థానములకుఁజేరి, యోజునామముల నింటిపేర్లుగా ధరించి మెలంగుచుండిరఁట. వాని నీక్రింద వివరింతుముగాక:—

1 అక్రోజు
2 అద్దోజు
3 అనుపోజు
4 అలుగోజు
5 అముఱోజు
6 ఆకోజు
7 కంచుమోజు
8 కంతోజు
9 కట్టోజు
10 కత్రోజు
11 కనుమోజు
12 కల్లోజు
13 కాటోజు
14 కామోజు
15 కుప్పోజు
16 కూర్మోజు
17 కొమ్మోజు
18 గారోజు
19 గుండోజు
20 చింతోజు
21 చిట్టోజు
22 చిట్టిమోజు
23 చెన్నోజు
24 జిల్లోజు
25 తిప్పోజు
26 తుమ్మోజు
27 దాకోజు
28 దాసరోజు
29 నవరోజు
30 నాగోజు
31 నాపోజు
32 నూకోజు
33 పాటోజు
34 పుత్తోజు
35 పుల్లోజు
36 పోలోజు
37 బిట్రోజు
38 బొల్లోజు
39 మండలోజు
40 మల్లోజు
41 మహారోజు
42 ముత్తోజు
43 యర్రోజు
44 రమణోజు
45 రామోజు
46 లంగోజు
47 లింగోజు
48 లక్కోజు
49 వనమోజు
50 వల్లెమోజు
51 వొంపోజు
52 శీలపోజు
53 సంగోజు
54 సంబోజు
55 సాపోజు
56 సిద్దోజు
57 సూరోజు
58 హాలమోజు
59 హీరోజు
60 షీరోజు

## విశ్వబ్రాహ్మణులు, శైవమతము:—

విశ్వబ్రాహ్మణులు తొలుదొల్త స్మార్తమతస్థులనియుఁ, గాలక్రమమున వీరిలోఁగొందఱు, 'బత్తుల' యనునింటిపేర్లిప్పుడుగలవారి పూర్వపురుషులు, శైవధర్మములఁ దెలుసుకొని, శైవమతస్థులైరనియు, నప్పుడు వారిపేళ్ళతుదలను భక్తశబ్దములు కలుపఁబడి, గండేభక్తుఁడు, గొన్నాభక్తుఁడు, తాళాభక్తుఁడు, బెన్నాభక్తుఁడు, మాచాభక్తుఁడు నని పిలుఁవబడిరనియు, వారి సంతతివారు గండేభక్తులవారు, గొన్నాభక్తుల వారు నను మొదలగునామములచేఁ బిలువఁబడుచుఁ, గొంతకాలమునకు భక్తశబ్దము వికృతిరూపమునంది తద్భవమగు 'బత్తుల' గా మాఱిపోయెననియు, వీరిలో వీ రనుకొనుట గలదు ఆభక్తుల వంశస్థులే యిపు డాంధ్రవిశ్వబ్రాహ్మణులలో 1 గండేబత్తుల, 2 గొన్నాబత్తుల, 3 తాళాబత్తుల, 4 బెన్నాబత్తుల, 5 మాచాబత్తుల యను నింటిపేళ్ళతోఁ బిలువఁబడుచున్నారఁట.

నానాఁటికి విశ్వబ్రాహ్మణులు శైవమతప్రవర్తకులైఁ యున్నారు. అందువల్లనే వీరిలో మృతిని కళేబరమునకు దహనసంస్కారము చేయక భూసమాధిమాత్ర మొనర్తురు. వీరిలో దహనసంస్కారముచేయు స్మార్తులుగూడ గలరని తెలియుచున్నది.

**విశ్వభద్రగణము**:—ఇది విశ్వబ్రాహ్మలయం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి.

౧ విశ్వభద్రగోత్రము:- విశ్వభద్ర, జ్ఞానభద్ర, దేవభద్ర (త్రయార్షేయప్రవర)
౨ భద్రర్షిగోత్రము:- జ్ఞానభద్ర, దేవభద్ర, గుహిక, యాహ్నిక, సాహ్నిక (పంచార్షేయ ప్రవర).
౩ దేవభద్రర్షిగోత్రము:- దేవభద్ర, గుహిక, యాహ్నిక, సాహ్నిక, వ్యాజిక (పంచార్షేయ ప్రవర).
౪ వ్యంజికర్షిగోత్రము:- వ్యంజిక, వ్యాజిక, వీరసేన (త్రియార్షేయ ప్రవర)
౫ ప్రబోధమనుగోత్రము:- వీరసేన, వేత్రసంగత, ప్రబోధ (త్రియార్షేయప్రవర).

**విశ్వభారతివిద్యాపీఠము**:—
(శాంతినికేతనము చూడుఁడు.)

**విశ్వరూపాచార్యుఁడు**:—
(సురేశ్వరాచార్యులు చూడుఁడు.)

**విశ్వవిద్యాలయము** (University):- విశ్వవిద్యాలయములకు విద్యాపీఠము లనియుఁ బేరు కలదు. ఇవి భరతదేశమునకు నవీనసంస్థలు కావు. తొల్లింటి గురువులగు మహర్షులవద్ద విద్యార్థులు చదువుకొనుచుండుట దీనికి మూలము. పిదప ప్రయాగయందు భరద్వాజమహర్షి యాశ్రమమున నధిక సంఖ్యాకులగు విద్యార్థులు చదువుచుంటయు, నుపాధ్యాయు లధికములుగ నుంటయుఁ గడుదూరప్రదేశములనుండి విద్యార్థు లట కేతెంచి యుత్తీర్ణు లగుచుంటయు, నొకసంస్థగ పరిణమించి, యక్కాలమున నదియొక విద్యాపీఠముగ వాడఁబడియెను. ఇటులనే భరతదేశమునందచ్చటచ్చట కొన్ని చిన్నవిగను, కొన్ని పెద్దవిగను విద్యాపీఠము లుండినవి. ఇటులనే కాశ్మీరదేశమున నొకవిద్యాపీఠ ముండెనఁట. దానిరక్షణ సరస్వతీదేవియే వహించి నెఱపుచుండెనని చెప్పఁబడినది.

బౌద్ధులకాలమున నాలంద, తక్షశిల మొదలగు విశ్వవిద్యాలయములు సుప్రసిద్ధములు. నవద్వీప విద్యాపీఠము కొలఁదికాలముక్రిందటి వఱకును బేరందియుండెను. విశ్వవిద్యాలయములు కాలమున కనుకూలించునటుల నిర్మింపఁబడి, పరిస్థితులం బట్టి పనిఁజేయవలసినసంస్థ లని యెఱుంగవలయును. కొందఱు పొరఁబడుచు తలంచున ట్లిక్కాలఁపు టాంగ్ల విశ్వవిద్యాలయములు బహుసమర్థతతో నిర్వహింపఁబడు (Well organized) సంస్థలనియు, తొల్లింటికాలఁపు విద్యాలయములు నిర్మాణవిధానము నెఱుంగనివి యనియుఁ దలంపరాదు. ఆయాకాలావసరములుగ దేశ, విద్యా, పరిసితుల కనుగుణములుగ బాగుగనే పనిచేసియుండినవి. ఈసందర్భమున నొక్కసంగతి మనస్సునందుంచుకొనవలసియుండును. దేశకాల పాత్రతలం బాటింపక, యతీతమైనప్రతికార్యమును బాధకరముగనే పరిణమించెడిని. శరీరమునకు వైద్యవిధానమువలె నిట్టిసంస్థలు పరిస్థితుల కనుకూలముగ నడుపఁదగినవిగ నెఱుంగుట దూరాలోచనఫలితము.

విద్యాపీఠములు చేయుపనులు మూఁడు. అందు మొదటిది విద్యావిధానమును, విద్యాబోధనాభ్యాసముల విధానముల నాయాదేశకాల పాత్రతల యొక్కయు, ప్రభుత్వావసరముల యొక్కయు, పరిస్థితుల కనుకూలించునటుల నేర్పఱుచుకొనుట.

రెండవది వానిని విద్యార్థుల కర్హరీతిని బోధింపఁజేయుట లేక అట్లితరు లేర్పఱచినపాఠశాలలందు సరిగా తమ విధానము నడుచుచున్నటుల పరిశీలించుచుండుట.

మూఁడవపని విద్యార్థులను పరీక్షించి, యర్హులైనట్టివారి కర్హ్వాపత్రము లొసంగి, యుత్తీర్ణులం జేయుట యైయున్నది. భరతదేశమున నీమూఁడు పను లించుమించు ప్రభుత్వమువారి పరిశీలనాంగీకారములం బడయుచు, లోఁబడియుండుట విధిగానున్నది. గాన దానివిధులంబట్టియే విద్యాధికత గలవారని తెల్పునధికారము విశ్వవిద్యాలయములందే యున్నదని చెప్పవలయును.

ఇట్టి విశ్వవిద్యాలయము లింకనుఁ జేయఁదగినపనులు గలవని యిక్కాలమువఱకుఁ గల్గినయనుభవమువలన ప్రజ తెలియుచున్నారు. అవి తాను పరిశీలించుట, పరీక్షించుటలకుఁ దోడుగ న్యాయశాస్త్రములు, చిత్రకళలు, చేతిపనులు, ఆవిరి మోటారుమొదలగు యంత్రవిద్యలు, ఎలక్ట్రిసిటీ మొదలుగాఁగల సర్వకళలం బోధించి మాపుచు, వానియందు విద్యార్థుల నుత్తీర్ణులం జేయు వేర్వేఱుపాఠశాలలంగూడఁ దానే స్థాపించి నడుపుటగూడఁ దనకార్యక్రమవిధానంబులం దవలంబించవలసియున్నది. ఇది ద్రవ్యసాధ్యమని కొందఱనవచ్చునుగాని, విధాయకములంగూర్చి యితరవ్యయములఁ గొన్నిటిని మానుకొనుటయో తగ్గించుకొనుటయో జరుపవలసియుండును.

పాశ్చాత్యదేశములందు గ్రీకు పండితుఁడగు ఆరిస్టాటల్ ప్రయత్నముతో నారంభమై, రోమను ప్రభుత్వమునఁ బెరిఁగి, తక్కినప్రభుత్వములచే నభివృద్ధినొంది, బలముగ విరాజిల్లుచున్న వేర్వేఱు యూనివర్సిటీలు విద్యాపీఠములే. ఇంకను పుస్తకభాండాగారములును విద్యాపీఠాంగములేనని కొందరియభిప్రాయమైయున్నది. అమెరికాదేశపు విశ్వవిద్యాలయములు ధనలోపము నెఱుంగనివని ప్రతీతి కలదు.

ఈసందర్భమున నింకొక్కసంగతి వివరించుట సమంజసము. అమెరికాసంయుక్తరాష్ట్రములం దప్పటప్పట వేర్వేఱువిద్యావిశారదు లొకచోఁ జేరి, వారివారి కళలయందు మహోపన్యాసముల నొసంగుచు, విద్యావిజ్ఞానప్రబోధములు ప్రజలకుఁ గావించుచుండుటకలదు. ఈయేర్పాటున కమెరికాదేశమున షాటుక్వాయని పేరు. షాటుక్వాయందు మహోపన్యాసము లొసంగినవిద్వాంసులకు ప్రతిఫలద్రవ్య మొసంగఁబడును. ఇందునకును, షాటుక్వాలు జరుపు నితరవ్యయములకును వలయుద్రవ్యము ప్రేక్షకులటికెట్లనుండి లభించునఁట. ఇందువలన తమకడ కేతెంచిన విద్యార్థులు మాత్రమే గాక దేశమునందలి ప్రజాసామాన్యమును విజ్ఞానబోధ నందెదరు. ఇట్టిసంస్థలు దేశము నతిత్వరితముగ కలావిద్యల నెఱుంగుస్థితి గలుగఁ జేయును. షాటుక్వాలను 'Most American thing in America' యని డాక్టరు సుధీంద్రబోసు పండితుఁడు వివరించియున్నాఁడు.

వీనిని విద్యాపీఠము లవలంబించుచు దేశమందలి వేర్వేఱుతావులం జరుపుచుండిన నెక్కువ బాగుండునని తోఁపకపోదు. ఇవి యిక్కాలఁపు 'యూనివర్సిటీలెక్చర్సు' అనంబడువాని పరిణామము గాని వేఱు కాదు.

పుస్తకభాండాగారములను దేశమునం ద్రిప్పుచు, నూరూర నొకకొంతకాల ముంచుచు, నడపుటవలన విద్యాప్రబోధము కలుగఁగలదు. ఇట్టిపనులకు విశ్వవిద్యాలయము గడంగుట దేశము విద్యావంతముగ నయ్యెడిని.

**విశ్వవిద్యాలయములు పూర్వఁపువి:—**
(తొల్లింటి విశ్వవిద్యాలయములు చూడుఁడు.)

**విశ్వసహుఁడు:—** ఇక్ష్వాకుసంతతి సూర్య వంశక్షత్రియుఁడు. తండ్రి వృద్ధశర్ముఁడు. కుమారుఁడు ఖట్వాంగుఁడు.

**విశ్వానరుఁడు:—** ఋషి. శాండిల్యవంశ జాతుఁడు. ఈతనికుమారుఁడు వైశ్వానరుఁ డను నగ్ని.

**విశ్వామిత్రగోత్రము:—**
(కామకాయనగణము చూడుఁడు.)

**విశ్వామిత్రమహర్షి:—** విశ్వామిత్రమహర్షి తండ్రి గాధిరాజు, [జమదగ్ని చూడుఁడు]. పురూరవుని మూఁడవకుమాఁడగు ఆమవసువు సంతతి. కొంతకాలము క్షత్రియుఁడై రాజ్యమేలి, బ్రాహ్మణుఁడౌటకు సర్వమును త్యజించి తపంబొనర్చి, యందరివలనను, ముఖ్యముగ వైరియగు వశిష్ఠునివలనను, 'బ్రహ్మర్షి' యనిపించుకొనినవాఁడు. శిష్యుఁడు గాలవుఁడు. భార్య మాధవి [ఈమె యయాతి పుత్రిక]. ఈమెయం దష్టకుఁడనుపుత్రుఁడుగలైనని భారతమునఁ జెప్పఁబడినది. విశ్వామిత్రుఁడు మేనక యందు శకుంతలం గనెను. అల్లుఁడు దుష్యంత మహారాజు విశ్వామిత్రుఁడు బాల్యమునఁ గృశాశ్వునికడ ధనుర్విద్య నభ్యసించెను. విశ్వామిత్రాశ్రమమునకు 'సిద్ధాశ్రమ' మని పేరని భారతముననేఁ జెప్పఁబడినది. గాయత్రిం బ్రతిపాదించి లోకమున కుపదేశించిన ఋషి.

**విశ్వామిత్రనది:—** వైడూర్యపర్వతమున జనించునది. బరోడాసంస్థానమునుండి ప్రవహించును. బరోడానగర మీనదీతీరమందే యున్నది. గుజరాతు దేశమునుండి ప్రవహించును.

**విశ్వామిత్రాశ్రమము:** విశ్వామిత్రుం డొక్కఁడే కాడనియు, ననేకులు గలరనియుఁ బెక్కండ్రు పరిశీలకు లభిప్రాయములం గల్గియుంట నందఱెఱింగినదే. అగునేని వీరు వేర్వేఱుకాలములందు జీవించి యుండవలయును. వీరియాశ్రమములు వేర్వేఱుతావులందు నాల్గు గాననగుచున్నవి.

కురుక్షేత్రమున స్థానేశ్వరముకడ స్థాణుతీర్థమున కెదురుగ సరిస్వతీనది కవ్వలి (పశ్చిమ) తీరమున గలదని, మహాభారత శల్యపర్వ ౪౩ నందుఁ గలదు. ఇప్పుడు కుశి యనఁబడుచు గంగానది యందు సంగమించు కౌశికీనదీతీరమునం దొక యాశ్రమముఁ గలదనిచెప్పఁబడినది. ఇప్పటిగయా నగరమునకు వాయవ్యదిశగా నిరువదియైదుమైళ్ళ దూరమున దేవకుండ మనుతావున వేఱొకవిశ్వామిత్రాశ్రమముఁ దావుం జూపుచున్నారు. బీహారదేశమందలి షహాబాదుజిల్లాలోనియిప్పటి బక్సారుపురము (తొల్లింటి వాక్సారపురము లేక వ్యాఘ్రసారపురము) నకు బశ్చిమదిశను విశ్వామిత్రాశ్రమమనియు, నిటనే శ్రీరాముఁడు తాటకిని వధించెననియు, రామాయణబాలకాండము ౨౬ నందుఁ గలదు. ఇటనే సిద్ధాశ్రమము వామనావతారస్థలమును గలవు. ఈయన శ్రీరాములనాఁటి విశ్వామిత్రుఁడై యుండవలెను. ఆయన యాశ్రమప్రదేశము నిప్పుడు 'చరిత్రవనీ' యనుచున్నారు.

**విశ్వామిత్రుఁడు:**—మహారాజు. కన్యాకుబ్జదేశమేలినవాఁడు. అత్రిసంతతి. చంద్రవంశము. తండ్రిపేరు గాధిరాజు. తల్లి మేనకాదేవి యందురు.

ఈతఁడు మహర్షి యయ్యెను. వశిష్ఠమహర్షిచే బ్రహ్మర్షి యనిపించుకొనిన మహనీయుఁడు. (వశిష్ఠమహర్షి చూడుఁడు.) సృష్టికిఁ బ్రతిసృష్టి నొనర్చినవాఁడు. గొప్పప్రభావము గలవాఁడు. సప్తమహర్షులలో నొకఁడు. వాక్స్వారపురము (ఇప్పటి బక్సార్) ఆశ్రమము. ఈతఁడు మేనక (అప్సరస) వలన శకుంతలం గనినవాఁడు.

**విశ్వాయనగోత్రము:**—

[వశిష్ఠగణము చూడుఁడు.]

**విశ్వేదేవగణము (దశవిశ్వేదేవతలు):**—

| | | |
|---|---|---|
| ౧ కాలుఁడు<br>౨ కామకుఁడు | } | వీరు ప్రేతకార్యములందు విశ్వేదేవతలై యుందురు. |
| 3 పురూరవుఁడు<br>४ ఆర్ద్రవుఁడు | } | స్వార్త పార్వణశ్రాద్ధములయందు పితృదేవతలకు సహాయులై యుందు విశ్వేదేవతలు. |
| ౫ ధూ లేక ధురి<br>౬ విలోచనుఁడు లేకవిరోచనుఁడు | } | వీరు మహాలయాది శ్రాద్ధములందు విశ్వేదేవతలై యుందురు. |
| ౭ సత్యుఁడు లేక బంధువు<br>౮ వసువు | } | వీరు ఉపనయనములందలి నాందీశ్రాద్ధములందు విశ్వేదేవతలై యుందురు. |
| ౯ క్రతువు<br>౧౦ దక్షుఁడు | } | వీరుయజ్ఞయాగాదులందు విశ్వేదేవతలుగ పూజింపఁబడుదురు. |

శైవులు ప్రత్యాబ్దికములందు నంది, మహాకాళులను విశ్వేదేవతలుగఁ జెప్పి పూజింతురు.

మయుని కుమారుఁడగు విశ్వరూపునకే యీ నామములు వర్తించుననియు, విశ్వరూపుఁడే విశ్వేదేవతయనియు భారతమునందుఁ జెప్పఁబడియున్నది. విశ్వేదేవతలు నవదేవతాగణములలోనివారు.

**విశ్వేదేవతలు ౧3 [త్రయోదశవిశ్వేదేవతలు]:**—

శ్లో॥ ఇష్టశ్రాద్ధే దక్షక్రతూ సంకీర్త్యౌ వైశ్వదేవకౌ। నాన్దీముఖే సత్యవసూ సాపిండే కాలకామకౌ। పురూరవార్ద్రవౌ చైతౌ పార్వణే సముదాహృతౌ। హేమశ్రాద్ధే ధనురుచి తీర్థే ధురివిలోచనౌ। ఏకోద్దిష్టే రుద్రసంజ్ఞో విశ్వేదేవాస్త్రయోదశ॥

ఇష్టశ్రాద్ధమున దక్షుఁడు, క్రతువు, నను పేర్లం బరఁగుచు, ఉపనయనమందలి నాందీముఖమున సత్యుఁడు, వసువు ననఁబడుచు, సాపిండమున కాలుఁడు, కామకుఁడు నను పేర్లం బరగుచు, పార్వణశ్రాద్ధమున పురూరవ, ఆర్ద్రవు లనంబడుచు, హిరణ్యశ్రాద్ధమున ధనుఁడు, రుచి యనంబడుచు, తీర్థశ్రాద్ధమున ధురి, విలోచనుఁడు, ననంబడుచు, ఏకోద్దిష్టశ్రాద్ధమున రుద్రసంజ్ఞచే బరఁగుచు, నిట్టుల త్రయోదశనామములచే మయునిసుతుండగు విశ్వరూపుఁడు విశ్వదేవుం డనఁబరఁగెడిని. ఇంకను మహాలయశ్రాద్ధమున పురుకుత్సనామమునఁ దనరెడి నందురు.

వైష్ణవులు నంది, మహాకాళులను నామములచే విశ్వదేవతారాధన మొనర్తురు.

విశ్వేదేవతలతండ్రి ధర్ముఁడనియు, తల్లి విశ్వయనియు, ఈమె దక్షపుత్రికయనియు, వీరు పితృదేవతలలోనివా రనియుఁ జెప్పఁబడినది.

**విషంమృత్యుః ఇతి న్యాయః:**—విషము మృత్యు వనుతఃకి విషము చావునకుఁ గారణమని యర్థము. 'ఆయుర్ఘృతమ్' లాంగలం

జీవనమ్' మొదలగున్యాయముల కిట్టియర్థమే యగును.

**విషక్రిమిన్యాయము:—** నాభియందు పుట్టినపురుగునకు నాభివలన భాధ గలుగదు. [నాభి యన విషమని యెఱుంగునది.]

అనగా నచటవసించుహారికిఁ దప్ప నితరుల కందరి కపాయస్థితిగా పరిణమించుతావని భావము. ఇట్టితావులం దెల్పుతటి నీన్యాయము ంచెడిని.

**విషగణగోత్రము:-**
[నిధృవగణము చూడుండు.]

**విషగుహ:-** - అగ్రా-అయోధ్యసంయుక్త రాష్ట్రములందు కుమానుడివిషన్‌లో ఆల్మోడా నుండి 137 మైళ్లదూరమున నీవిషగుహ యనంబడుగుహ కలదు. ఇందు గరళనిలయము కలదందురు.

గుహాముఖమునకేగిన చాలవేడిగల్గించును. పక్షు లనేకములెగిరినవి చచ్చిపడిపోయియుంటగాననగును. కుక్కలు మొదలగునవి యటకేగ వెలిచును. ఈగుహ సోబ్లా యనుపేరుగలగ్రామము కడ దార్చూలా ఖరేలా మకాములమధ్య నున్నది.

**విషజ్వరము (Typhoid fever):—** ఇది సూక్ష్మజీవులవలనఁ గల్గు నంటువ్యాధి. అవి నోటిద్రవమునందును, నీటియందును, చక్కఁగా వృద్ధినొందునని గ్రహింపఁబడినది. మంచుగడ్డవంటి ఘనీభవించిననీటియందు సైతము నెలలకొలఁదిగ నిది మనియుండఁ గలదనియు, నిసుకయందు సాధారణఁపుటెండలను సరకుగొనక వారములకొలఁది జీవింపఁగలదనియు, నిటీవలి పరిశోధనలఁ దెల్పుటచే నీ యపాయకరమగు సూక్ష్మజీవి చాలమొండి జాతిదని తేలుచున్నది. భరతదేశమునందుకన్న నైరోపాదేశమునం దిది చాలతీవ్రతతో నుండునని యందురు.

ఇది వేసవియందు పొడచూపుచుండుట నది దీని కుద్ధృతకాలమని గ్రహింపనగుచున్నది. ఇది వ్యాపించువిధానములు చిత్రముగ నుండును. రోగి మలమూత్రములలోని సూక్ష్మజీవు లెండిపోయినేఁఉవుగ్గై, బుగ్గిధూళితోఁ గలసి యెగురుచు, పీల్చిన యూపిరితో లోని కేగుటయు, రోగితోఁ గలసి నిద్రించుటయు, నేకారణముచేతనైన నెగిరినసూక్ష్మజీవులు పడిననీటినిగాని పాలనుగాని త్రాగుటయు, నెంజినసూక్ష్మజీవుల యణువుల, నీఁగలు మోసికొని వచ్చుటవలన నూపిరినుండి గాని, పానీయములనుండిగాని లోని కేగుటయు, నీరోగవ్యాప్తికారణములని వైద్యులు గ్రహించి యున్నారు. రోగికి రోగముకుదిరినపిదప రెండు లేక మూఁడునెలలదనుక నీరోగఁపుసూక్ష్మజీవులు శరీరమును వీడక, మలమూత్రములనుండిగాని, నోటిచొంగనుండిగాని, బయటికి వెలువడుచునే యుండు నందురు. ఏలనన రోగముకుదిరినచో కనీసము రెండుసంవత్సరములవఱకైనను దిరుగ నాశరీరము నీసూక్ష్మజీవులు బాధింపనేఱవని, కని పెట్టఁబడినది గాన, నయ్యవి యన్యులకు రోగమునువ్యాపింపఁజేయుట కేయభ్యంతరము లేదని తేలుచున్నది గాన కర్మాగారమునందు పనిచేయు పనివాండ్రయందు, జనసమ్మర్దము గలతావులందు నసించువారియందు నీరోగము విరివిగ వ్యాపించుచుండును.

ఈరోగలక్షణములు తీవ్రమగుజ్వరము అచ్చటచ్చట సన్నిపాతలక్షణములు నొకానొకచోట

ఒకటిగాని రెండుగాని కార్జములు (livers) విష పూరితములగుట [newmonia] యని చెప్పఁబడినది. కుఱుపులకుఁగారణమైన సూక్ష్మజీవులు చిన్నప్రేగులందుండుటయు, తమ విషపదార్థమును రక్తమునఁ బ్రవేశపెట్టుటకారణములు గాన దీనికీ పేరు కల్గెనఁట. మఱియునిదియే సన్నిపాతలక్షణములుకల్గుటకుఁ గారణమని పోల్చియున్నారు. [అంటువ్యాధులు సూక్ష్మజీవులు చూడుఁడు.]

ఒక్కొకప్పు డధికముగ తగులుటయు, నొక్కొకతఱి తక్కువగుచుండుటయు, నొక్కొకతఱి నష్టమే లేకపోఁగా వేఁడిసెగతము తగ్గుచుండుటయుఁ గల్గుచుండుజ్వరము.

**విషబొద్దితీఁగ:—**
(పాటతీఁగ చూడుఁడు.)

**విషమంగలపుఁజెట్టు:—**
(లక్ష్మీనారాయణచెట్టు చూఁడుడు.)

**విషమకంకాళము:—**
(తాళములు చూడుఁడు.)

**విషమతాళము:—**
(తాళములు చూడుఁడు.)

**విషమము (గ్రహలయ):—** అతీత అనాగత సమములుగా తాళము నడువక, వేఱు విధములుగా నడుచుటకుఁ బేరు. ఇది సంగీతశాస్త్రమున దశప్రాణములలో నొకటియగు గ్రహము (లయ) నందుఁగల నాల్గుభేదములలో నొకటి. [గ్రహలయ దశప్రాణములుఁజూడుఁడు].

**విషమయతి:—** ఇది సంగీతశాస్త్రసంబంధఁపుయతి గాని, కవిత్వసంబంధము గాదు [యతిప్రాణము చూడుఁడు].

**విషయానందము:—**
[ఆనందములు జూడుఁడు].

**విషయానుబంధము:—**
అనుబంధచతుష్టయముఁ జూడుఁడు. [అందులో నొకటి].

**విషవృక్షన్యాయము:—** విషవృక్షము తాఁ బెంచినదైనను తన కషాయము గల్గింపఁజాలు నని భావము.

**విషస్య విష మౌషధమ్:—**ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి. విషములకు విషములే పరిహారములు. (ప్రతిక్రియయగునట్టివి యని భావము).

**విష్టపురిగోత్రము:—**
[జమదగ్ని వత్స ఉపగణముఁ జూడుఁడు].

**విషువత్పుణ్యకాలము:—**
[పుణ్యకాలములుఁ జూడుఁడు].

**విషువత్పుణ్యకాలములు, అయన పుణ్యకాలములు, సంక్రాంతులు:—**
[అయనములు, సంక్రాంతులు, విషువత్తులు చూడుఁడు].

**విష్ణుకళలు:—**
[కళలుఁ జూడుఁడు].

**విష్ణుకుండినులు [విష్ణుకుండినవంశనృపతులు:—]**వీ రాంధ్రదేశభాగముల నేలిన నృపతులు.

**విష్ణుక్రాంతచెట్టు** లా. Evolvulus Alsinoides; సం. విష్ణుక్రాంత:— దీనికపా

యము పురాణజ్వరములు, పైత్యజ్వరములు, ౨కఫ జ్వరములు, ఉబ్బుజాడ్యములు నివారించుననియు, కలరాపై మంచిపనిజేసి యాఁపుననియు, నెండిన చెట్లపొగ బీల్చుటవలన ప్రాతఉబ్బసఁపుదగ్గు నివారణమగుననియు జెప్పఁబడినది.

**విషుగంగానది:.**

(అలకానంద చూడుఁడు.)

**విష్ణుగ్రంధి:—**

(గ్రంధులు చూడుఁడు.)

**విష్ణుగయ:—** బీరారుదేశమున మెఖార్ పురముసమీపమున "లేనార్" అనంబడుతావున నున్న యాత్రాస్థలము.

మఱియు మధ్యరాష్ట్రములలోని నారాయనఁబడుతావును 'విష్ణుగయ' యందురు. విష్ణుగయ ప్రశంస పద్మపురాణ ఉత్తర ౬౨ అధ్యాయమునఁ గలదు.

**విష్ణుగృహము:—** తామ్రలిప్తిదేశఁపు రాజధాని యగు తామ్రలిప్తిపురమునకు వైష్ణవమతావేశమున నీపేరు వాడుచుండిరి.

**విష్ణుగోత్రము:—**

(జమదగ్నివత్సఉపగణముఁ జూడుఁడు.)

**విష్ణు దేవస్థానములందలి విగ్రహములు:—** ఇవి యిరువదినాల్గుభేదములు గలవి. వీని విధానము పాంచరాత్రాగమమున వివరింపఁబడినది. ఇది పరమేశ్వరుండగు వాసుదేవునివిలాసమనియు, నాదిచతుర్వ్యూహము, ద్వితీయచతుర్వ్యూహము నను ద్వివిధమనియు, నీ యెన్మిదివ్యూహములందును మొత్త మిరువదినాల్గు విగ్రహలక్షణములు వివరింపఁబడినవి. విష్ణుదేవునివిగ్రహములకు నాల్గుచేతు లుండును. అవి కుడివైపు రెండుచేతులును, ఎడమవైపు రెండుచేతులును గల్గియుండెడిని. అందుపైనిగల రెండుచేతులందు, శంఖము, చక్రము, క్రిందఁగల రెండుచేతులందు గద, పద్మము నను విష్ణుదేవునియాయుధములు నాల్గును, సమర్పఁబడియుండెడిని. అవి చేతుల మార్పులచే నిరువదినాల్గుభేదములుగ నుండును. విగ్రహము చూచువారల కెదురుగనుండునని తలంతుముగాక. అట్టితటి పైచేతులలోనికుడి చేయి యొకటి యనియు, క్రిందిచేతులలోని కుడి చేయి రెండనియు, పైచేతులలోని యెడమచేయి మూఁడనియు, క్రిందిచేతులలోని యెడమచేయి నాల్గనియు, మనప్రస్తుతపులెక్కకు గుర్తించుకొందుము గాక.




౧ ఆదిచతుర్వ్యూహము:— (ఇందు నాల్గువిగ్రహలక్షణములు చెప్పఁబడినవి.)

౧ వాసుదేవ లేక కృష్ణవ్యూహము— ౧ గద, ౨ శంఖము, 3 చక్రము, ౪ పద్మము.

౨ సంకర్షణ లేక రౌహిణేయవ్యూహము—౧ గద, ౨ శంఖము, 3 పద్మము, ౪ చక్రము.

3 ప్రద్యుమ్న లేక మకరధ్వజ వ్యూహము— ౧ చక్రము, ౨ శంఖము, 3 గద, ౪ పద్మము.

౪ అనిరుద్ధవ్యూహము— ౧ చక్రము, ౨ గద, 3 శంఖము, ౪ పద్మము.

౨ ద్వితీయ చతుర్వ్యూహము:— (ఇం దిరువది విగ్రహలక్షణములు చెప్పఁబడినవి).

౧ కేశవవిగ్రహము. వైభవవిలాసమూర్తి — ౧ పద్మము, ౨ శంఖము, 3 చక్రము, ౪ గద.

౨ నారాయణవిగ్రహము. వైభవవిలాసమూర్తి. ౧ శంఖము, ౨ పద్మము, 3 గద, ౪ చక్రము.

3 మాధవవిగ్రహము. వైభవ విలాసమూర్తి. ౧ గద, ౨ చక్రము, 3 శంఖము, ౪ పద్మము.

౧ వాసుదేవవ్యూహము:—(ఇందైతు విగ్రహలక్షణములు చెప్పఁబడినవి).

౪ అధోక్షజవిగ్రహము. విలాసమూర్తి. ౧ పద్మ, ౨ గద, 3 శంఖ, ౪ చక్రి.

౫ పురుషోత్తమవిగ్రహము. విలాసమూర్తి ౧ చక్ర ౨ పద్మ, 3 శంఖ, ౪ గద.

౨ సంకర్షణవ్యూహము (ఇందైదు విగ్రహలక్షణములు చెప్పబడినవి.)

౧ గోవిందవిగ్రహము. వైభవవిలాసమూర్తి. ౧ చక్ర, ౨ గద, 3 పద్మ, ౪ శంఖ.

౨ విష్ణువిగ్రహము. వైభవవిలాసమూర్తి. ౧ గద, ౨ పద్మ, 3 శంఖ, ౪ చక్ర.

3 మధుసూదనవిగ్రహము. వైభవవిలాసమూర్తి. ౧ చక్రి, ౨ శంఖ, 3 పద్మ, ౪ గద.

౪ ఉపేంద్ర విగ్రహము. విలాసమూర్తి. ౧ శంఖ, ౨ గద, 3 చక్ర, ౪ పద్మ.

౫ అచ్యుతవిగ్రహము. విలాసమూర్తి. ౧ గద, ౨ పద్మ, 3 చక్ర, ౪ శంఖ.

3 ప్రద్యుమ్నవ్యూహము— (ఇందైదువిగ్రహలక్షణములుఁ గలవు).

౧ త్రివిక్రమవిగ్రహము. వైభవ విలాసమూర్తి. ౧ పద్మ, ౨ గద, 3 చక్ర, ౪ శంఖ.

౨ వామనవిగ్రహము వైభవవిలాసమూర్తి ౧ శంఖ, ౨ చక్ర, 3 గద, ౪ పద్మ.

3 శ్రీధరవిగ్రహము. వైభవవిలాసమూర్తి. ౧ పద్మ, ౨ చక్ర, 3 గద, ౪ శంఖ.

౪ నృసింహవిగ్రహము. విలాసమూర్తి. ౧ చక్ర, ౨ పద్మ, 3 గద, ౪ శంఖ

౫ జనార్దనవిగ్రహము. విలాసమూర్తి. ౧ పద్మ, ౨ చక్ర, 3 శంఖ, ౪ గద.

౪ అనిరుద్ధవ్యూహము (ఇందైదు విగ్రహలక్షణములు గలవు).

౧ హృషీకేశవిగ్రహము. వైభవ విలాసమూర్తి ౧ గద, ౨ చక్రి, 3 పద్మ, ౪ శంఖ.

౨ పద్మనాభవిగ్రహము. వైభవ విలాసమూర్తి. ౧ శంఖ, ౨ పద్మ, 3 చక్ర, ౪ గద.

3 దామోదరవిగ్రహము. వైభవవిలాసమూర్తి. ౧ పద్మ, ౨ శంఖ, 3 గద, ౪ చక్రి.

౪ హరి విగ్రహము. విలాసమూర్తి. ౧ శంఖ, ౨ చక్ర, 3 పద్మ, ౪ గద.

౫ శ్రీకృష్ణ విగ్రహము. విలాసమూర్తి. ౧ శంఖ, ౨ గద, 3 పద్మ, ౪ చక్ర

## విష్ణుదేవుని యష్టలీలాక్షేత్రములు:-

౧ శ్రీరంగక్షేత్రమున శయనలీల. శ్రీరంగము దక్షిణదేశమున తిరుచునాపల్లికడనున్న పట్టణము. ఇది మధ్యరంగముగఁ జెప్పఁబడిన తావు.

౨ యదుగిరిశిఖరమున నిలువఁబడులీల

3 తిరుపతి [కొండపై] తిరుమల యనఁబడు దేవస్థానమున జాగ్రల్లీల. దీనింగూర్చి సంశయముఁ గలదు. శ్రీ వేంకటేశవిగ్రహము దొల్లింటి కుమారస్వామివిగ్రహమై యుండెననియు, శ్రీ రామానుజదేశికులనాఁ డిది విష్ణుస్థలముగ మార్చఁబడెననియు, పరిశీలకు లనెదరు. బలమగు ప్రతీతులును గలవు.

౪ ప్రియాగకడ త్రివేణి (గంగాయమునా సరస్వతీ అంతర్వాహిణి) సంగమమున స్నానమొనర్చులీల.
౫ బదరీనారాయణక్షేత్రమున జపమొనర్చులీల.
౬ శ్రీజగన్నాథమున భోజనలీల.
౭ అయోధ్యయందు పచారుచేయు లీల (ప్రచారము)
౮ ద్వారకయందు విహారలీల.

## విష్ణుదేవుని యేకవింశత్యవతారములు:—

(ఏకవింశత్యవతారములు చూడుఁడు.)

## విష్ణుదేవుని చతుర్వింశత్యవతారములు:—

(చతుర్వింశత్యవతారములు చూడుఁడు)

## విష్ణుపదపుణ్యకాలము:—

(పుణ్యకాలములు చూడుఁడు.)

## విష్ణుప్రయాగ:—

(పంచప్రయాగలు చూడుఁడు.)

## విష్ణుపురిశిఖరము:—

రుద్రహిమాలయమునం దొకశిఖరము. [గంగానది చూడుఁడు.]

## విష్ణుపురాణము [వైష్ణవము]:—

ఇది దేవీభాగవతమున పదియవదిగను, తక్కిన పురాణములందు మూడవపురాణముగనుఁ జెప్పఁబడినది. పరాశరప్రోక్తము గ్రంథసంఖ్య దేవీభాగవతమునను దక్కినపురాణములయందును, నొకే రీతిని చెప్పఁబడినది.

**విష్ణువ్యూహము:—** రామానుజీయవైష్ణవ వైతన్యవైష్ణవ మతధర్మములందు తదేకాత్మ రూపమహావిష్ణువు అందు ద్వితీయ చతుర్వ్యూహములలో నొకటి యనియు, సంకర్షణవ్యూహము లైదింటిలో నొక యుపవ్యూహ మనియు, వైభవ విలాసమూర్తి యనియు, వరుసగ గద, పద్మ, శంఖ, చక్రము లాయుధము లనియుఁ జెప్పఁ బడినది. [విష్ణుదేవాలయముల విగ్రహములు చూడుఁడు].



## విష్ణుదేవునియందుఁగలషడ్గుణములు:—

[రామానుజీయవైష్ణవమత ధర్మమున] షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు చూడుఁడు].

## విష్ణుదేవుని యాయుధములు:—

౧ సుదర్శనము [చక్రము]
౨ పాంచజన్యము [శంఖము]
౩ కౌమోదకి [గద]
౪ నందకము [ఖడ్గము]
౫ శార్ఙ్గము [ధనస్సు]

విష్ణుదేవుఁడువక్షమున ధరించుమణికిఁ గౌస్తుభ మనియు, రొమ్మునందలిమచ్చకు శ్రీవత్సమనియుఁ బేర్లు.

**విష్ణువృద్ధఉపగణము:—** ఇది ఆంగీరససంతతిలోని కేవలాంగీరసగణమందలి యొక యుపగణము.

౫ విష్ణువృద్ధ ఉపగణమున ౩౯ గోత్రములుకలవు.

బోధాయనసూత్రోక్తగోత్రములు [౧౩]
౧ అరుణ్య, ౨ దేవస్థాన, ౩ నైతుంద్య, ౪ ప్రాయణ, ౫ మద్రణ, ౬ మర్షణ, ౭ వాత్స, ౮ విష్ణువృద్ధ, ౯ వైహోడ, ౧౦ శర, ౧౧ శ్యాబరాయణ, ౧౨ సాత్యకాయన, ౧౩ సుత్య.

వారణ్యకేశిసూత్రోక్తగోత్రములు [౯]
౧ ఉపమితి, ౨ ఋణి, ౩ జౌపగవి, ౪ కాలమ్భాయని, ౫ కుశమిత్రి, ౬ నితున్దిల, ౭ వత్సావన, ౮ వ్యాయని, ౯ శ్రవణార్షవ్య.

మాత్స్యసూత్రోక్తగోత్రములు [౭]
౧ అపరాయణ, ౨ కత్రృణ, ౩ ఛత్రిణ, ౪ జత్రృణ, ౫ పుత్రిణ, ౬ వజ్రిణ, ౭ హోత్రిణ.

ఇతరగ్రంథోక్తగోత్రములు [౧౦]
౧ ఏకత, ౨ కామ్య, ౩ కృణి, ౪ త్రైత, ౫ ద్వైత, ౬ పత్రి, ౭ భద్రిణ, ౮ వాత్సప్రాయణ, ౯ శతమర్షణ, ౧౦ సాత్విక.

ఈ [విష్ణువృద్ధఉపగణమందలి] గోత్రములకుఁ బ్రవరరూపములు,
౧ ఆఙ్గిరస, పౌరుకుత్స, త్రాసదశ్వ
౨ ఆఙ్గిరస, విష్ణువృద్ధ, బాదరాయణ
౩ ఆఙ్గిరస, విష్ణువృద్ధ, నేతుంద్య
౪ ఆఙ్గిరస, విష్ణువృద్ధ, త్రాసదశ్వ
౫ ఆఙ్గిరస, విష్ణువృద్ధ, శతమర్షణ
౬ ఆఙ్గిరస, శతమర్షణ, కామ్య
౭ ఆఙ్గిరస, శతమర్షణ, కృణి
౮ ఆఙ్గిరస, శతమర్షణ, సాత్విక.

## విష్ణువృద్ధగోత్రము:—
(విష్ణువృద్ధఉపగణము చూడుఁడు.)

**విష్ణుశర్మ**:—బ్రాహ్మణుఁడు. వేదనారాయణపురాగ్రహారనివాసి. కుమారుఁడు చంద్రశర్మ. పౌత్రులు వరరుచి, విక్రమార్కమహారాజు, భట్టి, భర్తృహరి యనువారు. అందు విక్రమార్కమహారాజు సాహసాంకుఁడు. ఉజ్జయనీపురాధీశుఁడు.

వేఱొకవిష్ణుశర్మ సుదర్శనుఁడను భూపతిసుతులకుఁ బంచతంత్రమను నీతిశాస్త్రగ్రంథము రచించి, బోధించి నీతికోవిదులుగ నొనర్చినవిద్వాంసుఁడు.

## విష్ణుహస్తము:—
(హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.)

**విష్వక్సేనుఁడు**:— ఈపేరుఁగలవారిర్వురు గానఁబడుచున్నారు.

రామానుజీయా శ్రీవైష్ణవమతధర్మమున విష్ణుపరిచరులలో నొక్కండగు (వైకుంఠసేనానాయకుఁడును) అగువిష్వక్సేనుని కార్యనిర్విఘ్నపరిసమాప్తికిఁగాను (తక్కినహిందువులు) గణపతి నర్చించునటులఁ బూజింతురు. ఈతఁడొక విష్వక్సేనుఁడు.

మఱియు బృహదిషునిసంతతివాఁడగు బ్రదస్తునిసుతుఁడును విష్వక్సేనుఁడను పేరుగలవాఁడె.

## విష్వగ్జ్యోతి:—
ప్రియవ్రతునిసంతతివాఁడగు నొకభూపాలుఁడు.

**విషూచివ్యాధి** (Cholera):— ఈవ్యాధి కింకను కలరావ్యాధి యనియు, వాంతిభేది యనియు, మరిడీజాడ్యమనియు, ఘాటుజబ్బు లనియుఁ ననుటఁ గలదు. హేళనగా నింకను కొందఱీరోగాధిదేవతగ నొకతె భావించి, 'గంజాముముసలమ్మ' యనియెదరు. ఇట్లనుటయందుఁ బోల్లింటి గంజాం మండలమున నుత్కలభాగమునం దెచ్చటనో ఋషికుల్య యనునదీతీరమున 'గంజా' మనుపట్టం

ముండెడిదనియు, నట నీవిషూచివ్యాధి కధిదేవతగ నొకశక్తి పూజింపఁబడుచు నాపురవాసులగు నుత్కలుల కొకమసలియాపెవలెఁ గన్పడుచుండిన దనియుఁ గలప్రివాదముగ నెఱుంగదగును.

ఇది నిజముగాకున్నను ప్రాణాపాయకరమును, గుదురుటదుర్లభము నగు నీఘోరవ్యాధి నరుల హేళనకుఁ బాత్రమగుట యొకవింత కానేరదు. ఇది సూక్ష్మజీవులవలనఁ గల్గి యతిశీఘ్రముగ ననేకవిధముల వ్యాపించి, యించుమించు మరణము నిశ్చయముగఁగల్గించు ఘోరవ్యాధి. తఱచుగ పానీయములవలనను, నరుదుగ నట్టిజలములతో సంపర్కముం గల్గినభోజనపదార్థములవలనను మనుష్యులకుం గల్గుచుండును. దీనింగూర్చి ప్రభుత్వము వారిచే ననేకసంఘములగుండా పరిశీలనలు జరిగి కొంతవఱకు నీరోగరహస్యములు బయల్పడినవి. ఈసూక్ష్మజీవి 'S' ఆకారముం గల్గియుండు ననియు, వారియొక్క మలమూత్రాదులగుండాను, నోటిద్రవముగుండాను, పిదప చాల కాలము వెలువడుచుండుననియు, నీటియందు, పాలయందు నిది బాగుగ వృద్ధినందుచు, నసంఖ్యాకములగు సూక్ష్మజీవులు పెరుగుచుండుననియు, సెంటిగ్రేడు థెర్మోమీటరుకొలతను పదునేనుడిగ్రీలవేఁడికి తక్కువగను, నలువదిరెండుడిగ్రీలకధికమగు వేఁడియందును, మనజాలకుండు ననియు, ప్రాణవాయువు లేనితావులందు మనఁజాలదనియు, సంపూర్ణారోగ్యవంతు లీరోగముతాకుటనుండి తప్పించుకొనినను తప్పించుకొనఁగల్గుదురనియు, మనస్స్వాస్థ్యము లేనివారును, అలసినవారును, ఆహారలోపముగలవారును, భీతిఁజెందినవారును, వర్షాకాలారంభమునకుముం దెండిపోయిననూతులు, చెఱువులులోని జలముం ద్రాగువారును, అనారోగ్యగృహముల నివసించువారును, అజీర్ణరోగము గలవారును, సులభముగ నీరోగ మునకు లోనగుచుందురనియు, కసరుగాయలుమాగి, కుళ్లుచుండెడిపండ్లు మొదలగుపదార్థములు నిల్వయుండుటవలన చెడిపోయిన పక్వపదార్థములు, ఆకుకూరలు, తఱుచు తినుచుండువారును, ఈరోగమునకు సులభముగ బలియగుదురనియు, ఘనులగువైద్యులు పరిశీలించి కన్గొనియున్నారు.

ఈవ్యాధి యంకురించుటయందుఁ దగినన్ని సూక్ష్మజీవులు శరీరమునఁ జేరుటయు, లోన నభివృద్ధియగుట కనుకూలపరిస్థితులు లేకుంటయు సంభవించునేని ఒకటి రెండువిరేచనములతో నాఁగిపోవునుగాని, ఇట్టిది సర్వసాధారణముగఁ దటస్థించుట చాల యరుదు.

పలుచని గంజివంటి నీళ్ళవిరేచనములు, వమనములు, కాళ్ళుచేతులు పీకు, కడుపునొప్పి, అపరిమితమగు దాహమగుచుండుట, నీరసము గల్గి నలువదియెన్మిదిగంటలలో మరణముసంభవించుట లక్షణములు. శరీర మంతయు ముక్కుసహా చల్లగనై, వేఁడి తగ్గిపోయెడిని. మూత్రము వెడలుట మానును. ఈరోగఁపుసూక్ష్మజీవులు విరేచనమునందు, వమనమందును గోట్లకొలఁదిగ నుండునని కన్గొనఁబడినది. గాన త్రాగుజలముల ప్రాంతముల నీగుశుభ్రపఱచుకొనుట చాల యుపాయకరమగును. ఈఁగలును, పిల్లులు, కుక్కలు, ఈసూక్ష్మజీవులను తమసంచారములు నీసూక్ష్మజీవులను నీటి కంటించుంగాన జాగ్రతఁ గొనవలసియుండును.

వ్యాధి కుదిరినపిదపఁ గూడఁ గొంతకాలము సూక్ష్మజీవులు శరీరమునందుండి మలమూత్రాదులతో వెడలుచుండును గాన జాగ్రతఁ గొనుచుండవలసియుండును. వర్షాధిక్యము వ్యాధిని వ్యాపింపనీయదందురు. దీనిటీకాలు inoculation రోగము రాకుండ నాపునందురు. (అంటువ్యాధులు సూక్ష్మజీవులు చూడుఁడు.)

**విసర్పి (సర్పి, చప్పి, చప్పిడి):—** ఆంగ్ల Herpes ఎఱ్ఱఁగాని, తెల్లగగాని పొక్కులొక్కొక్కచోట గుంపుగ లేచి, బాధించెడి చర్మరోగము. అంటువ్యాధి. దీనికి సర్పి చప్పి చప్పిడి యని వాడుక పేరులు కలవు.

**విసర్జిత (క్రియ):—** అఱచేతిని క్రిందుగా (అధోముఖముగ) చేయి చాచి (విసర్జితచూడుఁడు.) యాచేతిని వెలుపలకు విసరుటకుఁ బేరు.

ఇది సంగీతశాస్త్రమున క్రియాప్రాణములోని దేశ్యక్రియ లెన్మిదివిధములలో నొకటి.

(క్రియాపాణిమను చూడుఁడు.)

**విస్కాస్ - పదార్థములు (Viscous meterials):—** ఇవి ఘన (solid) పదార్థములయ్యు వేడితగిలిన ద్రవపదార్థములుగ మాఱును. లక్క, గ్లాసు మొదలగున వీజాతికిఁ జెందినవి. ఇవి మంచువలె వేడితగిలిన కరఁగి ప్రవహించునవి కావు. నైసర్గికముగ ద్రవమగులక్షణము వీటియందు లేదు. గానసే యింకను గొంతవడికిఁ దిరుగ జల్లారి గట్టిపడి ఘనరూపము నందెడిని. ద్రవరూపము నందినయెడల రెండుకఱ్ఱముక్కల నడుమగ నలఁది, రెంటిసంటించిన రెంటిలోని కాళీ ప్రదేశములలోనికిఁ బోవుచో, కఱ్ఱయొక్క మఱ్ఱిని భాగములలోనికిఁగూడఁ జొచ్చుకొనిపోయి, తాను గట్టిపడుటతో రెండుకఱ్ఱముక్కలం బిగలాగి యొకటినొకటి కొత్తుకొనఁజేయుచుండును. దీనిని పట్టుపట్టిన (hold together) దందుము. ఈ రెంటింగల్పి బిగఁబట్టి శక్తి విస్కాస్పదార్థముల 'మొలక్యూల్సు' (molecules) నందున్నదవి కనిపెట్టఁబడియున్నది. అట్టిదానిని విడఁదీసి భూతద్దముతోఁ బరిశీలించితిమేని తాఁ జొరఁగల్గినంతవఱకా మొలక్యూల్సు జొరబడెంగాని కఱ్ఱలోనికి దూరమువ్యాపింపలేదని స్పష్టమగును. ఇందువలన నధికముగ cavities కల కఱ్ఱలం జక్కఁగఁ బట్టఁగల్గుం గాని, యల్పముగనుండు గట్టిపదార్థములకు cavities లేనికఱ్ఱలం బట్టఁజాలవని తోఁచెడిని.

**విస్పృష్టుఁడు:—** కంసుని తమ్ముఁడు.

**విస్పరింగుగేలరి (whispering ga-lary):—** చిన్నయింగ్లయం దుపన్యాసములు దూరమునుండి వినుట సంభవింపదు. వినుటయు, దుష్టముగనే యుండును. ఏలయన Sound waves అనుకూలముగ విన్పించురీతిని control చేయఁబడుచు నిర్మింపఁబడలేదు.

ఉపన్యాసాదులకు నిర్మింపఁబడిన గొప్పగొప్ప విశాలభవనము లీ యేర్పాటు ననుకూలింపఁజేసి కొనునటుల నిర్మింతురుగాన, నట్టివాటియం దుపన్యాసములు దూరమునుండి గూనను చక్కఁగ వినదగ్గెడిని. లండనునగరమునందలి సెంటుపౌల్ దేవాలయముపైనున్న డోమునం దిట్టి యేర్పాటులు చక్కఁగ నమరియుంట నం దెంత మెల్లఁగ గుసగుసలాడినను చక్కఁగ విన్పించుచుంట సుప్రసిద్ధము. వాటికే 'విస్పరింగుగేలరీ' లనియెదరు.

**విస్ఫారికసన్నిపాతము:—**

(సన్నిపాత దోషము చూడుఁడు)

**విహారమహాదేవి (రాజ్ఞి):—** ఈమె అనూరాధపురము రాజధానిగ సింహళరాజ్య మేలినకాకవన్నతిస్సా మహారాజుపట్టఁపుదేవి. దూతూజుము నుమహారాజునకుఁ దల్లి. క్రీ.ము. ౧౫౦ సంవత్సరములప్రాంతమున 'కాకనసతిస్సా' యనుపేరుఁగల నృపతి అఱవలు (తమిళులు) అదేపనిగ సింహాలముపై దాడివెడలుచు, అనూరాధపుర మాక్రమించుచుండ, దాని దక్షిణమునఁ గొంతదూరమునం దెచ్చటనో మహావేలి గంగానదీతీరమునఁ గొంతకాల ముండనయ్యెనఁట. అప్పటి నొకపాటిపడవ

గాలికిఁ గొట్టుకొనుచు నరుదెంచి యట్టు తీరమునకుఁ జేరెనఁట. అందుండి యొక నారీరత్నము దరికిందిగి దీనవదనయై ఖిన్నతతో తాను కెలానియా సామంతరాజపుత్రి ననియు, అతని క్రూరకార్యములకుఁ గినిసి దేవత లాతనిరాజ్యమం దొక భాగము సముద్రగామి యగునట్లొనర్ప నాతఁడు ఖిన్నుఁడై, వయసునందిన తనయనుంగుపుత్రికం బలియీయ నుద్యుక్తుఁడై చంపఁజాలక నీయోడయందు సేవకురాండ్రనైత మెక్కించి, సముద్రఁపు లోఁబారున విడిచి బలి సర్పించెను. కాని, దైవవిధి యట్లుండ, సముద్రమునఁ బడవకేయపాయమును జరుగక వాయువశంబున నీతీరమునంజేరుటలో భూనాథునియెదుటనే యోడదిగుట సంభవింపనయ్యెను. గాన యోభూనాథా! మమ్ము నీరాజ్యమునుండి పోనిచ్చిన మావిధి మమ్ముఁ దీసికొనిపోయినరీతికి లోఁబడి, సామంతకూటశిఖరమునకెక్కి, శ్రీబుద్ధపాదపవిత్రస్థలిం బూజించి, మచ్ఛాపరించియున్న దుర్దోషభరిమును బాపికొందుమనియెనఁట. భూనాథుండగు కాకవన్నతిస్సా వెఱగందియు నా రాకొమరితపై బద్ధానురాగుండై, రాజపుత్రీ! నీ యాత్రలనెఱిపి, నీసంకల్ప మీడేర్పబద్ధుండను. నీ యాజ్ఞమేరకు మెలంగుచుండ వ్రతమునఁబూనెదను. నన్నన్యునిగ భావింపక నాకుఁ బట్టంపురాణివై ధన్యునిగా నొనర్పుమని వేఁడ, నాసుందరియు నియ్యకొనెనఁట. ఆమెకు 'విహారమహాదేవి' యనిపేరు. ఆయిందువదన నిల్లాలుగనంది, సుఖాబ్ధి నోలలాడుచు నాకాకవన్నతిస్సా నృపాలుఁడు తిస్సామహారామమునుం గట్టించి, జెమును తిస్సా లనుపేరుగల్గిన యిర్వురుసుతులం బడసెనఁట. ఇప్పు డామహారామము ద్వీపఁపుదక్షిణతీరమందలి మతారాపురమునుండి బాటను, అఱువది రెండుమైళ్ళ దూరమునందున్న మఠము, మఱియు నిక్కాలమున ద్వీపమునందున్న పుణ్యక్షేత్రములలో నొకటిగ దర్శింపఁబడుచున్న తావు.

అట్లాదంపతులు బాలకులగు నిర్వురుసుతులతో రాహూనీయందుఁ గాలముఁగడుపుచున్నతఱి నొకనాఁటిరాత్రి విహారమహాదేవి నిద్దురనుండి మేల్కాంచి, జెమునురాకొమరుని ప్రక్కపై ముడుచుకొని పరుండి నిదురించుచుండ లేపి, 'తండ్రీ! ఏల యిట్లు ముడుచుకొని పరుండెదవు. విశ్రాంతిగఁ జాచుకొని పరుండుమని లేపెనఁట. బాలుండగు జెమును "అమ్మా! ఎవ్వరికిని లొంగి లోఁబడనిసముద్ర మొకదెసను, అవ్వలితీరమున దమిళులైరులంగల్గిన మహావేలి గంగ రెండవ దెసను, గల్గినమనకు విశ్రాంతిగఁ గాలుచేతులం జాచుకొనిపరుండ నీలెక్కడున్నది? నన్నిట్టి యిప్పటికిఁ బండనిమ్మని తిరుగ నట్లె నిదురించెనఁట.

అంతఁ గొంతవడికి జెమునురాకొమరుండు యుక్తవయస్సురాఁ దమిళులం దును మాకు దాడివెడలఁ దన కనుమతి నొసంగుమని తండ్రిని బ్రార్థింప, నమ్మహీపతి కొంతకాల మాగుమని వారించెనఁట. అట్లింకఁ గొంతకాలము సైన్యబలమును బలపఱచుకొని రాసుతుండు తిరుగఁ దండ్రి నదేకోర్కెతోఁ బ్రార్థింప, తండ్రి యియ్యకొనక ఓర్చియుండుమనెనఁట. జెమును విసికి, తనతల్లి చేతియలంకారపుగాజులు రెంటి నడిగి పుచ్చుకొని తండ్రికడకరిగి తిరుగ ననుజ్ఞనడుగ, తండ్రి శాంతవచనములనే యుపదేశింపఁ గాంచి 'భూపతీ! యింక దేవరవా రొకటియు, నే నొకటియు నీ హస్తాలంకారముల ధరింతుముగాక' యనెనఁట. కాకవనతిస్సా తనసుతుని రణశూరత్వమున కచ్చెరువంది, సంగరమున కనుజ్ఞనిచ్చి, తానును దాడి వెడలి జెముని రాసుతుని సైన్యాధిపతిగ నొనర్చి, సంగరమొనర్చి, దమిళులం బరిమార్చి యనూరాధపుర మాక్రమించిరఁట. అది యాదిజగమునూ

రాకొమరుఁడును పిదప జమునామహీపతియైన తరినిగూడ నుతు (హస్తాభరణఁపురాజు) జమును యనఁబడుచుండెనఁట. అతఁడు తండ్రియనంతర భూపతియై తనకుఁ బిదపఁ దనకనిష్ఠ సోదరుండగు తిస్సాను సింహాసన మప్పగించెనఁట.

ఇంక నిటఁ జెప్పఁదగిన సంగతిఁ జెప్పి యవ్వల కరుగుదముగాక. తిస్సామహారామస్థూపమొక చిన్ననదియొడ్డున జలసమీపముననే నిర్మింపఁబడినది, దానిపై శిఖరము మొదలగు స్థూపాకారము క్రిందకదలనిశీతలజలమున స్పష్టముగ ప్రతిబింబించుచున్నద్దమునందువలెఁ గాన్పించుచుండ నదియందు స్నానము లొనర్చువారిముల్క లాప్రతిబింబమును యంగొంచు చిన్నయలలుపాలు జేయుచుఁ గడపునే గాని రూపుమాపఁజాలవు. ఇది చూడఁదగిన చిత్రము. అప్పటిసింహళదక్షిణమహాసంగ్రామము కలుతరగ్రామ పరిసరముల నడచెనని బలముగు ప్రతీతికలదు.

**విక్షిప్త (క్రియ):**— అఱచేతిని క్రిందుగా (అధోముఖముగ) చేయి చాచి (విసర్జితచూడుఁడు). ఆచేతినాల్గువ్రేళ్ళను ముడిచి తనదిక్కునకుఁ దీయుటకుఁ బేరు.

ఇది సంగీతశాస్త్రమందలి క్రియాప్రాణము లోని దేశ్యక్రియ లెన్మిదివిధములలో నొకటి. (క్రియాప్రాణము చుడుఁడు).

**విక్షేపము:**— ఇది సంగీతశాస్త్ర మందలి క్రియాప్రాణములోని మార్గక్రియయందలి నిశ్శబ్ద క్రియలలో నొకటి. (క్రియాప్రాణము చూడుఁడు).

**వీచీగ్రామము (ఇప్పటిబిథా):**— ఆగ్రా అయోధ్యాసంయుక్తరాష్ట్రములలోని యలహాబాదుపురమునకు నైఋతిదిశగా ౧౧ మైళ్లుదూమున యమునానదికిఁ గుడిప్రక్కతీరమున శోల్పఁబడినది. ఇచట దొరికిన శిల్పమునుండి Sir John marshall గారు దీనిని పోల్చిరి. ఇప్పటిపేరు బిథా యని యైయున్నది.



**వీచీతరంగన్యాయము:**— నీటియందలలు (కెరటములు) కలుగుటతో ధ్వనియు సిద్ధమే. ఒకకార్యముతోఁగూడ వేఱొకకార్యముం గూర్చి తెలుపుట కీన్యాయము వర్తించును.

**వీచుచుండనితఱిగాలినిలచియుండుటః:**— వాతావరణఁపుగాలి నిలచియుండు తఱి దానికి 'air' అనియు, వీచుచుండుతఱి దానికి 'wind' అనియు, నాంగ్లమున సాంకేతిక నామములు. గాలివీచుచుండుట జలప్రవాహముంబోలినదియే. ప్రవాహములేకుండుతఱి జలములు నిలచియుండునట్లలనే వీచుటలేనితఱి వాయువును నిలచియే యుండెడిని. వాయువు లేచుటకు వేఁడియై పైకెగయుట, ప్రక్కలనుండి చల్లనివాయువాతావునకు వచ్చుట, ప్రేడ్వింన్సుప్రవాహములు మొదలగున వనేక కారణములు కలవు. నిలచియుండుట గాని, వీచుచుండుట గాని, గాలి కొకవిధానఁపుస్థితి particular state of the airగాఁ జెప్పఁబడవలయునుగాని, రసాయనశాస్త్ర పద్ధతిగా గాలికి వీచుటగాని, నిలచియుండుటగాని లక్షణముగాఁ జెప్పవీలుండదు. గాలి దళసరిగా deuser నుండుతావులనుండి తక్కువగా (rarity of air) నుండినతావులకు వీచుచుండుట సహజమని కొంతవఱ కనందగును. తుపానులందు గాలి యుద్ధృతగతిని వీచుచు సుడితిరుగుచు బాధించెడిని.

**వీటోఅధికారము (Veto Power):**— "వలదు" అనునిరాకరించి రద్దుచేయు స్వాతంత్ర్య

రము. ప్రజలు శాసనసభలద్వారా యంగీకరించి, కోరిన శాసనమును ప్రభువులు గాని, ప్రజాప్రభుత్వ దేశములం దగ్రాసనాధిపతులు గాని, తమ కయుక్తమని తోచినచో నిరాకరించి, యంగీకరింపక నిలపివేయుటకు 'వీటో' అని పేరు.

ఈ వీటోస్వతంత్రిత, అమెరికాసంయుక్త రాష్ట్రముల యగ్రాసనాధిపతికిఁ గలదఁట. కాని, ఆ యనిరాకరణమునకుఁ బిదప రెండుహౌసులప్రజా ప్రతినిధులు కలసి తిరుగ నాశాసనమునే పునరుక్తించిరేని యది శాసనమగునఁట.

బ్రిటీషుసామ్రాజ్యచక్రవర్తి వీస్వాతంత్ర్యమును క్రీ. శ. ౧౭౦౭ నుండి యుపయోగించుచుండుట లేదు. కొన్ని దేశముల భూపతులు కొన్ని ప్రజాప్రభుత్వముల యగ్రాసనాధిపతు లీవీటో స్వాతంత్ర్యమును నేఁటికి నుపయోగించుచునే యున్నారు.

**వీణలు:**—వీణకు సంస్కృతమున విపంచి యనుపేరు. సంగీతమునందలి పలుకుల నన్నింటిని వీణపై వాయించి పల్కించుదురు. అట్టివీణలు తొలుత నాలువిధములుగ నుండి పిదప కాలమున నధికరూపములుగఁ గొంచెపుమార్పులతో నితర సంగీతపరికరములం గల్పించినవి. వీణలను వాయించుట కాయత్తపఱచుట యనఁగా వేర్వేరు స్వరములఁ బలుమెట్లను వేర్వేరు స్థానములందు బిగించుటను మేళగించుట యనఁబడును. అట్టిమెట్లను వేర్వేరుస్థానములందు స్థిరపఱచుట యుత్తరహిందూదేశపు భాషలందు టాట్ అని యందురు. ఈటాట్ చలమనియు, నచలమనియు ద్వివిధము. చలము మెట్లను వీలగుతావుల కెప్పటికప్పుడు చేర్చి తిరుగుడుచీలలచే బిగించుచుండు నేర్పాటు. అచలమట్లుగాక వేర్వేఱుద్వారములం బల్కుటకు వేర్వేఱుతావులందు మెట్లనుమైనము మొదలగువాటితో బిగించి స్థిరపఱచుట. ఇట్టితఱి తంత్రులను మాత్ర మప్పటప్పట బిగించుకొనుచు సరియగు ధ్వనినిచ్చుస్థితియందు దూడునట్లు చక్కఁ బఱచుకొనుచుండవలసియుండును. దీనికిఁ దంత్రుల మేళగింపు అనిపేరు. సంగీతముపాడుటయందు దంతటితో నాఁగక మృదంగము (మద్దెల) లేక తబలా (ఇది హిందూస్థానీదేశపుమృదంగము) ధ్వనితో తంత్రుల ధ్వనిని సరిఁజేసికొనుటకు శ్రుతిఁగుదర్చుకొనుట లేక శ్రుతిమైచుకొనుట యనియందురు. అన్నిశ్రుతుల నేకస్థితియందుంచి కుదిర్చినసంగీతము రంజకమైన పాట లేక వాయిద్యము శ్రావ్యమై రక్తిఁగల్గును.

శ్లో॥ నారదస్యాపి మహతీ తుంబురోస్తు కళావతీ
విశ్వావసోస్తు బృహతీ సరస్వత్యాస్తు కచ్ఛపీ.

అని చెప్పఁబడియుంట సంగీతపరికరములగువీణలాదికాలమున మనదేశమున నాలుగుండినట్లు తెలిసెడిని. వీటినే పూర్వులు సంగీతవిద్యాసాధనములని వాడియున్నారు.

అట్టియాదికాలమున నీవీణలు మహతి, లేక రుద్రవీణ, కలావతి, బృహతి, కచ్ఛపి, లేక సరస్వతివీణయు యని నాల్గుతెఱంగులుగ నుండెను.

ఇందు మహతీవీణలక్షణము మొదటను, కడను, రెండుతుంబలును, రెంటికినడుమ రెంటింగల్పు వెదురుబొంగును గల్గి, స్వరములుబల్కుట కిరువదిమెట్లును వాటిపై సంగీతధ్వనులొసంగి పల్కుటకు నాల్గుతీఁగెలం గల్గియుండునని చెప్పఁబడినది. ఇది యుత్తరదేశములందు వాడుకయందున్న వీణె దీనికి రుద్రవీణె యనియు పేరయ్యెనఁట. దీని మెట్లు చలనముంగల్గుననియఁట. అనఁగా టాటన్ నుపాటకు దప్పుడప్పుడుఁ తనకౌసరమైన స్వరముల బల్కుటకు మార్చుకొనవీలగునవిగ నుండును.

దీనిని నారదుఁడు ధరించి పాడునని చెప్పఁబడినది. ఈవీణియ మీటకనే నారాయణస్మరణము చేయు స్వభావముఁ గలది.

రెండవదియగు కలావతీవీణ తుంబురునకుఁ బ్రేమాస్పదమై తుంబురువీణ యని రానురాను పేరందినది. మఱియు నదియే యిక్కాలమునకు 'తంబూరా' యైనది. దీనియందు నాల్గుతంత్రులుం (తీఁగెలుం) డును. కలాస్వరంబులు (అనఁగా షడ్జమస్వరము, పంచమస్వరములకు సంగీతశాస్త్రమునఁ గల లనిపేరు.) హెచ్చుషడ్జమము, తక్కువ షడ్జమము, హెచ్చుపంచమము, తక్కువపంచమములం బల్కుచు మెట్లులేమిచే శ్రుతులను జ్ఞాపకముఁ జేయుచుఁ బల్కుచుండు నీతంబూరాశ్రుతికై యుపయోగింపఁ బడుచుండినది. బుద్ధిమంతు లగువిద్వాంసులు దీనికి నిటీవలఁ జలించుమెట్లులం గల్పించి వాడుచున్నారు. కలాస్వరములగు షడ్జమ పంచమస్వరములం బల్కునది గాన దీనికిఁ గలావతీ వీణయని పే రయ్యె నందురు.

మూడవదియగు బృహతీవీణ దీనిని విశ్వావసుండను గంధర్వుఁడు వాయించుచుండెననియు, దీని నాతఁడు ముద్దుపేరుగ సారంగము (లేఁడి) అని చెప్పుచుండువాఁడఁట. ఇక్కాలమునను దీనిని 'సారంగి'యనియు, 'సారంగవీణ' యనియు వాడుచున్నారు. ఉత్తరహిందూస్థానమం దిది ప్రచారమున నున్నది. దీనికి మెట్లుండవు. దీనియందుఁ దంత్రులసంఖ్య పదునేనునటికుండును. వాట్లపై నిక్కాలఁపుఫిడేలు తీఁగలపై గీచువిల్లువంటి విల్లుతో గీచుచు సంగీతస్వరావళిం బల్కింతురు. ఇక్కాలఁపుఫిడేలు దీనింజూచి పాశ్చాత్యదేశస్థులు రచించినదిగా తలంపఁబడుచున్నది. మఱికొందఱు ఫిడేలు కేవలపాశ్చాత్యకల్పితపరికరమే యని తలంచుచుందురు. అది యెట్లున్న నాదిరూపమగు సారంగవీణ భరతదేశఁపుదియే.

ఇంక నాల్గవదియగు కచ్ఛపీవీణకు 'సరస్వతీవీణ' యనిపేరు కలదు. దీనిని సరస్వతీదేవి వాడుచుంట నీపేరు కల్గెనని చెప్పఁబడినది. ఇది యాంధ్రదేశమున సర్వసాధారణముగ వీణ యని చెప్పఁబడుచు వాడుకయం దున్నది. ఇదియే సర్వసాధారణముగ నంద రెఱింగినవీణ. మొదలునందు గుల్లగఁ దొలువఁబడి మూయఁబడిన గుండ్రనికఱ్ఱ తుంబయు, కడను తగల్పఁబడిన యానపకాయ తుంబయుం గల్గి, రెంటినిగలుపుచు మధ్యనుండు దండె కాలువవలె గుల్లగఁదొలువంబడి పైమెట్లు మర్పఁబడియుండును. ఈమెట్లు వేర్వేఱుస్వరంబులం బల్కించుట వేర్వేఱుతావులందు మైనముతో బిగింపఁబడి యచలముగఁజేయఁబడి యుండును.

మెట్లపైనుండి స్వరములంబల్కించుటకు నాల్గు తీఁగెలును, వీణకుఁగుడివైపున క్రిందుగ జిటికెన వ్రేలుతో లయనైచుచుండుటకు మూఁడుతీఁగెలును మొత్తమేడుతీఁగెలం గల్గి తాఁబేటిదూకారఁపు గ్రిందితుంబఁ గల్గియుంట కచ్ఛపి యని పేరందిన దందురు. దీని నాంధ్రదేశమునందునను దక్షిణదేశములందునను తఱచు వాడుచున్నారు. ఇట్టివీణలను దంతముతోను, వెండిబంగారులతోను నలంకరించుటయే గాక ధ్వనిని చక్కఁగ నిలిపియుంచుటకుఁ బచ్చలపలకలు, నీలఁపుపలకలు, తంత్రుల క్రింద బిగించియుంచువీణలు గొప్పగొప్పవారివద్ద నున్నవి.

ఆదిన వీణలమెట్లను క్రిందికి, పైకి జరుపుకొనుటకు వీలగునట్లు చేసి, మరశీలలచే బిగించువారు. (బలముగుటాట్) తరువాత 'చిత్తా'లనంబడుచున్న తంబూరా (తుంబురువీణ)యందుఁగూడ హిందూ

స్థానీదేశమున నీబలమగు టాటీ (మెట్లపర్పాటు) చేయఁబడి వాడుకయం దున్నది. దానికె చితార్ అనిపేరు. షడ్జమ పంచమములు లభేద్యస్వరము లనియు, కలాస్వరము లనియు పేరందినవి. ఇం దాతర్భేదములుండవు గాన నివిరెండును రెండుగనే యుండును. ఇంకఁ దక్కినదరిషభ, గాంధార, మధ్యమ, దైవత, నిషాద స్వరములైదు ప్రకృతి వికృతిరూపములగు రెండేసిగనై పదియైనవి. కలాస్వరములు రెండుంగల్పి నివి పంన్రెండగును. ఇవియె చలమగుటాటీనందు మెట్లుగఁ జేసినఁ జాలును. దీని నచలముగఁ జేసినతఱి వీటి కింకను నెన్మిది మెట్లు కల్పవలసివచ్చును. గాన మహతి కిలావతివీణలందు మెట్లు నచలములుగ నొనర్చు నదనున నిరువదిమెట్లుగ బిగింపఁబడుచున్నవి.

ఇంక సరస్వతీవీణయగు కచ్ఛపీవీణయందు స్వరములఁబల్కించు మెట్లు లచలస్థితిఁ గలవి. వీట్లను మైనముచే నర్థస్థానముల వేర్వేఱుస్వరములం బల్కునటుల బిగించి, స్థిరపర్చెదరు. ఈసరస్వ వీణయం దిరువదినాల్గుమెట్లుండును. ఉత్తరదేశఁపువీణలం దిరువదిమెట్లేయుండునని మున్ను చెప్పఁబడినది. మనదేశఁపు సరస్వతీవీణలం దిరువదినాల్గు మెట్లు బిగించియుంచు నేర్పాటు రామరాజభూషణ కవి యొనరించెనని బలమగుప్రతీతియే గాక గ్రంథములందుగూడ తర్వాతికాలఁపువైణికులు వివరించి యున్నారు. అనఁగా నీనాల్గుమెట్లు రెండు రిషభ స్వరములుగను, రెండు గాంధారస్వరముగను నిది వఱకు హిందూస్థానదేశఁపుఁబద్ధతికన్న నధికముగఁ జేర్చి రామరాజభూషణకవి యిరువదినాల్గు సరస్వతీ వీణ కేర్పఱచెనని యెఱుంగునది. ఇది చాల సులభముగ వీణావాయింప వీలగుచున్నట్లు తలంపఁబడుచున్నది. ఇంక నిక్కాలమున ఫిడేలు క్లారొనెట్లు, సానై, అల్గోజా, వేణూ నాదము (పిల్లంగ్రోవి) మోర్సింగు, పియానో, హార్మోనియమ్, జలతరంగిణి, సంగీతపుఁబెట్టెలు మొదలగు పెక్కుసంగీత పరికరములు గానంబడుచుఁ బ్రచారము నందుచున్నవి. ఇందు విదేశ గానపరికరములుఁ గూడఁ గలవు.

**వీణెము లక్ష్మీపతికవి:—** ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. గౌడబ్రాహ్మణశాఖ యని చెప్పుచున్న శిష్టకరణకులస్థుఁడు. తండ్రిపేరు కృష్ణరాజపాలకుఁడు. తల్లి రంగమ్మ. రచించినది అభిమన్యుపరిణయము.

**వీతహవ్య లేక యాస్కగణము:—** ఇది భృగుసంతతిలోని యొకగణము. ఇందు డెబ్బదిమూఁడుగోత్రములు చెప్పఁబడినవి. దీనిని యాస్కగణమనియు నందురు.

బోధాయన సూత్రోక్తగోత్రములు. (౨౬)

౧ ఉగ్రవిత్రి,
౨ జేష్ఠ,
౩ కౌటిల్య,
౪ కౌశాంబేయ,
౫ చిత్రసేన,
౬ దైవతాయన,
౭ దుర్దిన,
౮ దైవస్థాయన,
౯ సూప,
౧౦ భాగస్త్తి,
౧౧ భాగలేయ,
౧౨ భాగవిజ్ఞేయ,
౧౩ భాగురి,
౧౪ భాస్కర,
౧౫ మధ్యమేయ,
౧౬ మూక,
౧౭ మహాన,
౧౮ యాస్క,
౧౯ రాజతాపి,
౨౦ రోదదిన,
౨౧ వర్ఘుపుష్య,
౨౨ వాకాశ్వకి,
౨౩ వాధూల,
౨౪ వార్కరేలయ,
౨౫ వాసి,
౨౬ సాత్యకి.

మాత్స్య సూత్రోక్తగోత్రములు (౨౬).

| | |
|---|---|
| ౧ కస్యపి, | ౧౪ మాదాయన, |
| ౨ కౌటిల్య, | ౧౫ మాసలిపిలి, |
| ౩ ఘల, | ౧౬ వాలేయ, |
| ౪ గార్జిగ, | ౧౭ వాసోద, |
| ౫ ఛన్దమోదన, | ౧౮ వాహ్లి, |
| జ్వరి, | ౧౯ విలేభి, |
| ౭ జైవత్యాయన, | ౨౦ వీతహవ్య, |
| ౮ తార్క, | ౨౧ శార్కరాక్షి, |
| ౯ దీర్ఘచిత్త, | ౨౨ శాలజ్ఞాయన, |
| ౧౦ ప్రివారేయ, | ౨౩ సమదోగేయ, |
| ౧౧ భవస్త్య, | ౨౪ సానుస్టి, |
| ౧౨ భాగలి, | ౨౫ సౌరి, |
| ౧౩ భాగవిత్తి, | ౨౬ హాలేయ. |

కాత్యాయనసూత్రోక్తగోత్రములు (౧౧).

| | |
|---|---|
| ౧ అగ్నిలేభి, | ౭ మన్బారేయ, |
| ౨ గోదాయన, | ౮ మాదోక, |
| ౩ గరిక్షిత, | ౯ మాధుల, |
| ౪ దైర్ఘచిత్త, | ౧౦ వృకాశ్మక, |
| ౫ పంచాలవ, | ౧౧ పౌష్టావత. |
| ౬ పాణ్యావత్త, | |

ఆశ్వలాయనసూత్రోక్తగోత్రములు (౨).

౧ సానర్ణి, ౨ సార్షిట.

ఇతరగ్రంథోక్తగోత్రములు [౮].

| | |
|---|---|
| ౧ ఐతిశాయన, | ౫ పిలి, |
| ౨ జాబాలి. | ౬ మాండు, |
| ౩ జీవన్త్యాయన, | ౭ మాసలి, |
| ౪ జైమిని, | ౮ నైతహవ్య. |

ఈగోత్రములకుఁ బ్రవరరూపములు:

౧ భృగు, (ఏకార్షేయప్రవర)
౨ భార్గవ, వైతహవ్య, సావేదస,
౩ భార్గవ, ఔరవ, జమదగ్న్య,
౪ భార్గవ, చానవ్య, ఆప్నువన,
౫ భార్గవ, చ్యావన, ఆప్నువన, ఔరవ, జమదగ్న్య
౬ భార్గవ, చ్యావన, ఆప్నువన, ఆర్ష్టిషేణ, అనుప
౭ భార్గవ, ఆర్ష్టిషేణ, అనుప.

## వీతహవ్యగోత్రము

(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**వీతిహోత్రుఁడు:**—యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడగు తాళజంఘునికుమారుఁ డొకవీతిహోత్రుఁడును, కాస్యుఁడగు ధృష్టకేతుని కుమారుఁ డొకవీతిహోత్రుఁడు (ఈతనిసుతుఁడు భారవుఁడు) ను, ఇంద్రసేనునిసుతుఁ డొక వీతిహోత్రుఁడును, ముప్వురు గాననగుచున్నారు.

**వీనస్గోళము (Venus):**—ఇది Solar system నకుఁ జెందినయొకగోళము. సూర్యగోళమునుండి 6,90,00,000 మైళ్లదూరమున నాగోళముంజుట్టి, 224 దినముల 16 గంటలలోఁ దిరిగి వచ్చుచుండునది యనియు, భూమిపరిమాణముతోఁ బోల్చిచూచిన 9.10 భాగముండు శరీరముగలది యనియుఁ జెప్పఁబడినది. ఐరోపాదేశముల Astronomy శాస్త్రవేత్తల కాదినుండి దీనింగూర్చి తెలియునని చెప్పఁబడినది. దీనిని శాస్త్రవేత్తలు 'Inferior planet' అనియెదరు. దుర్భిణీయంత్రముగుండా దీనిని బరిశీలించిన మనచంద్రునకువలెనే వృద్ధిక్షీణతలు కలవని తెలియఁగలదు. దీనిమార్గము సూర్యునకు భూమికి నడుమనుండును. భూమి యెన్నడువీటినడుమ కేగదు. వీనస్గోళము తనకుఁ దానే గిరగిరఁదిరుగు సూర్యునిం జుట్టివచ్చునది. శీతోష్ణస్థితి భూమింబోలియే యుండుననియు, దీనియందుఁ జెట్లుచేమలుండవనియుఁ దలంచుచున్నారు.

ఇది యెక్కువప్రకాశమానమైనది. సూర్యునకుఁ బశ్చిమముగా నుండుతఱి తెల్లవారు ఝాముననే ఉదయించుచుఁగాన నత్తరి 'Morning star' యనియు, సూర్యునకుఁ దూర్పుననుండుతఱి వెలుఁగు నస్తమించుచుంగాన 'Evening star' అనియు దీనికిపేరు కలదు. దీనియందువాతావరణమును, ఎత్తుగుపర్వతములును గలవని పరిశీలనల నుండి తేలినది. దీనిని భరతదేశపుజ్యోతిషశాస్త్రమున శుక్రుం డనియెదరు. [సోలార్ సిస్టము చూడుడు. ఎస్ట్రోనొమీ చూడుడు.]

## వీనుకులగోత్రము:—

[విన్నుకుల చూడుఁడు].

## వీపుమీఁదఁ గొట్టుట కడుపుపైఁ గొట్టుటకన్న మేలైనదే:—

[ఆంధ్రలోకోక్తి].

## వీరగోత్రము:—

(పౌతఘ్న ఉపగణము చూడుఁడు).

**వీరబాహువు:**—కాశీయందుఁ దొల్లింట హరిశ్చంద్రునికొని, శ్మశానమున సేవకావృత్తి నొసంగినయాతఁడు. ఈతనిసంతతివారు హరిశ్చంద్రశ్మశానముకడ భవనమున నివసించుచున్నారు. వీరబాహువు యమునియంశమున జనించినవాఁడఁట.

**వీరభద్రస్వామి:**—దక్షప్రజాపతి కుమార్తెలలో సతీదేవియను కుమార్తెను శివుఁడే భార్యగఁగైకొనెను. ఈమె యాదిశక్తియంశంబున జనించిన దేవి.

ఒకప్పుడు బ్రహ్మ సత్రయాగ మొనర్ప నందఱేతెంచిరఁట. దక్షుఁ డాలస్యముగ నేతెంచి యాసీనుండై యున్నశివుఁడు తన కల్లుఁడయ్యు తన్నుఁజూచి లేవకుండుటకుఁ గినిసి యాతనను నిర్లక్ష్యముగఁ జూడనెంచి, తాను బృహస్పతిసవనమనుయాగ మొనర్పసంకల్పించి, శివుని సతీదేవి నాహ్వానింపకపోయెను. పెక్కండుఋషులిది తగనిదియు శివవిముఖమగుయాగము చెల్లదనియు హితబోధ లొనర్ప తూలనాడి వారిని నిందించెనఁట. సతీదేవియు నిఁక వానిసుత యనిపించుకొనన్నొల్లమి తానే యటకేగి యుదాసీనభావమును జూచినదక్షునిపైఁ గోపించి యోగాగ్నిని గల్పించుకొని భౌతికశరీరముం దహింపఁజేసి, తా హిమవంతునకు బాలికయై దొరకి పెరఁగుచుండెనఁట. దానిందెలసిన శివుఁ డుగ్రుండై, దక్షుని శిక్షితు నిగఁజేయనెంచుతఱి యాయనయుగ్రముమూర్తిభవించి పరమేశ్వరుని యాజ్ఞకై వేచియుండ నాయుగ్రమూర్తికి వీరభద్రుం డనుపేరిడి దక్షాధ్వర ధ్వంసమొనర్చి రమ్మనెనఁట. ఆయుగ్రమూర్తియగు వీరభద్రుండు దక్షాధ్వరవాటికకుఁ బర్విడి, యాతని బరిమార్చి, సుఖాసీనులై హవిర్భాగములను సన్మానములనందుచున్న సూర్యచంద్రాగ్నులను, అహంభావపూరితులగు భృగ్వాదిఋషులను, మర్దించి కొందరికి మీసములు, కొందరికి నేత్రాద్యవయములునూడఁబెరికి వంచించి రసాభాసముఁ గావించెనఁట. దీనికంతకును రంగమగు దక్షాధ్వరస్థాన మిప్పటి హరద్వారపు (మాయాక్షేత్ర) మున సతీగుండమను తావుననై యున్నది. వీరభద్రస్వామిభార్య భద్రకాళి యనుశక్తి.

బళ్లారిజిల్లాలోని జీర్ణవిజయనగరమున నుద్దండ (ఎత్తినచేతికఱ్ఱగల) వీరభద్రస్వామిదేవస్థానము కల దిటనే చౌడాంబి (ఛండి) దేవాలయము నున్నది. చౌడాంబ వీరభద్రస్వామిచెల్లెలనియు, దేవాంగులకుఁ గులదేవతయనియుం జెప్పుదురు.

మరియు నిది దేవాంగులు, లింగాయతులు, పరిపాలించు క్షేత్రము. శైవులు వీరభద్రస్వామిని ప్రమథముఖ్యులలో స్మరింతురు.

## వీరభూమి-వీరదేశము-బీర్భూమ్:-

బంగాళములో నిప్పుడు బీర్భూ మనంబడుసీమ రాజధానినగరి యని చెప్పంబడినది.

## వీరభోగవసంతరాయుఁడు:—

దక్షిణ మధురాపురమేలిన నృపతులలో క్రీ. వె. ౧౬౭౯ మొదలు ౧౬౭౩ వఱకుఁ బాలించిన ముత్తు వీరప్ప నృపతి కీపేరుండెనఁట. ఈయన మధురదేవస్థానమునఁ గట్టించినమంటపమును వీరవసంతరాయ మంటప మనియెదరు.

గుంటూరు మండలములోని కందిమల్లయ్యపాలెమను గ్రామమున మఠము నిర్మించుకొని, యోగియై, యనేకమందిశిష్యులకు వేదాంత ముపదేశించిన విశ్వబ్రాహ్మణుండగు పోతులూరి వీరబ్రహ్మస్వామి తనవేదాంతఁపుఁబాటలలో వీరభోగవసంతరాయఁడు జన్మించునని పాడియున్నాఁడు. ఇక్కాలమున స్త్రీ భోగములకు లోలుఁడై రంగేళీగాఁ దిరుగుచుండువానికి హేళనగా వీరభోగవసంతరాయఁడని యందురు.

## వీరమాతలు:—

పృథుకీర్తి, పృథ, శృతదేవీ, శృతశ్రవీ (శృతశ్రవునిభార్య), రాజాధిదేవీ (ఈ అయిదుగురు వీరమాతలు.)

శ్లో॥ 'పృథుకీర్తీ పృథాచైవ శృతదేవీశ్రుతశ్రవాః।
రాజాధిదేవీ చతథా పంచైతా వీరమాతరః॥
॥హారివంశే॥

## వీరవిక్రమతాళము:—

(తాళములు చూడుఁడు.)

## వీరశైవ (లింగాయత) మతము:—

ఈమత మనాదిగనున్నది. పరమేశ్వరుండగు శివునకు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానము లనుపేరుగల యైదుముఖములు చెప్పఁబడినవి. అం దీశానమున నూర్ధ్వదిక్కునకును, సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష ముఖములు, పూర్వ దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిశలకును తిరిగియుంట నీయైదుముఖంబులచేఁ బరమేశ్వరుండగు శివుఁడు పంచముఖుఁ డనఁ బడుచున్నాఁ.

ఊర్ధ్వముఖమగు నీశానముఖసంబంధ జననముగలవారు వీరలింగాంగు లంబడిరి. వీ రూర్ధ్వసృష్టివా రనంబడుదురు. వీరిది శివకులము (శివుని సంతతివారని భావము). నందీశ్వరగోత్రము. వీరాగమసూత్రము. రుద్రశాఖ. నిరంజనగణేశ్వర ప్రవర. ఈలింగాంగమహాత్మసంతతివా రగు రేణుకారాధ్య, మరుళారాధ్య, పండితారాధ్య, ఏకోరామారాధ్య, విశ్వారాధ్యు లనెడు నైదుగురు మహాత్ములు కలియుగమున శివభక్తి నుద్ధరింప దేశికులై యుండినవారు. పరమేశ్వరోక్తములగు నిరువదియెన్మిది యాగమములు కలవు. అం దసుర మోహాకములు పది. తక్కిన పదునెన్మిదియు వీరంగీకరించు ప్రమాణగ్రంథములుగ నున్నవి.

వీరి కారాధ్యులవలె శివభక్తి, శివార్చనావిధు లున్నను వేదముల నంగీకరింపరు. పంచబ్రహ్మమంత్రములనుమాత్రము గౌరవించి శివార్చనాదులం దుపయోగించుచున్నారు.

ఇటీవల లింగాయతమహాజనసభవారు, శ్రీపతి పండితకృత శ్రీకరభాష్యమును వీరిమతబ్రహ్మసూత్రభాష్యముగఁ గైకొనియున్నారని విందుము.

ఇంక సద్యోజాతముఖసంబంధమున వీరశైవ బ్రాహ్మణులును, వామదేవముఖసంబంధమున వీరశైవక్షత్రియులును, అఘోరముఖసంబంధులుగ వీరశైవవైశ్యులును, తత్పురుషముఖసంబంధులుగ వీరశైవశూద్రులును, జన్మించిరని చెప్పుదురు. ఈనాల్గుతెగలవారిని అధోసృష్టివారందురు. ఇంకను ఊర్ధ్వసృష్టిలింగాంగుల నతివర్ణులనియు, అత్యాశ్రము లనియు, గణవంశజులను సాయుజ్యపదస్థులనియు, నిత్యముక్తులగు పంచములనియు, మతసంబంధకార్యములందు వాడుటఁ గలదు. ఈమతస్థులు మతసంబంధకార్యములందు లింగధారణము లేనివారిని 'భవులు' అనియెదరు. వీరికి గాయత్రీయజ్ఞోపవీతము లుండవు. ఆరాధ్యులకువలెనే శివైక్యము వీరికి ముక్తి.

ఇట్టిపూర్వమతమున బసవేశ్వరుఁడు కలియుగమున బసవేశ్వరుం డుద్ధరించి శివభక్తిని తనస్వప్రవర్తనవలన బోధించి, వీరశైవలింగాయతమతము నడిపి చూపెనని వీరనెదరు. ఈబసవేశ్వరుండు నందికేశుని యపరావతార మనెదరు. వీరు బిజ్జలభూపతికడ మంత్రిగనుండి సంగమేశ్వరునియం దైక్యము నందినవారఁట. మతసహనము లేనివారు వీరియందుఁ గొన్నిదోషాచారము లున్నవనెదరు.

**వీరశైవులు:**—ఇతి మతసంబంధసంఘ నామము. ఈసంఘమున జంగమకులజులుముఖ్యులు. వారికి జంగమదేవర లనియు, జంగమమాహేశ్వరులనియు, బిరుదనామములు వాడుకయందున్నవి. వీరు గురువులుగ నుందురు. వీరిశిష్యులుగ నింకను ౧ లింగబలిజలు, ౨ లింగాయతులు, 3 దేవాంగులు మొదలగుకులములవారు కలరు. లింగబలిజలు శివయోగులనియు, బిరుదనామముం ధరింతురు. సగటున మత సంబంధమున శిష్యవర్గమువా రందఱు శివయోగబిరుదము నభిలషించుచుందురు. దేవాంగు లిటీవల మహాసభలం జరిపి, తాము దేవబ్రాహ్మణుల మని బిరుదనామమును ప్రకటించుకొనుచు, యజ్ఞోపవీతధారణము లొనర్చుకొనిరి. (దేవాంగులు చూడుఁడు). లింగాయతులు, దేవాంగులులోఁ గొందరు తమపేరులకుఁ బిదప శ్రేష్ఠి యను బిరుదనామముం ధరించుదురు. వీరంద రనాదిగ శివభక్తులై, లింగధారులై, జంమదేవరలశిష్యులై యున్నారు. ఇది వారియందు సనాతనముగ వచ్చుచున్నపద్ధతి. ఇటీవలఁ గొందఱు దేవాంగులు యజ్ఞోపవీతధారు లగుటతో జంగమదేవరల శిష్యులుగనుంట తగ్గిపోయినదనియు, వారు స్మార్తవృత్తులుగ నుంటయే సంభవించుచున్నదనియు, కొందరు దేవాంగులు వారికులస్థులగు దేవబ్రాహ్మణులకడనే లింగధారణదీక్ష నందుచున్నారనియుఁ దెలియుచున్నది. ఏది యెట్లున్నను వీరంద రేకగ్రీవముగ వీరశైవులమనియే చెప్పుకొనుచుంటఁగాననగును. ఈసంఘమువారి, పూర్వగాధ వారివారి పురాణములందునను, మతగాధ, సుప్రబోధాగమము, పాశుపతాగమమునను, గలదు. మతధర్మములం దితర శైవబ్రాహ్మణులు లేక ఆరాధ్యులవలెనే వీరశైవులును వీరాగమాది దశశాంతాగమములు లేక ఉత్తరాగమపద్ధతుల నాచరించుచున్నారు. (ఆగమములు చూడుఁడు. వీరశైవలింగాయతమతము చూడుఁడు. పంచాచార్యులు చూడుఁడు.)

**వీరసేనుఁడు:**— నిషధదేశ మేలిన భూపతి నలచక్రవర్తి (దమయంతిభర్త) తండ్రి.

**వీరాధ్వరగోత్రము:**—

[నిధ్రువగణము చూడుఁడు.]

**వీరావళిపురము:**— అనహిలాపురము. [ఘూర్జరదేశము చూడుఁడు.]

**వీరాసనము:**—యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. [ఆసనములు చూడుఁడు.] తాను దక్షిణాభిముఖుఁడై కూర్చుండి యెడమకాలిమడమను గుదస్థానమున కానించి, యుత్తరదక్షిణములుగా నుండునటులఁ గాలు మడిచి, కుడికాలును నిలువుగామడిచి, కుడికాలిబటనవ్రేలి కామడమ తగులునటులఁ గూర్చుండుట వీరాసన మనఁబడును. దీనికిఁ బ్రకారాంతరభేదముగా కుడితొడక్రింద నెడమపాదమును, ఎడమతొడమీఁదఁ గుడిపాదమును నుండునట్లు కూర్చొనుట.

ఈయభ్యాసములవలన తెప్పపాటులు తగ్గుననియు, అపానవాయు వూర్ధ్వగతిం జెందుననియు, శరీరబల మతిశయించుననియుఁ జెప్పఁబడినది.

**వుడ్‌క్రొప్పరు [అడవిజంతువ]:**— 'wood cropper' అనఁబడునది భరతదేశపు దుప్పి, కణుజులవంటిజంతువ. దీనికిఁ బొడవగు కాళ్ళును, పొట్టిమెడయు నుంట భూమిపైగడ్డిగాదలను మేయుటకు మెడ యందదు. కొమ్ములు దుప్పికొమ్ములంబోలియే యుండెడివి. ఇది యురోపాఖండమునందలి యుత్తరసీమలందుఁగల మహారణ్యములందుఁ గాననగుచున్నది. దానికందునంతటి యెత్తుగనున్న గిడ్డజాతులను, పొదలయందలి కొమ్మలను, పెద్దచెట్లపట్టలు, అందినలేఁతకొమ్మలు దిని బ్రతుకును.

**వుర్టెంబర్గురాష్ట్రము:**— ఐరోపాఖండము నందలి జర్మనీదేశమునందలి యొకతొల్లింటికాలఁపు రాష్ట్రము. ౭౫౦౦ చతురఁపుమైళ్ళ వైశాల్యము కలది. క్రీ. వె. ౧౮౦౫ లోనే నెపోలియను దీని నొకరాష్ట్రముగాఁ జేసెనఁట. చాల ఫలవంతమైన భూమి. అభివృద్ధినందుచున్న దేశము. ప్రజలు ప్రొటస్టాంటుక్రైస్తవులు. స్టట్గార్టుపురము ప్రధానస్థానము. ఇచటఁ బుస్తకములవ్యాపార మధికము. నెకార్నదీతీరమున నున్నపురము. ఉలమ్పట్టణము, డాన్యూబునదీతీరమున బలవత్తరమగు దుర్గముగల పురము. వ్యాస్థానము. తూబింజెన్ పురము సుప్రసిద్ధ విశ్వవిద్యాలయపీఠముండిన తావు. (ఐరోపాఖండము, జర్మనుదేశము చూడుఁడు).

**వృష్టి:** -తండ్రి పుష్పార్ణుఁడు. తల్లి దోష. (కడపటిసుతుఁడు). సోదరులు ప్రదోషుఁడు, నిశీథుఁడు. భార్య పుష్కరిణి. కుమారుఁడు సర్వతేజస్సు.

**వృకప్రస్థము [శోణప్రస్థము]:**— (సామంతపంచకము చూడుఁడు. పంచగ్రామసంధిసూత్రము చూడుఁడు.)

**వృకాశ్మకిగోత్రము:**— (పింహాన్య లేక యాస్కగణము చూడుఁడు.)

**వృక్ణుఁడు:**— యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి మధువు. పితామహుఁడు కార్తవీర్యార్జునచక్రవర్తి. కుమారుఁడు వృష్ణి.

**వృజనివన్తుఁడు:**—అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి క్రోష్టువు. కుమారుఁడు అహి.

**వృజ్జివంశపు నృపతులు:**— వీరికి విచ్ఛావు లనియు వాడుకనామములు కలవు. వీరు విశాలదేశమేలినవారు. గజేంద్రమోక్షణస్థల మీ విశాలదేశమునం దున్నది.

**వృత్తము Circile (సర్కిల్):—** ఇది గుండ్రముగ నుండుటకు గురుతు. ఇందు మధ్యస్థానమునుండి (Centre) ఎటు కొలచినను నొకేరీతి నుండెడిని. (ఒకేకొలత కొప్పెడిని).

దీనచుట్టుకొలతకు 'circumference' అని యందురు. మధ్యప్రదేశమునందలి అడ్డుకొలతకు 'diametre' అని పేరు. మధ్యస్థానమునుండి కడకుగీయఁబడిన గీతకు Radisus (Plural Radic) అనిపేరు. సర్కిలెప్పుడును గుండ్రముగా నుండుంగాని గోళాకారముగ (oval) నుండ రాదు.

**వృత్తమును విభజించుట, డిగ్రీలు (Circle degree):—** ఐరోపాదేశములందలి విద్వాంసులు, వృత్తమునకు (Circle) మున్నూట అరువది (degree) లనియు, ఒకడిగ్రీయం దరువది మినిట్లు (minutes) కలవనియు ఒకమినిటునం దరువదిసెకండ్లు (seconds) కలవనియు లెక్కించెదరు. దానివిధాన మిది.

ఒకవృత్తమునందు సరిగా నుత్తరదక్షిణముల (నిలువుగ)కొకటియు, తూర్పుపడమరల (అడ్డుగా) కొకటియు, రెండువంకరలులేని తిన్నగీతలు (strait lines) మధ్యగుండా గీచి, వృత్తమును నాల్గుగ విభజింతుమేని ఆమధ్యస్థలము (Centre) న ఈశాన్య, ఆగ్నేయ, నైఋతి; వాయవ్యమూలలందు నాల్గుకోణములు సమానమగునవి (right angles) యేర్పడును. ఇట్టి right angle నందు $90^\circ$ (తొంబది డిగ్రీలు) ప్రమాణమనియు, నొక్కొకడిగ్రీ యఱువదిమినిట్లు (60) గను, ఒక్కొకమినిటు ($60''$.) అరువదిసెకెండ్లుగను విభజింపవలయు భావము. ఇటుల నొకవృత్తము $360^\circ$. డిగ్రీలుగను, లేక $21600'$ మినిట్లుగను, లేక $1296000''$ సెకండ్లుగను తెలుచున్నది. వృత్తాకారముగనుంట భూమిపటమునకును నిదియే కొలతగ నేర్పఱచియున్నారు.

ఇంకను వృత్తము చిన్నదైనను, పెద్దదైనను ఇదేకొలత వర్తించెడిని. వృత్తము చుట్టుకొలత (circumfernce) ఒకయడుగు అనఁగాఁబండ్రెండంగుళము లుండుననుకొనిన ($360 \div 12 = 30$) అంగుళమునకు ముప్పదిడిగ్రీలగును. చుట్టుకొలత రెండడుగులుండు ననుకొనిన ($360 \div 24 = 15$) అంగుళమున పదునేనుడిగ్రీ లుండును. అట్లే వృత్తముచుట్టుకొలత గజము (మూఁడడుగులు లేక ముప్పదియా రంగుళము లుండు ననుకొనిన ($360 \div 36 = 10$.) అంగుళమున పదిడిగ్రీలుండును.

సినకు దానే గిరగిరఁ దిరుగుచు యీపరిమాణముగలభూమి యిరువదినాల్గుగంటలకుఁ దిరిగి యథాస్థానముం జేరెడిని. ఇదియే దినమనంబడును.

**వృత్తివ్యాపారము:—**
(వర్తకవ్యాపారము చూడుఁడు.)

**వృత్తి:–** కవిత్వ కావ్యసంబంధవృత్తి (వాక్యవృత్తి). ఇది శబ్దమూలము, కావ్యమూలము నని ద్వివిధము. (లక్షణ చూడుఁడు.)

**వృత్రఘ్నీనది:–**దీని నిప్పుడు 'వాట్రక్' అనుచున్నారు. దీనికి వేత్రవతి యనియు నామాంతరముఁ గలదు. గుజరాతులోని సబర్మతీనదిలో సంగమించును. దీనింగూర్చిన ప్రశంస పద్మపురాణోత్తర ౫౩ – ౬౦ యందునను, మార్కండేయపురాణము ౫౭ యందునను గలదు.
[ఘూర్జరదేశము చూడుఁడు].

**వృత్తులు:—**సర్వసాధారణముగ శాంతవృత్తి, ఘోరవృత్తి, మూఢవృత్తి, యని ప్రవర్తనను త్రివిధముగఁ జెప్పుదురు.

వేదాంతశాస్త్రమున వైరాగ్యము, ఉపశాంతి, వివేకము నని వృత్తులు మూఁడువిధములు.

యోగశాస్త్రమున మనోవృత్తి (బహిర్వ్యాపకము గలఁది), వివేకవృత్తి (జ్ఞానమార్గగతమగు వృత్తి,) అఖండాకారావృత్తి, (అంతర్బహిర్వ్యాప్తమై స్థిరమై యచలమై యుండు వృత్తి) యని మూఁడువిధములు.

ఇంకను, సాత్వికవృత్తి, రాజసవృత్తి, తామస వృత్తి యనిమనస్సుయొక్క వృత్తులు (వ్యాపారములు) త్రివిధము. వీట్లనే 'అహంకారము' లనియు నందురు.

ఇంకను మనస్సుయొక్కవృత్తులు ద్వివిధము. ౧ సంకల్పము (మనస్సునందుఁ దోఁచుట), ౨ వికల్పము, [దానికివ్యతిరిక్తముగ మనస్సునందుఁదోఁచి మానివేయుట.]

**వృద్ధకాశి:**—దక్షిణదేశమున పుముచేరి మంటప మను విష్ణుక్షేత్రము కలదు. అది సుప్రసిద్ధమైయుంటఁ జైతన్యదేవుఁడు దర్శించినటుల జైతన్యచరితామృతమునఁ గలదు. దానిని 'వృద్ధకాశి' యని యచటివా రనెదరు.

**వృద్ధకుమారీన్యాయము:**— వృద్ధబ్రాహ్మణ వరన్యాయము వంటి యర్థముఁ గలది. అనర్థాంతం దెల్పును.

తొల్లి అర్థాంతం గల్గియుండియు, పిదప నాయర్థాంతం గోల్పోయె ననుట కీన్యాయము. వాడుదురు.

**వృద్ధకుమారీవరన్యాయము:**— దీనిని "ఇతరులకుఁ గల్గుఫలితము, వారితోఁబాటు వారితోఁ గలసి తానును ననుభవించుటకుఁ బ్రయత్నించుట' యనిచెప్పుదురు. ఇందమ్యులను మోసపుచ్చ కుండవారినిఁ దాను చేదోడు వాదోడై లేక వారితోఁ దాఁజేరుకొని వారిలోనిభాగముగనై వారితోఁగూడఁ దా నాఫల మనుభవించుట యనితాత్పర్యము.

**వృద్ధదారుచెట్టు:**— లా. Lettsomia Nervasa. సం. ఋషిజాంగరికీ, ఋషిగంధా, ఋషిగంధికా, కోటరపుష్పీ. దీనిచెక్క రస కషాయములు కాకఁజేసి ఉబ్బుజాడ్యము, ఉదరరోగము, బుద్ధిమాంద్యము (మందమతి) ల నివారించునని చెప్పఁబడినది.

**వృద్ధపరాశరుఁడు:**— ఈతఁడు వ్యాసర్షి మనుమఁ డందురు. ఈయన రచించినది జ్యోతిష గ్రంథము. వ్యాసర్షి తండ్రి. పరాశరస్మృతిరచించిన వే ఱొకపరాశరుఁడు కలఁడు. (అదృశ్యన్తి చూడుఁడు). ఆయనతల్లి అదృశ్యన్తి. తండ్రి శక్తి (వసిష్ఠపుత్రుఁడు).

**వృద్ధక్షత్రుఁడు:**—జయద్రథుని తండ్రి.

**వృద్ధికులగోత్రము:**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. వృద్ధికుల [బ్రాతిల శిష్ట బ్రామశిష్టకుల] గోత్రము. ఏకాక్షీయ ఋషి గోత్రము. జీవన్తిగణము. సంస్కృతగోత్రము వైవస్వతః. బృహస్పతిర్షి ఆపస్తంబ యజుశ్శాఖ. ప్రమాణగ్రన్థ మాద్యప్రవరఖణ్డ. సమానగోత్రము బృహస్పతిన. బృహదీశుఁడు దేవత. భార్య బృహదంబ శ్రీముష్ణము తపస్థానము. బృహత్సరస్సు తటాకము. జపము దశకోటి. దీపములు ౨౧. క్షేత్ర సంఖ్య ౫౧. కన్యక దానము. గజనిమ్మ గజపుష్పము వర్జనీయములు.

**వృద్ధి మిష్టవతో మూలమపి తే నష్ట మితి న్యాయము:**— వడ్డీ కాసించి మొదలు (మూలధనము) కు మోసముఁ దెచ్చుకొనుట కర్థ మిచ్చున్యాయము.

**వృద్ధిశర్ముఁడు:**—దిలీపమహారాజున కీపేరుఁ గలైను.

**వృష్టగోత్రము:**—
(ముద్గలఉపగణము చూడుఁడు.)

**వృవాశ్వగోత్రము:**
(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.)

**వృశ్చికభియా పలాయమాన ఆశీవి శేపముఖే నిపతిత ఇతిన్యాయము:**—తేలుకు వెఱచి పరుగిడు నాతఁడు పాము నెదుటం బడుననట్లని యర్థము. అనఁగాఁ జిన్నయాపదనుండి తప్పించుకొనుటతోఁ బెద్దయాపదకుఁ బాల్పడినట్లని భావము.

ఇట్టిన్యాయమే మఱియొకటి కలదు. అది 'ఏకా మసిద్ధం పరిహరతో ద్వితీయాపహా తేతి న్యాయము'. అనఁగా నొకయాపద నివారణమగు టతో మఱియొకటి తగుల్కొనిన ట్లని యర్థము. ఇట్టిసందర్భముల నీన్యాయములు వాడుదురు.

**వృశ్చికరాశి అధిపతి కుజుఁడు:**—ఇది విశాఖానక్షత్ర చతుర్థపాదమును, అనూరాధ ౧-౨-౩-౪ పాదములును, జ్యేష్ఠనక్షత్రి మంతయును కలిసిన తొమ్మిది పాదములరాశి. ప్రమాణము ఘడి ౫—30 లేక గంటలు ౨—౧౨ మినిటకాలము.

వృశ్చికము సౌమ్యరాశి. స్థిరలక్షణము. బ్రాహ్మ ణవర్ణరాశి. స్త్రీస్వభావరాశి. బంగారుపురంగు. నిర్జలరాశి. ఉత్తరరాశి. శీర్షోదయరాశి. పగలు బల మధికము. గుహ్యావయవము బలము.

వృశ్చికరాశి స్వక్షేత్రము కుజునకు, మూల త్రికోణము ఉచ్చ. ఎవ్వరికిం గాదు నీచచంద్రు నకు. మిత్రక్షేత్రము రవిగురులకు. శత్రుక్షేత్రము శనికి. సమక్షేత్రము చంద్ర బుధ శుక్రులకు. వృశ్చి కలగ్నమునకు రవి దశమాధిపతి. చంద్రుఁడు నవ మాధిపతి. కుజుఁడు లగ్నషష్ఠమస్థానములకును, బుధుఁడు అష్టమ ఏకాదశస్థానములకును, గురుఁడు ద్వితీయ పంచమ స్థానములకును, శుక్రుఁడు, సప్తమ ద్వాదశస్థానములకును, శని తృతీయ చతుర్థస్థానములకును అధిపతులుగ నుందురు.

**వృషకుఁడు:**—శకుని తమ్ముఁడు.

**వృషణుఁడు:**—యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. కార్తవీర్యార్జునుని మూఁడవకుమా రుఁడు.

**వృషదర్భుఁడు:**—అత్రిసంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. శిబిచక్రవర్తి జ్యేష్ఠపుత్రుఁడు. ఉశీనర దేశ మేలిననాఁడు.

**వృషదుఁడు:**—అత్రి చంద్ర పూరు సం తతిక్షత్రియుఁడు. తండ్రి దివోదాసుఁడు. కుమా రుఁడు ద్రుపదమహారాజు (పాంచాలదేశాధిపతి). రాజధాని కాంపిల్యనగరము. పాండవులభార్య యగు ద్రౌపదికిఁ దండ్రి.

**వృషధ్వనీనది:**—నైమిశమున జప్యేశ్వ రము సంగమించు నైదునదులలో నొకటి. (పంచ నదములు చూడుఁడు.)

**వృషధృఁడు:—** ఇతఁడు గురుశాపమున శూద్రుండై తిరుగ తప మొనర్చి విముక్తి నందినవాఁడు.

**వృషపర్వుఁడు:—** ఒక దానవన్నృపతి. కశ్యపుఁడు తండ్రి. తల్లి దనువు. కుమార్తె శర్మిష్ఠాదేవి. ఈమె యయాతిమహారాజు నెంగామించి భార్యగఁ జేసికొనెనని చెప్పఁబడినది.

**వృషభపౌర్ణవి:—** జ్యేష్ఠ శుద్ధ పౌర్ణమి. ఇందు వటవృక్షచ్ఛాయను (నీడను) సావిత్రీవ్రతము నాచరించు వ్రతదినము. [పండుగలు చూడుఁడు].

**వృషభ నూపురపురము:—** దీనికి వర్షాణపురమనియుఁ బేరై యిప్పుడు బర్సాన్ అనంబడుచు, వ్రిజమండలము [ఉత్తరమధురజిల్లా] భాతా పరగణాసరిహద్దున నున్నచిన్నపట్టణమై యున్నది. రాధిక జన్మస్థానమగు రావల్ నుండి యిట కామె తేఁబడి పెంచఁబడినదని చెప్పఁబడినది.

[వ్రిజమండలము—రావల్ చూడుఁడు, అష్టగ్రామము చూడుఁడు.]

**వృషభాయము:—**
[అష్టవిధాయములు చూడుఁడు.]

**వృషభరాశి అధిపతి శుక్రుఁడు:—** ఇది కృత్తికానక్షత్రముయొక్క ౨ ౩ ౪ పాదములును, రోహిణీనక్షత్రముయొక్క ౧ ౨ ౩ ౪ పాదములును, మృగశిరానక్షత్రమునందలి ౧ ౨ పాదములును కలసి తొమ్మిదిపాదములు గలది. ప్రమాణము నాలుగున్నరఘడియలు లేక గంటానలుఁబది యెన్మిది మినిట్లు.

వృషభము సౌమ్యరాశి. స్థిరస్వభావరాశి. వైశ్యవర్ణరాశి. స్త్రీలక్షణరాశి. శ్వేతవర్ణము. అర్ధజలరాశి. దక్షిణదిగ్రాశి. పృష్ఠోదయరాశి. రాత్రియందు బల మధికము. ముఖమున బలమని చెప్పఁబడినది.

వృషభము స్వక్షేత్రము. శుక్రునకు మూలత్రికోణము చంద్రునకు ఉచ్చ. నీచ మెవ్వరికిని గాదు. మిత్రక్షేత్రము బుధశనులకు. శత్రుక్షేత్రము రవిగురులకు. సమక్షేత్రము చంద్రకుజులకు. వృషభము లగ్నమగునేని రవి చతుర్థస్థానాధిపతి, చంద్రుఁడు తృతీయాధిపతియు నగును. కుజుఁడు సప్తమద్వాదశస్థానములకును, బుధుఁడు ద్వితీయపంచమస్థానములకును, గురుఁడు అష్టమ ఏకాదశ స్థానములకును, శుక్రుఁడు లగ్నషష్ఠమస్థానములకును, శని నవమ దశమ స్థానములకును అధిపతులై యుందురు.

**వృష్ణి:—** అత్రి, చంద్ర యాదవక్షత్రియుఁడు. సత్యశ్రుతుఁడు లేక సాత్వతుని కుమారుఁడు. సోదరులు కుంతిభోజుఁడు, అంధకుఁడు, దేవావృధువు, దివ్యుఁడు, భజి, భజమానుఁడు.

కుమాళ్ళు సుమిత్రుఁడు, యుధాజిత్తు ననువారు.

వృష్ణిపేరుగల యాదవు లింకను గలరు. కుకురునికుమారుఁ డొకఁడు వృష్ణి. [ఈతనికి దుందుభియని నామాంతరము కలదు.] అనమిత్రుని సుతుఁ డొకవృష్ణి కలఁడు. ఈతనిసుతులు శ్వఫల్కుఁడు, చిత్రకుఁడు నను వారలు.

**వృష్టిమన్తుఁడు:—** పాండవసంతతిక్షత్రియుఁడు. తండ్రి శుచిరథుఁడు. పితామహుఁడు చిత్రరథుఁడు. కుమారుఁడు సుసేనుఁడు.

**వృషుఁడు:—** తండ్రి సృంజయుఁడు. తల్లి రాష్ట్రపాలిక.

**వృషసేనుఁడు:**—అత్రిసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. అంగభూపతి. తండ్రి కర్ణుఁడు. ఈతఁడు భారతయుద్ధమున నర్జునునిచే నిహతుఁ డయ్యెను.

**వృక్షములనెక్కు చిఱుతపులిజాతి:-** ఇది సర్వవిధముల నన్ని చిఱుతపులులవంటి పోలికలఁ గల్గియున్నను ప్రత్యేకజాతిగా నెన్నఁబడుటకుఁ బెక్కుకారణములు గలవు. రంగు ఎక్కువ యాకర్షణీయమైనది. ఇందింకనుఁ గల చిత్ర మెండయందుఁ గన్పించువింతరంగులు నీడలు గన్పింపకుండును. దీని కాంగ్లజంతుశాస్త్రమున 'Felis nebilosa' అనియును, సర్వసాధారణముగ నాంగ్లమున వాడుకలో 'clouded leopeard' అనియు, tree tiger అనియు వాడుచున్నారు. మలయాదేశస్థులు దీనిని ఛలోక్తగా 'Tortoise-shell treecates' అనునర్థమిచ్చు వారిభాషాపదమును వాడుచుండుటఁగలదు. ఈ జంతువులు మలయాదేశమునందధికముగ నున్నను, నేపాళము, సిక్కింరాజ్యము, ఆసామ్‌దేశము, బర్మారాజ్యము, జావాద్వీపము, సుమిత్రాద్వీపము, కొన్ని యీస్టిండియాద్వీపములు, లటోయియాద్వీపము మొదలగు వానియం దెప్పుడును నాకు పచ్చరంగుఁ గల్గియుండు దట్టమగునరణ్యములలో వసించుచు, ఆహారము దొరకనపుడు కడుదూరము బయటికిఁ బోవుచు, తిరిగి తనయరణ్యమునకుఁ జేరుకొనుచు నుండునని తెలియుచున్నది. చీనాసరిహద్దునబర్మాలోనున్న, షాన్‌స్టేట్సులో నరణ్యమే లేనితావులందుఁ బశులగాపరులచే నివి చంపఁబడినట్లు తెలియుచుంట, నాహారము దొరకనప్పు డెంతదూరమైనను బోవునని తెలిసెడిని. పెద్దపెద్దచెట్లపైకి ముప్పదియడుగులయెత్తుదనుక నెక్కి, పంగలతో మెడనాని తలంబెట్టుకొని చెట్టుకొమ్మను కౌఁగిలించుకొని రాత్రులయందు నిదురించుచుండును. ఎట్లయిన నీజాతిచిఱుతపులులు సముద్రఁపునీటిమట్టముపై 7,000 అడుగులయెత్తునకుఁ బైగా జీవింపఁజాలవని పరిశీలనలు తెల్పుచున్నవి. ఈవిచిత్రజంతువులలోఁ బొట్టితోఁకలుగల దొకటి, Hynine ద్వీపమందున్నట్లు లిటీవల బయల్పడినది. సర్వసాధారణముగ నీజాతిచిఱుతపులులకు రెండడుగులు పొడుగుగల తోఁకలుండునఁట. మధ్యమధ్యసముద్రభాగములు విశేషముగాఁగల యచ్ఛిన్నభేదప్రదేశములగు ద్వీపములం దొకేజాతి చిఱుతపులు లుండుటంబట్టి భూశాస్త్రవేత్తలు పూర్వ మిదియంతయు నొకేభూప్రదేశమై యుండియుండనోపునని యనుమానించుచున్నారు. మలయాదేశములందు వారి భాషలో 'పిమాడాకన్' అని దీని నందురు. దీనికిఁ జెట్టెక్కుపులి యనియర్థమఁట. ఆంధ్రదేశమునకుఁ బరిచితముగాని యీజంతువుంగూర్చి క్లిష్టపదములతో మేమువ్రాయుటకన్న నేచురలిస్టు (Naturalist) పండితుఁడొకఁ డొకచెట్లెక్కుపులిని గూర్చి వ్రాసినవ్రాఁత నాంగ్లమున నట్లే యిట వివరించుట మాచదువరులకు సుబోధకమని యట్లొనర్చితిని. మన్నింపఁబడుదుము గాక.

"The eyes are a light yellowish umber, paler round the circumference and beautifully stippled near the centre with blackish atoms. The colour of the nose I have not seen recorded anywhere although it is somewhat surprising a bright pink!

Powerful Biuld:— The form of whole body was remarkable such a concentration of muscular power. Here was no mere 'wild-cat' but a true leopard and for its size more powerfully build than a leapard. The bull-neck went straight into the head in a streamline— almost seal -

like. The limbs were short but muscular and graceful— the 'hocks' of the hind legs being particullarly small.

The pads large and very round, were as soft as velvet. The claws, completely retractile., were hidden. The under surface showed the round character of the feet, which must make a roundor pule mark than that made by a comman leapard. The callosities under each digit were small and rounded and widely separated by for.

The whole animal taped just under Six feet the tail measuring two feet eleven inches— or just about half the entire length.

The tail, noticeable at once by its great length, was thickly and beautifully furred but in no way bushy, the heir being of even length the whole way along it."

ఇంకను వేఱొకయాంగ్ల జంతు శాస్త్రవిదుఁడు వానిగుణలక్షణములం గూర్చి యిట్లు వివరించినట్లు గలదు. 'The tail suddenly becomes narrower in its posterior Sixth ending in a blunt, cone like tip.' I was unable to confirm this, though I skinned the whole tail with care to the very end.

However, I have kept the last eight inches to examine again when the flesh has been completely removed. If it is true that there sugg st that the end of the tail is used differently to the rest of the tail- and if that is so I would suggest that it may be used as a dait to attract squirrels, birds and other animals. We know how cuirons such little creatures are and how they come to investigate any movement that they do not understand. What struck me most about the tail when skinning it was the width at its base and the great muscular devolopment in that region. It is not known what use exatly this long tail is put to. But from its power and length it must be of considerable importance to the animal. Possibly it is used as spring to lunch it in its jump on its pray or it may enable it to suddenly change direction when in flight after a monkey or a bird.

The clouded leapard's teeth are remarkable for the length of the eye-teeth, which have been described as miniature sabre-teeth. These eye-teeth, I found, measured 39 m. m. from the gum to the point in a Straight line, which makes them longes than those of a large common leapard. They are sharp-edged behind and minutely serrated, possibly adopted for the killing and plucking of feathered prey. In contrast, the incisors are very small indeed— far smaller than a dog's. To what exactly are these specially long eye-teeth adapted.

When I was skinning this clouded leapard I found embedded in the

muscles two porcupine quills, which is further proof of its killing ground pray. Far all we know, it may habitually pray on pangolins, porcupines and other ground animals. Perhaps its long eye-teeth are for piercing such armoured quarry!'

ము (Botany) నందలి గురుతులు, సంజ్ఞలు:—

Absent ఒకతావున లేనిది 

annual ఒకసంవత్సరము బ్రతికేది  లేక 

Blennial 

Climbing plant దేనినైనను పట్టుకొని ఎగబ్రాకునది 

Doubtful సంశయగ్రస్తము 

Ever green ఎప్పుడు [ఆకుపచ్చ] రంగు నిలచియుండునది 

Male మగవృక్షము 

Female ఆడువృక్షము 

Hermaphrodite  లేక 

Hybrid 

Number indefinite 

Monecious 8 లేక  లేక 

Dioecious 

Monocarpous 

Section of a genus 

None 

Ornamentalplant అలంకారవృక్షము 

Perennial చిరకాలజీవనముగలది 

| | |
|---|---|
| Personally Verified | |
| Polygamous | ♁☿♀ |
| Shrub | ♄ |
| Small shrub | 5̄ |
| Large shrub | 5 |
| Tree వృక్షము | ♃ |
| Vseful plant | ‡ |
| Winding to left<br>ఎడమవైపు ఒరిగియుండునది | ( |
| Winding to right<br>కుడివైపు ఒరిగియుండునది | ) |
| Woody stem plant<br>కట్టెపనికి వచ్చునట్టి వృక్షములజాతి | Y2 |

**వృక్షశాస్త్రము:—** వృక్షముల జీవితముం గూర్చినశాస్త్రము. ఇది బయాలోజీలోనిభాగము. అనఁగా బయాలోజీ రెండుభాగములనియు, ఒక భాగము జంతువులజీవితముఁగూర్చినది Zoology యనియు, రెండవభాగ మీవృక్షశాస్త్రమగు Botany యనియు నెఱుఁగునది.

తొల్లింటికాలమున Plato మహనీయుని యొక్కయు, Aristotle మహనీయునియొక్కయు కాలములనుండియు వృక్షశాస్త్రగ్రంథముండినదని తెలుచున్నది. Historia Plantarum అను వృక్షశాస్త్రగ్రంథమును, ఆదికాలములందే Theophrastus అను విద్వాంసుఁడు రచించియుండెను. ఆయనను పాశ్చాత్యులు Father of Botany అనివాఁడుచున్నారు. మఱియు Hippoerate అనుమహావిద్వాంసుఁడు మున్నొకవృక్షజాతుల వైద్యగుణాగణముల వివరించి యొక గ్రంథముౖవ్రాసియుండెను. Dioscorides అనువైద్యవిద్యాశిఖామణిDemateria medica అనునొక మహావైద్యగ్రంథమును రచించెను. కడపటి రెండు గ్రంథములనుండి పనునాలవశతాబ్దమున మూలికావిజ్ఞాన మతిశయించినదఁట. Mr. Turner అను నాంగవిద్వాం :డు 'New Herball (1551)' అనుగ్రంథమును మొక్కల నెక్కువగాఁ బరిశీలించియు, చక్కఁగ వివరించుచో నాంగ్లనామములం గూడఁ జేర్చి రచించియున్నాఁడు.

John ray's 'Catalougue of English plants' అను పుస్తకము క్రీ. శ. ౧౬౭౦ సంవత్సరమునను, ౧౬౯౦ లో ఆయనకృతిమగు సైనోప్సియా (Synopsia) యనుపుస్తకమును రచింపఁబడెనఁట. ఈరెండుగ్రంథములు, పిదప బయలువెడలిన యాంగ్లవృక్షశాస్త్రగ్రంథములకు మూలాధార మయ్యెనందురు.

పదునెన్మిదవశతాబ్దమున వృక్షశాస్త్రగ్రంథములు కొన్ని రచింపఁబడెనందు వృక్షములు, శరీరపటుత్వములు మొదలగునవి చక్కఁగ వివరింపఁబడినది vezetable statisties అనుగ్రంథము. దానిని His Hales అను వృక్షశాస్త్రజ్ఞుఁడు రచించియుండెను. అందు మొక్కలను జాతులవారీగాఁ దన సొంతపద్ధతులమేరకే విభజించియుండెను.

పందొమ్మిదవశతాబ్దమున వృక్షశాస్త్రము చక్కని యభివృద్ధిఁ గాంచెను. పెక్కండ్రు బోటనీవిద్యాగ్రంథములను రచించి, పేర్వడసిరి. వారు రచించినవృక్షశాస్త్రగ్రంథములును విపులములయినవి. అందు Robert brown- JE Smith- Lindley- అనువారు మంచిబోటనీగ్రంథముల రచించిరి. Beutham, Hookers అనువారల గ్రంథములందు వృక్షజాతులు చక్కఁగ విభజింపఁబడినవి.

Charles Darwin పండితుఁడును, ఆయన సుతుఁడగు Francis పండితుఁడును, విపులమగు గ్రంథములను వ్రాసియున్నారు. Thiselton Dyer అనుపరిశోధకుఁడు ద్రాక్షజాతులం గూర్చి గ్రంథము రచించెను. ఇంకను Bower పండితుని బోటనీగ్రంథము చాల విపులమైనది. వీట్లయం దిప్పటికి ౩౭౫౦౦౦ వృక్షములంగూర్చి వ్రాయఁబడినది.

**వృక్షమూలనిషించనన్యాయము:** చెట్టుమొదట నీళ్ళుఁబోసిన దానివేళ్ళగుం చెట్టునకంతకును నెక్కునని భావము.

ప్రథానస్థానమునఁ జేసినపని యంతకును వ్యాపింపఁగల్గునని భావము.

**వృక్షప్రకంపన్యాయము:—** ఒకనిని చెట్టుపై కెక్కించి నల్వురు క్రిందనుండి యుసిరికకాయ లేఱుచు క్రిందివారికోర్కెమేరకుఁ జెట్టుపైనున్నవాఁడు కొమ్మలం దులుపుచు నుసిరికకాయలు క్రిందరాలునటులఁ జేయుచుండును.

ఇటుల నందరికార్యములు వారికోర్కెలమేరకు నెఱపుచుండుటను దెల్పుట కీన్యాయము వాడుచుందురు.

**వృక్షాసనము:—** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. ఇది వృక్షాసనమనియు, నర్ధవృక్షాసనమనియు ద్వివిధము.

౧ వృక్షాసనము: - రెండుచేతులయఱచేతులను వెలకిలవేసి దరిఁజేర్చి భూమిపై నుండి, అందుఁ దనశిరమును కుదురుపఱచి యానించి కాళ్ళను పైకి ఆకాశమువైపునకు నిలువంబెట్టి భూమధ్యమున దృష్టిని నిలుపుట.

౨ అర్ధవృక్షాసనము- పైకి నిలువఁబెట్టినకాళ్ళను మోఁకాళ్ళకడ మడచి, మడమలు పిఱుదులకుఁ దాకించి, తక్కినది వృక్షాసనమువలెనే యుండుట.

ఈయభ్యాసమువలన ప్రాణాయామాభ్యాససిద్ధి గల్గునని చెప్పఁబడినది.

**వూల్సాక్ - ఛాన్సెలర్ (Woolsack chancellor:**—కూర్చుండు ఆసనమున కీపేరు వర్తించెడిని. ఆంగ్లదేశమున నెలిజబెత్తురాజ్ఞి పాలనమున ఉన్నిమెగుమతిచేయరాదని యొకశాసనముం జేడిదట. గాన, న్యాయాధిపతులయాసనములపై నాసంగతి జ్ఞాపకముచేయుచుండుటకుఁగాని Wool sack (ఉన్నిసంచి) పఱచుచుండుట పద్ధతియాయెనట. ఇప్పుడు పఱచుచుండుట మానినను

పేరుమాత్రము 'Wool sack' అనియే ఆసనమునకుఁ బేరు వాడుకయందున్నది.

**వ్యూహశాస్త్రము:—** వ్యూహ మనఁగాఁ బగతునిం జుట్టుకొని కదలకుండ నిర్బంధించి యాతనితోఁ బోరుట. పగతునిం జుట్టుకొనుటకు వ్యూహముపన్నుట యందురు. అభిమన్యుని భారత యుద్ధములోఁ గౌరవులు చుట్టుకొని పద్మవ్యూహమున నిర్బంధించిపోరి యోడించిరని భారతమునఁ జెప్పఁబడినది. వ్యూహములంగూర్చిన లక్షణగ్రంథములు దైత్యగురుండగు శుక్రుం డొకటియు, దేవతాగురుండగు బృహస్పతి యొకటియు రచించినటుల మనకుఁ దెలియుచున్నది.

అందు శుక్రునిమతమున వ్యూహాంగములు ౧ వక్షము, ౨ మధ్యము, ౩ పృష్ఠము, ౪ ప్రతిగ్రహము, ౫ కోటి యని యైదుగను, బృహస్పతి మతమున ౧ వక్షము, ౨ పక్షములు రెండు, ౪ మధ్యము, ౫ పృష్ఠము, ౬ ప్రతిగ్రహము, ౭ కోటి యని యేఁడును జెప్పఁబడినవి.

ఉభయులమతములందునను వ్యూహములు ప్ర. వ్యూహములు, ప్రకృతివ్యూహములు నని యిరుదెరంగులు.

ప్రధానవ్యూహములు— ౧ శ్యేనవ్యూహము, ౨ సూచివ్యూహము, ౩ వజ్రవ్యూహము, ౪ శకటవ్యూహము, ౫ మకరవ్యూహము, ౬ ధ్వజవ్యూహము. ఇవి గాక గ్రంథాంతరములఁ బద్మవ్యూహము, క్రౌంచవ్యూహము నను నవి గూడఁ జెప్పఁబడినవి.

ప్రకృతివ్యూహములు నాల్గువిధములు— దండవ్యూహములు, భోగవ్యూహములు, మండలవ్యూహములు, అసంహతవ్యూహములు అని.

దండవ్యూహములు ౧౭— ౧ ప్రిత్యోదరము, ౨ దృఢకేశము, ౩ శ్వావత్తు, ౪. శ్వానత్కుక్షి, ౫ ప్రతిష్ఠవ్యూహము, ౬ సుప్రతిష్ఠము, ౭ శ్యేనవ్యూహము, ౮ విజయవ్యూహము, ౯ సంజయవ్యూహము, ౧౦ విశాలవ్యూహము, ౧౧ అవిజయము, ౧౨ సూచివ్యూహము, ౧౩ స్థూణాకర్ణవ్యూహము, ౧౪ చమూముఖము, ౧౫ రథాస్యవ్యూహము, ౧౬ వలయవ్యూహము, ౧౭ దుర్జయవ్యూహము.

భోగవ్యూహములు ౫— ౧ గోమూత్రికావ్యూహము, ౨ అభిసారివ్యూహము, ౩ శకటవ్యూహము, ౪ మకరవ్యూహము, ౫ పతంతకవ్యూహము.

మండలవ్యూహములు ౨— సర్వతోభద్రము, దుర్జయము.

అసంహతవ్యూహములు — ౧ అష్టానీకవ్యూహము, ౧ ద్వితీయవ్యూహము, ౩ ప్రథమవ్యూహము, ౪ సర్వతోముఖవ్యూహము, ౫ అర్థచంద్రకము, ౬ శృంగాటకవ్యూహము.

ఇటుల నెంచింగినవ్యూహములు ముప్పదియెన్మిదిగా నెంచుంగునది.

**విస్టు - ఆట (whist):—** ఇది యేఁబది రెండు ముక్కలుగ పేక (దస్తా) తో నాడు పేకాటలో నొకటి. ఇది యిర్వురొకభాగస్థులుగను, ఇర్వు రొకభాగస్థులుగను, (భాగస్థు లెదురుగఁ గూర్చుండి) నల్వురిచే నాడఁబడును. ఒక్కొకరికిఁ బదమూఁడేసిముక్కలు పంచఁబడును. ఇందు వీలగునన్ని tricks చేయుటయే ఆట. తొలుతఁ బెద్దహారాటఁ బ్రారంభింతురు. పిదప ట్రిక్కునందు జయమందినవా రాడుచుంట నాచారము.

పేకముక్క లన్నియు నైపోవువఱకు నాడుట పద్ధతి. ఆడినమచ్చుపేకలు చేతనుండినసరే, లేకుండిన తురుపుం బడవైచి, ఆరింటిని మినహాయించి మిగిలినవాటినే లెక్కింతురు.

ఐదుపోయిం ట్లొకయాట యగును. మూఁడాటలందు రెండు గెలిచినవారు రబ్బరుం గైకొనెదరు. ఒకభాగఁపువారు వరుసగ రెండాటలం గెలిచిరేని యిఁక నాడుట యనవసర మగుటయుంగలదు. అట్టితఱి మఱియొకరబ్బరును ప్రారంభించనగును. ఒక యాటయందలి పాయట్లు వేఱొకయాటలోనికిఁ గైకొనఁబడవు. ఇది Napoleon (సంక్షిప్తపఱుపఁబడినరూపము N. A. P.) ఆటయనియు, సోలో ఆట యనియు ద్వివిధముగ నాడుచుండుటఁగలదు.

**వెంకోలకులగోత్రము:**—ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. వెంకోలకుల (వెంకాలకుల) గోత్రము. ఏకార్షేయ [౬-౩] గోత్రము. కపీతరగణము సంస్కృతగోత్రము కపీతస. వేద నిధిర్షి. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథము మాత్స్యసూత్రము. సమానగోత్రములు శక్తిస, వేదినిధిస. భీమేశ్వరుఁడు దేవత. భార్య భీమాంబ. వేంకటాద్రి తపస్థానము. భీమసరస్సు తటాకము. జపము లక్ష్మి. దీపములు 23. క్షేత్ర 23. రత్నములు దానము. వంకాయ వర్జనీయము. (వైశ్య గోత్రములు చూడుఁడు.)

**వెంచర్ (Venture):**— వాణిజ్యసంబంధపరిభాషాపదము. సాహసించుటయర్థము. అపాయకరమగుపరిస్థితులందు సాహసించి సరకులసంపుట మొదలగుపనులు.

**వెంటరావద్దంటే యెత్తుకొమ్మని యేడ్చినట్టు:**—(ఆంధ్రలోకోక్తి.)

**వెంటిలేషన్:**— మూయఁబడు టంతయో, కొంతయో కల్గియున్నయావరణమున జీవించి యుండువారి యారోగ్యము, సమర్థత, సౌఖ్యములు చెడకుండ నిలుచుండుటకుఁ దగినంత ప్రాంతగాలి కదలి యవ్వలకుఁబోవుటయు, క్రొత్తగాలి ప్రవేశించుటయు, జరగుచుండుటకు వెంటిలేషన్ అనిపేరు.

౧౦,౦౦౦ మొదలు,30,000 క్యూబిక్ అడుగుల వాయువునందు రెండుభాగములు కార్బోనిక్ ఆసిడ్‌గాస్ co 2 కలిసెనేని మనుష్యులకుఁ బ్రాణాపాయము కల్గును గాన నది చేరినయపరిశుభ్ర వాయువు పైకిఁబోవుచు క్రొత్తవాయువు లోనికిఁ జేరుచుంటకు వెంటిలేషన్ అని యనుచున్నారు.

**వెండ్రుకలు- రోమములు:**— సర్వసాధారణముగ తల, చంకలు మొదలగు కొన్నితావులందు మొలచెడివెండ్రుకలను వెండ్రుకలనియు, పురుషులముఖములందు మొలచెడివాటికి గడ్డము, మీసములనియు, స్త్రీపురుషుల కనుతెప్పలందు మొలచువాటికి వేఱుపేరు లేక కనుతెప్ప వెండ్రుకలనియు, పైనమొలచు రక్షకములకు కన్బొమలనియు ననుచుందురు. తక్కినశరీభాగమున మొలచువాటికి సర్వసాధారణముగ రోమములనియు నందురు. గొఱ్ఱెలు, మేకఁలు, పశువులు మొదలగువాటివెండ్రుకలకు బొచ్చనియు, సింహములముఖముల నిరుదెసల వెండ్రుకలకుఁ గేసరములనియు, చమరీమృగమువెండ్రుకలకుఁ జామరములనియు వాడుచున్నారు. పక్షులవెండ్రుకలకు ఈఁక లనియందురు. వెండ్రుకలన్నియు నొకతెగవే. ఇవి చర్మఁపుపైభాగమగు ఎపిడెర్మిస్ యొక్క పరిణామరూపమని పోల్పఁబడినది. (త్వగింద్రియము చూడుఁడు). ఇవి శరీరమందలి పల్ల

ములనుండి బయలుదేఱును. నాటికి రోమకూపము లుండురు. శరీరమంతటను రోమములు కలవు. కొన్నితావుల కేవలబలహీనములై కానరావు. కొన్నితావుల నించుకబలయుతములై యుండును. కొన్నితావుల మిక్కిలి (పొడవుగ) నుండును. చర్మము (true skin) నెడి గట్టిబాఱిన నట రోమములు, చెమట మొదలగునవి యుండక మృతావస్థయం దుండును. దానిని మచ్చ (scar) అనుచుందుము. అందు (sweat glands) ఉండవు. చర్మము ముదిరిన ట్లగుపడుచు గట్టిపడి మృతావస్థయం దుండును. చైతన్యముండదు. స్పర్శ మించుకయుండునని తలంపఁబడుచున్నది.

## వెంట్రిలోక్వ్యాఇజమ్ (Ventrilo-uuism):— ఇది పాశ్చాత్యకల. ఒకరు మాట్లాడుచుండు ధ్వనిని దూరమునుండి వచ్చుచున్న ధ్వనిగాఁ గాని, మఱియొకరు మాట్లాడురీతిని వినఁబడునట్లు గాని, వినఁబడఁజేయుట. ఇందు మెస్మరీజమో, హిప్నాటీజమో ప్రయోగింపఁబడునని కొందఱనుచున్నారు.

## వెండి బంగారు ఫిరంగులు:—(బంగారు వెండి ఫిరంగులు చూడుఁడు.)

## వెండి (రజితము):— ఆంగ్ల argentum. రజితము పంచలోహములలో నొకటిగఁ జెప్పఁబడి యోగ్యతయందు బంగారమునకుఁ దరువాత నన్నఁదగినది. దీని Chemical Symbal Ag.,.Atomic wight 107 ం 88, Atomic number 47. Specific Gravity 10° 57-, సెంటిగ్రేడు 961 డిగ్రీలవేఁడికిఁ గరఁగి నీరువలె నగును.

గనులనుండి వెండి త్రవ్వియెత్తఁబడుతఱి నా Silver ore తో Argentite - Proustite-Stephantite - Hessite - Pyrargyrite - Cerargyrite మొదలగునవికూడఁ గలసియుండుటయే గాక, Crystal cubes కూడ దొరకెడిని. వెండిఓరు ఒక్కొకతఱి సీసము, రాగి, పాదరసములతోఁ గలసిపుట్టుటయుం గలదు. అత్తఱి సీసము విస్తారము లభించునందురు.

వెండియు, బంగారువలెనే సాఁగఁగొట్టిన చక్కఁగ సాఁగుగుణమునందునను, సాఁగఁదీసిన చక్కఁగను, మెత్తగను సాఁగుగుణమందునను పేర్వడసినది. ఇంతియే గాక వెండియందు వేఁడిని విద్యుచ్ఛక్తిని (Heat & Electricity) తీసుకుండా చక్కఁగ నటునటు నడుపు (Cunductor) శక్తి నత్యద్భుతముగఁ గల్గియున్నది. తెల్లగఁ బ్రకాశమానమగు సునుపు మెఱుగులం బ్రదర్శించును. వెండిని పరిశుభ్రపఱచుటకు amalgamation - Solution - Smelting అను మూఁడుపద్ధతు లుపయోగింపఁబడుచున్నవి.

ఇక్కాలమున వెండిదొరకు గను లుండుప్రదేశములు మెక్సికోదేశము, అమెరికాసంయుక్తరాష్ట్రములు, కనడాదేశములును, దక్షిణమెరికా, జపానుదేశము, ఆస్ట్రేలియా, మధ్యయమెరికాదేశము, ఆస్ట్రియా, జర్మనీ, స్పానియా దేశములు చెప్పఁదగినవి. మనదేశమున వెండిగనులు గలవని తలఁపఁబడుచున్నది. Czechoslovakia లయందుఁగూడఁ గలదఁట. వెండియొక్కయుపయోగము నగలు, నాణెములు చేయుటయై యున్నది. ఇంటివాడుక సామానులు చేయఁబడుటయందు వెండి యెక్కువ వాడఁబడుచున్నది. oxide of silver (Ago.) అద్దమునకుఁ బచ్చరం గిచ్చుటకు వాడుచుందురు. silver nitrate (Lunar caustic) వెండిని నైట్రికాసిడ్డునందు (dissolving చేయుటవలనఁ గల్గినది. ఔషధోపయోగ

ము నందియున్నది. మఱియు దానిని Gum Arabic నందుఁ గల్పి సిరాలు చేయ నుపయోగింతురు.

Silver cloride, Silver Bromide, Silver iodide విస్తారము ఛాయాపఠములందీయుట, (Photography) యందు వాడఁబడుచున్నది. అవి వెలుతురు గల్గించుపనులకు 'extermely sensetive' అని చెప్పఁబడినవి. Silver sulphide is the mineral argentite అని చెప్పఁబడినవి.

శాస్త్రోక్తముగఁ జేయఁబడిన రజితభస్మము త్రిదోషములుహరించి, ధాతుసౌమ్యతనిచ్చి, సంపూర్ణారోగ్యముఁ గల్గించుననియు, వేర్వేఱు అనుపానముల వేర్వేఱురోగముల నడంచుననియుఁ జెప్పఁబడినది. బంగారురేకులవంటి గుణమే వెండిరేకులందు గలదు. వెండిని సింధూరింపఁజేసినను రజితచంద్రోదయ మనంబడును.

**వెండెట్టా** (Vendetta):—ఇదిలాటిన్భాషాపదమగు Vindicta (ప్రతిపగ యవియుక్తము). పద్యజన్యమందురు గాని, యిది ఐస్లాండుభాషా పదముగ నిప్పు డున్నది.

తనవారి నొకఁడు చంపినపగఁ దాఁ దీర్చుకొనవలసినబాధ్యతను తా వహించుట యని తేలుచున్నది. అనఁగా నట్టి తకు 'వెండెట్టా' యనుచుందురు.

**వెంపలిచెట్టు**:—లా. Galega purpures. ఆంగ్ల wild Indigo. సం. కాండపుంఖా, శరపుంఖా, సాయకపుంఖా, శ్వేతపుంఖా, శుభ్రపుంఖా. ఇందుఁ గడపటిరెండు తెల్లవెంపలి కన్వయించును.

వెంపలిచెట్లకు మొదటవేసిన మంచిఎరువై మొక్కలకు బలముచేయుంగాన తోఁటలను క్రొత్తగ వేయువారు తొలుత మొక్కలునాటి గోతియందు వెంపలికంపనిడి మరి పైన ప్రాతుదురు. ఎండించినతెల్లవెంపలివేరుఁ గాల్చి పొగఁ బీల్చిన దగ్గుమాను నందురు.

వెంపలి సమూలరసకషాయములు పరిణామశూలల నాపి, యుదరరోగముల నివారించు ననియు, క్రిమి గుల్మ దంత రోగములఁ బాపుననియు, వేరుకషాయ మజీర్తి విరేచనముల నాపి, చెవిలోఁ బుండు, చెవిలోపోటుల నివారించి, జీర్ణశక్తిం బలపఱచుననియుఁ జెప్పఁబడినది. ములువెంపలి కాకఁ జేసి క్రిమి,శూలల నివారించు నందురు. వెంపలి బయల్లయందుఁ పెరుగునడవిజాతిలోనిది.

## వెక్కిరింపఁబోయి కక్కుకున్నట్లు:
[ఆంధ్రలోకోక్తి.]

## వెక్కిరింపఁబోయి వెల్లకిలఁ బడినట్లు:
(ఆంధ్రలోకోక్తి)

## వెజిటబుల్ బట్టరు పరిశ్రమ:—
మనము సామాన్యముగా నుపయోగించునది పాలనుండి తీయు వెన్న. ఇది గాక నిటీవల కొన్నిరకముల ఫలములనుండి వెన్నఁ దీసి నేయి తయారుచేయుమార్గము కనిపెట్టఁబడినది. ఈనేతికే 'నట్ బట్టర్' లేక 'వెజిటబుల్ ఘీ' యని పేరు.

నారికేళములు మొదలగు కొన్నిజాతుల ఫలములనుండియు, కొన్నిరకముల గింజలనుండియుఁ దీయఁబడు నేతికి రానురాను గిరాకి యధిక మగుచున్నది. ఎందుకనఁగా నది పాలనుండి తీయఁబడు వెన్నకన్న చౌకగాఁ గిట్టును.

ఈ వెజిటబుల్ బట్టరుఁ దీయుటకుఁ గొబ్బరి మొదటిస్థానము నాక్రమించుచున్నది. దీనిని మర

పింపఁజాలుఫలము మరేదియుఁ గానరాదు. నారికేళమునుండి తీయునవనీతము మిక్కిలి నాణెమయివర్ధనియు, ఆరోగ్యకరమయినదనియు శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. రూపమునం దది పాలనుండి తీయఁబడు వెన్నవలెనే యుండును. రెంటికిని భేదము కనిపెట్టుటఁ జాలకష్టము. పరిశుభ్రత, ఆహారఁపు విలువ మొదలగు విషయములలో నది జంతుఘృతములోఁ దుల్యముగనే యుండును. పశ్చిమదేశముల యం దది విశేషముగా వాడుకచేయఁ బడుచున్నది.

ప్రత్యేకముగా నందుకొఱకై కనిపెట్టఁబడిన కొన్నియంత్రముల సాహాయ్యమువలనను, తయారుచేయుటలో నూతనవిధానములను గనిపెట్టుటచేతను, ఫ్రాన్సు, జర్మనీ మొదలగు దేశములలోఁ గొబ్బరినుండి వెన్నఁదీయుమార్గము మిక్కిలిమలభమును, చౌకయు నయినది. వారు విదేశములనుండి కొబ్బరికురిడీలను తెప్పించుకొని యీపరిశ్రమ నభివృద్ధిఁ జేయుచున్నారు.

కొబ్బరిలో నూటి కరువదివంతులు క్రొవ్వు పదార్థము కలదు. 76० ఫారెన్‌హీటులో నది కరఁగును. దీనిని రుచికరమగు వెన్న చేయుటలోని కష్టము నందలివాసనను బోఁగొట్టఁ జేయుటయే. ఇపు డాకష్టముగూడఁ దొలఁగింపఁబడినది. కొబ్బరినూనెలో నావిరిఁ బ్రివేశపెట్టి మగ్నీషియా (Magnesia) తోఁ జేర్చి కొబ్బరివాసనను నిర్మూలించుచున్నారు. ఆవచ్చినపదార్థమును వేడినీటితోఁ గడిగివేయఁగాఁ బరిశుభ్రమయిన బట్టరు పాలవలనవచ్చిన వెన్నవంటి పదార్థము వచ్చును. దీనిని కరఁగునట్లుఁ జేయుటకు 8° F డిగ్రీలవేడి కావలయును. అది 66° F డిగ్రీలలో మరల పేరుకొని గడ్డకట్టును. అట్టినేతిని మఱిగిపోకుండఁ జాలకాలము నిలువయుంచవచ్చును.

బోహిమియాదేశములోఁ దయారగుచున్న నారికేళఘృతమంతయు హిందూదేశఁపుఁ గొబ్బరినుండియే తీయఁబడుచున్నది. ఆవిధాన మీక్రిందఁ బొందుపఱుపఁబడినది.

మొట్టమొదట కొబ్బరికురిడీ చిన్నచిన్నముక్కలుగాఁ జేసి తైలయంత్రములోఁబెట్టి నూనె తయారుచేయుదురు. ఈనూనెయందు సబ్బుసంబంధమగు క్రొవ్వుపదార్థము విశేషముగా నుండుటచే వాసన యంతయింపుగా నుండదు. కనుక నాతైలమును పెద్దయినుపతొట్టెలలోఁ బోసి సబ్బుక్రొవ్వు, అడుగునకుఁ బోవునట్లుఁ జేయుటకుఁ గాను సున్నపిండి వేసి కలుపుదురు. సున్న సబ్బుక్రొవ్వడుగునకుఁ బోయినతరువాత మీఁదికిఁ దేరిన నూనెలు మరియొక తొట్టెలోనికిఁ దేర్చి పంపుచేయుదురు. ఇది శుభ్రపఱచు ప్రక్రియయందు ద్వితీయావస్థ.

ఆవెనుక నావిరిగొట్టములచే 270° C డిగ్రీలవఱకు వేడిచేయఁబడిన మరియొకతొట్టెలోనికిఁ దేరిన యీచమురు చేర్చఁబడును. తైలము, అద్దమువలె నిర్మలముగా నుండునంతవఱకు నిట్లుఁ జేయఁబడును. అప్పు డది బుంగలువచ్చి మరుగుట కారంభించును. అక్కడనుండి యది మరియొకతొట్టెలోనికిఁ బంపుచేయఁబడి చిన్నచిన్న మూసలలోఁ జేర్పఁబడి యందులోఁ జల్లారువరకు నుంచఁబడును. తరువాత టిన్నులలోను, గొట్టములలోను బెట్టి పైకి రవానా చేయఁబడును.

**వెజిటెబుల్ ఆయిల్** (Vezitable oils):—నువ్వులనూనె, పత్తిగింజలనూనె, అవిసిగింజలనూనె, ఆముదము, కొబ్బరినూనె, బాదంనూనెమొదలగు (గింజలనుండి తీయఁబడిన) చమురుల నాంగ్లమున 'వెజిటెబుల్ఆయిల్సు' అనెదరు. (ఏనిమల్ ఆయిల్సు, మినరల్ ఆయిల్సు చూడుఁడు.)

**వెట్‌బల్బ్ థెర్మామీటర్** (Wet bulb Thermometer):—తేమగలిగిన కోనశిఖరము గలిగిన థెర్మామీటరు. ఇది ఉష్ణనిబంధనము చేయును.

**వెటర్నరీ సైయన్సు** (Veterinary scince):— ఇది యాయుర్వేద వైద్యవిధానము నందలి పశుచికిత్సకుఁ బాశ్చాత్యవిధానమునందలి ప్రతివిద్య (పశురోగవైద్యము).

ఇందుఁ బ్రధానములగు పశురోగము లంటు వ్యాధులుగ నున్నవి. అందుఁ బ్రధానము లీక్రింద వివరింపఁబడును.

౧ Rabus, and distemper వ్యాధులు, ఇవి కుక్కలకుఁ గల్గుచుండును.
౨ Swine fever and swine crysipelas వ్యాధులు. ఇవి తఱచుగ పందులకుఁ గల్గుచుండురోగములు.
౩ Braxy and louping వ్యాధులు. ఇవి తఱచుగ గొఱ్ఱెజాతులకుఁ గల్గుచుండురోగములు.
౪ Rinderpest and bovine pleuro -penumonia వ్యాధులు. ఇవి తఱచుగ నన్ని పశుజాతులకుఁ దగులుచుండు రోగము.
౫ Strngples and South African horse sickness వ్యాధులు. ఇవి తఱచుగ గుఱ్ఱములకుఁదగులుచుండురోగము.

ఇవి ముఖ్యరోగములు. ఇంకను సర్వసాధారణముగ నన్నిటికిం దగులుచుండురోగములు కొన్ని కలవని చెప్పఁబడినది.

౧ Quarter ill రోగము.
౨ Glanders రోగము.
౩ Actinomycosis రోగము.
౪ Tetanus రోగము
౫ Foot disease రోగము
౬ Mouth disease రోగము
౭ Tuberculosis రోగము. (ఇది మనుష్యులకుఁ గూడ నంటునదనియు, ఈరోగముండిన పశువుల సంపర్కమును, దానిపాలుఁద్రావుటయు నపాయకరములని చెప్పఁబడినది.)
౮ Anthrox రోగము.

ఈరోగములందు 3 Actinomy cosisరోగమును, ౪ Anthrux రోగమును, ౫ Foot disease రోగమును, ౬ mouth disease రోగమును, ౨ Glanders రోగమును. ౪ Tetanus రోగమును, అంటువ్యాధులని యిటీవలి పరిశీలనలవలన గ్రహించియున్నారు. ఒక్కొకతఱి మనుష్యులకుఁ గూడ నేదోరూపమున నంటినను నంటవచ్చునని యనుమానింపఁ బడుచున్నది.

ఈశాస్త్రము గూర్చి లండనునగరమందలి Royal college of Veterinary surgeonsనందుఁ జక్కనిపరిశీలనలు జరుపఁబడుచున్నవి. ఇంకను నిట్టిపరిశీలనసంస్థ లితర తావులందునను గలవఁట.

**వెటికాన్** (Vetican):-ఇటలీదేశమునందు రోమునగరమున పోపుదేశికునిముఖ్యస్థానము 'వెటికాన్' అనుపేరుగల గిరిపై నిర్మింపఁబడియుంట నాపేరందినది. ఇది దివ్యభవనములసముదాయము. టైబరునదీతీరమున నున్నది. నదిపశ్చిమతీరమున నిది యొకపట్టణమువలె నుండును.

క్రీ. వె. ఎన్మదవశతాబ్దమున charlemagne ప్రభు విందు నివసించుచుండెననియు, ఆయన పట్టాభిషేకకాలమున కిదియెనివాసమనియుఁ జెప్పఁబడినది. పంద్రెండవశతాబ్దమునఁదిరుగనిర్మింపఁబడి, పదమూఁడవశతాబ్దమున నభివృద్ధిపఱుపఁబడినది. క్రీ. వె. ౧౩౭౭ నుండి రోమన్ కాతలిక్కుమతా

ధ్యతులగు పోపుదేశికులనివాసమై యున్నది. దీనిపొడవు ౧౧౫౧, వెడలుపు ౭౬౭.

ఇందు మేడలపై కెక్కుటకు నెన్మిది సోపానములు వేర్వేఱుగఁగలవు. ఇవి గాక రెండువందల మెట్లవరుసలు వేర్వేఱుతావులఁ గలవు. ఇరువది వాకిళ్లును, 4422 గదులు, లెక్కింపఁ బడినవి. అనేకదేవాలయములుకలవు. ఒకగేలరీ 230 గజములపొడవుఁగలదిగలదు. ఒకగొప్పమ్యూజియమును, నొక్కలై బ్రిరీయును సుప్రసిద్ధము. పుస్తకభాండాగారము క్రీ. శ. ౧౪౪౭ లో స్థాపించఁబడినది. ౧౫౮౮ లోఁ బ్రస్తుతభవనము నిర్మింపఁబడినది. ఇందు హిబ్రూగ్రంథములు ౬౦౦, అరబ్బీగ్రంథములు ౮౦౦, కోప్టిక్కు గ్రంథములు ౮౦, యెతియోపిక్కు గ్రంథములు ౭౦, సిరియాగ్రంథములు ౪౬౦ గలవు. ఇవి యమూల్యగ్రంథములని చెప్పఁబడినవి.

వెటికాన్ భవనములును, పరిసరములును, పాపాస్-స్టేటు అనుపేరున నైరోపామహాసంగ్రామానంతర మేర్పఱుపఁబడి, పోపుదేశికునిపాలనయందున్నది. ఈమహోదయుడు ప్రపంచమందలి రోమన్‌కాతలిక్కు మతాధిపతి యఁట.

ఇక్కాలమున వెటికాన్‌నందు ౩౪౦౦౦ వ్రాఁతగ్రంథములును, ౨౫౦౦౦౦ అచ్చుగ్రంథములును గలవని ప్రతీతి కలదు.

[పోపుమహాత్మునియెన్నిక చూడుఁడు. ప్యూరిటాన్ క్రైస్తవమతము చూడుఁడు. యూనిటేరియన్. సిద్ధాంతము చూడుఁడు. రోమన్‌కాతలిక్కు క్రైస్తవమతాతిశయములు చూడుఁడు. పోపుదేశికుఁడు చూడుఁడు].

## వెడలుపైన నుదురు [Broad or high forehead):—

సాముద్రికశాస్త్రమున వెడలుపగు నుదురుగలవాఁ డెక్కువదూరాలోచము లోసర్పఁగలవాఁడని చెప్పఁబడినది. ఐరోపాదేశములందు నుదురు వెడలుపుగనుంట మేధావయవము (brains) ఎక్కువయుండుననియు, నతండు దూరాలోచనాపరుఁడు, గ్రాహ్యశక్తి బాగుగఁ గలిగినవాఁనని యందురు.

నుదురు ఎత్తుగను లేక స్వల్పముగను, పల్లముగను నుండినచో మందమతియో లేక దూరాలోచనలేమిఁగని మూఢుఁడో యైయుండునని సర్వ సాధారణముగ వల్కుదురు.

ఇట్లనుటవలన నుదురు వెడలుపుగను నెత్తుగను నుండిన నాతండు ప్రజ్ఞానిధియనియు, దూరదృష్టిగలిగినవాఁడనియు, పూర్తిగ ననుటకువీలుండకపోవచ్చును. ఆతం డెక్కుఁడయ్యు నతనికిఁ దగిన విద్యయు, ఆతని మేధావయవముకుఁ దగినతరిఫియ్యతును లేకుండవచ్చునుగాన వెడలుపును, ఎత్తును గలిగినుదురుగలవాఁడు మేధావంతుఁడై యుండిన నుండఁదగినవాఁడని యెఱుంగవలయును.

## వెడ్డాజాతివారు:—

వీరు సింహాలద్వీపఁపు టాదిమనివాసులుగఁ జెప్పఁబడుచున్నారు. వీరికొకప్పుడు 'యాఖ్కో' లనుపే రుండెనఁట. ఈపే రెట్లు కల్గెనో తెలియుట దుస్తరముగా నున్నది. వెడ్డాశబ్దము వేఁటకాఁడని యర్థమిచ్చునేమో యని కొందరు తలంచిరి గాని, వెడ్డాశబ్దము వర్ధశబ్దఁపు వికారరూపముగ 'తక్షాతువర్ధకిః' అనఁగాఁ దొల్లింటి విశ్వకర్మసంతతియని పెక్కండ్రు పరిశోధకులు తలంచిరి. ఇంక యాఖ్కోశబ్దముయొక్క వికృతియేమొ లేక కొంద అనుమానించునటుల రక్కసిశబ్దముతో నేపాటియైన సంబంధముఁగల్గినదో పరిశీలింపఁ బడవలసియుండెడిని.

తెలుగువారిలోని జక్కులు, ఈ యాక్కోలతో వృత్తికళలో సమానలక్షణములుగలవారని

కొందరుపరిశీలకు లనెదరు. ఐరోపాదేశపుఁబరిశీలకులు యూకోఁలు మధ్యరాష్ట్రములందలి గోండు జాతింబోలి యన్నివిధములనున్నవారని పోల్చుచున్నారు. ఏది నిజమైనను వెడ్డాలు తొల్లింట లంకారాజ్యపురాక్షసులకు స్వదేశస్త్రీలయందు జనించినవారని బలమగువాడుక గలదు. సింహాలుల మూలపురుషుండగు విజయభూపతి వెడ్డాలబాలం బరిణయమాడె నని చెప్పఁబడినది. శివకుమారుండగు కుమారస్వామి పరిణయమైన వల్లీదేవి వెడ్డాల బాలిక యని వారియందు బలమైన నమ్మకము నేఁటికిని గలదు. వెడ్డాలు స్వల్పసంఖ్యాకులు. పార్కుకంట్రీ యనంబరఁగు కొండలలో గుహాలు మొదలగువాటియందు వసింతురు. వేటాడిన మృగములమాంసమును, తేనెను, కొన్నిపండ్ల జాతుల నాహారముగ భుజింతురు. ధనుర్బాణములచేతితోను, కొందరు పెద్దబాణములను వెల్లకిలంబరుండి చూడనొల్లక దాగుండెదరు. వక్కసు నల్పినను నిల్లే చాలుననే యుందురు. ఇతరజాతులు వీరిని పూతులుగ నెంచి, వీరికిఁ బిల్లలనిత్తురు. కాని వీరిపిల్లల నన్యుల కీయ నిచ్చగింపరు. వీరిమతముఁ గూర్చి సరిగాఁ దెలియరాకున్నది. (సింహాళము చూడుఁడు — రావణాసురుఁడు చూడుఁడు).

**వెడ్డాజాతివారు:—** వీరు సింహాలద్వీపపు టాదిమనివాసులమని యనెదరు. ఆద్వీపఁపుటాగ్నేయభాగమున మాత్రము కొండలలోఁ గాన వచ్చుచు నవనాగరికులుగ నున్నారు. వీరు రాక్షసులకుం బూర్వపుటాదిమనివాసులో లేక రాక్షస సంతతియే యిటుల హీనస్థితిపాలాయెనో గాని, గొప్పపిరికితనముచే నొరులకండ్లఁబడుటఁ దప్పించుకొనుటను వాంఛించుచుందురు. తేనె, కొన్ని వేటమృగములమాంసము, పండ్లు వీరియాహారము. కుమారస్వామి (షణ్ముఖుఁడు) పరిణయమైన వల్లీదేవి వీరియాఁడుబడుచని యనెదరు. పొట్టిగ నుందురు. గుహాలలో నివసించువారు. మాణిక్యగంగానది వీరు వసించుసీమయం దున్నది. మఱియు నటఁ గుమారస్వామిదేవళముఁ గలదు.

**వెణుతురుచెట్టు (వెలుతురుచెట్టు):-** లా. mimosa, Cinerea, సం. తీక్ష్ణకంటకః, కరీర. హిందీ కుబర్. దీనిని వెలుతురుచెట్టనియు వాడుదురు. దీనియాకులు కాకఁజేసి, దోషముల విడఁగొట్టు ననియు, కఫవాతములు హరించు ననియు, గుల్మములకు దానితోఁగల్పి లోనికిచ్చిన గ్రిమిని నిర్మూలింప, గుల్మము బలపడుననియు, ఆకు నూరి పైనిపై చికట్టిన వ్రణములు, వాపులు, విషదోషములు హరించుననియు, లేఁతచిగుళ్ళు లోనికిచ్చినఁ జలవఁజేయుననియు, వీటిం దంచి కంటి పై వేసికట్టిన కలకలు, ఎఱుపులు నివృత్తియగు ననియు, పూవులు కఫ పిత్తముల శమింపఁజేయు ననియు, కాయలు, పండ్లు, మలమును గట్టిపఱచు గుణము గలవియనియు, ఆకు చెక్కల రసకషాయములు, మలబద్ధము, రక్తవిరేచనములు, మూత్రాశ్మరి, మొదలగు మూత్రదోషముల నివారించుననియుఁ జెప్పఁబడినది.

**వెణుతురుబల్లి విశ్వనాధకవి:—** ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడిన వాఁడు. ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు. తండ్రి పేరు వెంకటామాత్యుఁడు. క్రీ. వె. ౧౬౦౦ సంవత్సరప్రాంతకాలమువాఁడు.

రచించినది శేషధర్మమనుపద్యకావ్యము. దానిని పెద్దాపురసంస్థానప్రభుండగు వత్సవాయి తిమ్మజగత్పతి మహారాజునకుఁ గృతి యిచ్చెను.

**వెణుతుర్ల వడ్డికవి:—** ఆంధ్రకవులలో నాధునికులందుఁ జేర్పఁబడినవాఁడు. శుక్ల

యజుర్వేదీయ (ప్రథమశాఖీ) బ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. తండ్రిపేరు మంగళగిరి. తాత పేరు వేఁగ (వేంక) నార్యుఁడు. రామభక్తుఁడు.

రచించినది 'శృంగారరసాలవాల' మనుప్రబంధము. ఈకవిపేరు (వడ్డీకాసుల అనఁగా వేంకటేశ్వర) తండ్రితాతలపేర్లు. వీరు వైష్ణవసాంప్రదాయస్థులని తోఁపింపఁజేసెడిని.

**వెదర్** (weather):—'వెదర్' అనినయాంగ్లపదమునకు గాలి, మేఘములు, వాన, ఎండ, వేఁడిమి మొదలగుపరిస్థితులు వాయుపదమునందెట్లున్నవో వాటిస్థితి.యనియర్థము.

**వెదర్‌ఫోరుకేస్టు**:—
[ఫోరుకేస్టు చూడుఁడు.]

**వెదురుకర్పూరము**:— మనదేశమునందు విశేషముగా లభించు వెదురుచెట్టు జనులకనేకవిధముల నుపయోగించుచున్నది. వెదురువలన నుపయోగములను సంపూర్ణముగా వివరించుట కష్టసాధ్యము. సారవంతమగు తొక్కను గలిగియుండుటవలన వెదురుచెట్టునకు, త్వక్క్షార మనియు, త్వచిసార మనియు నామాంతరములు గలవు. చిరకాలమునుండి మనవారు వెదురుగుంపులనుండి వెలికిస్రవించు పాలవంటిపదార్థము నొకదానిని సేకరించి దానిని వైద్యమున నుపయోగించుచున్నారు. ఆపదార్థమునకు వంశరోచనమనియును, త్వక్క్షీర యనియును బేర్లు. వ్యవహారికభాషయందు దీనిని దళనయని యందురు. 'త్వక్క్షీర' శబ్దమును పారసీభాషయందు 'తబర్‌క్షీర్' అనియును, దబషీర్ అనియును, వంశరోచనశబ్దమును హిందూస్థానీభాషయందు 'బంశలోచన' అనియు వాడుచున్నారు. ఇదియే వెదురుకర్పూరము. ఈపలుకులు కర్పూరఁపుఁబలుకుల పోలిక గలిగియుండుటవలన నీపేరువచ్చినది. ఈవెదురుకర్పూరము సేవించుటవలన నగ్నిదీపనము [digetion) వృద్ధిపొందునని మనవైద్యశాస్త్రమునం దున్నది. ఇంగ్లీషువారి వైద్యములో దీని నుపయోగించుటలేదు.

ఒకజాతిచిన్నపురుగు వెదురుబొంగులలో గుంపులుగలచోట్లకు కొంచెము మెఁఱుగు తొలిచి రంధ్రములుచేసి లోపలఁ బ్రవేశించుటవలన నారంధ్రములనుండి పాలవంటి యాలవణపదార్థము పైకి స్రవించి క్రమక్రమముగా గట్టిపడి ముక్కలగట్టును. అట్టిముక్కల నేరితెచ్చి జనులు సంగ్రహించుకొందురు.

కొంతకాలముక్రిందట నుత్తరదేశమునం దొకవర్తకుఁడు సన్నపాటి యినుపకమ్మితో, వెదురుగుంపులకు సున్నితముగా రంధ్రములు పొడిచి, కొన్నాళ్ళు వేచియుండఁగా పొడిచినరంధ్రములనుండి ద్రవముస్రవించుటవలన వర్తకునకు విశేషముగా వెదురుకర్పూరము లభించెను. ఈతీరున నాతఁడు చిరకాలము కర్పూరమును సంగ్రహించి దానిని విక్రయించి విశేషద్రవ్య మార్జించెను. కాఁబట్టి విస్తారముగా వెదురుపొదలుగల యడవులలో నీరీతిని కర్పూరముపుట్టుట కనువగు నేర్పాట్లుచేసి దానివలన లాభముఁ బొందుట కవకాశము గలదు.

మనప్రాంతమునందు వైద్యులు గొందఱు వెదురుకర్పూరము నెఱుఁగమిచేతను, ఎఱిఁగిన వారికయినను నది సమృద్ధిగా లభింపమిచేతను పాలగుండముక్కలను వెదురు కర్పూరమునకు మాఱుగా నుపయోగించుచున్నారు. వెదురుకర్పూరమే సమృద్ధిగా దొరకుచున్నయెడల నెన్నియోవిధముల నుపయోగించుటకు వీలుండు

పురుగులవలనఁ బుట్టింపఁబడు వెదురుకర్పూరము సమృద్ధిగా దొరకుట కవకాశము లేదుగావునఁ బై నిచెప్పినతీరునఁ జెట్లకణుపులదగ్గఱ కన్నములు పొడిపించి కర్పూరమును బుట్టించుట సమంజసము.

**వెదురుచెట్టు**:—లా. Bambusa Arundinacede. ఆంగ్ల. Bamboo. సం. వంశః, వేణుః, వెదురునందు చాలభేదజాతులు గలవు. గుల్ల లేని గట్టికఱ్ఱలవెదురు బాణాకఱ్ఱలం జేయుదురు. గుల్లగల వెదురుబొంగులు తవ్వలు, అడ్డలు మొదలగుకొలపాత్రలను, వెదురుపేళ్లబద్దలు, చాపలు, చాటలు, బుట్టలు మొదలు వేయియుపయోగపరికరములను వెదురుతోఁ జేతురు. ఇండ్లకప్పులు, పాలకిబొంగులు, వాసములు మొదలగు సర్వమునకు జపాన్ దేశమున వెదురే యాధారము. వెదురు లేనిచో జపాన్ నిలువఁజాలకుండునను నట్లుపయోగింతురు. వెదురుదుంపలను, లేఁతబోదులును ఊరవేసి మురబ్బాఁ జేసి భోజనపదార్థముగఁ జేతురు. వెదురుధాన్యమును (విత్తనములను) బియ్యముచేసి మన్యఁపుజను లన్నము వండుకొని తినెదరు. ఊహాపోహాలు, ఓర్పునేర్పులు, చతురతలం గల్గిన వెదురుఉపయోగములకులెక్కయే లేకుండు ననిపించును. ఇట్టివెదురు శ్లేష్మముగు జాతులనభివృద్ధిఁగల్గించిపనిపాటలంగల్గించి పెక్కండ్రకు జీవనోపాధి గల్గెడిని. వెదురుముదురుగడఁ దెచ్చి కణుపులుచెడకుండ నడికి పాతిన క్రిందికి వేళ్లుదిగి చిగిర్చి బ్రతుకును.

జీవించియున్న వెదురుచిగురాకు కషాయము చలువ జేయుననియు, స్త్రీలరుతురక్తము, ప్రసవస్త్రీలమైలరక్తము, చక్కఁగ వెడలించుననియు, మూలవ్యాధి నడఁగించుననియుఁ జెప్పఁబడినది. పశువులు పాఱుకొనుట గట్టునందురు. లేఁత వెదురుబోదు, మలమూత్రముల వెడలించి, యించుక కడుపుబ్బరముం గల్గించును. వెదురుబియ్యఁపుటన్నము శరీరఁపునిక్కాక నడంచుననియు, మేహశాంతి యొనర్చుననియుఁ జెప్పఁబడినది.

వెదురుగల్గించు దోషముల కావాలచూర్ణము, మోదుగక్షారము నందురు. ఇటీవలఁ గొన్ని వెదురుబొంగులు మిక్కిలి వలయుగనుండి జలములు నిల్వయుంచుకొనఁదగిన జలపాత్రలుగఁగోసి వాడుకొనఁదగినవి కలవని కనిపెట్టఁబడినది.

**వెనకకు వెడితే తన్ను, ముందుకు వస్తే పోటూ (అవునుగుణము లని భావము)**:—
(ఆంధ్రలోకోక్తి.)

**వెనశిష్ట వెనశేష్టగోత్రము**:—
(వేనశిష్టకులచూడుఁడు.)

**వెన్న**:—లా. Butyrum. ఆంగ్ల. Butter. ఫ్రెంచి. Beurre—Beurrer. జర్మను. boutyron సం. నవనీ, నవనీతం.

పాలుగాచి తోడుపైచిన పెరుఁగగును. దానిని కవ్వముతోఁగాని, చేతగాని గిలకొట్టి రుద్ది యందలి వెన్నను వేఱుఁజేయుదురు. ఈవెన్నంగాచిన నెయ్యియగును. ఒక్కొకజాతిమృగము లేక జంతువు పాలనుండి వచ్చువెన్న కొంతకొంత హెచ్చుతగ్గులం గల్గియుండును. గేదెలకు వెన్న యధికము. మేకలకుఁ దక్కువ. ఆవుపాలవెన్న శ్రేష్ఠము.

వెన్న పాలనుండి క్రొవ్వుభాగమును వేఱుఁ జేయుట యనిచెప్పఁబడినది. ఇది సగటున 3 . 75 భాగమని తెలిసెడిని. పాలనుండి వెన్నయంతయుఁ దీసివేయుట దుస్తరముగాని 3 . 75 భాగముఁ దీసి

వేయఁగలుగుచున్నారు. ఇదియే వెన్న. పరిశీలనల వలనఁ బాలయందు 84.91 క్రొవ్వును 13.05 నీరును, 1.02 పెరుగును, 1.02 ఉప్పును గలదని కనిపెట్టఁబడినది. ఇది సగటున ననఁగా నావుపాల యందని తెలియవలెను. ఒకయాంగ్లపరిశోధకుఁడు వెన్నను "Fatty particles of milk brought together into a still muss by churning" అని వివరించెను.

క్రీ. శ. 1887 Laval అను యంత్రవేత్త పాలనుండి వెన్నను వేఱుచేయుయంత్రముం గని పెట్టెను. దీనిమూలమున వేరుచేయఁబడినవెన్నను పండఁబెట్టుట యవసరమని తేలుచున్నది. మఱియు నిం దర్ధభాగముగ నుప్పుఁ జేర్చి డబ్బీలనింపి యమ్ముదురు. కొందరు పాశ్చాత్యరసాయనవేత్తలగు పరిశీలకులు Lactic acid ను కల్గించునట్టు యొకవిధమగు Baeteria వలన వెన్న యేర్పడుచున్నదని తెల్పుచున్నారు.

ఆయుర్వేదవైద్యశాస్త్రముమేరకుఁ గ్రొత్తవెన్న శ్లేష్మమనియు, సమధాతువుంగల్గించియు నించుక చలవఁజేసి వీర్యవృద్ధి, బలముఁ గల్గించుననియు, క్షయ, గ్రహణి, మూలశంక నివారించుననియు, నేత్రములకుఁ జలవఁజేసి యౌవనమును నిల్పుననియు, నధికముగఁ దినిన నగ్నిమాంద్యముఁ గల్గించికఫోద్రేకముఁ గల్గించుననియుఁ జెప్పఁబడినది. పచ్చిపాలనుండి తీసినవెన్న యధికముగఁ జలువఁజేసి, రక్తపైత్త్యము సంగ్రహిణి నేత్రరోగముల నయముఁజేసి నిక్కాకల నడంచుననియు, ప్రాంత గిలినవెన్న గురుత్వముగనుండి మూలశంకను ప్రేరేపించుననియు, ఉదరరోగము, ఉబ్బరోగము, కఫరోగము, కుష్ఠురోగము, జ్వరము, పాండురోగము, మూర్ఛ, వాంతులు గలవారు వెన్నను తినరాదనియు, సగటున వెన్న విరేచనబద్ధముం గల్గించుననియు, పైకి నలఁదుటవలన శరీరము మృదువు పడుననియు, వాతతత్వముగలవారికి వెన్న పడదనియుఁ జెప్పుదురు. వెన్న కల్లఁపుమురబ్బా, చెఱకురసము, తేనె, పంచదార విఱుగుడు లందురు. ఇంకను కొంద ఱుప్పు విఱుగు డని యెదరు.

ఆరోగ్యవంతు లావువెన్నను వసంతఋతునందు శొంఠి, గజపిప్పళ్ళచూర్ణముతోను, గ్రీష్మఋతునందు శర్కరతోను, వర్షఋతునందుఁ బంచకోలముల చూర్ణముతోడను, శరదృతువునందు యవధాన్యఁపుఁ బేలాలతోను, హేమంతఋతునందు సైంధవ లవణముతోను, శిశిరఋతువునందుఁ బిప్పళ్ళచూర్ణముతోను పుచ్చుకొనఁ దగునని శాస్త్రజ్ఞులు చెప్పిరి. ఇది బలమిచ్చి వయస్సును నిలిపి ముదిమి నెదిరించునని చెప్పఁబడినది.

## వెన్నకులగోత్రము:—

(విన్నకుల చూడుఁడు).

## వెన్న పెడితే వింగా లేఁడు వేలు పెడితే కఱవా లేఁడు:—

(ఆంధ్రలోకోక్తి).

## వెనిజుయెలాప్రజాప్రభుత్వరాష్ట్రము (Venezuela republic):—

ఇది దక్షిణయమెరికాలోని రాష్ట్రము. కొలంబియాకుఁ దూర్పున కరేబియాసముద్రము బ్రెజిల్ నడుమనున్నది. పశువులు, గుఱ్ఱములు, వేసడములు విస్తారము పచ్చికబయళ్ళయందుఁ బెరుగుచుండును. ౬,00,000 చతు॥ మైళ్ళవైశాల్యప్రదేశము. కాఫీ కోకో తోఁటలు విస్తారము. చర్మములు పదును చేయఁబడుచున్నవి.

తొల్లి యిది స్పానియావారిక్రింద యుండి, క్రి. శ. ౧౮౧౧లో విముక్తినొంది న్యూగ్రీనడా [ఇప్పటి

కొలంబియా) ఈక్వెడోరులతోఁ గలసి ప్రజాప్రభుత్వ మేర్పఱచుకొనెను. గాని సరిపడక ౧౮౩౦ లోఁ దాను స్వతంత్రప్రజాప్రభుత్వ మయ్యెను. సముద్ర తీరముననున్న కరకాస్‌పురము ప్రధానకార్యస్థానము. లాగువాయ్రా పురము రేవుస్థానము. మారకైబో మరియొక రేవుపట్టణము. కారకాసుపురము బోలివరుగారి జన్మస్థదేశము. ఈయన స్పానియా ప్రభుత్వమునుండి విముక్తిఁగల్గించినవాఁడని చెప్పఁబడినది.

## వెనిస్‌నగరము:— (ఇటలీదేశములోని యొకనగరము చూడుఁడు.)

## వెనీషియా:—(ఇటలీదేశములోని యొక ప్రోవిన్సు చూడుఁడు.)

## వెన్నెముక -ఉదయము, సాయంత్రము పరిస్థితులు:—

రాత్రి నిద్రయందు శరీరమునకు విశ్రాంతి చక్కఁగఁగల్గి శరీరావయవములన్నియు బలపడుచుండును. పగలు పనిపాటు శ్రమలచే నించుక తగ్గి యలసి యుండును. ఇది చాల తక్కువగా నుండుచు ననుదినము జరుగుచునే యుండెడిని.

ఇట్లే వెన్నెముకల నడుమనుండు మెత్తని బిళ్ళలును, అగుచుండును గాన నుదయమున నవి బలపడి బిగిసియుంట శరీరముం జక్కఁగ నిలువఁ బెట్టుచు నించుక పొడవుగఁ గన్పడఁజేయుచుండును. పగటిశ్రమ కవి కొంతబలముం గోల్పోయి క్షీణించి, పలుచఁబడియుంట మేను నించుక వంగి (కుగ్గి) ఇంచుకపొడవు తగ్గిన ట్లగుపడఁ జేయుచుండును. ఇది చాల తక్కువగఁ గాన్పించు భేదము. ఎక్కువ పరిశీలించినఁ గాని తెలియఁబడనిది.

ఎముకలనడుమనుండు మెత్తనిబిళ్ళలన నవియే. అవి లేకుండెనేని మేను వంగుట, యించుకయిటు నటుఁ దిరుగుట, దుస్తరముగా నయ్యెడిని.

## వెన్నెల (moon light):—

చంద్రిక యనియు, జ్యోత్స్న యనియు నందురు. సూర్యునికాంతి చంద్రునిపైఁ బడి భూమిపైఁ బ్రతిఫలించుకాంతిని 'వెన్నెల' యనెదరు. చంద్రగోళమున నేమార్పు లుండవనియు, ప్రాణులకు నివాసములే దనియు, గాలిలేనిదనియు, ఎస్ట్రోనోమీ శాస్త్రము చెప్పుచున్నది.

శరత్కాలమగు ఆశ్వీయుజ, కార్తిక మాసములందు వెన్నెల యధిక తేజోవంతమై, వేసవికాలమునఁ దగ్గియుండును. శుక్లపక్షమునఁ జంద్రోదయము రోజుకురో జేఁబదిమినిట్లుముందుగ నగుచు, వెన్నెల యభివృద్ధియగుచు, పౌర్ణమినాఁడు సంపూర్ణతఁగాంచుటయు, కృష్ణపక్షమునఁ జంద్రోదయము రోజుకురో జేఁబదిమిసి ట్లాలస్యమగుచు వెన్నెల క్షీణించుచు, తుద కమావాస్యనాఁడు వెన్నెలయే లేకుండుట సర్వసాధారణముగ నడుచుపద్ధతియైనను, అన్నితావుల నిట్లే యుండదనియుఁ జెప్పఁబడినది. The angle the moon's path cuts with the horizon నుండి యిది మాఱుచుండునని ఎస్ట్రోనిమీ శాస్త్రవిదులు లెక్కించియున్నారు.

ఈకోణము Pisces (మీనరాశి) యం దధికమై యుండును. దానిని autumn నందు 'Harvesh moon' అని పేరిడియున్నారు.

## వెన్నెలకంటి సూరన్నకవి:—

ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రము. హారితసగోత్రము.

# వెన్నెలకంటివారి వంశావళి హరిసతగోత్రము.

సూరనసోమయాజి (రాజేంద్రచోళుని సమకాలికుడు. శా. శ. సం. ౧౦౩౦—౧౦౮౦.)

(శా. శ. సం ౧౦౮౦—౧౧౩౦)

సిద్ధనమంత్రి భార్య సూరమ్మ (ఈమె పేరయ నన్నయల చెల్లెలని చెప్పబడినది. శా. శ. సం. ౧౧౩౦—౧౧౮౦)

- భాస్కరుడు లేక సూర్యుడు (అనవేమరెడ్డి భూపాలుని సమకాలికుడు. శా. సం. ౧౧౮౦—౧౨౩౦)
  - ఆదిత్యుడు లేక అమరన్న
    - సూరన్న లేక నారయ్య అని వాడుకనామము (విష్ణుపురాణకవి శా. సం. ౧౩౦౦—౧౩౫౦)
      - లక్ష్మన్న
      - వెన్నెలకంటి (శా. సం) భైరవుడు
        - గంగరాజు
          - వెంకటరాజు (వేంగన్న)
        - బాచిరాజు
          - సూరపరాజు
        - పెదవెంకటరాజు
          - రామరాజు
          - కేశిరాజు
        - చినవెంకటరాజు
          - వేంకట రాజు
          - వేంకట కృష్ణయ్య
          - బాలన్న
          - గోపన్న
          - గుడ్ల సూర్యుడు
        - చనప్ప
          - సూరన్న లేక సూరపరాజు
          - వెంకయ్య లేక వెంగయ్య
          - అనంతుడు లేక అనంతరాజు (శా. ౧౫౦౦)
            - రామరాజు (శా. శ. సం. ౧౫౦౦—౧౫౫౦) ...
            - గంగరాజు
            - సూరపరాజు
            - ఉదయగిరి
            - వేంకటరాజు
          - రామ కృష్ణయ్య
          - స్కందరాజు లేక [కందరాజు]
- జన్నయమంత్రి
  - సిద్ధయమంత్రి (విక్రమార్క చరిత్రను జక్కనకవివలన కృతినందిన దేవరాయని సంస్థానమున రాజచిహ్నములనందెను. శా. సం. ౧౨౩౦—౧౩౦౦)
    - తిరుమలయ్య
      - భైరవుడు
      - పిన్నమరాజు
    - చంద్రశేఖరుడు
  - భైరవమంత్రి

రచించినది విష్ణుపురాణము నాంధ్రపద్యకావ్యముగ నొనర్చినవాఁడు. (వెన్నెలకంటివారి వంశావళి చూడుఁడు.) విక్రమార్కచరిత్రమును కృతి నందిన వెన్నెలకంటి సిద్ధయమంత్రి జన్నయ కుమారుఁడు). పెద్దతండ్రియగు భాస్కరుఁడు లేక సూర్యుఁడు. సూరన్నకవి యని పిలువంబడు చుండువాఁడు అతఁడులేఁడని యెఱుంగవలయును. క్రీ. వె. ౧౫౦౦ ప్రాతఃకాలములం దుండినవాఁడు. విష్ణుపురాణముకావ్యూరి సంస్థానము (గుంటూరు) ప్రభువగు రాఘవరెడ్డికిం గృతి యీయఁబడినది.

## వెయిట్‌నోటు (Weight note):—

వాణిజ్యసంబంధపరిభాషాపదము. ఎగుమతిదిగుమతులందు దాకుకంపెనీవారిచ్చిన certificate నందు వివరింపఁబడినసరకులతూనికలు గల పత్రమున కీపేరువర్తించును.

## వెయి న్గంగానది:—

(వేనగంగ చూడుఁడు).

## వెయిలింగ్ ప్లేస్ ఆఫ్ జ్యూస్ (Wailing place of Jews):—

యూదులు పాలస్తినాదేశఁపుఁబ్రజలు. అచటిజెరూసలెమ్ నగరమందు వారి జొహోవాదేవాలయస్థానమున నిప్పుడు ఉమర్ మశీదు నిర్మింపఁబడి మహమ్మదీయుల వశమై యున్నది. దానిలోనికి యూదులను రానీయరు.

తొల్లింటి జొహోవాదేవాలయఁపు టానవాళ్ళిప్పుడు కానరాకున్నను, నొకమాఱుమూల నానాఁటిచిన్నగోడభాగమట్లే నిలిచియున్నది. అట కప్పుడు కొందరు యూదులేగి, యొకరబ్బీ (యూదులమతగురువు) క్రింద పోయిన తమ పూర్వౌన్నత్యముంగూర్చి దుఃఖించుచు, అది మత కార్యముగ నెంచుచుందురు. ఇందు రబ్బీచరణములుగ మాటలను వచించుచుండ తక్కినవారు పల్లవివలె దుఃఖవచనములం బల్కుచుందురు.

## వెయ్యి ఆవు లున్నవాని కొకటి యెగఁజేపితేనేమి దిగఁజేపితేనేమి?:-

(ఆంధ్రలోకోక్తి).

## వెర్నాల్ ఇక్వినోక్సు (Eernal Equinox):—

సమకాల స్థానము. (Equinoxes:- చూడుఁడు). ఈదినమున (21 మార్చి) సూర్యుఁడు భూమధ్యరేఖం దాఁటును. 1st point of Aries. (సీజన్సు చూడుఁడు).

## వెర్టిబ్రే (Vertebrae):—

ఇది అస్థిపంజరము. శరీరమును బడిపోనీయక నిలుచునట్లుచేయుట కేర్పఱుపఁబడినది. ఇట్టియెముకలచట్రము లనేకములు శరీరములం దమర్పఁబడియుంటఁ గాననగుచుండును. వీటి కాంగ్లశరీరశాస్త్రవిదులును, అలోపతీవైద్యశాస్త్రవిదులు నుBack bone అనివాడుచుందురు. ఇవి వెన్నునందు, మెడయందు, గుండెలకడను, పక్కలందు, ఇంకను బెక్కుశరీరభాగముల సమర్పఁబడి, శరీరమును నిలువఁ బెట్టుచున్నది. గట్టిగనుండు నెముకలుగాన బలమున నిలువఁ బెట్టఁగల్గుచున్నవి. మృగములం దివి వాటికిఁ దగినట్లుండి, యొకటితో నొకటి కొన్ని భేదములఁ గల్గియున్నను, కొన్నిపోలిక లన్నిటికి సాముదాయములుగ నుండుటఁ బరిశీలించినఁ దెలియఁగలదు.

పశువులందలి వెర్టిబ్రే తోకయందుఁ బరిణమించెడిని. మనుష్యశరీరములందు తోఁకయుండదు గాన నట నొకచిన్నయెముకముక్క యుండుటతోఁ బూర్తియగును. పరిశీలన లాచిన్నముక్కయు రానురాను తగ్గిపోవుచు నింకను జిన్నదిగ నగుచున్న

దని తెల్పుచున్నవి. ఈయస్థిపంజరము లేపై పునకు వంగుచుండపలెనో యేయే దెసకు వంగుట కేయాటంకము లుండక, వంగనవసరములేని దెసలకు వంగకుండ నాటకములంగల్గినట్లు నిర్మింపఁబడుట వీటి యందున్న చిత్రము. ఇందునకు సాదృశ్యము మోఁకాళ్ళు వెనుకకే వంగునటులను, నడుము ముందునకు వంగునటులను నిర్మింపఁబడెనుగాని వేఱొక దెసకు వంగకుంటునటుల నాటంకములం గల్గియుండుట వెర్టిబ్రే యేర్పాటుగాని, వేఱు కానేఱదు. ఆంగ్లవైద్యశాస్త్రవిదులు వెర్టిబ్రే బాల్యమునం దుండు రీతికిని ముదిరినపిదపనుండు రీతికిని భేదముండుననియెదరు. లేఁతయెముకలు వంగుటయందును ముదిరినయెముకలు వంగక నిలుచుటయందును నీభేదము జూపట్టనోపు.

## వెఱ్ఱివానిచేతితాయి:—

(ఆంధ్రలోకోక్తి.)

**వెర్రివెంగళప్ప:—** ఆంధ్రభాషాసాంప్రదాయార్థపదము. బహుశః వేంకటప్పశబ్దము వేంగళప్పగా మాఱియుండనోపు. ఇది వ్యక్తిశబ్దమనలే యుపయోగములేదు.

బుద్ధిహీనుఁడగు లేక చేయనేరనివాఁడగు నవ్యక్తిన కీపేరు వాడుచుందురు. గాని సరియగు ప్రయోగముఁ గానరాదు.

## వెర్నిల్లా ఐస్క్రీమ్:—

(Ice Cream చూడుఁడు.)

**వేర్వుల్ఫు (were wolf):—** దీనికి 'man wolf' అనిభావమఁట. మనుష్యుఁడు తానందిన కొన్నిగొప్పశక్తిసామర్థ్యములవలనఁ దానే తోఁడేలుగనై మనుష్యులం దినుచుంట కర్థమఁట. ఇది పాశ్చాత్యులందలి నమ్మకము.

## వెల:—

(టాస్టుచూడుఁడు.)

**వెలగచెట్టు:—** లా. Ferona Elphantum. ఆంగ్ల wood apple tree. సం. కపిత్థం - కపిత్థకః - గ్రాహి. ఫలవృక్షః అనుపదములు వెలగసామాన్యమునకును, కాకజంఘా, కాకతిక్తా, కావనాసా అనుపదములు కాకివెలగ లేక చీకివెలగ, లేక అడివివెలగకును వర్తించును. ఇవిగాక నేలవెలగ యను వేఱొకజాతి కలదు. వెలగయందు శ్రేష్ఠమయినజాతిభేదమునకు మిశ్రిఖండ మనిపేరు. దీనిపండ్లు పెద్దవిగను, నెక్కువ తీపిగలవిగను నుండును. ఈజాతి చాల యరుదు. చిన్నపండ్లుగల యధమఁపుజాతి కాకివెలగ యుని తలంపఁబడుచున్నది. వెలగపండ్లు ప్రసిద్ధభోజన పదార్థములు.

వంకాయలు లేతగనుండుతఱిని, గుమ్మడికాయ చక్కఁగ పండినపిదపను పథ్యముగాని వెలగ సర్వదా పథ్యమని యాయుర్వేదవైద్యులు నుడువుదురు. ఏనుఁగులు వెలగపండ్లను బహుప్రీతితో మ్రింగును. పిదపఁ గొంతసేపటికవి యేనుఁగు లద్దెలోఁ గలసి బయటపడిపోవును. అత్తఱి పండ్లలోనిగుంజంతయు హరించిపోయి వట్టితోలకలు పడియుండును. వాట్లను భాణసంచాచేయువారు లోన భాణసంచాచూర్ణములం గుక్కి యమ్ముదురు. హిందూగృహములందు మార్గశిరమాసమున గురువారములందు వెలంకాయలను తినరు సరికదా తానెక్కిన తాకకుందురు. దానినాడినమున తినుట యభాగ్యప్రదమని తలంతురు. వెలగచెట్టునీడను పగటియందు విశ్రమించుట యాపత్కారణమని యొకవాడుకగలదు. వెలగాకులు పత్రి పంచబిల్వములలో నొకటిగఁ జెప్పఁబడి శివార్చనకుఁ బవిత్రమైనది.

వెలగపండు త్రిదోషహరమైన పథ్యకారి. మేహశాంతి, పైత్యశాంతిఁ గల్గించి యారోగ్యాభి వృద్ధిఁ గల్గించు ననియు, కాయ పండ్లకు బలముచే యుననియు, నోటియందలిపూత, చర్దిపోక్కులు, గ్రహణి, సంగ్రహణి, నాపుననియు, చిగుళ్లుకషాయము కడుపుబ్బరము, చర్ది, ఎక్కిళ్ళు, వాంతి నివారించుననియు, వెలగచక్క (అందు ముఖ్యముగ వెలగవేరు గంధము నుదురు, కణతలు, కనురెప్పలపై నలఁదిన నిద్రగల్గించుననియు, వెలగజిగురుగాని వెలగాకురసముగాని లోనికిచ్చిన విరేచనముల నాపుననియు, వెలగఆకులు తలపైఁ గట్టిన తలనొప్పి నివారించుననియు, ప్రక్కపైఁ బఱచి పరుండిన, పైత్యము, జ్వరతాపము తగ్గి నిద్రవచ్చుననియు, తేనె, శర్కర, వేఁపగింజలు, పెద్దసోపు విఱుగుడులనియుఁ జెప్పఁబడినది.

## వెలగపూడి కృష్ణయ్యకవి:—

ఆంధ్ర కవులలో నాధునికులలో నొకఁడుగ పరిగణింపఁ బడినవాఁడు. ఆర్వేలనియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రి లోహితసగోత్రుఁడు. తాతపేరు నరసింహము. తండ్రి నరహరి. ఈకవికాలము క్రీ. శ. ౧౭౨౦ సంవత్సరప్రాంతము. దక్షిణ మధురాపురము నివాసమని తోఁచెడిని.

రచించినవి భా:మద్విజయ మనుప్రబంధము, మాలతీమాధవీయము, గౌళికాశాస్త్రము, చతుర్విధకందశతకము. ఇవి పద్యకావ్యములు. వేదాంతసారసంగ్రహ మనువచనకావ్యము.

ఈతనిపూర్వు లగువంశస్థులు గాంగేయోపాఖ్యానము, సంమంతోదయము, ఆంధ్రకర్ణామృతము, వజ్రభుజోపాఖ్యానము, సేతుమాహాత్మ్యము, దత్తాత్రేయచరిత్రము, మర్యాదరామసచివచరిత్రము ననుగ్రంథములు రచించియుండిరని కవి ప్రాసియున్నాఁడు. మఱియు నీతఁడు విజయరంగ చొక్కనాథుని దండనాథుఁడును సాంబయామాత్యుని సుతుండునగు గోవిందరాజునకు మేనమఱఁదినని చెప్పుకొనియున్నాఁడు.

## వెలగపూడి వేంగళరాజు కవి:—

ఆంధ్రకవులలో మధ్యకవులందు పేర్కొనఁబడిన వాఁడు. ఆరువేల నియోగిబ్రాహ్మణుఁడు, తండ్రి పేరు పెద్దిరాజు. క్రీ. శ. ౧౬౩౦ పూర్వుఁడువాఁడని తెలిసెడిని. ఈతఁడు లీలాశుకుని కృష్ణకర్ణామృతమును పద్యకావ్యముగ రచించెను.

## వెలగోళ్లు (వేలిగోళ్ల) గోత్రము:-

[వ్యాళకూళకుల చూడుఁడు].

## వెలమవారు:—

వీరిని పద్మనాయకులనియు, రాచవెలమ లనియు, వెలమదొరలనియుఁ గూడ ననుటకలదు. వీరియందు వేంకటగిరి, బొబ్బిలి, కాళహస్తి, పిఠాపురము మొదలగు సంస్థానాధిపతులు పెక్కండ్రు కలరు.

పూర్వకాలఁపువెలమవారిలోఁ గొండవీటిసీమ సంగరములం బేరందిన బ్రహ్మనాయని సంఘసంస్కర్తగను, సర్వజ్ఞసింగమనీడు భూపతిని విద్యాపోషకుండగు విద్వత్ప్రభునిగను, ధర్మప్పనాయని దాతగను, ప్రశంసించు చుందురు. (ఈవెలమవారియందు డెబ్బదియేఁడుగోత్రములు కలవందురు.) వాటిపేర్లుమొదలగునవి పూర్తిగ లభింపకున్నవి. (పల్నాటియుద్ధము చూడుఁడు. కొండవీటిసీమదండకవిలె చూడుఁడు).

డెబ్బదియేఁడుగోత్రములలో నొకటియగు రేచర్లగోత్రమువారి మూలపురుషులు పిల్లలమఱ్ఱి భేతాళరెడ్డిగా రను సుప్రసిద్ధోక్తిం గూర్చి యొక కథ ప్రచారమునం దున్నది. వారి,పూర్వనామము

చెవ్విరెడ్డిగారని యుండెవట. ఆయన బేరిసీమలో యామనగల్లను పేరుగల గ్రామమున కొంతభూస్వాస్థ్యముల గల్గి, వ్యవసాయము వృత్తిగాఁ గల్గియుండెనట. వారికడ రేచఁడు లేక రేసుగాఁడు పాలికాపు (సేవకుఁడు) గా నుండువాఁడట. ఈసందర్భమున బేరిసీమంగూర్చి గాని, యామనగంటిం గూర్చి గాని యితరసంగతులు తెలియరాకున్నవి. రేచఁడు మాలకులస్థుఁడని మాత్రము చెప్పఁబడినది.

ఒకతఱి రేచఁడు పొలము దున్నుచుండ నొక శాసనము గన్పట్టెనఁట. దానినెఱింగింప చెవ్విరెడ్డిగా రత్తావున కరిగి తిలకించి యత్తావున విశేషధననిలయముంటయు, దానిం గైకొన నొక నరబలి నీయవలసియుంటయు, నెఱింగి, యోచనానిమగ్నుఁడై యుంట, రేచఁ "డయ్యా, నన్నుం బలియిచ్చి యిచటిధనరాశిం గైకొనుఁ" డనియెనఁట. చెవ్విరెడ్డిగారాతనిభక్తివిశ్వాసముల కత్యాశ్చర్యమందియు, వానిం జంప నిష్టములేక విముఖుఁడై యుండ, రేచఁ డోస్వామీ! నాకు జీవితముపై రోఁతగల్గియు, విధిలేక జీవించుచున్నాననియు, నింక దాము నాపేరును గోత్రముగా వహించుట యొకటియు మీసంతతివారు వివాహమాడుటకుముందు మాసంతతివాని కొకనికి వివాహముఁ జేయించిచుంట యొకయాచారము, మీవారియం దొకపద్ధతి యేర్పడుట యొకటియు, తనపేరు పవిత్రముగనెంచి, మున్ముందు మీవారు వహించుచుఁట యొకటియు, మూఁడువరములు తనయాత్మశాంతికై యర్థించి, తన్ను బలినర్పింపుఁడని వేఁడెనట. పిదప నట్లెనడచి నాగభైరవుండు యాధనరాశి నారెడ్డిగారికి వశపఱచెనట. దానిం గాంచి ప్రసీమండైన భేతాళుం డారెడ్డిగారికిఁ బ్రత్యక్షమై, యాయనకోర్కెమేరకైశ్వర్యమును రణరంగమున శౌర్యధైర్యములను వారికే గాక వారిసంతతివారికిఁ గూడఁ గల్గియుండునని వరమొసంగి, సంగరములందుఁ బద్మనాయకులకుఁ దాను ముందుండి జయముంగూర్చుచుండునని యభయమొసంగెనఁట.

నేఁటికిని వీరియందు రేచర్లగోత్రమని వాడుకొనుటయు, వివాహమునకుముం దొక పంచమునకు రేసుగాఁడివివాహముఁ జేయించుచుంటయు జరుపుచునేయున్నారని తెలిసెడిని. పిదప కాకతీయ గణపతిదేవ మహారాజును వీరిం గౌరవించుచు పద్మనాయకులకు సైన్యాధిపత్యము లొసంగెనఁట. ఈచెవ్విరెడ్డిగారే పిదపఁ బిల్లలమర్రి భేతాళరెడ్డిగాఁ దేర్కొనంబడినవాఁడఁట.

ఇంక దక్కన డెబ్బదియాఱు గోత్రములనే యింటిపేరులుగ వాడుకొను నితరపద్మనాయకులం గూర్చి యోచింతుముగాక. (రేచర్ల మాధవరాయణింగారు కవి చూడుఁడు).

౧ అంపుల్లివారు
౨ అనుగంటివారు
౩ అయోధ్యవారు
౪ అరట్లవారు
౫ అల్లుచెర్లవారు
౬ ఆదూళ్ళవారు
౭ ఆరట్లవారు
౮ ఆరవెల్లివారు
౯ ఇనుగాలవారు
౧౦ కంచెర్లవారు
౧౧ కదుపనూళ్ళవారు
౧౨ కందేపల్లివారు
౧౩ కొప్పనూళ్ళవారు
౧౪ కొమరవెల్లివారు
౧౫ కొమ్మలూరివారు
౧౬ గుండెకరీతులవారు
౧౭ గుండేటివారు
౧౮ గూడూరివారి
౧౯ గూడేవారు
౨౦ చెరుకులవారు
౨౧ చెరుకునూళ్ళు
౨౨ జమ్మలూరివారు
౨౩ జయపట్లవారు
౨౪ డెబ్బిరులవారు
౨౫ దాసునూళ్ళవారు
౨౬ దేవనూళ్ళవారు
౨౭ ధాన్యవోలువారు
౨౮ నరకూలవారు
౨౯ నింగివెల్లివారు
౩౦ పల్లచెర్లవారు

| | |
|---|---|
| ౩౧ పల్కునూరివారు | ౫౬ ముట్నూళ్ళవారు |
| ౩౨ పసుపునూళ్ళవారు | ౫౭ ముదునూళ్ళవారు |
| ౩౩ పాట్నూళ్ళవారు | ౫౮ మోతేవారు |
| ౩౪ పాండురాజులవారు | ౫౯ యంపరాలవారు |
| ౩౫ పాయేటివారు | ౬౦ రాలూరివారు |
| ౩౬ పాలూరివారు | ౬౧ రావిపాలవారు |
| ౩౭ పునుగోటివారు | ౬౨ రేచర్లవారు |
| ౩౮ పులియాలవారు | ౬౩ రేపాలవారు |
| ౩౯ పూర్వదివారు | ౬౪ వల్లవులవారు |
| ౪౦ పెనుగొండవారు | ౬౫ వాలూరివారు |
| ౪౧ పెంపాలవారు | ౬౬ విప్పర్లవారు |
| ౪౨ పెర్నంకలవారు | ౬౭ విరియాలవారు |
| ౪౩ పేరనూళ్ళవారు | ౬౮ వెముళ్ళవారు |
| ౪౪ పైడిపాలవారు | ౬౯ వేటకూరవారు |
| ౪౫ పైడిముక్కలవారు | ౭౦ వేసట్లవారు |
| ౪౬ పైశాలవారు | ౭౧ శనగపాల (శనగపూడి) వారు |
| ౪౭ బిలిశిఖవారు | |
| ౪౮ మంగిపూడివారు | ౭౨ శివమల్లెవారు |
| ౪౯ మధుపాలవారు | ౭౩ శ్రీమల్లెవారు |
| ౫౦ మరువట్లవారు | ౭౪ శైలపూరివారు |
| ౫౧ మల్లచెర్లవారు | ౭౫ సన్నకూర (సన్నగిరి) వారు |
| ౫౨ మలిచేటివారు | |
| ౫౩ మల్లెలవారు | ౭౬ సానేపల్లివారు |
| ౫౪ మాధవరేకులవారు | ౭౭ సామంతరావువారు |
| ౫౫ మారట్లవారు | |

ఇంకను ఈగోత్రములకు ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానముననున్న పద్మనాయక కులచరిత్రయం దించుక పాఠాంతరభేదము కన్పట్టెడిని. వానినిందు వివరింతుముగాక.

| | | | |
|---|---|---|---|
| ౧ అలుగుచెర్ల వారు | ౪ కుప్పనూరి ,, | ౭ చలవోరి ,, | ౨౨ మక్కెర్ల ,, |
| ౨ అరవళి ,, | ౫ కురట్ల ,, | ౮ చిరమల్లె ,, | ౨౩ మట్లూళ్ళ ,, |
| ౩ ఈసిగాల ,, | ౬ కొమ్మనూరు ,, | ౯ చెనగ ,, | ౨౪ మద్దిపల్లె ,, |
| | | ౧౦ చెండెకరిచుల ,, | ౨౫ మరిచెడి ,, |
| | | ౧౧ జగతాఖ ,, | ౨౬ మాదర ,, |
| | | ౧౨ జములూరు ,, | ౨౭ యమ్మిరేల ,, |
| | | ౧౩ నరమాల ,, | ౨౮ యాటకురు ,, |
| | | ౧౪ పన్నగురి ,, | ౨౯ రాయిశి ,, |
| | | ౧౫ పల్లవుల ,, | ౩౦ రేకుల ,, |
| | | ౧౬ పునగోటి ,, | ౩౧ వరరట్ల ,, |
| | | ౧౭ పునుముల్లె ,, | ౩౨ వాలూరు ,, |
| | | ౧౮ పువ్వాడి ,, | ౩౩ విశాల ,, |
| | | ౧౯ పొట్నూళ్ళ ,, | ౩౪ వెంపాల ,, |
| | | ౨౦ పొన్నకుంట ,, | ౩౫ వేరట్ల ,, |
| | | ౨౧ బలిశిఖ ,, | ౩౬ శిరసనూళ్ళ ,, |

**వెలమసన్నిచెట్టు:**—దీనింగూర్చి సరిగాం దెలియదు. దీని సమూలరసకషాయములు చలువంజేసి కఫదోషము, జ్వరము, రక్తపైత్యములు నడంచునని చెప్పంబడినది.

**వెలిగందల నారాయణకవి:**—ఆంధ్రకవి. ఈతఁడు బమ్మెరపోతరాజు శిష్యుఁడని వాడుకఁ గలదు. రచించినది ఆంధ్రభాగవతములోని భాగము. ఈభాగవతము బొప్పదభాగవతము గాని, దేవీభాగవతము గాదనియు వ్యాసప్రోక్తము గాదనియు నెఱుంగునది.

**వెలిగారము:**— లా. boracum. ఆంగ్ల. Borax. ఫ్రెంచి borax అరబ్బీ Burak పరిశియా Burak సం. టంకణః టంగః టంగణః టగరః

దీనిని టంకణక్షారమని యనుట కలదు. దీనిని పొంగించి వాడుదురు. దీనినొక పాశ్చాత్యరసాయ

సవేత్త 'Combination' of Boric acid and sodium' అని వివరించియున్నాడు. రసాయనవేత్తలు దీనిని 'Biborate og Soda' అని యెదరు. (Na B. O.) తొల్లియొకప్పుడు నూవులచెట్లనుగాల్చి బూడిదనుండి చేయుచుండిరఁట. ఇప్పు డాయభాగసము మానిపోయినది. టిబెట్టు దేశమున దీనింజేయుచుండుట కలదు. అచట దానికి టింకాల్ అనిపేరు. (టంకణక్షారమునుండి) ఇటీవల నిటలీదేశమునందలి టుసికాన్ సముద్రము చెలకలందు లభించు బొరికాసిడ్‌నకు సోడా, బుగ్గి, కల్పి చేయఁగనిపెట్టిరి. ఇప్పటి నవనాగరికపుఁ పద్ధతుల ప్రకాశము చేయఁబడుచున్న వెలిగారము నొకరసాయనవేత్త Crystalline sodium salt of heatid Bornic acid అని వివరించెను.

ఇటలీదేశమునందలి యగ్నిపర్వతముఖముల నుండి విజృంభణము కల్గునపుడు ప్రక్కలకుజాఱు లావాతోఁ గలసి తెల్లనిపదార్థ మొకటి ద్రవరూపమునంబడి చల్లారును. దీనికి 'Boracic acid' అనిపేరు. దీనినే సులభముగ పలుకుటకు 'Boric acid' అనియు నందురు. ఇందు Boran అనం బడుపదార్థము కలదు. ఇది రసాయనము. మఱియు రసాయనవేత్తలు 'Boracite is a native borate of magnesia' అని పోల్చియున్నారు.

వెలిగారముయొక్క యుపయోగములు బట్టను చలవజేయు చాకలిపనులందునను, కేలికోబట్ట ముద్రించుటయందునను, గ్లేజుచేయుటయందును, లోహముల నతుకుటకై టంకముగఁ జేయుట యందును గలవు. ఇది లోహములతోఁ గల్పి కరఁగించిన లోహమినీరువలె పలచనై ప్రవహించునటులఁ జేయును.

వెలిగారము లోనికిచ్చిన నగ్నిదీప్తినిచ్చి కొన్ని చిల్లరరోగములం గుదుర్చును. తేనెతోఁగల్పి పైనపూసిన నోటిలోనిపుండ్లు నాలుకపగుళ్లు మానును. పొంగించిన వెలిగారపుఁ జూర్ణము నీటి యందుఁగల్పి పుక్కిలించి యుమియుచుండినను, చిగుళ్ళవాపుమానును.

వెలిగారమునందు స్త్రీలఋతుబద్ధము క్రమముతప్పియగు ఋతుస్రావము, పురాణయోని రోగముల నివాతంచుశక్తి గలదని చెప్పఁబడినది. గర్భిణిస్త్రీలకు వెలిగారము లోనికియ్యరాదు, ఇచ్చిన గర్భస్రావము గల్గించును.

**వెలిదండ్ల వేంకటపతికవి:—** ఆంధ్రకవులలో నాధునికులయందుఁ జేర్కొనఁ బడిన వాఁడు. శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు తిరువేంగళా (తిరువేంకటా) చార్యులు.

రచించినది రాధామాధవసంవాదము. దీనిని ప్రళయకావేరి పురనివాసియగు మగదల రామదాసునకుఁ గృతి యిచ్చెను.

**వెల్లంకి తాతంభట్టు కవి:—** ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. లాకిణికుండైనకవి. వెలనాటిశాఖబ్రాహ్మణుఁడు. వశితశాలవతసగోత్రము. అన్నగారిపేరు రామయ్యా శాస్త్రి. తండ్రిపే రబ్బయ్య; తల్లిపేరు ఎఱ్ఱమ్మ.

రచించినది కవిచింతామణి. ఇందు వ్యాకరణము, ఛందస్సు, లక్షణము వివరింపఁ బడినవి.

**వెల్లనాటిసీమ:—** గుంటూరు ప్రాంత సీమ. ఇందుఁగల 'వెల్ల' యనుపేరుగల సుప్రసిద్ధ నందియుండుగ్రామమునుండి యాదికాలమున వెల్లనాటిసీమ యనియు, వెల్లనాఁడనియుఁ బేరంది, రానురాను లకారముయొక్క ద్విత్వముం గోల్పో

యి, వెలనాడై యున్నది. ఆంధ్రులందు వెలనాటి శాఖవా రీసీమనుండియే పేరందియుండిరి.

## వెలుఁగునకుఁ గ్రొవ్వొత్తుల లెక్క:-

దీపము మొదలగువాని వెలుఁగు నిన్ని గ్రొవ్వొత్తుల వెలుఁగని లెక్కించెదరు. గ్రొవ్వొత్తి ప్రమాణము బ్రిటీషుపార్లమెంటువలన పౌనుబరువున కాఱుగ్రొవ్వొత్తులు తూఁగవలయునని యేర్పఱుపఁబడినది. ఇట్లనుటవలనఁ గ్రొవ్వొత్తి ఆఱురూపాయల పదిఅణాల ఎన్మిదిపైసలయెత్తు. అనఁగా 6⅔ తుల ముండి యుండవలయును. మఱియుఁ గ్రొవ్వొత్తులు గంటకు ౧౨౦ గ్రైనులకొవ్వును, లేక మైనమును లేక తిమింగలము నూనెం గాల్చఁ గలదిగ నుండునది యని పార్లమెంటువారిచే నిర్ధారణపరుపఁబడినది. అట్టిది కొవ్వొత్తి దానివెగ్గ లెక్క.

ఈవెలుఁగులెక్క కిక్కాలములకొల్లకు దీపములు గలవు. వాట్ల మేరకు లెక్కింతురు.

**వెలుతురు:**—వెలుతురు వేఁడినుండి కల్గునది గాని, వెలుతురునుండి వేఁడి కలుగదని కని పెట్టఁబడినది. కొందఱుపరిశీలకు లిటీవలఁ బ్రపంచమందలి యన్ని వెలుతురులును విద్యుచ్ఛక్తికి సంబంధించినవే యనుచున్నారు.

వెలుతురులయొక్క యుపయోగమును, దానిం గ్రహించుశక్తియు, మనుష్యులకుఁ దమనేత్రముల ద్వారా తప్ప వేఱుగలేదు. మనుష్యనేత్రములందుఁగల బలము, కొంతదూరమువఱకు వెలుతురుం జూడఁగలదుగాని పిదపనున్న దూరమును చూచుటకు బలముచాలనిది గానఁ జూడఁజాలరు. చూడఁగల్గినను చూడఁజాలకపోయినను వెలుతు రెంతదూరమైనను పోఁగలదే కాని, భూమియొక్క గ్రావిటేషన్ మొదలగువాటికి లోఁబడి క్షీణావస్థనంది నశించునది కాదని కనిపెట్టఁబడినది. ఏదేనడ్డమైనను, తెరవంటియాటంక మడ్డమువచ్చినను, అంతటితో వెలుతురుయొక్క గమన మాఁగిపోవును. గాని, వేఱొకశక్తిచేఁ బీల్చి వేయఁబడదు. నశించునది కాదు.

వెలుతురు దూరమేగినకొలఁది నెక్కువప్రదేశమునకుఁ దొమ్మిదిదిక్కులకువ్యాపించి చెదరిపోవుచుండునుగాన తొల్లిఁటిబలము చెదరిపోవుచుండుట తగ్గిపోవుచుండును. దూరముననున్న దీపము వెలుతురు (దూరమునకు) తగ్గియుంట కిదియే కారణము. దూరము రెట్టింపగుతావునకు వెలుతురునందు నాల్గవవంతునిలచుననియు, దూరము మున్మడించిన (treble) అపలువెలుతురునందుఁ దొమ్మిదవభాగము నిలచుననియు, నలువడించిన తావున నసలువెలుతురునందుఁ బదునాఱవవంతు గాననగుచుండు ననియు, లెక్కింపఁబడినది.

## వెలుతురు కలిగించునొత్తిడి [Pressure of light]:

—ఒకవస్తువుపైఁబడినవెలుతురు దానిపై నెంతవఱకు ఊనిక లేక ఒత్తిడి (pressure) కల్గించునని శాస్త్రపరిశీలకులకు యోచన కలుగవచ్చును.

ఒక light wave పరిమితి ప్రమాణములకు మించని త్రసరేణుపదార్థములపై వెలుతురుయొక్క, ప్రష్షరు పనిచేయఁగల్గునని గణితమునుండియును, తోఁకచుక్కల శరీరములంబోలిన లఘుపదార్థములపై మాత్రము పనిచేయఁగల్గునని పరిశీలనలనుండియుఁ దేలినది. చంద్రగోళము, నక్షత్రములు, భూమిమొదలగువాటిపైఁబడిన వెలుతురేపాటిస్వల్పభేదమును గల్గింపఁజాలదని గ్రహించి యున్నారు. (ఎస్ట్రోనోమీచూడుఁడు. వెలుతురు, దానికార్యములు చూడుఁడు. సూర్యగోళము చూడుఁడు. సూర్మరశ్మి చూడుఁడు.)

**వెలుతురు - గమనము:**— వెలుతురు గమనించుత్వరితమును గూర్చి పెక్కుపరిశీలనలు చేయఁబడినవి. తొలుత దీనిం బరిశీలింప మొదలిడినది గలీలియో (Galieo) యనుపేరుగల పండితుఁడు. ఆయన మనుష్యులు, దీపములతోఁ బరిశీలించినవాఁడు.

పిదపఁ జెప్పఁదగినపరిశీలకుఁడు Olaus Roemer అను పేరుగల డెన్మార్కుదేశపు జ్యోతిశ్శాస్త్రవేత్త. ఈయన ఫ్రెంచిదేశపుఁ బారిస్ నగరమునందుండి పరిశీలనలను సల్పినవాఁడు. అది క్రీస్తువెనుక ౧౬౭౫ సంవత్సర ప్రాంత కాలము. ఆయననిర్ణయముమేరకు సెకెండుకాలములో వెలుతురు ౧, ౮౬, ౫౦౦ మైళ్లదూరకం బోఁగలదని తేలినది. మఱియు నీయనవలననే జ్యూపిటరుగోళము నాశ్రయించి తిరుగు చంద్రునిగ్రహణసందర్భమున ౧౬ మినిట్లు ౨౬ సెకెండ్లకాలము తేడా కనిపెట్టఁబడి యిది దూరాధిక్యముగాఁ గల్గినదిగ నామహనీయుఁడే వెల్లడించెను. తక్కిన పరిశీలకులును నిశ్చయనిరి.

ఫ్రెంచిదేశపు రసాయనశాస్త్రవేత్త యగు Fizean పండితుఁ డీపనికొకయంత్రమునే రచించి యున్నాఁడు. ఇది కొంతయభ్యాసముండవలసిన చిక్కుయంత్రమైనను చక్కఁగా పనిఁజేయుచున్నదిగాఁ దలంపఁబడుచున్నది.

**వెలుతురు నాశనము కానేరదు:**— శాస్త్రవేత్తలు వెలుతురు నొకవిధమగు విద్యుత్కిరణ మనిరి. (Electric current) కొంత దూరమునకు వెలుతురు తగ్గిపోవుచుఁ గడకు నశించునట్లు మనకండ్లకగుపడునుగాని, నిజమున నశింపదు. మనకండ్లకట్లగుపడుటకుఁ గారణము దానిని గడవఱకు గ్రహించుచుండఁ గలశక్తి మనకండ్లకుఁ జాలదు. అది బలముగఁ బ్రకాశవంతమైననే మనము దాని నెఱుంగఁగల్గుచున్నాము. నక్షత్రములసంఖ్యాకములగు మైళ్ళదూరమునం దుండినను వాటిం గ్రహింపఁగల్గియుంట వెలుతురున కేదే నడ్డమై యాపినంగాని, యాగక పయనమొనర్చుచుండునదిగఁ దెల్పుచున్నవి. అది నడచుతఱి నష్టపోవుచుంటయైనను గానరాదు. అది వేఱుశక్తులచే నాకర్షింపఁబడి తగ్గిపోదు. నశించునది కానేరదు. మనకండ్ల కగుపడురీతిని వెలుతురు దూరమరఁగిన కొలఁది వ్యాపించుట యధికమగుచుంట గాఢత తగ్గి, పలచఁబడుచు నెక్కువవైశాల్యవ్యాపనముఁ గాంచుంగాని చెడునది కాదు. ఈతగ్గుదల మన నేత్రముల కగుపడురీతిని దూరము రెట్టింపగునేని వెలుతురుగాఢత నాల్గవవంతగుచుండునని లెక్కింపఁబడియున్నది. మూఁడువంతు లధికమగుతఱి తొమ్మిదవవం తగుననియు నాల్గువంతు లధికమగుతఱిని పదునాఱవవం తగుననియు లెక్క తేలుచున్నది.

**వెలుతురుయొక్క తరంగ మద్దముగుండాఁ జొచ్చుకొనిపోవుట (Light wave travels threw glass):**— వెలుతురుయొక్క తరంగము (wave) ఈతరుగుండా నడచునుగాని, గాలిపై నాధారపడునది కాదు. ఆంగ్లరసాయనశాస్త్రమునందలి ధర్మములలో నొకటియగు 'matter has no effect one ether waves' అనుధర్మము మేటరు mattr అగు నద్దమువలన నీతరు తరంగ మాపఁబడదుగాని కఱ్ఱ మొదలగు కొన్ని non transperant పదార్థము లాఁపివేయఁగల్గును. ధ్వనితరంగములధర్మము వేఱుగ నుండును గాన నవి యాఁపివేయఁబడెడిని. ఈతరునందు వ్యాపించఁగల వెలుతురుతరంగములు (light waves) ఈతరున్నంతదనుకఁ బోవుచుండెడిని.

కొందఱు శాస్త్రవిదులు తొలుత నీతరునందుఁబోయి, పిదప గాలియందుఁ బోవుతరంగ మగుననుచున్నారు.

**వెలుతురు వత్సరము** [Light year]:— పాశ్చాత్యుల Astronomy శాస్త్రముమేరకు వెలుతురు సంవత్సరమునందు [ఆంగ్లసాధారణసంవత్సరము] ౫,౮౭౯,౦౭౯,౮౮౦,౦౦౦ మైళ్లదూరము గమనించునని లెక్కింపఁబడినది.

అనఁగా నెబూల [Nebula] మొదలగు నక్షత్రముల వెలుఁగు కడుంగడు దూరము గాన వాటినుండి భూమికిం జేరని లెక్కమేరకు నడుచునని పరిగణింపఁబడినది.

**వెల్లుల్లివ్యవసాయము**:—వెల్లుల్లి వ్యవసాయము సర్వవిధముల నీరుల్లివ్యవసాయము వంటిది. (నీరుల్లివ్యవసాయము చూడుఁడు). భూమినిదున్నుట, ఎరువువేయుట, నారుపోసి ఊడ్చుట మొదలగునవన్నియు సమానములే. వెల్లుల్లిరెక్కపాయలు యెకరమున కేఁడువందల పౌనులు విత్తనము పట్టును. ఇదించుమించు చయిదు మాసములకుఁ బంట తేలును. కాడలు పచ్చబడుటతోఁ బంట త్రవ్వవచ్చునని గ్రహింపనగును. చక్కఁగాఁ బండినచో నెనిమిదివేలు మొదలు పది వేలువఱకుఁ బౌనులు పండును. వీట్లఖరీదు రెండు వందల యేబదిప్రాంతమున నుండును. (ఉల్లి చూడుఁడు.)

**వెలెస్లీప్రోవిన్సు**:— ఇది స్ట్రెయిట్సెటిల్మెంటులలో నొకటి. (చూడుఁడు.)

**వెల్లెస్ లైను**(Wallace's line)**హద్దు**:— ఈస్టుఇండీసు ద్వీపములకడను మెకాస్సార్జలసంధికిఁ గలిపయదూరమునందే ఒక లోతగు సముద్రపు జాడ గలదు. ఇదియే ఆశియాఖండమునకును, ఆస్ట్రేలియాకును, సరిహద్దనుచున్నారు. నీటియడుగున నున్న భూమియొక్క పగులు రెంటిని వీడఁదీసి యుండు ననుచున్నారు. ఆదిని ఈస్టుయిండీసుదీవులగుండా ఆసియా, ఆస్ట్రేలియాలు కలసియుండు ననియు, ఆభూమార్గ మంతరించియుండుననియు తలంపఁ బడుచున్నది. దీనికే వెల్లెస్‌లై ననియెదరు.

**వెలోసిటీ** (Velocity):— ఒక point గాని, లేక particle గాని, కదలుతఱి నదివఱకున్నస్థానము వదలి వేఱొకతావున కేగు Rate నకు వెలోసిటీ యనిపేరు. అట్టికదలుటయందు magnitude ను, direction కూడా యుండవలెనని విధింపఁబడినది. ఒకవేళ magnitude నందు భేదము లుండిన నుండవచ్చుననియు, direction మాఱిన మారవచ్చుననియు, కాని direction మాఱనంతవఱకు magnitude constant గా నుండవలయునని చెప్పఁబడినది. ఇచట constant అనఁగా తిన్నగ నేగుచుండుతఱి సరియగుప్రదేశములను సరియగుకాలమునసే కదలుచుండుటకు constant అని పేరనియెఱుంగునది. నడచువేగ మొకేరీతిని జరుగవలెనని భావము.

**వెల్‌ఫౌండేషన్** (well foundation):—
(పునాది చూడుఁడు.)

**వెస్టర్లీస్** (Westerlies) **గాలులు**:- ఐరోపాఖండపుఁ బశ్చిమమునఁ గల దేశములందును, తెప్పక బ్రిటీషుదీవులందునను, వేసవికాలమునందు బలముగను, తక్కినకాలములందు, నప్పటప్పటికిని వీచుగాలుల కవి పశ్చిమమునుండి వీచుంగాన వెస్టర్లీస్ అని యాంగ్లేయు లనుచున్నారు.

ఈగాలులు వర్షమును అట్లాంటిక్కుమహాసముద్రసంబంధమునుండి చేకూర్చెడింగాననే ఐరోపాఖండపుఁ బశ్చిమభాగములందు చక్కనివర్షములు పడుచుండునందురు. అందుఁ గొండభాగములం

దధికవర్షము కురిసెడిని. ఈగాలి ట్రేడ్విండ్సు గాలుల కుత్తరముగఁ బ్రారంభమై వీవమొదలిడు నట (ట్రేడువిండ్సు చూడుఁడు). ట్రేడ్విండ్సు వింటరుకాలమున దక్షిణముగా నుండుతటి వెస్టర్లీ విండ్సు నబు ట్రోపికల్ సీమలందుఁ బ్రిబలి వీచు చు వింటరు వర్షములం దెచ్చెడినందురు. (ట్రాపిక్సు చూడుఁడు). కాని సంవత్సరముపొడవునను కొద్దిగనో గొప్పగనో (ఇతరకారణముల చేకూరుచు) కొంపరేటుదేశములందు వర్షముఁ గల్గించు చుండెడిని. వెస్టర్లీగాలులే యనుచున్నారు.

భూమియొక్క దక్షిణగోళార్థమున నీవెస్టర్లీ గాలులు సరిగాఁ బశ్చిమదిశనుండియే వీచుచు భూమింజుట్టి తిరుగుచు రోరింగుఫార్టీస్‌నందుఁ గాన నగుచుండెడిని. (రోరింగుఫార్టీస్ చూడుఁడు).

ఓడలలోనిసైనికులు వీటిని 'Crave werter lies' అని మెప్పుగా ననుచుందురఁట. నవప్రచండ వాయువులు చూడుఁడు.

**వెస్ట్రిన్ ఇండియాస్టేట్సు [సంస్థానములు]:**—భరతదేశమున ఈస్టిండియాకంపెనీ వారి అధికారమునం దాదిని 'వెస్ట్రిన్‌ఇండియా స్టేట్సు' అను పేరున కతియవాడసంస్థానములు, గుజరాతిసంస్థానములు, క్రింద నుండెను. క్రీ. వె. ౧౯౨౪ లో కథియవాడ రాజ్యములు వేఱుపఱుపఁబడి యొకయేజన్సీగా నేర్పఱుపఁబడెను. ఇవి యిండియాప్రభుత్వమునకు లోఁబడినవిగా నేర్పఱుపఁబడినవి. పిదప తక్కినగుజరితిస్టేట్సు దీనికింజేర్పబడి ౧౯౩౩ లో ఇప్పటిపేరిడబడియెను. ఇందు బరోడా (బఱోదా) సంస్థానము ముఖ్యమైనదియు, పెద్దదియు నై యున్నది.

బరోడారాజ్యము కొంత కతియవాడునందు నను, కొంత గుజరాతునందును వ్యాపించిన యున్నది. ౮,౧౬౪ చతురఁపుమైళ్ళవై శాల్యమును ౨౪,౪౩,౦౦౭ జనాభాయుం గల్గినది. ఇది మొగలాయిసామ్రాజ్య మస్తమించి, మహారాష్ట్రులధికారమున స్థిరపడుటతో నారంభమైన సంస్థానము. ప్రభువు మహారాష్ట్రుఁడు గాయకవాఁడనియు, ఫరజండీ ఖాస్ ఇదౌలతీ ఇంగ్లిషియా యనియు, సేనాఖాస్ ఖేల్షమ్షేరు బహద్దరని యనుశృతబిరుదములుగలవాఁడు.

సౌరాష్ట్రదేశమందలి శ్రీకృష్ణుని రాజధాని యగు ద్వారావతీ (ఇప్పటిద్వార) పవిత్రక్షేత్ర మీబరోడాసంస్థానరాజ్యముననే యున్నది. బరోడానగరమున వెండి, బంగారుఫిరంగులు కలవు.

పాలిటానాసంస్థానము సుప్రసిద్ధజైనక్షేత్రమగు శతృంజయపర్వత మీసంస్థానరాజ్యములోనిదే. దీనిపై ౮౬౩ జైనదేవళములు కలవందురు. వీటియందు ౧౧ శతాబ్దమునాఁటి నిర్మాణములును కొన్ని గలవు.

సుప్రసిద్ధజైనక్షేత్రమగు గిరినార్‌పర్వతము కథియవాడులోనిదే. ఇటఁగల జైనదేవాలయములో సంప్రతిరాసతీర్థకరునిదేవస్థానమును నేమనాదు దేవాలయమును పెద్దవి.

ద్వాదశతేజోలింగములలో నొకటిగఁ జెప్పఁబడిన సోమనాధక్షేత్ర మీకత్యావాడలోనిదే. శ్రీకృష్ణశ్మశాన మీసమీపముననే కలదు. రాజకోటయం దీరాజకుమార సర్వకలాశాల సుప్రసిద్ధము. ఈప్రాంతముల సముద్రవర్తకము విశేషముఁగ జరుగుచుండును.

ఓఖామండలము (జిల్లా) ఓఖా సుప్రసిద్ధరేవు పట్టణము. మఱియు దీనికింజెందిన బేటుద్వీపమున సత్యభామదేవస్థానము పేరందినది జాంనగరుసంస్థానఁపుఁబ్రభువులకు జాంసాహెబని బిరుదము కలదు.

వీరు హిందువులు (గుజరాతుస్టేట్సు చూడుఁడు). అవియు వెస్టైన్ ఇండియాస్టేట్సుగనే పరిగణింపఁబడుచున్నవి.

## వెస్టిండీసుద్వీపములు [west Indies]:—

ఇవి పశ్చిమగోళార్ధమున ఫ్లోరిడానుండి ఒరినోకోనదిముఖద్వారముదనుక పశిఫిక్కుమహాసముద్రమున వ్యాపించియున్న దీవులు. క్రిష్టఫర్ కొలంబసు అనుపేరుగలనావికుఁడు వీటిం గనుగొనినయదనున నివి యిండియాదేశమునకుం జెందినపశ్చిమభాగముననున్న ద్వీపములని తలంచెనట. గాన నామహనీయుని యాహా పొరపాటునను నది నీటికిఁ గతిగాక తప్పనిదాయెను.

వెస్టిండీసు మూఁడుతెగల ద్వీపసమూహములుగ విభజించినట్లున్నవి. ఫ్లోరిడాదేశమున కాగ్నేయదిశగానున్న ద్వీపసమూహమునకు బహామా దీవు లని స్వదేశనామము. కరేబియాసముద్రమున కుత్తరముగానున్న ద్వీపసమూహమునకుఁ బెద్ద ఆంటిల్లీద్వీపము లనియు, తూర్పునైపుననున్న ద్వీపసమూహమునకుఁ జిన్న ఆంటిల్లీద్వీపములనియు, పైవారిపెట్టినపేర్లును నైయున్నవి. వీటియందున్నస్థానములు సమశీతోష్ణస్థితి కలవిగను, పల్లఁపుఁబ్రదేశములు నుష్ణములుగను నుండును. సముద్రఁపు గాలులు సౌఖ్యప్రదమై వీచుచుండును. తుపానులొకప్పుడు నాశనకరమైయుండును. అప్పటప్పట భూకంపములును కలుగుచుండును. కొన్నిదీవు లం దగ్నిపర్వతసంబంధమైనవి. కొన్ని యగ్నిశిఖరములును బైటికిఁ గలవు. క్రీ.వె. ౧౯౦౨ లోఁ గలిగినయుద్ధుతము St. Pierre అనుపట్టణమును పాడుచేసినది. మాంటుపీలీ శిఖరమునఁ గల్గిన యుధుగ్రత మిరువదివేలజనులతోనున్న Martinique ద్వీపమును సమూలనాశన మొనర్చెను. ఈద్వీపము ఫ్రెంచివారిది. ఈ ములందు జొన్నలు, కసవధాన్యములు, చెఱకు, పొగాకు, కాఫీ పైరుచేయఁబడుచున్నది. జనాభాయం దాఱవవంతు తెల్లవారును, తక్కినవారు నీగ్రోలు. ఉభయులకు మిశ్రసంతానము నైయున్నారు. తొలుత నీద్వీపములం దాదిమనివాసులుగ నమెరికా ఇండియన్‌జాతులవా రుండిరఁట. వారందరు నశింప నీగ్రోలు రప్పింపఁబడిరట. క్రీ.వె. ౧౮౩౮ లో బానిసత్వము రద్దుపఱుపఁబడి బ్రిటిషువారు మానవస్వతంత్రములను నీగ్రోల కొసంగిరి. వెస్టు ఇండీసుద్వీపములవైశాల్యము ౯౨౦౦౦ చతురఁపు మైళ్ళని యంచనా వేయఁబడినది.

వెస్టిండీసుదీవులందు ఫ్రెంచివారికిఁ గొన్ని దీవులు కలవు. అందు Martinique ద్వీపమును Guadaloupe ద్వీపములు పెద్దవి.

ఇంకను డెన్మార్కువారికి డచ్చివారికిఁగూడ కొన్ని ద్వీపములు కలవు గాని, యవి చాల చిన్నవిగ నున్నవి.

బ్రిటీషువారికిఁ జెందియున్నద్వీపములం దైదు ప్రభుత్వస్థానములు చెప్పఁబడినవి. అవి ౧౨౦ మైకా ప్రభుత్వము, కింగ్స్టటన్‌పురము, లీవర్డుద్వీపముల ప్రభుత్వము, ఏంటిగువాద్వీపము, విండ్వర్డుద్వీపములప్రభుత్వము, బార్బాడోయీస్ పురమున, ట్రినిడాడ్ ప్రభుత్వము, స్పానిష్పోర్టుపురము, బహామ ద్వీపములప్రభుత్వము.

## వెస్టుమినిస్టర్ ఎబ్బేదేవాలయము:-

ఇది యింగ్లాండుదేశమున లండనునగరమునం దున్న గొప్పక్రైస్తవదేవాలయము. ఆదేశముల క్రైస్తవమతసన్యాసియగు ఎబ్బాటు మహాత్ముని పాలనాధికారములక్రిందనున్న క్రైస్తవదేవాలయములకు ఎబ్బే (Abbey) యని వాడెదరు. ఆంగ్లేయుల కీ దేవాలయము ప్రియతమము. అనేకశక

ములనుండి వారిప్రార్థనాలయముగను, వారిప్రభువులరాజ్యాభిషేక (Coronation) స్థానముగను, వారిలో గొప్పవారికళేబరములం బాతి, గోలీ నిర్మించు గౌరవసమాధిస్థానములుగను వాడుచున్నారు. తొలుదొల్త దీనిచారిత్ర మించుక వివరించుట సమంజసము.

ఇది యాదినుండి ఎబ్బేగా నిర్మింపఁబడియుండలేదు. ౧౫౪౦ సంవత్సరమునకుఁ బూర్వము నాలుగునూరుల సంవత్సరములనాఁడు, ఎన్మిదవ హెన్రీప్రభువు మతాధిపతుల పాలనాధికారగరిమ (monastic system) నంతమునొందించిననాఁటికిది ఎబ్బేగా నుండక ఒకడీన్ (Dean) అధికారిక్రింద నుండినటులఁ గాన్పించెడిని. తరువాతి కొన్నివత్సరములలోనే భూపాలుని Visiton గను, డీన్‌గారిని ప్రధానాధిపతి (Chief) గను పునర్నిర్మాణసంస్కారస్థితి (reconstitution) నందెను. అత్తరి "The Collegiate Church of St. Peter of westminister" అని పేరిడఁబడెనఁట. కాని యెల్లరచే వెస్టుమినిస్టర్ ఎబ్బే యనివాడఁ బడసాఁగెనఁట. క్రీ. వె. పదమూఁడవ శతాబ్దప్రారంభకాలమున మూఁడవ హెన్రీభూపాలునిపాలనమున నిర్మింపఁబడిన యిప్పటికట్టడ మల్లె నేఁటికిని నిలచియున్నదఁట. ఆయన ఫ్రెంచి జన్మముఁగల్గినవాఁడైనను, ఆంగ్లపనివాండ్రే యీకట్టడమును ఫ్రెంచినిర్మాణవిధానములతో నిర్మించిరని చెప్పఁబడినది. William of Narmandy నృపాలుని దండయాత్రకుఁబూర్వమనఁగా క్రీ. వె. ౧౦౬౬ కుఁ బూర్వ మింగ్లాండు దేశమేలిన శాక్సనునృపతులు వించెస్టరు క్షేత్రలున పట్టాభిషేకముల నెరవుకొనుచుం గిరీటములం ధరించుచుండిరి. కాని ఆవిలియమ్ నృపతి Edward the Confessor నాఁడు నిర్మింపఁబడి యిప్పటి వెస్టుమినిస్టర్ ఎబ్బేయున్నతావుననే యుండిన నొకచర్చియందుఁగావించుకొని కిరీటముం ధరించియుండెనఁట. అది క్రిష్టమస్ దినమునందు జరిగెనఁట. నాఁడాదిగ నట్లేనడుచుట యాచారమైనదఁట.

ఈభవనముకడుంగడు సుందరవంతము. అందు Queen Eleanor of Castelle గారి గోలీపైనున్న యినుపపనిచిత్రమును Gates of Henry VII's Chapel విన్నాణమును చూపరుల కచ్చెరువుఁగొల్పుచుండును. లోనిపనియు, అద్భుతమైనవిన్నాణముం బ్రదర్శించుచుండును. ఈమహాభవనమున నింగ్లాండుదేశపు గొప్పవారనేకులు భూసమాధి నందియుండిరి. క్రీ. వె. పదునాఱవశతాబ్దమధ్యకాలమున సింహాసనమున కరుదెంచిన సుప్రసిద్ధురాలగు ఎలిజబెత్ మహారాజ్ఞినాఁటికాలమునుండియు నిందు భూసమాధినందుట మహాగౌరవమని స్థిరపడియేయున్నది. మహాకవి షేక్సుపియర్ గారి సమాధియు నిందే కలదు.

## వెహిల్ - లేక - విహిల్ శాఖక్షత్రియులు:—

(ప్రమారశాఖక్షత్రియులు చూడుఁడు).

## వెళ్లిపొమ్మంటే చూరు పట్టుకొని ప్రేలాడినట్లు:—

(ఆంధ్రలోకోక్తి).

**వేంకటరంగకవి:—** ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. ఈతనికాపురము కోపల్లెయని తెలియుచున్నది. ఈతఁడు రచించినది శశిరేఖాపరిణయము.

**వేంకటాచార్యులు:—** ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. శ్రీవై

ష్ణవబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రము. ఆత్రేయసగోత్రము. తండ్రిపేరు శ్రీనివాసాచార్యులు.

రచించినది భద్రరాజపుత్రచరిత్ర మను ప్రబంధము. వేటూరివేంకటాచార్యులు (కవి) గలఁడు. గోలకొండసీమలో కృష్ణానది కుత్తరముగ నుండు సీమ నివాసమని చెప్పఁబడినది. రచించినది చమత్కారమంజరి.

## వేంకటేశాధీశాధిభట్టరు వంశము:-

ఈపవిత్రవంశస్థులు రామానుజీయ వైష్ణవమత సాంప్రదాయస్థులై యున్నారు. ఈపవిత్రవంశస్థులందు మూలపురుషులుగ 'ఈశ్వరభట్టరు' అను వారుచెప్పఁబడిరి. వీరికిఁ బిదప, ఈశ్వరపూర్వభట్టరులని వాడుకగల్గెను. వారికుమారులే సుప్రసిద్ధులగునాథమునులు. వీరు శఠగోపులశిష్యులని చెప్పఁబడిరి. (రామానుజీయ వైష్ణవగురు సాంప్రదాయ పరంపర చూడుఁడు.)

నాథమునుల సుతుఁ డీశ్వరముని యనియు, ఆయనకు ౧ ఆళ్వందారుస్తోత్రకర్తయగు ఆళ్వందారులును, ౨ దైవనాథయోగిస్వామి యను సుతు లిర్వురునుగల్గిరి. అందు దైవనాథయోగిస్వామిగారికిఁ బెద్దతిరుమలనంబిగారు కల్గిరి. వీరే శ్రీమద్రామానుజ జగద్దేశికునకు మేనమామ. మఱియు వీరే వారికిఁ బ్రథమాచార్యులనియుం దెలిసెడిని. తిరుమలనంబిగారికి ౧ ఈశ్వరభట్టరు గారును, ౨ తిరుక్కలరగ్రైపిరాన్పిళ్ళా ననువారును ఇర్వురు సుతులు. అం దీశ్వరభట్టరులకు వేంకటేశాధీశాధిభట్టరు లుదయించిరి. వారిసంతతివారు భట్టరు లనంబడి గోల్కొండభట్టరులనియుఁ దిరుమలభట్టరులనియు ద్వివిధముగనైరి. గోల్కొండభట్టరులసంతతి వారు. (గోల్కొండ వ్యాపారులు చూడుఁడు.)

## వేక్సినేషన్, ఇనాక్యులేషన్ (Vaccination inoculation) టీకాలు:-

లాటిన్ భాషయందు Vacca యనిన ఆవని యర్థము. ఆంగ్లభాషయం దావులకుఁ గల్గెడి మశూచకఁపు జరమ్ము కులరసమును 'వేక్సిన్' అనిపేరు. అటు వేక్సినును టీకాలు వేయుటమూలమున మానవ శరీరములోనికి inoculate చేయుటవలన నారోగము నంటకుండ నాఁపుటకాని, అథవా ఉద్ధృతమునైన తగ్గించుటగాని జరగునని కనిపెట్టఁబడినది. దీనిని టీకాలు వేయుటయని వాడుచున్నారు. ఇటుల టీకాలువేయుట యొక్క మశూచకవ్యాధికి Vaccin తో మాత్రమేకాదు. విషమజ్వరము (typhoid fever) కలరావ్యాధి, ప్లేగువ్యాధి మొదలగు నపాయకరమగు వ్యాధులకు వాటి వాటిరసమును ఇనాక్యులేటు చేయుచుందురు.

క్రీ. వె. ౧౭౯౬ సంవత్సరమున నీపద్ధతి Edward Jenner అనువైద్యశిఖామణి కనిపెట్టి ప్రారంభించెను. తరువాత త్వరలోనే లోకమంతట వ్యాపించెనఁట.

## వేఁగిలిపి:—

వేఁగిరాజ్యమునకుఁ గొంత కాలము రాజధానిగనుండి తనపేరున రాజ్యముఁ గూడఁ బరఁగంజేసిన వేఁగిపుర మిప్పటి యేలూరు నకుఁ గతిపయదూరమున పెదవేఁగి, చినవేఁగి యను పల్లెగ్రామములుగ నైయున్నవి. (వేఁగిదేశము చూడుఁడు). ఈరాజ్యమేలిన ప్రభువుల శాసనములు క్రీ. వె. నాల్గవశతాబ్దమునాఁటి పూర్వఁపు విగను, నాల్గవశతాబ్దమునాఁటివిగను పోల్పఁబడుచున్నవి. దీనిని బహుశః పల్లవులు మొదలగువారేలుచుండిన ట్లగుపడుచున్నది. క్రీ. వె. ఏఁడవశతాబ్దకాలమునఁ దూర్పు చాళుక్యులవశమగుటతోఁ బల్లవులు కాంచీపురము తమరాజధానిగ నేర్పఱుచుకొని స్థిరపడిరని తెలిసెడిని.

వేఁగిభూపతుల శాసనములందలి లిపికిఁ దాక్షా లితముగ వేంగిలిపి యని పేరిడుదుముగాక. దీనికిని గుహాలిపికిని అట్టి భేదములేకుంట యేగాక నశోకా క్షరములందుఁ గొన్నింటితోఁ బోలికలం గల్గియుంట గాననగును. అశోకాక్షరములు గుండ్రముగను, గు హాలిపి వేంగిలిపుల యక్షరములు, కోణాకృతిగను నుండుట ముఖ్యభేదము. వేంగిలిపియందుఁ జాలు క్యలిపియందు వలెనే పరహల్లుపై రేఫమును వ్రాయుట కలదు. ఇదియే రానురాను తెలుఁగు నందు రకారఁపుఁ బొల్లుగ నైనది.

వేఁగిలిపియందుఁ గడను వ్రాయుమకారఁపుఁ బొల్లుచిన్నదిగ నుండుటయు, ఉపధ్మానీయమునకు వేఱుగు ర్తుండుటయు, లక్షణములు.

దేవనాగరాక్షరములపై నుండు నడ్డుగీతయె క్రమముగఁ దెలుఁగునందుఁ దలకట్టుగ నయ్యెను. ఇదియే కన్నడాక్షరములపై నుండు నడ్డుగీతగ నిల చియున్నది గాన నీయన్నియు మొదటిదాని పరిణా మములుగ నెంచవలయును.

వేఁగిలిపినుండి పురాతనఁపు జావాలిపియు, దాని నుండి యిప్పటిజావాలిపియగు కావి లిపియు నేర్ప డినవి. (తెలుఁగు - కన్నడలిపులు, దాక్షిణాత్య లిపులు, భరతదేశఁపులిపులు, తెలుఁగులిపి చూ డుఁడు).

## వేఁగిదేశము (రాజమహేంద్రవర రాజ్యము):

—ఆంధ్రదేశములోనిది. గోదావరి కృష్ణానదులమధ్యప్రదేశముగఁ దొలుత నుండి, రాజధానిగనుండిన వేఁగిపురమునుండి పేరందిన దేశము. ఒకప్పుడు కళింగ నీవేఁగిభూపతుల పాలనమునం దుండెను. వేఁగిపుర మిప్పటి యేలూరుపురపరిసరమున ననతిదూరమున పెద వేఁగి, చినవేఁగి యనంబడు రెండుగ్రామములును వాటిమధ్యప్రదేశమును, బహుశః ఇంకను అపరి సరములై యుండనోపునని తలంపఁబడుచున్నది. ఆంధ్రబ్రాహ్మణులలో నొకతెగవారగు వేఁగినాఁ టివా రీవేఁగినాఁడు సీమనుండియే పేరంది యుం దురు.

ఈదేశమునకు వేఁగిపురమునకుం బిదప బెజ వాడ (తొల్లిఁటి విజయవాడ) రాజమహేంద్ర వరము (ఇప్పటి చామర్లకోటవద్దనున్న) భీమ వరముంగూడ వేర్వేఱుకాలములందు రాజధాను లుగ నుండినటులఁ బరిశీలనలవలనఁ దేలు చున్నది. వీటికాలములు సరిగాఁ దెలియవుగాన వీటి నింతటితో వదలి పరిపాలనలనెఱపిన ప్రభువులంగూర్చి విచారించుట సమంజసము. వాతాపీపురము రాజధానిగ మహారాష్ట్రదేశమే లుచుండిన చాళుక్యరాజవంశమునఁ జీలిక గల్గి, తూర్పుచాళుక్యులు, పశ్చిమచాళుక్యులు నని రెండుగ నైరి. సుప్రసిద్ధుండై యశ్వమేధయాగ మొనర్చినటులఁ జెప్పఁబడిన మొదటిపులికేశి (జ యసింహుని మనుమఁడు) పౌత్రులగు రెండవ పులికేశియు, కుబ్జవిష్ణువర్ధనుఁడును దేశమును తూర్పుచాళుక్యులు, పశ్చిమచాళుక్యులు ననఁబరఁ గుచు రెండుభాగములుగ దేశమేల మొదలిడిరి. అందుఁ గుబ్జవిష్ణువర్ధనున కీవేఁగిదేశము స్వాధీనమా యెనని చెప్పఁబడినది. ఈయన సోదరులందు రెం డవవాఁడు.ఇది క్రీ. వె. ఐదవశతాబ్దాంతమో లేక ఆరవశతాబ్దప్రారంభమో నందురు. వీరు పూర్వ చాళుక్యభూపతు లనంబడిరి.

ఈవంశఁపురాజుపరంపరయందుఁ జాళుక్యభీమ నృపతిపాలనమునఁ గ్రొత్తరాజధానిగఁ జాళుక్యభీమ వర మనుపేరఁ బురనిర్మాణ మొనర్పఁబడి, యం దొకభీమేశ్వరుఁ డనుపేర శివలింగప్రతిష్ఠయు దేవ స్థాననిర్మాణమును చేయఁబడినది. ఇది యిప్పుడు చామర్లకోటకు దక్షిణమున నిప్పటిరెయిల్వేస్టేషను

 వేఁగిదేశము...రాజ్యము)

కెదురుగ కాల్వ కవ్వలిభాగమున భీమవరమను పేరం బరఁగుచుఁ బల్లెగ్రామమైయున్నది. (చాళుక్యభీమవరము చూడుఁడు.) ఆపరిసరములందే రాజకుటుంబనివాసమునకై నిర్మింపఁబడిన శ్యామలదుర్గముగోడలు నేలపాలై యంతరించియు, శ్యామలకోట నాఁబరఁగుచు, నేఁటికిఁ జామర్లకోట గా నిలచియున్నదఁట.

చాళుక్యభీమనృపాలుని కాలముననే గోదావరీనదిం దాఁటిన వేఁగిరాజ్యమింకను తూర్పునకు సాఁగుచుండెనఁట. ఆయనయనంతరము విజయాదిత్యుఁడు సింహాసనమునకు వచ్చి, తూర్పునకు దండయాత్రలు నెఱపుచు, సింహాచలపర్యంతముఁ గల దేశమును తనపరిపాలనకులోఁబడఁజేసి వేఁగిరాజ్యమునకుఁ గలుపుకొనియెను. ఈ విజయాదిత్యునకు 'కొల్లభిగండభాస్కరుఁ' డను బిరుద ముండెనఁట. కళింగభూముల నాక్రమించినపిదప నీయనయాఱు నెలలు మాత్రమే జీవించియుండెననియుఁ జెప్పఁబడినది.

పిదప కుమారుండగు అమ్మరాజవిష్ణువర్ధనుఁడు సింహాసన మెక్కి రాజమహేంద్రుఁడను బిరుదనామము వహించి, రాజమహేంద్రవర మనియో (లేక కొందఱుతలంచునటుల రాజమహేంద్రపుర మనియో) తనపేరట తన నూతనరాజధానీపురమును నిర్మించుకొనియె నని పరిశీలకులు చెప్పియున్నారు. ఇది నూతనరాజ్యమునకు, పూర్వరాజ్యమునకు నడుమగ రాజధాని గోదావరీనదీతీరమం దుంటయు, నుత్తరదక్షిణభాగములతో నదిపై రాకపోకలసంబంధము గలతావుగనుంటయే గాక నది యందునడచు పగవారి సైన్యఁపుఁబడవల తనప్రభుత్వఁపునిఘాయం దుంచవీలగునటుల రాజమహేంద్రవరదుర్గనిర్మాణ మొనర్చెనని తలంపఁబడుచున్నది. ఈయన కింకను సర్వలోకాశ్రయుఁడను బిరుద ముండెనని కొందఱనెదరు. ఈయనపరిపాలన మేఁడుసంవత్సరములని తేలుచున్నది.

రాజమహేంద్రుఁ డనంబడిన అమ్మరాజునకుం బిదప యాయనజ్యేష్ఠపుత్రుఁడు బేతరాజవిజయాదిత్యుఁడు సింహాసన మెక్కెను. అమ్మరాజు కడదినములం దాయనకుటుంబమున నంతఃకలహములు గల్గి యాయనశత్రువులగు రాష్ట్రకూటులు రహస్యముగ నుత్తరప్రత్యుత్తరములు సల్పుచుండిరట గాని యాయన జాగ్రతవలనను, ఆయన సైన్యాధిపతులయొక్కయు, మంత్రులయొక్కయు నప్రమత్తతవలనను, శత్రువులు జొఱఁజాలకుండిరఁట.

బేతరాజవిజయాదిత్యుఁడు సింహాసన మధిష్ఠించిన పదిహేనుదినములనాఁటి కాయనదాయాది, యుద్ధమల్లునిసుతుండగు తాళరాజాయనను హత్యఁగావించి తాను సింహాసనమెక్కెననియు, చాళుక్యభీముండను వేఱొక యతని దాయాదిసుతులలో నొక్కండగువిక్రమాదిత్యుఁడ డనునాతఁడు తాళరాజుం జంపి రాజ్య మాక్రమించెననియు, మఱి పదకొండునెలల కమ్మరాజు రెండవకుమారుఁడు (బేతరాజువిజయాదిత్యునితమ్ముఁడు) విక్రమాదిత్యునివిక్రమ మడఁచి, తాను సింహాసనం బెక్కెననియు, ఈతనిపేరు భీమరాజనియు, మఱియెన్మిది మాసములలోఁ దాళరాజుకుమారుఁడగు యుద్ధమల్లుఁడనునాతఁడు భీమరాజుం జంపి, క్రీ.వె. ౯౨౭ మొదలు ౯౩౪వఱకురాజ్యపాలన మొనర్చెననియు నక్కాలమున కమ్మరాజవిష్ణువర్ధనుని సవతితమ్ముఁడు రెండవచాళుక్యభీముఁడను పేరుగలవాఁడు యుద్ధమల్లుని యుద్ధమున నోడించి, పదభ్రష్టుంజేసి తాను సింహాసన మెక్కెననియుఁ జరిత్రలనుండి తేలుచున్నది.

ఈచాళుక్యభీమనృపతి తనశత్రువులనేగాక మిగిలినదాయాదులంగూడ సమూలనాశన మొనర్పఁ

లఁపడి, యుద్ధమల్లుని, చోడరాజైనలోవచిక్క భూపతిని, రాష్ట్రకూటభూపతి యగు నైదవగోవిందరావును, గంగరాజైన ఎఱ్ఱపరాజుంగూడనోడించియు, దునుమాడియు, వశవర్తులుగఁజేసికొనియు, నెమ్మదింగూర్చికొని, దాయాదులకుట్రలను మాటలేక, రాజ్యపాలన నెఱపుచు ప్రజారంజకుం డాయెను. అనేకభూదానము లొనర్చినవాఁడు. గండమహేంద్రుఁడు రాజమార్తాండుఁడు ననుబిరుదములను వహించినవాఁడనియు, చాళుక్యభీమవిష్ణువర్ధన నృపతిపేరుప్రతిష్ఠల నందెననియు నందురు. ఈయన యనంతర మదివఱకే యువరాజుగనుండి యుద్ధకాలములఁ దండ్రిశత్రులం దునుమాడుచుఁ దండ్రియాజ్ఞానువర్తిగ మెలంగుచుండిన సుతుండగు అమ్మరాజవిజయాదిత్యుఁడు సింహాసన మెక్కెను. ఈతనికి రాజమహేంద్రుఁడని బిరుదముండెనని తెలియుచున్నది.

నిజ మిదియని వివరింపఁ బరికరములు లభింపమి స్పష్టపఱుపఁజాలకున్నను జాళుక్యభీమవిష్ణువర్ధనమహారాజు కడదినములలో గోదావరికవ్వలి పెనుగొండనగరమున నార్యవైశ్యులం దగ్రస్థితి నున్న కుసుమశ్రేష్ఠిగారిసుతయగు శ్రీవాసవాంబ నీవిష్ణువర్ధనమహారాజు కామించి తనకిచ్చి పరిణయ మొనర్పుఁడని యడిగెననియు, వారియ్యకొనమి నీతనిప్రభుత్వప్రతాపాగ్నికి వెఱచి చేయునదిలేక నాకన్యకతో గోత్రమున కొక్కరుగ నగ్నిగుండము నంబడి మడిసి, పరలోకమునకేగి రనియు, కన్యకాపరమేశ్వరీపురాణమునఁగల గాధ నడచెననియుఁ దోడనే యామహారాజును మృతిఁజెంద సుతుండగు నమ్మరాజవిజయాదిత్య రాజమహేంద్రుఁడు సింహాసన మధిష్ఠించుచోఁ దాను పెనుగొండకరిగి, యూర మిగిలినవైశ్యబాలుర నూఱడించి వారి నాదరించి గారవించినట్లు తలంపఁబడుచున్నది. ఏది యెట్లుననుఁ, గాకున్నను, అమ్మరాజవిజయాదిత్యునిపాలన మిరువదియైదేండ్లు ప్రజలు సుఖమునమనిరని చెప్పఁబడినది. ఈతని పట్టాభిషేకము క్రీ. శ. ౯౪౫ డిశంబరు ౫ వ తేదీయనియు, ౯౭౦ వఱకు రాజ్యమేలెననియు లెక్కించియున్నారు. ఇతఁడు గొప్ప దాత. ఉదయగిరిమొదలు సింహాగిరి (సింహాచల క్షేత్రము) దనుక రాజ్యమునేలెనని నిదర్శనములు గలవు.

ఈతనికిఁ బిదప నీతని సాపత్న్యసోదరుఁడు సింహాసనమెక్కెంగాని మూఁడుసంవత్సరములలో దేశ మల్లకల్లోలమయ్యెను. అరాజకము వ్యాపించెను. జాతులకుట్రలు, వైదుంబులు, బాణులు, నోలంబులు, గాంగులు, రాష్ట్రకూటులు నిదే యదునని దండెత్తివచ్చుచుంటయుఁ గారణములని చెప్పుదురు. ఈకాలముననే కుంతలమహారాష్ట్రదేశముల రాష్ట్రకూటులపరిభావముల నడఁచి పశ్చిమచాళుక్యులు తాము తిరుగ స్థిరపడి నాటుకొనుట సంభవించెను. ఈగడబిడలమధ్య నిరువదియేఁడుసంవత్సరములు దేశ మరాజకస్థితియం దుండెనని చెప్పఁబడినది. ఇక్కారణమున దానార్ణవునకు, నార్యమహాదేవికి సుతుండగుకీర్తివర్మ చోడచక్రవర్తియగు రాజకేసరివర్మసహాయముతోఁ వేఁగిదేశమున నరాజకమడంచి తాసింహాసనమెక్కి, క్రీ. శ. ౯౯౯ మొదలు౧౦౧౧ వఱకుఁ బండ్రెండుసంవత్సరములు రాజ్యపాలనము శాంతితో నెఱపెను. ఈతనికిఁ జాళుక్యచంద్రుఁడని బిరుదముండెను. ఇతని కాలమున బర్మా, సయాం మొదలగు దేశములతో సముద్రవర్తకము నడఁచినటులఁ బరిశీలకులు తలంచుచున్నారు. ఆదేశంపుసీమలం దీతనిసువర్ణనాణెములు దొరకినవని చెప్పఁబడినది. ఈతనికిఁ బిదప నీతనిసోదరుఁడు క్రీ. శ. ౧౦౧౧ మేనెల ౧౧ వ తేదీని సింహాసన మధిష్ఠించెను. ఈతనిపేరు విమలా

దిత్యుఁడు. ఈతనికాలమున సింహాచలమునుండి మహేంద్రగిరివఱకుఁగల ప్రాగ్దేశము నాక్రమించి తనరాజ్యమునకుఁ గల్పుకొనెనని యచ్చటచ్చట శాసనములు గలవు.

ఈవిమలాదిత్యుఁడు చోళచక్రవర్తియగు రాజరాజు కేసరివర్మసుతయగు కూండవాంబాదేవిని బరిణయమగుట దక్షిణరాజ్యముతో సంబంధము గల్గియే యుండెడివాఁడు. ఈతఁడు బిరుదాంకభీముఁ డనియు, ముమ్మడిభీముఁ డనియు, త్రిభువనాంకుశుఁ డనియు, భూపమహేంద్రుఁడనియు బిరుదములు గలవాఁడఁట. ఈతనిపరిపాలన క్రీ. వె. ౧౦౨౨ వఱకు (అనఁగా పదునొకండు సంవత్సరములు) నడువ బిదప నితఁడు మృతినొందెను. ఈతనికడనుండిన యుద్యోగులు, సైన్యాధిపతులు, చాల ప్రభుభక్తివిశ్వాసములుకల్గినవారు గాన నీతని మరణానంతర మీతని జ్యేష్ఠపుత్రుండగు రాజరాజనరేంద్రుని పదేండ్లబాలుని సింహాసనముపైనుంచి, పూర్వము వలెనే రాజ్యపాలనము నడపుచుండిరి.

ఈరాజరాజనరేంద్రుంగూర్చి తెలియఁదగిన సంగతి యింకొకటి కలదు. తండ్రియగు విమలాదిత్యునివంకబంధువు లీతని విష్ణువర్ధనుం డనియు, తల్లియగు కూండవాంబాదేవివంకబంధువు లీతని రాజరాజనియుం బిలుచుచుండిరి. గాన జాళుక్యనామము విష్ణువర్ధనుఁడనియు, చోడనామము రాజరాజనరేంద్రుండనియు, నెఱుంగఁదగినది. ఈతని పట్టాభిషేకము క్రీ. వె. ౧౦౨౨ జూలై ౧౬ గురువారమనియు, మృతి ౧౦౬౩ అనియుం దెలియుచుంట నీమహారాజు పరిపాలనము ౪౧ సంవత్సరమని తేలుచున్నది. ఇది చాల మంచికాలమని చెప్పఁబడినది. ఈయన తనమేనమామయగు గంగయికొండరాజేంద్రచోడుని కుమార్తెయగు నమ్మంగదేవిని బరిణయమయ్యెను. ఈతనికిఁ బరగండభైరవుండని బిరుదముండెను. ఈయనపాలనమునఁ బ్రజలు సుఖంబున మనిరి.

ఈయన కింకను సత్యాశ్రయకులశేఖరుఁడనియు, సర్వలోకాశ్రయుఁడనియు, సమస్తభువనాశ్రయుఁడనియు, త్రిభువనాఙ్కుశుఁడనియు, రాజకంఠీరవుఁడనియు, రాజమహేంద్రుఁడనియు, రాజమార్తాండుఁడనియు, రాజపరమేశ్వరుఁడనియు బిరుదములుండెనని తెలియుచున్నది. అత్తవారు, మేనమామగారు, మాతామహులు నగు చోడుల పెత్తన మధికముగనుంట, నీయనకు రాజరాజనరేంద్రుండను చోడనామమే వాడుకనందెనుగాని, పితృసంబంధ చాళుక్యనామమగు విష్ణువర్ధనుఁడను మాట వాడుకనందలేదు. ఈయనకనిష్ఠ సోదరుని పేరు విజయాదిత్యుఁడు. అయనపే రక్లేఘుండెను గాని మాఱలేదు.

ఈవిష్ణువర్ధననాముఁడగు రాజరాజనరేంద్రుఁడు తనకు బ్రాహ్మణుండగు (పౌరోహిత్యుఁడు) నన్నయభట్టారకునిచే నాంధ్రభారతము రచింపఁజేసినవాఁడు. ఈయనరాజధాని రాజమహేంద్రవరమే. వీరిబంగారు నాణెములు మహాముద్రింగల్గియుంట 'వరహా'లని పేరందియున్నవి. చాళుక్యపాలనమున రాజమహేంద్రవరము నూఱు సంవత్సరములు రాజధానిగనుండెనదని యందురు. రాజరాజనరేంద్రుని సుతునిపేరు రాజేంద్రచోడుఁడు. ఇదియా బాలుని మాతామహునిపేరు. మఱియు నీబాలుఁడు మేనమామలతోఁబాటు మాతామహుల యింటనే పెరిగెనందురు. మఱియు నీతనికి దక్షిణదేశాభిమాన మధికము.

తండ్రియగు రాజరాజనరేంద్రునియనంతరము కుమారుండగు రాజేంద్రచోడుని సింహాసనమునకు రానీయక విజయాదిత్యుఁడు చోడభూపతిగ నప్పు

దుండిన వీరరాజేంద్రచోడునిసహాయముం గొని, తాను వేఁగిసింహాసన మధిష్ఠించి పరిపాలనసెఱపు చుండెను. ఈతరుణమునఁ బశ్చిమచాళుక్యభూపతి యగు నాఱవవిక్రమాదిత్యుం డనంబడినభూపతి గొప్పసైన్యముం గూర్చుకొని వేఁగిదేశముం జయింపనే తెంచెను. చోడరాజగు వీరరాజేంద్రుఁడు వెఱచి యాతనికిం దనకూఁతునిచ్చి పరిణయ మొనర్చి, మైత్రిఁగుదుర్చుకొనెను. వేంగిభూపతిగ నుండిన విజయాదిత్యుఁడు వెఱచి వెంగళి యగుటయు నెఱింగి, రాజేంద్రచోడుఁడు సైన్యములంగూర్చుకొని యెదిర్చి, పశ్చిమచాళుక్యులం దరిమివై చెను. అప్పటిరాజకీయకారణములమేరకుఁ దనపినతండ్రిని పదభ్రష్టునింజేసియు, నాతనినే తన రాజప్రతినిధిగ వేఁగిరాజ్యమేల నియమించి, తాను చోడభూపతియగు వీరరాజేంద్రచోడుఁ డత్తటి మృతినొంద నాతనిసుతుని నిహతుంజేసి తా నా చోడసింహాసనమెక్కి క్రీ. వె. ౧౦౭౦ మొదలు ౧౧౧౮ వఱకు నుభయరాజ్యములం బాలించు చుండెను. ఈతనికిఁ గుళోత్తుంగచోడుఁడని బిరుద ముండెను. ఈభూపాలుని నివాసము సభిమాసము ద్రావిడదేశమునందే యని యెఱుంగునది.

రాజేంద్రచోడనాముఁడగు కుళోత్తుంగచోడు నిసుతులు చోడగంగుఁడు, వీరచోడుఁడు, విక్రమ చోడుఁడు వరుసగ నొకరితరువాత నొకరుగ వేఁగి దేశమునకు రాజప్రతినిధులుగ నియమింపఁబడి కొంతకాలముండుచు దక్షిణదేశమునకే మరలి పోవుచుండిరనియు, పిదప వెలనాఁటి ప్రభువులు గానుండిన గొంకరాజు మొదలగువారీపదవికి నియమింపఁబడియు, వారు రాజమహేంద్రవరము ననుండక దనమప్రోలు (ఇప్పటి చందవోలు) నందు వసించుచుండిరనియుఁ దెలియుచున్నది. ఇటులఁ బదమూఁడవశతాబ్దమువఱకు గడచెను.

వెలనాఁటిచోడరాజులు పిదప స్వతంత్రులై యారాజ్యమును పాలించుచుండిరి గాని రాజమహేంద్రవరము రాజధాని కాలేదు. క్రీ. వె. ౧౩౨౩ లో రాజ్యము మహమ్మదీయుల హస్తగతమై సాలుమయూసజ్జా రను రాజప్రతినిధిక్రింద నుం డెను. ఆమహాత్ముఁడు దేవాలయములం బగులఁ గొట్టి పెద్దమశీదుఁ గట్టించెనని క్రీ. వె. ౧౩౨౪ మశీదుద్వారమునఁ బారశీభాషలో వేయించిన శాసనము నేఁటికిని రాజమహేంద్రవరమునఁ బెద్ద మశీదు ముఖద్వారమునఁ గాననగుచున్నది. పిదప దేశము రెడ్డిప్రభువులవశ మాయెను.

వెలనాఁటి చోడరాజుల రాజప్రతినిధిత్వము నుండి వేఁగిదేశమనుపేరు మాసిపోవుచుండి తుర కలనాఁడు రాజమహేంద్రము సర్కారుగ నయ్యెను. రెడ్డిప్రభువులనాఁడు రాజమహేంద్రవర రాజ్యమనంబడెనుగాని వేఁగిదేశమనుపేరు వెనుకఁ బట్టిపోయెను. ప్రారంభమున మంచికొండ కూనా రెడ్డి యనుపేరుగల ప్రభువు రాజమహేంద్రవర మునుండి పదిమైళ్ళదూరమందున్న కోరుకొండ తనరాజధానిగ నట దుర్గము నిర్మించుకొని రాజ మహేంద్రవరమునుండి కోనపర్యంతరాజ్యముం బాలించెననియు, దీనికే యాదిని రెడ్డిసీమయని పేరుఁ గల్గెనని చెప్పఁబడినది.

కొండవీటిభూపాలుండగు కుమారగిరిరెడ్డి బావ మఱఁదియగు కాటయ వేమారెడ్డి కీరాజమహేంద్రవరరాజ్య మిచ్చెనని చెప్పఁబడియున్నది. వీరు పంటరెడ్లట. [రెడ్లు చూడుఁడు.] కుమారగిరి రెడ్డి తండ్రిపేరు అనపోతారెడ్డి యని తేలు చున్నది. కాటయవేమారెడ్డి గొప్పదాత. వీరి పరిపాలనమందుఁ బ్రజలు సౌఖ్యపడిరని వాడుక కలదు. ఈయనకు మల్లమ్మ, దొడ్డమ్మ యనువార లిర్వురుభార్యలు. దొడ్డాంబికవలన ననితల్లి యను

కుమార్తెయుండెను. ఈమెభర్తయే కాశీఖండమును శ్రీనాథమహాకవినుండి కృతినొంది విద్వద్గోష్ఠిని కాలముం గడపుచుండిన సుప్రసిద్ధుండగు వీరభద్రనృపాలుఁడు [వీరభద్రారెడ్డి]. ఈయన తండ్రిపే రల్లాడరెడ్డి. ఆయనకు ౧ వేమారెడ్డి, ౨ వీరభద్రారెడ్డి, 3 అన్నారెడ్డి, ౪ దొడ్డారెడ్డి యను నల్వురుపుత్రులుండిరి. అందు జ్యేష్ఠుండగు వేమారెడ్డి సైన్యాధిపతియని పేరు ధరించియు, తమ్ముఁడగు వీరభద్రారెడ్డిపేర రాజ్యపాలనము తానే నెఱపుచుండువాఁడని పరిశీలకు లనుచుందురు, గాని యట్లేల చేసెనో కారణములు నుడువజాలకున్నారు. వీరికాలమున రాజమహేంద్రవరరాజ్యము కృష్ణానదిమొదలు సింహాచలముపర్యంత ముండెనఁట.

సంపూర్ణచరిత్రము వ్రాయ సమకట్టని యీ గ్రంథమునకు తప్పిళ్ళతో పనియుండదు గాని వీరభద్రారెడ్డికిఁబిదప రెడ్లపాలన సరిగా నడవలేదు. అనేకు లీరాజ్యమున కలహించుచు ప్రజాశాంతికి భంగముఁ గల్గించుచుండిరి. ౧౪౫౭లో కటకపురాధీశ్వరుండగు కపిలేంద్రగజపతి యాక్రమించెను. ౧౪౭౦లో మహమ్మదీయులు తిరుగ సిద్ధపడిరి కాని స్వాధీనపఱచుకొనలేరు. ౧౪౭౮లో బహమనీసుల్తాను హస్తగతమై క్రీ. వె. ౧౫౧౫ లో శ్రీకృష్ణరాయసార్వభౌమునిహస్తగతమై యాయన వలన తనమామయగు కటకపుగజపతివశమై, ౧౫౪౦ ప్రాంతమున దిరుగ మహమ్మదాలీకుతుబ్షాహస్తగత మాయెను. ఈమధ్య ౧౪౮౧ నుండి ౧౫౭౧ వఱకు చందనదేవుఁ డనువానిపాలనయందుండెను. పిదప గోలకొండనవాబుక్రిందకువచ్చెను.

క్రీ. వె. ౧౬౮౬లో ఔరంగజేబుసామ్రాజ్యమందు గలసిపోయి, ౧౭౨౪ లో నైజామురాజ్యమునందుండి యుత్తరసర్కారులనంబడి హాజీ హుస్సేనను నామాంతరముగల రుస్తుంఖానుని కూరతకుం గురియై, క్రీ. వె. ౧౭౫౧లో (ప్రెంచివారు) బుస్సీహస్తగతమై, ౧౭౫౮ పిఠాపురము వద్దనున్న చందుర్తియుద్ధమున (ఇంగ్లీషు ఫ్రెంచి) నాంగ్లేయులవశమాయెను. కాని పాలనమేర్పఱుపఁబడక అరాజకముగనేయుండి క్రీ. వె. ౧౭౬౬ నవంబరు ౧౨ తేదినుండి యాంగ్లపరిపాలనారాజ్యముకుం జేరిపోయి నేఁటికి నట్లే యున్నది.

**వేఁగినాఁటి కొండనార్యకవి:—** ఆంధ్రకవులలో నాథునికాలందుఁబరిగణింపఁబడినవాఁడు. వేఁగినాటిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. రచించినది వివేకసింధు వనెడివేదాంతగ్రంథము పద్యకావ్యము.

**వేఁగినాటిసీమ [వేఁగినాఁడు]:—** ఆంధ్రదేశమున నేలూరునకుఁగతిపయదూరమున పెదవేఁగియనియుఁ, జినవేఁగి యనియు రెండు గ్రామములు గలవు. ఇవి తొల్లిఁటివేఁగిదేశపు ప్రధానసగరమగు వేఁగిపురముండినతావునగలవు. పెదవేఁగిమొదలు చిన్నవేఁగివఱకు నాపరిసరములఁగూడ నాక్రమించి తొల్లింటి వేఁగిపుర ముండెడిదఁట. ఈప్రాంతసీమకు వేఁగివాఁడనియు, వేఁగినాఁటిసీమ యనియు వాడుకనామములు గలవు.

ఈనాఁటివారగు తొల్లింటివిప్రులకు వేఁగినాఁటి శాఖ బ్రాహ్మణులని పేరయ్యెను. వేఁగినాఁటిదేశమునుఁ బశ్చిమచాళుక్యనృపు లేలిరి.

**వేగవతీనది:—** దీనిని వేగనది యనియు నందురు. కాంచీపురమునకు సమీపమున నుండు నది. చెంగల్పట్టుజిల్లా లోనిది. పద్మపురాణము ౧౧ అధ్యాయమున దీనిప్రశంస కలదు.

**వేగిస (ఏగిశ) చెట్టు**:—లా. Pterocapus marsupium. ఆంగ్ల. Indian Kino tree. సం. సర్జకవృక్షః.

ఏగిస (చెట్టు) కలపకుఁ బనికివచ్చు నడవి చెట్టు. గొప్పమ్రానుగలది. దీనికలప టేకుచెట్టు కలపవలె నుపయోగించి పనితనమిచ్చును. దీని కలపయం దెఱ్ఱనిరంగు కలదు. ఏగిసజిగురు దంత రోగముల నివారించుననియుఁ జెక్కయు, నాకుల రసకషాయములును, శీతపైత్యదోషము నడఁచి వ్రణములను మాన్పి, తలవెండ్రుకలకు బలము జేయుననియుఁ జెప్పఁబడినది.

## వేజెళ్లవారి వంశావళి [గుడ్లూరి ప్రభువులు]:-

వీరు సామంతరాజులుగ కొండవీడుమొదలు నెల్లూరుజిల్లా, కందుకూరుతాలూకా, గుడ్లూరుదనుక గలసీమను బాలించినవారు. వీరియాస్థానమున వెన్నెలకంటి వేంకయ్యగారును, వారిసంతతివారును మంత్రులుగ నుండిరఁట.

వేజెళ్ళ పోలంరాజు రాజ్యసంపాదకుఁడు. రాజధాని తెలియదు.

|

పాపరాజు క్రీ. శె. ౧౪౪౯—౧౪౯౪.

కసవరాజు క్రీ. శె. ౧౪౯౪—౧౫౨౨.

|

అయ్యపరాజు — అయ్యపరాజు సర్రాజు (సర్వరాజు) గార్ల పాలన తప్పీళ్లు తెలియవు. — సర్వరాజు

వీరిలో నొకరికడనో యిద్దరికడనో వెన్నెలకంటి వెంకయ్యగారు మంత్రిగ నుండిరి. వీరిద్దరి పరిపాలన క్రీ. శె. —౫౨౨ మొదలు ౧౫౫౮ వఱకుండెను. వీరినాఁటి నుండియు గుడ్లూరు రాజధాని యయ్యెను.

పెదనర్సరాజు — చిననర్సరాజు క్రీ. శె. ౧౫౫౮—౧౬౦౦

కమారకృష్ణమరాజు క్రీ. శె. ౧౬౦౦—౧౬౩౬.

పెదనారాయణరాజు క్రీ. శె. ౧౬౩౬—౧౬౭౮.

|

కుమారక్రిష్ణమరాజు క్రీ. శె. ౧౬౭౮—౧౬౯౩.

కుమారనారాయణరాజు

|

కృష్ణమరాజు — రాఘవరాజు. ఈయన ప్రభుత్వమునకు రాలేదు.

|

చిననారాయణరాజు — సర్వరాజు (సర్రాజు) ఈయన తెట్టుజమీాదారుఁడని చెప్పఁబడినది.

|

కుమార కృష్ణమరాజు ఈయనతో గుడ్లూరిరాజ్య మంతరించినది. వీరిసంతతివారు నేటికిఁ గలరు.

**వేట్కలర్సు (Vat-Colours) రంగులు**:— (రంగులు చూడుఁడు).

**వేట్రిక్వది [వృత్రఘ్ని, వేత్రవతి]**:- (ఘూర్జరదేశము చూడుఁడు).

**వేఁడి (Heat)**:-- వేడి నాంగ్లరసాయనశాస్త్రవేత్తలు 'Sensible heat' అనియు, 'Latent heat' అనియు ద్వివిధములుగ విభజించుచున్నారు. ఇంద్రియగ్రాహ్యమగునది గాన సెన్సిటివ్ హీ టనియు, గుప్తమైనది గాన లేటెంటుహీ టనియుఁ బేర్లిడఁ బడినవి. సాధారణముగ నేదేని యొకవస్తువునకు వేఁడింజేర్చిన నో దానియుష్ణమాన [temperature] మధికమగుటయు, నొకవస్తువు నుండి వేఁడిదీసివైచిన దాని యుష్ణమానము [temperature] తగ్గుటయు నెల్లరెఱింగిన మూలసూత్ర [ధర్మ] మే కాని కరఁగి నీరగుచున్న మంచునకుఁ జేర్పఁబడినవేఁడి దానిటెంపరేచరు నధికపఱుపఁజాలదనియు, ఘనీభవించుచున్న నీటి నుండి కొంతవేఁడిం దీసివైచిన దానియందలి టెంపరేచరుం దగ్గింపఁజాల దనియుఁ జెప్పఁబడినది.

ఇంకను నీరును మంచును గలసియున్న సముదాయమునకు వేఁడిఁ జేర్చినను దానినుండి వేఁడిని దీసివైచినను గూడ దానియందలి టెంపరేచరునం దెచ్చుతక్కువ లుండవనియుఁ జెప్పఁబడినది. మఱియు నీటియావిరి వేఁడిని నీటికిఁ గలుపుటవలనం గల్గినదియైనను నానీటికన్న నధికమగు టెంపరేచరు కలదిగ నుండదనియుఁ జెప్పఁబడినది.

ఇటుల టెంపరేచరు నధికపఱుపఁజాలనివేఁడి యేమగుచున్నదని ప్రశ్న జనింపవచ్చును. ఆవేఁడి యందే గుప్తముగనై యడఁగియుండెడిని. దానికే గుప్తావస్థయందున్నవేఁడి (latent heat) అని పేరు.

ఇందువలన మంచునందు గుప్తమై యడఁగియున్న వేఁడియు, నీ రావిరియగుతరి యందు గుప్తమై యడఁగియున్నవేఁడియు లేటెంటుహీటనియు నింద్రియగ్రాహ్యమై పైకి తెలియుచున్నవేఁడి సెన్సిటివ్ హీ టనియు స్పష్టమైనది. ఏరూపమునం దున్నను నేపదార్థమం దిమిడి యెంతవేఁడి యుండునో దానికి 'specific heat' అనియెదరు. ఉష్ణమానసాధనము [తెర్మోమీటరు] తోఁ గొలచిన వేఁడిపరిమితి నెఱుంగఁగలరు గాని, వేఁడి నెఱుంగ పలుపడదని మనసునం దుంచుకొనవలెను. అనఁగా నొకపదార్థమునందుండువేఁడి టెంపరేచరు కాదని భావము.

వేఁడింగొలుచు యంత్రోపకరణమునకు Calorimeter' అనిపేరు. దీనికిని Thermometer నకును abssolute difference కలదని చెప్పఁబడినది. అనఁగా నొకటి. Quantity ని, రెండవది quality ని తెల్పునని భావము. Latent heat అనిన వేఁడినే (heat itself) అనియు, temperature అనిన heat level (వేఁడిపరిమితి) యనియు నెఱుంగునది.

జ్యోతిశ్శాస్త్ర (astronomy) పండితుఁడగు 'Laplace' అనునాయనయు,రసాయనశాస్త్ర (chemistry) పండితుఁడగు Lavoisier అనునాయనయుఁ గలసిపరిశీలనలుసల్పి calorimeter నుకనిపెట్టిరి. సుప్రసిద్ధపరిశీలకుండగు Lord kelvin పండితుఁడు వేఁడిగూర్చిన రహస్యధర్మములం గనిపెట్టెను. వీరు చిరస్మరణీయులు.

**వేఁడినీళ్ల కిండ్లు కాలునా?**:—
(ఆంధ్రలోకోక్తి)

**వేఁడినీరుపడినతోడనే కాలకుండుట**:— నీరు సరియైన యుడుకువేఁడి (Boiling

point) యందుండితఁటి నతిపలుచని యావిరి పొరచే నావరింపఁబడి యుండకతీరదు. ఆపొర నీటిందాఁకుతఁటి మెత్తగనుండునట్టి వేఱొకపొర వంటిదే యగును. అట్టినీ రకస్మాత్తున మేనఁబడెనేని మనమేనికి మొదట తాకునది యావిరిపొరయే గాని, వేఁడినీ రెంతమాత్రమును గానేరదు. తోడదే దులిపివేసిన చర్మము కాలకయే నీరు తుళ్ళి పైబడిపోవును. అపాయముండదు.

దులుపుటయందే స్వల్పకాలమాలస్యము జరి నను తోడనే నీటిపై పొరచితికి మేనికి నీరుతాఁకి కాలకమానదు. ఒకసెకండుకాలఁపు టాలస్యమైనను నొడలు గాలునట్లుచేయుటకుఁ జాలునని లెక్కింపఁబడినది.

ఇట్లయ్యు నాలిస్తయాలస్యమున నానీటివేఁడి గాలికిఁ గొంత చల్లారును. అపాయము (Boiling point నకు) దగినంత యుండఁజాలదని తేలినది.

## వేఁడినీళ్ల స్నానమునకుఁ బిదప నిద్ర వచ్చుట:

—'చన్నీటి స్నానము మేల్కొల్పు' నను సామెత కలదు. శరీరమంతయుఁ జన్నీటఁ దడిపి స్నానమొనర్చితిమేని మనశరీరమునకుఁ గొంత శీతలమును గల్గించితిమని యర్థము. శీతముతాకు కతన మనశరీరమునందలిరక్తమును ధరించియున్న చిన్నచిన్నగూడు లన్నియు బిగిసి ముడుచుకొని పోవును. తోడనే వానిమధ్యనున్న కన్నములందలి రక్తము నొక్కఁబడినదై శరీరావయవ ములందలి లోభాగమునకుఁజనును. రక్తమును పై చర్మము నకంటియుండు మనశరీరావయవముల చర్మమింకను చల్లబడియుండును. గాని లోపలనుండి రక్తస్రావము శరీరమంతటను గల్గియుండును. హృదయమును బలముజెంది పరాక్రమవంతమై కదలికఁ గల్గియుండును. నిదురతొలఁగి చైతన్యముత్తేజమై, బుద్ధివ్యాపకముగాంచి మెలకువగా నుండును.

ఇంక నుష్ణోదకస్నానమొనర్చితిమేని శరీరమున కంతకుఁ గొంతవేఁడి జూపితిమని యర్థము. ఉష్ణముతాకుటంజేసి, శరీరావయవములందు బైటి చర్మముకడనున్న చిన్నచిన్నరక్తముండుగూడులన్ని యుఁ దెఱచుకొనును. తోడనే లోనుండి రక్తమా గూడులంజేరి లోనరక్తము తగ్గిపోవును. ఇట్లేమే ధావయవము (brain) లోనున్నరక్తమునుఁ బైకిఁ జేరుకొలుటవలన శుద్ధియగును. హృదయము విశ్రాంతినొందును. మేధావయవము (Brain) విశ్రామముఁజెందును. అందువలన నిదురవచ్చును.

## వేఁడినీళ్లు మురికిని శుభ్రపఱచి కడుగుట:

— మనశరీర మందలిచర్మము, నఱచేతులు, నితరములగు నవయవములు మురికియుం గలసియుండునని యెఱుంగునది. జిడ్డుపదార్థము శరీరములందుండి లూబ్రికేషన్ (కందెన) నాఁబరఁగుచుండునది. క్రొవ్వు, జిడ్డు, మురికినతిత్వరితముగ నాకర్షించునవి గాన, నట కది జేరుకొనక తప్పదు. క్రొవ్వు పలుచనిస్థితియందు చిమురుగను, చమురు ముద్దగట్టినక్రొవ్వుగను, నగునని రసాయనశాస్త్ర విదులు సామెతగాఁ బల్కుచుండుట కలదు.

వీనింగరఁగింప వేఁడి కావలయును. లేకున్న (కరఁగింపకున్న) వదలుటదుస్తరము. వేఁడినీటి యందుఁగల వేఁడి దానిం గరఁగించి వదలఁ జేయును. చన్నీటియం దాశక్తి లేదుగాన శుభ్రముగా మురికి వదలుట దుస్తరము. జిడ్డులేకుండిన మురికి చన్నీళ్ళతో వదలుట కేయభ్యంతరమును లేదు. గాని కడుగుచేతులందు జిడ్డుంట శరీరధర్మమేగాన వేఁడినీళ్లు దీనింగూడ వదలఁజేయును.

**వేణీనది:**—ఇది కృష్ణానదియందుఁ గలియును. అటనుండి యానదికి కృష్ణవేణి యనిపేరు. దీనింగూర్చినప్రశంస పద్మపురాణ ముత్తరభాగమున ౭౮ అధ్యాయమునఁ గలదు.

**వేణుగ్రామము (బెల్గామ్):**– సుగంధవర్తియని తొలుతఁ బేరుండి (సౌంగత్తి యనియు న్యులచే వాడఁబడి) రత్తప్రభువుల కిటీవల రాజధానిగనుండినదని డాక్టరు భాండార్కరు పరిశీలకుఁడు Early History of Deccan నందు వివరించియుండినపురమునకుఁ బిదప వేణుగ్రామ మని పేరు వాడుకగల్గెను. రానురాను వేణుగ్రామము బెల్గామె యిప్పుడు కర్ణాటభూమిని బొంబై రాజధానియం దున్నది.

**వేణుగంగానది (వెయిన్గంగ):**—వింధ్యపాదపర్వతమున జనించి గోదావరి లేక గౌతమీనదియందుఁ గలియును. దీనింగూర్చినప్రశంసలు మార్కండేయపురాణము ౫౭ యందును, బృహచ్ఛివపురాణ ముత్తరకాండ ౨౦ యందును గలవు.

**వేణుగోత్రము:**—ఇది విశ్వామిత్రసంతతియందు వేణుగణముగఁ జెప్పఁబడిన గోత్రము. విశ్వామిత్ర, గాధిన, వైణవ యని ప్రవర. త్రయార్షేయప్రవర.

**వేణువనవిహారము:**—బింబసారుని వలన నొకవెదురుతోఁటయందు నిర్మింపఁబడి బుద్ధభగవానున కొసంగఁబడినగృహము. రాజగృహపురికి వెలుపల నుత్తరద్వారమున కవ్వల బైభారా పర్వతపాదమున నున్నది.

ఇంకను నిప్పటితిరునల్వేలిపురప్రాంత మంతయు వేణువనమనియు, నచటి 'నెల్లియప్పా' రనుశివలింగమును వేణువనేశ్వరుఁడనియు నందురు. ఇది యఱవదేశములోనిది. తొల్లిటిపాండ్యదేశము, తామ్రపర్ణినదీతీరము. (మగధరాజ్యము చూడుఁడు).

**వేణుహయుఁడు:**– యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. శతజితు రెండవకుమారుఁడు.

**వేణ్ణిల్లకుఁజన్నీళ్లు తోడు (తొరపడం)** (ఆంధ్రలోకోక్తి.)

**వేత్రవతీనది:**—దీని నిప్పుడు బెట్వా యనుచున్నారు. భోపాలరాజ్యములోనినది. ఇది విశాలీనదిలో సంగమించును. తొల్లి యిటనుండెడి దశార్ణదేశపు రాజధానియగు చేతీయనగర(చైత్యగిరి) మిప్పుడు పాశ్చై పల్లెయై యున్నది.

దీనిని హాగిరియనుటయుం గలదు. బళ్ళారి మండలమునకు ౧౦ మైళ్ళదూరమునను, కర్నూలుమండలమునను బ్రవహించి, తుంగభద్రానదియందుఁ జేరును. స్కాందపురాణ సహ్యాద్రికాండమున దీనిప్రశంస గలదు. (దశార్ణదేశము చూడుఁడు, వృతఘ్ని చూడుఁడు.)

**వేదనలు(ద్వాదశవేదనలు)ప్రాణులకుఁగల్గు బాధలు:**—౧ అగ్నివేదన, ౨ శీతలవేదన, ౩ అశని (పిడుగు) వేదన, ౪ జల (వెల్లువలు, వఱదలు, ఉప్పెనలు, మొదలగునవి) వేదన, ౫ వాత (ప్రచండవాయువు మొదలగునవి) వేదన, ౬ ఆయుధవేదన, ౭ విషవేదన, ౮ ఔషధవేదన, ౯ క్షుద్వేదన (ఆకలిబాధ), ౧౦ పిపాస (దాహము) వేదన, ౧౧ రోగవేదన, ౧౨ కోప (దురహంకార) వేదన (మనోవేదన).

**వేదపర్వతము [వేదగిరి లేక పక్షితీర్థము]:**—చెంగల్పట్టుమండలములోని తిరుకళుక్కుండ్రమను గ్రామము నంటియున్నగ్రామము.

దీనిని పక్షితీర్థమనియెదరు. పర్వతముపైకి రెండు పక్షులపరాహ్ణమువేళకు వచ్చి పెట్టినభోజనముఁ దినిపోవును. కొండపై వేదగిరీశ్వర శివలింగము, త్రిపురసుందరీ (తిరుమలసొక్కమ్మ) దేవస్థానములు గలవు. కొండక్రిందిగ్రామమున శంఖతీర్థమనుసరస్సును దేవాలయమును గలవు. ఇది తొల్లింటి చోళదేశములోనిది.

**వేదము:—** పరమేశ్వరునియందుఁ గల లక్షణములు మూఁడు. అవి సత్తు, చిత్తు, ఆనందము. అందొకొక్కటి యొక్కొకప్పుడు విజృంభించుచుండుననియు, అట్టి చిద్విజృంభణకాలమున నాగమములుగ వేదములు గలిగెననియుఁ జెప్పఁబడినది. తొలుత వేదము లన్నియు నొక్కట కలసి యుండినవి గాని వ్యాసమహర్షి వానిని విడదీసి, నాల్గుగ విభజించెను. ఋక్కులసముదాయముగల భాగమునకు ఋగ్వేదమనియు, యజుర్వేదమనియు, సామవేదమనియు, నథర్వణవేదమనియు, తా విభజించిన నాల్గువేదభాగములకుఁ బేర్లిడి, నాల్గు వేర్వేఱువేదములుగ నాతం డేర్పఱచెను.

మఱియు నాతఁడే నాల్గువేదములందలి క్లిష్టార్థములను స్పష్టపఱచి, యపార్థములు దోపకుండునటుల తనముఖ్యశిష్యుల నల్వుర నియమించి, వ్యాఖ్య వ్రాయించెను. ఆవ్యాఖ్య యాకాలపుటాచారసాంప్రదాయములమేర నుదాత్తానుదాత్త, స్వరిత, ప్రచయరూప లక్షణములతో వేదఛందస్సున వేదలక్షణములతో వ్రాయఁబడి, వేదమువలెనే స్ఫురించుచు నాయావేదములం దర్వస్థానములం జేర్పఁబడెనంట. గాన నిప్పుడు వానిం గూర్చుకొని వేదము బాహుళ్యతం గాంచి పెద్దదిగ నౌటయే గాక, మూల మేదో, వ్యాఖ్యభాగ మెద్దియో దెలియ నసాధ్యమై దనరారుచున్నది.

ఇట్లు వ్యాఖ్యవ్రాసిన దొక్క వ్యాసుని నల్వురు శిష్యులే గాక వారివారి శిష్యప్రశిష్యపరంపరలు తలాటములుగఁ బనిచేసి వ్యాఖ్యవ్రాసి ముగించిరి. వేదమందలి యాయాభాగములకు వారిపేర్లే డఁబడుచుంటఁ గాననయ్యెడిని.

వేదములందు మంత్రములనియు, బ్రాహ్మణములనియు, నుపనిషత్తులనియు, మూఁడు ప్రధాన భాగములు గలవు. ఉపనిషత్తులు వేదసారములు. వేదప్రధానధర్మరహస్యములనెత్తి కూర్చి, యుపనిషత్తులుగ నొనర్చిరి. ఈయుపనిషత్తులు పలువిధములగు మతమార్గములం గూర్చి చెప్పఁబడినవి. ఇందుఁ గొన్నియుపనిషత్తులు శైవపారమ్యమును, గొన్ని విష్ణుపారమ్యమును, గొన్ని సన్యాసావధూత, హంస, పరమహంస, ధర్మములనుఁ బ్రతిపాదించెడివి. ఇంకను గొన్ని విభూతి, రుద్రాక్ష పంచాక్షరి ధర్మములను, బ్రత్యేకముగఁ బ్రతిపాదించుటయు, వేర్వేఱు మతములం గూర్చియు నుపనిషత్తులు గాన్పించుచుంటయుఁ జూడ వేర్వేఱు మతములవారు వేర్వేఱుధర్మముల కుపనిషత్తులం గూర్చికొని రచించియుందురని తోఁచెడివి.

**వేదభృత్ గోత్రము:—**
(జమదగ్నిభిదా ఉపగణము చూడుఁడు).

**వేదయాతిగోత్రము:—**
(శండిలగణముఁ జూడుఁడు).

**వేదవేలగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**వేదశిరుఁడు లేక వేదశిరస్సు:—**
తండ్రి ప్రాణుఁడు, కుమారుఁ డుశేనస్సు.

**వేదశ్రుతులు నాలుగు:—**
(శ్రుతి - శ్రుతులు చూడుఁడు).

**వేదస్వరములు:**— వేదమునకు స్పష్టార్థములు స్ఫురించుటకుఁగాను నాల్గుస్వరములు కల్పింపఁబడినవి.

౧ ఉదాత్తము (ఉచ్చైస్స్వరము) పైకిఁబలుకునది.
౨ అనుదాత్తము (నీచస్వరము) క్రిందికిఁబలుకునది.
౩ స్వరితము- దీర్ఘముగఁ బలుకునది.
౪ ప్రచయము- సమముఁగాఁ బలుకునది

ఇంకను వ్యాఘ్రిస్వరము మొదలగునవి కలవు గాని, యవి అర్థముతో సంబంధించినవి గావు.

**వేద (శృతీ) నది:**— ఇది సంయుక్త రాష్ట్రములలోని యయోధ్యపరగణాలో గుమితీ (గోమతీ) నదికి సమీపముననున్న నది. దీని నిప్పుడు 'బైతా' యనుచున్నారు. రామాయణాయోధ్యకాండము ౪౯ అధ్యాయమున దీని ప్రశంస కలదు.

**వేదాంతవాదమతములు ౬ (షడ్వైదికమతములు):**— ౧ భాస్కరీయసిద్ధాంతము, ౨ శబ్దబ్రహ్మవాదసిద్ధాంతము, ౩ క్రీడాబ్రహ్మవాదసిద్ధాంతము, ౪ ద్వైత (ఆనందతీర్థస్వామికృతమధ్వ) సిద్ధాంతము, ౫ శుద్ధాద్వైత (శంకరభగవత్పాదసంస్కరణమందిన)సిద్ధాంతము, ౬ విశిష్టాద్వైతమత (రామానుజ జగద్దేశికసంస్కరణమందిన) సిద్ధాంతము

**వేదాయనగోత్రము:**—
(శాండిలగణము జూడుఁడు).

**వేదాయనిగోత్రము:**—
(కథ లేక కథ్యగణముఁ జూడుడు).

**వేదారణ్యము (అగస్త్యాశ్రమము):**- ఇది తంజావూరు మండలములోని యొకస్థలము. తొల్లింట నిది యరణ్యమై యగస్త్యమహర్షి నివాసమై యొప్పిన పవిత్రస్థలి. దేవీభాగవతము ౭-౩౦ యందు దీనింగూర్చిన ప్రశంస కలదు. (అగస్త్యుఁడు చూడుఁడు.)

**వేదిక:**— యుధిష్ఠిరునిభార్య

**వేదుఁడు:**— అయోదధౌమ్యుని శిష్యుఁడగు ఋషి. పౌష్యరాజున కుపాధ్యాయుఁడు

**వేనగంగ (వైన్‌గంగ) [wain ganga]:**- వింధ్యాచలపాదమున జనించి, మధ్యరాష్ట్రముల నుండి నడిచి యందలిపొలములఁ దడుపును. వేనగంగ వరదానదులు రెండును గలసి 'ప్రాణహిత' యనునదియై గోదావరీనదియందు సంగమించును. వేనగంగ కృష్ణానదిలో సంగమించు వేనా, లేక వేణీనది గాక వేఱునదియై యున్నది.

**వేనశిష్టకులగోత్రము:**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. వేనశిష్ట (వేనశ్రేష్ఠ) కులగోత్రము. ఏకార్షేయ (౬౨) గోత్రము. ప్రాచీనగణము. సంస్కృతగోత్రము ప్రాచీనస. శమీకర్షి. ఆపస్తంభయజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ. సమానగోత్రము లాశ్వలాయన, శమీకస, అను నవి. దేవవల్లభుఁడు దేవత. వల్లభాంబ భార్య. శేషాద్రి తపస్థానము. వసంత సరస్సు తటాకము. జపము దశలక్ష. దీపములు౯౦. క్షేత్రసంఖ్య ౪౯. మణులు దానము. తిక్త శాకములు వర్జనీయములు.

**వేనాకటకము:**—
(ఏకశిలానగరము, తెలింగానాదేశము చూడుఁడు)

**వేనాయనిగోత్రము:**—
(కథ లేక కథ్యగణము చూడుఁడు.)

**వేనుఁడు [వేనచక్రవర్తి]:—** స్వాయంభువుమనువు సంతతి. తండ్రి యంగుఁడు. కుమారుఁడు పృథుచక్రవర్తి. తల్లి సునీథ (ఈమె మృత్యువునకుఁ గుమార్తె.) మాతామహుఁడు మృత్యువు.

వేనుఁడు మృత్యువువలెనే క్రూరుఁడు. (ప్రజాక్షోభము శాపరూపమగుటచే నితఁడు నిహతుఁడాయెను.) అతని తొడలనుండి బాహుకుఁ డను నిషాదుఁడు జనించెను. ఈతనిసంతతివారు నిషాదులు (అడవులందు, కొండలందు నివసించువారు). పృథుచక్రవర్తి వేనుని బాహువులందుఁ బుట్టినవాఁడు. గాన నీతనికి వైన్యుఁడనియుం బేరుకలదు.

**వేఁపచెట్టు:—** వేఁపచెట్టు చేఁదువేప యనియు, కరివేఁపయనియు, పినవేప లేక పెద్ద వేఁపయనియు, తురకవేఁపయనియు, తియ్యవేప యనియు, నల్లవేప (కృష్ణహేమ లేక కాయఫల చెక్కచెట్టు) యనియు చెప్పఁబడినది. ఇవిగాక దీని పేరువహించినది నేలవే మనునది ప్రత్యేకజాతి యొకటి దీనికిఁ జెందినదికానిది కలదు. ఈయేఁడింటిని సప్తవిధహేమ (వేము) వృక్షములని చెప్పఁబడినది. వేఁపచెట్లగాలి చాల యారోగ్యకరముగ నెంచఁబడెడిని.

౧ చేఁదువేప— దీనింగూర్చి తెలియఁదగిన విజ్ఞాన మెక్కువగాఁగలదు. నూఱుసంవత్సరముల వయస్సుగల వేఁపచెట్టు చెక్కకషాయ మెటువంటి జ్వరములనైనను రాకుండ నిలిపివేయునని చెప్పఁబడినది. ఆంధ్రదేశమున గ్రామదేవతలను వేపచెట్లక్రిందఁ బ్రతిష్టింతురు. వేఁపకఱ్ఱబల్లలకుఁ జెదలుపట్టవు గాన వానితో భోషాణఁపుఁబెట్టెలు, పుస్తకములనుంచు బీరువాలు జేతురు. మశూచకము, వేఁపపువ్వు, ఆటలమ్మ యనంబడువ్యాధులు వ్యాపించి యితరుల కంటకుండ వేపాకుల నటనుంచియు, నలుగిడియు వాడుదురు. మఱియు మనదేశమున గ్రామదేవతలకు వేఁపకొట్టచిహ్నము. వేఁపగింజలను వేయించి కొన్నిపచ్చళ్ళయందుఁ బరిమళమునకై తాలింపు లిడుదురు. ఆంధ్రదేశమున సంవత్సరాది (ఉగాదిపండుగ) దినమున నింబకుసుమ భక్షణము (వేఁపపూవుపచ్చడిందినుట) విధింపఁబడినది. వేఁపచిగుళ్ళు, కుష్ఠువ్యాధిని పురాణజ్వరములను వరుసజ్వరములను నివారించునని చెప్పఁబడినది.

నూఱుసంవత్సరములవయస్సుగల వేఁపమ్రానును మొదట నొకపాటిరంధ్రముతొలచి యం దప్పుడే వండి చెమ్మగిలనియన్నమునునింపి వేఁపకఱ్ఱతోడిచ్చి కొట్టి బిగువుగ మూఁతవైచి, గాలిపోకుండ నావు పేఁడ యలికి యుంచుచు, సరిగా నొకసంవత్సరముంచి కడదినమున తీసిన లోనియన్న మెట్టబడి యుండుననియు, దానిని తోడనే యెండించి భద్రపఱచుకొని పూటకుఁబావుతులమెత్తుచొప్పుననలుఁబదిదినములు లోనికిచ్చిన కుష్ఠురోగము నివర్తించునని యుఁజెప్పఁబడినది. మఱియు ముదురువేఁపచెట్లు తమంతతామే పగిలి యందుండి రసము గారనారంభించునదనున నారసముఁదీసి భద్రపఱచుకొనిలోని కిచ్చిన జ్వరములు, పైత్యవికారమును నడఁచి శరీర రక్తమును శుభ్రపఱచునని చెప్పఁబడినది.

వేఁపజిగురు మేహశాంతి, పైత్యశాంతిఁ గల్గించి గ్రహణి, రక్తగ్రహణి, సంగ్రహిణి మొదలగు సమస్తవిరేచనములు కట్టుననియు, వేఁపనూనె మిక్కిలి కాకఁజేయుననియు, పైన రాయుటవలన రసికాఱుపొక్కులు, విషఁపుఁబొక్కులు, దురదలు మొదలగుచర్మవ్యాధులు, వాతఁపునొప్పులు, మేహవాతఁపునొప్పులు, పక్షవాతపునొప్పులు, ఎగుపులు, చుండు, పేలు, పశువుల గుఱ్ఱములవ్రణములు

మానుననియు, వేపపండులోనిగుంజు నేత్రరోగములు, గాయములు, మూలశంక, మూత్రరోగములు నడంచి వీర్యమునకుఁ బలువఁజేయుననియు, వేపచెక్కరసకషాయములు బలమగు పైత్యరోగము, మేహము, చర్మవ్యాధులు, కుష్టు, దురద, వ్రణములు, శీతపైత్యము, విరేచనములు, విషమజ్వరముల నిర్మూలించుననియుఁ జెప్పఁబడినది. అనుదినము వేపపుల్ల దంతధావనము చేయుచుండిన పైత్యమడంచి నిరోగశరీరిగఁజేయునని చెప్పఁబడినది.

౨ తీయవేపకు, చల్గోజా యని హిందీభాషా పదము. దీనపిక్కలలోని పప్పుపలుకులు తీయగనుండును. మిక్కిలిబలము, నించుక పైత్యముఁ జేయును. ఇది ఫలహారముల కుపయోగింపఁబడుచున్నది. ఈచెట్లు మనదేశమునఁ గానరావు.

3 కరివేప—ఇది ప్రసిద్ధవృక్షము. దీనియాకును పరిమళమునకై కూరలుమొదలగు వానియందుఁ దాలింపుపై చెదరు. (కరివేప చూడుఁడు).

౪ పెనువేపచెట్టు— దీనిని పెద్దమాను, పింయ్యాత, గండుగ మొదలగుపెక్కువాడుక నామములచేఁ బిలుతురు. దీనిచెక్క వేరుల రసకషాయచూర్ణములు శీతజ్వరములు, సమస్తగ్రహణులు, అతిసారములు నివారించుననియుఁ జెప్పబడినది.

౫ నల్లవేపచెట్టు— దీనికి, కాయఫలచెక్కచెట్టని యుందురు. కాకజేయునది. శరీరముపైఁబూసిన నెఱుపై పొక్కుఁజేయును. వైద్యులు ఔషధప్రయోగమున కుపయోగించుచుందురు.

౬ తురకవేప—దీనిని పారసీకదేశమునుండి మనదేశమునకుఁ గొనివచ్చినటుల బలమైన వాడుక గలదు. కొన్నిసీమలందుఁ బారసివేపయని యు దీనినందురు. దీనియందునను చేదువేపచెట్టుంబోలి యన్నిలక్షణములును, అన్నిగుణములును గలవు.

ఆకులరసము లోనికిచ్చిన క్రిమిని, మలమూత్రములను వెడలించును. స్త్రీల రుతురక్తమును వెడలించి ఋతుశూలల రాకుండ నాపును. సుఖసంబంధరోగములను, జ్వరములను అఁపును. వాతఁపుటుబ్బులను హరించుటయేగాకఁ దర్తారణమగు దుష్టబలముల నివారించును. ఆకులకషాయమపస్మారరోగమును నివారించును. విరేచనములు కట్టును. అపసగండమాలరోగముల నివారించును. చర్మవ్యాధుల నడంచును. మ్రానుచక్క, వేరుల రస కషాయములు పైత్యశాంతి, మేహశాంతి, నొసర్పి, లోనిమలమూత్రముల వెడలఁ జేయును. పుండ్లకుళ్ళు మాన్పును. గ[illegible]లం గరగించును. విషములవిఱచి నివారించును. తురకవేపపండునందు విషముండుంగాన లోని కీయరాదందురు. దీనిని పద్ధతులమేరకు యుపయోగించిన గుష్ఠు, గండమాల, మొండికఱుపులు, అంటువ్యాధులని[illegible]రింప నగునని చెప్పఁబడెను. [illegible], అంటువ్యాధుల దరిఁ జేరనీయవనియు, మేహవాతఁపునొప్పుల నిర్మూలించఁదగిన దగిన వనియుఁ జెప్పఁబడినది. దీనిజిగురు ప్లీహరోగములు నివారించునందురు. దీనివిత్తులనూనెకుఁ జేదువేపనూనెగుణములు గలవని చెప్పఁబడినది. (నేలవేము చూడుఁడు).

చేదు వేపచెట్టు. లా. malia Azodirachta ఆంగ్ల. margosa అనియు Indian Lilac. chalgosa అనియు Indian sweetLelac.

తీయ వేపచెట్టు. లా. corchorus capsularis అనియు Bergera koenigh ఆంగ్ల. Curry Leaf tree

కరివేప చెట్టు. లా. ailanthus Excelsa. ఆంగ్లపదము తెలియదు. పెను వేప లేక పింయాప, లేక పెద్దవేపచెట్టునకు వర్తించుపదములు.

తురకవేపచెట్టు. ఆంగ్ల. Persiam Lilac.

ఇంక సంస్కృతమున అరిష్టః, నింబః నింబకః, నియమకః, పిచుమందః, పిచుమర్దః అనుపదములు చేదువేపచెట్టునకును సురభినింబ, అను పదము కరివేపచెట్టునకును, నింబరకః అనుపదము పెద వేప లేక పెద్దమ్రాను లేక పింయాప చెట్టునకును, కట్ఫలం, కుంభీవృక్షః, కృష్ణనింబః, భూతికః అను పదములు నల్లవేప (కాయఫలచెక్క) చెట్టున కును వాడఁబడినవి.

౧ నేలవేము, ౨ చేదువేప, 3 తురకవేప, ౪ కరివేప, ౫ పెనువేపలకు నింబ పంచకమని యాయుర్వేదవైద్యశాస్త్రమునఁ బేరుకలదు.

**వేఁపపువ్వువ్యాధి:**—వేఁపచెట్లు పూచు కాలమున నీవ్యాధి తెఱచుగఁ గల్గుచుండుంగాన దీనికి 'వేఁపపువ్వు' అనిపేరయ్యెను. ఇది మశూచి కము, ఆటలమ్మలవంటి వ్యాధియే. మశూచిక మంత యపాయకరమై, తీక్ష్ణమైనవ్యాధికాకున్నను, కొంతవఱ కపాయకరము, బాధకరమునని చెప్ప వలెను. ఇది అంటువ్యాధి. శరీరమునకుఁ దగిలిన పిదపఁ బది లేక పదునాలుదినములలోఁ బైకిఁ గ న్పించును. జలుబు, నేత్రములుబరువు, ముక్కు బరువు, పడిసెము, జ్వరము, తలనొప్పి, ఒక్కొ క తఱి దగ్గు, వమనములు కన్పించి యీవ్యాధి ప్రారంభమగును. సర్వసాధారణముగ ముఖ ముపై పేసినట్లుగుపడి పాదములవఱకుం గ్రిందికి దిగుచు వ్యాపించి మాడి వదలిపోవుట సహజల క్షణమైనను, ఒక్కొకతఱిఁ గాళ్ళపైఁ బ్రారంభించి ముఖమువఱకుఁ బై కెక్కుచు వ్యాపించి తిరుగ క్రిందికిఁ దిగుటయుఁగూడఁ గలదు. ఇంకను గొం దఱకు మూఁడుపర్యాయములు ఎక్కుట, దిగుటఁ గూడ సంభవించుట కలదందురు.

అతివేగముగ నితరుల కంటువ్యాధి గాన జాగ్రతంగొని రోగిని ప్రత్యేకముగ వేఱుగదియం దుంచుట సముచితము. మూఁడువారములవఱకుఁ గూడ నిట్టి జాగ్రతం గొనుట మంచిది. ఇటీవలి పరిశోధనలవలన రోగికిఁ జల్లనిగాలి తగులునట్లు కిటికీలఁ దెఱచియుంచుట యపాయకరమనియు, Broncha pereumonia సంభవించినను సంభవించనోపుననియు, ద్వారముగుండ లోనికి వచ్చెడిగాలి చాలుననియు నాంగ్లవైద్యులు గ్రహించిరి. లఘువైనభోజనము పథ్యము చాలు ను. శైత్యపదార్థములు తగవు. విశ్రాంతియెక్కువ కావలయును. గుండెలపైఁ బ్రారంభించి యీవ్యా ధికి జర్మన్‌మూజిల్సు అనెదరు. దీనియందు గొం తుకనొప్పి యుండును. శరీరమునం దంతటను తట్లుతేలినటుల దద్దుకులుగఁ గనఁబడుట నిద్దానికిఁ దట్లమ్మవా రని వాడుకగల్గెనఁట. దీని సూక్ష్మ జీవింగూర్చి సరిగా నిరూపింపఁబడలేదు. అయిదు లేక పంద్రెండువత్సరములబాలురకుఁ దఱచుగను, పై వయస్సువారి కరుదుగను తగులుచుండును. దీనివ్యాపనమునకు రోగి సామీప్యము, అతని బట్టలు, పాత్రలు సంపర్కమేగాక గాలిద్వారా యీసూక్ష్మజీవులు పోయి వ్యాపించునటులఁ జేయుటఁ బరిశీలింపఁబడినది. ఇంకను ఈవ్యాధి గల్గి యూపిరితిత్తులు విషపూరితమై కార్జములం టుటయుఁ గూడఁ గల్గుటకలదు. అతిసారము కల్గు చుంటయుఁ గలదు. ఒకసారి యీవ్యా తఱచుగ తిరుగఁగలుగదని వాడుకఁ గలదు గాని తిరుగ నీవ్యాధియంటు సదర్శనము లున్నవి. (అం టురోగములు, సూక్ష్మజీవులు, మశూచికము, ఆటలమ్మవ్యాధి చూడుఁడు.)

**వే బిల్లు (Way Bills):**—వాణిజ్యసంబంధపరిభాషాపదము. ఒకపల్లెపకం పెనీవారిపనిగా [ఓడలు], రైళ్లు మొదలగువాట్లపై గొంపోఁబడిన passingers goods మొదలగువాట్ల తప్సీలు జాబితాల కీపేరు వాడెదరు.

**వేమనకవి:**—ఈమహాయోగి క్రీ. వె. ౧౫ ౧౬ శతాబ్దములనాఁటివాఁడని పరిశీలకు లభిప్రాయభేదములం గల్గియున్నారు. బ్రౌన్ పరిశీలకుఁడు ౧౭ శతాబ్దమువాఁడని తెల్పియున్నాఁడు. అనంతపురంజిల్లా కదిరితాలూకా లోని కటారు పల్లెయే యీయన జన్మస్థలమును, మృతిఁజెందిన తావుగూడనని యనెదరు. ఇట నీమహాత్ముని సమాధియు, ఈయనవిగ్రహము కలదనియు, నచటనే యొకగృహమున నీయన వాడుచుండిన వస్తువులు కొన్ని కలవనియు, వీటిని వీరిసంతతివారు పూజించుచు నుత్సవములం జరుపుచుందురనియు, కేంబెల్ పండితుఁడు వివరించియున్నాఁడు.

వీరు రెడ్డికులజులని బలమగు ప్రతీతి కలదు. మహాజ్ఞానసంపన్నుం డగుట నజ్ఞులకు ప్రపంచవిరాగియు, విముఖుండు నగు నీయన వెఱ్ఱివానివలె తోఁచిరేమో 'వెఱ్ఱివేమన్న' యని వాడుక సాగించిరఁట. ఈయన బహుశః జంగమదేవరల శిష్యుఁడుగా నుండెనేమో! బ్రౌనుపండితుఁ డీమహాత్ముని జంగమజాతికిం జెందినవాఁడని యభిప్రాయపడి యుండనోపు.

ఈజ్ఞానసంపన్నుని సమాధికడఁ బూజించు కుటుంబము పాకనాటిరెడ్లగుట జన్మతః ఈయనయు నాతెగకుఁ జెందినవాఁడా యని తోఁచెడిని. కాని కడపజిల్లా పంటరెడ్లలో వేమనయోగి తమ తెగకుఁ జెందినవాఁడని ప్రతీతి కలదు. వేమనపద్యము లైదువేలకుఁ బైగా నున్నవని విందుము. ఇందు వాడఁబడినపదములు అనంతపురము, కడప మండలములఁ దఱుచు వాడుకయందుంట నాప్రాంతవాసిగ స్ఫురించెడిని.

వేమనపద్యము లాత్మబోధగ 'విశ్వదాభిరామ వినరవేమా' యను మకుటయుత్తమై దనరారుచున్నవి. ఇటీవలిపరిశీలకు లీపద్యము లన్నియు నీయన రచించినవి కావనియు, నీయనభక్తులు కొందఱీయనను సంబోధించుచున్నుఁ గొన్ని ప్రక్షిప్తపద్యముల నందుఁ జేర్చియుందు రనియు నభిప్రాయపడుచున్నారు. వేమనకవిత్వము స్వతంత్రమ్ము, స్వాభావికమైనది. కొండంతను గోరంతగ నిమిడ్చి చక్కఁగ బోధపడునట్లుఁ జెప్పఁగలశక్తి యీయన కథకము. ఆటవెలఁదిపద్యము లీయనకుఁ బెట్టినదిపేరు. వీరిపద్యము లాంధ్రభూమియందే గాకఁ గన్నడదేశమునకును వ్యాపించియున్నవి. వీటికి వ్రత, ఉపవాస, పూజ, యజ్ఞ, తీర్థయాత్ర, సన్యాసవేష, వేదపారాయణ, పురాణపఠనాదులందు నమ్మకము లేదని యీయనపద్యములనుండి తెలియుచుండెను. హేమతారకవిద్యయు, వైద్యవిద్యయు వేమనయోగి యెఱింగినవాఁడని తెలియుచున్నది. ఈమహాయోగి శార్వరినామసంవత్సర చైత్రశుద్ధనవమిదినమున సిద్ధిఁబొందెనని చెప్పుచున్నారు. జీవించియున్నకాలమున నెవ్వరేని బలాత్కరించినంగాని భుజించువాఁడుగాకుండె నందురు. జనసంఘమునఁ జేరక దూరముగనుండ నిచ్చగించుచుండువాఁడఁట. ఐన నెవ్వ రెన్నిప్రశ్నల నడిగినను విసుఁగుఁజెందక సమాధానము లిచ్చుచుండువాఁడఁట.

**వేమన్న చెప్పింది వేదము కాదన్నవాఁడు గాడిద:**—

[ఆంధ్రలోకోక్తి.]

**వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యకవి.**—ఆంధ్రకవులలో నాధునికులందుఁ

బరిగణింపఁబడినవాఁడు. నియోగి. ఆరాధ్యబ్రాహ్మణుఁడు, శైవుఁడు.

గుంటూరుజిల్లాలోని యమరావతీ పట్టణము రాజధానిగ రాజ్యమేలిన వాసిరెడ్డి వేంకటాద్రి ప్రభునిసోదరపుత్రుఁడగు చంద్రమౌళీశ్వరప్రభువు ప్రోత్సాహంబున నహల్యాసంక్రందనవిలాస మనెడి, యైదాశ్వాసముల ప్రబంధము రచించి, యాతనికిఁ గృతియిచ్చెను.

## వేముగంటి దత్తోజీపండితుఁడు:-

ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడిన వాఁడు. ద్వైతమతస్థుండగు మహారాష్ట్రమధ్వుఁడో లేక కన్నడమధ్వుఁడో సరిగాఁ దెలియరాకున్న మధ్వబ్రాహ్మణుఁడు. హారితసగోత్రము. తండ్రిపేరు నాగోజీ. తల్లి నాగమాంబ. ఆపస్తంబ సూత్రము.

ఇతఁడు భగవద్గీతాయోగశాస్త్రమును పద్య కావ్యముగ రచించి 'కృష్ణార్జునసంవాద' మనియు, 'యోగశాస్త్ర' మనియు పేర్లు వాడుకఁగల్పించెను.

## వేములవాడగ్రామము:-

దీనింగూర్చి భేదాభిప్రాయములు కలవు. ఘనతవహించిన నిజాంప్రభువురాజ్యమునందుఁ గరీమ్నగరు మండలమున నొకవేములవాడ కలదు. అది కరీమ్నగరము నుండి ౨౫ మైళ్ళదూరమునం దున్నది. ఇటఁగల భీమేశ్వరాలయము తొల్లింట ద్రాక్షారామ మనునటవీప్రదేశమునం దుండినకతన ద్రాక్షారామ భీమేశ్వరశివలింగ మనుపేరునఁ బరఁగుచుండెననియు నాభీమేశ్వరప్రసాదలబ్ధజన్ముఁడై వేములవాడభీమకవి జన్మించి, భీమేశ్వరపురాణాదిగ్రంథముల రచించియుండెననియు, నిపు డాద్రాక్షాటవి పోయి దేవళ మటులనే నిలచియున్నదనియు, సచటవారనెదరు. దీనినే సుప్రసిద్ధపరిశీలకులగు వల్లూరిశీతారామారావుపండితు లభినవ సరస్వతీపత్రికయందు వ్రాసియున్నారు.

ఇదియిటుండఁ దూర్పుగోదావరీమండ లాంధ్రులేకగ్రీవముగఁ గాకినాడపరిసరముల రామచంద్రపురముతాలూకాలోని ద్రాక్షారామగ్రామమునఁ గల భీమేశ్వరదేవస్థాన మీద్రాక్షారామ మనియు, నాదేవునివరప్రసాదలబ్ధుండై వేములవాడ భీమకవి జన్మించినవాఁడనియు, నటకుఁ గొన్నిమైళ్ళ దూరమునం గల 'వేములవాడ' యనుకుగ్రామ మామహాకవినివాసగ్రామ మనియు, పల్కుచుందురు. ఇంకం గొందఱు గోదావరీమండలాభిమాను లీద్రాక్షారామము నింతటితో నుంచక నిది దక్షయజ్ఞము జరిగిన ద్రాక్షారామ మని వాదించువారుం గలరు. కాని, యిట దక్షయజ్ఞస్థలము, సతీగుండము, త్రిశూలము, కంకాళము మొదలగు తావుల ఆనవాళ్ళుగల హరద్వార కంకాళమునందు యానవాళ్ళిటఁ గానరాకున్నవి. ఇంకను నీతావు నదీతీరమును గాదు. ఇట నొకపాటి చిన్నసరస్సు భీమేశ్వరాలయముప్రక్కనే కలదద్దానికి సప్తగోదావర మనిపేరిడి వాడుచున్నారు. కాని, యిటీవలఁబరిశీలన లీదేవస్థానము తూర్పుచాళుక్యులనాఁ డేర్పడినదని పరిశీలనలు బయల్వెట్టుచున్నవి.

ఈస్థితిగతు లిటుండ మహాకవి శ్రీనాథుఁడు (కవిసార్వభౌముఁడు) తనభీమఖండమును రాజమహేంద్రవరమున రాజ్యమేలిన వీరభద్రారెడ్డి యాస్థానపండితుఁడుగ నుండుతఱి నారాజ్యమున మంత్రిపదవియందుండిన బెండపూడి యన్నయమంత్రికిఁ గృతినొసంగెను. అందు శ్రీనాథుఁ డీద్రాక్షారామభీమేశుని నగస్త్యుఁడు వ్యాసుఁడు దర్శించినటుల వ్రాయుచు నగస్త్యుఁడు కాశీనుండి బయలు దేఱి వెడలివచ్చుచు వింధ్యుని వంగున ట్లొనర్చి

వచ్చి ద్రాక్షారామభీమేశుం దర్శించినటుల వివరిం చినయీచరిత్ర వింతఁ గొల్పకపోదు. చాళుక్యభీమ నృపాలునిచే నీదేవస్థానము ప్రతిష్ఠింపఁబడినటులఁ దెల్పుశాసనములు దీనికె ట్లన్వయించునో పరిశీల కులు జాగ్రతగాఁ బరిశీలించవలసియుండును. కాని వేములవాడ యిక్కాలమున బీదగ్రామమై యు న్నది. ఇతరములగు నానవా ళ్ళిటఁ గానవచ్చుట లేదు.

## వేములవాడ భీమకవి:—

ఆంధ్రకవు లందుఁ దొల్లింటికవులలోఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. సోమన యనునాతఁడు మరణించినతరువాత నాతనిభార్యకు ద్రాక్షారామ భీమేశ్వరస్వామి యనుగ్రహమునఁ గల్గిన సుతుఁడు.

ఈకవిచరిత్రయంతయుఁ జాటుధారపద్యసహిత ములగు పుక్కిటిపురాణములతో నిండియున్నది. అందుఁ బెక్కులు కల్పితములై యొకటికొకటి సందర్భపడకయుంట నిదమిద్ధమని వ్రాయుటకు వీలుగాకున్నది. ఈతనికాపురము వేములవాడ యనియు, నిది ద్రాక్షారామయందలి భీమేశ్వర క్షేత్రమునకు సమీపమనియుం జెప్పఁబడినది. ఈ వేములవాడ గోదావరీమండలములోని కాకినాడకు సమీపమునందున్న వేములవాడ యని గురజాడ శ్రీరామమూర్తి పంతులుగా రభిప్రాయపడియు న్నారు. ఆంధ్రులచరిత్రవ్రాసిన చిలుకూరి వీరభద్ర రావుగారు దీనినే యంగీకరించిరి. సుప్రసిద్ధపరిశీలకు లగు జయంతి రామయ్యపంతులుగారు వేముల వాడ గోల్కొండతాలూకాలోనిది గాని, గోదా వరీ మండలములోనిది కాదని యభిప్రాయపడిరి. ఏది యెట్లున్నను తనది వేములవాడ యనియు, తాను భీమేశ్వరవరప్రసాదిననియు కవియే చెప్పు కొనియుంట సత్యమనియే యందరియభిప్రాయమై యున్నది.

ఈతనికాలమును నిక్కమై సంశయగ్రస్తమై యు న్నది. చాటుధారలధోరణి దేనికథ దానికేగాని యొకదానితో రెండవది సమన్వయింపకున్నది. నన్న యభట్టారకుఁ డీతని తనగ్రంథముల నుతింపకపోవు టం జేసి యంతకుఁబూర్వుఁడు కాఁడని తోఁచెడిని, కళింగగంగుప్రభుని కాలమువాఁడని యొకరీతిని, పోతనృపునికాలమువాఁడని (గుణ్ణఁపుఁ దగాదా) యొకరీతిని, సాహిణిమారసేనాని కాలమువాఁడని (యుద్ధఁపుఁదగాదా)యొకరీతిని, బడబానలభట్టుకుఁ దర్వాతివాఁడని యొకరీతిని తేలుచుండుట నీతని కాలము నెఱుంగుటయు దుస్సాధ్యమే. ఎక్కువ పరిశీలనలంజేసి, రా. బ. కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమకవులచరిత్రయందు క్రీ. వె. పదునాల్గవ శతాబ్దమువాఁడనియు, నందు బహు శః ౧౩౮౯—౧౩౨౦ కాలమునాఁటివాఁడనియు నభి ప్రాయముం దెల్పియున్నారు. ఈతనితల్లియే యీతనికి విద్యాగురువఁట. ద్రాక్షారామ భీమేశ్వ రస్వామి శాపమహిమయు, విద్యయుఁ గవిత్వశక్తి యు, నీతని కనుగ్రహించెనని చెప్పఁబడినది.

ఈతఁడు కేవలచాటుధారపద్యములల్లి కవియని పించుకొనినవాఁడు గాఁడనియు, నట్లయినచోఁ బూర్వకవు లీతని తమగ్రంథప్రారంభముల నుతించ రనియు, వీరేశలింగంపంతులుగా రభిప్రాయపడిరి. నిజమున శ్రీనాథాదిగ తర్వాతికవులు, పెద్దకవులు సహా తమగ్రంథాది నితనిని సంస్మరించియున్నారు. కాని యీమహనీయుఁడు రచించినగ్రంథములు బయల్పడుటలేదు. ఈతఁడు తిట్టుకవియని వాడు కయుఁ గలదు. అనేకు లీతని కవిరాక్షసుఁ డని చెప్పుచుండిరఁట. (కవిరాక్షసుండని పేరుగల వేఱొ కకవియుం గలఁడు).

ఇంక నీతనిగ్రంథములును సరిగా బయల్పడుట లేదు. భీమఛందమని వాడుకనామముఁగల 'కవి

జనాశ్రయ' మీతండు రచింపనేలేదని రా. బ. కందుకూరి వీరేశలింగం పంతులుగారు తేల్చివేసిరి. ఈతని నృసింహపురాణమునను నట్లే యున్నది. భీమన వ్రాసినటుల నొకానొకకవి తెనిఁగించిన ధానిలో యెవరోయొకకవి తనగ్రంథాదిని "అన్న మంతా సున్నముగావలెను; పప్పలన్నీ కప్పలు గావలెను" అని భీమకవిపల్కిన నట్లే యెన్నో మాహాత్మ్యములను వివరించిరి గాని, వీరిచరిత్రము బయలుపెట్టుట కనుకూలించునట్లు వ్రాయలేదు.

భీమన బసవపురాణము రచించెనని కొందరనె దరు. ఇందుఁ గడపటిపద్యముల శాలివాహనశకము ౧౨౫౧ సౌమ్యసంవత్సర శ్రావణ బ ౧౦ గురు వారమున నాగ్రంథము ముగింపఁబడినటుల చెప్పఁ బడెనఁట. అది కన్నడగ్రంథమఁట. ఇది క్రీ. వె. ౧౩౬౯ సంవత్సరమునకు సరిపోవును. గాన నతఁ డాకాలమునాఁటివాఁడేమొ.

ఇతని బసవపురాణఁపుఘోరణి 'ఉద్దండలలిత ధారాళ కవిత్వ' మని పొగడఁబడినది. శ్రీనాథమహా కవి కాశీఖండమునఁ దన్నుఁగూర్చి వీరభద్రనృపా లుఁ డనినటుల "సీ॥ వచియింతు వేములవాడభీమన భంగి నుద్దండలీలల నొక్కమాటు" అని చెప్పి యున్నాఁడు. దీని నుద్దండమతి యని యందురట. ఈగ్రంథము గానరాకున్నది. ఏది. యెట్లున్నను వేములవాడ భీమన గొప్పకవిగా నందఱు విశ్వ సించుచున్నారు. ఈతనిమహిమలు చదువరులే తీర్మానించుకొనఁ దగినవి.

## వేరియోమీటర్ (Variometer):—

లాటినుజన్యము. అయస్కాంతము మొదలగువాని యొక్క యాకర్షణగుణములను కొలుచు పరి కరము.

## వేరుసెనఁగ వ్యవసాయము:—

ఇది పల్లఁపుభూములందు నాటి నీరుగట్టి పండించు పల్లఁ పుఁబంటయు, మెరకగరపభూములందు నాటి పం డించు మెట్టపంటయు నని రెండుభేదజాతులుగ నున్నది. పల్లఁపు వేరుసెనగపంట యాంధ్రదేశమునకు, నాప్రాంత పరిసరదేశములకు నమరక సరిపోనిదిగ నుంట దానిని వదలి మెట్టవేరుసెనగంగూర్చి యోచించుట సమంజసము. ఇంచుమించు శనగలంబోలిన రుచిగల కాయలను (లోనిగింజలనని భావము) చెట్టుయొక్క వేరునందు కాచునుగాన దీనికి వేరు సెనగయని పేరమ్యెను. ఇది యిటీవల భరత దేశమున నారంభింపఁబడినది. లాభ మధికముగు పంట గాన నతిత్వరితముగ దేశమంతటను వ్యాపించి రైతులమనంబుల నాకర్షించుచున్నపంట.

గరపనేలలు, ఇసకగలసిన యితరమట్టిగల గుల్లనేలలు, చులకనినేలలు, ఈపంటకు ముఖ్యములు. బంకమట్టినేలలం దిది చక్కఁగాఁ బెరిగినను వ్రేళ్ళయందుఁ గాయలం గాచునదిగాన చెట్లను బీకుతరి కాయలు భూమియందు బిగిసికొని రాకపోవుటనుండి నష్టము కల్గుచుంట బంకమట్టి భూములు వేరుసెలగవ్యవసాయమునకుఁ దగవనియే చెప్పవలయును. మెరకలై చులకనైన గరప యిసుకభూములం దటులగాకఁ బీకివైచిన చెట్లతోఁ గాయలును లేచివచ్చును. కొంచెముకాయ లుండి పోయినను గొప్పదగ్గివ్వి తీసికొనఁగల్గునుగాన నీ పంట కట్టిభూము లర్హములని చెప్పఁబడినది.

వేరుసెనగపంటకుఁ గాలమానస్థితియుఁ గూడ ముఖ్యమైనది. ఇప్పు డాంధ్రదేశమున నెక్కువ వాడఁబడుచున్న మోరిషసుజాతి వేరుసెనగపంట నాలుగుమాసములకాలము పంటయని చెప్ప వచ్చును. కొన్నిపరిస్థితుల దైదుమాసములకుఁ బంటకువచ్చెడిని. మొదటి రెండుమూఁడుమాస ములదనుక కొంచెముపదునుండిన చాలును. ఇత

రిని చిన్నవర్షము లుండినను, లేక భూమియందుఁ జెమ్మనిలుచునటుల నితరవీళ్ళు కుదిరినను చాలును. పూతపూఁచి కాయలేర్పడునదనున నెండలుండు టీపంటకుఁ జాల శ్రేయస్కరము. కడసరి రెండు మాసములందుఁ గొద్దిపాటివర్షమున్నను దీనికిఁ జాలును. ఈపరిస్థితుల కనుకూలించుకాలము నెఱింగి యీవ్యవసాయము నెఱపవలసియుండును. అనఁగా వర్షపరిస్థితుల నెఱింగి యదనున నీవేరుసెనగ నాటఁదగును. మఱియు మొక్కలు చిన్నవిగనుండుతఱి పెద్దవర్షములు పడినచోఁ జెట్టుపెరుగకచాలనష్టము కల్గెడినని కనిపెట్టఁబడినది.

ఈవ్యవసాయమునకుఁ గలుపు కడువిరోధిగాన విస్తారముకలుపు లేవకుండుటకు దుక్కులు చక్కఁగాఁ జేయుట విధియైయుండును. కలుపు విస్తారము పెరిగిన పంట సరిగా నుండదు. కడపటిదుక్కికి ముందుగా ఎరువు వేయవలయును. మంద లాపుటయు, ముక్కి పాతబడినపేడగెత్తము వైచుటయు, కడులాభకరమగు పంటను గల్గించునని చెప్పఁబడినది. బూడిద, ఊరిలోనిపెంట, అనుకూలములు. యకరమునకుఁ బదిబండ్ల యెరువు వేయవలయునందురు.

విత్తనములు కాయలతో నిల్వయుంచుకొనవలయును. భూమియొక్క తీరుంబట్టి చెట్టుపెరుగును గాన, ప్రతిమూఁడవచాలులోను తొమ్మిదంగుళముల కొకమొక్క యుండునటుల విత్తనములను నాటవలయును. యకరమునకు 30 లేక 33 చెన్నపట్టణఁపుఁ బడుల విత్తనము పట్టునని యంచనా వేయఁబడినది.

వేరుసెనగపంట కైదుమాసములు పట్టును. దక్షిణార్కాడు మొదలగు కొన్నిదక్షిణజిల్లాలలో వేరుసెనగతో నంతకన్నఁ ద్వరితముగ పంట దేలు కొన్నితేలికపంటలం గల్పి వైచెదరు. వాటిని ముందుగఁ దీసివైచుకొని పిదప వేరుసెనగం దీసికొందురు. ఈపద్ధతి యెంతవఱకు మంచిదియో యింకను పరిశీలించవలసియే యుండును. ఏదియైనను గొప్పు తప్పనిసరిగా మనసునం దుంచుకొనవలసియుండుట తప్పదు. ఈసందర్భమున గొప్పు త్రివ్వుటకుబదులు మొక్కలులేని చాళ్ళందు దుక్కిని జాగ్రతగనడపుట చౌకయని కొందరు సూచించుచున్నారు. కాని కలుపులేని గుల్లమట్టియం దీమొక్కలు చక్కఁగ ఫలించెడిని.

పంటతేలిన సరియైనకాలము నెఱుంగుటకుఁ గాయతొడిమ లెంకుటయు, ఆకురాల నారంభించుటయు, కాయ నల్లనూదారంగ గుచుంటయు. లోనిపిక్క తెల్లరంగునుండిపైపొర యెఱ్ఱఁబాఱుటయు లక్షణములు. అతఱి నొకవర్షముపడిన చేను చులకనగాఁ దీసికొనవచ్చును. ఇవి యన్నియు భూమి, కాలమానము, చెట్లు మొదలగునవి పెరుగుట మొదలగు వాటింబట్టి యుండెడిని. దక్షిణార్కాడుజిల్లాయందు దాచేను దున్ని కాయలు నేరుకొనునాచారమును కలదు. పిదపకాయలను జక్కఁగ నెండించవలయును. సగటున నెకరమునందు 700 మొదలు 1200 వఱకు చెన్నపట్టణఁపుఁబళ్ళ కాయలు వచ్చునని చెప్పుదురు.

వేరుసెనగగింజలనుండి నూనెఁ దీయుదురు. పిండి నెఱువులక్రింద నుపయోగింతురు. చెట్టును పశువుల కాహార మిడుదురు.

నీరుఁగట్టి పండించు వేరుసెనగ యకరమునకు వెయ్యి మొదలు రెండువేలవఱకుఁ జెన్నపురిపడుల కాయలం బండునని చెప్పఁబడినది. శీతోష్ణస్థితులు, నీటిస్థితియు ననుకూలించినతావులందు మూఁడువేలపడులకాయలు పండుటయుఁ గూడఁ గలదఁట. (బాదము చూడుఁడు).

**వేర్ ది షూ పించెస్** (where the shoe pinches):—ఒకప్పు డొకరోమనుప్రముఖుఁడు తనభార్యతోఁ దనకున్నవివాహబంధమునుండి విముక్తిఁగోరి తగవుఁ దెచ్చెనఁట. చర్చయందామెపక్షపున్యాయవ్యాది యాతని, నిందించుచు నామెయందుదోషారోపణఁ జేయఁగలఁడాయనియు నామె రూపసియు, గుణవతియుఁగాదాయనియు, తీంద్రించుచుండ నామగఁ "డయ్యలారా, నాకాలిజోడు క్రొత్తదియే, అందమైనదియే, విలువఁగలదియే. అయిననునా కెక్కడఁ గఱచి బాధించుచున్నదో మీరెరుంగఁగలరా? అనుభవించినవారికే తెలియుట" యను దానినుండి యీయుక్తి జనించెనఁట.

**వేర్టెరిజమ్** (warterizm):— ఫ్రెంచి గెయిటీనవలలు నాటకములందలి ప్రధానపాత్రలబోలిన యుద్రేకప్రపూరితమగు కరుణాదిరసప్రధానసిద్ధాంతము.

**వేర్వేఱుశక్తులరూపాంతరములచే వేర్వేఱువస్తువులు రూపాంతరములం జెందినను జెందునుగాని ఉన్నదిపోనేరదు, లేనిది కలుగనేరదు**:—దీని నాంగ్లరసాయనశాస్త్రవిదులు Scientific truth అనిమెదరు. జర్మనుదేశమునను, ఆంగ్లదేశమునను గొప్ప రసాయన శాస్త్రజ్ఞులచే నిర్ణయింపఁబడిన ధర్మము. దీని నింకను గొందఱు 'Law of Conservation of energy' అనిగూడ వాడుట కలదు. "While all things Can be Changed in to other things by all forms of power nothings is made of nothing nor is any thing ever destroyed" "అనఁగా ననేక శక్తులయొక్క వేర్వేఱురూపముల నుపయోగించుచుఁ బలువస్తువులను వేఱువస్తువులు మార్చఁగల్గుతరి లేనిదానినుండి యేదియుం గలుగనేరదనియుం గలదేదియు నశింపఁబడ దనియు, యదార్థము నెఱుంగఁదగినదని భావము. ఇందు నిజమగు ధర్మము లేనిదెప్పటికిని లేనిదనియు, ఉన్నది నశింపబడదనియు, వేర్వేఱుశక్తులు వేర్వేఱురూపములుగ వాడఁబడుచు వేర్వేరు పదార్థములరూపములను మార్చఁగల్గిన మార్పనోపుననియు నైయున్నది. దీని కాంగ్లేయుండగు కెల్విన్‌ప్రభువు పరిశీలనలతో సంబంధము కలదని తెలిసెడిని.

**వేల**:—మేరువుకుమార్తె. సముద్రునిభార్య.

**వేలగోత్రము**:—
(భరద్వాజఉపగణము చూడుఁడు.)

**వేలనిగోత్రము**:—
(నిధృవగణము చూడుఁడు.)

**వేలవు**:—
(ఆక్షన్ చూడుఁడు.)

**వేలము వెఱ్ఱి**:—ఇది యాంధ్రభాషా సాంప్రదాయార్థపదము. నిజమున "ఏలమువెఱ్ఱి" యనియుండవలెనుగాని వాడుకయం దిట్లున్నది. ఏలముపాడుచుండుతరి దానివిలువం బాటింపక, ఒకరిపై నొకరు పోటీలకు ధరమెక్కించివేయుట ఏలమువెఱ్ఱియనంబడును. ప్రయోజన మెఱుఁగక పాటింపక పోటీల కొకరిపై నొకరు తయారగుచుండుటకు వేలంవెఱ్ఱి యందురు.

**వేలాయుధక్షేత్రము**:—
(అరియపాద చూడుఁడు.)

**వ్రేలిముద్ర లేక వేలిముద్ర** (Finger print):— మనుష్యుల సంతకమువలెనే యెడమచేతి బొటనవ్రేలిముద్రయు నానవాలు నిమిత్తము కొన్ని సందర్భముల వేయఁబడుచుండును. ఇది మనుష్యుల యానవాలు గుర్తించుటకై యున్నది.

చీనాదేశమున క్రీ. ము. ౨౦౦ సంవత్సరముల నుండియు వ్రేలిముద్ర వాడుకయందుండినటులఁ దెలియుచున్నది. ఐరోపాదేశములందు వ్రేలిముద్రలు నెఱుఁగకపూర్వము మనుష్యుల చహరాలను పోల్కి కొలతలను వ్రాయుచుండిరఁట. ఫ్రెంచి దేశస్థుండగు Bertillon Alphonse అను నపరాధపరిశోధకోద్యోగి నిర్మించిన బెర్టిలన్ సిస్టమ్ వాడుకయందుండెనట. కాని యిటీవల వ్రేలిముద్రలపద్ధతియే యెల్లదేశములందు నవలంబింపఁబడి యున్నది.

. ఆసియాఖండఁపు నైఋతిభాగమున మహమ్మదీయమతస్థులగు మహాత్ములగోరీయున్న స్థలముపైఁ గట్టఁబడిన కట్టడము లేక యాలయము. తెలుచు పైన నొకడోమ్ కట్టఁబడియుండును. దీనియావరణమున నుంచఁబడిన యేవస్తువునైనను దొంగలుసైతము తాకవెఱతురు. పాలస్తినాదేశమునందివి యధికముగఁ గలవు.

**వేల్ఫిష్టేరేవు**:— దక్షిణఆఫ్రికాయందు జర్మనుసౌతువెస్టుఆఫ్రికా యనునెడారి టెరిటరీకిఁ జేరిన భూమియందిది యొకరేవు. బ్రిటీషు ప్రభుత్వమువారిది. (జర్మను సౌతువెస్టాఫ్రికాయును, దక్షిణాఫ్రికాయును చూడుఁడు.)

**వేలూరుజిల్లా**:— అఱవదేశములోనిది. చెన్నపురిరాజధానికిఁ జేరియున్నది. రాయవేలూరు పురము ప్రధానపట్టణము. ఇట బొమ్మిరెడ్డిగారు నిర్మించిన దుర్గము కలదు. శ్రీకృష్ణరాయసార్వభౌముని పేరఁ బరఁగు పట్టణము. ఇచట నిత్తడిపనులు విశేషముగ జరుగుచుండియు నేతపను లధికముగాఁ గలవు. ఇట పోలీసుకాలేజీ కలదు. ధాన్యఁపుఁబంట యధికము.



**వేలూరు లేక (రాయవేలూరు)**:- దక్షిణదేశప్రారంభమున నుత్తరార్కాడు మండలమున వేలూరు ప్రధానపట్టణము. వేలూరన రావిచెట్లయూరని యర్థము. తొల్లి రావిచెట్లమధ్య వేలప్పాడి యనుచిన్నగ్రామ ముండెడిది. పట్టణము పెరిగి వేలప్పాడి వేలూరైనదఁట. ఒకప్పుడు శ్రీకృష్ణరాయ సార్వభౌముని రాజ్యమునఁజేరి రాయవేలూ రనిపేరయ్యెను. జనులలో నాల్గవభాగము మహమ్మదీయులు. పాలారునదీతీరమున సముద్రఁపు నీటిమట్టముపై నేఁడువందల యడుగుల యెత్తునఁగల యీపట్టణపరిసరములు పంట భూములగుట ధాన్యఁపువర్తక మిట బాగుగనుండును. వాసనకొఱకుఁ బూవులతోఁటలు పెంచబడి పూవులనమ్మువృత్తి కొంతవఱకు బాగుగనేయున్నది. ఈప్రాంతమంతయు, అంటుమామిడి, నారింజ, కొబ్బరి, ద్రాక్ష మొదలగు ఫలవృక్షములతోఁటలు విస్తారముగ నున్నవి.

పట్టణమునకుఁ దూర్పుదెసను ఆగ్నేయదిశనుండి వాయవ్యదిశగా ౫౦౦ అడుగులయెత్తుగల చిన్న కొండలు కలవు. అవి మూఁడుశిఖరములం గల్గి యున్నవి. అన్నావుల నొకప్పుడు మూఁడుకోటలం గట్టియుండిరఁట. అందు దక్షిణఁపునైపుకోట సజ్జారావుఘడమనియు, తర్వాతది గజ్జారావుఘడమనియు పేర్లం బరఁగుచుండెనఁట. ఈరెండును మహారాష్ట్రుల యధికారకాలమందలివి. మూర్తిఘుడమను మూఁడవచిన్నకోట మహమ్మదీయుల కాలమునాటిదఁట. ఇవి రక్షకసైన్యము లుండు దుర్గములు. ఇప్పుడు పడఁగొట్టఁబడినవి.

పట్టణముమధ్య బొమ్మిరెడ్డికట్టినకోట గలదు. ఈతఁడు భద్రాచలమునుండి వెడలఁగొట్టఁబడిన రాజకుటుంబమువాఁడగు రెడ్డి. అక్కాలమున నిట పాలకుండై యుండిన కలికాలచోడునియనుమతిం గైకొని యీకోటంగట్టి యందొక దేవాలయము నిర్మించెనఁట. దేవాలయగోపురముపై బొమ్మిరెడ్డివిగ్రహమని జూపుదురు. బొమ్మిరెడ్డి పశువులం బెంచి చాలధన మార్జించెననుటకన్న నాతనిం గూర్చి యేమియుం దెలియదు. క్రీ. వె. ౧౨౭౪ లో, కోటకట్టఁబడెనఁట. ఈప్రాంతములనే గల మాలయంప ట్టనంబడుగ్రామమునంగల దేవాలయమునందలి యొకశాసనముమేర కీకోట పదునాల్గవ శతాబ్దమునకుఁ బూర్వఁపుది కాదని తేలుచున్నది. ౧౭ వ శతాబ్దమునకుఁ బిదప గోడలపై భాగముపని జరగినట్టుల నిదర్శనములు కలవుగాన నిప్పుడగుపడుచున్నట్లు పని యొకసారి జరుగక మూఁడు సారులుగ జరిగి పూర్తియై యుండనోపు. రోము దేశఁపుఁ బనివాండ్రు కట్టిరని వాడుక గలదు.

ఈకోట క్రీ.వె. ౧౫౩౦ లో విజయనగరచక్రవర్తులకుఁ జెందియుండెను. పదునేడవశతాబ్దమధ్యమున వేలూరు బిజాపూర్ సుల్తానువశమాయెను. ౧౬౭౬ లోనే మహారాష్ట్రులు వానింశారఁద్రోలి దుర్గముఁగైకొనిరి. అత్తరి తుకోజీరావుసేనాని అబ్దుల్లాఖానునుండి కోటనుగైకొనెనని చెప్పఁబడినది. బదునేడవశతాబ్దాంతమున ఔరంగజేబు చక్రవర్తి సేనానియగు జుల్ఫికరాలీఖాన్ రెండుసంవత్సరము లీకోటను ముట్టడించుచుండెను. ౧౭౦౮ లో ఢిల్లీనుండివచ్చిన దావూద్ ఖాన్ మహారాష్ట్రులం దఱిమివైచి కోటంగైకొనెను. తరువాత నచిర కాలముననే సదాతుల్లాఖాను (ఆర్కాటునవాబు) వేలూరుకోటను తనసోదరుఁడగు గులాఁఆలీఖానుకొసఁగి, తా నార్కాటుపట్టణమును గట్టుకొని వేఱుగ వెడలిపోయెను. కాలము సరిగాఁ దెలియరాకున్నను నిరువదిసంవత్సరములు వేలూరుదుర్గము మూర్తాజాఆలీకి ఉనికిపట్టుదుర్గమై యుండెనఁట. నవాబుమహమ్మదాలీ ఆంగ్లేయసైన్యముల సహాయముంగొని మూర్తాజాఆలీని వేలూరుదుర్గమునుండి తఱిమివైచెను. క్రీ. వె. ౧౭౬౦ లో నాంగ్లేయసైన్యము లీకోట నాక్రమించి యుండెను.

క్రీ. వె. ౧౭౮౦ లో నీకోటముట్టడియందు హైదరాలీపేరు కన్పించుచున్నది. క్రీ. వె. ౧౭౯౦ లో మూఁడవమైసూరుయుద్ధమున కారన్వాలీసు ప్రభువు వేలూరుదుర్గమునుండియే ప్రయత్నములం గుదుర్చుకొని బెంగుళూరుపై దాడి వెడలెను. ౧౭౯౯ లో శ్రీరంగపట్టణము పడిపోయినపిదప టిప్పుసుల్తాన్ కుటుంబమువారి నీ వెల్లూరునందే యుంచిరి. టిప్పుసుల్తానుకు సుతులు పండ్రెండుగురనియు, కొమరితె లార్గురనియుఁ జెప్పఁబడినది. వా రీవెల్లూరుదుర్గముననే వసించిరి. వారిగోరీ లార్కాటురోడ్డువెపునఁ జూడనగును.

వేలూరుదుర్గమునఁగల దేవాలయము చూడఁదగినపనితనముఁగలది. ఒక మహమ్మదీయపరిపాలకుఁ డొక భోగమువనిత నీదేవాలయమున వధించెనఁట. నాఁడాదిగ నది వదలివేయఁబడిన దేవాలయమై యున్నదఁట. ఇది ౧౭ వ శతాబ్దాంతకాల మందురు. దీనిసమాధి కోటకొక యరమైలు దూరమునఁ గలదు.

వేలూరుకడనున్న వేలప్పాడియందుఁగల పాడుదేవళము బొమ్మిరెడ్డి యీకోటం గట్టకపూర్వముండిన దందురు. వేలప్పాడియందే కంకాలచోడ ప్రభువు వసించువాఁడఁట. వేలూరునం దిత్తడిపను లెక్కువగను, బట్టలనేత కొంచెముగను గాన్పించుచున్నది. కోటయందలి గృహములం దిప్పుడు కచేరీలు కలవు.

**వేల్స్వారి వేంకటేశ్వరకవి:**– ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. మౌద్గల్యసగోత్రము. తండ్రిపేరు బ్రహ్మయ్య. నివాసము విశాఖపట్టణ మండలములోని విజయనగర సంస్థానమునందలి రావివలస యనుగ్రామము.

ఈతఁడు గోవ్యాఘ్రచరిత్రము, విచిత్రరామాయణము పద్యకావ్యములుగా రచించెను. గోపీనాధకవిరచించిన యాంధ్రవచనరామాయణకథ ననుసరించి యీతఁడు విచిత్రరామాయణము రచించెనందురు.

**వేల్సుదేశపుఁ గౌంటీలు:**– తొల్లి యీ కప్పుడు వేల్సుదేశము 'కౌంట్సు' అను నుద్యోగ బిరుదనామముగల సామంతభూపతులచేఁ బాలింపఁబడుచుండినది. ఒకకౌంటు పాలించినదేశమునకు 'కౌంటీ' యనియు లేక 'షైరు' రనియుఁ బేరయ్యెను. నేఁటి కవి పరిపాలనావిభాగములై తనదేశపుజిల్లాలం బోలియున్నవి. వేల్సుదేశమున నిట్టి కౌంటీలు ౧౨ కలవు. (వేల్సుదేశము చూడుఁడు.)

ఉత్తరభాగపుఁ గౌంటీలనియు, దక్షిణభాగపుఁ గౌంటీలనియు, వేల్సుదేశము ద్వివిధముగనుండును.

| (ఉత్తరపుఁగౌంటీలు ౬) | (దక్షిణపుఁగౌంటీలు ౬) |
|---|---|
| ఆగ్లిసియా | కార్డిగాన్ షైరు |
| కార్నర్వాన్ | రెడ్నోరు షైరు |
| డెన్బిఘ్ షైరు | పెంబ్రోకు షైరు |
| ఫ్లింటుషైరు | కార్మార్థెన్ షైరు |
| మెరియోనెట్ షైరు | బ్రెక్నాకు షైరు |
| మాంట్గోమెరీ | గ్లెమార్గాన్ షైరు |

వెరశి పండ్రెండు కౌంటీలు.

**వేల్సుదేశము (wales):**—ఇది బ్రిటీషు ప్రభుత్వములోనిది. గ్రేటుబ్రిటన్ ద్వీపములోని భాగము. దీనిని బ్రిటీషుప్రభునిపుత్రుఁడగు (యువరాజు) Prince of Wales పేరిట నాయన Principality గాఁ జెప్పఁబడినది.

ఏఁడువేలనాల్గువందల యేఁబదిచతురపుమైళ్ళ వైశాల్యము. (ఇంగ్లాండుదేశము చూడుఁడు).

**వేవ్లెంగ్తులు (Wave Lenghts):**—
(రేడియోవైర్లెస్ చూడుఁడు.)

**వేసినదే ఒకగంతు, విఱిగినదే ఒక కాలు:**— (ఆంధ్రలోకోక్తి.)

**వేషాలన్నీ గ్రాసానికే:**-
(ఆంధ్రలోకోక్తి.)

**వ్రేళ్లు (fingers):**— మానవశరీరమునందు రెండుచేతులకు, రెండుకాళ్ళకు, కడలందు వ్రేళ్ళుండును. అవి యొక్కొకటి కై దేసిచొప్పున నుండెడిని. ౧ అంగుష్ఠము (బొటనవ్రేలు), ౨ తర్జని (చూపుడువ్రేలు), 3 మధ్యమ (పెద్దవ్రేలు), ౪ అనామిక (ఉంగరములవ్రేలు) దీనికిఁ దఱుచు నుంగరము లిడుచుందురు. కాని పూర్వకాలమున దీనికిఁ బేరులేకుండుటచే ననామిక యని పేరై యుండెను.) ౫ కనిష్ఠము.

కాళ్ళకు నిటులనే యైదేసివ్రేళ్ళుండును. వృక్షమూలములకును వ్రేళ్ళని పేరుగలదు. సర్వసాధారణముగా శరీరమందలివాటికి వేలు (బహువచనము వేళ్ళు) అనియు చెట్లయందుండువాటికి వేరు (మూలము) అనియు నందురు.

**వై అక్షరమునకుఁ జెందిన క్రైస్తవ పురుషనామములు:**—

Yates ఇది నవీనకల్పితపదము.

Yelverton ఇది నవీనకల్పితపదము

లకు రెడ్ (Red) రుష్యను లను పేరుగల్గుట లోకవిదితమే. అట్లు చేరక దానికి విముఖులైన వారిని 'White Russians' అనుచున్నారు. అట్టివారిలో నిరువదిలక్షలకుఁ బైగా స్వదేశమునం దుండలేక విదేశముల కరిగిరనియు నొక్క-పారిస్ నగరపరిసరముల రెండులక్షల కున్నారనియుఁ దెలిసెడిని. వారిదేశమున వ్యాపించియున్న ఫ్రెంచికల్చరు వారి నట కాకర్షించినదఁట. పెక్కం డ్రిదివఱకే ఫ్రెంచిదేశములను, అమెరికాసంయుక్త రాష్ట్రసీమలను, సిటిజన్షిప్పులఁ బడసియున్నారని విందుము. ఎచట నున్నను వీరు తమదేశమును వదలినప్పటివలెనే తమజాతీయతను, ఆచారములను, స్వభావనైజలక్షణములను వదలి యన్యాచారావలంబకులగునట్టి హీనతకుఁ బాల్పడక రష్యనులై నిలచియున్నారు. అటుల లేచివచ్చినవారిలో శ్రీమంతులు, భూస్వాములుగ నుండినవారు ధనికులగు బాంకరులు, వర్తకులు, వైద్యులు, విద్వాంసులు, పరిశీలకులు, న్యాయవాదులు, పెక్కు-వృత్తులవారు, చేతిపనులందు నేర్పరులు, వ్యవసాయమొనర్చువారు, నేతగాండ్రు మొదలగు వారు, పారిస్నగరపరిసరములు ప్రధానస్థానముగ ఫ్రెంచివారియాదరణ నంది, మోటారు డ్రైవరులుగను, ఎంజినీయరులుగను, యంత్రవేత్తలుగను, గుఱ్ఱపుఁబండ్లఁదోలువారుగను, ఇండ్లుకట్టువారుగను, నూతులం ద్రవ్వువారుగను, నౌకరులుగను, ఎల్లపనులందుఁ దామేయై యున్నారు. వీరి కెల్లరకు రష్యారాజకీయవేత్తలు నాయకులుగ నున్నారు. వీరు స్వదేశమున సుప్రసిద్ధులై, కడవఱకు బోల్షివిక్కు-లతోఁ బోరి నిల్వఁజాలక లేచివచ్చిన ధీశాలురు.

వీరికి పారిసుపరిసరములందు నూటయేఁబది సంఘసంస్థలు నాయకులచే స్థాపింపఁబడినవి. అవి వేర్వేఱువిధములఁ బనిచేయుచున్న వాట్లనుండి యెన్నుకొనఁబడిన ప్రతినిధులసంఘముచేఁ బరిశీలింపఁబడుచున్నవి. అందు Count kokovtzev (వెనుకటి ప్రధానమంత్రి) అధినాయకుఁడుగ నున్నాడఁట. విద్యాసంస్థలు, వివాహసంస్థలు, లైబ్రరీ సంస్థలు, పాఠశాలసంస్థలు నిందుఁ గలవు. వీరికి ముప్పదియైదు ప్రార్థనాలయములు గల వందలి బోధకు లుపాధ్యాయులుగ నుందురు. ఫ్రెంచిభాష నేర్పు నుపాధ్యాయులు కలరు. ప్రతిప్రార్థనాలయము పాఠశాలయే. వైటురష్యనులు ఫ్రెంచి భాషను శుద్ధముగను, చక్కఁగను మాటలాడ నేర్తురు. వీరికి ఫ్రెంచిసహాయము, సానుభూతి కలదు. పనిపాటలం గల్పింప ఫ్రెంచివారు సంసిద్ధులుగ నున్నారఁట. రష్యనులు కడు మర్యాదస్థులై కాలముఁబుచ్చుచున్నారఁట. వీరియందు రష్యాదేశమునఁ బ్రభుత్వము నెలకొల్పఁబడ నిచ్చగించు వారును, ప్రజాస్వామ్యము నెలకొల్పఁబడ నిచ్చగించువారును గూడ నిప్పటిఫ్రెంచిప్రభుత్వమునకు రష్యాదేశఁపు సోవియట్ప్రభుత్వముతోఁగల బాంధవ్యములం జక్కఁగ గుర్తించి, వాటికి వ్యతిరేక కార్యములు జరుగనీయక మెలఁగుచుందురఁట. అన్నిఁటికన్న నెక్కు-డుగ తమవారును, తమపిల్లలును, రెడ్రష్యనుల సాహావాసమున మాఱిపోకుండఁ గట్టుదిట్టములతో నధికజాగ్రతలం గొను చుందురఁట.

**వైట్ మేన్సు గ్రేవ్** (White man's grave):—(పశ్చిమాఫ్రికా చూడుఁడు)..

**వైట్ సెల్సు** (White cells of blood):—ఇవి రక్తమునందుండెడి రెడ్ సెల్సుతోఁ బోల్చిచూచిన వాటికన్న చాల తక్కు-వసంఖ్యాకములుగ రక మునం దుఁడునవి. ఏఁబదిలక్షల

రెడ్సెల్సు రక్తమునందుండిన వాటితో నెన్మిదివేల వైట్సెల్సుండునని పరిశీలకు లనెదరు. శరీరమునం దనారోగ్యము కల్గినతఱి నివి ప్రాణరక్షకములై యుండును. మఱియు నత్తఱి నివి యసంఖ్యాక ములై రోగకారణమైన మైక్రోబ్సు జంతువులం దినివేయుచు, నారోగ్యముంగల్గించ బ్రయత్నించు చుండునదియే యాంగ్లమున Natures healing power అని నాడుచున్నారు. పరిశీలించుతఱి వైట్సెల్సుగర్భమున మైక్రోబుపురుగు లగుపడు టతో దీనియుపయోగము బయల్పడెనుగాని, యంతకును న్నాలోపటివిధానమువారగు నాంగ్ల వైద్యు లివి శరీరారోగ్యమునకు నిరర్థకములని నిర సించుచుండిరఁట. ఒక్కొకతఱి వాటియందు రాతిఁణబొగ్గుపరమాణువులు మొదలగువన్యపదార్థ ములుగూడఁ గానఁనగుచుండును. పిదప దానిలోఁ గన్పడిన మైక్రోబు గానఁ పడకుండుటంబట్టి పెక్క రహస్యములు బయల్పడినవి.

వె టుసెల్సు, బ్లడ్ వెసల్సుగుండా నడిచి శరీర మున సంచరింపఁ గలవని కన్గొనంబడినది. దీనికి 'ఇమగ్రేషన్' అనుచున్నారు. శరీరమునందు గాయము తగిలి మైక్రోబ్సు, అందుఁజేరుటతో వైటుసెల్సు అచటి కరిగి, యాచేరిన మైక్రోబ్సుం దినివేయుటఁ గన్గొనంబడినది. మైక్రోబ్సుబాధ శరీర మునకుఁ గల్గినతఱి మితిమీఱివృద్ధియై వైట్సెల్సు వాటినడంచ త్వరపడుట భూతద్దములగుండా గాం చినఁ దెలియనగును. ఈపను లన్నియు Inflammation of lungs లేక స్కార్లెట్ఫీవరు (జ్వరము) వేఁపపువ్వువ్యాధి, ఉబ్బసఁపుదగ్గు, ఆట లమ్మవ్యాధి మొదలగువ్యాధులు కుదురుచుండున దనున పరిశీలించిన తెలియఁగలదు. ఇట్టివ్యాధులం గుదుర్చునది వైద్యులు గాదనియు, శరీరరక్తమం దలి వైట్సెల్సే యనియుం దెలియఁగలదు. అటుల మైక్రోబ్సుం దిని తాము నాశనమైన వైటుసెల్సు చీముగనై గాయములగుండా బైటవెడలిపోవును. దానినే చీముగనెంచుచున్నాము. దీనినే పాశ్చాత్య దేశములందలి యాదికాలఁపు గవులు Natures healing power అని యర్థమిచ్చునటులఁ జెక్కుఁద్రు పాడియున్నారు. ఇట్టినిజస్థితి నెఱింగిన కతన నావ్యాధులనుండి శరీరమును రక్షించినది వైద్యుఁడుగాఁడనియు, వైట్సెల్సు అనియు స్ఫురింప వైద్యుఁడన్న పరిస్థితులను సలహానొసం గెనని యనిపించెడిని.

**వైట్లెడ్** [white Lead]:— దీనిని రసా యనశాస్త్రజ్ఞులు 'Hydrated basic carbonate of Lead' అనియెదరు, ఇది 'soft heavy amorphous powder' అనియుఁ జెప్పఁ బడుచున్నది. ఇది చాల విలువగలది దీనియం దిత రవస్తువులు కల్పిబజారునం దమ్ము వైట్లెడ్ చేయు చున్నారు. ఇది Lead metal యొక్క nonpoisionos sulphate అని చెప్పఁబడినది.

## వెడాలిగోత్రము:—

(ఆత్రేయగణము చూడుఁడు.)

**వైడూర్యము**:— లా. Lapis Lazuli. ఆంగ్ల. Casts eye. ఫ్రెంచి. aulde caht. సం. వైడూర్యం, కేతురత్నం, మేఘఖలాంకురం, బాలసూర్యకం, రాష్ట్రికం, ప్రారుష్యం, అభ్రరోహం, శారాబాంకురం, విదురజం, కేతుగ్రహ వల్లభం, విదురరత్నం, వైదూర్యం.

ఇది సింహళద్వీపమున రత్నపురఁపుగనులలో దొరకురత్నము. దీని పాశ్చాత్యులు 'Servi Precions stone' అనిమెంచుదురు. నవరత్న ములలో నొకటిగఁ జెప్పఁబడినది. ఇది quartz రాతిసంబంధముగఁ బోల్పఁబడినది. అందు asbe-

stos అనుపదార్థము కలదని పోల్చియున్నారు. వైడూర్యమాకుపచ్చతోఁజేరిన బంగారుధాతువుం గలది. ఇది కబోషన్ గాకోయుదురు. లోనుండి గన్పించుకాంతి కాంగ్లులు 'chatoyancy' అనుచున్నారు. పిల్లికండ్లురాత్రి మెఱయునట్లుగనే యుండురత్నము. ఇంకను chrysobeyl జాతివి కొన్నియిట్లే యుండు వేరుజాతిరత్నములు కలవు. వాట్లకు cats eye అనియె వాడుచున్నారు.

దీని నింకను నాయుర్వేదవైద్యులు శాస్త్రోక్తముగ శుద్ధిచేసి భస్మమొనర్తురు. అధిక కఫవాతముల నడంచి గుల్మను శూలలను నివారించునని యు, పాండుజ్వరము, వాతక్షయ, పైత్యరోగముల నడంచుననియుఁ జెప్పఁబడినవి.

**వైడూర్యపర్వతము** — నర్మదానది యందలి ఓంకారక్షేత్రము. లేక మాన్ధాతద్వీపమున్న పర్వతమునకుఁ బేరు.

## వైతభావగోత్రము:—

(ముద్గలగణము చూడుఁడు.)

## వైతభావిగోత్రము:—

(అత్రేయగణము చూడుఁడు.)

## వైతరణీనది:—

(యజ్ఞపురము చూడుఁడు.)

## వైతరణీనదులు (నాలుగు):—

౧ ఉత్కలదేశములోని యజ్ఞపురము [ఇప్పటి జాజిపూర్] వెంబడి ప్రవహించునది. ఈనదిపై జాజిపూర్ నందు యజ్ఞవేదికయందు [దశాశ్వమేధఘట్టమున] వైతరణీగోదానము లొనర్తురు.

౨ బొంబై రాష్ట్రమున దేసినుపురమున కుత్తరమున నాశికకు సమీపమునజనించెడి వైతరణీనది కాలవశమున నిప్పుడు దన్తూరానది యనుపేరంబరఁగుచున్నది. దీనిని పరశురాముండిటకుఁ దెచ్చినటులఁ బద్మపురాణ తుంగారీమహాత్మ్యమునను, మత్స్యపురాణము ౧౧౩ అధ్యాయమునను చెప్పఁబడినది.

౩ కురుక్షేత్రమునందలివైతరణీనది. దీనింగూర్చి మహాభారతము వనపర్వము ౮౩ అధ్యాయమునఁ బ్రశంసకలదు.

౪ హిమవన్నగభూములలోనున్న గడవాలురాజ్యమున [తొల్లింటి యరుణోదదేశమున] కేదారనాధమునుండి బదరీనారాయణమునకేగుమార్గమున గోపీనాధమను మకాముకడ గోపీనాధమహాదేవునియాలయము ప్రక్కగాఁ బ్రవహించునది.

## వైతరాయణగోత్రము

[రాక్షకగణము చూడుఁడు.]

## వైతలగోత్రము:—

[కపిఉపగణము చూడుఁడు.]

## వైతలేయగోత్రము:—

[సంకృతిఉపగణము చూడుఁడు.

## వైతహవ్యగోత్రము:

[వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.]

## వైతాలకిగోత్రము:—

[వశిష్ఠగణము చూడుఁడు.]

## వైతిహోయగోత్రము:—

[జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.]

**వైద్యనాథధామము:—** బంగాళములోని సుప్రసిద్ధ శివక్షేత్రము. ఈస్టిండియన్ రెయిల్వేపై నున్నది. ఇట ౨౨ దేవళముల సముదాయమునందు వైద్యనాథశివలింగము సుప్రసిద్ధధామములు. ఇది చతుర్ధామములలో నొకటి. జైసిథ్ స్టేషనుగుండా పోవలయును. (చతుర్ధామములు చూడుఁడు — కేతకీవనము, చితాభూమి చూడుఁడు).

**వైద్యపరీక్షాస్థానములు ౮ [అష్టస్థానపరీక్ష]:—** ౧ చేతినాడి [పురుషులకుఁ గుడిచేయి, స్త్రీల కెడమచేయి. ఈపక్షముననే కుక్కలు మొదలగు పశువులకుఁ దొడయందు], ౨ స్పర్శము - శరీరమును తాఁకి వేఁడి, శీతలము మొదలగునవి ఎఱుంగుట, ౩ రూపము - శరీరవర్ణము నెఱుంగుట, ౪ నేత్రములు, ౫ ధ్వని [మాటల ధ్వని], ౬ జిహ్వ [నాలుకలక్షణము], ౭ మూత్రము, ౮ పురీషము.

**వైద్యశాస్త్రనాడి:—**
(నాడి నాడులు చూడుఁడు.)

**వైద్యశాస్త్రము లేక ఆయుర్వేదము-** వైద్యవిద్య, యెఱిఁగియుంట యని యర్థము. శరీరస్థమర్మధర్మముల (రోగములను) నెఱింగియుండుటయని భావము. పరమేశ్వరునకు మహాజ్ఞానము [సర్వజ్ఞత్వము] లక్షణముగాన వైద్యనాథుండనియు అన్యు లెఱుంగనిదాని నెఱుంగువాఁడుగాన భిషక్కనియు నామములు గలవు. అట్టి సర్వవిద్యాధిపతియగు పరమేశ్వరుఁడు విష్ణుదేవునకును, ఆతండు [ధన్వంతరిర్షికి నుపదేశించిన దీయాయుర్వేదము. ఇది యథర్వణవేదమున కుపవేదముగఁ జెప్పఁబడినది. ఈధన్వంతరి సముద్రమథనకాలమునం దుండినవాఁడనియు, దేవవైద్యుండనియుఁ జెప్పఁబడినవాఁడు. ఆయననుండి యితరర్షుః శాస్త్రము వ్యాపించెను.

ధన్వంతరిఋషి యాయుర్వేదమును వైద్యశాస్త్రగ్రంథమును రచించెను. అది హేతుస్కంధము, లింగస్కంధము, ఔషధస్కంధము నను మూఁడు భాగములు గలది.

౧ హేతుస్కంధము:—ఇందు శరీరస్థదోషములు వాత పిత్త శ్లేష్మములని త్రివిధములుగను, వీట్లప్రకోపభేదములే సమస్తరోగము లనియు [ఈమూఁడుదోషములు నర్వారీతిని శరీరమున సమముగనుంటయే యారోగ్యమనియు] ఈ త్రిదోషములు ప్రకోపించుటకుఁగాని, తగ్గిపోవుటకుఁగాని కారణములగు భక్ష్యవస్తువులవివరణములును తెలుపఁబడినవి. ఇదియే పథ్యాపథ్యపదార్థవివరణము.

౨ లింగస్కంధమున రోగచిహ్నములు వివరింపఁబడినవి. రోగము లెన్నివిధములో వాట్లాఁబోల్చుటకు లక్షణములు స్పష్టపఱుపఁబడినస్కంధమిదియే.

౩ ఔషధస్కంధము:—ఇందు రోగములను నివారించు నౌషధములు, అనుపానములు నుపశాంతికరపదార్థములు వివరింపఁ బడినవి. ఇందు రోగములకుఁ బ్రతిక్రియలుగ వివరింపఁబడిన యౌషధములు ౧౧ విధములు—

[౧] భస్మములు — ఓషధులను, లోహాదులను, అగ్నియందు పుటమువైచి, భస్మముగ నొనర్చినవి. ఇవి సువర్ణ భస్మము, రజితభస్మము, తామ్రభస్మము, వంగభస్మము, అభ్రకభస్మము, మొదలగునవి.

[౨] చూర్ణములు:— వేర్వేఱుపదార్థములను చూర్ణముగ [గుండలుగ] నొనర్చి కల్పినవి. పంచాగ్నిచూర్ణము, తాలీసాదిచూర్ణము, చిత్రకాదిచూర్ణము మొదలగునవి.

[౩] లేహ్యములు:— లేహ్యమన నాకఁబడునది యని యర్థము. పంచదార మున్నగువానిపాకముతోఁ గొన్నిచూర్ణములు మొదలగువానిం గూర్చియు, వండియు, సిద్ధపఱుపఁబడినవి. ఇవి ఖండార్ద్రికలేహ్యము, మదనకామేశ్వర లేహ్యము, కూష్మాండలేహ్యము మొదలగునవి. ఇవి నిదానముగఁ బనిజేయఁదగినతావుల రోగ ప్రతిక్రియలుగ వాడఁబడును.

(౪) రసాయనములు:— లేహ్యలక్షణములం గల్గియు, రసములు సువర్ణము మొదలగువాట్లం గూడియు, నవరసవుగునేని కొన్నిఘుటికౌషధములతోఁ గూర్పఁబడియు, వంటచేయఁబడినవి. ఇవి భల్లాతకీరసాయనము, లోహరసాయనము, సుదర్శనరసాయనము, నారికేళరసాయనము మొదలగునవి.

(౫) ఘృతములు:— నేతియందుఁ గొన్నిపదార్థములం జేర్చి వండినవి. ఇవి యశ్వగంధాదిఘృతము, షట్ఫలఘృతము మొదలగునవి.

(౬) తైలములు:— నూనెయందు, ఆముదములందు, కొన్నిపదార్థములంజేర్చి వండినవి. ఇవి భృంగామలకతైలము, లక్ష్మీనారాయణతైలము, భూనాగతైలము మొదలగునవి.

(౭) ద్రావకములు:— కొన్ని యౌషధులనుండి వేడికల్గించి ద్రవమందీసి సిద్ధపఱచునవి. ఇవి శంఖద్రావకము, మహాద్రావకము మొదలగునవి.

(౮) ఘుటికౌషధములు:— భస్మములు, చూర్ణములు, రసములు, నితరౌషధులు మొదలగువాట్లంజేర్చి కలువముననూరి మర్దించినవి. ఇవి మేహాంతకరసము, కాలాగ్నిరుద్రరసము, వసంతకుసుమాకరము మొదలగునవి. వీట్లను కజ్జలీఔషధములనియు వాడుచున్నారు. వీట్లలో వసంతకుసుమాకరము, పంచబాణరసము, పుష్పబాణరసము మొదలగు రస, విష గంధకములు కలియని యౌషధములను కల్పములందురు.

(౯) అంజనములు:— కన్నులకుఁ గాటుకలు, కలికములు మొదలగునవి. ఇవి సౌవీరాంజనము, నారికేళాంజనము, కర్పూరాంజనము మొదలగునవి.

(౧౦) కషాయములు:— వృక్షమూలములు వేళ్ళు తీఁగెలు, ఓషధులు మొదలగువాసింగూర్చి జలము మరఁగఁగాచి కషాయములుగఁ జేసినవి. వీట్ల నాంగ్లమున 'decoctions' అనియెదరు. ఇవి మహాపంచకోలకషాయము, బలామూలకషాయము, వాసాదికషాయము మొదలగునవి.

(౧౧) ఆసవములు:— ఆకులు, పూవులు, ఫలములు, కాయలు మొదలగునవి యుదకమునఁగాని, తైలమునఁగాని మఱఁగించి, ఆయత్తపఱుపఁబడినవి. ఇవి ద్రాక్షాసవము, పద్మాసవము, శర్కరాసవము, మున్నగునవి.

ధన్వంతరిరచించిన యాయుర్వేదముగ్రంథము నాధారముగ నిడుకొని సూర్యునిసుతులగు నశ్వనీదేవతలలో నిర్వురును, కశ్యపమహర్షియు, నత్రిమహర్షియు, వైద్యగ్రంథములను రచించిరి. అశ్వనీదేవతలు ధన్వంతరికిఁ బిదప దేవవైద్యము వహించినవారు.

అత్రి రచించిన వైద్యశాస్త్రగ్రంథమున నవ విధవిషములు, వాట్లయుత్పత్తి, లక్షణములు, విషములనుశుద్ధియొనర్చు విధానములు, వాట్లనుపయోగించు విధములు చెప్పఁబడినవి. అవి (౧) కాకోల విషము, (౨) కాలకూటము, (౩) హాలాహలము, (౪) సౌరాష్ట్రికవిషము, (౫) శౌక్లికేయ విషము, (౬) బ్రహ్మపుత్రి విషము, (౭) ప్రదీపన విషము, (౮) దారద విషము, (౯) వత్సనాభ విషము ననునవి.

ఇంక మిగిలినవారు రచించినవైద్యగ్రంథములందును నిట్లే వనౌషధులగు వృక్షలక్షణములు, పర్వతధాతువులు, ద్రవ్యగుణపాఠము, శరీరమందలి సప్తధాతువుల లక్షణములు, రోగనిదానములు, కషాయములు మున్నగునవి వివరింపఁబడినవి.

పిదపఁ గొంతకాలమునకు చరకుండనువైద్యశాస్త్రవిదుఁ డొకఁడు చికిత్సాసూత్రగ్రంథమును రచించెను. దాని నిఁకను చరకతంత్రమనియు, వైద్యమనియు, వైద్యపాతంజలమనియుఁ గూడ వాడుచున్నారు. తొల్లింట నాదిశేషుండు పతంజలిగ నవతరించి, వ్యాకరణభాష్యమును రచించి, వాగ్దోషములు శమింపఁ (శబ్దోచ్చారణ) జేసియు, పిదప నాయవతారముననే యోగశాస్త్రము సూత్రరూపమున రచించి, బోధించి, మనోదోషముల శమింపఁ (యోగాభ్యాసము) జేసియుం దృష్టి నందక చరకుఁడై యవతరించి, చరకతంత్రమురచించి శరీరదోషములకుఁ బ్రతిక్రియల బోధించెననియు, నిట్లా మహానీయుండే మనోవాక్కాయదోషములకుఁ బ్రతిక్రియలం బోధించి, కర్మశుద్ధిఁ గల్పించుకొన లోకులకు మార్గముఁ దెల్పెనని తలంపఁబడెను.

ఆచరకతంత్రమునకు సుశ్రుతుం డొకభాష్యము రచించెను. దానికి సుశ్రుతమని పేరయ్యెను. విదర్భదేశాధీశుఁడగు భోజనృపతి రాజమృగాంక మను పేర నొక వైద్యగ్రంథము రచించియున్నాఁడు. దానిని బాహటుండను వైద్యశాస్త్రవిశారదుఁ డొకఁ డష్టాంగహృదయసంహిత యను గ్రంథము రచించెను. అందు, కల్పస్థానము, శారీరస్థానము మొదలగు వివరణములు చెప్పఁబడినవి. దీని కనేకులు వ్యాఖ్యలు వ్రాసియున్నారు.

పిదప సులభశైలిగ్రంథములగు చింతామణి, గుణపాఠము, బసవరాజీయము ననుగ్రంథములు రచింపఁబడినవి. అవి యిక్కాలమున సర్వసాధారణులగు వైద్యులకడ విస్తారముగ వ్యాపించియున్నవి. వైద్యశాస్త్రపదములకు ధన్వంతరినిఘంటువు, మదనినిఘంటువు, పర్యాయార్ణవనిఘంటువు, మొదలగునిఘంటువులు పేర్కొనఁబడఁదగినవి. వైద్యునకు నాడీనిదానము, అష్టస్థానపరీక్షయు, రోగము నెఱుంగుటకు ముఖ్యసాధనములుగ నున్నవి.

ఆయుర్వేదవైద్యగ్రంథములం దే దేశస్థుల కా దేశపు వనమూలికలు, నౌషధములు, హితవులని చెప్పఁబడినది. (ఆంగ్లవైద్యముచూడుడు).

మఱియు నిక్కాలమున వైద్యుల యనుభవములమేరకు పెక్కుయౌషధములు వేర్వేఱు వైద్యులచేఁ గల్పింపఁబడినవి కలవు. ఆంగ్లవైద్యద్రవ్యసమ్మేళనలచేఁ గొన్ని కల్పింపఁబడినవియుం గలవు. ఆయుర్వేద వైద్యమునకు సోదరీవైద్యమనిపించుకొను యూనానీయౌషధములును, వాట్లసమ్మేళనౌషధములును కొన్ని కలవు. ఇవి గాక సిద్ధౌషధము లనియు, బైరాగిచిట్కీ లనియుఁ గొన్ని యౌషధయోగములు ప్రచార మంది

యున్నవి. కేవలము రసములే ప్రధానములుగఁ గొందఱు, వైద్యశాస్త్రక్రియాభ్యాస మొనర్చు వైద్యులు కొందఱును, పాషాణప్రధానముగ వైద్యక్రియాభ్యాస మొనర్చువైద్యులు కొంద ఱును గలరు. పాషాణవైద్యప్రాబల్యమున నుత్కల దేశము పేరందినది.

వైద్యశాస్త్రమున వ్రణవైద్యమనియు, జ్వర వైద్యమనియు, కేవలమూలికావైద్యమనియు, సుఖ రోగవైద్యమనియు, సూర్యరశ్మివైద్యమనియు, దొట్టివైద్యమనియు నిక్కాలమున పెక్కు తెఱం గులై గాననగుచున్నది.

మఱియు పాకశాస్త్ర [వంట] మాయుర్వేద వైద్యశాస్త్రమందలి యొకభాగముగఁ జెప్పఁబడి నది.

**వైదర్భి (రీతి):—** [లక్షణచూడుఁడు.]

**వైదారికసన్నిపాతము:—**
[సన్నిపాతదోషము చూడుఁడు.]

**వైదేహగోత్రము:—**
[ఆత్రేయగణము చూడుఁడు].

**వైద్యుత [లేక విద్యుత్] పర్వత ము:—** కైలాసశిఖరముదటిని మానసరోవర రాక్షసతలములకుఁ గతిపయదూరమునఁగల గరళ మాంధాతపర్వతము. దీనికి గరళశిఖర మనియు, మాంధాతశిఖర మనియు రెండుశిఖరములు కలవు. మాంధాతమహర్షి యొక్క యస్థు లొకగుహ యందు నేఁటికిని పూజింపఁబడుచున్నవి. అట పిత్ర ర్చన మొనర్తురు.

**వైనభృత్గోత్రము:—**
(జమదగ్ని బీధా ఉపగణము చూడుఁడు.)

**వైనుతిగోత్రము:—**
[భరద్వాజ ఉపగణము చూడుఁడు.]

**వైనశ్యగోత్రము:—**
(నిధ్రువ గణము చూడుఁడు.)

**వైన్యగణము:—** ఇది భృగుసంతతియం దలి యొకగణము. ఇందు వైన్య, పార్థ, భాష్కల యనుమూఁడుగోత్రములు చెప్పఁబడినవి. భార్గవ, వైన్య, పార్థ యని త్రయార్షేయప్రవర మూఁడు గోత్రములకుఁ జెప్పఁబడినది.

**వైన్యగోత్రము:—**
(వైన్యగణము చూడుఁడు.)

**వైభాషికబౌద్ధమతము:—** ఇది చతు ర్విధబౌద్ధములలో నొకటి. సర్వలక్షణములచే నీమతము బౌద్ధసిద్ధాంతము ననుసరించినది. (బౌద్ధ మతము చూడుఁడు). బుద్ధభగవానునితరువాత వారగు బౌద్ధపండితులలో నొకప్పుడు వివాద ములు కల్గి బౌద్ధులు ౧ మాధ్యమికులు, ౨ యో గాచారులు, ౩ సౌత్రాంత్రికులు, ౪ వైభాషి కులు నని నాల్గుతెగలవారైరి. వీరిభేదము లొక్క జ్ఞానజ్ఞేయములగు నంతరార్థమగుబుద్ధి లేక యాత్మ బాహ్యార్థమగు వెలుపలనుండు లేక బాహ్యగోచ రములగు జగద్వస్తువులం గూర్చియే యని యెఱుం గునది. ఇంకను వీరిలో నించుకయాచారభేదము లుండినను నవి స్వల్పములు గాన పాటింపఁబడఁ జనవు.

వైభాషికులకు బాహ్యార్థప్రత్యక్షవాదు లని యన్యమతములవారు పేరిడిరి. ఏలయన బాహ్యార్థ మగుజగత్తును వీరు ప్రత్యక్షప్రమాణముచే సత్య మందురు.

జగద్వస్తువులు తమంతటతామే జ్ఞానమునకు విషయముగా నేరవనియు, నవి ప్రత్యక్ష ప్రమాణముచే జ్ఞానమునకు విషయములగుట నిర్బాధకమనియు, కనుపించుచున్న జగద్వస్తువులను ప్రత్యక్షప్రమాణమే సాధింపఁజాలకపోయిన నింక నేదియు ప్రత్యక్షసిద్ధము కానేరదు. ప్రత్యక్షమే లేనప్పుడు ప్రత్యక్షవ్యాప్తిచే సిద్ధించునను ప్రమాణ మసలే సిద్ధింపఁజెల్లదు. రెండుప్రమాణములం గోల్పోవుట యసంభవమును, నజ్ఞానమును నైయుండు ననియు, మఱియు లోకానుభవవిరుద్ధము గాన ప్రత్యక్షమే యిచటఁ బ్రమాణమని చెప్పఁబడినది.

గంధలక్షణముగల భూపరమాణువులు, రసలక్షణముగల జలపరమాణువులు, వర్ణలక్షణముగల తేజఃపరమాణువులు, ఓజోలక్షణముగల వాయుపరమాణువులుఁ గూడి శరీరాదు లగుచున్నవనియు, మఱియు నివి యొకటితోనొకటి హత్తుకొని కూడియుండుశక్తి కలవుగాననే పిండరూపములై జగద్వస్తువులుగ నగుచున్నవనియు నిదియే బాహ్యార్థమనియుఁ జెప్పఁబడినది.

ఇంక నంతరార్థమగుబుద్ధి శరీరమునందు గ్రాహకాభిమానరూపకమగు విజ్ఞానసంతానమే యనియు, దీనికి వేరగు నాత్మ లేదనియు, కూడినచైతన్యమే బుద్ధియనియుఁ జెప్పఁబడినది.

ఈమతమున బుద్ధియొక్క వ్యాపారము జ్ఞానము నజ్ఞానము నని ద్వివిధము. అందు జ్ఞానము సప్రమాణము. అనఁగాఁ బ్రత్యక్ష అనుమాన ప్రమాణములచే సిద్ధించునది. విద్యామూలక మగునది. ప్రమాణమునఁ దెలియఁబడు ప్రమేయము జ్ఞేయమనుసంజ్ఞచేఁ దనరెడిని. ఇది కల్పితము. రెండవదియగు నజ్ఞానమప్రమాణము. అనఁగాఁ బ్రత్యక్షానుమానప్రమాణములచే సిద్ధింపనిది. ఇది యవిద్యామూలకము. అజ్ఞానమునకు మూలాజ్ఞాన మనియుఁ బేరు కలదు. అజ్ఞానము ౧ అవిద్య యనియు, ౨ స్కంధాజ్ఞాన మనియు, ౩ ఆయతనాజ్ఞానమనియు, ౪ ధాతుజ్ఞానమని చతుర్విధమని జెప్పఁబడిది.

౧ అవిద్య:- ఇది యొకేవిధము. వస్తుతత్త్వము నెఱుంగకుండుట యర్థము.

౨ స్కంధాజ్ఞానము:— పూర్వజన్మవాసనలసముదాయము.

(౧) జ్ఞానస్కంధాజ్ఞానము:- దీనిని విజ్ఞానస్కంధమనియు నందురు. లోకసంసారసంబంధముగనుండు వస్తుతత్త్వజ్ఞానము. ఇదిపరమార్థమున కనుకూలింపనిదియు నజ్ఞానమునం జేరునదియునై యున్నది..

(౨) సంస్కారస్కంధాజ్ఞానము:- పూర్వజన్మవాసనలసముదాయము.

(౩) వేదనాస్కంధాజ్ఞానము— సుఖదుఃఖరూపమును, అపేక్షారూపము నగు నజ్ఞానసముదాయకము. ఇట్టిలక్షణములుగల బుద్ధిప్రసారములు వేదనాస్కంధము లనంబడును.

(౪) సంజ్ఞాస్కంధాజ్ఞానము:—ప్రపంచవస్తువుల సంజ్ఞలు లేక నామములు.

(౫) రూపస్కంధాజ్ఞానము:—ప్రపంచవస్తువుల యాకారముల సముదాయము, ప్రపంచవస్తువుల నామరూపములు క్షణికము లౌట నెఱుంగక నజ్ఞానమున స్థిరములనుకొను భ్రాంతికి సంసారమని పేరు.

ఆయతనాజ్ఞానము:—ఇది ౧ చక్షురింద్రియసంబంధములు, ౨ శ్రోత్రేంద్రియసంబంధములు, ౩ ఘ్రాణేంద్రియసంబంధములు, ౪ జిహ్వేంద్రియసంబంధములు, ౫ కాయ [శారీరక]

సంబంధములు, ౬ మనస్సంబంధములు, ౭ రూపసంబంధములు, ౮ శబ్దసంబంధములు, ౯ గంధసంబంధములు, ౧౦ రససంబంధములు, ౧౧ స్పర్శసంబంధములు, ౧౨ ధర్మసంబంధములు నని పండ్రెండుభేదములు గలది. ఇవి సంసార సంబంధభ్రమములని చెప్పఁబడినది.

౪ ధాతురూపాజ్ఞానము:— ఇది పదునెన్మిది భేదములు గలదు.

ఇంక దీనినే మఱికొంద ఱింకొకవిధమున వివరించిరి. తత్వమును 'ఆర్యసత్వము' అనివాడిరి. ఆర్యసత్వములు ౧ దుఃఖము, ౨ ఆయతనము, 3 సముదయము, ౪ మార్గము నని నాల్గువిధములు.

౧ దుఃఖము- ఇది పంచస్కంధములు. (వెనుక వివరింపబడినవి).

౨ ఆయతనము- ఇది ద్వాదశాయతనములు. (వెనుక వివరింపఁబడినవి).

3 సముదయము- ఇది రాగాదులసముదాయము. ఆత్మ లేక బుద్ధి. "తాను" "నాది" యను భావనలం గల్గియుండుతటి నస్వభావములగు రాగాదులసముదాయముగఁ జెప్పఁబడినది.

౪ మార్గము- పూర్వవాసనలు (అనఁగా సంసార వ్యామోహములు క్షీణించి సర్వము క్షణికమనుధర్మముపై విశ్వాస ముదయించుట). అది స్థిరపడుటే మోక్షము. వైభాషికధర్మమునజగద్వస్తుసముదాయము స్థిరమని భ్రమించుచుండుటయే సంసారముగఁ జెప్పఁబడినది. యితర మతములందలి బంధముం బోలినది. ఇదియే యజ్ఞానచతుష్టయము.

వైభాషికబౌద్ధమోక్ష మిటుల నిర్వచింపఁబడినది. ప్రమాణజ్ఞానముచేఁ జతుర్విధాజ్ఞానములు నశించి, వాట్లకారణమగు మూలజ్ఞానముఁ గూడ తనంతటతానే సమసిపోయి క్షీణించుననియు, అట్లగుట నజ్ఞానమే శూన్యమై విశుద్ధజ్ఞాన ముదయించుటయే యగును. విశుద్ధజ్ఞానసంతతియే మోక్షము. ఇదియే బుద్ధభగవానుఁడు జెప్పిననిర్వాణమనియుఁ జెప్పుదురు.

## వైయకిగోత్రము:—

(నిధ్రువ గణము చూడుఁడు).

## వైయాఘ్రపదగోత్రము:—

(వ్యాఘ్రపద చూడుఁడు. సంకృతి ఉపగణము చూడుఁడు).

## వైరంతిగోత్రము:—

(అగస్త్యఉపగణము చూడుఁడు).

**వైరాగ్యములు:**— వైరాగ్య మన విరాగము; అనురాగము లేకుండుట. ఇవి పదునొకండు విధములు. ౧ విత్త (ధన) వైరాగ్యము, ౨ ఆయు (జీవనము) వైరాగ్యము, 3 అహంభావ (అహంకార) వైరాగ్యము, ౪ చిత్తవైరాగ్యము, ౫ ఆశావైరాగ్యము, ౬ శరీరవైరాగ్యము (దీనికే తనురాగ్యమనియు నందురు), ౭ యౌవనవైరాగ్యము, ౮ రూప (సౌందర్య) వైరాగ్యము, ౯ జరావైరాగ్యము, ౧౦ కాలవైరాగ్యము, ౧౧ విద్యావైరాగ్యము నని వసిష్ఠరామాయణమున వైరాగ్యప్రకరణమునఁ జెప్పఁబడినది.

## వైరాయణగోత్రము:—

(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

## వైరిణేయగోత్రము:—

(పరాశరగణము చూడుఁడు).

**వైరూప ఉపగణము:—** ఇది అంగిరస సంతతియందలి కేవలాంగిరసగణమునందలి యొక యుపగణము. దీనిని రథితర ఉపగణమని యందురు. (రథితర ఉపగణము చూడుఁడు.)

**వైరూపగోత్రము:—**
(రథితర ఉపగణము చూడుఁడు.)

**వైర్లెస్ టెలిగ్రాపు** (wireless telegraph) **చిత్రము:—** ఈకాలమున నిది గొప్ప చిత్రము. తంతులులేనిదే విద్యుచ్ఛక్తి ప్రపంచ మందలి యేమూల మూలలకైనను పంపి మనోభావముల నెఱుంగ వీలగుటకన్న నెక్కువచిత్రమింకేమి గావలయును? కాల మొక్కసెకండైన చాలును. ఒక్కఁడు, ఎంతదూరమునకైనను వేలకొలఁది మైళ్ళదూరముననున్న వేలకొలఁదిమనుష్యులకుఁ దన ధ్వనితోఁ దనమనోభావములను మాటలరూపమున వినఁజేయఁగల్గుటకన్న వింతయేముండును. ఐన నిది సాధ్యమై యాచరణలోనికి వచ్చియున్నది. ఒకేనిముషమునఁ బ్రపంచముయొక్క యేమూలనో మాట్లాడువానిధ్వనిని, గానమును, ఉపన్యాసములను వేలకొలఁది లక్షలకొలఁది జనులు వినున ట్లొనర్చు నొకచిన్నపరికరముం గూర్చి వివరింతుముగాక. వీటికి 'వైర్లెస్ రిసీవర్సు' (wireless recievers) అని పేరు. వాయుపథమునఁ దరంగములుగ నడచుచుండుమాటల నీవైర్లెస్ రిసీవరుతంత్రులు లాగుకొనుచు రిసీవరుగుండా వినఁబడున ట్లొనర్చెడిని. బిగ్గర విన్పించుటకు లౌడ్స్పీకరు పరికరములు దీని కమర్పఁబడి చక్కఁగను, గట్టిగను వేలకొలఁదిజనులకు వినఁబడఁజేసెడిని.

ఈమహావిద్యకుఁ జెందినవి నాలుగు పవిత్ర నామములు చిరస్మరణీయములు. క్లార్కుమేక్సువెల్ (Clark max well) అను మహనీయుని పేరును, హెర్ట్జ (Hertz) అనువానిపేరును మఱువరాదు. వారు దీనిం గనిపెట్టినవారు. క్రీ. వె. ౧౮౭౩ – ౧౮౮౭ సంవత్సరములు వీరు దీనిని బయటఁబెట్టిన కాలములు. వీటిని పాటించకున్న నిజముగులోపమేగాని వేఱుగాదు. క్లార్కుమేక్సువెల్పండితుఁడు తనపరిశీలనలఫలితముగ ౧౮౭౩ లో బహిఃప్రపంచమునకు "If any change is made in the field of force, produce by an electric magnet, the effect of the change will be flashed threw space, with the same speed at the rate of 186000 miles a second as a ray of light." అని ప్రకటించెను.

అటులనే ౧౮౮౭ లో హెర్ట్జపండితుఁడు తన మహాపరిశీలనల ఫలితముగ 'ఈతరుణమునందు ఎలక్ట్రిసిటీ సహాయమున శబ్దధ్వనులతరంగములఁ బ్రవేశపెట్టి నడుపనగు' నని ప్రకటించియున్నాఁడు. నిజము నెఱింగిన నీమహనీయుఁడే వైర్లెస్సిగ్నల్సు మాటలను మొదటఁ బంపినవాఁడని చెప్పవలసియున్నది. తాను పరిశీలనల నొనర్చుచుండినగది యందు దిట్టితరంగముల నీథరుగుండా నడిపియుంట నీపరిశీలకుఁడే యీసందర్భమున నగ్రగణ్యుం డగుఁగాక. గాననే పండితలోక మట్టితరంగములకు 'Hertzian waves' అని యీమహాత్ముని పేరిడి వాడుచున్నది. ఎట్లైనను వీరియుభయుల పరిశీలనలఫలితములం గల్పి వైర్లెస్ లోకమున కెఱుంగనైనదని యనుచున్నారు అట్లే యగునందుము.

హెర్ట్జ పండితుఁడు, ఒకటి పోసిటివ్, ఒక నెగటివ్ విద్యుచ్ఛక్తి ప్రవాహములం దగిలించి పరిశీలించెనఁట. పట్టఁదగినంతశక్తి నట కరిగినతటి నొకవిద్యుత్తుమిణుఁగురు Electric Oscilla-

tions కల్గెనఁట. ఆసిలేషన్ అన To and fro motion like the swing of a clock Pendulum' అని నిర్వచింపఁబడి యున్నది.

హెర్ట్జ్ పండితుఁడు Resonator అను పరికరమును రచించి తనపరిశీలనగదియం దమర్చి, దానిగుండా మహావాయుపథమందుఁ దరంగరూపమున నడచుచుండుధ్వనులం దెలియుటకు మొదలిడెనఁట. ఈధ్వనితరంగములు వాయుపథమున నీతరుసందుఁ జలించుచు, కాలపరిమితులమేర కంపన్న ధ్వనిపాత్రి (Vace) నకుం దగులుచు, ధ్వనింగల్గించి (Vibrations) వినఁబడఁజేయుచుండె నఁట. ఇటుల వీణతంత్రులకడ నొనర్పఁబడినధ్వను లావీణాతంత్రులందుఁ బ్రతిధ్వనిం గల్గించి, ధ్వనిన్ని బయటఁబెట్టుట మన మెఱిగియే యున్నాము. ఆధ్వనియు నటులఁగల్గినదే. ఇటుల ధ్వను లేర్పడు చిత్రమున కాహెర్ట్జ్ పండితుఁడు 'Resonance' అనిపేరిడియుంటఁ గా నెఱుంగఁదగినది. అటుల విననై గ్రహింపనైనధ్వనితరంగములకే హెర్ట్జ్వేవ్సని లోకము పేరిడియున్నది. అట్టితరంగములొనర్చు ధ్వనులంగూర్చియే అల్లసాని పెద్దనామాత్యవిద్వత్కవి తన మనుచరిత్ర యను మహాప్రబంధమున 'వాలారుఁగొనగోళ్ళ దీవనలతన్' అనుపద్యమున నాటకున్ మేలంబైన విపంచి యనియు, నాయాలాపంబే యవేళఁ బల్కెడిననియు, తంత్రులమేలగింపఁగదవే యనియు, వాడియున్నాఁడు. ఇం దామహాకవి యభిప్రాయమట్టిధ్వనినిచ్చు పదార్థఁపుధ్వనులంగూడ సరిఁజేయుపనికని యెల్లరెఱుంగకపోరు. ఇది భరతదేశఁపు గానసంబంధవిషయము.

పిదపఁ గొంతకాలము పరిశీలనలం దింకను గడచి 'Leghorn' అనంబడుతావున నక్కాలమున విద్యార్థిగనుండిన Guglielmo marconi యనుపేరుగల Bologna నివాసియగు ధీశాలి హెర్ట్జు మహాపండితుని పరిశీలనలం జక్కఁగఁ జదివి గ్రహించియు, తాను బోలోగ్నాకడ గొప్పగొప్పపరిశీలనలఁ బ్రారంభించి, ౧౮౯౫ లో నొకవిచిత్రముం గన్గొనెను. అది హెర్ట్జు గారి రెండుతంత్రుల శక్తిప్రసారములలో నొకదానిని భూమికిని, రెండవదాని నొకస్తంభముపైకడనున్న యొకలోహఁపుముక్కకుం గల్పిన ఈతరునం దిడఁబడిన ధ్వనితరంగము లింకను గొంతదూరమరుగుగలవిగ నగునని కన్గొనియెను. మఱియు నాస్తంభ మెంత యెత్తుఁ గల్గినదిగా నుండునో యంత యెక్కువదూర మాతరంగము లరుగఁగలవని యామహనీయుఁడే కన్గొనెనఁట. ౧౮౯౬ లో టెలిగ్రాపువార్తలం గొని యందించు యంత్రము నాయన నిర్మాణ మొనర్చి రచించెనఁట. పిదప నావత్సరముననే జూన్ నెలయందు బ్రిటన్ దేశమున నవి వాడఁబడ నారంభ మయ్యెను. మార్కొనీగారే ౧౮౯౭ జూను నెలయందు నాల్గుమైళ్ళదూరమునకు సాలిస్బరీమైదానమున వైర్లెస్ సిగ్నల్సు నడపిచూపినవాఁడు. ఫ్రెంచిప్రభుత్వము ౧౮౯౯ లో నీయనను గారవించి తమదేశమున నిట్టిసంస్థ నేర్పాటు చేయించుకొనిరి. అట్టియేర్పాటు పిదప డోవరురేవుఁన జేయంబడి ౩౦ మైళ్ళ దూరమునకు వైర్లెస్ వార్తలు నడచెనట.

ఈవ్యవహారమున నింకను వివరింపఁ దగిన పేరులు Sir olever Lodge పండితుఁడును, Brauly పండితుఁడును, నింకఁ గొందఱు సహాయకపరిశీలకులు నైయున్నారు. బొమ్మలుకూడ వైర్లెస్పై నొకతావునుండి వేఱొకతావునకు నడుపఁబడి చూపఁబడినవి. భూమియందున్న నిక్షేపము (గనులు) లు వైర్లెస్ పరికరములుగుండా

తెలియఁబడి చూపఁబడినవి కలవు. దానికి ఫైం డర్ (finder) యంత్రపరికరమని పేరిడియు న్నారు. ఇక్కాలమున ఫ్రెంచిదేశపు పారిస్‌నగ రముకడనున్న ఎఫిమెల్ టవర్ (Eiffel Tower) అను నిర్మాణముపైనుండి యనుదినము కాల మును ననేకవేలమైళ్ళదూరఁపుఁదావులకు వైర్లెస్ ద్వారా పంపుచున్నారు. లైట్‌హౌసెస్‌నుండి యోడలలోనికి వైర్లెస్‌వార్తలు దట్టమైనమంచు నందుఁ బంపఁబడుచున్నవి. సెర్చిలైటుదీపములు మైళ్ళకొలఁది దూరమునకుఁ బ్రకాశముం గొంపోవు చున్నవి. ఇట్టిచిత్రము లింక నెన్నిగలుగనున్నవో.

## వైరోహితగోత్రము:—

(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

## వైలహానిగోత్రము:—

(గర్గ ఉపగణము చూడుఁడు).

## వైలేయుగోత్రము:—

(గవిష్ఠిరగణము చూడుఁడు).

## వైలేయుగోత్రము:—

(ఆత్రేయగణము చూడుఁడు).

**వైవస్వతమనువు:**— తండ్రి వివస్వత్వ మునసున్న సూర్యుఁడు. తల్లి సంజ్ఞాదేవి. భార్య శ్రద్ధాదేవి. కుమాళ్ళు ఇక్ష్వాకు, నృగుఁడను నామాంతరముగల వృషపదుఁడు, శర్యాతి, దిష్టుఁ డు, ధృష్ణుఁడు, కరూశుఁడు, నరిష్యంతుఁడు, వృష ధృడు, నాభాగుఁడు, కవి యనుపదిమంది యని యు, కవి బాల్యమునందే మరణించెననియుం జెప్పఁ బడినది. కుమార్తె ఇల. ఈమె బుధుని పెండ్లాడి చంద్రవంశపు రాజగు పురూరవచక్రవర్తిం గని యెను. ఈతని మన్వంతరకాలమున నోజస్వియను వాఁ డింద్రత్వము వహించెను. అత్రి, వశిష్ట, కాశ్యప, గౌతమ, భరద్వాజ విశ్వామిత్ర జమ దగ్నులు, మహర్షులుగ నుండిరి. మాఘశుద్ధ సప్తమి వైవస్వతమన్వాది.



కుమాళ్ళు:— ౧ ఇక్ష్వాకుమహారాజు (ఈతని నుండియిక్ష్వాకువంశమని పేరయ్యెను). ౨ నృగుఁడు, ౩ శర్యాతి, ౪ దిష్టుఁడు, ౫ ధృష్ణుఁడు, ౬ కరూ శుఁడు, ౭ నరిష్యంతుఁడు, ౮ వృషధృఁడు, ౯ నభగుఁడు, ౧౦ కవి, (ఇతఁడు బాల్యమందే చనిపోయినవాఁడు). కుమార్తె ఇల.

౧ ఇక్ష్వాకుపుత్రులు:— కుక్షి, నిమి, దండుఁడు లేక దండకుఁడు, విశాలుఁడు (కుక్షియొక్కకుమా రుఁడు వికుక్షి), వికుక్షికుమారుఁడు కకుత్సమహా రాజు).

౨ నృగునిపుత్రులు:—

౩ శర్యాతిపుత్రులు:—ఉత్తానబర్హి, అనర్తుఁడు, భూరిసేనుఁడు. కుమార్తె సుకన్య.

౪ దిష్టునిపుత్రులు:— నాభాగుఁడు.

౫ ధృష్ణునిపుత్రులు:—నాభాగుఁడు

౬ కరూశుఁడు.

౭ నరిష్యంతునిపుత్రుఁడు చిత్రసేనుఁడు.

౮ వృషధృఁడు.

౯ నభగునిపుత్రుఁడు నాభాగుఁడు.

ఇల బుధునిభార్య. కుమారుఁడు పురూరవుఁ డు. ఇల పుంసత్వమున సుద్యుమ్నుఁడు. పుత్రులు ఉత్కలుఁడు, గయుఁడు, వినతాశ్వుఁడు నను మువ్వురు.

జైనమతగ్రంథములందు వైవస్వతమనువు సుమేరుపర్వతముపై వసించుచు, పరిపాలించిన వాఁడని చెప్పఁబడినది.

(సుమేరుపంచకము, గిరిపంచకము చూడుఁడు).

**వైవానరిగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**వైవానరిగోత్రము:—**
[జమదగ్ని బిధా ఉపగణము చూడుఁడు.]

**వైశంపాయనగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**వైశంపాయనగోత్రము:—**
[నిధ్రువగణము చూడుఁడు.]

**వైశంపాయనుఁడు:—**ఋషి. తండ్రి విశంపు. వ్యాసశిష్యుఁడు. యజుర్వేదాధ్యేత. జనమేజయునకు [వ్యాసునియాజ్ఞమేరకు] భారతముం జదివి వినిపించినవాఁడు.

**వైశాల్యానది:—**నర్మదానదియందుఁ జేరుకొను నొకనది.

**వైశాఖిగోత్రము:—**
(ఆత్రేయగణము చూడుఁడు.)

**వైశిప్రగోత్రము:—**
(నిధ్రువగణము చూడుఁడు.)

**వైశ్యగోత్రములు:—** వైశ్యు లార్యవైశ్యులనియు, వైశ్యులనియు నిరుతెగలుగ నున్నారు. అం దార్యవైశ్యులు తొల్లి కన్యకాపరమేశ్వరితో నగ్నిగుండఁబునంబడిన యార్యర్షులసంతతివారు. వీరు శ్రేష్ఠశాఖగా నెన్నఁబడెదరు.

ఇంకఁ గన్యకాపరమేశ్వరితో నగ్నిగుండప్రవేశమొనర్పనివైశ్యులు తేకకోమట్లనియు, కళింగకోమట్లనియు, భేరికోమట్లనియు నింక నిట్టి యనేకశాఖలవారుగ నున్నారు. వీ రన్యోన్యవివాహముల సంబంధబాంధవ్యము లొనర్చుకొనరట. గాని యందఱు వాణిజ్యమును కులవృత్తిగా నంగీకరింతురు. వీరిఁగూర్చి కన్యకాపురాణాదిగ్రంథములందు విపులముగ వివరింపఁబడినది.

వైశ్యులంగూర్చి గ్రంథములనుండి మనకుఁ దెలియఁగల సంగతులు పది కలవు. అవి యిప్పటి గోత్రము, తొల్లింటిసంస్కృతగోత్రము, గణము, సూత్రము, ప్రమాణగ్రంథము, సమానగోత్రములు, అన్యమగోత్రములు దేవత యనంబడు వర్గేశుఁడు (భార్యసహా), తపస్థానము, తటాకము, జపసంఖ్య, క్షేత్రసంఖ్య, దీపసంఖ్య, దానము, వర్జనీయపదార్థము ననునవి. వాట్ల నిందు వివరింతుము.

ఇంకను వైశ్యగోత్రములు ౧౦౨ అనియు, అం దొకగోత్రమువా రిప్పు డార్యవైశ్యశాఖయందు లేరనియు మిగిలిన ౧౦౧ గోత్రములవారే యున్నారనియుఁ దెలిసెడిని. వైశ్యులం దేకార్షేయగోత్రములు డెబ్బదియేఁడును, ద్వ్యార్షేయగోత్రములు పదునాఱును, త్ర్యార్షేయగోత్రము లేఁడును, చతురార్షేయగోత్ర మొక్కటియు, దశార్షేయగోత్ర మొక్కటియుం గలవు. అవి యిట్టుల నూటరెండుగోత్రము లగును. వాట్లను వివరింతుముగాక.

ఏకార్షేయగోత్రములు ౭౭.

గ్రంధిశీలకుల, బుధనకుల, వ్యాలకూలకుల, కురటకుల, పెద్దశిష్టకుల, పేరుశిష్టకుల, ఇనకుల, సూరశిష్టకుల, కరకఫాలకుల, సాంతాలకుల, తుప్పాలకుల, పిప్పలికుల, విశిష్టకుల, వసంతకుల, పునీతకుల, వాసంతకుల, విక్రమశిష్టకుల, అయనకుల, మండంకుల, బలశిష్టకుల, పద్మశిష్టకులగోత్రములు ౨౧, అనంతకుల, విన్నకుల, కుమారశిష్టకుల, మేరుకుల, మౌంజికుల, అభిమంచకుల, చెనశిష్ఠకుల,

శిరిశిష్టకుల, పైడికుల, భ్రమరకుల, ఘనశ్రీకుల, వృద్ధిశిష్టకుల, రెంటకుల, ఉశీరకుల, సుశాలకుల, ఛిద్రూపకుల, దీక్షమకుల, బుధయక్షకుల, మానసభికుల, కామశిష్టకుల, కదంబకులగోత్రములు ౨౧, అనుమర్షణకుల, ఎలమంచికుల, త్రిమూలకుల, క్రిమశిష్టకుల, పౌత్రయాజకుల, సమశిష్టకుల, పాలకుల, ఇషుపకుల, చక్రమూలకులగోత్రములు ౯, వస్తికుల, క్రానుకుల, ధనికుల, త్రివిక్రమశిష్టకుల, విపరిశిష్టతులశికుల, భీమశిష్టకుల, ఇక్ష్వాకుకుల, హస్తికుల, గణముఖకులగోత్రములు ౧౦, ధనగుండకుల, వెనశిష్టకుల, వెంకోలకుల, అందేరకుల, శంకారకుల, తృణశిష్టకుల, మంగమకుల, వృద్ధికుల, కమలకుల, కన్వకులగోత్రములు ౧౦, శిమనకుల, శనకాలకుల, అమలకుల, గుండగకుల, ముష్టికకుల, శ్రీపుంసకుల, చందకకులగోత్రములు మొత్తము ౭౭.

ద్వార్షేయగోత్రములు ౧౬.

౧ పెండ్లికుల, ౨ మన్యుకుల, 3 అనుపకుల, ౪ ఇంచుపకుల, ౫ తుర్వాటకుల, ౬ శ్రీకుల, ౭ ఘంటాస్థూలకుల, ౮ శ్రేష్ఠకుండకుల, ౯ ఫలకకుల, ౧౦ దేశిష్టకుల, ౧౧ మధవకుల, ౧౨ సనకుల, ౧3 ఉత్తమకుల, ౧౪ కౌటకుల, ౧౫ ఛన్నకుల, ౧౬ దంతకులగోత్రములు.

త్ర్యార్షేయగోత్రములు ౭.

౧ మునికుల, ౨ హారిశిష్టకుల, 3 చంద్రకుల, ౪ పోత్రలేఖకుల, ౫ చింతకుల, ౬ వ్రింగకుల, ౭ ఉపమన్యుకుల గోత్రములు.

చతురార్షేయగోత్రము ౧.

పౌత్రశీలకులగోత్రము.

దశార్షేయగోత్రము ౧.

పునగశీలకులగోత్రము.

వీట్లంగూర్చి ఆయాతావులందుఁ గాననగును.

## వైశ్రవణుఁడు:

[కుబేరుఁడు చూడుఁడు.]

## వైశ్వదేవము 3౮ విధములు:—

మహాహుతులు:— అగ్ని, విశ్వేదేవ, ధృవభూమి, ధృవక్షితి, అచ్యుతక్షితి, స్విష్టకృదగ్నులం గూర్చి చేయబడునవి.

బలులు ౨౪:— ధర్మదేవత, అధర్మదేవత, ఉదకము, ఓషధివనస్పతులు, రక్షోదేవజనులు, గృహ్యాములు, అవసానములు, అవసానపతులు, సర్వభూతములు, కాముఁడు, అంతరిక్షము, యదేనాములు, పృథ్వి, అంతరిక్షము, దివి, సూర్యచంద్ర నక్షత్రములు, ఇంద్ర బృహస్పతి ప్రజాపతులు, బ్రహ్మ స్వధా పితరులు, పశుపతి, రుద్రులు వీరింగూర్చి బలు లర్పించుట.

పంచయజ్ఞములు:— బ్రహ్మ మనుష్య భూత పితృ దేవయజ్ఞములు ౫.

అగ్రదానములు:— ధాన్యములు పరమేష్ఠింగూర్చి హోమము ౨, భూతబలి ౧. మొత్తము 3౮. ఇది జీవహింసాప్రయుక్త పాపనివృత్తికై నిత్యముఁ జేసెడికర్మ.

## వైశ్వానకిగోత్రము:—

(ఆత్రేయగణము చూడుఁడు).

## వైశ్వానరిగోత్రము:—

(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**వైశ్వానరుఁడు:**— ఒకయగ్ని. ఆంగీరససంతతి యనియు, శాండిల్యసంతతిలోని విశ్వానరునిపుత్రుఁడనియుఁ గాన్పించెడిని. కుమార్తె ఉపదానవి; హిరణ్యాక్షుని భార్య.

**వైషుగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**వైష్ణవధర్మము:—** వైష్ణవ మతధర్మమున జగత్సృష్టిస్థితిలయవిధానములు వేఱుగ నుండును. మహావిష్ణువే సర్వమునకుఁ గర్త్తయు, భర్త్తయు, నియామకుఁడు. మహావిష్ణుతత్వము ౧ స్వయం రూపమహావిష్ణువనియు, ౨ తదేకాత్మరూపమహా విష్ణువనియు, ౩ ఆవేశరూప మహావిష్ణువనియుఁ ద్రివిధముగ నుండును.

౧ స్వయంరూపమహావిష్ణువు.

ఇది స్వయంరూప మనియు, స్వయంప్రకాశ మనియు ద్వివిధము. అందు స్వయంరూపము వ్రజేంద్రనందనరూప మని చెప్పఁబడినది. రెండవది యగు స్వయంప్రకాశము ౧ ప్రభావమనియు, ౨ విభావమనియు, తిరుగ ద్వివిధముగ నయ్యెను. అందుఁ బ్రభావము బలరామరూపమనియు, రెండ వదియగు ఐశ్వర్య, మాధుర్య భేదములచే రెండు విధములనియుఁ జెప్పఁబడినవి.

ఐశ్వర్యమునకు మూలసంకర్షణ మనియుఁ బేరు కలదు. ఇది ద్వారకచతుర్భుజబలరామత్వ మనియు, బృందావన ద్విభుజబలరామత్వమనియు ద్వివిధముగ నుండును. ఇంక మాధుర్యము, ఆశ్ర యవిగ్రహత్వముగ నొప్పెడిని. ఇటుల స్వయం రూప మహావిష్ణు వొనరెడిని.

౨ తదేకాత్మరూప మహావి॥

ఇది ౧ స్వాంశ యనియు, ౨ విలాసమనియు, ద్వివిధము. అందు స్వాంశ ౧ పురుషత్వము, ౨ గుణము, ౩ లీలావతారములు, ౪ మన్వంత రావతారములు, ౫ యుగావ తారములు, ౬ అర్చావతార (విగ్రహ) ములునని షడ్విధము లుగ నుండును. ఇంక విలాసము, ఆదిచతుర్వ్యూ హ మనియు, ద్వితీయచతుర్వ్యూహ మనియు, తిరుగ రెండువిధములు. ఈ రెంటియందును నాలు గునాలుగు వ్యూహముల లక్షణములు వివరింపఁ బడినవి.

౧ స్వాంశ (తదేకాత్మరూపాంతర్గతము) ౬ భేదములు.

౧ పురుషత్వము:— ౧ కారణార్ణవశాయి మహా విష్ణువు, ౨ గర్భోదకశాయి మహావిష్ణువు, ౩ క్షీరోదకశాయి మహావిష్ణువు నని త్రివిధము.

౨ గుణము:— ౧ బ్రహ్మ, ౨ విష్ణు, ౩ మహేశ్వ రత్వము లని త్రివిధము.

౩ లీలావతారములు (౨౫)

| | |
|---|---|
| ౧ యజ్ఞవరాహ, | ౧౪ హరి, |
| ౨ సుయజ్ఞ, | ౧౫ వామన, |
| ౩ కపిల, | ౧౬ హంస, |
| ౪ దత్తాత్రేయ, | ౧౭ మన్వంతర, |
| ౫ కుమార, | ౧౮ ధన్వంతరి, |
| ౬ నరనారాయణ, | ౧౯ పరశురామ, |
| ౭ ధ్రువ, | ౨౦ శ్రీరామ, |
| ౮ పృథుచక్రవర్తి, | ౨౧ శ్రీకృష్ణ, |
| ౯ ఋషభ, | ౨౨ బలరామ, |
| ౧౦ హయగ్రీవ, | ౨౩ వ్యాస, |
| ౧౧ మత్స్య, | ౨౪ బౌద్ధ, |
| ౧౨ కూర్మ, | ౨౫ కలికి. |
| ౧౩ నృసింహ, | |

౪ మన్వంతరావతారములు ౧౪. ఇవి చతుర్దశ మనువులకాలములందుఁ గల్గిన మహావిష్ణువు యొక్క యవతారములు పదునాలుగు.

౧ స్వాయం. యజ్ఞావతారము.
౨ స్వారోచి. విభు అవతారము.
3 ఉత్తమ. శక్తిసేన అవతారము.
౪ తామస. హరి అవతారము.
౫ రైవత. వైకుంఠావతారము.
౬ చాక్షుష. అజితావతారము.
౭ వైవస్వత. వామనావతారము.
౮ సావర్ణి. సార్వభౌమావతారము.
౯ దక్షసా. రిషభావతారము.
౧౦ బ్రహ్మసా. విష్వక్సేన అవతారము.
౧౧ ధర్మసా. ధర్మసేతు అవతారము.
౧౨ రుద్రసా. సుధామావతారము.
౧3 దేవసా. యోగీశ్వరావతారము.
౧౪ ఇంద్రసా. బృహద్భాను అవతారము.

౫ యుగావతారములు ౪:—౧ సత్యయుగమున హరిఅవతారము శుక్లవర్ణము, ౨ త్రేతాయుగమున హయగ్రీవావతారము రక్తవర్ణము, 3 ద్వాపరయుగమున శ్యామావతారము కృష్ణవర్ణము, ౪ కలియుగమున కృష్ణావతారము పీతవర్ణము.

౬ అర్చావతార (విగ్రహ)ములు ౮:—శిలావిగ్రహముగ 'శైలీ' అవతారము, ౨ కఱ్ఱతోఁజేయఁబడి 'దారుమయీ' అర్చావతారము, 3 లోహముతోఁజేయఁబడి 'లౌహి' అర్చావతారము, ౪ లేపనము (రంగుల) తోఁజేయఁబడి 'లేప్య' (ము) అర్చావతారము, ౫ లిఖింపఁబడి, (చిత్రింపఁబడి లేక వ్రాయఁబడిన విగ్రహముగ) 'లేఖ్యము'. ౬ ఇసుకతోఁజేయఁబడిన విగ్రహముగ 'సైకతి' అర్చావతారము, ౭ మట్టితోఁజేయఁబడి 'మృణ్మయి' లేక 'మనోమయి' అర్చావతీ, ౮ మణితోఁజేయఁబడిన విగ్రహముగ 'మణిమయి' అర్చావతారము. ఇవి అష్టవిధార్చావతారములు.

౨ విలాసము (తదేకాత్మరూపాంతర్గతము) ౨ విధములు.

ఇంక రెండవదియగు విలాసమునందు ఆదిచతుర్వ్యూహమనియు, ద్వితీయచతుర్వ్యూహ మనియు రెండుగలవు. వీట్లయందు దేవస్థానములందుఁ బ్రతిష్ఠింపఁబడు విష్ణుదేవుని విగ్రహముల హస్తములు నాల్గింటియందుండు శంఖము, చక్రము, గద, పద్మములవిన్యాసము తెలియనగును. వీట్లిం




దెలియునిమిత్తము మన కెదురుగ మనవైపభిముఖమై విష్ణుదేవుని విగ్రహమున్నదని భావింపుఁడు. మఱియు నాల్గుచేతులలో రెండుచేతులు పైకిని రెండుచేతులు క్రిందికినినున్నవనికూడ భావింపుఁడు.

పైపై పునకున్న కుడిచేయి యొకటనియు, క్రిందివైపునకున్న విగ్రహముయొక్క కుడిచేయి రెండనియు, పైపైపుననున్న (విగ్రహముయొక్క) యెడమచేయి, మూఁడనియు, క్రిందివైపునకున్న (విగ్రహముయొక్క) యెడమచేయి నాల్గుగను భావించి, మనసునం దుంచుకొని (శంఖ చక్ర గదా పద్మములను) యాయాయుధముల నెఱుంగవలయును.

ఇంకను నీచతుర్వ్యూహములందుఁ గేశవాది శ్రీకృష్ణాంతముగ వింశతివ్యూహము లుండును. అట్టి విష్ణుదేవునివిగ్రహములు వైభవమూర్తులనియు, విలాసమూర్తులనియు ద్వివిధమూర్తులుగ నుండెడిని.

(౧) ఆదిచతుర్వ్యూహము. ఇది నాల్గు తెఱంగులు-

౧. వాసుదేవవ్యూహము ౧ గద ౨ శంఖ ౩ చక్ర ౪ పద్మము.

౨. సంకర్షణవ్యూహము ౧ గద ౨ శంఖము ౩ పద్మము ౪ చక్రము.

౩. ప్రద్యుమ్నవ్యూహము ౧ చక్రము ౨ శంఖము ౩ గద ౪ పద్మము.

౪. అనిరుద్ధవ్యూహము ౧ చక్రము ౨ గద ౩ శంఖము ౪ పద్మము.

(౨) ద్వితీయచతుర్వ్యూహము:—ఇదియు వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ భేదములచే చతుర్వ్యూహములుగ నున్నవి.

౧. వాసుదేవవ్యూహము:— ఇది యైదు ఉపవ్యూహములు కలది.

౧ కేశవ (ఉ. వ్యూ.) వైభవవిలాసమూర్తి. ౧ పద్మ, ౨ శంఖ, ౩ చక్ర, ౪ గద.

౧ నారాయణ (ఉపవ్యూ.) వైభవ విలాస మూర్తి. ౧ శంఖ, ౨ పద్మ, ౩ గద, ౪ చక్ర.

౩ మాధవ (ఉపవ్యూ) వైభవ విలాసమూర్తి. ౧ గద, ౨ చక్ర, ౩ శంఖ, ౪ పద్మ.

౪ అధోక్షజ (ఉపవ్యూ) విలాసమూర్తి. ౧ పద్మ, ౨ గద, ౩ శంఖ, ౪ చక్ర.

౫ పురుషోత్తమ [ఉపవ్యూ] వైభవవిలాసమూర్తి. ౧ చక్ర, ౨ పద్మ, ౩ శంఖ, ౪ గద.

౧ సంకర్షణవ్యూహము [ఐదుఉపవ్యూహములు.]

౧ గోవింద [ఉపవ్యూ] వైభవ విలాసమూర్తి. ౧ చక్ర, ౨ గద, ౩ పద్మ, ౪ శంఖ.

౨ విష్ణు [ఉపవ్యూ] వైభవవిలాసమూర్తి. ౧ గద, ౨ పద్మ, ౩ శంఖ, ౪ చక్రి.

౩ మధుసూదన [ఉపవ్యూ] వైభవవిలాసమూర్తి. ౧ చక్ర, ౨ శంఖ ౩ పద్మ, ౪ గద.

౪ ఉపేంద్రి [ఉపవ్యూ] వైభవవిలాసమూర్తి. ౧ శంఖ, ౨ గద, ౩ చక్ర, ౪ పద్మ.

౫ అచ్యుత (ఉపవ్యూ) విలాసమూర్తి. ౧ గద, ౨ పద్మ, ౩ చక్ర, ౪ శంఖ.

౩ ప్రద్యుమ్నవ్యూహము [ఐదుఉపవ్యూహములు]

౧ త్రివిక్రమ [ఉపవ్యూ] వైభవవిలాసమూర్తి. ౧ పద్మ, ౨ గద, చక్ర, ౪ శంఖ.

౨ వామన [ఉపవ్యూ] వైభవవిలాసమూర్తి. ౧ శంఖ, ౨ చక్ర, ౩ గద, ౧ పద్మ.

౩ శ్రీధర (ఉపవ్యూ) వైభవ విలాసమూర్తి. ౧ పద్మ, ౨ చక్ర, ౩ గద, ౪ శంఖ.

౪ నృసింహ (ఉపవ్యూ) విలాసమూర్తి. ౧ చక్ర, ౨ పద్మ, ౩ గద, ౪ శంఖ.

౫ జనార్దన (ఉపవ్యూ) విలాసమూర్తి. ౧ పద్మ, ౨ చక్ర, ౩ శంఖ, ౪ గద.

౪ అనిరుద్ధవ్యూహము [ఐదు ఉపవ్యూహములు].

౧ హృషీకేశ (ఉపవ్యూ) వైభవ విలాసమూర్తి. ౧ గద, ౨ చక్ర, ౩ పద్మ, ౪ శంఖ.

౨ పద్మనాభ (ఉపవ్యూహ) వైభవవిలాసమూర్తి. ౧ శంఖ, ౨ పద్మ, 3 చక్ర, ౪ గద.
3 దామోదర (ఉపవ్యూహ) వైభవ విలాసమూర్తి. ౧ పద్మ, ౨ శంఖ, 3 గద ౪ చక్ర.
౪ హరి (ఉపవ్యూహ) విలాసమూర్తి. ౧ శంఖ, ౨ చక్ర, 3 పద్మ, ౪ గద.
౫ శ్రీకృష్ణ (ఉపవ్యూహ) విలాసమూర్తి. ౧ శంఖ, ౨ గద, 3 పద్మ, ౪ చక్ర.

౩ ఆవేశరూపమహావిష్ణువు.

ఆవేశరూపము-మహావిష్ణువుయొక్క-శక్తి ఆవేశించుట యని భావము. ఈ (విష్ణు) శక్తిని పరాశక్తి యనియు, స్వరూపశక్తియనియు నందురు. మఱియు మహావిష్ణువుయొక్క-శక్తి ఆవహించుటను ముఖ్యావేశమని వైష్ణవమతగ్రంథములందు వాడియున్నారు.

పరమేశ్వరుఁడగు మహావిష్ణువే యొక్కొ-క ముక్తపురుషుని ఒక్కొ-కపనికి నియమించి, తన శక్తిని వానిపై నావహింపఁ జేయుట యిందలి భావము. సనకుఁడు, సనన్దనుఁడు, సనత్కు-మారుఁడు, సనాతనుఁడు, నారదుఁడు, పృథుచక్రవర్తి, పరశురాముఁడు, అనంతుఁడు, శేషుఁడు. ఇటుల మహావిష్ణువుయొక్క- నియామకముం గొని విష్ణుశక్తిచే నావహింపఁబడి తమ తమ నియమిత కార్యనిర్వహణ మొనర్చిన ముక్తపురుషులని చెప్పఁబడినది.

మహావిష్ణువుయొక్క-శక్తియగు పరాశక్తి (స్వరూపశక్తి) ౧ అంతరంగశక్తి లేక చిచ్ఛక్తి యనియు, ౨ తటస్థశక్తి లేక జీవశక్తి యనియు, 3 బహిరంగశక్తి లేక మాయాశక్తి యనియు త్రివిధము. ఇం దొక్కొ-కటి తిరుగ నందినీశక్తి, సంవిత్ శక్తి, హ్లాదినీశక్తి యని త్రివిధములుగ నైయుంట నవవిధశక్తులుగ నేర్పడియెడిని. ఇంకను ఈనవవిధశక్తులు నొక్కొ-కటి ప్రత్యేకప్రత్యేకముగ, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి యనెడి త్రివిధ భేదములంగల్గి యిరువదియేఁడువిధములుగ నేర్పడియెను.

మఱియుఁ జైతన్యవైష్ణవసిద్ధాంతధర్మమున ముఖ్యావేశమునకుఁ బిదప గౌణావేశమని మఱియొకయావేశము గలదు. దీనికి భావావేశ మనియుం బేరు కలదు. దీనిని విభూతి యనుచైతన్యమతస్థులు వాడుదురు. పరమేశ్వరుఁడగు మహావిష్ణువు [హరి] తేజ స్సొకరిపైఁబడి యాతనిమనస్సున వ్యాపించి, పనినొనరింపఁజేయుట గౌణావేశమని చెప్పఁబడినది. మరియు గౌణావేశమందుట విభూతినందుటయే యగును.

అట్టివిభూతినందినవా రార్గురు గోస్వాములు గలరు. వారు ౧ శ్రీరూపగోస్వామి, ౨ సనాతనప్రభు [గోస్వామి], 3 భట్టరఘునాథగోస్వామి, ౪ గోపాలభట్టగోస్వామి, ౫ జీవగోస్వామి, ౬ రఘునాథగోస్వామి యనువారలు.

## వైష్ణవపురాణస్థలములు:—

(పురాణస్థలములు చూడుఁడు.)

## వైష్ణవభక్తిపంచక భావనలు:—

శివభక్తియందు 'నవవిధభక్తి' చెప్పఁబడినటుల విష్ణుభక్తియందుఁ బంచవిధభక్తిభావనలు చెప్పఁబడినవి. ఈపంచభక్తిభావనలకు మూలస్థానము శ్రీకృష్ణునిజన్మప్రదేశమగు వ్రజమండలపవిత్రస్థానము.

౧ శాంతభక్తి- మనశ్శాంతిప్రదమై సంతోషయుతమైనభక్తిపారవశ్యమునకు 'శాంతభావ' మనిపేరు.

౨ దాస్యభక్తి- పరమేశ్వరుఁడగు విష్ణుదేవుని (కింకరత్వము) దాస్య మొనర్ప సంసిద్ధుఁడగు

టతోఁగూడిన యానందమునకు 'దాస్యభావన' లేక దాస్యభక్తి యనిపేరు.

3 సఖ్యభక్తి - నిష్కళంకమగు నిజస్నేహముగల వారి యన్యోన్యప్రేమలంబోలిన భక్తికి 'సఖ్య భావన'యనిపేరు.

4 వాత్సల్యభక్తి - పుత్రునందుఁ దలిదండ్రులకుండు బాధ్యతంబోలిన (విష్ణుదేవునందలి) భక్తికి వాత్సల్యభక్తి యనిపేరు.

5 మధురభక్తి - అన్యోన్యానురాగయుతులగు దంపతులం దన్యోన్యము వ్యాపించియుండునను రాగముంబోలినభక్తి పరమేశ్వరుండగు విష్ణుదేవునందు వ్యాపించియుండుటను 'మధుర భావన' లేక మధురభక్తి యనెదరు.

ఈయైదుభావనలుగల భక్తి నెఱపుచుందురు.

**వైష్ణవీదేవీక్షేత్రము [లతన్వాలీదేవి జ్వాలాముఖీ]:—** ఇది దేశప్రసిద్ధక్షేత్రము. దేవిని జ్వాలాముఖి యనియెదరు. కాంగ్రాజిల్లా డెహరా తహశీలునం దిది పురాతనస్థలము. ఇచటి దేవిని లతన్వాలీదేవి యనియు ననుచున్నారు. (జ్వాలాముఖి చూడుఁడు). దేవిముఖమునుండి నాలుకంబోలినజ్వాల వచ్చుచుండును. ఇట్టిజ్వాల లీదేవళమున నింకను కలవు. జాలంధరుఁడను సనుర నృపాలునిజ్వాల లని యందురు. గొప్పక్షేత్రము. దేవీపురాణ ప్రసిద్ధము.

**వైష్ణవ్యగోత్రము:—**
[వశిష్ఠగణము చూడుఁడు].

**వైహతిగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**వైహారము (పర్వతము):—** మగధ దేశపుఁ దొల్లింటిరాజధాని యగు గిరివ్రజపురము నంటియున్న యొకపర్వతము. (ఐదుపర్వతలలోఁ బ్రధానమైనది.) దీనింబట్టియే మగధకు విహారదేశ మనిగూడ పేరయ్యెను.

**వైహాదగోత్రము:—**
[విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు].

**వైహార్యారథిగోత్రము:—**
[అగస్త్య ఉపగణము చూడుఁడు].

**వొరల్డ్సుహైవేస్ (worlds high ways):—** (షిప్పుకెనాల్సు చూడుఁడు.)

**వొరమ్సు (Worms) పురుగులు:-** సన్నముగాను పొడవుగానుండుజాతి పురుగులకు 'worms' అని పేరిడియున్నారు. పాశ్చాత్యులీవొరమ్సు పురుగులను పరిశీలనము లొనర్చి తొమ్మిది భేదజాతులుగ నెంచిరి. నులిపురుగు లీజాతిలోనివే నట.

1 Slow worms వీటిని reptiles అనియు నందురు.
2 Ship worms వీటిని molluse అనియు నందురు.
3 Glow worms వీటిని insects అనియు నందురు.
4 Silk worms వీటిని పట్టుపురుగుల తెగయని యందురు.
5 Wire worms.
6 Blood worms.
7 Tape worms వీటిని eutozoasa అనియు నందురు.
8 Round worms.
9 Earth worms.

**వోలిగోత్రము:—**
(వశిష్ఠగణము చూడుఁడు.)

**వోరనోఫ్** (Voronoff):— ఈవైద్యశిఖామణిపేరు Serge Voronoff రష్యాదేశస్థుఁడు. పారిస్‌నగరమున విద్యాభ్యాస మొనర్చినవాఁడు. ౧౮౬౬ జూలై ౧౦ తేదీని జన్మించినవాఁడు.

వార్ధక్యము నరికట్టుటకు గొప్పపరిశీలన లొనర్చి monkey glands injuuction విధానమును బయలుదేఱఁదీసినవాఁడు.

**వోల్గానది** (Volga):— రష్యాదేశమునందు గొప్పనది. ఐరోపాఖండఁపు నదులందుఁ బొడవెక్కువ కలదని యందురు. వల్డాయిపర్వతములందు నీటియూటలుగల బురదనేలలం దుత్పన్నమై, పెక్కులుపనదులం జేర్చుకొనుచు, గొప్పనదిగ కాస్పియనుసముద్రపు టుత్తరతీరముంజేరి దానియందు సంగమించును. దీనిపొడవు ౨౪౦౦ మైళ్ళు.

జన్మస్థానము సముద్రఁపునీటిమట్టముపై నాఱువందల కించుకయధికము మాత్రమే. ఎత్తుగనుంటయు నిదిసంగమించు కాస్పియనుసముద్రఁపు నీటిమట్టముకన్న ౨౫౦ అడుగులయెత్తునసే జన్మించుటయు, ప్రవహించుప్రదేశ మంతయు సించుమించు సమతలముగనే యుంటయు, దీనిగమనమున మైలుకు నాలుగంగుళములకన్న నెక్కువలోతునకు దిగుటయే సంభవింపలేదు. దీనికిఁ దోడు దీనియందుఁజేరు నుపనదులును లోతుగలవిగ నుంట నీనదియం దోడల రాకపోకలకుం గడు దూరము వీలగుచున్నది.

దీనియందుఁ జేరుకొను నుపనదులలో, ఊరల్పర్వతమునుండి యరుదెంచు కామనదియును, పశ్చిమమునుండి యరుదెంచు ఓకానదియును, ముఖ్యములు. వోల్గానది యొకసరస్సునందు సంగమించుంగాన నతిశయమైనవఱదలు కల్గుటచేఁ బ్రక్కభూములు ముంపుడుగాకుండఁ బ్రధానములగుతావుల నీనదినుండి బాల్టిక్కుసముద్రమునకును, White sea కిని వోల్గానదినుండి నీరుప్రవహించిపోవుటకు గొప్పయోడలకాలువలం ద్రవ్వియున్నారు. దీనిపైభాగమునుండియే నీవానదిలోని కోడలకాలువం ద్రవ్వి కలిపియున్నారు. నీ వానదినుండి బాల్టిక్కుసముద్రమునకు మార్గమును గలదు.

ఎట్లయినను వోల్గాపరిసరములు వర్షము తక్కువగాఁగురియుప్రదేశములగుట నొక్కొకతఱి నీరుతక్కువయగుటయు నత్తఱి నోడలు నడుచుట కిబ్బంది గల్గుటయు సంభవించుచుండును. శీతకాలమున వోల్గానదియు, నుపనదులుఁగూడ ఘనీభవించి, మంచుగ బిగిసిపోవును. అత్తఱి స్లెడ్జిలోఁ బ్రయాణము లొనర్ప నీనదులు మార్గములే యగును.

వోల్గానదీముఖద్వారమున చేప లపరిమితములనియు నందురు.

**వోల్టు** (Volt):— Electro motive force యొక్కయు, pressure యొక్కయు, tension యొక్కయు, unit ను 'వోల్టు' అనెదరు. (కొన్నిచో) 'పోటెన్షియల్ డిఫరెన్సు' అని యర్థము. ఒక ohm. resistance గలఒక conductor నకు sleadely applied electrical pressure నుండి ఒక ampere current కల్గినదాని నొక volt అనెదరు.

ఒక Italian physiciat alessandro volta అనుపేరుగలపరిశీలకుఁడు క్రీ. వె. ౧౭౪౫-౧౮౨౭ కాలమున నుండినవాఁడఁట. ఆయనపరిశీలనలనుండి యీపేరు కల్గెను.

voltmeter పరికరము potential differences in volts ను తెల్పుచుండును. అది sensitive graduated galvanometer గాని యన్యముగాదని పరిశీలకు లనుచున్నారు.

**శంకరకవి:—** ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. ఆఱువేల నియోగి బ్రాహ్మణుఁడు.

ఈకవి నెల్లూరుప్రాంతవాసి యని C. P. బ్రౌన్ దొరగారును, అట్లుగాదు మాగోదావరీ మండలవాసియేయని శ్రీ॥ శ్రీ॥ రావుబహదూర్ కందుకూరి వీరేశలింగంపంతులువారును అభిప్రాయపడియున్నారు. ఏది నిజమైనను నీతఁడు రచించిన హరిశ్చంద్రచరిత్రము కృతినందిన యీడూరి యెల్లంరాజు (నియోగి) గోదావరీ దేశనివాసి. యీడూరుకరణ మని తోఁచుచున్నది.

**శంకరతీర్థము:—** నేపాలదేశమున, పటన్పురమునకు దిగువను మణిమతీనది భాగమతీనదిలో సంగమించుతావునఁ గల తీర్థము. ఇట రుద్రుఁడు యోగనిద్రయం దుండిన తావుగ స్వయంభుపురాణము ౮ అధ్యాయము ౨౯౮ పుటయందుఁ గలదు.

**శంకరాచార్యమఠములు:—** శంకరభగవత్పాదులు వేదమతవ్యాపకమునకు భరతదేశమున నాల్గుదిక్కులందు నాల్గుమఠములు స్థాపించిరి.

౧ ఉత్తరమున జ్యోతిర్మఠము. దీని నిప్పుడు జోషీమఠ మనుచున్నారు. బదరీనారాయణమున కేగుమార్గమున నున్నది. ఇది యానందగిరి యనుపేరుగల తోటకాచార్యులకు వశపఱచెనఁట. (అలకానందానదీతీరము).

౨ తూర్పున గోవర్థనమఠము లేక భోగవర్థనమఠము. ఇది యుత్కలదేశమున, జగన్నాథము (పూరీ) న నున్నది. దీనిని సనందనాచార్యుఁడను పేరుగల పద్మపాదాచార్యులకు వశపఱచెను.

3 దక్షిణమున శృంగగిరి (శృంగేరి) మఠము. ఇది మైసూరురాజ్యమున, కాడూరుజిల్లాయం (తుంగానది కెడమతట్టున) దున్నది. ఇట పర్వతము తొల్లింట విభాండకముని యిట కేతెంచి యాశ్రమనిర్మాణముఁ జేసికొనెనఁట. ఆయనసుతుండగు ఋష్యశృంగుఁ డంగదేశమున ఋష్యశృంగాశ్రమమున నుండువాఁడట. పిదప నాయనయు నిట కేతెంచి, యిటనే వసించుటంజేసి, 'ఋష్యశృంగగిరి' యని వాడుకయయ్యెనఁట. దానిసంక్షిప్తరూపమే శృంగగిరి, శృంగేరిగ నయ్యెనఁట.

ఇట శంకరభగవత్పాదులు తనమఠము నేర్పఱచి, శ్రీశైలక్షేత్రవాసియగు ప్రభాకరాచార్యులసుతుండగు పృథ్వీధరాచార్యునకు వశపఱచెనట. మఱియు నీతనికే హస్తామలకాచార్యుఁడనియుఁ బేరు వాడుకయుండెనఁట. ఇంకను దీనిపై ప్రధానశిష్యుండగు సురేశ్వరాచార్యుఁ డుండువాఁడఁట.

౪ పశ్చిమమున శారదామఠము. ఇది గుజరాతు లోని ద్వారకయందున్న మఠము. దీనిని పూర్వాశ్రమమున మండనమిశ్రుఁడనునామము గల విశ్వరూపాచార్యులకు వశపఱచెనఁట.

**శంకరాచార్యులు [శ్రీశంకరభగవత్పాదులు]:—** ఈమహాత్ముఁడు స్వల్పకాలమే జీవించినను అద్వైతసిద్ధాంతమతమును భరతదేశమున నెక్కువగా వ్యాపింపఁజేసిన వాఁడు. దేశమున నేమూల కేగినను వీరిబోధ కొద్దిగనో, గొప్పగనో కానఁబడుచుండుటయే గాక, విదేశములందుఁగూడ నీయద్వైతసిద్ధాంతము గాననగుచున్నది. ఇట్లనుటవలన నద్వైతసిద్ధాంతమునకు శంకరభగవత్పాదులు కర్త యనవీలులేదు. అదివఱకే యుండిన యద్వైతసిద్ధాంతమును నిర్గుణబ్రహ్మవాదము పరిణామముగను, సగుణబ్రహ్మవాద మాచరణాభ్యాసవిధానముగను, నొక చక్కనిమార్గమునకుం దెచ్చి, శాక్తేయమతభక్తి నతిశయముగఁ గల్గియుండిన మతబోధకుఁ డీయన గాఁ జెప్పఁదగినది. ఏనాఁటి సిద్ధాంతమైనను, నది వఱకే యుండినవిధానమైనను, విమతాక్రాంతమై చెడియుండినదుస్థితినుండి యుద్ధరించి, యష్టదిశలకు వ్యాపింపఁజేసినపని యీమహాత్ముఁడు జీవించియుండిన స్వల్పకాలమే పట్టుఁగొమ్మగా నుండినది. వీరి పవిత్రజీవనచరిత్రయు నాశ్చర్యముం గొలిపెడిని.

కేరళ మనుదేశమున, వృషభాచల మనుపర్వతముకడ, ప్రవహించుచుండు పూర్వవాహిని యగునదీతీరమున, శశలమను నగ్రహారము వీరిజన్మస్థానము. దానినిప్పుడు 'కాలాట్టి' యగ్రహార మనుచున్నారు. స్మార్తుల కొకవిధమగు యాత్రాస్థలముగ నున్నది. ఇట శంకరభగవత్పాదులదేవస్థానము నిర్మింపఁబడినది. వారినాఁటి శ్రీకృష్ణదేవస్థాన మొకటియుఁ గలదు.

వీరిజన్మకాలము కలియుగమున ౩౦౫౮ సంవత్సరములకు సరియగు నీశ్వర వైశాఖ శుద్ధ పంచమి, ఆదివార మనియు, ఆర్ద్రానక్షత్రమనియు, నిది క్రీ. పూ. ౬౭౭ అనియు నందురు. తల్లిపేరు ఆర్యాంబ. ఈమెతండ్రి మహాపండితుఁడు. పితామహునిపేరు విద్యాధినాథులు. తండ్రిగారిపేరు శివగురుస్వామి. (పతంజలిమహర్షి చూడుఁడు.)

మతావేశపుభక్తి మామూలుమేరకు వీరికిన్ని కొన్ని యర్థములేని మాహాత్మ్యములను వీరిమతస్థులగు చరిత్రకారులు వీరిజీవచరిత్రయందుఁ గల్పియుంట లేకపోలేదు. వీరు శంకరులయవతారమనియు, వీరిశిష్యులలో నొకరగు పద్మపాదాచార్యులు వాయువుయొక్క యవతారమనియు, తోటకాచార్య లగ్నియవతారమనియు, (మండనమిశ్రుఁడు) ఆయనభార్య సరస్వతీదేవి యవతారమనియు, వీ రొకప్పుడు గానరాకుండి యొక గుమ్మడికాయం బగులఁగొట్ట నందుండి వెడలి వచ్చిరనియు, వీరితో దేవత లందఱును భూమియం దవతరించి జన్మించిరనియు మొదలగు విపరీతములం గూడ వ్రాసి, యవి యన్నియు మాహాత్మ్యములుగ లెక్కించియున్నారు. ఈయద్భుతములకన్న వీరిజన్మకార్యమగు మతవ్యాపకమును, వీరురచించిన మతగ్రంథములును, అతి ప్రౌఢములై దనరుచు వేనోళ్ళ వీరిపవిత్రజీవనమును చాటుచున్నవి.

వీరికి విద్యాగురువు లెవ్వరో గాని, శంకరచరిత్రమున దూర్వాసమహర్షి యష్టాంగయోగము లభ్యసింపఁజేసెననియు, ఉపమన్యువు, దధీచి, గౌతముఁడు, అగస్త్యుఁడు, సకలవిద్యలు నేర్పిరనియుఁ జెప్పఁబడినది. వీరి కుపనయన మొనర్చినది వీరి

తండ్రిగారగు శివగురుస్వామియే నఁట. వారు మృతిఁ జెందినపిదప వీరితల్లిగారు శంకరులకు వివాహ మొనర్పఁ దలంచిరఁట గాని వీ రియ్యకొనక వలదని రఁట.

వీరు సన్యాసము స్వీకరింపఁ దలంప, వీరితల్లిగా రియ్యకొనరైరఁట. వీ రొకతఱి నదీస్నాన మొనర్చుచుండ నొకమొసలి వీరిం బట్టుకొనెనఁట. అటనే యుండిన వీరితల్లిగారు విలపించుచుండ, సన్యాసమున కంగీకరించుమని యన, తల్లిగారు సన్యసించియైనను బ్రతికియుండినఁ జాలు నని యొప్పుకొనిరఁట. మొసలియు వారిని వదలిపోయె నఁట. వీరు 'సన్యాసోస్మి' యని వచించి యింటికిఁ బోక, కృష్ణస్వామిదేవాలయమున నిలచి, యా దేవునికోర్కె మేరకు విగ్రహమును తులసివనమున వేఱొకతావునఁ బ్రతిష్ఠించి, యట భూమియందుండి ద్రవ్యముతో దేవాలయాదులు నిర్మింపుఁడని యచటివారికిం జెప్పి, వెడలిపోయి రఁట. వీరికి నారదర్షి, దత్తాత్రేయులు, విష్ణుతత్త్వోపదేశ మొనర్చిరని చెప్పఁబడినది. పిదప వైశాఖ శుద్ధ ద్వాదశిదినమున శంకరులు గోవిందభగవత్పాదులకడ యథావిధిగా సన్యాసము స్వీకరించిరని చెప్పఁబడినది. ఈగోవిందభగవత్పాదులు రసవాదము నుద్ధరించి, సిద్ధులై, జీవన్ముక్తి విధానమును బోధించిన సిద్ధులు. (పతంజలిమహర్షి చూడుఁడు.)

ఇంక నీసందర్భముననే గోవిందభగవత్పాదాచార్యులకాలముంగూర్చి కొంత చిక్కు తటస్థించుచున్నదని వివరింపవలసియున్నది. వీరిపూర్వాశ్రమ నామము చంద్రశర్మ యని చెప్పఁబడియుంటవా రెవరో, లేక వీరు వేఱొక గోవిందభగత్పాదులో సంశయింపవలసియున్నది. వ్యాకరణమహాభాష్యమును బ్రహ్మరాక్షసావస్థయందు నర్మదాతీరమున రావిచెట్టుపైనుండి పతంజలి వచింప, చంద్రశర్మ వ్రాసెనని చెప్పఁబడియుంట, నీసంశయము కల్గుచున్నది. పాణినిసూత్రములకు వృత్తిని (వాక్యములు) రచించిన వరరుచి [కాత్యాయనుఁడు] యును, భాష్యము రచించిన పతంజలియు, పాణినికిఁ బిదపవారై యుండవలసియుండును. పరిశీలనలు క్రీ. ము. ౧౫౦–౧౨౦ మధ్య మహాభాష్యము రచింపఁ బడెనని యనుచున్నారు. కొందఱు మగధభూపతియగు పుష్యమిత్రుని సమకాలికుఁడు పతంజలి యనుచున్నారు. సుప్రసిద్ధుండగు డాక్టరు భాండార్కరుపండితుఁడు క్రీ. ము. ఏఁడవ, లేక ఎన్మిదవశతాబ్దముల ప్రారంభమున మహాభాష్యము రచింపఁబడిన దనియున్నాఁడు. అప్పటికిఁ జంద్రశర్మ యిరువదివత్సరములవాఁడై యుండునెడ, సన్యాసము పిదప పదిసంవత్సరములలోఁ గైకొనినను పిమ్మట నఱువది లేక డెబ్బది సంవత్సరములు జీవించినను, గోవిందభగవత్పాదులు శంకరభగవత్పాదుల సమకాలికుఁ డౌట సంశయగ్రస్తము. దీనిని పరిశీలకులు పరిశీలించి, నిజస్థితిం దెల్పఁదగునని మాయాశయము.

శంకరులు సన్యాసస్వీకరణమునకుఁ బిదప మత బోధఁ జేయుచు భరతదేశమున తీర్థయాత్రలం దిరుగుచుండువారు. వీ రొకసమయమున నొక పంచమునిగూర్చి 'మనీషా పంచక' మను నైదు శ్లోకముల రచించిరి. అది "చండాలోస్తు సతు ద్విజోస్తు గురురి త్యేషా మనీషా మమ" అను మకుటముఁ గల్గియున్నది. ఇది వీరి సర్వోకులసమాన దృష్టిని బోధించుచున్నదని చెప్పుచుందురు. వీరి గురుండగు గోవిందభగవత్పాదు లొసంగిన చంద్రమౌళీశ్వరశివలింగము మొదలగువాటిని వీరిముఖ్య శిష్యులగు పద్మపాదాచార్యుల కొసంగిరఁట. (పద్మపాదాచార్యులు చూడుఁడు).

పద్మపాదాచార్యులు వీరికి ముఖ్యశిష్యులని చెప్పఁబడినది. కాశీయం దొకవిప్రుఁడు శంకరులకు 'వాఖ్యానసింహాసనాచార్యుం" డనుబిరుద మొసంగి రనియు, ఈతఁడు వ్యాసమహర్షి వహించిన మాయావేషధారి యనియుఁ జెప్పుచున్నారు.

శంకరులు కొంతకాలము ప్రయాగయందలి యక్షయవటచ్ఛాయను వసించుచుఁ దపంబొనర్చుచు, మతబోధ నాలించుచుండిరఁట. చేదిదేశమున మండనమిశ్రుం డనుగొప్ప విద్వాంసుని వాదమున నోడించి, శిష్యునిగఁ జేసికొని, సన్న్యాసమొసంగి, సురేశ్వరాచార్యుఁ డని పేరిడిరఁట. (సురేశ్వరాచార్యులు చూడుఁడు). వీ రిక్కాలముననే బ్రహ్మసూత్రములకు శంకరభాష్యమును రచించిరఁట. ఇంకను రచించినవి సౌందర్యలహరి ఉపనిషద్భాష్యము మొదలగునవికలవు. 'శివానంద లహరి" యను స్తోత్రశతకము సుప్రసిద్ధము. కరావలంబనస్తోత్రము శంకరకృతమే యనుచున్నారు.

శంకరభగవత్పాదులు శ్రీశైలమున శిఖరకలాయంత్రమును, కంచియందు గాళియంత్రమును, ప్రతిష్ఠించిరనియు, మళయాళభగవతి యనంబడు కొల్లూరునందలి మూకాంబ (ముండేశ్వరశివలింగముకడ) కుఁ గలారోహణ మొనర్చిరనియుఁ జెప్పఁబడినది. అచటికిఁ గతిపయదూరమునున్న శ్రీవల్లీపురవాసియగు నొకవిప్రుఁడు శిష్యుఁడై, హస్తామలకాచార్యుఁడని పేరందెనఁట.

శంకరులు దిగ్విజయయాత్ర సల్పిరని చెప్పఁబడినది. అత్తఱి కంచియందు, కామకోటియంత్ర స్థాపన మొనర్చిరని వాడుక గలదు. శంకరులు గౌడపాదాచార్యులకారికలకు భాష్యము రచించిరని చెప్పఁబడినది. వీ రింకను కాశ్మీరప్రవర పురమునకుఁ గతిపయదూరమున స్థాపింపఁబడిన సర్వజ్ఞపీఠము నధిరోహించి, 'గురుభూమండలాచార్య' బిరుదమందిరని బలమైనవాడుక గలదు. వీరి ముప్పదిరెండవవత్సరమున బదరీకేదారమున కేగి యట శివైక్యమైరని చెప్పఁబడినది.

వీరు స్థాపించినమఠములలోఁ బ్రధానమైనది శృంగగిరిపీఠము, తక్కినపీఠములును కలవు. (శంకరాచార్యమఠములు చూడుఁడు.)

**శంకాభి స్సర్వ మాక్రాంతమ్:**— ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. ప్రతివిషయమందు నేదో యొకశంకయైనను నుండనేయుండు ననిభావము.

**శంకుఁడు:**— యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. సోదరుఁడు కంసుఁడు. • వేఱొక శంకు మహావిద్వాంసుఁడు కలఁడు. (ఉజ్జయిని చూడుఁడు).

**శంకృతిగోత్రము:**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**శంకృత్యగోత్రము:**—
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**శంఖగోత్రము:**—
(హారిత ఉపగణము చూడుఁడు).

**శంఖణుఁడు:**— ఇక్ష్వాకసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి రఘుమహారాజు. కుమారుళ్ళు సుదర్శనుఁడు, అగ్నివర్ణుఁడు, శీఘ్రగుఁడు. (అగ్నివర్ణుఁడు చూడుఁడు.)

**శంఖతీర్థము:**— కురుక్షేత్రమున ద్వైతవనముకడ సరస్వతీనది యుత్తరతీరమునఁ గలదు.

ప్రశంస మహాభారతము. శల్యపర్వము. ౩౮ అధ్యాయమునఁ గలదు.

ఇంకను కాశీపట్టణమున దక్షిణభాగమునకు శంఖతీర్థమని పేరు కలదని, బృహన్నారదీయ పురాణము ౨-౪౭-౨౧ శ్లోకమునఁ జెప్పఁబడినది.

దక్షిణదేశమున చెంగల్పట్టుజిల్లాలోని పక్షితీర్థమునకడ, తిరుకళుకుండ్రి మను గ్రామమున నొక సరస్సునకు శంఖతీర్థమని పేరు కలదు.

## శంఖపుష్పి, శంఖపుష్ప లేక శంఖలత (దంతినచెట్టు):—

సం. కంజపుష్పి, కంజమాలినీ, మేధ్యా, శంఖపుష్పి, ఇంకను కంబుపుష్పా, కిరీటి, చండా, పీతపుష్పా, భూలగ్నా, మలవినాశినీ, మేధ్యా, శంఖాహ్వా, సుపుష్పి యనుపేర్లు వాడఁబడినవి. దీనిని తెల్లదంతినచెట్టనియు నందురు. కాని యిది వేఱుజాతిగ దోఁచెడిని. ఈలతాపుష్పములు శివార్చనకుఁ బ్రీతికరములని చెప్పఁబడినది. దీనియందు కాకఁ గల్గించు గుణము కలదందురు. దీనియందు, తెలుపు, నీలి, యెరుపురంగుల పూవులు పూచు మూఁడు జాతులు గలవు.

**శంఖము** :—శంఖము సముద్రపు గుల్ల జాతులలోనిది. నత్తగుల్లలు మొదలగుజాతులలో నొకజాతి. దీనిని రూపభేదములచే ముప్పదిరెండు భేదజాతులు గలదానినిగ లెక్కించియున్నారు. హిందువులు పరమేశ్వరారాధనయం దొకయుపచారముగ శంఖమును పూరించి ధ్వని జేసెదరు. తొల్లింటి భరతదేశపువీరులు యుద్ధకాలములందుఁ దాము యుద్ధసన్నద్ధుల మని శత్రువులకుఁ దెలియఁజేయ శంఖముం బూరించి ధ్వనిజేయుచుండిరి. అట్టిశంఖములకుఁ బేరులుండెను. విష్ణుదేవుని శంఖమునకుఁ బాంచజన్యమనియు, అర్జునుని శంఖమునకు దేవదత్త మనియు నిట్టిపేరులు వేర్వేఱుశంఖముల కుండినవి. విష్ణుమతస్థులు శంఖముతోఁ దీర్థముం గైకొనియెదరు, శంఖమునఁ బోయనిది తీర్థముగాదని సామెత యేర్పడినది. తెల్లనిశంఖమునకు 'ధవళశంఖ' మనియెదరు. దీని నుత్తమజాతిగ నెంచుచున్నారు. శంఖము మొదటఁగల తిరుగుడున కావృత్త మనిపేరు.

సర్వసాధారణముగ నన్నిశంఖములందు యీ వర్త ముత్తరమున నుండును. కాని చాల యరుదుగ దక్షిణావర్తముగ శంఖములు లభించును. ఇట్టివాటికి గొప్పవిలువ కలదు. ఎక్కువ మూల్యములకిని యమ్ముడుపోవును. కొన్నిశంఖములు ముత్యపుఁజిప్పను బోలినవన్నెఁ గల్గియుండును. ఇది చాలయరుదు. ఎక్కువవిలువఁ గల్గినవి.

శంఖములంగూర్చిన పరిశీలన లిటీవలఁ గొన్ని జరిగి యందు శంఖములజాతులు నూఱువఱకుం గలవని తేలినది. వాటిరూపము లీక్రిందఁ బొందుపఱుపఁబడినవి గాని వాటికి భరతదేశపునామములు బయల్పడకున్నవి. వాటి కాంగ్లమున నామము లిడియున్నారు. కాని యవి వాటియాకార లక్షణములనుండి పెట్టిన నవీననామములే గాని, వేఱేమియుం గావు. గాన వాటి నీయాంధ్రవిజ్ఞానము గైకొనలేదు.

## శంఖములో పోస్తే తీర్థము, పెంకులో పోస్తే నీళ్లు:—

[ఆంధ్రలోకోక్తి].

**శంఖర్షిగోత్రము**:— వీరికిఁ బ్రధానర్షి ఆంగిరసుఁడు. ప్రవరరూపము ఆంగిరస, అంబరీష, యావనాశ్వ యనియుఁ జెప్పఁబడినది. శిష్టుకరణములలో బాదంగివారు అనుయింటిపేరువారీగోత్రజులై యున్నారు.

(శిష్టుకరణములు చూడుఁడు.)

**శంఖరేఖ:—**
[పురుషసాముద్రికము చూడుఁడు. స్త్రీసాముద్రికము చూడుఁడు.]

**శంఖహస్తము:—**
(హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు).

**శంఖానది:—** చూటియా నాగపూర్ డివిజనులోని బ్రిహ్మణీనదిలో సంగమించు నొకచిన్న నది. దీనిప్రశంస మహాభారతము వనపర్వతము ౮౩ అధ్యాయమునఁ గలదు. దీని నచటివారు శంఖిణీనది యనియు ననుచున్నారు.

**శంఖినీనాడి:—**
(అష్టాంగయోగములు చూడుఁడు.)

**శంఖుఁడు:—** తండ్రి విరాటరాజు. (జ్యేష్ఠపుత్రుఁడు). సోదరుఁడు ఉత్తరుఁడు. సోదరి ఉత్తరి. (అభిమన్యుని భార్య.)

**శంఖుస్థాపనము:—** శిల్పశాస్త్రమునఁ జెప్పఁబడిన కర్మలకుఁ బ్రారంభకర్మకుఁ బేరు.
[శిల్పశాస్త్రము చూడుఁడు].

పదునాఱంగుళముల పొడవును, ఎన్మిదంగుళముల చుట్టుకొలతయు శంఖునకు గల్గియుండవలయును. ఎన్మిదికోణములుగల్గి శంఖాకృతిగ శంఖు రాతితోఁగాని, కఱ్ఱతోఁగాని చేయఁబడవలయును. గృహాదులకుఁ గఱ్ఱతోను, దేవాలయాదులకు రాతితోను, శంఖు చేయఁబడవలెనని చెప్పఁబడినది. మఱియు శంఖుస్థలమున నీశాన్యమూలను స్థాపించవలయునని చెప్పఁబడినది. ఇది చిత్తిమయముగ స్థాపింపవలయును. దేవాగారములందు శిలాశంఖు యవాగారమానముచేతను, మనుష్యోపయోగార్థములగు గృహాదులనిర్మాణమున శంఖు కఱ్ఱతోఁ జేయఁబడునదిగను నుండవలెనని చెప్పఁబడినది. అట్టిశంఖుకర్త యొక్క మధ్యవ్రేలియంగుళములకొలతతోనే యొసర్పవలయునని చెప్పఁబడినది.

ఇంకను మతాంతరమున మగధదేశప్రమాణము వివరింపఁబడినది. అది బ్రాహ్మణులకుఁ బదునాఱంగుళములు, క్షత్రియులకుఁ బదునేన [౧౫] ఙ్గుళములు, వైశ్యులకుఁ బదునాలుగంగుళములును, ఇతరవర్ణములవారికిఁ బదమూఁడంగుళములని విధింపఁబడినది. ఆపరిమాణములందు సగభాగము వర్తులాకారముగ నుండవలెనని చెప్పఁబడినది. సరియగు దిక్కుల నెఱుఁగుట కిక్కాలమున దిక్కులం జూపుయంత్రములు కలవుగాన వేఱుగ వ్రాయనక్కఱలేదు.

ఇంకను మతాంతరమున శంఖు ద్వివిధమనియు, నివివఱకుఁ జెప్పఁబడినది పురుషశంఖునియు, మొదట మూఁడుకోణములు, మధ్యభాగమున నాల్గుకోణములు, కొన నెన్మిది కోణములు గల్గి పదునాలుగంగుళముల పొడవుగలది స్త్రీశంఖు అనం బడుననియు, పురుషులకుఁ బురుషశంఖు, స్త్రీలకు స్త్రీశంఖు, దంపతు లుభయులగుతఱి నుభయశంఖులును, నపుంసకులకు స్త్రీశంఖును, జెప్పఁబడినవి. మఱియు సందే దేవాలయములకు మధ్యను, ఇండ్ల కీశాన్యమూలను, రాక్షసనిర్మాణములందు నైఋతిమూలను, శంఖుస్థాపనము విధింపఁబడినది.

**శంఖోద్ధారము (ద్వీపము):—** కచ్ఛసంయుక్తాగ్రిగుడమున నైరుతిదిశకడను గుజరాతునకుఁ జేరి యిప్పుడు 'బెయట్' అనియు, 'బిట' యనియుఁ బిలువఁబడుచున్న యొకద్వీపము. ఇట విష్ణుదేవుఁడు శంఖాసురుని వధించి, వేదములకు విడుదలఁ గల్గించి యుద్ధరించెనని పద్మపురాణము ౨౧ అధ్యాయమునఁ గలదు.

**శండిలగోత్రము:—**
(శండిలగణము చూడుఁడు.)

**శంతనుఁడు [మహారాజు]:—** అత్రి చంద్ర పూరువు కురు సంతతిక్షత్రియుఁడు. తండ్రి ప్రదీపుఁడు. పితామహుఁడు జహ్నువు. సోదరులు దేవాపి, బాహ్లికుఁడు. పుత్రులు భీష్ముఁడు, చిత్రాంగదుఁడు, విచిత్రవీర్యుఁడు. తల్లి సునంద. మానవరూపధారిణి యగు గంగయందు భీష్ముఁడును, రెండవభార్యయగు సత్యవతి (దాశరాజు పెంపుడుకుమార్తె) యందుఁ జిత్రాంగదుఁడు, విచిత్రవీర్యుఁడు నితనికిం గుమారులు. శంతన మహారాజు సముద్రుని యవతారమని చెప్పఁబడిన వాఁడు.

**శంభుగోత్రము:—**
(జాతుకర్ణ్యగణము చూడుఁడు.)

**శంభుగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుడు).

**శంభుఁడు:—** శంభుశబ్దము పరమేశ్వరునకు వర్తించును. మఱియు నిక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁ డొకఁడు శంభుఁడు కలడు. తండ్రి యంబరీషుఁడు. పితామహుఁడు నాభాగుఁడు. సోదరులు విరూపుఁడు, కేతుమంతుఁడు.

**శంభునాథుఁడు:—** జైనతీర్థకరులలో నొకఁడు. (తీర్థకరులు చూడుఁడు).

వీరిచిహ్న మశ్వము. ఇక్ష్వాకువంశక్షత్రియుఁడు. తండ్రి జితారి; తల్లి సేనాదేవి. జన్మస్థలము శ్రావస్తిపురము. పొడవు ४०० ధనుస్సులు. (ధనుస్సు మూఁడున్నరమూర). సువర్ణచ్ఛాయ. ఆయువఱువదిలక్షలు. గణధర్ ౧౫౦. నిర్వాణస్థలము సుమేరుశిఖరము. (శిఖర్‌జీ లేక ఆజా (అర్బుద పర్వతశిఖరము). పదిలక్షకోట్ల సాగర్ అని వీరింగూర్చి చెప్పఁబడినది.

**శంయుఁడు:—** ఒకయగ్ని. తండ్రి బృహస్పతి. తల్లి సత్య. యాగములందు మొదటి హవిస్సునందలి యాజ్యమును గైకొనువాఁడు.

**శ్వఃకార్య మద్య కుర్వీత ఇతి న్యాయము:—** రేపు చేయఁదగిన కార్యము నేఁడే చేయవలయునని యర్థము. ఆలసింపఁ జనదని భావము.

**శకటరేఫము:—** దీనిని బండిరా యక్షరమనియు నందురు. 'ఱ' అని వ్రాయుదురు. 'ర' అక్షరమునకు రేఫ మనియు, బండి 'ఱ' అక్షరమునకు శకటరేఫ మనియు సంస్కృతపర్యాయపదము. బహుశః ఆదికాలము శకటము యొక్క పరమువలె నీయక్షరముంట నీ పేరందియుండనోపు. 'కవిసంశయవిచ్ఛేద' మను గ్రంథమున నీరెండు రేఫములకుఁ గలభేద మిట్టుల వివరింపఁ బడినది.

గీ॥ ఊది వల్కుచోట నొగిఁ దేల్చి పలికిన
రేఫ కాదు శకటరేఫ గాని
తద్భవపదములను దవిలినయారేఫ
రేఫ గాని శకటరేఫ కాదు.......

[అడిదము సూరకవి.]

**శకటహస్తము:—** (హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.)

**శకద్వీపదేశము- సిథియాదేశము- సోగ్డినాదేశము:—** ఇది మధ్యఆసియా (Central Asia) లోనిది. తర్కిస్థానము కలసిన తార్తారదేశము. సిథియా, సోగ్డినా పదములు రెండును శకద్వీప మనుశబ్దముయొక్క వికార

రూపములే యని పెక్కండ్రి యభిప్రాయము. శకద్వీపవాసులు శకులు. తొల్లింటి శకస్థానము లేక శకద్వీపము నంతటను వ్యాపించకపూర్వము సిస్తాన్ పురమునకు, ఆప్రాంతములను కుదిరి, పిదప ద్వీప మంతటను వ్యాపించిరని తెలియుచున్నది. ఒకప్పుడు ద్రాంగియానాగా నుండినశబ్దము వీరినుండి శకస్థానమై సిజస్థానమై సిస్తాన్ అయినదని తలంపఁబడుచున్నది. ఈదేశపుఁ బ్రజలు పలు తెగలవారు. అందు యుష్టి లేక యుహ్చి లనంబడువారైదు తెగలు. అందు 'కుషాను' లనంబడువారిలోని వాఁడె కాశ్మీరదేశమేలిన కనిష్టమహారాజు. (తార్తారుశాఖ).

పురాతనపు టార్యులగ్రంథములందుగల వీరి తొల్లింటి సంస్కృతపుఁబేర్లకును ప్టోలెమీ తన భూగోళమున వ్రాసుకొనినపేర్లకును గలసంబంధ రూపముల నిట వివరింతుముగాక. పరిశీలకులు వీటిసంబంధముం గుర్తించి తెల్పియున్నారు.

మహాభారతము భీష్మపర్వము ౧౧ అధ్యాయమున శకద్వీపదేశము లిట్లు వివరింపఁబడినవి.

౧ కుముదదేశము— ఇది ఆక్సస్ జిక్సారిటీస్‌నదుల జన్మస్థానముల మధ్యనున్న కొండలదేశమని పోల్చఁబడినది. నివాసులు 'కొమెద్దై' యనంబడు తెగవారు.

౨ సుకుమారదేశము— నివాసులు 'కొమరోయి' యనంబడు తెగవారు.

౩ జల్లదదేశము— నివాసులు 'గోలక్తోఫాగోయి' యనంబడు తెగవారు.

౪ జలంధరిదేశము— నివాసులు 'శాలాతెరోయి' తెగవారు.

మఱియు జనపథదేశము లని మూఁడు చెప్పఁబడినవి.



౧ మృగదేశము— మార్గైన్ లేక మార్గియానా. దీని నిప్పుడు మేర్వ్ని వాడుచున్నారు.

౨ మశకదేశము— నివాసులు 'మస్సగెతాయి' తెగవారు.

౩ మద్గదేశము— నివాసులు 'మఖెతెగోయి' తెగవారు.

విష్ణుపురాణము ద్వితీయపటలము చతుర్థాధ్యాయమునందు వివరింపఁబడినవి.

౧ కుసుమోదదేశము— నివాసులు 'ఖొరాస్మోయి' తెగవారు.

౨ మోదాదిదేశము— నివాసులు 'మర్డ్యెనోయి' తెగవారు.

పర్వతములు—నదులు మొదలగునవి.

౧ మేరుపర్వతము- దేశీయమగు వాడుకపదము 'ఇమూస్'.

౨ మలయపర్వతము- దేశీయమగు వాడుకపదము 'అలస'.

౩ శ్యామగిరి- దేశీయమగు వాడుకపదము 'కొకోసోస్' దీనికర్థము. నల్లనికొండయని తేలుచున్నది. పారశీకుల జెండవెస్తాయందు 'శామక' అని గన్పించుచున్నది.

సితానది—దేశీయమగు వాడుకపేరు 'సిర్దారియా'. ఇందు 'డారియా' యనునది ప్రవాహమున కర్థమౌట. గ్రీకులును, వారియుచ్చారణనే గైకొనిన యాంగ్లులును, జాక్సారిటీస్ అని యీనదికిఁ బేరిడియున్నారు.

చక్షు లేక చక్షువర్ధనానది-ఇక్షునది యనియు దీనికి, తొల్లింటి నామము కలదు. దీనికి దేశీయమగు వాడుకపేరు 'ఒక్సోస్' నది. గ్రీకులు, నాంగ్లులు ఆక్సస్‌నది.

హిరణ్యావతీనది- (మహాభారతము ౬-౮) దీనికి దేశీయమగు వాడుకపేరు 'జరఫ్షాన్'. బంగారముంబంచుటయని దీని కర్థమఁట. ఈనది మహాభారతమున సుపర్ణుల గరుడుల దేశములయెల్లగా శాకద్వీపముండినటులఁ జెప్పఁబడినది.

భాగవతము పంచమస్కంధము- ౨౪ యందు హాటకీనది రసాతలమునఁ గలదని చెప్పఁబడినది. హాటకి యన బంగారమని యర్థము. ఈనది ఘాంఘాపర్వతమున జనించి, కరకుల్సాగరమున సంగమమగుచున్నదని యీదేశస్థు లందురు.

అస్తగిరి-దేశీయమగు వాడుకనామము 'అస్కతగ్క్'. తంగ్క యన పర్వతమని యర్థమఁట. దుర్గశైలము దేశీయమగు వాడుకనామము 'ఎల్బురుతంగ్క్'. బుర్జుయన దుర్గమని యర్థమఁట. మార్కండపురము-దేశీయమగువాడుకపదము 'సమర్కండ్'. ఇది సోగ్దినాదేశమునఁ బ్రధాననగరము. సోగ్దినాకుతొల్లింట నొకప్పుడు 'మరకండ్' అని పేరుండినటుల Mac crinleds in vasion of India by Alexander అనుగ్రంథమున ౪౦ పుట యందుఁ జెప్పఁబడియున్నది.

**శకములు:—** కృతయుగమున— ౧ హరిశ్చంద్రశకము, ౨ నలశకము, 3 పురుకుత్సశకము, ౪ పురూరవశకము, ౫ సగరశకము, ౬ కార్తవీర్యశకము, (షట్చక్రవర్తుల శకములు.)

త్రేతాయుగమున—౧ మాంధాతృశకము, ౨ దిపశకము, 3 రఘుశకము, ౪ అజశకము, ౫ దశరథశకము, ౬ శ్రీరామశకము నని చెప్పఁబడినది.

ద్వాపరయుగమున—౧ నహుషశకము, ౨ యయాతిశకము, 3 దుష్యంతశకము, ౪ శంతనుశకము, ౫ విచిత్రవీర్యశకము, ౬ పాండుశకము నని చెప్పఁబడినది.

కలియుగమున— ౧ యుధిష్ఠిరశకము, ౨ విక్రమశకము, 3 శాలివాహనశకము, ౪ విజయనందనశకము, ౫ నాగార్జునశకము, ౬ కల్కిశకము నని చెప్పఁబడినది. ఇవి పురాణోక్తశకములు కాని వేఱ్వేఱుదేశములం దింకను వేఱ్వేఱుశకములు వాడుకయం దున్నవి.

మహమ్మదీయులు మహమ్మదుజగద్గురుని జన్మమాదిగ ఫసలీ యనుశకమును, ఆయన మక్కావీడి మదీనాకు పలాయనమైనదాదిగ హిజరీశకమును వాడుచుందురు.

కైస్తవులు యేసుక్రీస్తుప్రభుని కాలమునుండి తమశకమును లెక్కించుచున్నారు. క్రీస్తు పూర్వకాలమును B. C. అనఁగా (Before chirst) అనియెదరు. క్రీ. వె. యనుటకు Anno Domini (A. D.) అనియెదరు. క్రైస్తవులు భక్తిపారవశ్యమున in the year of Lord అనుచుండుటయుం గలదు.

ఈక్రీస్తుశకముసందర్భమున నొకవ్యత్యాసము చెప్పఁబడినది. క్రీస్తుజన్మదినముగ క్రీష్టమసుపండుగను డిశంబరు ౨౫ తేది నాచరించుచుంట నెల్లరెఱింగినదే. ఇట్లయ్యు జనవరి ౧ వ తేదీనుండి సంవత్సరము లెక్కింపఁబడుచున్నది. మఱియు A. D. ౧ వ సంవత్సరము యేసుక్రీస్తుజన్మసంవత్సరము కాదనియు, ఆయన B. C. ౬ ౧ జన్మించెననియు తర్వాతిసంవత్సర మనియుంగూడ పలుగ్రంథములందుఁ జెప్పఁబడియున్నది. ఎట్లైనను ప్రభుత్వావలంబనచే వాడుకనంది యున్నది.

యూదులు తమలెక్కమేరకు సృష్ట్యాదిగ శకమును లెక్కించుచుందురు. వీరిశకమునకు anno

mundi (a. m.) అనుచున్నారు. రోమనులు రోమకపురినిర్మాణమాదిగ శకమును లెక్కింతురు.

**శకలతీర్థము:—** గుజరాతుదేశమున బ్రోచి (లేక బరోచి) (తొల్లింటిభరుకచ్ఛపురము) కడ నర్మదానదియందున్న స్నానతీర్థము. బ్రోచి పురమునుండి పదిమైళ్ళ దూరము.

ఇట నదియం దొకద్వీపమున నొకగొప్పవట వృక్షము కలదు. దానిని కబీరుభక్తుఁడు నాటెనట. దానిక్రిందుగఁ బదివేలజనులు విడియఁదగు నంతటిదని చెప్పుదురు. దానికిఁ గబీరు వాడి యని పేరిడియున్నారు.

**శకలదేశము:—** ఈపేరుగలదేశ మొకప్పుడుండినదని తెలియుటకలదు. దీనినిగూర్చి యేమియుం దెలియరాకున్నది. బహుశః శకలపురప్రాంతమైయుండనోపు.

**శకలపురము:—**
(శాకలపురము చూడుఁడు — మద్రదేశము చూడుఁడు.)

**శకవంశనృపతులు [ఇండోసిధియను నృపతులు]:—** వీరు గ్రీకునృపతులం జయించి, క్రీవి లేక అరాతిదేశమనంబడిన పాంచాలదేశ భాగముల నేలిరి. వీరిపాలనము క్రీ. పె. ౭౦ మొదలు ౧౫౬ వఱకు (డెబ్బదియెన్మిదివత్సరములు). వీరు ౧ వొనొనోయిస్, ౨ స్పార్లిరిసీస్, 3 ఒకటవఅజాన్, ౪ అజీలీసిస్, ౫ రెండవఅజాన్, ౬ మాయిాస్, [మొంగ] అనువార్గురు. వీరిశకము వొనొనోయిస్ పరిపాలనప్రారంభము. వీరిలోఁ గడపటివానిపాలన ఇండోపార్తియన్ నృపుఁడగు గొండోపారిస్‌వలన నోడి యంతమయ్యెను. ఇండోపార్తియనులకు పహ్లావు లనిపేరు కలదు. [క్రీవి దేశము చూడుఁడు.]

సత్యసింహుఁడు, రుద్రసింహుఁడు, ననువార లవంతి లేక మాళవదేశమును క్రీ. పె. 3౭౫ ప్రాంతముల నేలినవారు. రుద్రసింహుఁడు సముద్రగుప్తుని రెండవసుతుండగు [దత్తాదేవిసుతుఁడు] రెండవచంద్రగుప్తుఁడనంబడిన విక్రమాదిత్యునిచే నిహతుఁడై నవాఁడు. [అవంతి లేక మాళవ దేశము చూడుఁడు].

**శకిలాకిగోత్రము:—**
(ఆత్రేయగణము చూడుఁడు.)

**శక్తి [ఋషి]:—** విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షి యని యొప్పుకొనిన వశిష్ఠపుత్రుఁడు. శక్తి యొక్కకుమారుఁడు పరాశరుఁడు. [పరాశరుఁడు చూడుఁడు].

**శక్తిగోత్రము:—**
[కపియుపగణము చూడుఁడు].

**శక్తిచాలసముద్ర:—** యోగాభ్యాస విధానమునఁ జెప్పఁబడిన వింశతిముద్రలలో నొకటి.

పద్మాసనాసీనుఁడై రెండు నాసికారంధ్రములను మూసి, జాలంధరబంధముతోఁ గంఠము దాఁటి, వాయువుపైకివెళ్లకుండ లోనఁ గుంభించి, ఉడ్డీయాణబంధముచే వాయువు నొక్కఁగా (అనఁగా నాభిస్థానమును వెన్నెముకకంటునట్టుల నొక్కఁగా) కంఠస్థానమున నిద్రించుచుండలిసీశక్తి మేల్కొని, సుషుమ్నామార్గమునం బ్రవేశించునని యు, ఈయభ్యాసమువలన సమాధి అవస్థ సిద్ధింప వీలుగలుగునని యుఁ జెప్పఁబడినది.

## శక్తిపీఠములు:—

అష్టోత్తరశత శక్తిపీఠములు:— [ఇవి రెండు విధములుగఁ జెప్పబడినవి.]

శ్లో॥ వారణశ్యాం విశాలాక్షీ
నైమిశే లింగధారిణీ ౨
ప్రయాగే లలితాశక్తిః
కాముకా గన్ధమాదనే ౪
మానసే కుముదాశక్తిః
విశ్వకా యాఖిలేశ్వరీ ౬
గోమన్తే గోమతీరూపా
మందరే కామచారిణీ ౮
మదోత్కటా చైత్రరథే
జయన్తీ హస్తినాపురే ౧౦
కనాకుబ్జపురే గౌరీ
రంభా మలయపర్వతే ౧౨
ఏకామ్రకే కీర్తిమతీ
విశ్వా విశ్వేశ్వరస్థలే ౧౪
పుష్కరే పురుహూతాఖ్యా
కేదారే మార్గదాయినీ ౧౬
నన్దాఖ్యా హిమవత్పృష్ఠే
గోకర్ణే భద్రకర్ణికా ౧౮
స్థానేశ్వరే భవానీ చ
బిల్వకే బిల్వపత్రికా ౨౦
శ్రీశైలే భ్రామరీశక్తిః
భద్రా భద్రేశ్వరీ తథా ౨౨
జయా వరాహశైలాగ్రే
కమలా కమలాలయే ౨౪
రుద్రకోట్యాన్తు రుద్రాణీ
కాళీ కాలంజరే తథా ౨౬
కపిలాచ మహాలింగే
సాకేతౌ కమలేశ్వరీ ౨౮
సాలగ్రామే మహాదేవీ
శివలింగే జలప్రియా ౩౦
మాయాపుర్యాం కుమారీ చ
లలితా సంతానసుస్థలే ౩౨
ఉత్పలాఖ్యే సహస్రాక్షీ
హిరణ్యాక్షీ మహోత్పలే ౩౪
గయాయాం మంగళాదేవీ
విమలా పురుషోత్తమే ౩౬
విపాశాయా మఘోరాక్షీ
ఆటలా పుండవర్ధనే ౩౮
నారాయణీ సుపార్శ్వేచ
త్రికూటే రుద్రసుందరీ ౪౦
విపులే విపులాశక్తిః
కల్యాణీ మలయాచలే ౪౨
కోటీచ కోటితీర్థే తు
సుగన్ధా మాధవస్థలే ౪౪
గోధాశ్రమే త్రిసంధ్యా చ
గంగాగ్రే తూత్తరీ మతా ౪౬
శివకుండే శివానందా
నందినీ దేవికాతటే ౪౮
ద్వారావత్యాం రుక్మిణీ చ
రాధా బృందావనాంతరే ౫౦
మధురాయాం దేవకీశక్తిః
పాతాళే పరమేశ్వరీ ౫౨
సితాద్రా చిత్రకూటాఖ్యే
వింధ్యే వింద్యాద్రివాసినీ ౫౪
సహ్యాద్రా ఏకవీరా చ
హరిశ్చంద్రే తు చంద్రికా ౫౬
రమణాఖ్యా రామతీర్థే
యామునాయా మృగావతీ ౫౮
కరవీరే మహాలక్ష్మి
ఉమాదేవీ వినాయకే ౬౦
అరోగా వైద్యనాథేచ
మహాకాళే మహేశ్వరీ ౬౨

ఉష్ణతీర్థే భయాశక్తిః
అమృతా వింధ్యకందరే ౬౪
మాండవ్యే మాండవీదేవీ
స్వాహా మాహేశ్వరస్థలే ౬౬
ఛకలాండే ప్రచండా చ
చండికా అమరకంటకే ౬౮
సోమేశ్వరే వరారోహా
ప్రభాసే పుష్కరావతీ ౭౦
సరస్వత్యాం దేవమాతా
పరాశక్తిః పరాతటే ౭౨
మహాలయే మహాభాగా
పయోష్ణ్యాం పింగళేశ్వరీ ౭౪
సింహికా కృతశౌచే తు
కార్తికేయే తు శాంకరీ ౭౬
ఉత్పలావర్తకే లోలా
సుభద్రా శోణసంగమే ౭౮
మహాసిద్ధవనే లక్ష్మీ
అనంగా భరతాశ్రమే ౮౦
జాలంధరే విశ్వముఖీ
తారా కిష్కింధపర్వతే ౮౨
దేవదారువనే పుష్టి
కాశ్మీరేతు సరస్వతీ ౮౪
హిమాచలేతు భీమాఖ్యా
తుష్టిర్వస్త్రేశ్వరే తథా ౮౬
కపాలమోచనే శుద్ధి
మాయా కాయావరోహణే ౮౮
శంఖోద్ధారే ధ్వనిశ్శక్తిః
ధృతీ పిండారకే తథా ౯౦
కలాఖ్యా చంద్రభాగాయాం
అచ్ఛోదే శివధారిణీ ౯౨
వేణుక్షేత్రేమృతా శక్తిః
వర్చసీ బదరీవనే ౯౪

ఓషధీ చోత్తరక్షేత్రే
ప కుశోదకా
మన్మథా హేమకూటే తు
కుముదే సత్యవాదినీ
అశ్వత్థే వన్దనీయాఖ్యా
నిధీ వైశ్రవణాలయే ౧౦౦
వేదారణ్యేతు గాయత్రీ
మహారాష్ట్రేతు పార్వతీ ౧౦౨
ఇన్ద్రాణీ దేవలోకే చ
బ్రహ్మాస్యే తు సరస్వతీ ౧౦౪
సూర్యబింబే ప్రభాశక్తిః
వైష్ణవీ మాతృకాతలే ౧౦౬
అరుంధతీ సతీక్షేత్రే
రామాయాన్తు తిలోత్తమా ౧౦౮

**శక్తిపీఠములు [౧౦౮]** శక్తిపీఠములు నూటయెనిమిదిగ దేవీభాగవతమున నవమస్కంధమున జెప్పఁబడినది. తంత్రచూడామణిలో మహాశక్తిపీఠము లేఁబదిరెండుగ జెప్పఁబడినవి. (మహాశక్తిపీఠములు చూడుఁడు.) కాళికాపురాణమున నిరువదియాఱు ఉపపీఠములు వివరింపఁబడినవి. దేవీవినోదస్థానములుగ నలువదినాల్గు పీఠములు పేర్కొనఁబడినవి. పదునెనిమిదిపీఠములు మిక్కిలి ప్రాముఖ్యతనందినవి. (అష్టాదశశక్తిపీఠములు చూడుఁడు.) ఈవ్యాసమున దేవీభాగవతోక్తాష్టోత్తరశతపీఠములు వివరింపఁబడును.

౧ అతిప్రియాదేవి (హరిగంగాద్వారము)
౨ అతిశాంకరీదేవి (కార్తికక్షేత్రము)
3 అనంగాదేవి (భరతాశ్రమము)
౪ అభయాదేవి (ఉష్ణగుండతీర్థము)
౫ అమోఘాక్షి (విపాశతీర్థము)
౬ అమృతాదేవి (వేణాధరాస్థలి)

౭ ఆరోగ్యాదేవి (వైద్యనాథధామము)
౮ ఇన్ద్రాణీదేవి (దేవలోకమున)
౯ ఉత్పలాక్షీదేవి (సహస్రాక్షక్షేత్రము)
౧౦ ఉమాదేవి (వినాయకక్షేత్రము)
౧౧ ఉరశీదేవి (బదరీక్షేత్రము)
౧౨ ఏకవీరాదేవి (సహ్యాభరాధరము)
౧౩ ఓషధీశక్తి [ఉత్తరకురుసీమ]
౧౪ కపిలాదేవి [మహాలింగక్షేత్రము]
౧౫ కమలాదేవి [కమలాలయము]
౧౬ కల్యాణీదేవి [మలయపర్వతము]
౧౭ కామచారిణీదేవి [మందరగిరి]
౧౮ కామప్రపూర్ణ [పూర్ణగిరిమాయి]హిమనగం
౧౯ కాముకీశక్తి [గన్ధమాదనము]
౨౦ కాళీదేవి [లంజరక్షేత్రమున]
౨౧ కీర్తిమతీదేవి [ఏకామ్రపీఠము]
౨౨ కుమారి [కన్యాకుమారి] మాయాక్షేత్రము
౨౩ కుముదాదేవి [మానసరోవరమున]
౨౪ కుశోదకాదేవి [కుశద్వీపము]
౨౫ కోటరీదేవి (కోటితీర్థము)
౨౬ గాయత్రీదేవి (వేదముఖక్షేత్రము)
౨౭ గోమతీదేవి (గోమన్తక్షేత్రమున)
౨౮ గౌరీదేవి [కన్యాకుబ్జపురము]
౨౯ గౌరీదేవి [ముఖక్షేత్రము]
౩౦ చంద్రికాదేవి [హరిశ్చంద్రక్షేత్రము]
౩౧ ఛండికాదేవి. (కురుండకపురము)
౩౨ జయంతీదేవి. (హస్తినాపురము)
౩౩ జయాదేవి. (వరాహగిరి)
౩౪ జలప్రియాదేవి (సుందరశివలింగక్షేత్రమున)
౩౫ తారాదేవి (కిష్కింధ)
౩౬ త్రిసంధ్యాదేవి (గోదావరీతీరదేశము)
౩౭ దేవకీశక్తి (వ్రజమండలమధుర)
౩౮ ధరాదేవి [శంఖోద్ధారక్షేత్రము]
౩౯ ధృతీదేవి [పిండారకక్షేత్రమున]
౪౦ నందినీదేవి [దేవికాస్థలి]
౪౧ నారాయణీ [సుబాశము]
౪౨ నితంబాదేవి [వింధ్యగిరి]
౪౩ నిధీశక్తి [శ్రవణాలయమున]
౪౪ ప్రభండాదేవి [భగలండక్షేత్రము]
౪౫ పరమేశ్వరీశక్తి [పాతాళము]
౪౬ పాటలాదేవి [పుండ్రవర్ధనము]
౪౭ పార్వతీదేవి [భర్గసన్నిధి]
౪౮ పారావారాదేవి [తటము]
౪౯ పింగళాదేవి [పయోష్ణి]
౫౦ పురుహూతాదేవి [పుష్కరక్షేత్రము]
౫౧ పుష్కరావతీదేవి [ప్రభాసక్షేత్రము]
౫౨ పుష్టిదేవి [దారుకావనము]
౫౩ బిల్వపత్రిక [పల్వరక్షేత్రము]
౫౪ భద్రకర్ణిక [గోకర్ణము]
౫౫ భద్రాదేవి [భద్రపీఠక్షేత్రము]
౫౬ భవానీదేవి [స్థానేశ్వరము]
౫౭ భీమాదేవి [హిమవత్పర్వతము]
౫౮ మకుటేశ్వరి [మకటక్షేత్రము]
౫౯ మంగళాదేవి [గయ]
౬౦ మన్మథాదేవి [హేమకూటము]
౬౧ మహాదేవి [సాలగ్రామము]
౬౨ మహాభాగ [మహాలయక్షేత్రమున]
౬౩ మహాలక్ష్మి [కరవీరపురము]
౬౪ మహోత్పలాదేవి [హిరణ్యాక్షేత్రము]
౬౫ మాండవీదేవి [మాండవ్యక్షేత్రము]
౬౬ [దేవ] మాతా [దేవి] [సరస్వతీనదీతీరమున]
౬౭ మదోత్కలాదేవి [చైత్రరథము]
౬౮ మాధవీదేవి [ప్రయాగ]
౬౯ మాహేశ్వరీదేవి [మహాకాలక్షేత్రము]
౭౦ మృగావతీదేవి (యమునాతీరభూమి)
౭౧ మేధాదేవి [కాశ్మీరదేశము]
౭౨ రంభాగౌరీదేవి (మలయపర్వతము)

౭౩ రమణాదేవి (రామతీర్థము)
౭౪ రాధాదేవి (బృందావనము)
౭౫ రుక్మిణీదేవి (ద్వారావతీపురము)
౭౬ రుద్రసుందరీదేవి (త్రికూటపర్వతము)
౭౭ రుద్రాణీదేవి (రుద్రకోటిక్షేత్రము)
౭౮ లలితాదేవి (ప్రయాగ)
౭౯ లలితాదేవి (సంతానపీఠకస్థలము)
౮౦ లక్ష్మీదేవి (సిద్ధవనము)
౮౧ లింగధారిణీదేవి (నైమిశారణ్యము)
౮౨ లోలాదేవి (ఉత్పలావర్తము)
౮౩ వందనీయాదేవి (అశ్వత్థక్షేత్రము)
౮౪ వరారోహాదేవి (సోమేశ్వరము)
౮౫ వింధ్యవాసినీదేవి (వింధ్యాచలము)
౮౬ విపులాదేవి (విపులాక్షేత్రము)
౮౭ విమలాదేవి (జగన్నాథము)
౮౮ విశ్వకామాదేవి (దక్షిణేశ్వరము)
౮౯ విశ్వంభరాదేవి (విశ్వేశ్వరపురము)
౯౦ విశ్వముఖీదేవి (జాలంధరక్షేత్రము)
౯౧ విశాలాక్షీదేవి (వారణాసి)
౯౨ విశ్వేశ్వరి (విశ్వేశ్వరిక్షేత్రము)
౯౩ వైష్ణవీ (మాత) దేవి (మాతలక్షేత్రము)
౯౪ శివధారిణీదేవి (మచ్చోరము)
౯౫ శుద్ధిదేవి (కపాలమోచనక్షేత్రము)
౯౬ శుభానన్దాదేవి (శివకుండము)
౯౭ సత్యవాదినీదేవి (కుముదక్షేత్రము)
౯౮ సన్మార్గదాయిని (కేదారము)
౯౯ సరస్వతీదేవి (బ్రహ్మపురి)
౧౦౦ స్వాహాదేవి (మాహేశ (మాహిష్మతి) పురము)
౧౦౧ సింహికాదేవి (కృతశౌచక్షేత్రము)
౧౦౨ సీతాదేవి (చిత్రకూటము)
౧౦౩ సుగన్ధాదేవి (మాధవవనము)
౧౦౪ సుగళాదేవి (చంద్రభాగాతటము)
౧౦౫ సుప్రభాశక్తి (సూర్యబింబము)
౧౦౬ సుభద్రాదేవి (శోణ గంగాసంగమము)
౧౦౭ సుమాతాదేవి (కాయావరోహణక్షేత్రము)
౧౦౮ సోమాఖ్య (మాహేశ్వరక్షేత్రము).

ఈపీఠములందలి దేవీనామములందుఁ గొలఁదిగ మార్పు లచ్చటచ్చటఁ గానవగుచున్నను నవి దేవీ భాగవతమునఁ జెప్పఁబడినరీతిని వ్రాయఁబడినవి. ఇవి మున్ముందు సరిచేయఁబడవలసియుండును. దేవీభాగవతమున వీట్లం దెల్పుతటి శక్తింగూర్చి యప్సరలలో, తిలోత్తమ, మనస్సున బ్రహ్మకళా శక్తి, స్త్రీలలో నరుంధతీదేవి, సర్వదేహములందు శక్తిగఁ దెల్పియున్నారు.

శక్తిపీఠములు:— (అష్టాదశశక్తిపీఠములు).

౧ శాంకరీదేవి— లంకాపురి. ఇప్పుడు సముద్రగామియైనది.

౨ కామాక్షీదేవి—చెంగల్పట్టుమండలమునఁ గాంచీపురము దేవాలయమున చితగ్నికుండమునం జూపుదురు. లలితాసహస్రనామము లీక్షేత్రమందే యన్వయించును. ఇచట గాయః మంటప మున్నది.

౩ శృఙ్ఖలాదేవి— బంగాళాదేశమున హుగ్లీపురమునకుఁ గొంతదూరమునగల ప్రద్యుమ్నపురము లేక ప్రద్యుమ్ననగరము. ఇప్పుడు దీనిని పాండువా యనుచున్నారు.

౪ చాముండ— క్రౌన్చపట్టణము. దీని నిప్పటి మైసూరు రనియెదరు. దక్షిణదిశను చాముండి లేక మహిషాసురమర్దని యాలయము కలదు.

౫ జోగులాంబ— (అలంపురి) నైజాంరాజ్యమున N. G. S. R. ద్రోణాచలమునుండి హైద

రాబాదున కేగు నిసుపదారిశాఖపై అలం పూర్ రోడ్డుకు సమీపము.

౬ భ్రమరాంబాదేవి— శ్రీశైలమను పర్వతముపై నీక్షేత్రమున్నది.

౭ మహాలక్ష్మీదేవి— కొల్లాపురము, స్వదేశసంస్థానము, బొంబై రాజధాని M. S. M. R. వాబ్లిపూనాలైన్ మీఁద నున్నది.

౮ ఏకవీరికాదేవి—

౯ విరజాదేవి— ఉద్యాణపురము. ఇప్పుడు జాజిపూర్ అనుచున్నారు. ఉత్కళదేశము, కటకముమండలము. వైతరిణీనదీతీరము. [యష్టలేక యాజి] జాజిపూర్.

౧౦ మాణిక్యాంబ— ద్రాక్షారామము. ఆంధ్రదేశమున, గోదావరీమండలమున, కాకినాడపట్టణమునకు సమీపము.

౧౧ కామరూపాదేవి [అహిచ్ఛత్రపురము] — ఆసాందేశము [తొల్లింటి కామరూపదేశము] న గౌహతి. [తొల్లింటిఅహిచ్ఛత్రపురఁపుజాగా ప్రాంతము]. పురసమీపమున బ్రహ్మపుత్రానదీతీరము.

౧౨ పురుహూతికాదేవి—

౧౩ మహాకాళీదేవి— ఉజ్జయనీనగరము..

౧౪ మాధవేశ్వరీ— ప్రయాగ [అలహాబాద్ లోని ధారాగంజియందు].

౧౫ విశాలాక్షీదేవి— వారణాశీక్షేత్రము (కాశీ).

౧౬ సరస్వతీదేవి— నైజాంరాజ్యమున నిందూర్ సమీపము N. G. S. R. బాసర్ స్టేషనుకు కతిపయదూరమున గోదావరీనదీతీరము.

౧౭ వైష్ణవీదేవి— జ్వాలాపురి.

౧౮ మంగళగౌరీదేవి— గయాక్షేత్రము.

## శక్తియొక్క చతుర్దశనామములు:-

౧ దుర్గ, ౨ దళభవ, 3 సింగవాహిని, ౪ మహిషాసురమర్దని, ౫ జగదాధారి, ౬ కాళి, ౭ ముక్తకేశి, ౮ తార, ౯ ఛిన్నమస్తక, ౧౦ జగద్ధాత్రి, ౧౧ ప్రత్యంగిరా, ౧౨ అన్నపూర్ణ, ౧౩ గణేశమాతా, ౧౪ కృష్ణాంకితాతోరః.

భాగవతోక్తములు:-

౧ దుర్గ. ౨ భద్రకాళి, 3 విజయ, ౪ వైష్ణవి, ౫ కుముద, ౬ ఛండిక, ౭ కృష్ణా, ౮ మాధవి, ౯ కన్యకా, ౧౦ మాయా, ౧౧ నారాయణీ, ౧౨ ఈశాన, ౧౩ శారదా, ౧౪ అంబిక.

## శక్తిరేఖ:—

(పురుషసాముద్రికము చూడుఁడు. స్త్రీసాముద్రికము చూడుఁడు).

## శక్తి లేక శాక్తిగోత్రము:—

[పరాశరగణము చూడుఁడు].

## శక్తి [వైభవ పీఠములు] ౬౪:—

శక్తిపీఠములలో వైభవోపేతములు. అనఁగా దేవీ వైభవపీఠము లఱువది నాల్గుగఁ జెప్పఁబడినవి. ఇవి శక్తింబూజించు నఱువదినాల్గుకళలతో సంబంధముగలవిగ నొక్కొక్క వైభవపీఠమున నొక్కొకకళ ప్రధానమై దనరుటంజేసి, ఆయుపచారము నకుఁ బ్రధానస్థానమై బరఁగునని చెప్పఁబడినది. [శక్తిపీఠములు ౧౮ చూడుఁడు. శక్తిమహాపీఠములు ౫౨ చూడుఁడు.]

౧ అన్నపూర్ణాదేవి— బనారస్

౨ ఆనందాదేవి— అట్టహాసక్షేత్రము

3 ఆషాఢీదేవి.

౪ ఉగ్రాదేవి— కనకలేఖక్షేత్రము

౫ ఉత్పలాక్షీదేవి— స్థాణుస్థానము

౬ కామరూపీదేవి- అహిచ్ఛత్రపురము
౭ కామాఖ్య- గౌహాతి (అసాము)
౮ కమలాదేవి- కమలాలయక్షేత్రము
౯ కాళికాదేవి- కాలంజరము
౧౦ కులేశ్వరీదేవి
౧౧ కౌశికీదేవి
౧౨ గాయత్రీదేవి- త్రిసంధ్యాపుష్కరము
౧౩ గుహ్యకేశ్వరీదేవి- నేపాళదేశము
౧౪ చన్ద్రికళాదేవి
౧౫ చంద్రికాదేవి- హరిశ్చన్ద్రక్షేత్రము
౧౬ చండముండదండినీదేవి
౧౭ చండికాదేవి
౧౮ జ్ఞానప్రసూనాంబ- శ్రీకాళహస్తి
౧౯ జ్వాలాముఖి
౨౦ త్రిపురభైరవీదేవి
౨౧ త్రిశూలాదేవి- జప్యేశ్వరము
౨౨ ధ్వనీదేవి- శంఖుకర్ణక్షేత్రము.
౨౩ నీలసరస్వతి
౨౪ నీలాంబరీదేవి
౨౫ ప్రచండాదేవి- భగలండక్షేత్రము
౨౬ పరాశక్తి- ఏకాంబరక్షేత్రము
౨౭ పురుహూతాంబ- పీఠాపురము
౨౮ పుష్కరాక్షీదేవి- ప్రభాసతీర్థము
౨౯ భద్రకర్ణీదేవి- గోకర్ణక్షేత్రము
౩౦ భద్రాదేవి- సువర్ణస్థలి
౩౧ భవానీదేవి- వస్త్రాపాతక్షేత్రము
౩౨ భ్రామరీశక్తి- శ్రీశైలము
౩౩ భీమాదేవి- భీమపురము
౩౪ భైరవీదేవి- కేదారమార్గభైరవస్థానము
౩౫ మకుటేశ్వరీదేవి- మకుటపురము
౩౬ మంగళాగౌరి- గయ
౩౭ మంగళాదేవి- కొంకణ (మంగుళూరు)
౩౮ మహాకాళి- ఉజనీక్షేత్రము
౩౯ మహాభాగాదేవి- మహావలయము
౪౦ మాయా [గాయత్రీ]
౪౧ మీనాక్షీదేవి- వేదారణ్యం (మధుర)
౪౨ మూకాంబ [మళయాళభగవతి]
౪౩ యోగాఢ్యా [యోగీశ్వరీ] దేవి- చారుమణీ
౪౪ రక్తదంతాదేవి
౪౫ రుద్రాణీదేవి- రుద్రకోటిక్షేత్రము
౪౬ రేణుకాదేవి- మాతృపురము
౪౭ లక్ష్మీదేవి- కొల్లాపురము
౪౮ లింగధారిణీదేవి- నైమిశము
౪౯ వగలాదేవి [ఆరోగ్య] వైద్యనాథధామము
౫౦ వింధ్యాచలవాసిని
౫౧ విమలాదేవి- జగన్నాథము
౫౨ విశాలాక్షి- అలిముక్తక్షేత్రము
౫౩ విశ్వేశ్వరీదేవి- విశ్వేశ్వరక్షేత్రము
౫౪ విజ్ఞానేశ్వరీదేవి
౫౫ శర్వాణి
౫౬ శాకాంబరీదేవి
౫౭ శాంకరీదేవి- సింహళము
౫౮ శాండకీదేవి- మండలేశ్వరము
౫౯ స్వయంభువాదేవి- నకులీశక్షేత్రము
౬౦ స్థాణుప్రియ- స్థానేశ్వరము
౬౧ స్థూలాదేవి- స్థూలేశ్వరము
౬౨ సూక్ష్మాదేవి- మాతృకేశ్వరము
౬౩ హింగుళా [తులజా] దేవి- సప్తశృంగిపురము
౬౪ హృల్లేఖాదేవి- హేలాక్షేత్రము

**శక్తి శక్తులు:**— శక్తి పరమేశ్వరుని సామర్థ్యము [మహిమ] కు శక్తి యనిపేరు. దీని నాదిశక్తి, మహాశక్తి యనియు నందురు. ఇది మూండువిధములుగ నుండును. ౧ ఇచ్ఛాశక్తి, [తలంపు గల్గుట] ౨ జ్ఞానశక్తి, [సాధకబాధకములంగూర్చి

దూరాలోచనము [గల్గించుసామర్థ్యము], 3 క్రియాశక్తి [ఆచరించుటకగు సామర్థ్యము].

నీతిశాస్త్రమున ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి, యని త్రివిధము. పంచశక్తులు ౧ ఉమాశక్తి, అంబికాశక్తి, గణేశీ, ఈశ్వరీ, మనోన్మనీ.

**శకుంతల:—** తండ్రి విశ్వామిత్రర్షి, తల్లి మేనక. భర్త దుష్యంతమహారాజు. కుమారుఁడు భరతుఁడు. పెంపుడుతండ్రి కణ్వర్షి.

**శకునశాస్త్రము:** — శకునములంగూర్చిన ధర్మము లాదికాలముననే కనిపెట్టఁబడి ఋషులచే నెల్లడింపఁబడినవి. శకునముల కధిదేవత లక్ష్మీదేవతలని చెప్పఁబడినది. ముఖ్యముగ శకునములు శుభశకునము లనియు, నశుభశకునము లనియు, నపశకునములనియు, చేష్టాశకునము లనియు, వాక్యశకునము లనియు, క్షుతశకునము లనియు నాలు విధములుగఁ జెప్పఁబడినవి.

**శకుని:—** గాంధారభూపతియగు సుబలుని కుమారుఁడును, గాంధారీదేవికి సోదరుఁడును, దుర్యోధనునకు మేనమామయు నగువాఁడు. దుర్యోధనుపక్షమున ధర్మరాజుతోఁ గపటద్యూతమాడి యోడించి రాజ్యభ్రష్టులం జేసినవాఁడు. ద్వాపరాంశమున జనించినవాఁడు. ఈతనికిఁకుమారుడులూకుఁడు. ఉలూకుఁడు భారతియుద్ధమునఁ గురుక్షేత్రమున పాండవులకడ కేతెంచి, దుర్యోధనుఁడు చెప్పుమన్న మాటలం జెప్పిపోయినవాఁడు. ఆయుద్ధమున పాండవకనిష్ఠుండగు సహదేవునిచే నులూకుఁడు నిహతుఁడయ్యెను.

ఇంకను, దైత్యుఁడగు హిరణ్యాక్షుని కుమారుఁడొకఁడును, యదువంశక్షత్రియుఁడగు దశరథుని కుమారుఁడొకఁడును శకుని యను పేరు గలవా రున్నారు.

**శకేరియానది:—** ఏష్యామైనరునందున్న నది. బ్లాక్సీయందు కలియును. [ఏష్యామైనరు చూడుఁడు.]

**శక్రకుమారికాతీర్థము (కన్యాకుమారితీర్థము):—** పంజాబునందు శిర్మూరుజిల్లాలో నాహన్‌పురమున కుత్తరముగాఁ బదునాలుమైళ్ళ దూరము. శక్రకుమారికాతీర్థమునకు సమీపము. మహాభారతము వనపర్వము ౮౧ అధ్యా-శ్లో ౮౨ యందు దీని తొల్లింటిపేరు కన్యాకుమారికాతీర్థమని ప్రశంసింపఁ బడినది.

**శక్రజిత్తు:—**
[ఋతుధ్వజుఁడు చూడుఁడు].

**శక్రద్వాదశి:—**
[ఉపేంద్రద్వాదశి చూడుఁడు].

**శక్రిగోత్రము:—**
[గర్గ ఉపగణము చూడుఁడు].

**శక్రుఁడు:—**
[ఇంద్రుఁడు. స్వర్గలోకాధిపతి. శచీదేవిచూడుఁడు]

**శక్వరగణము:—** ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము. ఇందైదుగోత్రములు చెప్పఁబడినవి.

౧ శక్వరర్షిగోత్రము— శక్వర, శాక్వర, ముముక్ష, భోక్తవ్య, వేదపాల [పంచార్షేయప్రవర].

౨ వేదపాలర్షిగోత్రము— ముముక్ష, భోక్తవ్య, వేదపాల [త్రయార్షేయప్రవర].

౩ రాజధర్మర్షి గోత్రము— శాక్వర, ముముక్షు, భోక్తవ్య, వేదపాల, రాజధర్మ [పంచార్షేయ ప్రవర].

౪ భోక్తవ్యమను గోత్రము— భోక్తవ్య, వేదపాల, రాజధర్మ [త్రయార్షేయప్రవర].

౫ ప్రజ్ఞామతిఋషిగోత్రము— వేదపాల, రాజధర్మ, ప్రజ్ఞామతి [త్రయార్షేయప్రవర].

(అధర్వణశాఖా విశ్వబ్రాహ్మణులు చూడుఁడు).

**శచీదేవి:**— కశ్యపమహర్షికి వైశ్వానరుని కుమార్తెయగు పులోమయందుఁ గల్గినసంతతి గాన 'పౌలోమి' యనఁబడినది. భర్త దేవేంద్రుఁడు. ఈతనికి 'శక్రుఁ' డను పేరునుం గలదు.

**శఠగోత్రము**

[విష్ణువృద్ధఉపగణము చూడుఁడు.]

**శఠగోత్రము:**—

[భరద్వాజ ఉపగణము చూడుఁడు].

**శతకేరిగోత్రము:**—

(కధ లేక కథ్య గణము చూడుఁడు).

**శతఘంటావధానము:**—

(అవధానము చూడుఁడు.)

**శతఘ్ని:**—

(ఫిరంగి చూడుఁడు.)

**శతజిత్తు:**— అత్రి సంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. యాదవుఁడు. తండ్రి సహస్రజిత్తు. కుమాళ్లు వేణుహయుఁడు, హేహయుఁడు, మహాహయుఁడు. హేహయుఁడు హేహయవంశక్షత్రియశాఖకు మూలపురుషుఁడు. చేదిదేశ మేలిన నృపతి.

మఱియు యాదవులలోని భజమానుని కుమారుఁడొకఁ డీపేరుగలవాఁడే. ఇంకను ప్రియవ్రతుని వంశమునందు రజనిసుతుండగు శతజిత్తొకఁడు కలఁడు. ఇతనికి నూర్వురుపుత్రులు. అందు జ్యేష్ఠుఁడు విష్వగ్జ్యోతి.

**శతద్రునది:**— దీనిని సుతుద్రి యని వాడిరి. ఇప్పటిపేరు సట్లెజ్ నది. పంజాబుదేశమునందున్న నది. పాంచాలదేశఁపు టైదునదులలో నొకటి. సింధునదిలో సంగమించును.

(పాంచాలదేశము చూడుఁడు.)

**శతధన్వుఁడు:**— యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి హృదికుఁడు, సోదరుఁడు దేవమీఢుఁడు.

తనకూఁతు నిత్తునని సత్రాజిత్తనిన వారిలో శతధన్వుం డొకఁడు, అక్రూర కృతవర్మలు తక్కిన యిరువురును సత్యభామం దమకిమ్మని యడిగియు, తుదకాతఁడు నిరాకరించెనని సత్రాజిత్తు నిద్రించుతఱి నతనిం జంపి, యదికారణముగ తాను కృష్ణునిచే నిహతుఁడైనవాఁడు. (శమంతకమణి చూడుఁడు. అక్రూరుఁడు చూడుఁడు).

**శతధృతి:**— సముద్రుని కుమార్తె. భర్త ప్రాచీనబర్హి. కుమాళ్ళు ప్రచేతసులు.

మఱియు బ్రహ్మకును శతధృతియని నామాంతరము కలదు.

**శతద్రుదేశము:**— శతద్రు (ఇప్పటిసట్లెజ్) నది నుండి పేరందినదేశమని తోఁచెడిని. హ్యూయానత్సాంగు యాత్రికుఁడు 333 చుట్టుకొలతగల చిన్నరాజ్యమని పేర్కొనియున్నాఁడు.

**శతపత్ర పత్రశత భేదన్యాయము**— రెండుపదములకు నర్థమొకటియే యైనను, శతపత్ర

మన తామరపూవునకర్థముఁగూడ కలదు. పత్ర శతమునం దితరయర్థము లేదు.

ఇట్టివి శేషార్థసందర్భము గల్గుటనుదెల్పుటకే నీ న్యాయము వాడుదురు.

ఇట్టివి అంసలలక్ష్యక్రమవ్యంగము లను పేరఁ బరఁగెడివి.

**శతపర్వ:**— శుక్రునిభార్య.

**శతబలి లేక శతవలి:**— సుగ్రీవునిసేనా పతులలో నొకఁడు. సీతను వెదకుట కుత్తరదిక్కునకుఁ బంపఁబడినవారలలోఁ బ్రధానుఁడు.

**శతభిషం నక్షత్రము:**— ఇది పుష్పముం బోలియుండు నూఱునక్షత్రముల సముదాయము. దీనికింకను జలనిధిః, ప్రాచేతసః, వరుణః, వారుణః, శతతారః, శతభిషా యనుపర్యాయనామములు కలవు. దీనికి వరుణుఁ డధిదేవత. రాక్షస గణము. ఊర్ధ్వముఖము. నపుంసకస్వభావము. ఉష్ట్రాకారనక్షత్రము. ఆఁడుగుఱ్ఱము, ఆఁడకోడి, చండ్రచెట్టు నీనక్షత్రసంబంధములనియు, ప్రవేశించిన పదునెన్మిదిఘటికలపై త్యాజ్యము (అనఁగా విషఘటికల) నియు, ముప్పదినాల్గుఘటికలపై నమృతఘటిక లనియు, చరస్వభావనక్షత్ర మనియుం జెప్పఁబడినది.

**శతముఖుఁడు [దేవేంద్రుఁడు]:**— నూఱుమఖము (యజ్ఞము) లు చేసినవాఁడని యర్థము.

**శతమర్షణగోత్రము**
(విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.)

**శతయూపుఁడు**— కేకయవంశజుఁడగు రాజర్షి. ధృతరాష్ట్రుఁడు వనవాసమొనర్చుతఱి నీతనియాశ్రమమునఁ గొన్నిదినములు గడపెను.

**శతరూప:**— స్వాయంభువమనువు భార్య. శతరూపయు, స్వాయంభువమనువును, ఆదిదంపతులుగఁ బ్రజాభివృద్ధియొనర్ప సృష్టింపఁబడినవారు.

**శతలేఖిన్యవధానము:**—
(అవధానము చూడుఁడు).

**శతసేనుఁడు:**— యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. శ్రీకృష్ణుని సంతతివాఁడగు నుగ్రసేనునికుమారుఁడు.

**శతానన్దుఁడు [ఋషి]:**— తండ్రిగౌతమమహర్షి. తల్లి అహల్య. కుమారుఁడు సత్యధృతి. ఈమహాత్ముఁడు జనకచక్రవర్తి కుటుంబమునకుఁ బౌరోహితుఁడని చెప్పఁబడినది. కుమారునకు శరద్వతుఁడనియు వాడుకనామము కలదు.

**శతానీకుఁడు:**— అత్రి, చంద్ర, పూరువు, కురుసంతతిక్షత్రియుఁడు. పాండవచతుర్థుండగు నకులునికుమారుఁడు. ఈతఁ డుపపాండవుడు. భారతయుద్ధానంతరము నిద్రించుతఱి నశ్వత్థామచే నిహతుఁడైనవాఁడు. మఱియు నభిమన్యునిమనుమఁడగు జనమేజయునికుమారుఁడు శతానీకుఁడే.

ఇంకను పాండవసంతతియందు రెండవబృహద్రథుని మనుమఁడు (అనఁగా సుదాసునిసుతుడు) పేరు శతానీకుఁడే. ఈతనిసుతునిపేరు దుర్దమనుఁడు.

**శతావధానము:**—
(అవధానముఁ జూడుఁడు.)

**శత్రుంజపర్వతము:**— పాలిటానా [సంస్థాన] రాజ్యమున ప్రధానపురమగు పాలిటానా పురముప్రక్కనున్న పర్వతము. దీనిపై 863

జైనుదేవస్థానము లున్నవి. ఇది జైనులయాత్రా స్థలము. ఇది పంచజైనపవిత్రస్థానములలో నొకటి. కొన్ని దేవాలయములు ౧౧ వ శతాబ్దమునాటివని పోల్చిరి.

## శత్రుంజయ శిఖరము:—

[గిరిపంచకము చూడుఁడు].

## శతృగాయనగోత్రము—

[శాండిలగణము చూడుఁడు].

## శత్రుఘ్నుఁడు:—

ఈ పేరుగలవారు పెక్కండ్రు గలరు.

సూర్యవంశక్షత్రియులలో శ్రీరామునితమ్ముఁడొక శతుఘ్నుఁడు. తండ్రి దశరథమహారాజు. తల్లి సుమిత్ర. సోదరులు భరతలక్ష్మణ శ్రీరాములు. భార్య శ్రుతకీర్తి. [కుశధ్వజునిపుత్రిక]. ఈతఁడు శ్రీరామునియాజ్ఞమేరకు లవణాసురుం జంపినవాఁడు.

యదుసంతతియం దక్రూరునితమ్ములలో నొక శత్రుఘ్నుఁడు కలడు.

యదుసంతతియందే దేవశ్రవసుని జ్యేష్ఠపుత్రుఁడొకశత్రుఘ్నుఁడు. ఈతని కనిష్ఠసోదరుఁడే యేకలవ్యుఁడు.

## శతృజిత్తు [ప్రతర్దనుఁడు]:—

కాస్యుఁడు.

## పంచాశదితి న్యాయము:—

నూటిలో నేఁబదియని యర్థము. నూరుండిన నందులో నేఁబది పోయినను పోనగునని భావము.

## శత్రోహిగోత్రము:-

(నిధృవగణము చూడుఁడు.)



## శధిగోత్రము:—

(కణ్వ ఉపగణము చూడుఁడు.)

## శనకాలకులగోత్రము:—

ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. శనకాలకుల (సన్నకుల శౌనకకుల) గోత్రము. ఏకార్షేయ (౭౨) గోత్రము. శునకగణము. సంస్కృతగోత్రము శౌనకస. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథమాద్యప్రవరఖండ. సమానగోత్రములు శుక శరభంగస తుర్యవ్రతస. వీరేశుఁడు దేవత. ప్రసూనాంబుధి తటాకము. జపము దశలక్ష. దీపములు ౫౫. క్షేత్రసంఖ్య ౨౧. గజదానము. చేమలు, చేమంతి వర్జనీయములు.

(వైశ్యగోత్రములు చూడుఁడు).

## శనకులగోత్రము:—

[సనకుల చూడుఁడు.]

## శనగచెట్టు:—

శనగలయందు కొమ్ముశనగ యనియు, గుండ్రనిశనగయనియు, శనగగింజల నుండి ముఖ్యజాతులు రెండు. అందు కొమ్ము శనగజాతి, దేశవాళీశనగలు, తెల్లశనగలు, అడవి శనగలు నని మూఁడు భేదజాతులు కలవి. గుండ్రనిగింజలుగలజాతి. ఉత్తమజాతిని బటానీలనియు, అధమఁపుజాతికి బోడిశనగలనియు నందురు. ఇవిగాక వేరునందు కాయలంగాచు వేరుశనగజాతి యొకటి కలదు.

దేశవాళీశనగజాతి:—దీనికి లాటిన్భాషయందు Cicer Arietinum అనియు, ఆంగ్లమున Chicken?Pea అనియు, Bangal gram అనియు, సంస్కృతమున చణకః అనియుం బేర్లు.

శనగలు, శనగపప్పు, శనగపిండి, ప్రసిద్ధభోజన పదార్థములు గాన నెక్కువ వ్రాయ నక్కఱయుం

డను. శనగచెట్టు సమూలకషాయమునందు ఋతు బద్ధము నివారించుశక్తి కలదందురు. శనగలు పచ్చిగనుండుతఱి వాతముఁ జేయుననియు, బలమును గల్గించి, శ్లేష్మమును రేఁపుననియు నందురు.

శనగచేను మంచుకాలమున నుండుంగాన దానిపై బట్టలంబఱచి, మంచుతడింబిడిచి శనగపులుసు తీసుకొందురు. అది జీర్ణకారియై కొన్నియాయుర్వేదీయౌషధముల కనుపానముగ నీయ నుపయోగపడును. ఇదిరక్తములోనివేఁడి నడంచి, వాతమును శమింపఁజేయును.

శనగలను గుఱ్ఱముల కాహారముగఁగూడ వైచెదరు. శనగపొట్టు, శనగకాయలబొత్త, పశువుల కాహారముగ వైచెదరు.

తెల్లశనగలు:—దేశవాళీ (కొమ్ము) శనగజాతిలోని భేదమే. అడవిశనగ దీనికింజెందిన యధమఁపుజాతి యనఁబడును. వీటికి లాటిన్భాషయందు Cicer arietinum అనియు, ఆంగ్లమున wild Bengal gram అనియు, సంస్కృతమున వనచణకఃయనియుఁ బేర్లు కలవు. అడవిశనగలను కారుశనగలనియు నందురు. దీనియాచూర్ణము కఫహారమందురు. ఇవి భోజనపదార్థముగ వాడఁబడుట లేదు. తెల్లసెనగలు వాతముఁ జేసి పుంస్త్వముం దగ్గించునని చెప్పఁబడినది.

గుండ్రనిజాతిశనగలం దుత్తమజాతికి బఠాణీలనియు, అధమఁపుజాతికి బోడిశనగలనియుఁ బేరు. వీటికి లాటిన్భాషయందు Pisum sativum. అనియు, ఆంగ్లమున Peas అనియు, సంస్కృతమున కలాయః, మందశణకః, హరేణుః, హరేణుకః అనియుం బేరులు. పైత్యము, బలము జేయును. వీటికి చెల్లయుత్తరేణిక్షారము, శొంఠి, విఱుగుడులని చెప్పఁబడినది. గులకందు, గసగసాలుకూడ శనగజాతికి విఱుగుడు లందురు.

వేరుశనగజాతి భూమియందు వేళ్ళనంటి కాయలం గాచుజాతి. దీనికి లాటిన్భాషాపదము Arachis Hypogoea అనియు, ఆంగ్లమున Groundnut అనియు, Earthnut అనియు, సంస్కృతమున భూచణకః అనియుం బేరులు. దీనిపలుకులును భోజనపదార్థమే. మఱియు దీని పల్లులనుండి నూనెదీయుదురు. గాన దీనికి మంచి విలువ కలదు.

వేరుశనగ, తెలకపిండి, పశువుల కాహారము గను, కొన్ని చెట్లకు, పొలములకు ఎరువుగను వైతురు. గాన నదియు నాధర కమ్ముడుపోవును. వేరుశనగయందు శనగగుణములే యుండి, యధిక పైత్యముఁ జేయుననియు, దీనికి బెల్లము, శర్కర, విఱుగుడులనియు పల్కులను నేతితో వేయించిన దోషపరిహారమనియుఁ జెప్పఁ బడినది.

సగటున శనగజాతిపప్పుపై నుండుపొట్టు కడుపుబ్బరముఁ గల్గించునని తలంపఁబడుచున్నది.

**శనిత్రయోదశి**:— శ్రావణమాసమునందునను, కార్తికమాసముననను, శుద్ధత్రయోదశినాఁడు శనివార మగునేని దాని నీపేరున వాడుచున్నారు. (పండుగలు చూడుఁడు).

**శనివారము (Saturday)**:— సూర్యపుత్రుఁ డొకఁడు శనైశ్చరుఁడని చెప్పఁబడినవాఁడు కలఁడు. అనఁగా ద్వాదశాదిత్యాత్మక సూర్యుండని చెప్పఁబడిన వివస్వంతుని కుమాళ్ళలో నొకపంగుఁడు (కుంటివాఁడు) కలఁడు. ఈతఁడు కుంటియగుట మెల్లగ నడచుటఁజేసి శనైశ్చరుఁడని పేరు వాడుకయయ్యె. ఇతఁడు నవగ్రహాయులలో నొకఁడు. ఈతనిపేరఁ బరగుచున్న వారదినము. హిందువు లిది విష్ణుదేవునకుఁ బ్రీతికర

మగు పవిత్రదినముగ నెంతురు. శ్రావణశనివార ములు పవిత్రదినములు. శనివారమును మందవార మనియు ననుట కలదు.

ఐరోపాదేశములవారు 'Saturday' యని వాడుదురు. రోమనుల దేవతలలో నొకఁడగు Saturn అనంబడు దేవతపేరఁబరఁగ నేర్పఱచిరి. ఆయన దుశ్చరిత్రకలవాఁడని చెప్పఁబడినవాఁడు. తనపిల్లలనే తినివేసెననియు, క్రూరుఁడనియుఁ జెప్పఁబడినవాఁడు. శనివారము నాంగ్లులు 'half holy day' యనియెదరు.

బైబిలునందు పశువులు, పురుగులు, నడవి జంతువులు, నరుని (తనస్వరూపముగ) సృజించెను. నరు లన Adam and ere అనిభావము. శనివారముతో సృష్టి పూర్తి యాయెనని చెప్పఁ బడినది.

**శన్యూష కాలము:—** శనివారప్రారంభ ముననుండు నుషఃకాలము [తెల్లవాఱుజామునకు] 'శన్యూష' యనెదరు. ఇందుఁ బ్రయాణాదులు సకలశ్రేయోదాయకము లని చెప్పఁబడినవి. ఇది తెలవాఱకనుండు కాలము. అనఁగా శనివార దుర్ముహూర్తమునకుఁ బూర్వమని యెఱుంగునది

**శనైశ్చరుఁడు (శని):—** తండ్రి వైవస్వతుఁడు. [సూర్యుఁడు] సోదరుఁడు యముఁడు నవగ్రహములలో నొకటి.

**శపత్‌శాఖ క్షత్రియులు:—**
[క్షత్రియకులము చూడుఁడు].

**శంబల్‌గ్రామము:—** సంయుక్తరాష్ట్రములలోని మురాదాబాద్‌జిల్లా [రోహిల్ఖండ్] మురాదాబాద్ సమీపముననుండు చిన్నయూరు.

ఇట విష్ణువు కల్క్యవతారమెత్తునని భాగవతము ద్వాదశస్కంధమునఁ జెప్పఁబడినది. కల్కిపురాణము ౨ అధ్యాయమునఁ బ్రశంస కలదు.

**శబరి:—** సవరకులజ యగుస్త్రీ [బోయత]. పంపాతీరమున మతంగాశ్రమమున నివాసము. తొలుత మతంగరిషికి శిష్యురాలయి పిదప రామభక్తురా లాయెనఁట.

శబరి గోదావరీనది కుపనది. ఈశబరి ప్రస్తుత మొరిస్సారాజ్యమున [తొల్లి మద్రాసురాజ్యమునఁ లోనిది] జేరిన జయపురసంస్థానమునఁ బశ్చిమమునఁ బ్రవహించుచున్నది. "మోటు" అను గ్రామమున గోదావరిజిల్లాలో నున్నది.

పోలవరం జమీందారిలోనున్న మోటు అను గ్రామసమీపమున గోదావరినదిలోఁ గలియుచున్నది. ఈమోటు జయపురాధీశ్వరులది.

ఈమోటువఱకును శబరినదిలో జయపురము నుండి కలప మొదలగునవి యమ్మకమునకు వచ్చుచుండును.

**శబరీమలైషష్ఠాదేవస్థానము:—** శబరీమలె యనిన శబరీగిరి యనియర్థము. ఇది తిరువాన్కూరురాజ్యమున నెత్తగుపర్వతములలో నొకపర్వతలోవ. ఇటఁ గల సుప్రసిద్ధదేవస్థానము షష్ఠాదేవునిది. ఆప్రాంతవాసులగు స్వదేశస్థులీదేవుని 'అయ్యప్పన్' అనుటయుఁగూడఁ గలదు. ప్రతియేట జనవరి మాసమున వేలకొలఁదిగ జనులిటకు యాత్ర కరుదెంచుదురు. అయ్యప్పన్ వనముల కధినాథుఁ డందురు. ఇట విచిత్రమేమన హిందువులు, బౌద్ధులునేగాక, ఇస్లాంమతస్థులుఁ గూడ నరుదెంచెదరు. సమీపముననే మార్గము నంటి యొకమహమ్మదీయ మహాత్మునిగోరీ దర

గా కలదు. ఆమహాత్ముఁడు షష్ఠాదేవుని రక్ష కుండని మహామ్మదీయు లనెదరు. వనముల కధి నాధుండుగాన, త్రిమతస్థులు అయ్యప్పన్ దేవ స్థానమునం దాదరగ నెఱపుచుందురు. అదియం తయు మహారణ్యప్రదేశమే. ఎత్తగుపర్వతసీమయే.

ఈషష్ఠాదేవుని మహారణ్యమునందు నేరములు జరుగకుండ నీదేవుఁడు రక్షించుచుఁ బరిపాలించు ననియుఁ గాన, యాత్రార్థులై యరగువారల కేయా పదలు వాటిల్లవనియుఁ జెప్పుదురు. నిజమున తిరు వాన్కూరురాజ్యపు రక్షక (పోలీసు) భటులు గూడ నుండుటఁగాని, వారేజోక్యముం గల్గించు కొనుటఁ గానరాకుండును.

ఈదేవస్థానమున్నలోన కరుగుట కాదేశమున రెండుమార్గములు కలవు. ఒకటి కొండలనెక్కుచుఁ దిగుచు పదిమైళ్ళదూరముండెడిని. బహుకష్టతర మై యుండును. రెండవది ముప్పదిమైళ్ళదూరమై నను కొంత సుకర మనిపించెడిని. రెండును నాటు దారులేగాని రోడ్డు వేయఁబడలేదు. ఐన నీరెంటి గుండా యాత్రస్థులు నడుచుచునే యుందురు. మా ర్గమునందుఁగాని, దేవస్థానముకడఁగాని, గ్రామ ములు నంగడులు నుండవుగాన యాత్రస్థులు భోజనపదార్థములను, పూజాద్రవ్యములను గైకొని యే జనెదరు. మహారణ్యమగుట దరికేగువఱకు దేవాలయమున్నజాడలే తెలియఁబడవు. దేవాలయ ప్రదేశభాగమునుజుట్టి, గొప్పకందకము కలదు. అం దులోనికిఁజేరిన నడవిజంతువులబాధ యుండదు. ఆవరణమున, చేపలు, మాంసము, భుజించుట జంతువధ నొనర్చుట, జరుగరాదని సంస్థానమువారి శాసనము కలదఁట. రక్షకుండగు మహామ్మదీయ మహాత్మునిదేవస్థానము 'ఎరుమలై' యనఁబడు పర్వతమునం దున్నది. ఆమహాత్మునకు వావర్ లేక బాలర్ అని పేరఁట. సింహాలద్వీపవాసులగు బౌద్ధులుగూడ నిటకు యాత్ర కరుదెంతురు.

**శబస్తుఁడు**— మరీచి, ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి యువనాశ్వుఁడు. పితామహుఁడు విశ్వగంధుఁడు. కుమారుఁడు బృహదశ్వుఁడని కొన్నిచోట్లగలదు. ఇతఁడు గౌడ దేశమున 'శాబస్తి' అనుపురమును నిర్మింపఁజేసిన వాఁడఁట.

**శబ్దబ్రహ్మవాదమతము:**— ఇది షడ్వే దాంతవాదిమతములలో నొకటి.

ఈమతమున నీశ్వరుఁడు (పరబ్రహ్మము) సమస్తకారణమని చెప్పఁబడినది. ఇందువలన సమస్తము పరమేశ్వరసృష్టియనుట స్పష్టము. మఱియు నీమతసిద్ధాంతమున ప్రమేయము, ప్రమా ణము, ప్రమాత, ప్రమ యని నాల్గు వివరింపఁ బడినవి. ఇవి తెలుసుకొనుటకు (ఎఱుంగుటకు) నాల్గుక్రియాసంబంధములు కలవు.

దేనిని తెలుసుకొనవలెనో దానికి 'బ్రమేయ' మని పేరు. తెలుసుకొనుటకుఁ గలసాధనవిధాన ధర్మమునకుఁ 'బ్రమాణ' మని సంజ్ఞ. ఎవ్వరు తెలు సుకొనువారో (ఎవ్వరు తెలుసుకొనఁబ్రయత్నిం తురో) వారికిఁ 'బ్రమాత' యనియు నింక తెలు సుకొనుక్రియకుఁ 'బ్రమ' యనియు నామములు వివరింపఁబడినవి గాన తెలుసుకొనఁబడే యవస్థ యందుండుతఱి, తెలుసుకొనఁబడునది 'ప్రమేయ' మనంబడునని తేలుచున్నది. మఱియు నట్టియవ స్థకుఁ 'బ్రమేయావస్థ'యని పేరుండవలయును. అట్టి ప్రమేయావస్థయం దొకనామము [పేరు] గల్గి యుండ వలయునుగద. అట్టిపే రెప్పుడు శబ్దమై యుండును. అనఁగాఁ దెలుసుకొనఁబడు వస్తువు తెలుసుకొనఁబడుతఱి శబ్దమందుఁ బరిణమించునని

భావము. శబ్ద మన నాదము గాన బ్రహ్మవిచారముసల్పి, బ్రహ్మము నెఱుంగుతఱి నాదముగఁ (శబ్దముగఁ) బరిణమించుగాన, నీమతవిధానమునకు 'శబ్దబ్రహ్మవాద' మనియు, 'నాదబ్రహ్మవాద' మనియుం బేరయ్యెను.

జగమునం దిటుల నాదము బ్రహ్మమగుతఱి, నానాదము వేర్వేఱువస్తువులందు వేర్వేఱువిధములగు నాదములై, యవి యన్నియు బ్రహ్మము యొక్కపరిణామములే యయ్యెడిని. (పరిణామముఁ గూర్చి భాస్కరీయసిద్ధాంతమతము చూడుఁడు.) ఏలయన జగత్తునందలి సర్వవస్తువులును బ్రహ్మము యొక్క పరిణామములు గాన, వాట్లనాదములును నాదముయొక్క పరిణామములే యయ్యెడిని. మఱియు వీట్లయందుఁ బరిణామధర్మమే కలదుగాని, వికారధర్మము లేనేలేదు. గాన సర్వము నాద (శబ్ద) బ్రహ్మపరిణామమని చెప్పఁబడినది.

జగద్వస్తువు లన్నిటియందు రెండేసిభాగములు కలవు. అవి పదము, అర్థమునని. ఈపదము, అర్థము [రెండును] కలసియే పదార్థమైనది. అందు మొదటిభాగమగు పదము నాద [ధ్వని] రూపము. ఇది నాదబ్రహ్మముయొక్క పరిణామమని చెప్పఁబడినది. ఇంక రెండవభాగమగు అర్థము, ఆనాదముయొక్కయర్థమగు వస్తువుగా, ఆనాదము కనఁనయించిరూపముం గల్గి దనరెడిని. ఇది బ్రహ్మముయొక్కవికారమని చెప్పఁబడినది. ఇట్టు నామమగుపదము నశించునది కాదు. నాదమునం దైక్యమగునది. ఇంక రెండవదియగు అర్థము వస్తువుగాన నశించునది. గాన పదము సత్యమును, అర్థము మిథ్యయు నని చెప్పఁబడినవి.

ఇంకను శబ్దబ్రహ్మవాదసిద్ధాంతముమేరకు జగద్వస్తువులు జడము లనియు, నజడము లనియు ద్వివిధము. చైతన్యములేని రాళ్ళుమొదలగునవి జడములు. చైతన్యముగల పశు, పక్షి, మృగ, మానవు లజడములు. జడాజడములన్నిటికిని పదము సత్యమును, అర్థము మిథ్యయు నని చెప్పఁబడినది. ఇట్టి పదార్థవివేకజ్ఞానము నెఱింగి, నాదబ్రహ్మధర్మ లందుఁ బూర్ణుఁడగుటయే ముక్తిగఁ జెప్పఁబడినది.

**శబ్దశక్తిమూలః—**

[లక్ష్మణ చూడుఁడు].

**శమంతకమణి:—** ఒకమణి. మహిమ గలదిగఁ జెప్పఁబడినది. అనుదినము కొంతబంగారము నిచ్చుచుండునఁట. ఇది సత్రాజిత్తుకడ నుండునఁట. సత్రాజిత్తు శ్రీకృష్ణునిభార్యయగు సత్యభామతండ్రి. యాదవసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి నిమ్నుఁడు. [వృష్ణిసంతతి లోనివాఁడు]. సోదరుఁడు ప్రసేనుఁడు.

తొలుత సత్యభామ బాల్యురాలుగనుండుతఱి శతధన్వునకిచ్చి పరిణయమొనర్ప నిశ్చయించియుండిరి.

ఒకతరి ప్రసేనుఁడు శమంతకమణిని గళమున ధరించి, యడవికి వేటకై పోయెనఁట. [అది సూర్యునిచే సత్రాజిత్తున కొసంగఁబడినమణియు, మిగులకాంతిగలదియుగ నుండెనఁట]. ఒకసింహము మాప్రసేనుంజంపి, యామణిని గొంపోవుచుండ, జాంబవంతుఁ డాసింగముం బరిమార్చి యామణిం గొంపోయి తనగుహాయం దాడఁగొనుచుండు తన బాలికయగు జాంబవతియొక్క యుయ్యెలయందు వ్రేలాడఁదీసెనఁట. శ్రీకృష్ణుం డొకతఱి నీశమంతకమణియందు మక్కువఁజూపియుండెనఁట. దాని నెఱింగినసత్రాజి త్తామణి నపహరింప, శ్రీకృష్ణుండే తనతమ్ముఁడగుప్రసేనుం జంపి, యామణిం గొంపోయియుండునని తలంచి, తమ్మునికై విలపించు

చుండ, లోకులయందు శ్రీకృష్ణుండు మణికై ప్రసేనునిజంపి, దాని నపహరించుట యయుక్తమని యొకయపవాద ప్రబల, శ్రీకృష్ణుండు ఖిన్నుండై తనయపవాదఁబాపుకొనజాంబవంతునిగుహాకడకేగి యడ్డగింపఁబడి, యాతనితో నిరువదియెన్మిదిదిన ములు పోరి, యాతని నోడింప, నాజాంబవంతుఁ డును భీతచిత్తుఁడై చేయునదిలేక శ్రీకృష్ణుని కోపానలమునకు వెఱచి యామణిని, తనసుతయగు జాంబవతినింగూడ సమర్పించెను.

శ్రీకృష్ణుండును నాబాలికను పరిణయమై, శమంతకమును సత్రాజిత్తున కొసంగి గైకొనమ్మ నుచో, తనయపవాదం బాపుకొనియెనఁట. జరి గినదంతయు సత్రాజిత్తెఱింగి, గడగడ వడఁక శ్రీకృష్ణుఁడు పగఁబూనునని వెఱచి, యాతని ప్రీతుంజేయు తనయనుంగుపుత్రికయగు సత్య భామను తొల్లింటియేర్పాటుమేరకు శతధన్వున కీయక శ్రీకృష్ణున కర్పించి పరిణయమొనర్చెనఁట.

దాని కాశతధన్వుఁడు కుపితుఁడయ్యె నక్రూ రునియొక్కయు, కృతవర్మయొక్కయు ప్రోత్సా హముమేరకు సత్రాజిత్తుం బరిమార్చి యాతనికడ నున్న శమంతకమణిం గొంపోయి, యక్రూరుని కడ దాచి, తానును శ్రీకృష్ణునకు వెఱచువాఁడై మిథిలాపురమువైపు త్వరితగమనము గల నొక యశ్వమునెక్కి జనుచుండ, సత్యభామ నూఱ డించి శ్రీకృష్ణుం డాతనివెంటఁదగిలి బట్టుకొని శత ధన్వునిం బరిమార్చియు, నాతనికడ శమంతకమణి యుండమికి విన్నఁబోయి, విచారించుచుండెనఁట.

అది తెలిసి యక్రూరుఁ డాకృష్ణునికోపానలము నకు వెఱచి యామణి శ్రీకృష్ణున కర్పించి యేగె నఁట. ఇటుల నాశమంతకమణి శ్రీకృష్ణుని జేరిపోయెనఁట.

[అక్రూరుఁడు చూడుఁడు].

**శమంతపంచకము:**—ఇప్పటికురుక్షేత్ర ము త్రేతాయుగ ద్వాపరయుగ సంధికాలమునఁ బరశురాముఁడు క్షత్రియులంబరిమార్చి యైదుగుం డము లొనర్చి యందుఁదర్పణము లిడెనఁట. పితరు లాతని నోదార్చి యాయుద్యమము ముగింపఁజేసి రఁట. దానినుండి యాప్రాంతసీమకు శమంత పంచకమని పేరయ్యెనఁట. ఇది కౌరవులపేరట కురుక్షేత్ర మని పిదప వాడుకఁగాంచెను.

**శమఠుఁడు:**—ఋషి. ఇతఁడు యుధిష్ఠిరు నితోఁ దీర్థయాత్ర లొనర్చినవాఁడు.

**శమదమాదిషట్క [సంపద] ము:-**

౧ శమము—అంతరింద్రియనిగ్రహము (మనోబు ద్ధ్యహంకారములను స్వాధీన మందుంచుకొని నిగ్రహించుట).

౨ దమము—బాహ్యేంద్రియనిగ్రహము (జ్ఞానేం ద్రియకర్మేంద్రియములను స్వాధీనమం దుంచు కొని నిగ్రహించుట.)

౩ ఉపరతి—జ్ఞానవంతుఁడగుచు నాచరించుచున్న సత్కర్మానుష్ఠానముల (నిత్యకర్మల) నొక్కొ కటిగ వదలివేయుచుండుట.

౪ తితీక్ష—ఖేదమోదములు, సుఖదుఃఖములు, కష్టసుఖములు మొ॥ వాట్లకు లొంగక యొకే రీతిని సహించుశక్తిం గలియుండుట.

౫ శ్రద్ధ—పీడనిపట్టుదలంగల్గి పాలుమాలక యుం డుట.

౬ సమాధానము—అనుమానముతో వదలక సర్వ మును చక్కఁగ బోధపఱచుకొనుట. [సాధన చతుష్టయము చూడుఁడు.]

**శమనకులగోత్రము:**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. శమనకుల (చరకుల)

గోత్రము. ఏకాక్షేయ [౭౧] గోత్రము. కన్దర్ప గణము. సంస్కృతగోత్రము కందర్పస లేక కాం చనస. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మా ద్యప్రవరఖండ. సమానగోత్రము కాన్చనస. చన్ద్ర శేఁడు దేవత. భార్య మాధవాంబ. గంగాయము నాసంగమము తపస్థానము. కామధేను సరస్సు తటాకము. జపము రెండుకోట్లు. దీపములు 33. క్షేత్రసంఖ్య ౭౯. రత్నములు దానము. మల్లె పువ్వు, తోటకూర వర్జనీయములు.

(వైశ్యగోత్రములు చూడుఁడు).

**శమీకుఁడు:**— ఋషి. శృంగితండ్రి. పరీ క్షిన్మహారాజు శమీకుని మెడనే చచ్చినఁ పామును వైచి శృంగిచేఁ పాముగఅది చనిపోవుటకు శపింపఁ బడెను.

మఱియు భోజవంశమునజనించిన యొకభూపతి శమీకుఁడను పేరుగలవాఁడు కలఁడు.

**శమీవృక్షము:**—

(జమ్మిచెట్టు చూడుఁడు).

**శముఁడు:**—తండ్రి ధర్ముఁడు. తల్లి శ్రద్ధ. (జ్యేష్ఠపుత్రుఁడు). అనుజులు కాముఁడు, హర్షుఁ డు, నమవారలు. శమునిభార్య పేరు సంప్రీతి.

**శమ్యము [కల]:**— కుడిహస్తమున నెడమచేతిచపటికిఁ బేరు. ఇది సంగీతశాస్త్రమున క్రియాప్రాణములోని మార్గక్రియయందలి సశబ్ద క్రియలలో నొకటి. [క్రియాప్రాణము చూడుఁడు]. కల యనఁబడుచున్నది.

**శయనైకాదశి:**— ఆషాఢశుద్ధ ఏకాదశి. విష్ణుదేవుఁడు నేఁడు నిదురించి, కార్తీకశుద్ధ ఏకా దశిని తిరుగ మేల్కాంచునందురు. [ఉత్థానైకాదశి, బోధనైకాదశి చూడుఁడు].

విష్ణుదేవుండు నిదురించు నీదినములందు, అనఁగా నాషాఢ శు ౧౧ మొదలు కార్తిక శు ౧౨ దనుక, గోపద్మవ్రత మాచరించి, లక్ష్మీ నారాయణపూజ లొనర్చుచుందురు. [పండుగలు చూడుఁడు, ఏకాదశులు చూడుఁడు].

**శయూనదేశము:**—

[శయూన చూడుఁడు].

**శయ్య:**—కవిత్వ- కావ్య- శయ్య- [కవిత్వ ధోరణి]. [లక్షణ చూడుఁడు].

**శరణత్రయము:**—బౌద్ధమతధర్మమున శరణత్రయ మని సూఁటియుండు శరణ్యా మక్షిం తురు.

౧ బుద్ధం శరణం గచ్ఛామి— [బుద్ధభగవానుని యందు శరణు పొందుచున్నాఁడను].

౨ బోధం శరణం గచ్ఛామి- [ఆయనయొసర్చిన బోధయందు శరణు పొందుచున్నాఁడను.]

3 సంఘం శరణం గచ్ఛామి- [బౌద్ధసన్యాసుల సంఘమందు శరణు పొందుచున్నాఁడను].

బౌద్ధమతధర్మమున బౌద్ధసన్యాసులసంఘము పవిత్రవంతమని యెఱుంగునది.

**శరణస్థూపము [బౌద్ధశరణత్రయ స్థూపము]:**—బౌద్ధమతమందలి వింతమహా స్థానము. శరణమండలపుఁ బ్రధానస్థానమగు చన్ద్రాపట్టణమునకు సమీపముననే యైదుమైళ్ళలో నున్న రేనెల్ గంజికడ నున్నది. ఇటఁ గొన్నిపిశాచ ములు నరమాంసభక్షణ మొనర్చుచుండ బుద్ధ భగవానుఁడు వాటిని దనమతమునకుఁ గల్పి 'బౌద్ధశరణత్రయ'మనంబడిన మూఁడు శరణము)

లనుపదేశించె (శరణత్రయము చూడుఁడు) ననిచెప్పఁబడినది. అట నశోకనిర్మితమగు స్థూపము కలదు. అది బౌద్ధయాత్రాస్థలమైయున్నది. మఱియు మండలము నాఁటినుండియు శరణ్ జిల్లా యాయెనానని యచటిబౌద్ధులనెదరు.

**శరద్వంత ఉపగణము:**– ఇది యాంగీరససంతతి. గౌతమగణమునందలి యొక యుపగణము. ఇందు పదిగోత్రములు చెప్పఁబడినవి.

౧ ఔపబిందు, ౨ గణి, ౩ భాష్యణ్య, ౪ భీజితి, ౫ రాహూగణ, ౬ రౌహిణ్య, ౭ శరద్వంత, ౮ సౌముచి, ౯ సౌయామ, ౧౦ క్షీరకరమ్భ.

ఈ (శరద్వంతఉపగణ) గోత్రములకుఁ బ్రవరరూపములు. ౧ ఆంగీరస, గౌతమ, శారద్వంత.

**శరద్వన్తగోత్రము:**—
(శరద్వంత ఉపగణము చూడుఁడు).

**శరద్వన్తగోత్రము:**—
[ఔతథ్య ఉపగణము చూడుఁడు].

**శరద్వన్తగోత్రము:**—
[లౌగాక్షిగణము చూడుఁడు.].

**శరద్వన్తుఁడు:**— ఋషి. తండ్రిపేరు శతానందుఁడు. పితామహుఁడు గౌతమమహర్షి. ఇతనికి సత్యధృతి యని నామము కలదు. కుమారుఁడు కృపాచార్యుఁడు. కుమార్తె కృపాదేవి. ఈమె ద్రోణాచార్యునిభార్య. (అశ్వత్థామతల్లి.) కృపాచార్యుఁడు చిరంజీవియని చెప్పఁబడినది.

**శరన్నవరాత్రములు:**– ఆశ్వీయుజశుద్ధపాడ్యమిమొదలు తొమ్మిదిదినములు. వీట్లను దేవీనవరాత్రము లనియు నందురు. బంగాళదేశమున నీదినములందు దుర్గాదేవిని, హరిద్వారప్రాంతముల కాళీదేవి [మాయాస్వరూపిణియగు భద్రకాళి] ని పూజింతురు. విజయదశమి యమదంష్ట్రి పురోజులను గడచినపిదప, ప్రథమదినము గానవాయుపాయమును బాసినసంతోషముతోఁ బండుగనాచరించుచున్నారు. [విజయదశమి చూడుఁడు.]

**శరపురుషీయన్యాయము:**— తన నైరిప్పెఁ దాబాణమునుండి శరము వదలుతఱి తన వెన్కనుండి యొకశత్రువు తన్నుఁజంప వచ్చుచుంటం దెల్పును. ఇట్టిపరిస్థితియం దుపయోగించు న్యాయము.

**శరభంగుఁడు:**—ఋషి. బహుతపస్వి. ఇతనిని స్వర్గలోకమునకుఁ గొంపోవ నింద్రాదిదేవతలే యీతనికడ (దండకారణ్యమునందలి యాశ్రమమునకు) కేతెంచిరని చెప్పఁబడినది. శ్రీరాముఁ డీతఁడు దర్శించి, స్వర్గమునకేగెనఁట. ఈతనియాశ్రమము జహ్నవీతీర మనియుఁ గూడ చెప్పఁబడినది.

**శరభలీల [తాళము]:**—
[తాళములు చూడుఁడు].

**శరభుఁడు:**—పర్జన్యునివలనఁ గల్గినవానరుఁడు. సుగ్రీవునిసేనానాయకులలో నొకఁడు. ఈతనిపేర రామేశ్వరమున నొకతీర్థము, నూయి, కలదు.

**శరమాదేవి:**— శైలూషుఁడను గంధర్వరాజపుత్రిక. సింహళద్వీపాధిపతియగు విభీషణభూపతి [రాక్షసుఁడు] భార్య. ఈమెకుమార్తె త్రిజట. [విభీషణుఁడు, అసురులు చూడుఁడు].

**శరావతీ (నది):**— ఈనదినంటి రెల్లు విస్తారముగ పదిపొదుగునా పెరిగియుంట నీపేర వ్యోనఁట.

## శరీరచర్మము ముడుతలు పడుట

(Wrinkles):—శరీరమునఁ జర్మము ముడుతలు పడుట ముఖ్యముగ వార్ధక్యమునగాన నయ్యెడిని. అంగ్ల ఆలోపతీవైద్యవేత్తలు దీనికిఁ గారణము శరీరచర్మముక్రింద కొన్నిభాగముల కొవ్వుపదార్థము పేరుకొనియుండుననియు, నది తరిగిపోయి



muscles అనుపేరుగల శరీభాగములు ముడుచుకొనిపోవుటవలన, (by contraction of muscles) గల్గి యేర్పడుననియు ననుచున్నారు- ఇటీవల నడచిన కొన్నిపరిశోధనలనుండి వారు "If they have not become too pronounced by by massage and treat ment with certain skin foods" అని యనుచున్నారు. ఇంకను ఆవైద్యవేత్తలు "The skin foods will supply the fatty tissue to smooth out the skin form under neath" అనెదరు. కాని యింకను పరిశీలనలు జరుపఁదగినదిగనే యున్నది.

## శరీరచర్మ వురంగు:—

కొందఱు నల్లగను, కొందఱు తెల్లగను, ఇంకఁగొందఱు మధ్యరంగులుగనునుండుట యెల్లరెఱింగినదే. శరీరచర్మము సెల్సు చేయుంబడి లోనుండి పైకి నంతరాయములుగ నుండెడిని. పైపొరయందు రంగుపదార్థము (colouring matter) ఉండెడిని. దానిని Pigrment అనియు వాడుట కలదు. ఇది యధికముగనుండువారిశరీర మధికముగను, తక్కువగనుండువారిశరీర మల్పముగను, రంగుగల్గియుండెడిని. అధికమైనతరినే నల్లనివెంట్రుకలు, నల్లనిశరీరచ్ఛాయ లుండుట తక్కువయగుట మంచిమేనిఛాయకే తలయం దిది వార్ధక్యమునఁ దగ్గిపోయి వెంట్రుకలు నెఱసిపోయిడిని.

## శరీరతత్వములు, ప్రకృతులు:—

మానవుల శరీరతత్వముల ప్రకృతు లన్నియు నొక విధముగను, ఆవులు, ఎనుములు, ఏనుఁగులు, లొట్టియలు, గుఱ్ఱములు, గాడిదలు మొదలగు వేర్వేఱుజంతువులతత్వప్రకృతులు వాటిజాతి క్షేమములగునటుల వేర్వేఱుగను, నైసర్గికముగ నేర్పఱుపఁబడియున్నను, ఇంకను నొక్కొకవాటియందు భేదములు కలవు. మానవశరీరములందు బాల్యమున తీపియధికముగఁ గావలసియుండుట సహజముగాననే పిల్ల లధికముగ మిఠాయిలయం దాసక్తి గల్గియుందురు. పెద్దలైనపిదపఁగూడ వేర్వేఱుభేదరసాయనికపదార్థములు వారిశరీరములందుఁ గొఱవడి, కావలసివచ్చుచుండుటంబట్టి వారికి వేర్వేఱు రుచులయం దాసక్తిఁ గల్గియుండుట సంభవించెడిని. ఇవి పాలు, ఉప్పు, కారము, పులుపుమొదలగు నైసర్గికాహారధర్మములు. తక్కిన చేఁపలు,

మాంసము మొదలగు నన్నె సర్గికాహారముల కభ్యాసము, సహవాసమే యట్టిపరిస్థితులకు దారిచూపి వశవర్తనము చేకూర్చెడిని. ఈశరీరతత్వప్రకృతు లేశరీరమున కాశరీరమేగాని యన్యశరీరములతో పోల్కియుండుట యరుదు. దీనింబట్టియే "జిహ్వాకొకరుచి, బుఱ్ఱకొకగుణము" ననుసామెత యేర్పడినది గాఁబోలు.

## త్వప్రకృతులమార్పు:—

శరీరము లన్నియు, చిన్నచిన్నగూళ్లు, రంధ్రములు, వాట్లయందుండురక్తము, పైని రంధ్రములమయ మగు చర్మముచేఁ గప్పఁబడినదని యందఱెఱుఁగినదే. రంధ్రములుగల యీచిన్నగూళ్లు శరీరమునం దలి యొకకడనుండి మార్పుఁజెంద నారంభించి, రెండవకడకు మార్పు ముగియువఱకు రమారమి పదునాల్గువత్సరములకాలము పట్టును. ఈమార్పుదినవఱకున్నగూడు చెడిపోయి క్రొత్తగూడాస్థానమునఁ గుదురుటయని యెఱుంగునది. ఇట్లు పదునాల్గువత్సరములకు శరీరమంతయు మార్పుఁజెందుటతోఁ గొన్ని యితరమార్పులును సంభవించును. శరీరతత్వము, ప్రకృతి కొంత మార్పుఁజెందును. వాతపైత్యశ్లేష్మలతత్వములు, నాడి, కొంతనేఱుమార్గముం బట్టి స్వల్పముగనో, గొప్పగనో మార్పుగల్గును. కొందఱకు దృష్టియు, మఱికొందఱకు శ్రోత్రేంద్రియములు, కొంచెము భేదత నందును.

బాల్యమున నీమార్పు త్వరితముగ నగుచుండుననియు, కాలము మళ్లినకొలఁది మార్పులావశ్యకముగసంభవించుననియు, గాననేఁడేండ్లకాలపరిమితి స్థిరము కాదనియు, దీని నింకను బరిశీలించవలసియున్నదనియు, నిప్పటిపండితు లభిప్రాయపడుచున్నారు.

## శరీరధాతువు లేఁడు:—

(ధాతువులు చూడుఁడు.)

## శరీరఁపువేఁడి - అర్ఘ్యము - పాద్యము:—

శరీరములందుఁగలవేఁడి శరీరరక్తప్రవాహముతోఁ గాలుసేతులకుఁ జేరుచుండును. చేతుల కడకుఁ జేరుకొనుచుండు కాలుసేతులు గడుగుకొనుట మొదలగుకార్యములనుండి చల్లనినీటిచే నాకర్షింపఁబడుచు తగ్గి శరీరమున సమశీతోష్ణము గల్గి సుఖప్రదమగుచుండును గాననే భరతదేశమునం దనాదిగ నింటికిఁ జేరవచ్చినయతిథులకుఁ గాళ్ళుగడుగుకొనపాద్యమును, చేతులుఁ గడిగికొన నర్ఘ్యమును నిచ్చుచుంటఁ బ్రారంభమైనది. ఇంక దాహశాంతికై బడలికతీరనిచ్చు దాహోదకము పిపాసాశాంతికరమని చెప్ప నక్కఱయుండదు.

## శరీరఁపువేఁడిమి:—

శరీరములు, పృథ్వి, జలము, వేఁడి, వాయువు, ఆకాశము ననంబడు పంచభూతమయమై యున్నవి. గాననే స్థూలశరీరమును భౌతిక (భూతసంబంధమగు) శరీర మందురు. ఇవి సమముగ నుండునంతవఱకు శరీర మారోగ్యవంతముగ నుండెడిని.

మనము భుజించుపదార్థములు వేఁడివలననే జీర్ణమై, శరీరమునకు బలమొసంగెడిని. గాన నీ బలము వేఁడిగనే యుండును. అందు శరీరమునకవసరమగువేఁడి నిలచియుండును, తక్కినది యూపిరిద్వారా (నిశ్వాసము) కొంత పైకివెడలఁగొట్టఁబడుచుండును. మఱికొంత శరీరముయొక్క కొన్నిభాగములగుండా పైకి వెడలిపోవుచుండును. మఱికొంత మలముగుండా బైటఁబడును.

ఇట్లే శరీరమం దధికమగుజలము మూత్రముగను, చెమటగను, నింక నిట్టిమూలములుగనే

వెడలిపోవుచుండును. కొన్ని కారణములవలన జీర్ణ శక్తి చెడియు భుజించునది జీర్ణముగాక, లోన చెడి విషమగుటగాని, యితరసంపర్కములవలన విషదోషము శరీరమున కంటిగాని, కుళ్ళిగాని, చెడిగాని, మఱియొకవిధమగు విషపదార్థములు శరీరములోనికిఁ బ్రవేశించినచో నావేఁడి యతిశయించి, (ఉష్ణాధిక్యమై) బాధకరమగును. దానినే జ్వరమందుము. అప్పుడుశరీరపువేఁడి వెడలుమార్గములు విధానము చాలక ప్రకోపించి నిలచియుండుటను (temparature raise) మనము జ్వరముతో శరీరఁపువేఁడి హెచ్చాయెనని తలంతుము.

**శరీరమందలిముఱికిని సబ్బువెమొదలగునవివదల్చుట:—** శరీరములందు లోనిభాగములం గొన్నిటికి చమురుపదార్థ మవసరము. ఇంకను చర్మమారిపోయి బిగిసిపోకుండ, నీచమురుపదార్థము మెత్తనిపనునుగ నుంచుచుండును. దీనికి 'లూబ్రికేషన్' (Lubrication) అనెదరు. తఱచుగ నీలూబ్రికేషన్ శరీరములోపలిభాగములకు, చర్మములో మాత్రమునుండక శరీరమందు వ్యాపించియున్న వాతపైత్త్యాది విశేషలక్షణములచేతను, రోగాదులమూలమునను, శరీరమునందలి పెక్కుభాగములనుండి రంధ్రములగుండా బయటికిఁగూడ చిమ్ముచుండును. (Exuding) బయట మహావాయుమండలియందలి ధూళిమొదలగు నపరిశుభ్రపదార్థములయొక్క త్రసరేణువులు మిక్కుటముగఁ గల్గియుంట నీపైకిఁ జిమ్మినజిడ్డుచమ్మఁ దగులుకొని యుండును. శరీరమున ముఱికిపట్టినదని యనుకొందుము.

ఉదకము తైలములు (oils) గలయు పదార్థము కాదుగాన నెంతయుదకముతో స్నానమొనర్చినను, ముఱికి వదలదు. సరేకదా జిడ్డు మలామాయై శరీరమున బలపడి రుద్దుటతోఁ బ్రాకగల్గి వ్యాపించును. ఇంక సబ్బు, కుంకుడుకాయలు మొదలగుపదార్థములందుఁగల ఆల్కాలీ (alkali) యనంబడు పదార్థము. క్రొవ్వునుగూడ బలము జెడిపి కరగించు (decempore) శక్తిగలదిగాన నివి రుద్దినచో మేనిజిడ్డును పగలఁదీసి బలము గోల్పోవఁజేయును. పిదప (వేఁడి) నీటఁగడిగితి మేని పటిమలేనిదై వదలిపోయి నీటఁబడిపోవును. శరీరము తాదాతుగనైనను, శుభ్రపడును.

**శరీరమందలి మృతభాగములు జీవితభాగములు:—** నరములుగల్గినవి శరీరమున జీవించియున్నభాగములు వీటియం దర్హా చైతన్యము, స్పర్శజ్ఞానముగలదు. ఇందు రక్తప్రసార ముండును. దెబ్బతగిలిన నొప్పియు, గాయముతగిలిన బాధయు నుండును. తలవెండ్రుకలు, గోళ్లుమొదలగునవి శరీరమందలి మృతభాగములు గాన, వీటియందు చైతన్యము, స్పర్శజ్ఞానము, రక్తప్రసారము మొదలగునవి యుండవు. వీటికి గాయము తగిలినను బాధయుండదు. వాటికుదుళ్లు (మొదళ్లు) కడకుఁదెలియఁబడని యేదిక్కు, ఏబాధ యైనను తెలియఁబడక, వాటియందలి మృతావస్థం ప్రచుండునవి యందమైనవి గనున్నను చైతన్యశక్తి మొదలగునవి యుండవు.

కోమలావస్థయందు వెండ్రుకలు నిగనిగలాడు నల్లనిరంగు గల్గియుంటకును, వార్థక్యమున నెఱసియుంటకును పై శకలతో నేసంబంధము గానరాదు.

**శరీరమున దెబ్బతగిలి వాచిన తావున రంగుమాఱుట, నీటిబొబ్బ, కదుము:—** గాయము బలమైనతఱిఁ బరిస్థితులు వేఱుగనుండును. గాని, చిన్న దెబ్బతగిలినతఱిచటి పలుచనిచర్మఁపుఁబొరక్రిందనున్నరక్తఁపుఁగూడులు

కొన్ని చితికి, యందలిరక్తము బైటఁబడును. దెబ్బ తగిలినతావున రక్తస్రావమునకు స్వేచ్ఛామార్గము తొల్లింటివలె నుండక మెరకపల్లములతో నుంటయు, దానిని చర్మము హత్తుకొనియుంటయు, నచటి రక్తము ప్రవహించు సన్నఁపునాళములు తగిలిన దెబ్బకుఁ గనలియు, చెడియు, పనిచేయఁజాలకుంటయు, పై రక్త మటఁ బ్రసరించి పరిశుభ్రపఱుపఁజాలదు. చితికినగూళ్ళయందలి రక్తము ప్రవాహ సంపర్కము లేక (ఆక్సిజెన్ సంబంధ ముండక) తన పరిశుభ్రతం గోల్పోయి చెడనారంభించును. (decompose).

అపరిశుభ్రమగు స్థితియందు రంగులు మాఱును. ఈలోపున నచటిచర్మము వాచినను వాచును. ఆ వాఁపు తీయువఱకు ననఁగా లోపలిగూళ్ళు తిరుగచక్కఁబడి, రక్తప్రవాహము తిన్నగఁగల్గువఱ కీవాఁపునుండిగాని, చర్మముగుండాగాని, మాఱురంగులు గన్పించనోపు.

ఒకప్పు డావాఁపు నీటిబుగ్గ యగుటయుం గలదు. ఎట్లన లోపలిగూళ్ళకు బాధకలుగకుండ కేవలము పైపొరయే కాలుటవలనఁగాని, కొంచెము దెబ్బవలనఁగాని చీకాకొనర్పఁబడినచో నటకుఁ బరిశుభ్రమొనర్ప నెక్కువ నీ రేతెంచెడిని. ఈనీరు లోపలిచర్మమునకును, పలుచని పై చర్మమునకును, నడుమఁ బ్రవహించుచుండునది. ఈద్రవము చర్మముల నాఱిపోనీయక మెత్తనిపదునుగ నుంచుచుండును.

ఈద్రవము కాల్పుగాని, దెబ్బగాని తగిలిన తావునకుఁ బర్విడుచువచ్చి నిలుచును. అంతయు నిలదిపోయియు, కొంతవెనుకకు మరలును. ఈలోపున చుట్టుపట్ల నాటంకములచేఁ గొంతనిలచిపోవుటయుఁ గలదు. అదియే కదుముగట్టి లోపల పులిసి చెడిపోయి, బొబ్బయైయుండెడిని. ఆకదుము పగిలినచో నానీరే బయటపడును.

**శరీరవ్యాయామమున కాంగ్లవిధానము:**—ఆంగ్లదేశమునం దీవిధానము వాడుక నొందియున్నది. ప్రభుత్వశాఖవారి యంగీకారముఁ బడసినది. పాఠశాలబాలురకు సైన్యమునందు వాఁడఁబడుచున్నది. దీనిని 'Physical training Exercise' అందురు. భరతదేశఁపు వ్యాయామము (కసరత్తు)న్కు బోలియుండును.







కొన్ని చిటికి, యందలిరక్తము బైటఁబడును. దెబ్బ తగిలినతావున రక్తస్రావమునకు స్వేచ్ఛామార్గము తొల్లింటివలె నుండక మెరకపల్లములతో నుంటయు, దానిని చర్మము హత్తుకొనియుంటయు, నచటి రక్తము ప్రవహించు సన్నఁపునాళములు తగిలిన దెబ్బకుఁ గనలియు, చెడియు, పనిచేయఁజాలకుంటయు, పై రక్తమటఁ బ్రసరించి పరిశుభ్రపఱుపఁ జాలదు. చిటికినగూళ్ళయందలి రక్తము ప్రవాహ సంపర్కము లేక (ఆక్సిజెన్ సంబంధ ముండక) తన [illegible]తం గోల్పోయి చెడనారంభించును. (decompose).

అపరిశుభ్రమగు స్థితియందు రంగులు మాఱును. ఈలోపున నచటిచర్మము వాచినను వాచును. ఆ వాఁపు తీయువఱకు ననఁగా లోపలిగూళ్ళు తిరుగ చక్కఁబడి, రక్తప్రవాహము తిన్నగఁగల్గువఱకీవాఁపునుండిగాని, చర్మముగుండాగాని, మాఱురంగులు గన్పించనోపు.

ఒకప్పుడావాఁపు నీటిబుగ్గ యగుటయుం గలదు. ఎట్లన లోపలిగూళ్ళకు బాధకలుగకుండ కేవలము పైపొరయే కాలుటవలనఁగాని, కొంచెము దెబ్బవలనఁగాని చీకాకొనర్పఁబడినచో నటకుఁ బరిశుభ్రమొనర్ప నెక్కువ నీరేతెంచెడిని. ఈనీరు లోపలిచర్మమునకును, పలుచని పైచర్మమునకును, నడుమఁ బ్రవహించుచుండునది. ఈద్రవము చర్మముల నాఱిపోనీయక మెత్తనిపదునుగ నుంచుచుండును.

ఈద్రవము కాల్పుగాని, దెబ్బగాని తగిలిన తావునకుఁ బర్విడుచువచ్చి నిలుచును. అంతయు నిలదిపోయియు, కొంతవెనుకకు మరలును. ఈలోపున చుట్టుపట్ల నాటంకములచేఁ గొంతనిలచిపోవుటయుఁ గలదు. అదియే కదుముగట్టి లోపల పులిసి చెడిపోయి, బొబ్బయైయుండెడిని. ఆకదుము పగిలినచో నానీరే బయటపడును.

**శరీరవ్యాయామమున కాంగ్లవిధానము:**—ఆంగ్లదేశమునం దీవిధానము వాడుక నొందియున్నది. ప్రభుత్వశాఖవారి యంగీకారముఁ బడసినది. పాఠశాలబాలురకు సైన్యమునందు వాఁడఁబడుచున్నది. దీనిని 'Physical training Exercise' అందురు. భరతదేశఁపు వ్యాయామము (కసరత్తు)ను బోలియుండును.



















**శర్కరాత్రయము:**— [త్రిశర్కరలు చూడుఁడు].

**శర్కరవ్యాపారము:**—భరతదేశమును చెఱకుఁగడ్డకు జన్మదేశమనియు, శర్కరపరిశ్రమ భరతదేశమునం దనాదిగ గలదనియుఁ జెప్పవలయును. ఆదిని గొంతకాల మీదేశమునుండి ప్రపంచమునకంతకునగు శర్కరయం దెక్కవభాగ మంపఁబడుచుండె నని వాదుకగలదు. మూఁడు వేలసంవత్సరములకుము న్నీపంచదార బెల్లముల పరిశ్రమ భరతదేశముదేయని వాదుచుండిరి. సంస్కృతమున పంచదారకు శర్కర యనియు, బెల్లమునకు గుడ మనియుఁ బేరులు గాన్పించెడిని.

చెఱకుఉత్పత్తి, శర్కరపరిశ్రమ, గంగానది ప్రవహించులోవనుండి చీనాదేశమునకు, నటనుండి యీజిప్తునకు నటనుండి యైరోపాదేశము లన్నింటికిని వ్యాపించెననియు, నది యరబ్బీవ్యాపారస్థుల మూలమున జరిగెననియుఁ జెప్పఁబడినది. ఐరోపా వారు వెస్టిండీసుదీవులందు వ్యాపింపఁజేసిరి. అవియే యిక్కాలమున శర్కరపరిశ్రమయందుఁ బ్రఖ్యాతిఁగాంచియున్నవి.

క్రీ. వె. ౧౭౯౧ లో Hayti లోను, San Domingo యందునను గొప్పపంచదార గిరాకీ గల్గెనఁట. దానికిఁ బాశ్చాత్త్యులు 'Black rebellion' అని పేరిడిరి. అత్తఱి నీస్టిండియా కంపెనీవా రిండియానుండియు, వెస్టిండీసువారు వారి దీవులనుండియు, పంచదారలంపి లాభముఁ బడసిరి. అటుల నెపోలియన్ కలహములవఱకు సాఁగెను. క్రీ. వె. ౧౭౯౧ లో నింగ్లాండునందుఁ బంచదారపై పన్ను పౌ 32 - షి ౧౬ - పె 3 లేర్పడెను. క్రీ. వె. ౧౮౭౪ లోఁ దగ్గింపఁబడెను. క్రీ. వె. ౧౮౪౬ లో భరతదేశమునుండి బ్రిటనుదేశమున కఱువది వేలటన్నుల పంచదార యెగుమతిచేయఁబడెనని చెప్పఁబడినది.

క్రీ. శ. ౧౮౪౬ నుండి మాన్చెస్టరు వారి హస్తగతమైన పద్ధతి వ్యాపించె. ఇంగ్లాండు బెల్లముఁగొని పంచదార చేసి యమ్మనారంభించెను. దీనికి "ఫ్రీట్రేడ్డుపాలసీ" యనిపేరు. ఈనడుమ జావాద్వీపము తలయెత్తి పంచదారపరిశ్రమయందభివృద్ధి నందసాఁగెను. దీని నిటుండనిచ్చి భరత దేశఁపు శర్కరపరిశ్రమనుఁగుఱించి యోచింతము. క్రీ. శ. ౧౯౩౨ సంllరములో Sugar Industry protective Act. యేర్పడియెను. ఇది యిండియన్టారిఫ్ బోర్డు శిఫారసులమేర కుద్భవించిన శాసనము. భరతదేశమునందుఁ జెఱకువ్యవసాయముక్రింద 1933–34 సంవత్సరముల లెక్కలమేరకు 3305000 ఎకరములనేల కలదు. చక్కెరయంత్రశాలలు నిర్మింపఁబడినవి.

| | | |
|---|---|---|
| సంయుక్తరాష్ట్రములు (స్టేట్సుసహా)— | ౧౭౩౧౦౦౦ | ఎకరములు. |
| పాంచాలదేశము | ౪౬౭౦౦౦ | ,, |
| బీహారము ఉత్కలదేశము | ౪౧౮౦౦౦ | ,, |
| బంగాళము | ౨౫౭౦౦౦ | ,, |
| చెన్నరాజధాని | ౧౨౦౦౦౦ | ,, |
| బొంబై రాజధాని [స్టేట్సు సహా] | ౧౦౨౦౦౦ | ,, |
| పశ్చిమోత్తరసరిహద్దు పరగణాలు | ౪౯౦౦౦ | ,, |
| ఆసాముదేశము | ౩౪౦౦౦ | ,, |
| మధ్యరాష్ట్రములు, బీరారుదేశము | ౨౯౦౦౦ | ,, |
| మైసూరురాజ్యము | ౪౩౦౦౦ | ,, |
| హైదరాబాదురాజ్యము | ౪౬౦౦౦ | ,, |
| బరోడరాజ్యము | ౨౦౦౦ | ,, |
| భోపాళరాజ్యము | ౪౦౦౦ | ,, |
| ఢిల్లీ పరగణాలు | ౩౦౦౦ | ,, |
| మొత్తము— | ౩౩౦౫౦౦౦ | ఎకరములు. |

భరతదేశమున బెల్లమునుండియు, చెఱకురసమునుండియు తొల్లింటనుండి పంచదార చేయఁబడుచుండినది. పంచదార చక్కెర యని వాడఁబడు 'చక్కెర' శబ్దము శర్కరశబ్దమునుండి యేర్పడినదియే. ఇది యచ్చులోఁ బోయఁబడిన పంచదార. ఇంక చీనాదేశమునం దిది యిసుకవలె జేయఁబడుచుంట నిసుకఁబోలినగుండపంచదారను నేఁటికిని చీనాపంచదారయని పిలిచెదరు. అందు బనారసుప్రాంతములఁ జేయఁబడుచున్న మెత్తని గుండ పంచదారకు 'బనారస్‌చీనీ' యని వాడుచున్నారు. పాశ్చాత్యపద్ధతులపై భరతదేశమున నిర్మింపఁబడిన యంత్రశాలలందు చెఱకురసము బెల్లములతోడనే గాక యెక్కువగా తాటిబెల్లము, ఈఁతబెల్లములు పంచదారగఁ జేయఁబడుచున్నవి.

ఇంకను పాశ్చాత్యదేశములందు చీటురూటు దుంపలతోఁ బంచదార చేయఁబడుచున్నది. భరతదేశమునుండి యైరోపా కెగుమతిచేయఁబడుచున్న తాటిబెల్లమును నుపయోగించుచున్నారు.

**శర్కరానది-ఆవర్తానది:**— దేవీభాగవతము ౮-౨ యందు శర్కరావర్తనదులు రెండుగఁ బేర్కొనఁబడినది. వాటజాడ సరిగా గానరాకున్నది. బీహారుదేశమున 'శాక్రి' యనునొక చిన్ననది గానవచ్చుచున్నది. గాని యితరసదృశనము లేమియుఁ గానరాకున్నవి.

**శర్కరాసప్తమి:**— వైశాఖశుద్ధసప్తమికి పేరు కలదు. ఉదయముననే మేల్కాంచి (తెల్ల పువ్వులు) తెల్లని పూలదండ, తెల్లని గంధాది ద్రవ్యములు, స్థండిలముచేసి పద్మము కుంకుమలతో లిఖించి, యందుఁ బరమేశ్వరుని పూజించుచుందురు.

**శర్కరోన్మజ్జనీయన్యాయము:—** ఒకఁడు ఒకరాతిని నీటిలోని కూరక విసరెను. అది వలుకే యచ్చట మున్గియుండిన వేఱొకనికిఁ దగిలెను. విసిరినవానికి దురుద్దేశ్యము లేకున్నను మున్గినవానికిఁ దగిలెఁ గాన ప్రమాదమని భావము.

**శర్మిష్ఠ:—** తండ్రి వృషపర్వుఁడను దానవ భూపతి. (వృషపర్వుఁడు కశ్యపునకు దనువునందు జన్మించిన వాఁడు). వృషపర్వుఁడు శుక్రుని శిష్యుఁడు. శర్మిష్ఠ దేవయానికిఁ జెలికత్తె.

శుక్రుని కుమార్తెయగు దేవయాని యయాతి మహారాజు ప్రథమభార్యయై తనచెలికత్తె యగు శర్మిష్ఠంగూడ తనవిభునకే వివాహ మొనర్చినది.

**శర్వాణర్షియాశ్రమము:—** అయోధ్య రాష్ట్రమున ఫైజాబాద్ జిల్లా, అః జనులోని దోహ్రి యనుగ్రామముకడ మర్వావిశ్వానముల సంగమముకడ నంధముని కుమారుండగు శర్వాణర్షి యాశ్రమ ముండెను. ఇతనికి సరయూ నదీతీరమున నొకయాశ్రమ ముండినటుల, రామాయణము అయోధ్యకాండము ౬3 అధ్యాయమునఁ జెప్పఁబడినది. దశరథమహారాజే శర్వాణునే నీరు పాత్రతో ముంచుచున్నతఱి, నడవి యేనుఁగ యని పొరపడి బాణప్రయోగముచేఁ జంపెనని చెప్పఁబడినది.

**శర్యాఁడు:-** నరిష్యంతుని సంతతివాఁడగు క్షత్రియుఁడు.

**శర్వుఁడు:—** పరమేశ్వరుండగు రుద్రుని యెన్మిదియాకారములలో నొకటి. [అష్టమూర్తి చూడుఁడు.]

**శలభన్యాయము:—** శలభ మనిన మిడుత యనియర్థము. మిడుత దీపముపై కెగిరిపడుట సర్వసాధారణమే. మందుదీపముపై ప్రాలి రెక్కలను, శరీరమును గాల్చుకొని పడిచచ్చును. గొప్పవారిపై నకారణముగఁబడి బాధింపఁబోయి నాశనమందునట్టివారింగూర్చి యీన్యాయము వర్తించును.

**శలభాసనము:—** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. కాళ్ళు చాపుకొని బోరగిలఁబరుండి రొమ్ముక్రింద నరముఖమమాత్రము పైకెత్తియుండుట శలభాసనము. ఇది విశ్రాంతికరమని చెప్పఁబడినది.

**శల్కగోత్రము:—**
[భరద్వాజఉపగణము చూడుఁడు.]

**శల్యసారథ్యము —** కురుక్షేత్రసంగ్రామమున మద్రదేశాధీశ్వరుండగు శల్యుఁడు కర్ణునకు సారథ్యము చేయవలసివచ్చెను. శల్యుఁడు నకులసహదేవులకు సాక్షాత్తు మేనమామ. అందుచే, పాండవులదెన చుట్టఱికము మెండు. కారణాంతరములచేఁ దాను కౌరవులపక్షమునఁ బోరాడుచున్నను, పాండవుల కుపకారము చేయుదునని బాస యిచ్చెను. కర్ణునకుఁ దాను సారథిగానున్న సమయమున, కర్ణశూలములాడి, నర్జునునిపై నుద్దేశింపఁ గమనించినపుడెల్ల కర్ణుని నిరుత్సాహపఱచుచువచ్చెను. అప్పటినుండియు శల్యసారథ్యమనునది యొకలోకోక్తి యయ్యెను. శల్యసారథ్యమనఁగా తానొకపక్షముబూని, తత్పక్షమునకు నష్టకరముగాఁ బ్రవర్తించుట.

**శల్యుఁడు:—** అత్రి. చంద్రపూరువు కురుసంతతిక్షత్రియుఁడు. తండ్రి సోమదత్తుఁడు. పితామహుఁడు బాహ్లికుఁడు. సోదరులు భూరి, భూరిశ్రవుఁడు ననువారలు.

మఱియు మద్రదేశాధిపతి శల్యుఁడు. మాద్రీదేవి యాతనితోఁబుట్టువు; పాండురాజుభార్య. నకులసహదేవులకు మేనమామ. శత్రులకు హృదయశల్యుఁ డగుట నీతని కిది బిరుదనామ మందురు. అశ్వహృదయజ్ఞాన నిపుణుఁడని ప్రతీతి. ఇతఁడు కౌరవపక్షమున భారతయుద్ధమునందుఁ గర్ణునకు సారథియైనవాఁడు. యుధిష్ఠిరునిచే నిహతుఁడాయెను.

ఇంకను దానవుండగు విప్రచిత్తి కుమారునకును శల్యుఁడని పేరుకలదు.

## శవలగోత్రము:—

(కౌశాయనఉపగణము చూడుఁడు).

## శవాలంకారము:—

ఆంధ్రభాషాసాంప్రదాయార్థపదము. నిరర్థకకార్యమని భావము. ప్రయోజనములేనిపనుల నొనర్చుట కీఁడ్తని వాడుచుందురు.

## శవాసనము (మృతాసనము):—

యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. దీనికి మృతాసనమనియుం బేరుకలదు. వెల్లకిల భూమిపైఁబండి కాలుసేతులు తిన్నగఁ జాచియుండుట 'శవాసనము' లేక 'మృతాసన' మనంబడును.

ఇట్లే పరుండి చేతులు శిరస్సువైపు తిన్నగా నిలువున చాఁచుట 'దండాసన' మనఁబడును. ఆపరుండుటయే గుండెలను నేలమోపి బోరగిలఁబరుండిన నధ్వాసన మనఁబడును.

యోగాభ్యాసమువలనఁ గలిగెడిశ్రమను నివారించి, విశ్రాంతి నొసంగ నీయాసన ముపయోగింతురు.

## శవోద్వర్తనన్యాయము:—

దీనిని 'శతశృంగారన్యాయ' మనియు వాడుచుందురు.

నిష్ఫలితప్రయత్నమని భావము. మఱియు నరణ్యరోదనన్యాయమును నించుకభేదములతో నిట్టి యర్థమునే యిచ్చును.

## శశాంకుఁడు (చంద్రుఁడు):—

శశము (కుందేలు) అంకముగాగలవాఁడు. చంద్రుని లోని నల్లమచ్చయని భావము.

## శశిబిందువు [మహారాజు]:—

అత్రి చంద్ర, యాదవ (క్రోష్టుసంతతి) క్షత్రియుఁడు. తండ్రి చిత్రరథుఁడు. ఈతఁడు చక్రవర్తి. చతుర్దశమహారత్నసంపన్నుఁడని పేరందినవాఁడు. సుతులు భార్యలు పెక్కండ్రు కలవాఁడట. దొరకిన సుతులపేర్లు ౧ పృథుశ్రవుఁడు, ౨ పృథుదానుఁడు, ౩ పృథుకీర్తి, ౪ పృథుజయుఁడు, ౫ పృథుకర్ముఁడు, ౬ పృథుయశుఁడు. [చతుర్దశమహారత్నములు చూడుఁడు]. ఇందు, పృథుశ్రవుని కుమారుఁడు ధర్ముఁడు లేక ఉశస్సు. పౌత్రుఁడు శతాయువు. ప్రపౌత్రుఁడు రుక్మకవచుఁడు లేక రుచికుఁడు. అతని (రుక్మకవచుని) కుమారుఁడు జ్యామఘుఁడు. (మహారాజులు చూడుఁడు.)

## శశిరేఖ:—

అత్రి. చంద్రవంశక్షత్రియస్త్రీ. తండ్రి వసుదేవునికుమారుఁడగు బలరాముఁడు. తల్లి రేవతి. భర్త అభిమన్యుఁడు. [సుభద్రార్జునుల తనయుఁడు.]

శశిరేఖ బలరామునికుమార్తెయనిగాని, అభిమన్యుఁడు వివాహమొనర్చుకొనెననిగాని, శశిరేఖ యనునామ ముదాహృతమగుటగాని పురాణములందుఁ గానము.

## శస్త్రచికిత్స (ఆయుర్వేదీయము):—

ఆయుర్వేదవైద్యవిధానమున శల్యతంత్రమువందు శస్త్రచికిత్సంగూర్చి వివరింపఁబడినది. వాగ్భటమను గ్రంథమున, చికిత్సనొనర్చుటకు శస్త్రము లిరువదియాఱుగఁ జెప్పఁబడినను, శస్త్రము లిరువదియేయని పెక్కుతావులందుఁ గలదు. అవి ౧ మణ్డలాగ్రము, ౨ కరపత్రము, ౩ వృద్ధిపత్రము, ౪ నఖశస్త్రము, ౫ ముద్రిక, ౬ ఉత్పలపత్రకము, ౭ అర్ధధారము, ౮ సూచీ, ౯ కుశపత్రము, ౧౦ ఆటీముఖము, ౧౧ శరారీముఖము, ౧౨ అంతర్ముఖము, ౧౩ ఆర, ౧౪ వేతసపత్రిక, ౧౫ బడిశము, ౧౬ శంకులు, ౧౭ ఏషణి, ౧౮ త్రికూర్చకము, ౧౯ కుఠారిక, ౨౦ వ్రీహిముఖము, (సుశ్రుత, సూత్ర ౮ అధ్యాయము) అనంబడునవి యిరువదివిధములు శస్త్రములు చెప్పఁబడినవి.

ఈశస్త్రోపకరణము లారేసియంగుళముల ప్రమాణ ముండవలయుననియు, నొక్కొకకత్తికి మూఁడు లేక రెండు నకళ్ళుండవలె ననియు, నవి ప్రశస్తమైన యుక్కుతోను, చంద్రలోహము తోడను చేయఁబడి చక్కని దారుగల్గియుండవలె ననియు, నిందుఁ గొన్నికత్తులు సగము వఱకును, కొన్ని నాల్గవవంతు ప్రదేశమువఱకును, కొన్ని రెండువైపులను, కొన్ని కడను చక్కని దారు గల్గియుండవలెననియు, వీట్ల నుపయోగించుటకుఁ బూర్వము కత్తులకు వేఁడి గల్గించి, పాయనసంస్కారముఁ జేయవలె ననియుఁ జెప్పఁబడినది.

ఇట పాయనసంస్కార మన నాయాచికిత్సల కర్హమగురీతుల క్షారద్రవమందుఁగాని, తైలము నందుఁగాని, ఉదకమునందుగాని, యర్హమగురీతిని పాయన, పాటన, సౌకర్య హితములనంబడు చతుర్విధములైన పదునులు కత్తుల కిడవలయుననియుఁ జెప్పఁబడినది.

ఈశస్త్రములచేఁ జేయఁదగిన పనులు. ౧ ఛేద్యములు (నరకుట), ౨ భేద్యములు (చీల్చుటలు), ౩ లేఖ్యములు (గీరుటలు), ౪ వేధ్యములు (గ్రుచ్చుటలు), ౫ ఏష్యములు (వెతకుట లేక శోధించుటలు), ౬ ఆహార్యములు (బయటికి వెడలించుటలు), ౭ విస్రావ్యములు (స్రవింపఁ జేయుటలు), ౮ సీవ్యములు (కుట్టుటలు) నని యెన్మిది తెగలుగ విభజింపఁబడియున్నవి. (సుశ్రుతము అగ్రోపహరణీ అధ్యాయము చూడుఁడు).

ఇంకను శస్త్రము చేయకుండనే బాధకములై లోపలఁ జేరియుండు నన్యపదార్థముల బయటికి నూడఁబెఱుకఁదగిన సాధనములుగ నూటవక్కయంత్రములు వివరింపఁబడినవి. ఈయంత్రములు ౧౦౧ యు, ఆఱుతెగలుగ విభజింపబడినవి. ౧ స్వస్తికయంత్రము లిఱువదినాలుగు, ౨ సందశయంత్రములు రెండు, ౩ తాలయంత్రములు రెండు, ౪ నాడీయంత్రము లిరువది, ౫ శలాకాయంత్రము లిరువదియెన్మిది, ౬ ఉపయంత్రము లిరువదియైదు. ఇటుల నీయాఱువిధములగు యంత్రములు నూటఒక్కటి చెప్పఁబడినవి. వీటితో శస్త్రచికిత్స చేయనక్కఱలేని లఘుదోషములం బరిహరింపనగునని చెప్పఁబడినది.

ఇందు స్వస్తికయంత్రములు పదునెన్మిది యంగుళముల ప్రమాణమునను, సందశయంత్రము లాఱంగుళముల ప్రమాణమునను, తాలయంత్రములు, పండ్రెండంగుళముల ప్రమాణమునను, నాడీయంత్రము లనేకపరిమాణములతో నున్న శలాకాయంత్రములు, నుపయంత్రములు నర్హమగురీతుల వేర్వేఱుపరిమాణములతోను చేయఁబడునట్లు విధింపఁబడినది. వీట్లయందుఁ గొన్ని యినుము, కొన్ని దంతము, కొన్ని కఱ్ఱతోఁ జేయఁబడునట్లు శాస్త్రగ్రంథములందు సూచింపఁబ

ఈశస్త్రప్రయంత్రాదు లుపయోగింపుటయం దాయాయారోగములస్థితిగతుల ననుసరించి యెంతెంత లోతునకు శస్త్రము చేయనగునో, ఎంత వఱకు శోధింపవలెనోకూడ వివరింపఁబడియున్నది. చిరకాలమునుండి యాశస్త్రవైద్యమగు శల్య తంత్రము క్రియాభ్యాసమున లేకుండి, యట్లే నిలచియున్నది గాని యభివృద్ధి నందుచుండుట లేమికి వగవవలయునుగాని, యీస్థితియందుఁ జేయఁదగిన దేదియుఁ గానరాదు.

భరతదేశముఁ దొల్లింటి శస్త్రచికిత్సావిధాన ముంగూర్చి సుశ్రుత సూత్రస్థానమందలి ౧-౭-౧౮-౨౦-౨౧-౨౨-౨౩-౨౪-౨౫-౨౬-౨౭ అధ్యాయములందునను, చరకము చికిత్స ౧౩ వ అధ్యాయమునను, వాగ్భటసూత్ర ౨౬-౨౭-౨౮-౨౯-౩౦ అధ్యాయములందునను వివరింపఁబడియుంటఁ గాననగును.

## శస్త్రవిద్యావిధానమరణము:—

'ఆంగ్ల' ఆలోపతీవైద్యవిధానమునవలంబించిన శస్త్రవిద్యా ప్రపూర్ణులగు వారిధర్మముమేరకు మృతి Heart failure వలననో, Failure of central nervous system వలననో,Blood system చెడుటవలననో గల్గుచుండునని చెప్పఁబడుచున్నది. ఈమూఁడే చావునకు మార్గములఁట. ఈత్రివిధ మృతులును నొక్కొకటి Reversible death అనియు, Irreversible death అనియు, ద్వివిధములనియుఁ జెప్పఁబడినది. reversible death న కుదాహరణముగ గుండెలందుఁగత్తితోఁ బొడిచి చంపుటయని చెప్పఁబడినది. పొడిచినకతన నరముల గుండా రక్తము స్రవించుట యాగి యాపివా డకపోయెడిని. ఈస్థితి గల్గుటతో నాతఁడు చచ్చె ననియందురు. ఈమృతి శస్త్రవిద్యాధర్మమున Reversible death అనఁబడును. అట్టి స్థితి యం దాశరీరావయవములు Brain సహా యిం కను జీవించియుండనోపు. తోడనే వైద్యసహాయ మమరెనేని యాతఁడు తిరుగ జీవింపనోపు. ఆలస్య మగునేని Inreversible death కుఁ జేరిపో యెడిని. ఆస్థితి సంభవింపఁ బునర్జీవనదశ (Resuscittation) వీలుకాని దగును. ఏలయన నాశరీరమందలి మేధస్సు (Brain) సహా disintegration స్థితికిఁ జేరుకొనును. లేదా spiral centers disintegration స్థితికి లోనగును. ఇంచుక పిదపఁగూడ శరీరేతరావయవములందుఁ గొన్ని జీవనస్థితియందే యుండెడిని. అవి క్రమ ముగ నొక్కొకటిగ మరణించుచు, టిష్యూ [Tissues] లకూడ మృతికిఁ బాల్పడెడిని. మన స్సునకు మృతి కల్గునో లేదో యింకను పరిశీలనల నందవలసియే యున్నది. దానింగూర్చి యిదమిత్థ మని చెప్ప విలుగాకున్నది. ఈవిషయమును గూర్చి యమెరికా ఖండమునందలి న్యూయార్కు నగరమున Academy of medicine సభా సభ్యుల యెదుట రాక్ఫెల్లరు ఇన్‌స్టిట్యూటునందుఁ బండితుఁడగు Dr. Alexis carrd పండితుఁడు ప్రసంగించుచు తనవార్తరిపోర్టు సర్పించియున్నాఁడు. ఆమహనీయుఁ డింకను 'If scince is allowed to gon eight or ten centuries decease may perhaps be suppressed but there is no hope of ever conquering senescence and death" అనికూడ నుడివియున్నాఁడు.

## శస్త్రవిద్య (Surgery) సమగ్రము:—

పాశ్చాత్యుల వైద్యవిధానమున శస్త్రవిద్య యిక్కాలమునమిక్కిలి పేర్వడసియున్నది. ఆయుర్వేద వైద్యమందలి శస్త్రవిద్య తగ్గి ప్రచారమునఁ గాన్పించుటలేదు.

పాశ్చాత్త్యవిధానమున గ్రీకుదేశపు సాంప్రదాయములు చెప్పియున్నారు.

Paracelsus అను మహనీయుఁడు, తొలుత ప్రారంభించినవాఁడని చెప్పఁబడినది. దానిని 'Ambroise Pare' అని ఫ్రెంచిమిలటరీఎంజనీరు తనపరిశీలన ప్రయోగములవలన చాలయభివృద్ధికిఁ దెచ్చినవాఁడని చెప్పఁబడినది. A Vesalius అనువారును, G. Fallopius అనువారును నీ విద్యను చక్కఁగ నభివృద్ధికిఁ దెచ్చి Anatomy గ్రంథమును రచించిరి. క్రీస్తువెనుక పదునేఁడవశతాబ్దమున నీవిద్య గొప్పపరిశీలనలకు లోనై యనేక మెళుకువలనంది వృద్ధియాయెను.

క్రీ. వె. ౧౬౨౨-౧౬౭౬ కాలమువాఁడగు Richard wiseman పండితుఁ డాంగ్లదేశమున నెక్కువ కృషిసల్పినవాఁడు. పిదప నొకనూఱుసంవత్సరముల కాల మిది యట్లే నిలచియుండి John Hunter అనుగొప్పవైద్య విశారదునివలనఁ గొప్పవ్యాపకము గాంచెను. X-ray యును, blood Tests దీనిని పరిపూర్ణతకుఁ దెచ్చినవి. ఇప్పుడు విశారదులచేత నున్నది.

**శస్త్రహతచతుర్దశి:—** మహాలయపక్ష (సంబంధమున) ఆశ్వీయుజ బహుళ చతుర్దశిదినమున శస్త్రహతులంగూర్చి పితృర్చ మొనర్చుట కొందరియందుఁ గలదు.

**శ్రద్ధ:—** స్త్రీ. ఈపేరుగలవా రిర్వురు గానఁగుచున్నారు. ధర్మునిభార్య యొక శ్రద్ధాదేవి. ఈమెసుతుఁడు శముఁడు. వేఱొక శ్రద్ధాదేవి వైవస్వతునిభార్య.

**శ్రవణం నక్షత్రము:—** ఇది మత్స్యాకారమును స్ఫురింపఁజేయు మూఁడునక్షత్రముల సముదాయము. దీని కింకను 'మురజి' త్రనియు, వైష్ణవ మనియు, శ్రీకాంత మనియు, శ్రీశ మనియు, హరి యనియు, పర్యా కలవు. విష్ణుదేవుఁ డధిదేవత. దేవగణనక్షత్రము. ఊర్ధ్వముఖము. పుంస్వభావనక్షత్రము. ఆడఁకోఁతి, సముద్రపుకాకి, గంగరావిచెట్టు, ఈనక్షత్రసంబంధము లనియు, ప్రవేశించిన పదిఘడియలపై త్యాజ్య మ (విషఘటికల) నియు, ముప్పదినాల్గుఘడియలపై నమృతఘటిక లనియు, మత్స్యాకారచరస్వభావనక్షత్ర మనియుఁ జెప్పఁబడినది.

**శ్రవణద్వాదశి:—**
విష్ణుదేవుఁడు వామనుఁడై పుట్టినదినము.
[ఉపేంద్రద్వాదశి చూడుఁడు].

**శ్రవణార్షవ్యగోత్రము:—**
[విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు].

**శ్రవసగోత్రము**
[నిధ్రువగణము చూడుఁడు].

**శ్రవస్తిపురము:—** దీనికిఁ జంద్రికాపురి యనియు పేరుండెను. [సాహెత్ మాహెత్] అయోధ్యరాష్ట్రములోని గొండాజిల్లాలో నున్నది.

ఇది జైనుమత మూఁడవతీర్థకరుఁడగు సాంభవనాధునకును, ఎన్మిదవతీర్థకరుఁడగు చంద్రప్రభానాధునకును జన్మస్థానమగుట జైనులయాత్రాస్థలమైయున్నది.

**శ్వపుచ్ఛోన్నామనన్యాయము:—** కుక్కతోఁక వంకఁదీర్చుట యని యర్థము. కుక్కతోఁకవంక నైసర్గికము, తీర్చబడునది కాదు. కుక్కతోఁక వంక కుదురబో దని లోకోక్తి కలదు. నిష్ఫలితప్రయత్న మని భావము.

**శ్వఫల్కుఁడు:—** అత్రి చంద్రవంశ యాదవ క్షత్రియుఁడు, తండ్రి వృష్ణి. పితామహుఁడు అనమిత్రుఁడు. భార్య కాందిని. ఈమె యందు పన్నిద్దఱుసుతులని చెప్పఁబడినది కాని, యందొక యక్రూరునిపేరుతప్ప తక్కినవి తెలియఁబడవు. అక్రూరుఁడు జ్యేష్ఠుఁడఁట. అక్రూరునకు సుచారువు కుమార్తె.

**శ్వశానిర్గచ్ఛోక్తిన్యాయము:—**
బిచ్చగానిని కోడలు "బియ్యముతేవలెను వెళ్ళు" మనినంత, నత్తగారు వానిందిరుగఁ బిలచి 'బియ్యముతేవలెను వెళ్ళు' మని తిరుగ ననెనఁట. ఏలయన నత్తగారకు తనకు స్వతంత్రమున్నది గాని, కోడలు ముష్టివేయుటకుఁగాని, లేదుపొమ్మనుటకు గాని స్వతంత్రురాలు కాదనెనఁట.

ఫలములేని యధికారదురాగతమున కీన్యాయము వర్తించెడిని.

**శ్వస:**
భర్త ప్రజాపతి కుమారుఁ డనిలుఁడను పేరు గల వసువు.

**శాంకరీయ గోత్రము:—**
[ఉపమన్యుగణము చూడుఁడు].

**శాంకాయనగోత్రము:—**
[కుశికగణము చూడుఁడు].

**శాంఖరిగోత్రము:—**
[ఆత్రేయగణము చూడుఁడు].

**శాంగ్లశాఖక్షత్రియులు:—**
[ప్రమారశాఖక్షత్రియులు చూడుఁడు].

**శాండిలగణము:—** ఇది కశ్యపసంతతి యందలి యొకగణము. ఇం దెనుబది యెన్మిది గోత్రములు చెప్పఁబడినవి.

బోధాయన సూత్రోక్తగోత్రములు (౩౩).

| | |
|---|---|
| ౧ అగ్నిదేహ, | ౧౭ ధన్వంతరి, |
| ౨ ఆయవత్స, | ౧౮ పాచక, |
| ౩ ఔదమేఘ, | ౧౯ బహూదకి, |
| ౪ కామశి, | ౨౦ బహూదరి, |
| ౫ కారేయ, | ౨౧ భాగురి, |
| ౬ కోహల, | ౨౨ మాణవంశ, |
| ౭ కాకంటకి, | ౨౩ మహాంజాయన, |
| ౮ కౌశి, | ౨౪ వాక్యశర, |
| ౯ ఖాదంతీముఖ, | ౨౫ వాత్సబలి, |
| ౧౦ ఖారమానయ, | ౨౬ వాత్స్యాయన, |
| ౧౧ గాంగాయన, | ౨౭ వాపిక, |
| ౧౨ గోభిల, | ౨౮ వేదాయన, |
| ౧౩ గోమూత్ర, | ౨౯ శండిల, |
| ౧౪ జానస్థరి, | ౩౦ శాండిల్య, |
| ౧౫ జాలస్థరి, | ౩౧ సావవస, |
| ౧౬ త్రైక్షుమాభకి, | ౩౨ సౌదస, |
| | ౩౩ హిరణ్యబాహు. |

కాత్యాయన సూత్రోక్తగోత్రములు [౨౫]

| | |
|---|---|
| ౧ ఉత్తర, | ౧౧ జలంధవ, |
| ౨ ఉపలోద, | ౧౨ తృణబిందు, |
| ౩ కారుండజ, | ౧౩ దృకసంది, |
| ౪ కుహావ, | ౧౪ దేవజాతి, |
| ౫ కేశిభ, | ౧౫ పర్వాపకాంజిమ, |
| ౬ కోకిల, | ౧౬ పూవరి, |
| ౭ కౌవలి, | ౧౭ పైప్పల, |
| ౮ గర్ధభీముఖ, | ౧౮ బహుమింథ, |
| ౯ చలుభి, | ౧౯ బైధానవ, |
| ౧౦ చేరల, | ౨౦ వారి, |

౨౧ శాఖల, ౨౪ సౌదానవ,
౨౨ సపన్న, ౨౫ హైపుర.
౨౩ సుకేతు,

మాత్స్య సూత్రోక్తగోత్రములు [౧౪]
౧ అయ, ౮ మహాకోరలయ,
౨ కశ్యప, ౯ వలి,
౩ కైరాత, ౧౦ వేదయాతి,
౪ తదపాంస, ౧౧ సంపాతి,
౫ తోవరి, ౧౨ స్వవసు,
౬ పర్యశ్వకర్దమ, ౧౩ సుకేతు,
౭ పైప్పలాది, ౧౪ సుజాతిపూర.

ఇతరగ్రంథోక్త గోత్రములు [౧౬]
౧ అవత్సర, ౯ భుంజాల,
౨ అశిత, ౧౦ భూతమను,
౩ ఉమాన, ౧౧ మంగళ,
౪ గృహాల, ౧౨ మాగీదర్భ,
౫ చటాయన, ౧౩ ముస్సమయూర,
౬ జావంశ, ౧౪ శతృగాయన,
౭ డాజి, ౧౫ సుమేద,
౮ దైవల, ౧౬ సౌజమి.

ఈశాండిలగణమునందలి [౮౮]. గోత్రములకుం బ్రవరరూపములు [౭]
౧ కాశ్యప, అవత్సర, శాండిల్య.
౨ కాశ్యప, అవత్సర, దైవల.
౩ కాశ్యప, అవత్సర, అసిత.
౪ శాండిల్య, అసిత, దైవల.
౫ కాశ్యప, అసిత, దైవల.
౬ కాశ్యప, దైవల, అసిత.
౭ దైవల, అసిత.

**శాండిలర్షిగోత్రము:—** (శిష్టుకరణములు చూడుఁడు). ఈగోత్రస్థులకుఁ బ్రధానర్షి కశ్యపుఁడనియు, ప్రవర, కాస్యప, దైవల, అసిత, అనియు, శాండిల, అసిత, దైవల, అనియు, దైవల, అసిత యనియు త్రివిధముగఁ జెప్పఁబడినది.

శిష్టుకరణములలో ౧ ఆమిటివారు, ౨ ఇప్పిలివారు, ౩ కవిటివారు, ౪ నందిగాంవారు, ౫ బలివాడవారు, ౬ రావిపల్లివారు ౭ లోచర్లవారు నను నింటిపేర్లవా రీగోత్రజులై యున్నారు.

**శాండిలి:—** ఋషభపర్వతమునఁ దపమొనర్చుచుండిన యొకబ్రాహ్మణస్త్రీ.

గాలవుఁ (ఋషి) డు గరుడునితోసహా గుర్వర్థము గుఱ్ఱములను వెతకుచుండుతఱి నీమె దర్శనము చేసుకొనినటులఁ జెప్పఁబడినది.

మఱియు ప్రజాపతిభార్యలలో నొకతె శాండిలి కలదు. ఈమెసుతుఁ డగ్నియనువసువు.

## శాండిల్యగోత్రము:—
(శండిలగణము చూడుఁడు.)

## శాండిల్యమహర్షిఆశ్రమము:—
కాశ్మీరదేశములోని కామరాజుపురముకడ కిషన్గంగా (క్రిష్ణగంగా) మధుమతీనదులసంగమమున సారథి (శారద) అనంబడుగ్రామముకడ శాండిల్యాశ్రమ ముండినతావుం జూపుచున్నారు. మఱియు నిట శారదాసర్వజ్ఞపీఠము కలదు. ఇది ౫౨ శక్తిపీఠములలో నొకటి.

మఱియు సయోధ్యరాష్ట్రములోని పైజాభాద్ జిల్లాలోని చిత్తైమందార్పూ రనుగ్రామముకడ నొకశాండిల్యాశ్రమము కలదు. శాండిల్యుఁడు శాండిల్యసూత్రములు రచించినవాఁడు.

**శాండిల్యుఁడు:—** శాండిల్యుఁడనుఋషి ప్రసిద్ధుఁడుగానవేరే వివరింప ననవసరము. మఱియు

మగధరాజ్యము నందునిసంతతినుండి మురయను శూద్రస్త్రీసుతుండగు చంద్రగుప్తుఁడనుశాండిల్యుఁడను పేరుగలవాఁ డొకఁడు కలఁడు.

**శాండోనామము:—** ఆంధ్రదేశమున సర్వసాధారణముగను, భరతదేశఁపు టితరభాగములను గౌరవయుతహాస్యాస్పదముగను, శాండో యనిన బలాఢ్యుఁడ (వస్తాదు) నియును, అర్థమగుచుంటఁ గాననగును. ఇది యెట్లు వాడుకనందెనో వివరించుట యాంధ్రవిజ్ఞానమునకు సమంజసము గాకపోదు. ఇటులనే యాంధ్రదేశమున శరీరవ్యాయామములఁ జక్కఁగ నారితేరి గొప్పబలాఢ్యుండని పేరంది కుస్తీ మొదలగు బలప్రదర్శనములందుఁ బెక్కండ్రుబలవంతుల గెలిచిన శ్రీకోడిన రామమూర్తి నాయఁడుగారి కిట్లే 'ఇండియన్‌శాండో' యనుబిరుదనామము వాడుకనందియుంట యెరిఁగినదే. రానురాను శరీరవ్యాయామవిద్య నభ్యసించి గాని లేక గాని బలాఢ్యులగువారిని హాస్యమునకో, హేళనకో శాండో యనుట యెల్లరకుఁ దెలిసియున్నది.

దీనికిఁ గారకుండగు శాండోగారు శరీరవ్యాయామపరిశ్రమ నొనర్చినబలశాలి. జన్మకాలము క్రీ. శ. ౧౮౬౭ ఏప్రెల్‌నెల ౧౨ తేదియనియు, జన్మస్థానము, జర్మనుదేశమునందు Konigsberg అనుపేరుగల గ్రామమనియు, గోటింజను విశ్వవిద్యాలయ పాఠశాలయందు విద్యాభ్యాస మొనర్చెననియుఁ జెప్పఁబడినది. యౌవనప్రాదుర్భావమునందే కసరతు కుస్తీలయం దారితేరిన వాఁడని పేరందెను. తొలుతఁ దనవిద్యాప్రదర్శనములను రాజధానియగు బ్రసెల్సునగరమునను హాలండుదేశమున పురములందునను ప్రదర్శించుచు మెప్పువడయుచుండెనఁట.

ఒకతఱి శాండోగారి కొకయిటలీదేశస్థుండగు బలాఢ్యునితోను, మఱియొద్దఱితోను కుస్తీపందెములు నడచి యం దీయన యోడిపోయెనఁట. దానితో రోష మతిశయించి పౌరుషశాలియు, కడునేర్పరియు నయ్యెనఁట.

అక్కాలమున నింగ్లాండునందు Samson గారనుగొప్పబలశాలి యుండెనఁట. ఆయన నూఱు పౌనులుపందెము వైచియుండువాఁడఁట. ఆయన కొకప్రియశిష్యుఁడు Frank cyclops అను నాయనగూడ గొప్పపేరందిన బలాఢ్యుఁడుండు వాఁడఁట. శాండోగారు వారింగదిసి యోడించి తాను జయమంది పందెముం గైకొనెనఁట. ఇట్టి జయములను లండనునగరమునను పిదపఁగూడ నంది పేరందెనఁట. ఈతని ముఖ్యవిద్య బరువుల నెత్తుట యైయున్నది.

౧౮౯౧ జనవరి ౨౮ తేదిని 'హెర్క్యులిస్' అనంబడు లోకమల్లు నొకని బరువునెత్తుపందెమున గెలిచి, world's champion ship belt గౌరవబహుమాన మంది, ౮౯౭ లో శాండో గారు "Strength and bow to obsain it" అనుగ్రంథమును రచించిరఁట. ఇది శరీరవ్యాయామశాస్త్ర మనఁబడఁ దగిన గ్రంథమై యున్నది.

**శాంత (లేక కాంత యని నామాంతరము):—** అంగదేశాధినాథుఁడగు రోమపాదుఁడు (దశరథుఁడు) అయోధ్య (కోసల) దేశాధీశుఁడగు దశరథునిపుత్రికను (శ్రీరాముని చెలియలు) దత్తుదీసుకొనియెను. ఆబాలికపేరు శాంత లేక కాంత. ఈమెభర్త విభాండకర్షిసుతుండగు ఋష్యశృంగర్షి.

**శాంత తీర్థము:**—నేపాలదేశమున భాగమతీనదియందు మరదారికానది సంగమించుతావున గలతీర్థము. ఇట పార్వతీదేవి తపంబొనర్చెనని స్వయంభువపురాణము ౫ అధ్యా ౨౫౫ పుట యందుం జెప్పంబడినది.

**శాంతపాయనగోత్రము:**—
(జమదగ్నివత్స ఉపగణము చూడుండు).

**శాంతి:**— పూరువుసంతతి చంద్రవంశక్షత్రియుండు. తండ్రి నీలుండు. పితామహుండు దజమీఢుండు. (ఇతనిని శాంతిమహారా జనియెదరు).

మఱియు దేవకునికుమార్తెలలో నొకతె శాంతి యను పేరుగలది. ఈమెభర్త వసుదేవుండు.

**శాంతిచతుర్థి:**— ఫాల్గుణశుద్ధ చతుర్థి. [పండుగలు, వ్రతదినములు పర్వతిథులు చూడుండు].

**శాంతినికేతనము:**— ఇది విశ్వభారతి యను పేరుగల విశ్వవిద్యాలయంపుం బాఠశాల. డాక్టరు రబీంద్రనాధఠాగోరు మహాకవిచే స్థాపింపంబడినది. (రబీంద్రనాధ టాగోరుం జూడుండు). వంగదేశమున నీస్టిండియన్ రెయిల్వే లూపులైను పై కలకత్తానగరమునుండి ౯౦ మైళ్ల దూరమున బోల్పూరుస్టేషనునుండి మైదుమైళ్ళలో నొకపాటి వెడలుపుతక్కువ యగుబాట నీవిద్యాసంస్థ కలదు. ఇందు మున్నూఱువిద్యార్థులు విద్యాభ్యాస మొనర్చుచున్నారని తెలియుచున్నది. రెయిల్వేనుండి బయలుదేఱినతోడనే బాట యచిరకాలముననే బోల్బూరుగ్రామము దాటి యవ్వలి బయలుప్రదేశముగుండా నడుచుచు శాంతినికేతనావరణకుం జేర్చెడిని. దానియినుపద్వారము (గేటు) పై వంగభాషాక్షరలిపితో నాపేరుం గల్గి యుండును.

ఇది మామిడిచెట్లతోంట. తొల్లి రవీంద్రకవీంద్రునితండ్రి యిట కేతెంచి, భక్తిపారవశ్యతం బ్రార్థనామల నెఱపుచుండువాండట. ఆయన కతిదినములనిందే వసించుచుండెనట. ఈపే రాయనయే పెట్టెనట. శాంతినికేతనమన శాంతికిం దావని యర్థము.

ఇందలిజీవితమును వింతం గొల్పకపోదు. నిశ్శబ్దముగను, శాంతిగను, నీం దధ్యాపకులు బోధించుటయు, విద్యార్థులు విద్యలంగఱచుటయు, నెట్టి సమయములందైనను గడబిడలు, ధ్వనులు, అఱపులు, చప్పట్లు వికారపు (మితిమీఱిన) ధ్వనులు, లేక శాంతిగ నుంట నీపేరు సార్థక మనిపింపకపోదు.

కడుంగడునిశ్శబ్దముగ గడచినరాత్రికిం బిదప ప్రాతఃకాలముననే పక్షుల కలకలరవ మవ్యక్తమధురమై మేల్కొల్పును. ఐదుగంటల కొకగంట వాగుటతో నెల్లరు మేల్కాంచి, విధుల నిర్వర్తించి, నూతులకడకుం జని స్నాతులై వచ్చెదరు. పిదప నాఱున్నరగంటలకుం బెద్దపెద్దచెట్లనీడలను విద్యాభ్యాసము ప్రారంభమై గంటగంటకుం బాఠములు మాఱుచు, పండ్రెండుగంటలతోంబూర్తియగును. ఇట్లనుటయుం దీపాఠశాల కలకత్తావిశ్వవిద్యాలయపరీక్షలకు మెట్రిక్యులేషను, ఇంటర్మీడియేటు, బి. యే, పరీక్షలకు విద్యార్థుల నాయత్తపఱచు పని నడచుచుండునని యెఱుంగునది. మధ్యాహ్నము చిత్రలేఖనము, గానకళ, నృత్యాభినయములు, నేతపరిశ్రమ, వడ్రము, కమ్మరము మొదలగు విద్యలు నేర్పంబడుచుండును. ఇందలిచిత్రలేఖనము ముఖ్యముగ వంగదేశ పంబంధమని మనసునం దుంచుకొనుట సమంజసము. చిత్రలేఖనమున కొకభవనము ప్రత్యేక మేర్పఱుపంబడినది. దానిని 'Hall of painting' అను

చున్నారు. ఇంకను పుస్తకభాండాగారమునకు వేఱొకభవనము కలదు. ఇందు భరతదేశపు గ్రంథములేగాక నైరోపాదేశముల పెక్కుభాషల పెక్కువిపులగ్రంథములు కలవు. భరతదేశపు చరిత్రాత్మకగ్రంథములు మొదలగున విందు బ్రాముఖ్యములని చెప్పనొప్పును. ఏదేశపువై నను, ఏమతగ్రంథములైనను, ఏభాషాగ్రంథములైనను నిరాకరింపఁబడినవిగ నుడువవీలులేదు. ఇది కొంతభాగము సుందరభవన మనఁదగి యున్నది.

ఇంక నీసంస్థకు నిర్మాతయగు రవీంద్రనాథటాగోరుగారి నిందలివారందఱు గురుదేవుఁడని వాడుచుందురు. దేశోద్ధరణమునకు విద్యయే మూలమని నమ్మి యీమహాత్ముఁ డీమహాసంస్థ నేర్పఱచి దేశదేశముల కరిగి ధనముంగూర్చి దీనికిఁ జేర్చెను. ఐనను శాంతినికేతనసంస్థ ధనవంతమని చెప్ప వీలులేదు. ప్రభుత్వపుఁగళాశాలాభవనములం బోలియు, విశ్వవిద్యాలయప్రాసాదములం బోలియు దీనికి దివ్యసుందరభవనములును, సుందరమందిరములును లేవు. చదువు విద్యార్థులకైనను దర్పితవేషస్వాతిశయములును లేవు. తఱుచుగ వృక్షములనీడ నర్ధచంద్రాకారముగ నిర్మింపఁబడిన సెమెంటు అరుఁగులపైఁ గూర్చుండి విద్యార్థుల కధ్యాపకులు విద్యలం[?]గఱపుదురు. వారు సాధువులుగ నావరణముననున్న కుటీరములందు బీదలవలె నివసించుచుందురు. ఇట్టి వింత నిర్మాణకార్యములందు నిర్మాత యభిప్రాయమేమియో పలువురు పలువిధములుగఁ దలంచుచుందురు. కొందఱు స్వదేశస్వస్థానవేషభాషాదుల వీడి యన్యదేశీయుల వేషభాషాదులకు వశవర్తులై స్వదేశధర్మవిధులం గోల్పోవకుండ నన్యదేశవిజ్ఞానముల నెఱింగించుట కీపాఠశాల యని తలంచుచుందురు. ఇంకను గొందఱు విశేషధనవ్యయమునకుఁ బాల్పడక భరతదేశపుజీవనముననే యన్యదేశీయు లందుచున్నమహావిజ్ఞానము నందుటగా నుడువుదురు. మఱికొందఱు సర్వదృశ్యములందు, సర్వాచారములందు, సర్వవిధముల భారతీయమగు నీసంస్థయందు విద్యార్థు లన్యసంస్థలందు నితర విద్యార్థు లభ్యసించుచున్న విజ్ఞానాతిశయము భారతీయమతమందు మార్పులేకుండ నభ్యసింపఁ గల్గుటయు, ఏమార్పు లేక భారతీయధర్మములను, లక్షణములను వీడక విజ్ఞానియౌటగాఁ దలంతురు. ఇం దేది నిజమైనను, కాకున్నను కలకత్తా విశ్వవిద్యాలయపరీక్షలందుఁ గొన్నిటి కాయత్తపఱుపఁబడుటయు, భరతదేశపుం గళలను కొన్నిటిని నేర్పుటయు విద్యార్థులకు సంభవించుచుంట నెల్లరెఱుంగఁదగినది. దంభ మేమియులేని యీ విద్యాసంస్థంగాంచి భరతదేశస్థులేగాక యైరోపా, అమెరికా దేశములవా రనుదినము వచ్చి దర్శించి యేగుచుంట వింతగఁదోఁపకపోదు. సంస్థయంతటను మొత్తమున పాలించునది విశ్వభారతి యనఁబడు విద్యాపీఠమని చెప్పఁబడుచున్నది.

శాంతినికేతనమున విశ్వభారతి కనుబంధముగ శ్రీనికేతనమని వేఱొకటికలదు. అందు సేద్యము, ఇంటి చేతిపనులు, గ్రామనివాసోపయోగధర్మములు, నేర్పఁబడుచున్నవి. శ్రీనికేతనము గ్రామనివాసధర్మపునర్నిర్మాణసంస్థగఁ జెప్పఁబడినది.

శాంతినికేతన పుస్తకభాండాగారము నాంగ్ల, ఫ్రెంచి, జర్మను, ఇటాలియను భాషలగ్రంథరాజములును, సంస్కృతగ్రంథములును భరతఖండములోని వేర్వేఱు భాషాగ్రంథములును, చీనా, టిబెట్టు దేశములగ్రంథములును కలవు. వ్రాతప్రతులు 3000 కలవందురు. సంస్కృత, ప్రాకృత, పాళీ, అరబిక్కు, పరశియన్, జరథుస్త్రీయ, సినో

టిబెటియన్, బౌద్ధ, జైన, మహమ్మదీయమత ములవిశేషగ్రంథములు చేర్పఁబడినవి. ౧౯౧౮ సం వత్సరమున నున్నతవిద్యల విషయమునఁ గొన్ని మార్పులు, సంస్కారములుజరిగినవి. పరిశీలనలకుఁ బ్రత్యేకోద్యోగులు కలరఁట. గ్రంథపరిశీలనలకు, నష్టగ్రంథసంపాదనలకు మంచియేర్పాట్లు కలవం దురు. విశ్వభారతి క్రీ. శ. ౧౯౫౦ యందు స్థాపిం పఁబడినది. గొప్పవిద్వాంసులు విదేశములనుండి రప్పింపఁబడుచున్నారు. తూర్పుపడమరల నేకము చేయు సంస్థగాఁ జెప్పఁబడుచున్నది.

## శాంతే కర్మణి భేతాళోదయన్యాయము:—

శాంతికర్మ పిశాచబాధానివృత్తికై చేయఁబడుకర్మ. అట్టి శాంతికర్మ నొనర్ప పిశాచ ములకుఁ బెద్దయగు భేతాళుఁడు ప్రత్యక్షమైన ట్లని యర్థము. "శాంతికర్మకు మెచ్చి భేతాళుఁడు ప్రత్యక్షమైన" ట్లని సామెత కలదు. ఇది హేళన సాదృశ్యమగు న్యాయము.

## శాంతోదరి లేక శాన్దోదరిగోత్రము:-

[ఉ ౖ చూడుఁడు].

## శాంభవగోత్రము:—

[శేభగణము చూడుఁడు].

## శాంభవీముద్ర:—

యోగాభ్యాసవిధా నమునఁ జెప్పఁబడిన వింశతి ముద్రిలలో నొకటి.

యోగాభ్యాస విధానసత్క్రియలలో నొకటి యగు త్రాటకక్రియ నభ్యసించి [అనఁగాఁ గను రెప్పలు మూయకుండఁ గంటినుండి నీరుకారువఱ కేవస్తువునైన నేకలక్ష్యముతోఁజూచి] కంటినీరు కాఱినపిదప భ్రూమధ్యమునందు లక్ష్యముంచి చూచుట "శాంభవీముద్ర" యనియు, దీని యభ్యాసమున చిత్తైకాగ్రతకలిగి ధ్యానసిద్ధికి మార్గ మేర్పడుననియుఁ జెప్పఁబడినది.

## శాకగోత్రము:—

[ఆత్రేయగణము చూడుఁడు].

## శాకటాయనగోత్రము:—

[వాధ్ర్యస్వ లేక మిత్రయువగణము చూడుఁడు].

## శాకటాయనగోత్రము:—

[ఆత్రేయగణము చూడుఁడు].

## శాకటాయనగోత్రము:—

[కణ్వ ఉపగణము చూడుఁడు].

## శాకటాక్షగోత్రము:—

[వాధ్ర్యస్వ లేక మిత్రయువగణము చూడుఁడు].

## శాకపూర్ణిగోత్రము:—

[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు].

## శాకబలిగోత్రము:—

[లౌగాక్షిగణము చూడుఁడు].

## శాకము, పత్రశాకము, భక్ష్యశాకము:—

శాక మన కూర. [భోజనమందలికూర యనిభావము]. ఆకుకూరలకు, పత్రిశాక మని యందురు. భోజనపదార్థములగు శాకములకు భక్ష్యశాకము లందురు.

భక్ష్యశాకములందు "పత్రం పుష్పం ఫలం నాళం కందసం ఖేదజం తథా" యని చెప్పఁబడిన యాఱుభాగములలో నేవో కొన్నిగాని, యన్ని గాని భోజనోపయోగములని చెప్పఁబడినది.

## శాకలపురము [శకలపురము] సంగాలా:—

దీని నలగ్జాండరుగారి చరిత్రకారుఁ డు 'సంగాలా' అనియుంట బౌద్ధులం దాపేరే

వాడుకనందెనఁట. పిదప 'సాగల్' అనఁబడెనఁట. హ్యూనచ్వాంగు దీనిని క్రీ. వె. 630 లో దర్శించెను. రావీనదికిఁ దూర్పుగా నొకకొండపై నిర్మింపఁబడియున్నది. పాడుయొక్క పునాదులు గానఁగును. పురము చుట్టుకొలఁత మూఁడుమైళ్ళు మూఁడుఫర్లాంగులని హ్యూనచ్వాంగు వ్రాసియున్నాఁడు. ఇందొకస్థూపమును వెనకటినల్వురు బుద్ధభగవానులు బోధించి రనియు, వారిపాదములానిన యానవాళ్ళు కలవనియు నందురు. (మద్రదేశము చూడుఁడు).

**శాకల్యగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**శాకల్యము లేక శకలపురము—** మద్రిదేశమునకు రాజధాని. (మద్రిదేశముఁ జూడుఁడు.)

**శాకలాయనగోత్రము—**
(భరద్వాజ యుపగణము చూడుఁడు.)

**శాకలాయనిగోత్రము:—**
(గర్గఉపగణము చూడుఁడు.)

**శాకలిగోత్రము—**
(ఆత్రేయగణము చూడుఁడు.)

**శాకల్యుఁడు [శాకల్యర్షి]:—** ఋగ్వేదమును సంహితలుగ విభజించినఋషిసత్తముఁ డొకఁడు శాకల్యుఁడు.

మఱియు ఋగ్వేదము నైదుభాగములుగ విభజించి, తనశిష్యులగు మాద్గల్యుఁడు, గోముఖుఁడు, వాత్స్యుఁడు, శాలీయుఁడు, శిశిరుఁడు లేక శారీరుఁడు ననువారల కొసంగిన ఋషి యొకఁడు శాకల్యుఁడే. ఈతఁడు వేదమిత్రర్షి శిష్యుఁడగు సౌభరికుమారుఁడు.

ఇంకను ధృతరాష్ట్రుఁ డరణ్యావాసమున కేగుతఱిఁ బ్రజలయనుమతిఁ గైకొను దుఃఖసమయమున నోదార్చుచు శాంతవచనముల జ్ఞానోపదేశముఁ జేయుచుఁ గూడనుండిన ఋషిపేరును శాకల్యుఁడే.

**శాకహాయగోత్రము:—**
(ఉపమన్యుగణము చూడుఁడు.)

**శాక్రగోత్రము:—**
(హిమోదక ఉపగణము చూడుఁడు.)

**శాక్తలాజగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**శాక్యవంశనృపతులు:—** వీరు ప్రజలచే నెన్నుకొనఁబడి కపిలవస్తురాజ్యమేలినవారు. బుద్ధభగవానుని తండ్రియగు శుద్ధోదనుఁడు శాక్యుఁడే. విరుద్ధకుఁ డనంబడువానిచే సగర్వ యనంబడుతావున శాక్యులు బలాత్కారవధ యొనర్పఁబడి రని చెప్పఁబడినది.

**శాకాంబరపురము:—** రాజపుత్రస్థానము పశ్చిమభాగమున నిప్పుడు సాంభారా యనుపేరుఁ బరఁగుచున్న పురము. ఇందు దియోదాని యను బావి కలదు. అందు శుక్రాచార్యపుత్రికయు, యయాతిచక్రవర్తిభార్యయు నగు దేవయానను శర్మిష్ఠాదేవి యసూయాగ్రస్తురాలై పడఁద్రోయించెనఁట.

**శాకాంబరీదేవీ క్షేత్రము:—** సంయుక్తరాష్ట్రముల హద్దుకొని సహారాన్‌పూరుజిల్లా, సహారాన్‌పూరు తాలూకాయందు సహారాన్

పూరునుండి ౨౮ మైళ్ళదూరమున 'ఇందర్పూర్ భవాన్' అనుగ్రామమునఁగల శాకాంబరీదేవీ క్షేత్రము దేవీపురాణప్రసిద్ధము. దసరా కిట గొప్ప యాత్ర జరుగును. గొప్ప దేవీక్షేత్రము.

**శాకాయనగోత్రము**:— దీనిని శాక హాయ యనియునందురు. (ఉపమన్యుగణము గణము చూడుఁడు.)

**శాక్తేయమతము**:— ఈమతము శక్తి తత్త్వవాసియగు రుద్రప్రోక్తమని చెప్పఁబడినది. మఱియు దీనికి శక్తితంత్ర మనియుఁ బేరుకలదు. ఇందు శక్తి పారమ్యము. ఆరాధింపఁబడునది శక్తి సృష్టిస్థితిలయములకుఁగర ఈమతము భాస్కరీయసిద్ధాంతమతమునందలి సిద్ధాంతములనే స్వసిద్ధాంతములుగఁ గల్గియున్నది. వీరు సర్వమును (జడాజడాత్మికమగుసర్వజగత్తును) శక్తియొక్క పరిణామ మందురు.

ఈమతస్థులు ప్రత్యేక మొకతెగవారుగ లేరు. అన్యసిద్ధాంతములవారిలో శాక్తేయ మొనర్చువా రచ్చటచ్చటఁ గాననగుచున్నారు. వీరియందు దక్షిణాచార మనియు, వామాచార మనియు, రెండు సాంప్రదాయములు గలవు. మతగ్రంథ ములు గొన్ని తంత్రగ్రంథములుగ నున్నవి. గౌడ పాదాచార్యులు 'సభగోదయ' మనునీమతగ్రంథ మును రచించెను. శ్రీచక్రము నీమతస్థులు పూజించుటఁ గలదు. (శ్రీచక్రము చూడుఁడు.) వామాచారదక్షిణాచార శాక్తేయపూజావిధా నములందు చాలభేదము కలదు. తక్కినమత సిద్ధాంతములకు భాస్కరీయ సిద్ధాంతమతము చూడుఁడు.

**శాక్త్యాయనగోత్రము**:— (శౌనక లేక గ్రత్స్నమదగణము చూడుఁడు).

**శాక్త్రిమీటర్** (Saecharimeter):— ఏదేని ద్రవపదార్థమునందు తీఁపి యెంతకలదో కొలుచుపరికరము.

**శాకాచంద్రన్యాయము**. సూర్యో దయన్యాయము, సూర్యాస్తమయన్యాయమును నిట్టివియే. సూర్యున కుదయాస్తమయములు నిజ మునలేవు. మన కట్లు కనిపించుట మనమ ట్లను చుందుము. అట్లే చంద్రుఁడు కొమ్మపైకి వచ్చె వఱకని యందుము. నిజమున చంద్రుఁడు కొమ్మ పై కెక్కఁడు గాని, యట్లు కనిపించుటను దెల్పుచు నట్లందుము. ఇట్టిసందర్భముల నీన్యాయము వాడు దురు.

**శాఖానది**:— [నదులు చూడుడు].

**శాఖాయనిగోత్రము**:— [గర్గ ఉపగణము చూడుఁడు].

**శాఖాసనము**:— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. ఇది ద్వివి ధము.

౧ వామశాఖాసనము—ఎడమపాదమును కుడిమోఁ కాలిసందునను, కుడిపాదము నెడమపిక్క మీఁద నుండఁజేసి చేతులను నాభివద్దఁ జేర్చుట వామశాఖాసన మనియును,

౨ దక్షిణశాఖాసనము—కుడిపాదము నెడమమోఁ కాలిసందునను, ఎడమపాదము కుడిపిక్కమీఁ దను ఉండఁజేసి చేతులను నాభివద్దఁజేర్చుట దక్షిణశాఖాసన మనియు,

వీటియభ్యాసమున నారోగ్యము స్థిరతగాంచు ననియుఁ జెప్పఁబడినది.

**శాఖిలగోత్రము:—**
[శండిలగణము చూడుఁడు].

**శాటర్న్ గోళము [Saturn]:—** ఇది solar system నకుఁ జెందిన యొకగోళము. సూర్యగోళమునుండి 91,50,00,000 మైళ్ళదూర మున నాగోళముం జుట్టి 10759 దినముల 7 గం టలలోఁ దిరిగి వచ్చుచుండునదిగను, భూమితోఁ బోల్చి చూచిన 1000 భాగము లధికశరీరము కలదిగను చెప్పఁబడినది. ఇది Superior planet.

దీని నాశ్రయించునటుల దీనిం జుట్టి తిరుగు చుండు చంద్రులు [moons] ఎన్మిది కలవు. అందు రెండు Sir William Herschel గారే కనిపెట్టియుండిరి. ఈగోళము సూర్యునిఁ జుట్టివచ్చుటకు మనసంవత్సరము లిరువది తొమ్మి దియు, నాలునెలలును గావలసియుండెడిని. దీని జుట్టి వెడలుపగు వృత్తాకారఁపు Ring ఒకటి యున్నది. అది యసలుగోళమునకువలెనే ప్రకాశ మానమైనది. గోళముయొక్క డయామీటరులో మూఁడవవంతు వెడలుపుండునని తెలియుచున్నది. పరిశీలించినచో నడుమ నొకనల్లనిహద్దుఁ గల్గి యిది రెండురింగులకూడిక యని తోఁచును. ఇది స్వప్ర కాశముఁగలది కాదు. సూర్యుని వెల్గునుండియే ప్రకాశించునది. గోళము రింగు దానిచంద్రులపై న్నీ, అట్టిచంద్రగోళములు శాటర్న్ గోళముపై నిన్ని కాంతులం బ్రతిఫలించుచుండును. దీనియం దు వాతావరణము కలదని పోల్చఁబడినది. భరత దేశఁపుజ్యోతిషమున దీనిని శనిగ్రహమని వాడి యున్నారు. [ఎస్ట్రోనొమీ సోలారుసిస్టమ్ చూడుఁడు.]

**శాఠరగోత్రము:—**
(ఆర్ష్టిషేణగణము చూడుఁడు.)

**శాణపురాయి(Grainte stone):—** ఇది కఠినమగుశిల. శాణములతోఁగాని భేదింప వీలుకానిదనియట్టిపేరందినది. ఇది నలుపు, తెలుపు, ఎఱుపు మూఁడురంగులతో నలరుత్రివిధభేదములు కలదిగ నుండును. తఱచుగఁబర్వతములం దీరాయి యే యుండును. పరిశుభ్రమైనది. ఇందు Black mica white mica opag or grey or pink Felspar glassy quartz మొదలగు menerals కలవు. Felspar ఏరంగుకలదో రాయియంతట నారంగే కనఁబడుచుండెడిని. రసాయనశాస్త్రజ్ఞులు మైకా ఫెల్స్పార్ క్వార్ట్జ లుమూఁడును silicon సంబంధము లనెదరు. ఇం దాక్సిజెను కలదనుచున్నారు. ఇంకనుమొదటి రెంటియందు సోడియమ్, అల్యూమినియమ్, ఇనుము మొదలగులోహములును గలవనెదరు.

ఇందలి మినరల్సు వెనఁగొని కలసియుంట విడఁదీయ శక్యముగాదు. భూమియందలివేఁడి చాలఘోరమై యుండుతరి కరఁగినరాయిపదా ర్థము చల్లారుచు గట్టిపడినదిగా శాస్త్రజ్ఞు లీరాతిం గూర్చి వివరించుచున్నారు.

**శాణామూఁడువిధములా చెడి నట్లు:—**
(ఆంధ్రలోకోక్తి.)

**శాత్తన్:—** (హరిహరపుత్ర దేవస్థానము చూడుఁడు.)

**శాతాతపగోత్రము:—**
[సాహులగణము చూడుఁడు.]

**శాధూలకిగోత్రము:—**
(ఆత్రేయగణము చూడుఁడు.)

**శానాపతి ప్రభువులు:—** వీరుసౌరాష్ట్ర దేశమును వామనస్థలి రాజధానిగ [పాప్రభుపులకుఁ బిదప) పాలించిరనియు, వీరు కనూజగుప్తప్రభువులకు సామంతులుగ నుండిరనియుఁ జెప్పఁబడినది.

**శాప్యాయనగోత్రము:—**
(ఉపమన్యుగణము చూడుఁడు.)

**శామంగలిగోత్రము:—**
(కుండినగణము చూడుఁడు.)

**శారంగదగోత్రము:—**
(అగస్త్యఉపగణము చూడుఁడు.)

**శారద్వతాయనగోత్రము:—**(జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.)

**శారదానది:—** నైనైటాల్ జిల్లాలోని బ్రిటిష్ పరగణాయందు మేలాఘూటనంబడుగ్రామము పక్కఁబడి పోవునదికి 'శారదానది' యనిపేరు. ఇట నాశ్వీయుజమాసమున మేలా (స్నానయాత్ర) జరుగుటంజేసి యాతావునకు మేలాఘట్ట మనిపేరయ్యెనఁట. ఆంధ్రదేశమున విశాఖపట్టణమున కిరువదిమైళ్ళలోఁగల అనకాపల్లిప్రక్కఁబడి ప్రవహించునదికి 'శారదానది' యని పేరుకలదు.

**శారదామఠము:—**
(శుద్ధాద్వైతమఠములు చూడుఁడు.)

**శారాయణగోత్రము:—**
(గర్గఉపగణము చూడుఁడు.)

**శారీరచైతన్యములు:—**బుద్ధనిర్యాణానంతర మామహాత్మునియస్థు లెన్మిదిభాగములుగఁ బంచుకొని వాటిని వేర్వేఱుతావులం దెన్మిదిచైతన్యముల నిర్మించిరి. వాటి కీపేరు వాడఁ బడినది. అశోకచక్రవర్తి యట్టివానిని గొన్ని తెఱపించి యందులయస్థుల నింకను ముక్కలుగఁ గొట్టించి వాట్లపై దేశమంతటను ౮౪,౦౦౦ చైతన్యములం గట్టించె నందురు.

**శార్కరాక్షగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**శార్కరాక్షిగోత్రము:—**
(వీతహవ్య వేక యాస్కగణము చూడుఁడు).

**శార్ఙ్గము:—**(విష్ణుదేవునివిల్లు - ధనుర్విద్య చూడుఁడు.)

**శార్ఙ్గికులు:—**వీరు నల్వురు. మందపాలుని సుతులు. తల్లి జరిత (పక్షి).

మందపాలుఁడు ఋషి. ఈతఁడు సంతానార్థియై శార్ఙ్గకజాతిపక్షియై, ఆదేజాతియాఁడుపక్షి యగుజరితఁ గూడి నల్వురుసుతులం గనెను. ఖాండవదహనకాలమున ఖాండవవనమునుండిన నీనాల్గుపక్షులు మందపాలర్షి ప్రార్థనమేర కగ్నిచే రక్షింపఁబడి కాలిపోక బ్రతికినవని చెప్పఁబడినది.

**శార్దూలిగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**శాలంకాయనగణము:—** ఇది విశ్వామిత్రసంతతిలోని యొకగణము. ఇందు నాల్గు గోత్రములు చెప్పఁబడినవి. ౧ జహ్నుస, ౨ రోహితాక్షస, ౩ శాలాక్షస, ౪ శాలజ్గాయనస, వీట్లకుఁ బ్రవర, విశ్వామిత్ర, శాలజ్గాయనస, కౌశిక.

**శాలంకాయనగోత్రము:—**
(శాలంకాయనగణము చూడుఁడు.)

**శాలంకాయనగోత్రము:—**
(కుశికగణము చూడుఁడు.)

**శాలంకాయనగోత్రము:—**
(అగస్త్య ఉపగణము చూడుఁడు.)

**శాలంకాయనగోత్రము:—**
(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**శాలఙ్కాయనగోత్రము:—**
(గర్గ ఉపగణము చూడుఁడు.)

**శాలఙ్కాయనిగోత్రము:—**
(కథ లేక కథ్యగణము చూడుఁడు.)

**శాలఙ్కాయనులు (శాలఙ్కాయనవంశనృపతులు):—** వీ రాంధ్రదేశభాగముల నేలిననృపతులు.

**శాలగోత్రము:—**
(కుశికగణము చూడుఁడు.)

**శాలాతపగోత్రము:—**
(అగస్త్య ఉపగణము చూడుఁడు.)

**శాలాతురాపురము:—** ఇది ప్రసిద్ధుండగు పాణిన్యాచార్యుల జన్మస్థలము. ఈతఁడు వ్యాకరణసూత్రముల రచించినవాఁడు. తల్లి దక్షీదేవి గాన దాక్షేయుఁడని వాడుక. శాలాతురను పెక్కండ్రుపరిశోధకులు పెక్కతావులుగ ననుమానించిరి. తొల్లింటి గాంధారదేశము హద్దులలో నిప్పటి పాంచాలములోని ఓహిందున వాయవ్యదిశగా 'లాహూ' రను చిన్నగ్రామముగ కన్నింగ్హామ్‌పండితుఁడు పోల్చియున్నాఁడు.

పాణిని మగధరాజ్యమును క్రీ. ము. ౧౭౮—౧౪౩ సంవత్సరములమధ్య పాలించిన పుష్పమిత్రునిసమకాలికుఁడఁట. పాణినికాలము క్రీ. ము. ३५० అని కన్నింగ్హామ్ పరిశోధకుఁడు వివరించెను. ఓహిందున కీశాన్యదిశగా ౪ మైళ్ళదూరమునఁగల శాలాతుర పిదప హాలాతుర యనఁబడి, రాను రాను 'లాహూ' రని యిప్పటికిని పిలువఁబడుచున్నది.

**శాలానిగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**శాలాపిగోత్రము:—**
(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

**శాలాయనగోత్రము:—**
(సంకృతి ఉపగణము చూడుఁడు).

**శాలాయనిగోత్రము:—**
(వాధ్ర్యశ్వ లేక మిత్రేయువగణము చూడుఁడు).

**శాలావతగోత్రము:—**
(కుశికగణము చూడుఁడు).

**శాలాహారిగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**శాలాక్షగోత్రము:—**
(శాలంకాయనగణము చూడుఁడు).

**శాల్యాయనగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**శాలిమతగోత్రము:—**
(ముద్గలగణము చూడుఁడు).

**శాలివాహనుఁడు:-** ఈతఁడొకకులాల(కుమ్మరి) కన్యాపుత్రుఁడు. నాగేంద్రునియంశమున జనిం

చినవాఁడట. 'శకకర్తా విక్రమజిత్కాసీన శ్శాలివాహనః' అని చెప్పఁబడినది.
ఇంకను శాలివాహనుంగూర్చి వేఱొకగాథ కలదు.

తొల్లి ప్రతిష్ఠానమని నామాంతరముగల పైఠణపురముండెడిదఁట. ఇది యిప్పటినిజాంరాజ్యమున పైఠన్ అనుపేరఁబరఁగు ఔరంగాబాద్‌పురమునకు నైరుతిదిశగా ౨౮ మైళ్ళదూరముననున్నది. తొల్లింటి శాలివాహనునిరాజధానిగ నుండెను. గోదావరీనదీతీరము. దీని కింకను బ్రహ్మపురిప్రతిష్ఠానమనియు, మంగిలపట్టణ మనియు, శాలివాహనపుర మనియు, ముంగిపైఠణమనియుఁగూడ వేర్వేఱుకాలములందు వాడుకనామము లుండెనఁట. అది యక్కాలమున సోమకాంతుఁడనుభూపతికి రాజధానియఁట. ఆపురమున సులోచనుఁడనువాఁడొకఁడుండెనఁట. ఆతనిభార్య చనిపోయియు, నొకబాలిక సుమిత్రి యనుపేరుగలదియు నుండెనఁట.

ఆబాలికయందు నాగేంద్రుఁ డనురాగముఁ గలవాఁడై యామె యింటనొంటరిగ నుండుతఱి నామెంగూడి యేగుచుండెనఁట. రానురాను పరిణయములేకుండనే యాపడు చానాగేంద్రునివలన గర్భముధరించి సుతునిఁగనెనఁట. ఎల్ల రామెను, నామెతండ్రిని నిందించుచు వారిని పట్టణము వెలుపలకు వెడలనడపిరఁట. ఆకొన్ని త్రావున నా బాలుని, కుమార్తెను, పెట్టుకొని రావలసినదానిని రానిమ్ము, కాఁగలది కానిమ్ము. అనుభవింతుఁగాక యని యాసులోచనుఁడు బ్రతుకుచుండువాఁడట. మఱియు నబ్బాలునకు శాలివాహనుఁడని పేరిడిరఁట.

ఆప్రాంతమున కుండలుచేయ ననువగు చక్కని మన్ను దొరకుటంజేసి రానురాను కుమ్మరివారలనేకు లట నివాసమేర్పఱచుకొన, నదియు నొకపేటయయ్యెనట. బాలుఁడగు శాలివాహనుఁడును ఆటలందు సాటిబాలురలో మేటియై, దండివాఁడై, నాయకుఁడై, తాను నరపతియనియు, వేఱొక బాలుఁడు మంత్రియనియు, నింకొక్కఁడు సేనాని యని, మఱికొందఱు సైన్యముగను తమలోఁదా మేర్పఱచుకొనియాటలాడుచు, సభఁ దీర్చి నటనా ప్రదర్శనము లొనర్చుచుండువారఁట. ఆయాటల వినోదమును శాలివాహనుని ధర్మనియతియు, నేర్పును, జాగ్రతయుఁ జూచువారలకెల్ల యాశ్చర్యముఁ గొల్పుచుండునఁట.

ఒకనాఁటి యాటయం దొకబ్రాహ్మణుఁడు వినోదమునకు రాజగు శాలివాహనునకుఁ బంచాంగ శ్రవణ మొనర్ప, శాలివాహనుఁడొక మట్టిబిల్లను రూప్యమాయనునటుల నావిప్రునిచేతఁ బెట్టెనఁట. అది తోడనే స్వర్ణమయమైయుండ నీబాలుండు స్వర్ణరూప్యములు పంచువాఁడని వాడుకయుఁ గల్గెనఁట. మఱియొకతరి కుమ్మరిబాలు రందఱు మట్టితోఁ బెద్దపెద్దయేనుఁగులు, గుఱ్ఱములు, సైన్యములు, రథములు రచించుచు, ఇవి తమరాజ్యమున సైన్యములని యాటలాడుకొనసాఁగిరట-ఇట్లున్నొ వినోదములు నడచుచుండెడివఁట.

ఒకతరి నాయూర నొకభాగ్యవంతుఁ డగు వైశ్యుఁ డుండెనఁట. ఆతఁడు భూములును, వెండి బంగారములును, పశుగణమును, ధాన్యరాసులును తనసుతులకుఁ బంచియీయఁదలంచి, రోగవశుఁడై సావకాశములేక మృతుఁడగుచు నొకనికి మట్టిని, ఒకనికి బొగ్గును, వేరొకనికి శల్యమును, నింకొకని ఎముకయుం జూపి, అట్లాస్తిని కలహింపక పంచుకొనుఁడని నుడివి మరణించెనఁట. వారి కది యర్థము గాక ఎవ్వరి నడిగినను నేమియు బోధకము గాక నీకుమ్మరిరాజసభయందు వినోదముగ నడిగి

రఁట. దాని శాశాలివాహనతగవరి, మట్టింజూపిన సుతునిభూస్థితిని దీసికొనుమనియు, బొగ్గుంజూపిన సుతుని వెండిబంగారములు తీసికొనుమనియు, శల్యములసుతుని పశుగణముం గైకొమ్మనియు, ఊముక సుతునికి ధాన్యరాసులనియు, వారితండ్రి యభిప్రాయముగ నెరింగించి, యటులఁ బంచుకొని సుఖింపుఁ డనియెనఁట. వారును నట్లొసంతసించుచు జరుపుకొనిరఁట.

విక్రమాదిత్యమహారాజు శాలివాహనుంగూర్చి విని తనసైన్యములతో వెడలి శాలివాహనునికడ కేతెంచుచుండ, శాలివాహనునితల్లి భీతిల్లి తన భర్తయగునాగేంద్రుని కెఱుకపఱుప నాతండు మట్టితోఁ జేయఁబడిన సైన్యతురగగజాదులకు జీవమును, బలము నొసంగి, సుతు నజేయునిగ నొనర్ప నా శాలివాహనుం డెదుర్కొని విక్రమాదిత్యు నోడించి నర్మదానదిం దాఁటువఱకు సైన్యములం బాఱఁ దోలెనఁట. నాఁటనుండియు నర్మదానది కుత్తరము న విక్రమార్కశకమును, దక్షిణదిశను శాలివాహనశకమును వాడుకలో నుండెనఁట.

పిదప శాలివాహనుఁడు బలాఢ్యుఁడగుభూపతి యయ్యెను. ఇతనిరాజధాని పైథన్పురమే. ఇతను పండితుఁడును, కవియు నై చక్కఁగ రాజ్యపాలన మొనర్చియు, వైద్యశాస్త్రము, అశ్వశాస్త్రము, సప్తశతి (అలంకార గ్రంథము) రచించినట్లు తెలిసెడిని.

**శాలిహోత్రుఁడు:**— ఈపేరుఁగలపురుషులు ముగ్గురు గానవగుచున్నారు. పాండవులు లాక్షాగృహోపాయమునుండి తప్పించుకొని, హిడింబునివనముగుండ శాలిహోత్రుని యాశ్రమమున కేగిరి. అట వ్యాసుఁడు వారిని గలసికొని యోదార్చెను. మఱియు శాలిహోత్రునియాశ్రమ



సాగరజలములం ద్రావినవారలకు బుభుక్షాపిపాస లుండనేరవని పాండవులకు వేదవ్యాసుఁడు వివరించెనని చెప్పఁబడినది. ఇతఁ డొక శాలిహోత్రుఁడు. మఱియు నశ్వశాస్త్రమును రచించినఋషి యొక శాలిహోత్రుఁడు. వేఱొక శాలిహోత్రర్షి సామవేదాధ్యాపకుఁడు కలఁడని తెలిసెడిని.

**శాలీయుఁడు:**— ఋషి. శాకల్యుని శిష్యుఁడు.

**శాలంగోత్రము:**—
(కపిఉపగణము చూడుఁడు).

**శావార్యగోత్రము:**—
(ఉపమన్యుగణము చూడుఁడు.)

**శాశ్వతుఁడు లేక విశ్వగంధుఁడు లేక విశ్వకుఁడు:**— ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి పృథువు.

**శాసనములు:**— శాసింపఁబడినవి శాసనములు. దానము లిచ్చుట, జయించుట, ఘనకార్యము లొనర్చుట మొదలగు మహాకార్యాచరణము లక్షరములతోఁగాని, గుఱుతులతోఁగాని, మృగాదిసంజ్ఞలతోఁగాని, శ్లోకరూపమునఁగాని, యాదికాలములందు శాశ్వతముగ నుండునటుల వేయించుచు వచ్చిరి.

శాసనములు శిలాశాసనము, తామ్రశాసనములుగఁ జెప్పఁబడినను కొండవికొన్నియు, కట్టెకొన్నియుఁగూడ దొరకియున్నవి. శాసనములనుబట్టియే మన మెఱుంగఁజాలని తొల్లింటియాదికాలఁపుసంగతులను, చరిత్రాంశములను, నెఱుంగఁగల్గుచున్నాము. వీటివిద్యావిధానమున కాంగ్లమున 'Epigraphy' అనియెదరు. శాసనమునకు 'Inscriptions' అనియెదరు.

## శాస్త [శాసించువాఁడు] శాత్తన్:—
(హరిహరపుత్ర దేవస్థానములు చూడుఁడు).

## శాస్త్రగ్రంథములు:—

షడ్శాస్త్రములు—౧ వ్యాకరణ, ౨ వైశేషిక, 3 న్యాయ, ౪ మీమాంస, ౫ వైద్య, ౬ జ్యోతిష శాస్త్రగ్రంథములు.

వైదికశాస్త్రగ్రంథములు— మీమాంస, న్యాయ, వైశేషిక శాస్త్రగ్రంథములు.

అతిమార్గిక శాస్త్రగ్రంథములు— పాశుపత, మహావ్రత, కాపాలిక శాస్త్రగ్రంథములు.

చతుర్విధ మతశాస్త్రములు—౧ వైదికశాస్త్రములు, ౨ ఆధ్యాత్మికశాస్త్రములు, 3 అతిమార్గికశాస్త్రములు, ౪ మాంత్రికశాస్త్రములు.

3 త్రివిధశాస్త్రగ్రంథములలు.

౧ ప్రభుసమ్మితములు— వేదములు, ధర్మశాస్త్రములు. ఇవి ప్రభుశాసనములవలె విధించు శాస్త్రగ్రంథములు.

౨ మిత్రసమ్మితములు— పురాణేతిహాసములు. అవి స్నేహితునివలె బోధించు శాస్త్రగ్రంథములు.

3 స్త్రీసమ్మితములు— కావ్యాలంకార నాటకాదులు. ఇవి స్త్రీపల్కులవలె రచనాయుక్తములు, రుచికరములు, నైయుండు శాస్త్రగ్రంథములు.

## శాస్త్రఫలం ప్రయోక్తరి న్యాయము:—
ఒకపనియొనర్చుటకుఁ గల్గునటులఁ జెప్పఁబడిన ఫలిత మాపని యొనర్చువారి దని యర్థము.

ఎవ్వరు చేతురో వారే దాని ఫలిత మనుభవించువారని భావము.

## శాక్షనుజాతివారు:—
జర్మనుదేశపు శాక్సోనీనుండి యాదిని వీరు వచ్చుటచే నాపేరు గల్గెలని పెక్కండురు తలంచుచున్నారు. ట్యూటోనిక్కు రేస్ అని చెప్పఁబడినవారు. ఇంక గొంచరిక్కాలమున 'Slesvig Holstain' అనం బడుప్రాంతసీమలం దుండుచు, క్రీ. వె. 300 సంవత్సరప్రాంతముల Pirutes గా నప్పుడప్పుడగుపడుచుండి, యిప్పటి, ప్రష్యా, జర్మనీలలో వ్యాపించి సముద్రముందాఁటి, ఇంగ్లాండున కరిగి, యట స్థిరపడిరనియు ననుచున్నారు.

## శ్రాద్ధదేవుఁడు:—
సూర్యునికి సంజ్ఞాదేవియందుఁ గలినసుతుఁడు.

## శ్రాద్ధములు:—
పితృకర్మ లేక పిత్రర్చనయనిభావము. శ్రద్ధతో నాదరించునది గాన శ్రాద్ధ మనఁబడునని యెఱుంగునది. మఱియు వీట్లకు 'కవ్యము' లనియుఁబేరు కలదు. పితృదేవతలసంప్రీతి వీట్లకుఁ బ్రయోజనము.

శ్రాద్ధములు శుభకార్యములందు నశుభకార్యములందుఁగూడ సంభవించెడిని. ఉపనయనమున నందీముఖశ్రాద్ధము లేక అభ్యుదయశ్రాద్ధమును, వివాహమున స్థాలీపాక లేక శోభనదేవతాశ్రాద్ధమును నాచరింపవలయును. అశుభకర్మలందు శ్రాద్ధములలో ముఖ్యములు ప్రేతశ్రాద్ధములు. ఇవి ప్రేతతృప్త్యర్థము, ప్రేతత్వవిముక్త్యర్థము చేయఁబడునవి. ఇవి నగ్నము, ఏకోద్దిష్టము, షోడశము, సపిండీకరణశ్రాద్ధములు. వేఱొక్కటి పైతృకశ్రాద్ధము. వసురుద్రాదిత్య రూపులగు పితరులసంప్రీతి (తృప్త్యర్థము) గా నొనర్పఁబడు శ్రాద్ధము. ఇందుఁ బిండతర్పణములు కల్గినవి కొన్నియు, లేనివి కొన్నియుఁగూడఁ గలవు.

కాశి, గయ, ప్రయాగ, కురుక్షేత్రము, గోకర్ణము, కురుజాంగలము మొదలగుగాఁగలసమస్త పుణ్యక్షేత్రము లందునను, పుణ్యనదీతీర్థము లందు

నను నొనర్పఁబడునవి తీర్థశ్రాద్ధము లనఁబడును. వీట్లయందు గయాశ్రాద్ధము మిగుల ప్రాముఖ్యతను వహించినది.

మఱియు మృతతిథియందు, సూర్యేందుసంగమ దినముల, నమావాస్యలందు, అష్టకతిథులందు (మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణమాసముల బహుళాష్టములు), సూర్యసంక్రమణ తిథులందు, మహాలయతిథులందు, శ్రాద్ధము లొనర్పఁదగి నది.

ఇంకను పుత్రజన్మాదివృద్ధికాలము లందు, శృతాధ్యయనసంపత్తి (బ్రాహ్మణసంపత్తి) కాల ములను, వ్యతీపాత మహావ్యతీపాత యోగతిథులం దును, యుగాదితిథులు, మన్వాదితిథులు, గ్రహణ పుణ్యకాలములు మొదలగువాట్ల (పుణ్యకాలము లందు) శ్రాద్ధకర్మ లొనర్పవలయునని చెప్పఁబడి నది. ఇవిగాక కామ్యశ్రాద్ధకాలములు కొన్నికలవు. ఈశ్రాద్ధములు ముప్పదితొమ్మిదిగఁ జెప్పఁబడినవి.

౧ అష్టశ్రాద్ధములు 3 మాఘబహుళ సప్తమి, అష్టమి, నవములు. 3

౨ పార్వణశ్రాద్ధములు ౨౪ ప్రతిమాసము శుద్ధబహుళ ప్రతిపత్తులు (పాడ్యమి తిథులు). ౧౨ × ౨=౨౪

3 మాసశ్రాద్ధములు. ప్రతినెలయందు వచ్చెడి పితృతిథులు. ౧౨

3౯

**శ్రాద్ధసప్తపవిత్రములు:**—దీనింగూర్చి యిటులఁ జెప్పఁబడినది.

శ్లో॥ ఉచ్ఛిష్టం శవనిర్మాల్యం వమనంమృతతర్పణం
శ్రాద్ధేసప్తపవిత్రాణి దౌహిత్రః కుతవః స్థితిః॥

అనఁగా పాలు, దర్భలు, తేనె, పట్టువస్త్రము, దౌహిత్రుఁడు (పితృప్రసాదమును స్వీకరించుట యని భావము) అపరాహ్ణము, తిలలు (నువ్వులు) ఈయేడును సప్తపవిత్రపదార్థములని చెప్పఁ బడినది.

**శ్రావణబెళగోళము:**— ఇది జైనయా త్రాస్థలము. మైసూరురాజ్యమునందు మైసూరు రెయిల్వే బ్రాంచిరాకున్ను అను నినుపదారితావునుండి పదునేను మైళ్ళదూరమున (అనఁగా మైసూరునగ రమునుండి యేఁబదిమైళ్ళ దూరమున) చిన్నవి యగు రెండుకొండలనడుమ శ్రావణబెళగోళ మను పురాతనపట్టణ ముండెను. అది యిక్కాలమున తగ్గిపోయి పల్లెగ్రామమై యున్నది. ఇది బౌద్ధ మతముతో సంబంధముగూడఁ గల్గియున్నదిగాన బౌద్ధులుగూడ యాత్రస్థలముగ నెన్నుచున్నారు.

క్రీ. పూ. మూఁడవశతాబ్దమున మగధసామ్రా జ్యమేలిన మౌర్య చంద్రగుప్తమహారాజు తన కడ దినము లందు బౌద్ధభిక్షువై యీశ్రావణబెళగోల మున గడుపుచుండెనఁట. ఇటనున్న రెండుకొండ లలో నించుకపెద్దది 'వింధ్యగిరి' యనియు, చిన్నది 'పద్మగిరి'యనియు బౌద్ధులు వాడుచున్నారు. వింధ్యగిరియని పిలువఁబడుకొండ నాల్గువందల డెబ్బదియడుగులయెత్తు. దీని శిఖరమందుండిన యొకేగండశిలనుండి యిరువదియడుగులయెత్తున నిలచుండినటులఁ జెక్కఁబడిన యొకశిలావిగ్రహము భరతదేశపువిగ్రహములలోఁ బెద్దదిగఁ జెప్పఁ బడుచున్నది. దీనికి 'గోమతేశ్వరుఁ' డనిపేరు.

అటఁగల శిలాశాసనములమేర కది చాముండ రాయుం డనునాయన నిర్మింపఁజేసెననియు, గోమ తేశ్వరుం డట తపంబొనరించుచుండి నిర్వాణపథ మందిన జైన ముని యనియుఁ దెలియుచున్నది. ఈవిగ్రహము నిష్కర్కయగు లక్షణముల పని తనముఁగలిగి, తపోనిమగ్నుఁడగు ఋషిసత్తముని

యాకారమున నున్నది. దీనిం జేసినశిల్పి అరిట్టో నేమి (బహుశః అరిష్టనేమి) యని తెలిసెడిని. ముఖవర్చస్సు ప్రశాంతస్మితముం జూపెడిని. ఇది కొండపై శిఖరముగనుంటఁ జుట్టును పెక్కుమైళ్ళ దూరమునుండియుఁ గన్పించుచుండును. విగ్రహ మొకరాతిచప్టాగలయంగళమున నడుమఁగల గొప్ప తామరపూవునందు నిలచున్నటులఁ జెక్కఁబడినది. కొండనెక్కుట కైదువందల సోపానములు నిర్మింపఁబడినవి. కొండదిగువనే మైసూరుమహారాజులలోఁ బూర్వుఁపువారగు చిక్కదేవ వొడయారు గారు నిర్మింపఁజేసిన యొకసుందరమగు సరస్సు కలదు. ఆమహారాజు క్రీ. శ. ౧౬౭౨—౧౭౦౪ ఈరాజ్యపాలన మొనర్చినవాఁడు. ఈపరిసరముల ననేక జైనదేవళసముదాయములు కలవు. వాటిని బస్తి లనియెదరు.

కట్టడములపరిశీలనలం దారితేరిన ఫెర్గుసన్ - పండితుఁ డీగోమతేశ్వరవిగ్రహములం గూర్చి "Nothing grander or more imposing exists any where out of egypt, and ever there-no known statue surpasses it in hight or excels it in the perfection of art it exhibits." అని వ్రాసెను. దీని నిట వదలి జైనమతపరిస్థితులను విసరించి ముగింతుము. దీని కాదిని 'చంద్రగిరి' యనిపేరు వాడుకయం దుండెనట. వేర్వేఱు కాలములందు దేయదుర్గ మనియు, పద్మగిరి యనియుఁగూడ వాడుకనామము లయ్యెనట. జైనమతమునకు మూలస్థానమగు మగధ (పాటలీపుత్రి) రాజ్యమున నొకప్పుడు ద్వాదశవర్షక్షామము కలుగ, నప్పటిమతాధిపతియగు భద్రబాహుస్వామి కొందఱుజైనులతో శ్రావణబెళగోలమున కేతెంచి వసించుచు నటనే మృతినందెనఁట. ఆభద్రబాహుస్వామికే గోమటీశ్వరుం డని పేరు వాడుకయుండె నఁట. అచటి మతాధిపతి యిప్పుడు దిగంబరజైనుల ప్రధానమతాధిపతిగ నున్నాఁడు.

పిదప నెల్లట్లో కాలము గడచి, మగధదేశమునందు మిగిలినజైనులు శ్వేతాంబరజైనులుగ మాఱిరఁట. వారి మొదటిమతాధిపతి స్థూలభద్రస్వామి యని చెప్పఁబడియున్నది. మఱియు తన కడదినములందుఁ జంద్రగుప్తమహారాజు శ్రావణబెళగోళమున కేతెంచి వసించుట, బౌద్ధమతమునందు నమ్మకముచెడి, తిరుగ జైనుఁడై, యిట దిగంబరజైనధర్మమున వసించుచుండెనని యచటి వారనెదరు. శ్రావణబెళగోళమును కొండపై క్రీ. ము. నాలుగవ శతాబ్దములనాఁటి శాసనములు కలవు.

[జైనమతము షట్పవిత్రక్షేత్రములు, జైనసిద్ధాంత దిగంబర శ్వేతాంబర భేదములు, అర్హంతమతము చూడుఁడు.]

**శ్రావణమంగళవారములనోము:—** (మంగళగౌరీవ్రతము చూడుఁడు).

**శ్రావణశుక్రవారములనోము:—** (వరలక్ష్మీవ్రతము చూడుఁడు).

**శ్రావతము లేక (శ్రవస్తి):—** శ్రీరాముని సుతుండగు లవునిరాజధాని. శ్రీరాముఁ డీపురిని రాజధానిగ నీప్రాంతదేశమును తనసుతుఁడగు లవున కిచ్చెనని వాయుపురాణోత్తర ౨౬ అధ్యా చెప్పఁబడినది. దీని నిప్పుడు 'సాహెత్ మాహెత్' అనియు నందురు. ఉత్తరకోసలరాజధాని. అయోధ్యరాష్ట్రములోని గోండాజిల్లా తొల్లింటి యచిరావతీనదీతీరమున నున్నది. అయోధ్య కుత్తరముగా ౫౮ మైళ్ళదూరము. రామాయణము ఉత్తర ౧౨౧ యందు దీనిప్రశంస కలదు.

**శ్యాబరాయణగోత్రము:—**
ఉపగణము చూడుఁడు).

**శ్యామకర్ణాశ్వము:—** తొల్లింటికాలమునఁ బ్రభువు లొనర్చుచుండిన యశ్వమేధయాగము నందు యాగపశువుగ వాడఁబడుచుండిన నల్లని చెవులు, తెల్లనిరంగు గల్గినగుఱ్ఱము. (అశ్వమేధ యాగము చూడుఁడు.)

యాగమొనర్పఁ దలంచినతావుననుండి దీనిని స్వేచ్ఛగ సంచరింప వదలెదరు. పరరాజులు దానిం గట్టివై చిన, వారితోఁ గలహించి యోడించి యా శ్యామకర్ణాశ్వమును విడపించుచుందురు. అది తిరుగఁ బూర్వస్థానమునకుఁ జేరినతరువాత యాగశాల నేర్పఱచి క్రతువు నాచరింతురు.

**శ్యామకుఁడు:—** యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి శూరుఁడు. సోదరుఁడు వసుదేవుఁడు.

**శ్యామగోత్రము:—**
(గర్గఉపగణము చూడుఁడు.)

**శ్యామగోత్రము:—**
(నిధ్రువగణము చూడుఁడు.)

**శ్యామపుష్యగోత్రము:—**
(గవిష్ఠిరగణము చూడుఁడు.)

**శ్యామరశ్మి:—** ఋషి. కపిలునిశిష్యుఁడు. తొలుదొల్త వేదములను నిరాదరణముగఁ జూచిన వాఁడు. కపిలర్షితో వాదముఁగూడ సల్పినవాఁడు. పిదప వేదములప్రామాణత, ప్రాముఖ్యతల నెఱిఁగెను.

**శ్యామలనాధక్షేత్రము (సమాజ్లీ):-** బొంబై రాజధానిలోని మహాకాంతపురముకడ సమాజ్లీ యనంబడుచున్న విష్ణుక్షేత్రము. దేవాలయము క్రీ. శ. ౧౫ శతాబ్దమున నిర్మింపఁబడినదఁట.

పద్మపురాణము శ్రేష్ఠి ౧౧ అధ్యాయమునను, మత్స్యపురాణము ౨౨ అధ్యాయమునను ప్రశంసలు కాననగుచున్నవి.

**శ్యామలాదేవి:—** యముని భార్య యొక శ్యామలాదేవి. ఉచ్ఛిష్టశ్యామల యని వేఱొక దేవతయుఁ గలదు.

**శ్యామాత్రేయగోత్రము:—**
(ఆత్రేయగణము చూడుఁడు).

**శ్యామాయణగోత్రము:—**
(గర్గ ఉపగణము చూడుఁడు.)

**శ్యామాయనగోత్రము:—**
[కణ్వ ఉపగణము చూడుఁడు.]

**శ్యామాయనగోత్రము:—**
[గర్గఉపగణము చూడుఁడు.]

**శ్యామాయనిగోత్రము**
[పరాశరగణము చూడుఁడు.]

**శ్యామాలరునగోత్రము:—**
[కుశికగణము చూడుఁడు.]

**శ్యామిగోత్రము:—**
[ఉపమన్యుగణము చూడుఁడు.]

**శ్యామేయగోత్రము:—**
[కుశికగణము చూడుఁడు.]

**శ్యామేయగోత్రము:—**
[భరద్వాజ ఉపగణము చూడుఁడు.]

## శ్లావోనియా:-
[హంగేరీదేశము చూడుఁడు.]

## శ్వాత్రవర్ణాయన గోత్రము:-
[లోహితగణము చూడుఁడు.]

**శ్వానగమనాసనము:-** యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. ఇది దక్షిణశ్వానగమన మనియు, వామశ్వానగమన మనియు ద్వివిధము. ౧ దక్షిణశ్వానగమనము- శరీరభార మంతయు నానునట్లు కుడికాలి మునివ్రేళ్లపై నానునట్లు మడమ లెత్తి పాదము లాని కూర్చుండి, కుడిచంక కుడిమోకాలిపై చేర్చి రెండు చేతులచే దానిం జుట్టి, యెడమకాలి నడ్డముగా మడిచి, యెడమపాదమును కుడిమోకాలిమీఁద నుంచి కూర్చుండుట. దక్షిణశ్వానగమనాసనమును కుడియెడమగను, ఎడమ కుడిగను సవ్యాపసవ్యములుగ మార్చిపై విధముననే చేయుట వామశ్వానగమనమనియుఁ జెప్పఁబడినది. ఇది శ్వాసగతులను మార్చుట కుపయోగింతురు. దక్షిణాసనమున దక్షిణశ్వాసయు, వామాసనమున వామశ్వాసయు నడుచునని చెప్పఁబడినది.

## శ్వానన్క్షత్రగోళములు:—
(నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు.)

## శ్వానాయము:—
(అష్టవిధాయములు చూడుఁడు.)

**శ్వాస:—**ఎగరొప్పు, వగరుపు ననువాడుకపేర్లు గల దగ్గులలో నొకభేదజాతి. ఊపిరియెక్కువగా విడచుటవలన నాయాసముఁ గల్గించునది.

**శ్వాహితుఁడు:-**యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి వృజినవంతుఁడు.

## శింఘాణాదుంప (శింగాణాదుంప):-
(కోవెలదుంపచెట్టు చూడుఁడు.)

## శింశుపాయనుఁడు:—
(ఒకపౌరాణికుఁడు.)

**శింశుమారచక్రము:-** ఇది జ్యోతిశ్చక్రమనియు, భగోళమున నన్నిటికిఁ బైన నుండునదనియుఁ జెప్పఁబడినది. ఇది సర్వదేవతాత్మకచక్రమఁట.

ఈచక్రమున ధ్రువుఁడు, ఇంద్రి వరుణ కశ్యపులతోఁగూడి నిత్యము ప్రదక్షిణముగఁ దిరుగుచుండును. పుచ్ఛమున ప్రజాపతి, అగ్ని, ఇంద్రి, ధర్ములును, పుచ్ఛమూలమున ధాతృవిధాతలును, కటిప్రదేశమున ఋషిసప్తకమును, ఉత్తరహనువున నగస్త్యుఁడు, అపరహనువున యముఁడును, ముఖమున నంగారకుఁడు, గుహ్యమున శనైశ్చరుఁడు, గుహ్యాంగముకడ బృహస్పతి, ప్రక్క నాదిత్యుఁడు, నాభిని శుక్రుఁడు, చిత్తమునఁ జంద్రుఁడు, స్తనభాగమున అశ్వినీదేవతలు, ప్రాణాపానముల బుధుఁడు, సర్వాంగములను శనికేతువులు, రోమములఁ దారలును నుండునఁట.

**శిక్ష:—** శిక్ష వేదముల కనుబంధమై యంగముగఁ జెప్పఁబడినది. అది, అకారముమొదలు హకారముదనుక నేఁబది యక్షరములను పలికెడి రీతిని బోధించుగ్రంథము.

శిక్షయందు ౧ స్వర్గము, ౨ కాలము, 3 స్థానము, ౪ ప్రయత్నము, ౫ అనుప్రధానము, లను ప్రకారములుగ విభజించి యున్నారు.

శిక్షాగ్రంథములు శంభుశిక్ష, పాణినీయశిక్ష, వ్యాసశిక్ష, భారద్వాజశిక్ష, సర్వసమ్మతశిక్ష, అపిశలశిక్షలు మొదలగునవి నలుబది శిక్షాగ

ములు కలవు. వీట్లయందుఁ బాణినీయశిక్షయే వ్యాపకము నందియున్నది. మఱియు నదియే బ్రహ్మాయజ్ఞాంగముగఁ బరిగణింపఁబడుచున్న గ్రంథము.

## శిక్షలు (వేదాంగములు) ౯:—

౧ వ్యాసశిక్ష, ౨ లక్ష్మీకాన్తశిక్ష, 3 భరద్వాజ శిక్ష, ౪ శంభుశిక్ష, ౫ అపిశలశిక్ష, ౬ కహాళీయ శిక్ష, ౭ వర్ణశిక్ష (క్రమదర్పణము) ౮ ఆత్రేయ శిక్ష, ౯ అరణ్యశిక్ష.

### ఉపశిక్షలు [వేదాంగములు] ౯

౧ పాణినీయము, ౨ మధుసూధనము, 3 సర్వసమ్మతము, ౪ స్వరశిక్ష, ౫ ఈగ్యశిక్ష, ౬ అనీగ్యశిక్ష, ౭ న్యాయపంచాశతీశిక్ష, ౮ జటామణి శిక్ష, ౯ ఘనదర్పణశిక్ష. ౭ ౮ ౯ ఉపశిక్షలు ఆధునికములు.

## శిక్షాయనగోత్రము:—

[భరద్వాజ ఉపగణము చూడుఁడు.]

**శిఖండి:**—అత్రి చంద్ర పూరు వంశక్షత్రియుఁడు. తండ్రి ద్రుపదమహారాజు. సోదరుఁడు ధృష్టద్యుమ్నుఁడు. సోదరి కృష్ణా (ద్రౌపదీదేవి.)

ఈతఁడు గుహ్యకాంశమనియు, కాశీరాజు కూఁతురుగ (అంబయైయుండి) భీష్మునిజంప తపం బొనర్చి, కర్ణుఁడను యక్షునివలనఁ బుంసత్వముం బొంది, శిఖండియై భారతయుద్ధమున భీష్మునిచంపె ననియుఁ గూడ చెప్పఁబడినది. మఱియు నంతర్థానునిమొదటిభార్య పేరు శిఖండి.

**శిఖండి:**— ఈపదమునకు నైఘంటికము గానున్న యర్థము 'శిఖండి' చరిత్ర వ్రాయు నపుడు పనికిరాదు. వాడుకలో మాత్రము మొండితనమును సూచించుచున్నది. విస్తారమైన మొండితనమును సూచించువట్ల 'శిఖండి' యను శబ్దమునకున్న బలము చాలదని కావలయు 'మొండి శిఖండి' యనికూడ వాడుచున్నారు. పట్టుదల, మొండితనము సూచించునపు డీశబ్దము నుపయోగించుచున్నారు. శిఖండియను వ్యక్తికిఁగలపట్టుదలయు, అట్టిపట్టుదలకు గల పూర్వకారణములును గలసి, పున్జన్మచేతన్నను తనపట్టుదలఁ దీర్చికొనుటవలన నీమె నామధేయమే యొకవిశేష గుణప్రదర్శకశబ్దముగా వాడుక నందియున్నది.

పూర్వగాథ యొకింత తరచిచూచితిమేని సర్వాంగముగా నిది వ్యక్తముగాగలదు.

గాథ:— సత్యవతీశంతనుల యగ్రజుండగు చిత్రాంగదు ననంతరము విచిత్రవీర్యు వివాహమునకు, స్వయంవరోత్సవ మేర్పడియున్న కాశీరాజు కూఁతులు ముగ్గురను [అంబ, అంబిక, అంబాలిక] యనువారలను భీష్ముఁడు రాజమర్యాదలం దొలఁగించి తోడ్కొనివచ్చుటను కాశీరాజు సభాభవనంబునను, కాశీపట్టణమునను పెక్కుదుర్ణయంబులు వాటిల్లెను. సత్యవతితో నంబ సౌంభపురాధీశుండగు సాళ్వునందుఁ దనమనసుఁ దగిలియుంట దెలుప, మరల నామెను, భీష్ముఁడు దోడ్కొని కాశీరాజుచెంత వీడెను. ఆమెయు సాళ్వు నపేక్షింప, నాతఁడు 'భీష్ముఁడు కొనిపోయినదానినే వరియింప; నీకుఁ గన్యాత్వ మెడలెనని' యామెను నిరసించి, వెడలించె. తన కట్టియవమానమును, అనాథతయు భీష్మునివలనఁగలిగెగా యని భీష్మునెడఁ బగఁబూని, తపం బొనర్చి జన్మాంతరమందైనను నిన్ను మన్నిగొనెదనని పంతముఁబూని, తనతపోమహిమను ద్రుపదునకు జన్మించి ధృష్టద్యుమ్నుని తమ్ముఁడుగా నెన్నఁబడెను.

స్త్రీలు పౌరుషాభినయము నలవఱచుకొనుటను బురుషసదృశలుగను, స్త్రీత్వాభినయముచే స్త్రీకల్పులుగను, నగుట లోకవిదితమే. తొల్లి స్త్రీగా జన్మించిన శిఖండిని, పురుషుఁడని ద్రుపదుఁడు ప్రకటించుటయే గాక, ద్రోణునికడ నాతఁడు పుంరూపముతో నస్త్రశస్త్రవిద్యల నారితేఱినవానినిగాఁజేసి భీష్మునిఁ జంపునటుల శిఖండిని బురికొల్పుచు, దశార్ణదేశరాజు కుమార్తెను పెండ్లిచేసెను. దశార్ణభూపతియు నీకృత్రిమ మెఱింగి, యుద్ధసన్నద్ధుఁడై వచ్చినప్పుడే శిఖండి యొక్క స్త్రీత్వము లోకవిదితమైనది. స్థూలకర్ణుఁడను యక్షుఁడు శిఖండికిఁ బుంస్త్వమిచ్చె ననుగాథ నిట్లు సమర్థింపవచ్చును. పుంరూపముతో నుండిన శిఖండియొక్క పోలికఁగలవాఁడు స్థూలకర్ణుండను నొకం డుండవచ్చును.

ఆస్థూలకర్ణునిస్థానమున శిఖండి నిలిచి, తనస్థానమున కాపరీక్షాసమయమునకు స్థూలకర్ణు నంపి యుండును. శిఖండి చిన్నతనమునుండియు సాము గరిడీలను నేర్చి, శస్త్రాస్త్రవిద్యల నలవఱచుకొనుటచే భీష్మునితోఁ బోరుసామర్థ్యము నలవఱచికొనియుండెను. స్త్రీలు పుంభావముతో మెలఁగినచోఁ బురుషనిర్విశేష లగుదురని 'మాధురీ' పత్రికయందు (ప్రభవసం॥ మార్గశిరమాస సంచికయందు) సోదాహరణంబుగఁ బ్రకటింపఁబడుట నాలోచింప, నీశిఖండియొక్క పుంస్త్వము నట్టిదే యగునుకా నని దలంప ననువగుచున్నది. స్త్రీలస్త్రశస్త్రముల ధరించి, వీరత్వముతోఁ బోరాడు నాచారముండుటఁ బాశ్చాత్యదేశములందే గాక, భారతదేశమునఁగూడ వేదకాలము మొదలు గతశతాబ్దమధ్యమువఱకుఁ గలదని గ్రంథనిదర్శనములు గలవు. శిఖండిజన్మాదికముగూడ, దేవతామహిమలతోఁ జొప్పింపఁబడి సంపూర్ణసంకీర్ణత నొందియున్నది.

తనతండ్రియగు ద్రుపదుని నర్జునుఁడు బంధించి గురుకట్నముగా ద్రోణున కప్పగించినకాలమున, భీష్మపురస్సరమున రాజ్యము మరలఁ గైకొనఁ గలిగిన ద్రుపదునకు, భీష్ముఁడు విరోధియగుటకుఁ గారణ ముత్తరపాంచాలసంధినియమము చొప్పున ద్రోణుఁడు, అహిఛ్ఛత్రము నాక్రమించి యనుభవించుట యను తనయిప్పటిజన్మలో సంఘటిలిన యానుషంగికకారణముచే భీష్మునెడ పగఁబూనితి నని యీశిఖండి తఱుచుగ నుద్ఘాటించుచువచ్చెను. అట్లయ్యును తనపూర్వజన్మ వృత్తాంత మపుడపుడు స్మరణకు వచ్చుటనుగూర్చియుఁగూడ పలుమాఱుటంకించుచు వచ్చెను. ఎట్లైననేమి భీష్మమరణమున కీశిఖండియే కారణమని భారతమునఁ జెప్పఁబడియున్నది.

(ఈమెకు లేక యీతనికి) [ఈవ్యక్తికిఁ] బొక్కండు పుత్రులనికూడ భారతమునఁ జెప్పఁబడినది.

గాలికిని, నీటికిని బిడ్డలుపుట్టు నాకాలమున (గాలికొడుకగు భీముఁడు, నాంజనేయులును, నీటికొడుకు గంగాపుత్రుఁడగు శంతనుఁడును ఉదాహరణములు). క్షత్రదేవ, ఋక్షదేవాదులు శిఖండి పెండ్లియాడిన దశార్ణభూపతి పుత్రికయందు క్షేత్రజులుగాఁ బుట్టియుందు రనవచ్చును. బహుళపుత్రదత్తతగలకాల మగుటచే నల్వురను శిఖండి దత్తులనుగాఁ జేసికొనియుండును. అట్లు గాకున్న స్థూలకర్ణునకుఁ బ్రత్యుపకృతిగా బీదవాఁడగునాతని పుత్రులనే పెంచి, తనపుత్రులేయని ప్రకటించి యైన యుండనోపు. ఏది యెట్లున్నను, ఈశిఖండి భీష్మునెడఁగల ప్రాతఁబగం దీర్చికొనుటకుఁబునర్జన్మ మెత్తియైన తనమొండిపట్టుదలఁ దీర్చికొనియెను.

పట్టుదలనెఱవేర్చుకొనుపట్టుల నట్టివారిని "శిఖండి" యనియు, "మొండిశిఖండి" యనియు నను నీశబ్దములు వాడుకలోనికి వచ్చినవి.

కురుపాండవయుద్ధమున నీతఁడు లేక యీామె తుదకు నశ్వత్థామచే నిహతుం డయ్యెను.

**శిఖరవేదిక:**—శిల్పశాస్త్రమున దేవాలయశిల్పమగు విమాననిర్మాణమునందుఁ జెప్పఁబడిన సప్తవేదికలలో నొకటి. (విమానలక్షణము చూడుఁడు). శిఖరవేదిక తామరమొగ్గ యాకృతిఁగల్గి, విమానమెన్నవసంఖ్యదో [అనగా ౧-౨౮ విమానములలో నెన్నవసంఖ్యదో] అన్నిదళములంగల్గి యుండవలయుననియు, దానికి శిఖరవేదిక యని పేరనియు, చెప్పఁబడినది.

పురుషవిమానములం దీవేదికకు విష్ణుదేవుఁడును, సంకరవిమానములందుఁ బృథ్వియు, నధిదేవతలనియు, నన్నివిమానములలోని శిఖరవేదికలందు వశిష్ఠమహర్షి ఋషియనియుఁ జెప్పఁబడినది.

**శిఖరహస్తము:**—(హస్తాభినయము చూడుఁడు - భరతశాస్త్రము చూడుఁడు.)

**శిఖరీజీ:**— జైనుల పరేశనాథదేవస్థానమున్న చోటా నాగపూరులోని పర్వతశిఖరము. పరేశనాథమునకుఁ బరశునాథ మనియుఁ బేరు గలదు. [చోటానాగపూరు, ప్రోవిన్సు చూడుఁడు.]

**శిఖాపత్రిగోత్రము:**—
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**శిఖిధ్వజుఁడు:**—ఏనవమన్వంతర మందలి ద్వాపరయుగమున మాళవదేశమును బాలించిన వాఁడు శిఖిధ్వజుఁడు. ఈతఁడు సౌరాష్ట్రదేశాధిపునుత చూడాల యనుకన్యను బరిణయమాడెను. ఈపతివ్రతాశిరోమణి భర్తతోఁ గొంతకాలము గడపి, ఆత్మజిజ్ఞాసాపరాయణ యై, తాను తరించి భర్తను దరింపఁజేసినది. ఈవృత్తాంతము జ్ఞానవాసిష్టమున నిర్వాణప్రకరణమున 66 మొదలు 126 వ అకునుగల శ్లోకములందుఁ గలదు.

**శితివృక్షగోత్రము:**—
[వశిష్ఠగణము చూడుఁడు.]

**శిపిలగోత్రము:**—
[కౌశాయనఉపగణము చూడుఁడు.]

**శిపిలశ్విగోత్రము:**
[కౌశాయణఉపగణము చూడుఁడు.]

**శిబిగోత్రము:** —
[పరాశరగణము చూడుఁడు].

**శిబి (శిబిచక్రవర్తి) (ఉశీనరదేశాధిపతి):**— అత్రిసంతతి చంద్రవంశఁపుక్షత్రియుఁడు. తండ్రి యుశీనరుఁడు. సోదరులు నృగుఁడు, వుసఁడు, క్రిమి, సువ్రతుఁడు ననువారలు. పుత్రులు వృదర్భుఁడు, సువీరుఁడు, కేకయుఁడు, మద్రుఁడు ననువారలు. అందు వృషదర్భుఁడు తండ్రిరాజ్యమగునుశీనరదేశాధిపతి. తక్కినవారు తమపమ పేరిఁట వేర్వేఱుదేశముల కధిపతులైరి.

మఱియు ప్రహ్లాదునికుమారునకు శిబి యనియుఁ బేరు కలదు.

**శిరిగోత్రము:**—
[ఉపమన్యుగణము చూడుఁడు.]

**శిరియాలిక, శ్రియాళిపురము:**— శిరితొండభక్తునింగూర్చి శైవగ్రంథములం దందరెఱిఁగినదే. అతనినివాస మీపురమే.

ఇప్పు డిషియాళి యనఁబడుచు దక్షిణదేశమున తంజావూరుమండలమునందున్న పురము. సౌతిండియన్ రెయిల్వేయందు స్టేషనుగూడకలదు.

దీని కెవ్వరో శ్రీకాళి యని పేరిడియుండిరఁట. పిదప నది శీయాళికా వాడుకనందెనఁట. త్రివిక్రమపురమని మఱియొక రెవ్వరో పేరిడిరఁట గాని యెవ్వరు వాడకుండిరఁట.

## శిరిశిష్ట (శిరిశేష్ట) గోత్రము:

(శ్రీశేష్ట చూడుఁడు).

## శిరీష లేక శిరీషకగోత్రము:

(ముద్గలగణము చూడుఁడు).

## శిరీషకగోత్రము:—

(గవిష్ఠిరగణము చూడుఁడు).

## శిరోద్భేదము [తీర్థము]:—

(నగోద్భేదము చూడుఁడు).

**శిలాజిత్తు:—** ఆంగ్ల. Foliated crystalised gypsum అనియు, Bitumen అనియు, సం. శిలాజిత్, శైలసంభవః, గిరిజం, శైలేయం, అగజః, శిలాజం, శైలం, శైలేయం, శిలాస్వేదః, అద్రిజం, సీతపుష్పకం, అశ్మజం, అశ్మజతుకం, అశ్మలాక్షా. ఇది రాతిమడమనియు, రాతిపువ్వనియు, కొందరిది యొకజాతిరాయి యనియు నందురు. ఇందు రెండుజాతులు కలవు. కేవలము తెల్లగనుండుదానికిఁ గర్పూరశిలాజిత్తనియు, తెలుపుపసుపురంగులు కలిసినరంగుగల దానికి గోమూత్రశిలాజిత్తనియుఁ బేర్లు. రెంటికిని గుణము లొక్కరీతిగనే యున్నను, కొందరు గోమూత్రశిలాజిత్తందు మేలనియందురు. శిలాజిత్తును పద్ధతిమేరకు భస్మముచేసియు, శుద్ధిచేసియు విధములుగ వాడుదురు. ఈనడుమ నీశిలాజిత్తు నెండయందే కాగించి, శుద్ధియొనర్చుటం గనిపెట్టిరి.

శిలాజిత్తునందు గొప్పగుణములు కలవు. బలహీనమగు శరీరమునకు బలమిచ్చుట క్షీణించిన ధాతువున కుత్తేజమొసంగుట, క్షీణించినపుంస్త్వమును తిరిగి యుద్దీపన మొసంగుట, గాయములను మాన్పుట యిందుఁ బ్రధానములు. దీనిని మోమాయి యనియు నందురు.

శిలాజిత్తుభస్మము మహాశాంతి, చలవఁ జేయును. మలమూత్రనిరోధమును సడలించును. దృష్టికి బల మిచ్చును. మూత్రమున సుద్దపడెడురోగము నివారించును. అగ్నిమాంద్యము, నుదరరోగములు, కాస, నిశ్వాసి, గుల్మము, నెత్తురుగడ్డలు పాండురోగము, ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, రక్తగ్రంథులు (నెత్తురుగాలు కురుపులు) శూలలు, క్షయ నివారించును. శరీరపటుత్వము నీయఁగలదిగఁ జెప్పఁబడినది. దురదగల పుండ్లకుఁ దీనవేసికట్టను మానునని చెప్పఁబడినది.

## శిలాతలిగోత్రము:—

(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**శిలాదుఁడు:—** ఋషి. శివభక్తుఁడు. నైమిశారణ్యము (జపేశ్వరము) న శివునిఁగూర్చి గొప్పతపమొనర్చి నందికేశ్వరునిసుతునిగ బడసినవాఁడు. నందికేశ్వరుని భార్యపేరు సుకేశీదేవి.

## శిలాధాతువు:—

(రాతిపువ్వు చూడుఁడు).

**శిలానది:—** నేపాలదేశమున గండకీనదికి శిలా (రాయి లేక రాళ్ళుల) నది యనిపేరు కలదు. ఇది బహుశః సాలగ్రామశిలలనుండి కల్గినపేరుగ నుండనోపు.

గంగోత్తరి (గంగానది జన్మస్థానము కడ గడవాలుసంస్థానముననున్న యొకచిన్నదికి శిలానది యనిపేరు కలదు. ఇకను జాక్యారిటీస్ నదికిని శిలానది యనిపేరుండెను. రాతిప్రదేశమున నీనది ప్రవహించుటబట్టి కల్గినపేరు.

గంగోత్తరికడనున్న శిలానది కడుశీతలమై వ్రేలందు ముంచిన రాతివలె బిగిసిపోవుటవలన దానిం దాఁకిన శిలలైపోవునవి వాడుకవలన నత్యుక్తి నీపేరుగలెనఁట. సాలగ్రామి (గండకీ) నదికి. శిలాగ్రామి (సాలగ్రామి) శిలానది యని వాడుక యయ్యెఁగాఁబోలు. (గండకీనది చూడుఁడు. ముక్తినాథము చూడుఁడు.)

**శిలావతీనది (ఇప్పటి శిప్రై):**—[సుమహాదేశము చూడుఁడు]. శిలావతీనది, ద్వారకేశ్వరీనది, కలసి రూపనారాయణ యనఁబరఁగి, హుగ్లి [గంగ] యందు సంగమించును.

**శిలాసంగమము [విక్రమశిలా సంఘారామము]:**—
(అంగదేశము చూడుఁడు.)

**శిలాక్షరము:**—
[రాతిపైఁ జెక్కఁబడిన చెఱగనియక్షరమని భావము. ఆంధ్రలోకోక్తి].

**శిల్పకుఁడు, కవి:**—
[కవి - కవులు చూడుఁడు.]

**శిల్పకుష్ఠు:**—రాళ్లవలె గరకులుగాఁగ్రంథులు [గడ్డలు] లేచెడికుష్ఠుజాతిరోగము.

**శిల్పశాస్త్రము (వాస్తుశాస్త్రము)-** గృహములు, దేవాలయములు, నిర్మించుమార్గముల నెఱిఁగించునది శిల్పశాస్త్రము. దీనిని వాస్తుశాస్త్ర మనియు నందురు. దీనిని తొల్లి విశ్వకర్మ సంతతివాఁడగు మయుఁడు వివరించెనని చెప్పఁబడినది. శిల్పమును భరద్వాజమహర్షి గ్రంథరూపముగ రచించియున్నాఁడు. ఈ శాస్త్రప్రశంసలు బ్రహ్మాండపురాణమునందుఁ గలవుగాని పూర్తిగ వివరింపఁబడలేదు.

శిల్పము మనుష్యుల కుపయోగమగు, గృహనిర్మాణమునకుపయోగమనియు, దేవాలయాదులనిర్మాణమునకుపయోగమనియు, వివరించియున్నారు. మఱియు నిందు దేవతావిగ్రహనిర్మాణధర్మములును వివరింపఁబడినవి.

ఇందు ౧ భూపరీక్ష, ౨ వాస్తువు, ౩ శంకుస్థాపనము, ౪ వస్త్రము, ౫ విమానలక్షణము, ౬ విగ్రహశిల్పము ననునాఱంగము లాఱుభాగములుగ వివరింపఁబడినవి. వర్ణములు, ముహూర్తధర్మములును, విమానము (దేవాలయము) నందుండవలసిన వేదికలు, స్తంభగళములు, చిత్రములు, సోమసూత్రములు, పునాదులు, అష్టబంధము వివరింపఁబడినది.

విగ్రహశిల్పమునందు మనుష్యవిగ్రహలక్షణ ప్రమాణములు, అండజములు, జంతువులు, సర్పములు, ప్రమాణములు గూడ వివరింపఁబడినవి. దేవతావిగ్రహములందు ౧ గణపతి, ౨ ఉమామహేశ్వర, ౩ లక్ష్మీనారాయణ, ౪ సతీభార్తృ, ౫ మహాలక్ష్మి, ౬ గజలక్ష్మి, ౭ సరస్వతీ, ౮ శ్రీరామ, ౯ శ్రీరామపట్టాభిషేకము, ౧౦ శ్రీకృష్ణ విగ్రహములయొక్కయు, విష్ణుదేవుని దశావతారములయొక్కయు, శేషశయన నారాయణుని (శ్రీరంగనాయకవిగ్రహము) యొక్కయు, ఆంజనేయునియొక్కయు, అష్టదిక్పాలురయొక్కయు లక్షణములు రూపధ్యానము లనంబడు శ్లోకముల

రూపమున వివరింపఁబడినవి. (వాటి నాయాస్థాన ములందుఁ జూడనగును.)

**శివగంగ, పటలగంగ:**— మైసూరురాజ్యమున బెంగుళూరునుండి ముప్పదిమైళ్ళదూరమున బెంగుళూరు, పూనాలైను M. S. M. R. చిన్న లైనుపై, నిడ్వండస్టేషనుమీఁదుగా ఈపర్వతము కలదు. అందు గుహాలయంబేగల కొన్ని పెద్దదేవ స్థానములు కలవు. మఱియు నటనొక లోతగు కుండమున నగాధములైన జలములు కలవు. ఈజలములను పటలగంగ యని యందురు.

పర్వతాగ్రమున రెండు స్తంభలంబోలిన శిలలు కలవు. అందొకదానినుండి మకరసంక్రాంతిదినమున జలములూరును. దానిని శివగంగ యందురు. ఇది యాత్రాస్థలమై బహుజనుల నాకర్షించుచుండును.

**శివచతుర్దశి:**— ఫాల్గుణబహుళచతుర్దశికీపేరు గలదు. ఈపేరుసఁగలవ్రత మాచరింతురు. [భూతచతుర్దశి చూడుఁడు].

**శివనింబచెట్టు:**— లా. Appalathus Indica. ఎఱ్ఱనిపూవులుం బూచుచు నాల్గడుగులమెత్తునకుఁ బెరుగుచెట్టు. చింతాకులంబోలు చిన్నయాకులు. ఇవి చలువఁజేయుననియు, వీటి కషాయము కుష్టరోగమును నివారించుననియు, వేరు పంటినొప్పి, నోటిపొక్కులు, నోటిపూత నివారించుననియుఁ జెప్పఁబడినది.

**శివపురాణము:**— శివపురాణము (శైవము) దేవీభాగవతమున దీనిపేరే గానరాదు. దీనికిబదులు భాగవతము నాల్గవదిగఁ జెప్పఁబడినది. నారదీయమునను, మత్స్యపురాణమునను దీనికిబదులు వాయుపురాణమని నాల్గవపురాణము చెప్పఁబడినది. తక్కినఅన్నిటియం దిది నాల్గవ పురాణముగఁ జెప్పఁబడినది. వాయుదేవప్రోక్తము గాన వాయుపురాణమనియు, వాయవీయ మనియు, దీనికిఁ బ్రతినామము లుండనోపు. గ్రంథ సంఖ్యయన్నిటియందు ౨౪౦౦౦గను, దేవీభాగవత ముననాల్గవపురాణముగఁ జెప్పఁబడిన భాగవతము ౧౮౦౦౦ గను చెప్పఁబడినది.

**శివమొగ్గ (పురము):**— మైసూరు రాజ్యమున శివమొగ్గజిల్లా ప్రధానపురము 'షిమోగా' యనఁబడుచున్నది. ఇచటి కఱువదినాల్గు మైళ్ళదూరమున ప్రసిద్ధమగు గెరసొప్పజలపాతము కలదు.

**శివరాత్రులు ౧౨ [శివపూజార్థ పవిత్రదివసములు]:**—సంవత్సరమునఁ బ్రతిమాసమునందలి బహుళచతుర్దశితిథులు పండ్రెండును శివరాత్రి లనఁబడును. అందు మాఘబహుళ చతుర్దశి మిక్కిలి పవిత్రమైనదిగాన దానిని "మహాశివరాత్రి" యనియు, తక్కినపదకొండుశివరాత్రులను "మాసశివరాత్రు" లనియు నందురు.

**శివలింగసూర్యోదయము:**— కర్త చాగంటి శరభరాయాధ్యులు. అద్వైతి శైవుఁడు. ఈతఁ డద్వైత శైవసిద్ధాంతధర్మమును నాటక రూపమున సంస్కృతభాషను రచించెను.

**శివలింగహస్తము:**— (హస్తాభినయము చూడుఁడు— భరత శాస్త్రము చూడుఁడు).

**శివలీలలు (లీలలు) ౬౫:**—౧ ఉరు లింగోద్భవలీల, ౨ దక్షిణామూర్త్యవతారలీల, 3 సుఖావహలీల, ౪ ఏకపాదలీల, ౫ స్కన్దజనక లీల, ౬ విఘ్నేశ్వరప్రసాద (అంగీకరించుట) లీల, ౭ చక్రప్రసాద (విష్ణుదేవునకు) లీల, ౮ విష

హారణ (భక్షణ) లీల, ౯ ఛండీశానుగ్రహలీల, ౧౦ కంకాళ(పుత్ర) ధారుణలీల, ఆదికిరాత (అర్జునునకుఁ బాశుపతాస్త్రమనుగ్రహించి) లీల, ౧౨ అర్ధనారీశ్వరలీల, ౧౩ నృసింహగర్వభంగ (శరభసాళ్వావతార) లీల, ౧౪ దక్షాధ్వరధ్వంసలీల (వీరభద్రావతారగ్రామము), ౧౫ బ్రహ్మశిరఖండనలీల, ౧౬ జలన్ధరసంహారలీల, ౧౭ పురత్రయహరణ (త్రిపురాసురవధ) లీల, ౧౮ దండధరచ్ఛేదన (మార్కండేయరక్షణ) లీల, ౧౯ కందర్ప (మన్మథ) దహనలీల, ౨౦ భిక్షాటన (దారుకావనవిహార) లీల, ౨౧ సతీపతిన్యాయలీల, ౨౨ మహానటన (నాట్య) లీల, ౨౩ వృషభారూఢలీల, ౨౪ గౌరీసహితలీల, ౨౫ సోమకళాధర లీల, (చంద్రకళనుతలందాల్చుట.)

**శివలీలారూపములు:—** పరమేశ్వరుండగు శివునిలీలారూపము లిరువదియైదుగఁ జెప్పఁబడినవి. ఇది యాగమోక్తము.

శ్లో॥ ప్రథమం సోమధారీ స్యాత్ ద్వితీయ ముమయా సహ। తృతీయన్తు వృషారూఢః చతుర్థం నృత్తరూపమమ్.

శ్లో॥ వైవాహ్యం పంచమం విన్ద్యాత్ షష్టం భిక్షాటనం భవేత్। కామారిం సప్తమం విన్ద్యాత్ కాలారి శ్చాష్టమం భవేత్.

శ్లో॥ నవమం త్రిపురారి స్యాత్ జలంధరవధో దశ। ఏకాదశ గజారీ స్యాత్ ద్వాదశో వీరభద్రకః.

శ్లో॥ త్రయోదశో హరిధ్వంసః అర్ధనారీ శ్చతుర్దశ। కిరాతస్యా త్పంచదశ కంకాళ షోడశో భవేత్.

శ్లో॥ ఛండేశానుగ్రహ స్సప్త దశేతి పరికీర్తితః। విషాపహరణ శ్చాష్టా దశేతిసముదాహృతః.

శ్లో॥ ఏకోనవింశతి హరి శ్చక్రప్రదో భవేత్। వింశతి ర్విఘ్నప్రసాదో భవే చ్ఛతదనంతరమ్.

శ్లో॥ ఉమామహేశ్చైకవింశత్ ద్వావింశ శ్చైకపాదకః। సుఖావహ స్త్రయోవింశ ద్భవేచ్చ తదనంతరమ్.

శ్లో॥ దక్షిణామూర్తి రూపన్తు చతుర్వింశతి రీరితః। ఉరులింగోద్భవం రూపం పంచవింశతి రీరితః. ఏతే మాహేశరూపాశ్చ మూర్తిభేదాః ప్రకీర్తితాః.

౧ చంద్రకళాధరరూపము
౨ పార్వతీసహవాసరూపము
౩ వృషభవాహనరూపము
౪ నటరాజస్వామి (నృత్యము జేయుచున్నట్లు) రూపము.
౫ కల్యాణసుందరమూర్తి రూపము
౬ భిక్షాటనమూర్తి రూపము
౭ మన్మథదహనమూర్తి రూపము (కామారిరూపము)
౮ యమసంహారమూర్తి రూపము
౯ త్రిపురాసురసంహారమూర్తి రూపము
౧౦ జలంధరాసురసంహారమూర్తి రూపము
౧౧ గజాసురసంహారమూర్తి రూపము
౧౨ వీరభద్రావతారరూపము
౧౩ వ్యాఘ్రాసురసంహారమూర్తి రూపము
౧౪ అర్ధనారీశ్వరరూపము
౧౫ కిరాత (మాయాకిరాత) రూపము
౧౬ కంకాళమూర్తి రూపము
౧౭ ఛండేశానుగ్రహమూర్తి రూపము
౧౮ మృత్యుంజయమూర్తి రూపము
౧౯ (విష్ణుదేవునకు) చక్రప్రదానరూపము
౨౦ విఘ్నేశ్వరానుగ్రహమూర్తి రూపము

౨౧ ఉమాస్కన్దమూర్తి రూపము
౨౨ ఏకపాదమూర్తి రూపము
౨౩ సుఖాసీనమూర్తి రూపము
౨౪ దక్షిణామూర్తి రూపము
౨౫ లింగోద్భవమూర్తి రూపము

**శివసమవాదిశైవము:—** ఇది చతుర్దశ శైవ, భేద మతములలో నొకటి. (చూడుఁడు.) ఈమతమునందు ఆణవమల, మాయామల, కార్మికమలములు మలత్రయము. ఈమూఁడును పశు వనంబడు నాత్మ నావరించి యుండునవి. పతి [పరమేశ్వరుఁడు] పశువు [ఆత్మ లేక ప్రాణము] పాశము (బంధము) లనునవి త్రిపదార్థములు.

౧ పతి:— నామము, రూపము, క్రియలు లేనిది. నిత్యము, అనాది, సత్తు, చిత్తు, నిర్మలము, శుద్ధము నై యున్నది.

౨ పశువు:— ఇది ఆత్మ (లేక ప్రాణము) యనం బడును. ఇది యనాదికులసంబంధము గలది. అనేకరూపములుగ నిత్యమైయుండునని యనె దరు.

3 పాశము: అనాదిగ నున్నది. నిత్యమైనది. అనంతవ్యాపకశక్తిఁ గల్గినదని యందురు.

**శివాచారము:—** శైవాగమములందుఁ జెప్పఁ బడిన పంచాచారములలో నొకటి. ఇది పదునాఱు సంస్కారములు గలది.

౧ పాకము, ౨ రసము, 3 భవము, ౪ భూతము, ౫ భావశుద్ధి, ౬ మార్గము, ౭ కాలము, ౮ వాక్శుద్ధి, ౯ జనశుద్ధి, ౧౦ ద్రవ్యము, ౧౧ క్షేత్రము, ౧౨ గృహము, ౧౩ భాండము, ౧౪ తృణము, ౧౫ కాష్ఠము, ౧౬ వీటిక [తాంబూలము.] వీటిని షోడశసంస్కారములనియు, షోడశ శైవసంస్కారము లనియు నందురు.

**శివాజిగోత్రము:—**
[పరాశరగణము చూడుఁడు.]

**శివాదేవి:—** అగ్నికి దత్తపుత్రుఁడు నగు నాంగిరసాగ్ని భార్య.

**శివార్చకబ్రాహ్మణశాఖ [శివబ్రాహ్మణులు]:—** వీరి కాదిశైవులనియు, శివబ్రాహ్మణు లనియుఁ బేరులుగూడఁ గలవు. పూజారు లని వృత్తినామము తెలుచుగ వాడఁబడుచుంటఁ గాననగును. వీ రాంధ్ర, కర్ణాటక, తమిళ దేశము లందుఁ బ్రత్యేకబ్రాహ్మణశాఖగఁ గానఁబడు చున్నారు. వీరికి గురుక్కళ్ అని కులబిరుదము కల దఁట. పూర్వశైవులనియుఁ గొందఱు వాడుచుం దురని తెలిసెడిని. వీరు ద్రావిడశాఖ (గౌడశాఖ కాదనిభావము) వా రనియు, బోధాయనసూత్రము వా రనియు, శివాద్వైతమతస్థులనియు, శ్రీకంఠ (బ్రహ్మసూత్ర) భాష్యోక్తము వీరికి ధర్మ మనియు, ఆ శ్రీకంఠాచార్యుఁడు వీరిశాఖవాఁడే యనియు, వీరిగురుపరంపర

శ్లో. దూర్వాసం పైంగళం చైవ ఉగ్రజ్యోతి స్సుభోధకమ్। శ్రీకంఠం విష్ణుకంఠం చ విద్యాకంఠం తథైవ చ। రామకంఠం జ్ఞానశివం జ్ఞానశంకరమేవ చ। సోమశంభుం బ్రహ్మశంభుం త్రిలోచన శివ స్తథా। అఘోరశివమే వాథ ప్రాసాదవమేవ చ। రామనాథశివం చైవ ఈశానశివమేవ చ। వారుణాంచ శివంచైవ పద్ధత్యష్టాదశం భవేత్। ఏతై ర్దివ్యై శ్శివాచార్యైః మహానా మధిపా స్మృతాః। ఏతత్పరంపరా జాత మాదిశైవా శ్శివద్విజాః॥

ఇటుల శర్వాగమమునఁ గలదనియు, వీరిదగు నాదిశైవపత్రిక వికృమ, పుష్య, మాస సంచిక యందు వీరిశాఖవాఁడగు శ్రీబోధానందస్వామి (సన్యాసి) ప్రకటించియుంటఁ గాననగును. వీరిశా గమములు ప్రమాణగ్రంథములని తెలియుచున్నది. శైవులనుటనుండి వీరు శైవులగునారాధ్యబ్రాహ్మణశాఖవారని గాని, వీరశైవులగు జంగమ మహేశ్వరులు, లింగాయతవీరశైవులలో వీని కేసంబంధములేని ప్రత్యేక శాఖవారని తెలిసెడిని. దక్షిణ దేశసీమలందు శివాలయముల పూజారులుగ నున్న వారు గురుక్కళ్ అనంబడుచుండుట నెల్లఱుఁ దెలిసినదియే. ఆంధ్రదేశవాసులగు శివద్విజులు, ముఖ్యముగ గోదావరీతీరముల, తూర్పు పడమట గోదావరిజిల్లాలయం దున్నారు. కొందఱు గుంటూరు, కృష్ణా మొదలగుజిల్లాలయందుఁ గాననగుచున్నారు. ఆంధ్రదేశవాసులను వాడుకగా వెలనాటి పూజారు లని వాడుచుండుటయుఁ గలదు.

**శివికదేశము, మేవారుదేశము:—** రాజపుత్రస్థానమునందలి మేవా రని పిదప పేరంది యిప్పుడు పిలువఁబడుచున్న దేశము. ఇది శివిదేశమని పొరబడరాదు.

జేతూత్తరి చాలకాలము రాజధానిగ నుండెను. అల్బెరూనీ పండితుఁడు 'జెత్తురౌ'రని వ్రాయుటను జేతూత్తరిగఁ బోల్చియున్నారు. దీనిప్రశంస బృహత్సంహిత ౧౪ అధ్యాయమునఁ గాననగుచున్న దేశము.

**శివి (శిబి) దేశము:—** శివి, శివిక దేశములు గాన నొకటియని పొరఁబడరాదు.

మహాదాతయని పేరందిన శిబిచక్రవర్తి పాలన నుండి పేరందినదేశము. ఇది రాజపుత్రస్థానమందలి చిత్తూరుప్రాంతసీమగఁ బెక్కండ్రు పొరబడిరిగాని, అది సరికాదనియు, స్వాత్ నదీలోవప్రాంతమనియు, అరిష్టపురము కొంతకాలము ప్రధాననగరమనియు తేలుచున్నది.

మహాభారతము, వనపర్వము ౧౩౦–౧౩౧ యందు శివిదేశాధీశుని దానశీలతప్రశంస కలదు. [ఉశీనరచరిత్ర] ఇది పాంచాలమున కుత్తరమున నుండెనని ప్టోలోమీ వ్రాసెను. ఇప్పు డేయూన వాళ్ళును తెలియరాకున్న దేశము.

**శివునియాజ్ఞ లేక చీమయైనా కుట్టదు:-**
[ఆంధ్రలోకోక్తి]

**శిశిరుఁడు:—** ఋషి. శాకల్యర్షి శిష్యుఁడు.

**శిశునాగవంశనృపతులు:—** మగధదేశమును, క్రీ. పూ. ౬౪౨ మొదలు ౪౧౩ వఱకు నంఁగా ౨౬౨ సంవత్సరములు పాలించిరి. వీరికిఁ పిదప నందులు రాజ్యమునకువచ్చిరి. [మగధరాజ్యము చూడుఁడు.]

**శిశునాగుఁడు:—** శైశునాగవంశరాజ సంతతికి మూలపురుషుఁడు. మగధదేశాధీశుఁడు.

**శిశుపాలగోత్రము:—**
[ఆత్రేయగణము చూడుఁడు.]

**శిశుపాలుఁడు:-** చేదిదేశాధీశుఁడు. తండ్రి దమఘోషుఁడు; తల్లి శ్రుతశ్రవ (ఈమె వసుదేవుని చెలియలు). ఈతని పెద్దతల్లికుమారుఁడు దంతవక్త్రుఁడు. శిశుపాలదంతవక్త్రులు సనకసనందనుల శాపమువలన జనించిన విష్ణుదేవుని ద్వారపాలకులగు జయవిజయులని చెప్పఁబడినది. శ్రీకృష్ణునిచే నిహతుఁడై నవాఁడు.

**శిశోదియా [శాఖ] క్షత్రియులు:-** మేవాడ్ దేశము పరిపాలించు రసపుత్రశాఖకు శిశోరియావంశ మనిపేరు. వీరిలోఁ బ్రభువులకు రాణా లందురు. వీరు సూర్యవంశపువార మనియు, శ్రీరామునికుమారుఁడగు లవునిసంతతివార మనియుఁ జెప్పుదురు.

వల్లభీపురము శత్రువశమై తత్పాలకుఁడును, ఆదిత్యోపాసకుఁడును, నగు శిలాదిత్యుఁడు వీరశయనమందినపుడు వారిపట్టఁపుదేవులలో నొకరగు పుష్పావతీదేవి గర్భవతియై యుండెననియు, భర్తృమరణకాలమం దామె యంబికాక్షేత్రమున కరిగి యుండెననియు, దారిలో నామె కొక గుహలో కుమారుఁడుకలిగె ననియు నాతఁడే గుహలేతు వంశస్థాపకుఁ డయ్యెననియు, టాడ్ చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు. దీనినె 'గ్రహరాట్' వంశ మనియు నీతనిపేరు గ్రహరాట్టనియు, కొందఱు చెప్పుదురు. ఈతనికాలమునందే వీరి రాజధాని యీదూరునకు మార్పఁబడెననియు, తదనంతిర మీతనివంశీకులు తమరాజధాని నచ్చటినుండి అహార్యపురమునకు మార్చిరనియు, నప్పటినుండియు నావంశ 'మహార్యవంశ' మనియుఁగూడ వ్యవహరింపఁబడుచుండె ననియు, రానురా నీగుహలేతు వంశము లిరువదినాలుగు శాఖలుగా నభివృద్ధిఁ జెందె ననియు, అహార్యశాఖవారు పన్నెండవశతాబ్దమువఱకు దొంగర్‌పూరు (Dongarpur) రాజధానిగను, 'మాంగులియాశాఖవారు' ఎడారి సీమలలోను, శిశోదియాశాఖవారు మేవాడునందును, వీపారా (రహతోర్) శాఖవారు మార్వారునంమును ప్రభువులై యున్నట్టును టాడ్ రాజస్థానచరిత్రయందు వ్రాసియున్నాఁడు.

తక్కినశాఖలలో కాలూమ్, గహోర్, ధోర్నియా, గోడా, మగ్రాశా, భీమ్లా, కామ్‌కోటక్, కోటీకా, సూరా, అహూర్, ఒసేబా, నిరూప్ అను పన్నెండుశాఖలును క్రమక్రమముగా బలహీనములయి చెదరిపోయినట్లును, నడోరియా, నధోతా, ఒజాక్రి, కూట్రాక, దోసాడ్, బాట్వారా, పాహా, పరూత్ అను తక్కినయెనిమిదిశాఖలును రమారమి నిర్వంశములయినట్లును తెలియుచున్నది.

ఇప్పుడు గుహలేత్ వంశము సామాన్యముగా శిశోదియా యనుపేరుననే వ్యవహరింపఁబడుచున్నదనియు, క్రీ. వె. పన్నెండవ శతాబ్దములో వీరి వంశమువారిలో రహూప్ అనుపేరుగలజ్యేష్ఠుఁడు మేవాడ్ రాజ్యమునందు తనహక్కును విడిచిపెట్టి, దొంగార్‌పూర్ (Dongarpur) నం దొకకొత్త రాజ్యమును స్థాపించినట్లును తెలియుచున్నది. వీరి కనిష్ఠసోదరుఁడగు మహేపుఁ డనునతఁడు వీరి మూలపురుషుఁడు. సిసోదా నగరమునందుఁ దన రాజ్యముస్థాపించుటచే నప్పటినుండియు నీవంశమునకు శిశోదియావంశ మనుపేరు వచ్చెననియు, వాడుక గలదు.

రసపుత్రశాఖ లన్నిటిలో నీశాఖవారు కడు పరాక్రమవంతులు. స్వకులాభిమానమును, స్వతంత్రేచ్ఛయు వీరికి మెండు. ఎనిమిదిశతాబ్దముల కాలము విమతస్థులపాలనలో నుండుటచేఁ గొన్ని రసపుత్రశాఖలు వంశాచారవిరుద్ధముగాఁ బ్రవర్తించినను, ఈచిత్తూరు శిశోదియావంశమువారు మాత్రము స్థియర్ వంశకులతో సంబంధబాంధవ్యములు జరుపుట కంగీకరింపక, వంశమర్యాదను కాపాడుకొనినట్లు దేశచరిత్రకారులు ప్రశంసించియున్నారు.

హమీర్, బప్పారావల్, సంగరాణా, రాణాప్రతాప్, రాజసింహ మొదలగుమహావీరు లందఱు నీవంశములోనివారే. శిలాదిత్యుని పుత్రుఁడు

గ్రహాదిత్యుఁడు. ఇతఁడు బందరారణ్యమునకుఁ బోయి, యచ్చట గుహాలితువంశమును స్థాపించి నట్లు ఆసీపుర స్ఫటికశిలాశాసనముల యందుఁ గలదు. ఇతనికి కైశ్వుఁడు, గోపుఁడు నను నామాంతరము లున్నట్లును, ఈతని తరువాత నాగాదిత్యుఁడును, ఆతనికివెనుక భాగాదిత్యుఁడును, తదనంతరము దేవాదిత్య అశ్వాదిత్యులును, వారికిఁ బిమ్మట కాలభోజుఁడును, గ్రహాదిత్యుఁడు, బప్పారావల్ ఈగ్రహాదిత్యునికుమారుఁడయినట్లును గూడ, అసాపూర్ స్ఫటికశిలాశాసనములయందుఁ గలదు. ఈబప్పారావల్ శ్రీరామునుండి యెనుబదిపురుషాంతరములవాఁ డనియు, క్రి. వె. 714 సంవత్సరప్రాంతముల మోరీశాఖ క్షత్రియులను జయించి, చిత్తూరునొద్ద మేవాడ్ రాజ్యము స్థాపించెననియు, టాడ్ అనుచరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు.

## శిష్యాపరాధః గురోర్దండః:—

శిష్యుఁడు చేసినతప్పునకు గురునకా దండనము? అన్యాకృత్యమని భావము.

ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి.

**శిష్టుకరణములు:—** వీరు గంజాం, విశాఖపట్నము మండలసీమలందునను, ఆంధ్రోత్కలసరిహద్దులసీమలందునను నివసించుచున్నారు. తాము కాయస్థుల మనియు, గౌడబ్రాహ్మణుల మనియు, సామవేదుల మనియు, ఆశ్వలాయన కాత్యాయన సూత్రములవార మనియు, తమ కొఅప్పుడు శిష్ఠకాయస్థు లనియు, పూర్వపథ లౌకికు లనియు, పేర్లుండెననియు నను మన్నారు. వీరియందు మేనరికములు నిషేధములు. వీరు కులబిరుదములుగ పాత్రో, మహాపాత్రో, మజుందారు, పడంగి (తొల్లింటి పడంగవిత్) పట్నాయకుఁడు, (తొల్లింటి పట్టణనాయకో), మహాంతో, పండితో, మంత్రి, బైశకో, గుప్త, రాజదత్త, ధీమంతో, దత్తా (శస్త్రభేదవిద్యాబోధకుఁడు), మహాపత్రిశస్త్రో, పాఠకో (అధ్యాపకుఁడు) అను బిరుదములు గలవు. ఇవి యన్నియు నుత్కలదేశ సంబంధములని స్ఫురించెడిని.

కరణములందు 'శిష్టు' శబ్దము శ్రోత్రియు లగుటఁగల్గినదని చెప్పఁబడినది. ఉత్కలదేశమునకు వీ రేతెంచినపిదపఁ బ్రభువుల సన్మానములం బడసి, గ్రామోద్యోగులుగనుండి, 'పట్టణనాయకో' యను బిరుదముం బడసిరి. కరణ మనిన చేయువాఁడని యర్థము. అనఁగా గ్రామసముదాయకార్యనిర్వాహకుఁ డనిభావము. వీరి కింకను సుమ్మశాను లనియు, సుధన్వులనియు, ఖండపరిఖండ యనియు బిరుదములు కొందఱు గల్గి యుండెనని తెలియుచున్నది. వీరియందుఁబెక్కండ్రు న్వవసాయవృత్తి కలవారు. తెలుఁగు గణిత శాస్త్రవిద్యానిపుణులు. వీరు చిరకాల ముత్కల దేశవాసులుగ నుంట, నచటివేషభాషల నవలంబించినటులఁ దోచెడిని.

కరణములందు శిష్టుకరణములు గాక యింకను పదునే నితరశాఖలు కలవు. అవి ౧ అంబష్టకరణములు, ౨ కనకపిళ్ళకరణములు, ౩ చిట్టికరణములు, ౪ డంబైకరణములు, ౫ నిషాదకరణములు, ౬ మర్జుళ్ళకరణములు, ౭ మతిహాంసకరణములు, ౮ మహాంతికరణములు, ౯ మాగధికరణములు, ౧౦ వైశ్యకరణములు, ౧౧ వైశ్యకాయస్థులు, ౧౨ శ్రీనివాసకరణములు, ౧౩ సూతకాయస్థకరణములు, ౧౪ సృష్టికరణములు, ౧౫ వశిక్కరణములు. కాని వీరితోఁ దమకేసంబంధములు లేవనియు, తమవారు కారనియు శిష్టుకరణము లనుచున్నారు.

వీరిపూర్వోత్తరగాథలం దెల్పుచరిత్రలు లభింపకున్నవి. పండిత డబ్బీరు నారాయణమూర్తిశర్మ గారిచే రచింపఁబడిన 'శిష్టదర్పిని' యనిపేరుఁగల యుపన్యాసమనంబడు చిన్నపుస్తక మొకటియు, కుప్పిలి కృష్ణమూర్తిగారిచే రచింపంబడిన 'ఉత్కలవిప్రవంశదీపిక' యని పేరిడంబడిన చిన్నపుస్తక మొకటియుఁ గాననగుచున్నవి. ఈకుప్పిలి కృష్ణమూర్తిగారు తాము గౌడబ్రాహ్మణులమని వ్రాయుచు, నాగ్రంథమునకే ఉత్కలవిప్రవంశప్రదీపిక యని పేరిడుట వారికింగల యుత్కలాభిమానము వెల్లడియగుచున్నది. ఇంకఁ గమలాకరభట్ట ప్రణీతంబగు చరణవ్యూహమునందునను, హరికృష్ణశర్మప్రణీత బృహజ్జ్యోతిషార్ణవము నందలి బ్రాహ్మణోత్పత్తిమార్తాండము నందునను, వీరి పూర్వగాథ యించుక గాననగుచున్నది.

పద్మపురాణసృష్టిఖండమున బ్రహ్మమానస పుత్రుండగు చిత్రగుప్తుం డయోనిసంభవుండై జన్మించి, ప్రాణుల సదసత్కర్మలను లిఖించులేఖరిగ యమునికడ నియమింపఁ బడెననియు, అతండు బ్రహ్మకాయస్థుండౌట, కాయస్థుం డనంబడెననియు, అతండు దక్షప్రజాపతిసుతం బరిణయమై, విచిత్రగుప్తునిం గనెననియు, నాతండు మనుకన్యయందు ధర్మగుప్తుని, అతండు గాంధారియను భార్యయందు రుద్రగుప్తుని, అతం డప్సరసయందు మధుర, గౌడ, నాగర, నైగము లనునలువురు సుతులం గనెననియు, నందు గౌడునిసంతతివారు గౌడబ్రాహ్మణులైరనియు, వారినుండియే నాదేశమును, పేరం దెననియుం జెప్పఁ బడినది.

ఈసందర్భమున చిత్రగుప్తశబ్దమున కర్థము. (గుప్తచిత్రము) గోప్యము లేక అన్యులెరుంగని చిత్రము అని యైయున్నది. బహుశః ఇది ఈ మహనీయుని యుద్యోగనామమేమొ.

ఇట్లేర్పడిన గౌడబ్రాహ్మణ - శిష్టుకరణశాఖ యందు ౧ అంగిరస, ౨ ఆత్రేయ, ౩ ఉలూకాయన, ౪ ఔలక, ౫ కస్యప, ౬ కాలబవ, ౭ కుండిన, ౮ కౌశిక, ౯ గౌతమ, ౧౦ చకిత, ౧౧ ప్రతీశ్వర, ౧౨ పరాశర, ౧౩ బభ్రువర్షి, ౧౪ బృహదగ్నిర్షి, ౧౫ భారద్వాజర్షి, ౧౬ మనుర్షి, ౧౭ ముద్గలర్షి, ౧౮ యాజ్ఞవల్క్యర్షి, ౧౯ వశిష్ఠర్షి, ౨౦ వాలకాయనర్షి, ౨౧ శంఖర్షి, ౨౨ శాండిలర్షి, ౨౩ శాలజ్ఞాయనర్షి, ౨౪ శాలావతర్షి, ౨౫ శావినర్షి, ౨౬ శ్రీవత్సర్షి, ౨౭ శుంగర్షి, ౨౮ హారితర్షి, ౨౯ ఆలికేశ్వరఋషిగోత్రము లిరువది తొమ్మిది గాననంబడుచున్నవి. ఇంకను బ్రాహ్మణోత్పత్తిమార్తాండ మను గ్రంథమున గార్గ్యవత్స, భార్గవ, జమదగ్ని, కౌత్సుక లేక కౌతుక, విశ్వామిత్ర, పులస్త్య, అగస్త్య గోత్రము లెన్మిదిఁ గూడ వీరియందుఁ గలవని చెప్పఁబడుటయే గాని యాగోత్రములవా రిక్కాలమున వీరియందుఁ గానఁబడుటలేదు. (ఆయాగోత్రములు వేర్వేఱు తావులందు చూడనగును). వీరియందు 93 ఇంటి పేర్లు కలవందురు. ఇంటిపేరు లాంధ్రదేశమునకుఁ జేరినపిదప సంభవించియుండనోపు. అందుఁ బౌరుష నామసంబంధములుగను, పూర్వులగుఘనుల సంబంధములుగను, గ్రామనామములుగను, గన్పించుచున్నవి. వాని నాయాగోత్రములకడనే చూడనగును.

**శిష్టుకృష్ణమూర్తికవి:**—ఆంధ్రకవితనే కాక సంస్కృతకవిత్వమును చక్కఁగఁ జెప్పనేర్చిన పండితుఁడు. కాసలనాటిశాఖబ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు, వశిష్ఠసగోత్రుఁడు. తండ్రిపేరు సర్వశాస్త్రి; తల్లి గవరమ్మగారు, జననము పిఠాపుర ప్రాంతమున రాపర్తి యనుగ్రామమునం దనియు, శ్రావణబహుళ అష్టమిరాత్రి జననమనియు, అది

క్రీ. శ. 1796–1800 నడుమ ననియు, ఆంధ్ర విద్యావాచస్పతి కొ్మట శా్ర స్త్రిగారు వివరించిరి. వీరు సాహిత్యపరులనియు, వ్యాకరణ ముంజధివినవారనియు వారే వివరించిరి. గొప్పసం గీతవిద్వాంసుఁడఁట. తండ్రి దత్తుఁడనియు, పితామహుఁడు గోవిందుఁడనియు, ప్రపితామహుఁడు నర్సంభొట్లనియు తెలుచున్నది. వీరు రచించినవి ఇరువదియొక్కగ్రంథము లందురు.

౧ వేంకటాచలమాహాత్మ్యము, ౨ సర్వకామదాపరిణయము. (ఇది రామచంద్రపురము జమీందారులలో నొకరగు కాకర్లపూడి పద్మనాభరాజుగారికిఁ గృతిగ రచింపబడెఁగాని, యట్లు జరుగలేదు.) దీనికొకకథ నీప్రాంతములందుఁ బ్రచారమందియున్నది. ఈసీమయందే కుయ్యేరుగ్రామ కరణముగా నుండిన పిండిప్రోలు లక్ష్మణరాజుగారనునొక విద్వత్కవి నియోగిబ్రాహ్మణుఁ డుండువాఁడట. కృష్ణమూర్తి కవిగారికి నియోగులందసూయతయు, ద్వేషమును గల్గియుండుకతన లక్ష్మణరాజుగారియనకుఁ బ్రతిస్పర్ధిగనుండువాఁడు. సభయందు వారికి వాదప్రతివాదములు జరుగుటతోఁ గృతియిచ్చుట జరగక నిలచిపోవ, రోషావేశమున నీకృష్ణమూర్తిగారాసభయందు పనిజరగకపోయె నందురు. ౩ హనుమచ్ఛతకము, ౪ పంచతంత్రము, ౫ వసుచరిత్రకు వ్యాఖ్య రచించుట, ౬ స్త్రీనీతిశాస్త్రము, ౭ దీక్షారణ్యమాహాత్మ్యము, [ఇది గోదావరిజిల్లాకలక్టరు కచేరీ శిరస్తదారుగనుండిన తుళసింగశ్రేష్ఠిగారికిఁ గృతి] ౮ కంకణబంధము, ౯ యక్షోల్లాసము, (సంస్కృతము), ౧౦ వల్లపీపల్లవోల్లాసము, ౧౧ మదనాభ్యుదయము, ౧౨ చంద్రహాసోపాఖ్యానము, ౧౩ మాణిక్యాంబశతకము, ౧౪ నాటకదీపము, ౧౫ నానార్థశబ్దకోశము, ౧౬ అనంగవిపియము, ౧౭ ఆంధ్రపుష్పబాణవిలాసము, ౧౮ శ్రీవేణుగోపాలశతకము, ౧౯ నీలశైలనాధీయము, ౨౦ అశ్వశాస్త్రము హారికవికృతము లుగఁ దలఁపఁబడుచున్న హారికారికలకు వృత్తి ఉదాహరణముల నీయన రచించెనందురు.

ఇంకను వీరు రచించిన వనేకచాటువులు కలవఁట. వీరు క్రీ. శ. ౧౮౯౦ లో మాదుగుల యందు మృతినొందిరని చెప్పఁబడినది. వీరికి సర్వశాస్త్రికవి సుతుండు. (శిష్టుసర్వశాస్త్రికవి చూడుఁడు.) (అధర్వణ కారికలు; హారికారికలు చూడుఁడు.)

శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిలవారి
క్షత్రియకులగోత్రములం గూర్చిన

సీసమాలిక.

ఇం దైదు గోత్రములు, ౧౨౯ ఇంటిపేరులును, వివరింపఁబడినవి. ఈపండితుఁడు తూర్పుగోదావరీమండలమున రామచంద్రపుర సంస్థానమున క్షత్రియప్రభునికడ నాస్థానవిద్వాంసుఁడుగ కొంతకాల ముండినవాఁడు.

శ్రీపయోధరసర నీజమిళద్భృంగ
కరసంగతరథాంగ ఖగతురంగ
రమణీయమాత్రిలింగమహీతలములోని
క్షత్రియగోత్రముల్ సరవి వారి
గృహనామములును సాంగీకారభంగిగా
సీసమాలికఁ జేతుఁ జిత్తగింపు
అందు వశిష్ఠ కశ్యప ధనంజయ భరద్వాజ కౌండిన్య గోత్రంబు లైదు
ప్రవిమలకీర్తిసాంద్రము పూసపాటి
సంజ్ఞము, వత్సవాయి, కాకర్లపూడి,
సాగి, మంతెన, గుర జాల, నడిమిపల్లె
గణపతిరాజును, గాదిరాజు

సాగిరా జడ్డూరు వేగేశనయు, రుద్రి
రాజు, చోడ్రాజు, బుర్రాజు చెరుకు
వాడ పిన్నమరాజు, వాడపల్లెయు చిరు
వూరు, భైరాజు జిందుకూరు యిసుక
పల్లె ధేనువుకొండ, బాలరా జల్లూరు
పొత్తూరు సామంత పూడి పేరి
చెర్ల కొలుకలూరు, చేకూరు, బెజవాడ,
సకినేడు, కోసూరు, చల్లగళ్ళ
వలివర్తియును గొడవర్తి యిమ్మనరాజు
రావిపాడుకునంత రాజు వేట
కూరు, ములగపాడు, కొచ్చెర్లపాడును
వేజెర్ల అయ్యప రాజు దెందు
కూ రంగరాజన గొమరొప్పుచుండును
ధాత్రిపై వాసిష్ఠ గోత్రమునను
నలుబదియాఱుసంతతులు; కౌండిన్యగో
త్రమ్మున సంతతుల్ తొమ్మిది సరవిని [కలి
దిండి చిటార్జు న ద్దేపల్లి ముదునూరు
సరిపల్లె వర్ణాట, జంపెనయును
వేముల, మందయు, చేమర్తి, యైనమ
పూడి, నా విశ్రుతం బులు ధరిత్రి
ధానంజయాఖ్యసం తతి కోట, జంపెన,
దాట్ల, నల్లపరాజు, దంతలూరు
పాకనా డల్లభూ పతిరాజు, చింతల
పాడును గోకైర్ల పాడు, కంకి
పాడును, పెనుమత్స, తోటకూరయు, రుద్ర
రాజును, కమ్మెల, సాగిరాజు, గాది
రాజును, తిరుమలరాజును, చెరుకూరు,
పచ్చమట్లయును, జంపాటి, దండు
కొండూరు, కొవ్వూరు, గొట్టిముక్కలయును,
వీపూరు, కొప్పెర్ల, వేగిరాజు,
గుంటూరు, మద్దాల, కొత్తపల్లెయును, చే
కూరు, పల్లె కొలనువాడ
కూసంపూడియు, మరి దోసపాడును వేటు
కూరును, జుజ్జూరు, గోకరాజు
నుద్దరాజుడ్డాయును, ముదుండియును
వానపాలు, భైర్రాజు భేతాళనున్న
వడ్లమూ డ్గూడూరు వరుసతో గంతేడు
వార్లను పేర్లతో వసుధనొప్పు
నెన్నగా నలువదియేఁడు; కాశ్యపగోత్ర
భవములు, పదిరెంట బరగు మంద
పాడు, గోరెంట, యి ప్పలపాడు, సంయప
రాజు, సంబూరు, గండ్రాజు పాత
పాడును, ఈదర పల్లె, కఠారి, బె
ల్లముకొండ, కనుమూరు లకమరాజు
నన నొప్పుచుండు; నయ్యజ్ఞాతగోత్రోద్భ
వంబులు పదియైదు వసుధలోన
నీవనరాజును దైవనాలయు నోరు
గంటియు, నఁయ్యూర్యరు, గరికపాడు
పెమ్మరాజు, విసియు ముమ్మనరాజును,
పోచిరాజును, వడ్లమూడి బొమ్మిడ
లచ్చిరాజు, వెలగవేటి, దుర్గరా
జమలరాజను, పేర్ల నమరుచుండు
అలభరద్వాజగోత్రస్రుపా న్వయములు
కానరా విపుడు నాల్గు ఘనతఁజెందు
రహి పరిచ్ఛేదములును కర్ణాటకోట
కాశతులు ననుసంజ్ఞలు క్రమము మీఱు.
(ఆంధ్రదేశ క్షత్రియులు చూడుఁడు).

**శిష్టు సర్వశాస్త్రికవి:**— ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. తండ్రిపేరు శిష్టు కృష్ణమూర్తి కవి. (చూడుఁడు). రచించినది అమరుకము (ఆంధ్రపద్యరూపమున) కావ్యముగ నొనర్చి శ్రీకాళహస్తి సంస్థానాధీశ్వరుని కంకితమొనర్చెను. ఇది యీయనతం

ద్రీయు మహావిద్వత్కవియు నగు కృష్ణమూర్తి శాస్త్రిగారు రాయాస్థానమున (౧౬ వత్సరములు) పండితుఁడుగా నున్నకాలమునఁ గానోపు.

## శీఘ్రకగోత్రము:—

(నిధ్రువగణము చూడుఁడు.)

**శీఘ్రగుఁడు:**—ఇక్ష్వాకుసంతతి సూర్య వంశక్షత్రియుఁడు. తండ్రి శంఖణుఁడు. సోదరులు సుదర్శనుఁడు, అగ్నివర్ణుఁడు.

**శీతలకుంభకము:**— నాల్కను వెలుప లకు చాచి, నోటితో వాయువుఁబీల్చి నోరుమూసి లోన వాయునిరోధ మొనర్చి కుంభించుట (పిదప రెండుముక్కురంధ్రములగుండా రేచింతురు). ఈ యభ్యాసమున సమస్తరోగనివారణ మగుననియు, క్షుత్పిపాసలబాధ తగ్గుననియు, విషముసైతము బాధింపనిశరీరపటిమ గల్గుననియుఁ జెప్పఁబడినది.

కొందఱు దీనికిఁ బ్రకారాంతరముగా నాలుకను దంతములలోపుననే యిమిడ్చియుంచి (ఆకుంచ నము చేసి) ఆనాలుకగుండా పూరించుదురు. ఇందు వలన నాల్కయందుఁ జల్లదనము గల్గి క్షుత్పిపాసలు, నిద్ర, అలసట లేకుండ, శరీరబలము గల్గించునం దురు. మఱియు నీయభ్యాస ముష్ణకాలమునం దతి సౌఖ్యకర మనుచున్నారు.

(అష్టాంగయోగములు చూడుఁడు.)

**శీతలనాథుఁడు:**—జైనతీర్థకరులలో నొ కఁడు. (తీర్థకరులు చూడుఁడు.) వీరి చిహ్నము కల్పవృక్షము. ఇక్ష్వాకువంశక్షత్రియుఁడు. తండ్రి పేరుదృఢరథరాజు. తల్లి సునన్దాదేవి. జన్మస్థానము భద్రికాపురి (ఇప్పటిభాదీయనగరము. భాగల్పూర్ నకుఁ దూర్పుగా నెన్మిదిమైళ్ళు) పొడవు ౯౦ ధను స్సులు (ధనస్సు మూఁడున్నరమూరలు). సువర్ణ చ్ఛాయ. ఆయువు ౧ లక్ష. గణధర్ సంఖ్య ౧౮. నిర్వాణస్థలము సుమేరుశిఖరము. (శిఖరీజీ లేక అర్బుదశిఖరము). ౧ కోటిఅగర్లో. ౪౦౦ సాగర్ ౩౮ లక్షల ౨౭ వేలసంవత్సరములు లోటు. అంతరాళ్ (కాలాంతరము).

**శీతలాప్రస్తరన్యాయము:**— చలువ రాతిని విగ్రహములుగఁ జేసి పూజింతురు. పల కలుగఁ జేసి నేలంబఱచి వాటిపై నడుచుచుఁ ద్రొక్కుచుందురు.

గౌరవముగాని, యగౌరవముగాని మనుష్యుల భావనముం బట్టియే కల్లునుగాని, వస్తుతః కాదని భావము.

**శీతలాసప్తమి:**—శ్రావణబహుళసప్తమి. ఉత్తరదేశముల శీతలాదేవిం బూజించుపర్వదినము. శీతలాదేవి మశూచకదేవత యని యెఱుంగునది. (పండుగలు చూడుఁడు).

## శీతాంగసన్నిపాతము:—

(సన్నిపాతదోషము చూడుఁడు).

**శీతోష్ణములంగొలుచు యంత్రములు:**— శీతోష్ణములంగొలుచు యంత్రములు మూఁడు ప్రపంచమున వాడుకయందు న్నవి. వాటికి సర్వసామాన్యముగ 'తెర్మోమీటర్' (Thermo meter) అని వాడుక గలదు. ఆంగ్ల సీమలందు విస్తారముగ వాడుకయందున్నది ఫారన్ హీట్ తెర్మోమీటరు (Fharen heit Thermometer). అది యమెరికాసంయుక్తరాష్ట్రము లందుఁగూడ నెక్కువగ వాడుకనందియున్నది.

ఇది క్రీ. వె. ౧౭౦౪ సంవత్సరమున వాడఁ బడుట ప్రారంభమని చెప్పవచ్చును. సర్. ఐజాక్ న్యూటననుపేరుగల యాంగ్లేయుఁడు తాను కని

పెట్టినట్లు దీనింగూర్చి Philosophical Transactions for 1701' అనుదానియందు వివరించి యున్నాఁడు. అం దాతఁడు ప్రారంభము నీరు మంచుగడ్డగ ఘనీభవించున దాది యనియు, నీరు ఉడుకునట్టివేఁడి కడ యనియుఁ దలంచెను. కాని, పిదప నాతఁడు ప్రారంభించినతా విప్పటి ౧౨ డిగ్రీలకడనని తోఁచెడిని. దానినాతఁడు మానవశరీరఁపు (Blood heat) వేఁడిగఁ దలంచి యుండెను.

న్యూటన్ పండితుఁడు Freezing point (నీరు మంచుగడ్డ యగు హద్దు) మొదలు, శరీర వేఁడిమిహద్దు (Boiling point) వఱకు పండ్రెండు భాగములుగ విభజించియుండెనఁట.

పిదపఁ గొంతకాలమునకు ఫారన్హీట్ అనుపండితుఁడే యంత్రనిర్మాణముం జేపట్టి న్యూటనుపండితుఁ డొనర్చిన పండ్రెండుభాగముల నిరువదినాల్గు భాగములుగ నొనర్చియు, అంతమునందు న్యూటన్ పండితుఁడు వాడుచుండిన అవిసెనూనెకు బదులు పాదరసము బ్రయోగించియు, నిట్టి పెక్కు మెరుగులం గల్గించి, దానిని పరిపూర్తిగ రచించెను. నేఁటికి నాతని పేరంబరఁగుచు, ఫారన్హీట్ తెర్మోమీటరనుపేర నొప్పుచున్నది. తెర్మోమీట రన శీతోష్ణములకొలత యనియర్థము. ఈఫారన్హీటు తెర్మోమీటరునం దిప్పు డుప్పు మంచు కలిసి ఘనీభవించు తావును 'జీరో' (Zero) యనియును, దీనికిపైని ౩౨ డిగ్రీలకడ నీరు ఘనీభవించుతావు (Salamnoniac) గను, ౯౮ డిగ్రీల నాల్గుపాయింట్లకడ శరీరఁపువేఁడి (Blood heat) గను, ౨౧౨ డిగ్రీలకడ నీరుడుకువేఁడి (Boiling point) గను చూపెడిని.

పిదప ఫ్రెంచిదేశమునను, ఫ్రెంచిసీమలందును, మఱికొన్ని యితరదేశములందును సెంటిగ్రేడు (Centigrade) తెర్మోమీటరు వాడుకయందున్నది. ఇదియును నెక్కువగనే వాడఁబడుచుంట తెలియవగును. దీనియందు నీరు ఘనీభవించు (Ereezing point) Zero (జీరో) ప్రారంభముగను, 3౭వ డిగ్రీకడ శరీరపువేఁడి (Blood heat) గను, ౧౦౦వ డిగ్రీకడ నీరుడుకు నట్టివేఁడి (Boiling point) గను, గానవయ్యెడిని. నీరు ఘనీభవించుటకన్న నెక్కుడుగ శీతలముండు నెడ దానిని 'Bilow Zero' గా లెక్కింతురు.

జర్మనుసీమలందునను, ఆప్రాంతదేశములను వాడుకయందుండునది 'రిజొమర్' [Reumor Thermometer] అనఁబడును. ఇందు నీరు ఘనీభవించుతావు 'Zero' అనియును, దానికి పైన ముప్పదిడిగ్రీలకడ శరీరసామాన్యఁపు [Blood heat] వేఁడిగుఱుతును, ఎనుబదిడిగ్రీల కడ నీరునుడుకజేయువేఁడిగుఱుతును గన్పించెడిని. దీనియందునను అతిశీతలమును 'Below Zero' అని యెంచెదరు.

ఈ మూఁడు తెర్మోమీటర్ల చిత్రమును చూచిన వీట్లతేడాలు కానవయ్యెడిని.

ఇంక జ్వరముతగిలి శరీర మతివేఁడెక్కినతటి నాయుష్ణప్రమాణమును గొలువ 'Clinical Thermometer' అని [క్లినిక త్రెర్మోమీటరు] అను నొకటి ప్రత్యేకముగ నిర్మింపఁబడి యిందు మూలమున శరీరమున మామూలుగనుండు వేఁడి ౯౮ డిగ్రీల ౮ పాయం ట్లనియు, దానికెక్కువగ నున్న జ్వరమనియు, నందుకు తగ్గియుండిన వాత లక్షణ [Sub-normal] మనియు నెఱుంగుచున్నారు.

**శీతోష్ణముల కద్దము పగులుట:**—దీపముల యద్దపుఁ జిమ్నీగొట్టములు, గాజుగళాసులు, వేడినీటిని లోనంబోసిన పగులుచుంటయు నధిక వేడికి పగులుచుంటయు పెక్కుండ్రెఱిఁగి యుందురు. ఇటులనే మంచుంబోలిన శీతలస్థితి గలవాటిని లోనఁబోసినను, అతిశీతలవాయువు నట్టివాటిని బహిరంగపఱచినను నవి పగిలిపోవుచుంటయుఁ గల్గుచుండును. దీనికిఁ గారణ మా శీతోష్ణములని పెక్కుండ్రు పొరఁబడవచ్చును. ఇందలి నిజకారణ మరయవలెనని Heat expends bodies and cold contracts them అను నాంగ్లరసాయనికశాస్త్రధర్మమును మనసునం దుంచుకొనవలసియుండును. ఒకగళాసునం దుష్ణముగల ద్రవముగాని, శీతలముగల ద్రవముఁగాని పోయుటవలన దానిలోపలిభాగమున వాటిగుణమగు పెరుఁగుట (expending) సంభవించుటయో యనఁగా వికాసావస్థనందుటయో లేక ముడుచుకొను సంకోచావస్థనందుటయో సంభవించెడిని కాని యాగాజుగళాసుయొక్క వెలుపలిపొరయం దేమార్పు సంభవింపదు. గాజు. ఇట్టి యిఱుకులందు పగులుటయే గతిగాన పగులును. ఇంక దీపఁపుఁ జిమ్నీలో దీపముండుట లోననే వేడియెక్కునుగాని వెలుపలిపొరయందు కలుగక పగులనోపు. వాటికి మంచుంబోలిన శీతలోదకమున వాటిని ముంచిన నవి పగులఁజాలవు. అట్టి తరి మఱియు వాటింగాచి లోపల వెలుపలఁగూడ వేఁడిని గల్గించినను పగులక నిలువఁ గలిగి యుండెడిని.

**శీతోష్ణములు, కార్యములు:**—శీతోష్ణము లొనర్చుకొన్నికార్యము లద్భుతములుగ నుండెడిని. 'వేడి వస్తువులను సాగఁజేయును. శీతలము వస్తువుల ముడుచుకొనఁజేయును'అను సంకోచవికాసములసూత్రముపై నాధారపడి యీవిపరీతములు నడుచుచుండునని పరిశీలకు లనుచుందురు.

అమెరికాసంయుక్తరాష్ట్రముల ప్రజాప్రభుత్వఁపు టగ్రాసనాధిపతిగారి కార్యస్థానములగు రెండు ప్రజాప్రతినిధిమహాసభలు గూడునట్టి 'కాపిటోల్' అనుగొప్పభవనము కలదు. అది వాషింగ్టను నగరమున నడుమగా నిర్మింపఁబడినది. దానిపై నిర్మింపఁబడిన గొప్ప Dome పై కప్పునుండి యొక తీగెయు, ఒక (ఒడంబను) బంతియు వ్రేలాడఁదీయఁబడి, యట గొప్పపరిశీలనలు శాస్త్రజ్ఞులచే జరుపఁబడినవి. వారు సూర్యోదయాది నెండచే వేడిచేయఁబడుచు, వికాసస్థితినందుచు oval గా నాఱంగుళములు కదలుననియు, రాత్రి శీతలవాయువులకు సంకోచస్థితిగ్గ్రి తిరుగ న్యాయారంగములు కదలి యథాస్థానమునకుఁ జేరుచుండుననియు, పోల్చియున్నారు. ఇది డోములోపలి తీఁగకు వ్రేలాడఁదీయఁబడిన ఒడంబఁపుబండియుం దిముడ్చఁబడిన పెన్సలుగీతలనుండి యడుగున నిడఁబడినకాగితముపై పడు గీతలనుండి చూడనగుచున్నదఁట.

మఱియు నాపురముననేగల వాషింగ్టన్ మాన్యుమెంటును, ఇట్లే కొంచెము, ఒరుగుచు తిరుగ యథాస్థానమునకుఁ జేరుచుండుట యత్నాములుగఁ జూచుచుందురు. న్యూయార్కునగరమున బ్రూక్లిన్‌బంతెన (Brooklyn Bridge) అనుదినము పైకిలేచుచు, తగ్గిపోవుచుండును. ఇదియు శీతోష్ణము లొనర్చు సంకోచవికాసకార్యములుగఁ బోల్చఁబడి, దానికిఁ దగిన జాగ్రతపరికరములు, ప్రతీకారములుగ నావంతెన యందే యమర్చఁబడియున్నవి. ఈసంకోచవికాసముల నందుచుంట నీకట్టడములమహాన్నత్యము

(కడుఎత్తుగనుంట) వలనఁ గల్గినదనియు, నెత్తు తక్కువనుండుకట్టడముల కీయవస్థ లుండవనియుఁ దలంపఁబడుచున్నది.

## శీతోష్ణవర్ష వాతావరణాది పరిస్థితులు:

— ఒకసీమయందలి చల్లఁదనము, వేఁడి, వర్షపాతము, వాతావరణము మొదలగు పరిస్థితుల కన్నిటికిని సాముదాయికముగ నాంగ్లమున 'క్లైమెట్' (climet) అనియెదరు. వీట్లకుఁ గారణము లాఱనియు, వాట్పై నాధారపడి క్లైమెటుండు ననియు, నాంగ్లవాతావరణశాస్త్ర వేత్తలనెదరు.

అవి ౧ భూమధ్యరేఖనుండిగల దూరము. అనఁగా భూమధ్యరేఖకు సమీపమగుట, వేఁడి మియు, దూరమగుకొలఁది శీతలము, నధికమని చెప్పఁబడినది. ౨ సముద్రమునుండి కలదూరము. అనఁగా సముద్రమునుండి దూరమగుకొలఁది 'dry' అనియు, 'extreme' అనియుఁ జెప్పఁబడినది. 3 సూర్యకిరణప్రసారము- సూర్యరశ్మి యెదురుగఁ దగులుట వేఁడిప్రదేశముగ నుండెడిని. దీనిని స్లోపనియు సందురు. ౪ ఎత్తు- (altitude) అనఁగా సముద్రంపు నీటిమట్టముపై నెంతయెత్తున నాప్రదేశ ముండునో యంతచల్లఁదనమును, వర్షపాత పరిస్థితియు, నారోగ్య స్థితియు నుండునని చెప్పఁబడినది. ౫ ఆప్రాంతంపుఁ బర్వతపంక్తులు కల్గించుపరిస్థితి కొన్నిసీమలందు వీచు శీతవాయువులు, ఉష్ణవాయువులు, ప్రచండవాయువులు వీవకుండ పర్వతము లడ్డుండుట మొదలగుకారణములు. ౬ అట్లు వీచు వాయువులదిశల పరిస్థితులు క్లైమేటునకుఁ గారణములని చెప్పఁబడినది.

ఇట్టి క్లైమేటు నెన్మిదిభేదములుగలదిగ విభజించియున్నారు.

౧ భూమధ్యరేఖ, దానిపరిసరములం దొకేవిధముగ (మార్పుఁ జెందక) నిలచియుండు నెక్కువవేఁడి. ఇట సంవత్సరముపొడవునను, నొకే వేసవి.

౨ ట్రాపిక్సు నంటి యధికవేఁడి నధికమైన యెండు స్థితులుగల పశ్చిమప్రాంతముల పరిస్థితి.

3 ఎక్కువవేఁడి, అధికవర్షములు గల తూర్పు ప్రాంతముల పరిస్థితి.

౪ సబుట్రాపికలు సీమలందుండు వేసవివేఁడి. వింటరువర్షములుగల మెడిటరేనియను పరిస్థితి.

౫ సబుట్రాపికలు సీమల తూర్పుభాగములనుండు వేఁడి తక్కువవర్షములుగల పరిస్థితి.

౬ టెంపరేటు క్లైమేటు సమానపరిస్థితి.

౭ ఉత్తరదేశములందుఁగల తక్కువతేమ వేసవి నధిక శీతముగల వింటరుకాలముగల ఆర్కిటిక్కుపరిస్థితి.

౮ భూవాయువులువీచు వేసవి సముద్రఁపువాయువులు వీచు wet season, ఎక్కువవర్షములు, పొడిగాలిగల శీతకాలముగల పరిస్థితి.

**శీతోష్ణస్థితి (Climate):**. - ఒకస్థలముయొక్క శీతోష్ణస్థితిని 'Climate' అనెదరు. ఒకస్థలము మనుష్యుల కారోగ్యమో, యనారోగ్యమో యెఱుఁగుట శీతోష్ణస్థితి నెఱుంగుటయం దీపదము వాడఁబడుచుండును.

## శీలములు (పంచశీలములు) లేక బౌద్ధశీలములు:

—బౌద్ధమతమున ౧ అహింస, ౨ సత్యవ్రతము, 3 అదత్త, దానపరిగ్రహము. ఇతరులు తమంతతామే కోరి యీయనిదాన

మును పరిగ్రహింపకుండుట), ४ పరదారగమనవర్జ వ్రితము, ५ సురాపానవర్జనశీలము, ఇవి యనలం బింపవలసిన పంచశీలములు.

## శీలానుస్మృతిః—

(దశబౌద్ధానుస్మృతులు చూడుఁడు.)

**శ్రీకాకుళం:**—కృష్ణాజిల్లా, మచిలీపట్టణ ప్రాంతముననున్న యొకగ్రామము. ఇచట నున్న యాంధ్రనాయకస్వామిదేవళము ప్రసిద్ధము. మఱి యు గంజాముమండలమున, నాగావళీనదీతీరమున నొక శ్రీకాకుళ మనుపట్టణము కలదు. దాని తొల్లింటిపేరు గుల్షనాబాద్. ఇట తొల్లింట టపా సంచులసీళ్ళు తెఱచి, వేర్వేఱు మార్గములకుఁ బంపఁబడులేఖలను వేఱుచేసి పంపుతావుగ నుంట, శిక్కా-ఖోల్. (శిక్కా=శీలు; ఖోల్=తెఱచుట) అని పేరు వాడుకయుండెనఁట. మహమ్మదీయాధి కార మంతరించి, నానాఁటికి శిక్కా-ఖోలు చికాకో లగుటకుఁదోడు శ్రీకాకుళముగఁగూడ మాఱెను. ఇప్పు డీరెండుపేర్లు వాడఁబడుచున్నవి.

**శ్రీకారము నుపయోగించు విధములు:**— పద్యకావ్యప్రారంభము లందేమి, గద్యకావ్య ప్రారంభములందేమి, కావ్యమునం దలి ప్రత్యాశ్వాస ప్రారంభమునందేమి, సర్వపాప హారంబున కనియు, శోభాయమానప్రదమగుట కనియు, మంగళకరమగుట కనియు, కావ్యగౌరవ మున కనియు, 'శ్రీ' కారము వాడుకయం దుండు టకుఁ గారణములుగా లక్షణకర్త లెన్నెన్నియో యుపపత్తులం జూపియున్నారు.

ఇట్లు శ్రీకారముంగూర్చిన యుపయోగము పట్ల చెప్పఁబడిన పెక్కువిషయము లటుండనిచ్చి, ఉత్తరములు వ్రాయునపు డీ 'శ్రీ' కారముం గూర్చిన సంప్రదాయమును, తచ్ఛ్లోకవిషయము లును పరిశీలింతుముగాక!

1 తనసుతునకు జాబువ్రాయునపు డొక్క శ్రీకా రము వ్రాయవలెను.
2 తనచెలికానికి జాబువ్రాయునెడ రెండుశ్రీకార ములు వ్రాయవలెను.
3 తనతో సమునకు జాబువ్రాయుచో మూఁడు శ్రీకారములు వ్రాయవలెను.
4 తనశత్రునకు జాబువ్రాయు నవసరమున నాల్గు శ్రీకారములను,
5 తనగురునకు వ్రాయుపట్లనైదుశ్రీకారములను,
6 తన్నేలుదొరకు (తనప్రభునకు) వ్రాయుపక్షమున నాఱుశ్రీకారములను,
7 భూపాలునకు వ్రాయునపు డేడు శ్రీకారము లను వ్రాసి జాబు ముగింపవలెనని పెద్దలు సూచించియున్నారు.

ఈక్రిందవివరించినపద్యము గుర్తింపఁదగును.

"ఒకటి సుతునకు, చెలికాని కొప్పు రెండు
మూఁడుసమునకు, వైరికి మూఁడునొకటి,
ఐదు గురునకు, నేలిక కాఱు శ్రీలు
ఏడు భూపాలున కిల నేర్పడంగ."

**శ్రీకాళహస్తిక్షేత్రము:**— ఆంధ్రదేశ మునఁ జిత్తూరుమండలమునఁగల సుప్రసిద్ధశివక్షే త్రము. సువర్ణముఖీనదీతీరము. సువర్ణముఖరి యనియు, మొగలేరు (మొగలి × ఏరు) అనియు నీనదికి నామాంతరములు కలవు. ఈసుప్రసిద్ధ క్షేత్రమునందలి దేవాలయము గొప్పది. శ్రీ యనిన సాలెపురుగును, కాళ మనిన పామును, హస్తి యనిన ఏనుఁగును గాన నిట శివలింగమునం దీనాల్గుచిహ్నములు కలసియుంట, దేవుని నిట శ్రీకాళహస్తీశ్వరుఁ డనుటయే సమంజసము.

శివలింగము చివర సద్యోజాత, అఘోర, వామదేవ, తత్పురుష ముఖంబు లైదును గలవు. అవి పంచసర్పముఖంబులుగఁ గూడఁ దనరెడిని. తక్కినది సర్పశరీరముగ నుండును. కొననుండి యడుగు దనుక తెల్లపట్టె లేనుఁగుదంతములవలెఁ గన్పట్టెడిని. అడుగున సాలెపురుగుంబోలిన యాకృతిఁ గాననగును. తొల్లింట సాలెపురుగు, పాము, ఏనుఁగును తపంబొనర్చి పరమేశ్వరుని మెప్పించి శివైక్యముం జెంద నిట శ్రీకాలహస్తీశుండని పేరు కల్గెనట.

తొల్లింటికాలమున నీక్షేత్రమున వసిష్టుం డను నొకమునియు, నగస్త్యుండును దపంబొనర్చిరని చెప్పఁబడినది. కన్నప్పయనుబోయఁడు శ్రీకాళహస్తీశుని భక్తుండై యరణ్యమధ్యమందున్న నీశివలింగము నర్చించినటులఁ జెప్పఁబడినది. ఆతని విగ్రహము దేవళద్వారమండపముకడ నుంచియున్నారు. వైభవోపేతమైన యీదేవస్థానమున కన్నప్ప యర్చించినకాలము శంకరభగవత్పాదులకుఁ బూర్వమే యని తేలుచున్నది. శంకరాచార్యవిరచిత శివానందలహరిలో 'మార్గావర్తి' యను శ్లోకమున ప్రశంస చూడుఁడు.

శ్రీకాళహస్తీశుఁ డుండిన పవిత్రస్థలింజుట్టి యుండిన తొల్లింటి యడవికి 'అఖండబిల్వకానసం' బని యక్కాలమున వాడుకయుండెనట. ఇప్పుడాచెట్టొకటి ధ్వజస్తంభముకడ పంచలింగేశ్వర శివలింగము సమీపమునం దున్నది. ఈమారేడు చెట్టు (ఆకులు) దళములు కాడ కెన్మిదిమొదలు పదమూఁడువఱ కుండునఁట. ఈక్షేత్రప్రాంతమంతయు తుమ్మిచెట్లమయముగ నుండును. ద్రోణపుష్పములు (తుమ్మిపూల) దండల నిట బహునేర్పరితనముగా గ్రుచ్చి విక్రయించుచుందురు. ఇచటఁ గనఁదగినవిశేషము దేవాలయములోని యర్చకులుసహా శివలింగమును తాకుటలేదు. అభిషేకము మాత్రము శంకుతో నెత్తి శివలింగముపైఁ బోతురుగాని తాకరు. భస్మము నలందుట, చందనాదు లర్పించుట మొదలగు నుపచారములు వేఱొకకవచమునందే గాని, శివలింగమున కొనర్చు పద్ధతి లేదు.

సూర్యపుష్కరిణి యనంబడు నూతినీరు లోని వాడుకలకుఁ బవిత్రమని చెప్పఁబడినది. దేవాలయ ప్రాంతమునఁ గొన్ని లోవలు కలవు. అందు సరస్సులు, శివలింగములు, వృక్షములు, లతాగుల్మములు గలవు. అవి తొల్లింటి ఋష్యాశ్రమఁపుఁదావు లందురు. అందు సహస్రలింగకోన చాల ముఖ్యమైనది. అన్నియు మనోహరములై దర్శనీయములుగఁ దనరెడిని.

పృథ్వీలింగము కంచి ఏకాంబరనాథుడనియు, జలలింగము శ్రీరంగమునందలి జంబూకేశ్వరుఁడనియు, తేజోలింగ మరుణాచల (తిరువణ్ణామలై) అరుణాచలేశ్వర శివలింగమనియు, వాయులింగము శ్రీకాళహస్తీశ్వర శివలింగమనియు నాకాశలింగము చిదంబరమునందలి నటేశ్వర శివలింగమనియు నిట్టిపంచభౌతిక లింగములలో నొకటిగఁ జెప్పుదురు.

**శ్రీకీర్తితాళము:—**

(తాళములు చూడుఁడు.)

**శ్రీకూర్మము:**—ఆంధ్రదేశమున గంజాం మండలములోని శ్రీకాకుళముసమీపమునఁ గల విష్ణుక్షేత్రము. తొల్లింట నిది శివక్షేత్రమైయుండ, రామానుజులచే మార్చఁబడిన విష్ణుక్షేత్రమని ప్రతీతి కలదు. ఇట కూర్మనాథుని దేవస్థానము కలదు. పురాణములందుఁ బ్రశంస గానరాదు.

**శ్రీకృష్ణచైతన్యదేవుఁడు(స్వామి లేక సన్యాసి):—**
చైతన్యదేవుని తలవెంట్రుకలు చూడుఁడు.
కొటకద్వీపము చూడుఁడు.
చైతన్యమతనిషేధములు చూడుఁడు.
చైతన్యమతము చూడుఁడు.
నవద్వీపము (తొమ్మిదిద్వీపములు) చూడుఁడు.
నవద్వీపధామము చూడుఁడు.

**శ్రీకృష్ణనిర్యాణస్థలము:—** బొంబై రాజధానిలోని కతియవాడ్ సీమయందు జూనగడ్ సంస్థానరాజ్యమున విరావల్ రేవుపట్టణమునుండి యించుక దూరమునఁగల సోమనాథక్షేత్రము కడనున్న భాత్ కుండముకడ శ్రీకృష్ణనిర్యాణ స్థలమును జూపుచున్నారు. ఇటఁదలనదికి సరస్వతి యనెదరు. అట మూఁడుచిన్నప్రవాహములు కలియుతావున స్మశానఁపుజాగాఁగ తెల్పెదరు. గొప్పయాత్రాస్థలము. సోమనాథక్షేత్రము సుప్రసిద్ధశివదేవస్థానము. ఇట ప్రభాసతీర్థము కలదు. తొల్లింటి సౌరాష్ట్రదేశములోనిది.

**శ్రీకృష్ణవ్యూహము** రామానుజీయ వైష్ణవచైతన్యవైష్ణవమతధర్మములందు తదేకాత్మరూప మహావిష్ణువు. అందు ద్వితీయ చతుర్వ్యూహములలో నొకటియనియు, అనిరుద్ధములైదింటిలో నొక యుపవ్యూహమనియు, విలాసమూర్తియనియు, వరుసగ శంఖ, గద, పద్మ, చక్రము లాయుధము లనియుఁ జెప్పఁబడినది. (విష్ణుదేవాలయవిగ్రహములు చూడుఁడు.)



**శ్రీకృష్ణుఁడు:—** చంద్రవంశక్షత్రియుఁడు. వసుదేవుని కుమారుఁడు. తల్లి దేవకీదేవి. బలరాముఁడు సోదరుడు. చంద్రవంశమున యదుమహారాజుసంతతిని శ్రీకృష్ణుఁ డేఁబదియెన్మిదవ తరమువాఁడుగఁ జెప్పఁబడినది.

**శ్రీకృష్ణుని కుటుంబము:—** శ్రీకృష్ణుఁడత్రిమహర్షి సంతతియందు యదుమహారాజవంశమున జనించిన యాదవక్షత్రియుఁడు. ఈమహాత్ముని విష్ణుదేవునియవతారముగఁ జెప్పుచున్నారు. ఈమహామహుం డొనర్చిన మహాకార్యములు భారతభాగవతములపుటలు నింపుచున్నవి. పెక్కండ్రు రాక్షసులం దునుమాడినవీరుఁడు. తనతండ్రి వసుదేవభూపతిం బాధించియు, బాల్యమునందే మడియింప యత్నించిన కంసుం బరిమార్చిన ధీరుఁడు. భారతయుద్ధమొనర్చియు నడిపిన ధీశాలి. అర్జునకుఁ గర్మయోగమగు భగవద్గీత నుపదేశించిన జగద్దేశికుఁడు.

శ్రీకృష్ణుని తండ్రిపేరు వసుదేవుఁడు. తల్లి దేవకీదేవి. భిన్నోదరసోదరులు బలరాములు. (వసుదేవుఁడు చూడుఁడు.) భార్యలు- ౧ రుక్మిణీదేవి. ఈమె విదర్భదేశాధిపతి యగుభీష్మకుని కుమార్తె.
౨ జాంబవతీదేవి. జాంబవంతుని పుత్రిక.
౩ సత్యాదేవి—ఈమెను సత్యభామ యని వాడుచున్నారు. ఈమె సత్రాజిత్తుకుమార్తె.
౪ కాళిందీదేవి— ఈమెంగూర్చి సరిగాఁ దెలియదు. సూర్యపుత్రిక యని చెప్పఁబడినది గాన బహుశః సూర్యవంశఁపుక్షత్రియకుమారి గానోపు.
౫ మిత్రవిందాదేవి—ఈమె యవంతి భూపాలురగు విన్దానువిందులసోదరి యనియు, వారితల్లిగారి పేరు రాజాధిదేవి యనియుఁ జెప్పఁబడినది.

వేఱొకతావున రాజాధిదేవి వసుదేవభూపతికి సోదరియని (శ్రీకృష్ణునిమేనత్త) చెప్పఁబడినది.

౬. నాగ్నజితీదేవి— కోసలదేశాధీశుఁడగు నగ్నజితుమహీశునిపుత్త్రిక. ఈమెపేరు తెలియరాకున్నది.

౭ భద్రాదేవి— ఈమె కేకయరాజపుత్త్రిక.

౮ లక్ష్మణాదేవి— ఈమె మద్రదేశాధీశునిపుత్రిక.

ఇటుల శ్రీకృష్ణున కెనమండుగురుభార్యలని చెప్పఁబడినది. వేఱొకరీతిని విదేహదేశమున కుంభకుఁడను యాదవుఁడొకఁ డుండెననియు, నాతని యింట తారకయుద్ధమునమడిసిన కాలనేమిపుత్రు లేడ్వురును, ఏడాఁబోతులుగ జన్మించి యున్నారనియుఁ దెలసి శ్రీకృష్ణుం డటకు దాడి వెడలి, వాటితోసహా వానిం బరిమార్చి, వానికొమార్తె యగు నీలాసుందరిం బరిణయమాయెనని చెప్పఁబడియున్నది. ఈనీలాదేవి యెవ్వరో తెలియరాకున్నది. పరిణయమైనభార్యయై, (ఈమె) పై ఎనమండుగురలో నొకతెగాకుండిన, శ్రీకృష్ణునకు తొమ్మండుగురుభార్యలని చెప్పవలయును

శ్రీకృష్ణునిపుత్రులు— ౧ ప్రద్యుమ్నుఁడు, (ఈతనిసుతుం డనిరుద్ధుఁడు. ఉష ఈతనికి భరిణయమయ్యెను). ౨ చారుదేష్ణుఁడు, ౩ సుచారుఁడు, ౪ భద్రచారుఁడు, ౫ తామ్రుఁడు, ౬ చక్రిఁడు, ౭ సాంబుఁడు, ౮ మిత్రవంతుఁడు, ౯ సునీథుఁడు, ౧౦ మిత్రబాహువు నని తెలియుచున్నది. వీరు వేర్వేఱుభార్యలవలనఁ గల్గినవారు.

శ్రీకృష్ణుని సోదరులు— ౧ త్రివృష్ణుఁడు, ౨ కృతకుఁడు, ౩ బలరాముఁడు, ౪ గదుఁడు, ౫ విపులుఁడు, ౬ సారణుఁడు, ౭ శ్రుతముఖ్యుఁడు, ౮ సుధన్వుఁడు, ౯ వసువు, ౧౦ హంసుఁడు, ౧౧ శ్రీకృష్ణుఁడు, ౧౨ శూరుఁడు అనువారలు. అందు హంసునకు కౌశికుఁడనియు వాడుకనామము కలదు. శ్రీకృష్ణునకు, రుక్మిణీ, సత్యభామలు గాక మఱి భార్యలు లేరని గ్రంథాంతరమున గలదు.

## శ్రీకృష్ణునిసభ

(దాశార్హిం చూడుఁడు.)

## శీఘ్రకారిసన్నిపాతము:—

(సన్నిపాతదోషము చూడుఁడు).

## శ్రీచక్రము:—

శ్రీచక్రము పరదేవతాస్థానము. పరమేశ్వరునిశక్తియగు మహాశక్తి కునికిపట్టు. ఈమెకు శ్రీమత్త్రిపురసుందరి యని శాస్త్రమునఁ బేరిడి వాడియున్నారు. 'పరదేవత' యని త్రిపురతాపిన్యుపనిషత్తునను, 'శివా' యనియు, 'శివ' యనియు, సౌందర్యలహరియందునను పేళ్లు వాడియున్నారు. ఇందు వాడఁబడిన యితర శక్తులపేరులు కొంత కలవరపఱచునవిగ నుండును గాన చక్కఁగ జ్ఞాపక ముంచుకొనవలసియుండును.



శ్రీచక్ర మనుపే రొకే చక్రమనిపించును గాని, నిజముఁ బరిశీలించిన నిది నవచక్ర సముదాయ

మని తెలిసెడిని. ఈచక్రము లొకటిపై నొకటిగ నెత్తై యుండెడిని. శ్రీచక్రలక్షణము లీక్రింది రీతిని వివరింపఁ బడియున్నవి.

౧ త్రిపురతాపిన్యుపనిషత్తు:—

శ్లో॥ బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ|
మన్వస్ర నాగదళ షోడశపత్రయుక్తమ్|
వృత్తత్రయం చ ధరణీసదనత్రయం చ|
శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయాః॥

౨ 'సుభగోదయ' మనుగ్రంథమున సుప్రసిద్ధ శాక్తతంత్రవేత్త యగు గౌడపాదాచార్యుఁడిటుల వివరించియున్నాఁడు.

శ్లో॥ త్రికోణై రష్టారం త్రిభి రపి దశారం సము
దభూ| ద్దశారం భూవేశ్మా దపిచ భువనాశ్ర
మ్సమభవత్| తతో ఽ భూన్నాగారం నృపతి
దళమస్మాత్త్రివలయమ్| చతుర్ద్వాః ప్రాకా
రత్రితయ మిదమే వాంబ శరణమ్॥

సౌందర్యలహరియందు శంకరభగవత్పాదు లిట్లు శ్రీచక్రమును వివరించెను:—

శ్లో. చతుర్భి శ్రీకంఠై శ్శివయువతిభిః పఞ్చభి రపి|
ప్రభిన్నాభి శ్శంభోర్నవభి రపి మూలప్రకృతిభిః|
చతుశ్చత్వారింశ ద్వసుదళకలాశ్రత్రివలయ|
త్రిరేఖాభి స్సార్ధం తవ శరణకోణాః పరిణతాః.

గాన నీ శ్రీచక్ర మొకటిపై వేఱొకటిగ నున్న తొమ్మిదిచక్రములసముదాయమని తేలుచున్నది. ఈతొమ్మిదిచక్రములకు శాక్తతంత్ర గ్రంథములందు నవావరణము లని వాడియున్నారు. అవి క్రిందినుండి వరుసగ ౧ త్రైలోక్యమోహనము, ౨ సర్వాశాపరిపూరకము, ౩ సర్వసంక్షోభణము, ౪ సర్వసౌభాగ్యదాయకము, ౫ సర్వార్థసాధకము, (దీనినే బహిర్దశార మనియు నందురు), ౬ సర్వరక్షాకరము, (దీనినే అంతర్దశార మనియు నందురు), ౭ సర్వరోగహరచక్రము, ౮ సర్వసిద్ధిప్రదాయకము, ౯ సర్వానందమయ చక్రము ననంబడునవి. వీట్లంగూర్చి వివరింతుము గాక—



౧ త్రైలోక్య మోహన చక్రము.

ఇది యన్నిచక్రములకుఁ గ్రిందుగనుండు చక్రము. నలుచతురముగను, మూడావరణలు నడుమ నేర్పడునటుల నాల్గుప్రాకారములం గల్గినది. నాల్గుదెసలందు నాల్గుద్వారములం గల్గినది. దీనిని ప్రథమావరణమని శాక్తేయులు వాడుచుందురు. ఈచక్రముల కారప్రకృతికమనియు, పృథివ్యాత్మకంబనియు, నిట సర్వసంక్షోభిణీముద్ర యనియు,



'ద్రాం' అనునది బీజమనియు, స్థాయీభావము రతి యనియు, ఇచటిరసము శృంగారస మనియుఁ జెప్పఁబడినది.

ఈ త్రైలోక్య మోహనచక్రమునం దున్న మొదటి యావరణమున ౧ అణిమాసిద్ధి, ౨ మహిమాసిద్ధి, ౩ లఘిమాసిద్ధి, ౪ ఈశిత్వసిద్ధి, ౫ వశిత్వసిద్ధి, ౬ ప్రాకామ్యసిద్ధి, ౭ భుక్తిసిద్ధి, ౮ ఇచ్ఛాసిద్ధి, ౯ ప్రాప్తిసిద్ధి, ౧౦ సర్వకామసిద్ధి యనఁబడు దశసిద్ధులు (అనఁగా సిద్ధిదేవతలు) వసించు

చుండు ననియు, వీరు పరదేవతయగు శ్రీమత్త్రిపురసుందరీదేవియొక్క దేహకాంతులను రూపములుగ ధరించియుండువా రనియుఁ జెప్పఁబడినది.

లోపలనున్న రెండవయావరణమున ౧ బ్రహ్మరూపధారిణి యగు బ్రాహ్మియు, ౨ మహేశ్వరరూపధారిణి యగు మాహేశ్వరియు, ౩ కుమారరూపధారిణి యగు కౌమారియు, ౪ విష్ణురూపధారిణియగు వైష్ణవియు, ౫ వరాహరూపధారిణి యగు వారాహియు, ౬ మహేంద్రరూపధారిణి యగు మాహేంద్రియు, ౭ పరదేవత శక్తి యగు చాముండియు, ౮ పరదేవతా మహిమ యగు మహాలక్ష్మియు వసించుచుందురని చెప్పఁబడినది. ఇందు బ్రాహ్మీ - మాహేశ్వరీ - కౌమారీ - వైష్ణవీ - వారాహీ - మాహేంద్రీ యనంబడు నాలుశక్తులకు షట్శక్తు లనిపేరు వాడఁబడినది. వీటికి చాముండియుఁ గలసిన నేడుశక్తులకు సప్తమాతృకలని పేరు వాడఁబడినది. వీటికి మహాలక్ష్మిం జేర్చిన నెన్మిదిశక్తులకు అష్టమాతృకలు లేక అష్టశక్తులనియుం బేర్లు శాక్తగ్రంథములందు వాడఁబడినది.

ఇంకను లోనున్న మూఁడవయావరణప్రాకారమునందు ౧ సర్వసంక్షోభిణీ, ౨ సర్వవిద్రావిణీ, ౩ సర్వాకర్షణీ, ౪ సర్వవశీకారిణీ, ౫ సర్వోన్మాదినీ, ౬ సర్వమహాంకుశీ, ౭ సర్వఖేచరీ, ౮ సర్వబీజా, ౯ సర్వయోనీ, ౧౦ సర్వత్రిఖండా, యను పేర్లుంబరఁగు దశముద్రాధిదేవతలు వసించుచుందురని చెప్పఁబడియున్నది. ఇటులనే మూఁడుప్రాకారములందున్న ఇరువదియెన్మిది దేవతాశక్తులకు 'ప్రకటయోగినులు' లనిపేరు. ఈమొదటిచక్రమగు త్రైలోక్యమోహనచక్రమునకు త్రిపురా నామక చక్రేశ్వరి యధినాధురాలని చెప్పఁబడినది.




౨ సర్వాశాపరిపూరక చక్రము.

ఇది త్రైలోక్యమోహనచక్రముపై నధిష్ఠించియుండు రెండవచక్రము. దీనిని "షోడశదళపద్మ" మనుటయుఁ గలదు. దీనిం జుట్టి మూఁడు వృత్తరేఖలుండునుగాని, అవియు నీచక్రమునకుఁ జెందినవియే. దీనిని ద్వితీయావరణ మని శాక్తేయులు వాడుచుందురు. ఈచక్రము స కారప్రకృతికమనియు, చంద్రాత్మకమనియు, నిట సర్వవిద్రావిణీముద్ర యనియు, ద్రీం అనునది బీజమనియు, స్థాయీ భావము ఉత్సాహ మనియు, నిచటిరసము వీరరసమనియు, పూజాక్రమము ప్రదక్షిణక్రమమే యనియుఁ జెప్పఁబడినది.

ఈ సర్వాశాపరిపూరకచక్రమునందున్న షోడశదళములందు ౧ కామాకర్షిణి, ౨ బుద్ధ్యాకర్షిణి, ౩ అహంకారాకర్షిణి, ౪ శబ్దాకర్షిణీ, ౫ స్పర్శాకర్షిణీ, ౬ రూపాకర్షిణి, ౭ రసాకర్షిణీ, ౮ గంధా

కర్షిణీ, ౯ చిత్తాకర్షిణీ, ౧౦ ధైర్యాకర్షిణీ, ౧౧ స్మృత్యాకర్షిణీ, ౧౨ నామాకర్షిణీ, ౧౩ బీజాకర్షిణీ, ౧౪ ఆత్మాకర్షిణీ, ౧౫ అమృతాకర్షిణీ, ౧౬ శరీరాకర్షిణీ యనంబడు షోడశాకర్షిణీ దేవత లుండెడివి. వీరికి "గుప్తయోగిను" లని పేరు కలదు. ఈ రెండవచక్రమగు సర్వాశాపరిపూరకచక్రమునకు త్రిపురేశినామక చక్రేశ్వరి యధినాధురా లని చెప్పఁబడినది.

ఈచక్రము చంద్రతత్త్వాత్మకమని చెప్పఁబడుట షోడశచంద్రకలల నిట వివరించుట సమంజసము. అవి ౧ అమృతా, ౨ మానదా, ౩ పూషా, ౪ తుష్టి, ౫ పుష్టి, ౬ రతి, ౭ ధృతి, ౮ శశినీ, ౯ చంద్రికా, ౧౦ జ్యోతీ, ౧౧ జ్యోత్స్నా, ౧౨ శ్రీకలా, ౧౩ ప్రీతి, ౧౪ అంగదా, ౧౫ పూర్ణా, ౧౬ పూర్ణామృతా యనంబడు కలలు.

### ౩ సర్వసంక్షోభణచక్రము.

ఇది సర్వాశాపరిపూరకచక్రముపై నధిష్ఠించియుండు మూఁడవచక్రము. దీనిని 'అష్టదళపద్మ' మనుటయుం గలదు. దీనిని తృతీయావరణమని శాక్తేయులు వాడుచుందురు. ఈచక్రము హకారప్రకృతిక మనియు, అష్టమూర్త్యాత్మకమనియు, నిట సర్వాకర్షిణీ ముద్రయనియు, క్లీం అనునది బీజమనియు, స్థాయీభావము శోక మనియు, ఇచటిరసము కరుణారస మనియుఁ జెప్పఁబడినది.




ఈసర్వసంక్షోభణచక్రమునందు అనఁగాఁ బద్మమందలి యెన్మిదిదళములందు ౧ తూర్పున అనంగకుసుమా, ౨ ఆగ్నేయమున అనంగరేఖా, ౩ దక్షిణమున అనంగమేఖలా, ౪ నైఋతిదిశయందు అనంగవేగినీ, ౫ పశ్చిమమున అనంగమదనా, ౬ వాయవ్యదిశను అనంగమాలినీ, ౭ ఉత్తరమున అనంగమదనాతురా, ౮ ఈశాన్యదిశయందు అనంగాంకుశ, అనుశక్తు లెన్మిదియు గుప్తయోగినులను పేరఁ బరఁగుచు, వసించుచుందురని చెప్పఁబడినది. వీరందరికీ నాలుగేసి చేతులును, వాటియం దందరికీ కేరితిని ౧ పాశము, ౨ అంకుశము, ౩ వరద (ముద్రా) హస్తము, ౪ అభయ (ముద్రా) హస్తము గల్గియుండుననియు, వీరికి అనఁగా నీమూఁడవచక్రమునకు త్రిపురసుందరినామక చక్రేశ్వరి యధినాధురా లనియుఁ జెప్పఁబడినది.

### ౪ సర్వసౌభాగ్యదాయిక చక్రము

దీనికి మన్వస్ర మనియు, చతుర్దశారమనియు పేరులు కలవు. మనుశబ్దమునకుఁ బదునాలు గని యర్థముచెప్పి, అన్నికోణములు గల్గిన దనియు, చతుర్దశ (పదునాల్గు అని యర్థము గాన అన్ని) కోణములం గల్గిన చక్రమనియు, నెఱుంగునది గాని, అంతర్దశారచక్రము, బహిర్దశారములం బోలిన పది కోణములు గల్గినచక్ర మిదియని, పొరఁబడరాదు. అనఁగా నిది దశారచక్రము గాదని భావము. దీనినిచతుర్థావరణమని శాక్తేయులు

వాడుచుందురు. ఈచక్రము ౧ త్రైలోక్యమోహనము, ౨ సర్వాశాపరిపూరకము, ౩ సర్వసంక్షోభణము నను మూఁడుచక్రములపై నధిష్ఠించి యుండునది. ఈచక్రము ఈ కారప్రకృతిక మనియు, చతుర్దశభువనాత్మక మనియు, నిట సర్వవశంకరీముద్ర యనియు, బ్లూం అనునది బీజమనియు, స్థాయీభావము భయమనియు, నిచటి రసము భయానక మనియు, పూజాక్రమము




వామావర్తమనియుఁ జెప్పఁబడినది. ఈ సర్వసౌభాగ్యదాయకచక్రమునందుఁ బదునాల్గుకోణములందు ౧ సర్వసంక్షోభిణీ, ౨ సర్వవిద్రావిణీ, ౩ సర్వాకర్షిణీ, ౪ సర్వాహ్లాదినీ, ౫ సర్వసమ్మోహినీ, ౬ సర్వస్తంభినీ, ౭ సర్వజృంభిణీ; ౮ సర్వవశంకరీ, ౯ సర్వరంజనీ, ౧౦ సర్వోన్మాదినీ, ౧౧ సర్వార్థసాధనీ, ౧౨ సర్వసంపత్ప్రపూరిణీ, ౧౩ సర్వమంత్రమయీ, ౧౪ సర్వద్వంద్వక్షయంకరీ యను పేరులంబరఁగెడి చతుర్దశసాంప్రదాయయోగిను లుందురనియు, వీరిపై నధినాథురాలుగ నీచక్రమున త్రిపురవాసిని చక్రేశ్వరి యైయుండు ననియుం జెప్పఁబడినది.

ఇంక నీచక్రము చతుర్దశభువనాత్మకముగఁ జెప్పఁబడినది గాన వాటిపేరుల నిట వివరింపఁ దగును. (౧) ఏఁడు అధోలోకములు:— ౧ అతలము, ౨ వితలము, ౩ సుతలము, ౪ తలాతలము, ౫ రసాతలము, ౬ మహాతలము, ౭ పాతాళము. (౨) సప్తఊర్ధ్వలోకములు:— భూలోకము, ౨ భువర్లోకము, ౩ సువర్లోకము, ౪ జనలోకము, ౫ మహాలోకము, ౬ తపోలోకము, ౭ సత్యలోకము ననఁబడునవి.

### ౫ సర్వార్థసాధక చక్రము.

ఇది నాల్గవది యగు సర్వసౌభాగ్యదాయిక చక్రముపై నధిష్ఠించియుండు చక్రము. దీనికి బహిర్దశారమనియుఁ బేరుకలదు. అనఁగా నీచక్రమునందుండు పది వెలుపలికోణములందు దశశక్తు లుండుననిభావము. దీనిని శాక్తేయులు పంచమావరణ మని యందురు. ఈచక్రము ఏ కార యనియు, దశావతారాత్మకచక్ర మనియు,




ఇచటిది సర్వోన్మాదినీముద్ర యనియు, సః అనునది బీజమనియు, స్థాయీభావము జుగుప్స యనియు,

భీభత్స మిట వ్యాపించియుండురసమనియు, పూజాక్రిమము ప్రిదక్షిణాక్రమమనియుఁ జెప్పఁబడినది.

ఈసర్వార్థసాధకమనంబడు బహిర్దశారచక్రిమునందు వెలుపటనుండు పదికోణములందునను, ౧ సర్వసిద్ధిప్రిదా, ౨ సర్వసంపత్ప్రదా, ౩ సర్వప్రియంకరీ, ౪ సర్వమంగళకారిణీ, ౫ సర్వకామప్రిదా, ౬ సర్వదుఃఖవిమోచనీ, ౭ సర్వమృత్యుప్రశమనీ, ౮ సర్వవిఘ్ననివారిణీ, ౯ సర్వాంగసుందరీ, ౧౦ సర్వభాగ్య (కొన్నితావులందు సౌభాగ్య అనియుం జెప్పఁబడినది) దాయినీ అనంబడు దశకులోత్తీర్ణయోగిను లుందురని చెప్పఁబడినది. ఈచక్రమునకు వీరిపై నధినాథురాలుగ త్రిపురాశ్రీచక్రేశ్వరి యని చెప్పఁబడినది.

## ౬ సర్వరక్షాకరచక్రము.

ఇది ఐదవచక్రమగు సర్వార్థసాధకచక్రము లేక బహిర్దశారముపై నధిష్ఠించియుండునది. దీని కంతర్దశారమనియుఁ బేరు కలదు. అనఁగా నీచక్రమున లోపుననుండు పదికోణములందు దశనిగర్భయోగిను లనుశక్తులు వసించుచుండునని భావము. దీనిని శాక్తేయులు షష్ఠావరణమని వాడుచుందురు. ఇది రేఫ (రకార) ప్రికృతిక మనియు, వైశ్వానరాత్మక (అగ్ని) మనియు, ఇందలిది సర్వ




మహాంకుశముద్రి యనియు, క్రోం అనున దిట బీజమనియు, స్థాయీభావము క్రోధ మనియు, రసము రౌద్రిమనియు, పూజాక్రిమము వామావర్తమనియుఁ జెప్పఁబడినది.

ఈసర్వరక్షాకరమనంబడు నంతర్దశారచక్రమున ౧ సర్వజ్ఞ ౨ స ౩ సర్వైశ్వర్యప్రిద, ౪ సర్వజ్ఞానమయి, ౫ సర్వవ్యాధివినాశని, ౬ సర్వాధారస్వరూపిణి, ౭ సర్వపాపహర, ౮ సర్వానందమయి, ౯ సర్వరక్షాస్వరూపిణి, ౧౦ సర్వేప్సితఫలప్రిదా యనంబడు దశనిగర్భయోగినీశక్తు లుండునని చెప్పఁబడినది. వీరిపై నధినాథురాలుగ నీచక్రిమున త్రిపురమాలినీశక్తి చక్రేశ్వరియైయుండెడినని చెప్పఁబడినది. ఇది వైశ్వానరాత్మకచక్రిమని చెప్పఁబడుట అగ్నికలలం బదింటినిట వివరించుట సమంజసము. ౧ ధూమ్రా, ౨ అర్చికలా, ౩ ఉష్ణాకలా, ౪ జ్వాలినీకలా, ౫ జ్వాలినీ, ౬ విస్ఫులింగినీ, ౭ సుశ్రీకలా, ౮ సరూపాకలా, ౯ కపిలా, ౧౦ హవ్యకవ్యవాహనకలా యనఁబడునవి.

## ౭ సర్వరోగహర చక్రిము.

ఇది యేడవచక్రిమగు సర్వరక్షాకరచక్రిముపై నధిష్ఠించియుండెడిని. దీనిని అష్టకోణమనియు ననుటకలదు. చక్రిమునకు లోపలనుండు నెన్మిదికోణములందు అష్టరహస్యయోగినులు లేక వాగ్దేవత లుండెదరు. దీనిని వసుకోణ మనియనుటకు అష్టవసువులసి యిటనెన్మిదికర్థము కుదిరెడిని. శాక్తేయు లీచక్రిమును సప్తమావరణ మనుచుందురు. ఈచక్రము క కారప్రకృతిక మనియు, ప్రకృత్యాత్మక మనియు, ఇట సర్వఖేచరీముద్రి యనియు, ప్రకృత్యష్టకము చక్రతత్వ మనియు, స్థాయీభావము హాసమనియు, రసము హాస్యరసమనియు, పూజాక్రమము వరుసగనే యనియుఁ జెప్పఁబడినది. ఈసర్వరోగహారచక్రఁపు టష్టకోణ

ములందు ౧ వశినీ, ౨ కామేశ్వరీ, ౩ మోదినీ, ౪ విమలా, ౫ అరుణీ, ౬ జయనీ, ౭ స ౮ కాళినీ యనంబడు అష్టరహస్యయోగినులు లేక అష్టవాగ్దేవత లుందురని చెప్పఁబడిరి.





నధినాథురాలుగ నీచక్రమునఁ ద్రిపురాసిద్ధచక్రేశ్వరిగాఁ జెప్పఁబడినది. ఇంకనీ చక్రముంగూర్చి తెలుపఁదగిన యితరవిశేషములు కొన్ని కలవు. వాటిని వివరింతుముగాక.

ఈవసుకోణమధ్యస్థమై ముక్కోణముకు మీఁదుగానుండు చతుశ్రిప్రదేశమున షోడశనిత్యలు, అష్టదేవౌఘదేవతలు, చతుస్సిద్ధౌఘదేవతలు, అష్టమానౌఘదేవతలు ఆర్గురు షడంగదేవతలు (వెరసి నలువదియిద్దరు) నుందురని చెప్పఁబడినది.

(౧) షోడశనిత్యలు:— వీరు పూర్వాపర (లేక శుక్లబహుళ) పక్షతిథిదేవతలుగాఁ జెప్పఁబడినవారు. వారు ౧ కామేశ్వరి, ౨ భగమాలిని, ౩ నిత్యక్లిన్న, ౪ భేరుండ, ౫ వహ్నివాసిని, ౬ మహావజ్రేశ్వరి, ౭ శివదూతి, ౮ త్వరిత, ౯ వకుళసుందరి, ౧౦ నిత్య, ౧౧ నీలపతాకిని, ౧౨ విజయ, ౧౩ సర్వమంగళ, ౧౪ జ్వాలామాలిని, ౧౫ చిత్ర, ౧౬ మహానిత్య లేక లలిత యనంబడు శక్తులు.

(౨) అష్టదేవౌఘదేవతలు:— ౧ పరమేశ్వరి, ౨ పరమేశ్వరమయి, ౩ మిత్రేశమయి, ౪ షష్ఠీశమయి, ౫ ఉడ్డీశమయి, ౬ చర్యానాథమయి, ౭ లోపాముద్రామయి, ౮ అగస్త్యమయి యనంబడు శక్తులు.

(౩) చతుస్సిద్ధౌఘదేవతలు:— ౧ కాలతాపనమయి, ౨ ధర్మాచార్యమయి, ౩ ముక్తకేశీశ్వరమయి, ౪ దీపకలానాథమయి యనంబడు శక్తులు.

(౪) అష్టమానౌఘదేవతలు:— ౧ విష్ణుదేవమయి, ౨ ప్రభాకరదేవమయి, ౩ తేజోదేవమయి, ౪ మనోదేవమయి, ౫ కల్యాణదేవమయి, ౬ రత్నదేవమయి, ౭ వాసుదేవమయి, ౮ శ్రీరామానందమయి యనంబడు శక్తులు.

ఈత్రివిధఔఘదేవత లిరువదిమందియు, దేవతాగృహముల కవ్వల వసించువారని చెప్పఁబడినది. ఆపైని రత్నఖచితస్వర్ణపీఠములం దతి సుందరులగు షడంగదేవతలు, ౧ హృదయదేవి, ౨ శిరోదేవి, ౩ శిఖాదేవి, ౪ కవచదేవి, ౫ నేత్రదేవి, ౬ అస్త్రదేవి యనంబడువార లుందురని చెప్పఁబడినది. ఇటుల వీ రెల్లరు నలువదిరెండు శక్తులు.

## ౮ సర్వసిద్ధి ప్రదాయక చక్రము.

ఇది త్రికోణాకారము. ఏఁడవదియగు సర్వరోగహరచక్రముపై నధిష్ఠించియుండునది. దీనిని శాక్తేయు లష్టావరణ మనుచుందురు. దీనికి సర్వసిద్ధిప్రదమనియు, సర్వసాధారణముగ వాడుచుంటయుఁ గలదు. ఈచక్రము నాదప్రకృతిక మనియు, (సత్వ రజ స్తమో) గుణత్రయాత్మక మనియు,

యోగిజన మనోరంజకమనియు, నిట సర్వబీజ ముద్ర యనియు, హ్స్త్రైః అనునది బీజమనియు, స్థాయీభావము విస్మయమనియు, రస మద్భుత రస మనియు, ఈచక్రముయొక్క తత్త్వము సత్త్వరజస్తమోగుణాత్మకతత్త్వమే యనియు, పూజాక్రమము




ప్రదక్షిణక్రమమే యనియుఁ జెప్పఁబడినది. చక్రమునం దగ్రకోణమున కామగిర్యాలయాగ్నిపీఠముపై వాగ్భవస్వరూపిణియు కాదివిద్యామయి యగు పరబ్రహ్మాత్మకశక్తి ౧ కామేశ్వరీదేవి తన యాఱుచేతులందు పాశము, అంకుశము, అమృతకలశము, కపాలము, వరదముద్ర అభయముద్రల ధరించి, మిత్రేశనాథసహితయై, నవయోనిచక్రాత్మకయై, తత్త్వసృష్టికృత్యయై, ఇచ్ఛాశక్తిస్వరూపిణియై యుండుననియు చక్రముయొక్క దక్షిణకోణమున సూర్యమండలమయ దేవాలయ జాలంధరపీఠమున కామకలాస్వరూపిణియు, హాదివిద్యామయియు, కామరాజాత్మికయు నగు వజ్రేశ్వరీ దేవి తనయాఱుచేతులందునను చాపము, బాణము, పాశము, అంకుశము, పుస్తకము, జపమాల, క్రమముగ ధరించి షష్ఠీశనాథసహితయై, దశారద్వయ చతుర్దశార చక్రములకుం గర్త్రియై, విద్యాతత్త్వస్థితి కృత్య యగుచు జ్ఞానశక్తిస్వరూపిణియై యుండుననియు—

చక్రమునందలి వామకోణమునఁ బూర్ణగిరి గహ్వరము (గుహాదేవాలయమున) చంద్రమండలమయపీఠముపైఁ బరాపరస్వరూపిణియు, సాదివిద్యామయి, రుద్రాత్మకశక్తియు నగుభగమాలినీ దేవి తనయాఱుచేతులందు విల్లు, అమ్ములు, పాశము, అంకుశము, పుస్తకము, అభయముద్రా హస్తము, ధరించి ఉడ్డీశానందనాథసహితయై చతురశ్ర షోడశదళ అష్టారద్వయ చక్రములకుం గర్త్రియగుచు, నధినాథురాలును, శివతత్త్వసంహారకృత్యయునగుచు, రుద్రాత్మకశక్తిగను, చంద్రసమాన శరీరచ్ఛాయాయుక్తగను, దనరుచు క్రియాశక్తిస్వరూపిణియై యుండుననియుఁ జెప్పఁబడినది.

ఈముగ్గురుశక్తులు అనఁగా అగ్రకోణస్థకామేశ్వరీదేవి, వామకోణస్థభగమాలినీదేవి, దక్షిణకోణస్థవజ్రేశ్వరీదేవియు నతిరహస్యయోగిను లని చెప్పఁబడుచుందురనియు, వీరిపై నధినాథురాలుగ నీచక్రమందు త్రికోణమున త్రిపురాంబ యనుశక్తి చక్రేశ్వరియై యుండుననియుఁ జెప్పఁబడినది.

౯ సర్వానందమయచక్రము [బిందువు]

ఇది యన్నిచక్రములపై నధిష్ఠించియుండునది. ఇదియుఁ జక్రమే. బిందువు ప్రజ్ఞాస్వరూపము, పంచబ్రహ్మాత్మకము నని చెప్పఁబడినది. శాక్తేయులు బిందువును నవావరణమని యనుచుందురు. బిందువు శ్రీమత్త్రిపురసుందరీనివాసము. చక్రప్రకృతి బిందుస్వరూపము - చక్రతత్త్వము - పంచబ్రహ్మాత్మికము - సర్వయోగినీముద్ర - ఐం అనునది బీజము. స్థాయీభావము శమము. ఇట వ్యాపించి యుండునది శాంతరసము.

ఈబిందువునందు ౧ సద్యోజాత, ౨ వామదేవ, ౩ అఘోర, ౪ తత్పురుష, ౫ ఈశాన (పంచ) బ్రహ్మాత్మకమగు మహాధ్యానపీఠమున చక్రేశ్వరియు, సర్వచక్రాధినాథురాలును, సర్వజగదీశ్వరియు నగు శ్రీమత్త్రిపురసుందరీదేవి రాజరాజేశ్వరియ నాఁబరఁగుచు త్రిలోకసుందరుఁడును, సర్వేశ్వరుండును, సర్వలోక కర్తృత్వ భర్తృత్వ లయత్వాధినాథుండు నగు పరమేశ్వరుని యందు విశిష్టయై, వామభాగమున చర్యానంద

నాధాదిసహిత శాస్త్రరస స్వరూపిణియగుచు, సమస్తచక్రపరివార సహితయు, పంచబ్రహ్మమయియు నగుచు, వసించుచుండెడి నని చెప్పఁబడినది. ఈమెయుండుపీఠమునకు మహాధ్యానపీఠమునెక్క షణ్ణవతితత్వసోపానము లుండునని చెప్పఁబడినది. ఆషణ్ణవతితత్వములం దెల్పి ముగింతుము గాక.

పంచభూతతత్వములు:—
పృధి, వ్యాప, స్తేజో, వాయు, రాకాశములు. ౫

పంచతన్మాత్రతత్వములు:—
గంధ, రస, రూప, స్పర్శ, శబ్దములు. ౫

పంచకంచుకతత్వములు:— కాల, విద్యా, కలా, నియతి, రాగతత్వములు. ౫

పంచజ్ఞానేంద్రియ తత్వములు:— త్వక్, చక్షు, శ్రోత్ర జిహ్వా, ఘ్రాణములు ౫

పంచకర్మేంద్రియ తత్వములు:—
వాక్పాద, పాణి, పాయు, ఉపస్థలు ౫

సప్తధాతు తత్వములు:— వసా, అసృక్, మాంస, మేదో, ఽస్థి, మజ్జా, శుక్లములు.
మతాంతరమున:— రోమ, చర్మ, మాంసా, స్థి, స్నాయు, మజ్జా, ప్రాణములు. ౭

పంచవాయు తత్వములు:—
ప్రాణాఽపానవ్యానోదానసమానవాయువులు. ౫
మనోఽహంకార ప్రకృతిపురుషతత్వములు ౪
రాగ, విద్యా, కలా, నియతి, కాల, తత్వములు. ౫

౪౬

పై సంఖ్య— ౪౬
మాయా, శుద్ధవిద్యా, మహేశ్వర, సదా శివ తత్వములు. ౪
శక్తి, శివ తత్వములుకలసిన తత్వము. ౧
ఉపప్రాణతత్వములు:— నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయవాయువులు. ౫

అరిషడ్వర్గము (శక్తితత్వము):— కామ, క్రోధ, లోభ, మోహ, మద, మచ్ఛరములు. ౬
పుణ్య, పాప, శక్తితత్వములు. ౨
వచన, దాన, గమన, ఆనంద, విసర్గ, హాస, ఉపాదాన, ఉపేక్షా (శక్తిత్వములు) ౮

నాడీశక్తితత్వములు:—
అలంజసా కుహూ, విశ్వోదరీ, వరుణీ, హస్తిజిహ్వా, యశశ్వి, అశ్వినీ, గాంధారీ, పూషా, శంఖినీ, సరస్వతీ, ఈడా, పింగళా,

సుషుమ్నాతత్వములు:— ౧౪
రేచకాదిశక్తిత్రయములు:- ౬
రేచక, పూరక, శోషక, దాహక, పావక, అమృత శీతోష్ణ శక్తి తత్వములు ౨
౧ శీతము, ౨ ఉష్ణము.
సుఖతత్వము, దుఃఖతత్వము (ఈరెండును శక్తి తత్వములే) ౨

౯౬

ఇవి షణ్ణవతితత్వము లని చెప్పఁబడినవి.

**శ్రీదేవి:**—శ్రీదేవి యన సర్వసాధారణముగ లక్ష్మీదేవి కన్వయించెడిని. ఈమె విష్ణుదేవుని భార్య.

మఱియు దేవకునికుమార్తె యొకశ్రీదేవి. ఈమె వసుదేవుని భార్య. శ్రీకృష్ణునితల్లియగు దేవకీదేవిచెలియలు.

**శ్రీధరమల్లెవేంకటస్వామికవి:**—ఆంధ్ర కవులలో నాథునికులందుఁ బరిగణింపఁబడిన వాఁడు. బడగలనాటి కన్నడబ్రాహ్మణుఁడు. అశ్వలాయనసూత్రము. భారద్వాజస గోత్రము. తండ్రి అయ్యనార్యుఁడు.

రచించినది బ్రహ్మోత్తరఖండము. ఆంధ్రపద్యరూపకముగ రచించెను. దీనిని సిద్ధవటప్రాంతయంబాళపురస్థిత పార్థివేశ్వరస్వామి కంకిత మొనర్చెను. గాన నాప్రాంతవాసుఁడని తోఁచెడిని. ఈతనికాలము క్రీ. వె. ౧౮౧౫ ప్రాంతము.

**శ్రీధరవ్యూహము:**- రామానుజీయ వైష్ణవ - పాంచరాత్ర వైష్ణవమత ధర్మములందు తదేకాత్మరూప మహావిష్ణువు. అందు ద్వితీయ చతుర్వ్యూహములలో నొకటి యనియు, ప్రద్యుమ్న వ్యూహము లైదింటిలో నొకయుప వ్యూహమనియు, వైభవవిలాసమూర్తి యనియు, వరుసగఁ బద్మ చక్ర గద శంఖము లాయుధము లనియుఁ జెప్పఁబడినది.



గ్రహములు చూడుఁడు.)

**శ్రీనందనతాళము:**—

(తాళములు చూడుఁడు.)

**శ్రీనగరము:**—ఇది కాశ్మీరదేశపు రాజధాని. గడవాలుసంస్థానరాజ్యము (తొల్లింట అరుణోద లేక చతురశీతిలింగదేశపు) యొక్క రాజధానియు శ్రీనగరమను పేరు కలదియె.

(కాశ్మీరదేశము చూడుఁడు.)

**శ్రీనాథద్వారక:**—

(ద్వారకలు చూడుఁడు.)

**శ్రీనాథమహాకవి (కవిసార్వభౌముఁడు:)**—ఈతఁ డాంధ్రకవులలోఁ బూర్వకవులలోఁ బరిగణింపఁబడినవాఁడు. ఈతనికి మహాకవి యనియు, కవిసార్వభౌముఁ డనియు, బిరుదములు గలవు. ప్రాజ్ఞాటినియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజసగోత్రుఁడు. ఆపస్తంబసూత్రము. తండ్రి పేరు మారన్న. తల్లి భీమాంబ. తాత కమలనాథయ్య. ఈతనిసోదరి బమ్మెరపోతనభార్య యనెదరు. శ్రీనాథుని శైవుండని రా.బ. కందుకూరి వీరేశలింగంపంతులవా రభిప్రాయపడియున్నారు. కవిత్రయము (నన్నయ-తిక్కన - ఎఱ్ఱాప్రగ్గడలకుఁ) బిదప పెద్దగ్రంథములు రచించినవాఁడని పేరందినవాఁడు. ఇతనికన్న పిన్నవయసువాఁడగు పిల్లలమఱ్ఱి పినవీరన్నయెడల శ్రీనాథునకు భక్తి యధికమని చెప్పఁబడినది. ప్రౌఢదేవరాయుండను భూపతివలనఁ గవిసార్వభౌమ బిరుదమందినవాఁడు. వీరభద్రారెడ్డి యాస్థానకవి యని యనిపించుకొనినవాఁడు. కొంతకాలము కొండవీటిరెడ్లకడ నాస్థానకవియె యుండె నందురు.

శ్రీనాథమహాకవి విరచితములగు పద్యకావ్యము లెన్నియో గలవు. అందుఁ బండ్రెండు దేశమున వ్యాపకము నందియున్నవి. అవి ౧ మరుత్తురాట్చరిత్రము, ౨ శాలివాహనసప్తశతి, 3 శృంగారనైషధము, ౪ వీధి, ౫ పలనాటివీరచరిత్ర, ౬ పండితారాధ్యచరిత్ర, ౭ హరవిలాసము, ౮ శివరాత్రిమాహాత్మ్యము, ౯ వల్లభాభ్యుదయము,

౧౦ ధనంజయవిజయకావ్యము, ౧౧ భీమేశ్వ పురాణము, ౧౨ కాశీఖండము, ఇంక నెన్నియో కలవు.

**శ్రీపంచమి:—** చైత్రశుద్ధపంచమి. దీని నింకను ల పంచమి యనియు నందురు. విష్ణు దేవస్థానములందు దేవుని నూయెలయం దుంచి డోలోత్సవ మొనర్తురు. (పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుఁడు).

మాఘశుక్లపంచమికి నీపేరు కలదు. ఆనాడు లక్ష్మీపూజ యొనర్తురు.

**శ్రీపథ గోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**శ్రీపాదము:—** సింహళద్వీపములోని 'ఆడమ్సుపీకు' అనఁబడు శిఖరము. ఇట గొప్పపాదము కలదు. దీనిని బౌద్ధులు బుద్ధునిపాదముయొక్క యానవాలనియు, హిందువులు శ్రీరామునిపాదముయొక్క యానవాలనియు, క్రైస్తవులు ఆదమ్ (ప్రథమపురుషుని) పాదముయొక్క యానవాలనియు ననుచున్నారు. దీనికి 'సుమనకూట' మనియుఁ బేరు గలదు.

**శ్రీపాదశిఖరము:—**
(ఏదమ్సు పీక్ చూడుఁడు.)

**శ్రీపుంసకులగోత్రము:—** ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. శ్రీపుంసకుల గోత్రము. ఏకాక్షేయ (౭౬) గోత్రము. పరస్పరాయణగణము. పరస్పరాయన (సంస్కృత గోత్రము) పులస్త్యర్షి. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథము మాత్స్యసూత్రము. సమాన గోత్రము. గాలవస. పులస్త్యస పరేశుఁడు దేవత. పుష్పాంబ భార్య. పారియాత్రము తపస్థానము. పుష్పాబ్ధి తటాకము. జపము లక్ష. దీపములు ౭౦. క్షేత్రసంఖ్య ౭౦. స్వర్ణదానము. పాలపండ్లు వర్జనీయము. (వైశ్యగోత్రములు చూడుఁడు.)

**శ్రీఫలవృక్షము:—**
(మారేడుచెట్టు చూడుఁడు).

**శ్రీభోజపురము:—** హిందూమహాసముద్రమున సుమత్రాద్వీపమునను్న పురము. బౌద్ధవిద్యాస్థానముగ క్రీ. వె. ఏఁడవశతాబ్దమున ప్రతీతి వడసినతావు. చీనాదేశఁపుబౌద్ధయాత్రస్థు లెక్కువ సంఖ్యాకులుగ దర్శించుచుండిరఁట. ఇప్పుడు జీర్ణించి పాలెంబాంగ్ అనుపేరఁ బరఁగుచున్నది.

**శ్రీముఖగోత్రము:—**
(సంకృతి ఉపగణము చూడుఁడు).

**శ్రీరంగతాళము:—**
(తాళములు చూడుఁడు).

**శ్రీరంగపట్టణము, దుర్గము:—** ఇది మైసూరుసంస్థానరాజ్యములోనిది. మైసూరునుండి తొమ్మిదిమైళ్ళదూరము. ఇది కావేరీనదియందలి ద్వీపము ఇట శ్రీరంగమునందువలెనే రంగనాయకస్వామిదేవస్థానము కలదు. దీని నాదిరంగ మని యందురు. చరిత్రప్రసిద్ధస్థలము. ఇచటి దుర్గము టిప్పుసుల్తాన్ కాలము ముగియువఱకు దక్షిణదేశఁపుఁ గోటలలో బెబ్బులివంటి దనిపించుకొనినకోట.

ఇక్కాలమున నీదుర్గము తనసామర్థ్యముం గోల్పోయి, యెవ్వరెట్లు కదిపి, యెట్లీడ్చిన నట్లు జరుగు మృతవ్యాఘ్రకళేబరమో యనునటుల నామమాత్రావశిష్టమై యొకసాధారణఁపుఁబల్లె గ్రామమును తనలో నిముడ్చుకొని తొల్లింటి

పెద్ద పేరును గోల్ప్రోవక యున్నది. కోటగోడ లచటనచట పడిపోయి, రాళ్ళు గొంపోవఁబడుచు, కందకములు మేటవేయుచు, చెట్లుచేమలు, డొంకలు బలసి, మన్యఁపుద్వారములకుఁ దావై, చూపరుల నాకర్షించుచు మాత్రమున్నది.

ఈద్వీపముపొడవు మూఁడున్నరమైళ్ళును, వెడలుపొకటిన్నరమైళును నడుమ గల్గియుండి, వైశాల్యమేఁడుచతురఁపుమైళ్ళుండును. ద్వీపమునందు వాయవ్యమూలనూరింజుట్టి కోటయున్నది. ఇట క్రీ. వె. ౧౧౩౩ సంవత్సరమునకుఁ బూర్వము శివసముద్రమున రాజ్యమేలిన గంగవంశఁపురాజొకఁడొకకోటంగట్టించెనని వాడుకగలదు. క్రీ. వె. ౧౧౩౩ కాలమున మైసూరుప్రాంతసీమనేలుచుండిన బల్లాలవంశస్థుఁడగు విష్ణువర్ధనుండనుభూపతి జైనమతమునువీడి వైష్ణవుండై తనగురుండగు రమణాచార్యుండను విద్వాంసున కెన్మిదిగ్రామముల నగ్రహారములుగ నొసంగెనఁట. వాటిని నేటికిని 'అష్టగ్రామము' లని వాడుచున్నారు. పిదప నీరాజ్యము విజయనగరరాజులపాలనక్రిందికి రా వైష్ణవస్వాములును వారికి లోనై యుండిరి.

క్రీ. వె. ౧౪౫౪ వైష్ణవులలో దండివాడైన తిమ్మణ్ణ ప్రభుత్వమువారి యనుమతి నంది, యదివఱకుండిన శిథిలదుర్గముంబాగుఁ జేయించి, పోయిన తావులంగట్టించి, బలపఱచెను. నాఁడాదిగ ననేకులందు నివాసము గుదుర, 'శ్రీరంగపట్టణ' మను పేరుఁ గల్గెనఁట. ఈపనులం ణ్ణాచార్యుఁడు కలాసవాడి జైనగ్రామమందలి ౧౦౧ జైనదేవళములం బడఁగొట్టించి, యారాళ్ళ నీపనుల కుపయోగించెనని యందురు. పదునేనవశతాబ్దమున విజయనగరమునుండి పరిపాలన నడపుట కొక యుద్యోగి యిటకుఁ బ్రవేశపెట్టఁబడియెను.

విజయనగరసామ్రాజ్య మస్తమించువఱకు, తిరుమలరాజనునాతఁడు రాజప్రతినిధి. అతఁ డనేక భవనముల నీదుర్గము నిర్మించినవాఁ డట. ౧౪౬౪ తురకలు ప్రబలినను శ్రీరంగపట్టణమున భద్రముగనే యుండెనఁట. సమీపముననేయుండు మైసూరురాజు సైతముకోటపై కన్నువైచియుండియుఁ జేయునదిలేక మిన్నకుండెనఁట.

క్రీ. వె. ౧౬౧౦ లోఁ దిరుమలరాజు పరిస్థితుల నారసి మైసూరురాజున కీదుర్గ మప్పగించెనఁట. మైసూరురాజు రాజవొడయరు నాఁడాదిగ శ్రీరంగపట్టణమున నివసింపసాఁగెనఁట. ఇట్లు నారాజకుటుంబము ౧౭౯౯ వఱ కిటనే యుండెనఁట. ౧౭౬౧ యం దీదుర్గము హైదరాలీహస్తగతమై, యాతనిమృతితో ౧౭౮౧ లో టిప్పుసుల్తాన్ హస్తగతమై, ౧౭౯౯ లో నాతఁ డాంగ్లేయ నికులచే యుద్ధమున మరణించినపిదపఁ గొంతకాల మాంగ్ల సైనికస్థానమైయుండి, మైసూరురాజ్యము తొల్లింటిమైసూరురాజుసంతతివారికి వశపఱుప నీదుర్గమును వారికి వశమయ్యెను. ఇప్పుడు బెంగుళూరునుండి మైసూరునకేగు నినుపబాట దీనిగుండా పోవుట నిది తెలిచినయింటిని బోలియున్నదుర్గము.

పై చరిత్రతో సంబంధించినతావులే యిప్పుడు శ్రీరంగపట్టణమునఁగాననగు దృశ్యములు (ఆదిరంగము చూడుఁడు). గనున్నవి. అవి స్కాట్లీస్తంభము, మైసూరుదర్వాజా, ఏనుగులదర్వాజా టిప్పుసుల్తాను నివసించినభవనఁపుజాగా, రంగనాథస్వామిదేవళము కదలుపట్టివంతెన. దీనిని కెప్టెన్ డి హావిల్లాం డను ఫ్రెంచిఎంజినీరు కట్టెను. తన నైపుణ్యము టిప్పుసుల్తానుకుఁ జూప నిర్మించెనఁట. ౧౧౨ అడుగలఉల్లోపుగల ఇటుకలాను, లాదునాల్గడుగులమందము,నాల్గడుగులు వెడలుపుగలది. లాదుమధ్యమున ననఁగా కీస్టోన్‌క్రిందికి

భూమినుండి పదియడుగులయెత్తుండెడిని. భూమట్టమునుండియే కట్టఁబడినది. ఇటునటు స్తంభఁపు దిక్కులు కలవు. లాదుపై కెక్కి ఖండీరాయికడ నడుమనిలువంబడి, ఊపిన నించుక లాదుకదలును. (లాదు గిలాబాచేయఁబడలేదు). కోటకడ నేటి యొడ్డున యుద్ధస్మారకచిహ్నము, టిప్పుసుల్తాన్ కారాగారము, టిప్పుసుల్తాన్ నిర్యాణస్థలము, పెద్ద మశీదు, వెల్లెస్లీవంతెన, దర్యాదౌలతుభాగు, లాల్బాగ్ గుంబుజ్ (హైదరాలీ, టిప్పుసుల్తానుల గోరీలు) కౌలుబజారు, కలనల్స్కాటు బంగాళా, పశ్చిమవాహినీ కావేరిస్నానములరేవు, సంగమేశ్వరము గలవు.

**శ్రీరంగము:**—దక్షిణదేశమున తిరుచనాపల్లికడ కావేరినదియందున్నద్వీపమునందొకపట్టణము. దీనిని మధ్యరంగ మందురు. (శ్రీరంగపట్టణము చూడుఁడు.) ఇట శ్రీరంగనాథునికోవెల ప్రాకారములందే శ్రీరంగ (పట్టణ)ము కలదు. ఇటీవలఁ బైకిఁగూడ పెరిగినది. మొత్తమున నేఁడు ప్రాకారములు కలవు. అందు వెలుపలి మూఁడు ప్రాకారములందు పట్టణమును, లోని మూఁడు ప్రాకారములందు దేవాలయమును, దానిసంబంధమంటపములును గలవు. సహస్రస్తంభమంటపము మొదలగుమంటపము లిట సుప్రసిద్ధము. ఈక్షేత్రము విష్ణుదేవుని భూలోకనివాసమనియు, నిట పరమేశ్వరుండగు విష్ణుదేవుఁడు శయనసుఖలీలలం బ్రదర్శించుననియు వైష్ణవగ్రంథములందుఁ జెప్పఁబడినది. కావేరీనదిని విరజానదిగను, శ్రీరంగనాథుని మందిరము వైకుంఠముగను, రంగేశుఁడగు రంగనాథస్వామిని పరవాసుదేవునిగను పోల్చుకొని యిచట రామానుజీయ శ్రీవైష్ణవస్వాము లిది భూలోకమున ప్రత్యక్షపరమపథ మనెదరు. ఇచటఁగలతావులలో వైకుంఠద్వారము పేరందినది. క్రీ. ము. నుండి యీదేవస్థానము కలదని తెలుచున్నను దొరకినశాసనములు తొమ్మిదవ శతాబ్దమునుండి మాత్రము కలవు.

**శ్రీరంగక్షేత్రములు 3:**— శ్రీరంగము, లేక రంగము. రంగ మనస్థలమని యర్థము. ఇవి మూఁడు కావేరినదియందలి ద్వీపములు. మూఁడు దేవాలయములందు రంగనాథుఁడే దేవుఁడు. విష్ణుస్థలములే.

౧ ఆదిరంగము— మైసూరు రాజ్యమునందలి శ్రీరంగపట్టణము. (ద్వీపము).

౨ మధ్యరంగము— తిరుచనాపల్లి కవ్వలి కావేరీనదియందలి ద్వీపము. దీనిని సాధారణముగ శ్రీరంగ మందురు. ఇది పట్టణమే. ఇది గొప్పక్షేత్రము.

3 అంత్యరంగము— తంజావూరు మండలములోని మాయవరం పట్టణమునకుఁ గొంతదూరమునఁ గావేరీనది మధ్యద్వీపమున 'తిరువేళుందూరు' అను గ్రామమునఁగల రంగనాథ (విష్ణు) దేవస్థానము.

**శ్రీరామచక్రవర్తి:.** షోడశమహారాజులలో నొకఁడు.

వైవస్వతమనువు నుండి శ్రీరామునివఱకు నేబదియేఁడుతరము లయినవనియు, వ్యాసునిపురాణమం దున్నది.

(మహారాజులు చూడుఁడు).

**శ్రీరామనవమి:**— చైత్రశుద్ధ నవమి. వసంతనవరాత్రములందుఁ గడపటి (తొమ్మిదవ) దినము. శ్రీరామవర్ధంతి కొందఱును, సీతాకళ్యాణముఁ గొందఱును జరుపుదురు.

**శ్రీరామసేతువు:—** శ్రీరాముఁడు సీత కొఱకై లంక కరుగుతరి, తనదండయాత్ర సైన్యములు నడచుటకుఁగాను నిర్మించినకట్టను (గట్టును) "శ్రీరామసేతు" వనెదరు. దీనినాంగ్లేయులు, మహమ్మదీయులు, 'adam's bridge' అనెదరు. సృష్ట్యాదిమనుష్యుడగు ఏడ మీఁకట్టపై నుండి నడచివచ్చెనఁట. అట్లే యగుననుకొనిన, నంతకుఁ బూర్వమే యది శ్రీరామునికాలమున ౦పఁబడియుండునని తేలును.

సేతువు గొప్పగొప్పగండశిలలును, నిసుకయుఁ గల్గినగట్టుగ నుండెను. ఇక్కాలమున నది రామేశ్వరద్వీపపుఁ దూర్పుకొననుండి సింహలమున కుత్తరముగాఁగల మన్నారుద్వీపమునకుఁ జేరు చిన్న చిన్న సముద్రపుద్వీపములవరుసగా నున్నది. ఈద్వీపములు కొన్ని కడుచిన్నవి. మన్నారు ద్వీపము కొంత పెద్దద్వీపమే. (మన్నారుద్వీపము చూడుఁడు). సేతువుయొక్క రామేశ్వరద్వీపపుఁ గొన ధనుష్కోటి యనఁ బరఁగుచు హిందువుల పవిత్రస్నానతీర్థముగ నున్నది. ఇచటి కిరుదెసల నున్న సముద్రభాగములను 'రత్నాకర' మనియు, 'మహోదధి' యనియు పేరుల వాడుచున్నారు. ఆదిని రామేశ్వరద్వీపము వేఱుగనుండక, భరత దేశపు దక్షిణభూమితోఁ జేరియే యుండెననియు నిప్పుడు వెత్తైల్ మండమునుక కలసియుండె నని యుఁ బిదప సముద్రపుఁబాయయేర్పడి, వేఱయ్యె ననియుఁ బరిశీలకు లనుచున్నారు.(రావణాసురుఁడు చూడుఁడు).

**శ్రీరామ సేతువు:—**

(ఏడమ్సుబ్రిడ్జి చూడుఁడు).

**శ్రీలకులగోత్రము:—** ఆర్యవై ౧౦౨ గోత్రములలో నొకటి. శ్రీలకుల (చీలకుల) గోత్రము. ద్వావ్లేయ (౬) గోత్రము. శ్రీవత్సగణము. సంస్కృతగోత్రము శ్రీవత్సస. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథము నిర్ణయసింధు, ధర్మసింధు. శివదేవుఁడు దేవత. భార్య మద్దామ్మ. సింధుదేశము తపస్థానము. అర్జునసరస్సు తటాకము. జపము లక్ష. దీపములు ౩౦. క్షేత్ర సంఖ్య ౪౦. సింధుదేశఁపుగుఱ్ఱము దానము. చిట్టికూర, చిట్టాముదములు వర్జనీయము.

**శ్రీవత్సగోత్రము:—**

(జమదగ్నివత్స ఉపగణము చూడుము).

**శ్రీవత్సగోత్రము [శిష్టుకరణము లది]:—** వీరికిఁ బ్రధానర్షి భృగుఁడనియు, ప్రవరరూపములు భార్గవ, చ్యవన, ఆప్నువాన లనియు, భార్గవ, చ్యవన, ఆప్నువాన, ఔర్వ, జామదగ్న్య లనియు, భార్గవ, చ్యవన, ఆప్నువాన, ఆశ్వలాయన, ఆపస్తంభ యనియుఁ జెప్పఁబడినది. శిష్టుకరణములలో ౧ అంపలాంవారు, ౨ జొద్దు మహంతివారు, 3 నందిగాంవారు, ౪ పోతుమహంతివారు, ౫ పోలోకివారు, ౬ పోలుమహంతివారు, ౭ రాజపాత్రునివారు, ౮ సదాశివునివారు, అను నింటిపేర్లుగలవా రీగోత్రజులై యున్నారు.

**శ్రీవేష్టకము:—** Ceader చెట్టుబంకతోఁ జేసిన ధూపవస్తువు. సుగంధద్రవ్యము. సీడరు చెట్టుకు ధూపవృక్షః, కలిద్రుమః, శీర్షః అని సంస్కృతపుఁ బేరులు. దేవదారుబంక గుణములును గల్గియు ఉబ్బు, కఫము, గ్రహణి, రక్తపైత్యము, వ్రణముల నివారించు నందురు.

**శ్రీవైష్ణవులు** ఆంధ్రదేశమునందలి రామానుజీయవైష్ణవమతస్థులలో (విశిష్టాద్వైత మతస్థులలో) నఱవదేశమునుండి వచ్చియాంధ్ర

దేశమున కాపురముకుదిరినవారికి ద్రావిడులనియు, తెలుఁగువారికి శ్రీవైష్ణవులనియు, వాడుకనామములు కలవు. ఇవి సర్వసామాన్యమైన వాడుకనామములు. ఇం దింకను నంతర్భేదశాఖలు కలవు. వాటికి కొడులు అనివాడుచున్నారు. వీరుగాక చాత్తాదశ్రీవైష్ణవులని వేఱొకతెగవారు కలరు. వారికి సాతానులని వాడుక గలదు. వీరికి తెలగలు మొదలగుకొన్నిజాతులవారు శిష్యులు. వీరియందు విద్యాధికులును గలరు.

ఆంధ్రదేశమునందున్న రామానుజీయవైష్ణవులలో ముఖ్యమగుతెగలు ద్రావిడవైష్ణవులును, ఆంధ్రవైష్ణవులు నని వైష్ణవు లనెదరు. ఈరెండు తెగలవారియందు వడగల, తేంఘల భేదములు కలవు. ద్రావిడులలోఁ గేవలద్రావిడులు, తూర్పునాడులు, ఆరామద్రావిడులు నని మూఁడుభేదములుకలవు. కేవలద్రవిడులలో నఱవభాషమఱువనివారు,మఱచినవారు నిరుతెగలుగ నైరి. మఱువనివారు సాధ్యమగునంతవఱకు అఱవవారితోనే సంబంధబాంధవ్యములు చేసుకొందుమని యనెదరు గాని, మఱచినవారితోఁగూడ సంబంధములు చేసికొనుచుండుటఁ గానవగుచుండును. కొందరు పరిశీలకులు, ఈద్రవిడవైష్ణవులందే వడఘలి, తేంగలి భేదములు కలవుగాని, తక్కినవైష్ణవులు తేంఘలుగనే యున్నారని యనుచున్నారు. ఇంకను వడఘలులకు సంస్కృతవేదమునందుఁ బాక్షికమును తేంఘలులకు ద్రావిడవేదమునందుఁ బాక్షికమును నధికమఁట.

తూర్పునాడులు అనువైష్ణవులు కలరు. వా రిప్పు డాంధ్రులుగనే యున్నారు. వీరు తూర్పిల్ నాడు లేక తూర్పినాఁడను నఱవ సీమనుండి వచ్చినవారని కొంద ఱనెదరు. ఆదినుండియు నాంధ్రదేశపువారేయని కొందర నెదరు. వీరి కఱవము రాదు. వీరియందు స్త్రీ లఱవదేశపుస్త్రీలవలె వస్త్రము ధరింతురఁట. వీరిం గూర్చి పరిశీలన జరుగవలసియుండును.

ఆరామద్రావిడులను వైష్ణవశాఖకుఁ దోఁట యఱవవారని యర్థమగును. వీరి కఱవము రాదు. వీరిస్త్రీ లాంధ్రస్త్రీలవలెనే వస్త్రముం ధరింతురఁట. ఇంక నీద్రవిడవైష్ణవులలోనే మంగలంపాటివా రను వేఱొకశాఖ కలదని విందుము. వారు తఱుచుగ నుండమి వారింగూర్చి సరియగు సంగతులు తెలియరాకున్నవి.

ఆంధ్రశ్రీవైష్ణవులలో వెలనాటివైష్ణవులు (శ్రీవైష్ణవులమని చెప్పుకొనెడి) యాజ్ఞవల్క్యులు లేక ప్రథమశాఖవైష్ణవులు, బ్రహ్మపురవైష్ణవులు, ప్రధానశాఖలు. బ్రహ్మపురవైష్ణవుల నితరశాఖలవారు గోల్కొండవ్యాపారులనియు, తెలగాణ్యపునియోగు లనియుఁగూడ ననెదరు. గాని, యిది యసూయచేవల్కు పిలుపుగాఁగూడ గాన నయ్యెడిని. వీరిలో నాదివైష్ణవమనియు, మధ్యవైష్ణవమనియు, నవీనవైష్ణవమనియు, మూఁడు భేదములుగ నున్నారనియు, వీరియం దన్యోన్యసహపంక్తి భోజనములు లేకున్నను సంబంధబాంధవ్యములు కలవనియు, నొకవాడుక గలదు. నిజ మెట్టిదియో స్పష్టముగఁ దెలియరాకున్నను, వీరియం దాంగ్లవిద్యావిశారదులగు కొందరన్యశాఖలవారితో భోజనప్రతిభోజనములం గావించుచు మతకట్టుబాట్ల నంతగాఁ బాటింపనివారును గలరు. గాన వారియందు వైష్ణవదీక్షనందినవారు, నందనివారు నను ద్వివిధభేదములు వీరియందుఁగలవని తేలుచున్నది.

వైష్ణవులలో వైఖానసులు, పాంచరాత్రులు నను మఱిరెండుశాఖలు కలవు. వీరును వైష్ణవా

చారసంపత్తిగలవారే. వీరు తఱుచుగ దేవాలయములం దర్చకులుగఁ గానఁబడుచుందురు. వైఖానసులకు విఖనసఋషిప్రోక్తమగు వైఖానససూత్రము ప్రమాణగ్రంథము. వీరియందు సమాశ్రయణసంస్కారము, శ్రీవైష్ణవులందువలె నుండక గర్భచక్రాంకితరూపముగా జరుగునఁట. అనఁగా తల్లిగర్భమునం దుండగనే తల్లికిఁ దిరుగ చక్రాంకనము మొదలగు మతసంస్కారము లొనర్చుదురఁట. పిదప పురుషుల కుపనయనానంతరమునను, స్త్రీలకు వివాహానంతరమునను మతధర్మముఁగ సమాశ్రయణ మొనర్తురఁట. పాంచరాత్రులకుఁ బాంచరాత్రాగమము ప్రమాణగ్రంథము. వీరు సమాశ్రయణదీక్ష నందు వారే. శ్రీవైష్ణవులది బోధాయనసూత్రమని నెఱుఁగునది. (ఆంధ్రబ్రాహ్మణులు చూడుఁడు.)

**శ్రీశిష్టకులగోత్రము:—** ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.)

శ్రీశిష్ట (శిరిశిష్ట - శిరిశ్రేష్ట గోత్రము. ఏకాత్రేయ (౮౮) గోత్రము. శ్రీధరగణము-సంస్కృతిగోత్రము శ్రీధరస. ఆపస్తంబసూత్రము. యజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖణ్డ. సమాన గోత్రము. శండిల్యస శిరీషేశుఁడు దేవత. భార్య సిన్ధు. కైలాసము తపస్థానము. శ్రీసింధువు తటాకము. జపము లక్ష. దీపములు ౮౦. క్షేత్రసంఖ్య ౩౦. మేకపోతు దానము. చిఱుశనగలు వర్జనీయము.

**శ్రీశైలపర్వతము:—** కర్నూలుమండలములోని మల్లికార్జునశివలింగదేవస్థానమునఁ బర్వత మొకటి శ్రీశైల మనంబడుచున్నది.

గుంటూరుమండలములోని పలనాటిసీమలో మాచెర్ల రైలుస్థానమునుండి ౧౫ మైళ్ళదూరమున పల్లారెడ్డిగూడెముకడ నాగార్జునునికొండ యనియు, (సర్వసాధారణముగ) నల్లరాళ్ళబోడనియు వాడంబడుచున్న యొకపాటికొండయు, నాపరిసరప్రదేశమునకును శ్రీశైల పర్వతమని పేరు కలదు. [నాగార్జునుని కొండ చూడుఁడు, నాగార్జునుని సుహృల్లేఖ చూడుఁడు].

**శ్రీశైలక్షేత్రము:—** ఆంధ్రదేశమునందలి యీసుప్రసిద్ధశివక్షేత్రము కర్నూలుమండలములోనిది. శ్రీశైలమల్లికార్జున శివలింగము ద్వాదశతేజోలింగములలో నొకటిగను, అచటి భ్రమరాంబాశక్తి పీఠ మష్టాదశశక్తిపీఠములలో నొకటిగను చెప్పఁబడియుంట నిది కడుపవిత్రస్థలిగ నెంచి సరియగు మార్గసౌకర్యము లేకున్నను మహాశివరాత్రికి యాత్రికులు వేలకువేలుగ తండోపతండములుగఁగూడి బహుకష్టముల కోర్చి దర్శించుచుందురు. సగటున నీయాత్రయందు మార్గమున నీటివసదుపాయము కష్టమని వాడుక గలదు. మార్గ మంతయు నెంచువారి సాహాయ్యముంగొని నడకను, డోలీలపైనను ప్రయాణములు సాగింతురు. దేవాలయము కట్టడములు కడుపురాతనములు. స్కాందపురాణమునను, మహాభారతమునను, ఈమహాక్షేత్రము ప్రశంసింపఁబడియుంట కడుపురాతనస్థలమని చెప్పక తప్పదు. ఇచటఁగల కృష్ణానదికి 'పాతాళగంగ' యనెదరు.

సుప్రసిద్ధశివభక్తుండై యపరశివావతారముగ శైవులచే నెన్నఁబడు నందికేశ్వరుని తండ్రియగు శిలాదమునియు, నాయన రెండవసుతుండగు పర్వతుండును, ఈక్షేత్రమున తపంబులొనర్చి సిద్ధిఁబడసి పరమేశ్వర ప్రసన్నతంగాంచిరని చెప్ప

బడినది. మల్లికార్జున శివలింగమునఁ బర్వతుఁడు ధరించిన యిష్టలింగ మైక్యమైనదిగ శైవు లిట నధికభక్తిఁ గల్గియుందురు. గుప రాజవంశమునకుఁ జెందినరాకొమరిత మల్లిక యను ముద్దుపేరుగల చంద్రావతీదేవి మగధనుండి యిట కేతెంచి, శివ లింగమును మల్లెపూవులం బూజించుచు గొప్ప భక్తురాలై తా నం దైక్యము క్తి నందుట నాఁడా దిగ నీశివలింగము మల్లికార్జున (అర్జున=తెలుపు) స్వామిగ పేరువాడుక యయ్యెనని చెప్పఁబడు చున్నది.

ఇచటికేగు మార్గములకు లెక్కలేదు. పెక్కం డ్రు నందియాలుస్టేషను (M. S. M. మీటరు గేజి బెజవాడ, గుంతకల్లులైను) నందు దిగి, యట నుండి 30 మైళ్ళదూరమున నున్న ఆత్మకూరు నకు మోటారుబస్సులలో నరిగి, యింక మూప్ప దిరెండుమైళ్ళదూరమం దున్న శ్రీశైలమునకు నాగలూటి పేటచెరువులమీఁదుగా నేగుచుం దురు. పేటచెరువునుండి గుఱ్ఱము లద్దెకు దొరకు నఁట. యాత్రికులబసలు దేవాలయమంటపము లందుఁ గుదిరెడిని.

ఈపర్వతముయెత్తు ౧౫౭౦ అడుగులు. క్రీ. వె. ౧౬౮ ప్రాంతముల నీదేవాలయకట్టడములు నిర్మింపఁబడినవని పోల్చుచున్నారు. కృష్ణానదిశాఖ యగు పాతాళగంగ దీనిప్రక్కఁబడి ప్రవహించె డిని. దానిలోనికి దిగుటకుఁ బోలభూపతిసుతుండు వేమనృపాలుఁడు సోపానములం గట్టించెనియు నందురు. క్రీ. వె. ౧౨ శతాబ్దకాలమునకు సరి పోవుశాసన మొకటి యటనున్నది.

## శ్రీహత్తపురము (సిల్హెటన్):—

ఇప్పటి బంగాళమునందున్నపురము. దీనింగూర్చిన ప్రశంస యోగినీతంత్రము ౨ — ౬ యందుఁ గలదు.

## శ్రీహరిదాసు ఆచార్యుఁడు:—

ఈమహాత్మునితండ్రిపేరు సనందుఁడు. ఈయన వ్రజమండలములోని గోల యనుగ్రామమున గిరిధరుఁడను విష్ణుదేవునిం బ్రతిష్ఠించిన విష్ణుభక్తుఁ డఁట. మాతామహుఁడు బృందావనముకడ రాజమా యనుగ్రామనివాసియగు గంగాధరుఁ డనువిప్రుండఁట. విక్రమశకము ౧౭౭౧ వీరిజన్మ కాలమని చెప్పఁబడినది. బృందావనముకడనున్న మానసరోవరము నివాసము. గొప్పవిష్ణుభక్తులు. వీరిప్రథమశిష్యుఁడు, ఈయనతల్లిగారి మేనమామ యగు విఠ్ఠలభూపాలుఁడు. వీ రనేకమాహాత్మ్య ములు కనపఱచిరఁట. కడునృద్ధులై విక్రమశకము ౧౫౩౭ లో మృతిఁజెందిరఁట. (వీరికి 96 వ ఏట) వీరికిఁబిదప విఠలదాసు, బిహారీదాసు, నగరి దాస్, ఒకరితర్వాతనొకరుమహాన్తులై మఠాధిపతు లైరని చెప్పఁబడినది. వీరిని సన్యాసు లందురు. ఈ మతసులు బృందావనప్రాంతమున నున్నారు.

## శ్లీపదరోగము [బోదకాలు]:—

ఆంగ్ల Elephantiasis — బోదకా లనియు, బూరగా లనియు నందురు. Fileria యనియు, కొంద అనుట కలదు.

అప్పటప్పట పైత్యాధిక్యతఁగల్గుచో జ్వరము దగులుచుండువ్యాధి. ఒక్కొకతఱి పౌర్ణములందు నను, ఒక్కొకతఱి నమావాస్యలందునను జ్వరము గల్గుట గలదు. ఈవ్యాధి చేతులకుఁ గూడఁ గల్గు చుండుట కలదు. ఒక్కొకతఱి పురుషులకు వృష ణములకు సంబంధము గల్గియుండును.

## శంగర్షిగోత్రము:—

ఈ గోత్రమువారికిఁ బ్రధానర్షులు భారద్వాజుఁడు, ఆంగిరసుఁడు అని యు, ప్రవర ఆంగీరస, బార్హస్పత్య, భరద్వాజ,

త్రియార్షేయ మనియుఁ జెప్పఁబడినది. శమంత రావుపా రనునింటిపేరుగలవా రీగోత్రజులు.
(శిష్టకరణములు చూడుఁడు).

**శుంగవంశనృపతులు:**— వీరు మౌర్యులకుఁ బిదప మగధరాజ్యమేలినవారు. వీరు క్రీ. పూ. ౧౮౫ మొదలు ౭౩ వఱకుఁ బాలించిరి. అనఁగా ౧౧౨ సంవత్సరములు పాలించిరి.

శుంగవంశస్థులగు నగ్నిమిత్రుఁడు, పుష్యమిత్రుఁడు మాధ్యమికదేశపాలనకూడ నెఱపిరఁట.

**శుకగోత్రము:**—
(హిమోదక ఉపగణము చూడుఁడు).

**శుకతుండహస్తము:**—
(హస్తాభినయము చూడుఁడు, భరతశాస్త్రము చూడుఁడు).

**శుక నలికా న్యాయము:**— శుకము, నలికము ననునవి యంత్రములు. ఇవి యుద్ధములందు రథ, గజ, తురగములకు హాని యొనర్చు యుద్ధపరికరము లని చెప్పఁబడినది. చూడ సౌందర్యముగానే యుండునఁట.

పైకి మంచిగనే గన్పడియు, ఘోరకృత్యము లొనర్చువారింగూర్చిన న్యాయము. అనవసరమగు భీతిం దెల్పుట కీన్యాయము వాడుకచేయుటయుఁ గలదు.

**శుకమహర్షి:**— తండ్రి వ్యాసమహర్షి. తల్లి శుకరూపిణియగు ఘృతాచి. శుకుఁడు జ్ఞానయోగాభ్యాసమొనర్చిన మహాయోగి. గమనసిద్ధి గలవాఁడు. సర్వాంతర్యామి. తండ్రికడనే వేదశాస్త్రములం జదివి, యాయనపంపున మిథిలాపురాధినాథుండగు జనకచక్రవర్తికడ జ్ఞానవిద్య నెఱింగెనని చెప్పఁబడుట శ్రీరామునిసమకాలికుఁడని తేలుచున్నది. తన్నుఁగోరి వచ్చి వలపించఁ జూచిన రంభ నీతఁడు నిరాకరించెను.

జనకునియాజ్ఞమేరకు పీవరి యనుకన్యను శుకుఁడు పరిణయమై ౧ కృష్ణుఁడు, ౨ గౌరప్రభువు, ౩ భూరి, ౪ దేవశ్రవుఁడు ననుకొమరులను, కీర్తి లేక కీర్తిమతి యనఁబడినకుమార్తెను గనెనని వేఱొకచోఁ జెప్పఁబడినది.

అనుహానిభార్య యని చెప్పఁబడినది.

**శుకయోగి [శ్రీశుకుఁడు లేక శుకాచార్యుఁడు]:**— వేదవ్యాసుని (బాదరాయణుఁడు లేక కృష్ణద్వైపాయనుని) పుత్రుఁడు. తల్లి శుకరూపమున విహరించుచుండిన యచ్చర. పితామహుఁడు పరాశరుఁడు. ప్రపితామహుఁడు శక్తి. ప్రప్రపితామహుఁడు కడపటివసిష్ఠుఁడు. [మహర్షి] బహుశః ఈవశిష్ఠుడే గాధిరాజసుతుఁడును, కన్యాకుబ్జభూనాథుఁడుగ నుండిన విశ్వామిత్రునితపోబలమున తొంబదితొమ్మండుగురు సుతులం గోల్పోయినవాఁడని తోఁచెడిని.

శుకాచార్యుఁడు యోగాభ్యాస మొనర్చి శుకయోగి యనంబడెనఁట. ఆత్మజ్ఞానిగఁ జెప్పఁబడినవాఁడు. జీవన్ముక్తుఁడై పరఁగినవాఁడు. జన్మకాలముననే యాత్మజ్ఞానిగ నుండి [వామదేవుని వలె] సర్వజగద్వస్తువితతియుఁ బరమేశ్వరునియందే చేరియున్నదనియు, తాను నందులోని వాఁడే యగుట, తానని యనుకొనుట కన్య లేదని యెఱింగి, అహంకార, మమకారములఁ బాటింపనొల్లనివాఁ డనియు, బదరికాశ్రమమునఁ దపోనియతిచేఁ గాలముఁగడపెననియుఁ జెప్పఁబడినవాఁడు. ఈయునినిష్ఠకు భంగము గల్గింప రంభ యొకతఱి ప్రయత్నించి, విఫలమనోరథ యాయె

నని 'శుకరంభాసంవాద' మందుఁ జెప్పఁబడినది. ఈయనకు గౌడపాదాచార్యుఁడు శిష్యుఁడఁట. [శుద్ధాద్వైతగురుపరంపర చూడుఁడు.] శుకయోగి వామదేవునివలె జన్మకాలమునందే యాత్మజ్ఞాని యని మున్ను వివరించియుంటిమి. ఆవామదేవుఁడు తల్లిగర్భమునందుండియే తన పూర్వజన్మముల వృత్తాంతముల వివరించెననియు, వ్యాసుండు తన బ్రహ్మసూత్రములందు వామదేవుంగూర్చి ప్రశం సించియుంట వ్యాసునకుఁ బూర్వుండో లేక సమ కాలికుఁడో యైయుండవలెను. కొన్నిస్మృతులందు వామదేవుఁడును, శుకయోగియు జన్మకాలము నకే యాత్మజ్ఞానులు, జీవన్ముక్తులు నని చెప్పఁబడి యుంట గాననగును.

**శుక్లవాతము:—** శుక్లము, శోణితము చెడి, పల్చనగుటయు పకారణముగఁ బడిపోవుచు, క్షీణించియుండెడిజబ్బు.

**శుక్రవారము (Friday):—** ఇది కవి యొక్క సుతుండగు కావ్యుఁడు తెల్లనితేజస్సుఁ గలవాడగుట శుక్రుండు, లేక శుక్రాచార్యుఁ డనఁబరఁగిన రాక్షసగురునిపేరఁబరగు వారదినము. ఈయన గొప్పవిద్వాంసుఁడును, గొప్పతపస్వియు ననియుఁ జెప్పఁబడినవాఁడు. ఈయనయాశ్రమము భరుకచ్ఛపురము (ఇప్పటిబ్రోచి) కడ నుండెను. ఈయన బలిచక్రవర్తిచేఁ గ్రతువులం జేయించిన వాఁడు. మఱియు హిందువులకు శుక్రవారము మహాలక్ష్మీదేవికిఁ బ్రీతియగుదినము. శ్రావణమా సమునందలి శుక్రవారములందు స్త్రీలు వరలక్ష్మి పూజ లొనర్తురు.

స్కాండినేవియాదేశమునందు దేవుఁడని చెప్పఁ బడిన వోడెన్‌భార్యయు, Thor నకుఁ దల్లియునై యుండెను. ఈమెయే Throyam అనురాక్షసుని వరింప నిరాకరించి, Thro చే నాతనిఁజంపించి నది. ఈమెపేర నీవారదినము పరఁగ నేర్పాటుఁ జేసిరి. ఇది పవిత్రదినముగఁ గొందఱును, దురదృ ష్టదినముగఁ గొందఱును, వాడఁబోడఁగిరి. (బుధ వారము, గురువారము చూడుఁడు.)

బైబిలునందు శుక్రవారమున జలచరములగు జంతువులను, పక్షులను సృజించెనని చెప్పఁబడినది.

**శుక్రవారదురదృష్టములు:—** ప్రభువైన ఏసుక్రీస్తు శుక్రవారమున సిలువవేయఁబడెనఁట. గానఁనే రోమనుక్యాతలిక్కు క్రైస్తవులు శుక్రవా రములం దుపవసింప నిచ్ఛగింతురఁట. క్రైస్తవు లందు శుక్రవారముల నధికముగ నవ్విన నాదివార ములలోపున నేడ్పు సిద్ధమగునని యొకనమ్మకము గలదఁట. ఆదాము హవ్వలు శుక్రవారమున ఏడెన్‌తోఁటయందుఁ దినకూడని పండు తిని తిరుగ నాదినముననే మృతింగూడ నందిరఁట. క్రీ. వె. ౧౭౪౫ డిశంబరు ౬ తేదీని ఇంగ్లాండునకు దుర్వార్త చేరుకొన్న నాఁడు శుక్రవారముగుట 'Black Friday' అని నేఁటికిని వాడుచున్నా రు. పౌర్ణమినాఁడు శుక్రవారము తటస్థమగు నేని కాలము వ్యత్యాసముగ నుండునని యాంగ్ల సామెత యొకటి కలదు.

**శుక్తిమతీదేవి:—** ఈపేరుగల నదియుఁ గలదు. భర్త కోలాహలుఁడు. కుమార్తె శిరికా దేవి. ఈమెభర్త వసుమహారాజు.

**శుక్తిమతీనది.—** వసుచరిత్రయందు వివ రింపఁబడిననది. కోలాహలపర్వతమున జనించునది. చేదిదేశము (బండెల్ఖండు) నఁ బ్రవహించునది. మహాభారతము. ఆది ౬౩ యందు దీనిప్రశంస కలదు. పార్గితార్ పండితుఁడు దీని నిప్పటి 'కేన్' నదిగాఁ బోల్చియున్నాఁడు. ఈనదీతీర పురమగు

శుక్తిమతీపురము చేదిదేశపురాజధాని. మహాభారతము వనపర్వము ౨౦ యందుఁజెప్పఁబడినది.

కేన్ నదినే బౌద్ధగ్రంథములందు 'సొత్తివతి' యని వ్రాసియున్నారు. (యజాభుక్తిదేశము చూడుఁడు.)

## శుక్తిమతీపురము:—

త్రిపుర లేక అనూపదేశములోనిది (చూడుఁడు.)

బౌద్ధగ్రంథములందు శుక్తిమతికి సొత్తివతి యని పల్కిరి. చేదిదేశమునకు 'చేతి' యనిరి.

## శుక్తిమానపర్వతము:—

(భల్లాటదేశము చూడుఁడు.)

## శుక్రుఁడు లేక ఉశనుఁడు:—

రాక్షసగురుఁడు. ఏకాక్షి. ప్రకాశమానమగు తెల్లనిశరీరచ్ఛాయఁ గలవాడగుట శుక్రుఁడనియు, కలియనియు, నుశనుఁడనియు వాడుకపేరులు గలవాఁడు. బ్రహ్మమానసపుత్రుఁడగు భృగువుయొక్క పౌత్త్రుఁడని తెలియుచున్నది. శుక్రునితల్లి వహాన. ఇంద్రుఁడు దేవలోకమున నుండకుండుటకుఁ దపమొనర్చుచుండ విష్ణుదేవునిచే నిహతయయ్యెనఁట. శుక్రునికుమార్తెలు ౧ అరజి. ఈమె తండ్రి యాశ్రమమునఁ దపంబొనర్చుచు, సిక్ష్వాకుమహారాజపుత్త్రుఁడై యాతనిచే త్యజింపఁబడి, దండకారణ్యమున మధుమత్తమను పురముంగట్టుకొని యేలుచుండిన దండునిచే బలాత్కరింపఁబడినది. పిదప శుక్రశాపమున దండుఁడు నిహతుఁడయ్యెను. రెండవకుమార్తె దేవయాని. యయాతిమహారాజుపట్టపుదేవి. ఈమెవలన యయాతి యదువు, తుర్వసువు నను నిర్వురుసుతులం గనియెను. శుక్రుని భార్యపేరు ఊర్జస్వతి. ఈమెతండ్రిపేరు ప్రియవ్రతుఁడు. ఈమె దేవయానితల్లి.

## శుచి:—

ఈపేరుగలవారు ముగ్గురు కలరు. మిథిలవంశస్థుఁడగు నొకక్షత్త్రియుఁడు శుచి యను పేరుగలవాఁడు కలఁడు.

యదుసంతతిలో నంధకునిపుత్రుఁ డొకఁడు శుచి యనిపేరుకలవాఁడు.

ఆయువుపౌత్రుఁడగు శుద్ధనిసుతుఁ డొకఁ డీపేరు గలవాఁడే. పితామహుఁడు అనేనస్సు.

మగధ బార్హద్రథ సంతతి క్షత్త్రియుఁడు. తండ్రిపేరు విప్రమహారాజు. పితామహుఁడు. శ్రుతంజయుఁడు. పుత్రుఁడు క్షేముఁడు. (ఇతఁ డొక శుచిమహారాజు.)

## శుచిరథుఁడు:—

పాండవసంతతి క్షత్త్రియుఁడు. తండ్రి చిత్రరథుఁడు. పితామహుఁడు ఉష్ణుఁడు. కుమారుఁడు వృష్టిమంతుఁడు.

## శుద్ధశైవము:—

ఇది చతుర్దశ శైవ భేదములలో నొకటి. (చూడుఁడు.) ఈమతస్థులు దక్షిణదేశమున మొదలియారులుకులస్థులుగను, పిళ్లైకులస్థులుగను కొందఱు గానఁబడుచున్నారు వీరు శివార్చనమున ముక్తి (శివసాన్నిధ్యావాసము శివైక్యము) కల్గుననియెదరు. ఈమతమున పతి పశుపాశము లనంబడు త్రిపదార్థములును, మల త్రియమును, శివసమవాది మతమునందు వలెనే యుండును. వీరు త్రిపదార్థములందు సచ్చిదానందబ్రహ్మనిశ్చయముం దెల్పి మానము, నిష్ఠ, శివార్చనకాలములందు విధిగఁ దెల్పెదరు. వీరు భస్మరుద్రాక్షధారులుగ నున్నారు.

## శుద్ధాద్వైతగురుపరంపర:—

శుద్ధాద్వైతులు తమగురుపరంపరను తొలుత నారాయణుం డనియు, పిదప విధాత యనియు నను చుందురు. పిదప నీగురుత్వ మెట్లో వసిష్ఠునకుం

జేసెనఁట. ఆవలి వ్యైవశిష్ట్యో తెలియదు. పిమ్మట నాచార్యబిరుదము వారినుండి ప్రారంభమైనది. ఆయనకుఁ బిదప శక్తి [ఆచార్యుఁడు] యు, పిదపఁ బరాశరుఁడును, పిదప వ్యాసుఁడును, పిదప శుకుండును నాచార్యత్వము వహించి గురువులైరి. శ్రీశంకాచార్యునకు గౌడపాదుండు శిష్యుఁడాయెను. గౌడపాదాచార్యునకుఁ బంద' శిష్యుండై గోవిందభగవత్పాదుం డనుపేరఁబరఁగెను. ఈయనయే సుప్రసిద్ధుండగు శంకరభగవత్పాదులగురుండని వీ రనెదరు గాని, యిది పలింపఁబడఁదగినది. [శంకరభగవత్పాదులు, గోవిందభగవత్పాదులు, గౌడపాదాచార్యులు, పతంజలి చూడుఁడు].

శుకునివద్దనుండియు, తరువాతి గురుపరంపర ఆచార్యబిరుదమునకు, పరివ్రాజికాచార్య బిరుదముఁ గూడనందియున్నారు. వారిఆశ్రయసన్యాసమునకుఁ 'బరమహంస' యనిపేరు. శంకరభగవత్పాదులు స్థాపించిన వేర్వేఱుపీఠాధిపతులగు గురుపరంపరలను వేర్వేఱుగ నీగురుపరంపరలకుం జేర్చి, చెప్పుదురు. వారిని 'పరమహంసపరివ్రాజికాచార్య యనియు, అందరికి సాముదాయకముగ శంకరాచార్య యనియు బిరుదములు వాడుచుంట యాచారమైయున్నది.

**శుద్ధాద్వైతమఠములు**:—అద్వైతసిద్ధాంతమునకుఁ గొన్ని కట్టుదిట్టములగు మార్గములం గుదిర్చి, శుద్ధాద్వైతరూప మమర్చినవారిలో ముఖ్యుఁడు శంకరభగవత్పాదులు. (అద్వైతమతములు చూడుఁడు).

శంకర భగవత్పాదుల తండ్రిపేరు శివగురువు. తల్లి మహాపండితుని కుమార్తెయగు ఆర్యాంబ. మళయాళదేశమున కాలాటి (ఇప్పటిపేరు కల్లాడి) అగ్రహారము. జన్మస్థానము క్రీ. వె. కలియుగము 3౦౫౮ సం॥ ఈశ్వరనామ సంవత్సర వైశాఖ శుద్ధ ౫ భానువారము, ఆర్ద్రానక్షత్రము జన్మకాలమని చెప్పఁబడినది. ఈయనకు వ్యాఖ్యాసింహాసనాసీనాది బిరుదములు గలవు.

ఈతం డద్వైతమత వ్యాపకమునకు నాలుమఠములు స్థాపించెనఁట. అందు నాలుగు ముఖ్యములు.

౧ జ్యోతిర్మఠము—ఉత్తరము. దీనిని జ్యోషీమఠమనియు నందురు. బదరీనారాయణమున కేగు మార్గమునందున్న శుద్ధాద్వైతమఠము. అసలు మఠము తొల్లింటి బదరీనాథము (బదరీనాథము) దే. ఇందు తోటకాచార్యుల నధిపతిగ నుంచెనఁట తోటకాచార్యులు శంకర శిష్యుఁడు. మఱియు నానన్దగిరి లేక ప్రతర్దనుఁడు నను పేర్లుగలవాఁడు.

౨ గోవర్ధనమఠము—(పూర్వమఠము) దీనికి భోగవర్ధనమఠ మనియుఁ బేరుకలదు. ఇది శ్రీ జగన్నాథక్షేత్రమున సముద్రతీరమం దున్నది. ఇందుఁ బద్మపాదాచార్యుండను శిష్యు నధికారిగ నుంచెనఁట. ఇతనికి సనందనుఁడనియుఁ బేరు కలదు. ఈతండే శంకరులకు మొదటి శిష్యుఁడైనవాఁడు.

3 శృంగేరిమఠము— (ఋష్యశృంగిమఠము) ఇది తొల్లింట విభాండకర్షి యాతనిసుతుఁడగు ఋష్యశృంగర్షి యాశ్రమములు నిర్మించుకొనిన తావు. ఇది దక్షిణమఠము. ఇది యిప్పుడు మైసూరుసంస్థానరాజ్యమున కాడూరు జిల్లాయం దున్నది. మిగుల ధనవంతమును, ఎక్కువ భూస్వాస్థ్యముఁ గల్గినదిగ నున్నది. ప్రభాకరపుత్రుండగు పృథ్వీధరాచార్యుల నధి

కారిగ నియమించెను. ఈతని హస్తామలకా చార్యుఁడనియు వాడుకయుండెనఁట. కాని శంకరవిజయమున సురేశ్వరాచార్యుండే యిట నుండెనని చెప్పఁబడినది.

౪ శారదామఠము—(పశ్చిమమున) ఇది గుజరాతుదేశములోని ద్వారకయందున్న మఠము. ఇందు విశ్వరూపాచార్య (తొల్లింటి మండన మిశ్రు) లను నధికారమున నుంచెనఁట. మఱియు, నిట సురేశ్వరాచార్యుఁడును బ్రహ్మస్వరూపాచార్యుఁడును నుండిరనియుం జెప్పఁబడినది.

ఈముఖ్య మఠములు గాక సుమేరుమఠమనియు, పరమాత్మ మఠమనియుఁ గూడ నుండెనఁట.

శంకరాచార్యులు తన ౩౨ వ యేట సిద్ధినంది (మరణించి) రని చెప్పఁబడినది. ఇది కలియుగమని ౩౮౮౯ — ౩౧౦౧ యనియు, ౨౬౩౧ లేక ౩౧౦౩ అనియు, నభిప్రాయభేదములతో తలంచుచున్నారు.

శృంగేరి మఠమున కొకశాఖగా హంపి (జీర్ణవిజయనగరము) యందు విరూపాక్ష పీఠమునది యొకటి, తొల్లింటి మాధవాచార్యుం డనఁబరఁగిన విద్యారణ్యస్వామి యొకపీఠమును, దానికి శాఖగా నభినవవిరూపాక్షపీఠమని, ఉద్దండనృసింహభారతి యను వేఱొకస్వామి వేఱొకపీఠమును స్థాపించిరి.

**శుద్ధాద్వైతమతము:**- ఇది షడ్వేదాంతవాదిమతములలో నొకటి. ఇది యాదినుండియు నుండినమతము. దీనిని శంకరభగవత్పాదులు కొంచెముగ మార్చియు, స్పష్టపఱచియు, బోధించి వ్యాపింపఁజేసిరి. పెక్కండ్రు వారియందలిభక్తిచే నీమతమునకు శంకరాచార్యులు కర్త యనియే చెప్పుచుందురుగాని యిది యతిశయోక్తికన్న వేఱుగాదు. ఇంకఁ గొందఱాయనను పరమేశ్వరునియవతారమే యందురు. ఇవి యన్నియు నిరర్థకవచనములు. కాని, యీమతము నెక్కువగా వ్యాపింపఁజేసి, ప్రస్తుతస్థితికిఁ దెచ్చినమహనీయుఁడు శంకరభగవత్పాదదేశికుఁడే గాన, నాతని చరిత్రి మించుక వివరించుట సమంజసము గాకపోదు.

శంకరులు మళయాళదేశమున 'కాలటి' యను గ్రామమున జన్మించినవాఁడు. తండ్రి శివగురువు. తాత విద్యాధినాధుఁడు. తల్లి ఆర్యాంబ. కాలటి గ్రామమునకు తొల్లింట 'శశల' మను పే రుండెనఁట. వృషభాచలప్రాంతమనియు, పూర్వవాహిని యగు నొకానొక నదీతీరమనియుఁ జెప్పఁబడినది. పితామహుఁడు మహాపండితుఁడు. జన్మకాల మీశ్వరసంవత్సర వైశాఖశుద్ధ పంచమి ఆదివారము, ఆర్ద్రానక్షత్రమని చెప్పఁబడినది. వీరు తురీయాశ్రమముఁ (సన్యాసము) గైకొనినవారు. వీరింగూర్చి ప్రత్యేకస్థలములందుఁ జూడనగును.

శుద్ధాద్వైతమతసిద్ధాంతమున, పరబ్రహ్మము నిర్గుణము, నద్వితీయము, సత్యము. నామరూపములు వహించి, సత్వరజస్తమోగుణ సంబంధము గల్గిన జగత్తువలె మిధ్య గాదు. (నశించునది కాదు) గావున నీమతస్థులు 'శివ స్సత్యమ్ జగన్మిధ్యా' యనెదరు. ఈమతమునం దీరెండే ముఖ్యవస్తువులు. ఇంక మాయ యనంబడునది బ్రహ్మ వలనఁ గల్పింపఁబడినది. అట్టి కల్పింపఁబడిన మాయతోఁ గూడిన బ్రహ్మమే ప్రధానపురుషుఁడు. జగత్తంతయు బ్రహ్మపదార్థమే యగుట, పరబ్రహ్మస్వరూపమే. బ్రహ్మమునందు (నామరూపములచే నలరారు) మిధ్యయగుజగత్తు భ్రాంతిమూలమున గోచరించుచున్నదని చెప్పఁబడినది.

చీఁకటియందు త్రాడు సర్పమువలె నెటుల భ్రాంతి గల్గించునో, యటులనే సత్యమగు బ్రహ్మము నందు మిథ్యయగుజగత్తు భ్రాంతి యనిచెప్పఁబడి నది. మిథ్య యసత్యము గాన, నశించునదియై సత్యము కానేరదు.

వస్త్రములందు నూలుపోగులవలె బ్రహ్మము మిథ్యాభూతమగు జగత్తునకు మూలకారణ మని చెప్పఁబడినది. బ్రహ్మమే మూలకారణమై సమ స్తమునం దున్నదనిభావము. బ్రహ్మకల్పితమగు మాయ యందరిహృదయములందుఁ బ్రకాశమా నమై యుండియున్నది. మాయ కవిద్య యనియుం బేరు కలదు.

జీవుఁ డవిద్యనుగూడియుండిన కారణమున తా నెఱుంగఁగల, వినఁగల, చూడఁగల, సకలపదార్థ ములకును తాను భిన్నుఁడ నని తలంచుచుండుట సంభవించుచున్నది. ఇది మాయకార్యము గాని వేఱుకాదు. ఈయవిద్యవలనఁ గల్గినలక్షణములు భ్రమలు జ్ఞానముచే నశించెడిని. అవిద్యవలన నిటు లనే కల్పింపఁబడినది సంసారము. జ్ఞానము గల్గి యవిద్య నశింప నారంభించెనేని సంసారభ్రాంతి యుఁ దగ్గెడిని. సంపూర్ణజ్ఞానము కల్గుటతో సర్వ భ్రాంతులు వదలి, తనకు దృశ్యమగు సర్వమును సత్యమగు బ్రహ్మపదార్థమని గోచరించును. సం సారభ్రాంతి నశించును. ఆత్మ పరబ్రహ్మపదార్థ మని స్పష్టపడును. గాన జీవబ్రహ్మైక్యము స్థిర పడును. ఇదియే మోక్షము.

అనాదిగ నవిద్యకుఁ బాల్పడి, (అజ్ఞానముచే నావరింపఁబడి) యున్న బ్రహ్మపదార్థమే శివమని చెప్పఁబడినది. జీవము బ్రహ్మపదార్థమయ్యు ననాదిగ నజ్ఞానవశమై ౧ మలము, ౨ కర్మ, ౩ మాయ, ౪ మాయాస్థమగుజగత్తు, ౫ తిరో ధానకరశక్తి యనంబడు పంచపాశములకు లోనై కారణ, సూక్ష్మ, స్థూలశరీరములలో నుండు పురుషత్వము (కర్మానుభవము) నకుఁ బాల్పడి, షడూర్ములు, షడ్వికారముల నందుచుండును.

మనస్సునకు శోకమోహములు, ప్రాణమునకు క్షుత్పిపాసలు (ఆకలిదప్పులు), స్థూలదేహమునకు జరా మృతులు (ముసలితనము మృతి), షడూ ర్ములుగ బాధించుచుండును. ఇంక ౧ గర్భస్థత [తల్లికడుపులోనుండుట], ౨ జన్మత [పుట్టుట], ౩ అభివృద్ధి [పెరిగి పెద్దలగుట], ౪ పరిణామము [పండుట లేక వార్ధక్యదశనందుట] ౫ క్షీణత [కృశించుట లేక కృంగుట], ౬ వినష్టత [మృతి నందుట] షడ్వికారము లనంబడును. ఇవి యవిద్య సంయోగఫలితములుగ ప్రాణికిఁగల్గిన విపరీతములు.

జీవునకు గురూపదేశజన్యమగు దశమవివేకజ్ఞా నమే యీమతమున ముక్తిసాధనముగఁ జెప్పఁబడి నది. ఇట దశమవివేకజ్ఞాన మన, ఆత్మ పరబ్రహ్మ మేగాని యన్యము గాదనియు, అవిద్యకల్పించిన మిథ్యారూపమగుజగత్తసత్యమైనదనియు తనకుఁ బరబ్రహ్మమునం దైక్యమున కర్తృత్వము గలదనియు, తనస్థితి నెఱుంగుట యని యుందలిభావము. ముక్తి యన నీమతమున విడుదల లేక 'విముక్తి' యని యెఱుంగునది.

మఱియు నీయద్వైతమతమునందు 'ప్రతిబింబ' వాద మనియు, 'అవచ్ఛేదవాద' మనియు ద్వివిధ వాదములును, 'ఏకజీవవాద' మనియు, 'ననేక జీవవాద' మనియు మఱిరెండువిధములగు వాద ములును, గానఁబడుచున్నవి.

అద్దములో వస్తువు ప్రతిబింబించునటుల పర బ్రహ్మము ప్రతిబింబించుచున్నదనియు, అప్రతి

బింబావస్థయే జీవుఁడనియు, ననునది ప్రతిబింబ వాద మనఁబడును.

ఆకాశము సర్వత్ర ఒకటియే యయ్యు, నింటి యందుఁ గన్పించు నాకాశమునకు అపవరాకాశ మనియు, కుండయందు నిండియున్న యాకాశము నకు ఘటాకాశ మనియు, నెటుల పేరులు కలవో యటులనే పరబ్రహ్మము సర్వత్ర యొకటియే యయ్యు, అంతఃకరణమునకు గోచరమగు బ్రహ్మ ము జీవుఁడనునది 'అవచ్ఛేదవాద' మనఁబడును.

గోచరమగు సంసారమున నొకశరీరములో జీవము కలదనియు, ఆజీవునకు స్వప్నమువలెఁ గలి గిన భ్రమయే సంసారమనియు, జీవునకు ముక్తి కల్గుటయన సంసారసృష్టి సమాప్తియగుననియు ననుటయేక జీవవాద మనఁబడును. ఈవాదమున నింతవఱకెవ్వరు ముక్తినందినటులఁ జెప్ప వీలుండ కున్నది.

ఒక్కొకశరీరమునం దొక్కొకజీవము కలదని యు ననుట 'యనేకజీవవాద' మగును. ఇం దనే కులు ముక్తులగుటఁ జెప్ప వీలుకలదు. ఇంకను ముక్తులగుచుండుటకు వీలు కలదు.

**శుద్ధుఁడు:—** ఆయువుపౌత్రుఁడు. అనే నసునికుమారుఁడు. కుమారుఁడు [3 శుచి].

**శునకగోత్రము:—**

[శౌనక లేక గృత్సమదగణము చూడుఁడు.]

**శునక (కుక్కల) శాస్త్రము:—** శునక శాస్త్రముంగూర్చి పూర్వోత్తరము లేమియు సరిగాఁ దెలియకున్నను పరిశీలించిన యనుభవ ముపైఁ దెల్పినదని మాత్రము తోఁచకపోదు. కుక్క కడువిశ్వాసముగల జంతు వగుటయే గాక కొంతవఱ కూహాపోహాలం గల్గి, తనయూహాలను తనయజమానిని కెఱుంగఁజేయు సంజ్ఞలం గొన్నింటిఁ దెలిసినదని తోఁచుచున్నది. ఆసంజ్ఞలయం దనేక ములు దుర్గ్రాహ్యములై యెఱుంగ నశక్యముగ నుంట నీశాస్త్రము నెఱింగిన వానిం గ్రహింప నగునని చెప్పఁబడినది. ఇది గ్రామసంబంధము, గృహసంబంధము, వీధిసంబంధము, వర్షసంబం ధము, ప్రయాణసంబంధము, శుభాశుభఫలసం బంధము నని యాఱుభేదములుగఁ జెప్పఁబడినది.

౧ గ్రామసంబంధఫలములు:— గ్రామమున పెద్ద యగువానియింటియెదుట కుక్కలు రొద చేయుచు నేడ్చుచుండిన నాకుటుంబ మా దేశమువీడి యన్యస్థలములకుఁ బోదురని చెప్పఁ బడినది. ఇది యుదయకాలమున, ప్రధాన మనియు, వారియింటిపై పుదరికి కుక్క లఱ చుట వారికి స్థానచలనప్రద మనియుఁ జెప్పఁ బడినది.

గ్రామము శ్మశానముల మధ్యకు తిరిగి డుచుఁ గుక్కలు రొదఁజేయుచుండిన గ్రామ మునం దపమృత్యుకరమరణములు సంభవించు నియు, గ్రామమున ప్రముఖులు మరణింతు రనియుఁ జెప్పఁబడినది.

గ్రామమున కాగ్నేయదిశ నుదయకాల మున, సూర్యుని జూచుచు కుక్క లదేపనిగ రెండుమూఁడురోజులు రొదఁ జేసి యఱచు చుండిన చోరాగ్నిభయములును, మధ్యాహ్న మువేళ యైనచో నపమృత్యుభయమును, అప రాహ్ణమువేళ యగునేని కలహభయమును, సాయంత్రమునం దగునేని చోరభయమును, సంధ్యాకాలములం దగునేని ధననష్టభయ మును, ఆగ్రామమువారలకు తప్పక గల్గుచు వేధించుసూచనయని యనుభవజ్ఞులగు శాస్త్ర వేత్త లనిరి. మఱియుఁ గుక్కలు గోపురము

లు, వాములు, దిబ్బలు మొదలగు నెత్తు ప్రదేశముల కెక్కి గ్రామమువైపు తిరిగి రొదచేసిన గ్రామారిష్టమనియు, పశువుల మందలవైపుతిరిగి గాని, వాట్లకడగాని, రొద చేసిన పశుసంతతికి రోగములుకల్గి, కీడుమూడి నష్టములుగల్గుననియుఁ జెప్పఁబడినది.

౨ గృహసంబంధఫలములు:—యేయింటి ముందర కుక్కలు తలవంచుకొని నేలఁబరుకుచు రొద చేయునో ఆయింట పిల్లలకు కీడురానున్నదని యెఱుంగవలయుననియు, ఏయింటిపైకి కుక్క యెక్కిరొదఁ జేయునో ఆయింటిలోనివారి కాపదలు రానున్నవని యెఱుంగవలెననియు, కుక్క వాకిలిమీఁద తలనుమోపి, తోఁక వీధిలోనికి చాచి, రొదఁ జేయుచుండిన నాయింట రోగములు గల్గునని యెఱుంగవలెననియు, కుక్క తలను గడపమీఁదఁబెట్టి తోఁకను యింటిలోనికి చాపి, రొదఁజేయునెడ, నాయింటియిల్లాలు దుశ్చరిత్రసంచారమొనర్చుట సంభవించుననియు, కుక్కలు గోళ్ళతో నేలం బరుకుచు రొదఁ జేయుచుండిన నాయింట చోరులు కన్నమువైచి సొమ్ములం గొంపోవుదురని యెఱుంగవలెననియు, ఇంటఁ బెంచిన పెంపుడుకుక్క యొకకంట నీరుగార్చుచు, (బహుశః అన్నముం దినుటగూడ కొన్నికుక్కలు మానును.) దుఃఖించుచు, రొదఁజేయుచుంచుండిన నాయింటియజమానునకు దుఃఖమో, ఆపదయో రానైయున్నట్టు లెఱుంగవలయుననియు, ననుభవజ్ఞులు వచింతురు.

౩ వీధిసంబంధఫలములు:—ఏవీధియందు మధ్యగా కుక్కలుచేరి రొదఁజేయుచుండిన నావీధిని యొకటిరెండుమరణములు సంభవించునని జెప్పఁబడినది.

౪ వర్షసంబంధఫలములు:— ఆకాశమువంక చూచుచు కుక్కలు రొదచేసిన వర్షముగురియుననియు, మిద్దెలు, గడ్డివాములు, నెత్తగుస్థలములందు కుక్కలు రొదచేసిన విస్తారము వర్షము వచ్చుననియు, కుక్కలు నీటంబడి స్నానమాడుతఱి రొదఁజేయుచు తల విదిలించుట వర్షయోగకర మనియు, వర్షధర్మము లెఱింగిన మహనీయులు బలుచదురు.

౫ ప్రయాణసంబంధఫలములు:— తనకుడివైపున నేయవయవముఁగాని ప్రయాణసమయమున (కుక్క) బరుకుచుఁబోయిన నాప్రయాణమున లాభముగఁగార్యసిద్ధి యగుననియు, ప్రయాణమైపోవువారికాలిని కుయ్‌కుయ్ మని యఱచుచు, కుక్క మూచూచుచు నెడల నాప్రయాణము కొనసాఁగదనియు, సుూ ఘ్రాణించి వెడలిన ధనవ్యయమే ఫలితమగుననియు, పెద్దలు వచించిరి. ఆఁడకుక్క మగకుక్క కలయిక గండ్లంబడిన దినమున ప్రయాణ మేగువారు పయన మాఁపిన మఱునాఁడు బయలుదేఱవలయును. ఆ దినము ప్రయాణార్హమని చెప్పఁబడినది. కుక్క బురదనుగాని, యమేధ్యముంగాని, బూసుకొని, చెవులు జాడించుట గాంచుట ప్రయాణకాలమున జరుగునేని మృత్యుప్రద తుల్యదోష మనియు, నాఁటి ప్రయాణ మాఁపిన శ్రేయస్కరమనియు ననుభవజ్ఞులు చెప్పుదురు.

౬ శుభాశుభఫలసంబంధము:—తన యెడమమోఁకాలును కుక్క మూచూచినయెడల ధనలాభము గల్గుననియు, కుడిమోఁకాలును మూచూచిన స్త్రీకలహము సంభవించుననియు, ఎడమతొడను మూచూచిన కీడనియు, పఱుపుపై కెక్కి కుక్క రొదచేసిన యాపాన్పుపైఁ బండువారికిఁ గీడనియు, కుక్క తనపిల్లలకుఁ

జాలిచుచ్చు తనయెదుట నిలచిన తనసంసార మభివృద్ధినందు ననియు, తోఁకలేనికుక్కం జూచుట, కీడనియు, కుంటుకుక్కం జూచుట, అశ్రేయ స్సనియు, నల్లకుక్కంజూచిన కార్య సిద్ధికరమనియు, నీమూఁడును కార్యారంభ మున పరిశీలింపనగుననియుఁ జెప్పఁబడినది.

శునకము రోదచేయుటయందు తనకుడివైపున ఊకారధ్వని యొనర్చిన ధనలాభమును, ఐకారము మేలును, ఔకారము కీడును, రాగలవని సూచించెడినని చెప్పఁబడినది. కుక్క కాళ్ళకడ్డముగ నడచుచు, తోఁకరుద్దుచు, వెనుకవైపు మొఱుఁగునెడల దొంగలట గలరని యర్థమనియు, గట్టిగానేడ్చుచు, కూఁతలిడుచు, కుక్క పరుగెత్తుచుండినచో దానివెంటఁ జనిన నేదోయొకసంగతి తెలియనగునని శునకభాషావేత్తలు గ్రహించియున్నారు. కుక్కలకు తనయజమానునకుఁ దెలియని సంగతులం దెల్పుకోర్కెయుండునని పెద్దలు పలుకుచుందురు.

**శునకుఁడు:**— చంద్రవంశము. తండ్రి కృత్స్నమదుఁడు. కుమారుఁడు శౌనకుఁడు. [తపోనియతియు, సూతునివలన పురాణసంహిత వినిన మహర్షులలో నైమిశారణ్యమున నగ్రగణ్యుఁడ యుండినవాఁడు.]

ఇంకను రురునికిఁ బ్రమద్వరవలనఁ బుట్టిన తనయునకు శునకుఁడని పేరు కలదు.

**శునశ్శేఫము (ఆదిపచ్ఛఘూనా):**—

[ఆదిపచ్ఛఘూనా చూడుఁడు.]

**శునశ్శేపుఁడు (దేవరాతుఁడు):**—

ఋచికుని రెండవసుతుఁడు.

**శుభకార్య పంచపల్లవములు (పుణ్యాహవాచనాదులు):**—

( చూడుఁడు.)

**శుభదన్తి:**—ఏనుఁగు. పుష్పదంతమను దిగ్గజముభార్య.

**శుభశకునములు:**— ౧ పంచమహావాద్యములు (మద్దెల మున్నగునవి). ౨ భేరీవాద్యములు, ౩. ఉఱుముధ్వని, ౪ శుభవాక్యములు. వీట్లనాలించుతఱి సేవనులుయత్నించినను జయము, కార్యసిద్ధి గల్గుననియు, ఫలములు, పూవులు, కాయలు, బ్రాహ్మణద్వయము, తెల్లనియన్నము క్షీరాన్నము, కన్యపడుచు, వేశ్య ఎదురగుతఱి పయనము జయప్రదమనియు, ఏనుఁగు, గుఱ్ఱము, ఎద్దు, సైన్యము, ప్రజ్వలించుచుండు నగ్ని, పీనుఁగు, పాలు, పెరుఁగు, పయనమగుతఱి నెదురగుట కార్యసిద్ధి, క్షేమకరము ననియు, పూర్ణజలకుంభద్వయము కల్లుకావడి (నిండుది), గాజులశెట్టి, చేఁపలు, పయనమగుతఱి నెదురగునేని యితరదోషము లెన్నియున్నను పరిహారమై కార్యసిద్ధి యగుననియు ఋషులు వచించిరి.

**శుభస్వప్నములు లేక సుస్వప్నములు:**—దేవతలు, నదీజలములు, ప్రజ్వలించుచున్నయగ్ని, మహారాజు, గోవులు, బ్రాహ్మణులు, మిత్రులు, స్వప్నములో నగుపడినలాభము.

ఫలములు, తెల్లనిపూవులు, తెల్లవస్త్రము, చేఁపలు, మాంసము, గొప్పమందిరము, ఏనుఁగు, ఫలభరితములగువృక్షములు, పర్వతారోహణము, గజారోహణము, జలపూర్ణప్రదేశముల దాటుట, స్వప్నమునఁగల్గినను, కన్పించినను, ధనలాభము. రోగనివారణము.

మఱియుఁ దన్ను పాము, జలగ, తుమ్మెద, కఱచినటుల స్వప్నమగుట యారోగ్యము, ధన లాభము గల్గునని చెప్పఁబడినది. ఈస్వప్నములు రోగికిఁ గల్గిన నారోగ్యప్రాప్తికరము.

గ్రహములు, నక్షత్రములు, సూర్యుఁడు, చంద్రుఁడు, ప్రజ్వలితాగ్ని, స్వప్నమం దగుపడినఁ గార్యసిద్ధికరము.

మద్యపాన మొనర్చుట, మాంసభక్షణము, నమేధ్యము నొడలికంటుట, రక్తమున స్నాన మొనర్చుట, శ్వేతవస్త్రధారణము, చందనాను లేపము, రత్నాలంకారములు స్వప్నమున శుభ ప్రదములు. ఇంకను చిట్టు, పద్మములు, తెల్ల పువ్వులు, తెల్లనిస్త్రీలు, ఎద్దు, పర్వతము, పాలు వీనింజూచుటయు, ఫలవృక్షముల నెక్కుట, అద్ద ముం జూచుట, నీటిలో నీదుట స్వప్నమునగల్గు నేని ధనప్రాప్తి, ఆరోగ్యమని చెప్పఁబడినది.

వరాహమిహిరాచార్యుఁడు తనబృహద్యాత్ర యందు పర్వతము, మేడ, ఏనుఁగు, వృషభము, వీనినెక్కుటయు, సూర్య చంద్ర నక్షత్రములను మ్రింగుటయు, వెదకుటయు, భూసముద్రములను మ్రింగుటయు, శత్రువులను వధించుటయు, వివాహమునను, ద్యూతమునను జయముం గాంచుటయు, యుద్ధము, కుస్తీలం గెల్చుటయు, మత్స్యమాంసభక్షణ మొనర్చుట, పాలు ద్రావుట, స్నానముచేయుట, తడిసినభూమిని, నిర్మలాకాశమును, దేవబ్రాహ్మణ నివాసదర్శనము చేయుట, మద్యము, రక్తము, క్షీరాన్నము, పాన మొనర్చుట, ఆఁడుసింహము, ఆఁడుగుఱ్ఱము, ఆవు, గేదె వీనిపాలు దీయుట, స్వప్నమునఁగల్గిన శుభమనియు, జలాభిషేకము రాజ్యప్రదమనియుఁ జెప్పెను.

మఱియు నామహావిద్యావిశారదుఁడే రాజ్యాభిషేకమగుట, తలదెగుట, తానుమరణించుట, అగ్నిదొరకుట, ఇండ్లు తగులఁబడుట, విషమ స్థానము నతిక్రమించుట, గుఱ్ఱము, ఏనుఁగు, ఆవు తనయింట నీనుట, ఏడ్చుట స్వప్నమునఁగల్గిన శుభకరమని నుడివెను.

పాలచెట్టు ఫలించియుండ దానినెక్కుటయు, తాను చెట్టుపై భద్రముగా నుంటయు, ధనప్రద మ లనియు, తెల్లనిసర్పము తనకుడిచేయిం గఱచి నటుల స్వప్నమగునేని స్పష్టముగుధనము చేకూరు ననియు, పాముగాని, తేలుగాని, నీటంగఱచినటుల గల్గినస్వప్నము జయప్రదము, పుత్రలాభము, ధనప్రదము ననియు, సముద్రముదాఁటినటుల, దాసకులమున జన్మించినటుల, మహాసౌధమున తాభుజించినటుల, గల్గినస్వప్నము తనను భూపతిం జేయుననియు, సాగరమధ్యమున తామరాకులో ఘృతక్షీరములఁ బాన మొనర్చినటులఁ గల్గినస్వప్నము తనకు రాజ్యలాభముం గల్గించుననియుఁ జెప్పఁబడినది.

బలాకపక్షి, కోడిపెట్ట, ఆఁడుకొంగ మొళు కువగలస్వప్నమునఁ జూచుట, అనుకూలవతియు, సత్కులీనయు నగుకళత్రము లభించుననియు, తాంబూల చందనాగరు కర్పూరపుష్పములం జూచుట ధనలాభప్రదమనియుం జెప్పఁబడెను. నురుగుతోనున్న పాలం ద్రావినట్లె కలగనుట యజ్ఞమునందు సోమపానము లభించుననియు, లేకున్న వివిధభోగములు గల్గుననియు, శవదర్శనము స్వప్నమున ప్రీతిలభించుననియు, గోధుమలం జూచుట ధనప్రద మనియు, యవలం జూచుట యజ్ఞయాగ కర్మాచరణము గల్గుననియు, ఆవాలు లాభప్రద మనియు, పెరుఁగులభించుట ధనప్రదమనియు, నేయి దొరకిన కీర్తిప్రదమనియు జెప్పఁబడినది.

దుస్స్వప్నమైనను తోడనే శుభస్వప్నమగునేని, దుస్స్వప్నదోషము పరిహారమగునని చెప్పఁబడినది.

ఇంకను ఈక్రిందిస్వప్నములుగ పెక్కుమతాంతరములు కలవు. అందు బృహస్పతిమతము ప్రధానముగ పాటింపఁబడినది.

స్వప్నమున మనుష్యుని తలమాంసము తినుట, రాజ్యప్రదము. హృదయమునందలి మాంసమ్మును దినుట మంత్రిత్వము గల్గును. బాహువులు, పాదముల మాంసమును దినినట్లయిన ధనలాభము గల్గును. చెప్పులు, ధ్వజము, చక్రము, వాఁడిగల కత్తి, స్వప్నమునందు గల్గినతోడనే ప్రయాణము సంభవించును. నావనెక్కి నదిదాటుట స్వప్నమయ్యేనేని దూరదేశగమనము. పీతవస్త్ర, పీతపుష్పమాలాలంకృత, పీతగంధ ధారిణి తన్నుఁ గౌఁగలించుకొనునటులఁ గల్గిన స్వప్నము మంగళకరము, వివాహప్రదము. ఇటులనే శ్వేతవస్త్ర శ్వేతమాలికా, శ్వేతగంధధారిణి కౌఁగలించుకొనినటులఁ గల్గిన స్వప్న మైశ్వర్యప్రదమని చెప్పఁబడినది.

బృహస్పతిమతమున దైవములు గాని, మహారాజులుగాని, బ్రాహ్మణులుగాని, గోవులుగాని, సాధువులుగాని, స్వప్నములందుఁ గన్పడి పల్కిన వాక్కులు సత్యములగుచు సిద్ధించునని చెప్పఁబడినది.

ఆసనము, పానుపు, సవారి మొదలగు వాహనముల, గజాశ్వములపైన తానుండి, తగులఁబడినటుల కలగనివాఁడు తా ధనవంతుడగుననియు, స్వప్నమున ఆఁడుగుఱ్ఱము, కోడిపెట్ట, ఉయ్యెల లభించినటుల కలగనినవానికి సత్కళత్రము లభించుననియు, సంకెళ్ళు, పాశములువలన నిర్బంధము గల్గినట్లు కలఁగనినవానికి, పుత్రలాభము గల్గునని యు, యశస్సు గల్గుననియుఁ జెప్పఁబడినది.

పరాశరర్షి తనపరాశరసంహితయందు 'శరీరము కాలినటులను, శత్రువును భుజముచే నొక్కి జయించుట, ఆపదలసంచుట, నాల్గుదిశలందు బద్ధుండగుట, ఇంద్రధ్వజము నాలింగనమొనర్చుట, ఏనుఁగనెక్కుట, పవిత్రపురుషుల దర్శించుట, కలఁగనినవారు పృథ్వీపతియగునని వివరించెను. మఱియు సూర్య, చంద్ర, తార, భూ, సముద్రములను మ్రింగినటులను, తెల్లనిసింహాసన మెక్కినటులను, పత్రిభుదర్శనము చేసినటులను, తనశిరస్సు ఏఁడుగాని, యైదుగాని, మూఁడుగాని, వ్రికలై నటులను, ఎద్దునుగాంచినటులను కలగనినవాఁడు పృథ్వీపతియగునని వచించెను

యుద్ధజయము, ద్యూతజయము, స్వచ్ఛవస్త్రములం ధరించుట, చందనానులేపనము,పరస్త్రీతోఁ జెలిమి, స్వమరణము, అగ్నిముట్టడి, పంటచేలం జూచుట, పూలదండలను ధరించుట, ఆశీర్వాదము, స్వర్ణ రజిత మణిపాత్రిలలో భోజనము, సుస్వప్నములు, కార్యసిద్ధి సూచకములనియుఁ జెప్పఁబడినది.

## శుష్కప్రియములు - శూన్యహస్తములు:—

(ఆంధ్రిలోకోక్తి.)

**శుష్కవైరం వివాదంచ న కుర్యాత్కేనచిత్సహ:**—వృథాశత్రుత్వము, వృథా వివాదము, నెవ్వరితోడను గల్గించుకొనుట సమంజసము కాదనిభావము. 'కజ్జాకు కాలుదువ్వరా' దని తెలుఁగుసామెత కలదు.

**శుష్కేష్టిన్యాయము:—** యజ్ఞములు చేయించు చదువును చదువుకొనుచుండు విద్యార్థులు, నిజముగఁ జేయించుతఱి చేయిదిరుగుటకుఁ దాము యజ్ఞమును నిజముగనే యొనర్చునటుల నంతయు యథావిధిగ నొనర్చునభ్యాస ప్రయత్నమునకు 'శుష్కేష్టి' యని పేరు. ఇది నిజముగ యాగము కాకున్నను, అన్నివిధులు నడపుట జరుగును. దీనికి భూమిరాథికన్యాయ మనియుఁ బేరు కలదు.

**శ్రుతశ్రవ:—** యదువంశక్షత్రియుఁడగు శూరునికుమార్తె. వసుదేవుని చెలియలు. దమఘోషునిభార్య. కుమారుఁడు శిశుపాలుఁడు. (దమఘోషుఁడు చేదిదేశపుఁ బ్రభుఁడు). సోదరి శ్రుతదేవి.

**శ్రుతసేనుఁడు:—** పాండవకనిష్ఠుండగు సహదేవునికుమారుఁడు. తల్లి ద్రౌపదీదేవి. ఈతఁడుపపాండవుఁడు. భారతయుద్ధానంతరము రాత్రి శిబిరమున నిద్రించుతఱి నశ్వత్థామ యుపపాండవులం జంపెను.

**శ్రుతముఖ్యుఁడు:—**
అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి వసుదేవుఁడు. తల్లి సహదేవి.

**శూద్రకదేశము:—** శూద్రకమహారాజ పాలనమునుండి పేరందినదేశము. మహాభారతప్రసిద్ధము. సింధు, శతద్రు, నదులమధ్యభాగమున తక్కిననదులు సింధునదులు చేరువఁబకుండినదేశ మని పోల్చఁబడినది.

రాజధాని ఉచ్ఛనగరము లేక ఉచ్ఛపురము. ఇప్పటి 'ఉచ్' అనంబడుచున్నపట్టణము.

అయోధనపుర మొకప్పుడు దీనికి రాజధానిగ నుండెనఁట. ఇది శతద్రునదియొక్క పురాతనఁపుఁ బ్రదేశతీరమునం దుండెను. ఇప్పుడు ప్రవాహము మాఱిపోయినది. ఈదేశమునందు దిపాల్పూ రను వేఱొకపట్టణ ముండెను. పిదప ప్రజలు రాజు లేక పోవుట అరాష్ట్రికులనియు, దేశమున కరాష్ట్రిక (అరాట) దేశమనియు పేరందియుండిరఁట. వీరిని 'Free nation' అని సర్. కనింగుహామ్ పండితుఁడు వివరించెను.

వీరి కింకను మద్రు లనియు, బాహ్లి [దొంగలు] వాహ్లీకు లనియు, అరాటు లనియు, యాత్రికు లనియు వేఱువేఱుకాలముల పేర్లుండెనఁట. వీరు తురేనియనులుగ నుంట పై వన్నియు నసూయతచే నిడఁబడినపేర్లు గానోపు.

ఇప్పుడు బులాండుషహ రనంబడుపట్టణ మీ దేశము లోనిది. ఇది మహమ్మదీయనామము. ఇదియే ఉచ్ఛనగర ముండినతావని తలంపఁబడుచున్నది.

**శూద్రకుఁడు [మహారాజు]:—**
మగధదేశాధీశుఁడగు సుశర్మకడ భృత్యుఁడుగాఁ దొలుతనుండి ప్రభువైనవాఁడు. ఆన్ధ్రుఁడు. సుశర్మం జంపి తాను రాజైనవాఁడు. ఈతని సంతతి భూపతులను ఆంధ్రభృత్యులని వాడిరి.

**శూర (శాఖ) క్షత్రియులు:—**
(చౌకానులు చూడుఁడు).

**శూరుఁడు:—** యాదవులలో శూరుఁడను పేరుగలవారు పెక్కండ్రుగలరు. దేవమీఢుని పుత్రుఁడు (వసుదేవునితండ్రి) యొకశూరుఁడు. వసుదేవునకు మదిర యనుభార్యయందు కల్గిన పుత్రులలో నొకఁడు శూరుఁడను పేరుగలవాఁడు. ఈతఁడు శ్రీకృష్ణునిసవతితమ్ముండై యుండవలయును.

దుస్వప్నమైనను తోడనే శుభస్వప్నమగునేని, దుస్వప్నదోషము పరిహారమగునని చెప్పఁబడినది.

ఇంకను ఈక్రిందిస్వప్నములుగ పెక్కుమతాంతరములు కలవు. అందు బృహస్పతిమతము ప్రధానముగ పాటింపఁబడినది.

స్వప్నమున మనుష్యుని తలమాంసము తినుట, రాజ్యప్రదము. హృదయమునందలి మాంసమ్ముం దినుట మంత్రిత్వము గల్గును. బాహువులు, పాదముల మాంసముం దినినట్లయిన ధనలాభము గల్గును. చెప్పులు, ధ్వజము, చక్రము, వాఁడిగల కత్తి, స్వప్నమునందు గల్గినతోడనే ప్రయాణము సంభవించును. నావనెక్కి నదిదాటుట స్వప్నమయ్యేనేని దూరదేశగమనము. పీతవస్త్ర, పీతపుష్పమాలాలంకృత, పీతగంధ ధారిణి తన్నుఁ గౌఁగలించుకొనునటులఁ గల్గిన స్వప్నము మంగళకరము, వివాహప్రదము. ఇటులనే శ్వేతవస్త్ర, శ్వేతమాలికా, శ్వేతగంధధారిణి గౌఁగలించుకొనినటులఁ గల్గిన స్వప్న మైశ్వర్యప్రదమని చెప్పఁబడినది.

బృహస్పతిమతమున దైవములు గాని, మహారాజులుగాని, బ్రాహ్మణులుగాని, గోవులుగాని, సాధువులుగాని, స్వప్నములందుఁ గన్పడి పల్కిన వాక్కులు సత్యములగుచు సిద్ధించునని చెప్పఁబడినది.

ఆసనము, పానుపు, సవారి మొదలగు వాహనముల, గజాశ్వములపైన తానుండి, తగులఁబడినటుల కలగనివాఁడు తా ధనవంతుడగుననియు, స్వప్నమున ఆఁడుగుఱ్ఱము, కోడిపెట్ట, ఉయ్యేల లభించినటుల కలగనినవానికి సత్కళత్రము లభించుననియు, సంకెళ్ళు, పాశములువలన నిర్బంధము గల్గినట్లు కలఁగనినవానికి, పుత్రలాభము గల్గునని యు, యశస్సు గల్గుననియుఁ జెప్పఁబడినది.

పరాశరర్షి తనపరాశరసంహితయందు 'శరీరము కాలినటులను, శత్రువును భుజముచే నొక్కి జయించుట, ఆపదలసందుట, నాల్గుదిశలందు బద్ధుండగుట, ఇంద్రధ్వజము నాలింగనమొనర్చుట, ఏనుఁగనెక్కుట, పవిత్రపురుషుల దర్శించుట, కలఁగనినవారు పృథ్వీపతియగునని వివరించెను. మఱియు సూర్య, చంద్ర, తార, భూ, సముద్రములను మ్రింగినటులను, తెల్లనిసింహాసన మెక్కినటులను, ప్రభుదర్శనము చేసినటులను, తనశిరస్సు ఏఁడుగాని, యైదుగాని, మూఁడుగాని, వ్రక్కలైనటులను, ఎద్దునుగాంచినటులను కలగనినవాఁడు పృథ్వీపతియగునని వచించెను.

యుద్ధజయము, ద్యూతజయము, స్వచ్ఛవస్త్రములం ధరించుట, చందనానులేపనము,పరస్త్రీతోఁ జెలిమి, స్వమరణము, అగ్నిముట్టడి, పంటచేలం జూచుట, పూలదండలను ధరించుట, ఆశీర్వాదము, స్వర్ణ రజత మణిపాత్రిలలో భోజనము, సుస్వప్నములు, కార్యసిద్ధి సూచకములనియుఁ జెప్పఁబడినది.

## శుష్కప్రియములు - శూన్యహస్తములు:—

(ఆంధ్రిలోకోక్తి.)

**శుష్కవైరం వివాదంచ న కుర్యాత్కేనచిత్సహ:**—వృథాశత్రుత్వము, వృథా వివాదము, నెవ్వరితోడను గల్గించుకొనుట సమంజసము కాదనిభావము. 'కజ్జాకు కాలుదువ్వరా' దని తెలుఁగుసామెత కలదు.

**శుష్కేష్టిన్యాయము:**—యజ్ఞములు చేయించు చదువును చదువుకొనుచుండు విద్యార్థులు, నిజముగఁ జేయించుతఱి చేయిదిరుగుటకుఁ దాము యజ్ఞమును నిజముగనే యొనర్చునటుల నంతయు యథావిధిగ నొనర్చునభ్యాస ప్రయత్నమునకు 'శుష్కేష్టి' యని పేరు. ఇది నిజముగ యాగము కాకున్నను, అన్నివిధులు నడపుట జరుగును. దీనికి భూమిరాథికన్యాయ మనియుఁ బేరు కలదు.

**శ్రుతశ్రవ:**— యదువంశక్షత్రియుఁడగు శూరునికుమార్తె. వసుదేవుని చెలియలు. దమఘోషునిభార్య. కుమారుఁడు శిశుపాలుఁడు. (దమఘోషుఁడు చేదిదేశపుఁ బ్రభుఁడు). సోదరి శ్రుతదేవి.

**శ్రుతసేనుఁడు:**— పాండవకనిష్ఠుండగు సహదేవునికుమారుఁడు. తల్లి ద్రౌపదీదేవి. ఈతఁడుపపాండవుఁడు. భారతయుద్ధానంతరము రాత్రి శిబిరమున నిద్రించుతఱి నశ్వత్థామ యుపపాండవులం జంపెను.

**శ్రుతముఖ్యుఁడు:**—
అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి వసుదేవుఁడు. తల్లి సహదేవి.

**శూద్రకదేశము:**— శూద్రకమహారాజ పాలనమునుండి పేరందినదేశము. మహాభారతప్రసిద్ధము. సింధు, శతద్రు, నదులమధ్యభాగమున తక్కినదులు సింధునదులు చేరువఱకుండినదేశ మని పోల్చఁబడినది.

రాజధాని ఉచ్ఛనగరము లేక ఉచ్ఛపురము. ఇప్పటి 'ఉచ్' అనంబడుచున్నపట్టణము.

అయోధనపుర మొకప్పుడు దీనికి రాజధానిగ నుండెనఁట. ఇది శతద్రునదియొక్క పురాతనఁపుఁ బ్రదేశతీరమునం దుండెను. ఇప్పుడు ప్రవాహము మాఱిపోయినది. ఈదేశమునందు దిపాల్పూ రను వేఱొకపట్టణ ముండెను. పిదప ప్రజలు రాజు లేక పోవుట అరాష్ట్రికులనియు, దేశమున కరాష్ట్రిక (అరాట) దేశమనియు పేరందియుండిరఁట. వీరిని 'Free nation' అని సర్. కనింగుహామ్ పండితుఁడు వివరించెను.

వీరి కింకను మద్రు లనియు, బాహ్లి [దొంగలు] వాహ్లీకు లనియు, అరాటు లనియు, యాత్రికు లనియు వేఱువేఱుకాలముల పేర్లుండెనఁట. వీరు తురేనియనులుగ నుంట పై వన్నియు నసూయతచే నిడఁబడినపేర్లు గానోపు.

ఇప్పుడు బులాండుషహ రనంబడుపట్టణ మీ దేశము లోనిది. ఇది మహమ్మదీయనామము. ఇదియే ఉశ్చనగర ముండినతావని తలంపఁబడు చున్నది.

**శూద్రకుఁడు [మహారాజు]:**—
మగధదేశాధీశుఁడగు సుశర్మకడ భృత్యుఁడుగాఁ దొలుతనుండి ప్రభువైనవాఁడు. ఆన్ధ్రుఁడు. సుశర్మం జంపి తాను రాజైనవాఁడు. ఈతని సంతతి భూపతులను ఆంధ్రభృత్యులని వాడిరి.

**శూర (శాఖ) క్షత్రియులు:**—
(చౌకానులు చూడుఁడు).

**శూరుఁడు:**— యాదవులలో శూరుఁడను పేరుగలవారు పెక్కండ్రుగలరు. దేవమీఢుని పుత్రుఁడు (వసుదేవునితండ్రి) యొకశూరుఁడు. వసుదేవునకు మదిర యనుభార్యయందు కల్గిన పుత్రులలో నొకఁడు శూరుఁడను పేరుగలవాఁడు. ఈతఁడు శ్రీకృష్ణునిసవతితమ్ముఁడై యుండవలయును.

అంధకునిపౌత్రులలో నొకఁడు విదూరథుని సుతుఁడగువాఁ డొకఁడు శూరుఁడనుపేరుగలవాఁ డున్నట్టు తెలిసెడిని.

కార్త్యవీర్యార్జునుని మొదవసుతుఁడగు ఊర్జితునకు శూరుఁడను పేరు కలదఁట.

**శూర్పము:—**
(ఆయుర్వేదమానముఁ జూడుఁడు).

**శూర్పారకపురము (సుపరా):—**
(అపరాంతదేశము చూడుఁడు).

**శూరసేనుఁడు:—** యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి కార్త్యవీర్యార్జున చక్రవర్తి.

ఈతఁడు రెండవసుతుఁడు. ఇతఁడొక శూరసేనుఁడు.

మఱియు నిక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడగు శ్రీరామసోదరుఁడగు శత్రుఘ్నుని సుతుం డొక శూరసేనుఁడు.

ఈశూరసేనుఁ డేలినదేశమగుట నాయనపేర శూరసేనదేశమని పేరయ్యెను.

**శూరసేనిదేశము:—** వ్రజమండలములోని మధురాపురము (ఇప్పటి Muttra) రాజధానిగ గల్గిన యాప్రాంతదేశమున కొకప్పు డీపేరుండెను.

జైనులు నేఁటికిని మధురను 'శౌరిపుర'మనియు, 'శౌర్యపుర' మనియు వాడుచునేయున్నారు. శ్రీకృష్ణునిజన్మదేశము. (వ్రజమండలము చూడుడు).

శ్రీరామసోదరుఁడగు శత్రుఘ్నునిసుతుఁడు శూరసేనుఁ డేలుకతన నాతనిపాలననుండి పేరందిన దేశమని చెప్పఁబడినది.

**శూల:—** కడుపులోఁగాని, పక్కలందుఁ గాని, యెముకలలోఁగాని హఠాత్తుగాఁ గల్గెడి నొప్పి.

**శూలపాణి (శూలభేద) తీర్థము:—** దీని నిప్పుడు శుల్పాన్ అనుచున్నారు.

నర్మదానదియందు సరస్వతి యనంబడు నొక కొండజలపాతము (ధార) జలములుకలియు (మక్రీ) జలపాతము makrifalls) తావున శూలపాణి మహాదేవుని శివలింగము కలదు. దీనికి శూలపాణి తీర్థమని పేరు. దీనిని శూలభేదతీర్థ మని స్కాంద పురాణ, రేవాఖండము ౪౪—౪౯ అధ్యాయము ౧౦ చెప్పఁబడినది.

**శృంగగ్రాహికన్యాయము:—** కొమ్ములు పట్టుకొనఁగల్గిన నెంతముష్కరఁపు టెద్దైనను లొంగిపోవునని భావము.

దుర్మార్గుండగుబలాఢ్యుని ప్రధానస్థానమునఁ బట్టుకొనిన లొంగుననుట కీన్యాయము వర్తించును.

**శృంగగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**శృంగవరపురము (శృంగిబేరిపురము):—** దీనికి 'రామ్చారా' యనియుఁ బేరు కలదు. ఇది గుహాకనిషాదునిస్థానము. ఈతండు దశరథమహారాజునకును, శ్రీరామునకును, మిత్రుఁడని రామాయణము అయోధ్యకాండము ౫౦—౫౨ అధ్యాయములందుఁ జెప్పఁబడినది.

[శృంగిబేరిపురము చూడుఁడు].

**శృంగి:—** ఋషి. తండ్రి శమీకర్షి.

పరీక్షిత్తుమహారాజు [శమీకర్షి తపమొనర్చు తఱి] తండ్రిమెడను చచ్చినపామును వైచెనని

కోపించి, పాముగఁజచి మృతిచెందునటులఁ బరీక్షిత్తును శపించినవాఁడుశృంగి యని చెప్పఁబడినది.

## శృంగిబేరపురము (రామహ్చౌరీ):—

అలహాబాదునకు పశ్చిమోత్తరదిశ. [కన్యాకుబ్జదేశము చూడుఁడు, శృంగవరపురము చూడుడు].

**శృంగేరి (శృంగగిరి):**—అద్వైతస్మార్తులకు ప్రధానగురుండగు శంకరాచార్యపీఠము. శంకరాచార్యులవారిచే స్థాపింపఁబడిన పీఠములలో ముఖ్యపీఠము. తుంగానదీతీరము. మైసూరురాజ్యమున కాడూరుజిల్లాలోనిది. కాడూరునుండి ౫౫ మైళ్ళదూరము. సుప్రసిద్ధుండగు ఋష్యశృంగ మహర్షినివాసముగ నొకప్పు డుండి, యాయన నుండి పేరందినదిగఁ గొందఱును, విభాండకుఁడనుఋషి యిట తపంబొనరించుటంజేసి ప్రసిద్ధి నందినదిగఁ గొందఱును జెప్పుచున్నారు. ఏదియెట్లైనను శంకరభగవత్పాదు లేర్పఱచిన స్థానము. ఇచట శారదావిగ్రహమును కాశ్మీరము నుండి వారే తెచ్చి ప్రతిష్ఠించిరఁట. ఇచటిమఠాచార్యపీఠమును వారిశిష్యపరంపర యధిష్ఠించుచున్నారు. వీరి కనేకబిరుదములు కలవు. గొప్ప రాబడిగల భూస్వామ్యము మైసూరురాజ్యమునఁ గలదు. శృంగగిరింజుట్టి ప్రధానమగువీధి యొకటి కలదు. కొండపై శారదాంబదేవస్థానము కలదు. మఠము చాలగొప్పది. రాజగౌరవములు గలసంస్థాన మనంబడుచున్నది.

## శృఘ్నఘన లేక శృఘ్నుదేశము:—

శ్రుఘనదేశ ముత్తరమున హిమాలయముమొదలు దక్షిణమున ముజాఫరుపూరువఱకును, పశ్చిమమున కురుక్షేత్రమునందలి స్థానేశ్వరము మొదలు గంగానదివఱకును వ్యాపించియుండినదేశ మనియు, మఱియు నిందు డెరాడూన్భాగములు, సర్హిందులోనిభాగము, ఖ్యార్ఖాడూన్ అంతయు, పైదోఆబ్ అంతయును జేరియుండెననియుఁ బోల్చుచున్నారు. పంజాబునందలి అంబాలాజిల్లాలోనిస్థానేశ్వరమునుండి నలుబదిమైళ్ళదూరమునన్నున్న వృద్ధయమునయొక్క కుడితట్టున కాల్సి యనంబడు పట్టణపరిసరములనున్న శుగ్రఘ్ అనంబడుచున్న గ్రామము. తొల్లింట శృఘ్నపురముండిన యానవాలుగఁ బోల్చఁబడినది.

ఈదేశమందలి పర్వతపంక్తికి మైనాకపర్వత మనిపేరు. దీనిశిఖరములు సపాదలక్ష (లక్షాయిరువదియైదువేలు) యుంట, దాని హిందీభాషానువాదమగు 'సవాలాక్' పదము రానురాను 'శివాలిక్' అయి, ఆంగ్లులచే శివాలిక్కొండలన్ను అనఁబరఁగుచున్నవి.

హరిద్వార (తొల్లింటి గంగాద్వార)ము ఈ దేశములోనిది. శ్రుఘనదేశఁపుఁ దూర్పుభాగమునందుండునది. దీనిని విష్ణుభక్తులు హరిద్వారమనియు, శివభక్తులు హరద్వార మనియు వాడుచున్నారు. గంగానది పర్వతములనుండి దిగి సమతలమున ప్రవహింపమొదలిడుతావునకు 'గంగాద్వార' మని తొల్లింటిపే రుండెను. ఇట మాయాదేవీదేవస్థానముంట నీయూరికి 'మాయాపుర' మనియుఁ బేరు. నేఁటికి నీపాతహరిద్వారమున కీపేరు వాడుచునే యున్నారు.

ఇప్పటిహరిద్వారమును, అందుఁగల శర్వనాథదేవస్థానమును నవీనములు. ఇఁదొకభాగమునకు కంకాళ మనిపేరు. ఇట నీలధార యనంబడుజలపాత మొకటి గంగయందుఁ జేరును. కంకాళమున దక్షప్రజాపతి యజ్ఞమొనర్చి భంగపడినతావు గలదు. అటనే వీరభద్రస్వామి త్రిశూలమున దక్షప్రతిష్ఠితమగు దక్షేశ్వరశివలింగమును గలదు. హరిద్వారము యోగక్షేత్రమనియు, కంకాళము భోగక్షేత్రమనియుఁ జెప్పఁబడినది. హరి

ద్వారమున ముఖ్యమగు స్నానఘట్టమునకు 'హరికీ పౌరీఘాట్' అనియు, 'హరికీచరన్ఘాట్' అనియుఁ జెప్పుదురు. అట నొకరాతిపై చెక్కఁబడిన విష్ణు పాదముం జూపుదురు. ఇది తొల్లింట విష్ణుపాద విన్యాసమువలన పవిత్రీకృతంబడినతావఁట.

**శ్రుతకీర్తి:—** పాండవమధ్యముఁడగు నర్జునునికి ద్రౌపదీదేవియందుఁగల్గిన సుతుఁడు. ఇతఁడుపపాండవులలోనివాఁడు. [అశ్వత్థామ ఉపపాండవులు నిద్రించుతరి వధించెను]. భిన్నోదరసోదరులు అభిమన్యుఁడు, బభ్రువాహనుఁడు.

మఱియు విక్రమార్కునిమాతామహుఁడు శ్రుతకీర్తి యనిపేరుగలవాడు. ఈతఁడుజ్జయినీ పురాధీశుఁడు. ఇతనికిఁ బురుషసంతతి లేనందున కుమార్తెకుమారుఁడగు విక్రమార్కుఁడవంతీ రాజ్యాధిపతి యయ్యెను.

ఇంకను యదుసంతతియందు వసుదేవునిచెలియలు శ్రుతకీర్తి యని పేరు కలది. ఈమె కేకయ భూపతియగు ధృష్టకేతునిభార్య. ఈమెసుతులు ప్రతర్దనాదులు పదుగురు.

మఱియు శ్రీరామసోదరుండగు శత్రుఘ్నుని భార్యకు శ్రుతకీర్తియను పేరు కలదు. ఈమె కుశధ్వజునికుమార్తె.

**శ్రుతంజయుఁడు:—** మగధ బార్హద్రథ సంతతిక్షత్రియుఁడు. తండ్రి కర్మజిత్తు. పితామహుఁడు బృహచ్ఛేనుఁడు. పుత్రుఁడు విప్ర మహారాజు.

**శ్రుతదేవి:—**యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడగు శూరసేనునికుమార్తె. వసుదేవుని చెలియలు. వృద్ధశర్మునిభార్య. దంతవక్త్రుని తల్లి. శ్రుతదేవిచెలియలు శ్రుతశ్రవ.

**శ్రుతదేవుఁడు:—**
[బహులాశ్వుఁడు చూడుఁడు.]

**శ్రుతర్షులు:—**
[ఋషులు చూడుఁడు.]

**శ్రుతశ్రవాదేవి:—**
[సాత్వతి చూడుఁడు.]

**శ్రుతశ్రవుఁడు —** మగధ బార్హద్రథ సంతతిక్షత్రియుఁడు. తండ్రి మార్జాలి. పితామహుఁడు సహదేవుఁడు. పుత్రుఁడు పితాయువు.

మఱియు సోమశ్రవునితండ్రి శ్రుతశ్రవుఁడనుపేరుగల ఋషి. ఈయన జనమేజయమహారాజులకాలమం దుండినవాఁడు.

**శ్రుతస్వప్నములు:—**
[స్వప్నశాస్త్రము చూడుఁడు.]

**శ్రుతసోముఁడు:—**అత్రి చంద్ర పూరువు కురుసంతతి క్షత్రియుఁడు. తండ్రి భీమసేనుఁడు. తల్లి ద్రౌపదీదేవి. భిన్నోదరసోదరులు ఘటోత్కచుఁడు, సుగుణుఁడు. శ్రుతసోముఁడుపపాండవుల లోనివాఁడు. ఈతనిని భారతయుద్ధానంతరము రాత్రి నిద్రించుచుండ నశ్వత్థామ చంపెనని చెప్పఁబడినది.

**శ్రుతాయుధుఁడు:—** ఒకభూపతి. వరుణునియంశమున జనించినవాఁడు. వరుణుఁడీతని కొకగద (ఆయుధము) నిచ్చెనఁట. అది యెవ్వరిపైఁ బ్రయోగించినను శత్రుశరీరమునకుఁ దగిలెనేని తప్పక వానిం బరిమార్చుననియు, తగులనిచోఁ బ్రయోగించినవానిని (కొట్టినవానిపైఁ బడి వానినే) చంపుననియుఁ జెప్పఁబడినది. భారతయుద్ధమున నీశ్రుతాయుధుఁ డీగదను శ్రీకృ

ష్ణునిపైఁ బ్రయోగింప నాతఁడు తగులక తప్పించుకొన నాగద వెనుకకు మరలి శ్రుతాయుధునే పరిమార్చెనఁట.

**శ్రుతాయువు [వసుమంతుఁడు]:-** అత్రిసంతతి, చంద్రవంశము, పురూరవచక్రవర్తి కుమారుఁడు. సోదరులు ఆయువు, ధీమంతుఁడు, అమవసువు, చిరాయువు (లేక శతాయువు) నను వారలు. ఈతనికి వసుమంతుఁడనియుం బేరు కలదు.

ఇంకను కళింగదేశపురాజొకఁ డీపేరుగలవాఁడు భారతయుద్ధమున భ్రాతృపుత్రసహితముగ భీమునిచే నిహతుఁ డయ్యెను. మఱియు నరిష్టనేమిసుతుం డొకఁ డీపేరుగలవాఁ డుండెను.

**శ్రుతిగీతలు:-** జగదవసానకాలమున వేదములు పరమేశ్వరుని స్తుతించు నటుల వ్రాయఁబడిననుతులు. తత్త్వార్థప్రతిపాదకము లనియు, వైష్ణవమతస్థులు వ్రాసికొనినవనియుఁ జెప్పుదురు.

**శ్రుతి-శ్రుతులు:—** శ్రుతి యనఁగా వినఁబడునదని యర్థము. సర్వసాధారణముగ వేదమునకు శ్రుతి యని వాడుక కలదు.

వేదశ్రుతులు ४:- ఉదాత్తము- పైకి ఎత్తి పలుకుట. అనుదాత్తము- క్రిందికి తక్కువగాఁ బలుకుట. స్వరితము- దీర్ఘముగా చాపి పలుకుట. ప్రచయము- సమముగాఁ బలుకుట.

సంగీతశ్రుతులు ౨౨:- షడ్జమస్వరమున ౧ తీవ్ర, ౨ కుముద్వతి, ౩ మన్దా, ४ ఛన్దోవతీశ్రుతులు; రిషభస్వరమున- ౫ దయావతీశ్రుతి, ౬ రంజనీ, ౭ రక్తికాశ్రుతులు; గాంధారస్వరమున- ౮ రౌద్రీశ్రుతి, ౯ క్రోధాశ్రుతులు; మధ్యమస్వరమున- ౧౦ వజ్రిణీశ్రుతి, ౧౧ ప్రసారిణా, ౧౨ ప్రీతి, ౧౩ మార్జనీశ్రుతులు; పంచమస్వరమున- ౧४ క్షితీ, ౧౫ రక్తాశ్రుతి, ౧౬ నందినీశ్రుతి, ౧౭ ఆలాపినీశ్రుతులు; దైవతస్వరమున- ౧౮ మదంతీశ్రుతి, ౧౯ రోహిణీశ్రుతి, ౨౦ రమ్యాశ్రుతి; నిషాధస్వరమున- ౨౧ ఉగ్రాశ్రుతి, ౨౨ క్షోభిణీశ్రుతి.

ఇవి యిరువదిరెండు సంగీతశ్రుతులు.

**శ్రుతుఁడు:—** ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. ఇతనికి సుహోత్రుఁడని నామాంతరము కలదు. తండ్రి భగీరథుఁడు.

**శేయూనదేశము:-** ఉత్తరమున నాశికాపట్టణము మొదలుగ దక్షిణమున దక్కనులోని దేవగిరి [నైజాంరాజ్యములోని దౌలతాబాద్] వఱకుఁ గలప్రదేశమున కొకప్పుడు శేయూనదేశమని పేరుండెనఁట.

శేయూనచంద్రుఁడను యదువంశక్షత్రియ ప్రభువుపాలననుండి పేరందినదేశము. రాజధాని శేయూనచంద్రపురము. ఈతఁడే దీనినిర్మాత. ఈతఁడు మొదటిశేయూనచంద్రుఁ డనిచెప్పఁబడినది. పిదప దేవగిరిరాజధాని యాయెనఁట.

**శేకదేశము:—** అజ్మీరుపురమున కాగ్నేయముగానున్న ఘూల్వార్ పరిసరదేశమని తలంపఁబడినది. మహాభారతము సభాపర్వము ౩౧ యందు చర్మణ్వతీనదికి (ఇప్పటి చంబల్) దక్షిణమునను, అవంతి (ఇప్పటి ఉజ్జయిని) కుత్తరమునను నుండుననుటయందు శేకదేశ ముత్తరమాళవగా స్ఫురించెడిని.

సహదేవుఁ డపరశేకదేశముతోసహా శేకదేశమును జయించినటులఁ జెప్పఁబడియుండుటవలన

నపర శేక దేశము దక్షిణముగ నుండిన శేకదేశ మని తేలుచున్నది.

**శేనఫాగతిగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**శేషభట్టరుకవి:—** ఈతనిపేర ప్పలాచార్యులని యందురు. తండ్రి నరసింహాచార్యుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్యస గోత్రుఁడు. రచించినది రామకృష్ణవిలాస మనునైదాశ్వాస ముల గ్రంథము. ఇది భద్రాద్రిరామున కంకితము చేయఁబడినది.

**శేషము వేంకటపతికవి:—** ఆంధ్రకవులలో నాథునికునిగఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁ డేమోయని తోఁచెడినని తలంతురుగాని వైష్ణవుఁడని తెలియుచున్నది. కందాళ రామానుజాచార్యులశిష్యుఁడు. తండ్రిపేరు కృష్ణయార్యుఁడు లేక కృష్ణమాచార్యుఁడు.

రచించినది 'తారాశశాఙ్కవిజయము'. ఇది శృంగారప్రబంధము. దీనిని వంగల సీనయ్యగారికిఁ గృతియిచ్చెను. ఈతనికాలము క్రీ. వె. ౧౭౦౮ ప్రాంతమువాఁడు. కృతిభర్త వంగలసీనయ్య దక్షిణమధురాపురమున విజయరంగచొక్కభూపతికడ సన్మానియని చెప్పఁబడినది.

**శేషయగోత్రము:—**
(సంకృతి ఉపగణము చూడుఁడు).

**శేషాయలెస్సా? అంఁ గరుడాయ లెస్సా?:—** (ఆంధ్రలోకోక్తి).

**శేషువు:—**
[ఆదిశేషువు చూడుఁడు.]

**శేషెక్ద్వీపము:—** ఆఫ్రికాఖండమునకుఁ జెందిన పండ్రెండుద్వీపములు చూడుఁడు.

**శ్యేనకపోతీన్యాయము:—** డేగ, కపోతపక్షీ న్యాయము. ఇది శరపురుషేయన్యాయము వంటిదేయని కొందరనెదరు. అనఁగా డేగవలన కపోతపక్షికి, వేఁటకానివలన డేగకొకేకాలమున నపాయము సిద్ధించెనఁట. ఇంకను బలాఢ్యుఁడు, బలహీనుఁడు నని తెల్పుటకీన్యాయము వర్తించును.

**శ్యేని (పక్షి):—** అనూరునిభార్య. (అనూరుఁడు కశ్యపునకు వినతయందుగల్గిన సుతుఁడు గరుడునిసోదరుఁడు) అరుణుఁడను నామాంతరము గలవాఁడు. సూర్యునిరథసారథి.)

కుమాళ్ళు సంపాతి, జటాయువు ననువక్షులు.

**శ్రేయగోత్రము:—**
(నిధృవగణము చూడుఁడు).

**శ్రేయాంశినాధుఁడు:—** జైనతీర్థకరులలో నొకఁడు. [తీర్థకరులు చూడుఁడు.] ఈయన చిహ్నము గండామృగము. ఇక్ష్వాకువంశక్షత్రియుఁడు. తండ్రిపేరు విమలరాజులేక విష్ణురాజని నామాంతరము. తల్లి విమలాదేవి లేక నందాదేవి యనినామాంతరము. జన్మస్థానము శింగపురి. పొడవు ఎన్మిదిధనుస్సులు. [ధనస్సు మూడున్నర మూర]. వర్ణము సువర్ణచ్ఛాయ. ఆయువు ౮౪ లక్షలు. గణధర్సంఖ్య ౭౭. నిర్వాణస్థలము సుమేరుశిఖరము. [శిఖరీజీ లేక అర్బుదపర్వతశిరము]. అంతరాళము. ౫౪ సాగర్. 3 పల్ల.

**శ్రేయాంసి బహువిఘ్నాని:—** మంచి కార్యమే లోనర్చుటకై ననేకయవాంతరములు కల్గునని భావము.

[ఇది సంస్కృత లోకోక్తి.]

**...ష్టకుం ...**
(శ్రేష్ఠకుండలకుల చూడుఁడు.)

**శ్రేష్ఠకుండలకులగోత్రము (చేగో...ళ్ళ)**:— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి.

శ్రేష్ఠకుండలకులి (చేగోళ్ళకుల) గోత్రము. ద్వాక్షేయ (౮) గోత్రము, కందర్పగణము. సంస్కృతగోత్రము కన్దర్పస. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖణ్డ. కామేశ్వరుఁడు దేవత. భార్య కామాంబ. కావేరీతీరము తపస్థానము. కామసరస్సు తటాకము. జపము అర్బుదము. దీపములు ౫౦. క్షేత్రసంఖ్య ౫౦. దాసీదానము. శ్రీగ్రంథము, మాదీఫలము, వర్జనీయములు.
(వైశ్యగోత్రములు చూడుఁడు.)

**శ్వేతకిగోత్రము**
(ఆత్రేయగణము చూడుఁడు).

**శ్వేతకి**:— ఒకరాజర్షి. గొప్పతపస్వి. నియమనిష్ఠలుగలవాఁడు. ఇతఁడొక గొప్పయజ్ఞ మొనర్చుతఱి బ్రహ్మయే దుర్వాసుని ఋత్విక్కునిగ నుండ నాజ్ఞయొసంగెనఁట. మఱియు నీతఁడు బ్రహ్మచర్యము పండ్రెండేడులు గడపెనఁట. అత్తఱి నవిచ్ఛిన్నమగు [తెగి యాఁగిపోని] యాజ్యధారచే నగ్ని కాహుతులొసంగువాఁడనియు, నదియగ్నిదేవునికి మాంద్యము గల్గింప, తేజోహీనుఁడై విదాహముగల్గె ననియు, ఆవ్యాధివారణకే ఖాండవవనము దహించవలసివచ్చె ననియుఁ జెప్పఁబడినది.

**శ్వేతకేతుఁడు**:— ఋషి— అష్టావక్రర్షి మేనమామ. ఈతనిపుత్రుఁడును తపోనిధియైన దండ్రికి తగినసుతుఁడే. ఒకప్పు డష్టావక్రునికి సుతునిపైఁ గోపమువచ్చి 'యమునిం జూడఁబొమ్మ' ని శాపరూపముగ గద్దించెనఁట. సుతుండును సశరీరుఁడై యమునికడకేగి దర్శించి తిరుగవచ్చెనఁట. వేఱొక శ్వేతకేతుఁ డుద్దాలకుని సుతుఁడు.

**శ్వేతగిరి (పర్వతము)**:— టిబెట్టుదేశమునకు తూర్పుగానున్న హిమవత్పర్వతభాగమునకుఁ బేరు. దీనిం గూర్చి మహాభారతము సభాపర్వము. ౨౮ అధ్యాయమునను, మత్స్యపురాణము ౧౧౨ శ్లో ౩౮ యందునను గానవచ్చెడిని.

**శ్వేతము, శ్వేతకుష్టు, బొల్లరోగము**:— కుష్ఠుజాతులలో నొకజాతిరోగము. దీనిని బొల్లి యనుటయుఁ గలదు. ఆంగ్లమున Lucoderma అని యందురు. శరీరమున రక్తముచెడి తెల్లనిమచ్చలు బయలుదేరి వ్యాపించెడి జబ్బు.

**శ్వేతయోగి**:— కృతయుగమునాఁటివాఁడనియు యోగాచార్యుఁ డనియుఁ జెప్పఁబడినవాఁడు, వీరియాశ్రమము కాశ్మీరదేశమున నచ్ఛోదసరోవరతీరమని బృహన్నారదీయ పురాణము ౧ . ధ్యాయమునఁ జెప్పఁబడినది. ఇది యిప్పటి మార్తాండక్షేత్రమున కాఱుమైళ్ళదూరమున నున్నదావు.

అచ్ఛోదసరోవరప్రశంస బాణభట్టునికాదంబరియందునను, బిల్హణుని విక్రమాంకదేవచరిత్రమునను గలదు. శ్వేతయోగిమొదలు లకులీశునివఱకు యోగాచార్యు లనియు, వీరికి ౧౧౨ గురుశిష్యులనియుఁ జెప్పఁబడిరి. పాతంజలియోగసూత్రములను వ్రాసియుద్ధంకచినవాఁడు గాని సేశ్వరసాంఖ్యమతకర్త గా పొరఁబడరాదు.

**శ్వేతయూపిగోత్రము**:—
(పరాశరగణము చూడుఁడు).

## శ్వేత్యంతాయనగోత్రము
(కుశికగణము చూడుఁడు).

## శ్వేతాంబరజైనులు:—
(జైనసిద్ధాంతము చూడుఁడు).

## శ్వేతాత్రేయగోత్రము:—
(ఆత్రేయగణము చూడుఁడు).

## శ్వేతీయగోత్రము:—
(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

## శ్వేతీయగోత్రము
(కారేణుపాలి ఉపగణము చూడుఁడు).

**శ్వేతుఁడు:**—ఈపేరుగలవారు ముగ్గురు లేక నల్వురు గానఁబడుచున్నారు. విరటాధిరాజు కుమారుఁడు (ఉత్తరునియన్న) పేరు శ్వేతుఁడు. (మచ్ఛదేశాధిపతి).

మఱియు విదర్భదేశాధీశుఁడగు సుదేవుని కుమారుఁడొకశ్వేతుఁడు కలఁడు. ఈ శ్వేతమహారాజుసోదరుఁడు సురథుఁడు. ఈతఁడు ధర్మాచరణపరాయణుఁడై యుండి యన్నదానమొనర్పని వాఁడని చెప్పఁబడినది.

వేఱొకశ్వేతుఁడనురాజర్షి కాళాంజనతీర్థమున తపంబొనర్చుచుండ యముఁడీతనిఁబాశబద్ధునిజేసి యీడ్వ, పరమేశ్వరుఁడా యముని వారించెనని చెప్పఁబడినది.

ఇంకను కృతయుగమున యోగధర్మలక్షణముల నెఱింగిన శ్వేతయోగి యొకఁడుండె ననియు, 'శ్వేతాది లకులీశాన్తాం యోగాచార్యపరంపరామ్' అని చెప్పఁబడియుంట శ్వేతుఁడు మొదలు లకులీశునివఱకు యోగాచార్యులనియు, వీరికి నూటపండ్రెండుగురుశిష్యులు గలరనియుఁ దెలియుచున్నది. వీరే మొదటివారు. పతంజలియోగసూత్రకర్త మొదలగువారు తర్వాతవారని తెలియఁగలదు.

## శైఖేయగోత్రము:—
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**శైబ్య:**— విదేవభూపాలునికుమార్తె. ఈమె తొల్లింటిజన్మంపుఁ బేరు తెలియదుగాని తొల్లింట నీమెభర్త పేరు శతధనుఁడు. విష్ణుభక్తుఁడు. ఒకనాఁడు స్నాతుఁడై యేతెంచుచో నావైష్ణవుండగు పాషండునితో ప్రసంగించుదోషమునఁగ శ్వాన (కుక్క) సృగాల (గద్ద), కాక, బక, మయూర (నెమలి), జన్మము లెత్తి పిదప మనుష్యజన్మమెత్త వలసివచ్చెనఁట. శైభ్య పతివ్రతగాన వాటినెఱింగి తిరిగి మనుష్యజన్మ మెత్తువఱకు పెండ్లియాడక యట్లేయుండి పిదప నాతనినే పెండ్లియాడెనఁట. ఇది పాతివ్రత్యధర్మమును విష్ణుభక్తుల కనన్యవృత్తి దోషమును వివరించిఁ జెప్పఁబడినగాథగఁ దోచెడిని. మఱియు జ్యామఘునిభార్య యొకశైబ్య కలదు. ఈమెసుతుఁడు విదర్భుఁడు.

**శైబ్యులు:**— శిబిచక్రవర్తియొక్క (ఉశీనరునికుమారుఁడు) సంతతివారికి శైబ్యులనిపేరు.

## శైభ్రేయగోత్రము:—
(అత్రిపుత్రికాపుత్రుల గణము చూడుఁడు.)

## శైరిషగోత్రము
(అగస్త్య ఉపగణము చూడుఁడు).

**శైరీషకపురము:**—దీని నిప్పుడు 'శిర్సా' యనుచున్నారు. పంజాబునం దున్నది. దీనిప్రశంస మహాభారతము, సభాపర్వము 32 అధ్యాయమునఁ గలదు.

**శైలగోత్రము:—**
(జమదగ్ని బిధాఉపగణము చూడుఁడు.)

**శైలాలిగోత్రము:—**
(ఉపమన్యుగణము చూడుఁడు.)

**శైలాలిగోత్రము:—**
(రథితరఉపగణము చూడుఁడు.)

**శైలాహారదేశము:—** బొంబై రాజధాని లోని కొల్హాపురసంస్థానప్రాంతదేశమునకు క్రీ. వె. పదునొకండవ శతాబ్దమున శైలాహారదేశముగ నుండెనని తేలుచున్నది. ఈదేశప్రశంస పద్మపురాణము, ఉత్తరఖండము ౭౮ అధ్యాయమునఁ గలదు. క్షుల్లకపుర మనియు, పద్మావతీపుర మనియు, వాడుకనామములుగల కరవీరపురము రాజధానియై యుండెనఁట. ఇప్పు డది కొల్హాపురము, లేక కొల్లాపుర మనంబడుచు నిప్పు డారాజ్యమేలు మహారాజునకు స్వదేశసంస్థానఁపురాజధానియై యున్నది. పరిశోధనలవలనఁ గొందఱు 'శైలాహారపుర' మనుమాట మారి కొల్లాపుర మైనదని తలంచుచున్నారు. ఇంకఁ గొందఱు 'క్షుల్లకపురము' మారి 'కొల్లాపుర' మాయెనను చున్నారు. అచటివారు 'కరవీరపుర' మని కూడ నేఁటికిని వాడుచునే యున్నారు.

కొల్లాపురము వేణీనదీతీరము. ఇది కృష్ణానది యుపనది. కృష్ణానదియు, వేణీనదియుఁ గలసిన ప్రవాహమునకుఁ 'గృష్ణవేణి' యని పేరగుచున్నది. వేణీనదీప్రశంస హరివంశము ౯ అధ్యాయము నందుఁ గలదు.

కొల్లాపురమున ప్రసిద్ధమగు మహాలక్ష్మీదేవస్థానము గలదు. అది దేవీభాగవతము ౭-౩౦-౩౮ యందునను, మత్స్యపురాణము ౧౩ యందునను ప్రశంసింపఁబడినది. శ్రీకృష్ణుం డిట పరశురాముని గలసెనఁట. శైలాహారనృపతియు శృగాలుం బరిమార్చెనఁట.

**శైలాహారవంశనృపతులు:—** వీరు కర్హాడ రాజధానిగ నాప్రాంతరాజ్య మేలినవారు. కర్హాడ యిప్పుడు బొంబై రాజధానియం దున్నది. [కర్హాడదేశము చూడుఁడు].

ఉత్తరకొంకణమున శ్రీస్థానము లేక స్థానపురమనుపేరుగల పట్టణమునకుఁ దొల్లింట 'శైలాహారపుర' మని వాడుకయుండెనఁట. శ్రీ లోపించి స్థానశబ్దము తానా యై యిక్కాలమున బొంబై రాజధానియందలి పురముగా నున్నది. ఇంక నాకొల్లాపురప్రాంతసీమకు క్రీ. వె. పదునొకండవ శతాబ్దమున శైలాహారదేశ మని వాడుకయుండెనఁట. కొల్లాపురము కరవీరపుర మనంబడుచుండెనఁట. శైలాహారనృపతి యొకఁడు శృగాలుం బరిమార్చెనని చెప్పఁబడినది.

కుంతలదేశమేలుచుండిన రెండవ విక్రమాదిత్యుఁడు శైలాహారనృపపుత్రికయగు చంద్రలేఖం బరిణయమాయెనని చెప్పఁబడినది.

**శైలోదా నది:—** దీనిని జాక్సారిటిస్ అని పెక్కండ్రు పొరబడి తలంచిరి. మహాభారతము, సభాపర్వము ౫౧ అధ్యాయమున శైలోదానది మేరు మందర పర్వతములనడుమ నున్నదనియు, రామాయణము కిష్కింధాకాండము ౪౩ అధ్యాయమున నుత్తరకురుభూములకు సమీప మనియుఁ జెప్పఁబడియున్నది.

**శైవగవగోత్రము:—**
[భరద్వాజ ఉపగణము చూడుఁడు].

## శైవగవగోత్రము:—

[సంకృతిఉపగణము చూడుఁడు].

## శైవగవగోత్రము:—

[జాతుకర్ణ్యగణము చూడుఁడు].

## శైవధర్మ విధానతత్త్వములు:—

శైవధర్మమునఁ బరమేశ్వరుఁడే జగత్కర్త, జగద్భర్త, సర్వవేత్త. తొలుతనే యున్నపరమేశ్వరునుండి సృష్టిస్థితిలయములు గల్గెను. శివతత్త్వము-ఇది ౩౬ గా నెన్నఁబడుచున్నది. పరమేశ్వరునకు లయపరికరము. ప్రథమావస్థ.



3౫ శక్తితత్వము:—

శక్తి యన పరమేశ్వరిసామర్థ్యము. ఇది పరమేశ్వరునకు భోగపరికరము. బలావస్థ. మహిమాస్థానము. సర్వవ్యాపకము. పరమేశ్వరునిశక్తి కాది శక్తి యని పేరు. ఇది మూఁడుభేదములు గలది. ౧ ఇచ్ఛాశక్తి (ఒకపనిఁజేయుటకుఁ దలంపు గలుగుట.) ౨ జ్ఞానశక్తి [ఆపనిం జేయుటయందలి సాధకబాధకముల నాలోచించుట]. 3 క్రియాశక్తి [ఆపనిం జేయుట] అని. ఇంకను శక్తులు, శక్తిపీఠములు, నీతత్వమునకుఁ జేరినవియే.

3౪ సదాశివతత్వము:—

పరమేశ్వరునియధికారావస్థ స్థితిహేతుకము. దీనియందు నాద బిందు కలలు కలిగెను. అనాహత మని నాదముంగూర్చి జెప్పఁబడియెను.

33 ఈశ్వరతత్వము:—

పరమేశ్వరుని యైశ్వర్యావస్థ. సృష్టిహేతుకము.

3౨ శుద్ధవిద్యాతత్వము:—

పరమేశ్వరునిసర్వజ్ఞావస్థ. జ్ఞానహేతుకము.

3౧ మాయాతత్వము:—

చరాచరాత్మకమగు జగద్గర్భితరహస్యము. దీనినుండి 3౦ కలాతత్వము జనించెను. ౨౭ నియతితత్వము జనించెను. ౨౬ రాగతత్వము జనించెను.

3౦ కలాతత్వము:—

(దీనినుండి ౨౯ విద్యాతత్వము, ౨౬ రాగతత్వము, ౨౫ ప్రకృతితత్వము జనించెను.) ౧ నివృత్తి, ౨ ప్రతిష్ఠా, 3 విద్యాకలా, ౪ శాంతికలా, ౫ శాంత్యతీతకలా, ౬ శాంత్యతీతోత్తగాకలా అని కలలాఱువిధములు.

3౪ సదాశివతత్వమున నాద బిందు కల లుద్భవించెనని పైనవివరింపఁ బడినది. ఇందు కలలు వివరింపఁబడినవి. కలలలోని విద్యాకల విద్యాతత్వమనఁబరగి ౨౯ తత్వముగా వివరింపఁబడును. ఇంక అనాహతమగు నాదము తొలుదొలుత అ కారముగను, పిదప ఇ, ఉ, ఋ లుగను, పరిణమించెను. ఇందు ఇ, ఉ, ఋ లనునవి. ఆద్యస్వరమగు అకారమునుండి జనించినవిగాఁ జెప్పఁబడినది. మఱియు ఇ, ఉ, ఋ లను జన్యస్వరము లందురు.

పై నాల్గుస్వరములయొక్క వికారరూపములుగ ఆ, ఈ, ఊ, ౠ, ఌ, ౡ అనుస్వరములు గలిగెను. వీట్లకు వికారస్వరము లనిపేరు.

పిదప అ, ఇ [అను] స్వరములు కలసి ఏ యయ్యెను. ఆ, ఉ [లను] స్వరములు కలసి ఓ యయ్యెను. అ, ఎ లు కలసి ఐ అయ్యెను. అ, ఒ లు కలిసి ఔ యయ్యెను. ఇట్లేర్పడిన ఎ, ఒ లకు గుణస్వరము లనియు, ఐ, ఔ లకు వృద్ధిస్వరము లనియుం బేరు. పిదప అనుస్వారము [సున్న], విసర్గము కలిగెను. ఇట్లు శక్తిముఖమునుండి పదునాఱుస్వరములు కలిగెను.

శక్తియొక్క పంచాంగములనుండి ఐదువర్గములుగ నిరువదియైదువర్గస్వరములు గల్గెను. అవి ౧ క వర్గము. క ఖ గ ఘ ఙ, ౨ చ వర్గము. చ ఛ జ ఝ ఞ, 3 ట వర్గము. ట ఠ డ ఢ ణ, ౪ త వర్గము. త థ ద ధ న, ౫ ప వర్గము. ప ఫ బ భ మ అనునవి ౨౫.

శక్తియొక్క సప్తధాతువులనుండి య, ర, ల, వ, శ, ష, స అను ధాతుస్వరములు కలిగెను. శక్తిప్రాణజన్యమగు హ కారమును, ఉభయాత్మకమగు క్ష కారమును గల్గెను. ఇట్లేఁబదివర్ణములు

పంచాశద్రుద్రరూపములై యేర్పడియెను. దీనిని 'వర్ణాధ్వ' యనెదరు.

౨౯ విద్యాతత్త్వము:—

ఇది ౩౦ కలాతత్త్వజన్యము. ఇందు సమస్త విద్యలు జనించెను. వేదములు, వేదాంగములు, ఉపాంగములు, చౌషష్టి విద్యలు, కలలు మొదలగు వేదశాస్త్రవిద్యలు, నితరవిద్యలు నీసంబంధములే. ఆయావిద్యలంగూర్చి వాట్లవాట్ల వేర్వేఱు తావులం గాననగును.

౨౮ కాలతత్త్వము:—

ఆయుఃప్రమాణములు, యుగములు, మన్వంతరములు, వత్సరములు, మాసములు, పక్షములు, వారములు, దినములు, గడియలు, లిప్తలు, గంటలు మొదలగునవన్నియుఁ జేరినవియే. ఈసంబంధములే. ఇంకను భూత, వర్తమాన, భవిష్యత్కాల ధర్మము లీతత్త్వసంబంధమే యగును. ఇది మాయాతత్త్వజన్యము.

౨౭ నియతి తత్త్వము:—

జగమునందు నియామకముగ సంభవించుచుండు సర్వధర్మము లీతత్త్వసంబంధములే యగును. ఇది మాయాతత్త్వజన్యము.

౨౬ రాగతత్త్వము:—

సమస్త వస్తువులందుఁగల యనురాగములు, వాంఛలు తత్త్వసంబంధకములే. ఇది కలాతత్త్వజన్యము.

౨౫ ప్రకృతితత్త్వము:—

దేనియందైనను కల్గువాంఛకు మోహ మని పేరు. అది చేకుఱినం గల్గునది సంతసము. చేకుఱకుండినఁ గల్గునది దుఃఖము. ఈమోహాసంతస దుఃఖములకుఁ బ్రకృతి మూలమని చెప్పఁబడినది. ప్రకృతి కలాతత్త్వజన్యము. ప్రకృతి తత్త్వమునుండి ౨౪ గుణతత్త్వము కలిగెను.

౨౪ గుణతత్త్వము:—

దీనికిఁ బురుషతత్త్వమనియుం బేరు గలదు. పురుష యన పూర్వసంచితమగు కర్మానుభవమున కాయత్తపఱుపఁబడినప్రాణికిఁ బురుషసంజ్ఞ వర్తించును. గాని స్త్రీపురుషభేదశబ్దార్థ మిట కాదు. ఇది ౨౫ ప్రకృతితత్త్వజన్యము. దీనినుండి ౨౩ బుద్ధితత్త్వము కలిగెను.

౨౩ బుద్ధితత్త్వము:—

ఇది గుణతత్త్వజన్యము. బుద్ధినుండి సాత్త్విక తామస రాజసగుణాత్మకమగు అహంకార (౨౨) తత్త్వము జనించెను. అహంకారమన 'నేను' 'నాది' యను కాంక్ష. భ్రాంతియని యర్థము.

౨౨ అహంకారతత్త్వము:—

ఇది మానవజీవితధర్మమున నైహికకార్యములకుఁ బ్రధానము. ఇది తామసాహంకార మనియు, సాత్త్వికాహంకార మనియు, రాజసాహంకార మనియుఁ ద్రివిధము. ఇది బుద్ధితత్త్వజన్యము. సాత్త్వికాహంకారమునుండి మనస్తత్త్వము కల్గెను.

౨౧ మనస్తత్త్వము [అంతఃకరణము]:—

ఇది యహంకారతత్త్వజన్యము. దీనినుండి యైదుజ్ఞానేంద్రియతత్త్వములు గల్గెను. వాట్లను వివరింతుము.

౨౦ శ్రోత్రతత్త్వము:—

చెవియందు వినిపించు [ఇంద్రియము] లేక శక్తి.

౧౯ త్వక్తత్త్వము:—

చర్మమునందు స్పర్శము నెఱుంగు [ఇంద్రియము] లేక శక్తి.

౧౮ చక్షుస్తత్వము:—

నేత్రమందు కన్పించు [ఇంద్రియము] లేక శక్తి.

౧౭ జిహ్వాతత్వము:—

నోటియందు రుచింగ్రహించు [ఇంద్రియము] లేక శక్తి.

౧౬ ఘ్రాణతత్వము:—

ముక్కునందు వాసనం గ్రహించు [ఇంద్రియము] లేక శక్తి.

రాజసాహంకారమునుండి యైదుతత్వములు జనించెను. వాటికిఁ గర్మేంద్రియతత్వము లనిపేరు. వాట్లను వివరింతుము.

౧౫ వాక్తత్వము:—

నోరు మాటాడు [ఇంద్రియము] లేక శక్తి.

౧౪ పాణితత్వము:—

చేతులు పనిచేయు [ఇంద్రియము] లేక శక్తి.

౧౩ పాదతత్వము:—

పాదములు నడచిపోవు [ఇంద్రియము] లేకశక్తి,

౧౨ ఉపస్తత్వము:—

రహస్యేంద్రియము ఆనందముం గల్గించు [ఇంద్రియము] లేక శక్తి.

౧౧ పాయుతత్వము:—

గుదేంద్రియము విసర్జనమొనర్చు [ఇంద్రియము] లేక శక్తి.

తామసాహంకారమునుండి పంచతన్మాత్రతత్వములు కల్గెను. వాట్లనుండి పంచభూతతత్వములు జనించెను. వాట్లను వివరింతును.

౧౦ శబ్దతత్వము [తన్మాత్ర]:—

దీనినుండి [౫] ఆకాశతత్వము కల్గెను. దీనియందు సప్తకోటిమహామంత్రములు గలిగెను, (వాట్లంగూర్చి ముందు వివరింతుము).

౯ స్పర్శతత్వము (తన్మాత్ర):—

దీనినుండి (౪) వాయుతత్వము కల్గెను.

౮ రూపతత్వము (తన్మాత్ర):—

దీనినుండి (౩) అగ్నితత్వము కల్గెను.

౭ రసతత్వము (తన్మాత్ర):—

దీనినుండి (౨) జలతత్వము కల్గెను.

౬ గంధతత్వము (తన్మాత్ర):—

దీనినుండి (౧) పృథ్వీతత్వము కల్గెను. పృథ్వీతత్వసంబంధములై ౨౨౪ భువనములు భువనధ్వగ దనరెడిని.

## శైవపథిగోత్రము:—

[అగస్త్య ఉపగణము చూడుఁడు].

## శైవ లేక శైవాదేవి:—

ఆంగీరసుం డను అగ్నియొక్కభార్య. ఆంగీరసుడు అగ్నియొక్క జ్యేష్టపుత్రుఁడుగ దత్తత చేసుకోబడినవాఁడు.

## శైవేరిగోత్రము

[కణ్వఉపగణము చూడుఁడు].

## శైశిరగోత్రము:—

[భరద్వాజ ఉపగణము చూడుఁడు].

## శైశిరిగోత్రము:—

[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు].

## శైశునాగులు:—

శిశునాగునిసంతతివారగు మగధదేశమేలిన ప్రభువులు. ప్రద్యోతరాజవంశమునకుఁబిదప నీవంశఁపునృపతులు ౩౬౨ సంవత్సరములు మగధరాజ్య మేలిరి.

## శొంఠి:—

లా. Zingiber officinali ఆంగ్ల. Dry ginger. సం. నాగరా.

ముదిరినయల్లమును గంధకముకాల్చినవేఁడిచే నెండించి, సున్నపుఁనీటం దడిపి శొంఠిం జేసెదరు.

ఇది భోజనపదార్థములందే గాక, ఔషధములందు తఱుచుగ కలియునది. శొంఠి త్రికటుకములలో నొకటి. కషాయములందు శొంఠి యించుమించుగ తప్పక చేఱుంగాన "శొంఠిలేని కషాయమా" యని సామెతగాఁ జెప్పుట కలదు. అనఁగా కషాయములందు శొంఠి ప్రధానమని భావము. కాక జేసి జీర్ణముగావించును. కడుపుబ్బరమునివారించి, విరేచనము వెడలించును. మూలవ్యాధి, గుల్మము శ్లీపదము నివారించును.

శొంఠిగంధము పై సిప్టువెచి నిప్పుతోఁగాచిన తలనొప్పి, పార్శ్వఁపుతలనొప్పి, పంటినొప్పి, చిగురువాపు, వాతనొప్పులు, మేహవాతఁపు నొప్పులు హరించును. శొంఠియందు నీళ్ళవిరేచనములంగట్టు గుణమును, తుమ్మెద, తేనెటీఁగ, కందిరీఁగల కాటు బాధ నివారించుగుణమును కలదందురు.

**శోణగిరి:**—ఇది జైనుల యాత్రాస్థలము. ఒకకొండపై నున్న క్షేత్రము. గ్రేటిండియన్పెనిన్సులారెయిల్వే బొంబై ఢిల్లీలైనులో ఢిల్లీనుండి ౨33 మైళ్ళదూరముగల శోణగిరిస్టేషనుకడనున్న పర్వతము.

**శోణప్రస్థము:**—దీనికి వృకస్థలియనియు, వృకప్రస్థమనియు నామాంతరములు. హస్తినాపురముదక్షిణభాగమునఁ గొంతదూరమునం దుండెడిది. (సామంతపంచకము చూడుఁడు.)

**శోణభద్రానది:**— అమరకుండకమున మేఖలపర్వతములపై జనించి, (కపిలధారనుండి) మగధదేశఁపుఁబశ్చిమసరిహద్దునఁ బ్రవహించునది. ఇది గంగలో సంగమించునది. తనప్రవాహమును మార్చుచు వేర్వేఱుకాలముల వేర్వేఱుతావుల గంగానదింజేరుచుండిన నది. రామాయణకాలమున అప్పుడు వసుమతి (వసుమహారాజుపేరం బరగు రాజధానీపురము) యని పేరఁబరగిన గిరివ్రజపురము ప్రక్కనుండి ప్రవహించుచుండినటుల రామాయణము ఆదికాండము 3౨ అధ్యాయమునను, భారతకాలమున నిప్పటి బీహారుదేశములోని ఆరాపురముప్రక్కఁబడి ప్రవహించుచుండినటులఁ దెలియఁగలదు.

ఒకప్పుడు పాట్నానగరముకడనున్న బంకిపురముదరిని గంగానదిం జేరుచుండెను. గాని యిప్పుడు ౧౨ మైళ్ళయెగువను గంగను జేరుచున్నది. ఇప్పుడు గంగలో సంగమించుతావున 'సింఘి' యనుగ్రామము కలదు. (చప్రాపట్టణమునకు తూర్పుగా నెన్నిదిమైళ్లు). శోణభద్రానదీతీరమున శోణపూరనుగ్రామము కలదఁట. గుఱ్ఱములసంత దేశప్రసిద్ధము. (సుమాగధీమగధీనది మగధరాజ్యము చూడుఁడు.)

**శోణితపురరాజ్యము:** బాణాసురభూపతి రాజ్యము.

**శోణితపురము లేక దేవీకోట:**—
(బాణాసురభూపతిరాజ్యము చూడుఁడు.)

**శోణ్యగోత్రము:**—
(శౌనక లేక గృత్సమదగణము చూడుఁడు.)

**శోద్రేయగోత్రము:**—
(ఆత్రేయగణము చూడుఁడు.)

**శోభానగరము [శోహాన్]:**—
(చౌహాను శాఖక్షత్రియులు చూడుఁడు.)

**శోష:**—సొమ్మసిలుట. ఇది యాహారము లేమి, నధికమైన యెండివేఁడిమికి, నమితదేహాయాసమునఁ గల్గును.

**శ్రౌచుము గోత్రము:—**
(అయాస్య ఉపగణము చూడుఁడు).

**శ్రోణీచేషక గోత్రము:—**
(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

**శ్రోతాయనగోత్రము:—**
(సంకృతి ఉపగణము చూడుఁడు).

**శ్రోత్రాంజనము:—** ఇది antimony జాతిభేదములలో నొకటిగఁ దలంపఁబడుచున్నది. అనఁగా సురమారాయిజాతులలో నొకటి. క్రమముగ శుద్ధిచేయఁబడినతరి ఎక్కిళ్లు, కాస, నాసికారోగములు, నేత్రరోగములు, పైత్యములు, వ్రణములు, వాతములు, శ్వాస నివారించునని చెప్పఁబడినది. విషదోషములు హరించునందురు. కాటుకవలె నేత్రముల కిడిన నేత్రరోగములు నివారించును.

**శ్రోత్రియగోత్రము:—**
(శౌనక లేక గ్రత్సమదగణము చూడుఁడు.)

**శ్లోకమయగోత్రము:—**
(పరాశరగణము చూడుఁడు.)

**శ్వోవలగోత్రము**
(కుశికగణము చూడుఁడు.)

**శౌంగగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**శౌంగశైశిరిగోత్రము:—** ఇది అగస్త్య సంతతి. అగస్త్యోత్తరగణములోని శౌంగశైశిరి గణముగ నెన్నఁబడిన గోత్రము.

౧ ఆంగీరస, బార్హస్పత్య, భరద్వాజ, కధ్య, అక్షీల.

౨ ఆంగీరస, కధ్య, అక్షీల.

3 ఆంగీరస, బార్హస్పత్య, భరద్వాజ, శౌంగ, శైశిర అని మూడుప్రవరరూపములు కలవు.

ఈశౌంగశైశిరి- ద్విగోత్రమని చెప్పఁబడినది. అనఁగా భరద్వాజగణమందలి శుంగగోత్రమును విశ్వామిత్రసంతతి గణమందలి శిశిరగోత్రమును కలిశి శౌంగశైశిరి గణమును గోత్రమును ఏర్పడినటుల చెప్పఁబడినది.

**శౌకయగోత్రము:—**
(నిధ్రువగణము చూడుఁడు).

**శౌకిగోత్రము:—**
[పరాశరగణము చూడుఁడు].

**శౌక్తికోటరగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**శౌద్ధకర్ణిగోత్రము:—**
[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు].

**శౌద్ధకిగోత్రము:—**
(జమదగ్నివత్సగణము చూడుఁడు.)

**శౌద్ధిగోత్రము:—**
[భరద్వాజ ఉపగణము చూడుఁడు].

**శౌనకగోత్రము**
[భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**శౌనకగోత్రము:—**
[శౌనక లేక గృత్సమదగణము చూడుఁడు].

**శౌనక లేక గ్రత్సమదగణము:—**
ఇది భృగుసంతతియందలి యొకగణము. దీనిని గృత్సమదగణమని కొందరువాడిరి. ఇందు పదునేడుగోత్రములు చెప్పఁబడినవి.

కాత్యాయనసూత్రోక్తగోత్రములు [౧౨]

౧ ఖాదర్యాయున, ౨ గర్భాయన,
3 గంగాయున ౪ గాత్స్నమద,
౫ తైత్తిరీయ, ౬ పత్ఫాల,
౭ మాత్స్యగన్ధ, ౮ యాజ్ఞకి,
౯ శునక, ౧౦ శౌనక,
౧౧ శ్రోత్రియ, ౧౨ స్వాజ.

మాత్స్యసూత్రోక్త గోత్రములు [౫]

౧ యోగ్యాపత్య, ౨ శాక్త్యాయన, 3 శోణ్య, ౪ సనక, ౫ స్వేత.

ఈగోత్రములకుఁ బ్రవరరూపములు.

౧ శౌనకహోత్ర (లేక) భార్గవ లేక శునక లేక శౌనక: (అని ఏకార్షేయప్రవరలు ౪).
౨ గృత్సమద లేక గార్త్సమద (అని ఏకార్షేయ ప్రవర).
3 భార్గవ గార్త్సమద లేక గార్త్సమదభార్గవ. (అని ద్వార్షేయప్రవర).
౪ భార్గవ - శౌనహోత్ర - గార్త్సమద.
౫ భార్గవ - గార్త్సమద - శౌనక.
౬ భార్గవ - వైన్య - పార్థ.

**శౌనకర్ణిగోత్రము:—**
[ఆత్రేయగణము చూడుఁడు].

**శౌనకాయనగోత్రము:—**
[జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు].

**శౌనకుఁడు:—** చంద్రవంశము. మహర్షి. తండ్రి. శునకుఁడు. ఈతఁడు తపోనియతి. నైమిశారణ్యవాసి. సూతమహర్షివలనఁ బురాణములు వినిన ఋషులలో నగ్రగణ్యుఁడు. ఈతఁడవివాహితుఁడు.

వేఱొకశౌనకుఁడు ఋషి. శునకునిపుత్రుఁడు. కృత్సమదుని పౌత్రుఁడు. తపోనిధి. సకలపురాణములు సూతపౌరాణికునివలన వినినవాఁడుగఁ జెప్పఁబడినవాఁడు.

**శౌనరిగోత్రము:—**
(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

**శౌనకులగోత్రము:—**
(శనకాలకులగోత్రము చూడుఁడు.)

**శౌనాయనగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**శౌరసేనిభాష:—**
షట్ప్రాకృతభాషలలో నొకటి. (ప్రాకృతభేదములు చూడుఁడు). ప్రాకృతజన్యము. అష్టభాషలలో నొకటి. (భాష యెన్మిదివిధములు చూడుఁడు).

**శౌరి:—** శ్రీకృష్ణునికి వాడుకనామము. శూరుని సంతతివాఁడని భావము. (శూరుఁడు లేక శూరసేనుఁడు శ్రీకృష్ణుని పితామహుఁడు).

**శౌశిరిగోత్రము:—**
(కథ లేక కథ్యగణము చూడుఁడు).

**శ్రౌమతగోత్రము:—**
(కామకాయనగణము చూడుఁడు).

**శ్రౌతహిగోత్రము**
(పరాశరగణము చూడుఁడు).

**షట్చక్రవర్తులు (మహారాజులు):**—
(చక్రవర్తులు చూడుఁడు.)

**షట్సహస్రావనీ మండలము:**—
(ధరణికోట (సామంత) రాజ్యముఁ జూడుఁడు.)

**షట్తాళములు:**— (తాళములు చూడుఁడు.)

**షట్ప్రాకృతములు [భాషలు]:**—
(ప్రాకృతభేదములు చూడుఁడు).

**షట్క్రియలు:**—
(అష్టాంగయోగములు చూడుఁడు).

**షట్ఛివలింగములు [రావణప్రతిష్ఠితములు]:**—

౧ వైద్యనాథలింగము } ఝూరఖండము.
౨ వక్రేశ్వరనాథలింగము }
3 సిద్ధినాథలింగము } రాధాదేశము.
౪ తారకేశ్వరలింగము }
౫ ఘంటేశ్వరలింగము- రత్నాకరనదీతీరము (ఇప్పటిపేరు కానానది.) హుగ్లీమండలము. బంగాళాదేశమున నున్నది.
౬ కపిలేశ్వరలింగము- భాగీరథీనదీతీరము.

**షట్త్రింశదుపచారములు:** పూజనొనర్చుటయందలి ముప్పదియా రుపచారములు. పూజాంగములని భావము.

శ్లో॥ ఆసనా, భ్యంజనే, తత్వ దుద్వర్తన విరుక్షణే। సంమార్జనం సర్పిరాది ?శనావావాహనేతథా। పాద్యార్ఘ్యాచమనీయంచ స్నానీయ మధుపర్కకౌ। పునరాచమనీయంచ వస్త్ర యజ్ఞోపవీతకే। అలంకారో గంధపుష్పే ధూప దీపౌ తథైవచ। అనులేపశ్చ శయ్యాచ చామర వ్యజనంతథా। ఆదర్శదర్శనంచైవ నమస్కారా ఉధనర్తనమ్। గీతవాద్యేచ దానాని స్తుతిహోమ ప్రదక్షిణమ్। దంతకాష్ఠప్రదానంచ తతో దేవ విసర్జనమ్। ఉపచారా ఇమే జ్ఞేయా షట్త్రింశత్సురపూజనే॥

(ఉపచారములు చూడుఁడు).

**షట్పితాపుత్రికతాళము:**—
[తాళములు చూడుఁడు).

**షట్సీతినరకకుండములు :**—
(నరకకుండములు చూడుఁడు).

**షట్పురాణస్థలములు:**—
(పురాణస్థలములు చూడుఁడు).

**షట్ ఫర్ డివిడెండు పీరీడ్ (Shut for Dividend Period):**— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. కంపెనీల ట్రాన్సఫరు బుక్కు మూసివేసినకాలము. ఈకాలమున డివిడెండువారంట్లు తయారు చేసుకొనుటకు ట్రాన్సుఫర్లు నాపివేతురు.

**షడంగములు:**—సంగీతశాస్త్రమున ౧ అనుద్రుత, ౨ ద్రుత, 3 లఘు, ౪ గురు, ౫ ప్లుత, ౬ కాకపాదములను షడంగము లందురు.
(సంగీతాంగములు చూడుఁడు).

**షడంగములు:**— భరత (నాట్య) శాస్త్రమున ౧ శిరస్సు, ౨ హస్తములు, 3 ఉదరము, ౪ పార్శ్వములు (ప్రక్కలు), ౫ పిరుదులు (కటిస్థలి), ౬ పాదములు, షడంగములని చెప్పఁబడును.

(హస్తాభినయము చూడుఁడు, భరతశాస్త్ర

ము చూడుఁడు, ఉపాంగములు చూడుఁడు, ప్రత్యంగములు చూడుఁడు).

## షడంశపరిశోధక సాధనము:—

(తురీయషడంశపరిశోధక సాధనములు చూడుఁడు— టైకోబ్రాహిపరిశీలకుఁడు చూడుఁడు).

## షడధ్వలు:—

(అధ్వలు చూడుఁడు).

**షడశీతిపుణ్యకాలము:**— రవి, మిధున, కన్యా, ధను, మీనరాసులలోఁ బ్రవేశించుకాలమునకు షడశీతిపుణ్యకాలమని పేరు.

(పుణ్యకాలములు చూడుఁడు).

## షడ్దర్శనములు:—

౧ న్యాయశాస్త్రము (గౌతమర్షి కర్త).
౨ వైశేషికము (కణాదర్షి కర్త).
3 సాంఖ్యశాస్త్రము. (కపిలర్షి) ఇది నిరీశ్వరసాంఖ్యము.
౪ యోగము (పతంజలి కర్త). ఇది సేశ్వరసాంఖ్యమనఁబడును.
౫ పూర్వమీమాంస (జైమిని కర్త). ఇది కర్మమీమాంస యనంబడును.

౬ ఉత్తరమీమాంస [వ్యాసమహర్షి కర్త]. ఇది బ్రహ్మమీమాంస యనఁబడును. ఇది యుత్తరమీమాంసయు ననఁబడును. ఇది దైవకాండమనియు, జ్ఞానకాండమనియు ద్వివిధము. జ్ఞానకాండము బ్రహ్మసూత్రము లనఁబడును.

## షడ్వర్గు [జ్యోతిష షడ్వర్గరాసులు]:-

౧ రాశి, ౨ హోర, 3 ద్రేక్కాణము, ౪ నవాంశ, ౫ ద్వాదశాంశ, ౬ త్రింశాంశ షడ్వర్గమనంబడును.

౧ రాశి— మేషాదిద్వాదశరాసులలో నొకటి రాశి యనఁబడును. ఇందు మేష, వృశ్చికముల కంగారకుఁడును, వృషభ తులలకు శుక్రుఁడును, మిధునకన్యలకు బుధుఁడును, కర్కాటకమునకుఁ జంద్రుండును, సింహమునకు సూర్యుఁడును, ధనుర్మీనములకు గురుఁడును, మకర, కుంభములకు శనైశ్చరుఁడు రాజ్యాధిపతులు.

౨ హోర— ప్రతిరాశిని రెండుభాగములుగ విభజించిన నారాశిభాగములకు హోరలనిపేరు. మేషము, మిధునము, సింహము, తుల, ధనస్సు, కుంభరాసులు విషమరాసులు. వీని యందుఁ బ్రధమభాగము సూర్యహోర, ద్వితీయభాగము చంద్రహోర యనిచెప్పఁబడినది. తక్కిన వృషభ, కర్కటక, కన్యా, వృశ్చిక, మకర, మీనములు సమరాసులు. వీనియందు ప్రథమభాగము చంద్రహోర, ద్వితీయభాగము సూర్యహోర యనిచెప్పఁబడినది.

3 ద్రేక్కాణము— ప్రతిరాశిని మూఁడేసిభాగములుగ విభజించిన నారాశిభాగములకు ద్రేక్కాణములనిపేరు. వీటియందు లగ్నాధిపతి ప్రథమ ద్రేక్కాణాధిపతిగను, పంచమాధిపతి తృతీయ ద్రేక్కాణాధిపతిగను కొందరుపు లభిప్రాయపడిరి. మరికొందరు లగ్నద్వాదశైకాధిపతుల వరుసగ మొదటి, రెండవ, మూడవద్రేక్కాణాధిపతు లనిరి. ఇంకంగొందరు వరుసగ లగ్న, పంచమ, నవమాధిపతులుచరరాసులందునను, నవమ, లగ్న, పంచమాధిపతులు స్థిరరాసులందునను, పంచమ, నవమ, లగ్నాధిపతులు ద్విస్వభావరాసులందునను, నధిపతులని చెప్పియున్నారు. ఈమతమే పెక్కండ్రచే గౌరవింపఁబడిన మతము.

౪ నవాంశ— ప్రతిరాశిని తొమ్మిదిభాగములుగ విభజించిన నారాశిభాగములకు నవాంశయని పేరు. అనఁగా తొమ్మిదవభాగమని యర్థము. మేష, సింహ, ధనస్సులకు మేషాదిగను, కర్కట, వృశ్చిక, మీనములకు కర్కటకాది గను, మకర, వృషభ, కన్యలకు మకరాది గను, తులా, కుంభ, మిధునములకు తులాది గను, రాశ్యాధిపతుల వరుసను నవాంశభాగ ముల కధిపతులుగఁ జెప్పియున్నారు.

౫ ద్వాదశాంశ— ప్రతిరాశిని పండ్రెండుభాగము లుగ విభజించిన నారాశిభాగములకు ద్వాద శాంశ [పండ్రెండవభాగము] యనిపేరు. వీటి యందు వరుసగ ద్వాదశరాశ్యాధిపతులే ద్వాదశాంశరాసుల కధిపతులని చెప్పఁబడినది.

౬ త్రింశాంశ— ప్రతిరాశిని ముప్పదిభాగములుగ విభజించిన నారాశిభాగములకు, త్రింశాంశ యని పేరు. ఈభాగములందు [విషమరాసు లగుమేష, మిధున, సింహ, తుల, ధనస్సు, కుంభ రాసులందు] వరుసగ కుజుఁడైదుభాగ ములకును, శని యైదుభాగములకును, గురుం డెనిమిదిభాగములకును, బుధుం డేడుభాగము లకును, శుక్రుం డైదుభాగములకును నధిపతు లై యుందురు. తక్కిన సమరాసులందు (అ నఁగా వృషభ, కటక, కన్యా, వృశ్చిక, మకర, మీనములందు) వరుసగా శుక్రుం డైదుభా గములకును, బుధుఁ డేడుభాగములకును, గురుం డెన్మిదిభాగములకును, శని యైదుభాగ ములకును, కుజుం డైదుభాగములకును నధి పతులని చెప్పంబడినది. దుష్టషడ్వర్గము దోష మని చెప్పఁబడినది.

## షడ్వర్గదోషములు:—

(దోషములు చూడుఁడు.)

## షడాతతాయిలు:—

(ఆతతాయిలు చూడుఁడు.)

## షడామ్నాయములు:—

(ఆమ్నాయములు చూడుఁడు.)

**షడారణ్యము [ఆర్కాడు]**:—తొల్లిఁటి కాలమున భృగు, అంగీరస, కశ్యప, అత్రి, వశిష్ఠ, గౌతములను మహర్షులార్గురు కాంచీపురమున నేకాంబరేశ్వరశివలింగమును పాలారునదీతీరమున కవ్వల నిప్పటివెల్లూరుపురమున విష్ణుదేవుని పాలా రునది (పాల=క్షీరములు, ఆర్=నది కిరుదెసలా నభిభావము) ప్రతిష్ఠించి నడుమనుండు ప్రదేశ మున వటవృక్షములనాటి యారుఅరణ్యములఁ జేసుకొని యందు వసించుచు తపంబొనగించిరట. ఆయారాశ్రమములు [ఆల్ లేక ఆర్ అనిన నరవ భాషయందు మఱ్ఱియనియర్థము. ఇంక నరవభాష యందు 'ఆర్' అనిన నారనియు నర్థము.) 'ఆర్ కాడు' [కాడు అనిన అరవమున అరణ్యము] అని యరవవారిచేతను, షడారణ్యములని అన్యుల చేతను వాడఁబడుచుండెనట. నానాటికామధ్యదేశ మార్కాడుసీమ యయ్యెనట. ఆంగ్లమున నా ర్కాటనఁబడెను. పురాణప్రసిద్ధము కాదు.

**షడ్వికారములు**:—ప్రాణమునకుఁగర్భాను భవమునందుఁగల్గెడి యారువికారములు.

౧ గర్భస్థతవికారము— తల్లిగర్భమునం దుండుట. తల్లి గర్భముధరించియుండినతరి ప్రాణి గర్భస్థు డై యుండిన యవస్థ.

౨ జన్మతవికారము— నెలలునిండినతరి తల్లిగర్భము నందుండి (నను) జన్మమొందు నవస్థ.

౩ అభివృద్ధివికారము— జన్మమొందినపిదప దిన దినాభివృద్ధిగ నెదుగుచుండు నవస్థ.

౪ పరిణామవికారము—ఎదిగినపిదప శరీరము ముదురుట, పండుట మొదలగు నవస్థ.

౫ క్షీణతవికారము— పిదప వార్ధక్యమున శరీరేంద్రియబలములు క్షీణించుట. ముడుచుకొని పోవుచుండు నవస్థ.

౬ వినష్టతవికారము— మృతినొంది భౌతికశరీరమును విడచునట్టి యవస్థ.

## షడ్విధసమాధులు [సమాధులు]:-

౧ అంతశ్శబ్దానువిద్ధము. (సవికల్పకము)
౨ అంతర్దృశ్యానువిద్ధము. (సవికల్పకము)
౩ బాహ్యశబ్దాను విద్ధము. (సవికల్పకము)
౪ బాహ్యదృశ్యానువిద్ధము. (సవికల్పకము)
౫ అంతర్నిర్వికల్పము. (నిర్వికల్పకము)
౬ బాహ్యనిర్వికల్పకము. (నిర్వికల్పకము)

ఇవి యోగశాస్త్రమునఁ జెప్పఁబడినవి.

## షడ్విధవాదములు:—

(వాదషట్కము చూడుఁడు).

## షడున్నతసంజ్ఞాస్థానములు:—

౧ కుడిమీగాలు, ౨ ఎడమమీగాలు, ౩ కడుపు, ౪ మెడ, ౫ కుడిభుజము, ౬ ఎడమభుజము.

## షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు:—

౧ రాజనీతియందు షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు గలవు.

౧ సంధి- [రాజీ, స్నేహము, అవరోధప్రవర్తనము నడపుట].

౨ విగ్రహము- [విరోధించుట శత్రునిశత్రువులఁ గూడుట].

౩ యానము- [యుద్ధయాత్ర కేగుట].

౪ ఆసనము- [తటస్థము లేక సర్వపరిస్థితులు కుదురువరకును నిరీక్షించుచుండుట. లేక నొక స్థలమున దాగియుండుట].

౫ భేదతంత్రము- [శత్రువుల కన్యులతో విరోధమును గల్గించుట].

౬ సమాశ్రయము- [తాను బలవంతుల నాశ్రయించి బలముఁ గూర్చుకొనుట].

ఇందు యానమింకను నైదువిధములని కొన్ని గ్రంథములందుఁ జెప్పఁబడినది.

౧ సంధాయయానము— శత్రువులను వశపర్చుకొని మర్గాదులను గైకొనుటకై చేయు దండయాత్ర.

౨ ప్రసంగయానము— ఒకదిక్కునకుఁ గదలి వీలుకాలేదని వేరొకదిక్కునకుఁ జనుట. దీనిని తొలుతనె యోచించుకొని బయలుదేరి దండయాత్ర చేయుదురు.

౩ విగృహ్యయానము— కేవలము శత్రువులను సంహరింపఁ దలంచియె బయలుదేరు దండయాత్ర.

౪ సంభూయయానము— శత్రువులు బలవంతులని యెఱిఁగి తా నితరులసహాయముఁ గూర్చుకొని బయలుదేరు దండయాత్ర.

౫ ఉపేక్ష్యయానము— తనస్వబలముచేతనే శత్రులంద్రుంచసమకట్టి దేశకాలాదులను సరకుఁగొనక బయలుదేరు దండయాత్ర.

౨ భగవంతుని [పరమేశ్వరుని] యందుఁ గలషడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు.

శ్లో॥ ఉత్పత్తించ వినాశంచ భూతానా మాగతిం
గతిమ్। వేత్తి విద్యాంతు విద్యాంచ సవాచ్యో
భగవానితి॥

ఉత్పత్తి (కల్గించుశక్తి), వినాశము [నశింపఁ జేయుశక్తి], [భూతముల కాగతి, గతులఁ గల్గించుశక్తులు]. విద్యాజ్ఞానము, అవిద్యాజ్ఞానములుఁ గల్గియుండుటవలన నన నీషడ్గుణైశ్వర్యములఁ గల్గియుండుటవలన భగవంతుం డనిపించుకొనుచుండుటయని యెఱుంగునది. ఈషడ్గుణములును గలవాఁడు భగవంతుఁడని భావము.

3 మనుష్యుల యందుండు షడ్గుణైశ్వర్యములు:—

౧ మాహాత్మ్యము. [తాను గొప్పవాఁడుగఁ దలఁపఁబడుచుండుట.

౨ ధైర్యముఁ గల్గియుండుట.

3 యశస్సు [కీర్తిం గల్గియుండుట].

౪ సిరి [ధనవంతుఁడై కొదువలులేక యుండుట].

౫ జ్ఞానవంతుఁడై యుండుట.

౬ వైరాగ్యముఁ గల్గియుండుట.

౪ మతాంతరమున షడ్గుణైశ్వర్యములు:—

౧ ఐశ్వర్యము [ప్రభుత్వము లేక సధినాధత్వము లేక నాయకత్వము].

౨ వీర్యము [పరాక్రమశాలియై యుండుట].

3 యశము [కీర్తివంతుఁడై యుండుట].

౪ సిరి [ధనవంతుఁడై యుండుట].

౫ జ్ఞానము [జ్ఞానియై యుండుట].

౬ వైరాగ్యము [విరాగి కాంక్ష లేనివాఁడు] గ నుండుట.



వీటిని గల్గియున్నవారు షడ్గుణైశ్వర్యసంపన్నులనఁబడుదురు.

రామానుజీయవైష్ణవమతధర్మమునఁ బరమేశ్వరుఁడగువిష్ణుదేవునియందుఁగల షడ్గుణములు [షడ్గుణైశ్వర్యములు]:—

౧ వాత్సల్యము— కనికరము. (ప్రాణులయందుఁ గనికరము.)

౨ భవశోషణము— సంసారవేదన నెండింపఁజేసి పోగొట్టుట.

3 ఉదారత్వము— గంభీరముగనుండియు దాతృత్వము గల్గియుండుట.

౪ అభయప్రదానము— భయమునుదీర్చి రక్షించుట.

౫ ఆపత్కాలరక్షణము— ఆపదలందు తన్ను వేడిన రక్షించుగుణము.

౬ అక్షయపదము—ఎప్పుడును తగ్గిపోవని వైకుంఠపథసౌఖ్య మొసఁగుట.

**షడూర్మ్ములు:**— ప్రాణమునకు, కర్మానుభవమున శరీరధారియైయుండుతరి షడూర్మ్ములు.

౧ కారణదేహ సంబంధములు— ౧ మోహము (కోర్కె లేక వాంఛ), ౨ శోకము [కోరిక సిద్ధింపకున్న గల్గెడి యావేదన, దుఃఖము].

౨ సూక్ష్మదేహ సంబంధములు— ౧ పిపాస [దాహము లేక దప్పి], ౨ క్షుత్తు [ఆకలి, భోజన వాంఛ].

3 స్థూలదేహ సంబంధములు— ౧ జర [ముసలితనము], మృతి [మరణము లేక చావు].

**షడృతువులు:**—

(ఋతువులు చూడుఁడు.)

**షడ్వైదిక మతములు:**—

(వేదాంతవాదమతములు చూముఁడు.)

## షడ్గోస్వాములు:— చైతన్యమత గోస్వాము లార్గురు. (చైతన్యమతముచూడుఁడు, నవద్వీపధామముఁ జూడుఁడు.)

## (షణ్ణవ) చ్ఛ్రాద్ధములు (౯౬):—

| | |
|---|---|
| సూర్యసంక్రమణములు ౧౨. వీనియందు జరుపనగు శ్రాద్ధములు | ౧౨ |
| మాసములు ౧౨. వీటియందు [శ్రాద్ధము జరపు పితృతిధులు. అనగామాసశ్రాద్ధము లేక మాస తిధిశ్రాద్ధములు) | ౧౨ |
| పార్వణములు:— (అనఁగా ప్రతినెలయందును శుక్లపాడ్యమి, కృష్ణపాడ్యమి తిధులయందు జరపు శ్రాద్ధములు) | ౨౪ |
| సంవత్సరమునందలి ప్రతి యమావాస్యయందును జరపుశ్రాద్ధములు | ౧౨ |
| సంవత్సరమునందలి ప్రతిపౌర్ణమియందును జరపు శ్రాద్ధములు | ౧౨ |
| మహాలయ [పక్షమందలి ౧౫ దినములందును జరపు] శ్రాద్ధములు | ౧౫ |
| అష్టక [అనగా మాఘబహుళ ౭. ౮. ౯ తిధులంజరపు] శ్రాద్ధములు | 3 |
| ఉపనయనమునందలి నాన్దీముఖశ్రాద్ధము | ౧ |
| వివాహమునందలి స్థాలీపాకశ్రాద్ధము | ౧ |
| తీర్థములందుజరపు తీర్థవిధిశ్రాద్ధము | ౧ |
| అంత్యేష్టి [అపరకర్మ] శ్రాద్ధము | ౧ |
| ఊనషాణ్మాసికము [లేక త్రైపక్షికశ్రాద్ధము] | ౧ |
| సంవత్సరవిమోచకశ్రాద్ధము | ౧ |
| | ౯౬ |

ఇం దుపనయనమున తనకుమారుని యుపనయనమనియు, వివాహమున తాఁ గన్యాప్రదానమొనర్చు తనకుమార్తె వివాహమనియుఁ దక్కినవి తా నొనర్చు పితృకర్మలనియు నెరుఁగవలయును. ఇటుల శ్రాద్ధములు తొంబదియారు.

## [షణ్ణవతి (౯౬) తత్వములు]:—

ఆత్మసంబంధతత్వములు:— ౫ భూతతత్వములు, ౫ తన్మాత్రతత్వములు, ౫ జ్ఞానేంద్రియతత్వములు, ౫ కర్మేంద్రియతత్వములు, ౧ మనస్తత్వము, ౧ బుద్ధితత్వము, ౧ అహంకారతత్వము, ౧ ప్రకృతితత్వము మొత్త ము ౨౪

| | |
|---|---|
| నాడులు [పదితత్వములు] | ౧౦ |
| అవస్థలు | ౫ |
| మలములు [౧ ఆణవమలము, ౨ కార్మికమలము, 3 మాయామలము] | 3 |
| గుణములు [సత్వ, రజ, స్తమోగుణములు] | 3 |
| మండలము [సోమ, సూర్య, అగ్నిమండలము] లు | 3 |
| వ్యాధులు [వాత, పైత్య శ్లేష్మములు] | 3 |
| విరాగములు [ధనవిరాగము, రాజ్యవిరాగము, బల, విద్యా, తపోబల, రూప, సౌందర్య, యౌవన, కులవిరాగములు ఎన్మిది] | ౮ |
| షట్చక్రములు [ఆధార, స్వాధిష్ఠ, మణిపూరక, అనాహత, విశుద్ధ, సహస్రారము] | ౬ |
| సప్తధాతువులు [౧ వసా (క్రొవ్వు), ౨ అసృక్ (రక్తము), 3 మాంస (మాంసము), ౪ మేధా (మెదడు), ౫ అస్థి (ఎముకలు), ౬ మజ్జా(సారము), ౭ శుక్లములను నేడుధాతువులు. పక్షాంతరమున ౧రోమ, ౨ త్వక్ (చర్మ), 3 మాంస, ౪ అస్థి, ౫ స్నాయు (నరములు), ౬మజ్జా, ౭ ప్రాణములు, సప్తధాతువులు | ౭ |

దశవాయువులు— [౫ వాయువులు], ౫ ఉప వాయులువు]   ౧౦
పంచకోశములు— [అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ, కోశములైదు]   ౫
నవద్వారములు— శరీరమందలి రంధ్రములు   ౯
ఇటుల తత్వములు తొంబదియారు   ౯౬

జైనమత తత్వములు ౫—జీవుఁడు, ధర్మము, అధర్మము, పుద్గలము, ఆకాశము.

మధ్వమత తత్వములు ౨ — స్వతంత్ర తత్వము [పరమాత్మ] అస్వతంత్రతత్వము [ఆత్మ].

## షణ్ణవతి [౯౬] తిథులు:—

శ్లో. అమా యుగ మనుక్రాంత ధృతిపాత మహాలయాః। అన్వష్టకాఖ్యతిథయః షణ్ణవత్యాః ప్రకీర్తితాః॥

సంవత్సరమునందలి యమావాస్యతిథులు   ౧౨
,, కృతయుగాది ద్వాపరయుగాది త్రేతాయుగాది కలియుగాది తిథులు   ౪
,, మన్వాదితిథులు   ౧౪
,, సూర్యసంక్రాంతులుగలతిథులు   ౧౨
,, ధృతినామయోగమున్నతిథులు   ౧౩
వ్యతీపాతయోగమున్న తిథులు   ౧౩
,, మహాలయశ్రాద్ధార్హతిథులు   ౧౬

మహాలయపక్షమున బ ౧ మొదలు పక్షాంతమగు 30 సహాతిథులు ౧౫, తర్వాతిదినమగు ఆశ్వయుజ శు ౧ పాడ్యమి ౧.

,, అన్వష్టకతిథులు   ౧౨
మార్గశిర బహుళ సప్తమి, అష్టమి, నవమి.
పుష్య బహుళ సప్తమి, అష్టమి, నవమి.
మాఘ బహుళ సప్తమి, అష్టమి, నవమి.
షణ్ణవతితిథులు   ౯౬

## షర్బత్తు (పానకము):—

అరబ్బీపదము. పుష్పపరిమళములతోగాని, ఫలరసరుచులతోగాని చేయఁబడిన పంచదారపానకమని యర్థము.

## షర్ఘాగోరీ:—

(నసాక్రియునందలి షర్ఘాగోరీ చూడుఁడు.)

## షర్కీస్ నృపవంశము:—

వీరు జోన్పూరురాజధానిగ నాప్రాంతదేశమేలిన ముసల్మాన్నృపులు.

## షరీఫ్ బిరుదము:—

అరబ్బీభాషయందీపదమునకు 'noble' అని యర్థముచెప్పఁబడినది. గౌరవార్థముగ మహమ్మదీయమతగ్రంథమగు కురానును "కురాన్షరీఫ్" అని వాడుచున్నారు. మహమ్మదు దేశికుని కుమార్తెయగు ఫతీమాదేవిగారిసంతతివారందరును షరీఫుబిరుదము ధరించువారలుగనే యున్నారు. అరేబియాదేశమందలి మక్కానగరఁపుఁబరిపాలకుని షరీఫని యెదరు. మొరాకో (లేక మొరాకష్) దేశమందలి పరిపాలకులకు షరీఫులని యుద్యోగపదవీబిరుదముండును.

ఇంక నింగ్లాండు దేశమునను, స్కాట్లాండు నర్లాండదేశములందును షరీఫులనఁబడు నుద్యోగులుగలరు. ఇది 'Shire Reeve' అనుపదముల నుండి యేర్పడిన యాంగ్లపదమేగాని పవిత్రబిరుదముగాదని తెలుచున్నది. తొల్లింట భూపతులీయుద్యోగమొసంగుచు వేర్వేరుషైరులం (కౌంటీలు) దు వారి నధికారులుగ నియమించుచుండువారని స్పష్టపడినది. వారు రానురాను ముదిరి బలపడి యీయుద్యోగపదవి వంశపరంపరహక్కుగ నేర్పడియుంట రెండవహెన్రీభూపతినాడు దాని

నాపి నామకగౌరవముమాత్రి ముంచెనని చెప్పఁ బడినది.

ఒకప్పుడు బ్రిటీషుదీవులం దీపదవి సంవత్సర మున కొకతటి నెన్నికలమూలమున లభించు చున్నదిగ నుండెనఁట. లండనునగరమున నిక్కాల మున నిద్దరుషరీఫు టుద్యోగులుందురు.

స్కాట్లండు దేశమున షరీఫునకు న్యాయస్థాన మొకటి కలదు. వారికి కంట్రాక్టులు పౌజసరీకార్య ములు, స్వల్పఁపుఁబాకీలదావాలు, చిన్నచిన్న నేర ములు విచారించుటకధికార ముండునఁట.

భరతదేశఁపు బ్రిటీషుప్రభుత్వమున రాజధాని ప్రధాననగరములందు షరీఫుపదవియుండును. ఆయనపని గొప్పగొప్పసభలఁ గూర్చుటయై యున్నది.

## షష్టికశాలిధాన్యము:—

[తనోనుః చూడుఁడు.]

## షస్థాదేవస్థానము:—

[శబరీమలై చూడుఁడు, అయ్యప్పన్ చూడుఁడు.]

**షహజహన్పూరు జిల్లా**:. ఆగ్రా ప్రోవిన్సులోనియొకజిల్లా. షహజహన్పురము బ్రధానస్థానము. [ఆగ్రాప్రోవిన్సు చూడుఁడు.]

**షహపూర్జిల్లా**:— పంజాబుదేశమునందలి షహపూర్ [నగరము] ప్రధానస్థానముగాగల యొకజిల్లా.

**షహరాన్పూరుజిల్లా**:— ఆగ్రాప్రోవిన్సు (మండలము (నందలి షహరాన్పూరు (నగరము) ప్రధానస్థానముగా గలయొకజిల్లా. [ఆగ్రాప్రోవిన్సు చూడుఁడు].

**షహాబాదుజిల్లా**:— విహారదేశమునందలి ఆరాపురము [తొల్లిఁటి యేకచక్రపురము - బకాసురునివాసము] ప్రధానస్థానముగా గలజిల్లా. [బీహారదేశము చూడుఁడు].

**షాజీరా (పెద్దజాతిజీలకఱ్ఱ)**:—దీనిని పెద్దజీలకఱ్ఱయందురు. సంస్కృతఁపుఁబేళ్లు జీర్ణా, జీర్ణః, జీరణః. సాధారణఁపు జీలకఱ్ఱకు సంస్కృతమున 'జీరః' 'జీరకః' అందురు. [జీలకఱ్ఱ చూడుఁడు.]

పెద్దజీలకఱ్ఱ వేడిఁజేసి శ్లేష్మమును హరించు ననియు, చూర్ణమును బీల్చిన ముక్కునెంట రక్తముపడుట మానుననియు, రక్తపైత్యము నివారణ మగుననియు, దగ్గు, ఉబ్బసఁపుదగ్గు శాంతించు ననియు, నాకలిఁ గల్గించుననియు, దేహ మెండిపోవుట, పచ్చఁబడి పాలిపోవుటలు నివారించు ననియుఁ జెప్పఁబడినది.

షాజీరాకు, బాదముజీగురు విరుగుడు అని యందురు.

**షాటుక్వా [Chautauqua]**:— అమెరికాసంయుక్తరాష్ట్రములం దొక్కొకతావున ఢేరా నైచి యందు వివిధశాస్త్రములు, విద్యలు, కలలు, గానము, నాట్యము, హాస్యము, చతురతలు, మొదలగునవి ప్రదర్శించి ప్రజలకు విద్య గరపుచుండు సంస్థకుఁబేరు. ఇక్కాలమున నేఁటేట వీనికిక్రింద నాదేశమున నూటయేబదిలక్షలరూప్యములు వ్యయమగుచు నెనుబదిలక్షల జనులవఱకును దీనియుపన్యాసములను విని విద్యావిశేషములం గ్రహించి యానందించుచుందురని చెప్పఁబడినది.

క్రీ. వె. ౧౮౭౦ సంవత్సరప్రాంతమున నొక వేసవికి సంయుక్తరాష్ట్రములలోని న్యాయార్కు

స్టేటునందలి పెక్కండ్రు గొప్పవా రొకతరి షాటు క్వాసరస్సుతీరమున వినోదార్థము నివసింప నేగి యట శాస్త్రములంగూర్చిన యుపన్యాసములు, గానములు వినుటయును, నృత్యప్రదర్శనమును, వినోదములును గుదుర్చుకొని సంతోషమునఁ గాల ముం బుచ్చిరట. బాల్యమున నున్నతవిద్యఁ జదువ వీలుకల్గనివారల కిది విజ్ఞానమగుటయు నందఱికిని వినోదకరమగుటయు నెఱింగి యిట్టియేర్పాటులు తరుచుగ జరుగుచుండిన బాగుగ నుండునని యంద రికిని దోఁచెనట. ఆకోర్కెబలపడుట నచ్చటచ్చట నిట్టి కూటములు జరుగుట ప్రారంభమై వర్తక సంఘములు గొప్పవిద్యాధికులకు ద్రవ్యపారితోషి కము లిడుచు నిట్టివి వర్తకసరళిగ నడిపి లాభము నొందుటకు మొదలిడెనట. ఎచ్చటజరిగినను పేరా సరస్సునుండియే షాటుక్వాయని యేర్పడియెనట. ఇప్పుడు దేశమంతటను వ్యాపకమై యాదరణ మున నడుపఁబడుచుఁ బ్రతిచిన్నపట్టణములందును నేఁటేట జఱుగుచుండునట. ఉపన్యాసము లిచ్చు పండితులకు, సంగీతముపాడు గాయకులకును, వినో దకరులు మొదలగువారికిని సన్మానములు నడచు చుంటఁ గొందరి కీషాటుక్వాపని వృత్తియై ప్రజల కు విజ్ఞానపథమును వినోదకరముగను నమరి యుప యోగించుచున్న దట. షాటుక్వా యేర్పాటు 'most American thing in America' అని యొకసుప్రసిద్ధవిద్వాంసుఁ డనియున్నాఁడు.

## షాదౌలా మహాత్ముఁడు:—

[గుజరాతుపట్టణము చూడుఁడు.]

## షాన్‌దేశము [లావోస్‌దేశము]:—

ఆసియాఖండమున నిండోచైనిస్పెనెన్సులాయం దున్న దేశము. ఇం దనేకతెగలప్రజలు నివసించు చున్నారు. అం దధికసంఖ్యాకులు షానులు. తరు వాతఁ జెప్పఁదగినవారు లావోతెగవారు. గాన నీపేర్లు వాడుకనొందినవి. కొండలు సరణ్యములును గలదేశము. పార్జ్ఞిషుచెట్లుమొదలగు విలువగల చెట్లు విస్తారముగ గలవు. ఈదేశమున గుర్రము లును నెఱ్ఱును విస్తారముపెంచబడుచు నెగుమతి చేయఁబడు చున్నవి. ఈదేశఁపు గుర్రములనే బర్మానుండి యిండియా పంపుదురు. వానికి పెగ్గూ పోనీలని పేరు. [అప్పరుబర్మా చూడుఁడు.] లోహములు, లక్క, చీనా కెగుమతిచేయఁబడు చున్నది. చిన్నచిన్నస్టేటులుగా వారివారి భూపతు లచేఁ బాలింపఁబడుచున్నది.

## షా బిరుదము:—

ఇది పారసీకచక్రవ ర్తులకున్న బిరుదము. వారిని 'షా ఇన్షా' [రాజాధి రాజు] అందురు. ఇది మహమ్మదీయచక్రవర్తుల 'బాదుషా' బిరుద సంబంధమని మహమ్మదీయు లు తలంచుచున్నారు. కాని యట్లు గానరాక నిది ప్రత్యేకబిరుదమని తోఁచెడిని. ఈజిప్టు, టర్కీ దేశములందున్న పాషాబిరుదము బాద్‌షాశబ్దసం బంధముగల నగుఁగాక. పారసీకుల స్వతంత్ర బిరుదమగు 'షా' యూత్ర మందుకుఁ జేరినదిగాఁ దోఁచదు.

నేపాళదేశఁపు మహారాజులకును 'షా' బిరు దము కలదు. వీరికి మహమ్మదీయభాషల సంబం ధము లేశము గానరాదు. మఱియు షావంశ నృపతులు క్రీ. వె. నొకటవశతాబ్దము మొదలు నాల్గవశతాబ్దమువరకును వలభీనగరము రాజధా నిగ సౌరాష్ట్రదేశ మేలిరని చెప్పఁబడియున్నది. ['షా' వంశ నృపతులు చూడుఁడు.]

## షామనిజమ్ మతము:—

దీనిని 'Spirit worship' అనుచున్నారు. ఈమతము

టిబెట్టునందు, సైబేరియాదేశమునందు, అమెరికా దేశ(పు టిండియనులందు వ్యాపించియున్నదని చెప్ప(బడినది.

**షామానిజమ్** [Shamanism]:— ఉత్తరఏషియా, యుత్తరమెరికా భూములయందు(గల యడవిజాతులయొక్క మతభావములు, దయ్యములను, భూతములను నారాధించువిధానము.

**షామ్మింగ్ అబ్రహామ్** (Shamming Abraham):— మాయవేషమున మోసపుచ్చుట కీయుక్తిని వాడుచున్నారు. తొలుత లండన్‌నగరమున బెత్లెహెమ్ ఆసుపత్రి యేర్పాటైనప్పు డందలి పిచ్చివాళ్ళలో నపాయకరులు కానివాళ్ళను కొన్ని యేర్పాటుల నిర్బంధము లేర్పరచి వీధుల వెంట దిరుగ నిచ్చెడివారట. ప్రజలును కనికరించి వారల కేదేని ధర్మ మిడుచుండువారట. అచిరకాలముననే మాయవేషధారు లెందరో యాపిచ్చివారివలె సిద్ధమై యూరివీధుల వెంబడి ప్రజలను బీకుకొని దిన నారంభించిరట. తోడనే దాని నాపివైచిరట.

**షామొయిస్‌మేక**:— దీనిని కుక్కజాతిగ( గొందరు తలంతురు కాని యది సరికాదు. ఆల్ప్సుపర్వతములపై షామోనిక్సులోయయందు తరుచుగ( గన్పించుజాతి. దీనిచర్మమును బాగుచేసిన పట్టువలె మెత్తగనుండి యద్దములు మొదలగువానిని తుడిచి శుభ్రపరచ నుపయోగింతురు. దాటుటయందు, కాలుజారక నిలచుటయందు, పర్విడుటయందు నీజంతువు నేర్పరి.

**షార్టు** (Short):— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. అసిన( గుఱుచ. దీర్ఘకాలముకాని యని యర్థము. చూడగానే సొమ్మిచ్చునట్టిగాని లేక బహుస్వల్పకాలము గడువుతోగాని చెల్లింపబడుహుండీలరేట్లు తెలియపర్చుటకు 'Short Exchange' అనుచుందురు. కొంచెముకాల(పు గడవున తీర్పగలయప్పునకు 'Short Loans' అనిపేరు. లేనిదాని నమ్ముటకును Bearing వను లకును నమెరికాదేశమున Short Stock అనుచుందురు. జాగాలేకగాని యపాయమువలన లేక అపాయభీతివలన నోడయందు వేసికొనక నిరాకరింపబడినసరకులకు Short Shipment అనుచుందురు.

**షార్టుహేండు రైటింగు** [Short hand writing):— షార్టుహేండు రైటింగువిద్య యైరోపాఖండమునుండి భరతదేశమునకు( దేబడినది. గాన నాదేశభాషల యక్షరములు, మాటలు, నుపన్యాసములను వ్రాయుటకే యుపయోగించుచున్నది గాని భరతదేశ(పు భాషలకు వర్తించునదికాదు.

త్వరితగతి నొసంగ(బడు నుపన్యాసములను పూర్తిగ నీగురుతులతో వ్రాసెదరు. ఇక్కాలమున భరతదేశమునం దాంగ్లభాషకై నదిగనున్నది. క్రీ. వె. ౧౮౮౭ లో లండనునగరమున మొదటి యింటర్నేషనల్ షార్టుహేండు కాంగ్రెసుమహాసభకూడి యన్ని దేశవిధానములును పరిచూచుకొన(బడినది. ఇప్పుడు జర్మనీదేశమునందలి డ్రెస్డెనునగరమందున్న Royal Stynographic Institute నందున్న పుస్తకభాండాగారమున షార్టుహేండు రైటింగుగ్రంథము లధికముగ గలవనియు, నది యీగ్రంథములు చరిత్ర నధికముగ సంగ్రహించినసంస్థయనియు, ప్రపంచమునం దన్ని దేశములందును గొప్పవాడుక కలదు.

షార్టుహేండువ్రాత మూడుముఖ్యభేదములు గల్గియున్నది. ౧ జియోమెట్రిక్కు విధానము. ౨ స్క్రిప్టువిధానము. ౩ సెమిజామిట్రిక్కు అండ్ గ్రాఫిక్కువిధానము నని త్రిభేదములుగ నున్నది. ఇందొక్కొక్కటియిట్టిభేదములం గల్గియున్నటుల నంగీకరింపనివారు షార్టుహేండు వ్రాతను ఫోనెటిక్కు (లేక ఆర్థోగ్రాఫిక్కు) విధానమనియు, ద్వివిధముగ నుండుటయె సమంజసమందురు.

ఇందు జియామెట్రిక్కు విధానమున Euclid నందలి రూపాకారముల నధికముగ గుర్తులుగ వాడంబడియుంట నా పేరందినదట. తక్కిన స్క్రిప్టు, సెమిజామిట్రిక్కు అండు గ్రాఫిక్విధానములు రెంటియందునను, లాంగుహేండు రైటింగుకుం జెందిన అక్షరముల పోలికగీత లధికమైయుండెడివి. సెమిజామిట్రిక్కు అండు గ్రాఫిక్కు విధానమును కొందరు కర్స్యూరేటివ్ విధానమనియు వాడుచున్నారు. ఇవిగాక స్క్రిప్టు జియామెట్రీలు కలసిన సంకరవిధాన మొకటి యిటీవల సిద్ధపర్పంబడినది. అందు నిలువుగీతలును నెడమచేతివైపు వంగినగీతలును లేవు.

ఈచెప్పంబడినవి ప్రచారమునొందిన ముఖ్యవిధానములుగ నున్నను, ఇంకను Dot and Dash విధానము, Stave short hand విధానములు కొన్నియు, కొందరిచే రచింపంబడినవి కాని ప్రచారమునొందలేదు. బ్రిటీషు సామ్రాజ్యనకుం బయటిదేశములం దీషార్టుహేండురైటింగు విద్యను ఫోనోగ్రాఫీయని వాడుచుందురు. ఇది సర్వసాధారణమై ప్రచారమునొంది లోకమున నున్నది.

ఫోనెటిక్కువిధానము మాటలయొక్క ధ్వనులకు గురుతులం గల్గియుండును. దీని కక్కరము లతో సంబంధ ముండదు. సెలెబిక్కువిధానము మాటయందున్నను syllables ను గుర్తులచే వివరించునది. స్టేవువిధానము. నిలువునడ్డుగీతలు, వంకరగీతలు, వృత్తములు, వృత్తభాగములు వీనిచే గురుతులుగ నేర్పడి ధోరణిని వివరించెడివి. ఇందు diacritical గురుతు లనేకములు గలవు.

బ్రిటీషుసామ్రాజ్య దేశములందు పిట్మాన్ షార్టుహేండువిధానమును, నైరోపాపశ్చిమభాగంపు దేశములందు జియోమెట్రిక్కువిధానములును, రైనునదికిం దూర్పుతీరంపు దేశములందు స్క్రిప్టుగాని కర్స్యూరేసివ్ విధానములును, నమెరికాదేశములందు స్క్రిప్టుగాని, జియోమెట్రిక్కువిధానములు గాని వాడుకయందున్నవి.

ఇంక నీవిద్యయొక్క చరిత్రమును గూర్చియోచించిన క్రీస్తుశకమునకుం బూర్వమే గ్రీసుదేశమున సిసిరోనివాసుండగు టైరోయనంబడిన యొకస్వతంత్రముంబడసిన మానవుం డొక షార్టుహేండు విధానమును గనిపెట్టి ప్రచారమునకుం దెచ్చెననియు నావిధానము రోమనుదేశమునకు వ్యాపించి యాకాలమునాటివారి కతిశయప్రేముల కాస్పదమై రోమనుదేశములందు వ్యాపించియుండెననియు, మఱియు నావిధానమున కాదేశములందు 'Notae' అని పేరుండెననియు, క్రీ. శ. ౬౩ సంవత్సరమున నప్పటి సుప్రసిద్ధప్రవక్తగ నుండిన కేటోగారు రోమనుసెనేటుమహాసభయం దొసంగిన కేటిలీనియన్ కుట్రంగూర్చిన మహోపన్యాసమీవిధానమునను వ్రాయంబడి వ్యాపించెననియుం జెప్పంబడినది. అక్కాలమున భూపతులకు, బానిసలకు నీవిద్య ముఖ్యముగ నేర్పంగందగినదిగం దలంపంబడుచుండె నని తెలిసెడివి. రోమకసామ్రాజ్యపతనముతో నావిద్యయు నంతరించెనందురు.

కాని యాజ్ఞాపకమే బ్రిటీషుసామ్రాజ్యమునం దావిద్య తిఱుగ నుత్పన్నమై తలనెత్తుటకుఁ గారణమైనదని చెప్పవచ్చును. సెంటుబర్తాలోమ్యూ ఆసుపత్రియందు వైద్యుఁడుగ నుండిన డాక్టరు టిమోటీబ్రైటుగారు తొలుదొలుత నొకయక్షరసంజ్ఞావిధానమును ౧౫౮౮ లోఁ గుదిర్చి ప్రకటించిరట. అందాంగ్లాక్షరములలో I. J. ల కొకేయక్షరమును U.V.W. ల కొకేయక్షరఁపు గుఁరుతును నేర్పరుపఁబడి Q & X అక్షరముఁలు వదలివేయుంబడెనట.

పిదప క్రీ. వె. ౧౬౦౨ సంవత్సరమున లండను నగరమునందు క్లర్జీగానుండిన జాన్విల్లిసుగారు ధ్వనులంబట్టి మాటలకు గురుతులఁ గుదిర్చిమొట్టమొదట స్టెనోగ్రాఫిక్కువిధానమును రచించి ప్రకటించిరట. ౧౬౨౦ సంవత్సరమున Falkengham Grigg గారు monoslope basissystum గా నొకవిధానము 'Brachy graphy' అనుపేర రచించెనట. ౧౬౨౬ లో షెల్టనుగారు 'Trachy graphy' అనుపేరున నొకవిధానమును ౧౬౩౫ లో మెట్కాఫుగారింకొకటియు ౧౬౪౬ లో రిచ్చేగారు మరియొకటియు[కార్టురైటువిధానము] బయులుదేరఁదీసిరట. ఈకాలమున నెవ్వరు రచించినది దెలియని యొక క్రొత్తవిధానఁపు వ్రాతప్రతియొకటి దొరకేనట. దానిపైని Characterisme అనిమాత్రము నామకరణము వ్రాయంబడియెనట. కాని యిది యేప్రాముఖ్యతను బడయకనే కృంగెనని తోఁచెడిని.

౧౬౭౪ లో కోలిస్విధానమొకటి కొంత సంస్కరింపంబడె నందురు. లండనునగరనివాసియగు మేసనుగారు వరుసగ మూడువిధానములను రచించియుండిరఁట. అందు కడపటి విధానమును తోమస్గుర్నెగా రవలంబించి, యుద్ధరించి వ్యాపింపఁ గారకుఁడాయెనని చెప్పంబడినది. ఇందు డికెన్సుగారివిధానమునుండి కొంత కలుపంబడెననియు ౧౭౩౭ తరువాతకాలమున బ్రిటీషుపార్లమెంటుషార్టుహేండురైటరుగా నుండిరనియుం దెలియుచున్నది.

ఈనడుమను ౧౭౨౦ లో జాన్బైరనుగారింకొక్కవిధానమును రచించిరట. కాని యిది త్వరితముగ పనినీయఁజాలకుండెనట. ఆయన ౧౭౨౬ లో నొకసంఘముంగుదిర్చి వారికి నేర్పుచుండువాడట. వా రాయనను గ్రాండుమాస్టరుగారని పిలచుచుండువారట. పిదప ౧౭౫౧ లో టిఫిన్గారి విధానమని యొకటియు, ౧౭౭౫ లో విలియమ్సన్గారివిధానమని యొకటియు, ౧౭౮౦ లో మేవరుగారి విధానమొకటియు బయల్పడెనని తెలియుచున్నది. పిదప ౧౭౮౭ లో సెర్నన్బ్రాడ్లేగా రొక విధానమును, సామ్యుఅల్టెయిలరుగారు వేరొకటియు బయలుదేరదీసిరట. అందు టెయిలరుగారి విధాన మైరోపాదేశభాషలన్నిటికిని నుపయోగించునటు లుండెనట. గాన దాని నక్కాలమున యూనివర్సల్సిస్టమ్ ఆఫ్ స్టెనోగ్రాఫీ యని వాడఁగడఁగిరట.

ఇంక నాయింగ్లాండుదేశముననే ౧౮౦౨ లో Roe గా రొకటియు, Oxley గారు వేరొకటియు విధానములం గల్పించిరట. ౧౮౨౩లో హార్డింగను బుద్ధిశాలి టైలరుగారివిధానమును సంస్కరించి ప్రచారమునందుంచ నది చక్కగా వ్యాపించుచుండెనఁట. దీనినే సుప్రసిద్ధుండగు Isaac Pitman గారభ్యసించి వాడమొదలిడిరని చెప్పఁబడినది.

ఇది ఇట్లుండ నైరోపాఖండపు టితరదేశము లందు కొన్నివిధానములు తలసూపె నందురు. ౧౮౦౮ సంవత్సరముననే Thibierge గారి విధానమొకటియు, ౧౮౩౨ సంవత్సరమున Fayet గారి విధానమొకటియు, ౧౮౩౪ సంవత్సరమున Gabels berger గారి విధానమొకటియుఁ బయల్పడియెనట. అందుఁ గడపటివారు జర్మనులనియు, వారివిధానము కర్స్యారేటివువిధానములం దాదివిధానమనియు జర్మనుదేశస్థు లనుచుందురు.

౧౮౪౦ సంవత్సరమున నింగ్లాండునందు, పిట్మానుగారివిధానము చక్కగ వ్యాపింపమొదలిడెను. ఇందు హల్లులకు దళసరిగీతలును, సన్నని గీతలును, అచ్చులకు దళసరిచుక్కలును, సన్నని చుక్కలును, గీతలును వాడఁబడియున్నవి. ఇంక నీవిధానము Learners పద్ధతియనియు, Corresponding పద్ధతియనియు, Reporting పద్ధతియనియు త్రివిధాంతర్భేదములం గల్గియున్నది. మరియు జర్మనుసీమలందు ౧౮౪౧ లో Stolze విధానమొకటి బెర్జరుగారివిధానమునకు విరోధిగా బయలుదేరెనట.

౧౮౮౭ లో Schrey గారొకవిధానమును రచించుచు నందు పై రెంటి [విరోధవిధానముల]ని గల్పిరట. అది తోడనే వ్యాపింపమొదలిడెనట. పిదప ౧౮౮౫ లో George C. mares గారి విధానమొకటియు బయల్పడెననియు, నిది Script Giometic Short hand అనియు, దీనిని తొలుత రచించిన దీయనయేయనియుఁ జెప్పఁబడినది. ఇది Johu R. Grigg గారి విధానము ననుసరించియె యున్నదని కొందరందురు. ఇది ౧౮౮౮ నుండి వ్యాపించ మొదలిడె నందురు.

ఇంక నీషార్టుహేండుచరిత్రమును ముగించుటయందు Benn Pitman గారును, Graham గారును, Munson గారును, Longley గారును, Osgood by గారును దీనియభివృద్ధికిఁ బాటుపడిన చిరస్మరణీయు లనఁబడినవారు.

## షాలీమార్ ఉద్యానవనము:—

(కాశ్మీరదేశపు సుప్రసిద్ధోద్యానవనములు చూడుఁడు).

**షావంశనృపతులు:—** వీరు సౌరాష్ట్ర దేశ మేలిరని చెప్పఁబడినది.

వీరికాలము క్రీ. ము. ౧ శతాబ్దము మొదలు క్రీ. వె. నాల్గవశతాబ్దమువరకునని చెప్పఁబడినది. రాజధాని వలభీనగరము.

## షింటోయిజమ్ (Shintoism):—

బౌద్ధమతము జపానుదేశమునందు వ్యాపింపని పూర్వకాలమున నచటనున్న మతము. వీరపురుషుల నారాధించుటయు, సూర్యుని పూజించుటయు దీని ప్రధానసిద్ధాంతములు.

**షికార్పూరుజిల్లా:—** బొంబై రాజధాని సింధుడివిషనులోనున్న జిల్లా. షికార్పూరు ప్రధాననగరము. సుక్కూరు, బుక్కూరుదుర్గము, రోహిరిపురము నీజిల్లాలోనివి.

## షికోకూద్వీపము:—

(జపాన్దేశము చూడుఁడు).

## షిప్పుకేనాల్సు [Ship canals]:—

ఈ యాంగ్లనామమునకన్న పొగయోడలు నడచు కాల్వలనిన సమంజసముగనుండుఁ గాని సుప్రసిద్ధమైన దాంగ్లనామమే యగుట నిశ్చట ముఖ్య

ముగఁ గై కొనంబడినది. వేర్వేరునదులజలములు కడుదూరము గొంపోవుచు పొలములకు నీరిచ్చు పంటకాల్వలును, దేశవాళీపడవలను, నావలను, కలపను నడపుటకుఁ ద్రవ్వంబడిన కాల్వలకన్నను వేరై యిక్కాలఁపుఁ బెద్దపెద్ద పొగయోడలను నడపుటకు తగినంత వెడలుపు, లోతుఁ గలవియై నదీజలములుగొప్పగొప్ప సరస్సులనేకాక సముద్రములఁగూడ షిప్పుకెనా ల్సుపయోగించుకొనును.

ఈ కాలువ లనేకములు వేర్వేరుదేశములందుఁ ద్రవ్వంబడినవి. ఒక్క యమెరికాసంయుక్త రాష్ట్రములందే సుప్రసిద్ధము లిరువదియైదు కలవు. words High ways అని సుప్రసిద్ధములుగఁ జెప్పఁబడినవి పదునొకండు గానఁబడుచున్నవి. వీని కన్న కొంతప్రాముఖ్యతయందుఁ దక్కువగా నున్నట్టియు చక్కగ నన్ని దేశముల యోడలును నడచుచుండుకాల్వలు పదివరకును గానంబడుచున్నవి. వీటిలో ముఖ్యములు వివరింపఁబడును.

World's high ways—

౧ సూయజ్ కెనాల్— క్రీ. వె. 1850 - 1869 త్రవ్వబడినది. మధ్యధరాసముద్రము నుండి Red sea కడనున్న సూయజ్ పురమువరకు ఫ్రెంచిఎంజినీర్ లెసెప్సివల్ల త్రవ్వించబడిన ౯౦ మైళ్ళ పొడవుఁగల కాల్వ ఈజిప్టుదేశము నుండి నడచును. కాలువ పై వెడలుపు ౪౨౦ అడుగులును, అడుగువెడలుపు ౧౦౮ అడుగులను గల్గి ౩౧ అడుగులలోతున త్రవ్వంబడినది.

౨ Kronstadt and St Petersburg Canal— దీనిని Kronstadt to Leningrad Canal అనియు నందురు. క్రీ. వె. ౨౮౭౭ — ౧౮౯౦ త్రవ్వఁబడినది. ౧౬ మైళ్ళ పొడవును నిరువదియడుగులన్నర లోతును పెద్దపొగయోడలు నడచుటకుఁ దగిన వెడలుపును గలదు. దీని కనుబంధముగ deepening of the bay Canal కూడ పనిజరిగెనట. రష్యాదేశము-

3 కోరింత్కెనాల్— క్రీ. వె. ౧౮౮౧—౧౮౯3 త్రవ్వఁబడినది. ఇది Gulf of Corinth to Gulf of Aegnia వరకు నాల్గుమైళ్ళ పొడవును, ౨౬ అడుగుల పాతికలోతును, కాల్వయడుగున ౭౨ అడుగుల వెడలుపుఁగల్గి పెద్దయోడలు నడచుకాలువ. దీనిలోఁ బ్రయాణముచేయుటవలన ౧౭౫ మైళ్లు చుట్టుప్రయాణము తగ్గును.

౪ మాంచెస్టరు షిప్కెనాల్— ఇది కేవలము ఇంగ్లాండు దేశములోనిది. తొల్లింట చిన్నకాల్వగ నుండి క్రీ. వె. ౧౮౯౪ లోఁ బ్రస్తుతరూపమునకుఁ ద్రవ్వఁబడినది. మెర్సెనదితో మాంచెస్టరును లివర్పూలుంగల్పు కాలువ. పొడవు ముప్పదియైదున్నర మైళ్లు. వెడలుపు నీటిపై మట్టమున ౧౭౫ అడుగులు. కాల్వయడుగున వెడలుపు ౧౨౦ అడుగులు. లోతు ౨౬ అడుగులు. పెద్దసముద్రఁపు టోడలు తిన్నగా మాంచెస్టరునగరము వరకును నేగుటకుఁ ద్రవ్వబడినకాలువ.

౫ కెయిజరు విల్హెమ్ కెనాల్— దీనిని కీలుకెనాలనియు ననుట కలదు. జర్మనుదేశమునుండి బాల్టిక్కుసముద్రము మొదలు నార్తు సీ వరకుఁ ద్రవ్వంబడినకాలువ. క్రీ.వె. ౧౮౯౫ లోఁ బని పూర్తిచేయఁబడినది. ౬౧ మైళ్ళుపొడవు. నీటిపై మట్టమున ౧౯౦ అడుగులు వెడలుపు. కాలువ యడుగున ౭౨ అడుగుల వెడ

లుపు. కాలువలోతు యిరువదితొమ్మిదిన్నర యడుగులు.

౬ The Elbe and Trave Canal— ఇది యు బాల్టిక్కు సముద్రమునుండి నార్తుసీవర కును త్రవ్వఁబడినకాల్వ. పెద్దపొగయోడలు నడచుటకుఁ ద్రవ్వబడినది. క్రీ. శ. ౧౯౦౦. లోఁ బనిపూర్తిచేయఁబడినది. కాల్వపొడవు ౪౧ మైళు.

౭ వెల్లాండ్ కెనాల్—ఇది యమెరికాసంయుక్త రాష్ట్రములందు Lack Ontario వరకును త్రవ్వంబడినకాల్వ. ౧౮౩౩ లోఁ ద్రవ్వంబడి, పిదప ౧౮౭౪-౧౯౦౦ లో వృద్ధిచేయఁబడినది. ఇం దిరువదియైదులాకులు నిర్మింపఁబడినవి. ౩౨౭ మైళ్లుమొత్తునకు ఓడ లేవవలయునట. కాల్వపొడవు ౨౭ మైళ్లు. పెద్దయోడలుపోవు నట.

౮ అమెరికాసంయుక్తరాష్ట్రములలోని Lake superior నుండి కెనడాకుఁజెందిన Lake Huron వరకును త్రవ్వంబడినకాల్వలు రెండు. అవి యొకేకాల్వగ కలసి పనియిచ్చు చున్నవి. ఇం దమెరికాసంయుక్తరాష్ట్రముల భాగమునకు ౮ యని యెఱుంగునది.

౯ ఇక్లే కెవడా దేశపు గాల్వభాగమునకు ౯ సంఖ్య.

౧౦ పనామాకాలువ. (పనామాకాలువ చూడుఁడు.)

ఈ కాలువపొడవు నలుబదియారున్నర మైళ్లు, దీనిదిద్రవ్వువిధమును, లాకులునిర్మించు విధులను నమెరికన్, ఫ్రెంచి, జర్మన్, ఆంగ్ల, రష్యాన్ దేశముల యింజినీర్లు కలసియోచించిన international Board of Engineers వల్ల నేర్పర్చఁబడి తొలుత నిది కలుపునట్లాంటిక్కు పశిఫిక్కు మహాసముద్రములందు మంచిహార్బరు లేర్పర్చబడినవి. త్రవ్వుడుకాల్వ Colon నుండి పనామావర కుండును. కులిబ్రాకొండం ద్రవ్వినభాగ మంను గొప్పవ్రియ మాయెనందురు. కాల్వ యంతయు నీటిపై మట్టమున ౧౬౦ అడుగులు. కాలువఅడుగున ౭౨ అడుగులును వెడలుపు గలిగియుండునుగాని కొండలు ద్రవ్వినభాగమున నీటిమట్టమున ౭౮ అడుగులును, కాల్వఅడుగున ౨౯ అడుగులును మాత్రముండును. ఉత్తరమెరికా, దక్షిణమెరికాలనడుమ భూసంధినుండి యిది త్రవ్వంబడి కరిబ్బియన్ సముద్రము నంటియున్నది.

౧౧ నికారగు ఆ (Nicaraguo canal) కెనాల్— మధ్యయమెరికాలోని నికారగు ఆదేశమునందలి నికారగుఆసరస్సునుండి నడిచి పసిఫిక్కు, అట్లాంటిక్కు మహాసముద్రములఁ గల్పుకాలువ. దీనిపొడవు 189.9 మైళ్ళనియు, వెడలుపు కాల్వయడుగున నధమను నూరడుగులుండుననియు, లోతు 30 అడుగులనియుఁ జెప్పఁబడినది. ఈలోతు 110 మైళ్లు. పొడవు 40 మైళ్లు. వెడలుపుగల నికారగువాసరస్సు నుండి నడచును. దీనినుండి యోడ నడచుటకు ౪౪ గంటలు పట్టును.

ఇతరములగుకాలువలు.

౧ నార్తుహాలండుకెనాల్— ఇది ఆమ్‌స్టర్‌డామ్ నగరము నుండి సముద్రమునకుం ద్రవ్వఁబడినకాల్వ.

పెద్దయోడ లిందు నడవఁదగినట్లే త్రివ్వం బడినది. క్రీ. శ. ౧౮౪౮ లోఁ ద్రవ్వంబడి పిదప నభివృద్ధిపర్చఁబడినది. ౧౨౫ అడుగుల వెడలుపును, ౨౦ అడుగుల లోతునుగలది.

Caledonian Canal— ఇది స్కాట్లాండు దేశములోనుండి త్రివ్వంబడి నార్తుసీనుండి అట్లాంటిక్కు మహాసముద్రమునకుఁజేర్చును. ౨౫౦ మైళ్లుపొడవును, ౫౦ అడుగుల వెడలుపును ౧౭ అడుగులలోతును గలది.

Canal du Mide— ఫ్రాన్సుదేశములోనుండి త్రివ్వంబడి Toulouse నుండి (ఇది Garonne పైనున్నపట్టణము) మధ్యధరాసముద్రముపైనున్న Cette వరకుఁ గలకాలువ. కాలువపొడవు ౧౫౦ మైళ్లు. ఇందు ౧౧౪ లాకులు గలవు. పెద్దపొగయోడలు నడచు కాలువ.

Darian route canal— సెంట్రిల్ అమెరికాయందు పనామాభూసంధిలోనుండి Mandiuga Bay నుండి Pearl ద్వీపముల హార్బరుదనుక తిన్నగ సముద్రపునీటిమట్టమున నడచు కాలువ. పొడవు ముప్పదిమైళ్లు.

Sault Ste Canal—ఇది యమెరికాసంయుక్త రాష్ట్రములలోని సరస్సులంగల్పు కాలువ.

Marie Canal — దీనిని Sl. Mary's river Canal అనియు నందురు. అమెరికాసంయుక్త రాష్ట్రములలోనిది.

సైమా కెనాల్— ఇది ఫిన్లాండు దేశములోనిది. Ericson అనుపేరుగల స్వీడిష్ఇంజినీరు దీనిని 11 సంవత్సరములు త్రివ్వెనట. పొడవు 32 మైళ్లు. సముద్రపునీటిమట్టముపై 300 అడుగుల యెత్తుననున్న కాల్వయని చెప్పఁబడినది. ఇందు ౨౮ లాకులు గలవు. ఒక్కొకతావున నాల్గులాకు లొకేచోటనుంట విచిత్రమని పించును. పెద్దపొగయోడలు పోవుకాల్వ.

గోతా కెనాల్—ఈకాల్వయును, 'సోడట్రైలీ కెనాల్' అనుకాల్వయును స్వీడన్ దేశములోనివి.

ఇంక నమెరికాసంయుక్తరాష్ట్రము లందు సరస్సులం గల్పుచుఁ బెద్దపొగయోడలు పోవీలగు కాల్వలుఁ బెక్కుగలవు. వానియందు ముఖ్యములు Ohio, Miame, and Eric, Oswego, Illinois & Michigan, Sturgeon bay canal, Lachine canal, Soulanges canal, Beauharnois, Corn wall, Farrrn's point canal, Rapide plat canal, Galops canal, St Curs Lock canal, Chambly St anne's Lock canal, Carillion canal, Greuvilli canal, Rideau canal up, do down, Do Perth Bch canal, Murry canal మొదలగునవి చిన్నకాల్వలుఁ గలవు. ఇవి యన్నియుఁ బొగయోడలు నడచునవియె.

## షిప్ కెనాల్ లిఫ్టు (Ship Canal lift):—

నీడర్ఫినోకడనున్న యీషిప్ కెనాల్ లిఫ్టు ప్రపంచమునందంతటిలోఁ బెద్దదిగాఁ జెప్పంబడుచున్నది. ఇది జర్మనుదేశమునం దున్నది. ఈ నీడర్ఫినోకడనే హోహెన్ జోలెర్న్ (Hohenzollern canal) కాలువయు స్టెటిన్ (stettin canal) కాలువయు, గలిసిపోయెడిని. గాన నిది కాలువలసంధిగాఁ జెప్పవలయును. కాలువలన నివి చిన్నవికావు. పెద్దయోడలు నడువఁదగినవి. ప్రధాననగరమగు బెర్లినునుండి స్టెటిన్ వరకుంగల

కాలువ. భూమట్టమున నిరముందు హేవెల్ (Havel) నుండి ఒడెర్టిల్ (Odertal) స్లేటో (పీఠభూమి) కెక్కుటకు కడుచుట్టుందిరుగుచు నాల్గులాకులదాటి జనవలసియుంట నది చాల కాలము (ఈనిర్మాణముకుంబూర్వము) పట్టుచుండెడిది. కాల్వలసంధికడనే నూటపదునారడుగుల యెత్తునకు లాకుసమీపమందే యుండునది. ఈ రెండుకాలువల జలమార్గమే బెర్లినునగరమునుండి బాల్టిక్ సముద్రములోని కరగుమార్గముఁగూడనై యున్నది.

నీడర్ఫినోగ్రామపరిసరములనే సర్వసైన్యాధిపతి Georing సేనాని తనవిశ్రాంతిభవనమును నిర్మించుకొనియున్నాఁడు. దానికి Karinhall (country house) అని పేరిడియున్నాఁడు. లాకులమీఁదుగాఁబ్రయాణమొనర్చుచుఁ గాలువలలో నోడలు గమనించుటకు పట్టినదీర్ఘకాలమేగాక లాకులబేసినులందు నిరీక్షించుచు పడియుంటయె చాలదినములై పోవుచుండెనట. ఇప్పటి లిఫ్టు కట్టినపిదప నిరువదిమినిట్లకాలములో నారువందల టన్నులయోడదానినీడ్చుటగ్గు (tug) తోసహా రెండువందలయడుగుల యెత్తునకెత్తంబడి యట కాలువలో తిరుగ పయనము సాగించనగుచున్నది.

ఈ పెద్దలిఫ్టుకట్టడము కాల్వలసంధికడనే బేసినునందు నీటిమట్టముపై రెండువందలఅడుగులయెత్తునకు రియిన్ఫోర్సుడు (reinforced concrete) కాంక్రీటు ఉక్కులోహములతో నిర్మింపంబడినది. కట్టడముపొడవు 300 అడుగులుండును. ఇటంగల ఏక్విడక్టు (aqueduct) అనగా క్రిందికాలువనుండి పైకాలువ కోడలనందిచ్చునది ౩౧౦ అడుగుల పొడవుంగల్గియున్నది. ఆక్విడక్టుక్రిందుగ నీడర్ఫినోకాలువనుండి లీపి (Liepe) కరిగు మోటారుబండ్లబాట యరగలిసి. క్రిందికాలువనుండి కొన్నిమైళ్లదూరమునసే యోడర్నదిపై హూహెన్సాటెన్ అనఁబడు (Hohensaaten) పురముగలదు. అది వర్తకస్థలమై యున్నది.

ఈలిఫ్టుకట్టడఁపుఁబునాదు లరువదియడుగులలోతునుండియుఁ గలవు. ఇందు ముప్పదివేల టన్నుల సిమెంటు పట్టినదట. పదునే నడుగుల దళసరిగఁ జేయఁబడిన రెయిన్ఫోర్సుడు కాంక్రీటు పలకలతోఁ జేయంబడినదిమ్మ (Platform) బేసుమెంటును దానిపై నినుపదూలముల లిఫ్టు కట్టడమును నిలుపంబడి బిగింపంబడినది. ఈలోహపుఁబని యిరువదివేల టన్నులని చెప్పంబడినది. ఉక్కుభాగములు నడుమ నడుమ గలవందురు. ఇది పనిచేయుటంగూర్చి చదువరులకుఁ బరిచితము గాని యాంధ్రపదములతో వ్రాయుటకన్న నాంగ్లమున ననువదింపంబడిన దట్లే నీక్రింద బొందుపరచుట సముంజసము. ఏలనన సుబోధకమవనోపు. అప్లొనర్చుటకు మన్నింపఁబడుదుముగాక.

"The lift works on its rails and racks from water to water. Two rows of 24 feet high contra-weights holds the gigantic trough on 256 wire hawsers, which, with the water load but not including the Ship, weight over 4, 200 tons and will lift vessels up to 1. 000 tons 116 feet in five minutes."

"The weight of the 256 wire cables runnig over 128 double grooved pulleys is compensated by four chains which run from the lower end of the counter-weights over a cylinder and are fastened to the bot-

tom of the trough. Thus trough and counter weights, being exactly balanced can be raised or lowered by four electric motors of only 75 horse power each. The sluice gates and lift gates are raised and lowered by electric power.''

**షిప్పు బ్రోకరు (Ship Broker):—** కమీషనున నోడపై నెగుమతి దిగుమతి (సరకుల) పనుల నడపెడి కమీషన్వర్తకుఁడు టపాద్వారాగాక నోడపై ప్రత్యేకముగ నంపబడిన జాబునకు Ship letter అనెదరు. Ship Broker ఓడల రాకపోకతేదులు మొదలగు వివరములను ముద్రించి పంపుకార్డులకు Shipping cards అనియెదరు. ఓడపై ఎగుమతి చేసిన సరుకుల బరువునకు Shipping weight అనిపేరు. సరకుల fright డ్యూటీలు మొదలగునవి పూర్తిగా చెల్లినట్లు Custom ఉద్యోగులిచ్చు నొప్పుదలపత్రములకు Ship's clearence in wards అనియు, Ship's clearence out wards అను పేర్లంబరగెడిని. ఒక యోడయందుగల సరకులవివరములది యే యే రేవులనంటుచు నెచ్చటకేగునో యావివరములఁ దెల్పుపత్రమునకు Ship's manifest అనిపేరు. ఓడ తొలుతరిజిస్టరయిన certificate. ఓడ నాకర్లతో చేసుకొన్న పనిజీతముల కంట్రాక్టుకాగితములు, Bills of Landing కాగితములు, మేనిఫెస్టుకాగితములు, Official Log book, Bills of health మొదలగు కాగితములెప్పుడును నోడయందుండితీరవలసినవాటికి Ship's papers అనియెదరు. యుద్ధకాలములం దీసంబంధమునులేని ఇతరదేశపుటోడ యొక్క దేశము, యజమానిపేరు, వివరములు, అందున్నసామాను, అదిగ్గ కొనిపోవునరకులు మొదలగు వివరములం దెల్పుచు నది విరోధదేశపుటోడకాదని ప్రభుత్వమువారిచ్చుపత్రమునకు Ship's pass port అని యెదరు. ఒక Notary ఎదుట యోడకుగాని, యందలిసరకునకుగాని కలిగిననష్టము, దెబ్బ మొదలగుసంగతులను వివరించుచు యిచ్చినపత్రమునకు Ship's Protist అనిపేరు. ఓడయొక్క స్థితిగతులు, ఓడయందలి పనివాండ్రు, సరకులస్థితిం దెలుపుచు రేవుచేరిన నిరువదినాల్గుగంటలలోపల నోడ ప్రధానోద్యోగియిచ్చు రిపోర్టుపత్రమునకు Ship's Report అనిపేరు. ఓడపైనున్న డ్యూటీ యివ్వఁదగినసరుకులకుఁ బ్రయాణమున నవసరయోగము నకై యుపయోగించుకొనవచ్చి యట్లు చేయుటం గూర్చి వివరింపఁబడిన పత్రమునకు Ship's Store bond అనిపేరు. మరియు నోడపైనుండువారి యుపయోగమునకు (భోజనాదు) పయోగము నిమిత్తము తెచ్చుకొనుసరకులకు Ship's Stores అని పేరు.

**షియాతెగ| మహమ్మదీయులు:—** అలీయనునాయన అబూతలీబుగారిసుతుఁడు. మహమ్మదుదేశికునిచే పెంచుకొనఁబడినవాఁడు. పిదప నాయనసుతయగు ఫతీమాను పెండ్లియాడి యట్లు డామెను. హసేన్, హుసేన్ అనువార లీదంపతులకుఁ గల్గినసుతులు. మహస్సిన్ అనుమరియొక కుమారుఁడుగూడ నుండెనందురు. క్రీ. శ. ౬౦౦ మొదలు ౬౬౧ వరకు నీమహాత్ముని కాలమని తెలిసది. ఇతను ౬౫౬ లో ఖలీఫాపదము నందెను. ఇతనిరాజధాని కుఫాయనెదరు. ఇతనిని ఇబ్నుముల్జామ్ అనువైరి ఖడ్గముతో పొడిచి చంపెనట. ఈతనిగోరీ యిక్కాలమున మెషెడ్ ఆలీయనుపేరఁ బరగుచు నెజ్ జెఫ్ అనుతావునందున్న మహమ్మదీయపుణ్యక్షేత్ర మైయున్నది. ఈయన మహాపండితుఁడట. ఆమాట యీతనిమరణాంతరము

బైటపడ్డదట. షియా తెగ మహమ్మదీయులు ఖలీఫా, అలీలసంతతివారమని కొందరును, అను చరవర్గమువారమని కొందరును చెప్పుచున్నారు. వీరిప్రతిస్పర్థులు సున్నీ తెగమహమ్మదీయులు. వారు అలీగారికి ప్రతిస్పర్థియైన అయేషా (మహమ్మదు గారిప్రియపత్ని) గారి యనుచరులై యామెపక్ష మున నాలీగారిమనుష్యులతో యుద్ధమొనర్చుచు పోరుచుండినవారు. వారు పీరపండుగయందు పాల్గొనరు.

## షీకాయ [శీకాయ] చెట్టు:—

లా. mimosa Abstergens అనియు acacia concinna అనియు నామములు.

దీనికాయలను షీకాయలందురు. వాని నుడి కించి, రుబ్బి చేసినపులుసుతో స్త్రీపురుషులు తల లురుద్దుకొందురు. దీనిచిగురు పచ్చడి, చారు జేయుదురు. పైత్యశాంతియు, మలబద్ధనివృత్తియు గల్గించునందురు. ఇది ముళ్ళుడొంకగానఁ దోటకం చెలందు వైచెదరు.

దీని కాయగుంజు పాండువు, పైత్యముల నివారించునని చెప్పఁబడినది. కాయలు తలరుద్దు కొనునవిగాన విలువ గల్గియున్నవి.

## షూటింగ్ స్టార్ (Shooting Star):—

ఆకాశమునందుండు నసంఖ్యాకములగు చిన్న చిన్న గోళములు సూర్యునింజుట్టి తిరుగుచు నొకప్పుడు పెక్కు పెద్దగోళములకుసమీపించి వానియాకర్ష ణకులోనయి వానివైపునకుఁ బట్టి వదలఁ బడును. అపుడు వేగమునకు వేడిబుట్టి యగ్నిందగుల్కొని మండి జూడిపడ్డయై పోవును. కొంత మిగిలినను భూమిపైఁబడుతరి వానిని aerolites అనెదరు.

[ఉల్కాపాతము] అగ్నిమండుచు భూమిపైఁబడు టకు పర్వడు తేజోమయములగుగోళములు Shooting Star ఉల్కాపాత మందురు.

(aerolete చూడుఁడు.)

## షేక్ హేండ్సు ఆచారము (Shake hands):—

గృహస్థులు, స్నేహితులు కలసి కొనునపుడు వారివారి కుడియరచేతులఁ గల్పిపట్టు కొని యించుక యాడించుచు షేకుహేండ్సు మర్యాదనునడపుట బ్రిటీషువారి యాచారావలం బనమున భరతదేశస్థులకు మామూలై పోయినది. గాని దానిపూర్వోత్తరముల నెరుంగుట సమంజ సము. ఇది యూరోపాదేశములనుండి భరతదేశస్థ లకుఁజేరిన యాచారములలోనొకటి. ఆదికాలమున నైరోపాదేశనీములం దన్యోన్యద్వేషభావము లధిక ముగా వ్యాపించియుండుకాలములం దిర్వురు పరి చయముగలవారు. తోటలుమొదలగు బహిరంగ ప్రదేశములందుఁ గలసికొనుచుండు తఱి నొకరి యాయుధములను రెండవవారిచేతికిచ్చి పట్టుకొనం జేయుట యన్యోన్యవిశ్వాసమునకై (విరోధము లేదను నమ్మకమునకుగాను) జరుగుచుండెడి దట. రానురాను నాయుధము మొలలోలేకున్ననునాయు ధము వద్దలేకున్నను, నాయుధముంబట్టి కుడిచేతి తోడుటివాని హస్తమునం దుంచుట ప్రారంభమూ యెనట. నానాటి కిదియే స్నేహభావమును దెల్పు పద్ధతిగ నేర్పడి యిర్వురు కలసికొనినతఱి సద్భావ చిహ్నముగా కుడియరచేతులఁ గట్టుకొనుటమర్యా దయు నాచారముగను దనరుచున్నది. దీనికే యాంగ్లమున Shake hands అనియెదరు. ఇది యన్యోన్యసద్భావమును సూచించు మర్యాదగా నున్నది.

**షేక్ (Shake):**— ఇదియరబ్బీభాషా పదము. దీనికి పెద్దవారనియర్థము. ఒక తెగకు లేక నొకసమూహమునకు లేక నొకగ్రామమునకు నాయకుని 'షేక్' అందురు. ఇది యరబ్బీ మహమ్మదీయులందు వాడుక నందియున్న హోదా.

**షేక్స్పియరానిజమ్ (Shakespeareanism):**—పాత్రపోషణమునందును, రచనా విధానమునందును షేక్స్పియర్ మహాకవినిబోలిన విధానము.

**షేక్స్పియరుమహాకవి:**— ఈయాంగ్ల కవిపేరు welliam shakespeare. తండ్రిపేరు John shakespeare. ఆయన తండ్రియొక రైతు. తల్లిపేరు Mary Arden. ఈమెయు నొకరైతుకుమార్తెయే! భార్యపేరు Ann. వివాహము క్రి. వె. 1582. గొప్పయాంగ్లకవి యని పేరందినవాఁడు.

ఈయన రచించిన గ్రంథములు.

Henry VI

Titus Audronicus
Love's Labour Lost
Two Gentlemen of Verana
Comedy of Errors
Romeo and Jullet
Richard II & III
Venus and Adonis
Lucrece
King John
A mid summer night's dream
Merchant of Vinice
Sounets
All's well that ends well
Taming oi the shrew

Henry IV

Merry wives of windsor

Henry V

Much ado about nothing
As you like it
Twelfth night
Julius caesar
Hamlet
Trollus and cresslda
Measure for measure
Mecheth
King Leare
Timon of Athens
Pericles
Antony and cleopatra
Coriolanus
Cymbeline
The winter's Tale
Tempest

Henry VII

ఈమహాకవికృతములైన గ్రంథములందు Bran The Blessed అను వేరొకగ్రంథము గలదని కొందరుచెప్పుచున్నారు. ఆంగ్లకవుల గ్రంథములం దీతనివి బహురసమతములని చెప్పఁబడినది.

**షేబాదేశము:**—ఇది పూర్వకాలమున నరేబియాదేశమునందుండిన దేశము. ఇందు బంగారము, రత్నములు, సువాసనద్రవ్యములు మొదలగునవి ప్రసిద్ధములని చెప్పఁబడినది.

**షేరు [వాటా Share]:—** ఇది యాంగ్లేయపదము. దీనికి వంత [వాటా] ని యర్థము.

[జాయింటుస్టాకుకంపెనీ చూడుఁడు.]

**షేరు బ్రోకరు (Share Broker):—** వాణిజ్యసంబంధపరిభాషాపదము. షేరుబ్రోకరన షేరులను కనిూషను కితరుల కమ్మువర్తకుఁడు. అతఁడు దానిచ్చు నొప్పందలపత్రములకు Share certificate అందురు. వాటాలఁ గొనినవారికి Share holders అనిపేరు. ఫలానివారికి కిన్ని వాటాలున్నవనియు వానిమూల్యము జెల్లింపఁబడె ననియు సంఘమువారిచ్చుపత్రమునకు Share warrant అని యందురు.

**షేల్ప్రదేశము:—** షేల్ అనిన పొరలు పొరలుగానున్న ప్రదేశమని యర్థము. ఇవి మట్టితోఁ గలసియుండు కొన్నిపదార్థములని భావము. Strongly clayey షేల్సుమట్టితో Fire bricks చేయుదురు. Lime stone షేల్సుతో Port land cument చేయుదురు. Alum [పటిక] shales తోఁ బటికనుచేయుచున్నారు. Bituminous shales నందు పెట్రోలియమ్ దొరకును.

**ష్వేజాయన్ దేవస్థానము:—** ఇది బర్మాదేశమున మాండలేనగరముకడ మ్యిటంగీనదీ తీరమందున్నది. అనొరతభూతతి (అప్పటి బర్మా ప్రభువు) రాజ్ఞియగు షిన్మ్సవ్హాలాదేవి దీనింగట్టించినటుల శాసనమటఁ గలదు. బౌద్ధులగుయాత్రస్థులిటఁ బెంపంబడుచున్న చేపలతలలపై బంగారు పూతరేసల నంటించి చేతులతో నాయాహార పదార్థములను వానినోటి కందిచ్చినఁ దినునంతటి మచ్చికనందిన చేపలటఁగలవు.

[మాండలేనగరముఁ జూడుఁడు].

**షైత్రికాయనగోత్రము:—**

(జమదగ్నిబీధా ఉపగణముఁ జూడుఁడు).

**షోడశనిత్యాశక్తులు:—**

(నిత్యలు చూడుఁడు).

**షోడశమహాదానములు:—** ౧ గోదానము, ౨ భూదానము, 3 తిలదానము, ౪ హిరణ్యదానము, ౫ రత్నదానము, ౬ విద్యాదానము, ౭ కన్యాదానము, ౮ దాసీదానము, ౯ శయ్యాదానము, ౧౦ గృహదానము, ౧౧ అగ్రహారదానము, ౧౨ రథదానము, ౧3 గజదానము, ౧౪ అశ్వదానము, ౧౫ ఛాగదానము, ౧౬ మహిషీదానము.

(దానములు చూడుఁడు).

**షోడశమహారాజులు:—**

(చక్రవర్తులు చూడుఁడు. మహారాజులు చూడుఁడు.)

**షోడశ యోగములు:—** జ్యోతిషశాస్త్రమునందు యోగము లిరువది యేడుగఁ జెప్పఁబడినవి. అవి విష్కంభాదులు.

(యోగములు చూడుఁడు.)

**సంకటహరణచతుర్థి:—** శ్రావణ బహుళ చతుర్థి. ఈదినమున సంకటహరణవినాయకుని పూజింతురు. (పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుఁడు).

**సంకటుఁడు:—** ధర్మునకు, కకుద్దేవియందుఁ గల్గినసుతుఁడు.

**సంకర్షణవ్యూహము:—** రామానుజీయవైష్ణవ చైతన్య వైష్ణవ మతధర్మములందు, తదేకాత్మరూప మహావిష్ణువు. అందాది చతుర్వ్యూహములలో నొకటిగఁ జెప్పఁబడినది.



దీనిని రౌహిణేయవ్యూహములలోని ఉపవ్యూహ మనియెదరు. విలాసమూర్తి. వరుసగ గద, శంఖ, పద్మ, చక్రము లాయుధములు.

[విష్ణుదేవాలయములందలి విగ్రహములు చూడుఁడు].

**సంకర్షణుఁడు (సీరి):—**
(బలరాముఁడు చూడుఁడు.)

**సంకలితము:—** కలుపుట లేక కూడుట. చతుర్విధగణితములలో నొకటి. (గణితము చూడుఁడు.)

**సంకల్ప:—** ధర్ముని భార్యలలో నొకరిత. కుమారుఁడు సంకల్పుఁడు. వేఱొకసంకల్పుఁడు బ్రహ్మమానసపుత్రుఁడు.



**సంకల్పసూర్యోదయము:—** కర్త నారాయణాచార్యుండను విశిష్టాద్వైతి. ఈతఁడు విశిష్టాద్వైతసిద్ధాంతధర్మములను నాటకరూపమున సంస్కృతభాషను రచించెను.

**సంకీర్ణజాతితాళములు:—** సంగీతశాస్త్రమున సప్తతాళములందుఁగల మైదుజాతులలో నొకటి.

[జాతి (లయ) ప్రాణము చూడుఁడు].

**సంకుసాల నృసింహకవి:—** ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. మహాకవి.

గీ. యతి విటుఁడు గాకపోవు టెట్లు స్మదీయ
కావ్యశృంగారవర్ణ నాకర్ణనమున,
విటుఁడు యతి గాకపోరాదు వెస మదీయ
కావ్యవై రాగ్య వర్ణ నాకర్ణనమున.

అని తన కవికర్ణరసాయనమున గర్వముగ వ్రాసికొనిన కవి. ఐనను గొప్పదారిద్ర్య మనుభవించుచుండినవాఁడని వాడుక గలదు. ఈతఁడు కవికర్ణరసాయన మనుప్రబంధము శ్రీకృష్ణరాయసార్వభౌమునకుఁ గృతియీయఁదలఁచి విజయనగరమున కేతెంచెననియు, రాజదర్శనముకాక నది సందర్శింపమి నతఁడు దుఃఖించి తిట్టుచుంబోయి దూషణపద్యము లందుఁ జొప్పించి శ్రీరంగనాథున కంకిత మిడెననియు వాడుక గలదు.

ఇందునుగురించి యాంధ్రలోకమున నొకగాథ ప్రచారమునం దున్నది. నృసింహకవి శ్రీకృష్ణరాయసార్వభౌముని దర్శనమునకై యనేకమాసములు విద్యానగరమునఁ బడిగాపులువడి కర్చువెచ్చముల కిబ్బందిగలుగ, నీకవికర్ణరసాయనము

నందలి కొన్నిరసవత్తరములగు పద్యములు విక్రయించుకొనెనఁట. అందు—

గీ. ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిఁ జూచి
తరుణితనుమధ్య మెచటికో దరలిపోయె
నుండియున్నను గనఁబడకున్నె యహహా!
ఉద్ధతులమధ్యఁ బేదల కుండఁదరమె.

అనుపద్యమును శ్రీకృష్ణదేవరాయని కుమార్తె మోహనాంగియను నామె దాసి కొన్నిరూకల కుం గొని రాపుత్రికి సమర్పించెనఁట. ఒకనాఁ డంతఃపురమునఁ బ్రభువు తనకుమారితోఁ జదరంగ మాడుసమయమున రాకుమార్తె శకటునకు రాజు యొక్క బలములలో రెంటిపగగలుగుటచే రాకుమారి "ఉద్ధతులమధ్యఁ బేదల కుండఁదరమె?" యనుచరణమును జదివి శకటును దప్పించెనఁట. రా జాపద్యమునంతను నామెవలన విని యెవరి పద్యమని యడిగి యామెవలనను, దాసివలనను నృసింహకవి పడినపాటులం దెలిసికొని, మిగులఁ జింతించి, యాతనికై వర్తమానించెనఁట. గాని యప్పటికే నృసింహకవి-

"సీ. ఆందోళికలయందు నంతరచరులైన సవికృతాకృతులు శాచజనులు" మొదలగు రాజనిందా పద్యములను దనకావ్యమున వ్రాసికొని పరమ దయామయుఁడును, భక్తసులభుఁడు నగు శ్రీరంగనాథస్వామి కంకితముఁజేసినందున రాజుకోర్కె సిద్ధింపలేదఁట.

కవికర్ణరసాయనమునందు మాంధాతమహారాజచరిత్రము వర్ణింపఁబడినది. రసవత్తరమైన ప్రబంధము.

**సంకృతి:**— పూరువుసంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి నరుఁడు. పితామహుఁడు భుమన్యుఁడు. కుమాళ్లు గురుఁడు, రంతిదేవుఁడు.

**సంకృతి ఉపగణము:**— ఇది అగస్త్య సంతతియందలి అగస్త్యోత రగణములోని యొక యుపగణము. ఇవి ద్విగోత్రములని చెప్పఁబడినది. ఇందు ౩౮ గోత్రములు కలవు.

బోధాయనసూత్రోక్త గోత్రములు [౧౮].

| | |
|---|---|
| ౧ అద్రాపి, | ౧౦ శైవగవ, |
| ౨ ఆగ్రాయణ, | ౧౧ సంకృతి, |
| ౩ చాంద్రాయణ, | ౧౨ హారిగ్రీవ, |
| ౪ తణ్డి, | ౧౩ ఆర్ష్టభి, |
| ౫ పరిభవ, | ౧౪ తారకాధ్య, |
| ౬ పూతిమాష, | ౧౫ పౌల, |
| ౭ మలక, | ౧౬ శంభు, |
| ౮ వైతలేయ, | ౧౭ శ్రోతాయన, |
| ౯ శేషయ, | ౧౮ హారిగ్రీవ. |

కాత్యాయనసూత్రోక్త గోత్రములు [౧౦].

| | |
|---|---|
| ౧ గార్గిలోగాక్షి, | ౬ నగహారి, |
| ౨ చాసరాయణి, | ౭ సూతవ్య, |
| ౩ జానకి, | ౮ సహి, |
| ౪ తాల, | ౯ సూషిభి, |
| ౫ త్రైరథ, | ౧౦ సౌపవన. |

మాత్స్యసూత్రోక్త గోత్రములు [౧౦].

| | |
|---|---|
| ౧ కాద్రవ్య, | ౬ మనుసంబంధి, |
| ౨ హారి, | ౭ విభాతకి, |
| ౩ గలాగలి, | ౮ వైయాఘ్రపద, |
| ౪ తైల, | ౯ వ్యాఘ్రపద, |
| ౫ బిల్లాతి, | ౧౦ శాలాయన. |

ఈసంకృతిగణమునందలి ౩౮ గోత్రములకుఁ బ్రవరరూపములు (౨).

౧ ఆంగీరస- గౌరీవీత- సాఙ్కృత్య.
౨ ఆంగీరస- సాఙ్కృత్య- గౌరీవీత.

**సంకృతిగోత్రము:—**
(సంకృతిఉపగణము చూడుఁడు.)

**సంకృతిగోత్రము:—**
(జాతుకర్ణ్యఉపగణము చూడుఁడు.)

**సంకృతుఁడు:—** మిథిలవంశస్థుఁ డగు నృపాలుఁడు.

**సంక్రమణప్రవేశములు:—** అనఁగా Zodiac constallations హద్దులలోని సూర్యుఁడు ప్రవేశించు కాలములు. ఇవి తఱుచుగా నాయాచెప్పఁబడిన నెలలయందు 21 తేదియందుఁ గాని, ఆప్రాంతదినమునఁగాని, జరుగుచుండును. aries - మేషరాశి - మార్చినెల, Taurus - వృషభరాశి - ఏప్రిల్ నెల, Gemini - మిథునరాశి - మేనెల, Cancer - కటకరాశి - జూన్ నెల, Lio - సింహరాశి - జూలై నెల, Virgo - కన్యారాశి - ఆగస్టునెల, Libra - తులారాశి - సెప్టెంబరు, Scerpio - వృశ్చికరాశి - అక్టోబరు, Sagittarins - ధనస్సు - నవంబరు, Capricornus - మకరం - డిశంబరు, aquarius - కుంభము - జనవరి, Pisces - మీనరాశి - ఫిబ్రివరినెల.

ఇంక మేషమున నవంబరు, వృషభమున డిశంబరు, మిథునమున జనవరి, కటకమున ఫిబ్రివరి, సింహమున మార్చి, కన్యయందు ఏప్రిల్, తులయందు మే, వృశ్చికమున జూన్, ధనస్సున జూలై, మకరమున ఆగస్టు, కుంభమున సెప్టెంబరు, మీనమున అక్టోబరు నెలలయందుఁ బూర్వభాగఁపురాత్రులందుఁ దూర్పునను, అర్ధరాత్రులందు meredian యందునను, పరభాగఁపు రాత్రిభాగమునఁ బశ్చిమమునను, ఈకాన్స్టలేషను నక్షత్రము లాకసమునఁ గన్పట్టుచుండును.

**సంక్రమణము:—**
(మకరసంక్రాంతిపండుగ చూడుఁడు.)

**సంక్రాంతిపురుషులు:—** దీనింగూర్చి సరియగు పూర్వోత్తరస్థితులు తెలియరావు. ఇట సంక్రాంతియనిన సూర్యుఁడు మేషాదిరాసులందుఁ బ్రవేశించుటయని భావము. జ్యోతిషశాస్త్రమున సంక్రాంతిపురుషు లేడుగఁ జెప్పఁబడినది. అవి ౧ ఘోరా, ౨ ధ్వాంక్షీ, 3 మందాకినీ, ౪ మందా, ౫ మిశ్రీ, ౬ రాక్షసీ, ౭ మహోదరీ లేక మహోదరా అని వ్రాయఁబడియున్నది.

ఈపేరులంబట్టి యివి స్త్రీవాచకములుగఁ దోఁచెడిని. ఇంకను వీటిని వివరించు చోఁ బంచాంగములందు 'పురుషాకృతి' అని కూడ వ్రాయఁబడుచుంట నివి స్త్రీలా యని తోఁచెడిని. ఇంకను నీసంక్రాంతిపురుషులకు వాహనములు గూడ నాయా సంవత్సరఫలములను సూచించునటులఁ జెప్పుచుండుట కలదు. అవి సింహము, ఏనుఁగు, వ్యాఘ్రము, గుఱ్ఱము, గాడిద, అడవిపంది, నరుఁడు, ఎనుబోతు, మేఁక యనఁబడునవి.

సంక్రాంతిపురుషులంగూర్చి మకరసంక్రాంతులను వివరించుతఱిఁ బంచాంగములందు వ్రాయుట యాచారమైయున్నది.

**సంక్రాంతివాదిశైవము:—** ఇది చతుర్దశ శైవ-భేద మతములలోనొకటి. (చూడుఁడు.) ఈమతమును త్రిపదార్థములు, మలత్రయము, శివసమవాదిమతమునందు వలెనే తలంపఁబడుచున్నది. (శివసమవాది శైవము చూడుడు.)

పతి అమలుఁడు. (మలత్రయముచే వేధింపఁబడదనిభావము.) పాశము జడమని తలంపఁబడుచున్నది. పతి (పరమేశ్వరుఁడు) దేనిని దహింపని దీపమువలె తటస్థముగ నుండునని యందురు. సూదంటురాయి యినుమును వేధించునట్లు మాయాబలముచే శరీరముంగల్గినయాత్మ (పశువు) శరీరకరణములచే (ఇంద్రియములచే) జగత్తును భోగించుచుండు (అనుభవించుచుండు) నని యందురు.

## సంక్రాంతులు, అయనములు, విషువత్తులు:—

[అయనములు, సంక్రాంతులు, విషువత్తులు చూడుఁడు].

## సంక్రాక్షక్షత్రియులు:—

[చౌహానులు చూడుఁడు].

**సంఖ్యాస్థానములు:**—వీరేశలింగముగారిచే గణితశాస్త్రమునం దిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ ఏకం దశం శతం చైవ సహస్ర మయుతం తథా। లక్షశ్చ నియుతశ్చైవ కోటి రర్బుద మేవచ।
బృందః ఖర్వో నిఖర్వశ్చ శంఖ పద్మాచ సాగరః। అన్త్యం మధ్యం పరార్థశ్చ దశవృద్ధ్యా యథా క్రమమ్॥

| | | |
|---|---|---|
| ౧ | ఏకస్థానము (ఒకటి) | ౧ |
| ౧౦ | దశస్థానము (పది) | ౨ |
| ౧౦౦ | శతస్థానము(నూఱు) | ౩ |
| ౧౦౦౦ | సహస్రస్థానము (వేయి) | ౪ |
| ౧౦౦౦౦ | అయుతస్థానము (దశసహస్రము) | ౫ |
| ౧౦౦౦౦౦ | లక్షస్థానము | ౬ |
| ౧౦౦౦౦౦౦ | నియుతస్థానము (దశలక్ష) | ౭ |
| ౧౦౦౦౦౦౦౦ | కోటిస్థానము | ౮ |
| ౧౦౦౦౦౦౦౦౦ | అర్బుదస్థానము | ౯ |
| ౧౦౦౦౦౦౦౦౦౦ | బృన్దస్థానము | ౧౦ |
| ౧౦౦౦౦౦౦౦౦౦౦ | ఖర్వస్థానము | ౧౧ |
| ౧౦౦౦౦౦౦౦౦౦౦౦ | నిఖర్వస్థానము | ౧౨ |
| ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦ | శంఖస్థానము | ౧౩ |
| ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦ | పద్మస్థానము | ౧౪ |
| ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦ | సముద్రస్థానము | ౧౫ |
| ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦ | అంత్యస్థానము | ౧౬ |
| ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦ | మధ్యస్థానము | ౧౭ |
| ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦ | పరార్థస్థానము | ౧౮ |

ఇంకను వేర్వేరుగ్రంథములందు క్షోణి యనియు, మహాక్షోణి యనియు, మహాశంఖ మనియు, , మహాక్షితి యనియు, క్షోభము, మహాక్షోభ మనియు, నిధి, మహానిధి యనియు, పరతము, పదార్థము, అనన్తము, అవ్యయము, అచిన్త్యము, అమేయము, భూరి, మహాభూరి, యనుసంఖ్యాస్థానములు గానవచ్చెడిని.

కాని, ప్రాచీనకాలమునఁగూడ 'పరార్థ' మే సంఖ్యాస్థానపరమావధి యైనటుల ఋగ్వేదసంహిత వలనఁ దెలియనగుచున్నది.

వాజసనేయ, కాఠక, మైత్రాయణీసంహితల యందును, పంచవింశ, జైమినీయోపనిషత్, బ్రాహ్మణములందు నించుమించు ఒకరీతగనే పెద్ద సంఖ్యాస్థానములు గినఁబడుచున్నవి.

తైత్తిరీయసంహితయం దేకాధికముగఁ జెప్ప బడిన సంఖ్యాస్థానవివరణమునకును మీఁదఁజూపిన లీలావతీగణితమునందలి సంఖ్యాస్థానములును నొక్కరీతిగనే యున్నవి. సంఖ్యాస్థాననామముల యందును భేదములేకుంటచే లీలావతీగణిత కారుఁడు గూడ నార్షకాలఁపురీతినే యనుసరించి నటులఁ దోఁచుచున్నది.

## సంగ పంచకము:—

బౌద్ధమతధర్మ మున ౧ రాగము, ౨ ద్వేషము, ౩ మోహము, ౪ గర్వము, ౫ దృష్టి (చూపులు) ఇవి సంగ పంచక మనంబడును.

## సంగమము:—

(నదులు చూడుఁడు).

## సంగమరాజవంశనృపతులు:—

వీరు తొమ్మండ్రుగురు. యాదవక్షత్రియ ప్రభువులు. ఆంధ్రకర్ణాటక సామ్రాజ్యమేలిన భూపతులు.

౧ హరిహరరాయులు— (హుక్కరాజు) రాజ్య స్థాపకుఁడు. క్రీ. వె. ౧౩౩౬ రాజ్యమునకు వచ్చెను.

౨ బుక్కరాజు— [౧వ బుక్కరాయలు] ౨ వ ప్రభువు.

౩ రెండవహరిహరరాయలు— క్రీ. వె. ౧౪౦౪- ఆనంద ౧౩౦ మరణించెను.

౪ రెండవబుక్కరాయలు— ౧౩ నెలలు రాజ్య ము చేసెను.

౫ ప్రతాపదేవరాయలు— ౧౪౦౬ నవంబరు ౭ పట్టాభిషేకము.

౬ విజయరాయలు— స్వల్పకాలము రాజ్యపాలన మొనర్చెను.

౭ ప్రౌఢదేవరాయలు.

౮ మల్లికార్జునదేవరాయలు.

౯ విరూపాక్షరాయలు— క్రీ. వె. ౧౪౭౮ మర ణించెను. (సైన్యాధిపతియగు తుళువవంశనర సింహరాజుచేఁ జంపఁబడెనని ప్రతీతి). వీరిది సాళవ వంశమని చెప్పఁబడినది. (విజయనగర సామ్రాజ్యము చూడుఁడు).

## సంగాద్గుణదోషా భవన్తి:—

ఇది సం స్కృతభాషయందలి లోకోక్తి. దీనిని సంగగుణ దోషన్యాయ మనియు నందురు. సాంగత్యము (సహవాసము) వలన గుణ మబ్బినను నబ్బును; దోష మబ్బినను నబ్బును. అనఁగా దుస్సాంగ త్యము దుర్గుణము లబ్బుటకుఁ గారణము గాన ననర్హమని భావము.

## సంగీత అంగములు:—

౪ అంగము:— ఇది పదునాఱుభేదములు గలది.

౧ అనుద్రుతము (౨ అంగుళములు) గురుతు ∪

౨ ద్రుతము (౪ అంగుళములు) ○

౩ ద్రుతవిరామము (౧ అంగుళము) ∪○

౪ లఘువు (౮ అంగుళములు) ।

౫ లఘువిరామము ∪।

౬ లఘుద్రుతము ○

| | | |
|---|---|---|
| ౭ లఘుద్రుతవిరామము | 101 | |
| ౮ గురువు (౧౬ అంగుళములు) | ౭ | |
| ౯ గురువిరామము | ౮౭ | |
| ౧౦ గురుద్రుతము | ౦౭ | |
| ౧౧ గురుద్రుతవిరామము | ౮౦౭ | |
| ౧౨ ప్లుతము (౨౪ అంగుళములు) | ౭ | |
| ౧౩ ప్లుతవిరామము | ౮౭ | |
| ౧౪ ప్లుతద్రుతము | ౦౭ | |
| ౧౫ ప్లుతద్రుతవిరామము | ౮౦౭ | |
| ౧౬ కాకపాదము [౩౨ అంగుళములు] | + | |

ఇందు అనుద్రుత - ద్రుత - లఘు - గురు - ప్లుత కాకపాదము లనారింటిని షడంగములని వాడుదురు. తక్కిన ౩ ద్రుతవిరామాదుల పదింటిని దశాంగములని వాడుటయుం గలదు.

లఘువు [ధృవకచేతను, గురువు. ధనకపతితల చేతను, ప్లుతము. ధృవకసర్పిణి. కృష్యలచేతను, కాకపాదము (౪ నిశ్శబ్దమాత్రలు).

సర్పిణి కృష్య పతాక పతితలచేతను వాడవలయును. (సంగీతషడంగములు - సంగీతదశాంగములు - సంగీతలయ - దశప్రాణములు చూడుఁడు.)

## సంగీతపుఁజింతచెట్టు

(గ్వాలియరుచింతచెట్టు ఆకుచూడుఁడు).

**సంగీతపుఁజేపలు:—** సింహాగిద్వీపఁపుఁదూర్పుతీరమున బట్టికాలోవా యనంబడుపురముఁ జుట్టి ముప్పదిమైళ్ళపొడవుగల గొప్పనీటితంపర కలదు. ఇందు చేప లధికముగ నుండునని చెప్పఁబడినది. అందేగల యొకజాతిచేపలు నిశ్శబ్దముగ నుండి, చక్కఁగ వెన్నెలంగల్గిన రాత్రులందు గానము సల్పునఁట. ఇందు భేదముగల రెండు స్వరములు వినఁబడియెడిని. గాని, యివి మాధుర్యవంతముగ నెన్నఁదగినవి కావని యందురు.

**సంగీతతాళాంగములు:—**

(అంగములు చూడుఁడు).

**సంగీతదశప్రాణములు:—** ౧ కాలము, ౨ మార్గము, ౩ క్రియ, ౪ అంగము, ౫ గ్రహము, ౬ జాతి, ౭ లయ, ౮ కళ, ౯ యతి, ౧౦ తాళము. [లయ చూడుఁడు].

**సంగీతదశాంగములు:—** సంగీతశాస్త్రమున ౧ ద్రుతవిరామము, ౨ లఘువిరామము, ౩ లఘుద్రుతము, ౪ లఘుద్రుతవిరామము, ౫ గురు విరామము, ౬ గురుద్రుతము, ౭ గురుద్రుత విరామము, ౮ ప్లుతవిరామము, ౯ ప్లుతద్రుతము, ౧౦ ప్లుతద్రుతవిరామములను సంగీతదశాంగము లందురు. [సంగీత అంగములు చూడుఁడు].

**సంగీతము:—** సంగీతము సామవేదమున కుపవేదము. దీనింగూర్చిన జ్ఞానమించుక సంపాదించవలయునన్న గ్రంథములం జదువవలయుంగాని క్రియాభ్యాసము చేయవలయునేని యొక్కగాన విద్యావిశారదునియొద్ద నభ్యసించవలసినదే. గానము మార్గము, దేశి, యని ద్వివిధము. మార్గము. ఈశ్వరప్రణీతమైన యసలు సంగీతవిద్య. ఇంక దేశి ఆయాదేశసంబంధమగు మార్పులంజెందిన



సంగీతము. ఇది యొక్కొక దేశమున నొక్కొకవిధము గఁ గాన్పించినను, నన్నియు శ్రవణసుఖమునకు నడుచు నవిగ్నెయుంటఁ గొంతగాకున్న కొంతగనైనను పోల్కి కల్గి యుండకపోదు.

భరతభూమియందు వ్యాపించియున్న గానమునకు మూలములుగ సప్తశ్రుతులు దనరెడిని.

౧ షడ్జమము:— గురుతు స- ఇందులో- తీవ్ర- కుముద్వతి- మంద- ఛందోవతి యనునాల్గు శ్రుతులు కలవు. ఇది ప్రకృతి ఒకేవిధము.

౨ రిషభము:— గురుతు రి- దీనియందు దయావతీ- రంజనీ- రక్తికా యనుమూఁడుశ్రుతులు గలవు. ఇది ప్రకృతి శుద్ధరిషభ మనియు, వికృతిచతుశ్శ్రుతిరిషభము, షట్శ్రుతిరిషభము ననియు త్రివిధము.

౩ గాన్ధారము— గురుతు గ- దీనియందు రౌద్రి- క్రోధ యనురెండుశ్రుతులు గలవు. ఇది ప్రకృతి శుద్ధగాంధార మనియు, వికృతి సాధారణ గాంధారము, అంతర్గాంధారము లనియు మూఁడు తెఱగులు.

౪ మధ్యమము:— గురుతు మ- దీనియందు- వజ్రిక- ప్రసారిణి- ప్రీతి- మార్జనీ యనునాల్గు శ్రుతులుగలవు. ఇది ప్రకృతి - శుద్ధమధ్యమ మనియు వికృతి ప్రతిమధ్యమ మనియు ద్వివిధము,

౫ పంచమము:— గురుతు ప- ఇందు క్షితి-రక్త- సందీపినీ-ఆలాపిని యను నాల్గుశ్రుతులు గలవు. ఇది ప్రకృతి దీని కేవిధముగాని వికృతి లేదు.

౬ దైవతము గురుతు ద. దీనిలో మదన్తి, రోహిణీ, రమ్యా యని మూఁడుశ్రుతులు గలవు. దైవతస్వర ముప్రకృతి. శుద్ధదైవత మనియు, వికృతి. చతుశ్శ్రుతిదైవతము నని త్రివిధము.

౭ నిషాదము- గురుతు ని. దీనిలో ఉగ్రిక్షోభిణీ యను రెండుశ్రుతులుకలవు. ఇది ప్రకృతి శుద్ధనిషాదమనియు, వికృతి కైశికీనిషాదము, కాకలీనిషాదము ననియు మూఁడు తెఱఁగులు.

ఇందులో ౧ ఛందోవతి, ౨ రక్తిక, ౩ క్రోధ, ౪ మార్జని, ౫ ఆలాపినీ, ౬ రమ్యా, ౭ క్షోభిణీ శ్రుతులు నియతశ్రుతు లనంబడును. వీట్లంగూడిన స్వరములకు శుద్ధస్వరము లనియు, మిగతశ్రుతు లంగూడియుండినతఱి వికృతస్వరము లనియుఁ జెప్పఁబడును. మఱియు చతుశ్శ్రుతిరిషభమునకును, శుద్ధగాంధారమునకును ధ్వనియొకటిగనే యుండెడిని. చతుశ్శ్రుతిదైవతమునకును, శుద్ధనిషాదమునకును, ధ్వనియొకటిగనేయుండెడిని. షట్శ్రుతిదైవతమునకును, కైశికీనిషాదమునకును ధ్వని యొకటిగనే యుండెడిని.

ధ్వని తక్కువగఁ బల్కించుతఱి 'మందర' స్థాయి యనియు, మందరస్థాయికన్న నెక్కువగను, పల్కించుతఱి 'మధ్య' స్థాయి యనియు, ధ్వని యెక్కువగఁ బల్కించుతఱి 'తార' స్థాయి యనియు, త్రివిధములగు స్థాయిలు కలవు.

దశవిధగమకములు.

౧ ఆరోహణము- మొదటినుండి కడవఱకు స్వరముల నొకటికన్న నొకటి హెచ్చించుచుఁ బలుకుట.

౨ అవరోహణము- కడనుండి మొదటికిఁ దగ్గించుచుఁ బలికించుట.

౩ ఢాలు- రెండేసిస్వరములను [విజాతిగ] పల్కించుట.

౪ స్ఫురితము- రెండేసి స్వరములను [సజాతిగ] పల్కించుట.

౫ కంపితము- స్థాయియందు నిలచి తంతినల్లార్చుచుఁ బల్కించుట.

౬ ఆహతము- సరి - రిగ - గమ - మప- పద - నిస - ఈరీతిని పల్కించుట.

౭ ప్రత్యాహతము- సని - నిద - దప - పమ - మగ - గరి - రిస - ఇట్లు వెనుకకుఁ బల్కించుట.

౮ త్రిపృచ్ఛము- ససన - రిరిరి - గగగ - ఇట్లు మూఁడేసిగ[సజాతి] స్వరములనుఁ బల్కించుట.

౯ ఆందోళనము-సరిసపాప రిగరిమామ - గమగ- గాగ - మపమరీరి - పదపసాస - దనిదనీని- నిసనిదాద - ఇటుల ఆందోళనమొనర్చి పల్కిం చుట.

౧౦ మూర్ఛనము- మూర్ఛనలు ౨౧ కలవు. అవి మూఁడుగ్రామములుగ నున్నవి. అవి షడ్జ గ్రామము, గాంధారగ్రామము, మధ్యగ్రామ ము నని. అందు షడ్జ మధ్యగ్రామములందలి ౧౪ మూర్ఛనలు నొక్కొకటి ౧ శుద్ధము, ౨ కాకలి, 3 సాన్తారము, ౪ ద్వయోపేతము, నని నాల్గు తెఱంగులుగ నగుట షడ్జగ్రామము నందలి మూర్ఛన లిరువదియెన్మిదిగను, మధ్య గ్రామమునందలి మూర్ఛన లిరువదియెన్మిది గను భేదములం గల్గియున్నవి.

షడ్జగ్రామమునందు ౧ ఉత్తరమందర, ౨ రం జని, 3 ఉత్తరాయత, ౪ శుద్ధషడ్జ, ౫ మత్సరి కృత్, ౬ అశ్వకాంతి, ౭ హిరుగ్గతలని యేఁడు మూర్ఛనలు కలవు.

గాంధారగ్రామమున- ౧ నన్ద, ౨ విశాల; 3 సుముఖి, ౪ చిత్ర, ౫ చిత్రవతి, ౬ సుఖ, ౭ ఆలాప అని ౭ మూర్ఛనలు కలవు. గాని ఈ గ్రామము నారదుఁ డభ్యసించి స్వర్గములోని వారికిమాత్రమే యుపదేశించుటంజేసి భూలోకము లోని సంగీతవేత్తల కిది తెలియదు. గాన వాడుక లో లేదు.

మధ్యగ్రామమున మూర్ఛన లేఁడుగలవు. అవి ౧ సౌవీరి, ౨ హారిణాశ్వ, 3 కలోపగత, ౪ శుద్ధ మధ్య, ౫ మార్గ, ౬ కౌరవి, ౭ హృష్యక యనం బడునవి. ఇవియును షడ్జగ్రామమునందలి యేఁడు మూర్ఛనలవలెనే యొక్కొక్కటి ౧ శుద్ధము, ౨ కాకలి, 3 సాంతారము, ౪ ద్వయోపేతము నని నాలుగేసి భేదములు గలవగుట నిరువది యెన్మిదిభేదములు గలవిగ నున్నవి.

ఇటుల షడ్జ మధ్యగ్రామములందలి మూర్ఛ నలు కలసి ఏబదియాఱుభేదములు. గాన్ధారగ్రామ ముంగూర్చి యందుగల ఏడుమూర్ఛనలపేర్లు తప్ప యందలిభేదములు తెలియరావు. మఱియు నది వాడుకయందునను లేదు.

ఇటుల షడ్జమ, రిషభ, గాన్ధార, మధ్యమ, పంచమ, దైవత, నిషాదస్వరముల నేడింటిని ఆయాపద్ధతులమేరకు ఆరోహణ అవరోహణ ఢాలు, స్ఫురితము, కంపితము, ఆహతము, ప్రత్యాహతము, త్రిపృచ్ఛము, ఆందోళనము మూ ర్ఛన యనంబడు దశవిధగమకములపాల్జేసి ప్రస్త రించిరేని రాగము లేర్పడును. రాగవితతికి 'సంగీత' మని సామాన్యనామము వర్తించెడిని.

ఈసంగీతము మార్గము, దేశి యని తొలు దొల్త వివరింపఁబడియె. మార్గ-దేశి సంబంధము లగు సంగీతములో ఒక్కొకటియందు ౧ శుద్ధము, ౨ సాలగము, 3 సంకీర్ణము నని మూఁడేసి తెఱం గులుగ నుండును. అందు మార్గము ప్రత్యేకముగ ౧ దక్షిణము, ౨ వార్తికము, 3 చిత్రము, ౪ చిత్ర తరము, ౫ చిత్రతమము, అతిచిత్రతమము నని యాఱు తెఱంగులు. మఱియు నీసంగీతమున రాగ మొలాపనమొనర్చుతరి ఎక్కువ యానందకరమగు తావులను కళాస్థానము లందురు. అకళలు ఏక కళ - ద్వికల - త్రికల - చతుష్కలని నాల్గు విధములు. సంగీతము దీప్త - ఆయుత - కరుణ -

మృదు, మధ్య యను నైదుజాతులుగను, నాది - వివాది - సంవాది - అనువాది యనంబడు నాల్గు తెఱంగులుగను దనరెడిని. ఇంక రాగములం గూర్చి విస్తరింతుము.

రాగము నియమమైన స్వరములతో దశవిధ గమకప్రస్తారభేదములచే నేర్పడిన యొకగానము. ఇవి మూఁడువిధములు. సప్తస్వరము లారోహణ ములం దనరుచు జనునవి సంపూర్ణరాగము లనియు, ఒక్కొకస్వరమును లోపింపఁజేసి మిగిలిన యారుస్వరములనారోహణావరోహణలపాలొనర్చి నడపినరాగములను షాడవరాగము లనియు, రెండు స్వరములను లోపింపఁజేసిమిగిలిన యైదుస్వరముల నారోహణావరోహణాది దశవిధగమకముల పాలొనర్చి నడపినరాగమునను ఔడవరాగము లనియు, రాగములు మూఁడుతెఱఁగులై దనరెడిని.

ఇట్లనుటతో నీత్రివిధములందుఁ దొమ్మిదిభేద ములు తప్పక గల్గెడిని. వాట్లను వివరింతుముగాక. దశవిధగమకములం దేఁడేసిస్వరములు గానునగు రాగములకు 'సంపూర్ణసంపూర్ణము' లనిపేరు. ఆరోహణయం దేఁడు స్వరములును, అవరోహణ యం దారుస్వరములును, గాన్పించురాగములు 'సంపూర్ణషాడవము' లనఁబరఁగెడిని. ఇట్లే యారో హణయం దేఁడును, అవరోహణయం దైదును గల్గుతరి 'సంపూర్ణఔడవ' రాగము లనఁబరఁగెడిని. ఇటులనే షాడవ ఔడవ రాగములును గల్గెడిని.

ఆరుస్వరములకు నారోహణావరోహణాదిగమ కములు గల్గుతరి వాట్లకు షాడవరాగములని పేరు మున్ను వివరింపఁబడియె. అయ్యవి యారు స్వరము లారోహణమందును, ఏడుస్వరము లవ రోహణమందును, గల్గుతటి, షాడవసంపూర్ణ రాగము లయ్యెడిని. అట్లే రోహణావరోహయాణ ములం దారారుస్వరములుగల రాగవితతికి షాడవ షాడవరాగము లనియు, ఆరోహణము దారు స్వరములును, అవరోహణమం దైదుస్వరములు నయ్యెనేని షాడవ ఔడవరాగము లగును.

ఐదుస్వరముల ప్రస్తారమున ఔడవమని పేరు గాన నారోహణమునం దైదును, అవరోహణము నం దేఁడును స్వరములుండి రాగము నడిపింపఁబడి నచో నారాగవితతికి ఔడవసంపూర్ణ మనియు, ఆరోహణమునం దైదును, అవరోహణమునం దారును స్వరములుండునటుల నడిపింపఁబడిన రాగ వితతికి ఔడవషాడవరాగము లనియు, ఆరోహ ణావరోహణముల రెంటియం దైదైదుగు స్వరము లుండునటుల నడిపింపఁబడిన రాగముల కౌడవ ఔడవ రాగములనియుఁ బేరు.

ఇటుల నేర్పడిన సంపూర్ణ షాడవ ఔడవ రాగములు ౧ సంపూర్ణసంపూర్ణము లనియు, ౨ సంపూర్ణషాడవములనియు, ౩ సంపూర్ణఔడ వములనియు, ౪ షాడవసంపూర్ణము లనియు, ౫ షాడవషాడవములనియు, ౬ షాడవఔడవము లనియు, ౭ ఔడవసంపూర్ణములనియు, ౮ ఔడవ షాడవములనియు, ౯ ఔడవఔడవము లనియు, నవవిధములుగ నయ్యెడివి.

(సంగీతవిద్యాచరిత్ర చూడుఁడు.)

## సంగీతమునకుఁ జింతకాయలు రా లవు:— [ఆంధ్రలోకోక్తి].

## సంగీతలయ-దశప్రాణములు:—

సంగీతమునకు శ్రవణసుఖ మెంత యత్యవసరమో లయయు నంత ప్రధానమే. లయ యొకవిధమున సంగీతమునకు నియతి. గాన నియతిందాటిన సంగీ తమైనను రుచులం గోల్పోవఁగలదు. లయతప్పిన పాట నెవ్వరు విననొల్లరు.

సంగీతశాస్త్రమున లయంగూర్చి యెఱుంగఁ దగినముఖ్యాంశములు పది గలవు. వాటికి 'దశ ప్రాణము' లనిపేరు. అవి కాలమార్గ క్రియాంగ గ్రహజాతి లఘు లయ కళాయతులు. వీట్ల నెఱిం గిన త్భాములంగూర్చి సర్వమును తెల్లవగును. తాళములు లయానిబంధనలు. లయకు తాళములే ఉనికిపట్టు. తాళములు ముప్పదియైదుగను, నూట నొక్కటిగను రెండువిధములుగ నుండును. వీట్లం గూర్చి వేర్వేఱుతావులందు గానసగును.

(దశప్రాణములు చూడుఁడు).

**సంగీతవాదము నాల్గు:**— [చతుర్విధ సంగీతములు వాదములు చూడుఁడు].

**సంగీతవిద్యాచరిత్ర:**— ఆదిని భరత దేశమున వేదములకాలమున సంగీతవిద్యకు "గాంధర్వవేద"మని వాడుకయుండెను. రానురాను నాట్యము, లయ, అభినయము, గానమునకు ...ంగములుగ నందుఁ జేరియున్నవి. దీనిం గూర్చి పరిశీలన లొనర్చిన ప్రొఫెసరు కీత్ పండితుఁడు ఋగ్వేదకాలమునం దీభరతదేశపు సంగీత విద్య ప్రబలినదని యభిప్రాయపడియున్నాఁడు. నాట్యముంగూర్చి మనమెఱిఁగియున్నంత వఱకు ఆదిని శివుఁడే తాండవ (నృత్య) మొసర్చెననియు. యుద్ధసందర్భమున నింద్రుఁడు వీరావేశపూరితుఁడై తాండవమొనర్చెననియు, భరతమహర్షి స్వర్గమం దప్సరల కీవిద్య నుపదేశించిన గురుఁ డనియు, తెలియుచున్నది. (సంగీతముఁ జూడుడు.) ఈసందర్భమున పురుషుఁడొనర్చునది 'తాండవ' మనియు, స్త్రీలొనర్చునది 'లాస్య' మనియు, నృత్యము ద్వివిధముగ నుండుననియు, తండి యను పేరంబరఁగు ఋషిప్రోక్తమై 'తాండవ' మని పేరందెననియు, అతఁడు తాండవనృత్యవిధానము లను వ్రాసినవాఁ డనియు, నెఱుంగునది. ఆదిని సంగీతపరికరములుగ ౧ దుందుభి (రణభేరి మొదలగునవి), ౨ అఘాతి (తాళములు మొదలగువాద్యోపకరణములు), ౩ జంత్రము (దీనిని క్షోణి యనియు నందురు. వీణ మొదలగునవి), ౪ మరుత్తు, (వేణునాదము, పిల్లనగ్రోవి, సొన్నాయి మొదలగునవి) అని యుపకరణములు నాల్గుగఁ జెప్పఁబడి యున్నవి.

ఈవిద్యాప్రశంసలు వరాహ, అగ్ని, మార్కండేయ, విష్ణుధర్మోత్తర పురాణములందునను, రామాయణము నందునను, మహాభారత విరాట్పర్వమునందునను, శ్రీమద్భాగవతదశమస్కంధము నందునను, ఇంకం గొన్నిస్మృతులందునను గానసగును. పాణినికాలమగు క్రీ. పూ. ౮౫౦ ప్రాంతములనాటికే యివి యేర్పడినవిగ పరిశీలకు లనుచుందురు. భరతదేశఁపుసంగీతవిద్యయందు సోమేశ్వరపథమనియు, భరత (మహర్షి) పథ మనియు, హనుమత్పథ మనియు, మూఁడుమార్గములు గానసయ్యెడిని. ఆర్యులకాలమునకుఁ బిదప హనుమత్పథము వ్యాపించినదని యెల్లరు తలంచుచున్నారు. ఇందు ౧ స్వర, ౨ రాగ, ౩ తాళ, ౪ నృత్య, ౫ భావ, ౬ కోక, ౭ హస్తాధ్యాయము లనంబడు ఏడధ్యాయములు చెప్పఁబడినవి. ఇంక నిక్కాలమున భరతదేశమునందు వేర్వేఱు తావుల వేర్వేఱుజాతిసంగీతవిద్యలు వ్యాపించి ప్రబలియున్నవి. వీట్లంగూర్చి విచారించుట సమంజసము. భారతీయులనుండి పారశీకులు, వారినుండి యరబ్బులు, వారినుండి కొన్ని యైరోపాయితరదేశములవారు సంగీతవిద్యారుచుల నెరింగిరని వదంతి కలదు. Guido d'Arezzo యనునాయన పదునొకండవశతాబ్దప్రారంభకాలమునఁ గొన్ని దేశములవారికి వ్యాపింపఁజేసెనని వాడుక బలముగా వ్యాపించియున్నది.

పురాతనకాలఁపు రోమనులు మతకార్యము లందు నృత్యమును వాడుచుండిరనియు, వినోద ములకొఱకు కెఱుంగరనియు, స్పార్టను లైదేండ్ల బాల్యప్రాయమునుండియు యుద్ధనాట్య మభ్య సించుచుండిరనియు, యూదులు నృత్యము నాది నుండి యెఱుఁగుదురనియు, మోషేప్రవక్తయు, మియమ్మహాత్మయు, ఇశ్రాయేలీయు లెఱ్ఱసము ద్రముం దాటినసంతోషమున నృత్యమొనర్చుచు యెహోవా దేవుని స్తుతించిరనియు, దావీదుభూ పతి యప్పుడప్పుడు సంతసమున నృత్యమొనర్చు చుండువాఁ డనియుఁ జెప్పఁబడినది.

గ్రీకు లాదికాలమున గ్రామములందు, తమ దేవస్థానములంజుట్టి యాటపాటలతోఁ సందుగపర్వ ములందు ప్రదక్షిణముల నొనర్చువారనియు, వారినాటకకళయం దీరెండు నుండెననియు, వారి కక్కాలమున భరతదేశఁపుఁదాండవముం బోలిన నృత్య ముండెననియుఁ దెలియుచున్నది. హోమ ర్పండితుఁడు, అరిస్టోటల్ విద్వాంసుఁడు, పిండా ర్విదుషీమణియు తమగ్రంథములం దీవిద్యం గూర్చి వ్రాసియున్నారు. ఈజిప్టు (ఐగుప్తు) దేశ మునం దాదినే నృత్యము, గానము, వృత్తి గాఁగలస్త్రీ లుండిరనియు, వారిసంఘమునకు 'అలామీ' యని పేరుండెననియు, వీరివిద్య భరత దేశఁపుహిందుస్థానీసీమల నృత్యముతో నించుక పోలిక గల్గియున్నదనియుఁ గొంద అనుచుందురు.

సరాసినుల యాదికాలఁపుస్థితి సరిగాఁ దెలి యదు. రెండవ వలీద్కాలీఫాకాలమునం దీవిద్య దేశమునం దధికముగ వ్యాపించెనఁట. ఆకాలమున నీవిద్య కొన్నిసంఘదోషములకుఁ గారణమగుట ముస్లిం హారీములకు (అంతఃపురములకు) ఘోషా పద్ధతి ప్రారంభమాయెనఁట. మఱియు నక్కాలఁపు ఖలీఫాలు గానవిద్యను నిషేధించుచుండిరఁట. ఐనను వాలిక్కాలీఫా గొప్పగానవిద్యాపోషకుఁడై యుండగనుంట విద్య నిలచియేయుండెనఁట. ఖోరా సాన్ దేశఁపురాజధానిగ బేబరుచక్రవర్తి కాలమునం దుండిన హీరతుపురము గానవిద్య కునికిపట్టని తలంపఁబడుచుండెడిదఁట. బేబరుచక్రవర్తి సంగీత విద్యాకవి, గానపోషకుఁడే భరతదేశమున మొగ లైచక్రవర్తులు వారి గానవిద్యావ్యాపకమున కండగ నుండిరి. అక్బరుచక్రవర్తికడనుండిన ముప్పది యార్గురు సంగీతవిద్యానిపుణులలో నైదుగురు హిందువులు. వారైనను భరతదేశఁపుగానము నేర్చినవారు కారు. గాన భరతదేశఁపుగానము నిర్బంధమునం బడి నిలిచినదనియే తలంపనగును. ఉత్తరహిందూస్థానమంతటను హిందూస్థానీగాన మనంబడువిద్య వ్యాపించి (యిప్పుడు కర్ణాటక గాన మనంబడు) దక్షిణసీమలందు నిలచిన దీకాల మునసే.

ఔరంగజేబుచక్రవర్తి గానవిద్యా విరోధి. ఈయననాఁడు రాజప్రాసాదమున గానవిద్య మా న్పింపఁబడినను, నిలచియుండిన దందురు.

## సంగీతశ్రుతు లిరువదిరెండు:—

(శ్రుతులు చూడుఁడు).

## సంగీత షడంగములు:—

(సంగీతాంగములు— షడంగములు చూడుఁడు).

## సంగీతషోడశాంగములు:—

(సంగీతాంగములు చూడుఁడు).

**సంగ్రహణి:**— విషమస్థితికివచ్చిన గ్రహణి రోగమునకు 'సంగ్రహణి' యనిపేరు.

## సంఘానుస్మృతి:—

(దశబౌద్ధానుస్మృతులు చూడుఁడు).

**సంచవ్యానిగోత్రము:—** (ఆత్రేయగణము చూడుఁడు).

**సంజయుఁడు:—** ధృతరాష్ట్రుని కాప్తుఁడగు నొకసూతకులజుఁడు. వ్యాసశిష్యుండై తత్వవేత్తయు, నీతికోవిదుఁడును నైనవాఁడు. భారత యుద్ధమంతయు నరయుచు ధృతరాష్ట్రునకు జరిగిన దంతయు నివేదించుచుండువాఁడు.

ఇంకను పురూరవచక్రవర్తియొక్క రెండవ కుమారుఁడగు క్షత్రవృద్ధునిపౌత్రుఁ డొకసంజయుఁడు. ఈతనికి కుశుఁడని నామాంతరము కలదు. సుహోత్రునికుమారుఁడు.

**సంజ్ఞాదేవి:—** సూర్యునిభార్య. ఈమెకు ప్రభావతి, పద్మిని, ఛాయ మొదలగు పెక్కునామములు గలవు.

సుతులు:— యముఁడు, శనైశ్చరుఁడు, నైవస్వతమనువు. కుమార్తెలు:— తపతి, కాళింది.

ఈమె ఛాయారూపిణియై కనినసంతాన మశ్వినీదేవతలు. సంజ్ఞాదేవి త్వష్టకుమార్తె.

**సంతకము:—** (నిశాని చూడుఁడు).

**సంతసము:—**
(మోహసంతస దుఃఖములు చూడుఁడు).

**సంతానము లేఁడువిధములు (సప్తసంతానములు):—**

౧ తటాకప్రతిష్ఠచేయుట [చెఱువులం ద్రవ్వించి ధర్మార్థముగాఁ బ్రతిష్ఠించుట.]

౨ ధననిక్షేపము— దేవాలయాదులందు ధనమును స్వర్ణరత్నాదులం బాతిపెట్టి స్థలమహిమ నతిశయింపఁజేయుట. [సువర్ణరత్నాదులఁ బాతినచో దేవస్థానములందు మహిమ యతిశయించునని చెప్పఁబడియున్నది.)

౩ బ్రహ్మస్థాప్యము— అగ్రహారము లొసంగి ప్రతిష్ఠించుట.

౪ శివాలయము— శివలింగప్రతిష్ఠ యొనర్చి దేవస్థానముల నేర్పఱచుట.

౫ వనప్రతిష్ఠ— ధర్మోపయోగమునకుఁగాను ఫలవృక్షములు, తోఁటలువేయించి ప్రతిష్ఠించుట.

౬ ప్రబంధరచన— ప్రబంధమును రచింపఁజేసి తాకృతినందుట. కొందఱు తానే ప్రబంధమును రచించుట యనిరి.

౭ పుత్రసంతతి (తనకుమాళ్ళు)

ఇందైదవదియగు వనప్రతిష్ఠంగూర్చి—

శ్లో॥ అశ్వత్థ మేకం పిచుమంద మేకం।
న్యగ్రోధ మేకం దశ తింత్రిణీనామ్।
కపిత్థబిల్వా మలకత్రయం చ।
పంచామ్రవాపీ నరకం న పశ్యేత్॥

అని చెప్పఁబడినది. అనఁగా ౧ రావిచెట్టు, ౧ వేపచెట్టు, ౧ మఱ్ఱిచెట్టు, ౧౦ చింతచెట్లు, ౧ వెలగచెట్టు, ౧ మారేడుచెట్టు, ౧ ఉశిరికచెట్టు, ౫ మామిడిచెట్లు ధర్మారామ మని భావము.

**సంతాల్జాతివారు:—** బీహారదేశమందలి సంతాల్పరగణాలయందలి కొండవారు.

**సంతోషము సగము బలము:—**
[ఆంధ్రలోకోక్తి].

**సందంశపతితన్యాయము:—** దీనిని సందంశనన్యాయమనియుఁ నందురు. "సందంశ" మన, పటకారు. (పట్టుకారు.)

పట్టకారులోఁ జిక్కుకొని నట్లని యర్థము. అనఁగా నిటునటుఁ గదలి తప్పించుకొనలేనిదుస్థితి. నిర్బంధమని భావము.

**సందంశహస్తము:**— (హస్తాభినయము చూడుఁడు, భరతశాస్త్రము చూడుఁడు).

**సందిమానపర్వతము:**— ఇది కాశ్మీర దేశపు శ్రీనగరమందున్న యొకపాటికొండ. జీల మునదిగుండా యోడలలో శ్రీనగరమున కేఁగు వారికిఁ జక్కఁగఁ గన్పడునది. దీనిపై కెక్కి చూచిన శ్రీనగరపట్టణదృశ్యములు చక్కఁగఁ గన్పడును. దీని కాదిని సందిమాన పర్వతమని పేరుండ శంకరభగవత్పాదులు దీనిపై జ్యేష్ఠరుద్ర శివలింగప్రతిష్ఠ యొనర్చిరి. దానిని బౌద్ధు లాక్రమించి, 'గోపాద్రి' యని పేరిడి, దానిపయిని బౌద్ధభిక్షువుల విహార మొనర్చిరి. పిదప మహమ్మదీయులనాఁడు వా రాక్రమించి, 'తఖ్త్-సులేమాన్' అనిపేరిడి, అట నొకమసీదుఁ గట్టిరి. ఇన్నిమార్పులకుఁ బాల్పరుపఁబడిన యాకొండ త్రిమతస్థులచే మూఁడుపేర్ల చేతఁగూడ పిలువఁబడుచున్నది. హిందువులగుస్మార్తులు శంకరాచార్యపర్వత మనియు ననెదరు. (కాశ్మీరదేశము, కాశ్మీరదేశ చరిత్ర చూడుము).

**సంధాయయానము:**— రాజనీతియందుఁ జెప్పఁబడిన పంచయానములలో నొకటి. (షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు చూడుఁడు).

**సందిగ్ధస్య వాక్యశేషా న్నిర్ణయః ఇతి న్యాయము:**— సందేహాస్పదమగు నర్థము. దానిపూర్వోత్తరసందర్భాన్వయములనుండి నిర్ణయించుకోవలసి యుండును.

**సందిగ్ధే న్యాయః ప్రవర్తతీతి న్యాయము:**— సంశయముఁ గల్గినతఱి "సందిగ్ధం సప్రయోజనశ్చ విచార మర్హతి" అని చెప్పఁబడి యుంటవలన న్యాయము (అనఁగా ధర్మము) ఆచరింపఁబడవలయునని భావము.

**సంధి:**— రాజనీతియందు షడ్గుణములలో నొకటి. (షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు చూడుఁడు.)

**సంధికసన్నిపాతము:**— (సన్నిపాత దోషము చూడుఁడు.)

**సంధికాలంపులిపి:**— సంధికాల మనిన పూర్వపశ్చిమచాలుక్యలిపులు సంధించి కలసికొని వ్యాపకము నందిననాఁడని యర్థము. ఇప్పటి తెలుఁగులిపికిఁ బూర్వఁపులిపియగు ప్రాఁత తెలుఁగును, హళేకన్నడమును విడిపోకపూర్వమని భావము.

ఇక్కాలమున క్రీ. శ. ౧౨౦౦ మొదలు ౧౩౫౦ వఱకునని సుప్రసిద్ధపరిశీలకశిఖామణి యనఁదగిన శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు నిర్ణయించియున్నారు. మఱియు నీలిపిని శ్రీవారే 'ఆంధ్రకర్ణాటకలిపులు కలసియుండి విడఁదీయ వీలుకాకుండిన యవస్థగా వివరించుచు నప్పటిని తూర్పున రాజమహేంద్రవరము, పడమట పశ్చిమ సముద్రతీరము నెల్లలుగ వ్యాపించియుండిన దనియు, క్రీ. శ. ౧౩౦౦ ప్రాంతమునుండి మెల్లమెల్లగ తెలుఁగులిపి తూర్పుదిక్కునను, కన్నడలిపి పశ్చిమమునను, విడిపోవుచు వేరైన వనియున్నారు. బర్నెలుపండితుఁడు గూడ నీయభిప్రాయమునే గల్గి దీనినే వివరించెను. పిమ్మట దేశమునం దచ్చక్షరములు వ్యాపించినకొలఁది తెలుఁగు కన్నడ లిపులు బొత్తుగా విడిపోయె నందురు. తెలుఁగు

లిపికిఁ బూర్వఁపులిపి ప్రాఁతతెలుఁగనియు, కన్నడ లిపికిఁ బూర్వఁపులిపి హాళీకన్నడ మనియు నెఱుంగ వలసియుండును.

(తెలుఁగు కన్నడలిపులు, దాక్షిణాత్యలిపులు, భరతదేశఁపులిపులు, తెలుఁగులిపి చూడుఁడు.)

## సంధిపాతగించుట:—

(సన్నిపాత దోషము చూడుఁడు).

**సంధిమానపర్వతము:**— ఒకప్పుడు 'గోపాద్రి' యనంబడినది. ఇప్పుడు 'తఖ్తసులేమాన్' అనఁబడుచున్నది.

(కాశ్మీరదేశము చూడుఁడు.)

**సంధ్య:**— సంధ్య యన సంధికాల మని యర్థము.

౧ ప్రాతస్సంధ్య:— రాత్రి గడచిపోయి పగలు ప్రారంభమగు (ఉదయ) సంధికాలము. తెల్లవాఱుచుండుతఱి నక్షత్రము లింకను కనిపించు చుండఁగనే ప్రాతస్సంధ్య ప్రారంభించి గాయత్రి నుపాసించి, సూర్యోదయముం జూచి ముగించవలయును.

౨ మాధ్యాహ్నికసంధ్య:— పగటియందలి పూర్వభాగము (ఉదయము) గడచి యపరాహ్ణము ప్రారంభమగు (మధ్యాహ్న) సంధికాలము. ఈమధ్యాహ్నసంధ్యయందు సావిత్రి నుపాసించవలయును.

3 సాయంసంధ్య:— పగలు గడచిపోయి రాత్రి ప్రారంభమగు (సాయంత్రము) సంధికాలము. సూర్యాస్తమయ మింకను కాకుండఁగనే సాయంసంధ్య ప్రారంభించి, సరస్వతి నుపాసించి సూర్యాస్తమయ మైనపిదప ముగించ వలయును. సంధ్య వార్చుట తన నిత్యకర్మానుష్ఠానయోగ్యత సిద్ధించుకొనుటకని చెప్పఁబడినది.

**సంధ్యానది:**—మాళ్వదేశమునఁగల చిన్న నది. యమునలో సంగమించును. మహాభారతము, సభాపర్వము, ౯ అధ్యాయమునఁ బ్రశంసింపఁబడినది.

**సంధ్యారాగము (Twilight):**— సంధ్యాకాలమందలి రాగము (వెలుతురు) సంధ్యారాగ మనంబడును. రాత్రికి, పగటికి సంధి ఉదయసంధ్యాకాల మనియు, పగటికి రాత్రికి సంధి సాయంకాల మనియు నెఱుంగునది. ఇది భూమియొక్క వేర్వేఱుప్రదేశములందు వేర్వేఱు పరిమాణములు గలదియై యుండును. భూమధ్యరేఖకడను సంధ్యారాగమే యుండదు. సూర్యుఁ డుదయించుదనుక రాత్రిగనే యుండి యుదయించుటతో వెలుతురు కల్గి పగలు ప్రారంభమగుటయు, సూర్యాస్తమయ మగుటతో చీఁకటియై రాత్రి ప్రారంభ మగుటయు, సంభవించు చుండెడిని.

అటనుండి యుత్తరమునకుఁ గాని దక్షిణమునకుఁ గాని పోయినకొలఁది సంధ్యారాగ ముత్తరోత్తర మధికకాలముగ నిలఁచుచుఁ గడకు ధ్రువములందుఁ గడుదీర్ఘములై యుండును.

భూవలయరేఖకు దిగువను ౧౮ డిగ్రీలుగ సూర్యుఁ డుండువఱకు నస్తమయమునను, ఆతావు చేరుటనుండి యుదయమును సూర్యునికాంతి యాకసమున మేఘములపైఁ బడును. వాతావరణమందలి ధూళియు, మేఘములు, నాకాంతిని భూమిపై ప్రతిఫలింపఁ జేయును. దానినే సంధ్యారాగ మందురు.

ఉత్తరధ్రువముకడ సెప్టెంబరు ౨౨ తేదీమొదలు నవంబరు ౧౨ తేదీదనుకను, జనవరి ౨౮

తేదీ మొదలు మార్చి ౨౦ తేదీదనుకను, సంధ్యారాగాతిశయముఁ గాంచనగుననియు, ఒక్కొక్కతరి రాత్రి యించుమించు చంతయు సంధ్యారాగమే యనియు ననుచున్నారు. ఇట్టిస్థితి కొంతమార్పుతో సింగ్లాండుదేశమునం దొకరీతిని గానవగునట. (వాతావరణఁపు వకృతలు చూడుఁడు, జోడియాకల్ లైటు చూడుఁడు).

## సంపదలు ౧౬ (షోడశసంపదలు):-

౧ కీర్తి. ౨ విద్య, ౩ బలము, ౪ జయము, ౫ పుత్రులు ౬ స్వర్ణరజితసమృద్ధి, ౭ ధాన్యసమృద్ధి, ౮ సత్కాలయాపన, ౯ భోజనసౌఖ్యము, ౧౦ జ్ఞానసంపర్కము, ౧౧ రూపము, ౧౨ సహనము, ౧౩ శరీరదార్ఢ్యము, ౧౪ ధైర్యసంపద, ౧౫ ఆరోగ్యము ౧౬ దీర్ఘాయువు.

## సంపద్వేషికతాళము:—

(తాళములు చూడుఁడు).

## సంపల్శాఖక్షత్రియులు:—

(ప్రమారశాఖక్షత్రియులు చూడుఁడు).

## సంపాతిగోత్రము:—

(శండిలగణము చూడుఁడు).

## సంపాతేయ లేక సాంహితేయగోత్రము:—

[కథ లేక కథ్యగణము చూడుఁడు.]

## సంపూర్ణగ్రహణము:—

(గ్రహణములు చూడుఁడు).

## సంపూర్ణసంపూర్ణసంరాగములు:—

(ఉపాంగరాగములు, సంగీతము చూడుఁడు).

**సంపెంగచెట్టు:—** సంపెంగభేదజాతులు తొమ్మిది. వీటికి నవచంపకము లనిపేరు. అవి ౧ చంపకము (మానుసంపెంగ లేక చెట్టుసంపెంగ. వసుపు, ఎఱుపు గలసినరంగుపూవులం బూచునది. చెట్టుగ పెరుగువృక్షము. ఇది సాధారణఁపుజాతి) ౨ శ్వేతపంచకము (ఇది చెట్టుగనే పెరిగి తెల్లని పూవులం బూచుజాతి. పరిమళయుతము), ౩ రక్తచంపకము (ఇది చెట్టుగనే పెరిగి యెఱ్ఱనిపూవులం బూచుజాతి. అంతపరిమళ ముండదు) ౪ చాంపేయము, ౫ సుకుమారము, ౬ కాంచనచంప (బంగారువన్నెపూవులు బూచునది) ౭ హేమపుష్పచంప, ౮ సకలఫలము (ఫలసంపెంగయు ననెదరు). ౯ ఆకుసంపెంగ. ఇవియుఁ గడపటి రెండును డొంకలుగ పెరుగుజాతులు. అం దాకుసంపెంగ యధమఁపుజాతి.

లా. Michelia Champaka. ఆంగ్ల. Gold Flower tree. సం. చంపకః, గన్ధఫలీ, గన్ధమోదినీ, గన్ధా, చాంపేయః, హేమపుష్పః, హేమపుష్పకః, ఇందు లాటిన్ భాషాపదము ఆంగ్ల పదము. చంపకము (దేశవాళీజాతి) కే వర్తించెడిని.

సంపెంగజాతులు ప్రసిద్ధములగు పూలచెట్ల జాతులు. పూఁదోఁటలందుఁ బెంచుదురు. పూవులందు వివిధపరిమళములు కలవు. విషహార మనియు, చక్కకషాయము జ్వరముల నివారించునని యు నందురు.

సంపెంగపూవులు శివప్రీతి కావనియు, శివలింగములను వీట్లతోఁ బూజింపరా దనియుఁ జెప్పఁబడినది.

**సంప్రీతి:—** శమునిభార్య.

## సంబంధము (అనుబంధము):—

అనుబంధచతుష్టయము (చూడుఁడు). అందులో నొకటి.

**సంబరేణి చెట్టు:—** లా. Gratiola moniria. ఇది నీటివారభూములందు నేలనేప్రాఁకులాడు చిన్న చెట్టు. దీనిసమూలరసము మూత్రము వెడలించి విరేచనముఁ జేయుననియు, నొప్పులం దీయుననియు, గడ్డలను మెత్త పఱచుననియుఁ జెప్పఁబడినది.

**సంభూతయానము:**—రాజనీతియందుఁ జెప్పఁబడిన పంచయానములలో నొకటి. (షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు చూడుఁడు).

**సంభూతి:—** ఈపే రిర్వురకు నామాంతరమై యున్నది. [సుమనసుఁడు, త్రిధన్వుఁడు చూడుఁడు].

**సంబోధిసత్వ సప్తకము (బౌద్ధమత ధర్మమున):—** ౧ స్మృతి, ౨ ధర్మవిచారము, ౩ వీర్యము, ౪ ప్రీతి, ౫ ప్రశాంతి, ౬ సమాధి [నిశ్చలత], ౭ ఉపేక్ష. ఇవి మనస్సున నాటి వికసించున ట్లొనర్చెడి సని బుద్ధభగవానుఁ డనెను.

**సంయాతి:**— తండ్రి నహుషమహారాజు. తల్లి ప్రియంవదాదేవి. యయాతి మహారాజు కనిష్ఠసోదరుఁడు. ఈతనిసంతతింగూర్చి యేమియుం దెలియదు. చంద్రవంశక్షత్రియుఁడు.

మఱియు పూరువంశక్షత్రియుఁడగు శర్యాతికిని సంయాతి యని నామాంతరము కలదు. ఇతఁడు బహుగంతుని కుమారుఁడు. బహుగంతుఁడు సుద్యువుకుమారుఁడు. శర్యాతిభార్య పేరు వరాంగి. బహుగంతుని బహుగవుఁడనియు నందురు.

**సంయుక్తాగ్రగుడము:—**
(గల్భ చూడుఁడు.)

**సంయుక్తరాష్ట్రములు:—**
(ఆగ్రా, అయోధ్య, సంయుక్త రాష్ట్రములు చూడుఁడు.)

**సంవత్సరఫలపరీక్ష (కాలవిజ్ఞానశాస్త్రపరీక్షలలో నొకటి):—**

౧ ప్రభవసంవత్సరము— మితవర్షములు, మితసస్యము, ప్రజావైభవము, కొఱ్ఱ, రాగి, మినుములు, సమృద్ధిగఁ బండునని చెప్పఁబడినది. మఱియును గురుఁడు కన్యారాశియందుండఁగా శని యచటఁజేరెనేని నర్మదానది కుత్తరమున హిమవత్పర్వతపర్యంతము, అనావృష్టి కల్గునని చెప్పఁబడినది.

౨ విభవ— స్వల్పవృష్టి, ధాన్యఁపుఁబంట తక్కువగను, సితరపంట లెక్కుడుగను, పండుననియు, పాఁడి బాగుండుననియు, శుభకార్యము లెక్కుడుగ నింటింట జరుగుననియుఁ జెప్పఁబడినది.

౩ శుక్ల— అధికవృష్టి, శుభసంతోషాధిక్యత గల్గియుండును.

౪ ప్రమోద లేక ప్రమోదూత— వస్త్రు, చెఱకు, కందమూలములు చక్కఁగ ఫలించును. సంతోషప్రదముగ కాలము గడచును.

౫ ప్రజోత్పత్తి— వర్షసమృద్ధి, సస్యసమృద్ధి, పశువృద్ధిగల్గియుండును.

౬ ఆంగిరస—ధాన్యము చక్కఁగ ఫలించును.

౭ శ్రీముఖసంవత్సరమున— సస్యానుకూలవర్షములు, పంటలు, కల్గియుండును. ధాన్యము నిల్వచేయవలయునని శెట్టవిజ్ఞాని తెల్పియున్నాఁడు.

౮ భావ— అల్పవృష్టి, భయము కల్గియుండును. కుజోదయము గల్గినచో ధూమకేతువు గాన్పించును. ధర లతిశయమై యుండును.

౯ యువ— అల్పవృష్టి, అగ్నిపీడనము, రోగపీడనము గల్గియుండును. ధర లతిశయముగనే యుండును.

౧౦ ధాత— మితవర్షము, ధాన్యసమృద్ధి, గల్గును. భీతావహమై యుండును.

౧౧ ఈశ్వర— పంటలు, ధనముం గల్గియుండును. అచ్చటచ్చట కరవు గల్గియుండును.

౧౨ బహుధాన్య— అల్పవృష్టి, పంటలు తక్కువ. రాజ్యాంగపుఁ జికాకులు గల్గియుండును. ధాన్యము నిలువచేయుఁడని రెట్టవిజ్ఞాని సూచించియున్నాఁడు.

౧౩ ప్రమాధి— సన్నధాన్యములు, పెసలు బాగుగ పండును. అచ్చటచ్చట జొన్నపంట బాగుగ ఫలించును. ప్రత్తికి ధర గల్గియుండును.

౧౪ విక్రమ— పంటలుపండినట్లు తోఁచినను స్వల్పముగ పండును. ధాన్యపుఁబంట చాలకుండును.

౧౫ విషు— [వృష] సంవత్సరమున అర్ధసస్యము గల్గును. కలతలు చోరభయము గల్గియుండును.

౧౬ చిత్రభాను— పంటలు, వర్షములు సరిగానుండియు ధర లధికమై యుండును.

౧౭ స్వభాను— పైరులు, వర్షములు బాగుండును. సుభిక్షముగల్గియుండును. అగ్నిపీడ గల్గియుండును.

౧౮ తారణ— ధాన్యమధికము. పాఁడి బాగుండును.

౧౯ పార్థివ— అతివృష్టి, సస్యసమృద్ధి, అగ్నిభయము, సత్ప్రవర్తనము గల్గియుండును.



౨౦ వ్యయ— పంటలుపండియు కొల్లపోయి, క్షామము కొంచెము గల్గియుండును. రోగములు, భయము వ్యాపించియుండును.

౨౧ సర్వజిత్తు— పంటలు బాగుండును. రోగపీడ యతిశయించి యుండును.

౨౨ సర్వధారి— వర్షము సస్యానుకూలముగ నుండును.

౨౩ విరోధి— వరిసస్యములు బాగుగ పండును. ఇతరసస్యములు చెడిపోవును. దుర్జనులు బాధలందుదురు.

౨౪ వికృతి— స్వల్పవృష్టి, స్వల్పసస్యము గల్గి జనులు మోదముగ నుందురు.

౨౫ ఖరసంవత్సరమున— స్వల్పవృష్టి, అల్పసస్యము, వికలత గల్గియుండును.

౨౬ నందన— సస్యానుకూలవృష్టి గల్గి సుభిక్షముగ నుండును.

౨౭ విజయ— సస్యానుకూలవృష్టిగల్గి సన్నధాన్యములు, గోధుమలు, జొన్నలు, చక్కఁగ పండి సుభిక్షత గల్గియుండును.

౨౮ జయ— సుభిక్షకాలము. అన్ని యనుకూలమై సుఖింతురు.

౨౯ మన్మథ— సుభిక్షకాలము. అన్నియనుకూలమై సుఖింతురు.

౩౦ దుర్ముఖి— సస్యానుకూలవర్షములు గల్గినను వరిపంట తక్కువగను, ఇతరపంట లనుకూలముగను ఫలించును. (పంచగుడులు).

౩౧ హేవిళంబి— కొంచెము కష్టకాలముగ నుండును. పైరులకు కీడు గల్గును. నిరుత్సాహము ప్రబలును. (పంచగుడివత్సరములలోనొకటి). శని కుంభమున, గురుఁడు సింహమున నుండిరేని ప్రజానాశనము కల్గునని చెప్పఁబడినది.

౩౨ విళంబి— మితవర్షము, పరిపాలన ఒత్తడి ప్రజ లితర దేశముల కేగుచుందురు. (పంచ గుడివత్సరములలో నొకటి.)

౩౩ వికారి— వర్షము, పంటలు తక్కువగ నుండును. జనులకు, పీడ కల్గియుండును. ధాన్యము దాచవలయునని చెప్పఁబడినది. (పంచగుడులు).

౩౪ శార్వరి— అతివృష్టివలన పంటలు నష్టపోవును. జనపీడ గల్గియుండును. రెండుగ్రహణములు గల్గిన కలహములు గల్గియుండును. పంచగుడి వత్సరములలోఁ గడపటిసంవత్సరము.

౩౫ ప్లవ— అల్పవృష్టియైనను సస్యానుకూలముగ నుండి వరి పండును. ఇతరపంటలు తక్కువగ నుండును. చోరభయముండియు జను లభివృద్ధిగ నుందురు.

౩౬ శుభకృతు— సస్యానుకూలవర్షములు కల్గియన్నిపంటలు పండును. ద్విజులు సత్కర్మముల పాటింపకుందురు. కలహములు గల్గును.

౩౭ శోభకృతు— సస్యానుకూలవర్షము. సమృద్ధిగ గల్గియుండును.

౩౮ క్రోధి— సస్యానుకూలవర్షము సమృద్ధిగ గల్గియుండును. మఱియు శని మీనమందు, గురుఁడు కన్యయందు నుండుట సంభవించునేని చోరబాధలును, ఉత్తరదేశమున పంట నష్టమును గల్గునని చెప్పఁబడినది.

౩౯ విశ్వావసు— సస్యానుకూలవర్షము సమృద్ధిగ గల్గియుండును.

౪౦ పరాభవ— సస్యానుకూలవర్షము సమృద్ధిగ గల్గియుండును.

౪౧ ప్లవంగ- అనావృష్టి, సస్యలోపము, క్షామము, కలహములు, పీడ గల్గియుండును.

౪౨ కీలక— అతివృష్టి, అర్ధ [సస్య] ఫలము, కించిత్ క్షామము గల్గియుండును.

౪౩ సౌమ్య— వర్షములు, పంటలు, ధరలు కూడ ద్వంద్వమై యుండును. పశుపీడ గల్గియుండును.

౪౪ సాధారణ— వర్షములుండియు వరి అర్ధఫలముగను, అపరదినుసులు జొన్నలు ఫలించును. అచ్చటచ్చట ప్రజాపీడ గల్గియుండును.

౪౫ విరోధికృద్వత్సరమున— వర్షములు, పంటలు, మితముగ నుండును. అంతట కలహములు గల్గియుండునని చెప్పఁబడినది.

౪౬ పరీధావి— ప్రత్తి, నువ్వులు పండును. తక్కినవి నశించును. దుర్భిక్షము, ఒత్తిడి, దీనత కల్గియుండును.

౪౭ ప్రమాధి [లేక ప్రమాదీచ]— వర్షములు, పంటలు తక్కువగనుండును.

౪౮ ఆనంద— సుభిక్షకాలము సమృద్ధిగఁ గల్గియుండును.

౪౯ రాక్షస— వానలుండియు వరిపంట తగ్గియుండును. పాడి సమృద్ధిగనుండును. ప్రజాపీడ, రోగములు కల్గియుండును.

౫౦ నళ లేక నల— పరిపాలన బాధకరమైయుండును. చోరభయ మధికముగ నుండును.

౫౧ పింగళ— సుభిక్షసంవత్సరము. సమృద్ధి గల్గియుండును.

౫౨ కాళయుక్తి— వెనుకటివర్షములు కురియును. పైరుల కీటిబాధలు కల్గియుండును.

౫౩ సిద్ధార్థి— వర్షములుండి పైరులుపండియు, దండుగలు గల్గును. అచ్చటచ్చట క్షామము గల్గియుండును. కలహములు గల్గియుండును.

౫౪ రౌద్రి— వాన చక్కఁగఁ గురియదు. పంటలు పండిన ట్లగుపించియు తక్కువగ ఫలించును. ఇతరబాధలు లేకుండును.

౫౫ దుర్మతి— వానలుండియు వరిపంట తగ్గియుండును. కొఱ్ఱి, రాగి, సజ్జ యెక్కువగ ఫలించును. అపరములొకరీతిఁ బండును.

౫౬ దుందుభి— సుభిక్షకాలము. సమృద్ధి గల్గియుండును.

౫౭ రుధిరోద్గారి— పంటలు మితముగ నుండును. భయదుఃఖములు ప్రజలకుఁ గల్గియుండును. [ధాన్యము నిల్వచేయఁదగునని చెప్పఁబడినది].

౫౮ రక్తాక్షి— కష్టకాలము, క్షామము, పీడలు గల్గియుండును.

౫౯ క్రోధన— సస్యానుకూలవర్షములు, పంటలు, బాగుండును. జనులు క్షేమముగ నుందురు.

౬౦ క్షయ [అక్షయ యనియు నందురు] సంవత్సరమున—వర్షములు, పంటలు తక్కువగనుండి, ఒత్తిడి, భయము, పీడ కల్గియుండును.

ఇటుల రెట్టకాలవిజ్ఞాని వివరించియున్నాఁడు.

## సంవత్సరములు [౬౦]:—

| | |
|---|---|
| ౧ ప్రభవ | ౧౫ వృష |
| ౨ విభవ | ౧౬ చిత్రభాను |
| 3 శుక్ల | ౧౭ స్వభాను |
| ౪ ప్రమోదూత | ౧౮ తారణ |
| ౫ ప్రజోత్పత్తి | ౧౯ పార్థివ |
| ౬ ఆంగీరస | ౨౦ వ్యయ |
| ౭ శ్రీముఖ | ౨౧ సర్వజిత్ |
| ౮ భావ | ౨౨ సర్వధారి |
| ౯ యువ | ౨3 విరోధి |
| ౧౦ ధాత | ౨౪ వికృతి |
| ౧౧ ఈశ్వర | ౨౫ ఖర |
| ౧౨ బహుధాన్య | ౨౬ నందన |
| ౧3 ప్రమాధి | ౨౭ విజయ |
| ౧౪ విక్రమ | ౨౮ జయ |

| | |
|---|---|
| ౨౯ మన్మథ | ౪౫ విరోధికృత్ |
| 3౦ దుర్ముఖి | ౪౬ పరీధావి |
| 3౧ హేవళంబి | ౪౭ ప్రమాదీచ |
| 3౨ విళంబి | ౪౮ ఆనంద |
| 33 వికారి | ౪౯ రాక్షస |
| 3౪ శార్వరి | ౫౦ నల |
| 3౫ ప్లవ | ౫౧ పింగళ |
| 3౬ శుభకృత్ | ౫౨ కాళయుక్తి |
| 3౭ శోభకృత్ | ౫3 సిద్ధాద్రి |
| 3౮ క్రోధి | ౫౪ రౌద్రి |
| 3౯ విశ్వావసు | ౫౫ దుర్మతి |
| ౪౦ పరాభవ | ౫౬ దుందుభి |
| ౪౧ ప్లవంగ | ౫౭ రుధిరోద్గారి |
| ౪౨ కీలక | ౫౮ రక్తాక్షి |
| ౪3 సౌమ్య | ౫౯ క్రోధన |
| ౪౪ సాధారణ | ౬౦ క్షయ |

**సంవత్సరాది:**— ఏసంవత్సరమునకైన నాది (ప్రథమ) దినమును 'సంవత్సరాది' యందురు. ఇది పండుగదినము. దీని నింకను 'ఉగాది' యనుటయుం గలదు. ఈదినము సంతోషముగను, లాభప్రదముగను గడచిన సంవత్సరముపొడవున నట్లే గడచునని సర్వసాధారణముగ జనులు నమ్ముదురు. గాన, నాసంవత్సరమును పాటించువారెల్ల రాదినమున సంతసముతోఁ గడుప యత్నించుచుందురు.

క్రీస్తుశకమున మొదటినెలయగు జనవరియం దొకటవతేదీ గాన నది సంవత్సరాది యగును. దీని నాంగ్లమున 'న్యూయియర్సు డే' యందురు. సూర్యసంక్రమణములు పండ్రెండునెలలకు సరిహద్దులుగాగల, సౌరమానవత్సరమున రవి మేష రాశియందుఁ బ్రవేశించుదినము సంవత్సరాది

యగును. ప్రభవాది షష్టిసంవత్సరములు చాంద్ర మానసంవత్సరములు. గాన వాటియందు మొదటి నెల యనఁగ చైత్రమాసమున శుద్ధపాడ్యమి సంవత్సరాది యగును. మఱియుం దీనియం దశ్వినీ నక్షత్రము తటస్థించెడిని. బార్హస్పత్యమానవత్సర మునను, మాసములు చైత్రాదులే గాన శుద్ధ పాడ్యమియే సంవత్సరాది యగుచుండును. మహా మ్మదీయ, ఇస్లాం, మతస్థులు మహమ్మదు దేశికుని ఫసలీ హిజరీలను సంవత్సరములుగ పాటించుచు, వాటియందు ప్రతిచంద్రోదయదర్శనదిన మాదిగ చంద్రుఁడు గాన్పించనిదినములలో కడదినమగు శుద్ధపాడ్యమికడవఱ కొకనెలగా లెక్కించుకొనుచు సంవత్సరమున వారిమొదటినెల యగు మొహ రమ్ ప్రథమదినము సంవత్సరాదిగ నెంతురు. గాని, సంవత్సరాది నొకపండుగగ పాటింపక మొహరము పీరులపండుగలలో నెంచుదురు. వీరు హిజరీవత్సరమును, నిత్యకాలమానమునను, ఫసలీ వత్సరము లౌకికవ్యవహారములందు వాడుచుం దురు ఇందు. సంవత్సరాది పాటింపఁబడుట గానఁ బడదు.

పురాతనఁపు 'attic year' వత్సరము జూన్ నెల ౨౧ తేదికి పిదప వచ్చిన అమావాస్యకు మఱునాఁడు సంవత్సరాదిగ పరిగణింపఁ బడుచుం డెడిది. ఏదేశమునం దైనను, అట నాచరణయం దున్న వత్సరమునందలి ప్రథమదినము సంవత్స రాదిగ లెక్కింపఁ బడుచుండునని యెఱుంగునది.

**సంవత్సరాదిపాడ్యమి:**—ఇది చాంద్ర మాన లేక సౌరమాన లేక బార్హస్పత్యమాన సంవత్సరములో దేనియందైనను ప్రథమదివస మని స్ఫురించుచున్నను, ఆంధ్రదేశమున వాడుక గనున్న చాంద్రమానసంవత్సరఁపుఁబ్రథమదినమగు చైత్రశుద్ధమందలి ప్రథమదినముగ (పాడ్యమి) నాంధ్రదేశస్థులు గ్రహించుచున్నారు. చాంద్ర మాన సంవత్సరాదిపాడ్యమియందు నింబకుసుమ (వేపపువ్వు) భక్షణము విధింపఁబడినది. హిందు వులు సంవత్సరాది తన కెట్లుగడచునో యాసంవ త్సరమంతయుఁ దన కట్లేగడచునని యాదినమును సూచ్యార్థసూచక దినముగ నెంతురు. ఈపాడ్యమి యందు, కొద్దిగనో, ఎక్కువగనో అశ్వినీనక్షత్రము సంభవించునందురు. ఇది పండుగ దినము. (పండు గలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుఁడు).

**సంవత్సరాధిపతిఫలపరీక్ష(కాలవిజ్ఞాన శాస్త్రపరీక్షలలో నొకటి):**— చాంద్రమానసం వత్సరాది యేవారమగునో ఆవారాధిపతిని సంవత్స రాధిపతిగ దైవజ్ఞులు చెప్పియున్నారు. సంవత్సరా ధిపతులు శుభగ్రహములగుదురేని యది సుభిక్ష సంవత్సరముగ నుండునని చెప్పఁబడినది.

౧ రవి— (ఆదివారము) సంవత్సరాధిపతి యగు నేని స్వల్పవృష్టి ఆపదలు కల్గియుండును.

౨ చంద్రుఁడు (సోమవారము)అధిపతి యగునేని వర్షములుండియు వరిపంట తక్కువగను, గోధుమలు, రాజనములు, జొన్నలు, చెఱుకు, ఎక్కువగను ఫలించును. వెండి విస్తారముగ దొరకును. గోబ్రాహ్మణులు మోదమున మనెదరు.

౩ కుజుఁడు (మంగళవారము) అధిపతియగునేని వర్షములు, పంటలు మితముగ నుండి ధరలు తక్కువయై యుండును. అచ్చటచ్చట రోగ ములు గల్గియుండును. పశువు లభివృద్ధిగాం చును. గాలి ఎక్కువయై యుండును.

౪ బుధుఁడు సంవత్సరాధిపతి యగునేని పాఁడి పంటలు గల్గియుండును. వర్షములు గల్గి యుండును. సుభిక్షకాలముగ నుండును.

౫ గురుఁడు సంవత్సరాధిపతి యగునేని వర్షములు, పంటలు బాగుండును. క్షేమము, సుభిక్షము గల్గియుండును.

౬ శుక్రుఁడు సంవత్సరాధిపతి యగునేని గోవులు క్షీరప్రదములై యుండును. జనులు సుఖముగ నుందురు. వర్షము, పంటలు బాగుండును.

౭ శనైశ్చరుఁడు సంవత్సరాధిపతి యగునేని యల్ప వృష్టియు, అర్ధసస్యఫలము, పరిపాలనయం దసౌఖ్యము, ప్రజలయం దసంతృప్తి, రోగపీడ, పాపకార్యవ్యాప్తి గల్గి ధరలు తగ్గియుండును. ప్రజలయందు మనస్తాపము వ్యాపించి యుండును.

వీట్లనరసి కాలవిజ్ఞాన మెఱుంగఁదగునని రెట్టవిజ్ఞాని పూర్వర్షి మతమును, తనస్వానుభవమును గూర్చి రెట్టమతశాస్త్రమున వెల్లడించియున్నాఁడు.

**సంవర్తగణము:—** ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి.

౧ సంవర్తర్షి గోత్రము— సంవర్త, యజ్ఞ, ప్రతిపక్ష (త్రయార్షేయగోత్రము.)

౨ యజ్ఞపాలర్షి గోత్రము— యజ్ఞపాల, ప్రతితక్ష, సురోత్తమ, కుశధర్మ, తామ్రగర్భ (పంచార్షేయప్రవర).

3 కుశధర్మర్షి గోత్రము— ప్రతితక్ష, సూత్తమ, కుశధర్మ, (త్రయార్షేయప్రవర).

౪ తామ్రగర్భర్షి గోత్రము— అతిధాత్య, లోకేశ, తామ్రగర్భ, (త్రయార్షేయప్రవర).

౫ అతిధాత్యర్షి గోత్రము— తామ్రగర్భ, లోకేశ, అతిధాత్య, (త్రయార్షేయప్రవర).

**సంవరణుఁడు:—** అత్రి చంద్ర పూరు సంతతిక్షత్రియుఁడు. తండ్రి ఋక్షుఁడు. భార్య సూర్యపుత్రికయగు తపతీదేవి. కుమారుఁడు ప్రసిద్ధుండగు కురుమహారాజు.

**సంవర్తుఁడు:—** తండ్రి అంగిరసుఁడు. బృహస్పతి సోదరుఁడు. మఱియు నీతనికి ఉతథ్యుఁడని నామాంతరము కలదు.

**సంశప్తకులు:—** త్రిగర్తదేశమేలిన సుశర్మ భూపాలసోదరులు. అనఁగా సుశర్మయు, సత్యరథుఁడు, సత్యసేనుఁడు, సత్యకర్ముఁడు, సత్యవర్ముఁడు, రథికముఖ్యులు. వీరు కౌరవులపక్షమున భారతయుద్ధమున పోరుసల్పినవారు.

వీ రందఱు నర్జునుని చంపుటకును, చంపలేనిచోఁ దాము చచ్చుటకును ప్రతినయొనర్చినవారు. వీరితో నర్జునుఁడు యుద్ధమొనర్చుతఱి నభిమన్యుని (ఇతరులగు) కౌరవులు చంపిరి.

వీరు నామముచేతనే, ఆడినమాట తిరుగమని యొట్టుపెట్టుకొన్నవారని తెలియుచున్నది. భారతకాలమునఁ దిగర్తులతో సంశప్తకయోధగణ ముండినట్లుల పాణినికాలమునఁ ద్రిగర్తషట్కముతో 'దామన్యాది' ఆయుధజీవికగణము కలిపి చెప్పఁబడుట మాత్రము విచిత్రమే యగును.

**సంశయము (Sceptic):—** Sceptic అనునది గ్రీకుభాషాపదము. దీనికి look about అని యాభాషయం దర్థము. ఏదేని యొకసిద్ధాంతమున కింకను గలసంశయమని దీనిభావము. ఒకదాని నిజతత్వముంగూర్చి వేయిసార్లు పరిశీలించి, లేక వేయివిధములఁ బరిశీలించి, పూర్వపక్షము గానఁబడమి సిద్ధాంతమే యనుకొనువిషయమున వేఱొకరు వేయినొక్కవిధమున పరిశీలించిన నిక్క

యుండునని నెటుల చెప్పఁగలరని యడుగుటవంటి సంశయము 'స్కెప్టి' క్కనంబడును. ఇట్టిసంశయ స్థితి యెప్పటికి నివారణకానిదేయని యెల్లరకుఁదోఁ పకపోదు. దీనికిఁ గర్త Pyrrho అను గ్రీకుతత్వ పరిశీలకుఁడు. ఈయన అలగ్జాండరు ది గ్రేటు భరతదేశముపై దాడివెడలినతరి నాయనపరివార ముతో వచ్చినవాఁడు. భరతదేశము పెక్కండ్రు పండితులతో సంప్రతించి, ప్రసంగించెనఁట. ఎట్టి కేల కేవిషయమైనను నమ్ముట కేమి హక్కుకలదు? అనుసంశయమునందు స్థిరచిత్తముగల్గినవాఁడాయె నట. స్వదేశమునకుఁ జేరినపిదప 'ఏవిషయమైనను నమ్ముట కేమిహక్కుగలదనియు గాన నేవిషయ మందైనను కల్గించుకొనుటకన్న వదలివేయుటయే ఉత్తమ' మనియు, తనసిద్ధాంతమును బోధించమొదలిడెను.. ఇట్టివి స్కెప్టిక్సిద్ధాంతము లనం బడుచున్నవి.

**సంశ్రుత గోత్రము లేక సంశ్రుత్య గోత్రము:—** (కౌశికగణము చూడుఁడు.)

**సంసారమునకుగుట్టు, రోగమునకు రట్టు:—** (ఆంధ్రలోకోక్తి.)

**సంస్కారములు ౯ (నవసంస్కారములు):—** ౧ ప్రాణిపంచకము:— ౧ ప్రాణము, ౨ అపానము, ౩ వ్యానము, ౪ ఉదానము, ౫ సమానము.

౨ జ్ఞానేంద్రియపంచకము:—౧ ఘ్రాణేంద్రియము, ౨ జిహ్వేంద్రియము, ౩ చక్షురింద్రియము, ౪ త్వగింద్రియము, ౫ శ్రోత్రేంద్రియము.

౩ కర్మేంద్రియపంచకము:— ౧ పాయ్వింద్రియము, ౨ ఉపస్థేంద్రియము, ౩ పాదేంద్రియము, ౪ పాణీంద్రియము, ౫ వాగింద్రియము.

౪ భూతపంచకము:— ౧ పృథ్వి, ౨ జలము, ౩ అగ్ని, ౪ వాయువు, ౫ ఆకాశము.

౫ అంతఃకరణచతుష్టయము:— ౧ మనస్సు, ౨ బుద్ధి, ౩ అహంకారము, ౪ చిత్తము.

౬ కర్మత్రయము:— ౧ మానసికకర్మ, ౨ వాక్కర్మ, ౩ కాయికకర్మ.

౭ అవస్థాత్రయము:— ౧ జాగ్రదవస్థ, ౨ స్వప్నావస్థ, ౩ సుషుప్త్యవస్థ.

౮ అజ్ఞానము.

౯ స్థూలశరీరము.

ఈతొమ్మిది సంస్కారము లనఁబడును.

**సంస్కృతభాష:—** ఆదిని దేవభాషయని పేరుండెననియు, వ్యాకరణశాస్త్రముచే సంస్కరింపఁబడినకతన సంస్కృత మని పేరు వాడుకయయ్యె ననియుఁ జెప్పబడినది. సంస్కరింపఁబడుటయన పరిశుద్ధపఱుపఁబడుట యని యర్థము. ఇది యాదిశేషుండగు పతంజలి యొనర్చినది. ఈయనయే వ్యాకరణమహాభాష్యకర్త. అదియే ఆదిని వెడలినవ్యాకరణమనియు, పిదప వరరుచికృత వాక్యవృత్తియు, పాణినికృత సూత్రములు గల్గి వ్యాకరణశాస్త్ర మని వాడుచుండిరనియు నందురు. గాననే సంస్కృతభాష పరిశుద్ధభాషగఁ జెప్పఁబడి, దేవతలచే వాడఁబడుచున్నదని యనుచున్నారు. (భరతదేశఁపు లిపులు చూడుఁడు).

**సంహతాశ్వుఁడు (బర్హిణాశ్వుఁడు):—** ఈతనికి బర్హిణాశ్వుఁడని నామాంతరము గలదు.

**సంహారషష్ఠి:—**

(స్కందషష్ఠి చూడుఁడు).

## స్తంభవాశ్వోడు లేక బర్హిణాశ్వోడు:—

(బర్హిణాశ్వోడు చూడుఁడు).

## స్తంభశబ్దగోత్రము:—

(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

## స్తంభతీర్థము [కాంబేపురము]:—

ఇది జైనులతీర్థము. స్తంభతీర్థము కంభాతుగ మారి యిప్పుడు కాంబేయైయున్నది. గుజరాతులోనిది. దీని కింకను తాంబానగరు, స్తంభ లేక తంబపురము నని వాడుకలుండెనని చెప్పఁబడినది. హేమచంద్రు నిట జైనస్వామిగఁజేసి, ఆశ్రమస్వీకార మిప్పించినతావు. స్తంభతీర్థమున శాలిగవసహికదేవస్థానమున జరిగెనట. అక్కాలమున ౧౨ వ శతాబ్దమునకుఁ బారపాలనరపతిపాలనకాలమని ప్రబంధచింతామణి ౧౮౩ పుటయందు గలదు.

## స్థండిలము:—

స్థండిలము హోమము చేయుతావు. అగ్నికుండములు చేసి యందు హోమమొనర్పలేనివారు స్థండిలముచేసి దానిపై నగ్నింబ్రతిష్ఠించి హోమమొనర్తురు. ఇది తాత్కాలికహోమముల కుపయోగించెడిని. దీనింగూర్చి విధిగ్రంథములం దిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ స్థండిలంవాథకుర్వీత హస్తమాత్రప్రమాణకమ్। సికతాభి ర్మృదావాఽపి గుణాంగుళమితోన్నతమ్॥

హోమముచేయుటకు మూరెడు పొడవు, మూరెడు వెడలుపు గలప్రదేశమున నిసుకచేఁగాని, మట్టిచేఁగాని, మూడంగుళములయెత్తున నొకతావును, ఆయత్తపఱచి (రచించి), దీనిపై నర్హమగు రీతి నగ్నింబ్రతిష్ఠించి, యందు హోమముచేయఁదగునని చెప్పఁబడినది. దానికి స్థండిలమని పేరు. ఈస్థండిలమును ప్రధానకుండస్థానమునఁ జేయవలయునని చెప్పఁబడినది. (హోమకుండములు, అగ్నులు చూడుఁడు).

## స్కందగోత్రము:—

(గర్గఉపగణము చూడుఁడు.)

## స్కందనోలు:—

ఇది రానురాను కందనోలు. కందనోలు గందనోలుగ మాఱి కడకు మహమ్మదీయాధికారకాలమున కర్నూలై ఆంగ్లేయులచే నట్లే నిలువఁబడి వాడుకయందున్నది. ఇటులనే స్కందపురము కందుకూరైనది.

## స్కందపంచకము (పంచస్కందములు:—

బౌద్ధమతధర్మమున స్కందములు ౫. ౧ జ్ఞానస్కందము, ౨ సంస్కారస్కందము, ౩ వేదనాస్కందము, ౪ సంజ్ఞాస్కందము, ౫ రూపస్కందము.

## స్కందపంచమి:—

ఆషాఢశుద్ధ పంచమి. ఈదినమున కుమారస్వామిం బూజింతురు. పర్వదినము. (పండుగలు - పర్వతిథులు - వ్రతదినములు చూడుఁడు.)

## స్కందపురము (కరూరు):—

(చేరదేశము చూడుఁడు).

## స్కందషష్ఠి:—

దీనిని సంహారషష్ఠి, మల్లారిషష్ఠి యనియు నందురు. మార్గశిరశుద్ధషష్ఠి. దక్షిణదేశమున మళయాళమునను సుబ్రహ్మణ్యస్వామి పూజలొనర్చు పర్వదినము. ఇంకను చంపకాదేవిపూజ లొనర్తురు. (పండుగలు చూడుఁడు).

## స్కంధాజ్ఞానము లైదు:—

(వైభాషికబౌద్ధమతము చూడుఁడు.)

**స్కంభిన్నగోత్రము:—**
(పరాశరగణము చూడుఁడు.)

**స్పంజి:** - ఆంగ్ల. Sponge. ఫ్రెంచి. Eponge. స్పంజి సముద్రమున నీటియందు మునిఁగియుండునది. గ్రీసు దేశతీరములందు, భరత దేశ దక్షిణసీమల తీరమునందు, జపానుసముద్రము లందు స్పంజి ముఖ్యముగ లభించుచున్నది. ఎక్కువ శ్రేష్ఠములగు స్పంజి Levant అనంబడుతావు నుండి వచ్చును. ఇది జంతుసంబంధమని కొందఱును, వృక్షసంబంధమని కొందఱును అభిప్రాయ భేదములం గల్గియుందురు. ఎల్లెనను సముద్రజల ములతీరమునకు సమీపముననే నీటమునింగియే పెరిగియుండునది. ఒక్కొకతావున తక్కువగ గుంపులుగ నుండును.

స్పంజి ఏఁడుజాతులుగ నుండునని పరిశీలనల వలనఁ దెలియుచున్నది. జపాన్‌స్పంజి Feather వలె చెట్టు ఆకారమున నుండును. కొమ్మలవలె నుండునవి నాల్గుభేదజాతులుగ నుండుస్పంజిజాతులు కలవు. Venus Flower Basket అనంబడు స్పంజిజాతియొకటి కలదదియు మనకు సామాన్యముగ దొరకుచుండు Bath sponge అని యొకజాతియుఁ గలదు. బాతుస్పంజి పెద్దదిగ నుండునది. వీట్లతో స్నానకాలమున నీటముంచి యొడలు రుద్దుకొందురు. స్పంజియందు నీరుపీల్చి పట్టుగుణముకలదు. పిండివైచిన నీరంతయు వెడలి కారిపోవును. నీటికి త్వరితముగ చెడదు. పోటికి పోదు. నానదు. కుళ్ళదు. పిడిచినవెంటనే పొడిగ సిద్ధమగును. గాన పుండ్లను కడుగుట కుపయోగించుచుందురు.

దీనింగాల్చి చేసినభస్మము [మశి] లోనికిచ్చిన కడుపులోనిమంట నాపి మలములను దోషములను వెడలఁజేసి గండమాల, కంఠరణము, కణుతులు, సర్పి, తామరలను నివారించును.

**స్పందతిగోత్రము:—**
(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.)

**స్పందితిగోత్రము:—**
(గర్గఉపగణము చూడుఁడు.)

**సకూ బాయి:—** మహారాష్ట్రమున కృష్ణానదీతీరమున కహాడ్‌గ్రామవాసి. ఈమెపతి వ్రత, బ్రాహ్మణి, భక్తురాలు.

**సకృత్కృతేకృతః శాస్త్రార్థరితిన్యాయము:—** శాస్త్రము కొరకయినచో ఒక పని నొకసారి చేసిన చాలును. తిరిగీతిరిగీ ఆకార్యమె చేయనక్కరలేదని భావము.

**కి మవగుంఠనేన ఇతి న్యాయము:—** ఒకసారి పతితురాలగు స్త్రీ పిదప మొగమును మూసికొన నక్కర యుండదు. ఇంక సిగ్గుతోఁబనియుండదని భావము.

**సక్తుప్రస్థుఁడు:—** కురుక్షేత్రమునందుండిన ఒకానొకవిప్రుఁడు. అతిథిపూజ లొనర్చుచుండువాఁడు. యముఁడీతని యతిథిసత్కారమునకు మెచ్చి యీతనిని కుటుంబసహితముగ బ్రహ్మలోకముం జేరఁజేసెను.

**సక్షీనగోత్రము:—**
(గర్గ ఉపగణము చూడుఁడు).

**సగరచక్రవర్తి:—** ఇక్ష్వాకుసంతతి సూర్యవంశక్షత్రియుఁడు. ఇతఁడు చక్రవర్తి. షట్చక్రవర్తులలో నొకఁడు. తండ్రి బాహుకుఁడను నామాంతరముగల అసితుఁడు. పితామహుఁడు

ధ్రువసంధి. కుమారుఁడు అసమంజసుఁడు. భార్య లిర్వురు. విదర్భరాజపుత్రికయగు కేశిని లేక సుకేశి ప్రథమభార్య. యీమె సుతుఁడు అసమంజసుఁడు. అరిష్టనేమి సుతయగు సుమతి రెండవ భార్య. ఈమె కరువదియైదుగురు సుతులు.

ఒకతఱి సగరుఁ డశ్వమేధయాగమొనర్ప సమకట్టి యాయశ్వమును వదలనద్దాని నింద్రుఁ డపహరించెననియు, దానివెదక సగరుని రెండవభార్య సుతు లరువదియైదుగురేగి పాతాళమున కపిల మహర్షి కోపానలమునకుఁ బాల్పడి భస్మమైరనియు, వారికై తపం బొనర్చుచు, మూఁడు తరములవారగు సగరుఁడు, అతనిపుత్రుఁ డసమంజసుఁడు, మనుమఁ డంశుమంతుఁడుగడచిరనియు, ముమ్మనుమఁడు భగీరథునినాడు తపముఫలించి, గంగ యాతని కనుగ్రహింపఁబడి వారందరికి సద్గతి గల్గెననియు, భగీరథుని కొసంగఁబడుకతన గంగకుఁ భాగీరథియని పేరయ్యెననియుఁ జెప్పఁబడినది.

బనిరాజ్యము శత్రువులచే నపహరింపఁ బడినకతన నడవికిఁబోయి యట మరణింప నతని జ్యేష్ఠభార్య గర్భవతియైయుండి సహగమనము చేయఁ బ్రయత్నించియు నందరిచే వారింపఁబడెను. మఱియు సవతులామె పుత్రవతియగుట కోర్వలేక విషముపెట్టిరి. అది బాధించక కుమారునింగనెనట. గర=గరళము గాన సగరుఁడు= గరళసహితుఁ డని పేరిడిరఁట.

మఱియు ఋతుపర్ణునికడ నలుఁడు వంటవాఁడు గనుండుతఱి సిదే నామ మిడికొనియెను. (మహారాజులు చూడుఁడు).

**సగ్గుబియ్యము:—** సగ్గుబియ్యముచెట్టున 'కాంగ్లమున పేరు Sago అనెదరు. ఇది Palmae తెగకుంజేరిన Palm గాఁ జెప్పఁబడినది. ఇవి మూఁడుభేదములుగల జాతులు. సాగోచెట్లు న్యూగినియాదేశము, మలయాదేశము, సుమత్రాద్వీపము, బోర్నియోద్వీపము, మొలుక్కాస్ ఈస్టిండీస్ ద్వీపములు మొదలగుతావుల కలవు. ఈస్టిండీస్నందు Metroxylon laeve అనుపేరుగల ముండ్లులేని సాగోపామ్సును, బోర్నియోద్వీపప్రాస్తముల Metroxylon rumphi అనుపేరుగల ముండ్లుగలచిన్నజాతి sago palms నూ కలవు. ఇవియె సుమత్రామొలక్కాస్లందుకూడ వ్యాపించియున్నవి. వీట్లలోని తెల్లనిముద్దంగడిగి సగ్గుబియ్యము చేతురు. మూఁడవజాతిదగు Fern palm నకు cycas అనిపేరు. ఈచెట్లగింజలనుండియు సగ్గుబియ్యము చేతుఁరు.

మనదేశమున సగ్గుబియ్యము క్షీరాన్నముగను వడియములుగను చేసి భోజనపదార్థముగ వాడుచున్నారు. సగ్గుబియ్యమునందుఁ గాకఁజేసి వాతదోషము హరించి మూత్రమును వెడలించుగుణమును విరేచనముజేసి దోషజ్వరమునడంచు గుణమును కలదందురు. ఉష్ణశరీరులకు సగ్గుబియ్యము పడవందురు.

**సఘాలియన్ద్వీపము:—** ఇది సైబీరియాకుం జెందినది. శీతల మధికము. సదా మంచు నిండి యుండునది. ఆమూరునదీప్రాంతము. (సైబీరియాదేశము చూడుఁడు.)

**సఘోషకృత్ గోత్రము:—**

(భరద్వాజఉపగణము చూడుఁడు.)

**సచ్చిదానందమహర్షి:—**

ఈతనింగూర్చి యేచరిత్రయుం దెలియరాకున్నది.

**సచ్చిదానందములు:—**

పరమేశ్వర లక్షణములు.

౧ సత్— (దీనిని 'అస్తి' యనియు నందురు.) త్రి

కాలములబాధ లేకుండుట. అనఁగాఁ బరమేశ్వరునకు భూత భవిష్య ద్వర్తమానకాలములబాధ లేదనుట. పరమేశ్వరుఁ డెల్లప్పు డుండినవాఁడు, ఉండువాఁడు, ఉండేవాఁడు గాన నాయన లేనికాలము ఉండదనిభావము.

౨ చిత్—(దీనిని 'భాతి' యని యందురు.) స్వప్రకాశమానుఁడు. అనఁగా సూర్యునివలనఁ జంద్రునికి, అగ్నివలన లోకమునకుఁ బ్రకాశము గల్గినట్లు, ఏయితర తేజము పరమేశ్వరునియందుఁ బ్రకాశించుట లేక పరమేశ్వరసంబంధ చిత్ తేజమే సర్వజగములందు వెలుఁ గిచ్చి ప్రకాశింపఁజేయఁ గలది యని భావము.

3 ఆనందము—దుఃఖమనునది నిల్వఁజాలనిపరిపూర్ణ మగు నెడతెగని యానందము, పరమేశ్వరుని లక్షణమని భావము.

**సజ్జనగడము (సజ్జన్గడ్):**— పూనా బెంగుళూరు లైనుపైనున్న సతారా (సత్రా) స్టేషను [M. S. M. మోటరుగేజి] నుండి వాయవ్యదిశగా నేఁడుమైళ్ళదూరమునం దున్న యొకపాటి చిన్నకొండపై శ్రీరామాలయము కలదు. దానిక్రిందనే త్రవ్వఁబడిన యొకగుహ యందు సుప్రసిద్ధుండగు సమరరామదాసస్వామి సమాధి గలదు. ఈ మహాత్ముఁడు సుప్రసిద్ధమహారాష్ట్రచక్రవర్తియగు శివాజీమహారాజుగారి దేశికుఁడు. ఆయన జీవించియుండినకాలమున నీగుహ యందే వసించుచుండెను. అంతకుఁ బూర్వ మా కొండపై దేవాలయముప్రక్క నొకచిన్నపాకయం దుండువాఁడఁట. దీని నంతయుం జుట్టి శివాజీమహారాజొక కోటం గట్టించి 'సజ్జన్గడ్' అని పేరిడెనఁట. భక్తులు దీని ననుదిన మధికసంఖ్యాకులుగ దర్శించుచుందురు. బొంబై రాజ్యమున మహారాష్ట్రదేశమునందున్న యాత్రాస్థలము.

**సజ్జరసము (ఏపిచెట్టుబంక) ధూపగుగ్గిలము:**— దీనిని Gum of Shorea Robusta అని యందురు. ఏపిచెట్టు జిగురున కీపే రేల వచ్చెనో దురూహ్యము. సంస్కృతఁపుఁ బేరులు రాలః, సాలః (ఏపిచెట్టు) సాలజః లేక సాలనిర్యాసః [ధూపగుగ్గిలము], సాలరసః లేక సారవేష్టా (ధూపగుగ్గిలము), సురధూపః దీనిని ధూపగుగ్గిలమని యందురు.

కాకఁజేసి విషదోషములను, విషవ్రణములను మాన్పుననియు, వీర్యస్తంభనఁ జేయు ననియుఁ జెప్పఁబడినది. దీనినుండి తీయఁబడిన తైలము పాండువులు, శ్లేష్మవాతముల నడంచు నందురు. ఇంకను సంస్కృతమున దీనిని సర్జః, సర్జనిర్యాసకః, సర్జరసః, సర్జాఖ్యః, సర్జ్యం, యక్షధూపః అనియు వాడియున్నారు.

**సజ్జలు-వ్యవసాయము:**— సజ్జలు కొన్నిసీమలం దాహారపదార్థము. హిందూస్థానీయందు 'బాజీరా' యనియు, నఱవదేశమునందు 'కంబు' అనియు దీనికిఁ బేరులు. ఇది మెరకదేశఁపుఁబంట. తఱుచుగ పెసర, కంది, దోస, నువ్వు, గోంగూర, అలచందలు, జనుము వీట్లతోఁ గలిపి చల్లి పండించుచుందురు. కాలము ననుసరించి మూఁడు లేక నాలుగు నెలలలోఁ బండును. నీరు లేని గరపరాళ్ళప్రదేశములలో నీపంట విస్తారముగఁ బండును. నీరు తోడిన చక్కఁగఁ బండును. కసవు, బూడిద, పేడ, వీట్లకు ఎరువులుగా వేయఁబడుచున్నవి. దీనికిఁ బొలుఁబోసికొనుకాలమున వర్షాధిక్యము నష్టకరము. అహమదాబాదుప్రాంతముననుకైరాజిల్లాలోను, ఇసుకభూములపై 42 లక్షల యకరము లీపంటక్రింద నున్నట్టును, పంచమహాల్ జిల్లాలో 50 వేలయకరములవఱకు నీపంటక్రింద నున్నట్టును, బరోచ్, సూరత్ ప్రాంతముల సము

ద్రిఁపుటిసుకభూములలో సహిత నీరా ప్పె రు పెట్టఁ బడుచున్నట్టును తెలియఁబడుచున్నది. ఎకరమున కెనిమిదిపౌన్లవిత్తులు కావలయును. పరిస్థితు లను కూలించినచోఁ దొమ్మిదివందలపౌనులసజ్జలు పండును. వీటితోఁ గలిపి చల్లినచో నువ్వులుకూడ పండునని యిటీవలఁ దేలినది.

## సజ్జాకారము:

(సజ్జాక్షారము చూడుఁడు.)

## సజాతపిగోత్రము:—

(లౌగాక్షిగణము చూడుఁడు.)

## సజ్జాక్షారము (సజ్జాకారము):—

దీని నాంగ్లరసాయనవేత్తలు Carbonate of soda అనియు, Impure soda అనియు వాడుదురు.

సజ్జాకారమునం దగ్నిమాంద్యము, గండమాలలు, గుల్మరోగము, సమస్తమగు నుదరరోగములు, ఉబ్బుజాడ్యము, కడుపులోనిబల్లలు, కడుపులోనిమంటలు నివారించుగుణమును, మలముల వెడలించి పరిణామశూలలు నాఁపుశక్తియుఁగల దందురు. సజ్జాక్షారము నప్పడాలకారమనుటయుం గలదు. అప్పడములలో నించుకఁ గల్పిన నవి బాగుగఁ బొంగి గుల్లగ నుండెడిని.

## సణగోత్రము:—

(కణ్వ ఉపగణము చూడుఁడు).

## సతు - సత్తుభస్మము:—

(తగరము చూడుఁడు).

## సత్యకగణము

— ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి.

౧ సుయజ్ఞర్షిగోత్రము— సత్యక, వసుయజ్ఞ, యజ్ఞసాంప్రదీక, సుతప, సుయజ్ఞ, (పంచార్షేయప్రవర).

౨ సుతపర్షిగోత్రము— వసుయజ్ఞ, యజ్ఞసాంప్రదీక, సుతప (త్రయార్షేయప్రవర).

౩ ప్రబోధకర్షిగోత్రము— సుతప, ప్రసక్త, బర్హి, కాలనాథ, ప్రబోధక (పంచార్షేయప్రవర).

౪ వసులోచనమహర్షిగోత్రము— ప్రబోధక, ధూర్వ, వసులోచన, (త్రయార్షేయప్రవర).

౫ చిత్రధర్మర్షిగోత్రము— వసులోచన, సునంద, శాంతమతి, సిద్ధబోధ, చిత్రధర్మ (పంచార్షేయప్రవర).

(ఋక్శాఖవిశ్వబ్రాహ్మణులు చూడుఁడు).

## సత్యకర్ముఁడు:—

అంగదేశాధీశుఁడు. కుమారుఁడు దృఢవ్రతుఁడు.

## సత్యకాలము:

- ఆంధ్రభాషాసాంప్రదాయార్థపదము. గడసరియు, జాణయుఁ గాని వారిని 'సత్యకాలఁపుమనిషి' యనుచుందురు. ఇందు సత్యమన యథార్థమని యర్థము కాదు. వెనుకటికాలమని భావము గా నోపు.

## సత్యకిగోత్రము:—

(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

## సత్యకీర్తి:

—హరిశ్చంద్రచక్రవర్తి కడఁ బ్రధాన మంత్రిగ నుండినవాఁడు.

## సత్యకుఁడు:

—అత్రి, చంద్ర, యాదవ క్షత్రియుఁడు తండ్రి శిని; తాత అనమిత్రుఁడు. కుమారుఁడు యుయుధానుఁడు.

**సత్యకేతువు** — కాశ్యుని సంతతి. పితామహుఁడు సుకేతుఁడు, కుమారుఁడు విభువు.

**సత్యజిత్తు:**— యదుసంతతి చంద్రవంశీయుఁడు. కుశుని రెండవసుతుఁడు. పితామహుఁడు శూరుఁడు. పెదతండ్రి వసుదేవుఁడు.

మఱియు ద్రుపదునియన్నయు సత్యజిత్తను పేరుఁ గలవాఁడే. ఇంకను మగధ, బార్హద్రథ సంతతి క్షత్రియుఁడగు సునీథుని పుత్రుఁ డొకఁడు సత్యజిత్తుఁడు. ఈతని పితామహునిపేరు సుబలుఁడు. పుత్రునిపేరు విశ్వజిత్తు.

**సత్యాతిగోత్రము:**
(ఆయాస్య ఉపగణము చూడుఁడు).

**సత్యధృతి:**— ఈపేరుగలవారు ముగ్వురు గాన నగుచున్నారు. ఒకసత్యధృతికి శరద్వంతుఁడను బిరుదునామము గలదు. ఈతఁడు శతానందునికుమారుఁడు. విలువిద్యావిశారదుఁడు. ఊర్వశిం గని మోహావేశపరుఁడై వీర్యము పతితముగాగా దానినుండి యిర్వురు పిల్లలు గల్గిరట. వారి నట వదలి యాతఁ డేగ వారిం జూచి శంతనుఁడు పెంచెనఁట. వారు కృపి, కృపుఁడు [కృపాచార్యుఁడు]. అందు కృపి ద్రోణాచార్యుల భార్యయయ్యెను. (అశ్వత్థామ తల్లి).

మఱియు పూరుసంతతి క్షత్రియుఁడగు కృతిమంతునికుమారుఁడును, మిథిలవంశమున మహావీర్యుని కుమారుఁడును సత్యధృతి యనిపేరు గలవారలే. (సుర్వతి చూడుఁడు).

**సత్యభామ:**— సత్రాజిత్తు కుమార్తె. శ్రీకృష్ణుని ప్రియభార్య. నరకాసురునితో యుద్ధ మొనర్చినది. (శమంతకమణి, శ్రీకృష్ణుఁడు చూడుఁడు, అక్రూరుఁడు చూడుఁడు, కృతవర్మ, చూడుఁడు).

**సత్యము (Truth):**— సత్య మనేక విధములుగఁ జెప్పఁ బడుచున్నది. జరిగినది జరుగునట్లును, యున్నది యున్నయట్లులను గ్రహింపఁ బడుట సత్యమని యెల్లరెఱుంగుదురు. యథార్థమును వేరు ప్రయోజనములకై మరుగుపఱచి ౦ం దెల్పుట సత్యదూర మందురు. ఇది యసత్య మనఁబడుచున్నది.

పరిశీలకులు సత్యాన్వేషణ మొనర్చుచు నిజస్థితిం గన్గొనుటఁగూడ సత్యముగనే యెంచుచున్నారు. ఇందు కుదాహరణముగ ... చెట్టునుండి పండినపండు భూమిమీఁ బడుటకుఁ గారణము భూమియందున్న యాకర్షణశక్తి (gravetation pull) అని వివరించియున్నాఁడు. ఇటీవల జర్మనుదేశఁపువిద్వాంసుఁడగు ఎనిస్టన్ పండితుఁడు దానికి Curve in space కారణమని వివరించెను. ఈరెంటిని బరిశీలించి యిం దేది నిజమో కన్గొనుట సత్య మనంబడును. గ్రీకుదేశఁపువిద్వాంసుఁడగు నరబ్బీపండితుఁడు Eucluides అనునాయన రచించిన రేఖాగణితము (Geometry) యందు, పలుసంగతులను ఋజువుపఱచి సిద్ధాంతీకరించియున్నాఁడు. ఆసిద్ధాంతములు సత్యములుగా నెన్నఁబడుచున్నవి. కొన్నివేలు సంవత్సరములు మఱుఁగుపడిన రహస్యములు బయలుపడుటతో నవియు సత్యము లనంబడుచున్నవి. ఋజువుఁ గల్గిన సంగతులు సత్యము లనంబడుచున్నవి. క్రైస్తవమతస్థులు దేవుని వెదకికొనుటను సత్యాన్వేషణ మనుచుందురు. అద్వైతమతస్థులు శివస్సత్య మనుచుందురు. అనఁగాఁ బరమేశ్వర కల్పితసృష్టి సత్యమనియు నామరూపాత్మకమగు జగద్వస్తువ్యవహారము మిథ్యయనియు నను

చుందురు. వ్యతిరేకముగ రుజువు లభించుదనుక సత్యముగఁ దలంపఁబడినది. రుజువు వేరువిధముగ లభించుకతన నసత్య మనఁబడుచుండును.

## సత్యమునందలి భాగములు:—

మహాభారతమున, యుధిష్ఠిరమహారాజునకు భీష్ముఁడు సత్యమునందుఁ బదమూఁడుభాగములు గల వనెను. ౧ సమత్వము, ౨ దమము, ౩ అమాత్సర్యము, ౪ క్షమము, ౫ లజ్జ, ౬ తితీక్ష, ౭ అనసూయ, ౮ త్యాగము, ౯ ధ్యానము, ౧౦ ఆర్యత్వము, ౧౧ ధృతి, ౧౨ దయ, ౧౩ అహింస.

వీటిని సత్యముయొక్క యంగములని కొందఱనియున్నారు.

## సత్యలోకములు ఆఱు:—

౧ భూలోకము, ౨ భువర్లోకము, ౩ స్వర్లోకము, ౪ మహర్లోకము, ౫ జనలోకము, ౬ తపోలోకము. ఇవి సత్యలోకములని చెప్పఁబడినవి. మఱియు నివి సిద్ధాంత శేఖరమను గ్రంథమున శివపదమందు భూలోకమును, శివునియందు భువర్లోకమును, సూక్ష్మసూక్ష్మమందు స్వర్లోకమును, శబ్దశబ్దమందు మహర్లోకమును, జ్ఞానజ్ఞానమందు జనలోకమును, పింగపింగమందు తపోలోకమును నుండుననియుఁ జెప్పఁబడినది.

## సత్యవంతుఁడు:—

మద్రదేశాధీశుఁడగు ద్యుమత్సేనుని పుత్రుఁడు. ఇతనికిఁ జిత్రాశ్వుఁడనియుఁ బేరు కలదు. భార్యపేరు సావిత్రి. ఈమె యశ్వపతి కుమార్తె. పతివ్రత. (సావిత్రి చూడుఁడు.)

## సత్యవతి:—

ఉపరిచరవసువునకు శాపవశమై యమునానదియందున్న 'అద్రిక' యను నప్సరసయందు జనించి, దాశరాజుచేఁ బెంపఁబడి యాతని పెంపుడుకూఁతు రనంబరగెను. అత్తఱి నీమెకు మత్స్యగంధి యనియు, యోజనగంధి యనియుం బేరు లుండెను. అట్టితఱి పరాశరుని వలనఁ గృష్ణద్వైపాయనుని [వ్యాసుని] కన్యాత్వమునసే కనెను. [అచ్ఛోదము చూడుఁడు]. పిదప నీమె సత్యవతి యనునామమునం బరగుచు శంతనుని బరిణయమై చిత్రాంగదుఁడు, విచిత్రవీర్యుఁడు నను సుతుల నాతనికిఁ గనెను. [శంతనచక్రవర్తి చూడుఁడు].

మఱియు గాధిరాజసుతయు, ఋచికువిభార్యయు నగునామెపేరుగూడ సత్యవతియే. ఈమె తనభర్త మరణించుతఱి నాతనితో సహగమనమొనర్చి కౌశికనది యయ్యెనని చెప్పఁబడినది.

## సత్యవ్రత మహారాజు (త్రిశంకుఁడు):—

[త్రిశంకువు చూడుఁడు.]

## సత్యవ్రతుఁడు:—

సూర్యవంశక్షత్రియుఁడగు త్రిశంకువునకు మొదటిపేరు. త్రిశంకు వను నది [మూఁడుశంకువులు లేక మేకులు] శాపము వలనఁ గల్గిన దోషములు త్రిశంకువు. [హరిశ్చంద్రుఁడు చూడుఁడు.]

వేఱొకసత్యవ్రతుఁ డొకక్షత్రియుఁడట. ఈతఁ డొకప్పుడు ద్రవిడదేశాధీశుఁ డఁట. ప్రళయకాలమున నావయం దుండుభక్తుఁడట. పిదప వైవస్వత మను వట.

## సత్యవోలు భగవత్కవి:—

ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజస గోత్రము. తండ్రిపేరు జనార్దనామాత్యుఁడు. ఏనుఁగు లక్ష్మణకవితో సమకాలికుఁ డందురు.

ఈయన నూఱుశతకములు రచించెను. రుక్మిణీ పరిణయమను ప్రబంధము రచించెను. మిక్కిలి రసవంతమైన ధారాళమైన కవిత్వము.

**సత్యశ్రుతుఁడు (సాత్వతుఁడు):—** అత్రి, చంద్ర, యాదవ క్షత్రియుఁడు. తండ్రి పురుహోత్రుఁడు. కుమాళ్లు ౧ భోజుఁడు, ౨ అంధకుఁడు, 3 దేవావృధుఁడు, ౪ వృష్ణి, ౫ దివ్యుఁడు, ౬ భజి, ౭ భజమానుఁడు ననువా రేఁడుగురు. [సాత్వతుఁడు చూడుఁడు.]

**సత్యసేనుఁడు:—**
కర్ణుని (అంగదేశాధీశుని) కుమారుఁడు.

**సత్యహితుఁడు:—**
ఉపరిచరవసువుయొక్క వంశస్థుఁడు.

**సత్రమున భుజించి మఠమున నిద్రించువాని యాస్తి అంతా యెఱుఁగినదే:—** (ఆంధ్రలోకోక్తి).

**సత్రము:—** దీనికి సత్తరువని నామాంతరము కలదు. అతిథులకు భోజనము, బస మొదలగు సౌకర్యము లిందుఁ జేయఁబడును.

**సత్రయాగము:—** యజ్ఞములలో నొక భేదము. దీనిని జనమేజయమహారా జొనర్చెను. దీనియం దన్నదానమునకుఁ బ్రాముఖ్యత నిచ్చిరి. ఇతఁడు సర్పయాగమునుగూడఁ జేసినవాఁడు. వైశంపాయనునివలన భారతకథ నంతను వినినవాఁడు.

**సత్రపుప్రభువులు:—** వలభీనగరము రాజధానిగ మౌర్యులకు లోఁబడి వీరు సౌరాష్ట్ర దేశము నేలిరని చెప్పఁబడినది.

**సతారాజిల్లా:—** సతారా (సత్రా) పురము ప్రధానస్థానము. (బొంబై రాజధాని చూడుఁడు).

**సత్రాజిత్తు:—** అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి శూరుఁడు. నిమ్నునిసుతుఁడని వేఱొకతావునఁ గానవచ్చెడిని. ఈతనిసోదరుఁడు ప్రసేనజిత్తు. సత్రాజిత్తు సూర్యోపాసకుఁడు. ఈతఁడు సూర్యుని తనతపఃప్రభావమున మెప్పించి శమంతకమను నొకమణిని వడసెను. అది దివ్యకాంతివంతమైనదేగాక సువర్ణము నుత్పత్తిఁజేయుశక్తిగూడనం దున్నది. సత్రాజిత్తునకు సత్యభామయను సురూప లక్షణ సమన్వితయగు పుత్రిక గలదు. బాల్యవయస్సున నామెను శతధన్వునకుఁ బరిణయ మొనర్పవలె ననుకొనిరి గాని ప్రసేనుఁడు శమంతకమును ధరించి వేటకుఁబోయి సింహముచే నిహతుండైనపిదప సత్రాజిత్తు శ్రీకృష్ణుఁడు మణికై ప్రసేనుని జంపెనని దుర్వార్తఁ గలిగించెను. అందులకు శ్రీకృష్ణుండు సహింపక యడవికిఁబోయి మడిసిన ప్రసేనుని, గుఱ్ఱమును జూచి యటనుండి సింహపాదచిహ్నమార్గమునఁ బోయి యచ్చట సింహకళేబరమును, అటనుండి జాంబవంతుని పదచిహ్నములు గని, యాతని గుహం బ్రవేశించి, యాతనితోఁ బోరి, జయించి, మణిని, జాంబవతీకన్యకామణిని గ్రహించి యింటికి వచ్చెను. పిదపఁ గృష్ణుఁడు సత్రాజిత్తును జేరి జరిగినది చెప్పి మణి నాతని కిచ్చెను. అంత సత్రాజిత్తు తా నకారణముగఁ గృష్ణనింద చేసినందులకు వగచి తనకూఁతు సత్యభామను, శమంతకమణియుతముగఁ గృష్ణార్పణ మొనర్చెను. శ్రీకృష్ణుఁడు సత్యభామను గ్రహించి శమంతకమును, సత్రాజిత్తున కిచ్చివేసెను.

# సత్యశ్రుతనృపాలునివంశావళి

దీనినుండి భోజులువంశము, శ్రీకృష్ణబలరామవంశము, సత్రాజిత్తువంశము చీలును.

వీరు అత్రిసంతతి, చంద్రవంశపు క్షత్రియులు. పురూరవచక్రవర్తి, నహుషమహారాజు **యదు మహారాజు** సంతతివారు.



**సత్రాజిత్తు వంశావళి:—** ఈతఁడు శ్రీకృష్ణుని భార్యయగు సత్యభామకుఁ దండ్రి. అత్రి సంతతి. చంద్రవంశము, క్షత్రియుఁడు. పురూరవచక్రవర్తి, నహుషమహారాజు, యదుమహారాజు, సత్యశ్రుతనృపాలుఁడు సంతతి.

- సత్యశ్రుతనృపాలుఁడు [సాత్వతుఁడు]
  - వృష్ణి [ఏడ్గురు సోదరులు]
    - సుమిత్రుఁడు
    - యధాజిత్తు
      - శిని
      - అనమిత్రుఁడు
        - నిమ్నుఁడు [సురథుఁడు]
          - విదూరథుఁడు
            - శూరుఁడు
              - సత్రాజిత్తు
                - కుమార్తె సత్యభామ శ్రీకృష్ణునిభార్య
              - ప్రసేనుఁడు
        - శిని
          - సత్యకుఁడు
            - యుయుధానుఁడు
              - సాత్యకి [శైనేయుఁడు]
        - వృష్ణి [పృశ్ని]
          - శ్వఫల్కుఁడు
            - అక్రూరుఁడు
              - కుమార్తె సంచారువు
            - క్షత్రోపేక్షుఁడు
            - గన్ధమాదనుఁడు
          - చిత్రకుఁడు

**సత్వగోత్రము:—** [వశిష్ఠగణము చూడుఁడు.]

**సత్వస్తంబగోత్రము:—** [భరద్వాజ ఉపగణము చూడుఁడు.]

**సదశ్వుఁడు:—** బృహదిషుని సంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. సమరుని కుమారుఁడు.

**సదస్యము:—** ఉపనయన వివాహాము లందుఁ బండితులను సత్కరించుసభకుఁ బేరు.

**సదాచారము:—** శైవాగమములందుఁ జెప్పఁబడిన పంచాచారములలో నొకటి. ఇది ౧ ఉత్పన్నము, ౨ ఆచారము, ౩ ఉద్యోగము, ౪ ఉత్కలము, ౫ సంబంధము, ౬ ప్రసన్నము, ౭ ఉత్తమము, ౮ జ్ఞానము నని యెన్మిదిభేదములు గలది.

**సదానందశివయోగి:—** వీరు శ్రీశైలమున వీరశైవపీఠాధిపతియగు స్వామి. స్కాంద పురాణ శంకరసంహితయందు ౭౫ అధ్యాయమున వీరిప్రశంస కలదు. వీరింగూర్చిన 'సవ్యతరభోగి శ్రీసదానందయోగి' యను పద్యము లాంధ్ర దేశస్థు లెఱుంగుదురు. ఆరాధ్యబ్రాహ్మణుఁ డందురు.

**సదాప [ఆకు] చెట్టు:—** ఇది సదాప లేక పెద్దసదాప, పిన్నసదాప, అడవిసదాప యని త్రివిధభేదములు గలది.

లా. Pencedanum Sowa అనుపదము పెద్దసదాపకును, అడవిసదాపకును వాడఁబడినది. Pencedanum Graveolens అనుపదము పిన్నసదాపకు. లాటిన్భాషాపదము. ఆంగ్లమున పెద్ద సదాపకు Garden Rue అనియు, పిన్నసదాపకు Drill seed plant అనియు, అడవిసదాపకు Wild Rue అనియు వాడుకనామములు గల్పించెడిని. ఇంక సంస్కృతమున అతిచ్ఛత్రా, అవాక్పుష్పీ, అహిచ్ఛత్రా, కారవీ, కాలేయమిషిః, తాలపర్ణీ, మధురా, మాధవీ, మిసిః, వనజాసా, వలపుష్పీ, శతపుష్పా, శతపుష్పికా, శతాహ్వా, శతాక్షీ, శాలినీ, శావీనా, శితచ్ఛత్రా, సంపాతపత్రికా, సీతశివా, సురస, యనుపదములు కానవచ్చెడిని. కొన్నిసీమలందు సదాపాకును సోయికూర యనెదరఁట. మఱియు నది భోజనపదార్థమట.

సదాపయందు కాకఁజేసి యాకలిని వృద్ధిఁజేయు గుణమును, మితముగఁ బుచ్చుకొనిన త్రిదోషములను శమింపఁజేయుగుణమును, మలమూత్రనిరోధము, స్త్రీల ఋతురక్తనిరోధము, నివారించు గుణమును గలవనియు, అపస్మారము, కఫరోగము, గుల్మరోగము, వ్రణములు, విషదోషము, హరింపఁజేయుననియు, నేత్రరోగములఁజక్కఁగ నివారించుననియుఁ జెప్పఁబడినది.

సదాపవిత్తులందు జ్వరతాపము, శ్లేష్మదోషము హరించుగుణము కలదందురు.

**సదాశివకలలు:—**

(కళలు చూడుఁడు).

**సదృశా త్సదృశోద్భవః ఇతి న్యాయము:—** పోల్కెంబోలునదియె పోలిక. అనఁగా ప్రాణినుండి ప్రాణియు, ఏజాతిచెట్టునుండి యాజాతిచెట్టు నిట్టిసాదృశములకు సాదృశములే కల్గుచుండునని భావము.

దీనికి జయంతభట్టునిఖండనము కలదు. పేడనుండి తేళ్లు, తోఁటకూరపురుగునుండి తుమ్మెదయుఁ గల్గుచుండుట సర్వసాధారణమే. 'జీవాత్ జీవోద్భవః' (జీవమునుండి జీవము జనించును) అనున్యాయమును, ఈన్యాయార్థమే యగును.

**సద్గుణచతుష్టయము (మానవుల కుండఁదగిన సద్గుణములు):—**

౧ మైత్రి:—ఇతరులయెడల మంచియు, స్నేహభావమును గల్గి ప్రవర్తించుట.

౨ ముదిత:—సర్వదా సంతోషాంతరంగముఁ గల్గియుండుట.

౩ కరుణ:— అందరియెడలఁ బ్రేమ, కనికరము, భూతదయఁ గల్గియుండుట.

౪ ఉపేక్ష:— దుర్మార్గులచర్యలను సైతము ఖండించి వారలను బాధించుచుండక, వారియెడ నిర్లక్ష్యము (ఉదాసీనత) వహించి యుపేక్షించి యూరకొనుచుండుట.

## సద్రోశాఖక్షత్రియులు:—

[ప్రిమూరశాఖక్షత్రియులు చూడుఁడు].

## సధాపగోత్రము:—

(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

## సనకగోత్రము:—

[శౌనక లేక గృత్సమదగణము చూడుఁడు].

**సనందనుఁడు:** బ్రహ్మమానసపుత్రుఁడు. బ్రహ్మర్షి. సృష్టికై పుట్టింపఁబడినవాఁడు. గాని యాబాల్యజ్ఞానియై సృష్టివిముఖుఁడైన వాఁడు. సృష్టి యీతనివలన నభివృద్ధి నందలేదు. ఎల్లలోకములందు సంచరించుశక్తి గలవాఁడు. (బ్రహ్మ, బ్రహ్మమానసపుత్రులు చూడుఁడు.)

**సనకమహర్షి:**— సనకసనందనులు బ్రహ్మమానసపుత్రు లనియు, దేవర్షులనియు వామన, కూర్మ పురాణములందుఁ జెప్పఁబడినది. వీరు ధర్మ ప్రజాపతికిని, హింసకును జనించినవారని యితరత్ర చెప్పఁబడినది.

**సనకుఁడు:**— బ్రహ్మమానసపుత్రుఁడు. బ్రహ్మర్షి. సృష్టికై పుట్టింపఁబడినవాఁడు. గాని యాబాల్యజ్ఞానియై సృష్టివిముఖుఁడైనవాఁడు. సృష్టి యీతనివలన నభివృద్ధి నొందలేదు. ఎల్లలోకములందు సంచరించుశక్తి గలవాఁడు. (బ్రహ్మ, బ్రహ్మమానసపుత్రులు చూడుఁడు.)

**సనకులగోత్రము:**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.)

సనకుల (శౌనకుల) గోత్రము. ద్వ్యార్షేయ గోత్రము (౧౨). సనకగణము. (సనకసగోత్రము సంస్కృతగోత్రము). ఆపస్తంబ యజుశ్శాఖ. ప్రమాణగ్రస్థ మాద్యప్రవరఖండ. సమానగోత్రము కాశ్యపస. వర్ణేశుఁడు దేవత. పల్లవాంబ భార్య. విన్ధ్యాచలము తపస్థానము. రత్నసరస్సు తటాకము. జపము లక్ష, దీపములు ౧౮, క్షేత్ర సంఖ్య ౪. భూమి దానము. జాజికాయ వర్జనీయము.

**సనత్కుమారమహర్షి:** బ్రహ్మమానసపుత్రుఁడు. విదురుఁ డితనిశిష్యుఁడనియు, నతనిప్రార్థనమేరకు ధృతరాష్ట్రునికడ కేగి యధ్యాత్మవిద్య నుపదేశించె ననియు, సనత్కుమారుఁ డెల్లప్పుడును కౌమారదశయందే యుండఁగలవాఁడనియు, సర్వలోకములందు సంచరింప శక్తిఁ గలవాఁ డనియుఁ జెప్పఁబడినది.

**సనత్సుజాతుఁడు:**— బ్రహ్మమానసపుత్రుఁడు. బ్రహ్మర్షి. సృష్టికై పుట్టింపఁబడినవాఁడు. గాని యాబాల్యజ్ఞానియై సృష్టివిముఖుఁడాయెను. సృష్టి యీతనివలన నభివృద్ధినందలేదు. ఎల్లలోకములందు సంచరింపశక్తి గలవాఁడు. [బ్రహ్మమానసపుత్రులు, బ్రహ్మ చూడుఁడు].

**సనాజిత్తు (సోభంజియని నామాంతరము):**— యదుసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి కుస్తి. పితామహుఁడు మాహిష్మంతుఁడు. ప్రపితామహుఁడు హేహాయుఁడు. ఈతనికి సోభంజి యనునామాంతరము కలదు.

**సనాతనగణము:—** ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము. ఇందైదుగోత్రములు చెప్పఁబడినవి.

౧ సనాతనగణము. ఐదుగోత్రములు.

౧ సనాతనర్షిగోత్రము— సనాతన, విష్ణు, వామదేవ, (త్రియార్షేయప్రవర).

౨ వామదేవర్షిగోత్రము— మయ, విష్ణు, వామదేవ, (త్రియార్షేయప్రవర).

౩ విశ్వచక్షుర్షిగోత్రము— విష్ణు, వామదేవ, విశ్వమయ, విశ్వదక్ష, విచక్షు, (పంచార్షేయప్రవర).

౪ ప్రితితక్షర్షిగోత్రము— విశ్వదక్ష, విశ్వచక్షు, వితక్ష, సుతక్ష, ప్రతితక్ష, (పంచార్షేయప్రవర).

౫ సునస్ధమనుగోత్రము— సుతక్ష, ప్రతితక్ష, సునస్థ, [త్రయార్షేయప్రవర).

**సనాతనసాగరము:—**
(రూపసాగరము చూడుఁడు).

**సన్బాత్ (ఆతపస్నానము)**
(సూర్యాగ్రికరణచికిత్స చూడుఁడు).

**సన్నకులగోత్రము:—**
(శనకాలకుల చూడుఁడు).

**సన్నతమంతుఁడు:—** పూరువుసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి సుమతి. పితామహుఁడు సుపార్శ్వుఁడు. కుమారుఁడు కృతి. వీరు హస్తిమహారాజు కుమారుఁడగు ద్విమీఢునిసంతతి.

**సన్నతి:—** అత్రిసంతతి చంద్రవంశక్షత్రియుఁడు. కాస్యునిసంతతిలోనివాఁడు. తండ్రి అలర్కుఁడు. పితామహుఁడు కువలయాశ్వుఁడనఁబడు ప్రితర్దనుఁడు. సోదరుఁడు భార్గవుఁడు. సుతుఁడు సునీతుఁడు.

ఇంకను క్రితువుభార్య పేరును సన్నతియే. ఈమె దక్షపుత్రిక. వాలఖిల్యమహర్షుల తల్లి.

**రాష్ట్రము (సన్నదుంప రాష్ట్రము):—** దీనింగూర్చి పెక్కభిప్రాయభేదములు కలవు. కొందరిది ప్రత్యేకమైనచెట్టనియు, కొందరు తమలపాకులతీఁగవే రనియు నందురు.

లా. Vanda Rax burghii అనియు, Cymbidium Tessalocides. ఆంగ్ల, Galangal Lesser. సం. పేర్లు సరిగా తెలియగా కున్నది. సన్నరాష్ట్రమును సన్నదుంపరాష్ట్రమనియు వాడుచుందురు.

వేఁడిచేసి శ్లేష్మము, శ్వాసకాసలు, విషదోషము, వాతదోషము, అజీర్తి, హరించును. పిల్లలకు లోనికిచ్చుచుండిన త్వరగ మాటలాడఁజేయుననియు, గొంతునుసను నివారించుననియు, గంధము పైనపూసిన మచ్చలు మానుననియు, దీనియందు దుంపరాష్ట్రిపుగుణములు, కొంతిగుణములు కలవుగాన వాట్లకుఁ బ్రిత్యామ్నాయముగ వాడనగుననియు నందురు.

(దుంపరాష్ట్రము చూడుఁడు).

**సన్నిపాతదోషము [సంధి]:—** ఆయుర్వేదవైద్యవిధానమున వాతపైత్యశ్లేష్మములు శరీరమునందు సమముగ నుండుట. ఆరోగ్యముం దెల్పు సమధాతులక్షణముగ వివరింపఁబడినది. ఇవి విషమావస్థం జెందుటయే రోగమనియు, దానిందెల్పు ధాతువును విషమధాతువు లేక విషమనాడి యని చెప్పఁబడినది. (త్రిధాతుదోషము చూడుఁడు).

రోగి జ్వరపీడితుండై యుండుకతన శరీరము నందలి వాత, పిత్త, శ్లేష్మము లనంబడు ధాతువులు విషమావస్థం జెందుటకు సన్నిపాతమని పేరు. వాతము, పైత్యము, శ్లేష్మము, యేకకాలమున విషమావస్థం జెందుట యన దోషబలముచే ధాతువులు స్వబలముం గోల్పోయి, స్వస్థితులం దప్పి, హీనముగంగాని, యధికముగంగాని యగుచు మాఱుట సన్నిపాతముగ నెఱుంగవలయును. ఈసన్నిపాతదోషమునందలి యంతర్భేదములు పదమూండని వైద్యశాస్త్రకర్తలు విభజించియుంట వీటికి, త్రయోదశసన్నిపాతము లనిపేరు కల్గెను.

ఈపదమూండు సన్నిపాతములు చేకుఱుటకు రోగికి సంభవించిన లేక రోగియొనర్చిన యపథ్యదోషము కారణమని చెప్పంబడినది. అవి అతి పులుపు, జలోదరపదార్థములు, ఉష్ణపదార్థములు, కటుపదార్థములు సేవించుటయు, సారాయము మొదలగు మత్తుపదార్థములం ద్రావుటయు, ఎండ విస్తారము తగులుట, కామక్రోధమానసుండై యుండుట, అనిష్టకార్యాచరణము, బలాత్కారము, భయము, అతిశీతపదార్థసేవనము, శ్రమయు, చింతయు, దుఃఖము, శోకము, స్త్రీసంగమమొనర్చుట మొదలగువాటివలన సన్నిపాతోపద్రవము కల్గునని చెప్పంబడినది. మఱియు నీసన్నిపాతము లన్నింటియందు సామాన్యలక్షణములుగ రాత్రి నిద్రపట్టకుండుటయు, పగలు కృశించి యుంటయు, మూర్ఛగల్గుచుంటయు, శరీరతాపము, చలి, చమట, అతిజ్వరము, అసంగతప్రసంగము లాడుచుండుటయు, వాతప్రకోపము గల్గుచుండుటయు, మదోన్మత్తత, నవ్వు, రొమ్మునొప్పి, రొమ్ముమంట, శ్వాస, కాస, విదాహము, శిరస్సునొప్పి, నాలుక కృశించియు పిడపగట్టియు నుండుట, గగుర్పాటు, కీళ్ళయందు నెముకలయందు నొప్పి, అరుచి, దబ్బరలాడుచుండుట, భీతి, కోపము, పండ్లుకొఱుకుట, కండ్లకొలకు లెఱ్ఱనై యుండుట, చెవులు గడియలుపడుట, హీనస్వరము గల్గుట, నేత్రములు కృంగి మూతలుపడియుండుట, ఉమిసిన రక్తముపడుట, నాలుక నల్లగంగాని, మిక్కిలి యెఱుపుగంగాని యగుట, బద్ధకము, కండ్లుమంట, శరీరముపోటు, ఎక్కిళ్ళు, గల్గుచుండుట, ఇవి సన్నిపాతలక్షణములని వివరింపంబడినవి. ఇవి రోగియందన్నియుంగాని కొన్నిగాని సామాన్యస... సన్నిపాతములందుంగల్గియుండులక్షణము లన్నియు బాగుగ పరిశీలించిన కొన్నికొన్ని జాతుల సన్నిపాతములందు, కొన్నికొన్ని లక్షణములు గానవచ్చుచుండునని యు, వైద్యవిద్యావిశారదు లనుచున్నారు.

సన్నిపాతభేదములు పదమూండు.

౧ సంధికసన్నిపాతము— దీని కింకను వాతపిత్తకఫోల్బణసన్నిపాత మనియు నందురు. కొన్ని వైద్యగ్రంథములందు విస్ఫారిక మని వాడియున్నారు. ఇందు ధాతువు త్రిదోషగతమై అనంగా ఏకకాలమున మూండును జెడియుండు నని భావము. ఇది వైద్యులకుం గష్టసాధ్యమైన దనియు, నిదితగిలినదాది నేండుదినములు గడుననియుం జెప్పంబడినది.

౨ తాంత్రికసన్నిపాతము— దీని నింకను వాతోల్బణసన్నిపాత మనియు నందురు. కొన్ని వైద్యగ్రంథములం దాశుకారమని వాడియున్నారు. ఇది వైద్యులకుం గష్టసాధ్యమనియు, తగిలినదాదిగ నేండు గాని, యిరువదియొందుదినములు గాని గడుననియుం జెప్పంబడినది.

3 చిత్తవిభ్రమ సన్నిపాతము— దీనికింకను పిత్తోల్బణ సన్నిపాతమనియు, కంపనమనియు పేర్లు వాడంబడియున్నవి. ఇది వైద్యులకుం గష్ట

సాధ్యమనియు, తగిలినదాదిగ నిరువదియొక్క దినములు గడువనియుఁ జెప్పఁబడినది.

౪ కంఠకుబ్జసన్నిపాతము— దీని కింకను కఫోల్బణ సన్నిపాత మనియు, బభ్రువనియు, పేర్లు వాడఁబడినవి. దీని నింకను కఫోల్బణసన్నిపాత మనియు, బభ్రువనియు వైద్యగ్రంథములందు వాడియున్నారు. ఇది కడుంగడు కష్టసాధ్య మనియు, తగిలినదాదిగ పదమూకిడుదినములు గడువనియుఁ జెప్పఁబడినది.

౫ కర్ణికసన్నిపాతము— మఱియు దీనికి వాతపిత్తో ల్బణ (ద్విదోష) సన్నిపాతమనియు, శీఘ్రకారి యనియు పేర్లు వైద్యగ్రంథములందు వాడి యున్నారు. ఇది వైద్యులకు కడుంగడు కష్ట సాధ్యమనియు, తగిలినదాదిగ పదమూఁడుదిన ములు గడువనియుఁ జెప్పఁబడినది.

౬ జిహ్వకసన్నిపాతము— మఱియు దీనిని వాత కఫోల్బణ (ద్విదోష) సన్నిపాత మనియు, భల్ల మనియు, వైద్యగ్రంథములందు వాడి యున్నారు. ఇది కడుంగడు కష్టసాధ్యమనియు, తగిలినదాదిగ పదునాఱుదినములు గడువనియు జెప్పఁబడినది.

౭ బుగ్నాహాసన్నిపాతము— దీని నింకను పిత్తకఫో ల్బణసన్నిపాత మనియు (ద్విదోషయుతము) పుటపాకమనియు, వైద్యగ్రంథములందు వాడి యున్నారు. ఇది మారకతుల్యమగు మృత్యు ప్రాయసన్నిపాత మనియు, తగిలినదాదిగ నిరు వదిదినములు గడువనియుఁ జాగ్రతగొనఁదగిన దనియుఁ జెప్పఁబడినది.

౮ అంతకసన్నిపాతము— దీని నింకను హీనవాత మధ్యపిత్త శ్లేష్మాధిక (త్రిదోషయుక్త) సన్నిపాత మనియు, సమ్మోహక మనియు, వైద్య గ్రంథములందు వాడియున్నారు. ఇది వైద్య సాధ్యమనియు, తగిలినదాదిగ పదిదినములలోఁ గుదురుననియుఁ జెప్పఁబడిన రోగము.

భుగ్న నేత్రసన్నిపాతము— దీనినింకను హీతవాత మధ్యకఫ వాతాధిక [త్రిదోషయుక్త] సన్నిపాత మనియు, పాలక మనియు, వైద్యగ్రంథములందు వాడియున్నారు. ఇది వైద్యులకు సాధ్యమనియు, తగిలినదాదిగ నెన్మిదిదినములు గడువనియుం జెప్పఁబడినది.

౧౦ రక్తష్టీవి లేక రక్తష్ఠీవి సన్నిపాతము— దీనినింకను హీనపిత్త మధ్యకఫ వాతాధిక (త్రిదోషయుక్త) సన్నిపాత మనియు, యామ్య మనియు, వైద్యగ్రంథములందు పేర్లు వాడి యున్నారు. ఇది వైద్యసాధ్య మనియు, తగిలినదాదిగఁ బదిదినములలోఁ గుదురుననియుఁ జెప్పఁబడియున్నది.

౧౧ ప్రలాపసన్నిపాతము— దీని కింకను హీనపిత్త, మధ్యవాత, శ్లేష్మాధిక (త్రిదోషయుక్త) సన్నిపాతమనియు, క్రకచ మనియుఁ బేర్లు వైద్య గ్రంథములందు వాడియున్నారు. ఇది వైద్యులకు సాధ్యమనియు, తగిలినదాదిగ పదునాలుగుదినములు గడువనియుఁ జెప్పఁబడినది.

౧౨ సీతాంగసన్నిపాతము— దీని నింకను హీనకఫ, మధ్యవాత, పిత్తాధిక (త్రిదోషయుక్త) సన్నిపాత మనియు, కర్కటక మనియు, పేర్లు వైద్యగ్రంథములందు వాడియున్నారు. ఇది వైద్యసాధ్యమనియు తగిలినదాదిగ పదునేను దినములలోఁ గుదురుననియుఁ జెప్పఁబడినది.

౧౩ అభిన్యాససన్నిపాతము— దీనినింకను హీనకఫ, మధ్యపిత్త, వాతాధిక, సన్నిపాత మనియు,

వైదారికమనియు, పేర్లు వైద్యగ్రంథములందు వాడియున్నారు. ఇది వైద్యసాధ్యమనియు తగిలినదాదిగ పదునేను దినములలోఁ గుదురు ననియుఁ జెప్పఁబడినది.

ఈగడువుదినములందు ధాతువులు విషమావస్థయం దుండుటయు, క్రమముగ నౌషధసేవ వలనను, ఉపచారమువలనను దోషము తగ్గుచు యథాస్థితికి వచ్చుట గాని, లేక విషమావస్థయం దుద్రేకించి రోగిం జంపుటగాని, సంభవించునని చెప్పఁబడినది.

ఈసన్నిపాతజ్వరములకాలమునందు మలపాక మనియు, ధాతుపాక మనియు, నింక రెండుదోష ములు రోగికి కల్గుటయుఁ గలదు. వాటింగూర్చి వైద్యుఁడు జాగ్రతంగానవలసియుండునని హెచ్చ రింపఁబడినది. (మలపాకము చూడుఁడు, ధాతు పాకముజూడుఁడు, త్రిధాతుదోషము చూడుము).

కడపటియూఱును త్రిదోషసన్నిపాతము లనం బడుచున్నవి.

**సన్నిపాతము [కళ]:—** రెండుచేతులు సమముగా చప్పటువేయుటకుఁ బేరు. ఇది సంగీత శాస్త్రమున క్రియాప్రాణములోని మార్గక్రియయం దలి సశబ్దక్రియలలో నొకటి. ఇది కళ యనంబడు చున్నది. (క్రియాప్రాణము చూడుఁడు.)

**సన్యాసాశ్రమము [తురీయాశ్రమము]:—**
[ఆశ్రమచతుష్టయము చూడుఁడు].

**సనీనులు:—** తుపాకులకడను బిగించు సనీనులు.



**సపంచగోత్రము:—**
[శండిలగణము చూడుఁడు].

**సప్తకురుక్షేత్రవనములు:—**
(కురుక్షేత్రవనములు చూడుఁడు).

**సప్తకులపర్వతములు:—**
(కులపర్వతములు చూడుఁడు).

**సప్తకొంకణములు:—** ౧ కేరళదేశము, ౨ తులుంగదేశము, ౩ గోరాష్ట్ర [గోకర్ణప్రాంత] దేశము, ౪ కరహాటదేశము, ౫ వరాలాటదేశము, ౬ బర్బరము, ౭ కొంకణదేశము.

ఈయేడుదేశములకుఁ బరశురామక్షేత్ర మని పేరు. వీట్లను పరశురాముఁడు, ఏఁడు వేర్వేఱు తెగలబ్రాహ్మణుల నివాసమున కిచ్చెనని స్కాంద పురాణసహ్యాద్రిఖండము ౭౮ యందుఁ జెప్పఁబడి నది.

ఈయేఁడుదేశములకు నుత్తరమున గుజరాతు దేశమనియు, తూర్పున దక్షిణాపథ (Deccan) మనియు, దక్షిణమున నుత్తరకన్నడదేశమనియు, పశ్చిమమున సముద్రమనియుఁ జెప్పఁబడినది. దక్షిణఁపుటెల్ల యిందు సంశయగ్రస్తము.

**సప్తకౌశికలు (కౌశికనదులు ఏఁడు):—**
౧ శోణకౌశిక (దీనికి మిలమ్చి యనివాడుక గలదు). మఱికొందరు భోటియాకోశి యనియు నందురు. ౨ తామ్రకౌశిక (దీనిని తంబకోశి, తామరకోశి యనియునందురు) ౩ రవికౌశిక, ౪ దుగ్ధకౌశిక, ౫ అరుణకౌశిక, ౬ లిఖుకౌశిక, ౭ ఆది (వరుణ) కౌశిక.

ఈయేఁడునదులు ముఖ్యముగ నేపాళమునఁ బ్రవహించుచువచ్చి కాశ్మీరదేశమున నొకటితో

నొకటి కలసి, **మహాకౌశిక** (నది) యై ప్రవహించెడిని.

ఇందరుణకౌశిక తొలుత వరుణ (ఆది) కౌశికలోఁజేరెడిని. లిబుకౌశిక శోణకౌశికలోఁ జేరెడిని. ఇట్లు ఒకటిలో నొకటి చేరుకొని **మహాకౌశిక** యయ్యెడిని.

ఇంకను కాశ్మీరములోని బారాముూలాపట్టణమున కెగువను, తామ్ర, అరుణ, శోణ కౌశికులు చేరుకొనును. దీనిం ద్రివేణి యనియెదరు. ఇట వరాహస్వామి దేవస్థానము కలదు. సూకరక్షేత్రమని వాడఁబడుచున్నది. పవిత్రతీర్థమై తనరుచున్నది.

**సప్తగంగలు:—**
(గంగలు చూడుఁడు.)

**సప్తగండకీనదులు:—**(గండకీనదులు ఏడు).
(గండకీనది చూడుఁడు).

**సప్తగ్రామములు:—** తొల్లింట క్రీ. A. D. 1630 ప్రాంతమునకుఁ బూర్వము (ఇప్పటి బంగాళాదేశమగు) అప్పటి వంగదేశమున రాఢాదేశమని యొకచిన్న సామంతదేశ మేఁడు గ్రామములు గలదై యుండెనఁట. గంగాతీర మాట నదిపైఁ బడవలమూలమున విస్తార వర్తకము జరుఁగుచుండెడిదఁట. 1630 A. D. సంవత్సరమున గొప్పతుపాను గల్గినది. ఇట గొప్పమేట వైచి దూరముపోయెనఁట. హుగ్లీపట్టణ మంతటినుండి మంచిరేవై వర్తకస్థలమగుట నాఁడాదిగ క్షీణించిపోయెనట. పిదప సామంతయుం బోలు సప్తగ్రామనామధేయ మాత్రశేషమై యున్నది. ఆసప్తగ్రామములు— ౧ బాన్సబేరియ, ౨ క్రిష్టపుర, ౩ బాసుదేవపుర, ౪ నిత్యానందపుర, ౫ శిబి (శివ) పుర, ౬ సాంబపోర, ౭ బలాఘ్టుటి గ్రామములై యున్నది.

**సప్తగ్రామరాజ్యము:—**
(రాఢాదేశము చూడుఁడు).

**సప్తచైతన్యములు:—**
(చైతన్యసప్తకము చూడుఁడు).

**సప్తతాళములు:—** ౧ ధ్రువతాళము, ౨ మఠ్యతాళము, ౩ రూపకతాళము, ౪ ఝంపెతాళము, ౫ త్రిపుటతాళము, ౬ అటతాళము, ౭ ఏకతాళము, సప్తతాళము లనంబడుచున్నవి. ఇవి సంగీతతాళములు. కంచుతోఁజేయఁబడిన తాళముతో వాయింపఁబడునది గానతాళ మని పేరిడిరి. ఈయేడుతాళములు, ఒక్కొకటి చతురశ్రజాతి, త్రిశ్రజాతి, మిశ్రజాతి, ఖండజాతి, సంకీర్ణజాతి, యనునైదేసిజాతులుగల్గి మొత్తము ముప్పదియైదు భేదతాళములుగ నైనది.
(జాతి లయ ప్రాణము చూడుఁడు).

**సప్తద్వీపములు:—** స్వాయంభువమనువునకు శతరూప యనుభార్యయందుఁ బ్రియవ్రతుఁడు, ఉత్తానపాదుఁడు నను నిర్వురుసుతులు గల్గిరి. అందుఁ బ్రియవ్రతునకు, కర్దమప్రజాపతి కుమార్తెయగు సుకన్యభార్య. ఈమెవలన సామ్రాట్టు, కుక్షి యనునిర్వురుకుమార్తెలును, ౧ అగ్నీధ్రుఁడు, ౨ అగ్నిబాహువు, ౩ వపుష్మంతుఁడు, ౪ ద్యుతిమంతుఁడు, ౫ మేధ, ౬ మేధాతిది, ౭ హవ్యుఁడు, ౮ సవనుఁడు, ౯ పుత్రుఁడు, ౧౦ జ్యోతిష్మంతుఁడు నను పదిమందిపుత్రులును కలిగిరి. వీరిలో నగ్నిబాహువు, మేధ, పుత్రుఁడు ననువారలు యోగపరాయణులై తండ్రిరాజ్యమొల్లరైరి. తక్కినయేడ్గురుపుత్రులు తండ్రిరాజ్య

మును భాగములుగ విభజించుకొని ప్రభువులైరి. వారియేడుభాగములును సప్తద్వీపములనఁబడెను.

౧ అగ్నీధ్రునకు— జంబూద్వీపము;
౨ వపుష్మంతునకు— శాల్మలద్వీపము;
౩ ద్యుతిమంతునకు— క్రౌంచద్వీపము;
౪ మేధాతిథికి— ప్లక్షద్వీపము;
౫ హవ్యునకు— శాకద్వీపము;
౬ సవనునకు— పుష్కరద్వీపము;
౭ జ్యోతిష్మంతునకుఁ గుశద్వీపము.

ప్రియవ్రతునకు విశ్వకర్మకుమార్తె యగు బర్హిష్మతి వేఱొకభార్య.

(ద్వీపసప్తకము చూడుఁడు).

## సప్తధాతువులు (ధాతువాదమున):—

(ధాతువులు చూడుఁడు).

## సప్తపవిత్రతీర్థములు:—

పద్మపురాణమున వివరింపఁబడిన సప్తతీర్థములు.

౧ రేణుకాతీర్థము— [రేణుకాతీర్థము చూడుఁడు].
౨ సూకరతీర్థము— గంగానదిపై నున్న సోరోన్.
౩ కాశి [వారణాశీక్షేత్రము].
౪ కాళీ, కరారా, గంగానదీతీరము.
౫ ఈశ్వరతీర్థము.
౬ కాలాంజరతీర్థము.
౭ మహాకాళము— ఉజ్జయిని.

## సప్తపాతాళములు:—

(పాతాళములు చూడుఁడు).

## సప్తభంగిన్యాయస్యాద్వాదము—

[అర్హతమతస్థులు వాగ్దోషము గలుగకుండ నిట్లు వాదింతురు].

౧ స్యాదస్తి [కల్గి యుండవచ్చును.]
౨ స్యాన్నాస్తి [లేక యుండవచ్చును].
౩ స్యాదస్తిచ నాస్తిచ [కల్గియు లేకయుఁ గూడ నుండవచ్చును.]
౪ స్యాదవక్తవ్యమ్ [ఉన్నను లేకున్నను అనవీలు గాక యుండవచ్చును].
౫ స్యాదస్తి చ అవక్తవ్యమ్ [ఉండియు అన వీలు గాక [అనుటకురాక] యుండవచ్చును.
౬ స్యాన్నాస్తిచ అవక్తవ్యమ్ [లేకుండియు అన వీలుగాకయుఁ గూడ నుండియుండవచ్చును].
౭ స్యాదస్తిచ నాస్తిచ అవక్తవ్యం [ఉండియును, లేకుండియును, అనరాకయును, గూడ నుండి యుండవచ్చును].

## సప్తమహర్షులు:—

[మహర్షులు చూడుఁడు].

## సప్తమహాదేవదూతలు [archangles]:—

మహమ్మదీయమతమునను, క్రైస్తవ మతమునను నేడుగురు archangles చెప్పఁబడి యున్నారు.

౧ గెబ్రియెల్ లేక జిబ్రేయెల్— ఈమహాత్ముఁడు దేవునకును దేవుని ప్రవక్తలకును మధ్యవర్తి. కురాన్గ్రంథమును మహమ్మదు జగద్గురునకుం దెల్పుచుండినవాఁడు. ఆఱువందల రెక్కలు గలవాఁడు.

౨ మైకెయేల్— పంటలు, వర్షములు, భోజన పదార్థములపై నధినాథుఁడు.

౩ ఇస్రాఫేల్.

## సప్తమాతృకలు [మాతృకాశక్తులు ౭] అష్టమాతృకలు అష్టమహాలక్ష్ములు:—

బ్రహ్మయొక్క శక్తి (సామర్థ్యము). ౧ బ్రాహ్మి, ౨ వైష్ణవి (విష్ణుదేవునియొక్క శక్తి), ౩ మహే

శ్వరి (మహేశ్వరునియొక్క శక్తి), ౪ కౌమారి (కుమారస్వామియొక్క శక్తి), ౫ వారాహి (వరాహస్వామియొక్క శక్తి), ౬ మాహేంద్రి (మహేంద్రునిశక్తి) లేక ఇంద్రాణి, ౭ చాముండి (ముండాసురుని సంహరించినశక్తి. ఈమెకు చాముండి, భిన్నమస్తక యని నామాంతరములు. మఱియు శ్రీచక్రమందు త్రైలోక్యమోహన మనంబడు). ప్రథమావరణమున మధ్య చతుర శ్రీరేఖలందు అష్ట లక్ష్ములనిపేరున సప్తమాతృకలను, మహాలక్ష్మియను వేఱొక శక్తియు, అష్టమహాలక్ష్ములనుగా నావాహన మొనర్చి పూజింతురు. ఇది శ్రీవిద్యోపాసకులు చేయువిధానము. మఱియు నీదేవతలనే 'అష్టమాతృక' లని యనుట గలదు. అంధకాసురుని వధించుతఱి శివునియర్ధశరీరాక్రాంతయగు శక్తియొక్క ఏఁడువిధములగు సామర్థ్యము (శక్తులు) ౧ బ్రాహ్మి, ౨ మాహేశ్వరి, ౩ కౌమారి, ౪ వైష్ణవి, ౫ వారాహి, ౬ ఇంద్రాణి, ౭ చాముండి.

ఇంకను ఎనిమిదవశక్తి భిన్నమస్తక యని వేఱొకటి కలదు. ఇదియు మాతృకయైనట.

...లు:— భారతమునందు ౧ కాళి, ౨ కౌశిక, ౩ ఉద్ధత, ౪ హవిష, ౫ శారిక, ౬ ఆర్య, ౭ వైధాతి అనుశక్తులు సప్తమాతృక లనియు, వీరికిం గుమారస్వామి సప్తమాతృకలని పేరిచ్చి బాలగ్రహములుగ (బాలురం బాధించురోగాధిదేవతలుగ) నేర్పఱచెనని మతాంతరమున చెప్పఁబడినది.

**సప్తమాయావస్థలు:-**
(మాయావస్థలు ఏఁడు చూడుఁడు).

**సప్తమోక్షదాయకపురములు:—**
(మోక్షప్రదపురములు చూడుఁడు).

**సప్తర్షి నక్షత్రములు లేక గోళములు:—** [నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు].

**సప్తర్షిశకము:—** లౌకికశకము ఉత్తరకాండమునఁ బ్రారంభింపఁబడినది. క్రీ. వె. ౭౫౦.

**సప్తవ్యసనములు:—**
[వ్యసనములు చూడుఁడు].

**సప్తవాయువులు:—**
[వాయువులు చూడుఁడు].

**సప్తవ్యాహృతులు:**
[వ్యాహృతులు చూడుఁడు].

**సప్తవిధచైతన్యములు:—**
[చైతన్యసప్తకము చూడుఁడు].

**సప్తవిధ పాశ్చాత్య పాకములు (వంటలు):—** ఐరోపాదేశస్థులవంటలం దేఁడువిధములవంటలఁ జేయుట చెప్పఁబడినది. ఇవి యన్నియుఁగాని, కొన్నియుఁగాని కలసి భోజనపదార్థములను పాకముచేతురు.

౧ Boiling— నీటియం దుడికించుట.

౨ Frying— అగ్నిపై వేఁడియందుఁ బక్వము చేయుట.

౩ Roasting— ఒకబాణలి [మూకుడునందు] పక్వ మొనర్చుట.

౪ Grilling— ఒకబాణలియందుఁ బక్వమగున ట్లుడికించుట.

౫ Stewing— మూసినపాత్రయందు, తాపీగా పక్వపఱచుట.

౬ Steaming— నీటియావిరిపై పక్వమగునట్లొనర్చుట.

౭ Baking— నిప్పులతోఁగాల్చి వేఁడియగునట్లు చేసిన ఆవరణలను మూసి యందుంచి పక్వ మగునట్లు రాల్చుట.

## సప్తవిధపుటములు:—

(పుటసప్తకము చూడుఁడు.)

## సప్తవిధోపాయములు:—

(ఉపాయములు చూడుఁడు).

## సప్తవేలగోత్రము:—

(వశిష్ఠగణము చూడుఁడు).

**సప్తశిఖరములు:**—1 నవకోటశిఖరము, 2 అర్బుదశిఖరము, 3 ధాతమందాద్రిశిఖరము, 4 ఖైరాలుశిఖరము, 5 పాక్కొరుశిఖరము, 6 రోదుర్వాశిఖరము, 7 పూగలుశిఖరము.

[ప్రిమార . ,యులు చూడుఁడు].

## సప్తసంతానములు:—

[సంతానములు ఏఁడువిధములు చూడుఁడు].

## సప్తసముద్రములు:—

౧ లవణసముద్రము— జంబూద్వీపము (ఇండియా దేశముం జుట్టియున్న హిందూమహాసముద్ర మును, దానిశాఖలగు బంగాళాఖాతము, అరేబియాసముద్రమును గలసి లవణసముద్ర మనఁబడును.) దీని ప్రశంస పద్మపురాణాదిగాఁ గల పెక్కుపురాణములందునను, క్రియాయోగ సారము ౧౧ అధ్యాయమునను గలవు.

౨ ఇక్షుసముద్రము— చెఱుకురసనిలయమని య ర్థము. ఆక్సస్ (ఇక్షు) నది యిచ్చటిభావము. ఆక్ససనదీజలములు చెఱుకురసముంబోలి కడు మాధుర్యవంతములు. ఇటనది కేసముద్రార్థము. పుష్కరద్వీపము (ఇప్పటి భూష్కరము లేక బోఖారాపట్టణప్రాంతదేశము) నకు దక్షిణఁపు టెల్లగాఁ బ్రవహించునది. దీనిప్రశంస వరాహ పురాణము ౮౯ అధ్యాయమునఁ గలదు.

౩ సురా— [సారా యన నిప్పటి కాస్పియన్] సముద్రము. దీనికి మద్యమని యర్థముచెప్పుట కాలానుగతముగ సంభవించిన యపార్థముగ పెక్కండ్రు పరిశోధకులు తలంచుచున్నారు. కాస్పియనుసముద్రము కుశద్వీపమున కాగ్నే యదిశగా సరిహద్దుగనున్న సరస్సు. ఇట సర స్సునకు సముద్రార్థము.

౪ సర్పి— దీనికి ఘృతమని కాలానుగతమగు నపా ర్థమని తలంపఁబడుచున్నది. ఇరీత్రియశబ్దము, సర్పియు నొకటియేయని పోల్చిరి. దీనినిప్పుడు పరిషియన్‌గల్ఫు అనుచున్నారు. ఇది శాల్మలీ ద్వీపమునకు సరిహద్దుగ నున్నది. శాల్మలీద్వీప ము ఛాల్డియా, అస్సీరియా దేశములుగ నేర్ప డినభూభాగముగ నెలుంగునది. వరాహపురా ణము ౮౯ అధ్యాయమునఁ గాననగుచున్నది.

౫ దధి (పెరుఁగు) సముద్రము— అరాల్ సము ద్రము. అరాల్ అనిన పెరుగునకు సిథియన్ [క్రౌంచద్వీప] భాషయం దర్థము. ఇది మెటులనో మార్పులకులోనై కాలానుగత ముగ నిట్లు కడకు వట్టిభ్రమయని తేలనైనది. ఈక్రౌంచద్వీపము Upper gaxartes భూ మిగ పోల్చియున్నారు. అచటిప్రజలు సిథియను జాతివారు. దీనిప్రశంస వరాహపురాణము ౮౮ అధ్యాయమునఁ గలదు.

౬ క్షీరసముద్రము— శకద్వీపమున కుత్తరభాగ మున నంటిన కాస్పియన్‌సముద్రభాగమునకు, తొల్లింట క్షీరవంతసముద్రమని పేరుండెను. దానిని కాలానుగతముగ షిరవాన్ సముద్రి

ముగ మార్పునకు లోఁబడఁజేసిరి. తొల్లింటి క్షీరవంతము క్షీరసముద్రముగ మాఱి కాల ముగడచి దూరదేశములకేగిన యార్యసంతతికి క్షీరములని స్ఫుటార్థముగ గల్గెను. దీనిప్రశంస వరాహపురాణము ౮౬ అధ్యాయమునఁ గలదు.

౭ జలార్ణవసముద్రము— ఇది చందూన్ అనం బడునది. దానికిఁ దొల్లింటిపేరు జలార్ణవమని తేలినది. ఇచట నదికి సముద్రార్థము సిద్ధింప నైనది. ఇది ప్లక్షద్వీపఁపుహద్దుగ నున్ననది. ప్లక్షద్వీపము మంగోలియాయని పోల్చియు న్నారు. కాని, దీనింగూర్చి సంశయించుపరి శోధకులును గలరు.

వీఁటి సాంప్రదాయకథనములం బాటింపనివారు "శ్లో॥ లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర, జలార్ణవః" అని యేడుసముద్రములను వివరింతు రు. గాని యవి యేవో పరిశీలించిన ట్లగుపడదు.

ఆంగ్లభూగోళశాస్త్రవేత్త లిక్కాలమున సప్త సముద్రములన ౧ ఆర్కిటిక్ ఓషన్, ౨ అంటా ర్టిక్ ఓషన్, ౩ ఉత్తరఅట్లాంటిక్కు మహాసము ద్రము, ౪ దక్షిణ అట్లాంటిక్కు మహాసముద్రము, ౫ ఉత్తరపశిఫిక్కు మహాసముద్రము, ౬ దక్షిణ పసిఫిక్కు మహాసముద్రము, ౭ హిందూమహా సముద్రములను నేఁడింటిని సప్తమహాసముద్రములుగ వాడుచున్నారు.

## సప్తసరస్వతులు (నదులు):—

౧ నైమిశారణ్యమున [నిమ్సార్ శితాపూర్ జిల్లా సంయుక్తరాష్ట్రములు] గల కాంచ నాక్షీనది.

౨ గయయందు [బీహారదేశము] విశాలానది.

౩ కోసలదేశమున మనోరమానది.

౪ కురుక్షేత్రమున ఓఘావతీ [సరస్వతీ] నది.

౫ హరిద్వారమున సురేణు యనంబడునది.

౬ హిమాలయమున విమలోదానది.

౭ పుష్కరక్షేత్రమున సుప్రభానది.

వీట్లకు సప్తసరస్వతులనిపేరు. మహాభారతము, శల్యపర్వము ౩౮ అధ్యాయమున ప్రశంస గాన నగుచున్నది.

**సప్తసారస్వతము:—** ఇదియొక పుణ్య క్షేత్రము. కురుక్షేత్రములోని సరస్వతీనదియం దున్నది. ఈక్షేత్రమున వసిష్ఠాదిసప్తమహర్షు లేడ్గురు ఏఁడుసవనము లొనర్చిరట. ఆయాగము లందు సరస్వతీనది నారీరూపమున సంప్రభ, కన, కాక్షీ, విశాల, సురతస్వ, అమోఘమాల, సువేణి, విమలోదక అను నేఁడునామములచే నెల్ల రచేఁ బూజలందెనని చెప్పఁబడినది. దీనిప్రశంస మహాభారత వనపర్వ ౮౩ అధ్యాయమునఁగలదు.

మఱియు నైమిశారణ్యములోని కాంచనాక్షీ నదియు, గయలోని విశాలయు, కోసలదేశము లోని మనోరమయు, కురుక్షేత్రములోని సరస్వతీ [ఓఘావతి]నదియు, హరిద్వారములోని సురేణువు, హిమాలయమునందలి విమలోద, పుష్కరక్షేత్ర ము, సుప్రభయు, సప్తసారస్వతము లని [సాము దాయికనామము]. మహాభారతము, శల్యపర్వము ౩౮ అధ్యాయమునఁ జెప్పఁబడినది.

## సప్తసింధువులు (సింధునదులు):—

౧ ఐరావతీనది- ఇప్పటిపేరు రావీనది.

౨ చంద్రభాగానది ,, బీనాబ్ [దీనికి అ యనిపేరు].

౩ వితస్థానది ,, జీలమ్‌నది.

౪ విపాశానది- ఇప్పటిపేరు బీయాస్‌నది.
౫ శతద్రునది ,, శెట్లెజినది.
౬ సరస్వతీనది ,, సరస్వతి లేక ఓఘావతీ నది.
౭ ఆదిసింధునది ,, సిందు లేక ఆదిసింధు నదము.

ఈయేడునదులకు సప్తసింధువులని పేరు. వీటింగూర్చిన ప్రశంసలు ఋగ్వేదము ౮-౨౪-౨౭ యందునను, భవిష్యపురాణము ప్రతిసర్గపర్వము ౧-౫ యందునను గలవు.

**సప్తసోమయజ్ఞములు:—**
[సోమయజ్ఞములు చూడుఁడు].

**సప్తహవిర్యజ్ఞములు:—**
[హవిర్యజ్ఞములు చూడుఁడు].

**సపాదలక్షపర్వతపంక్తి:—** దీనిని శివాలిక్ పర్వతపంక్తి యనుచున్నారు. హిందుస్థానీదేశవాసులు సపాదలక్షకు [సవాలాక్] అనియు వాడెదరు. (లక్షా ఇరువదియైదు వే లనియర్థము). దీనికిఁ దొల్లింటిపేరు మైనాకపర్వతము.

**సప్తర్షిపురము:—** ఇది మహారాష్ట్రదేశపు దక్షిణభాగమునన్నది. ఇప్పటిపేరు సతారా. విష్ణుసంహిత ౮౫ అధ్యాయమున ప్రశంసింపఁబడినది.

**సపుష్పిర్వాగోత్రము:—**
[ఔతథ్య ఉపగణము చూడుఁడు].

**సఫరెన్సు వార్ఫు Sufferance warf:-** వాణిజ్యసంబంధ పరిభాషాపదము. డ్యూటీ చెల్లింపఁబడవలసినసరకులం దింపి డ్యూటీ చెల్లింపఁబడువఱకు నట నిల్వయుంచుకొనుటకు లైసెన్సుచేయఁబడిన రేవునందలివార్ఫు [Warf]. దిమ్మస్థలము.

**సఫలస్వప్నములు:—**
[స్వప్నశాస్త్రముఁ జూడుఁడు].

**సఫేదు:—**దీనికి 'White oxide of lead' అని యాంగ్లనామము. [సీసము చూడుఁడు.] లోనికిచ్చిన విరేచనబద్ధమును దీనితో రంగు వేయుచుండినవారికి పక్షవాతము గల్గుచుండునని చెప్పఁబడినది. దీనిలేపనమున కణుతలు హరించునందురు.

**సఫేదుమిశ్రి:—**
[చల్లగడ్డలు చూడుఁడు.]

**సప్లై స్లూస్ (Supply sluice):—** Irrigation (పంటకాల్వ) engeneering నందుఁ జెప్పఁబడిన reservoir లకు కాల్వలకుఁ గూడ జెందినయొకనిర్మాణము. (ఇరిగేషన్ చూడుఁడు). ఇవి చెఱువులు మొదలగు రిజర్వాయరులందు, కాలువలందునను అనఁగా వాట్లగట్లపై వాటినుండి నీటిని పొలములకుఁ గొంపోవుకాల్వల మొగను నిర్మింపఁబడును. ఇవి రాయిసున్నములతోఁ గాని, యిటుకసున్నములతోఁగాని కట్టఁబడుచు దీనియందుఁగల నీటితూములను తెఱచుటకుఁ గాని, మూయుటకుఁ గాని, తలుపులు (Shutters) అమర్పఁబడి వాటిమూలమున కాలువలోనికిఁ బోనిచ్చునీరు (control) చేయఁబడుచుండును. కాలువలనుండియు, పంటచెఱువులనుండియు పొలములలోనికి నీటినివదలు కాలువల మొగను నిర్మింపఁబడు నీస్లూసు తఱచుగ చిన్నవిగను, యొక్కొకతఱి పెద్దవిగను గూడ నుండుటయుఁ గలదు.

**సబర్మతీనది:—** దూనాగపురమున కుత్తరముగ ౨౦ మైళ్ళదూరమునఁగల మీరాహ్వాదుకడ

తొల్లింట నందికుండమని చెప్పఁబడిన యిప్పటి ధన్బార్ సరస్సునందు జన్మించి, అహమ్మదాబాదు నగరముప్రక్కగఁ బ్రవహించి, కాంబేసంయుక్తా గ్రగుడసముద్రమున సంగమించునది. దీనిప్రశంసలు పద్మపురాణము, ఉత్తరఖండము ౫౨—౫౩ అధ్యాయములందుఁ గలదు. అందు దీనిపేరు కృతవతీ నది యనిచెప్పఁబడినది.

[ఘూర్జరదేశము చూడుఁడు.]

**సబ్బాతుదినము:**— సబ్బాతనిన విశ్రాంతి యనియర్థము. బైబిలు పూర్వనిబంధనగ్రంథమున దేవుఁ డారుదినములందు సృష్టిని ముగించి యేఁడవదినమగు నాదివారమున విశ్రాంతిఁ గొనెనని చెప్పఁబడుట యూదు లాయేఁడవదినము పనులను మాని దైవారాధన లొనర్చుటయందుఁ గడపుచుండెదరఁట. పిదప క్రైస్తవులును నా యాచారమునే గైకొనిరి. గాన వారలకుఁ బవిత్రదినముగ నాయెను.

క్రీస్తుప్రభువు సబ్బాతు మనుష్యునికొఱకుఁ జేయఁబడినది గాని, మనుష్యులు సబ్బాతుకొఱకుఁ జేయఁబడలేదని చెప్పెనఁట. కొంద రీసబ్బాతు దినము, ఆదివారమున నాదినుండి లేదనియు, పిదప నీయాదివారమున సబ్బా తేర్పఱుపఁబడె ననియు ననుచున్నారు.

క్రైస్తవమతస్థులగు బ్రిటీషువారిప్రభుత్వమున నాదివారము వారికిఁ బవిత్రదినమైనను, వారిప్రభుత్వ కార్యాలయోద్యోగులగు నన్యమతస్థులకు విశ్రాంతిదినముగ నున్నది. మహమ్మదీయమతస్థులకు శుక్రవారము పవిత్రదినముగాన వారి కది సబ్బాతని చెప్పఁబడినది.

**సబ్బిసాహిరమండలము:**— ఇది యాంధ్రభూమియందు నైజామురాజ్యమున వరంగల్లునగరమునకుఁ గతిపయదూరముననున్న అనుమకొండప్రాంతసీమగఁ బోల్పఁబడినది. హద్దులు తెలియవు. అనుమరాజు, కొండరాజు నను పేర్లు గల [బోయ లేక మెఱుకల భూపతిసుతులు] నృపకుమారుల పేరం గట్టఁబడి అనుమకొండ నాఁబరఁగెను. గాని యిటీవల మహమ్మదీయాధికారులచే హనుంకొండ యనంబడుట నాంధ్రులచే హనుమకొండ యనఁబడుచున్నది.

అనుమకొండసీమ క్రీ. వె. ౧౧౨౮ ప్రాంతముల పశ్చిమచాళుక్యనృపాలుండగు నాఱవవిక్రమాదిత్య పృథ్వీవల్లభ మహారాజాధిరాజు సామ్రాజ్యములోని ఆయనసామంతభూపాలుఁడగు రెండవ కాకతిప్రోలరాజునకు రాజ్యమై అనుమకొండ ఆయనరాజధానియై యుండినట్లు ద్రాక్షారామ భీమేశ్వరాలయము (తూర్పుగోదావరి మండలము) నఁగల యొకశాసనమున బయల్పడినది. పశ్చిమచాళుక్యుల యధికార మీసీమయందు క్రీ. వె. ౧౧౨౦—౧౧౨౮ నాల్గువత్సరములే యని యిది వఱకే పరిశీలనలు స్థిరపఱచినవి. [త్రిలింగకాకతీయ సామ్రాజ్యము చూడుఁడు.]

**సబుటోపిక్సు:**—

(టోపిక్సు, సబుటోపిక్సు చూడుఁడు).

**సబ్బు:**— సబ్బు పాశ్చాత్యులు భరతదేశమునకు నేర్పినది. దీని నొకరసాయనవేత్త 'Detergent or cleansing substance produced by the action of caustic soda, or caustic potash or animal or Vegetable oils or fats' అనియు, నింకొక రసాయనవేత్త 'a soluble alkaline fatty substance yielding a lather used in washing and cleansing' అనియు, సబ్బును

వివరించియున్నారు. ఆంగ్లమున దీనికి Soap అనియు, ఫ్రెంచిభాషయందు savon అనియు పేరులు.

తొల్లింటికాలమున మనదేశమున కుంకుడుకాయలు, షీకాయ, పంచదారలవలెనే పాశ్చాత్యసీమల క్రీ. వె. మొదటిశతాబ్దమున కఱ్ఱలరొయ్యి సున్నముతో నుడికించుటతోఁ బ్రారంభమై యనేకానుభవములచేఁ గుదుర్పఁబడి, పరిశీలనలచే బాగుచేయఁబడి, సబ్బుచేయుట యిప్పటిస్థితి నందియున్నది. ఐనను, క్రీ. వె. ౧౮౫౦ సంవత్సరము నుండి తలయెత్తి, ౧౮౫౩ వ సంవత్సరమున పన్నులు తీసివేయఁబడుట నభివృద్ధినందినదని చెప్పవలయును. మనదేశమునను సబ్బుచేయఁబడుచున్నది. పెక్కురకములసబ్బులు కలవు.

ఇక్కాలమున సబ్బుబిళ్ళల నెఱుఁగనివా రుండరు. దానిని స్నానములందు వాడనివా రరుదు. చాకలివాండ్రు బట్టల నుతుకుటయందు సబ్బును వాడువారును గలరని తెలియుచున్నది. నవనాగరికతయు నైరోపాదేశాచారావలంబనమును సబ్బువాడుక కాధారములు. సుప్రసిద్ధరసాయనశాస్త్రవిదుఁడగు Professor Liebig పండితుఁడు (గతశతాబ్దమున నుండినవాఁడు) దీనివాడుక దేశమందలి ధనసమృద్ధినాగరికతలం దెల్పునని ప్రశంసించియున్నాఁడట.

దీనిపురాతనకథనము దురూహ్యముగ నున్నది. పరిశీలకులు 'Phoenicians' దీనిని క్రీ. ము. ౬౦౦ సంవత్సరములనాఁడే చేయుచు గాల్సుతో వ్యాపార మొనర్చుచుండినటుల తలంచుచున్నారు. Pliny the Elder గారి వ్రాఁతలంబట్టి సబ్బు మేకశరీరమందలిక్రొవ్వును, కొన్నికఱ్ఱలరొయ్యిం గల్పి చేయఁబడుచుండినటుల తేలుచున్నది. దొరకినంతదనుక దీనిచరిత్ర మింకను యోచింతుము గాక. క్రీ. వె. ౭౯ లో పోంపీనగర మిటలీదేశమున వెసూవియస్ అగ్నిపర్వతఁపు లావాధూళిలోఁ గప్పఁబడి పూడిపోయి నాశనమైనతరి చేయఁబడిన సబ్బుకణిక లాకర్మాగారముతో సహా యిటీవల త్రవ్వఁబడి కన్గొనఁబడియున్నవి గాన సబ్బుపరిశ్రమ మానాటి కిటలీదేశమున వ్యాపించియున్న దని తేలినది. రోమకసామ్రాజ్యాధికారానంతర మూసబ్బుచరిత్ర యాదేశమున బయల్పడుట లేదు. ఏఁడవశతాబ్దమున జర్మనుదేశమున నీపరిశ్రమ విజృంభించిన ట్లగుపడుచున్నది. ఇంక నిది యాంగ్లదేశమున క్రీ. వె. పండ్రెండవ శతాబ్దాంతకాలముదనుక తలయెత్తినట్లగానరాదు. అక్కాలమునం దొక సుప్రసిద్ధుండు బ్రిస్టల్‌నగరమున నీసబ్బుపరిశ్రమను నడుపుచుండె నట. పదమూఁడు, పదునాల్గుశతాబ్దములందు లండనునగరమున చీఫ్‌సైడనుభాగమున నీపరిశ్రమ చక్కఁగాఁ జేయఁబడుచుండెనని తేలుచున్నది. ఆదినములందుఁ జేయఁబడిన ప్రతిటన్నుసబ్బుపై భారమగుపన్ను చెల్లింపవలసియుండె నట. నెపోలియను కలహాముల కాలముననను, పిదపనుగూడ నీపన్ను పౌనుపై మూఁడుపెన్నీలుండినటుల నిదర్శనములు గాననగుచున్నవి. అక్కాలమున నింగ్లాండునందు సబ్బుచేయుపాత్రలపై మూఁతలు, తాళములు, నమర్పఁబడి సుంకరులచే లక్కముద్రలు వేయఁబడి రాత్రులందు వారి కెఱుకలేకుండ సబ్బుచేయ వీలులేకుండెనట. ఈ ఒత్తుడులన్నియు క్రీ. వె. ౧౮౫౩ లో తీసివేయఁ బడినవట. అత్తరి ప్రభుత్వమున కొకమిలియన్ స్టెర్లింగుపౌను లేటేట రాబడి తగ్గినటులఁ జెప్పఁబడియున్నది. కాని యది చేతిపనులలో నొకటిగమాత్ర ముండెడిది.

యనునట్లు దోఁచుఁగాని యట్టినిదర్శనములు గాన రావు. ఇట్టినీటిపైయొక్కతకు 'Teusion' అనియును, నీటిపై భావించఁబడినపొరకు 'Surface teusion' అనియును పేర్లు శాస్త్రమునఁ గలవు.

ఇట్టిలక్షణముగల నీటితో సబ్బునుగలపిన యీ teusion బలపడును. అనఁగా నొకటి కొకటి హత్తుకొనుశక్తి యధికమై సన్నఁపుగొట్టముకొన నందు ముంచి యూదిన నాగాలిచుట్టు నీటియొక్క పలుచనిపొర నావరించి చులకనయగుట తేలుచు, నెగురుచు కొంతకాలమున పగిలిపోవును.

**సబ్మెరీను ఓడ:**— గత మైరోపామహా సంగ్రామమునందు సబుమెరీనుఓడలు స్పష్టము లగు నుపయోగములకు వాడఁబడినవి. Mr. Robert Fulton అనువారు క్రీ. వె. ౧౮౦౦ సంవత్సరములకాలమునాఁడే యీజాతియోడలం గూర్చి యెక్కువపరిశీలన లొనర్చి ప్రయత్నముల నడపియుంచెను. ఆయన సబుమెరీనుఓడ నీటియం దిరువదియైదడుగులలోతునకు దిగి మూఁడుగంటల కాల మందు నిలచియుండఁగల్గెనట. కాని మొట్ట మొదట సరిగా పనిచేసిన సబ్మెరీను ఓడ Mr. Holland గారు క్రీ. వె. ౧౮౯౦ ప్రాంత మున రచించిరని చెప్పఁబడినది.

ఇటీవల నమెరికాసంయుక్తరాష్ట్ర ప్రభుత్వము వారి నావికాదళమునందు నిర్మింపఁబడినది ౩౪౦ అడుగులపొడవును, ముప్పదియడుగుల వెడలుపు గల్గినది కలదు. అది యుపరిభాగమున [అనఁగా surface speed] గంటకు ౨౨ మైళ్ళుగా పోవు నదియుని చెప్పఁబడినది. అందొకతరి, పద్ధు రుద్యోగులను, ఎన్బదిమంది సైనికులను, తీసుకొనిపోఁ ల్గినదట. అది యట్లాంటికు మహాసముద్రముం దాఁటిపోయి తిరుగ మరలిపోఁగల్గినతరి తిరుగ fuel భర్తీ చేసుకొనలేదని చెప్పఁబడినది.

సబ్మెరీనుఓడలు నీటిపైఁ బర్విడఁగలవు. నీట మున్గి యంతరాళమునను నడువఁగలవు. దానిలోని పీపాలలోనికిఁ బరువెక్కుటకు నీటిని పంపుచేయుటచే నీట మున్గునని యుఁ జెప్పఁబడినది. ఇవి నీట మున్గుట ప్రొపెల్లరును, హారిజంటల్ రడ్డరులు [propeller and horizental Rudder] లును సాధకములుగ నుపయోగింపఁబడుచున్నవి. తిరుగ నానీటిని వెలుపలికి పంపుచేయుటవలన నవి తేలును.

సబ్మెరీనులశరీరము గట్టియుక్కుతోఁ జేయఁ బడును. ఏలయన నది మున్గుతరి పైనుండి యుద కములభారమునకు చితుకకయు, లొత్తలుబడకయు నాగియుండవలసియుండును. ఈసబ్మెరీనుఓడలు నీటిపైభాగమున నుండుతరి ముందుకు దూకించుట [Propelling] కు రెండురకముల power ఉపయోగించుదురు. ఒక గాసోలైను [ఆయిల్] ఎంజను గాని, ఎలక్ట్రికుడైనామోగాని పవరు గల్గించుచుచుండ వీటిని నడపుచుందురు. ఆడైనామో స్టోరేజిబేటరీని ఛార్జిచేయుచుండును. ఈపని యోడ నీటమున్గి యుండుతరి జరుగుచుండునట. నీటమున్గుతరిని గాసోలైను ఎంజిను ఆపివేయఁబడ వలసియుండును. అత్తరి స్టోరేజిబేటరీనుండి ఎలక్ట్రిక్కుపవరు ప్రొపెల్లరున కంపఁబడి పనిచేయఁ గాన నోడ నడుచును. ఈఎలక్ట్రిక్కుక్రరెంటే దీపములకుఁగూడ నం దుపయోగింపఁబడును. ఇంతి యేగాక లోనున్నవారిభోజనమునకు వంటయు, నీకరెంటే వండుట కుపయోగింతురు.

సబ్మెరీనుఓడలందు Compressed air గల గాలిడబ్బాలంగొంపోవుదురు. వాటినుండియే లోని

వారు పీల్చుటకు శుభ్రమైనగాలి నందఁజేయు చుందురు. ఇంకఁ గొన్ని యితరకార్యములకుగూడ నీ Comoressd air ఉపయోగింపఁబడునని చెప్పుచున్నారు. టోర్పిడో ఓడలం దీగాలియొక్క యుపయోగ మధికమట. అవి దూరప్రయాణము లొనర్చుతరి నీ Compressed air యంత్రములు నడువ నుపయోగించుచున్నారని తెలిసెడిని.

సబ్మెరీనుఓడలనుండి నీట మున్గియున్నను, 'పెరిస్కోపు' అనఁబడు దూరదర్శకదుర్భిణీయంత్ర పరికరములగుండా సన్నిదిశలం దేమి కలవో చూడ వచ్చును. ఇట్లు చూచుట యితరనావలు మొదల గునవి కన్పించుతరి జాగ్రతఁ గొన వీలుకల్గెడిని. [పెరిస్కోపు చూడుఁడు].

## సబ్ పోయెనా (Sub poena):—

వాణిజ్యపరిభాషయందు 'under penalty' అని యర్థము.

నష్టపరిహారపద్ధతికి లోఁబడి యని భావము.

## సబ్స్టాంటియాలిజమ్ [Substantia-lism]:—

సత్యప్రామాణ్యపూర్వకమగు పద్ధతులపై ధృవపఱుపఁబడు తత్త్వశాస్త్రవిషయము.

## సబ్సైడీ (Subsidy):—

వాణిజ్యసంబంధపరిభాషాపదము. ఒకరు లేక ప్రభుత్వము, కార్పొరేషన్ కంపెనీ మొదలగువారిచే నొకపని జరుపుట లేక నడుపుట, ఉద్ధరించుటకుగా నీయఁబడిన ద్రవ్యసాహాయ్యము.

## సభానలుఁడు:—

అత్రిసంతతి. చంద్రవంశపు క్షత్రియుఁడు. తండ్రిపేరణువు. పుత్రుఁడు కాలానలుఁడు.



## సమంతర్షిగణము:—

ఇది విశ్వబ్రాహ్మణులం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి.

(ఋక్శాఖ చూడుఁడు. విశ్వబ్రాహ్మణులు చూడుఁడు).

౧ సమస్తర్షిగోత్రము:— సమస్త, శ్వేతాంగద, పురంజయ (త్రయార్షేయప్రవర).

౨ శ్వేతాంగదర్షిగోత్రము:— శ్వేతాంగద, పురంజయ, భానుమతి, కర్మదక్ష, జయత్కుమార [పంచార్షేయప్రవర].

౩ పురంజయగోత్రము:—పురంజయ, భానుమతి, కర్మదక్ష, జయత్కుమార, సుచిత్ర (పంచార్షేయప్రవర].

౪ భానుమతిర్షిగోత్రము:—భానుమతి, కర్మదక్ష, జయత్కుమార [త్రయార్షేయప్రవర].

౫ జయత్కుమారర్షిగోత్రము:— జయత్కుమార, సుచిత్ర, చిత్రచార, సుచి, సుపోధక [పంచార్షేయ[illegible]]

## సమతతదేశము:—

బంగాళములోని కోమిల్లాపురమునకు సమీపమునఁ గల కమ్తా యనంబడు పట్టణమును తొల్లింటి సమతత లేక సమతపుర మనియు, ఆప్రాంతదేశమునకు సమతత దేశమనియు తొల్లింటిపేరని పోల్చుచున్నారు.

సమతత మాటి కమ్తా యైనదని తలంపఁబడుచున్నది. ఇదియే రాజధానిగ నుండనోపు. Journal of asiatic of Bengal 1914 pp. 87 యందు దీనిని ఖడ్గవంశపునరపతు లేలిరని చెప్పఁబడియున్నది.

**సమతనాథుఁడు**:— జైనతీర్థకరులలో ఒకఁడు. [తీర్థకరులు చూడుఁడు].

సమతనాథుఁడు [సుమతీనాథుఁడు]. చిహ్నము చక్రవాకము. ఇక్ష్వాకువంశక్షత్రియుఁడు. తండ్రి మేఘప్రభువు, తల్లి మంగళాదేవి, జన్మస్థానము అయోధ్యానగరము. పొడవు 300 ధనస్సులు [ధనస్సు అనమూఁడున్నరమూర]. వర్ణము సువర్ణచ్ఛాయ. ఆయువు నలుబదిలక్షలు. గణధర్ ౧౧౬ సంఖ్య. నిర్వాణస్థలము సుమేరుశిఖరము [అబూపర్వతశిఖరము]. తొంబదివేలకోట్ల సాగర్.

**సమతాళము**:—

[తాళములు చూడుఁడు].

**సమదోగేయగోత్రము**:—

[వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు].

**సమము [గ్రహలయ]**:— తాళము, గీతము సమముగనే నడుచుటకుఁ బేరు. ఇది సంగీతశాస్త్రమున దశప్రాణములలో నొకటి యగు గ్రహ [లయ] ము నందుఁగల నాల్గుభేదములలో నొకటి.

[గ్రహలయ దశప్రాణములు చూడుఁడు].

**సమయతి [సంగీతశాస్త్రమున]**:—

[యతిప్రాణములు చూడుఁడు].

**సమర్కండ్ [సోగ్దినాపురము]**:—

[శకద్వీపదేశము చూడుఁడు].

**సమర్కండ్పురసీమ**:— సమరఖండపురమున కాదినామము మార్కండమని యుండెనఁట. ఒకప్పు డిది సోగ్దినాదేశఁపు రాజధానిగ నుండినది. జరఫ్షాను నదీతీరము. దీని నింకను కారాదర్యా యనియు నందురు. సోగ్దినా రాజధానిగ నుంట క్రీ. వె. పదునాల్గవశతాబ్దముగఁ దేలుచున్నది. పిదప తైమూరు [తామర్లిన్] పాలించిన దేశమునకు రాజధాని యయ్యెను. ఆయనగోరీ యీయూరనే కలదు. మరియు నక్కాలమున నిది మహమ్మదీయవిజ్ఞానమున కాసియాఖండమున పేరందినదాయ్యె యుండెనఁట. పిదప బోఖారారాజ్యమునకుఁ జేరి కొంతకాల ముండినది.

క్రీ. వె. ౧౮౬౬ న రష్యాదేశఁపువారి పరిపాలన క్రిందికి వచ్చెను. వీరిక్రింద సమర్కండ్ క్రొత్త పట్టణము కట్టఁబడి పాతయూరు విలువతగెనందురు. ఇక్కాలమున ధాన్యఁపుదినుసులు, ప్రత్తి, బియ్యము, ఎండఁబెట్టినఫలజాతులు, పట్టువ్యాపారములు జరుగుతావు. ఇవి యెగుమతులు. ఇచటి గుఱ్ఱములు శ్రేష్ఠములు గాన పెంచి యమ్ముచుంటయు, కొంతవ్యాపారము నడచుచున్నది. సమర్కండుసీమ కెల్ల ఉత్తరమున సర్దర్యా నది, ఫెర్గానాసీమప్రదేశము తూర్పునను సర్దర్యా నది ఫెర్గానాప్రదేశములు నై యున్నది. ఉత్తరము నిష్ఫలప్రదేశమగు బయలుగ నుండును. దక్షిణఁపుటెల్లయు, పశ్చిమఁపుటెల్లయుబోఖారాసీమ, కిజిఖుమ్, ఎడారిప్రదేశము నై యున్నవి. దక్షిణఁపు టెల్ల జరఫ్షాన్నదియొక్క లోవగా చెప్పవచ్చును. ప్రజలకు ముఖ్యవృత్తి వ్యవసాయము, గుఱ్ఱములఁ బెంచుటయు నై యున్నది. ద్రాక్షతోఁటలు, పత్తివ్యవసాయము నధికము. ప్రజలు ఉజ్బెగ్ జాతి తెగవారు [మహ్మదీయులు]. ౨౬౬౭౮ చతురఁపుమైళ్ళు వైశాల్యము గలసీమ. ఇప్పటి రష్యాతురుష్కస్థానమునం దున్నది. [మార్కండము చూడుఁడు].

**సమరితాను తెగవారు [Samaritans]**:— వీ రాదిని పాలస్తినాదేశ మధ్యభా

గంపుసీమయగు సమేరియాయందుండి పేరందిరి. గొప్పబలశాలురు. పొడవుశరీరము, పలుచని మేను, సగటున భయంకరాకారములతో ధైర్య సాహసములంగల్గి రణవీరులుగ నుండందగినవారు. బాహ్యస్థితి యిట్లుండియు దయార్ద్రహృదయులు. పరోపకారచింత వీరికిం బ్రధానలక్షణము. ఏదేశ మం దున్నను వీరి కీలక్షణము ప్రధానలక్షణము గనే యున్నది. వీరి పూర్వచరిత్ర విజ్ఞానమునకు వినోదకరము గాకపోదు.

సమరఖండంపు టుజ్జేగుజాతివారితో వీరి కేసం బంధము లేదుగాన వీ రొకప్పు డాదేశవాసులై యుండిరేమో యను సంశయమునకుం దావు లేదు. వీరు అసలు ఇశ్రాయేలీయులసంతతివార మని చెప్పుకొనుచుందురు. యూదులు ఇశ్రా యేలుసంతతివారు కారని వారిని నిరసించుదురు. వీరికి షెచమ్పురము పవిత్రస్థానము. అచటి గిరి జెమ్గుట్టపై వీరి జహోవాదేవస్థాన ముండెను.

చరిత్ర కనికరమున కాస్పదము. క్రీ. ము. ౭౨౧ సంవత్సరమున జరిగిన సమేరియాయుద్ధమున నోడి, సమెరియా పడిపోవుకతన వీరికి దీనావస్థ ప్రారంభమైనదని చెప్పవచ్చును.

క్రీ. ము. ౯౨౦ సంవత్సరప్రాంతమున పాల స్తినాదేశమును బాలించుచుండిన ఓమ్రీ భూనా థుండు సమేరియాపురము నిర్మించి తనరాజధా నిగం జేసుకొనెనని చెప్పంబడినది. అందు మన స్సెయాసంతతివారును, ఎఫ్రాయిమ్సంతతివారు ను, కొంద రస్సిరియాదేశంపువారగు వలసచేరిన జనులును వసించుచుండిరని చెప్పంబడుటయు, నదివఱకు షెబెమ్నం దుండిన ప్రభుత్వకార్యాలయ ములు ఓమ్రీభూపతి యిటకు మార్చెననుటయు, సార్గోన్పురమును ధ్వంస మొనర్చె ననుటయు,

రోమనులకు సామంతుగనుండిన హెరోదుభూపతి తిరుగ పురమును గట్టించి 'సెబస్తి' యని క్రొత్త పే రిడుటయు నాదిగాంగల చరిత్రాత్మకములగు విషయములు బైబిలునుండి తెలియంగలవు.

క్రీ. ము. ౭౨౧ సమేరియాపతనమున సార్గోన్ జయశీలుండు పెక్కండ్రు సమేరియనులను విదేశ ములపాలుంజేసి దేశమునం దుండకుండం జేసెను. వారిసంతతివారే యీజిప్టు, అరేబియా, మెసపు టేమియా, తురుష్కస్థానంపునగరములందుం గాన నగు సమరితాను లైయున్నారు. మిగిలిన కొలంది పాటికుటుంబములు బలహీనులుగ స్వదేశమున వదలివేయంబడిరి. ఆ సార్గోన్శూరుండే పిదప బాబిలోనియానుండి తేంబడినవారలను, సిరియా ప్రజలను, అరబ్బులను సమెరియాదేశమ్మున నివ సింప నేర్పాటుంజేసెను. రానురాను వారందఱు యొహోవామతస్థులెపోయిరి.

ఆదిమనివాసులగు సమరితానులు శూరులుగ మున్నే వివరింపంబడినది. వారిపట్టుదల పిదప పెక్కండ్రు సమరితానులను తిరుగ స్వస్థానోన్ముఖు లం జేసినది. కాని పెక్కండ్రు విదేశములం దుండి పోయిరి. స్వదేశమున నిల్చు సమరితానులు బల పడుటతోం దక్కినవారికి వీరిపై నసూయ జనిం చెనట. తా మసలు ఇశ్రాయెలీయుల మను టతో యూదులు వీరికి విరోధులైరి. వారిదేవా లయనిర్మాణకార్యముల వీరిని బాల్గొననీయమి వీరిపవిత్రస్థానమును ఓమ్రీభూపతికిం బూర్వంపు రాజధానియు నగు షెబెమ్పురముకడ గిరిజెమ్ కొండపై జోహోవాదేవునకుం దను దేవళము నిర్మించుకొనిరని, అది క్రీ. ము. 33౨ కాలమ నియు జోసెఫస్గారినుండి తెలియుచున్నది. పురా తనంపు హిబ్రూలిపియందున్న పెంటాటచ్చిగ్రం

థము వారిమతగ్రంథమై నేఁటికి నసలుపుస్తక మాహోముమహాత్ముని ముమ్మనుమఁడగు అబిషా గారి వ్రాతప్రతి యనియు సమరితాను లందురు. దాని నతిగౌరవభక్తులతో నెబ్లుసునం దొకదేవళ మున భద్రపఱచియున్నారు. దాని నన్యులగు నెల్లరు 'సమరితాన్పెంటాటచ్' అని వాడుచుం దురు. యూదు లాగ్రంథమును క్రీ. ము. ౧౨ లేక ౧౩ శతాబ్దములకన్న పూర్వఁపుది కాదని నిరసించెదరు. దాని నెట్లో అరమెయిక్కుభాష లోని కనువాద మొనర్చి 'సమరితాన్తర్గుమ్' అని పేరిడిరి. వారి కింకను జోషుఆగారి గ్రంథము కూడ నంగీకారమే.

క్రీస్తుప్రభువు సమరితానుల కొకమంచిమాట యని నుడువఁగా యూదులు కోపించిరని బైబిలు నందుఁజెప్పఁబడినది. క్రీ. ము. ౧౨౮ లోనే సమరి తానులదేవస్థానము భగ్నము చేయఁబడిన దనియు, యూదులే కారకులనియుఁ గొందరనెదరు. పిదప వారు యూదులకువలెనే సునగోగులను నిర్మించు కొనిరట.

రోమకసామ్రాజ్యమున క్రైస్తవమతము వ్యా పించుటతో సమరితానులజీవనము దుర్భరమయ్యె నట. క్రీ. వె. ౧౧౭—౧౩౮ హాద్రియనుగారి పాలనము వారితిరుగుబాటుస్వభావమునకు శిక్షగా వారి పవిత్ర గ్రంథనాశనమునకుఁ గడంగెను. క్రీ. వె. ౫౨౯ లో జస్టీనియన్చక్రవర్తి సమరి తానులవిప్లవమని ప్రకటించి, వారి సునగోగుల నాక్రమించ పెక్కండ్రు విదేశములపాలైరి. రెం డవ జస్టిన్‌చక్రవర్తిపాలనమున సమరితానులు out laws (ధర్మనిబద్ధులుగారనువారు) గాఁ బ్రక టింపఁబడి పౌరసత్వములన్నిటిని గోల్పోయి యుండిరి. క్రూసేడుసంగరములందు వారిస్థానమగు నాబ్లుసు కొల్లగొనఁబడెనట. వా రెట్టకేలకు క్రీ.వె. ౧౫౧౭ లో టర్కీతురుష్కులపాలనక్రిందకిఁ జేర్పఁ బడిరి.

దారితప్పిపోయిన మార్గస్థుల నెంతదూరమున కైనను తా మరిగి వారిని వారిదారికిం జేర్చు సహాయము తమకు విధియగు పవిత్రకార్యమని సమరితానులు తలంచుట యెల్లరెరింగినదే.

## సమరుఁడు [కాంపిల్యాధిపతియైన వాఁడు]:—

బృహదిషునిసంతతి. తండ్రి నీపుఁడు (జ్యేష్ఠపుత్రుఁడు). కుమాళ్లు పారుఁడు, సుపారుఁడు, సదశ్వుఁడు. (కాంపిల్యాపురాధీశుఁ డైనవాఁడు).

## సమశిష్టగోత్రము:—

ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి.

సమశిష్టగోత్రము— ఏకాశైయ (౮౭) గోత్ర ము. సంస్కృతగోత్రము సానందనస. సనందనగణ ము. ఆపస్తంబసూత్రము యజుశ్శాఖ. ప్రమాణ గ్రంథము లాద్యప్రవరఖండ. విశ్వేశుఁడు దేవత. త్రిపురాంబ భార్య. జాహ్నవీతీరము తపస్థానము. పీరసరస్సు తటాకము. జపములక్ష. దీపములు ౧౭. క్షేత్రసంఖ్య ౩౧. ఈననిగోవు దానము. వెదురు బియ్యము వర్జనీయము.

## సమశీతోష్ణప్రదేశము (Sanatorium):—

వీట్లను నిర్ధారణచేయుటకు సరియగు పద్ధతు లొకవిధముగా నుండవు. గాన నాయా తావులపరిస్థితుల కనుకూలమగున ట్లీక్రిందిలక్షణ ముల నెఱుంగఁదగును. వేఁడిదేశములందు, చల్లని స్థలములును, చలిదేశములందు శీతబాధతగ్గి యుండు స్థలములును, ఆరోగ్యవంతములై యుం డియు మనుష్యులశరీరమునకు సౌఖ్యకరముగను, మనస్సున కానందములుగను దనరు ప్రదేశములను

సమశీతోష్ణప్రదేశము లనియు 'Health resorts' అనియు నందురు.

వేడిదేశములందు వేసవికాలమున క్రిందిప్రదేశములవేడి యెక్కువగా నుండును. పర్వతోపరి భాగము లంతవేడిగా నుండవు. గాలియు పలచనగ నుంట నెక్కువవేడిని latent గా నొనర్చును. మఱియు నచట చెమ్మయు నుండమిగాన నారోగ్యవంతములుగనే యుండును. పర్వతములందు భూమట్టమునకుఁ బైగా కొంత యెత్తువఱకు మన్యఁపుజ్వరముల బాధతోఁగూడిన యనారోగ్యస్థితియుండుట సర్వసాధారణమే. అట్టిపరిస్థితులం దాటి పైగానుండిన తావులు సమశీతోష్ణ ప్రదేశములు.

సాధారణముగ సముద్రతీరప్రదేశములు, గొప్ప గొప్పనదులుండుతావుల వీలుకుదిరినప్రదేశములు, గొప్పగొప్పసరస్సులకడనున్న ప్రదేశములు, విస్తార వాయుప్రసారమున కొంతశీతలమును, ఉష్ణమును, తగ్గి కొంతసౌఖ్యముగ నుండెడిని. అవియు నితర పరిస్థితు లనుకూలించి యారోగ్యవంతములై యుండుటఁగూడ ననుకూలించెనేని వాట్లంగూడ సమశీతోష్ణప్రదేశము లందురు. చలిదేశములందు శీతలవాయువులు వీచువైపుల కడ్డముగ నెత్తగు పర్వతములడ్డుగనుండుట తటస్థించినచో నట నంత శీతలబాధ యుండుట తగ్గి తక్కినచుట్టపట్లప్రదేశములకన్న సౌఖ్యముగ నుండును. వాట్లను సమశీతోష్ణప్రదేశము లందురు. భూమధ్యరేఖ కుత్తరమున ఆర్కిటిక్‌సర్కిల్ వఱకు నుత్తరశీతవాయువు లీశాన్యదిశనుండి వీచుంగాన నావైపున పర్వతము లడ్డుండిన సౌఖ్యకరప్రదేశ మాపర్వతమునంటి క్రింద నివ్వలిభాగమున నుండెడిని. ఇంక దక్షిణమున అంటార్టిక్ సర్కిల్ వఱకు దక్షిణ వాయువు లాగ్నేయదిశనుండి వీచుంగాన నావైపున పర్వతము లడ్డుండిన నవ్వలిప్రదేశము సౌఖ్యకరమై యుండెడిని. ఇది చలిదేశములందని యెఱుంగునది.

ఇంకను నుష్ణదేశములందు వేసవిదినములలో చల్లగాలి చక్కగ వీచుప్రదేశములును, వేడి తగ్గియుండునవి గాన సమశీతోష్ణప్రదేశములుగనే యెన్నఁబడును. కొన్ని విశేషకారణములవలన ప్రదేశ మెత్తైనది గాకున్నను వేసవిప్రారంభము నుండి కొద్దిగనో, గొప్పగనో వర్షములు కురిసి వేడి తగ్గి సౌఖ్యములుగ నుండుతావులుగూడ సమశీతోష్ణప్రదేశములుగ నెన్నఁబడునవియే. అతిశీతలప్రదేశములనంటి సముద్రప్రవాహోష్ణోదకములు ప్రవహించుటయు నిట్టికారణమే యగును.

ఆయాప్రదేశములందలి పరిస్థితుల ననుసరించి యుష్ణముగాని, శీతముగాని, సౌఖ్యకరముగనుండు నటుల తగ్గించుకారణములు గల్గుటయు నారోగ్యవంతమై దనరుటయు సమశీతోష్ణప్రదేశ నామ మొనఁగూర్చెడిని. భూమధ్యరేఖవైపునకేగుకొలది నుష్ణమును, ఉత్తరదక్షిణధ్రువములవైపున కేగు కొలఁది శీతలమును నతిశయించుచుండునని మన మునం దుంచుకొనవలయును.

## కాలము [Times] కాలమానము:

కాలము నడఁచుచుండగ మధ్యమధ్య హద్దు లేర్పఱచి దినములుగను, మాసములుగను, వారములుగను, పక్షములుగను, ఋతువులుగను, అయనములుగను, సంవత్సరములుగను, శకములుగను, యుగములుగను, మహాయుగములుగను, విభజించి లెక్కించుట 'కాలమాన' మనంబడును. ఈకాలమానము మనుష్యకాల మనియు, పితృమాన మనియు, దేవమానమనియు బ్రహ్మ (కాల) మానమనియు నాలుగువిధములు. "హిరణ్మయస్వరూపి"యగు పరమేశ్వరకలసూర్యమండలమధ్య

ఆనంద (సంప్రజ్ఞాత) సవికల్పసమాధి— ఇది రజోగుణతమోగుణముల నంతఃకరణమున స్వల్పాంశములు నవలంబన చేయుచు నాభావ నయందు మనోలయ మగుట. దీనిని సానంద సమాధి యనియు ననుచున్నారు.

ఈసమాధియందు దృఢచిత్తులై సిద్ధిం గాంచినవారు దేహాభిమానవర్జితులు గాన విదేహులని చెప్పఁబడుచుందురు. యోగపరి భాషాపదముగ నీసమాధిని యోగులు 'గ్రహణసమాపత్తి' యనుచున్నారు.

౪ అస్మిత (సంప్రజ్ఞాత) సవికల్పసమాధి— దీనిని సాస్మితసంప్రజ్ఞాతసమాధి యనియు వాడు చున్నారు. ఇది రజస్తమోగుణవిరహితమైన శుద్ధసత్వగుణ మవలంబించి చేయుభావన యని చెప్పఁబడినది.

ఇందు, చిచ్ఛ సత్తామాత్రస్వరూపముతో భాసించుననియు, ఈసమాధిసిద్ధినందినవారు ప్రకృతిలయు లనంబడుదురనియుఁ దెలియు చున్నది. చిత్తవృత్తిచేరి తన్మయతనొందుం గాన నీసమాధికి 'గృహీతృసమాపత్తి' యని పేరుకూడ కలదు.

(3) నిర్వికల్ప (అసంప్రజ్ఞాత) సమాధి— ఇది నిర్బీజసమాధి యనియుఁ బేరు వాడుకయందుఁ గలది. సంప్రజ్ఞాతసమాధియందుఁగల వితర్కము, విచారము, ఆనందము, అస్మితయు పరిత్యజించు జ్ఞానమును చిత్తమునఁ జలింప నీయని మనోలయావస్థ. ఇందు వేద్యవస్తువు లేదుగాన నిర్బీజ మనంబడుచున్నది. వితర్క విచార సమాధులు 'గ్రాహ్యసమాపత్తి' యనఁబడుచుండును.

**సమాధిషట్కము:**— (షడ్విధసమాధులు చూడుఁడు, యోగశాస్త్రము చూడుఁడు, అష్టాంగయోగములు చూడుఁడు).

**సమానాసనము:**— యోగశాస్త్రము నఁ జెప్పఁబడిన యాసనములలో నిది యొకటి. స్వస్తికాసనము వైచి గూర్చుండి చేతుల నంగుష్ఠ మధ్యమములచేతఁ గటిప్రదేశముం బట్టియు (అనఁగా తర్జనులచేత నాభిప్రదేశము నొత్తుట) సమానాసన మనంబడును.

(స్వస్తికాసనము చూడుఁడు).

**సమాశ్రయగుణము:**—
రాజనీతియందలి షడ్గుణములలో నొకటి.

**సమాశ్రయణము:**— ఇది రామానుజదేశికబోధితమగు వైష్ణవమతస్థుల కొనర్చు సంస్కారపంచకము.

౧ తాపము:— తప్తచక్రాంకనము. శంఖచక్ర చిహ్నములం గాల్చి భుజములపై ముద్ర వేయుట.

౨ పుండ్రము:— ద్వాదశభిర్దోర్ధ్వపుండ్రములం ధరింపఁజేయుట.

3 నామము:— మతసంబంధనామకరణము (పేరు) ను శిష్యున కిడుట.

౪ మంత్రము:— శ్రీమన్నారాయణాష్టాక్షరీ మంత్ర ముపదేశించి జప మొనర్పఁ జేయుట.

౫ వైష్ణవేష్టి:— "శ్రీమన్నారాయణస్య చరణౌ శరణం ప్రపద్యే" అను తిరుద్వయ మొనర్చి, యితరజనసమపంక్తి భోజన శయ్యాసనములను, అన్యదేవతాదర్శనార్చనాదులను విడుచునటుల దీక్షఁగరపి యాగ మొనర్చుట.